బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

సరళ వ్యాఖ్యానసహితం

## మొదటి సంపుటము

1, 2 స్కంధములు

వ్యాఖ్యాతలు

డా॥ కేసాప్రగడ సత్యనారాయణ

డా॥ మల్లెల గురవయ్య

డా॥ సముద్రాల లక్ష్మణయ్య

ప్రధాన సంపాదకులు

విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2017

**Bammera Potanamatya Praneeta**
**SRI MAHABHAGAVATAMU, with Commentary**
**Volume - I (Skandhas - 1 & 2)**

*Author :* **Potana Mahakavi**

*Commentary by*
**Dr. Kesapragada Satyanarayana *(Skandha - 1)***
**Dr. Mallela Guravaiah *(Skandha - 1)***
**Dr. Samudrala Lakshmanaiah *(Skandha - 2)***

*Edited by*
**Vidwan Mudivarthi Kondamacharyulu**



T.T.D. Religious Publications Series No. 1237

*First Edition :* 2017

*Copies :* 3000

*Published by*
**Dr. D. Sambasiva Rao, I.A.S.,**
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati.

*D.T.P.*
Publications Division
T.T.D., Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందుమాట

**భా**రతీయ సనాతన వాఙ్మయంలో అద్భుతమైన ఆధ్యాత్మిక గ్రంథాలు చాలా ఉన్నాయి. అందులో అమూల్యమైన రత్నాల్లాగా శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారత, శ్రీమద్భాగవత గ్రంథాలు సంస్కృత వాఙ్మయ ప్రపంచంలో ప్రకాశిస్తున్నాయి.

వాటిల్లో శ్రీమద్రామాయణ మహాకావ్యం ఆదికవి వాల్మీకి మహర్షి ప్రణీతం. కాగా ఇక మిగిలిన భారత భాగవత గ్రంథాలు రెండూ కృష్ణద్వైపాయనుడైన శ్రీవ్యాసమహర్షి రచించినవి.

తి.తి.దేవస్థానం ధార్మిక సాహిత్య ప్రచురణలో భాగంగా ఇప్పటికే సంస్కృత శ్రీమద్రామాయణ కావ్యాన్నీ, తెలుగు కవిత్రయ మహాభారత కావ్యాన్నీ సవ్యాఖ్యానంగా ప్రచురించింది.

అదే వరుసలో పోతన మహాకవి తెలుగులో రచించిన భాగవతాన్ని కూడా తెలుగువారికి అందించాలన్న సదాశయంతో ప్రముఖ పండితులు డా॥ కరుణశ్రీ గారి ప్రధాన సంపాదకత్వంలో సరళమైన తాత్పర్యంతో పోతన భాగవతగ్రంథాన్ని ఐదుసంపుటాలుగా దేవస్థానం అందించింది. ఈ గ్రంథం పాఠకుల విశేషాదరణకు పాత్రమై పలు ముద్రణలను పొందింది.

ఆ తర్వాత కొందరు పండితుల సలహామేరకు, పాఠకుల అభ్యర్థనలమేరకు, 'కవిత్రయ భారతం' మాదిరిగానే పోతన మహాకవి భాగవతాన్ని కూడా అందరికీ సులభంగా అర్థం అయ్యేట్లు సరళమైనశైలిలో వ్యాఖ్యానాన్ని అందించాలనే లక్ష్యంతో దేవస్థానం ఆ కార్యక్రమాన్ని చేపట్టింది.

ప్రస్తుతం బమ్మెర పోతనగారి భాగవత గ్రంథం, ముప్పైమూడు మంది పండితులు సరళవ్యాఖ్యానాన్ని అందించగా ప్రముఖ సాహితీవేత్తలు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారి ప్రధానసంపాదకత్వంలో తయారయ్యింది. ఈ వ్యాఖ్యానగ్రంథం తయారీలో కృషిచేసిన దేవస్థానం ప్రచురణల విభాగం అధికారి మరియు పోతన భాగవత వ్యాఖ్యాన పర్యవేక్షకులు, సమన్వయకర్త డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికీ, వారి సహాయకులు, ఉపసంపాదకులు డా॥ నొస్సం నరసింహాచార్య గారికీ, ఈ పోతన భాగవత వ్యాఖ్యానగ్రంథ ప్రధాన సంపాదకులు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారికీ, వ్యాఖ్యాతలకూ, సంపాదకమండలి సభ్యులకూ, సహాయసహకారాలందించినవారికీ, కన్సల్టెంట్లందరికీ, ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రింపజేసిన తి.తి.దేవస్థానం ప్రెస్సు వారందరికీ ప్రత్యేకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. పోతన పద్యాలకు వ్యాఖ్యానాలనదగిన చక్కనైన బాపుగారి రేఖాచిత్రాలను ఈ గ్రంథ సంపుటాల్లో అక్కడక్కడా పొందుపరుచుటకు అనుమతించిన శ్రీ బాపుగారి కుటుంబ సభ్యులకు ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ సరళవ్యాఖ్యాన గ్రంథం ఎనిమిది సంపుటాలుగా, ఆ యా పుటల్లో అక్కడక్కడ ప్రముఖ చిత్రకారులు బాపుగారి బొమ్మల మెరుపులతో సర్వాంగసుందరంగా, శ్రీ హేమలంబి నామసంవత్సరం తెలుగు ఉగాదినాడు తెలుగువారందరికి శ్రీ తిరుమలేశుడు అనుగ్రహిస్తున్న ప్రసాదంగా స్వీకరించగలరని ఆకాంక్షిస్తూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

శ్రీరస్తు

# బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీమహాభాగవత ప్రాజెక్టు పుట్టుపూర్వోత్తరాలు

**వేదకల్పవృక్షవిగళితమై శుక**
**ముఖసుధాద్రవమున మొనసియున్న,**
**భాగవతపురాణఫలరసాస్వాదన**
**పదవి గనుడు రసికభావవిదులు.**

అని భాగవత రచనకు ఉపక్రమించిన సహజకవి పోతనామాత్యుడు భాగవతప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు.

వాల్మీకి విరచితమైన ఆదికావ్యం రామాయణం. "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా" అన్నట్లు వేదానికి మారురూపంగా అది ప్రసిద్ధి పొందింది. వ్యాసవిరచితమహాభారతాన్ని పంచమవేదంగా (భారతం పంచమో వేదః) భావిస్తారు. సనాతనధర్మానికి అనల్పమైన వ్యాప్తిని గావించిన ఈ మూడుగ్రంథాలు భారతీయ సాహిత్యంలో సాటిలేని మేటిరచనలుగా ప్రసిద్ధి పొందాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ ప్రచారంకోసం ఆధ్యాత్మికగ్రంథాలను పెద్ద ఎత్తున ప్రచురిస్తోంది. దేశంలో మరే ఇతరదేవస్థానం కూడా ధర్మప్రచారంకోసం గ్రంథముద్రణను ఇంత పెద్ద ఎత్తున చెయ్యడం లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. వేదార్థాలను ప్రతిపాదించే వాఙ్మయాన్ని వివిధ భాషల్లో ప్రచురించి ప్రచారం చేయడం తిరుమల తిరుపతి దేవస్థానం తన బాధ్యతగా స్వీకరించింది. అనేకభాషల్లో దేవస్థానం ద్వారా వెలువడుతున్న ధార్మికగ్రంథాలలో రామాయణ, భారత, భాగవతాలు మిక్కిలి ప్రధానమైనవని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

1982లో జరిగిన భక్తకవి పోతన పంచశతాబ్ది జయంతి ఉత్సవాలలో పోతన భాగవతాన్ని తాత్పర్యంతో ముద్రించాలని దేవస్థానం సంకల్పించింది. **కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి** గారి నేతృత్వంలో 15 మంది పండితులు పోతనభాగవతానికి తాత్పర్యాన్ని సమకూర్చారు. తొలిసారిగా 1987లో తాత్పర్యసహిత పోతన భాగవతాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం పాఠకలోకానికి అందించింది.

కవిత్రయవిరచితమహాభారతానికి ప్రసిద్ధపండితులచేత ప్రతిపదార్థతాత్పర్యవిశేషవివరణలు వ్రాయించి ప్రచురించాలన్న సంకల్పం 1983లో తిరుమల తిరుపతి దేవస్థానానికి కలిగింది. ముప్ఫైమంది పండితులు ఈ పద్ధతిలో భారతానికి వ్యాఖ్యానం రచించారు. 2005వ సంవత్సరంలో మహాభారతం సంపూర్ణంగా సవ్యాఖ్యానంగా వెలువడింది.

ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషవ్యాఖ్యానాలతో కవిత్రయభారతం, తాత్పర్యసహితభాగవతం తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలలో అగ్రశ్రేణికి చెందినవిగా రూపొంది అతివిస్తృతమైన ప్రజాదరణకు పాత్రమైనాయి. వేలకొలది ప్రతులు భక్తులకు, పాఠకులకు అందుతున్నాయి.

1981లో డా॥ పన్నాల రాధాకృష్ణశర్మగారి నేతృత్వంలో వ్యాసవిరచితసంస్కృతభాగవతాన్ని ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలను సమన్వయించే మూడువ్యాఖ్యానాలతో పరిష్కరించి ప్రచురించాలని దేవస్థానం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు భాగవతం ప్రాజెక్టు ఏర్పాటైంది. **డా॥ రాధాకృష్ణశర్మ, డా॥ ఎన్.సి.వి.నరసింహాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గార్ల నేతృత్వంలో శ్రీధరీయం (అద్వైతం), వీరరాఘవీయం (విశిష్టాద్వైతం), విజయధ్వజీయం (ద్వైతం) అన్న మూడువ్యాఖ్యానాలతో సమగ్రంగా 14 బృహత్ సంపుటాలుగా 2006 నాటికి భాగవతం సిద్ధమయింది.

ఈ పరిష్కరణ కార్యక్రమం ముగియగానే పురాణ ఇతిహాస ప్రాజెక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** నాటి తితిదే శ్రీకార్యనిర్వహణాధికారి **శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ** ఐ.ఏ.ఎస్., గారి వద్దకు వెళ్ళి వ్యాసభాగవత పరిష్కరణ పూర్తి అయిందని విన్నవించారు. అప్పుడు కార్యనిర్వహణాధికారిగారు ఎంతో సంతోషించి “పోతన భాగవతాన్ని తాత్పర్యంతో మాత్రమే ముద్రించగలిగాం. తెలుగు ప్రజలందరికీ ఎంతో ప్రియమైన భాగవతాన్ని కూడా అర్థ తాత్పర్య వివరణలతో సిద్ధం చేస్తే బాగుంటుంది. ఇందుకు తగిన ప్రతిపాదనలను సిద్ధం చెయ్యండి” అని నిర్దేశించారు.

ఈ బృహత్కార్యక్రమం భాగవతప్రాజెక్టుద్వారా కాకుండా కవిత్రయ మహాభారతానికి వ్యాఖ్యానం సమకూర్చడంలో అనుభవం గడించిన సప్తగిరి సంపాదక కార్యాలయం ద్వారానే నిర్వహించడం సముచితంగా ఉంటుందని తెలుపుతూ **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** వ్యాఖ్యాన రచనకు అవసరమైన ప్రతిపాదనలను సిద్ధం చేసి కార్యనిర్వహణాధికారివారికి పంపగా వారు ఆమోదించారు.

**డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రతిపాదనలో సారాంశం**

- వ్యాఖ్య సామాన్యులకు కూడా అర్థమయ్యే తీరులో ఉండాలి.
- శిష్టవ్యావహారికభాషను ప్రయోగించాలి.
- వ్యాకరణాదివిశేషాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండరాదు.
- ఆధ్యాత్మిక అంశాలను పరిమితంగా విశేషాంశాలలో చెప్పవచ్చు.
- కార్యనిర్వహణాధికారి వారి అధ్యక్షతన తితిదే ప్రజాసంబంధాధికారి, సప్తగిరి ప్రధాన సంపాదకులు, తితిదే స్థానిక పండితులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి వ్యాఖ్యాతలను, సంపాదకమండలిని ఎన్నుకోవాలి.

- వ్యాఖ్యాత లందరితో తిరుపతిలో ఒక కార్యశాలను నిర్వహించి అందరి వ్యాఖ్యానం ఒకే విధంగా ఉండేలా చూడాలి.
- ఇంతకు మునుపు తితిదే ముద్రించిన తాత్పర్యసహిత భాగవతానికి తాత్పర్యం వ్రాసిన పండితులలో సమర్థులైనవారిని ఈ కార్యక్రమంలో వినియోగించుకోవచ్చు.

2007లో కార్యనిర్వహణాధికారి **డా॥ కె.వి.రమణాచారి** ఐ.ఏ.ఎస్., గారి ఆమోదంమేరకు నాటి సప్తగిరి సంపాదకులు **డా॥ సి.శైలకుమార్**, భాగవత ప్రాజెక్టు ప్రధానసంపాదకులుగా **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** గారిని నియమించారు. ఆ తరువాత ఈ బృహత్కార్యాచరణకు సలహాలు, సూచనలు చేసేందుకు కవిత్రయభారత వ్యాఖ్యాననిర్వహణలాగే తొమ్మిదిమందితో కూడిన సలహామండలిని ఏర్పాటు చేశారు. దీనికి తితిదే కార్యనిర్వహణాధికారి గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు.

**సలహామండలి**

| | | |
|---|---|---|
| **శ్రీ కార్యనిర్వహణాధికారి** | **-** | **గౌరవ సంపాదకులు** |
| **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, తిరుపతి** | **-** | **ప్రధాన సంపాదకులు** |
| **డా॥ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి** | **-** | **సభ్యులు** |
| **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, మద్రాసు** | **-** | **సభ్యులు** |
| **డా॥ శలాక రఘునాథశర్మ, రాజమండ్రి** | **-** | **సభ్యులు** |
| **ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి** | **-** | **పదవీ నిమిత్త సభ్యులు** |
| **సప్తగిరి సంపాదకుడు** | **-** | **సి. శైలకుమార్, కన్వీనర్** |
| **తితిదే ప్రజాసంబంధాధికారి** | **-** | **విశేష ఆహ్వానితులు** |
| **తితిదే ప్రెస్ మేనేజర్** | **-** | **విశేష ఆహ్వానితులు** |

ఈ సంపాదక మండలిలోని పండితవర్గమైన **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, డా॥ సముద్రాల లక్ష్మణయ్య, డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, డా॥ శలాక రఘునాథశర్మ** గార్లతో ప్రధాన సంపాదకమండలిని నెలకొల్పారు. ఆ తరువాత కారణాంతరాలవల్ల **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య** గారి స్థానంలో **డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య** గారు సంపాదక మండలి సభ్యులుగా నియమితులయ్యారు. ఈ ప్రధాన సంపాదక మండలివారు భాగవత

వ్యాఖ్యాన రచనకు ముప్పైమంది పండితులను ఎంపికచేసి ఒక్కొక్కరికి 300 – 350 పద్యగద్యాలకు వ్యాఖ్యాన రచనా బాధ్యతలను అప్పగించారు.

ఆ తరువాత అనుకున్నంత వేగంగా ఈ కార్యక్రమం ముందుకు సాగలేదు.

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలను, సవ్యాఖ్యాన భాగవతాన్ని త్వరితగతిన వ్యాప్తిలోకి తేవాలన్న ఉద్దేశ్యంతో 2011లో ద్రవిడ విశ్వవిద్యాలయ విశ్రాంత ఉపకులపతి **ఆచార్య రవ్వా శ్రీహరి**గారిని ప్రచురణల విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నియమిస్తూ వీరికి సహాయకులుగా **డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గార్లను ప్రచురణల విభాగానికి ఉపసంపాదకులుగా, **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం** గార్లు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు.

అప్పటిదాకా మందకొడిగా సాగుతున్న ప్రచురణ కార్యక్రమంతోపాటు వ్యాఖ్యాన రచనా కార్యక్రమం కూడా **ఆచార్య రవ్వా శ్రీహరి** గారి సారథ్యంలో వేగాన్ని పుంజుకున్నది. వ్యాఖ్యాన రచయితలతో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ రాయలేమని తెలిపిన వారి భాగాలను వేరే పండితులకు అప్పగిస్తూ 2013నాటికి దాదాపు పండితులందరినుండి భాగవత వ్యాఖ్యానాలను తెప్పించారు. వెనువెంటనే డి.టి.పి. వగైరా పనులుకూడా ముమ్మరంగా సాగాయి. పుటల సంఖ్య ఆధారంగా 12 స్కంధాల భాగవతాన్ని 8 సంపుటాలుగా ముద్రించేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు.

**ఆచార్య రవ్వా శ్రీహరి**గారి తదనంతరం 2014లో ఎడిటర్–ఇన్–చీఫ్‌గా బాధ్యతలు చేపట్టిన పురాణ ఇతిహాస ప్రాజక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** ఈ కార్యక్రమాన్ని మరింత వేగవంతం చేశారు. వ్యాఖ్యాన రచనలను పరిష్కరించడానికి, అక్షర దోషాలను తొలగించడానికి మరి కొందరు పండితులు అవసరం కావడంతో అప్పటికే భాగవతం కన్సల్టెంటుగా ఉన్న **డా॥ గల్లా చలపతి** గారితోపాటుగా **డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు** గార్లు భాగవతం ప్రాజెక్టు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు. భాగవత స్కంధాలను సంపాదకమండలి పరిష్కరణ స్థాయికి వీరు తీసుకువచ్చారు. 2015 ఏప్రిల్ 15వ తేదీన తితిదే కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., మరియు సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుపతి) **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గార్ల ఆధ్వర్యంలో

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**గార్లతో కూడిన పోతనభాగవత సంపాదకమండలి తొలి సమావేశం జరిగింది. త్వరితగతిన పరిష్కరణ పూర్తిచేసేందుకు గాను అనుసరించాల్సిన ప్రణాళికను ఈ సమావేశంలో సిద్ధం

చేశారు. ఆ తరువాత **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంయోజకత్వంలో జరిగిన సంపాదక మండలి సమావేశాలలో మూడుస్కంధాల పరిష్కరణ పూర్తిచేసి ముద్రణార్హమైన ప్రతిని సిద్ధం చేశారు. అనివార్యకారణాలవల్ల సంపాదకమండలిలో కొందరు సభ్యులు తదుపరి సమావేశాలకు హాజరు కాలేకపోయారు.

2016లో ప్రచురణల విభాగానికి **శ్రీ ప్రయాగ రామకృష్ణ**గారు ప్రత్యేకాధికారిగా నియమితులయ్యారు. కార్యనిర్వహణాధికారి గారి అమోదం మేరకు వీరు భాగవత పరిష్కరణ కార్యక్రమం త్వరితగతిన పూర్తికావడానికి అంతకు మునుపున్న సంపాదకమండలి స్థానంలో

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య (ప్రధాన సంపాదకులు)**

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ**

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

**డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**

**డా॥ ధూళిపాళ రామకృష్ణ**

**డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**

**డా॥ కె.వి. సుందరాచార్యులు**

**డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ**గార్లతో కొత్త సంపాదకమండలిని ఏర్పాటు చేశారు. అప్పటినుంచి వ్యాఖ్యాన పరిష్కరణ కార్యక్రమం వేగవంతం అయింది. కాగా 2017 ఉగాదినాటికి సవ్యాఖ్యాన భాగవతం ముద్రించబడి ప్రజలకు అందుబాటులోకి రావాలన్న తితిదే సంకల్పాన్ని అనుసరించి పరిష్కరణ కార్యక్రమాన్ని మరింత త్వరగా పూర్తి చేసేందుకుగాను కార్యనిర్వహణాధికారి వారి ఆమోదంమేరకు

**డా॥ నిట్టల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి**

**డా॥ మరడాన శ్రీనివాసరావు**

**డా॥ గల్లా చలపతి** గార్లకు సంపాదకమండలిలో స్థానం కల్పించారు. 2016 సెప్టెంబరునుండి పండితులందరితో ప్రతినెలా దాదాపు 20 రోజులపాటు తిరుపతి శ్వేత సమావేశ మందిరంలో సమావేశాలు ఏర్పాటుచేసి పండితులందరి ఆమోదంమేరకు పరిష్కరణ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించి శుద్ధప్రతిని ముద్రణకు పంపేందుకు సిద్ధం చేశారు. ఇలా అనుకున్న సమయానికి శ్రీమహాభాగవతాన్ని ప్రకటించగలిగినందుకు సంతోషిస్తున్నాము.

సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకుని వ్యాఖ్యానం సరళంగా ఉండాలన్న కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారిగార్ల సూచనలమేరకు వ్యాఖ్యాన రచనలో విస్తృతంగా విశేషాలను వ్రాసిన పండితుల రచనల్లోంచి సంపాదకమండలి సూచనల ప్రకారం అవసరమైన మేరకు మాత్రమే విశేషాలను స్వీకరించడమయింది.

**కృతజ్ఞతలు**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావడానికి అధికారికమైన ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకమండలి అధ్యక్షులకు మరియు పాలకమండలి సభ్యులందరికీ కృతజ్ఞతలు.

లోగడ తితిదేవస్థానం కార్యనిర్వహణాధికారిగా ఉండి భాగవత ప్రాజెక్టు ప్రారంభానికి కారకులైన **శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ** ఐ.ఏ.ఎస్., గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. అదే పరంపరలో తితిదే కార్యనిర్వహణాధికారులుగా బాధ్యతలు నిర్వహించి భాగవత ప్రాజెక్టుకు సంపూర్ణ సహకారాన్ని అందించిన **డా॥ కె.వి.రమణాచార్య** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎమ్.జి.గోపాల్** ఐ.ఏ.ఎస్., గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు.

పోతనభాగవతం ముద్రణదశకు చేరుకునేందుకు తగిన సూచనలు, సలహాలు ఇచ్చిన సలహామండలి సభ్యులందరికీ ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన భాగవత ప్రచురణలో ఆసక్తిని కనబరుస్తూ అన్నివిధాలా అందుకు తగిన ప్రోత్సాహాన్ని అందజేసిన గౌరవ శ్రీ కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారి **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గారికి మా హృదయపూర్వక నమోవాకాలు.

భాగవత వ్యాఖ్యాన రచనకు అవసరమైన పండితులను ఎన్నుకొని వారికి వ్యాఖ్యాన బాధ్యతలను అప్పగించడంలో కృషిచేసిన నాటి సప్తగిరి ప్రధాన సంపాదకులు **డా॥ సి.శైలకుమార్** గారికి, సంపాదకులు **డా॥ కె.రాధారమణ** (ప్రస్తుత ప్రధాన సంపాదకులు) గార్లకు కృతజ్ఞతలు.

వ్యాఖ్యాతలందరినుండి వ్యాఖ్యాన భాగాలను రప్పించడంలో శ్రమించి, విశేష కృషిచేసిన నాటి ప్రచురణల విభాగం అధికారి **ఆచార్య రవ్వా శ్రీహరి** గారికి, పరిష్కరణ కార్యక్రమాన్ని వేగవంతంచేసిన తదుపరి అధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారికి, కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పోతన భాగవత పరిష్కరణలో తమ అమూల్య సహాయసహకారాలనందించి శుద్ధప్రతిని తయారు చేయడంలో సహకరించిన **పోతన భాగవత సంపాదకమండలి సభ్యులందరికీ** పేరుపేరునా ధన్యవాదాలు.

ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ అన్నివిధాలా సంపూర్ణ సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగ ఉపసంపాదకులు **డా॥ నొస్సం నరసింహాచార్య** గారికి, పరిష్కరణ, అక్షరదోష సవరణల్లో సహకరించిన కార్యాలయ పండితులు **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, డా॥ గల్లా చలపతి, డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు**గార్లకు, ప్రచురణల విభాగంలో కొంతకాలం ఉపసంపాదకురాలుగా పనిచేసి భాగవత పరిశీలనా కార్యక్రమంలో సహకరించిన **శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవత ముద్రణకు సంబంధించిన దస్త్రాలను నడపడంలోను, సంపాదకమండలి సమావేశాలను ఏర్పాటు చేయడంలోను సహకరించిన **ప్రచురణల విభాగ కార్యాలయ సిబ్బందికి** నా ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవతం ఎనిమిది సంపుటాలలో చివరన ముద్రించిన అకారాదిక్రమ పద్యగద్య సూచికను తయారు చేయడంలో సహకరించిన **శ్రీ వాడపల్లి శేషతల్పశాయి** (ఆంధ్రభారతి.కామ్) గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలను అందంగా డి.టి.పి. చేసి చక్కటి వర్ణచిత్రాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రచురణల విభాగ కార్యాలయ డి.టి.పి. సిబ్బంది **శ్రీమతి ఎమ్.సుబ్బరత్నమ్మ, శ్రీమతి జె.కరుణ, కుమారి ఎమ్.మానస, శ్రీ ఎమ్.రెడ్డిప్రసాద్** గార్లకు ధన్యవాదాలు.

ఈ గ్రంథంలో ప్రసిద్ధ చిత్రకారులు బాపుగారి అద్భుత వర్ణచిత్రాలను ముద్రించేందుకు అనుమతించిన బాపుగారి కుటుంబసభ్యులకు మా ప్రత్యేకధన్యవాదాలు.

తక్కువ వ్యవధిలో గ్రంథ ముద్రణను పూర్తిచేసి పాఠకులకు అందించేందుకు తోడ్పడిన టిటిడి ముద్రణాలయ ఉపకార్యనిర్వహణాధికారి **శ్రీమతి ఎమ్.గౌతమి** గారికీ, వారి సిబ్బందికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

*సదా శ్రీవారి సేవలో...*

ప్ర. రామకృష్ణ

**(ప్రయాగ రామకృష్ణ)**

కన్వీనర్

ప్రత్యేకాధికారి, ప్రచురణల విభాగం

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# సంపాదక మండలి

అధ్యక్షులు

**డా॥ డి.సాంబశివరావు**, ఐ.ఏ.ఎస్,

కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి

పర్యవేక్షకులు

**శ్రీ పోల భాస్కర్**, ఐ.ఏ.ఎస్,

సంయుక్త కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి

ప్రధాన సంపాదకులు : **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

## సభ్యులు

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

కన్వీనర్ : డా॥ సముద్రాల లక్ష్మణయ్య, ఎడిటర్-ఇన్-చీఫ్, ప్రచురణల విభాగం

కో - కన్వీనర్ : డా॥ నొస్సం నరసింహాచార్య, ఉపసంపాదకులు, ప్రచురణల విభాగం

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

| వ్యాఖ్యాతలు | స్కంధాలు |
|---|---|
| 1) డా॥ కేసాప్రగడ సత్యనారాయణ | ప్రథమస్కంధము (1-275) |
| 2) డా॥ మల్లెల గురవయ్య | ప్రథమస్కంధము (276-529) |
| 3) డా॥ సముద్రాల లక్ష్మణయ్య | ద్వితీయస్కంధము (1-288) |
| 4) డా॥ కడిమిళ్ళ వరప్రసాద్ | తృతీయస్కంధము (1-388) |
| 5) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (389-717) |
| 6) డా॥ గల్లా చలపతి | తృతీయస్కంధము (718-887) |
| 7) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (888-1055) |
| 8) డా॥ దావులూరి కృష్ణకుమారి | చతుర్థస్కంధము (1-322) |
| 9) డా॥ ఆర్. అనంతపద్మనాభరావు | చతుర్థస్కంధము (323-636) |
| 10) డా॥ శలాక రఘునాథశర్మ | చతుర్థస్కంధము (637-977) |
| 11) డా॥ కె. సర్వోత్తమరావు | పంచమస్కంధము |
| | ప్రథమాశ్వాసము (1-183) |
| | ద్వితీయాశ్వాసము (1-167) |
| 12) డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు | షష్ఠస్కంధము (1-251) |
| 13) డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ | షష్ఠస్కంధము (252-346) |
| 14) డా॥ ఆకురాతి పున్నారావు | షష్ఠస్కంధము (347-440) |
| 15) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | షష్ఠస్కంధము (441-530) |
| 16) డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ | సప్తమస్కంధము (1-186) |

17) డా॥ ఆకురాతి పున్నారావు — సప్తమస్కంధము (187-482)

18) డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద — అష్టమస్కంధము (1-391)

19) శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు — అష్టమస్కంధము (392-744)

20) డా॥ డి. మీరాస్వామి — నవమస్కంధము (1-364)

21) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం — నవమస్కంధము (365-737)

22) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య — దశమస్కంధము పూర్వభాగము (1-288)

23) డా॥ ఎ.ఎస్. గోపాలరావు — దశమస్కంధము పూర్వభాగము (289-610)

24) శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ — దశమస్కంధము పూర్వభాగము (611-912)

25) డా॥ పి. నరసింహారెడ్డి — దశమస్కంధము పూర్వభాగము (913-1188)

26) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు — దశమస్కంధము పూర్వభాగము (1189-1485)

27) డా॥ పి.ఆర్. హరినాథ్ — దశమస్కంధము పూర్వభాగము (1486-1792)

28) డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు — దశమస్కంధము ఉత్తరభాగము (1-245)

29) డా॥ ఎన్.వి.ఎస్. రామారావు — దశమస్కంధము ఉత్తరభాగము (246-537)

30) డా॥ కె. మలయవాసిని — దశమస్కంధము ఉత్తరభాగము (538-764)

31) డా॥ కె.జె. కృష్ణమూర్తి — దశమస్కంధము ఉత్తరభాగము (765-1033)

32) డా॥ సంగనభట్ల నరసయ్య — దశమస్కంధము ఉత్తరభాగము (1034-1343)

33) డా॥ గల్లా చలపతి — ఏకాదశస్కంధము (1-127)
ద్వాదశస్కంధము (1-54)

**పోతన భాగవతప్రాజెక్టు కన్సల్టెంట్స్**

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం ✻ డా॥ గల్లా చలపతి ✻ డా॥ ముదివేడు ప్రభాకరరావు

శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు ✻ శ్రీ కట్టా నరసింహులు

# సంకేతాక్షర సూచి

| | | | | | |
|---|---|---|---|---|---|
| క. | – | కందం | య. | – | యగణం |
| ఆ. | – | ఆటవెలది | మ. | – | మగణం |
| తే. | – | తేటగీతి | త. | – | తగణం |
| సీ. | – | సీసపద్యం | ర. | – | రగణం |
| ఉ. | – | ఉత్పలమాల | జ. | – | జగణం |
| చ. | – | చంపకమాల | భ. | – | భగణం |
| మత్త. | – | మత్తకోకిల | న. | – | నగణం |
| మ. | – | మత్తేభవిక్రీడితం | స. | – | సగణం |
| శా. | – | శార్దూలవిక్రీడితం | ల. | – | లఘువు |
| శ్లో. | – | శ్లోకం | గ. | – | గురువు |
| వ. | – | వచనం | వ. | – | వగణం |
| అలం. | – | అలంకారం | | | |

| | | |
|---|---|---|
| అవ. | – | అవతారిక |
| తా. | – | తాత్పర్యం |
| ప్రతి. | – | ప్రతిపదార్థం |
| విశే. | – | విశేషార్థం |
| ప్ర.ఆ. | – | ప్రథమాశ్వాసం |
| ద్వి.ఆ. | – | ద్వితీయాశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |
| ... | – | తరువాతి పద్యం / వచనంతో అన్వయం |



# భాగవత మాహాత్మ్యము

**శ్లో. అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరోహరిః ।**
**అఫాలలోచనః సాక్షాద్ భగవాన్ బాదరాయణః ॥**

**శ్లో. వ్యాసంవసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

**శ్లో. వ్యాసాయవిష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥**

శ్రీ వ్యాసమహర్షియే బాదరాయణుడు. ఈయన నాలుగు ముఖములులేని బ్రహ్మ, రెండు చేతులు ఉన్న విష్ణుమూర్తి, పాలభాగంలో మూడవ కన్నులేని శివుడు. వ్యాసుడు వసిష్ఠునకు మునిమనుమడు. శక్తికి మనుమడు. పరాశరునికి కొడుకు. శుకమహర్షికి తండ్రి. అట్టి తపోనిధికి నమస్కరిస్తున్నాను. వ్యాసుడే విష్ణువు, విష్ణువే వ్యాసుడు. వసిష్ఠుని వంశంలో పుట్టిన, బ్రహ్మనిధి అయిన వ్యాసునకు నమస్కరిస్తున్నాను.

వ్యాసమహర్షి రచించిన పురాణాల్లో భాగవతం శ్రేష్ఠమైంది. భాగవత మహిమ స్కాంధపురాణం, పద్మపురాణం, కౌశికసంహిత మొదలైనవాటిలో ఎక్కువగా కీర్తించబడింది. భాగవతమాహాత్మ్యాన్ని శ్రీమహావిష్ణువే స్వయంగా చతుర్ముఖ బ్రహ్మకు ఉపదేశించాడు.

**స్కాంధపురాణం – విష్ణుఖండం**

భాగవత మాహాత్మ్యాన్ని గురించి స్కాంధపురాణంలోని విష్ణుఖండంలో శ్రీమహావిష్ణువు బ్రహ్మదేవునికి వివరిస్తూ “కుమారా! భాగవతపురాణం విశ్వవిఖ్యాతమైంది. భాగవతాన్ని శ్రద్ధగా వినాలి. అదే నాకు సంతోషాన్ని కల్గిస్తుంది. భాగవతాన్ని నిత్యం పఠించిన వారికి కపిలగోవును దానం చేసిన ఫలితం లభిస్తుంది. భాగవతంలోని ఒక శ్లోకాన్ని కాని, శ్లోకంలోని సగభాగాన్ని కాని కనీసం ఒక పాదాన్ని కాని చదివితే వేయి గోవులను దానం చేసిన ఫలితం లభిస్తుంది. భాగవతంలోని ఒక్క శ్లోకాన్ని నిత్యమూ చదివితే పద్దెనిమిది పురాణాలూ చదివిన ఫలితం కలుగుతుంది. విష్ణు కథలను చదివినవారి పాపాలు పటాపంచలవుతాయి. వైష్ణవశాస్త్రమగు భాగవతాన్ని తమ ఇళ్లలో ఉంచి ఎవరు పూజిస్తారో వారికి ఏ పాపాలూ అంటవు. కలిబాధలు తొలగిపోతాయి. భాగవతాన్ని ఎవరు నిత్యం అర్చిస్తారో వారిని దేవతలు కూడా అర్చిస్తారు. మానవులు తమ ఇళ్లలో భాగవతాన్ని ఉంచి పూజించినన్ని రోజులు వారి పితృదేవతలు పాలు, నెయ్యి, తేనె, తియ్యని నీళ్లు తాగుతారు. ఎవరి ఇంట్లో భాగవతం ఉంటుందో వారు వేలకొలది సంవత్సరాలు వైకుంఠంలో నివసిస్తారు. భాగవతాన్ని చదివేవాడు తక్కిన శాస్త్రాలు అధ్యయనం చేయకపోయినా పరవాలేదు. ఎవరి ఇంట భాగవతం ఉండదో వారిని యముడు పాశాలతో పీడిస్తాడు.

కుమారా! ఎవరు భాగవతాన్ని చదవరో వాడే చండాలుడు. నన్ను సంతృప్తిపరచాలంటే మానవులు తనకున్న ధనాన్ని దానంచేసి నిత్యం భాగవత పారాయణం చేయాలి. కలియుగంలో ఎక్కడెక్కడ భాగవతం ఉంటుందో

అక్కడక్కడ నేను దేవతలతో కలిసి నివాసముంటాను. ఎక్కడ భాగవతం ఉంటుందో అక్కడ సర్వతీర్థాలూ, సకల పుణ్యక్షేత్రాలు, నదులు, సరస్సులు, యజ్ఞాలు, సప్తనగరాలు (అయోధ్య, మథుర, మాయ, కాశీ, కాంచి, అవంతిక, ద్వారక), పవిత్ర పర్వతాలు ఉంటాయి. కీర్తి, ధర్మం, జయం, మోక్షం కోరుకునేవారు పాపాలను నశింపచేసుకొనేందుకు ధర్మబుద్ధితో భాగవత పురాణాన్ని వినాలి. భాగవతాన్ని చదివినా, విన్నా పుణ్యం, ఆయుశ్శు, ఆరోగ్యం లభిస్తాయి. ఎవరు భాగవతాన్ని వినరో, విని సంతోషించరో వారు యమధర్మరాజు అధీనంలో ఉంటారు. ఇది సత్యం. ఇదే సత్యం.

ఏకాదశినాడు ఎవడు భాగవతాన్ని వినడో వాడు మహాపాపి. ఎవరింట్లో భాగవతం రాయబడుతుందో అక్కడ నేనుంటాను. సకల పుణ్యనదుల్లో స్నానం చేయడంవల్ల ఎటువంటి ఫలం కలుగుతుందో, నాలుగు ఆశ్రమ ధర్మాలందున్న సాధువులను సేవించడంవల్ల ఎటువంటి ఫలం కలుగుతుందో అటువంటి ఫలం భాగవత పారాయణంవల్ల కలుగుతుంది.

ఓ చతుర్ముఖా! ఎక్కడ భాగవత కథ వినబడుతుందో అక్కడకు దూడను వెతుకుతూ వెళ్లే ఆవులాగా నేను వెళతాను. ఎవరు నా కథలు వింటారో, ఎవరు నా కథలు చదువుతారో, ఎవరు భాగవత కథలవల్ల తృప్తి పొందుతారో వారిని నేనెప్పుడూ విడిచిపెట్టను. ఎవరు భాగవత పురాణాన్ని చూచి కూడా నిలబడి భక్తితో నమస్కరించరో వారికి సంవత్సర పుణ్యం నష్టమవుతుంది. ఎవరు భాగవతానికి నమస్కరిస్తారో వారిని చూసి నేను ఆనందిస్తాను. ఎవరు దూరంనుండి భాగవతాన్ని చూసి సమ్ముఖులై భక్తితో దానిదగ్గరకు వెళతారో వారికి అశ్వమేథయాగం చేసిన పుణ్యం లభిస్తుంది. ఎవరు నిలబడి భాగవతానికి భక్తితో నమస్కరిస్తారో వారికి మంచి సంపదనూ, మంచి భార్యనూ, మంచి సంతానాన్ని నేను ప్రసాదిస్తాను. ఎవరు తమ శక్తికొలదీ రాజోపచారాలతో భాగవతపురాణాన్ని పూజించి వింటారో వారికి నేను వశమవుతాను. ఎవరు పర్వదినాల్లోను, దేవోత్సవాల్లోను వస్త్రాలు, నగలు దానంచేసి భాగవతాన్ని ధూపదీపాలతో అర్చిస్తారో వారు పతివ్రత భర్తను వశం చేసుకున్నట్లు నన్ను వశం చేసుకుంటారు. ప్రతిరోజూ భాగవతాన్ని చదవడంవల్ల సమస్త పుణ్యఫలాలూ లభిస్తాయి" అని శ్రీమహావిష్ణువు తన కుమారుడైన బ్రహ్మదేవునికి భాగవత మాహాత్మ్యాన్ని తెలియజేశాడు.

**పద్మపురాణ ఉత్తరఖండంలోని భాగవత మాహాత్మ్యం**

పూర్వం నైమిశారణ్యంలో సూతపౌరాణికుణ్ణి శౌనక మహర్షి "మహాత్మా! విష్ణు భక్తులందరూ భక్తి జ్ఞాన వైరాగ్యాలతో వివేకాన్ని పెంచుకొని మాయను తొలగించుకుంటున్నారు. అది ఎలా సాధ్యం. సాధారణంగా ఈ కలియుగంలో జీవులు రాక్షసభావంతో ఉంటారు. అట్టి ఆపదలో ఉన్నవారు తరించుటకు ఏదైనా ఉపాయం ఉందా? శ్రేయస్సుల్లో శ్రేయమైంది, పవిత్రమైంది శ్రీకృష్ణుని చేర్చునది అయిన సాధనమేది? చింతామణి కోరిన సుఖాలనిస్తుంది. కల్పవృక్షం కోరిన సంపదలనిస్తుంది. సద్గురువు యోగులకు దుర్లభమైన వైకుంఠాన్నే ఈయగలదు కదా!" అని ప్రార్థించాడు.

శౌనకుని ప్రశ్నకు సమాధానంగా సూతమహర్షి "ఓ శౌనకా! కాలమనే నల్లత్రాచు పాముచే కరవబడిన సంసారికి సుఖాలనిచ్చేది శుకమహర్షి చెప్పిన భాగవతమొక్కటే. ఎన్నో జన్మల్లో పుణ్యం చేసినవారికే భాగవతం

లభిస్తుంది. శుకబ్రహ్మ పరీక్షిత్తుకు భాగవత కథను చెప్పడం మొదలుపెట్టాడు. ఆ కథలు వినడానికి దేవతలు అమృతభాండంతో వచ్చారు. ఆ అమృతభాండాన్ని శుకమహర్షికి ఇచ్చి భాగవతామృతాన్ని తమకివ్వమని అడిగారు. అమృతమెక్కడ? భాగవతామృతమెక్కడ? అమృతం గాజుపెంకువంటిది. భాగవతామృతం చింతామణివంటిది అని శుకుడు నవ్వి భాగవతాన్ని ఇవ్వడానికి అంగీకరించలేదు.

పరీక్షిత్తునకు భాగవత కథాశ్రవణంచేత ప్రాప్తమైన మోక్షాన్ని చూచి బ్రహ్మ ఆశ్చర్యంతో సత్యలోకంలో భాగవత కథను ఒకవైపు, మోక్షసాధనాలను మరోవైపు త్రాసులో ఉంచి తూకం వేశాడు. భాగమతమే బరువైతూగింది. భాగవతం విష్ణుస్వరూపం. దీన్ని విన్నా, చదివినా వైకుంఠప్రాప్తి కలుగుతుంది. ఏడురోజులు భాగవతాన్ని భక్తితో పారాయణం చేస్తే తప్పక మోక్షం సిద్ధిస్తుంది.

ఒకసారి సనకసనందనాది మహర్షులు విశాలానగరానికి వచ్చి నారదుణ్ణి చూచి “నారదా! నీవెందుకు దైన్యంగా ఉన్నావు? వేగంగా ఎక్కడకుపోతున్నావు?” అని అడిగారు. అందుకు నారదుడు “ఓ మహర్షులారా! నేను భూలోకం గొప్పదని భావించి వెళ్లాను. కాశీ, ప్రయాగ, గోదావరి, హరిద్వారం, కురుక్షేత్రం, శ్రీరంగం, రామేశ్వరం మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించాను. భూలోకమంతా తిరిగాను. ఎక్కడా సత్యం, ధర్మం లేవు. ప్రజలందరూ మందులు, మందబుద్ధులు, పాషండులుగా జీవిస్తున్నారు. ఇళ్లలో ఆడవారిదే పెత్తనం. ఆడపిల్లలను అమ్ముకుంటున్నారు. పుణ్యక్షేత్రాలను మ్లేచ్ఛులు పరిపాలిస్తున్నారు. యోగి, జ్ఞాని, సిద్ధుడు, కర్మ చేసేవాడు లేనేలేరు. జనులు అన్నాన్ని అమ్ముకుంటున్నారు. ఇదంతా కలియుగ మహిమ.

నేను యమునా నదితీరంలో ఒక అద్భుతాన్ని చూశాను. అక్కడ యౌవనంలో ఉన్న ఒక స్త్రీ కనబడింది. ఆమెపక్కన ఇద్దరు ముసలివారు చైతన్యం లేకుండా పడి ఉన్నారు. ఆమె వారికి సేవచేస్తూ చైతన్యాన్ని కలిగించే ప్రయత్నం చేస్తూంది. ఆమెను వందమంది స్త్రీలు సేవిస్తున్నారు. నేను ఆశ్చర్యంతో ఆమెను వివరాలడిగాను. ఆమె తన వృత్తాంతాన్ని ఇలా చెప్పింది – “ఓ నారదా! నా పేరు భక్తి. ఈ ఇద్దరూ జ్ఞానుడు, వైరాగ్యుడు అనే నా కుమారులు. ఈ స్త్రీలు గంగ, యమున మొదలైన నదులు. నాకెక్కడా శాంతి లేదు. నేను ద్రావిడదేశంలో పుట్టి, కర్నాటదేశంలో పెరిగి, మహారాష్ట్రంలో కొంతకాలం ఉండి చివరకు ఘూర్జరదేశం చేరి చిక్కిపోయాను. బలహీనురాలనయ్యాను. ఈ స్థితిలో ఉన్న నా కుమారులతో జాడ్యమును పొందాను. తరువాత బృందావనం చేరగానే నాకు నూత్న యౌవనం వచ్చింది. నా బిడ్డలుమాత్రం ముసలివారైపోయారు. ఓ నారదా! నీవు బుద్ధిమంతుడివి. యోగివి. మేమిలా అవ్వడానికి కారణమేమి?” అని అడిగింది. నారదుడు దివ్యదృష్టితో అంతా తెలుసుకొని ఇలా చెప్పాడు – “ఓ బాలా! ఈ కలికాలం చాలా చెడ్డది. కలి ప్రవేశించగానే సదాచారం, యోగమార్గం, తపస్సు లోపించాయి. జనులందరూ పాపాత్ములై, రాక్షసులై దుష్కర్మలు చేస్తున్నారు. భూమి భారం మోయలేకపోతూంది. ఆదిశేషునికి కూడా భూభారం ఎక్కువైంది. ఓ భక్తీ! ఇప్పుడు నిన్ను, నీ కొడుకులైన జ్ఞానవైరాగ్యాలను ఎవ్వరూ పట్టించుకోవడం లేదు. ఈ బృందావనం శ్రీకృష్ణ భక్తితో నిండింది కనుక నీవు తరుణివైనావు. ఈ జ్ఞానవైరాగ్యాలను ఎవరూ తెలుసుకొనే ప్రయత్నం చేయడంలేదు. కనుక ముసలివారైయ్యారు. శ్రీకృష్ణుడు భూలోకాన్ని విడిచి వైకుంఠాన్ని చేరగానే కలి భూలోకంలో ప్రవేశించాడు. ఈ కలియుగంలో ఇంకా

యజ్ఞయాగాలు, జ్ఞానం, వైరాగ్యం మొదలైనవానికి అవకాశం లేదు. కేశవ నామాన్ని స్మరించడమే మోక్షదాయకం. బ్రాహ్మణులు ఇంటింటా భాగవతాన్ని చదివితే మళ్లీ ధర్మం వృద్ధి పొందుతుంది. విష్ణుభక్తి ఈ లోకంలో తగ్గిపోయింది. ఎవరిని ఏమని నిందించినా ప్రయోజనం లేదు. ఇది యుగధర్మం. బృందావనంలో శ్రీకృష్ణుడే సమస్తాన్ని చక్కబరుస్తాడు.

ఓ బాలా! భక్తీ నీవెందుకు విచారిస్తున్నావు. శ్రీకృష్ణుని పాదపద్మాలను స్మరించు. నీ దుఃఖాలన్నీ తొలగిపోతాయి. పూర్వం కౌరవులు నిండుసభలో ద్రౌపది వస్త్రాలను హరించే ప్రయత్నం చేయగా శ్రీకృష్ణుడు అక్షయ వస్త్రాలనిచ్చి ద్రౌపది మానాన్ని కాపాడలేదా? నీవు భక్తివి. నీవంటే కృష్ణుడికి మక్కువ ఎక్కువ. నీవు పిలిస్తే శ్రీకృష్ణుడు నీ ఇంటికే వస్తాడు. కలియుగంలో భక్తిమార్గమే ప్రధానమైంది. కలికాలం నాస్తికులచే పీడింపబడుతూంది. ముక్తికాంత వైకుంఠాన్ని చేరింది. ఓ భక్తీ! నీవు పిలిస్తే ముక్తికాంత భూలోకానికి వస్తుంది. నీ కొడుకులైన జ్ఞానుడూ, వైరాగ్యుడూ కలిచే పీడింపబడి ముసలివాళ్లయ్యారు. విచారం మాని వీళ్లను నీవే పోషించు. ఒకవిధంగా చూస్తే ఈ కలియుగమే గొప్పది. జనులెంత పాపాత్ములైనా నీ (భక్తి) వలన నిర్భయంగా శ్రీకృష్ణమందిరంలో ప్రవేశిస్తున్నారు. ఎవరి మనస్సులో భక్తి ఉంటుందో వారికి ఆపదలుండవు" అని చెప్పి నారదుడు ముసలివారైన భక్తి కుమారులను తన చేతితో స్పృశించి ఓ జ్ఞానుడా! ఓ వైరాగ్యుడా! లేవండి అని చెవిదగ్గర గట్టిగా అరిచి మేల్కొల్పాడు. వేదాలచేత, వేదాంతాలచేత, భగవద్గీతచేత వారు బలవంతంగా నిద్రనుండి లేచారు. చిక్కిన శరీరాలతో మళ్లీ వారు నిద్రలోకి దిగారు. నారదుడు ఏం చేయాలో తెలియక విచారంతో గోవిందుని స్మరించాడు. అప్పుడు ఆకాశవాణి "నారదా! నీ ప్రయత్నం ఫలిస్తుంది. నీవు సత్కర్మలు ఆచరించు" అని పలికింది. ఎటువంటి సత్కర్మలవల్ల ఆ ఇద్దరు కుమారులు మేల్కొంటారో తెలియక అన్ని తీర్థాలూ తిరుగుతూ కనిపించినవారినందరినీ అడుగుతూ చింతతో చివరకు నారదుడు బదరీవనాన్ని చేరాడు. ఏ సత్కర్మవల్ల జ్ఞానుడు, వైరాగ్యుడు మేల్కొంటారో తెలుసుకొనేందుకు బదరీవనంలో తపస్సు చేయాలని నిర్ణయించుకున్నాడు. ఈలోపు బ్రహ్మచారులైన సనకసనందనాదులు ఎదురయ్యారు. నారదుడు వారిని ప్రార్థించి ఆకాశవాణి పలుకులను తెలియజేశాడు. ఆ సత్కర్మను ఉపదేశించమని కోరాడు. అప్పుడు వారు "నారదా! అన్ని యజ్ఞాలలో జ్ఞానయజ్ఞం గొప్పది. భాగవతాన్ని మాటిమాటికీ చదవడమే జ్ఞానయజ్ఞం. భాగవతం పరమహంససంహిత. భక్తి, జ్ఞాన, వైరాగ్యాలనే త్రికానికి భాగవత కథాలాపమే గొప్ప బలం. జ్ఞానవైరాగ్యాలకు కలిగిన కష్టం తొలగిపోయి భక్తిసుఖం కలుగుతుంది. భాగవతాన్ని చదవడంవల్ల సకల కలిదోషాలు తొలగిపోతాయి అని అన్నారు. అప్పుడు నారదుడు వారిని "స్వామీ! వేదవేదాంతాది గీతాపాఠాలతోనే జ్ఞానుడు, విరాగుడు మేల్కొనలేదు. మరి అది ఒక్క భాగవతాన్ని వినడంతోనే ఎలా సాధ్యమవుతుంది?" అని అడిగాడు. ఆ మాటలు విని సనత్కుమారాదులు "నారదా! ఈ భాగవతం సమస్త వేదవేదాంతాల్లోని సారం. భాగవత కథాశ్రవణఫలం ప్రత్యేకమైనది. భాగవతం మొదటినుండి చివరిదాకా సారవంతమైనది. దానిని ఆస్వాదించకపోతే ప్రత్యేక ఫలం దొరకదు. చెరకుగడలో పైనుంచి కిందిదాకా తీపి (చక్కెర) వ్యాపించి ఉంటుంది. దాన్ని ప్రత్యేకంగా తిన్నప్పుడే ఆనందం కలుగుతుంది. అలాగే ఈ భాగవత కథనుకూడా సంపూర్తిగా వింటేనే విశిష్టమైన ఫలితం లభిస్తుంది. గంగాద్వారం దగ్గర ఆనందం అనే పేరుగల పవిత్రతీర్థం ఉంది. ఆ తీర్థాన్ని అనేకమంది మహర్షులు, సిద్ధులు సేవించారు. ఆ ప్రదేశం

పరమపవిత్రమైంది. అపూర్వరసస్వరూపమైన ఈ భాగవత జ్ఞానయజ్ఞాన్ని అక్కడే నిర్వహించు. బలహీనులైన జ్ఞానవైరాగ్యాలతోపాటు భక్తికూడా అక్కడకు వస్తుంది" అని ఉపదేశించారు.

నారదునితోపాటు సనత్కుమారాది మహర్షులు కూడా ఆ గంగాతీరాన్ని చేరారు. పలువురు విష్ణుభక్తులు, భృగువు, వసిష్ఠుడు మొదలైన మునిగణం, తమ భార్య, బంధుమిత్ర శిష్యులతో కలిసి అక్కడికి చేరుకున్నారు. వేదవేదాంతాది శాస్త్రాలు, మంత్రతంత్రాలు రూపాలు ధరించి అక్కడికి చేరుకున్నాయి. గంగ మొదలైన నదులు, పుష్కరం మొదలైన తీర్థాలు, దండకం మొదలైన పుణ్యక్షేత్రాలు, భాగవతాన్ని వినడానికి అక్కడకు చేరుకున్నాయి. నాగులు, గరుడులు, గంధర్వులు, దేవతలు అక్కడకు వచ్చారు. శుక్రాచార్యుడు రాక్షసులను వెంటబెట్టుకుని భాగవత శ్రవణానికి వచ్చాడు.

నారదుడు భాగవత ప్రవచన దీక్షను తీసుకున్నాడు. ఋషులు, దేవతలు, విద్యలు, పుణ్యతీర్థాలు నాలుగు దిక్కులందు కూర్చున్నారు. జయజయ ధ్వానాలతో, శంఖారావాలతో, మృదంగ ధ్వనులతో సభ మారుమోగింది. పూలవాన కురిసింది. వారిలో శ్రేష్ఠులు, మహాత్ములు అయిన ఋషులు కొందరు భాగవత మాహాత్మ్యాన్ని వివరించారు. భాగవతం ఒక్కటే మోక్షశాస్త్రం. వేదం, శాస్త్రం, పురుషసూక్తం, ద్వాదశాక్షరమంత్రం అన్నీ భాగవతమే. అంత్యకాలంలో భాగవతాన్ని స్మరించేవాళ్ళు వైకుంఠాన్ని పొందుతారు. వారికి విష్ణుసాయుజ్యం, ముక్తి లభిస్తాయి.

ఈ విధంగా నారదుడు దీక్షతో ఏడురోజులు భాగవతాన్ని చెప్పగా అందరూ శ్రద్ధగా విన్నారు. భక్తికూడా తన కుమారులు జ్ఞాన, వైరాగ్యులతో కలిసి భాగవతాన్ని వినింది. విష్ణువు తన తేజస్సును భాగవతంలో ప్రవేశపెట్టాడు. భాగవత శ్రవణంవల్ల భక్తి, జ్ఞాన, విరాగులకు నూతన జవసత్వాలు వచ్చాయి. అప్పుడు భక్తి "నేను మీచేత అనుగ్రహింపబడ్డాను. ఈ భాగవత కథారసంచేత కలి నాశనమయింది. నేనిప్పుడు ఎక్కడ ఉండాలి?" అని బ్రహ్మను అడిగింది. అప్పుడు బ్రహ్మదేవుడు "ఓ భక్తీ! నీవు గోవిందస్వరూపిణివి. ఎల్లప్పుడూ విష్ణుభక్తుల హృదయంలో నీవు నివసించు. అందువల్ల నీకు కలిదోషాలు అంటవు" అని చెప్పగా బ్రహ్మ ఆజ్ఞానుసారం భక్తి హరిభక్తుల హృదయాల్లో నివసించసాగింది. శ్రీహరి కూడా వైకుంఠాన్ని వదలి తన భక్తుల హృదయాల్లో నివాసాన్ని ఏర్పరచుకున్నాడు.

నారదుని భాగవత సప్తాహ జ్ఞానయజ్ఞ ప్రవచనాన్ని వింటూ అక్కడున్న మహర్షులు అలౌకికమైన సమాధి స్థితిలోకి వెళ్లారు. వాళ్లను చూసి నారదుడు "ఈ భాగవత సప్తాహంవల్ల మూర్ఖులు, మహాఅపకారులు, పాపాత్ములు, పశుపక్ష్యాదులతోసహా తమ పాపాలను పోగొట్టుకున్నారు. ఈ లోకంలో ఆత్మశోధనకు భాగవతంకంటే పవిత్రమైనది లేదు. సర్వపాపాలను పోగొట్టే భాగవతంతో సమానమైన కథ మరొకటి లేదు. ఎవరెవరీ కథాశ్రవణంవల్ల పవిత్రులవుతారో దయచేసి వివరించండి" అని సనకాది మహామునులను అడిగారు.

సనకాది మహామునులు "నారదా! మహాపాపాత్ములు, దురాచారులు, కామక్రోధ మానసులు, అసత్యాన్ని మాట్లాడేవారు, పితృదూషకులు, అత్యాశాపరులు, వర్ణాశ్రమాచార ధర్మాలను పాటించనివారు, మాత్సర్యం గలవారు, పంచమహాపాతకులు, పిశాచాల్లాగా నిర్దయులైన క్రూరులు, బ్రాహ్మణ ద్రవ్యాలను అపహరించినవారు, వ్యభిచారులు

మొదలైన వారందరూ భాగవత కథాశ్రవణంవల్ల పునీతులవుతారు. పూర్వం జరిగిన ఒక వృత్తాంతాన్ని చెబుతాను విను. ఈ వృత్తాంతాన్ని వింటేనే పాపం నశించిపోతుంది.

## గోకర్ణోపాఖ్యానం

తుంగభద్రా నదీతీరంలో ఒక పట్టణముంది. ఆ పట్టణంలో సకల వేదాలను చదివిన ఆత్మదేవుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు భిక్షావృత్తితో ధనవంతుడయ్యాడు. అతని భార్య దుందులీ. ఆమె గయ్యాలి. వారికి సంతానం కలగలేదు. ఆత్మదేవుడు ఒకరోజు అడవికి వెళ్ళాడు. అక్కడ ఒక సన్న్యాసి కనిపించాడు. ఆత్మదేవుడు సన్న్యాసి కాళ్లపై పడి నమస్కరించి "అయ్యా! నాకు సంతానం లేదు. నేనొక గోవును పెంచుకుంటున్నాను. ఆ గోవు కూడా గొడ్డుదయింది. నేను చెట్టును పెంచినా కూడా అది ఫలాలనివ్వడం లేదు. సంతానంలేని నిర్భాగ్యుని జీవితం వ్యర్థమే కదా! నాకు సంతానం కలిగే ఉపాయాన్ని చెప్పండి" అని ప్రార్థించాడు. ఆ సన్న్యాసి "ఓ విప్రోత్తమా! నీకు ఒక పండిస్తాను. నీవు దాన్ని నీ భార్యతో తినిపించు. కుమారుడు తప్పక జన్మిస్తాడు" అని పండునిచ్చి వెళ్ళిపోయాడు. ఆత్మదేవుడు ఆ ఫలాన్ని తెచ్చి భార్యకిచ్చాడు. ఆమె తన మనస్సులో "ఈ పండు తింటే నాకు గర్భం వస్తుంది. పొట్ట పెద్దదవుతుంది. కడుపులో ఉన్న బిడ్డ పెరిగినకొద్దీ అనేక దుఃఖాలు కలుగుతాయి. పురుడు వచ్చినప్పుడు బిడ్డ అడ్డం తిరిగితే బాధ భరించలేక చావాల్సి వస్తుంది" అని అనుకుంటూ ఆ పండును తన చెల్లెలికి ఇచ్చింది. ఆ చెల్లెలు 'ఇప్పుడు నేను గర్భవతిని. నాకు పుట్టిన బిడ్డను నీకు ఇచ్చేస్తాను' అని చెప్పింది. వారిద్దరూ కలిసి ఆ పండును ఇంట్లో ఉన్న ఆవుకు పెట్టారు. చెల్లెలికి బిడ్డ పుట్టగానే ఆమె దుందులికి ఇచ్చేసింది. దుందులి ఆ బిడ్డను భర్తకు చూపి వీడు నాకు పుట్టిన కుమారుడని చెప్పింది. ఆత్మదేవుడు ఆ కుమారునికి 'ధుంధుకారి' అని పేరుపెట్టాడు. ఆ పండు తిన్న గోవుకు కూడా ఒక కుమారుడు పుట్టాడు. ఆత్మదేవుడు ఆ పిల్లవానికి 'గోకర్ణుడు' అని పేరుపెట్టాడు. ఇద్దరు బిడ్డలను ప్రేమతో పెంచసాగాడు. గోకర్ణుడు పండితుడు, జ్ఞాని అయ్యాడు. ధుంధుకారి చదువులేని మూర్ఖుడు, దుష్టుడు అయ్యాడు. గోకర్ణుడు సత్కార్యాలు చేయసాగాడు. ధుంధుకారి దొంగ అయి, హింసాపరుడై దీనులను హింసిస్తూ, దుర్మార్గులతో స్నేహం చేసి, కుక్కలను పెంచుతూ వేశ్యాలోలుడయ్యాడు. ఆత్మదేవుడు చెడుమార్గాల్లో వెళ్తున్న తన కొడుకును చూసి బాధపడసాగాడు. ధుంధుకారి ఆస్తిని పూర్తిగా ఖర్చుచేస్తూ, తల్లిదండ్రులను హింసిస్తూ, సకల వస్తువులను దొంగతనం చేయసాగాడు. ఆత్మదేవుడు చావడానికి సిద్ధమై అడవికి బయలుదేరాడు. అప్పుడు గోకర్ణుడు వచ్చి తండ్రికి సంసారం నిస్సారమని చెప్పి జ్ఞానాన్ని ఉపదేశించాడు. 'తండ్రీ! నీవు భాగవతాన్ని పారాయణం చెయ్యి ముక్తిని పొందుతావు' అని ఉపదేశించాడు. ఆత్మదేవుడు అడవుల్లో నివసిస్తూ నిరంతరం శ్రీహరిని స్మరిస్తూ భాగవతంలోని దశమస్కంధం పారాయణం చేయసాగాడు. ఆ పుణ్యంవల్ల ఆత్మదేవుడు శ్రీకృష్ణుడిలో ఐక్యమయ్యాడు.

ధుంధుకారి తల్లిని కొట్టి బావిలో పడేశాడు. ఆమె మరణించింది. ధుంధుకారి ఐదుగురు భోగకాంతలను ఇంట్లో ఉంచుకున్నాడు. దొంగతనం చేసి వారికి బట్టలు, నగలు, ధనం తెచ్చి ఇచ్చేవాడు. ఒకసారి ఆ వేశ్యలు బలవంతంగా ధుంధుకారిని చంపి గోతిలో పూడ్చిపెట్టారు. వాడు ప్రేతమై గాల్లో తిరుగసాగాడు. అది గోకర్ణుడికి తెలిసింది. సోదరునికి గయాశ్రాద్ధాన్ని పెట్టి తీర్థయాత్రలు చేశాడు. ఒకనాడు గోకర్ణుడు పడుకుని ఉండగా

ధుంధుకారి భయంకరమైన ప్రేతరూపంతో కనబడ్డాడు. గోకర్ణుడు వాడిపై నీళ్లు చల్లాడు. వాడి పాపాలు నశించిపోయాయి. కాని, ప్రేతత్వం పోలేదు. గోకర్ణుడు ఎందరో పండితులను ప్రేతత్వముక్తికి ఉపాయాన్ని అడిగాడు. ఎవరూ ఏమీ చెప్పలేకపోయారు. అప్పుడు గోకర్ణుడు తన యోగమహిమతో సూర్యవేగాన్ని ఆపి, సూర్యునికి భక్తితో నమస్కరించి 'ఓ జగత్సాక్షీ! నీకు నమస్కారం. మోక్ష ఉపాయాన్ని చెప్పు' అని అడిగాడు. అది విన్న సూర్యుడు గోకర్ణా! నీవు ఏడురోజులు భాగవతాన్ని దీక్షతో పఠించు అని చెప్పాడు. గోకర్ణుడు భాగవత సప్తాహ పారాయణం మొదలుపెట్టాడు. ఆ కథ వినడానికి ధుంధుకారి వచ్చాడు. అక్కడ ఏడు కణుపులతో ఒక వెదురుచెట్టు ఉండగా దాని రంధ్రంలో ధుంధుకారి ప్రవేశించి భాగవత కథ వినసాగాడు. మొదటిరోజు సాయంకాలానికి భాగవత కథ ముగిసింది. ఆ వెదురుగడ కణుపొకటి బద్ధలై పెద్ద శబ్దం వచ్చింది. ఇలా ఒక్కోరోజు ఒక్కో కణుపు బద్దలవసాగింది. గోకర్ణుడు పన్నెండుస్కంధాల కథను వినిపించి భాగవత సప్తాహాన్ని పూర్తి చేయగానే ధుంధుకారి ప్రేతత్వం తొలగిపోయి దివ్యరూపంతో తులసీమాలను, పీతాంబరాన్ని ధరించి నీలమేఘశ్యాముడై, కవచకుండలాలను ధరించి గోకర్ణునికి నమస్కరించాడు. సోదరా! నీవు చెప్పిన భాగవత కథలను వినడంవల్ల నా ప్రేతత్వం పోయింది. వైష్ణవతత్త్వం వచ్చింది. భాగవత సప్తాహంవల్ల వైకుంఠలోకం ప్రాప్తించిందని చెప్పి విష్ణు విమానమెక్కి ధుంధుకారి వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

భాగవత సప్తాహం అంత గొప్పది. భాద్రపద, ఆశ్వయుజ, కార్తిక, మార్గశిర, జ్యేష్ఠ, శ్రావణ మాసాలు భాగవత సప్తాహ యజ్ఞం చేయడానికి ప్రశస్తమైనవి. భాగవత కథాశ్రవణంవల్ల సకల రోగాలూ, పాపాలూ నశిస్తాయి. సంతానం లేనివారికి సంతానం కలుగుతుంది. దరిద్రులు ధనవంతులవుతారు.

శుకమహర్షి భాగవత కథను చెప్తూండగా శ్రీమహావిష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యాడు. ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి, ఉద్ధవుడు, అర్జునుడు, నారదుడు విష్ణువును పూజించారు. పార్వతీపరమేశ్వరులు, సరస్వతీబ్రహ్మలు అక్కడకు వచ్చారు. శుకుడు కథను గానం చేస్తుండగా ప్రహ్లాదుడు, ఉద్ధవుడు కంచుతాళాలు వాయించారు. నారదమహర్షి వీణ వాయించాడు. అర్జునుడు స్వరకల్పనతో రాగం కూర్చాడు. ఇంద్రుడు మృదంగం వాయించాడు. దేవతల జయజయ ధ్వనులతో సభ ప్రతిధ్వనించింది. శ్రీమద్భాగవత కథాశ్రవణంవల్ల పరీక్షిన్మహారాజు శ్రీహరిలో లీనమయ్యాడు.

ఇది భాగవతమాహాత్మ్యం. దీన్ని చదివినా, విన్నా సకల పాపాలు నశించి విష్ణుసాయుజ్య కైవల్యాన్ని పొందుతారు.

***శ్రీకృష్ణార్పణమస్తు***

# చతుశ్శ్లోకీ భాగవతం

**భా**గవతాన్ని శ్రీమన్నారాయణుడు హయగ్రీవరూపంలో (భాద్రపదంలో) ఉపదేశించాడు. బ్రహ్మ నారదునికీ, నారదుడు (కార్తికంలో) వ్యాసునికీ, వ్యాసుడు సూతునికీ, సూతుడు శౌనకాది మహర్షులకూ ఉపదేశించారు. మరియు వ్యాసుడు (మార్గశీర్షంలో) శుకమహర్షికీ, శుకుడు పరీక్షితుకూ (మాఘమాసంలో) ఉపదేశించారు. భాగవతం ఉపదేశరూపమైన సత్యపరమార్థమే తప్ప, మామూలు గ్రంథంకాదు. ఈ సత్యం కూర్పు చేయబడింది గనుక గ్రంథంపేరుకూడ భాగవతమే! సృష్ట్యారంభంలో నారాయణుడు సృష్టికర్తయగు బ్రహ్మకు ఉపదేశించాడు. బ్రహ్మ నారదునికి ఉపదేశించే కాలానికి 1. వరాహావతారం 2. సుయజ్ఞావతారం లేక హరిఅవతారం (గజేంద్రుని రక్షించింది) 3. కపిలుడు 4. దత్తాత్రేయుడు 5. సనకాదులు 6. నరనారాయణులు 7. ధ్రువుడు 8. పృథువు 9. వృషభుడు 10. హయగ్రీవుడు 11. మత్స్యం 12. కూర్మం 13. నృసింహుడు 14. అది మూలవతారం 15. వామనుడు 16. హంసావతారం 17. మనువు – అనే 17 అవతారాలు జరిగిపోయాయి.

బ్రహ్మ నారదునికి ఉపదేశిస్తున్న సమయానికి 18,19 అవతారాలైన ధన్వంతరి, పరశురామ అవతరాలు జరుగుతున్నాయి. అంటే వారు సమకాలికులు. జరుగబోయేటివిగా 20. రాముడు 21. బలరామకృష్ణులు 22. వేదవ్యాసుడు 23. బుద్ధుడు 24. కల్కి – అని బ్రహ్మ నారదునికి తెల్పాడు. ఈ 24 సంఖ్య గాయత్రీ మంత్రాక్షరాలకూ, కాలస్వరూపానికీ, కేశవాది నామాలకూ, ఆయుర్నిర్ణయానికీ, సంకేతాలని పెద్దలు సూచించారు. సృష్ట్యారంభంలో బ్రహ్మ విష్ణుదేవుణ్ణిగూర్చి తపస్సు చేస్తుండగా స్వామి సాక్షాత్కరించాడు. బ్రహ్మ విష్ణువుకు నమస్కరించాడు. విష్ణువు సంతోషించి "నీ తపస్సుకు మెచ్చాను. ఏం కావాలో కోరుకో" అన్నాడు. అందుకు బ్రహ్మ "దేవదేవా! సర్వమూ నీ విలాసమే! సర్వంలో క్రీడించే నీ మహిమను తెలుసుకొనే జ్ఞానాన్ని ప్రసాదించు. సృష్టి చేసేటపుడు నాలో మహత్తు, అహంకారం తప్పక కలుగుతాయి. వాటిల్ని మరలా తొలగించుకొనే మార్గానికై నిన్ను ప్రార్థిస్తున్నాను" అని విన్నవించగా, శ్రీమన్నారాయణుడు బ్రహ్మకు చెప్పిన పరమార్థ బోధమే చతుశ్శ్లోకీభాగవతం. ఆ నాల్గుశోకాలు భాగవతరహస్యనిధులు. అవి–

శ్లో. **అహ మేవాస మేవాగ్రేఽ నాన్య ద్య త్సదసత్పరమ్ ।**
**పశ్చా దహం య దేత చ్చ యోఽ వశిష్యేత సోఽ స్మ్యహమ్ ॥**

శ్లో. **ఋతేఽ ర్థం యత్ప్రతీయేత, న ప్రతీయేత చాత్మని ।**
**తద్విద్యా దాత్మనో మాయాం, యథాఽ ఽ భాసో యథా తమః ॥**

శ్లో. **యథా మహాంతి భూతాని భూతే షూచ్చా వచే ష్వపి ।**
**ప్రవిష్టా న్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్ ॥**

శ్లో. **ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాఽ ఽ త్మనః ।**
**అన్వయవ్యతిరేకాభ్యాం యత్ స్యాత్ సర్వత్ర సర్వదా ॥** (సంస్కృత భాగవతం–2 స్కం–9అధ్యా 33–36 శ్లో)

1. మొట్టమొదట ఆత్మమాత్రమే "నేను, నేను" అను చైతన్యస్ఫురణతో ఉంది. దానికంటే వేరైన అసత్పదార్థానికి స్థితే లేదు. ఈ దృష్టితో వివేచిస్తే, ఆత్మకంటె భిన్నమైన ఈ మాయా ప్రపంచం లేనే లేదనీ, అధిష్ఠానంగా జ్ఞానస్వరూపమైన ఆత్మపదార్థమే శాశ్వతంగా మిగిలి ఉందనీ, అదే అందరియొక్క యథార్థ స్వరూపమనీ శ్రీభగవానుడు బోధిస్తున్నాడు.

2. పరమార్థమైన ఆత్మగాక, అసత్పదార్థమైన ఏ మాయ అజ్ఞానులకు గోచరిస్తూందో, ఆ అసత్పదార్థం యథార్థంగా అధిష్ఠానమైన ఆత్మయందు లేనే లేదు. అజ్ఞానదృష్టితో చూచినపుడుమాత్రమే ఆత్మయందు మాయాపదార్థం ఆవరణరూపంగా గోచరిస్తుంది. కానీ వెలుగు రాగానే చీకటి తొలగిపోతున్నట్లుగా, జ్ఞానదృష్టి కలుగగానే మాయావరణం తొలగిపోతూంది. వెలుగు లేనంతవరకు చీకటి ఉన్నట్లే గోచరిస్తుంది. అట్లే జ్ఞానదృష్టి కలిగేంతవరకూ మాయ గోచరిస్తూనే ఉంటుంది. జ్ఞానప్రాప్తి కాగానే అంతవరకూ ఉందనుకొన్న మాయాస్వరూపమంతా భ్రాంతే అని తెలుస్తుంది.

3. ఏ విధంగా మహాభూతమైన ఆకాశంలో దానికంటే చిన్నదైన వాయువూ, వాయువులో దానికంటే చిన్నదైన అగ్నీ, అగ్నిలో దానికంటే చిన్నదైన నీరూ. అంతర్లీనమై ఉంటాయో అట్లే 'నేను' అనే ఆత్మపదార్థం అన్నింటిలోనూ ఉంటుంది. కానీ వాటిలో ఆత్మ విలీనం కాదు. పంచమహాభూతాలలో ఆకాశం ఎలా అన్నింటికీ ఆధారమై, మిగిలిన వాటిచే గ్రహించబడక (కబళింపబడక) సర్వవ్యాపకమై ఉందో అట్లే 'నేను' అనే నిరావరణంలో బ్రహ్మాదిపిపీలికాపర్యంతమైన జగత్తు ఇమిడి ఉందే కాని, జగత్తును ఆధారంగా చేసుకొని ఆత్మ ఉండడం లేదు. ఆత్మే ఆధారం. జగత్తు ఆధేయం. ఆకాశం – ఆధారం. మిగిలినభూతాలు ఆధేయం. (ఆధేయం= ఉంచదగినది) ఆధేయం ఉన్నపుడుకూడా ఆధారానికి స్థితి ఉంది. ఆధేయం లేనపుడూ ఆధారానికి స్థితి ఉంది. అట్లే జగత్తు ఉన్నపుడూ ఆధారమైన ఆత్మ ఉండనే ఉంది. ఆధేయమైన జగత్తు లేనపుడూ ఆత్మ నిర్వికారంగా, స్వస్వరూపంలో నిత్యమై ఉంటుంది.

4. తత్త్వజిజ్ఞాసు వయినవానికే ఈ పరమార్థం అనుభవైకవేద్యమవుతుంది. జగత్తు ఉంది అనుకొన్నపుడూ ఆత్మ ఆధారంగా ఉండనే ఉంది. జ్ఞానదృష్టి గలిగినపుడు జగద్భ్రాంతి తొలగినా, సర్వదా, సర్వత్ర అన్నింటికీ ఆధారంగా ఆత్మే ఉంది. కానీ, జగత్తూమున్నగు భ్రాంతికి తావే లేదని స్పష్టంగా అనుభవమవుతుంది. ఈ విధంగా శాస్త్రపద్ధతి ననుసరించి, అన్వయవ్యతిరేకాలతో ఆత్మతత్త్వాన్ని, (పరమాత్మను) జగన్మిథ్యాత్వాన్నీ నిర్ధారించుకోవాలి.

సర్వత్ర వ్యాపించి 'బృహత్' అనగా అనిటికంటే పెద్దది అయినందున, పరమాత్మ బ్రహ్మం అనబడుతుంది. సృష్టిలో ఎప్పటికీ ఉండేదే, వినాశం లేనిదీ ఆత్మ ఒక్కటే! అదే సర్వచైతన్యస్ఫురణగల వస్తువు. ఆత్మే సత్పదార్థం. అన్నిజీవులయొక్క యథార్థ స్వరూపం ఆత్మే! మాయాప్రభావం వల్ల మనం ఆనాత్మ ఐన ప్రపంచాన్ని, ఆత్మగా భావిస్తున్నాం. ఇది అజ్ఞానఫలం. జ్ఞాని ఈ సర్వజగత్తునూ పరమాత్మ స్వరూపంగానే, అతనివిలాసంగానే దర్శిస్తాడు.

అన్నిటికీ, అవకాశం ఇచ్చేది ఆకాశం. దీన్నుండే వాయువు, అగ్ని, జలం, భూమి – అనే మహాభూతాలు ఏర్పడుతున్నాయి. కనుక అన్నింటిలోనూ ఆకాశతత్త్వం వ్యాపించే ఉంది. "ఆకాశ శరీరం బ్రహ్మ" అని వేదం పరమాత్మకు ఆకాశాన్ని శరీరంగా పేర్కొనింది. శ్రీమన్నారాయణుణ్ణి నీలమేఘశ్యాముణ్ణిగా రూపించడానికి కారణం

– ఆకాశశరీరత్వం చేతనే!! 'నేను' అనేది పరబ్రహ్మవాచకం. ఇదే బ్రహ్మలో, చీమలో, సర్వత్ర వ్యాపించి ఉంది. సర్వానికీ ఆధారం ఆత్మే! సృష్టికి ముందూ, ప్రళయంలో తర్వాతకూడా ఉండేది ఆత్మ ఒక్కటే! జగత్తు ఉన్నపుడు జగద్రూపంలోనూ, జగత్తు లేనపుడు, నిర్వికారమై స్వస్వరూపరూపంతోనూ ఆత్మ ఉంటుంది.

ఈ ఆత్మనే 'ఈశ్వరుడు' అంటారు. అంటే మాయను తెలిసినవాడు. తనమాయతో కూడి, ఈ సృష్టి రూపంలో తానే క్రీడించడం ఈశ్వరునివిలాసం. దీన్నే దైవయోగం అంటారు. మాయలో ఈశ్వరుడు అధిష్ఠించి ఉన్నపుడు 'మహత్తు' అనే తత్త్వం పుట్టింది. దాన్నుండి కాలం, గణం అనేవి పుట్టాయి, ఈ రెంటిసంబంధంవల్ల గుణాలు పుట్టాయి. ఇవి ఒక దానితో ఒకటి చేరి క్రొత్తగుణాల్ని పుట్టించాయి. దీన్నే పరిణామ మంటారు. ఇది జీవులకు గోచరించకనే జరగి పోతుంటుంది. ఈ మార్పులవరుస కార్యకారణ సంబంధంగా ఏర్పడుతుంది. దీన్నే "కర్మం" అంటారు. ఈ కర్మవల్లనే జీవులు జన్మిస్తున్నారు.

త్రిగుణాలలో రజస్సు, సత్త్వం కలసి 'మహత్తు' ఏర్పడింది. దానిలో తమస్సు ప్రధానంగా పనిచేసినపుడు ఈ మూడింటికలయికతో కూడిన అస్తిత్వం – అహంకారంగా పరిణమించింది. ఈ అహంకారమే 1. రాజసాహంకారం= వస్తువుల్ని పుట్టించే శక్తి 2. తామసాహంకారం= క్రియల్ని పుట్టించే శక్తి 3. సాత్త్వికాహంకారం= జ్ఞానాన్ని పుట్టించే శక్తిగా రూపాంతరా లొందింది. తామసాహంకారంనుండి ఆకాశం పుట్టింది – దీన్నుండి వాయువు, అగ్ని, జలం, భూమి పుట్టాయి. అట్లే పంచతన్మాత్రలు (శబ్ద స్పర్శ రూప రస గంధాలు) ఏర్పడ్డాయి. సాత్త్వికాహంకారంవల్ల మనస్సు, దానిఅధిదేవత చంద్రుడూ, పిదప దిక్కులూ మున్నగునవి ఏర్పడ్డాయి. రాజసాహంకారంనుండి ఇంద్రియాలు పుట్టాయి. ఇన్ని ఉన్నా వీటిల్ని నిల్పే శరీరం కావాలి గనుక, భగవత్‌శక్తి – బ్రహ్మాండమనే శరీరాన్ని నిర్మించింది. ఇందువల్ల అనేకశరీరాలు, అందులో చేతనాలూ, అచేతనాలూ ఏర్పడ్డాయి. ఇదంతా ఒక గ్రుడ్డులాగా ఏర్పడింది, ఈ గ్రుడ్డు 1000 అయుత సంవత్సరాలు జలంలో ఉండింది. (వేయి లక్షల సంవత్సరములు) ఈశ్వరుడు దానికాలకర్మలలో తగుల్కొనక, అందలి సమస్తాన్ని చేతనంగా చేశాడు. తానే జీవరూపంలో అందులో ప్రవేశించాడు. లోపలనుండి వెలుపలకు దానివిస్తారాన్ని పెంచుతూ, బ్రద్దలు కొట్టుకొని, ఈ సర్వసృష్టిగా వెలుపలకు వచ్చింది. బయటనుండి ప్రేరేపించేటపుడు ఈశ్వరుడు వాసుదేవుడు – అండంలో (గ్రుడ్డు) ప్రవేశించినపుడు తానే సృష్టికర్తయగు బ్రహ్మ. ఈ తత్త్వాన్ని తెలుసుకోవడమే పరమాత్మజ్ఞానం.

కనుక భగవంతుడే బ్రహ్మాండంలో అనేకజీవులరూపంలో ఉంటున్నాడు. జ్ఞానులు ఈ సృష్టిలోని అనేకరూపాల్నీ, అందలి అవయవాల్నీ, చూచి, వీటిద్వారా మొత్తం భగవంతునిరూపాన్ని దర్శిస్తున్నాడు. ఈ రూపం – యోగం చేతనే దర్శనీయం. సమస్తలోకాలూ భగవంతునిఅవయవాలే! తత్త్వజ్ఞులకు ఈ పరమార్థం అనుభవైకవేద్యం. కనుక జగత్తు ఉన్నప్పుడూ, లేనప్పుడూ సర్వదా ఉండేది ఆత్మ ఒక్కటే! జగత్తు ఉన్నట్లు ఆభాసిస్తూంది. కానీ, జ్ఞానదృష్టితో చూచినప్పుడు జగత్తు మిథ్య. బ్రహ్మం మాత్రమే సత్యం. క్షణక్షణపరిణామశీలమైన జగత్తుకు శాశ్వతత్వం లేదు. ఆత్మ (పరమాత్మ) దేశకాలదులవల్ల పరిచ్ఛిన్నం కానిది. అది శాశ్వతం. పరిణామం లేనిది. నిత్యమైంది. స్వయంప్రకాశం. సర్వదా, సర్వత్ర అన్నింటికీ ఆధారంగా ఆత్మే ఉంది. కానీ, జగత్తుమున్నగు భ్రాంతికి తావే లేదని తత్త్వజ్ఞునికి జ్ఞానదృష్టి అనుభావ్యమవుతుంది. ఇట్లు ఆత్మ తత్త్వాన్నీ, జగన్మిథ్యాత్వాన్నీ నిర్ధారించుకోవాలి.

ఈ సృష్టిరహస్యజ్ఞానమే "చతుశ్శ్లోకీభాగవతం"గా భగవత్ ప్రోక్తమైంది. భాగవతం ఇలా ఆవిర్భవించింది. ఈ జ్ఞానం మొట్టమొదట సృష్టికర్తకు బోధింపబడింది. అతనికి తెలిస్తేనే అతడు సృష్టించే జీవులకూ అట్టి జ్ఞానం సిద్ధిస్తుంది. ఇదే భాగవతహృదయం. దీన్నే బ్రహ్మ నారదునికీ, నారదుడు వ్యాసునికీ, వ్యాసుడు సూతశుకులకూ వ్యాఖ్యానరూపంలో కథాదృష్టాంతాలతో పరంపరగా వివరించారు. ఇది పారమహంస్యప్రబోధం. జ్ఞానానందమయం. ఈ జ్ఞానాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకొన్నవాళ్ళు జీవన్ముక్తులై శ్రీకైవల్యపదం పొందుతారు. వాళ్లకు పునర్జన్మ ఉండదు. వాళ్లే మాయనుండి తరిస్తారు. ఈ ఆత్మజ్ఞానం లేకపోవడమే, దుఃఖాలకూ, అశాంతికీ కారణమవుతూంది. భౌతికాన్ని పరమార్థంతో మేళవించి, ఆత్మానందం పొందడమే మానవజీవితలక్ష్యం. అపుడే "బహిరంత శ్చ సర్వత్ర బ్రహ్మైవ మాపయతి గ్రాహయతీతి మానం ప్రత్యగ్దర్శనం, తదేవ సర్వదా వాతి, భజతీతి మానవో బ్రహ్మవి ద్యతిః" – వెలుపల లోపల సర్వత్ర బ్రహ్మాన్నే గ్రహించడానికి 'మాన' మని పేరు. ఇట్టి 'మానాన్ని (జ్ఞానాన్ని) సర్వదా అనుభవించే బ్రహ్మజ్ఞాని "మానవః" (మానవుడు) – అనబడుతున్నాడు. ఇట్టిమహార్థాన్ని సాధించి, అనుభవించిననాడు మానవజన్మ సార్థకమవుతుంది. నరుడు నారాయణుడవుతాడు. ఇట్టి దివ్యస్థితిని పొందడానికే భాగవతాన్ని భక్తిశ్రద్ధలతో పఠించి, శ్రవణం చేయాలి.

ఇట్టి పారమహంస్యజ్ఞానాన్ని మనకు అందించిన వ్యాసభగవానునికీ, పోతన మహాకవికీ, ఎందరో మహాత్ములకూ – అందరికీ కృతజ్ఞతాభివాదాలు.

## ఏకశ్లోకీభాగవతం

**శ్లో. ఆదౌ దేవకిదేవిగర్భజననం, గోపీగృహే వర్ధనం**
**మాయాపూతనజీవితాపహరణం, గోవర్ధనోద్ధారణమ్ ।**
**కంసచ్ఛేదన కౌరవాదిహననం, కుంతీసుతాపాలనం**
**హ్యేతద్భాగవతం పురాణకథితం శ్రీకృష్ణలీలామృతమ్ ॥**

శ్రీకృష్ణపరమాత్మ మొట్టమొదట దేవకీదేవిగర్భంనుండి పుట్టాడు. గోపికల ఇండ్లల్లో పెరిగాడు.

మాయాపూతనజీవితాన్ని హరించాడు. గోవర్ధనపర్వతాన్ని ఎత్తాడు. కంసుణ్ణి సంహరించాడు. కౌరవుల్ని చంపించాడు. పాండవుల్ని రక్షించాడు. ఇదే శ్రీమద్భాగవతపురాణం.



# కల్పతరువు

# పీఠిక

**వ్యాసమహర్షి**

**శ్లో. కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్ ।**
**కోఽహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారత కృద్భవేత్ ॥**

శ్రీమన్నారాయణుడే వ్యాసుడు. అలా కాకపోతే మహాభారతసంహితను నిర్మించడం మరొకరికి సాధ్యంకాదు. విష్ణుపురాణంలోని ఈ శ్లోకాన్ని తిక్కనగారు మహాభారతం శాంతిపర్వంలో అనువదించారు (6-476) “కృష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభున్ నారాయణుంగా” అని తిక్కనగారు స్పష్టీకరించారు. శ్రీమహావిష్ణువుయొక్క పదునేడవ అవతారం శ్రీవ్యాసమహర్షి అని భాగవత మహాపురాణం (I-38-21)

**శ్లో. తతః సప్తదశే జాతః సత్యవత్యాం పరాశరాత్ ।**
**చక్రే వేదతరోః శాఖా దృష్ట్వా పుంసోఽల్పమేధసః ॥**

శ్రీపరాశరమహర్షికి సత్యవతి వలన శ్రీమహావిష్ణువుయొక్క పదునేడవ అవతారమైన వ్యాసమహర్షి జన్మించారు. ఆయన అల్పమతులైన పురుషులను చూచి, కరుణించి వేదవృక్షానికి శాఖలను ఏర్పరచారు. అంతేకాదు, అష్టాదశపురాణాలను రచించి వాటికి ఉపపురాణాలను సంతరించి, పంచమవేదమని ప్రసిద్ధి కెక్కిన ‘భారతసంహిత’ను నిర్మించారు.

## వ్యాసుని శ్రీమద్భాగవతం

శ్రీవ్యాసమహర్షి రచించిన అష్టాదశపురాణాలలో శ్రీకృష్ణభాగవతానికి విస్తృతమైన ప్రచారం ఉంది. ఇది పరీక్షిన్నరేంద్రునికి శుకయోగీంద్రుడు ఉపదేశించింది. దీనిలో 12 స్కంధాలు, 335 అధ్యాయాలు, 18,000 శ్లోకాలున్నాయి. శ్రీమన్నారాయణుని జ్ఞానయోగం, వివిధావతారాలు, విస్తారంగా వర్ణింపబడ్డాయి. **“జన్మ కర్మ చ మే దివ్యమ్”** (గీత-4-9) అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లుగా ‘దివ్యభూమిక’ లో జరిగిన శ్రీకృష్ణుని ‘అవతార లీలావిభూతి’, ఆయన జన్మ - కర్మలు రెండూ అద్భుతంగా వర్ణింపబడినాయి.

శ్రీశంకరభగవత్పాదులు చిన్నవయస్సులోనే తమతల్లికి భాగవతాన్ని చదివి విన్పించేవారట! శ్రీమధ్వాచార్యుల ‘భాగవత తాత్పర్య నిర్ణయం’ ప్రసిద్ధం! వేదాంత ప్రస్థానంలో అప్పటివరకు శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వాచార్యుల అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత ప్రస్థానత్రయమే ఉండగా, శుద్ధాద్వైతపరంగా బ్రహ్మసూత్రభాష్యాన్ని రచించిన శ్రీవల్లభాచార్యులవారు చతుర్థప్రస్థానాన్ని స్థాపించారు. వీరు భాగవతానికి ‘సుబోధినీ’ అనే వ్యాఖ్య వ్రాశారు. భాగవతమహాపురాణంపై సుమారు 40 వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. భగవదవతారాలన్నీ వేదాలలో చెప్పబడినాయని చతుర్ధర నీలకంఠ పండితుడు ‘మంత్రభాగవతము’ లో సూచించినారు. శ్రీమధుసూదన సరస్వతి ‘భక్తిరసాయనం’

లోను, శ్రీరూపగోస్వామి **'ఉజ్జ్వలనీలమణి', 'భక్తిరసామృత సింధువు'** లలో భాగవతాన్ని ప్రమాణ గ్రంథంగా గ్రహించి **'భక్తి రసరాజ'** మని నిరూపించారు. శ్రీవంశీధరమిశ్రులు "జన్మాద్యస్య యతః" అనే భాగవతప్రథమశ్లోకానికి నూరువిధాలైన అర్థాలు చెప్పడం ఆ మహాపురాణం యొక్క అతిలోక వైభవాన్ని, జగదాశ్చర్యకరమైన భగవత్–భాగవత తత్త్వసమన్వయాన్ని ఆవిష్కరించడమే! ఈ విధంగా భగవద్భక్తితోపాటు, సర్వశాస్త్రరహస్యాలు భాగవతంలో ఇమిడి ఉండడం చేతనే –

**శ్లో. ధనంజయే హాటకసంపరీక్షా – రణాంగణే శస్త్రభృతాంపరీక్షా ।**
**విపత్తికాలే గృహిణీ పరీక్షా – విద్యావతాం భాగవతే పరీక్షా ॥**

అనే సూక్తి ఏర్పడింది. బంగారాన్ని నిప్పులో వేసి పుటపాకం పెట్టినప్పుడే అపరంజి బంగారం వస్తుంది. మహాఘోర సంగ్రామంలో వీరుడు యుద్ధం చేసినప్పుడే వానిశౌర్యపరాక్రమాలు వెల్లడి అవుతాయి. గృహచ్ఛిద్రం ఏర్పడిన వేళల్లోనే ఒక గృహిణి సమయస్ఫూర్తి, చాకచక్యం, తెలివితేటలు తెలుస్తాయి. విద్వాంసుడైన వాని పాండిత్యప్రకర్షకు పరీక్షాస్థానం భాగవతం ఒక్కటే! ఒక్కమాటలో చెబితే, భాగవతం పండితుల పాండిత్యానికి గీటురాయి! శలాకాపరీక్ష!!

## పురాణం - పంచలక్షణాలు

యాస్కమహర్షి నిరుక్తంలో – **'పురాఽపి నవం భవతి ఇతి పురాణమ్'** అని నిర్వచించారు. కథ ప్రాచీనకాలంలో జరిగి ఉన్నప్పటికీ చదివేటప్పుడు ఎప్పటికప్పుడే కొత్తగా ఉన్నదనే అనుభవాన్ని కల్గిస్తుంది గనుక పురాణమైందని చెప్పారు.

పద్మపురాణంలో (5–2–53) "పురా పరంపరాం వష్టి పురాణం తేన తత్ స్మృతమ్" అన్న వాక్యానికి ప్రాచీన పరంపరను చెప్పేది కావడంచేత పురాణమైందన్నారు. ఛాందోగ్యోపనిషత్తు (7–1) కూడ పురాణాన్ని పేర్కొన్నది.

## పంచలక్షణాలు

**శ్లో. సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వంతరాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్ ॥**

1) సర్గం 2) ప్రతిసర్గం 3) వంశం 4) మన్వంతరాలు 5) వంశానుచరితం – ఈ ఐదింటినే పంచలక్షణాలంటారు.

**1) సర్గం :** జగత్తు, జగత్తులోని నానాపదార్థాలు – వీటి సృష్టి

**2) ప్రతిసర్గం :** నిత్య – నైమిత్తిక – ప్రాకృతిక – ఆత్యంతిక ప్రళయాలు. దీనినే 'ప్రతిసంచర'మని విష్ణుపురాణం (1–2–25) 'సంస్థ' అని భాగవతపురాణం పేర్కొన్నది.

**3) వంశం :** ప్రాచీనరాజుల చరిత్ర.

**4) మన్వంతరం :** మనువు, దేవతలు, మనుపుత్రులు, ఇంద్రుడు, ఋషులు భగవంతుని అవతారాలు – ఈ ఆరింటిని గురించి చెప్పడం (భాగ. 12–7–15).

**5) వంశానుచరితం :** రాజవంశాల మూలపురుషుల్ని గూర్చి చెప్పడం. (భాగ-12-7-16)

కౌటిల్యుని అర్థశాస్త్రంలో పురాణపంచలక్షణాలు ఈ విధంగా ఉన్నాయి.

## భాగవతం - దశలక్షణాలు

పురాణాలన్నీ పంచలక్షణాలు గలవి. కానీ, భాగవత మహాపురాణం ఒక్కటే దశలక్షణాలతో కూడుకొన్నది.

**శ్లో. అత్రసర్గో విసర్గ శ్చ స్థానం పోషణ మూతయః ।**
**మన్వంత రేశానకథా నిరోధో ముక్తి రాశ్రయః**
**దశమస్య విశుద్ధ్యర్థం నవానా మిహ లక్షణమ్ ॥ - భాగవతమ్ (II-10-1,2)**

"అందు దశలక్షణంబు లెవ్వియనిన 1. సర్గంబును 2. విసర్గంబును 3. స్థానంబును 4. పోషణంబును 5. ఊతులును 6. మన్వంతరంబులును 7. ఈశానచరితంబులును 8. నిరోధంబును 9. ముక్తియు 10. ఆశ్రయంబును నసం బది తెఱంగులయ్యె. దశమాశ్రయ విశుద్ధ్యర్థంబు దక్కిన తొమ్మిది లక్షణంబులుఁ జెప్పంబడియె నవి యెట్టి వనిన" - పోతన భాగవతం (2-259)

**1. సర్గం** : 1. మహత్తు 2. అహంకారం 3. పంచతన్మాత్రలు (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలు-సూక్ష్మభూతాలు) 4. పంచజ్ఞానేంద్రియాలు 5. పంచకర్మేంద్రియాలు 6. మనస్సు - ఇవి భగవంతునివల్ల పుట్టడం **'సర్గం' - తృతీయస్కంధం.**

**2. విసర్గం** : విరాట్పురుషునివల్ల పుట్టిన బ్రహ్మ చరాచరమహాభూతాలను (స్థూలశరీరాలను) సృష్టించడం **'విసర్గం' - చతుర్థస్కంధం.**

**3. స్థానం (స్థితి)** : దుష్టశిక్షణపూర్వకంగా విశ్వస్థితిని నెలకొల్పిన శ్రీవైకుంఠనాథుని విజయం - **స్థానం.**
ఋత - సత్యాలనే జగద్వ్యవస్థ. ఖగోళ - భూగోళాలు - భగవంతుని విరాట్ స్వరూపం - **పంచమస్కంధం.**

**4. పోషణం** : భగవంతుడు భక్తులను అనుగ్రహించడం **'పోషణం'.** ఈశ్వరానుగ్రహంచే లోకపాలనం - **షష్ఠస్కంధం.**

**5. ఊతులు** : పూర్వజన్మకర్మవాసనలు **'ఊతులు'.** ఇవి జగత్తుకు హేతువులు - **సప్తమస్కంధం.**

**6. మన్వంతరం** : భగవంతుని అనుగ్రహం పొందిన సజ్జనులు ధర్మాన్ని విస్తరించడం, సాధకులు ధర్మాన్ని ప్రత్యక్షంగా చూడటం మన్వంతర కథ - **మన్వంతరం - అష్టమస్కంధం.**

**7. ఈశానకథ** : భగవంతుని అవతారాలను అభివర్ణించడం - **ఈశానచరితం.** సోమ - సూర్య - యదు వంశాలలోని పరమభాగవతుల కథలు - **నవమస్కంధం.**

**8. నిరోధం** : శ్రీమహావిష్ణువు యోగనిద్రలో ఉన్న సమయంలో సంభవించే అవాంతరప్రళయం **నిరోధం.** శ్రీకృష్ణావతారం - దుష్టసంహారం - **దశమస్కంధం.**

**9. ముక్తి** : అవిద్యకు మూలమైన ప్రకృతినుండి విడివడి జీవుడు ఆత్మానుసంధానంతో బ్రహ్మాభావం పొందడం **ముక్తి. (మోక్షం) - ఏకాదశస్కంధం**

**10. ఆశ్రయం**

**(అపాశ్రయం)** : ఈ విశ్వంయొక్క ఉత్పత్తి - స్థితి - లయానికి హేతువు పరబ్రహ్మము - పరమాత్మ. అతడు శ్రీకృష్ణుడే అని శరణు పొంది భక్తితో ఆత్మనివేదనం గావించడం **ఆశ్రయం - ద్వాదశస్కంధం.**

సంస్కృతభాగవతంలోని ద్వాదశస్కంధంలో ఈ దశలక్షణాలు ఇంకొక విధంగా చెప్పబడ్డాయి.

**శ్లో. సర్గశ్చాథ విసర్గ శ్చ వృత్తిరక్షాంతరాణి చ ।**
**వంశో వంశానుచరితం సంస్థాహేతు రపాశ్రయః ॥ (12-7-9)**

1. సర్గం 2. విసర్గం 3. వృత్తి 4. రక్ష 5. అంతరాలు 6. వంశం 7. వంశానుచరితం 8. సంస్థ 9. హేతువు 10. అపాశ్రయం. ఇవి భాగవత దశలక్షణాలు. పోతనభాగవతంలో దీని అనువాదం శిథిలమైంది.

**1. సర్గం** - సూక్ష్మభూతాల సృష్టి

**2. విసర్గం** - స్థూలపంచమహాభూతాలసృష్టి, జీవులసృష్టి

**3. వృత్తి** - జీవుల జీవనానికి ఏర్పడిన సామగ్రి

**4. రక్ష** - భగవంతుడు వివిధ అవతారాలతో దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించడం.

**5. అంతరాలు** - మన్వంతరాలు

**6. వంశం** - త్రైకాలికులైన ఋషుల, రాజులవంశపరంపర

**7. వంశానుచరితం** - ఋషులు, రాజులయొక్క చరిత్ర

**8. సంస్థ** - ప్రళయం (ప్రతిసర్గం)

**9. హేతువు** - అవిద్యను ఆశ్రయించిన జీవుడు తన పూర్వ కర్మాలను అనుసరించి కర్తృత్వ - భోక్తృత్వాలచే విశ్వంయొక్క సృష్టి - స్థితి - లయానికి కారణం కావడం - హేతువు.

**10. అపాశ్రయం** - స్వప్న - సుషుప్తులనే అవస్థలలో విశ్వ - తైజస - ప్రాజ్ఞ సంజ్ఞలచే వ్యవహరింపబడి జీవవృత్తులకు వ్యతిరిక్తమై సాక్షిరూపంగా ఉన్న తురీయతత్త్వమైన పరబ్రహ్మం.

ఈ దశలక్షణాలను బ్రహ్మాండపురాణంకూడ పేర్కొనింది. ఈ దశలక్షణాల వ్యాఖ్యానమే భాగవతం. ఈ లక్షణాలే భాగవతాన్ని తక్కిన పురాణాలకంటే విలక్షణంగా, విశిష్టంగా నిలిపింది.

## భాగవతం - భగవత్స్వరూపం

పాదాది కేశాంత స్తవంగా సాగిన ఈ శ్లోకాలలో బాహ్యాభ్యంతర సమన్వయంతో భగవంతుని పాదాలు మొదలుకొని ఆత్మపర్యంతం సమన్వయింపబడ్డాయి.

**శ్లో. పదాది జాను పర్యంతం ప్రథమః స్కంధ ఈరితః ।**
**తదూర్ధ్వం కటిపర్యంతం ద్వితీయః స్కంధ ఉచ్యతే ॥**

**తృతీయో నాభిరిత్యుక్త శ్చతుర్థ ఉదరం స్మృతమ్ ।**
**పంచమో హృదయం ప్రోక్తం షష్ఠః కంఠం సబాహుకమ్ ॥**

**సర్వలక్షణసంయుక్తం సప్తమో ముఖ ముచ్యతే ।**
**అష్టమ శ్చక్షుషే విష్ణోః కపోలో భ్రుకుటిః పరః ॥**

**దశమో బ్రహ్మరంధ్రశ్చ మన ఏకాదశః స్మృతః ।**
**ఆత్మాతు ద్వాదశః స్కంధః శ్రీకృష్ణస్య ప్రకీర్తితః ॥ - కౌశికసంహిత (25-8)**

**1. ప్రథమస్కంధం :** శ్రీకృష్ణుని పాదాల నుండి మోకాళ్ల వరకు
**2. ద్వితీయస్కంధం :** కటి (మొల) పర్యంతం
**3. తృతీయస్కంధం :** నాభి (బొడ్డు)
**4. చతుర్థస్కంధం :** ఉదరభాగం
**5. పంచమస్కంధం :** హృదయం
**6. షష్ఠస్కంధం :** కంఠం
**7. సప్తమస్కంధం :** ముఖం
**8. అష్టమస్కంధం :** కన్నులు
**9. నవమస్కంధం :** బుగ్గలు, కనుబొమలు
**10. దశమస్కంధం :** బ్రహ్మరంధ్రం
**11. ఏకాదశస్కంధం :** మనస్సు
**12. ద్వాదశస్కంధం:** ఆత్మ

## సంస్కృత భాగవత కర్త బోపదేవుడా?

శ్రీధరస్వామి శ్రీమద్భాగవతభావార్థదీపికారంభంలో -

**"అత ఏవ భాగవతం నామాన్యదిత్యపి న శంకనీయమ్ ।"**

శ్రీకృష్ణభాగవతమే మహాపురాణంగాని, తక్కింది (దేవీభాగవతం) కాదని స్పష్టీకరించాడు.

శ్రీనీలకంఠపండితుడు శ్రీదేవీభాగవతవ్యాఖ్యానారంభంలో – **“ద్వితీయపక్షైకదేశినోఽపి విష్ణుభాగవతం బోపదేవకృత మితి వదంతి”** అని శ్రీకృష్ణభాగవతం బోపదేవుడు రచించినట్లు కొందరు చెబుతున్నారు.

బోపదేవుడు 1. హరిలీలామృతము 2. ముక్తఫలము 3. కైవల్యదీపిక 4. భాగవతసారము 5. ముగ్ధబోధవ్యాకరణము 6. కవికల్పద్రుమము (ధాతుపాఠము) 7. కావ్యకామధేనువు (ధాతువృత్తి) 8. బోపదేవవైద్యశతకము మొదలైన మహాగ్రంథాలను రచించిన మహాపండితుడు. వీనిలో మొదటి నాలుగు భాగవతపురాణానికి చెందినవి.

హరిలీలామృతప్రారంభంలో –

“శ్రీమద్భాగవతస్కంధాధ్యాయార్థాది నిరూప్యతే విదుషా బోపదేవేన మంత్రి హేమాద్రి తుష్టయే” అని చెప్పబడింది. ఈ గ్రంథంలోని 176 శ్లోకాలలో భాగవతపురాణ విషయాలు స్కంధానుసారంగా వివరింపబడినాయి. దీన్నిబట్టి బోపదేవుడు భాగవతసంగ్రహకర్తయే గాని భాగవతపురాణకర్త కాదని స్పష్టంగా తెలుస్తోంది. భాగవతం బోపదేవ విరచితం కాదనీ, అది శ్రీ వ్యాసప్రోక్తమైన మహాపురాణమని శ్రీదంపూరు వెంకటసుబ్బాశాస్త్రిగారు **“సిద్ధాంత చంద్రిక”** (వావిళ్ల సంస్కృత భాగవత ప్రతి పీఠిక)లో విస్తారంగా నిరూపించారు.

## సంస్కృత భాగవతం - లఘుటీకలు, టిప్పణులు

1. శ్రీధరవ్యాఖ్యకు విపులపాఠాంతరపరిష్కృతముద్రణలు అనేకం ప్రకటింపబడ్డాయి.
2. తొమ్మిదివ్యాఖ్యలతో భాగవతం ‘బృందావనం’ నుండి వెలువడింది.
3. ముప్పైటీకలతో భాగవతం గుజరాతు నుండి ప్రచురింపబడింది.
4. ముప్పై నాలుగు సంస్కృత టీకలతో **“కృష్ణప్రియా”** హిందీటీకతో ఉన్న దశమస్కంధం కాశీ – చౌఖంబా ప్రకాశన్ వారిచే ప్రచురింపబడింది.
5. శ్రీ తిరుమల – తిరుపతి దేవస్థానాలద్వారా శ్రీధరీయ – వీరరాఘవీయ – విజయధ్వజ వ్యాఖ్యలతో (అద్వైత– విశిష్టాద్వైత – ద్వైత వ్యాఖ్యలు) సంపూర్ణంగా శ్రీపన్నాలరాధాకృష్ణశర్మ, శ్రీమాన్ ఎన్.సి.వి.నరసింహాచార్యులు, శ్రీమల్లంపల్లిశరభేశ్వరశర్మ, మహామహోపాధ్యాయ డా॥సముద్రాల లక్ష్మణయ్యగారి పరిష్కరణలో 14 సంపుటాలుగా ప్రకటింపబడి ఈనాడు లభిస్తున్నాయి.

## శ్రీధరస్వామి

**శ్లో. మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।**
**యత్కృపా తమహం వందే పరమానందమాధవమ్ ॥**

ఎవ్వని దయ మూగవాణ్ణి అనర్గళ వాగ్వైఖరి గలవానిగాను, కుంటివాణ్ణి పర్వతం పైకి ఎగిరి దూకేవాణ్ణిగాను చేస్తున్నదో, అటువంటి పరమానందమాధవునికి నమస్కరిస్తున్నాను.

ఈ సుప్రసిద్ధశ్లోకం శ్రీధరస్వామి భాగవతవ్యాఖ్యాన అవతరణికలో ఉంది.

శ్రీధరస్వామి ఏ ప్రాంతంవాడో తెలియదుకాని ఈయన కాశీలో నివసిస్తూ పురాణవ్యాఖ్యలు వ్రాసినట్లు తెలుస్తున్నది. విష్ణుపురాణవ్యాఖ్యానావతరణికలో –

**శ్లో. శ్రీబిందుమాధవం వందే పరమానందవిగ్రహమ్ ।**
**వాచం విశ్వేశ్వరం గంగాం పరాశరముఖాన్ మునీన్ ॥**

కాశిలోని పవిత్రగంగానదికి గల మణికర్ణికాఘట్టంలో బిందుమాధవస్వామి మందిరం దగ్గర శ్రీధరస్వామి మఠం, ఆయన పూజించిన నృసింహస్వామివిగ్రహం నేడుకూడ చూడవచ్చు. శ్రీధరస్వామి నృసింహమంత్రోపాసకుడనటానికి ఈ క్రింది శ్లోకమే ప్రబలప్రమాణం! శ్రీధరస్వామి గురువు పరమానందస్వామి కాబట్టే గురుస్మరణపూర్వకంగా పై శ్లోకంలోను 'మూకం కరోతి' అనే శ్లోకంలోను గురువైభవాన్ని పరోక్షంగా ప్రకాశింపజేశాడు.

**శ్లో. వ్యాసో వేత్తి శుకో వేత్తి రాజా వేత్తి వా న వా ।**
**శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః ॥**

"భాగవతార్థం వ్యాసునికి, శుకునికి, పరీక్షిత్తుకు తెలుసు. వీరికి కూడా పూర్తిగా తెలుసునో తెలియదో కాని, శ్రీనృసింహస్వామి అనుగ్రహంవల్ల శ్రీధరస్వామికి సర్వమూ తెలుసు.

## శ్రీధరస్వామి కాలం - కృతులు

శ్రీధరస్వామి, చిత్సుఖాచార్యులనే భాగవత తొలివ్యాఖ్యాతను (క్రీ.శ.13 శ) పేర్కొనడమే గాక ఆయన వ్యాఖ్యానం అనుసరించినట్లు స్పష్టమౌతుంది. కాని, చిత్సుఖుని వ్యాఖ్య నేడు అలభ్యం. అంతేకాదు, క్రీ.శ.13వ శతాబ్దానికి చెందిన బోపదేవుణ్ణి కూడ ఆయన స్మరించాడు.

విష్ణుపురి (క్రీ.శ.16 శ.) 'భక్తిరత్నావళి'కి రచించిన స్వోపజ్ఞవ్యాఖ్యయైన **'కాంతిమాల'**లో శ్రీధరస్వామిని అనుసరించాడు. కాబట్టి, శ్రీధరస్వామిని క్రీ.శ.14వ శతాబ్దానికి చెందినవాడుగా చెప్పవచ్చు.

శ్రీధరస్వామి మూడువ్యాఖ్యలు వ్రాసినట్లు తెలుస్తున్నది.

1. విష్ణుపురాణవ్యాఖ్య – 'స్వప్రకాశం'
2. భాగవతపురాణవ్యాఖ్య – 'భావార్థ దీపిక'
3. భగవద్గీతావ్యాఖ్య – 'సుబోధిని'

భాగవతానికి గల వ్యాఖ్యలలో శ్రీధరుని 'భావార్థదీపికా' వ్యాఖ్య పరమప్రమాణమైంది. తరువాతి వ్యాఖ్యాతలకు ఆధారమైంది. వంశీధరశర్మ వ్రాసిన దీపికాప్రకాశవ్యాఖ్య శ్రీధరుని వ్యాఖ్యకంటె పెద్దది. కారణం, అది శ్రీధరీయ వ్యాఖ్యకు వ్యాఖ్యానం కావడమే!

పోతన మహాకవి, ఆంధ్రభాగవతంలో శ్రీధరస్వామి వ్రాసిన **'భావార్థదీపికా'** వ్యాఖ్యనే ఎక్కువగా అనుసరించారు. ఇది పండితు లందరూ ఏకగ్రీవంగా అంగీకరించిన విషయం.

సంస్కృతభాగవతంలో 12 స్కంధాలు 335 అధ్యాయాలు, 14,264 (16,259) శ్లోకాలు, 1320 ఉవాచలు ఉన్నాయి.

## పోతన మహాకవి
## (క్రీ.శ.1370-1450)

**చ. నగుమొగమున్ సుమధ్యమును నల్లనిదేహము లచ్చికాటప**
**ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండలకర్ణముల్ మదే**
**భగతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁగల్గు వెన్నుఁ డి**
**మ్ముగఁ బొడసూపుఁగాతఁ గనుమూసిన యప్పుడు విచ్చునప్పుడున్. (9-732)**

శ్రీమద్భాగవతపురాణాన్ని సర్వాంగసుందరంగా ఆంధ్రీకరించి తెలుగువారిని అనుగ్రహించిన పుణ్యాత్ముడు బమ్మెరపోతన. ఇతడు మహాకవి. మహాపండితుడు. మహాభక్తుడు. కారణజన్ముడు. ఈ మహానుభావుడు నాలుగుకృతుల్ని రచించాడు.

1. వీరభద్రవిజయము 2. నారాయణశతకము
3. భోగినీ దండకము 4. భాగవతము

**పోతన నివాసం**

పోతన తెలంగాణాలోని **'బమ్మెర'** కు చెందినవాడని ఈ రోజు అందరు అంగీకరిస్తున్నారు.

**ఉ. బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్ (భాగవతం 1-13)**

**ఉ. బమ్మెర కేసయలక్కసానికిన్ (భాగ.1-26)**

**ఉ. బమ్మెర పోతరాజుఁ గవిపట్టపురాజుఁదలంచి మ్రొక్కెదన్ (భాగ.6-12)**

ఈ విధంగా భాగవతపద్యాలలో పోతనగారి ఇంటిపేరు బమ్మెర అని స్పష్టంగా చెప్పబడి ఉంది.

కడప మండలంలోని 'ఒంటిమిట్ట' లోని, శ్రీకోదండరామాలయం అతిప్రసిద్ధమైంది. ఈ ఆలయంలోనే పోతన భాగవతాన్ని రచించి, శ్రీరామచంద్రునికి అంకితమిచ్చాడని జనశ్రుతి.

దీనికి పరిష్కారమార్గాన్ని పోతన చరిత్ర మహాకావ్యంలో వానమామలై వరదాచార్యులు ఇలా సూచించారు. పోతన తీర్థయాత్రాలు చేశాడని, తిరుమల శ్రీనివాసుణ్ణీ, కంచి వరదరాజస్వామిని, శ్రీరంగంలోని రంగనాథుణ్ణీ, శ్రీపెరంబూదూరు రామానుజాచార్యుల్నీ, శ్రీవిల్లిపుత్తూరు గోదాదేవిని (ఆండాళ్), ఒంటిమిట్ట శ్రీరామచంద్రుణ్ణీ

సేవించినట్లు వర్ణించారు. ఇది ఎంతో సమంజసంగా ఉంది. పోతన ఒంటిమిట్ట శ్రీరామచంద్రుణ్ణీ సేవించినాడనడంలో విప్రతిపత్తి ఏమీలేదు. పోతన తీర్థయాత్రలు చేసినాడనటానికి శాసనాది ప్రమాణాలు అక్కరలేదు.

**వ. "అని మఱియు మదీయపూర్వజన్మసహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనాకుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబురాకం గని సజ్జనానుమతంబున నభ్రంకషసముత్తుంగ భంగ యగు గంగకుం జని గ్రుంకులిడి వెడలి... (భాగవతము, 1-15)**

**వ. "ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవత పురాణ పారిజాతపాదప సమాశ్రయంబునను హరికరుణా విశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మరల కొన్ని దినంబులకు నేకశిలానగరంబుకుం జనుదెంచి యందు గురువృద్ధ బుధబంధు జనానుజ్ఞాతుండనై" (భాగవతము 6-23)**

ఈ వచనాలను బట్టి పోతన చంద్రగ్రహణసమయంలో గంగలో స్నానం చేశాడని, ఏకశిలానగరంలో భాగవతాన్ని రచించాడని స్పష్టంగా తెలుస్తూ ఉంది.

## పోతన వంశం - వంశవృక్షం

వీరభద్ర విజయం, భాగవత అవతారికల్లోని వంశవర్ణనల్ని బట్టి పోతన వంశక్రమం ఈ విధంగా తెలుస్తోంది.

పోతనగారి యింటిపేరు బమ్మెరవారు. వీరు కౌండిన్యసగోత్రులు. ఆపస్తంబసూత్రులు. వీరి వంశానికి మూలపురుషుడు మల్లయ. మల్లయకొడుకు భీమయ. భీమయ కుమారుడు అన్నయమంత్రి. ఇతని భార్య గౌరమాంబ. వీరిపుత్రుడు సోమన. ఇతనిభార్య మల్లమ. ఈ దంపతులకు 1. రేచన 2. అన్నయమంత్రి 3. ఇమ్మడినాగయ్య అనే ముగ్గురు కుమారులు జన్మించారు. కేసనగారి భార్య లక్ష్మి (లక్కమాంబ). ఈ పుణ్యదంపతులకు 1. ఈశ్వరసేవాకాముడైన తిప్పన 2. భాగవత కర్తయైన పోతన పుట్టారు. బమ్మెర కేసనకవి, మల్లకవులు దాక్షాయణీ పరిణయం రచించారు. వీరి తండ్రి ప్రౌఢ సరస్వతి (కేసన), తాత మల్లయ. ముత్తాత పోతన.

## పోతనగారి వంశవృక్షం

వీరభద్ర విజయం - భాగవతం - దాక్షాయణీ పరిణయం ప్రబంధావతారికల ఆధారంగా)






బమ్మెరవారికి శ్రీశైలమల్లికార్జునస్వామి (మల్లన్న) యిలువేల్పు కాబోలు! ఈ వంశవృక్షానికి మూలపురుషుడు మల్లయ్య పోతన కొడుకు మల్లన్న. ఈ మల్లన్న మనుమడు బమ్మెర మల్లకవి.

పోతన వీరభద్రవిజయాన్ని శ్రీశైలమల్లికార్జునస్తుతితో ప్రారంభించాడు.

## బమ్మెర వంశకవులు

బమ్మెర వంశంలో పోతనగారి తర్వాత రెండుమూడుతరాలవరకు కవులు ఉన్నారు.

### బమ్మెర కేసకవి - మల్లకవులు

పోతన మనుమడైన కేసనకు ప్రౌఢసరస్వతి అనే బిరుదు ఉంది. ఇతనికి 1. అప్పలమ్మ 2. వీరమ్మ అనే ఇద్దరు భార్యలు. అప్పలమ్మ కుమారుడు కేసకవి, వీరమ్మ కుమారుడు మల్లకవి. ఈ సవతి అన్నదమ్ములు జంటకవులు. వీరు దాక్షాయణీ పరిణయాన్ని రచించి గురజాల మల్లన సోమయాజికి, విష్ణు భజనానందము రచించి పెనుమత్స నారపరాజుకు అంకితమిచ్చారు.

**గద్యం :** "ఇది శ్రీమద్భవానీ శంకర పర్వతాల గురుప్రసాదాసాదిత సారస్వత బమ్మెర కులపవిత్ర కౌండిన్యముని గోత్ర, పోతయామాత్య పౌత్ర మల్లయా మాత్యపుత్ర సంస్కృతాంధ్ర భాషా చమత్కార కవితా ధురీణతా బుధవిధేయ ప్రౌఢ సరస్వతీ కవి నామధేయ వరతనూభవ కేసన కవి మల్లనకవి ప్రణీతంబైన దాక్షాయణీ పరిణయం బను (విష్ణుభజనానందంబను) మహాప్రబంధంబునందు" అని రెండు కావ్యాలలో గ్రంథాంతగద్యం ఒకే విధంగా ఉన్నది.

పోతనగారి కులగురువు ఇవటూరి సోమనారాధ్యులని వీరభద్రవిజయంలో చెప్పుకొన్నాడు. కేసకవి - మల్లకవి గురువు ఇవటూరి ముక్తినాగేశారాధ్యులు. కాబట్టి, బమ్మెరవారు మొదటి నుండి కూడా శైవసంప్రదాయానికి చెందినవారే.

దాక్షాయణీ పరిణయకృతిభర్తయైన గురుజాల మల్లన సోమయాజి వరంగల్లు జిల్లాలోని పరకాల మండలంలోని గురుజాల వాస్తవ్యుడు. విష్ణుభజనానంద కృతిభర్త అయిన పెనుమత్స నారపరాజు 'రేలంగి' వాస్తవ్యుడు. ఈ జంటకవులు పశ్చిమ గోదావరిలోని 'ఆచంట' గ్రామవాస్తవ్యులు. **దీనినిబట్టి బమ్మెరవారు తెలంగాణం నుండి పశ్చిమ గోదావరీ మండలానికి వలస వచ్చినట్లు తెలుస్తున్నది. ఈ జంట కవులు క్రీ.శ.16 వ శతాబ్దిలో ఉన్నవారు.**

పశ్చిమగోదావరీమండలంలోని 'పోడూరు' గ్రామవాస్తవ్యుడైన పోడూరి పెదరామ కవి 'కౌసల్యాపరిణయం', 'శివరామాభ్యుదయం' అనే ద్వ్యర్థి కావ్యాలను రచించారు. ఈ పెదరామకవి గురుజాల వేదమంత్రి కోరికపై దాక్షాయణీ పరిణయానికి ఒక ప్రతి వ్రాసిపెట్టినాడు. దాక్షాయణీపరిణయ ప్రతివిలేఖన కాలం - 'ధాతృనామ సంవత్సర ఆశ్వయుజ మాస కృష్ణ దశమీ సోమవారం' (18-10-1756).

కూచిమంచి వేంకటరాయడు రచించిన సుకవిమనోరంజనంలో విష్ణుభజనానందాన్ని ఉదాహరించాడు. కేసకవి, మల్లకవులు రచించిన యీ రెండు కావ్యాలు ఇంతవరకు ముద్రించబడలేదు.

## అజ్జరపు పేరయలింగము

ఈ పేరయ కవి పశ్చిమగోదావరీమండలంలోని 'అజ్జర' గ్రామవాస్తవ్యుడు. ఇతడు 'ఒడయనంబివిలాసం' అనే ఆరు ఆశ్వాసాల కావ్యాన్ని రచించి 'ఆచంట' లోని శ్రీవేంకటేశ్వరస్వామికి అంకితం చేశాడు. ఈ పేరయలింగకవి ప్రౌఢసరస్వతికి అల్లుడు. కేస కవి - మల్ల కవులకు బావ. ఈ కావ్యం ఇప్పటికి రెండుసార్లు ముద్రింపబడింది. ఇది శ్రీచెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు అభిమానించిన కావ్యం. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిశోధనల్లో విరివిగా ఉపయోగించిన కావ్యం!

కొందరు బమ్మెరపోతన కుమారుడైన మల్లనయే రుక్మాంగద చరిత్రను (ఏకాదశీ మాహాత్మ్యమ్) రచించిన ప్రౌఢకవి మల్లన అని భ్రాంతి పడుతున్నారు. **గద్యభాగం - "ఇది శ్రీమత్పార్వతీపరమేశ్వర వరప్రసాద లబ్ధ కవితా పవిత్ర పోతయామాత్య పుత్ర సకల జనానంద చర్య ప్రౌఢకవి మల్లనార్య ప్రణీతంబైన రుక్మాంగద చరిత్రంబను మహాపుణ్యకథయందు..."** ఈ గ్రంథాంత గద్యాన్ని చదివేటప్పుడు స్థూలదృష్టికి అట్లే తోస్తుంది. కాని, ఇది పొరపాటు. ప్రౌఢకవి మల్లన శ్రీవత్సగోత్రుడు. ఈయన తల్లిపేరు అమ్మళాంబ. తండ్రి పోతయ. బమ్మెరవారు కౌండిన్య గోత్రులు. ప్రౌఢకవి మల్లన శ్రీవత్స గోత్రుడు. కాబట్టి, ఈ మల్లన్నలు ఇద్దరూ భిన్నవ్యక్తులనేది స్పష్టం!

ఇక్కడ మరో ముఖ్యాంశం చెప్పవలసి ఉంది. ప్రాచీన తాళపత్రగ్రంథాలకు ముందు విషయానుక్రమణికలు ఉండేవి కావు. అందువల్ల నన్నయగారు ఆశ్వాసాంత గద్యాలలో **'విషయానుక్రమణికను'** జోడించారు. దీనివల్ల పాఠకునికి గ్రంథంలో చదివిన విషయం మరల జ్ఞాపకానికి వస్తుంది. మారన మార్కండేయపురాణంలో నన్నయగారిని అనుసరించాడు. పోతనగారు కూడ స్కంధాంతగద్యాలలో కథావిషయానుక్రమణికల్ని యథాక్రమంగా సంతరించారు. పోతన వీరభద్రవిజయంలో గద్యాలు కూడా ఇలాంటివే! ప్రౌఢకవి మల్లన కూడ ఆశ్వాసాంత గద్యల్లో ఈ పద్ధతినే పాటించాడు. ఈ విధంగా **కావ్య ప్రబంధాలకు విషయానుక్రమణిక లిచ్చినవారు ఆంధ్రసాహిత్యంలో నలుగురు కవులే ఉన్నారు.** తిక్కన నియమాన్ని సడలించారు. తరువాతి కవులందరూ ఆయన మార్గాన్నే అనుసరించారు. గ్రంథ పరిష్కరణ పద్ధతుల్లో ప్రాచీనప్రబంధాలకు విషయానుక్రమణికలను పునరుద్ధరించిన వారు సి.పి.బ్రౌన్ దొరగారే!

## పోతనకాలం (1370-1450)

పోతన కాలాన్ని విమర్శకులు తలకొక విధంగా నిర్ణయించారు.

1. పురాణం హయగ్రీవశాస్త్రిగారు - క్రీ.శ.1372-1450
2. కందుకూరి వీరేశలింగంపంతులుగారు - క్రీ.శ.1400-1460
3. వంగూరి సుబ్బారావుగారు - క్రీ.శ.1480-1520
4. చాగంటి శేషయ్యగారు - క్రీ.శ.1450-1510
5. శేషాద్రిరమణ కవులు - క్రీ.శ.1375-1440

ఈ పట్టికలో హయగ్రీవశాస్త్రిగారు, శేషాద్రిరమణకవులు నిర్ణయించిన కాలమే సమంజసమైనది. పోతన కాలం 1370-1450 అని నిర్ణయించడానికెన్నో ఆధారాలున్నాయి.

## పోతన కాలం - ప్రబల ప్రమాణం

నందిమల్లయ - ఘంటసింగయ అనే జంట కవులు (క్రీ.శ.1440-1520) సుప్రసిద్ధులు. వీరు 1. ప్రబోధ చంద్రోదయము 2. వరాహపురాణము 3. కవుల షష్ఠము రచించారు. ఈ కవుల షష్ఠం ఈనాడు లభించడం లేదు. లక్షణగ్రంథాలలో రాచమల్లు కవుల షష్ఠస్కంధమని; కవుల షష్ఠమని, శృంగారషష్ఠమని పద్యాలు ఉదాహరింపబడ్డాయి.

శా. **చండాంశు ప్రభ! చిక్క తిమ్మయ తనూజా! తిమ్మ! విధ్వస్త పా**
**షండం బైన త్రిలింగ భాగవత షష్ఠస్కంధ కావ్యంబు నీ**
**కుం దక్కెన్ జతురాననత్వ గుణయుక్తుల్ మీర వాణీమనో**
**భాండారోద్ధత 'చూరకార బిరుద ప్రఖ్యాతి సారంబుగన్** **- కవిజన సంజీవని (1-35)**

అనే పద్యాన్ని ముద్దరాజు రామన్న ఉదాహరించాడు. దీన్నిబట్టి పాషండులు విధ్వంసం చేసిన ఆంధ్రభాగవతం లోని షష్ఠస్కంధాన్ని వీరు మరలా రచించినట్లు తెలుస్తోంది. ఈ షష్ఠస్కంధాన్ని రచించినవారు మలయమారుత కవులని కొందరు లాక్షణికులు పేర్కొన్నారు. 'మలయమారుత' బిరుదాంకితులైన మల్లయ-సింగయ కవులే యీ షష్ఠస్కంధకర్తలని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరిలో ఊహించారు. నిడుదవోలు వేంకటరావుగారు ప్రబోధచంద్రోదయ పీఠికలో ఈ ఊహను బలపరిచారు. ఆరుద్ర సమగ్రాంధ్రసాహిత్యంలో ఆమోదించారు. ఆచార్య రవ్వా శ్రీహరిగారు కూడ ఇట్లే భావించి కవుల షష్ఠంలో లభించిన 27 పద్యాల్ని 'అలబ్ధకావ్యముక్తావళి' లో ఉదాహరించారు.

హరిభట్టుకూడ భాగవతంలోని 6-11-12 స్కంధాలను మరల రచించాడు. హరిభట్టు కాలం క్రీ.శ.1450-1520 అని వరాహపురాణ పీఠికలో ఆచార్య దేవళ్ల చిన్నికృష్ణయ్యగారు వ్రాశారు.

నందిమల్లయ-ఘంట సింగయ కవులు వరాహపురాణాన్ని రచించి శ్రీకృష్ణదేవరాయల తండ్రియైన తుళువ నరసింహరాయలకు అంకితం చేశారు. ఈ నరసరాయల రాజ్యకాలం క్రీ.శ.1490-1503. నందిమల్లయ-ఘంటసింగయ కవులు, దగ్గుపల్లి దుగ్గన్న ఇంచుమించు సమానవయస్కులు. వీరికి ముందున్న పోతన-శ్రీనాథులు కూడా సమానవయస్కులే.

ప్రబోధచంద్రోదయ రచనాకాలం క్రీ.శ.1470 అని వీరేశలింగం పంతులుగారు, నిడుదవోలు వెంకటరావుగారు కూడా అంగీకరించారు. తెలంగాణంలో పుట్టిన భాగవతాన్ని రాయలసీమ కవులు అనుకరించడానికి కనీసం 20 సంవత్సరాల వ్యవధి కావాలి! కాబట్టి, భాగవతం క్రీ.శ.1450 నాటికే పూర్తయిందని అంగీకరింపక తప్పదు. పోతన కాలం ఎట్టి పరిస్థితుల్లోను క్రీ.శ.1450 కిందికి దిగదు.

ప్రబోధచంద్రోదయ కృతిభర్తయైన నాదెళ్ల చిట్టిగంగన్న మొదట బసవభూపాలుని కొలువులో పిమ్మట సాళువ నరసింహరాయల కొలువులో, మంత్రిగా ఉన్నవాడు. దూబగుంట నారాయణ కవి పంచతంత్రం అనుసరించి బసవభూపాలునికి అంకితమిచ్చాడు. పిల్లలమఱ్ఱి పినవీరభద్ర కవి జైమినిభారతాన్ని సాళువ నరసింహరాయల కంకితమిచ్చాడు. ఈ కవికూడ భాషావిషయంలో పోతనను అనుసరించాడు.

శబ్దరత్నాకరకారుడైన బహుజనపల్లి సీతారామాచార్యుల అభిప్రాయంలో - "పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు గొప్పకవి. ఇతనికవిత్వము మిక్కిలి శ్లాఘ్యముగానే యున్నది. అయిన నితఁడు బమ్మెరపోతన మతము నవలంబించినాడు".

కొఱవి గోపరాజు (క్రీ.శ.1425-1500) కూడ సింహాసన ద్వాత్రింశికలో భాగవతపద్యాలను ఎక్కువగా అనుకరించినవాడే! పోతనను మొట్టమొదటి 'భాగవత నైష్ఠికుడు', 'కవి పట్టపురాజు' అని స్తుతించిన ఏర్చూరి సింగన (1400-1475) పోతనశిష్యకోటిలోనివాడు. చరిగొండ ధర్మన్న (1450-1530) చిత్రభారతములో పోతనను స్తుతించాడు.

ఇలా, ఏ విధంగా చూచినా పోతన కాలం క్రీ.శ.1370-1450 మధ్యకాలమని సిద్ధాంతీకరింపవచ్చు.

**పోతన గురువులు - సహజపాండిత్యం**

**"శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసన మంత్రిపుత్ర సహజపాండిత్య"** అనే భాగవత గద్యాన్ని బట్టి, పరమేశ్వరుని కరుణచేత కవిత్వమూ, సహజంగానే పాండిత్యమూ పోతనకు అబ్బినవని తెలుస్తోంది. "సహజపాండిత్య" అనే బిరుదంచేత పోతన గురువుల వద్ద విద్యనభ్యసింపలేదని భావించరాదు.

**"జనకశిక్షిత విహితాక్షరాభ్యాసుండనై వీరభద్ర ప్రసాద లబ్ధ కవితాతిశయంబున"** (1-40) అనీ, **"శ్రీమన్మహామహేశ్వర యివటూరి సోమనారాధ్య దివ్యశ్రీపాదపద్మారాధక కేసనామాత్యపుత్ర పోతననామధేయ"** అనీ, వీరభద్రవిజయంలో చెప్పుకోవడంచేత ఇవటూరి సోమనారాధ్యులవద్ద కావ్య, ఇతిహాస పురాణాలను, శైవశాస్త్రాగమాలలోని రహస్యాలను తెలిసికొని స్వయంకృషితో సర్వశాస్త్రాలలో ఉద్దండపాండిత్యాన్ని సంపాదించి సహజపాండిత్య బిరుదాన్ని పొందాడని భావించాలి.

గురుశుశ్రూషాపూర్వకంగా విద్యను అభ్యసించాలని పోతనగారే ఉపదేశించారు. 'చిదానందు'డనే యతి పోతనకు శ్రీరామతారకమంత్రోపదేశం చేసినట్లు ప్రాచీనకాలం నుండి కర్ణాకర్ణిగా వినబడుతోంది. పోతన చరిత్రలో శ్రీవానమామలై వరదాచార్యులు ఇలాగే వ్రాశారు.

1. బాల్యదశలో పోతన సాహిత్య గురువు - తండ్రి కేసన.
2. శైవశాస్త్రసంప్రదాయగురువు - ఇవటూరి సోమనారాధ్యులు
3. ఆధ్యాత్మికమంత్రోపదేశగురువు - శ్రీ చిదానంద యోగి

ఈ చిదానందయోగియే వేమనగారికికూడ మంత్రోపదేశం చేసిన గురువు అని జనశ్రుతి. ఇటువంటి సంఘటనలకు శాసన గ్రంథస్థాధారము లక్కరలేదు. వేమన మహాకవికూడ పోతన శ్రీనాథులకు సమకాలికుడు. వేమన క్రీ.శ.1400-1500 మధ్యకాలంలో విలసిల్లినవాడే!

సహజపాండిత్యమంటే లౌకిక శాస్త్ర పాండిత్యం కాదు. శ్రీశంకర భగవత్పాదులు భగవద్గీతా భాష్యంలో -

**"పండితాః = ఆత్మజ్ఞాః పండా ఆత్మవిషయా బుద్ధి ర్యేషాం తే హి పండితాః -**
**పాండిత్యం నిర్విద్యా ఇతిశ్రుతేః"** *(బృహదారణ్యకోపనిషత్తు 3-5-1) - భగవద్గీత (2-11)*

అని చెప్పినట్లుగా పాండిత్య మంటే బ్రహ్మజ్ఞానం. నారదోపదేశంవల్ల తల్లిగర్భంలో ఉండేటప్పుడే ప్రహ్లాదునికి బ్రహ్మజ్ఞానం కల్గినట్లే పోతనగారికి తల్లికడుపులో ఉన్నప్పుడే కేసనగారి ఉపదేశంవల్ల వేదాంతనిష్ఠ కుదిరింది. ఆంధ్రభాగవతమంతా బ్రహ్మజ్ఞానం ప్రతి పుటలో ప్రకాశిస్తూ ఉంది.

పోతనగారు బాల్యంలో వీరభద్రవిజయం రచనాసమయంలో శ్రీవీరభద్రస్వామిభక్తులు. తరువాత పరమేశ్వరుని, (శ్రీశైలమల్లికార్జున) భక్తులు. భాగవత రచనానైష్ఠికులైనప్పుడు, ప్రహ్లాదునివలె చలింపని వైష్ణవభక్తిపూర్ణులు. హరిహర వందనాభిలాషులైన అద్వైతులు.

## పోతన శిష్యులు

ఆంధ్రభాగవతంలో 5-6-11-12 స్కంధాలలో శిథిలమైన భాగాలను గంగన-సింగన-నారయలు పూరించారు. నారయ 11-12 స్కంధాంత గద్యాలలో **'పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన'** అని చెప్పుకొన్నాడు. కాబట్టి గంగన, సింగన, నారయలు ముప్వురు పోతనశిష్యులే!

## పోతన కృతులు

### వీరభద్ర విజయము

ఇది పోతన బాల్యకృతి. కులగురువులైన ఇవటూరి సోమనారాధ్యుల ఆజ్ఞపై రచింపబడింది. దీనిలో నాల్గు ఆశ్వాసాలు, మొత్తం 1050 గద్యపద్యాలున్నాయి.

### నారాయణ శతకం

తెలుగు వాఙ్మయంలో ఎంతో ప్రచారం గల శతకాలలో నారాయణశతకం ఒకటి. దీనిలో 'నారాయణా!' అనే మకుటంలో105 శార్దూల, మత్తేభవృత్తపద్యాలున్నాయి.

**మొదటి పద్యం**

శా. **శ్రీరామామణి పాణి పంకజ మృదు శ్రీతద్‌జ్ఞపాదాబ్జ! శృం**
**గారాకార శరీర! చారుకరుణా గంభీర! సద్భక్త మం**
**దారాంభోరుహ పత్ర లోచన! కళాధారోరు సంపత్సుధా**
**పారావారవిహార! నాదురితముల్ భంజింపు నారాయణా!**

కొన్ని తాళపత్ర ప్రతులలో గ్రంథాంతంలో – **"ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన నారాయణ శతకము సర్వంబు సంపూర్ణము".**

ఇది పోతన రచితం కాదని, తర్వాతి కాలం నాటిదని కొందరు వాదించగా, వెల్లంకి తాతంభట్టు గారు 'కవి చింతామణి' లో పోతనగారి నారాయణ శతకంలోని మూడవపద్యాన్ని ఉదాహరించాడు.

**"గురుకణ్పై నను వంకఁ బోయినఁ గడున్ గజ్జెనఁ బేదెత్తినన్**
**జెఱుకుంగోలకుఁ దీపె కాని గలదే చేదెందు? నారాయణా!"**

ఇది పోతన రచితమేనని లక్షణగ్రంథకర్తలు అంగీకరించారు. తాతంభట్టు క్రీ.శ.1450-1500 మధ్యకాలంలో గ్రంథరచనలు చేశాడు. కాబట్టి, నారాయణ శతకాన్ని పోతన క్రీ.శ.1500 పూర్వమే రచించాడన్నది స్పష్టం.

**"....... ధర్మపురిలక్ష్మీనాథ! నారాయణా!"** (97) అనే పద్యంచేత శ్రీ కందుకూరి వారు పోతన తెలంగాణ ప్రాంతం వాడని నిర్ణయించారు.

చివరి పద్యం

శా. నీ మూర్తుల్ గన నీ కథల్ వినఁ మదిన్ నీ పాద నిర్మాల్య ని
ష్కామోదంబు నెఱుంగ నీ చరణ తోయంబాన నైవేద్యముల్
నీకుం బొప్ప భుజింప నీ జపము వర్ణింపన్ గృపంజేయవే
శ్రీమించన్ బహుజన్మజన్మములకున్ శ్రీయాదినారాయణా (105)

ఆరుద్ర ఇలా వ్రాశారు. ఇందులో **"బహుజన్మజన్మములకున్"** అనే మాట పోతరాజుగారి తత్త్వానికి విరుద్ధం! వారు పునర్జన్మ కోరరు. భాగవతాన్ని తెనిఁగించి **"నా జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండగన్"** అని వారు దీక్ష వహించారు (భాగవతం 1-19) అందుచేత 'బహుజన్మజన్మములు' చెప్పే నారాయణ శతకం పోతరాజుగారి రచన కాదని చెప్పవచ్చు (సమగ్ర ఆంధ్రసాహిత్యం - సం.5, పుటలు 240-241).

ఇది ఆరుద్రగారి చమత్కారమే గాని వాస్తవం కాదు. నారాయణశతకం రచించేనాడు పోతన స్థితి వేరు. భాగవతం రచించే నాటి స్థితి వేరు. జన్మజన్మలకు భగవద్భక్తి ఉండవలె ననేదే భారతీయుల భావన. అదే పోతనగారి ఆంతర్యం!

'పోతరాజుగారి కవితాకన్య మత్తేభగమన' - అని ఆరుద్ర చెప్పిన వాక్యం అక్షర సత్యం! పోతనగారికి శార్దూలాల మీద కంటె మత్తేభాలపై అభిమాన మెక్కువ. వీరభద్రవిజయంలో శార్దూలాలు (56), మత్తేభాలు (69) ఇంచుమించు సమానంగా ఉన్నాయి. భాగవతంలో శార్దూలాల కంటె మత్తేభాల సంఖ్య ఇబ్బడిగా ఉన్నాయి. నారాయణ శతకంలో ముబ్బడిగా ఉన్నాయి. శార్దూలాలు 28, మత్తేభాలు 77.

నారాయణ శతకంలో 1) ఆదిదశకము 2) అవతారదశకము 3) దివ్యరూపదశకము 4) నామదశకము 5) కృష్ణావతారవింశతి 6) జ్ఞానవింశతి 7) మోక్షవింశతి (10+10+10+10+20+20+20=100) అనే ఏడు విభాగాలలో శతక నిర్మాణం చేసినట్లు పోతనగారే ఒక పద్యంలో చెప్పారు.

**మ. రమణీయంబుగ నాదిమంబు, నవతారంబున్, భవద్దివ్యరూ**
**పము, నామామృతమున్ దలంపఁగ దశప్రాప్తియ్యెఁ గృష్ణావతా**
**రము, సుజ్ఞానము, మోక్షమున్ ద్వివదశ సంప్రాప్తిన్ శతాంధ్రాఖ్య కా**
**వ్యము నర్పించితి మీ పదాబ్జములకున్ వైకుంఠనారాయణా!**

ఒక సుప్రసిద్ధపద్యం

**మ. ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై**
**పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండ మాకారమై**
**సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై**
**వరుసన్ నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా! (10)**

ఈ పద్యం ఆంధ్రదేశంలో మారుమూల పల్లెటూళ్లలో కూడ బహుళ ప్రచారం పొందిన పోతనగారి పద్యం ఈ శతకంలోనిదని చాలామందికి తెలియదు. విజయదశమి నాడు గిలుకలు పట్టించేటప్పుడు బడిపిల్లలచే నారాయణశతకపద్యాలను చదివించే ఆచారం నిన్న మొన్నటి వరకు ఉండేది. అందుకే ఇదొక ప్రత్యేక చాటుపద్యంగా గుర్తించి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ 'చాటుపద్యమణిమంజరి' ప్రథమ సంపుటంలో చేర్చారు. (టి.టి.డి.వారి ముద్రణ, 2013, పుట-3)

## భోగినీ దండకం

దండక రచనలో పోతనకు మక్కువ మెక్కువ. వీరభద్రవిజయంలో వీరభద్ర దండకం (4-180); భాగవతంలో తృతీయ-దశమ స్కంధాలలో (3-203), (10-1-1233) రెండు కృష్ణదండకాలు రచించాడు. భాగవత దండకాలకు భోగినీ దండకానికి ఎక్కువ పోలికలున్నాయి.

## పోతన భాగవత వైశిష్ట్యం

శ్రీమద్భాగవతపురాణరచన చేతనే పోతన తెలుగుకవులలో ధ్రువతారగా ప్రకాశిస్తున్నాడు. సంస్కృతాంధ్రభాషలలో శ్రీమద్రామాయణ - భారత - భాగవతాలు ఉద్గ్రంథాలు. మహాభారతాన్ని నన్నయ - తిక్కన - ఎఱ్ఱనలు (కవిత్రయం) తెనిగించారు. వీరు కథాభాగం కొంచెం కూడా వదలిపెట్టకుండా ఉపాఖ్యానాలు అన్నింటిని జోడిస్తూ, మూలవిధేయంగానే రచన సాగించారు. కాని, సంస్కృత భారతం తెలుగులో సగానికి సగం తగ్గింది. సభాపర్వం సంగ్రహంగా ఉంది. యక్షప్రశ్నలు, భగవద్గీత మొదలైనవి సంక్షిప్తంగా ఉన్నాయి. సనత్సుజాతీయం, విష్ణుసహస్రనామాలు మొదలైనవి సూచింపబడ్డాయి. లక్షశ్లోకాల పై చిలుకుగల సంస్కృతభారతం తెలుగులో 40 వేల గ్రంథసంఖ్యకు తగ్గింది. అయినప్పటికీ శ్రీ ఆంధ్రమహాభారతం యథామాతృకంగానే ఉన్నది. ఆంధ్రభారతం వంటి భారతగ్రంథం భారతదేశంలో మరియే ఇతరభాషలలో లేదు.

భాస్కరరామాయణం కూడ సంగ్రహానువాదమే. ఇది యథామూలానువాదం కాదు. కొన్ని అవాల్మీకాలు కూడా చేరాయి. వాల్మీకిరామాయణంలో 24,000 శ్లోకాలుండగా తెలుగులో దీని గ్రంథ సంఖ్య 10,000కు దిగింది. (గ్రంథమంటే 32 అక్షరాల అనుష్టుప్‌శ్లోకం.)

పోతనభాగవత ఆంధ్రీకరణం అలాంటిది కాదు. రచన అంతా యథామాతృకంగానే సాగింది. మూలంలోలేని నరకాసురవధ చేరింది. క్లిష్టస్థలాలలో శాస్త్ర - వేదాంత ఘట్టాలలో శ్రీధరస్వామి వ్యాఖ్యానం జోడింపబడింది. ప్రహ్లాద చరిత్రం, గజేంద్రమోక్షణం, వామనచరిత్ర, ఉషానిరుద్ధులకథ మొదలైనవి ఎక్కువగా చేరాయి. గ్రంథారంభంలో నైమిశారణ్యవర్ణన (1-39), వామనచరిత్రలో స్వర్గవర్ణనం (8-447), నవమస్కంధంలో గంగావతరణం (9-230); దశమస్కంధంలో శరత్కాలం (10-1-765), రాసక్రీడ (10-1-1082) మొదలైనవి బాణమహాకవి కాదంబరీగద్యశైలిలో శ్లిష్టోపమలతో సుదీర్ఘంగా సాగాయి. నృసింహస్వామి స్తంభోద్భవగద్యం (7-285), త్రికూట పర్వతారణ్య వర్ణనం (8-24), రామాయణం (9-259 నుండి 363 వరకు), దశమస్కంధంలో శ్రీకృష్ణుని బాలక్రీడలు, గ్రీష్మ, వర్ష, శరద్, హేమంత ఋతువులు, జలక్రీడ, సూర్యాస్తమయ చంద్రోదయ, సూర్యోదయాలు, ద్వారకాపురం

మొదలైన వర్ణనలు ప్రబంధపద్ధతిలో ఎక్కువగా విస్తరింపబడ్డాయి. వీటిలో చాల వర్ణనలు పోతనవిగా స్వోపజ్ఞాలు. ఈ విధంగా తెలుగు భాగవతం సంస్కృతమూలానికి రెట్టింపు గ్రంథమైంది.

పోతన, భాగవతాన్ని సంపూర్ణంగా రచించాడు. సింగభూపాలుడు పాతిపెట్టించడం చేత చెదలు పట్టడం చేత, భాగవతంలోని 5-6-11-12 స్కంధాలలో కొన్ని భాగాలు శిథిలమై నష్టమయ్యాయి. ఈనాడు లభిస్తున్న ఆంధ్రభాగవతంలో 1-2-3-4-5-6-7-8-9-10 స్కంధాలు పోతనగారివి పూర్తిగా లభిస్తున్నాయి. ఇవే పెద్ద స్కంధాలు. పంచమ స్కంధాన్ని **బొప్పరాజు గంగన,** షష్ఠస్కంధం **ఏర్చూరి సింగన,** ఏకాదశ - ద్వాదశ స్కంధాలు **వెలిగందల నారయ** పూరించినట్లు కొన్ని తాళపత్రప్రతుల్లో, ఈనాటి ముద్రితగ్రంథాల గ్రంథాంత గద్యల్లో ఉన్నాయి. పై ముగ్గురు పోతన శిష్యకోటిలోని వారు. ఆ యా స్కంధాలను వారు పూర్తిగా రచింపలేదు. పోతన రచించిన భాగవతంలో శేషించిన భాగాలను కలుపుకొంటూ శిథిలాలైన పద్యభాగాలను, కొన్ని ఘట్టాలను మాత్రమే పూరించారు. అందు చేతనే ప్రాచీనతాళపత్రప్రతుల్లో కొన్నింటిలో అన్ని స్కంధాల చివర పోతనగారి పేరే ఉంది.

**ఆంధ్ర భాగవతస్కంధ - పద్యసంఖ్య**

| క్రమ సంఖ్య | స్కంధం | కవిపేరు | పద్యగద్యసంఖ్య |
|---|---|---|---|
| 1 | ప్రథమస్కంధం | బమ్మెర పోతన | 529 |
| 2 | ద్వితీయస్కంధం | బమ్మెర పోతన | 289 |
| 3 | తృతీయస్కంధం | బమ్మెర పోతన | 1055 |
| 4 | చతుర్థస్కంధం | బమ్మెర పోతన | 977 |
| 5 | పంచమస్కంధం (2 ఆశ్వాసములు) | బొప్పరాజు గంగన | 351 (183+168) |
| 6 | షష్ఠస్కంధం | ఏర్చూరి సింగన | 530 |
| 7 | సప్తమస్కంధం | బమ్మెర పోతన | 482 |
| 8 | అష్టమస్కంధం | బమ్మెర పోతన | 744 |
| 9 | నవమస్కంధం | బమ్మెర పోతన | 736 |
| 10 | దశమస్కంధం (పూర్వ+ఉత్తరభాగములు) | బమ్మెర పోతన | 3132 (1790+1342) |
| 11 | ఏకాదశస్కంధం | వెలిగందల నారయ | 127 |
| 12 | ద్వాదశస్కంధం | వెలిగందల నారయ | 53 |
| **మొత్తం గద్యపద్యాల సంఖ్య** | | | **9005** |

మొత్తం భాగవతంలోని పద్యగద్యాల సంఖ్య 9005, అయితే 5-6-11-12 స్కంధాలలోనివి 1061. ఈ స్కంధాలలో సగం పోతన కవిత అని అంగీకరించినప్పటికీ ఆయన రచించినవి 8500 అనీ, తక్కిన ముప్వురు వ్రాసినవి 500 గద్యపద్యాలని అంగీకరింపక తప్పదు.

ఈ విషయాన్నే శేషాద్రిరమణ కవులిలా వ్రాశారు. "ఆ యా భ్రష్టభాగముల నన్నింటిని బదులు పూర్తిచేసి రనియు, నందలి కవిత పూర్తిగాఁబరులదే యనియు మేము విశ్వసింపజాలము... వీనినన్నింటిని సమన్వయము చేసినచో, బోతన గ్రంథములోఁ బరుల కూర్పులు, మార్పులు తప్ప సొంత రచన యంతగా లేదని తోఁచును" (వావిళ్ల ప్రతి పీఠిక : పుట.83) హైదరాబాద్, ఆం.ప్ర.సా.అకాడమీ ప్రతి సంపాదకవర్గంవారి మాటలివి "మహాకవిపోతన లిఖితము శిథిలమై పోఁగాఁ బలువురు పూరించినట్లు పరంపరాసూక్తి యున్నది. ఈ విషయము లోఁతుగా బర్యాలోచించినపుడు మూలగ్రంథము పూర్తిగా నష్టమైనట్లు తోచదు." (పీఠిక, పుట-157) కాబట్టి, భాగవతమంతా పోతన విరచితమే.

గ్రంథపరిమాణంలో పద్యగద్యసంఖ్యలో తిక్కనగారి తరువాతిస్థానం పోతనగారిదే! తిక్కనగారి నిర్వచనోత్తర రామాయణంలో 1281; భారతంలో 16,457; మొత్తం 17,738 పద్యగద్యలున్నాయి. పోతనగారి వీరభద్రవిజయం (1050); నారాయణ శతకం (105); భాగవతం (8500); వీటిలో మొత్తం గద్యపద్యాలు సుమారు 10,000 ఉన్నాయి. ఎఱ్ఱనగారి అరణ్యపర్వశేషం (1595); నృసింహపురాణం (843); హరివంశం (4685) లోని పద్యగద్య సంఖ్య 7126. శ్రీనాథుని శృంగార నైషధం (1357); హరవిలాసం (799); భీమఖండం (1037); కాశీఖండం (1786) శివరాత్రి మాహాత్మ్యం (540) వీటిలో గల పద్యగద్యసంఖ్య 5519.

ప్రాచీన కవులలో పద్యగద్యసంఖ్యలో తిక్కన గారిది ప్రథమస్థానం. పోతనగారిది ద్వితీయస్థానం. ఎఱ్ఱనగారిది తృతీయస్థానం. శ్రీనాథునిది చతుర్థస్థానం. ఎఱ్ఱనగారి రామాయణం కూడ లభిస్తే పోతన గారితో తులతూగుతారు. శ్రీనాథుని శాలివాహనగాథా సప్తశతి, మరుత్తరాట్చరిత్ర మొదలైన ప్రబంధాలు కూడా లభిస్తే పోతనగారితో సరికావచ్చును.

### పోతన సంస్కృతాంధ్రపూర్వకవిస్తుతి

**క. శ్రీరామాయణ కథభువి - వారక నిర్మించినట్టి వాల్మీకి మనః**
**స్ఫారుఁబరాశరనందను - శ్రీరమ్యుని బాయకెపుడుఁ జింతింతు మదిన్**

**సీ. బాణునంచిత శబ్దపారీణు నసమాన - కవితాగుణావాసుఁగాళిదాసు**
**మాఘు వాక్యామోఘు మణిభద్రు శివభద్రు రమణీయతర కవిరాజు భోజు**
**బ్రకటితవిమలప్రభారవి భారవి - నున్నతగుణధుర్యు నన్నపార్యు**
**సేవిత కవిరాజి శ్రీసోమయాజిని - శృంగార కవినాథు రంగనాథు**

**నవని రెండవ శారదయై వెలుంగు - వైభవోద్దాము వేములవాడ భీము**
**నాదిగాఁగల కవులను నధిక భక్తిఁ - దలఁచి వర్ణించి తత్ప్రసాదంబు వడసి**
**- వీరభద్ర విజయము (I - 8,9)**

వ. అని యిష్టదేవతలం జింతించి దినకర కుమార ప్రముఖులం దలంచి ప్రథమ కవితా విరచన విద్యావిలాసాతి రేకి వాల్మీకి నుతియించి హయగ్రీవ దనుజ కరపరిమళిత నిగమ నివహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి శ్రీమహాభాగవత కథా సుధారస ప్రయోగికి శుకయోగికి నమస్కరించి మృదు మధుర వచన వర్గపల్లవితస్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి కతిపయ శ్లోక సమ్మోదిత సూరు మయూరు నభినందించి మహాకావ్య కరణ కళావిలాసుం గాళిదాసుం గొనియాడి కవి కమలరవిన్ భారవిన్ బొగడి విదళితాఘు మాఘు వినుతించి యాంధ్రకవితా గౌరవజనమనోహారి నన్నయసూరిం గైవారంబు సేసి, హరిహరచరణారవింద వందనాభిలాషిం దిక్క మనీషిన్ భూషించి, మఱియు నితర పూర్వకవిజన సంభావనంబు గావించి వర్తమాన కవులకుం బ్రియంబు వలికి భావికవుల బహూకరించి యుభయకావ్యకరణదక్షుండనై (భాగవతం 1-12)

అని పోతన వీరభద్రవిజయ, భాగవతాలలో వాల్మీకిని, వ్యాసుని, బాణుని, మయూరుని, కాళిదాసుని, మాఘుని, శివభద్రుని, భోజుని, భారవిని, నన్నయ్యను, తిక్కనను, రంగనాథుని, వేములవాడ భీమకవిని స్తుతించినాడు.

## పోతన బహుగ్రంథావలోకనం

పోతన చేసిన కవిస్తుతులను బట్టి వాల్మీకి రామాయణాన్ని, వ్యాసుని భారతపురాణాలను, కాళిదాసుని రఘువంశ - కుమారసంభవ - మేఘసందేశ కావ్యాలను, శాకుంతల - విక్రమోర్వశీయ - మాళవికాగ్నిమిత్ర నాటకాలను, భారవి కిరాతార్జునీయాన్ని, మాఘుని శిశుపాలవధన్ని, బాణుని కాదంబరీ - హర్షచరిత - చండీశతకాలను, మయూరుని సూర్యశతకాన్ని, భోజుని చంపూ రామాయణ సరస్వతీ కంఠాభరణాది కృతుల్ని, వేములవాడ భీమకవి కృతుల్ని, కవిత్రయ భారతాన్ని, రంగనాథ రామాయణాన్ని చదివినాడనటం స్పష్టం. పోతన భాగవతంలో చాణక్య నీతిదర్పణాన్ని, భర్తృహరి సుభాషితాలను, లీలాశుకుని కృష్ణకర్ణామృతాన్ని, పాలకుఱికి సోమన కృతుల్ని, భాస్కర రామాయణాన్ని, ఎఱ్ఱన గారి నృసింహపురాణ - హరివంశాలను, నాచన సోమన ఉత్తరహరివంశాలను అనుకరించినాడు.

ఇవిగాక, పతంజలి మహాభాష్యాన్ని, ధర్మకీర్తి రూపావతారాన్ని, వామన, జయాదిత్యుల కాశికావృత్తిని, మహేశ్వరుని విశ్వప్రకాశనిఘంటువునూ, వృత్తశాస్త్రాన్నీ, గణితశాస్త్రాన్నీ, అర్థశాస్త్రాన్నీ, రతిరహస్యాన్నీ, గ్రహశాస్త్రాన్నీ పాంచరాత్రాన్నీ, దానకాండ - కామధేను - కల్పలతాది ధర్మశాస్త్రాలనూ వేదాన్ని తాను పఠించినట్లుగా పోతనగారే భంగ్యంతరంగా చెప్పికొన్నాడు.

## కథలు - గాథలు

1. పోతన - శ్రీనాథులు బావ - మఱదులు. పోతన బీదవాడు. వ్యవసాయం చేస్తూ కాలం గడిపేవాడు. శ్రీనాథుడు రాజాస్థానాలలో ఉన్నవాడు. కనుక రాజులకు, మంత్రులకు కృతుల్ని అంకిత మిస్తూ మహాభోగాలను

అనుభవించేవాడు. ఒకనాడు శ్రీనాథుడు బావగారిని చూడడానికై పల్లకి ఎక్కి సపరివారంగా వస్తున్నాడు. ఆ సమయంలో పోతన కుమారుడు మల్లన పొలం దున్నుతున్నాడు. శ్రీనాథుడు తన గొప్పతనాన్ని వెల్లడించడానికై పల్లకి మోసేవారిని, ముందు భాగంలోని దండె విడిచిపెట్టండని ఆజ్ఞాపించాడు. బోయీలు లేకనే పల్లకినడువసాగింది. ఈ అద్భుతాన్ని మల్లన పోతనకు చెప్పాడు. పోతన దుక్కిదున్నే ఎద్దులలో ఒక యెద్దును విడిచి పెట్టమన్నాడు. ఎద్దులేకనే నాగలి సాగడం మొదలు పెట్టింది. శ్రీనాథుడు వెనుక వైపు మోసే బోయవారిని కూడ దండె విడిచి పెట్టండని ఆజ్ఞాపించాడు. వాహకులు లేకుండానే పల్లకి నడువసాగింది. పోతన రెండవవైపు కాడికి కట్టిన ఎద్దును కూడ విడిపించాడు. ఎద్దులేకనే నాగలి భూమిని దున్నసాగింది. అంతలో శ్రీనాథుడు పల్లకి దిగి బావగారి దగ్గరకు వచ్చి “హాలికులు కుశలమా?” అని వేళాకోళం చేశాడు, దానికి సమాధానంగా పోతన-

**ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకవ్యకన్యకన్**
**గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్**
**హాలికులైన నేమి? గహనాంతర సీమలఁగందమూలకౌ**
**ద్దాలికులైన నేమి? నిజదారసుతోదర పోషణార్థమై।** అనే పద్యంలో చెప్పాడు

## ఒక సందేహం - సమాధానం

1. ‘బాలరసాల’ అనే పద్యం కొంచెం పాఠభేదంతో మంచన (క్రీ.శ. 1300) రచించిన కేయూరబాహు చరిత్రలో (1-13) ఉంది. కాని, ఎంతో అసందర్భంగా ఉంది. కేయూరబాహు చరిత్రానికి వ్రాతప్రతి ఒక్కటే లభించింది. కాబట్టి, “బాలరసాల” పద్యం మంచన రచించిందో లేక ప్రక్షిప్తమో నిర్ధారణగా చెప్పలేము. ఇది మంచన రచించిందే అన్న అభినివేశం ఉంటే మంచన పద్యాన్నే ప్రాస్తావికంగా చిన్న మార్పులతో పోతన పఠించాడని సరిపెట్టుకోవచ్చు. అయితే ‘బాలరసాలసాల” అనే పదబంధం పోతనగారి కెంతో ఇష్టమైంది. భాగవతంలోని కొన్ని ప్రయోగాలు పరిశీలిస్తే ఆవిషయం స్పష్టమౌతుంది. ‘వనాంతరాళరసాల సాలశాఖాంకుర” (భాగ. 1-255), “సాలరసాలమాధవీ” (2-42) మందార రసాలసాల (3-160) బాలరసాలసాల (3-760), హింతాల రసాలసాల (8-24) వటహింతాలరసాలసాల (8-42) బాల రసాల సాలంబులను (10-2-765) బాలరసాలసాల (10-2-1322) బాలరసాల జాల (10-2-1322) అని భాగవతంలో పుంఖానుపుంఖాలుగా ప్రయోగించి ఉన్నాడు. పోతనగారు పూర్వకవుల్ని ఎక్కువగా అనుకరించే స్వభావం లేనివారు. అందువల్లనే, శ్రీకాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు (ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక - 1939) శ్రీ చెళ్ల పిళ్ల వేంకట శాస్త్రిగారు (కథలు-గాథలు, భాగం - 3, (1-14) శ్రీజంధ్యాల పాపయ్య శాస్త్రిగారు (కల్యాణ కల్పవల్లి, పుట 86) మొదలైన వారు ‘బాలరసాలసాల’ అనే పద్యం పోతన చెప్పిందే అని భావించారు. పోతన చాటువుగా లోకంలో బహుశ ప్రచారంలో ఉండడం ప్రసిద్ధం!

2. పోతన శ్రీరామాంకితంగా భాగవతం రచించాడు. శ్రీనాథుడు సపరివారంగా పోతన ఇంటికి వచ్చాడు. వారందరికి భోజనం పెట్టడానికి పోతన ఇంటిలో పదార్థాలు లేవు. పోతన వంటయింటి లోనికి వెళ్లి శ్రీ సరస్వతీమాతను

ప్రార్థించాడు. దేవి ప్రత్యక్షమై 'నేనెంతమందికైనా భోజనం పెడుతాను. నీవు చింతపడ వద్దు' అని పోతనకు అభయమిచ్చి వంట ప్రారంభించింది. ఈ సంగతి ఎవ్వరికీ తెలియదు. పోతన – శ్రీనాథులు వీధి సావడిలో కూర్చుని సాహిత్యవిషయాలు ముచ్చటించుకోసాగారు. అప్పుడు శ్రీనాథుడు పోతనతో–

**క. కమ్మని గ్రంథంబొక్కటి – యిమ్ముగ నేనృపతికైనఁగృతి యిచ్చినచోఁ**
**గొమ్మని యియ్యరె వెయ్యా – ర్లిమ్మహిదున్నంగనేల? యిట్టి మహాత్ముల్**

అని సాభిప్రాయంగా చెప్పాడు. ఆ మాటలు విన్న సరస్వతి వంటయింటిలో విలపించింది. ఆమె శోకధ్వని పోతన చెవిలో పడింది. చాటుపద్య మణిమంజరి, సం. 1 పుట. 167 టి.టి.డి. ముద్రణ – 2013. వెంటనే పోతన వంటింటిలోనికి వెళ్లి ఆ చదువులతల్లి కాళ్లపైబడి –

**ఉ. కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో**
**కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో**
**హాటక గర్భురాణి! నినునాఁ కటికిం గొని పోయి యల్ల క**
**ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!**

అని ప్రతిజ్ఞ చేసి తల్లిని ఒదార్చాడు. ఆ వాగ్దానాన్ని విన్న శారద సంతోషించి, వంట పూర్తిచేసి అదృశ్యురాలైంది.

3. ఒకనాడు శ్రీనాథుడు పోతన ఇంటికి వచ్చాడు. పోతన కొడుకు మల్లన ఇంటిలో ఉన్నాడు. 'పోతన ఎక్కడ?' అని శ్రీనాథుడు ప్రశ్నించాడు. 'నాన్నగారు, గ్రామాంతరం వెళ్లారు. మధ్యాహ్నానికి వస్తారని' మల్లన బదులు చెప్పాడు. శ్రీనాథుడు సావడిలో కూర్చొని తాను రచిస్తున్న శృంగారనైషధాన్ని పరిశీలింప సాగాడు. అప్పుడు మల్లన శ్రీనాథునితో, "ఈ గ్రంథాన్ని మానాన్నగారెప్పుడో తెనిగించారని చెప్పాడు. శ్రీనాథుడాశ్చర్యపడి, పోతన దమయంతి విరహగ్లానిని ఎలా వర్ణించాడో చదువమన్నాడు వెంటనే మల్లన –

**తే.గీ. కాంతకలఁదిన చందన కర్దమంబు**
**ఉగ్రవిరహాగ్నిఁదుకతుక నుడికి చెదరి**
**చెంతనున్నట్టి దమయంతి చెలియకత్తె**
**మెఱుఁగు బాలిండ్ల పైఁబడి మిట్టి పడియె ।**

అనే పద్యాన్ని చదివాడు. ఇంతలో పోతన ఇంటిలోకి రాగా, శ్రీనాథుడు 'నీవు నైషధాన్ని తెనిగించావా? నాకెప్పుడూ చెప్పలేదేమి? అని ప్రశ్నించాడు. అంతలో జరిగిన సంగతి అంతా తెలిసి కొన్న పోతన, "బావా! నిన్నాటపట్టించడానికే మా మల్లన అలా చెప్పాడు. ఇట్టి రసభంగ కవిత్వాన్ని నేను చెబుతానా? నేను నైషధం వంటి శృంగార కావ్యాన్ని తెనిగింపను అని బదులు చెప్పాడు. శ్రీనాథుడు స్తిమితపడి తన గ్రామానికి పోయాడు. (చూ॥ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి చాటుపద్యరత్నాకరము, పుట – 54, 57)

4. పోతన, తృతీయ స్కంధంలో వరాహావతార ఘట్టాన్ని దీక్షగా రచిస్తున్న సందర్భంలో, సింగ భూపాలుడు, భాగవతాన్ని పోతన తనకు అంకిత మివ్వడం లేదనే కోపంతో బలాత్కారంగా ఆయనను కట్టి తీసుకొనిరండని భటుల్ని పంపాడు. సింగమనీని సైన్యం పోతన ఇంటిని ముట్టడించింది. వెంటనే మహావిష్ణువు శ్వేతవరాహరూపంలో వచ్చి భటుల్ని పారద్రోలి పోతన ఇంటి చుట్టూ తిరుగుతూ కాపలా కాయసాగాడు.

5. పోతన అష్టమస్కంధంలో గజేంద్రమోక్షాన్ని దీక్షతో రచిస్తున్న సమయంలో –

**మ. అలవైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబుదా పల**

అనే పద్యాన్ని ప్రారంభించి తరువాత ఏమి వ్రాయాలో తోచకుండా పూలతోట లోనికి వెళ్లి ఆలోచించ సాగాడు. అంతలో శ్రీమహావిష్ణువు పోతన రూపంతో వచ్చి –

**..... మందార వనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలో**
**త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి**
**హ్వలనాగేంద్రము పాహి, పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై (8–95)**

అని పద్యాన్ని పూరించి వెళ్లాడు. ఆ తర్వాత పోతన వచ్చి ఆ పద్యం పూర్తిగా వ్రాయబడి ఉండడం చూచి, ఆశ్చర్యచకితుడై మరల మరల చదివి "ఇదంతా విష్ణుమాయ కాకమరేమిటని చేతులు జోడించాడు.

ఈ విషయాన్నే అహోబలపండితుడు గ్రంథస్థంచేసి ఉన్నాడు.

**శ్లో. కావ్యే బమ్మెరపోతరాజ సుకవే రాంధ్రేకృతీశః స్వయం**
**కించిత్తస్య సుదుష్కరం రచితవాన్ సర్వజ్ఞ చూడామణిః ।**
**లక్ష్మీశః స్వరహస్య మాదరబలాత్ పద్యేఽతిహృద్యే పదై**
**ర్యస్యాజ్ఞా బలతో వివేక చతురాలోకే భవేయు ర్జనాః ॥ – (కవిశిరో – 84)**

"శ్రియఃపతి ఆంధ్రకవియైన బమ్మెర పోతరాజు గ్రంథమైన భాగవతానికి కృతిపతియై స్వయంగా ఆ సుకవి మీది ఆదరంతో అతనికి అలవి కాని వర్ణన చేస్తున్న సమయంలో; అలవైకుంఠ పురంబులో.... అని ప్రారంభింపబడిన ఆ హృద్యమైన పద్యాన్ని తన రహస్యాన్ని వెల్లడించే పదాలతో పూరించాడు" అని చెలమచర్ల రంగాచార్యుల వివరణం. శ్రీమహా విష్ణువు స్వయంగా రచించిన పద్యంతో పునీతమైన గ్రంథరాజం పోతరాజ భాగవతం.

6. పోతన గజేంద్ర మోక్షణంలో గజేంద్రుని మొర విన్న శ్రీమహావిష్ణువు –

**మ. సిరికిం జెప్పడు శంఖచక్రయుగముఁ జేదోయి సంధింపఁడే**
**పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం**
**తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో**
**పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై॥ (8–96)**

వచ్చాడని వర్ణించాడు ఈ పద్యాన్ని విని శ్రీనాథుడు, విష్ణువు ఏ విధమైన ఆయుధాలు లేకుండవచ్చి ఏమి చేయగలడని హేళన చేశాడు? పోతన అప్పటికి మౌనం వహించాడు. మరుసటి రోజు శ్రీనాథుడు తలంటి పోసుకుంటూ ఉండగా, పోతన పెరటిలోని బావిలో ఒక బండరాయిని వేసి, "బావా! నీ కొడుకు బావిలో పడ్డాడని గట్టిగా అరిచాడు. ఆ కేక విన్న శ్రీనాథుడు పరుగుపరుగున వచ్చి బావి చుట్టూ తిరుగుతూ ఏడ్వసాగాడు. అప్పుడు పోతన, "బావా! బావిలో పడిన బాలుణ్ణి బయటికి తీయడానికి నీవు నిచ్చెనో, చాంతాడో వంటి పరికరాలు వెంటనే తీసుకొని రాకుండా ఎందుకు వచ్చినట్లు?" అని పరిహసించాడు. అంతలో మల్లన వచ్చి పకపక నవ్వుతూ – "మీ అబ్బాయి బావిలో పడలేదు. పడింది బండరాయి. కన్న కొడుకును రక్షించడానికి నీ వెంత ఆదుర్దాగా వచ్చావో, తన భక్తుని మొర విన్న శ్రీమహావిష్ణువు అతణ్ణి రక్షించడానికి అంతే ఆదుర్దాగా ఎవరికీ చెప్పా పెట్టకుండా, ఏ ఆయుధాలు లేకుండా, హుటాహుటిగా వచ్చాడని చెప్పాడు. అప్పుడు శ్రీనాథుడు సిగ్గుపడి, పోతనను కౌగిలించుకొని నీ హృదయ మిప్పుడు నా కర్థమైందని మెచ్చుకొన్నాడు.

7. పోతన రుక్మిణీ కల్యాణాన్ని రచిస్తూ –

**ఆ.వె. హరికిఁ బ్రేమబంధ మధికరంబుగాఁగేశ**
**బంధ మధిక మగుచు బాలకమరె!**

(బాలకు+అమరె; బాల+కమరె) పై పద్యాన్ని వ్రాస్తూండగా పోతన కూతురు కాళ్లు తడబడి కుంపటిపై పడింది. ఒళ్లు బొబ్బలెక్కాయి. వెంటనే పోతన–

**పద్మనయను వలనఁబ్రమదంబు నిండార**
**నెలఁత యౌవనంబు నిండియుండె (10- 1- 1690)**

అని పద్యాన్ని పూరింపగానే ఆయన కుమార్తె ఒంటి బొబ్బలు పోయి స్వస్థురాలైంది.

8.ఉ. **బమ్మెర పోతరాజ కృత భాగవతంబు సలక్షణంబుగా**
**కిమ్మహి నేమిటం గొదువ యెంతయు నారసిచూడఁగాను రే**
**ఫమ్ములు ఱాలునుం గలసి ప్రాసములైన కతంబునం గదా**
**యిమ్ముగనాది లాక్షణికు లెల్లరు మాని రుదాహరింపఁగన్ – అప్పకవీయం 2-234**

అని అప్పకవి చెప్పిన పద్యాన్ని ఒక పండితుడు చదివాడట!

వెంటనే మరొక పండితుడు ఆగ్రహోదగ్రుడై –

ఉ. **బమ్మెర పోతరాజ కృత భాగవతమ్ము జగద్ధితమ్ముగా**
**కిమ్మహి నేమిటం గొదువ యెల్లపుడున్ భవనాశహేతు భూ**

**తమ్మయి లోకనాయక కథా వినివేశిత సర్వసాధుచి**
**త్తమ్మయి గోస్తనీరసయుతమ్మయి యున్కినొ! పాపి విన్కినో!!**

అని బదులు చెప్పాడట! (దీపాలవారిచాటు పద్యరత్నాకరం, పుట - 9)

9. సద్గురు శ్రీమలయాళస్వామి వారొక సభకు వస్తామని వాగ్దానం చేశారు. ఆ సభనాటికి వారు జబ్బు పడి ఎంతో అస్వస్థులై కదలలేని పరిస్థితిలో ఉండినారు - అయినప్పటికీ ఆ సభకు వెళ్ల డానికి పూనుకున్నారు. అప్పుడు వారి శిష్యులు -

**ఆ.వె. వారిజాక్షులందు వైవాహికములందు**
**బ్రాణవిత్తమానభంగమందుఁ**
**జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు**
**బొంకవచ్చు నఘము వొందఁడధిప! (8-585)**

అని పోతన భాగవతంలో ఉంది. మీరు సభకు వెళ్లక పోతే అసత్యదోషమేమీరాదు. కనుక వెళ్ల వద్దని నివారించినారట! అప్పుడు స్వామివారు. "అది శుక్రనీతి! నా నీతి అదికాదు. దానికి కూడ పోతన భాగవతమే సమాధానం! వినండి! అని-

**మ. నిరయంబైన, నిబద్ధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు**
**ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము, కానిమ్ముపో;**
**హరుఁడైనన్, హరియైన, నీరజభవుం డభ్యాగతండైననౌఁ;**
**దిరుగన్ నేరదు నాదు జిహ్వ, వినుమా! ధీవర్య! వేయేటికిన్? - భాగవతం 8-593**

పై పద్యాన్ని ఉదహరించినారట! అంత జబ్బులోను ఆ సభకు వెళ్లి ప్రసంగించి వచ్చారని! (ఈ విషయాన్ని మహామహో పాధ్యాయ శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారు చెప్పారు)

**10. సి.పి. బ్రౌన్‌దొరగారి భాగవత పరిచయం**

సి.సి. బ్రౌన్‌గారి భాగవతపరిచయాన్ని గురించి మనకు తొలిసారిగా తెల్పినవారు బ్రహ్మ శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు. (1888-1950). ఆయన సంకలనం చేసిన చాటు పద్యమణి మంజరి (రెండవ భాగం)లో పుటలు 181-183 లలో ఈ విషయాన్ని వ్రాశారు. (చూ॥ టి.టి.డి వారి ముద్రణ, 2013, (పుటలు 181-183))

తెలుగు భాషావాఙ్మయోద్ధారకుడు, తెలుగు సాహిత్యాభిమాని ఐన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌దొర (1798-1884)కు ఎందరెందరో దేశీయ కవిపండితులు వినతిపత్రం, లేఖలు, విన్నపాలు వ్రాసి పంపుకొనే వారు. అటువంటి విన్నపాలలో ఒకానొక పండితుడు తన బతుకుతెరువు కోసం ఆరాట పడుతూ బ్రౌన్‌కు ఒక వినతిపత్రం పంపుకున్నాడు. ఆపద్యం గజేంద్రమోక్షణ ఘట్టంలో గజేంద్రుడు విష్ణువుకు చేసుకొన్న మొర కావడం విశేషం.

**శా. లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్**
**నీవే తప్ప నితఃపరంబెఱుఁగ, మన్నింపందగున్ దీనునిన్**
**రావే యీశ్వర! కావవే వరద, సంరక్షింపు భద్రాత్మకా! - భాగవతం (8-90)**

తన బ్రతుకు జీవన్మరణసమస్యగా పరిణమించిందని వెంటనే ఆదుకోకపోతే తానిక జీవించలేనని ఒక ఆర్తుడైన పండితుడు జీవిక కోసం అర్థించడం ఆ విన్నపంలోని ప్రధానాంశం. దాన్ని గజేంద్రుని మొరగా సంభావించాడు.

పోతన భాగవతంలో పై పద్యానికి బ్రౌన్‌దొర సరైన సమాధానం భాగవతంలోనే ఎన్నుకొనడం ఆయన సమయస్ఫూర్తికి చక్కని తార్కాణం. పరీక్షిన్మహారాజు మరణ భీతితో శుకమహర్షిని శరణు జొచ్చి దుఃఖించగా, దానికి మహర్షి ఇచ్చిన సమాధానాన్నే తనకు విన్నపం వ్రాసిన వ్యక్తికి పంపడం సందర్భోచితంగా ఉంది.

**"ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్"**
**మానుము, సంభవంబు గల మానవకోట్లకుఁజావు నిత్యమౌఁ**
**గాన హరిం దలంపు; మికఁగల్గదు జన్మము నీకు ధాత్రిపై**
**మానవనాథ! పొందెదవు మాధవలోకనివాససౌఖ్యముల్ - పోతన భాగవతం (స్క.12 - ప.25)**

ఎనిమిదో స్కంధంలోని పద్యానికి పన్నెండో స్కంధంలోని పద్యం సమాధానంగా ఎన్నుకోవడంలోనే బ్రౌన్‌దొరగారి భాగవతపరిచయం తెలుస్తోంది.

ఇటువంటి కథలు ఇంకా ఉండవచ్చు ఈ కథలు- గాథలన్నీ వాస్తవంగా జరిగాయని సాంప్రదాయికుల విశ్వాసం. ఇవి వట్టి కట్టు కథలని, పుక్కిటి పురాణాలని ఆధునిక విమర్శకులు తోసి వేస్తున్నారు. ఎవరి విశ్వాసాలు వారివి. ఈ కథలు - ఐతిహ్యాలు నిజమైనా, అబద్ధమైనా వీటి వల్ల ఒక మహాప్రయోజనం సిద్ధిస్తూ ఉంది. అదేమంటే, పోతన భాగవతం రచించిన కాలం నుండీ ఆ గ్రంథం లోని పద్యాలు ప్రజల నాల్కలపై నాట్యమాడేవని, ఆ పద్యాలకున్న ప్రాచుర్యం ప్రసిద్ధి ఇంతింతని చెప్పడానికి వీలులేనిదని, భాగవతప్రాభవం జనుల దైనందిన జీవితాలపై ప్రభావాన్ని చూపిందనడానికి ఈ కథలే ప్రబలమైన తార్కాణాలు. మరో విధంగా ఆలోచిస్తే, ప్రాచీనకవుల జీవితాలతో ముడిబడిన ఈ కథలు కూడ వాఙ్మయంలో ఒక భాగమే! అవి ప్రజల జీవితంతో పెనవేసుకొని పోయా యన్నది ప్రత్యక్షరసత్యం!

ఒక మహాకవిని గురించి వివరించేటప్పుడూ ఆ కవికి సంబంధించి లోకంలో వ్యాపించిన ఐతిహ్యాలు, కథలు, గాథలు కూడా సంస్మరించడం పీఠికాకర్తల కనీస ధర్మం. ఇవి సత్యాలో కావో అన్న సంగతి పాఠకుల విజ్ఞతకే వదలి పెడుతున్నాను.

## భాగవత ప్రశస్తి - ప్రాభవం

మన తెలుగు దేశంలో భాగవతాని కున్నంత ప్రచురప్రచారం మరే ఇతర గ్రంథానికి లేదు. నన్నయగారి రచనలో ప్రసాదగుణం, శ్రీనాథుని కవితలో ప్రౌఢి ఎక్కువగా ఉన్నట్లే, పోతన పద్యాలలో మాధుర్య మెక్కువగా ఉంది. అసలు భాగవత మంతా మందార మకరందమే. అర్థగాంభీర్యంతోపాటు శబ్దాలంకారాలతో నిండి శ్రవణపేయంగా ఉన్న భాగవతశైలి పాఠకుల్ని ఎక్కువగా ఆకర్షిస్తుంది.

భీష్మస్తుతి, కుంతీస్తుతి మొదలైన స్తోత్రాలు భక్తులు తెల్లవారుజామున పారాయణం చేస్తారు.

తే. **చేతులారంగ శివుని పూజింపడేని (1-14)**

శా. **శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా! (1-200)**

ఉ. **ఎవ్వని చేజనించు జగమెవ్వని లోపల నుండు లీనమై (8-73)**

క. **నీపాదకమల సేవయు**

శా. **నీ పద్యావళు లాలకించు చెవులున్, నిన్నాడు వాక్యంబులున్**

మొదలైన పద్యాలు చదువుతూ గృహిణులు పెరుగు చిలుకుతారు పిల్లలకు చెప్పి వల్లెవేయిస్తారు.

1. శత్రుపీడ గలవారు **'నారాయణ కవచం'** పారాయణం చేస్తారు.
2. ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షణం వామనచరిత్ర చాలమందికి కంఠస్థాలు
3. పెండ్లి కాని కన్యలకు శీఘ్రంగా వివాహం కావడానికి రుక్మిణీ కల్యాణాన్ని చదివిస్తారు.
4. శ్రీకృష్ణాష్టమినాడు శ్రీకృష్ణ జననాన్ని పురాణంగా చెబుతారు.
5. వినాయకుని చవితి నాడు శ్యమంతకోపాఖ్యానం చదివి కథాక్షతల్ని నెత్తిపై చల్లుకుంటారు.
6. క్షీరాబ్ధిద్వాదశినాడు అంబరీషోపాఖ్యానం పఠించడం పరిపాటి

## అనంతర కవులపై భాగవత ప్రభావం

అనంతర కవులందరిపై భాగవతప్రభావం ఎక్కువగా ఉంది. నిరోష్ఠ్య కావ్యాలు వ్రాసిన మరింగంటి కవులు మొదలైన వారికి, శ్లేషనియమాలు పెట్టుకొన్న రామరాజ భూషణాదులకు, 'శ్రీనాథ' శబ్దం అమరినట్లుగా 'పోతన శబ్దం కుదురలేదు. ఎఱ్ఱనగారి సంగతి కూడా ఈ విధంగానే ఉంది. ముఖ్యంగా భక్తి శతకాలు రచించిన అయ్యలరాజు తిప్పయ్య, కాసుల పురుషోత్తమకవి, భద్రాచల రామదాసు (కంచెర్ల గోపన్న) మొదలైన భక్తకవులు, పురాణకవులు, వేదాంతకవులు, భాగవతాన్ని ఎక్కువగా అనుసరించారు, అనుకరించారు.

సద్గురు శ్రీ త్యాగరాజ స్వామివారు పోతన భాగవతాన్ని స్వహస్తంతో వ్రాసికొని తన శ్రీరామపూజాగృహంలో పెట్టి పూజించి నిత్యపారాయణం చేసేవారు. ఈ స్వహస్తలిఖితప్రతి ఈ నాడు మద్రాసు (చెన్నై)లోని సౌరాష్ట్ర

గానసభవారి గ్రంథాలయంలో భద్రంగా ఉంది. శ్రీ పరవస్తు చిన్నయ సూరిగారు నిఘంటు నిర్మాణం కోసం పోతన భాగవతం లోని సాధుపాఠాలను నిర్ణయించి ఉన్నారు. సి.పి. బ్రౌన్ మహాశయుడు పోతన భాగవతానికి శుద్ధప్రతిని 1827లో సిద్ధం చేయడమేకాదు క్రీ. శ. 1848 లో దానిని ముద్రించినారు. (ఈ విషయం ఆయన మాటల్లోనే 'భాగవత ముద్రణ'ల క్రింద తెలుపబడుతుంది).

గాంధీ మహాత్ముడు ఆంధ్ర దేశంలో పర్యటించినప్పుడు -

**ఉ. లోకము లన్నియున్ గడియలోన జయించిన వాఁడ వింద్రియా**
**నీకము ఁజిత్తమున్ గెలువనేరవు, నిన్ను నిబద్ధుఁజేయు నీ**
**భీకర శత్రులార్వురఁబ్రభిన్నులఁజేసినఁ బ్రాణికోటిలో**
**నీకు విరోధి లేఁడొకఁడు, నేర్పునఁజూడుము దానవేశ్వరా! (భాగవతం, 2-267)**

అనే పద్యాన్ని నేర్చుకొని, కంఠస్థంచేసి సభలలో ప్రసంగించే వారట!

**సీ. కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి**
**గగనభాగంబెల్లఁగప్పికొనఁగ (1-222)**

మొదలైన పద్యాలు చలనచిత్రాల కెక్కి నిరక్షరాస్యులకుసైతం వీనులవిందు చేస్తున్నవి. 'భక్త ప్రహ్లాద' చలన చిత్రమొక అద్భుతకళాఖండం. భక్త పోతన చిత్రంలో చిత్తూరు నాగయ్యగారు పోతన పాత్రకు ప్రాణప్రతిష్ఠ చేశారు. 'అభినవపోతన' బిరుదాంకితులైన శ్రీవానమామలై వరదాచార్యులవారు పవిత్రమైన పోతన చరిత్రకు 12 ఆశ్వాసాలతో 3471 పద్యగద్యాలతో ఒక పురాణ ప్రబంధంగా తీర్చిదిద్దారు.

భాగవతం ఒక్క తెలుగురాష్ట్రంలోనే గాక ఇరుగు పొరుగు భాషలైన తమిళ - కర్ణాటక - మహారాష్ట్ర దేశాలలో గూడ వ్యాప్తిపొందింది. కాంచీమండల వాస్తవ్యుడైన వేంకటాధ్వరి మహాకవి సంస్కృత విశ్వ గుణాదర్శంలో పోతన గారి పద్యాలను అనుసరించాడు. మహారాష్ట్రుల మహాభక్త విజయంలో పోతనగారి చరిత్ర ఉంది. సమర్థ రామదాసు గారి 'దాసబోధలో కూడ పోతన ప్రశంస ఉంది.

## జాతీయాలు - నుడికారాలు

సామాన్య కవులు లోకంలోని జాతీయాలను తమ కావ్యాలలో వాడుకొంటారు. మహాకవుల వాక్యాలు లోకంలో జాతీయాలుగా నిలిచి పోతాయి. 'కామాంధోఽపి న పశ్యతి' (3-382) వంటి సంస్కృత జాతీయాలు 'నీ కడు పెప్పుడున్ జల్లగా వలె" (10-1-103) మొదలైన తెలుగు జాతీయాలు భాగవతంలో కోకొల్లలుగా ఉన్నాయి. పోతన గ్రహించిన జాతీయాల కంటె సృష్టించిన జాతీయాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి.

వినం గౌతూహలంబయ్యెడిన్ (7-20) (8-437) (10-1-1682)

ఎట్లో గదే యీశ్వరా! (8-72)

వారిజాక్షులందు వైవాహికములందు (8-585)

పుట్టి నేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో (8-618)

ఇంతింతై వటుఁడింతయై (8-622)

ఎక్కడనుండి రాక (9-792)

నాఁటి కొక్కదైవము లేదేఁ (10-1-29)

ఊరక రారు మహాత్ములు (10-1-284)

కలయోవైష్ణవ మాయయో (10-1-342)

కలడు కలండనెడు వాడు కలడోలేడో (8-86)

'తట్టుముట్టాడు నట్టి పేదరికము' (10-2-962)

'నాభాగ్య మెట్లున్నదో?' (10-1-1727)

మొదలైన భాగవత వాక్యాలు నేటికీ సామెతలుగా పలుకుబళ్లుగా వాడబడుతున్నాయి. కవి సమ్రాట్ విశ్వనాథ మహాకవి చెప్పినట్లు **"పోతన్న తెలుగుల పుణ్యపేటి"** : ఆయన కవిత్వం - **"అచ్చముగా కలకండ లచ్చులన్ పోతలు పోసినవి"** అని చక్కగా భావించినారు. ఇటువంటి పరమపుణ్యగ్రంథమైన శ్రీభాగవతము ఇంచుమించుగా 20 సంస్థలు సుమారుగా 50 సార్లు ప్రచురించాయి.

## సి.పి. బ్రౌన్ దొర నిర్మించిన తొట్టతొలి పరిష్కృతప్రతి (1827)

## (ముద్రణ 1848)

పోతన భాగవతానికి తొట్టతొలిసారిగా పరిష్కృత ప్రతిని సిద్ధం చేసినవారు ఆంధ్ర భాషా వాఙ్మయోద్ధారకుడైన సి.పి.బ్రౌన్ దొరగారు. క్రీ.శ. 1827 లో శుద్ధ ప్రతిని పండితులచే తయారు చేయించి, క్రీ.శ. 1848 లో మద్రాసు నగరం నుండి ముద్రింపచేశారు. ఈ సంగతిని వారే తమ తెలుగు ఇంగ్లీష్ బ్రౌణ్యనిఘంటువు 'పీఠిక' లో తెలియజేశారు.

"The Telugu version of the Bhagavat was written by Poturaju and is in the biggest esteem with all the Telugus. It enjoys the highest popularity, as a masterpiece of beautiful and faultless Telugu Verse. The Rukmini Kalyan, the Gajendra Moksham and other episodes selected from it are excessively popular. A corrected edition was prepared at my expense in the year 1827. The Telugu Bhagavat was printed in quarto at Madras in the year Kilaca, 1770, i.e., 1848 AP." - A Dictionary of 'Telugu and English' Introduction - C.P. Brown.

ఇది ఒక పాశ్చాత్యుడైన తెలుగు భాషాభిమాని పూనుకొని చేసిన నిస్స్వార్థ సాహితీసేవకు నిదర్శనం

## భాగవత ముద్రణలు

1. శ్రీ వేదం వేంకటాచల శాస్త్రి (1840) 2. పురాణంహయగ్రీవ శాస్త్రి (1848, 1855, 1858) 3. కరాలపాటిరంగయ్య (1865) 4. పాలపర్తి నాగేశ్వర రావు-సటీక (1884, 1992) 5. నేలటూరి వేంకటసుబ్బా శాస్త్రి (1889) 6. మృగీస్థలం అన్నమాచార్యులు (1889) 7. పనప్పాకం అనంతాచార్యులు (1894) 8. తంజనగరం తేవప్పెరుమాళ్లయ్య (ఆనందప్రెస్ - 1905, 1911, 1939) 9. శ్రీ విష్ణుపాద సుబ్బరాయశాస్త్రి (అమెరికన్ డైమండ్ ప్రెస్ - 1911, 1925) 10. రాయదుర్గం నరసయ్య శాస్త్రి (వావిళ్ల - 1915, 1922) 11. శేషాద్రిరమణ కవులు (వావిళ్ల - 1926, 1948, 1961, 1968) 12. శేషాద్రిరమణ కవులు (వాణీనివేదనము, విజయవాడ- 1939) 13. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ (రాయల్ అండ్ కో, మద్రాసు, కడప - 1954) 14. తెనాలివారి ప్రతి (చిన్నసైజులో - 1960) 15. కల్లూరు వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు (వెంకటరామా అండ్ కో - 1961) 16. బులుసు వేంకటరమణయ్య (రవీంద్ర పబ్లిషింగ్ హౌస్ - 1962) 17. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్ - 1964 (8 ముద్రణాలు)) 18. జంధ్యాల పాపయ్య శాస్త్రి(సంపా), తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి - 17 సంపుటాలు (తాత్పర్యంలో 1982 - 1992) 5 సంపుటాలలో 6 ముద్రణలు 1987, 1998, 2004, 2005, 2008, 2010 (తాత్పర్యంతో) 19. రోహిణీ పబ్లికేషన్స్, రాజమండ్రి - వావిళ్ల ప్రతికి యథాతథం - 4 ముద్రణలు 2004, 2007, 2009, 2014) 20. శ్రీరామకృష్ణ మిషన్, హైదరాబాద్, మద్రాసు (టి.టి.డి 5 సంపుటాల సంయుక్తముద్రణ - 1998) 21. శ్రీరామకృష్ణమిషన్ ప్రచురణ (స్వీయరచిత తాత్పర్యంతో - హైదరాబాద్, 2016) 22. తిప్పాభట్ల రామకృష్ణమూర్తి (తాత్పర్యసహితం - గీతాప్రెస్, గోరఖ్‌పూర్ 2016).

ఇవే గాక మరికొన్ని ముద్రణలు ఉండవచ్చు. ఇప్పుడు శ్రీపద్మావతీవేంకటేశ్వర కరుణా కటాక్ష వీక్షణాలతో, తిరుమల తిరుపతి దేవస్థానాల వజ్రసంకల్పంతో, ప్రతిపదార్థ, తాత్పర్యాలతో సవ్యాఖ్యానంగా పోతన భాగవతం ప్రకటింపబడుతున్నది. తి.తి.దే. ప్రతి ప్రాయికంగా ఆం.ప్ర.సా. అకాడెమీ (హైద్రాబాద్) ప్రతినే అనుసరించింది. యతిభంగాలు, ప్రాసభ్రంశాలు, అపపాఠాలు. ఉండే చోట పూర్వముద్రిత ప్రతులలోని మేలైన పాఠాలు గ్రహింపబడ్డాయి. చాలా చోట్ల సంస్కృత భాగవతంతో, శ్రీధరీయాదివ్యాఖ్యలతో సరిచూచి సాధుపాఠాలను నిర్ణయించింది.

ఈ పవిత్ర భాగవత గ్రంథాన్ని తెలుగు వారందరూ చదివి శ్రీ శ్రీనివాసకృపాపాత్రులై తరింతురుగాక!

విజయవాడ
20-12-2016

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుడు
**'సహజపాండిత్య' గరిమెళ్ల సోమయాజులు శర్మ**

# ప్రథమస్కంధ ప్రాశస్త్యం

**శ్లో. శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర**
**క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో**
**ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలసదృగ్జాలసంభూత నా**
**నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్.**

ఇది రమణీయమైన మంగళాచరణం. దీనిలో ధ్యానపూర్వకనమస్కారం ఉంది. శ్రీకృష్ణకథాత్మమైన వస్తు నిర్దేశం ఉంది. పోతన కెక్కువ ప్రియమైన అంత్యానుప్రాసనియమం ఉంది. అలంకారధ్వని, వస్తుధ్వని చాలా కావ్యాలలో ఉంటుంది. రసధ్వని మహాకవుల కావ్యాలలోనే ఉంటుంది. పోతన పద్యాలలో శాస్త్రధ్వనులెక్కువగా ఉంటాయి. ఆయన కోరుకొన్నది కైవల్యం. భాగవతంలో ఈ శబ్దాన్ని పుంఖానుపుంఖంగా ప్రయోగించాడు.

'లోకరక్షైకారంభకు' అనే చోట 'యేన జాతాని జీవంతి' అనే తైత్తిరీయోపనిషత్ (3-1) వాక్యానుసారం "ఈ పుట్టిన చరాచరాలన్నీ ఏ బ్రహ్మంవల్ల జీవిస్తున్నాయో", "జన్మాద్యస్య యతః' అనే బ్రహ్మసూత్రం (1-1-2) చేత "ప్రపంచమంతా ఏ బ్రహ్మం వలన పుట్టి, వృద్ధి పొంది మరల దానియందే లయిస్తున్నదో, ఇట్టివాడు శ్రీకృష్ణపరబ్రహ్మమని ఉపనిషద్బ్రహ్మసూత్రాలు ధ్వనిస్తున్నాయి. "భక్తపాలనకళాసంరంభకున్" అనే సమాసంచే ద్రౌపది - ప్రహ్లాద - గజేంద్రాది కథలు ధ్వనిస్తున్నాయి. "దానవోద్రేకస్తంభకు" అనే మాటవలన హిరణ్యాక్ష - హిరణ్యకశిప - కంసాదులు ధ్వనిస్తున్నారు. 'కేళిలోల' అనే శబ్దంచేత, 'లోకవత్ లీలాకైవల్యమ్' (2-1-3) అనే బ్రహ్మసూత్రవాక్యం ధ్వనిస్తోంది. 'దృగ్జాల' శబ్దంచేత 'ఈక్షతే ర్నా శబ్దమ్ (1-1-5) అనే ఈక్షత్యధికరణం ధ్వనిస్తోంది. కుండ తయారు చేయవలెనంటే కుమ్మరి ఉండాలి. వస్త్రం తయారు చేయాలంటే, సాలెవాడు ఉండాలి. అట్లే, ఈ బ్రహ్మాండం పుట్టాలంటే ఒక కర్త ఉండాలి. అతడే ఈశ్వరుడు. "క్షిత్యాద్యంకురం సకర్తృకం కార్యత్వాద్ ఘటవత్" అని తార్కికులు భగవంతుణ్ణి అనుమాన ప్రమాణంచేత నిరూపిస్తున్నారు. ఈ విషయమంతా 'సంభూత నానాకంజాత భవాండకుంభకు" అనే సమాసంచే ధ్వనిస్తోంది. అట్టి 'మహానందాంగనాడింభకున్= యశోదా కుమారుడైన శ్రీకృష్ణుణ్ణి ధ్యానిస్తున్నాను అని అర్థం. మహా+ఆనంద+అంగనా+డింభకున్= ఆనందమనే అంగనకు పుట్టిన డింభకు డనడంచే "ఆనందమయోऽభ్యాసాత్"(1-1-12) అని బ్రహ్మసూత్రాలలోని ఆనందమయాధికరణం ధ్వనిస్తోంది. శ్రీకృష్ణుడు ఆనందబ్రహ్మమేకదా! 'ముహ్యంతి యత్సూరయః' అనే సంస్కృతమూలాన్ని చెప్పకుండానే పోతన ధ్వనింప జేసినాడు. 'ఆరంభకున్', 'సంరంభకున్', 'స్తంభకున్', 'కుంభకున్', 'డింభకున్' - ఇవి ద్వితీయాంతాలు. వీటిని షష్ఠ్యంతాలని కొందరు భ్రమిస్తారు. అదే అధ్యాస (అద్వైతంలో 'అధ్యాస' అనేదొక పరిభాష. ఒక వస్తువును చూచి మనమనుకొన్న వస్తువుగా భావన చేయడం 'అధ్యాస'. ఒక తాడు ముక్కను చూచి మసక చీకటిలో పాము అని భ్రమించడం అధ్యాస. 'మాయ'కే మరొక పేరు అధ్యాస.)

ఈ పద్యాన్ని 'లోకరక్షైకారంభకు' 'డింభకున్' అని మొదలుపెట్టి పూతనవధ ఘట్టంలో దశమస్కంధం పూర్వార్థంలో 'దుర్జనవధ ప్రారంభకున్ డింభకున్' (ప.216) అని మరల ప్రయోగించి తొలిపద్యంలో చెప్పిన వస్తు నిర్దేశాన్ని ధ్వనింపజేశాడు. దుష్టుల్ని శిక్షించి, శిష్టుల్ని రక్షించడమే శ్రీకృష్ణావతారప్రయోజనం.

## భాగవతం - అవతరణ నేపథ్యం

ఒక పున్నమినాడు చంద్రగ్రహణం పట్టింది. పోతన గంగలో స్నానంచేసి, ఇసుకతిన్నెపై కూర్చొని కండ్లు మూసికొని శ్రీపరమేశ్వరుణ్ణి ధ్యానం చేస్తున్నాడు. అప్పుడు శ్రీరాముడు ప్రత్యక్షమై భాగవతాన్ని తెనుగు చేసి తన కంకిత మివ్వమని ఆదేశించాడు. పోతన భాగవతరచనకు శ్రీకారం చుట్టాడు. ఇష్టదేవతల్ని ధ్యానించి, పూర్వకవులకు నమస్కరించి, వర్తమానకవులకు ప్రియమైనమాటలు చెప్పి, భావికవుల్ని ప్రశంసించి, సంస్కృతాంధ్రోభయకావ్యకరణదక్షుడై, నన్నయ, తిక్కనాదులు భాగవతాన్ని తెనిగింపకపోవడం తన భాగ్యమని భావించి, ఏకశిలా నగరానికి వచ్చి, గురు - వృద్ధ - బుధ - బంధుల అనుజ్ఞను పొంది తన వంశక్రమాన్ని చెప్పి, పునర్జన్మ లేకుండా ఉండాలని సంకల్పించి భాగవత ఆంధ్రీకరణాన్ని ప్రారంభించాడు.

ప్రథమస్కంధంలోని ప్రధానవిషయాలివి. భాగవతరచనాసందర్భం - వ్యాసనారదుల సమాగమం - నారదుని పూర్వజన్మవృత్తాంతం - అశ్వత్థామగర్వభంగం - శ్రీకృష్ణుడు ఉత్తరగర్భాన్ని రక్షించడం - కుంతీస్తుతి, భీష్మస్తుతి - శ్రీకృష్ణుడు ద్వారకకు రావడం - అభిమన్యుని భార్యయైన ఉత్తరకు పరీక్షిత్తు పుట్టడం - విదురుని తీర్థయాత్రలు - గాంధరీధృతరాష్ట్రులు శరీరపరిత్యాగం చేయడం - శ్రీకృష్ణనిర్యాణం - పరీక్షిత్తు పట్టాభిషేకం - పరీక్షిత్తు వేటకు వెళ్లడం - శమీకమహర్షిపై చచ్చిన పామును వేసి తిరిగి రావడం - శమీకుని కుమారుడైన శృంగి నేటి కేడవనాడు శివకేశవులు అడ్డువచ్చినా పరీక్షిత్తు తక్షకవిషాగ్నిచే చచ్చుగాక అని శపించడం - శుకమహర్షి పరీక్షిత్తువద్దకు రావడం - పరీక్షిత్తు శుకుణ్ణి ముక్తిమార్గాన్ని ఉపదేశించమని కోరడం కథాకథనంలో ప్రస్తావించబడ్డాయి.

## పోతన భాగవతం - అద్వైతవేదాంతదృష్ట్యా
## వ్రాయబడిన శ్రీధరుని వ్యాఖ్యననుసరించి వ్రాయబడింది

పోతన భాగవత ప్రారంభంలోనే శ్రీధరస్వామివ్యాఖ్యానాన్ని అనుసరిస్తూ అనువాదం మొదలుపెట్టాడు.

శ్లో. జన్మాద్యస్య యతోఽన్వయా దితరత శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్ (1-1)

జన్మాదితి - 'అస్య విశ్వస్య జన్మాది జన్మస్థితి భంగాః ।

యతః - పరమేశ్వరాద్భవంతి తం ధీమహేతి...

యద్వా - అన్వయశబ్దేనానువృత్తిః, ఇతర శబ్దేన వ్యావృత్తిః ।

అనువృత్తత్వాత్ సద్రూపం బ్రహ్మకారణమ్. మృత్సువర్ణాదివత్

వ్యావృత్తత్వా ద్విశ్వం కార్యం ఘటకుండలాదివత్యర్థః...

ధీమహేతి గాయత్ర్యా ప్రారంభేణ చ గాయత్ర్యాఖ్య పరబ్రహ్మ

విద్యారూప ఇమేతత్పురాణ ఇతి దర్శితమ్ ।

యథోక్తమ్ - మత్స్య పురాణే పురాణ దాన ప్రస్తావే ।

**శ్లో. యత్రాధికృత్యగాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః ।**
**వృత్రాసురవధోపేతం తద్భాగవత మిష్యతే ॥**

అని శ్రీధరీయ వ్యాఖ్య!

**సీ. విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని - వలన నేర్పడు ననువర్తనమున**
**వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రాజగుచుఁ జిత్తమునఁజేసి**

**వ. ఇట్లు 'సత్యం పరం ధీమహి' యను గాయత్రీప్రారంభమున గాయత్రీనామబ్రహ్మస్వరూపంబై మత్స్య పురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటంజేసి యీ పురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు. (స్క.1, 34-35)**

ఈ విధంగా శ్రీధరీయాన్ని అనుసరించిన స్థలాలు తెలుగు భాగవతంలో వందలకొలది ఉన్నాయి. వాటిని వివరించడానికి ఈ లఘుపీఠికలో అవకాశం లేదు.

## పోతన కథాకథన పద్ధతి

ఇతరుల కావ్యాలు చదివేటప్పుడు ఆ పద్యాలలో దాన్ని రచించిన కవులే కనబడుతారు. తిక్కన పోతనల రచనలు చదివేటప్పుడు పాత్రలు కన్నుల ముందుంటాయి. పాఠకులు కథలో లీనమై రసంలో నిమగ్నులవుతారు.

వ్యాసుడు వ్యాకులచిత్తంతో మనశ్శాంతి లేకుండా సరస్వతీనదీతీరంలో కూర్చొని విచారిస్తుండగా నారదుడు అక్కడకి వచ్చి ఆయనతో ఇలా చెప్పాడు.

**ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం**
**చించుకగాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం**
**చించిన మెచ్చునే? గుణవిశేషము లెన్ననఁ గాక నీకు నీ**
**కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా! (1-95)**

భగవంతుని చరిత్రలేని గ్రంథం నిరర్థక మని నారదుని నిశ్చితాభిప్రాయం!

కసాయివాడు పశువుల్ని చంపినట్లు అశ్వత్థామ అర్ధరాత్రివేళలో నిద్రిస్తున్న ఉపపాండవుల్ని చంపాడు. ద్రౌపది ఆ వార్త విని కన్నీరు మున్నీరై దుఃఖించింది. అర్జునుడు తాళ్లతో కట్టి అశ్వత్థామను బందీగా తీసుకుని వచ్చాడు. తగిన శిక్షను వేయవలసిందిగా ద్రౌపదికే వదలి వేశారు. అప్పుడు ద్రౌపది "నీవు పుత్రాకారంలో ఉన్న ద్రోణుడవు. శిష్యులబిడ్డల్ని నిర్దయగా చంపడం ధర్మమా?" అని అడిగింది. చిన్ని పాపల్ని చంపడానికి నీకు చేతులెట్లా వచ్చాయి అని సున్నితంగా మందలించింది. అప్పుడు అశ్వత్థామను చంపితే ఆయన తల్లి కృపి ఏ విధంగా దుఃఖిస్తుందో అని బాధపడి, బ్రాహ్మణ హింస మానండని శ్రీకృష్ణార్జునుల్ని బతిమాలింది. ఈ సందర్భంలో-

"ఆసురకృత్యంబు ధర్మ మగునే తండ్రీ!"

"నిద్రాసక్తుల సంహరింప నకటా నీచేతు లెట్లాడెనో!"

"అతిపాపము బ్రాహ్మణహింస మానరే!"

అన్న ద్రౌపదివాక్యాలు ఒక భారతీయస్త్రీమూర్తియొక్క మానవీయ, మాననీయ విలక్షణవివేచనతో పాటు, ఆమె ప్రత్యేకత ప్రతిబింబించే ప్రవర్తన, ఆమె సొంతగొంతుక మనకు వినబడేటట్లుగా కథాకథన శిల్పాన్ని కన్నులకు కట్టించారు – మహాకవి పోతన!

అటువంటి సంక్లిష్టపరిస్థితిలో అశ్వత్థామను చంపడానికే నిశ్చయించి, భీముడు ఆగ్రహోదగ్రుడై ముందుకు వచ్చి–

**చ. కొడుకులఁ బట్టి చంపెనని కోపము నొందదు బాలఘాతుకున్**
**విడువు మటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది, వీఁడు విప్రుఁడే?**
**విడువఁగ నేల? చంపుఁ డిటు వీనిని మీరలు నంపరేని నా**
**పిడికిటి పోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడు డిందఱున్. (1–168)**

శోకతప్తమూ, దుఃఖభార నిమగ్నమైన సన్నివేశాన్ని క్షణకాలంలో భీముని మాటలతో వీరరసంలో ముంచెత్తినాడు పోతన! అశ్వత్థామను చంపబోయిన భీముని ద్రౌపది అడ్డుపడింది. శ్రీకృష్ణుడు నాల్గుభుజాలతో ఆ వేగాన్ని నివారించి, భీముని ఆవేశాన్ని తగ్గించాడు.

## ద్రౌపదీ మానసంరక్షణం

శ్రీకృష్ణపరమాత్మ ఈ భూమిపై అవతరించి అనేక అద్భుతాశ్చర్యకరమైన కార్యాలు చేశాడు. ఏడేండ్ల బాలుడుగా ఉన్నప్పుడే గోవర్ధన గిరిధారి అయ్యాడు. భగవద్గీతను బోధించాడు. వీటిలో ద్రౌపదీమాన సంరక్షణమే ఘనకార్యమని భాగవతకర్త తలచాడు.

**శా. పాంచాలీకబరీవికర్షణమహాపాపక్షతాయుష్కులన్**
**చంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందుడు (1–176)**

ద్రౌపదీదేవి కొప్పుపట్టి ఈడ్చి, నిండుసభలో అందరూ చూస్తూ ఉండగా కోకలు విప్పిన పాపంచే కౌరవుల ఆయుస్సు తరిగిందట!

**శా. వైరుల్ గట్టిన పుట్టముల్ విడువఁగా వారింప నా వల్లభుల్**
**రా రీవేళ నుపేక్ష సేయఁ దగవే? రావే! నివారింపవే!**
**లేరే త్రాతలు కృష్ణ! యంచు సభలో దీనాంగియై కుయ్యిడన్**
**గారుణ్యంబున భూరివస్త్రకలితంగాఁ జేయఁడే ద్రౌపదిన్. (1–363)**

అని అర్జునుడే విలపించాడు – భాగవతంలో శ్రీకృష్ణనిర్యాణఘట్టంలో – శ్రీకృష్ణుడు భూలోకాన్ని విడిచి వైకుంఠం చేరాడు. అర్జునుడు శోకిస్తూ వచ్చాడు హస్తినాపురానికి. అప్పుడు ధర్మరాజు చెప్పిన మాటలివి.

క. **ఓడితివో శత్రువులకు - నాడితివో సాధుదూషణాలాపములన్**
**గూడితివో పరసతులను - వీడితివో మానధనము వీరులనడుమన్. (1-354)**

క. **తప్పితివో యిచ్చెద నని, చెప్పితివో కపటసాక్షి, చేసినమేలున్**
**దప్పితివో, శరణార్థుల - రొప్పితివో, ద్విజులఁ బసుల రోగుల సతులన్. (1-355)**

క. **అడఁచితివో భూసురులను, గుడిచితివో బాలవృద్ధగురువుల వెలిగా**
**విడిచితివో యాశ్రితులను, ముడిచితివో పరులవిత్తములు లోభమునన్. (1-356)**

ఇవన్నీ మానవుడు చేయకూడని పనులు. అప్పుడు అర్జునుడు-

క. **మనసారథి, మనసచివుఁడు, మనవియ్యము మనసఖుండు, మనబాంధవుడున్**
**మనవిభుఁడు, గురువు దేవర మనలను దిగనాడి చనియె మనుజాధీశా! (1-358)**

అర్జునుడు శ్రీకృష్ణనిర్యాణాన్ని గురించి చెప్పి దుఃఖించాడు. ఈ విలాప పద్యాలు చదువుతున్నప్పుడు కన్నీళ్లు రాని పాఠకుడు పాషాణహృదయుడు.

## దృశ్య చిత్రీకరణలు

శ్రీకృష్ణుడు పరీక్షిత్తును బ్రదికించాడు. కుంతీదేవి శ్రీకృష్ణుణ్ణి స్తుతించింది. ఇది ఒక రమ్యమూ కమనీయమైన దృశ్యచిత్రీకరణ.

ఉ. **కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో**
**గోపిక త్రాటఁ గట్టిన వికుంచితసాంజనబాష్పతోయ ధా**
**రాపరిపూర్ణవక్త్రముఁ గరంబులఁ బ్రాముచు వెచ్చనూర్చు చుం**
**బాపఁడవై నటించుట కృపాపర! నామదిఁ జోద్య మయ్యెడున్. (1-192)**

యశోద పెరుగు చిలుకుతున్నది. బాలకృష్ణుడు వెన్న పెట్టుమని అడిగాడు. ఆమె పెట్టలేదు. వెంటనే కవ్వము పట్టి, కోపంతో పెరుగుకుండను బద్దలుకొట్టాడు. ఆమె బాలకృష్ణుని తాటితో కట్టింది. బాలకృష్ణుడు కన్నులకు పెట్టిన కాటుక కరిగి కన్నీళ్లధారగా కారుతోంది. కృష్ణుడు రెండుచేతులతో కన్నుల్ని ముఖాన్ని పాముకొంటున్నాడు. ఈ దృశ్యం కుంతికి గుర్తు కొచ్చింది.

కురుక్షేత్రంలో భీష్ముడు అంపశయ్యపై శయనించాడు. యుద్ధానంతరం పాండవులు, కృష్ణుడు, మహర్షులు భీష్మణ్ణి చూడటానికి వచ్చారు. భీష్ముడు శ్రీకృష్ణుణ్ణి పూజించి స్తుతించాడు.

సీ. **కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గగన భాగంబెల్లఁ గప్పి కొనఁగ**
**నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతిఁ గదలఁ**
**జక్రంబు చేపట్టి చనుదెంచు రయమునఁ బైనున్న పచ్చనిపట్టము జాఱ**
**నమ్మితినా లావు నగుఁబాటు సేయక మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ**

**తే. గరికి లంఘించు నింగంబు కరణి మెఱసి, నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు**
**విడువు మర్జున! యనుచు మద్విశిఖవృష్టిఁ దెరలి జనుదెంచు దేవుండు దిక్కు నాకు. (1-222)**

యుద్ధంలో ఆయుధాన్ని పట్టుకోనని శ్రీకృష్ణుడు ప్రతిజ్ఞ చేశాడు. శ్రీకృష్ణునిచే ఆయుధం పట్టిస్తా నని భీష్ముడు ప్రతిజ్ఞ చేశాడు. ఆ భక్తుని ప్రతిజ్ఞను నిజం చేయడానికై యుద్ధరంగంలో చక్రంపట్టి ఏనుగుపై దూకే సింహంవలె భీష్మునిపైకి దుమికాడు. ఇదొక దివ్యమైన భూమికగల దృశ్యసాక్షాత్కార వైభవం! దానిని నాన్యతోదర్శనీయంగా చేసిన పోతన పదబంధాలు చిత్రకారునికుంచెకు మార్గదర్శకాలు!

### అద్వైత తత్త్వం

**మ. ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కడై తోఁచు పో**
**లిక నే దేవుదు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ**
**న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూనరూ**
**పకుఁడై యొప్పుచునుండు నట్టి హరినేఁ బ్రార్థింతు శుద్ధుండనై. (1-226)**

సూర్యు డొక్కడే సకల జీవులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా కన్పడుతున్నాడు. పరమాత్మ ఒక్కడే! జీవుల హృదయాలలో అనేకవిధాలైన రూపాలతో కనబడుతున్నాడు. ఈ జీవులన్నీ ఆ దేవునినుండే పుట్టాయి. ఆ మహావిష్ణువే సర్వాంతర్యామి. ఇది అద్వైతులు చెప్పిన బింబ - ప్రతిబింబవాదం. ఒక కుండలోని నీళ్లలో ఒక సూర్యబింబం ప్రతిబింబించింది. అటువంటి జలంగల కుండలను అనేకం ఏర్పరచినప్పుడు అనేక సూర్యబింబాలు ఆ యా కుండల్లోని జలాల్లో ప్రతిబింబించాయి. ఏకం అనేకం కావడమే సృష్టిలక్షణం. ఈ అనేకం మళ్లీ ఏకంలో లీనం కావడమే లయం. ఈ వేదాంత తత్త్వాన్ని ఈ పద్యం బోధిస్తున్నది.

ఈ పద్యం వేదాంతపు ముద్ద! భిన్నత్వంలోని ఏకత్వాన్ని దర్శించడమే అద్వైతం.

### పరీక్షిత్తు పరమ భాగవతుడు

పరీక్షిత్తు పూర్వకర్మవశంచేత శమీకునిపై మృతసర్పాన్ని వేశాడు. శమీకుని కొడుకైన శృంగి శపించాడు. ఆ శాపం విన్న శమీకమహర్షి పరీక్షిత్తు తప్పు చేసినా, గొప్పవాడని, పరమభాగవతుడని కీర్తించాడు.

**ఉ. భారతవంశజున్ బరమభాగవతున్ హయమేధయాజి నా**
**చారపరున్ మహానయవిశారదు రాజకులైకభూషణున్**
**నీరము గోరి నేఁడు మననేలకు వచ్చిన యర్థి భక్తిస**
**త్కారము సేసి పంపఁజనుఁగాక శపింపఁగ నీకు ధర్మమే? (1-485)**

పరీక్షిత్తుకు శృంగి ఇచ్చిన శాపం తెలిసింది. మృత్యువు తప్పదనుకొన్నాడు. ప్రాపంచికమైన సంగములన్నీ విడిచిపెట్టాడు. మనస్సులో శ్రీమహావిష్ణువును నిలుపుకొన్నాడు. భాగవతుడైనాడు. భవిష్యజ్జన్మజన్మాలలో కూడ విష్ణుభక్తినే కోరుకొన్నాడు.

**క. చూడుఁడు నా కల్యాణము, పాడుఁడు గోవిందుమీఁదిపాటలు దయతో**
**నాడుఁడు హరిభక్తులకథ లేదహములలోన ముక్తి కేఁగక నిచటన్.**

**క. అమ్మా! నినుఁ జూచిన నరుఁ, బొమ్మా యని ముక్తికడకుఁ బుత్తు వఁట కృపన్**
**తెమ్మా! నీ రూపముతో రమ్మా! నాకెదుర గంగ రమ్య తరంగా!" (1-505, 506)**

అని గంగమ్మను స్తుతించి, ప్రాయోపవేశం చేశాడు. గంగమ్మను స్తోత్రం చేయడంలో కూడా గాంగేయుడైన భీష్ముని మునిమనుమడు ఈ పాండవ వంశాంకురమైన పరీక్షిత్తు అని స్పష్టమౌతున్నది.

## శ్రీకృష్ణుని గుణగణాలు

భగవంతుడైన కృష్ణుడు 'అనంతకల్యాణగుణనిలయుడు' 1. సత్యం 2. శుచిత్వం 3. దయ 4. క్షమ 5. త్యాగం 6. సంతోషం 7. ఋజుస్వభావం 8. మనోనిగ్రహం 9. ఇంద్రియనిగ్రహం 10. తపస్సు 11. సర్వసమత్వం 12. సహనం 13. ఉదాసీనత్వం 14. శాస్త్రవిచారం 15. జ్ఞానం 16. వైరాగ్యం 17. శౌర్యం 18. తేజస్సు 19. బలం 20. స్మృతి 21. స్వాతంత్ర్యం 22. కుశలత్వం 23. కాంతి 24. ధైర్యం 25. మృదుస్వభావం 26. గొప్ప ప్రతిభ 27. అనునయం 28. శీలం 29. జ్ఞానేంద్రియబలం 30. కర్మేంద్రియబలం 31. మనోబలం 32. సౌభాగ్యం 33. గాంభీర్యం 34. స్థైర్యం 35. ఆస్తిక్యబుద్ధి 36. శ్రద్ధ 37. కీర్తి 38. మానం 39. అహంకారరాహిత్యం – ఇవి శ్రీకృష్ణుని నిత్యగుణాలని భూదేవి చెప్పింది (1-402). వీటిలో కొన్నింటినయినా మానవుడు అలవర్చుకోవాలని భగవంతుని సందేశం!

## కలి నివాసస్థానాలు

1. ప్రాణిహింస 2. స్త్రీ వ్యసనం 3. జూదం 4. పానం 5. అసత్యం 6. మదం 7. కామం 8. హింస 9. వైరం – ఈ చివరి ఐదు డబ్బుకోసం చేసేవి. ఇవి కలిపురుషుడుండే స్థానాలు. వీటిని మానవుడు విడిచిపెట్టాలి.

## అలంకారయోజనం

పోతనగారిది ఆలంకారిక భాష. పురాణాలు అలంకార ప్రధానాలు కావు. కాని, పోతనగారు భాగవతాన్ని పలుతావుల్లో ప్రబంధపాకంలో నడిపాడు.

**ఉ. జలజాతాక్షుఁడు సూడ నొప్పె ధవళచ్ఛత్రంబుతోఁ జామరం**
**బులతోఁ బుష్పపిశంగచేలములతో భూషామణిస్ఫీతుఁడై**
**నలినీబాంధవుతో శశిధ్వజముతో నక్షత్రసంఘంబుతో**
**బలభిచ్చాపముతోఁ దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్. (1-258)**

శ్రీకృష్ణుడు మేఘంవలె ఉన్నాడు. గొడుగు సూర్యునివలె ఉంది. వింజామరలు చంద్రధ్వజంవలె ఉన్నాయి. పూమాలలు నక్షత్రమాలలవలె ఉన్నాయి. పీతాంబరం ఇంద్రధనుస్సులాగా ఉంది. మణులు పొదిగిన అలంకారాలు మెరుపుతీగల్లాగా ఉన్నాయి.

పూర్వార్ధంలో ఉపమేయాలు, ఉత్తరార్ధంలో ఉపమానాలు, యథాసంఖ్యంగా చెప్పబడ్డాయి. ఇది క్రమానుప్రాణితోపమాలంకారం. సూర్యుడు తెల్లగా ఉండడు. సూర్యునితో ఉన్న చంద్రుడు (అమావాస్య) కనబడదు. సూర్యునితో నక్షత్రాలుండవు. కాబట్టి ఇది అభూతోపమ.

## బహుశాస్త్రపరిజ్ఞానం

**1. ధర్మశాస్త్రం :** పోతన భాగవతారంభంలో శ్రీకృష్ణుణ్ణి, శివుణ్ణి, బ్రహ్మను, వినాయకుణ్ణి, సరస్వతిని, దుర్గను, లక్ష్మీదేవిని స్తుతించాడు. 'పుట్టం బుట్ట శరంబునన్ మొలవ' (1-7) అనే పద్యంలో శ్రీకుమారస్వామి ప్రస్తావన ఉంది. అంతేకాక, వచనంలో ఇలా వ్రాశారు "అని యిష్టదేవతలం జింతించి దినకర కుమార ప్రముఖులం దలంచి" (1-12) అని సూర్యుణ్ణీ, శ్రీకుమారస్వామిని ప్రత్యేకంగా పేర్కొన్నాడు.

**శ్లో. ఆదిత్యస్య సదా పూజాం తిలకం స్వామిన స్తథా ।**
**మహాగణపతే శ్చైవ కుర్వన్ సిద్ధి మవాప్నుయాత్ ॥ - యాజ్ఞవల్క్యస్మృతి (1-294)**

సూర్యుణ్ణీ, శ్రీకుమారస్వామిని, గణపతిని నిత్యం తిలక, కుంకుమాదులతో పూజిస్తే మోక్షం సిద్ధిస్తుందని మితాక్షరావ్యాఖ్య. తిలకప్రియః స్వామీ= తిలకస్వామీ - అని 'వేదాంత కల్పతరువు' - అందువల్లనే, పోతనగారు సూర్య, కుమారస్వాముల్ని ప్రత్యేకంగా పేర్కొన్నారు.

**వ. వాసుదేవ, సంకర్షణప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తి నామంబులు నాలుగుభక్తిం బలికి (1-110)**

**2. సాముద్రిక శాస్త్రం :** "యవ పద్మాంకుశ చారుచక్ర ఝషరేఖా లంకృతంబైన మాధవుపాదద్వయము... (1-343)

పోతన శ్రీకృష్ణుని పాదప్రస్తావన వచ్చినప్పుడంతా పలుతావులలో పద్మం, ధనుస్సు, చక్రం వంటి రేఖలు అరకాలిలో ఉన్నట్లు వర్ణిస్తాడు. ఇది మహాపురుషలక్షణం ।

**క. హల కులిశ కలశ తోమర, జలచర జలజాత శంఖచ్ఛత్రో**
**జ్జ్వలలాంఛనకరపదములు, గల యాతఁడు ధరణి నేలుఁ గడు నొప్పారన్ (1-66)**

అని అన్నయమంత్రి సాముద్రికశాస్త్రం.

**3. బీజాక్షరప్రయోగం :** ఆరవ అక్షరం **'త'** కార ముంచి, పద్యంతో శపిస్తే శత్రువు చనిపోతాడు. వెల్లూరి తిరుమలయ్య ఆరవచోట **'త'** కారంబు నిలిపి తన గుర్రాన్ని దొంగిలించిన శ్రీపతి పోతరాజును ఏడు దినాలకు చావాలని తిట్టిన చాటుధార-

**చ. హయమది సీ'త' పోతవసుధాధిపుఁ డారయ రావణుండు... నా**
**జయమును బో'త' రక్కసునిచావును నేడవనాఁడు చూడుఁడీ!**

అని అప్పకవి ఉదాహరించాడు.

**ఉ. ఓడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మాఱుమా**
**టాడక యున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మద**
**క్రీడఁ జరించురాజు హరకేశవు లొడ్డినఁ గావఁ జచ్చుఁబో**
**యేడవ నాఁడు 'త'క్షక ఫణీంద్ర విషానలహేతి సంహతిన్ ॥ (1-473)**

శృంగి, పరీక్షిన్నరేంద్రుణ్ణి శపించిన ఈ పద్యంలో పోతన **'త'**కారం ఆరవఅక్షరంగా ప్రయోగించాడు.

**శ్లో. మానిషాద! ప్ర'తి'ష్ఠాం త్వగమః శాశ్వతీః సమాః ।**
**- వాల్మీకిరామాయణం బాలకాండ (2-15)**

అని వాల్మీకి మహర్షి బోయవాణ్ణి శపించిన ఘట్టంలోని శాపవాక్యంలో ఆరవ అక్షరం **'త'**కారముండటం గమనింపదగింది.

## ప్రయోగ విశేషాలు

1. వినుము, శుకుఁడు వచ్చి విజ్ఞాన పద్ధతి నతని కెట్లు సూపె (1-274)

**'వినుము'** అనే క్రియ పద్యంలో సంగత పడుటలేదు. అని ఎకాడెమీ ప్రతి. 'వినుము' అన్నది పోతరాజు గారి ఊత పదం అని 'ఆరుద్ర'గారు. 'వినుము' అని కథ చెప్పేవాడు అంటాడు కానీ, కథ చెప్పుమని అడిగేవాడు అనడు అని దీపాలవారి భాగవతపాఠపరిశోధనం. ఇక్కడ 'వినుము' అంటే మా ప్రశ్న 'విను' మని అర్థం! లోకంలోకూడా అడిగేవాడు చెప్పేవాణ్ణి 'నా ప్రశ్న ముందుగా విను మనడం' వ్యావహారంలో ఉంది. పోతనగారు.

**క. మునినాయక! విను! కాముక, జన దుష్ప్రాపంబు విష్ణుచరణాంబు మహా**
**ర్చన మునిజనసంప్రాప్యము, ననఁగల పంకేరుహాక్షు నవ్యయపదమున్. (4-294)**

అని ప్రయోగించాడు. ఇది విదుర మైత్రేయ సంవాదంలోనిది. ఇక్కడ వక్త మైత్రేయుడు. శ్రోత విదురుడు. విదురుడే 'విను' మని ప్రశ్నించాడు. కాబట్టి, సంగతపడని దేమీలేదు. 'విను' మనేది పోతనగారి ఊత పదమూకాదు.

**క. వాయించు వీణ నెప్పుడు, మ్రోయించు ముకుందగీతములు జగములకుం**
**జేయించుఁ జెవులపండువు, మాయించు నఘాళి నిట్టి మతి మతి గలఁడే? (1-134)**

"మత మస్యాస్తీతి మతీ" - మతి= బుద్ధిమంతుడు, జ్ఞాని.

మతము= జ్ఞానం (కే.ని.) (సూర్యరాయాంధ్రనిఘంటువు)

**3. పక్షీకరణము - బ్రహ్మాభూత, బ్రహ్మీభావం**

**క. పక్షులు తమతెక్కలలోఁ బక్షంబులు రాని పిల్ల పదువుల మమతన్**
**రక్షించినక్రియ మీరలు, పక్షీకరణంబు సేయ బ్రతికితిమి గదే! (1-301)**

**పక్షీకరణము** - ఇది 'చ్వి' ప్రత్యయాంతం.

**కృభ్వస్తి యోగే సంపద్య కర్తరి చ్విః (5-4-50)**

అనే సూత్రంచే పక్ష శబ్దానికి **'కృ'** ధాతురూపమైన **'కరణ'** శబ్దం పరమైనప్పుడు **'చ్వి'** ప్రత్యయం వచ్చి "అస్యచ్వౌ" (7-4-32) అనే సూత్రంచే **'పక్ష'** శబ్దంలోని చివరివర్ణానికి ఈత్వం వచ్చి **'పక్షీకరణ'** మనే రూపం ఏర్పడుతుంది.

"అభూత తద్భావ ఇతి వక్తవ్యమ్" అనే వార్తికంచే అంతకు ముందు గానిది దాని భావాన్ని పొందేటప్పుడు **'చ్వి'** ప్రత్యయం వస్తుంది. **"పక్షీకరణ"** మంటే అంతకు ముందు రెక్కలు రాని వానికి రెక్కలు వచ్చునట్లు చేయడం.

ఇటువంటి **'చ్వి'** ప్రత్యయాంత రూపాలను భాగవతంలో వందకొలదిగా పోతన వాడినాడు. ఇక్కడ ఒక విశేషం!

లోకంలో **బ్రహ్మీభావం, బ్రహ్మీభూతుఁడు** - అనేవి వాడుకలో ఉన్నాయి. ఇవి 'చ్వి' ప్రత్యాయాంతాలు. బ్రహ్మమే (జీవుడే) బ్రహ్మ మవుతోంది. కాని, బ్రహ్మ భిన్నవస్తువు, బ్రహ్మంకాదు. కాబట్టి, ఇది అద్వైతప్రక్రియకు విరుద్ధం! ద్వైతమతంలో జీవుఁడు బ్రహ్మంగా కావడాన్ని అంగీకరింపబడలేదు. కాబట్టి, ఈ ప్రయోగం ద్వైత ప్రక్రియకు విరుద్ధం. శ్రీ శంకరభగవత్పాదులు **"బ్రహ్మీభవితు మిచ్ఛసి"** (వి.చూ 52)

బ్రహ్మీభూతః - బ్రహ్మ సూత్రభాష్యం (1-3-15) అని ప్రయోగించారు.

ఇది వ్యావహారికదశలో అధ్యాసను అనుసరించి వాడబడినవి. "బ్రహ్మభూతోఽధిగచ్ఛతి" (భగవద్గీత 5-4) బ్రహ్మభూతమకల్మషమ్ (భగవద్గీత 6-27) బ్రహ్మభూతః ప్రసన్నత్మా (భగవద్గీత 18-54) అని చ్విప్రత్యయంలేని రూపాలే భగవద్గీతలో ఉన్నాయి. పోతనగారుకూడ భాగవతంలో బ్రహ్మభూతత్వ (1-458) బ్రహ్మభావము (1-519) (4-615) (8-237); బ్రహ్మభూతుడు (4-93) (4-615) (5-134) (8-237) (9-42) అని వాడినారుగాని, ఒట్టుపెట్టినట్లు 'బ్రహ్మీభావ, బ్రహ్మీభూత' అని వాడలేదు. ఇది పోతనగారి వ్యాకరణ, వేదాంతశాస్త్ర మర్మజ్ఞతకు నికషోపలం. పోతనగారు పారమార్థిక కవులు.

## ఛందో విశేషాలు

### 1. యతివిశేషాలు

1. హరిగుణవర్ణన రతుఁడై, హరితత్పరుఁడైన బాదరాయణి (1-139)
2. పొందుచు నాపోవ భూభార ముడుపుటకై హరి వరుఁడు నారాయణుండు - (2-173)

   బాదర+అయన; నార+అయన - వీనిని నిత్యసమాసయతులుగా అప్పకవి పేర్కొన్నాడు.

### 2. ప్రాసవిశేషాలు - అర్ధబిందు ప్రాసం

1. రాఁడా? చూడ సమస్త భూతములలో రాజిల్లు వాఁడిచ్చటన్
   లేఁడా? పాఱుని చిచ్చఱమ్ముఁ దొలఁగన్ లీలాగతిం ద్రోచి నా

కీఁడా? నేఁ డభయప్రదాన మతఁ దూహింపన్ నతత్రాత మున్
గాఁడా? యెందఱఁ గావఁ డే యెడల మత్కర్మంబు దానెట్టిదో!? (1-283)

ఈ పద్యంలో అర్ధబిందు ప్రాసనియమం పాటింపబడింది. ఇటువంటి పద్యాలు భాగవతంలో ఆరు ఉన్నాయి. తక్కినవి ఇవి -

2. వీఁక - తోఁక - మ్రోఁకరిల - సోఁకోర్వక (8-361)
3. ఆఁకట - వీఁక - తాఁకి - కూఁకటి (9-241)
4. పోఁడను - రాఁడను - లేఁడను - (ఉ)న్నాఁడను (10-1-1727)
5. తాఁకి - ఊఁకున - తాఁకఁగ - ఆఁక (10-2-436)

అష్టదిగ్గజ కవుల కాలంవరకు ఈ నియమం పాటింపబడింది. తరువాతికాలంలో ఈ నియమం సడలింది.

**3. పోతన ప్రథమస్కంధంలో వాడిన విశేషవృత్తాలు -**

1. తరలం 2. మత్తకోకిల 3. భుజంగ ప్రయాతం 4. మాలిని.

**తరలం**

పరమ పూరుషుఁడొక్కఁ డాఢ్యుఁడు పాండవోద్భవనాశముల్ (1-60)

భరయతిన్ దరళం బెసంగు నభంబులున్ రసజాగముల్ - లక్షణసారసంగ్రహం

తరళంలోఁ ప్రతిపాదంలో 'స-భ-ర-స-జ-జ-గ' గణాలు.

12వ అక్షరం - యతిస్థానం.

**మత్తకోకిల**

బల్లిదుండగు కంసుచేతను బాధ నొందుచు నున్న మీ (1-189)

మారుతీ! ర-స-జా-భ-రల్ తగు మత్తకోకిల దిగ్యతిన్ - లక్షణసార సంగ్రహం

మత్తకోకిలలో ప్రతిపాదంలో ర-స-జ-జ-భ-ర అనే గణాలుంటాయి. 11వ అక్షరం యతిస్థానం.

**భుజంగప్రయాతం**

హరించున్ గలిప్రేరితాఘంబు లెల్లన్ (1-294)

యయాయల్ భుజంగ ప్రయాతన్ వడేళ్లన్ - లక్షణ సారసంగ్రహం

భుజంగప్రయాతంలో ప్రతిపాదంలో య-య-య-య గణాలుంటాయి. 8వ అక్షరం యతిస్థానం.

**మాలిని**

అనుపమగుణహారా! హన్యమానాదివీరా! (1–528)

మహి గజయతి మించెన్ మాలినిన్ నామయాప్తిన్ – లక్షణసారసంగ్రహం

మాలినీ వృత్తంలో ప్రతిపాదంలో 'స–స–మ–య–య–' గణాలు ఉంటాయి. 9వ అక్షరం యతిస్థానం.

**తూఁగు కందాలు**

తూఁగుకందాలు, సర్వలఘుకందాలు, సర్వలఘుసీసాలు మొదలైనవాటిని ఆంధ్రసాహిత్యంలో మొట్టమొదట మొదలుపెట్టినవాడు పోతన.

క. **బాలాజన, శాలాధన,**
**లీలావన, ముఖ్యవిభవ, లీనమనీషా (1–308)**

క. **సేవింపను, వర్ణింపను,**
**భావింపను, భావ్యుఁడభవ, భాజికి, నధిపాఁ (2–4)**

క. **(సుం) దరులను, హితవరులను, బుధ**
**వరులను, వర్జించి, గాఢవైరాగ్యమునన్ (2–10)**

క. **నొచ్చెదరును, విచ్చెదరును,**
**జచ్చెదరును, నేఁడు చూడు, జలజాతాక్షీ! (10–1–1754)**

రామరాజభూషణాదులు ఈ తూఁగుకందాలను ఎక్కువగా అభివృద్ధి పరిచారు.

క. **ఉద్ధతరిపు విద్ధతపన, పద్ధతి కరిభవన దవనిపటదంబుధి సం**
**పద్ధరణ సముద్ధరణ స, మిద్ధరణ రజోవ్రజోద్యదిభ మదసృతికిన్ – వసుచరిత్ర (1–89)**

## ప్రాచీనకవుల అనుకరణాలు

**నన్నయ – పోతన**

ఉ. **... నన్నయభట్టు తెనుంగునన్ మహా**
**భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్. – భారతం – ఆదిపర్వం (1–26)**

ఉ. **బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్. – భాగవతం – (1–13)**

కవిత్రయంవారు, పోతనగారు **'జగత్తుయొక్క హితాన్నికోరి'** భారత – భాగవతాలు రచించిన ఋషికల్పులు. అందువల్లనే, శ్రీనాథుడు భీమఖండంలో–

ఉ. పంచమవేదమై పరఁగు భారతసంహిత నాంధ్రభాషఁగా
వించెఁ బదేను పర్వములు విశ్వజగద్ధిత బుద్ధి నెవ్వఁడు... – భీమఖండం

అని తిక్కనగారిని స్తుతించాడు.

మ. అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామల చ్ఛాయమై
సుమహావర్గచతుష్క పుష్ప వితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై. – భారతం – ఆదిపర్వం (1-66)

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై. – భాగవతం (1-22)

నన్నయగారికి భారతం పారిజాతంకాగా, పోతనగారికి భాగవతం కల్పతరువైనది. అయితే, పోతన పద్యాలలో శ్లేషాలంకారం ఉంది.

**శ్రీనాథుడు – పోతన**

పోతన – శ్రీనాథులు సమకాలికులు. సమవయస్కులు పరస్పరం పద్యాలను అనుకరించుకొన్నవారు.

సీ. తనయుల తోడనే దహ్యమానంబగు జతుగృహంబున యందుఁ జావకుండఁ
గురురాజు వెట్టించు క్రూరవిషంబున మారుతపుత్రుండు మడియకుండ
ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ, ద్రౌపది మానంబు దలఁగకుండ
గాంగేయ కుంభజ కర్ణాది ఘనులచే నాబిడ్డలని లోన నలఁగకుండ

తే.గీ. విరటు పుత్రిక కడుపులో వెలయుచాలు – ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగకుండ
మరియు రక్షించితివి పెక్కుమార్గములను – నిన్ను నేమని వర్ణింతు నీరజాక్ష! – భాగవతం (1-188)

సీ. అంగదాభరణంబులందుఁ గీలించిన, వజ్రాల కీలన వదలకుండ
వక్షఃస్థలంబున వైచిన నవకంపుఁ దులసి దండకు వాఁడు దోఁపకుండ
గడునొప్పఁ దీర్చిన కస్తూరి తిలకంబు, చెమట బిందుల చేతఁ జెదరకుండ
నెట్టెంబు సుట్టిన నెమ్మి పింఛము దండ కొనరేక యొక్కింత గుదియ కుండ

తే.గీ. శ్రవణ కల్హారముకుళంబు జాఱకుండ, విరుల కీల్కొప్పు వదలి కై పెక్కకుండ
నెత్తె శృంగార కందుకం బెత్తినట్లు, కైటభారాతి మందరక్ష్మాధరంబు. – హరవిలాసం (6-46)

## పోతనను అనుకరించిన కవులు

**పోతన – మొల్ల**

**క. పలికెడిది భాగవతమఁట – పలికించెడివాఁడు రామభద్రుండఁట; నేఁ**
**బలికిన భవహర మగునట – పలికెద, వేఱొండు గాథ పలుకఁగ నేలా? – భాగవతం (1-18)**

**క. చెప్పుమని రామచంద్రుఁడు, చెప్పించిన పలుకుమీఁదఁజెప్పెద నేనె**
**ల్లప్పుడు నిహపరసాధన మిప్పుణ్య చరిత్ర తప్పులెంచకుఁడు కవుల్. – మొల్ల రామయణం**

పోతనగారి పై పద్యాన్ని చాలా మంది కవులు అనుకరించారు. పోతన ననుసరించి (భాగవతం – 1-29... 32) వారణాసి వెంకటకవి కూడ రామచంద్రోపాఖ్యానంలో షష్ఠ్యంతాలు ఉత్పల మాలల్లో చెప్పాడు.

**పోతన – వేమన**

**ఆ.వె. ధనముఁ గొనుట యొండెఁ దల గొఱుగుట యొండె నాలయంబు వెడల నడుచు టొండెఁ**
**గాని చంపఁదగిన కర్మంబు సేసినఁ జంపఁదగదు విప్రజాతిఁ బతికి. – భాగ (1-174)**

**ఆ.వె. చంపదగిన యట్టి శత్రువు తన చేతఁ జిక్కెనేని కీడు సేయరాదు**
**పొసఁగ మేలు చేసి పొమ్మనుటే చాలు (చావు) విశ్వదాభిరామ వినురవేమ ॥**

'ధనముఁగొనుట యొండె' ఈ భాగవత పద్యం సారంగుతమ్మయ వైజయంతీ విలాసంలో (4-111) యథాతథంగా ఉంది.

**పోతన – కనుపర్తి అబ్బయామాత్యుడు**

**మ. హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజ హంసావళీ**
**సురుచి భ్రాజితమైన మానస సరః స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ**
**హరి నామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ**
**కరమై యుండ దయోగ్య దుర్మలినవత్కా కోల గర్తాకృతిన్. – భాగవతం (1-96)**

**మ. హరినామాంకితమైన కావ్య మెట్టిదయిన న్నానందమై సజ్జనా**
**దరణీయంబగుఁ బుష్ప మాలికలలో దారంబు చందంబునన్**
**నరనామాంకితమైన కావ్యము రసౌన్నత్యస్థ మయ్యున్ నిరా**
**కరణంబై చను హీనజాతిపురుషం గై కొన్న వేశ్యన్ బలెన్. – అనిరుద్ధచరిత్రము (1-18)**

**పోతన– రామరాజభూషణుడు**

**ఉ. రాజఁట! ధర్మజుండు! సురరాజ సుతుండఁట ధన్వి! శాత్రవో**
**ద్వేజకమైన గాండివము విల్లఁట! సారథి సర్వభద్ర సం**

యోజకుడైన చక్రి యఁట! యుగ్రగదాధరుఁడైన భీముఁడ
య్యాజికిఁ దోడు వచ్చునఁట! యాపదగల్గు టిదేమి చోద్యమో! - భాగవతం (1-211)

ఉ. కొండఁట విల్లు! వేదలల కుండలిరాజఁట నారి! యమ్మ నం
తుండఁట! బైటి పల్లియలు దున్మిన వాఁడఁట! యొందు రెండు; భ
ర్గుండిది నిండు పౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబులు
ద్దండత నొక్క తుంటవిలుఁ దాలిచి యంటినఁ గందు తూఁపులన్. - వసుచరిత్ర 3-174

**సంస్కృతవాక్యానుకరణాలు**

1. "సత్యం పరం ధీమహి" (1-35)
2. బ్రాహ్మణో న హంతవ్యః (1-170)

***శ్రీ పరమేశ్వరార్పణమస్తు***

విజయవాడ
24-12-2016

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుడు
**గరిమెళ్ల సోమయాజులు శర్మ**

# ద్వితీయస్కంధ ప్రాశస్త్యం

**భా**గవతంలోని ద్వితీయస్కంధంలో శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజుకు ముక్తిమార్గం తెలుపడం – సకలయోగాల్లో భక్తియోగమే గొప్పదని నిర్ణయించడం – నారదమహర్షి బ్రహ్మదేవుణ్ణి ఈ ప్రపంచ సృష్టిని గురించి ప్రశ్నించడం– శ్రీ మహావిష్ణుని దివ్యావతారాలు – ప్రపంచోత్పత్తి – శ్రీమన్నారాయణుడు బ్రహ్మతపస్సుకు మెచ్చి వరాలివ్వడం– భాగవతం – దశలక్షణాలు – ప్రధానంగా చెప్పబడ్డాయి. పరీక్షిత్తు శ్రీశుకమహర్షిని ఇలా ప్రశ్నించాడు –

క. **ధారణ యేక్రియ నిలుచును? ధారణ కేరూప? మెద్ది ధారణ యనఁగా**
**ధారణ పురుషుమనోమల, మేరతి హరించు నాకు నెఱిఁగింపఁగదే!**

శ్రీ పరమేశ్వరుని విరాడ్విగ్రహం అనుసంధానం చేయడమే 'ధారణ' అని శుకమహర్షి వివరించాడు.

## విష్ణుని విరాడ్విగ్రహం

ఆ భగవంతుని విరాట్ విగ్రహానికి

1. పాతాళలోకం – పాదమూలం
2. రసాతలం – మడమలు, పాదాలు
3. మహాతలం – చీలమండలం
4. తలాతలం – పిక్కలు
5. సుతలం – మోకాళ్లు
6. వితలం, అతలం – తొడలు
7. మహీతలం – మొల
8. ఆకాశం – బొడ్డు
9. నక్షత్రమండలం – వక్షఃస్థలం
10. మహర్లోకం – మెడ
11. జనలోకం – ముఖం
12. తపోలోకం – నుదురు
13. సత్యలోకం – తల
14. ఇంద్రాదులు – భుజాలు
15. దిక్కులు – చెవులు
16. శబ్దం – శ్రవణేంద్రియం
17. అశ్వినీదేవతలు – ముక్కు
18. గంధం – ఘ్రాణేంద్రియం
19. నిప్పు – నోరు
20. అంతరిక్షం – కన్నులు
21. సూర్యుడు – చక్షురింద్రియం
22. రేయింబగళ్లు – కనురెప్పలు
23. బ్రహ్మపదం – కనుబొమలు
24. జలం – దవుడలు
25. రసం – జిహ్వా
26. వేదాలు – మాటలు
27. యముడు – కోరపండ్లు
28. పుత్రాదిస్నేహకళలు – దంతాలు
29. మాయ – నవ్వు
30. ప్రపంచసృష్టి – కడకంటిచూపు
31. సిగ్గు, లోభం – పెదవులు
32. ధర్మము – రొమ్ము

| | | | |
|---|---|---|---|
| 33. అధర్మం | - వెన్ను | 49. గుర్రాలు | - గోళ్లు, ఏనుగులు మొదలైనవి. |
| 34. ప్రజాపతి | - మేఢ్రం | 50. కటి | - జంతువులు |
| 35. మిత్రావరుణులు | - వృషణాలు | 51. ఆలాపాలు | - పక్షులు |
| 36. సముద్రాలు | - కడుపు | 52. జీవనం | - బుద్ధి |
| 37. పర్వతాలు | - ఎముకలు | 53. నివాసం | - పురుషుడు |
| 38. నదులు | - నరాలు | 54. స్వరాలు | - విద్యాధదాదులు |
| 39. చెట్లు | - వెంద్రుకలు | 55. స్మృతి | - ప్రహ్లాదాదులు |
| 40. వాయువులు | - ఉచ్ఛ్వాసనిఃశ్వాసాలు | 56. వీర్యం | - రాక్షస సమూహం |
| 41. కాలం | - నడక | 57. ముఖం | - బ్రాహ్మణులు |
| 42. కర్మం | - సంసారం | 58. భుజాలు | - క్షత్రియులు |
| 43. మేఘాలు | - శిరోజాలు | 59. తొడలు | - వైశ్యులు |
| 44. సంధ్యలు | - కట్టు బట్టలు | 60. పాదాలు | - శూద్రులు |
| 45. మూలప్రకృతి | - హృదయం | 61. నామాలు | - వసురుద్రాది దేవతలపేర్లు |
| 46. చంద్రుడు | - మనస్సు | | |
| 47. మహత్తత్త్వం (బుద్ధి) | - చిత్తం | 62. ద్రవ్యాలు | - యజ్ఞహవిర్భాగాలు |
| 48. రుద్రుడు | - అహంకారం | 63. భగవత్కర్మలు | - యజ్ఞప్రయోగాలు |

ఇది పరమేశ్వరుని విరాడ్విగ్రహం. మోక్షాన్ని కోరేవాడు విరాడ్విగ్రహాన్ని మనస్సులో ధ్యానించాలి. దీనికే 'ధారణ' అని పేరు. విశ్వమంతా విష్ణుమయమే!

**క. హరిమయము విశ్వమంతయు - హరి విశ్వమయుండు సంశయము పని లేదా!**
**హరిమయము గాని ద్రవ్యము - పరమాణువు లేదు విశ్వపావన! వింటే! (2-17)**

ఈ విరాడ్విగ్రహంపై ధారణ నిలిపి బ్రహ్మ సమస్తవిశ్వాన్ని సృష్టించాడు. 1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధారణ 7. ధ్యానం 8. సమాధి. వీటిలో ఆరవయోగాంగమే ధారణ.

## పోతన ఆత్మీయత

పోతనకు మొదటినుండీ రాజాస్థానాలను ఆశ్రయించడం, గ్రంథాలను రాజుల కంకిత మిచ్చి లౌకిక భోగాలు అనుభవించడం ఇష్టంకాదు. పైగా రాజప్రసంగం వచ్చినప్పుడు ఉద్రేకం చెందుతాడు.

**ఉ. పోము హిరణ్యదానములఁ బుచ్చికొనంగ ధనంబు లేమియుం**
**దేము సవంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా**

**రాము వనంబులన్ గృహవిరాములమై నివసింపఁ జెల్లరే**
**పామును వైవగా దగునె? బ్రహ్మమునీంద్రభుజార్గళంబునన్.**

**క. పుడమిఁగల జనులు వొగఁడఁగఁ గుడుతురు కట్టుదురు గాక కువలయపతులై**
**యడవుల నిడుములఁ బడియెడి, బడుగుల మెడ నిడఁగఁ దగునె పన్నగ శవమున్**

**(భాగవతం, 1-468, 469)**

ఈ పద్యాలకు మూలంలేదు. ఇవి పోతనగారి స్వీయ పద్యాలు. ఆయన ఆత్మీయ భావాలను ప్రతిబింబించేవిగా ఉండడం వీటి ప్రత్యేకత!

**సీ. కమనీయభూమిభాగములు లేకున్నవే, పడియుండుటకు దూది పరువు లేల?**
**సహజంబులగు కరాంజలులు లేకున్నవే, భోజనభాజనపుంజమేల?**
**వల్కలాజినకుశావళులు లేకున్నవే, కట్ట దుకూలసంఘుంబు లేల?**
**గొనకొని వసియింప గుహలు లేకున్నవే, ప్రాసాదసౌధాదిపటల మేల?**

**తే.గీ. ఫలరసాదులు గురియవే పాదపములు, స్వాదుజలముల నుండవే సకలనదులుఁ**
**బొసఁగ భిక్షము వెట్టరే పుణ్యసతులు, ధనమదాంధులకొలు వేల తాపసులకు**

**క. రక్షకులు లేనివారల, రక్షించెద ననుచుఁ జక్రి రాజై యుండన్**
**రక్షింపు మనుచు నొకనరు, నక్షముఁ బ్రార్థింపనేల? యాత్మజ్ఞునకున్**

ఈ భావాలు మూలంలో ఉన్నా పోతన ఆ భావాలను ఆత్మీయతతో కలిపి విస్తరించి చెప్పడంచేత పాఠకుల హృదయాలకు అవి హత్తుకొంటున్నాయి.

కన్నడ కవయిత్రి, మహాభక్తురాలు అయిన అక్కమహాదేవి (క్రీ.శ.12శ) కూడ ఆమె వచన సాహిత్యంలో ఈ భావాలనే చెప్పి ఉంది. కన్నడ వచనానికి ఆంగ్లానువాద మిది

**For hunger, there is the village rice in the begging bowl**
**For thirst, there are tanks and streams and wells**
**For sleep temple ruins do well**
**For the company of the soul I have you, O! chenna Mallikarjuna!**

**- Sant Darshan (page 5)**

ఈ గ్రంథంలో పోతన (1400-1470) గారిపై వ్యాసం ఉంది.

## విష్ణుమూర్తి ధ్యానం - వైశిష్ట్యం

శ్రీ విష్ణుమూర్తిని ధ్యానింపకుండ విషయలోలుడైన వాణ్ణి యమకింకరులు శిక్షిస్తారు.

**మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయచింతాయత్తుఁడై చిక్కి వా**
**సరముల్ ద్రోసెడువాఁడు కింకరగదాసంతాడితోరస్కుడై**
**ధరణీశోత్తమ! దండభృన్నివసనద్వారోపకంఠోగ్రనై**
**తరణీవహ్నిశిఖా పరంపరలచే దగ్ధుండు కాకుండునే? (2-24)**

**క. మొత్తుదురు గదల మంటల, కెత్తుదు రద్దంబు దేహ మంతింతలుగా**
**నొత్తుదు రసి పత్రికలను, హత్తుదురు కృతాంతభటులు హరివిరహితులన్**

**సీ. వాసుదేవశ్లోకవార్త లాలించుచుఁ గాల మే పుణ్యుండు గడుపు చుండు**
**నతని యాయువు దక్క నన్యుల యాయువు, నుదయాస్తమయముల నుగ్రకరుఁడు**
**వంచించి కొనిపోవువాఁడది యెఱుగక, జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు**
**నంగనాపుత్రగేహారామవిత్తాది, సంసారహేతుకసంగసుఖము**

**తే.గీ. దగిలి వర్తింపఁ గాలంబు తఱి యెఱింగి, దండధరు కింకరులు వచ్చి తాడనములు**
**సేసికొని పోవఁ బుణ్యంబు సేయ నైతిఁ, బాపరతి నైతి నని బిట్టు పలవరించు**

భాగవత సారాంశమంతా ఈ పద్యంలో ఇమిడి ఉంది. శ్రీ విష్ణుమూర్తి పుణ్యశ్లోకాలు చదువుతూ, వింటూ ఏ పుణ్యాత్ముడు కాలం గడుపుతుంటాడో అతనిఆయువు తరుగదు. అలా చేయనివానిఆయుస్సును సూర్యుడుదయించేటప్పుడు, అస్తమించేటప్పుడు హరిస్తూ ఉంటాడు. అది తెలియనిజీవుడు పామరుడై భార్య, పిల్లలు, ఇల్లు, పొలాలు, ధనం మొదలైన వానితో సుఖాలు అనుభవిస్తూ – నాకు మరణం లేదు. ఎంతోకాలం జీవిస్తానని ఇంద్రియసుఖాలలో ఆసక్తిగలవాడై దానిలో నిమగ్నుడైపోతాడు. ఆయుఃకాలం చెల్లినంతనే యమకింకరులు వచ్చి పట్టుకొని, కొట్టుతూ వాణ్ణి యమలోకానికి తీసుకొని పోతారు. అక్కడ యమయాతనలనుభవిస్తూ ఏ మాత్రం పుణ్యం చేయలేదు, ఎన్నో పాపాలు చేశానని బిగ్గరగా ఏడుస్తూ బాధపడతాడు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొని లాభంలేదు కదా! కాబట్టి, వివేకి అయినవాడు ఈ జన్మంలోనే భగవంతునిపై భక్తి కలిగి ఉండాలి. అందుకే "విష్ణుపూజ లేనినరజన్మ నిరర్థకం" అని పెద్దలంటారు.

"అలరుజొంపములతో నభ్రంకషంబులై, బ్రదుకవే వనములఁ బాదపములు..."

అనే సీస పద్యంలో –

అడవుల్లో చెట్లు ఏపుగా ఆకాశాన్నంటేట్టు పెరగడంలేదా?

శిశ్నోదరపరాయణులై గ్రామాల్లో జంతువులు జీవించడంలేదా?

ఉచ్ఛ్వాసనిశ్వాసాలనేవి మానవులకేకాక కొలిమితిత్తులకులేవా?

పందులు, కుక్కలు దీనవదనాలతో వీధులవెంబడి ఇంటింటి వాకిట తిరగడంలేదా?

ఒంటెలు, గాడిదలు బరువులు మోయడంలేదా? విష్ణుభక్తిలేని మానవపశువు అడవుల్లో ఉన్నా, ఇంటిలో ఉన్న వాడిజీవితం వ్యర్థమే!

"విష్ణుకీర్తనముల విననికర్ణంబులు కొండలబిలములు కువలయేశ!... (2-49)

అనే సీసపద్యంలో -

విష్ణుకథలు విననివాని చెవులు కొండగుహలు. విష్ణుకీర్తనలు, స్తోత్రాలు చదవని వాని నాలుకలు కప్పనాలుకలు, విష్ణుమూర్తిని దర్శింపనివానికన్నులు నెమలికన్నులు; విష్ణువును అర్చించనిచేతులు శవహస్తాలు, విష్ణుతులసిని వాసన చూడనిముక్కు పందిముక్కు, విష్ణువుకు ప్రదక్షిణం చేయనిపాదాలు చెట్లపాదాలు. (2-50)

"నారాయణుని దివ్యనామాక్షరములపైఁ గరగని మనములు కఠినశిలలు... (2-51)

అనే సీసపద్యంలో -

"విష్ణునామాలు చదివేటప్పుడు ఆ దివ్యనామాక్షరాలకు కరగని మనస్సులు బండరాళ్లు, విష్ణువుకథలు వినేటప్పుడు పులకింపనిదేహం మొద్దు. విష్ణువును నమస్కరింపని వానితలపైనున్న బంగారుకిరీటం కట్టెలమోపు. విష్ణుసమర్పణం చేయని మానవునిభాగ్యం అడవికాచినవెన్నెల. విష్ణుభజనం చేయకుండా నడచువాడు గాలిలో నడిచే జీవచ్ఛవం. విష్ణుమూర్తిపాదాలు చూడకుండ బ్రతికేవాడు పుచ్చినపత్తికాయలో ఉండే పురుగు వంటివాడు.

ఇది భాగవతోపదేశం. ఈ భావాలే నవమస్కంధంలోని ప్రహ్లాదచరిత్రలో విస్తరింపబడ్డాయి.

## వాసుదేవుని లీలావతారాలు

ప్రథమస్కంధంలో - 1. సనత్కుమారుడు 2. వరాహస్వామి 3. నారదముని 4. నర-నారాయణులు 5. కపిలుడు 6. దత్తాత్రేయుడు 7.సుయజ్ఞుడు 8. వృషభుడు 9. పృథుచక్రవర్తి 10. మత్స్యమూర్తి 11. కూర్మమూర్తి 12. ధన్వంతరి 13. జగన్మోహిని 14. నరసింహుడు 15. వామనుడు 16. పరశురాముడు 17. వ్యాసుడు 18. శ్రీరాముడు 19. బలరాముడు 20. శ్రీకృష్ణుడు 21. బుద్ధుడు అనే ఇరవైఒక్కఅవతారాలు 22. భవిష్యదవతారంగా కల్కిమూర్తి అవతారం పేర్కొనబడినాయి. ఇవి 22 అవతారాలు సూచనప్రాయంగా ఉన్నాయి.

ద్వితీయస్కంధంలో - ఈ పై చెప్పబడిన అవతారాలే కొంచెం విస్తరింపబడ్డాయి. కానీ, వీటి క్రమం మారింది. 1. వరాహావతారం. 2. సుయజ్ఞుడు 3. కపిలుడు 4. దత్తాత్రేయుడు 5. సనకసనందన - సనత్కుమార- సనత్సుజాతావతారాలు 6. నర - నారాయణావతారం 7. ధ్రువుడు 8. పృథుచక్రవర్తి 9. వృషభుడు/ఋషభుడు 10. హయగ్రీవుడు 11. మత్స్యావతారం 12. కూర్మావతారం 13. నృసింహావతారం 14. ఆదిమూలావతారం (గజేంద్రమోక్షణం) 15. వామనావతారం 16. హంసావతారం 17. మనువు 18. ధన్వంతరి 19. పరశురాముడు 20. శ్రీరాముడు 21. శ్రీకృష్ణుడు 22. బలరాముడు 23. వ్యాసుడు 24. బుద్ధావతారం 25. భవిష్యత్కాలంలో కల్కివతారం మొత్తం 25 అవతారాలు చెప్పబడ్డాయి.

ప్రథమస్కంధంలో చెప్పబడిన 1. నారద 2. మోహిన్యవతారాలు ద్వితీయస్కంధంలో లేవు. ద్వితీయస్కంధంలో చెప్పిన 1. ధ్రువ 2. హయగ్రీవ 3. ఆదిమూల 4. హంస 5. మను – అవతారాలు ప్రథమస్కంధంలో లేవు. మొత్తం భాగవతంలో చెప్పిన విష్ణుమూర్తి అవతారాలు ఇరవైయేడు. సనకావతారమన్నా – సనత్కుమారావతారమన్నా ఒక్కటే! వీనిలో దశావతారాలు ప్రధానమైనవి.

## దశావతార నిర్ణయం

**శ్లో. మత్స్యః కూర్మో వరాహశ్చ నరసింహోఽథ వామనః ।**
**రామో రామ శ్చ కృష్ణ శ్చ బుద్ధః కల్కీ చ తే దశ ॥ (4-2)**

అని వరాహపురాణం! ఈ దశావతారాలే తక్కిన స్కంధాల్లో వర్ణింపబడ్డాయి. ఇక్కడ ఒక రహస్యం చెప్పాలి!

శ్రీ శంకర భగవత్పాదులు బౌద్ధమతాన్ని ఖండించినా బుద్ధావతారాన్ని అంగీకరించారు.

**శ్లో. మత్స్యః కూర్మో వరాహో నరహరిణపతి ర్వామనో జామదగ్న్యః ।**
**కాకుత్స్థః కంసఘాతీ మనసిజవిజయీ య శ్చ కల్కీ భవిష్యన్ ॥**
**విష్ణోరంశావతారా భువనహితకరా ధర్మసంస్థాపనార్థాః ।**
**పాయాసుర్మాంత తు పతే గురుతరకరుణా భారఖిన్నాశయా యే ॥**

అని విష్ణుపాదాది కేశాంతవర్ణన స్తోత్రం! విశిష్టాద్వైతులైన శ్రీవైష్ణవులు బుద్ధావతారాన్ని అంగీకరించరు .

**శ్లో. మీనాకృతే! కమఠ! కోల! నృసింహ! వర్ణిన్!**
**స్వామిన్! పరశ్వథ! తపోధన! రామచంద్ర!**
**శేషాంశరామ! యదునందన! కల్కిరూప!**
**శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥**

అందుచేతనే శ్రీవేదాంత దేశికులవారు –

"ఇచ్ఛామీనవిహార కచ్ఛపమహాపోత్రిన్ యదృచ్ఛాహరే..." అంటూ బుద్ధావతారాన్ని గ్రహించలేదు.

మాధ్వులైన శ్రీవాదిరాజస్వామివారు దశావతారస్తుతిలో బుద్ధావతారాన్ని స్వీకరించారు. జయదేవుడు (క్రీ.శ.11శ.) గీతగోవిందంలోను, శ్రీ శ్రీహర్షుడు (12శ.) నైషధంలోను, బుద్ధావతారాన్ని గ్రహించారు. అదే సాహిత్య సంప్రదాయమైంది. పోతన దశావతారవర్ణనం వచ్చిన ప్రతిచోట బుద్ధావతారాన్ని వర్ణించాడు.

తరువాతవచ్చిన ఆంధ్రకవులైన పెద్దన, శ్రీకృష్ణదేవరాయలు, మొదలైనవారందరూ పోతనగారినే అనుసరించారు.

**పోతన రామాయణాలు**

భాగవతంలోని ద్వితీయస్కంధంలో, నవమస్కంధంలో రెండుసార్లు శ్రీరామచరిత్రం వచ్చింది. శ్రీరామభక్తుడైన పోతన మహాకవి ఈ స్కంధంలో మూలంలో మూడుశ్లోకాలుంటే 18 గద్యపద్యాలలో (పద్యం 154 నుండి 171 వరకు) శబ్దార్థాలంకారాలతో పెంచి రచించాడు.

శబ్దాలంకారాలతో నిండిన మూడుపద్యాలను చూడవచ్చు.

**క. ఆ వనమున వసియించి నృ - పావననయశాలి యిచ్చె నభయములు జగ**
**త్పావనమునిసంతతికిఁ - గృపావననిధియైన రామభద్రుం డెలమిన్.**

**క. ఖరకరకులజలనిధిహిమ, కరుఁడగు రామవిభుఁడు గఱకరితోడన్**
**ఖరుని వధించెను ఘనభీ - కరశరముల నఖిలజనులుఁ గర మరుదందన్.**

**క. రావణునఖిల జగద్వి - ద్రావణుఁ బరిమార్చి నిలిపె రక్షోవిభుఁగా**
**రావణు ననుజన్ముని నై - రావణసితకీర్తి మెదసి రాఘవుఁ డెలమిన్. (2 - 163, 164, 165)**

శ్రీకృష్ణుడు తన నోటిలో యశోదకు బ్రహ్మాండభువనభాండాలను చూపిన ఘట్టాన్ని ఇలా వర్ణించాడు.

**క. మదిఁ గృష్ణుండు యశోదబిడ్డఁ డని నమ్మంజాల యోగీంద్ర! త**
**ద్వదనాంభోజములోఁ జరాచరసమస్తప్రాణిజాతాటవీ**
**నదనద్యద్రిపయోధియుక్తమగు నానాలోకజాలంబు భా**
**స్వదనూనక్రియఁ జూపెఁ దల్లికి మహాశ్చర్యంబు సంధిల్లఁగన్. (2-178)**

నాచన సోమనాథుడు ఉత్తరహరివంశంలో 56 దేశాలపేర్లు ఒకే సీసపద్యాలలో, ఒకే సమాసంలో గుదిగుచ్చాడు. ఇదొకచమత్కారం. పోతన, శ్రీకృష్ణుడు చంపిన రాక్షసులపేర్లను ఒకే పద్యంలో ఇలా చెప్పాడు.

**చ. నరక మురప్రలంబ యవన ద్విప ముష్టిక మల్ల కంస శం**
**బర శిశుపాల పంచజన పౌండ్రక పల్వల దంతవక్త్ర వా**
**నర ఖర సాల్వ వత్స బక నాగ విదూరథ రుక్మి కేశి ద**
**ర్దుర వృష ధేనుక ప్రముఖదుష్టనిశాటులఁ ద్రుంచె వ్రేల్మిడిన్. (2-190)**

ఇదే విధంగా విష్ణుభక్తులపేర్లను ఒకే సీసపద్యంలో పొదిగాడు.

**సీ. గాధి గయాదులిక్ష్వాకు దిలీప మాంధాతృ భీష్మ శుకయయాతి సగర**
**రఘు ముచుకుం దైళ రంతిదే వోద్ధవ సారస్వతోదంక భూరిషేణ**
**శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల బలి విభీషణ శిబి పార్థ విదురు**
**లంబరీష పరాశరాలర్క మిథిలేశ్వరానుసౌభరి దేవలాభిమన్యు**

**తే.** **లార్ష్టిషేణాదులైన మహాత్ము లెలమిఁ, దవిలి యద్దేవు భక్తిఁ జిత్తముల నిల్పి**
**తత్పరాయణులౌట దుర్దాంతమైన, విష్ణుమాయఁ దరింతురు విమలచరిత! (2-204)**

"సుర, సిద్ధ, సాధ్య, కిన్నర, వర, చారణ, గరుడ, గంధర్వ, పిశాచ..." ఇత్యాది సీసపద్యం కూడ సుదీర్ఘ సమాసంతో నడచింది. ముద్దులొలికే తెలుఁగు పలుకుల కూర్పునకు ఉదాహరణం-

**క.** **ముద్దుల కొమరుని వ్రేతల, రద్దులకై తల్లి ఱోల రజ్జులఁ గట్టం**
**బద్దులకు మిన్ను ముట్టిన, మద్దుల వడిఁ గూల్చె జనసమాజము వొగడన్. (2-177)**

సుదీర్ఘ సంస్కృత సమాన సంఘటనానికి ఉదాహరణం-

**సీ.** **క్షాళితాఖిలకల్మషప్రజామరనదీ, జనకకోమలపదాబ్జముల వాని**
**నఖిలసంపత్కారణాపాంగలక్ష్మీ వి, లాసితవక్షస్థలంబు వానిఁ**
**బద్మమిత్రామిత్రభాసురలోచన, నలినసుందరనయనముల వాని**
**భువననిర్మాణనైపుణభవ్యనిజజన్మకారణనాభిపంకజము వాని.**

**తే.గీ.** **నహిహితాహితశయనవాహముల వాని, సేవితామరతాపసశ్రేణి వాని**
**నఖిలలోకంబులకు గురుఁడైన వాని, గాంచెఁ బరమేష్ఠి కన్నుల కఱువు దీఱ**

## అలంకారయోజనం

**1. యమకములు**

**క.** **తోయజసంభవ! నా కీ, తోయము వివరింపు, చాలఁ దోఁచిన నే నా**
**తోయమువారికి నన్యుల, తోయములం జెందకుండ ధ్రువ మెఱిఁగింతున్. (2-78)**

**క.** **హరిసుతుఁ బరిచరుఁగాఁ గొని, హరిసుతుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్,**
**హరివిభునకు హరిమధ్యను, హరిరాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై. (2-165)**

(హరి) శ్రీవిష్ణు స్వరూపుఁడైన రాముఁడు, (హరి) సింహపరాక్రముఁడై

(హరి) సూర్యుని కుమారుడైన సుగ్రీవుని బంటుగాఁగైకొని

(హరి) ఇంద్రుని కుమారుడైన వాలినిఁజంపి, (హరి) యమపురికి పంపాడు.

(హరి) వానరాధిపుఁడైన సుగ్రీవునికి (హరి) సింహమధ్యయగు రుమను, రాజ్య పదవిని ఇచ్చాడు.

ఇలాంటి యమకాలు భాగవతంలో కోకొల్లలుగా ఉన్నాయి.

**2. రూపకాలంకారం**

**సీ.** **తోయజహితవంశదుగ్ధపారావారరాకావిహారకైరవహితుండు**
**కమనీయకోసలక్ష్మాభృత్సుతాగర్భశుక్తిసంపుటలసన్మౌక్తికంబు. (2-155)**

సూర్యవంశమనే పాలకడలికి పూర్ణచంద్రునివంటివాడు, కౌసల్యాగర్భమనేముత్యపుచిప్పకు ముత్యం వంటివాడు... అని ఈ విధంగా ఆరోపించి భావనిరూపణం చేయడంచే రూపకాలంకారం.

**3. యథాసంఖ్యాలంకారం**

**"కిసలయఖండేందుబిసకుందపద్మాబ్జపదఫాలభుజరదపాణినేత్రఁ" (2-59)**

ఈ పద్యంలో చిగుళ్లవంటి పాదాలు, అర్ధచంద్రునివంటినుదురు, తామరతూండ్లవంటిచేతులు, మల్లెమొగ్గలవంటిదంతాలు, పద్మాలవంటిచేతులు, పద్మాలవంటికన్నులు, గల్గినది సీత అని అన్ని పాదాలలో ముందు ఉపమానాలూ, తర్వాత ఉపమేయాలూ క్రమంగా చెప్పడంచే యథాసంఖ్యాలంకారం.

**4. విరోధాభాసాలంకారం**

**ధర్మసంరక్షకత్వప్రభావుం డయ్యు ధర్మ విధ్వంసకత్వమునఁ బొదలి (2-171)**

ధర్మము= న్యాయము, యజ్ఞము, విల్లు

విశ్వామిత్రుని యజ్ఞాన్ని (ధర్మాన్ని) రక్షించినవాడైనప్పటికీ, శివధనుస్సును (ధర్మాన్ని) ధ్వంసం చేసినవాడని విరోధాన్ని కల్పించి పరిహరించడంచే విరోధాభాసాలంకారం.

**5. అర్థాంతరన్యాసాలంకారం**

**హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తమునం దలంచి**
**పరువడి నుయ్యి ద్రవ్వునె పిపాసితుఁడై సలిలాభిలాషితన్? (2-209)**

శ్రీ విష్ణువును మనస్సులో ధ్యానం చేసి, సౌఖ్యం పొందిన బుద్ధిమంతులు తక్కిన పనులు చేయరు. ఇంద్రుడైనా సరే, దాహం వేసినప్పుడు నీళ్లకోసం బావిత్రవ్వడం సరైన కార్యమా? అని విశేషాన్ని సామాన్యంచే సమర్థించడంచే అర్థాంతరన్యాసాలంకారం.

## శాస్త్ర పరిచయం

**1. యోగశాస్త్రం**

సీ. **అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ బీడించి ప్రాణంబు బిగియఁ బట్టి**

వ. **మఱియు దేహత్యాగకాలంబున... సహింపఁ జాలక**

సీ. **అట్టి బ్రహ్మలోకమందు వసించు, రాజవర్య! మరల రాఁడు వాఁడు (2-29-31)**

ఇక్కడ యోగాభ్యాసం, యోగి గతిక్రమం, యోగికి పునరావృత్తి రహితమైన బ్రహ్మలోకప్రాప్తి చెప్పబడ్డాయి.

**2. సాంఖ్యశాస్త్రం**

**వ. ప్రకృతి యంశంబున మహత్తత్త్వం బగు, మహత్తత్త్వాంశంబున నహంకారం బగు, నహంకారాంశంబున శబ్దతన్మాత్రం బగు... గంధ తన్మాత్రంబునఁ బృథివి యగు, వాని మేళనంబునం జతుర్దశ భువనాత్మకంబైన విరాడ్రూపం బగు. (2-32)**

ఇక్కడ - మూలప్రకృతి → మహత్తత్త్వం (బుద్ధి) → అహంకారం - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రలు → ఆకాశ వాయు, తేజోజల, పృథివీ సృష్టి → వాటిమేళనంవల్ల చతుర్దశభువనసృష్టి - కపిల మహర్షి సాంఖ్యదర్శనాన్ని అనుసరించి చెప్పబడ్డాయి.

**వ. వినుము, మాయావిభుండైన యీశ్వరుండు... అండంబు భేదించి, నిర్గమించె. (2-86)**

ఈ వచనంలో - మహత్తత్త్వం → కాలం → స్వభావం → పరిణామం → ద్రవ్యశక్తి → క్రియాశక్తి → జ్ఞానశక్తి → శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు → పంచీకరణం → చెవి, చర్మం, కన్నులు, నాలుక, ముక్కు, వాక్కు, హస్తం, పాదం, గుదం, గుహ్యం అనే ఇంద్రియాలు వీటి అధిదేవతలు - బుద్ధి - ప్రాణం - వీటి సృష్టి, బ్రహ్మాండ సృష్టి చెప్పబడింది.

**3. సంగీత శాస్త్రం**

**సీ. తనరారు మంద్ర మధ్యమ తారముల నింపు దళుకొత్త రాగభేదములఁ జెలఁగి**
**దైవత ఋషభ గాంధార నిషాద పం, చమ షడ్జ మధ్యమ స్వరము లోలి (2-188)**

**గలుగజాతులు మూర్ఛనల్ గలగ వేణు...**

మంద్రము= గంభీరమైన స్వరం; మధ్యమము= మంద్ర తారముల నడిమిస్వరం; తారము= ఉచ్చస్వరం; స= షడ్జం; రి= ఋషభం; గ= గాంధారం; మ= మధ్యమం; ప= పంచమం; ధ= ధైవతం; ని= నిషాదం; స-రి-గ-మ-ప-ధ-ని - ఈ సప్తస్వరాల ఆరోహణ, అవరోహణాలకు మూర్ఛన అని పేరు. ఆనందభైరవి మొదలైన రాగాలు ప్రసిద్ధాలు.

## ప్రయోగ విశేషాలు

ప్రతియుగ - (దు) ర్గతికులు - (శాశ్వతములు - (స)న్నుతుఁడు) అని వావిళ్ల పాఠం. (2-194)

ప్రత్యుగ - (దౌ) ర్గత్యగులైన - సత్యము - సాత్యవతేయ - అని ఎకాడెమీ పాఠం. ఇది వ్రాతప్రతుల్లోని పాఠమై ఉంటుంది. సంస్కృత నిఘంటువుల్లో **'యుగ'** శబ్దమున్నది. **ఉగ** శబ్దం లేదు.

ఉగము - వి. (సం.యుగం - జన్మము, ఉగాది)

వి. (సం.యుగాది : క. ఉగాది) అని సూర్యరాయాంధ్ర నిఘంటువు

ప్రతి+ఉగము= ప్రత్యుగము. పోతనగారి ప్రౌఢ ప్రయోగం.

## పూర్వకవుల అనుకరణాలు

**పాల్కురికి సోమనాథుడు - పోతన**

తెలుగు పద్యాలను సంస్కృత వాక్యాలతో అలంకరించడం ఒక చమత్కారం. ఈ విధమైన రచనావిధానానికి ఒరవడి పెట్టినవాడు పాల్కురికి సోమనాథుడు. సోమన శివభక్తిని ప్రచారం చేస్తే, పోతన విష్ణుభక్తిని ప్రచారం చేశాడు.

సీ. శ్రుతి 'ఏక ఏవరుద్రో న ద్వితీయాయ తస్థే' యనుట యథార్థంబు దలcప
నవల 'నణోరణీయాన్ మహతో మహీయా' నన నదియె యనూనపదము
పంబి 'యవాగ్గోచరం' బను 'నప్రాప్య మనసా సహ' యనుమాట నిజము
ఏదియుc గాదనియెడి పరమేశుcడే', యెంతయు నని యెర్గి యెఱుcగ ననక

ఆ.వె. ఎట్టు లనుచు సంశయింపక శివతత్త్వసారగద్యపద్య సమితి శివుని
మహిమc దెల్పినట్టి మల్లికార్జున పండి - తయ్యగారిc దలcతు ననుదినంబు.

ఇటువంటి పద్యాలు పాల్కురికివారి అనుభవసారంలో ఎక్కువగా ఉన్నాయి. సరిగ్గా ఇలాంటి పద్యాన్నే పోతనకూడా రచించాడు.

సీ. వల నొప్పcగా 'న దైవం కేశవాత్పర', మ్మని పల్కు రాజకీరావళియును
మహిమ 'జగద్విష్ణు మయ మఖిల' మ్మని చదివెడు శారికాసముదయంబు
నేపారcగా 'జితం తే పుండరీకాక్ష' యని లీలc బాడు పికావళియును
లలిమీఱcగా 'మంగళం మధుసూదన' యనుచుc బల్కెడు మయూరావళియును,

తే.గీ. దవిలి 'శ్రౌషడ్వషట్ స్వధేత్యాది' శబ్దకలితముగ మ్రోయు మధుపనికాయములును,
గలిగి యఖిలైకదివ్యమంగళవిలాసమహిమజెన్నొందు వైకుంఠమందిరంబు. **(2-228)**

**భాస్కరుడు - పోతన**

క. రాముcడు మేచకజలద - శ్యాముcడు సుగుణప్రభావసంయమివినుతి
స్తోముcడు గిరిజాధివనుత - నాముcడు వాక్రుచ్చెc గుశికనందనుతోడన్. **(బాల - 353)**

క. రామున్ మేచకజలద - శ్యామున్ సుగుణాభిరాము సద్వైభవసు
త్రామున్ దుష్టనిశాటవి - రామున్ బొమ్మనియెc బంక్తిరథుc డడవులకున్. **(భాగవతం, 2 - ప.160)**

## పోతనను అనుకరించిన కవులు

**1. పోతన - వారణాసి వెంకటకవి (1850)**

సీ. కిసలయఖండేందుబిసకుందపద్మాబ్జ, పదఫాలభుజరదపాణినేత్రc
గాహళకరభచక్రవియత్పులినశంఖజంఘోరుకుచమధ్యజఘనకంఠ

ముకురచందనబింబశుకగజశ్రీకరగండగంధోష్ఠవాగ్గమనకర్ణఁ
జంపకేందుస్వర్ణశఫరధనుర్నీలనాసాననాంగదృగ్భ్రూశిరోజ

తే.గీ.నళి సుధావర్తకుంతలవాసనాభికలితజనకావనీపాలకన్యకా ల
లానుఁ బరిణయ మయ్యె లలాటనేత్ర - కార్ముక ధ్వంస ముంకువ గాఁగ నతఁడు (భాగవతం (2-158))

సీ. అర్ధచంద్రశరాసనాబ్జాబ్దశష్కులీ - కచముఖభ్రూనేత్రగండకర్ణ
హీరకందుకబింబకీరచంపకచంద్ర - రదచుబుకోష్ఠవాగ్ఘ్రాణహాస
దరబిసపల్లవధరతరంగమృగేంద్ర - గళభుజకరకుచవళివలగ్న
మహికరతూణకమఠదంతితారకా - కటిసక్థిజంఘాంఘ్రిగమననఖర

తే.గీ.కాంచనశిరీషకుసుమసత్కాంతిదేహ - మాంగళికదివ్యలక్షణమహిత యగుచు
రఘుకులోద్భవుసామ్రాజ్యరమ యనంగ, జనకసుతయొప్పెఁబరిణయసమయమందు.
- రామచంద్రోపాఖ్యానం (2-131).

**పోతన - బుద్ధవరపు మహాదేవకవి**

సీ. వలనొప్పఁగా 'నదైవం కేశవాత్పర' మ్మని పల్కు రాజకీరావళియును...

అనే పోతనగారి సీసపద్యానికి మహాదేవకవి 'సూతసంహిత'లో చేసిన అనుకరణం.

సీ. సాకల్య మెఱుఁగుడీ 'యేకమే వాద్వితీయం బ్రహ్మ' యని పల్కులలరఁ బల్కఁ
జాలఁ జింతింపఁ 'నశబ్ద మస్పర్శ మరూప' మ్మనుచు నీశ్వరుని వచింప
'బ్రహ్మ యో వేద న బ్రహ్మైవ భవతి' సత్యమ్మంచు ఘంటాపథమ్ము తెలుపఁ
గన నెంతయును 'నిర్వికార నిరంజన పురుషుఁ డుమేశు'ఁడన్ బోధ మెసఁగ

తే.గీ.శ్రుతిని బోలెడు వేఱొక్కచొప్పు నెందుఁ గాంచ మెన్నండు నితరమార్గములు సతముఁ
బల్కఁజాలు నవిద్య వేభంగు లొప్పు, విద్య వెలయింపఁ జాలవు పెఱతెఱువులు
(సూతసంహిత - యజ్ఞవైభవఖండం - ప.357)

**ప్రామాణికత్వంకోసం ధర్మశాస్త్రశ్లోకాన్ని ఉదాహరించడం**

పురాణానువాదం చేస్తున్న పోతన్నగారు ప్రామాణికభావప్రతిపాదనంకోసం ధర్మశాస్త్రశ్లోకాలను సందర్భోచితంగా, యథాతథంగా స్వీకరించడం తెలుగులో పురాణానువాదం చేసిన కవుల సంప్రదాయమే!

శ్లో. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః ।
తా య దస్యాయనం పూర్వం తేన నారాయణ స్మృతః ॥ - మనుస్మృతి (1-10)

మనుస్మృతిలోని ఈ శ్లోకం చాలపురాణాలలో స్వీకరింపబడింది. దీన్ని యథాతథంగా పోతనగారు ఉదారించారు (భాగవతం 2-268).

ఇది సంస్కృత భాగవతంలో లేదుగాని, శ్రీధరస్వామి వ్యాఖ్యలో ఉంది.

## మకుటనియమం - భక్తిమార్గసూచకం

ఆదికవి నన్నయభట్టు ఆంధ్రమహాభారతం ఆదిపర్వం ఉదంకకృత నాగస్తోత్రంలో **"...అనంతుడు మాకు ప్రసన్నుఁడయ్యెడున్"** అనే మకుటంతో రెండువృత్తపద్యాలు వ్రాసినట్లుగా, పోతనగారుకూడ...**అఘౌఘ నివర్తను భద్రకీర్తనున్"** అనే మకుటంతో రెండుఉత్పలమాలలు, ఒకచంపకమాలావృత్తాలతో మొత్తం మూడు పుష్పమాలల్ని పరమేశ్వరునికి నమస్కార ప్రశంసాపూర్వకంగా సమర్పించాడు. ఆ మూడువృత్తపద్యా లివి -

**ఉ. ఏ విభువందనార్చనము లేవిభు చింతయు నామకీర్తనం**
**బే విభు లీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ, దో**
**షావళిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నంద్రు నే**
**నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్**

**ఉ. ఏ పరమేశుపాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్**
**లోపలిబుద్ధితో నుభయలోకము లందుల జడ్డుఁ బాసి యే**
**తాపములేక బ్రహ్మగతిఁ దారుగతశ్రములై చరింతు రే**
**నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్**

**చ. తపములఁ జేసియైన మతి దానము లెన్నియుఁ జేసియైన నే**
**జపములఁ జేసియైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే**
**యపదములై దురంత విపదంచిత రీతిగ నొప్పుచుండు న**
**య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్ - భాగవతం (2-60,61,62)**

**'ఆశ్రయించెద', 'మ్రొక్కెద', 'భజించెద'** అనే మూడు క్రియాపదాలచే నవవిధభక్తిమార్గాలలో పై మొదటి పద్యంలోనే చెప్పినట్లుగా, వందనం, అర్చనం, కీర్తనం అనే మూడువిధాలైన భక్తిమార్గాలను పోతన భగవద్విషయంలో నిరూపించారు.

## పోతన ఆంధ్రాభిమానం

**శ్లో. కిరాత హూణాంధ్ర పులింద పుల్కసా, ఆభీరకంకాయవనాః కషాదయః ।**
**యేఽన్యే చ పాపాయదుపాశ్రయాశ్రయాః, శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః ॥ - వ్యాసభాగవతం (2-4-18)**

సంస్కృత భాగవతంలో పై శ్లోకంలో చెప్పబడిన పాపులలో ఆంధ్రులుకూడ చేరి ఉన్నారు.

**మ. యవనవ్యాధ పుళింద హూణ కషకంకా భీర చండాల సం**
**భవులున్ దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి, భా**
**గవత శ్రేష్ఠులఁ దాసి శుద్ధతనులై కల్యాణులై యుందు రా**
**యవికారున్ బ్రభవిష్ణు నాదు మదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్. (పోతనభాగవతం (2-63))**

పోతన ఈ అనువాదపద్యంలో పాపుల పట్టికనుండి ఆంధ్రుల్ని మినహాయించి, ఔచిత్యాన్ని పాటించడంచేత ఆయనకు ఆంధ్రజాతిపైగల అభిమానం స్పష్టమౌతున్నది.

## సాధుపాఠ నిర్ణయం

**ఆ.వె.'ఇచ్ఛలేనియోగి - యొక్క ముహూర్తార్ధ...' (2-29)**

అని ఆం.ప్ర.సా. అకాడెమీ ప్రతిపాఠం, యతిభంగం.

**ఆ.వె.ఇచ్ఛలేనియోగి - యెలమి ముహూర్తార్ధ...**

అని తంజనగరం, వావిళ్లవారిపాఠాలు. ఇవే సరైనవి.

2. **త్వక్కు ధాత్రీఛందం బనియు (2-89)**

అన్ని ప్రతుల్లో ఈ పాఠమే ఉంది. **గాయత్రీ** ఛందముందిగాని **'ధాత్రి'** అనే ఛందం లేదు...

**'త్వగింద్రియమువలన గాయత్రీఛందంబును'** (3-388) అని మూడవస్కంధంలో స్పష్టంగా ఉంది. కాబట్టి **'త్వక్కు గాయత్రీఛందం బనియు'** అని ఉండాలి.

3. **మయసూనుం డగు దానవుండు నిజమా - యన్ గోపరాజిన్** (2-182) ఇక్కడ యతిస్థానం తప్పింది. 14వ స్థానంలో ఉండవలసిన 'మా' వర్ణం 13వ స్థానంలో పడింది.

అందుచేత, శ్రీపురాణం హయగ్రీవశాస్త్రిగారు **"హయసూనుం డగు దానవుండు నిజమా - యన్..."** అని సవరించారు. తంజనగరం, వావిళ్ల ప్రతులీపాఠాన్నే స్వీకరించాయి.

పద్యంలోని రాక్షసుడు **'మయసూనుఁడు'** కని, **'హయసూనుఁడు'** కాదు, మయాసురుని కుమారుడు **వ్యోమాసురుఁడు. 'మయసూనునా చ'** అని మూలం. మయసూనుః = వ్యోమాసురః**, మయసూనునా= వ్యోమాసుర పుత్రేణ** అని వ్యాఖ్యలు.

**శా. ఆలోదొంగలలో మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు** (10-1-1186)

అని దశమస్కంధంలో స్పష్టంగా ఉంది.

**మయపుత్రో మహామాయో వ్యోమో గోపాలవేషధృక్** (10-37-29)

అని సంస్కృత మహాభాగవతం. కాబట్టి, పురాణం వారు దిద్దిన **'హయసూనుం'**డనేది అపపాఠం, ఆం.ప్ర.సా అకాడెమీవారి సంపాదకవర్గంవారు చేసిన 'సవరణ' ఇలావుంది.

**మ. "మయసూనుండు నిజానువర్తుల మహామాయన్ మహీభృద్గుహాశ్రయులుంగా నొనరించి...'** (2-182)

అనే పద్యపాదాన్ని పూర్తిగా మార్చి యతిని సవరించారు. కాని, ఇది పోతన పాఠంకాదు.

**4. "అతి లోలాత్ములు సూనృతేతరులు ఖేదాచారసంశీలు,రు**
**ద్ధత పాషండ మతాపధర్ములు జగత్సంహారులైనట్టి యా**
**దితి సంజాతు లధర్మవాసనల వర్తింపం దదాచారసం**
**హతి మాయించి హరించె దానవులఁ బద్మాక్షుండు బుద్ధాకృతిన్ (2-196)**

**'ఖేదాచారసంశీలురు'** అన్నది తంజనగరం, వావిళ్లవారి పాఠం.

**'వేదాచారసంశీలురు'** అన్నది ఆం.ప్ర.సా. అకాడెమీవారి పాఠం.

రాక్షసులు, 'వేదాచారసంశీలురు' ఎట్లవుతారని సందేహించి, తంజనగరం వారు, వానిననుసరించి వావిళ్లవారు **'ఖేదాచారసంశీలురు'** అని పాఠాన్ని సవరించి ఉంటారు.

**"దేవద్విషాం నిగమవర్త్మని నిష్ఠితానామ్"** (2-7-37) అని సంస్కృతమూలం, ఇక్కడ -

**'దేవద్విషాం దైత్యానాం నిగమవర్త్మని వేదమార్గే**
**సత్కర్మానుష్ఠానాదే నిష్ఠితానాం నితరాం స్థితానాం తద్బలేన చ ।**
**పూర్భిః త్రిపురైః అదృశ్యతూర్భిః దేవాదిభి రప్యలక్ష్యవేగాభిః**
**కించ అయోరజత తామ్రమయీభిః లోకాన్ ఘ్నతామ్ ॥ - శ్రీధరవ్యాఖ్య.**

కాబట్టి, శ్రీధరీయవ్యాఖ్యానుసారం **'వేదాచార సంశీలురు'** అన్న పాఠమే సరైనది.

ధారణాస్వరూపం, విరాడ్విగ్రహస్వరూపం, భక్తిమార్గం, ప్రపంచసృష్టి, విష్ణుని 25 అవతారాలు, భాగవత మహాపురాణదశలక్షణాలు, చెప్పబడుటచే 'ద్వితీయం' 'అద్వితీయ'మని పండితులు చెబుతారు.

**ప్రథమస్కంధం - సూత్రగ్రంథం**

**ద్వితీయస్కంధం - వార్తికం**

**తక్కిన భాగవతమంతా - భాష్యం**

మ. పరుఁడై, యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థానసం
హరణక్రీడనుఁడై, త్రిశక్తియుతుఁడై, యంతర్గతజ్యోతియై,
పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు దు
స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్.

శ్రీమత్పరమేశ్వరార్పణ మస్తు

విజయవాడ,
30-12-2016

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుడు
**గరిమెళ్ల సోమయాజులు శర్మ**

# ప్రథమస్కంధం - కథాసారం

**స**మస్తమైన అరణ్యాలలో అగ్రగణ్యమయినదీ, మిక్కిలి పుణ్యప్రదమైనదీ 'నైమిశారణ్యం' అది పుష్పఫలసముదాయంతో కూడినదీ, సమస్త మునీశ్వరులచే ప్రశంసించబడినదీ, అత్యంత ప్రశాంతమైనదీ అయిన విష్ణుక్షేత్రం కూడా. పూర్వం శౌనకాది మహర్షులందరూ చేరి విష్ణుసాయుజ్యం పొందడానికి వేయి సంవత్సరాలు పట్టే సత్త్రయాగాన్ని చేస్తుండగా, ఒకనాడు వేదవ్యాసమహర్షి శిష్యుడూ, రోమహర్షణుని పుత్రుడూ సుప్రసిద్ధ పౌరాణికుడూ ఉగ్రశ్రవసుడు అనే పేరుగల సూతమహర్షి అక్కడికి వచ్చాడు. ఆ మహాఋషులందరూ సూతుని ఆహ్వానించి, అతని గుణగణాలను ప్రశంసించి ఈ విధంగా వేడుకొన్నారు.

"మహాజ్ఞానీ! మహానుభావా! సూతమహర్షీ! వేదవ్యాసాది మేధావులు, మహామునులు దర్శించిన వేద శాస్త్ర పురాణ ఇతిహాసగ్రంథాలన్నింటినీ నీవు లోతుగా అవగాహన చేసుకొన్నవాడవు. ఈ కలికాలంలో మానవులు మందబుద్ధులై అల్పాయుష్కులూ, భోగలాలసులూ, సోమరులూ, రోగగ్రస్తులూ, అభాగ్యులూ, మోక్షాసక్తిలేనివారు అవటంచేత వేదశాస్త్రాలను పఠించి, ఆ ధర్మాలను పాటించి సత్కర్మలను ఆచరించడానికి అసమర్థులై ఉంటారు. అలాంటివారిని తరింపజేయడానికి శ్రీకృష్ణపరమాత్ముని దివ్యగాథాశ్రవణమే ఏకైకమార్గమని విన్నాం. పుణ్యశ్లోకుడైన శ్రీమన్నారాయణుని పుణ్యకథలను వినిపించి, మా జన్మలను సార్థకం చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాం. ఇంకా కలియుగంలో మానవులు చాలా ఈతిబాధలకు లోనై అరిషడ్వార్గాలచే పీడింపబడతారు. శ్రీకృష్ణావతారం పరిసమాప్తమైన తరువాత, ధర్మం క్షీణించి ప్రజలు అజ్ఞానాంధకారంలో చిక్కుకొంటారు. దీనికి తగిన తరణోపాయాన్ని తెలుపవలసిందిగా కోరుతున్నాం". ఇలా శౌనకాదిమునులు వేడుకోగా సూతమహర్షి సంతోషించినవాడై ముందుగా శుకయోగికి, నరనారాయణ ఋషులకు, పురుషోత్తముడైన శ్రీకృష్ణునికి, సరస్వతీదేవికి, వ్యాసమహర్షికి, బ్రహ్మదేవునకు నమస్కరించి ఇలా చెప్పసాగాడు.

పుణ్యాత్ములైన ఓ మునీశ్వరులారా! శ్రీకృష్ణుని కథలను వినాలనే మీ కోరిక సర్వశుభాలను కలిగించేది. భగవానుని ఆరాధిస్తూ, కీర్తిస్తూ, ధ్యానిస్తూ ఉంటే సంసారాది బంధాలనుండి విముక్తి కలిగి మోక్షాన్ని పొందవచ్చు. భక్తులు కీర్తించే తన చరిత్రలను, వారు పాడే తన కీర్తనలను వింటూ సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణుడు తన్మయుడౌతాడు. వారిలోని భక్తి పెరుగుతున్నకొద్దీ కామక్రోధాదులు క్షీణించి, పరిశుద్ధులై, బుద్ధి వికసించి, భగవంతుని తత్త్వం ప్రకాశిస్తుంది. అద్వితీయమైన అవ్యక్తపరమాత్మ తన మాయాశక్తిచే త్రిమూర్తులుగా, వివిధత్వంతోకూడిన జగత్తుగా వ్యక్తమౌతాడు. ఆ పరమాత్మను దర్శించడమే మానవుల పరమలక్ష్యం. ఈ పరమాత్మయే సకల చరాచరసృష్టిస్థితిలయకార్యాలను నిర్వహిస్తూ అనేకరూపాలలో అవతరిస్తూ పరిపాలిస్తుంటాడు. ఈ భగవంతుని అవతారగాథల సంకలనమైన భాగవతాన్ని విని మానవుడు తరించగలడు.

పరబ్రహ్మస్వరూపుడు అయిన పరమేశ్వరుడే గరికపోచ నుండి బ్రహ్మపర్యంతం సకలజీవరాశులను సృష్టించాడు. ఆ సృష్టిలో దేవతలు, మానవులు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు), స్థావరాలు (చలనంలేనివి) అనే నాలుగు వర్గాలు ఉన్నాయి. వాటిలో స్త్రీ పురుషభేదాలు, సత్త్వ రజస్తమోగుణ భేదాలు ఏర్పడ్డాయి. మనుష్యజాతిని క్రమబద్ధీకరించడానికి

ఆశ్రమధర్మ భేదాలు, వర్ణవిభజనలు, వారి మనుగడకు పురుషార్థాలు నిర్దేశించబడ్డాయి. ఆ పురుషార్థాలను సాధించడానికి కావలసిన జ్ఞానాన్ని అందించడానికి చతుర్ముఖబ్రహ్మ ద్వారా భగవానుడే వేదాలను వెలువరింపజేశాడు. ఆ జ్ఞానాన్ని నేరుగా పొందడానికి సామాన్యులకు సాధ్యం కాదు కనుక భగవంతుడే వేదవ్యాసునిగా అవతరించి వేదవిజ్ఞానాన్ని ఒకచోట చేర్చి విపులీకరించి, కర్మకాండలతో కూడుకొన్న పూర్వభాగానికి తన శిష్యుడైన జైమినిచే పూర్వమీమాంసాసూత్రాలు వ్రాయించి జ్ఞానభాగమైన ఉత్తర భాగానికి తానే బ్రహ్మసూత్రాలను రచించాడు. అందులోను పూర్వభాగానికి వివరణగా పంచమవేదమనబడే మహాభారతాన్నీ, ఉత్తర భాగానికి వివరణగా శ్రీమద్భాగవతాన్ని రచించి, వాటిలో వేదసారాన్నంతా సులభంగా అర్థమయ్యేటట్లు పొందుపరచాడు.

సృష్టించాలనే సంకల్పం కలిగినపుడు దానికి అనుగుణమైన సమయంలో పరమాత్మ రజోగుణ ప్రధానమైన బ్రహ్మదేవుని శరీరంలో ఉండే జీవుని చేరి జగత్తును సృష్టిస్తాడు. ఉపసంహారం చేయదలచుకొన్నప్పుడు తమోగుణ ప్రధానమైన శివునిలోనుండే జీవునితో చేరి లయం చేస్తాడు. జగత్తుయొక్క రక్షణ పోషణకార్యాన్ని సత్త్వగుణ ప్రధానమైన విష్ణుస్వరూపంలో నిర్వహిస్తాడు. వేదాలలో నిర్దేశింపబడిన వాసుదేవుడే సృష్టికి పూర్వమందున్న పరమాత్మ, భగవానుడు. అతడు సమస్త జీవుల దశేంద్రియ, మనస్సులతోనూ, పంచభూతాలతోనూ కూడి విరాట్పురుషునిగా వెలసి, అనిరుద్ధుడు అనబడి, నీటిలో యోగనిద్రలో శయనించి, తన నాభిహ్రదము నుండి పద్మాన్ని సృష్టింపగా, ఆ పద్మంనుంచి బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. వేయిశిరస్సులతో, సహస్ర అవయవాలతో దివ్యాభరణాలతో ప్రకాశించే అనిరుద్ధ భగవానుని దివ్యదేహం నుంచి సనకసనందనాది నలుగురు కుమారులు, దేవమానవాదిరూపాలు ఆవిర్భవించాయి. ఆ దేవదేవుడే క్రమేణా కాలానుగుణంగా అనేకమైన అవతారాలెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపన, భక్తపాలన వంటి అనేకకార్యాలను నిర్వర్తించాడు. మంత్రద్రష్టలైన మునులు, వ్యాసవశిష్ఠాది మహర్షులు, దక్షాదిప్రజాపతులు, మనువులు, ఇంద్రాదిదేవతలు మొదలైన వారందరూ ఆ పరమాత్మయొక్క అంశలచే పుట్టినవారే.

శ్రీరామ, శ్రీకృష్ణ అవతారాలు పరిపూర్ణాలు. తక్కిన అవతారాలు ఒక ప్రత్యేకకార్యార్థమై సంభవించాయి. శ్రీకృష్ణావతారంలో జ్ఞానం, బలం, శక్తి, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు మొదలైన భగవంతుని దివ్యమంగళ లక్షణాలన్నీ ప్రకటితమయ్యాయి. అందుకే **'కృష్ణస్తు భగవాన్ స్వయం'** అని అన్నారు.

ఈ స్థూలజగత్తే కాకుండా మనోబుద్ధి అహంకారాలతో కూడుకొన్న సూక్ష్మదేహాలు కూడా భగవంతుని మాయచే ఏర్పడ్డాయి. ఆయన అవతారలీలారహస్యాలు పరిమితమైన మానవమేధాశక్తికి, తర్కహేతుచర్చలకు అంతుబట్టవు. ఆయన పాదపద్మాలను శరణు వేడినవారికి మాయపొరలు తొలగి మర్మం తెలుస్తుంది. సకల వేదసారాన్ని వ్యాసుడు, తన కుమారుడు శ్రీశుకదేవునికి బోధించాడు. శుకమహర్షి పరీక్షిత్తునకు, అక్కడ ఉన్న ఋషులకు వినిపించాడు. అక్కడ ఈ పరమపవిత్రమైన భాగవతగాథను వినే అదృష్టం నాకు దక్కింది. నా శక్తిమేరకు నేను విన్నదానిని మీ అందరికీ వినిపిస్తాను" – అని సూతమహర్షి శౌనకాది మహామునులకు వివరించాడు.

"పూర్వం ఉపరిచరవసువు వలన జన్మించిన సత్యవతికి పరాశరమహర్షి వల్ల నారాయణాంశతో వ్యాసుడు జన్మించాడు. అతడు కలియుగంలోని ప్రజల దుస్థితిని ధ్యానావస్థలో గమనించి, వారికి తేలికగా అర్థం కావడానికి వేదాలను నాలుగుగా విభజించి ఋగ్వేదాన్ని పైలునకు, యజుర్వేదాన్ని వైశంపాయనుడికి, సామవేదాన్ని జైమినికి, అథర్వవేదాన్ని సుమంతునకు అప్పగించి వాటిని తమ తమ శిష్యులకు బోధిస్తూ భద్రపరచాలని ఆదేశించాడు. పురాణేతిహాసాలను సూతుని తండ్రి అయిన రోమహర్షణునికి అప్పగించాడు. వేదాలను గ్రహించలేనివారికి మహాభారతాన్ని పంచమవేదంగా చతుర్వేదసారంగా భగవద్గీతను ఇమిడ్చి, సులభగ్రాహ్యంగా రచించాడు. బ్రహ్మసూత్రాలనూ వ్రాశాడు. ఇన్ని అనన్యసాధ్యమైన గొప్ప గ్రంథాలు వ్రాసినా వ్యాసుడు అశాంతితో వ్యాకులచిత్తుడై ఉండగా ఒకనాడు దేవర్షి నారదుడు వచ్చి వ్యాసుని ఊరడించి ఇలా అన్నాడు – "ఓ మహానుభావా! వేదవ్యాసా! నీవు అనేక వేదపురాణ శాస్త్ర ఇతిహాసాదులను అనన్యసాధ్యంగా లోకులకు అందించి ఎనలేని సేవ చేశావు. భారత మహాగ్రంథంలో ప్రసంగవశాన భగవానుని గుణగణాలను పేర్కొన్నావే కాని ప్రధానంగా దేవదేవుని గాథాగుణగణాలను కీర్తించలేదు. భగవత్స్వరూపలీలాగుణవైభవాలను నుతించని గ్రంథం ఎంత గొప్పదయినా అది నిస్సారమయింది. అట్టివాటిని పరమహంసలయిన పరమభాగవతోత్తములు ఎవ్వరూ ఆదరించరు. ప్రజలకు భక్తిని కలిగించలేని కర్మ దుఃఖహేతువే కాని ఫలప్రదంకాదు. భగవద్భక్తిని కలిగించని పురుషార్థసాధనలు మోక్షప్రదాలు కావు. భగవంతునికి సమర్పితంకాని కర్మఫలాలు తాత్కాలికాలు అనర్థాన్ని తెచ్చిపెట్టేవి. సుఖశాంతులను కలిగించవు. కాబట్టి ఓ వ్యాసమహర్షీ! సకల వేదశాస్త్ర జ్ఞాననిధివైన నీవే భగవానుని దివ్యలీలాగాథలను వివరించడానికి సర్వసమర్థుడవు. నీ రచనలను చదివినవారికీ, విన్నవారికీ మోక్షం లభిస్తుంది. నీవు భగవంతుని నామసంకీర్తన లీలాగుణవైభవగాథలతో కూడి భక్తిని ప్రతిపాదించే కావ్యాన్ని రచిస్తే పరమశాంతిని ఆనందాన్ని పొందగలవు" అని ఉపదేశించి నారదమహర్షి అందుకు తార్కాణంగా తన పూర్వజన్మవృత్తాంతాన్ని వివరించి నిష్క్రమించాడు.

ఆ తరువాత వ్యాసుడు తన 'శమ్యాప్రాసము' అనే ఆశ్రమంలో ధ్యానమగ్నుడై పరమదేవుని దర్శించి, ఆయన అధీనంలో ఉన్న మహామాయను దాటుకొని, భగవదనుగ్రహం పొందడానికి భక్తియే సాధనమని గ్రహించి శ్రీమహాభాగవత సంహితను రచించి తన పుత్రుడైన శుకయోగికి వివరించాడు అని సూతుడు శౌనకాది మునులకు ఇట్లు చెప్పసాగాడు.

పరీక్షిత్తుయొక్క జన్మనుగూర్చి, ముక్తినిగూర్చి, పాండవుల మహాప్రస్థానాన్ని, శ్రీకృష్ణకథోదయాన్ని మీకు వివరిస్తాను. మహాభారతయుద్ధంలో చివరిరోజు భీముని గదదెబ్బతో తొడలు విరిగి చచ్చేందుకు సిద్ధంగా ఉన్న దుర్యోధనుని దురవస్థచూచి అశ్వత్థామ విచారంతో అతనికి ప్రియం కలిగించడానికి రాత్రి పాండవశిబిరంలో దూరి గాఢనిద్రలో ఉన్న ద్రౌపదీపుత్రులైన అయిదుగురు ఉపపాండవుల తలలునరికి దుర్యోధనునికి చూపి సంతృప్తిపరచాడు.

ఈ ఘోరవార్తను విన్న అర్జునుడు కలతజెంది శ్రీకృష్ణుని తోడ్కొని అశ్వత్థామను బంధించి తెచ్చి, ద్రౌపది కోరికపై వానిని చంపకుండా అతని తలపైనున్న శిరోమణిని తీసివేసి, తల గొరిగించి విడిచిపెట్టాడు. తరువాత శ్రీకృష్ణుడు ధర్మరాజును పట్టాభిషిక్తునిజేసి, అతనిచే అశ్వమేధయాగాలను చేయించి, అపాండవం చేయాలనే

సంకల్పంతో అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రం బారినుండి ఉత్తరగర్భంలోని శిశువును రక్షించాడు. ఆ బాలుడే పరీక్షిత్తు.

భారతయుద్ధంలో జరిగిన అపారజననష్టంగూర్చి దుఃఖిస్తూ శ్రీకృష్ణవ్యాసనారదాదులు ఎంత సముదాయించినా ధర్మరాజు శోకబుద్ధితో తపించిపోతుంటే, అంపశయ్యపై శయనించి దేహత్యాగానికి సిద్ధంగా ఉన్న భీష్మునివద్ద శ్రీకృష్ణుని ప్రోత్సాహంతో అపారలోకానుభవ విషయాలు, శాస్త్రజ్ఞానసంగతులను తెలుసుకొన్నాడు. పాండవులవద్ద కొన్నాళ్లు గడిపి, వారినందరినీ ఒప్పించి శ్రీకృష్ణపరమాత్మ హస్తినాపురం నుండి ద్వారకకు వెళ్లిపోయాడు.

తరువాత కొన్నాళ్లకు శ్రీకృష్ణుడు తన అవతారాన్ని పరిసమాప్తం కావించాడని తెలుసుకొన్న ధర్మరాజాదులు అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తుకు సింహాసనం అప్పగించి, మహాప్రస్థానం చేశారు.

తదనంతరం పరీక్షిత్తు ధర్మమార్గం తప్పకుండా జనరంజకంగా, ధర్మబద్ధుడై రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. ఉత్తరాభిమన్యుల పుత్రుడైన పరీక్షిత్తు అనబడే విష్ణురాతుడు పరమభాగవతోత్తముడై, సద్గుణసంపన్నుడై, పరాక్రమశాలియై కృపాచార్యుల ఆధ్వర్యంలో మూడు అశ్వమేధయాగాలు నిరాటంకంగా జరిపించగా, దేవతలు నిజరూపాల్లోనే వచ్చి హవిస్సులను అందుకొన్నారట. అతడు తన మేనమామ అయిన ఉత్తరుని కుమార్తె ఐరావతిని వివాహమాడి జనమేజయుడు మొదలైన నలుగురు కుమారులను పొందాడు. పరీక్షిత్తు దిగ్విజయ యాత్రచేసి భద్రాశ్వ, కేతుమాల, ఇలావృత, రమ్యక, హిరణ్మయ, హరివర్ష, కింపురుష, భారతాది వివిధ దేశాలను జయించాడు. ఆయాదేశాలలోని ప్రజలు, పండితులు పఠిస్తూ ఉండే పూర్వరాజుల చరిత్రలను వింటూ, ఆ కథలద్వారా పాండవులకు శ్రీకృష్ణుడు చేసిన సహాయాలు, వాసుదేవుని పాదపద్మాలపట్ల పాండవులకు ఉండే భక్తివిశేషాలను తెలుసుకొంటూ పరమాత్మునిపట్ల అంకితమైన పవిత్రభక్తితో పరవశిస్తూ పుణ్యాత్ముడై జీవిస్తూ ప్రజలను కంటికిరెప్పలా కాపాడేవాడు. ఒకసారి పరీక్షిత్తు దేశాటనం చేస్తుండగా రాజువేషాన్ని ధరించిన ఒక అనాగరికుడు ఒంటికాలితో ఉన్న ఒక ఎద్దును, కన్నీరు కారుస్తున్న ఒక గోమాతను కాలితో తన్నుతూ అదలించడం చూసి వాడే కలిపురుషుడని, వృషభాన్ని ధర్మమూర్తిగాను, ఆవును భూమాతగాను గ్రహించి మెరపువేగంతో కత్తిదూసి కలిపురుషునిపైకి లంఘించాడు. అపుడు భయవిహ్వాలుడైన కలిపురుషుడు పరీక్షిత్తుని పాదాలపైబడి శరణు వేడుకోగా, ఆయన కనికరించి "ఓయీ! నీవు నీచాత్ముడవు. రాజవేషం ధరించావు గాని నీలో అన్నీ పాపప్రవృత్తులే గోచరిస్తున్నాయి. అసత్యలోభ దౌర్జన్య చౌర్య దురాచార కపట మాయా కాలుష్యాది అవగుణాలన్నీ నిన్ను ఆశ్రయించి ఉన్నాయి. నీవల్ల నా ప్రజలు అనేకబాధలకు గురి అవుతారు. కనుక నీవు నా రాజ్యంలో ఎక్కడా కనిపించరాదని శాసిస్తున్నాను" అని ఆజ్ఞాపించాడు. ఆ తర్వాత వృషభమూర్తికి లోపించిన 'తపం – శౌచం – దయ' అనే మూడు పాదాలను పునరుద్ధరించి, భూమాతకు ఆనందం కలిగించి, కలిపీడ లేకుండా రాజ్యాన్ని పరిపాలించాడు. అలాంటి పరీక్షిత్తుని రాజ్యకాలంలోనే మీరు వేయి సంవత్సరాలపాటు చేయసంకల్పించిన ఈ సత్త్రయాగాన్ని ప్రారంభించారు అని సూతుడు శౌనకాది మహామునులకు వివరిస్తూ ఇంకా ఇలా చెప్పాడు.

ఈ విధంగా కలిని నిగ్రహించి, జనహితంగా చాలాకాలం రాజ్యాన్ని పరిపాలిస్తున్న పరీక్షిన్మహారాజు అరణ్యానికి వేటకై వెళ్లి అనేక జంతువులను వేటాడి ఆకలిదప్పికలతో అలసి సొలసి, ఎంత వెదికినా నీటిచుక్కైనా దొరకని

స్థితిలో శమీకమహామునియొక్క ఆశ్రమంలో ప్రవేశించి, 'దాహం దాహం కొంచెం నీరివ్వండి' అని బిగ్గరగా ఎంత అరచినా ఎవరూ పట్టించుకోలేదు. ధ్యానమగ్నుడై ఉండడంవల్ల శమీకమహర్షికి ఏమీ వినిపించలేదు. దాహంతో గొంతెండి, నాలుక పిడుచకట్టుకుపోతుండగా దాహబాధను తట్టుకోలేక కదలక మెదలక ఉన్న మునిని చూచి రోషావేశంతో, విధివశుడై బయట చచ్చిపడి ఉన్న పామును తెచ్చి శమీకుని మెడలోవేసి వెళ్లిపోయాడు. ఇది చూచిన ఇతర బాలురు, శమీక మహాముని పుత్రుడైన శృంగితో చెప్పగా అతడు, సర్వం తెలుసుకొని క్రోధావేశపరుడై 'నా తండ్రి మెడలో మృతసర్పాన్ని వేసి అవమానించినవాడు నేటికి వారం రోజులలో తక్షక సర్పదష్టుడై మరణిస్తాడు' గాక అని శపించాడు.

సమాధినుండి లేచిన శమీకముని జరిగినదంతా తెలుసుకొని మిక్కిలి విచారిస్తూ శృంగితో ఇలా అన్నాడు. "నాయనా! ఎంతపని చేశావురా. ఇంత చిన్న తప్పుకే అంత కఠోరమైన శాపాన్ని ఇస్తావా? తల్లి కడుపులోనే దగ్ధం కావలసిన రాజును శ్రీహరియే రక్షించాడు కదా. వాసుదేవుడు నిష్క్రమించిన తరువాత అరాచకం ప్రబలిపోకుండా ఈ రాజే దేశాన్ని కాపాడి సమర్థవంతంగా సంరక్షిస్తున్నాడు. అలాంటి ధర్మాత్ముడైన రాజు లేకపోతే జరిగే అనర్థాల పాపం మనకు చుట్టుకోదా? తొందరపాటుతో ఎంత చెడ్డపని చేశావురా తండ్రీ!" అని మందలించి, విచారించి ఒక మునిబాలుని పిలిచి ఈ శాపవార్తను మహారాజుకు తెలిపిరమ్మని పంపించాడు. శాపవార్తను తెలుసుకొన్న పరీక్షితుడు జరిగినదానికి విచారించి, దైవసంకల్పాన్ని ఎవరూ తప్పించుకోలేరని భావించి, తనకు మరణకాలం సమీపించిందని గ్రహించి, తన హృదయాన్ని గోవిందునిపై లగ్నంచేసి సకలరాజ్యభోగాలను విడిచిపెట్టి, సర్వసంగపరిత్యాగియై, విష్ణుపదియైన గంగానది ఒడ్డున, దర్భాసనం మీద కూర్చొని నిశ్చలభక్తితో ధ్యానిస్తున్నాడు.

ఈ విధంగా పాండవపౌత్రుడైన పరీక్షిత్తు శ్రీమహావిష్ణువుయొక్క చరణారవింద సంస్మరణకందళిత హృదయారవిందుడై గంగానది తీరంలో ప్రాయోపవిష్టుడై ఉన్న విషయం తెలుసుకొన్న అత్రి, విశ్వామిత్ర, వశిష్ఠ, భృగు, వ్యాస, భరద్వాజ, పరశురామ, దేవల, మైత్రేయ, కణ్వ, అగస్త్య, నారదాది పరమపావనులైన బ్రహ్మర్షి, రాజర్షి, దేవర్షి పుంగవులు అనేకులైన ఋషిసత్తములు శిష్యప్రశిష్యులతో వచ్చారు. పరీక్షిత్తు వారందరికీ దండప్రణామాదులాచరించి, ఆనందబాష్పాలతో చేతులు జోడించి "ఓ దయామూర్తులైన తపోధనులారా! మీరు సమస్త పాపరాశిని భస్మం చేయగల పుణ్యాత్ములు మీ పాదరజం సోకగానే నేను ధన్యుడ నయ్యాను. నా పాపం పరిహారమయ్యే మార్గం సెలవియ్యండి. ఈ సంసారసాగరంలో మునిగితేలుతున్న నాకు ఈ విప్రశాపమే ఒక వరం అయ్యేటట్లు భావిస్తున్నాను. ఈశ్వరసంకల్పం అనివార్యం. రాబోయే ప్రతి జన్మలోను శ్రీకృష్ణచింతనపట్ల ఆసక్తి, శ్రీకృష్ణగాథాశ్రవణానురక్తి, శ్రీకృష్ణచరణసరోజాలపట్ల భక్తి కలిగేట్లు అనుగ్రహించండి. నా శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని గోవిందుని లీలలు గానం చెయ్యండి, భాగవతోత్తముల చరిత్రలను వినిపించండి, ఏడురోజులలో నాకు ముక్తి కలిగే మార్గమేదో చూపించండి" అని వేడుకొని, తన కుమారుడైన జనమేజయునికి రాజ్యభారం అప్పగించాడు.

పరీక్షిత్తుని హరిభక్తికి సంతోషించిన ఆ మహామునులందరూ వారంరోజుల గడువు దాకా తాము అక్కడే ఉంటామన్నారు. ఏడుదినాలలో ముక్తిని పొందే మార్గమేదైనా ఉందా? అని అన్వేషించసాగారు.

అంతలో దైవయోగంచేత, పదహారేళ్ల బాలునివలె కనిపిస్తూ, దిగంబరుడైన ఒక అవధూత అక్కడికి వచ్చాడు. అతనిని మహాయోగివరేణ్యుడు, వేదవ్యాస కుమారుడైన శ్రీశుకదేవునిగా గుర్తించి అక్కడ ఉన్న మహర్షులందరూ గౌరవసూచకంగా లేచి ఆయనను ఆహ్వానించారు. పరీక్షిత్తు ఎదురేగి, ప్రణమిల్లి, సత్కరించి, ఉచితాసనంపై కూర్చుండబెట్టి ఆయన పాదాలపై వాలి ఇలా అన్నాడు.

ఓ యోగీంద్రా! నేడెంత సుదినం. నా అదృష్టవశంచేత మీరు వచ్చారు. ఎక్కడా ఆవుపాలు పితికే సమయంకంటే ఒకచోట ఆగని మీ దర్శనంకంటె మాబోటి వారికే ఏమికావాలి? శ్రీకృష్ణపరమాత్మయే మిమ్మల్ని ఇక్కడికి పంపించి ఉంటాడని నా నమ్మకం. నా సమస్యకు పరిష్కారమార్గం చూపగలవారు మీరే. తాము నాపట్ల అనుగ్రహముంచి వారం రోజుల వ్యవధిలో వైకుంఠధాముని చేరే దారి చూపించండి. ఎల్లప్పుడూ మానవుడేమి చేస్తుండాలి. ఏమి వింటూ ఉండాలి. దేనినిగూర్చి ఆలోచిస్తూ ఉండాలి. మరణానికి చేరువలో ఉన్న నేను ఇప్పుడేమి చెయ్యాలి. దేనిని పరిత్యజించాలి. సరియైన మార్గాన్ని ఉపదేశించి నన్ను తరింపజేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను అని పరీక్షిత్తు శ్రీశుకదేవులవారిని వేడుకొన్నాడు అని సూతుడు శౌనకాది ఋషులకు చెప్పాడు.

**– గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

# ద్వితీయస్కంధం - కథాసారం

**ప**రీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడు ఇలా అన్నాడు. – "ఓ రాజేంద్రా! మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైంది. కనుకనే **"జన్తూనాం నరజన్మ దుర్లభం"** అని అన్నారు. ఈ మానవజన్మ పొందినందుకు నారాయణుని చరణాలను సేవిస్తూ జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. కాని, మానవుడు తన జీవితంలో సగభాగం సంసారలంపటంతో, నిద్రతో వ్యర్థపరుస్తున్నాడు. మిగిలిన సగం కాలం పశు, పుత్ర, బంధు, ఆశ్రితుల రక్షణకోసం ధనసంపాదనకోసం సరిపోతుంది. చివరకు కన్నుమూసి, మళ్లీ అలాంటి జన్మ పొందడానికే పునాది వేసుకొంటున్నాడు. ప్రతిరోజూ తనచుట్టూ ఉన్న వారు మరణిస్తున్నా, ప్రతిమనిషీ తనకు మాత్రం మరణం లేదు రాదు అనే భ్రమలో ఉంటాడు. సంసారబంధాలనుండి విముక్తి పొందాలనుకొన్న వ్యక్తికి సర్వాత్మకుడు, జగదీశ్వరుడు అయిన ఆ శ్రీమహావిష్ణువు ఒక్కడే శరణ్యం. అందుకు ఆ భగవంతుణ్ణి విడిచిపెట్టకుండా త్రికరణశుద్ధిగా చింతన చెయ్యడమే సులువైన మార్గం.

ఓ మహారాజా! నా తండ్రి వేదవ్యాస భగవానుడు శ్రీమద్భాగవతాన్ని నాకు ఉపదేశించాడు. భగవంతుని అవతారలీలలను విన్నందువల్ల నేను బ్రహ్మతత్త్వంలో మునిగిపోయాను. వాసుదేవుని నామసంకీర్తనే యోగిపుంగవులకు ఉత్తమవ్రతం. కాబట్టి పరమభక్తుడవైన నీకు ఈ దివ్య గాథను వినిపిస్తాను. బ్రహ్మజ్ఞానులకు కూడ శ్రీకృష్ణనామోచ్చారణమే ఏకైక మార్గం, లక్ష్యంకూడా. ఇక సంసారంలో పడి కొట్టుమిట్టాడే ఎంతటి అవివేకి అయినాసరే ఒక్కగడియకాలంపాటు హరినామాన్ని స్మరిస్తే చాలు, ముక్తి లభిస్తుంది.

ఇందుకు ఉదాహరణగా ఖట్వాంగచక్రవర్తి ఉదంతం చెప్తాను. విను. పూర్వం ఇంద్రాది దేవతలు రాక్షసులను జయించలేక, భూలోకంలో ఉన్న ఖట్వాంగ చక్రవర్తిని సహాయం కోరారు. ఖట్వాంగుడు రాక్షసులతో యుద్ధంచేసి, వారిని ఓడించాడు. ప్రతిఫలాపేక్ష లేకుండా సహాయపడిన అతనికి దేవతలు సంతోషంతో వరమిస్తామన్నారు. కానీ అతడేమీ కోరుకోకుండా ఇంకా తానెంతకాలం జీవిస్తానో చెప్పుమన్నాడు. అతని ఆయుర్దాయం ఇంకా రెండు గడియలే ఉందని వారు తెలియజేశారు. వెంటనే ఖట్వాంగుడు తన రాజధాని చేరి సర్వ భోగభాగ్యాలు విడిచిపెట్టాడు. భార్యాపుత్రవ్యామోహ బంధాలు తెంచుకొన్నాడు. పరమభక్తితో గోవిందనామ సంకీర్తనం చేస్తూ శ్రీమన్నారాయణునియందే మనసు నిలిపి ఉంచాడు. ఒక్క ముహూర్తకాలంలోనే వైకుంఠలోకం చేరుకున్నాడు.

కనుక, ఓ పరీక్షిన్మహారాజా! బంధాలు తెంచుకొన్నవాడికి మోక్షం పొందడానికి ఒక్క క్షణకాలం చాలు. భగవన్నామస్మరణం ఒక్కటే ముక్తిహేతువు. నీకు ఏడురోజుల వ్యవధి ఉంది. మరి చింత ఏల? తమోగుణంతో విమూఢతను, రజోగుణంతో చాంచల్యాన్ని పొందకుండా జాగ్రత్తపడాలి. ఆ గుణాల ప్రభావంతో కలిగే మాలిన్యాన్ని తొలగించుకుంటూ ధారణతో మనస్సును శుద్ధి చేసుకోవాలి. అలాంటివారే సర్వోత్కృష్టమైన విష్ణుపదాన్ని పొందుతారు, అని శుకమహర్షి పలికాడు. వెంటనే 'ధారణ' అంటే ఏమిటి? దానివల్ల చిత్తమాలిన్యం ఎలా తొలుగుతుంది? అని అడిగిన పరీక్షిత్తుతో శ్రీశుకుడు ఇలా కొనసాగించాడు.

పండితుడైన వాడు వాయువును నియంత్రించి, సర్వసంగాలనూ విడిచి పెట్టాలి. ఇంకా ఇంద్రియాలను అదుపులో ఉంచి బుద్ధినీ, చిత్తాన్నీ శ్రీహరి స్వరూపంలో నిలపాలి. విరాట్ స్వరూపుడైన శ్రీమహావిష్ణువు నందు లగ్నమైన మనసుకు భూత, వర్తమాన, భవిష్యత్ కాలాల్లో వుండే విశాల విశ్వం స్వరూపంతో గోచరిస్తుంది. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్తత్త్వం అని ఏడు ఆవరణలతో విరాట్ స్వరూపం నిండి ఉంటుంది. అటువంటి శరీరంలో విరాట్ పురుషుడు ప్రకాశించాలంటే ధారణ కావాలి. అటువంటి మహాత్ముని శరీరంలో ఏడు ఊర్ధ్వలోకాలు, ఏడు అథోలోకాలు, ఇంద్రాది దేవతలు, సమస్తమైన దిక్కులు ఇంద్రియాలు, అశ్విని దేవతలు, సూర్యచంద్రులు త్రికాలసంధ్యలు చాతుర్వర్ణ్యాలు, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష విద్యాధరాదులు, అప్సరసలు, వసువులు, రుద్రులు లీనమై వుంటారు. ఇటువంటి విశ్వమయుడైన విరాట్ పురుషుని రూపాన్ని మోక్షార్థి అయినవాడు తన మనస్సులో అనుసంధానం చేసుకోవాలి.

**క. హరిమయము విశ్వ మంతయు, హరి విశ్వమయుండు సంశయము పనిలే దా**
**హరిమయము కానిద్రవ్యము, పరమాణువు లేదు వంశపావన వింటే!**

విశ్వమంతా విష్ణుమయం, విష్ణువు విశ్వమయుడు, ఇందులో సందేహం లేదు. విష్ణుమయం కాని పదార్థం ఈ విశ్వంలో ఒక్క పరమాణువైనా లేదు.

సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు ప్రాణుల హృదయాలలో ఉంటూ బుద్ధి వ్యాపారాలను తెలుసుకొంటాడు. అతడు సత్‌స్వరూపుడు, ఆనందస్వరూపుడు, విజ్ఞానమూర్తి. ఆతనిని సేవించి పొందాలి తప్ప, ఇతరత్రా సాధ్యం కాదు. కైవల్యం సిద్ధించదు. సంసారబంధం వదలదు.

ఓ రాజేంద్రా! శబ్ద ప్రధానమైన వైదిక కర్మకాండలను నిర్వహిస్తూ నిరర్థకాలైన స్వర్గాది సుఖాలను కోరుకుంటూ అజ్ఞాని మోక్షప్రాప్తికి దూరమవుతాడు. జ్ఞానిమాత్రం దేహాన్ని ధరించడానికి కావలసినంత విషయాలను మాత్రమే స్వీకరిస్తూ ఇతర భోగాలను విడిచిపెట్టి ఆత్మస్వరూపుడు, సత్యుడు, నిత్యుడు అయిన వాసుదేవుని సేవించి అవిద్యను తొలగించుకుంటాడు. గోవిందుని పాదపద్మాలను సేవించడానికి విముఖులయినవారు అనేకమైన కర్మబంధాలలో తగులుకొని ఫలాపేక్షతో, భోగలాలసత్వంతో కర్మకాండలు, కామ్యకర్మలు చేస్తూ మళ్లీ మళ్లీ జన్మిస్తూ, శాశ్వత ఆనందాన్ని పొందలేక కర్మపంకంలో కూరుకుపోతున్నారు.

మనిషి స్వప్నంలో ఏవేవో ఆకారాలు చూస్తూ, తాను కొన్ని అనుభవిస్తూ సంచరిస్తూ వుంటాడు. మెలకువ వచ్చిన తరువాత అదంతా స్వప్నం అని గ్రహిస్తాడు. అదేవిధంగా సకలప్రాణకోటిలో ఉన్నవి ఏవీ ఆయనను అంటవు. అంతటివాడు కనుకనే ఆయన అనుగ్రహంతోనే బ్రహ్మదేవుడు ఈ బ్రహ్మాండభాండాలనన్నింటిని సృష్టిస్తున్నాడు.

ముక్తి సద్యోముక్తి, క్రమముక్తి అని రెండు రకాలు. ఇవి వేదగీతలలో వివరించబడ్డాయి. పూర్వం భగవానుడే వీటిని బ్రహ్మదేవునికి బోధించాడు. సంసారంలో ప్రవేశించినవారికి తపస్సు, యోగం మొదలైన మార్గాలు వున్నవి.

అన్నింటికంటే సులువైనది భక్తిమార్గం. భక్తితో తప్ప మరోమార్గాన మోక్షం లభించదు అని బ్రహ్మదేవుడు వేదాలను మూడుసార్లు తరచి తరచి విశ్లేషించి ఈ సత్యాన్ని నిర్ధారించాడు.

ఓ రాజా! మానవుడు అనేక దేవతలను ఆరాధిస్తూ పలు కోరికలను తీర్చుకుంటాడు. దేవతలందరు కోరిన కోర్కెలను తీర్చగలరుగాని మోక్షాన్ని ప్రసాదించలేరు. తత్త్వజ్ఞాని అయినవాడు ఎలాంటి కోరికలు లేనివాడై పరమపురుషుని భజిస్తూ మోక్షాన్ని మాత్రమే కోరతాడు. శ్రీమహావిష్ణువును సేవిస్తే విమలమైన జ్ఞానవైరాగ్య మోక్షాలు సిద్ధిస్తాయి. కోరికలు ఉన్నవారైనా, లేనివారైనా ఆ శ్రీహరిని ఆరాధిస్తే చాలు. ఆయనే అన్ని అనుగ్రహించి చివరకు మోక్షాన్ని ప్రసాదిస్తాడు.

**సీ. నారాయణుని దివ్యనామాక్షరములపైఁ గరఁగని మనములు కఠినశిలలు**
**మురవైరి కథలకు ముదితాశ్రురోమాంచ మిళితమై యుండని మేను మొద్దు**
**చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న కనక కిరీటంబు గట్టెమోపు**
**మాధవార్పితముగా మనని మానవు సిరి వనదుర్గ చంద్రికావైభవంబు**

**ఆ. కైటభారిభజన గలిగి యుండని వాఁడు, గాలిలోన నుండి కదలు శవము**
**కమలనాభుపదముఁ గనని వాని బ్రతుకు, పసిఁడికాయలోని ప్రాణి బ్రతుకు. (2-51)**

శ్రీమన్నారాయణుని దివ్యనామాక్షర స్మరణతో కరిగి ప్రవహించని మనస్సులు కఠిన శిలలు. విష్ణుదేవుని కథాశ్రవణంతో ఆనందబాష్పాలు రాలని కన్నులు, రోమాంచంకాని శరీరం దారు సమానం. చక్రధారునకు ప్రణమిల్లని మూఢుని తలమీద బంగారు కిరీటం ఉన్నా అది బరువు చేటు. భగవంతునకు అర్పితం కాని మానవుని ఐశ్వర్యం అడవిని గాచిన వెన్నెల లాంటిదే. వాసుదేవుని సేవలో వినియోగింపబడని శరీరం ఉన్నవాడు ప్రాణవాయువుచే కదిలే శవంవంటివాడు. పద్మనాభుని పాదాలను ఆశ్రయించని వాని బ్రతుకు పట్టు దారపుగూడులోని పురుగు బ్రతుకు. అని శ్రీశుకుడు చెప్పగా, పరీక్షిత్తు భార్యా పుత్ర బంధు మిత్ర పరివార రాజ్యసంపదలు సర్వం త్యజించి, భగవంతునిపై మనస్సు నిలిపి, మరణ భీతి లేకుండా, ధర్మార్థకామాలను తిరస్కరించి, శ్రీమన్నారాయణుని లీలా విశేషాలను అనుభవించాలనే కాంక్షతో శ్రీశుకునితో ఇలా అన్నాడు.

"యోగీంద్రోత్తమా! నాలోని భ్రమలన్నీ తొలగిపోయినవి. నా మనస్సు సంతోష పరవశమయింది. శ్రీహరియొక్క సృష్టి స్థితి లయ కార్యాలు ఎలాగ నిర్వహింపబడుతున్నవో తెలియజేయవలసింది" అని ప్రార్థించాడు. పరీక్షిత్తుకోరికను మన్నించి, సృష్టిని గురించి, భగవదవతారాలను గురించి వివరించుటకు ముందుగా శ్రీశుకుడు ఈ విధంగా దైవప్రార్థన చేశాడు.

**మ. పరుఁడై, యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థాన సం**
**హరణక్రీడనుఁడై, త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై,**
**పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు దు**
**స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్. (2-58)**

ఉ. ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభులీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునంద్రు నే
నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్. (2-60)

మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో, యచ్ఛిన్నుఁడో, ఛిన్నుఁడో,
గుణియో, నిర్గుణుఁడో యటంచు విబుధుల్ - గుంఠీభవత్తత్త్వ మా
ర్గణులై యే విభుపాదపద్మ భజనోత్కర్షంబులం దత్త్వ వీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్. (2-66)

అని శ్రీమన్నారాయణుని స్మరిస్తూ సూతుడు శౌనకాదిమహామునులకు భాగవతకథాసుధను ఆస్వాదింపజేస్తున్నాడు.

ఆద్యంతరహితుడు, నిత్యనిర్మలుడు, కేవలుడు, నిర్మలుడు, సర్వాంతర్యామి, మహాతేజోనిధి అయిన శ్రీమహావిష్ణువే సృష్టిస్థితిలయాలకు కారకుడు. ఆ అరవిందాక్షుని లీలావతారాలు అంతులేనివి. ఆయన చేసిన మహత్తర కార్యాలను లెక్కించడానికి ఎవరికీ సాధ్యంకాదు. అయినా వీలయినంతమేరకు వివరిస్తాను.

**ఆదిపురుషావతారం :** ఒకే భవనంగా ఉండే ఈ బ్రహ్మాండాన్ని పదునాలుగు లోకాలుగా విభజించి అంతటా ఆయనే వ్యాపించియున్నాడు. ఆ పరాత్పరుని మొట్టమొదటిది, సహస్ర శీర్షాదులతో కూడియున్నది, ఆదిపురుషుని మొట్టమొదటి అవతారం. ఈ ఆదిపురుషుని కాల, స్వభావశక్తులు, కార్యకారణరూపమైన ప్రకృతి, అందులోనుండి త్రిగుణాలు, కర్మజ్ఞానేంద్రియాలు, పంచభూతాలు, వీటి అన్నింటి సంఘాతంచే విశ్వరూపుడైన విరాట్ పురుషుడు. అతనివలన స్వయం ప్రకాశమైన చరాచర రూపాలతో స్థావర, జంగమాత్మకమైన జగత్తు, త్రిమూర్తులు, ప్రజాపతులు, యోగులు, దేవజాతులు, పితృజాతులు, దైత్యదానవ భూత ప్రేత పిశాచ కూష్మాండ పశు పక్ష్యాదులు ఉద్భవించాయి. ఈ జగత్తుయొక్క ప్రథమసృష్టి, మూడవది సమస్త భూత సృష్టి.

**యజ్ఞవరాహావతారం :** హిరణ్యాక్షుడనే రాక్షసుడు తన బాహుబలంతో భూమండలాన్ని చాపగా చుట్టి సముద్ర గర్భానికి తీసుకుపోగా, అప్పుడు శ్రీమన్నారాయణుడు యజ్ఞవరాహరూపంతో ఆ రాక్షసునితో యుద్ధంచేసి చంపి, భూమండలాన్ని ఉద్ధరించాడు.

**సుయజ్ఞావతారం :** పూర్వం స్వాయంభువమనువు కూతురైన 'ఆకూతి'కి, 'రుచి' అనే ప్రజాపతికి జన్మించిన 'సుయజ్ఞుడు', దక్షిణ అనే కాంతను వివాహమాడి 'సుయములు' అనే దేవతలను కన్నాడు. అంతే కాకుండా అతడు ఇంద్రుడై, దేవతలను పరిపాలించి, విష్ణువువలె సకలలోకాల దుఃఖాన్ని తొలగింపజేశాడు. అప్పుడు స్వాయంభువమనువు తన దౌహిత్రుని మహత్తర చరిత్రకు ఆనందించి ఈ పవిత్రచరిత్రుడు శ్రీమన్నారాయణుడే అని గుర్తించి ప్రకటించాడు.

**కపిలావతారం :** కర్దమ ప్రజాపతికి, స్వాయంభువ అనే పేరుగల పుత్రిక అయిన 'దేవహూతి' యందు తొమ్మిదిమంది కుమార్తెల తర్వాత శ్రీహరియే 'కపిలుడు'గా అవతరించాడు. శ్రీమన్నారాయణుని పొందడానికి సాధనమైన సాంఖ్య యోగాన్ని కపిలుడు తన తల్లికి ఉపదేశించి, ఆమెకు బాధలు తొలగించి, మోక్షాన్ని ప్రసాదించాడు.

**దత్తాత్రేయ అవతారం :** సంతానార్థి అయిన అత్రిమహర్షికి పరమసాధ్వియైన అనసూయ యందు విష్ణువు ప్రసన్నుడై 'నేను మీకు దత్తుడిని అయ్యా'ను అని చెప్పి కొడుకుగా జన్మించాడు. అందుకే, ఆ బాలుడు దత్తాత్రేయుడయ్యాడు. ఈ మహాత్ముని పాదధూళి సోకడంచేత యదువంశీయులూ, హైహయవంశీయులు అందరూ పవిత్రులై, జ్ఞానబలాన్నీ, యోగఫలాన్నీ, ఐశ్వర్య శౌర్య సౌఖ్యాలను పొందారు. ఇహపరలోకాలలో ఆ మహానుభావుని కీర్తి విఖ్యాతి గాంచింది.

**సనకసనందనాది అవతారం :** కల్పప్రారంభంలో విశ్వసృష్టికి పూనుకొని తపోదీక్షలో ఉన్న బ్రహ్మనోట అప్రయత్నంగా వెలువడిన 'సన' అనుశబ్దం నుండి సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు సనత్సుజాతుడు – అనే నలుగురు బ్రహ్మమానసపుత్రులు ఉద్భవించారు. గతకల్పాంతంలో నశించిపోయిన ఆత్మతత్త్వాన్ని వారు మళ్లీ ఈ లోకంలో ప్రవర్తింపజేశారు. శ్రీహరికళలతో జన్మించిన ఈ నలుగురూ ఒకే అవతార సంభూతులు.

**నరనారాయణావతారం :** దక్షుని కుమార్తె అయిన మూర్తికి, ధర్ముడికి జన్మించిన నరుడూ, నారాయణుడూ బదరీవనంలో నిశ్చల దృఢదీక్షాచిత్తంతో తపస్సు చేసుకొంటుంటే, దేవేంద్రుడు తన పదవికి ముప్పువస్తుందనే భయంతో, వారి తపస్సుకు భంగం కలిగించాలని అప్సరసలను పంపించాడు. కానీ, వారు అప్సరసల ప్రయత్నాలకు ఏమాత్రం చలించకుండా నిర్మోహులై, తపోమగ్నులై, నిశ్చింతులై ఉన్నారు. తమ శ్రమ అంతా వ్యర్థం అయిపోయిందని దుఃఖిస్తున్న ఆ దేవకాంతలను చూచి జాలిపడి, వారిని తలదన్నే అతిలోకసౌందర్యరాశులైన ఊర్వశి వంటి రూపలావణ్యవతులను సృష్టించి ఇంద్రుడికి కానుకగా పంపారు. నరనారాయణుల సృష్టిలీలా విలాసానికి దేవకాంతలు సిగ్గుపడి, వారు శ్రీమన్నారాయణుడి అవతారలీలా పురుషులని గ్రహించి, ఊర్వశిని తమ నాయకురాలిగా గ్రహించి స్వర్గానికి దారితీశారు.

**ధ్రువునకు దర్శనమిచ్చిన అవతారం :** ఉత్తానపాదుడు అనే రాజుకు సునీతి అనే భార్యయందు జన్మించిన ధ్రువుడు తన సవతి తల్లి అయిన సురుచి తూలనాడిన మాటలకు నొచ్చుకొని, నారదుని సలహాను అనుసరించి శ్రీహరి గురించి తపస్సు చేశాడు. దేవదేవుని అనుగ్రహదర్శనంతో ధ్రువుడు శరీరంతో శాశ్వతమైన, మహోన్నతమైన ధ్రువస్థానంలో స్థిరపడి విష్ణువుతో సమానుడయ్యాడు.

**పృథుచక్రవర్తి అవతారం :** వేనుడనే రాజు దుర్మార్గుడై బ్రాహ్మణశాపానికి గురై, నరకలోకాన్ని పొందాడు. శ్రీహరి కళాంశతో వేనరాజుకు పుత్రుడిగా పుట్టిన పృథువు తండ్రిని నరకం నుండి రక్షిస్తాడు. భూదేవిని బిడ్డగా గ్రహించి ఆమెనుండి ప్రజలకు అవసరమైన వస్తువులను స్వీకరించాడు. అందుకే భూమికి 'పృథివి' – అని పేరు వచ్చింది.

**ఋషభావతారం (వృషభావతారం) :** అగ్నీధ్రుని పుత్రుడైన నాభికీ, మేరుదేవి (లేక సుదేవి)కి శ్రీహరి అంశతో జన్మించిన ఋ(వృ)షభనాథుడు జడునివలె యోగాభ్యాసం చేస్తూ, ప్రశాంతచిత్తుడై పరమహంస జీవనం సాగించే వాడని సాధుపుంగవులు ప్రశంసించేవారు.

**హయగ్రీవ అవతారం :** యజ్ఞపురుషుడైన మహావిష్ణువు నారదునిచే చేయబడిన యాగంలో బంగారుచాయతో హయగ్రీవునిగా ఆవిర్భవించాడు. వేదరూపుడు, దేవతాత్మ స్వరూపుడైన ఈ హయగ్రీవుని శ్వాసయే వేదాలు.

**మత్స్యావతారం :** ప్రళయకాలంలో లోకమంతా జలమయమై పోగా వైవస్వతమనువు ఒక పడవలో కూర్చున్నాడు. అప్పుడు శ్రీహరి మత్స్యావతారమెత్తి భావిసృష్టికి అవసరమయ్యే ద్రవ్యాలను పెట్టించి పడవను రక్షించాడు. బ్రహ్మముఖం నుండి జారిన వేదశాఖలు సంకీర్ణం కాకుండా విభజించి దేవతల కోరిక మేరకు మళ్ళీ బ్రహ్మదేవునికి ప్రీతితో అందించాడు.

**కూర్మావతారం :** పూర్వం దేవదానవులు అమృతం సాధించేందుకు మందరపర్వతాన్ని కవ్వంగా, వాసుకిని త్రాడుగా చేసుకొని పాలకడలిని మథించారు. అప్పుడు ఆ మందర పర్వతం సముద్రంలో మునిగిపోతుంటే శ్రీహరి తాబేలు రూపంధరించి, ఆ పర్వతాన్ని ఉద్ధరించి మీదికి నిలిపి ఉంచాడు.

**నరసింహావతారం :** హిరణ్యకశిపుడు శిష్టులను బాధిస్తూ, దేవలోకాన్ని ఆక్రమించి, శ్రీహరి భక్తుడైన ప్రహ్లాదుని హింసిస్తూ ఉండటంవలన శ్రీమహావిష్ణువు లోకరక్షణార్థం నరసింహావతారం ఎత్తి హిరణ్యకశిపుని సంహరించాడు.

**ఆదిమూలావతారం :** గజేంద్రుడు ఒకానొక మొసలిచేత పట్టుబడి వేయిసంవత్సరాలు దానితో పోరాడి శక్తిచాలకపోవడంచేత శ్రీహరిని రక్షించమని భక్తితో మొరపెట్టుకోగా, శ్రీమహావిష్ణుడు ఆదిమూలరూపుడై వచ్చి, మొసలిని చంపి ఏనుగును రక్షించాడు.

**వామనావతారం :** దేవరాజ్యాన్ని ఆక్రమించుకొన్న బలిచక్రవర్తిని అణచివేసి దేవేంద్రుడికి తిరిగి ఆ రాజ్యాన్ని ఇప్పించడానికి వామనుడిగా అవతరించి మూడు అడుగుల నేలను బలివద్ద దానం తీసుకొని ముల్లోకాలను ఆక్రమించి బలిచక్రవర్తిని రసాతలానికి పంపివేశాడు.

**హంసావతారం :** నారదుని భక్తి శ్రద్ధలకు మెచ్చి పరాత్పరుడైన విష్ణువు ప్రేమతో హంసరూపంలో వచ్చి ఆత్మతత్త్వాన్ని బోధించాడు.

విష్ణువే శిష్టరక్షణ, దుష్టశిక్షణార్థం మనువుగా అవతరించి తన కీర్తిని సత్యలోకంలో ప్రకాశింపజేశాడు.

ఆయనే ధన్వంతరిగా అవతారమెత్తి, ప్రజల రోగాలను పోగొట్టే మార్గం చూపించాడు.

**పరశురామావతారం :** శ్రీహరి భార్గవరాముడిగా అవతరించి దుష్టులు, లోకకంటకులైన హైహయరాజులను, చంపి, ఇరవైయొక్క సార్లు భూమండలంలోని రాజులను పోరాడి నిర్మూలించి, జయించిన భూమండలాన్ని బ్రాహ్మణులకు దానం చేసాడు.

**శ్రీరామావతారం :** శ్రీమన్నారాయణుడు దశరథ పుత్రుడై శ్రీరాముడిగా అవతరించి రావణకుంభకర్ణాది రాక్షసులను, లోకకంటకులను తునుమాడాడు.

**శ్రీకృష్ణావతారం :** రాక్షసాంశతో జన్మించిన రాజులు సైన్యాలను పెంచుకొని అధర్మపరులై లోకకంటకులుగా మారడంచేత, భూదేవి మొరనాలకించిన శ్రీమహావిష్ణువు భూలోకభారం తగ్గించడానికి తన తలలోని ఒక తెల్లవెంట్రుక, ఒక నల్లవెంట్రుకలతో బలరామకృష్ణులను సృష్టించాడు. ఇందులో శ్రీకృష్ణునిది భగవంతుని పరిపూర్ణావతారము. ఆజన్మాంతం అనేక అద్భుతాలు చేసి మహిమలు ప్రదర్శించాడు. పూతన, శకటాసుర, వత్సాసుర, బకాసుర, అఘాసుర, ధేనుకాసుర, నరకాసుర, వ్యోమాసుర, కంసాది దుష్టులను చంపి అనేక సందర్భాలలో వ్రేపల్లె వాసులను రక్షించాడు. కాళియుని మర్దించాడు. ప్రలంబుడు, కేశిని, అరిష్ట చాణూరులు, కువలయాపీడమనే ఏనుగు, కాలయవనుడు, పౌండ్రకుడు, సాల్వుడు, ద్వీపకుడు, ముష్టికుడు, శంబరుడు, శిశుపాలుడు, పల్వుడు, రుక్మి, దంతవక్త్రుడు మొదలైన అనేక మంది దుష్టులను హతమార్చాడు.

**వేదవ్యాసావతారం :** అన్ని యుగాల్లోను మందబుద్ధులూ, అల్పాయుష్కులూ, దుర్గతిపాలైనవారూ ఉంటారు. వారు వేదాలు మొదలైన వాటి స్థాయి అందుకోలేరు. అలాంటివారిని అనుగ్రహించడానికి శ్రీహరి పరాశరమహర్షికీ సత్యవతికీ కుమారుడిగా జన్మించి వేదవృక్షాన్ని శాఖోపశాఖలుగా విభజించి వేదవ్యాసుడని ప్రసిద్ధి చెందాడు. భారతము, అష్టాదశ మహాపురాణాలు, ఉప పురాణాలు, బ్రహ్మసూత్రాలు రచించి లోకాలకు అందించాడు. తన శిష్యులకు కూడా బోధించి, లోకంలో ప్రవర్తింపజేశాడు.

**బుద్ధావతారం :** భోగలాలసులూ, చపల చిత్తులూ, అసత్యవాదులూ, అధర్మనిరతులూ, భేదాచార పరాయణులు, శుద్ధపాషండులూ అయిన ఆసుర ప్రవృత్తిగలవారు లోకులను బాధిస్తూ, పెడత్రోవ త్రొక్కడంవల్ల, శ్రీహరి బుద్ధావతారం ఎత్తి వారినీ, వారి దురాచారాలను నిర్మూలించాడు.

**కల్కి అవతారం :** కలియుగంలో బ్రాహ్మణులు భగవంతుని కీర్తించక, వేదవిహితమైన యజ్ఞయాగాది కర్మలను ఆచరించక, సత్యాన్ని పాటించక నాస్తికులవలె ప్రవర్తిస్తారు. వాళ్ల నోటినుండి వషట్, స్వాహా, స్వధా వంటి మంగళకర వైదికవచనాలు వినిపించవు. అల్పులు రాజ్యపాలన చేస్తారు. ఇలాంటి హీనస్థితి ప్రబలినప్పుడు భగవానుడు కల్కి అవతారమెత్తి దుష్టచరిత్రులను, అధర్మవర్తనులను నిర్మూలించి ధర్మసంస్థాపన చేస్తాడు. భగవంతుడు విష్ణుయశుడనే విప్రుని ఇంట కల్కి రూపంలో అవతరిస్తాడు.

అని ఈ విధంగా సూతముని శౌనకాది మునులకు భాగవతాన్ని వివరించాడు.

**– డా॥ మరడాన శ్రీనివాస ద్విశతావధాని**

# శ్రీమద్భాగవత మహిమ

**శ్లో. యం(బ్రహ్మావరుణేంద్ర రుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః**
**వేదైస్సాంగపద(క్రమోపనిషదైర్గాయంతి యం సామగాః ।**
**ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినః**
**యస్యాంతం న విదుస్సురాసురగణా దేవాయ తస్మై నమః (భాగవతం 12-1)**

శ్రీ సూతమహర్షి ఇలా చెప్పాడు. "ఆ పరమాత్మను బ్రహ్మదేవుడు, వరుణుడు, ఇంద్రుడు, రుద్రులు, మరుద్గణాలు దివ్యమైన స్తోత్రాలతో స్తుతిస్తున్నారు. సామవేద విద్వాంసులు, అంగ, పద, క్రమ ఉపనిషత్తులతో కూడిన వేదాలతో, ఆ పరమాత్మను కీర్తిస్తున్నారు. యోగులు ధ్యానంచే మనస్సును నిశ్చలంగా దానిలో లీనంచేసి ఆ పరమాత్మను దర్శిస్తున్నారు. దేవతలు, రాక్షసుల గణాలకు ఆ పరమాత్మ యొక్క పూర్ణతత్త్వం తెలియదు. అటువంటి స్వయంప్రకాశ పరమాత్మకు నమస్కరిస్తున్నాను".

**శ్లో. పృష్ఠే భ్రామ్యదమంద మందరగిరి గ్రావాఽగ్ర కండూయనాత్**
**నిద్రాలోః కమఠాకృతేర్భగవత శ్వాసానిలాః పాంతు నః ।**
**యత్సంస్కార కలాఽను వర్తన వశాద్వేలా నిభేనాంభసాం**
**యాతాయాత మతంద్రితం జలనిధే ర్నాద్యాపి విశ్రామ్యతి ॥ (భాగవతం 12-2)**

శ్రీహరి తాబేలుగా అవతారమెత్తి బరువైన మందరపర్వతాన్ని వీపుపై మోసేటప్పుడు దాని బండరాళ్లకొనల రాపిడిచే దురదతీరి నిద్రవచ్చింది. అప్పుడాయన శ్వాస, గాలుల తాకిడి సముద్ర జలాలలో ఈ నాటికీ సంస్కార రూపంగా మిగిలిపోయే ఉంది. కాబట్టి, సముద్రంలో క్షోభ అనే మిషతో అలుపునెరుగకుండా ఆటుపోటులు వస్తూనే ఉన్నాయి. అట్టి భగవంతుని శ్వాసవాయువులు మిమ్ములను రక్షించుగాక!

**శ్లో. శ్రీమద్భాగవతం పురాణమమలం యద్వైష్ణవానాం ప్రియమ్**
**యస్మిన్ పారమహంస్య మేక కమలం జ్ఞానం పరం గీయతే ।**
**తత్ర జ్ఞానవిరాగ భక్తి సహితం నైష్కర్మ్య మావిష్కృతం**
**తచ్ఛృణ్వన్ విపఠన్ విచారణపరో భక్త్యా విముచ్యే న్నరః ॥ (భాగవతం 12-18)**

శ్రీమద్భాగవతం నిర్దుష్టమైన పురాణం. ఇది విష్ణుభక్తులకు ప్రీతికరం. దీనిలో పరమహంసలకు హితమూ, అద్వితీయమూ, నిర్మలమూ, చైతన్యస్వరూపమూ అయిన పరబ్రహ్మ గానం చేయబడింది. దీనిలో ఆత్మజ్ఞానం, వైరాగ్యం, భక్తి అనే అంశాలతో కూడిన ఆత్యంతిక కర్మ నివృత్తి ఆవిష్కరించబడింది. దీనిని భక్తితో శ్రవణంచేసి, పారాయణచేసి, నిష్ఠగా మననం చేసేవాడు విముక్తుడౌతాడు.

**శ్లో. కస్మైయేన విభాసితోఽయమతులో జ్ఞానప్రదీపః పురా**
**తద్రూపేణ చ నారదాయ మునయే కృష్ణాయ తద్రూపిణా ।**
**యోగీంద్రాయ తదాత్మనాఽథ భగవద్రాతాయ కారుణ్యతః**
**త చ్ఛుద్ధం విమలం విశోకమమృతం సత్యం పరం ధీమహి ॥ (భాగవతం 12-19)**

"ఈ భాగవతం సాటిలేని జ్ఞానమనే గొప్ప దీపం. దీనిని ఆ పరమాత్మ పూర్వం సృష్ట్యాదిలో బ్రహ్మదేవుని కోసం, ఆ బ్రహ్మదేవుని రూపంలో నారదమహర్షి కోసం, ఆ నారద మహర్షిరూపంలో కృష్ణద్వైపాయన మహర్షి కోసం, ఆ వ్యాసమహర్షిరూపంలో యోగివర్యుడైన శుకమహర్షికోసం, ఆ శుకమహర్షి రూపంలో దయతో భగవంతునిపై ప్రీతిగల పరీక్షిత్తు కోసం ప్రకాశింపజేశాడు. అటువంటి శ్రేష్ఠమూ, శుద్ధమూ, ప్రాకృతదోషాలులేని పరమార్థమూ, శోక వినాశాలు లేనట్టి పరబ్రహ్మను ధ్యానిస్తున్నాను.

# విషయసూచిక

## ప్రథమస్కంధము

## ద్వితీయస్కంధము





# ప్రథమస్కంధము


కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గగన భాగంబెల్ల గప్పికొనగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న జగముల వ్రేగున జగతి గదల
జక్రంబు జేపట్టి చనుదెంచు రయమున బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయక మన్నింపుమని క్రీడి మరల దిగువ
గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖ వృష్టి దెరలి చనుదెంచు దేవుడు దిక్కు నాకు!


శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## ప్రథమస్కంధము

**అవతారిక :** పోతన మహాకవి తాను వ్రాయబోయే భాగవతంలోని ప్రతి స్కంధానికి ముందు శ్రీరాముణ్ణే స్తోత్రం చేశాడు. చివరకు శ్రీకృష్ణచరిత్ర ప్రాధాన్యంకల దశమస్కంధ ప్రారంభంలోకూడ ఆయననే నుతించాడు. కాని, ఏ శ్రీరాముని ఆజ్ఞపై తాను భాగవతాంధ్రీకరణకు పూనుకొన్నాడో, ఆ భాగవత ప్రథమస్కంధ రచనారంభంలో మాత్రం మొదటిపద్యంలో శ్రీకృష్ణస్తుతి చేసినట్లుగా కనబడుతోంది. పర్యాలోచన చేయగా ఈ పద్యంలో పరబ్రహ్మాన్ని కూడ స్తుతించినట్లుగా మనం భావించవచ్చు. మానవుడికి మోక్షాన్ని మించిన మహాభాగ్యం మరొకటి ఏముంది? భాగవతం మోక్షదాయిని. శ్రీకృష్ణ స్మరణ మోక్షదాయకం. అందుకే మోక్షార్థి అయిన పోతనగారు భాగవత మహాగ్రంథ రచనను శ్రీకృష్ణ స్మరణతో ప్రారంభించారు.

**శా. శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్, లోక ర**
**క్షైకారంభకు, భక్తపాలనకళా సంరంభకున్, దానవో**
**ద్రేకస్తంభకుఁ, గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా**
**నాకంజాతభవాండకుంభకు, మహానందాంగనా డింభకున్. 1**

**ప్రతిపదార్థం :** శ్రీ= మహాభాగ్యమైన; కైవల్య= మోక్ష; పదంబున్= స్థానమును; చేరుటకున్+ఐ= చేరుకొనుటకై; లోక= లోకములను; రక్షా+ఏక+ఆరంభకున్ : రక్షా= కాపాడుట అనే; ఏక= ఒకే ఒక; ఆరంభకున్= ప్రయత్నము కలవానిని; భక్త= తన భక్తులను; పాలన= రక్షించుట అను; కళా= విద్యలో; సంరంభకున్= వేగిరపాటు కలవానిని; దానవ+ఉద్రేక, స్తంభకున్ : దానవ= రాక్షసులయొక్క; ఉద్రేక= విజృంభణమును; స్తంభకున్= మ్రాన్పడ చేయువానిని, కొయ్యబారి పోవునట్లు చేయువానిని; కేళి, లోల, విలసత్+దృక్+జాల : కేళి= ఈ జగన్నాటకమనే ఆటయందలి; లోల= మిక్కిలి ఆసక్తిచేత; విలసత్= ప్రకాశించే; దృక్= చూపుల; జాల= సమూహం వల్ల లేదా మాయవల్ల; సంభూత= పుట్టిన; నానా, కంజాత, భవ+అండ, కుంభకు : నానా= అనేకానేక; కంజాత= నీటపుట్టిన పద్మంనుండి; భవ= జన్మించిన బ్రహ్మ; అండ= గ్రుడ్డు ఆకారంలో సృజించిన లోకాలకు, బ్రహ్మాండాలకు; కుంభకున్= కుండవంటి వానిని, కుండవలె తనలో ఇముడ్చుకొని ఉన్నవానిని; మహా= గొప్పదౌ; నంద+అంగనా= నందుని భార్య అయిన యశోదయొక్క; డింభకున్= ముద్దుబిడ్డడైన శ్రీకృష్ణుని; చింతించెదన్= స్మరిస్తాను.

**తాత్పర్యం :** లోకాలనన్నింటిని కాపాడటమే తన పనిగా పెట్టుకొన్నవాడు, భక్తులను సత్వరమే రక్షించేవాడు, రాక్షసుల విజృంభణాన్ని అణచేవాడు, ఈ జగన్నాటకం అనే ఆటమీది అమితాసక్తితో ప్రకాశించే చూపుల మాయవల్ల పుట్టిన బ్రహ్మాండాలను, కుండవలె తనలో ఇముడ్చుకొన్నవాడు, ఎంతో గొప్పదైన నందగోపుని ఇల్లాలు యశోదాదేవికి ముద్దుబిడ్డడు అయిన శ్రీకృష్ణుని మహాభాగ్యమైన మోక్షాన్ని పొందటానికి స్మరిస్తాను.

**విశేషం :** కైవల్యం – కేవలస్థితి – అనగా మౌలికస్థితి – మొట్టమొదటి స్థితి. మానవుని మొట్టమొదటి స్థితి ఆత్మస్థితే. జన్మజన్మాంతర కర్మవాసనాఫలితంగా సంభవించే ఉపాధివల్ల ఆ స్థితి మరుగుపడుతూ ఉంటుంది. భక్తి జ్ఞానాదులతో శాశ్వతంగా ఉపాధికి దూరమై, మళ్ళీ ఆనందమయమైన ఆ మొదటి స్థితిని – (ఆత్మస్థితిని) పొందటమే మోక్షం.

"లోకరక్షైకారంభకున్" అనడంచే ధర్మసంస్థాపకత్వం, "భక్తపాలన కళాసంరంభకున్" అనడంచే శిష్టరక్షణ పరాయణత్వం, "దానవోద్రేకస్తంభకున్" అనడంచే దుష్టశిక్షణ సామర్థ్యం, "కేళి... డింభకున్" అనడంచే సర్వస్రష్టృత్వం, "మహానందాంగనా డింభకున్" అనడంచే సర్వభోక్తృత్వరూపమైన ఆనందమయత్వం, "శ్రీకైవల్యపదంబు" అనడంచే సర్వేశ్వరత్వం వివరించబడ్డాయి.

"ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యార్థ సూచకః" అనే సంప్రదాయాన్ని అనుసరించి కదా కావ్యారంభం చేయాలి? దాన్నికూడ పరిశీలిద్దాం. "శ్రీ కైవల్య... చింతించెదన్" అనడంచే ప్రథమస్కంధగత పరీక్షిత్తు మోక్షాసక్తి, "లోక... కున్" అనడంచే హిరణ్యాదిరాక్షస సంహారం, "భక్త... సంరంభకున్" అనడంచే గజేంద్రాది సంరక్షణం, "దాన... స్తంభకున్" అనడంచే బలిచక్రవర్తి ఔద్ధత్యాన్ని అణచడం, "కేళి... కుంభకున్" అనడంచే సమస్త బ్రహ్మాండ చరాచర జంతుసృష్టి, "మహా... డింభకున్" అనడంచే యశోదాకృష్ణ పరస్పర ప్రేమానురాగవైభవం – ఇలా పంద్రెండు స్కంధాలలోని వృత్తాంతం ఈ పద్యంలో సూచన చేశాడు పోతన. ఈ రచనాసంవిధానమే పోతనకు సహజ పాండిత్య బిరుద సార్థక్యాన్ని సంతరించింది.

జాలశబ్దంలో అర్థశ్లేష – సమూహము, మాయ. ఈ సృష్టిలో పుట్టుట, పెరుగుట, గిట్టుట – ఈ మూడూ ఆ పరమాత్ముని చూపులవల్ల జరిగే క్రియలే. ఆయన ఒక విధంగా చూస్తే పుట్టుక; మరోవిధంగా చూస్తే పెరుగుట, ఇంకోవిధంగా చూస్తే గిట్టుట. జగత్తంతా ఆ పరమాత్ముని చూపులమాయే. భగవల్లీల.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని" అను సూక్తిప్రకారం "శ్రీ" శబ్దంతో పద్యరచన ప్రారంభమయింది. "శ్రిఞ్ సేవాయాం" అను ధాతువునుండి "శ్రియతే జనైః" అనే అర్థంలో శ్రీ శబ్దం నిష్పన్నమై "జనులచే సేవింపదగిన" అనే అర్థంలో స్వీకరింపబడింది. "కుభి ఆచ్ఛాదనే" అనే ధాతువునుండి నిష్పన్నమైన కుంభశబ్దం ఆచ్ఛాదనార్థంలో ఇచట గ్రహింపబడింది. "ఏతి కార్యం కర్తుం స్వయమేవ గచ్ఛతీతి ఏకః" అన్యాపేక్ష లేకుండా స్వయంగా కార్యసాధనకు పూనుకొంటే 'ఏక' శబ్దం ప్రయుక్తమవుతుంది.

**అవ :** పోతన ప్రప్రథమంగా విష్ణుపరంగా స్తోత్రంచేసి అనంతరం శివస్తుతి ఈ విధంగా కావిస్తున్నాడు.

**ఉ. వాలిన భక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా**
**శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్**
**బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో**
**న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్. 2**

**ప్రతి :** అవారిత= నిలువరింప వీలుకాని; తాండవ+కేళికిన్= తాండవ నృత్యమనే క్రీడ కలవానికి; దయాశాలికిన్= దయతో విరాజిల్లేవానికి; శిఖరిజా= పర్వతరాజపుత్రియొక్క; ముఖపద్మ= పద్మంవంటి ముఖానికి; మయూఖ= కిరణములనే; మాలికిన్= మాల కల సూర్యునివంటివానికి; బాలశశాంక= అర్ధచంద్రుని; మౌళికిన్= కొప్పునందుకలవానికి; కపాలికిన్= పుర్రె చేపట్టినవానికి; మన్మథ= కామునియొక్క; గర్వపర్వత= కొండ అనే అహంకారాన్ని; ఉన్మూలికిన్= పెల్లగించినవానికి; నారద+ఆది= నారదుడు మున్నగు; మునిముఖ్య= యోగిశ్రేష్ఠుల; మనస్+సరసీరుహ= మనస్సులనే పద్మములకు; అళికిన్= తుమ్మెదవంటివానికి; శూలికిన్= శూలం కలిగినవానికి (శివునకు); వాలిన= మిక్కుటమైన; భక్తిన్= భక్తితో; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** నిరోధించడానికి వీలుకాని తాండవనృత్యం చేసేవాడు. కరుణారసహృదయుడు, పార్వతీదేవి ముఖారవిందాన్ని ప్రభాకరునిలా వికసింపజేసేవాడు, శిరస్సున నెలవంక ధరించేవాడు, పుర్రెను దాల్చేవాడు, కందర్పుని దర్పాన్ని సమూలంగా

నాశనం చేసినవాడు, నారదాది మహర్షుల హృదయకమలాలలో భ్రమరంలా విహరించేవాడు, త్రిశూలధారి ఐన శివునికి మిక్కిలి భక్తితో నమస్కరిస్తున్నాను.

**విశే :** నిరాకారుడైన శివుని 'అణిమ' మున్నగు అష్టసిద్ధులు కలవానిగా, సాకారుడైనపుడు 'అష్టతనువులు' కలవానిగా స్తుతి చేయడం ఒక సంప్రదాయం. పోతనకూడ ఈ పద్యంలో ఎనిమిది విశేషణాలు ఉపయోగించి ఈశ్వరస్తుతి చేశాడు. పరమశివుని ఉద్ధత నృత్యం తాండవం. అది కేళీప్రధానమయితే ఆనందతాండవం. సంహారప్రధానమయితే ప్రళయతాండవం. శివతాండవం ఆనంద, త్రిపుర, రుద్ర, సమర, కాళీ, ఉమా, గౌరీ భేదాలతో ఏడువిధాలు.

**అవ :** విష్ణుస్తుతి, శివస్తుతి కావించిన పిదప పోతన బ్రహ్మను ఇట్లు స్తుతిస్తున్నాడు.

**ఉ. ఆతత సేవఁ జేసెద సమస్తచరాచరభూతసృష్టి వి**
**జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశి ని**
**ర్ణేతకు దేవతానికర నేతకుఁ గల్మషజేతకున్ నత**
**త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్. 3**

**ప్రతి :** సమస్త= అఖిలమైన; చర= కదలే ప్రాణులను; అచర= కదలని జడములను; భూతసృష్టి= ప్రాణికోటిని పుట్టించడంలో; విజ్ఞాతకున్= విశేషజ్ఞానం కలవానికి; భారతీ= సరస్వతీదేవియొక్క; హృదయ= మనస్సునకు; సౌఖ్య= సంతోషం; విధాతకున్= చేకూర్చేవానికి; వేదరాశి= వేదాలయొక్క సమూహాన్ని; నిర్ణేతకున్= నిర్ణయించువానికి; దేవతానికర= దేవతల సమూహంయొక్క; నేతకున్= నాయకునికి; కల్మష= పాపములను; జేతకున్= జయించినవానికి; నత= వంగి నమస్కరించిన వారిని; త్రాతకున్= రక్షించువానికి; నిఖిల= సమస్తమైన; తాపసలోక= మునుల సమూహానికి; శుభ= శుభములను; ప్రదాతకున్= లెస్సగా ఇచ్చేవానికి; ధాతకున్= బ్రహ్మ దేవునికి; ఆతత= విస్తారమైన; సేవన్= సేవను; చేసెదన్= చేస్తాను.

**తా :** సమస్త స్థావర జంగమాత్మక ప్రపంచాన్ని సృజింపనేర్చినవాడు, సరస్వతీదేవి హృదయానికి విశేష సంతోషం చేకూర్చేవాడు, వేదసమూహాలను నిర్ణయించేవాడు, సురగణాలకు నాయకుడై నడిపించేవాడు, స్వస్వభావంచేతనే సమస్త పాపాలను జయించేవాడు, మొక్కినవారిని రక్షించేవాడు, తపోధనులకు శుభాలు ఎక్కువగా చేకూర్చేవాడు అయిన బ్రహ్మదేవుని భక్తితో సేవిస్తాను.

**విశే :** కల్మషం – కల్యతే గణ్యతే చిత్రగుప్తాదిభిరితి కల్మషం (యద్వా) శుభం కర్మ శ్యతి తనూకరోతి వా కల్మషం. పాపం రెండు రకాలు. చిత్రగుప్తాదులచే లెక్కింపబడేది. లెక్కింపబడనిది. శుభమైన కర్మమును బాగుగా తగ్గించివేసేది. అందు మొదటిదానికి కల్మషం అని పేరు.

నేత అంటే నాయకత్వం వహించి నడిపించేవాడు. నేతృశబ్దం "నయతి వినియుంక్తే సేవకానితి" అనగా వారివారి యోగ్యతలనుబట్టి సేవకులను వినియోగించువాడు అనే భావంలో కూడ ఉపయుక్తం.

**వ. అని నిఖిలభువన ప్రధానదేవతావందనంబు సేసి. 4**

**ప్రతి :** అని= ఈ విధంగా; నిఖిల= సమస్త; భువన= లోకాలకు; ప్రధానదేవతా= ముఖ్యులగు దేవతలైన త్రిమూర్తులకు; వందనంబు+చేసి= నమస్కరించి...

**తా :** సృష్టిస్థితి లయకారకులైన త్రిమూర్తులు ప్రధాన దేవతలు. వారు సమస్తలోకాలకు ముఖ్యులు. అందువల్ల వారికి నమస్కరించి

**అవ :** అనంతరం తన రచన నిర్విఘ్నపరిసమాప్తికై విఘ్నేశ్వర ప్రార్థన పోతన ఇట్లు కావించాడు.

**ఉ. ఆదర మొప్ప మ్రొక్కిదుదు నద్రిసుతాహృదయానురాగ సం**
**పాదికి, దోషభేదికిc, బ్రపన్నవినోదికి, విఘ్నవల్లికా**
**చ్ఛేదికి, మంజువాదికి, నశేషజగజ్జననందవేదికిన్**
**మోదకఖాదికిన్, సమదమూషక సాదికి, సుప్రసాదికిన్. 5**

**ప్రతి :** అద్రిసుతా= పర్వత పుత్రికయొక్క; హృదయ+అనురాగ= మనస్సులోని కూర్మిని; సంపాదికిన్= పొందినవానికి; దోషభేదికిన్= పాపములను తొలగించేవానికి; ప్రపన్న= శరణాగతి చేసేవారితో; వినోదికిన్= క్రీడించువానికి; విఘ్న, వల్లికా= ఆటంకములనే లతలను; ఛేదికిన్= త్రుంచేవానికి; మంజువాదికిన్= మధురంగా భాషించేవానికి; అశేష= సమస్తమైన; జగత్= లోకాలలోని; జన= ప్రజలయొక్క; నంద= ఆనందానికి (ఆనందాన్ని); వేదికిన్= వేదికయైనవానికి లేదా తెలిసినవానికి; మోదకఖాదికిన్= కుడుములను భక్షించేవానికి; సమద= బలిసిన; మూషక= ఎలుకను; సాదికిన్= అధిరోహించేవానికి; సుప్రసాదికిన్= శుభముగా ప్రసన్నుడయ్యేవానికి అయిన విఘ్నేశ్వరునకు; ఆదరము= గౌరవం; ఒప్పన్= మిక్కుటంకాగా; మ్రొక్కు+ఇడుదున్ : మ్రొక్కు= నమస్కారము; ఇడుదున్= సమర్పిస్తాను.

**తా :** పార్వతి సృజింపగా తల్లి కారణంగా పునరుజ్జీవితుడై, ఆమె హృదయానురాగాన్ని పూర్తిగా సంపాదించినవాడు, కలిదోష నివృత్తి చేయగలవాడు. ఆపన్నుల కష్టాలను తొలగించి క్రీడించేవాడు. భక్తుల కష్టాలు అనే తీవలను ఛేదించేవాడు, మధురంగా మాట్లాడేవాడు, అన్ని లోకాల జనుల ఆనందాన్ని అవగాహన చేసుకొన్నవాడు, ఆ ఆనందానికి ఆధారవేదిక అయినవాడు, కుడుములను భక్షించేవాడు, బలిసిన ఎలుకనెక్కి విహరించేవాడు, సులభంగా భక్తులకు ప్రసన్నమయ్యేవాడు అయిన విఘ్నేశ్వరునికి గౌరవభావంతో నమస్కరిస్తాను.

**విశే :** 'సంపాదికిన్ – ప్రపన్న' అనే పాఠం సమంజసమైనది. సాదిన్ శబ్దం సీదతి నిషీదతి ఇతి సాదీ – సాదీస్యాత్తురగారోహే, రథేభారోహయోరపి" అని రథేభతురగారోహణంలో ప్రయుక్తం కావాలి. కాని ఇక్కడ మూషకారోహణార్థంలో ఉపయుక్తమయింది. "మన జ్ఞానే, మన్యతే సర్వైరితిమంజు" అందరిచే తలంపబడేదికాన మంజులం.

**ఉ. క్షోణితలంబునన్ నుదురు సోcకcగ మ్రొక్కి నుతింతు సైకత**
**శ్రోణికిc జంచరీకచయసుందరవేణికి రక్షితామర**
**శ్రేణికిc దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్**
**వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్. 6**

**ప్రతి :** సైకత= ఇసుకతిన్నెలవంటి; శ్రోణికిన్= (విశాలమైన) పిఱుదులుగలదానికి; చంచరీకచయ= తుమ్మెదల గుంపువలె; సుందరవేణికిన్= అందమైన జడగలదానికి; రక్షిత= కాపాడబడిన; అమరశ్రేణికిన్= దేవతల సమూహం కలదానికి; తోయజాతభవ= కమలం నుండి పుట్టిన బ్రహ్మయొక్క; చిత్త= మనస్సును; వశీకరణ= స్వాధీనపరచుకోవడంలో; ఏక=

ముఖ్యమైన, సాటిలేని; వాణికిన్= వాక్కుకలదానికి; అక్షదామ= స్ఫటికమాలచేత; శుక= చిలుకచేత; వారిజ= పద్మముచేత; పుస్తక= (వేద) గ్రంథముచేత; రమ్య= మనోజ్ఞములైన; పాణికిన్= చేతులుగలదానికి; వాణికిన్= సరస్వతీదేవికి; క్షోణితలంబునన్= నేలపై; నుదురు= లలాటం; సోఁకఁగన్= తాకునట్లుగా; మ్రొక్కి= నమస్కరించి; నుతింతున్= స్తుతిస్తాను.

**తా :** ఇసుక తిన్నెలవలె విశాలరమ్యాలైన పిఱుదులు కలది, తుమ్మెదల బారువంటి అందమైన నల్లని జడగలది, దేవతాసమూహాన్ని రక్షించినది, బ్రహ్మదేవుని మనస్సును వశం చేసుకొనుటలో సాటిలేని మాట నేర్పుకలది, స్ఫటికమాల, చిలుక, పద్మం, పుస్తకం ధరించి మనోహరాలైన చేతులు కలది, అయిన సరస్వతీదేవికి నొసలు నేల తాకేటట్లు నమస్కరించి ఆమెను స్తుతిస్తాను.

**విశే :** స్త్రీల పిఱుదులు మాంసలత్వం కలిగి ఉండడంచే సైకతస్థలితో పోల్చడం కవిసమయం. అల్లిన జడ తుమ్మెదల బారులా కనిపిస్తుంది. కాబట్టి తుమ్మెదల రంగు జడరంగు సమానం గాన, వాణి అలికులవేణి అయింది. "దేవీం వాచమజనయంత దేవాః" అను శ్రుతివాక్యం ప్రకారం దేవతలను కనికరించడానికై అమ్మ వాగ్రూపంలో అవతరించింది కావున ఆమె రక్షితామరశ్రేణి అయింది. ఆమె తన వాక్కు చేతనే బ్రహ్మదేవుని వశపరచుకొన్న మృదుమధురసల్లాప.

ఆమె ధరించిన స్ఫటికమాల జపానికి చిహ్నమై, నిత్యం బ్రహ్మజ్ఞానంతో కూడి ఉంటుంది. శుకం కామానికి ప్రతీకయై ధర్మానికి విరుద్ధం కాని ఇచ్ఛయై ఉంది. పద్మం ధనరాసులకు కాణాచియై నిత్యలక్ష్మీయుక్తమై అర్థమై శోభిల్లుతూ ఉంది. పుస్తకం వేదశాస్త్రాలకు నిలయమై ధర్మానికి ఆధారమై నిలిచి ఉంది. ఈ విధంగా ధర్మార్థకామమోక్షాలకు ప్రతీకలుగా ఆమె పుస్తకం, పద్మం, చిలుక, అక్షమాల ధరించి దర్శనమిస్తుంది.

**శా. పుట్టం బుట్ట, శరంబునన్ మొలవ, నంభోయానపాత్రంబునన్**
**నెట్టం గల్గను, గాళిఁ గొల్వను, బురాణింపన్ దొరంకొంటి మీఁ**
**దెట్టే వెంటఁ జరింతుఁ దత్సరణి నా కీవమ్మ! యో యమ్మ! మేల్**
**పట్టున్ నాకగుమమ్మ! నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ! 7**

**ప్రతి :** (బ్రహ్మదేవుని భార్య అయిన ఓ సరస్వతీదేవీ!) దయా+అంభోనిధీ= దయకు సముద్రంవంటిదానా!; పుట్టన్= పుట్టయందు; పుట్టన్= పుట్టలేదు; శరంబునన్= ఱెల్లుగడ్డిలో; మొలవన్= జన్మించలేదు; అంభః= నీటిమీద; యాన= పయనించే; పాత్రంబునన్= పాత్రయందు, పడవయందు; నెట్టన్= తప్పనిసరి అయి; కల్గన్= పుట్టలేదు; కాళిన్= కాళికాదేవిని; కొల్వను= పూజించను; పురాణింపన్= భాగవత మహాపురాణమును వ్రాయుటకు; దొరంకొంటి= పూనుకొన్నాను; మీఁదు= మున్ముందు; ఎట్టు= ఏ విధముగా; ఏ+వెంటన్= ఈ పనివెంబడి; చరింతున్= నడతునో, ముందుకు వెళ్ళుదునో; తత్= ఆ; సరణిన్= మార్గమును; నాకున్= నాకు; ఈవు+అమ్మ= ఇమ్ము తల్లీ; ఓ+అమ్మ= ఓ తల్లీ; మేల్= మేలైన; పట్టున్= ఆధారము; నాకున్= నాకు; అగుము+అమ్మ; నమ్మితిన్= (నిన్నే) నమ్మినాను; చుమీ= సుమా!

**తా :** అమ్మా! ఓ సరస్వతీదేవీ! దయామయీ! నేను వాల్మీకి మహాకవివలె పుట్టలో పుట్టలేదు. కుమారస్వామివలె రెల్లుగడ్డిలో జన్మించలేదు. వ్యాసమహర్షివలె పడవలో ప్రభవిల్లలేదు. కాళిదాస మహాకవివలె కాళికాదేవిని పూజించలేదు. అయినా, శ్రీమద్భాగవత మహాపురాణ రచనకు పూనుకొన్నాను. ఏ విధంగా ముందుకు వెళ్ళాలో త్రోవ చూపు తల్లీ! నాకు గట్టి ఆధారంగా నిలువుమమ్మా! నిన్నే నమ్ముకొన్నాను తల్లీ.

**విశే :** వ్యాస వాల్మీకి కాళిదాసాదులతో కుమారస్వామిని చేర్చటం ఈ పద్యంలో ఒక విశేషం. ఒక మహాకవిగా లేదా ఒక మహాపండితుడుగా కుమారస్వామి ప్రసిద్ధుడు కాలేదు కదా, పోతనగారు ఆయన పేరును ఇందులో ఎందుకు చేర్చారని పాఠకులకు అనిపించవచ్చు.

అందువల్ల కొందరు శరంబునన్ మొలవ అనేదానికి బదులుగా 'శిరంబునన్ మొలవ' అనే పాఠాంతరాన్ని స్వీకరించి – శిరంబునన్= తలమీద; పుట్ట; మొలవన్= మొలవగా; పుట్టన్= జన్మించినవాడనుకాను అని సమన్వయించి చెపుతారు. ఈ సమన్వయం పూర్తిగా త్రోసిపుచ్చదగినదికాదు; సత్యానికి సుదూరమూ కాదు.

అయితే, ఇదే స్కంధంలో పంద్రెండవ వచనంలో పోతనగారు కుమారస్వామి ప్రస్తావన మరల తెచ్చారు. కుమారస్వామి సుబ్రహ్మణ్యుడు. చక్కని బ్రహ్మజ్ఞాన సంపన్నుడు. బ్రహ్మజ్ఞానాన్ని మించిన విజ్ఞానం మరొకటి ఏముంది? ఆధ్యాత్మికతాశిఖరమైన శ్రీమద్భాగవత మహాగ్రంథ రచనకు పూనుకొన్న పోతనగారు – తాను వాల్మీకి వ్యాసకాళిదాసాదులవలె గొప్ప కవినికాదని, కుమారస్వామివలె ఆధ్యాత్మిక తత్త్వవేత్తను కానని, సవినయంగా సరస్వతీదేవికి విన్నవించుకోవటానికి, కుమారస్వామి ప్రస్తావన తీసుకురావటం సమంజసమే కదా.

**ఉ. శారదనీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా**
**హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం**
**దార సుధాపయోధి సితతామరసామరవాహినీ శుభా**
**కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ! 8**

**ప్రతి :** భారతీ= సరస్వతీ!; శారదనీరద= శరత్కాలమేఘంయొక్క; ఇందు= చంద్రునియొక్క; ఘనసార= కర్పూరంయొక్క; పటీర= చందనంయొక్క; మరాళ= హంసయొక్క; మల్లికా= మల్లెయొక్క; హార= ముత్యాలహారంయొక్క (హారోముక్తావళీ); తుషార= మంచుయొక్క; ఫేన= నురుగుయొక్క; రజతాచల= వెండికొండయొక్క; కాశ= ఱెల్లుయొక్క; ఫణి+ఈశ= ఆదిశేషునియొక్క; కుంద= మొల్లయొక్క; మందార= జిల్లేడుపూవుయొక్క; సుధాపయోధి= క్షీరసాగరంయొక్క; సితతామరస= తెల్లతామరయొక్క; అమరవాహినీ= ఆకాశగంగయొక్క; శుభ+ఆకారతన్= స్వచ్ఛమైన కాంతివంటి ఆకారంతో; ఒప్పు= ప్రకాశించు; నిన్నున్= నిన్ను; మదిన్= మనస్సునందు; కానఁగన్= చూడగా; ఎన్నఁడు= ఎప్పుడు; కల్గున్= చేకూరుతుంది?

**తా :** సరస్వతీదేవీ! శరత్కాల మేఘంవలె, చంద్రునివలె, కర్పూరంవలె, చందనంవలె, హంసవలె, మల్లెపూవువలె, ముత్యాలహారంవలె, మంచువలె, నురుగువలె, వెండికొండవలె, రెల్లువలె, ఆదిశేషునివలె, మొల్లవలె, తెల్ల జిల్లేడు పూవువలె, పాలసముద్రంవలె, తెల్లతామరవలె, ఆకాశగంగవలె స్వచ్ఛమైన తెల్లని కాంతితో ప్రకాశించే నిన్ను మనస్సున దర్శించే అవకాశం ఎప్పుడు కలుగుతుందో!

**విశే :** శారదాదేవి తెల్లని కాంతులతో, చల్లని చూపులతో విరాజిల్లుతూ దర్శనమిస్తుంది. అందువల్ల సృష్టిలోని చల్లదనాన్నిచ్చే, తెల్లని వస్తువులన్నీ పోతన పద్యంలో ఇమిడినంతవరకు ఉపమానంగా స్వీకరించి, ఆమె ధవళ సుందరమూర్తిని కన్నులకట్టినట్లు చూపించాడు.

**ఉ. అంబ, నవాంబుజోజ్జ్వలకరాంబుజ, శారదచంద్రచంద్రికా**
**డంబర చారుమూర్తి, ప్రకట స్ఫుట భూషణ రత్నదీపికా**

**చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ, భా**
**వాంబరవీథి విశ్రుత విహారిణి, నన్ గృపఁజూడు భారతీ! 9**

**ప్రతి :** భారతీ= ఓ సరస్వతీ!; అంబ= అమ్మా!; నవ+అంబుజ : నవ= కొత్తగా వికసించిన; అంబుజ= పద్మంచేత; ఉజ్జ్వల= ప్రకాశించే; కర+అంబుజ= హస్తపద్మం కలదానా!; శారద= శరత్కాలంలోని; చంద్ర= చంద్రబింబంయొక్క; చంద్రికా= వెన్నెలలు; ఆడంబర= సంరంభంతోకూడిన (ఆటోపంతో కూడిన); చారుమూర్తి= మనోజ్ఞమైన ఆకారం కలదానా!; ప్రకట= ప్రకటింపబడుతున్న (కనబడుతున్న); స్ఫుట= స్పష్టమైన; భూషణ= ఆభరణాదులు; రత్న= మణులయొక్క; దీపికా= కాంతులచే; చుంబిత= ముద్దు పెట్టుకొనబడిన; దిక్+విభాగ : దిక్= దిక్కులయొక్క; విభాగ= విభాగములు కలదానా!; శ్రుతి= వేదాలలోని; సూక్తి : సు+ఉక్తి= మంచి మాటలచే వ్యక్తమయ్యే; వివిక్త= పవిత్రమైన; నిజప్రభావ= స్వయంప్రభావం కలదానా!; భావ+అంబరవీథి= (సత్కవుల; మహాభక్తుల) భావాకాశవీథులలో; విశ్రుత= ప్రశస్తితో; విహారిణి= విహరించుదానా!; నన్= నన్ను; కృపన్= దయతో; చూడు(ము)= వీక్షింపుము.

**తా :** కొత్తగా వికసించిన పద్మాన్ని ధరించి మిక్కిలిగా ప్రకాశించే పద్మంవంటి హస్తం కలదానా! శరత్కాలపు వెన్నెలకాంతుల ఆడంబరంతో కూడిన అందమైన ఆకారం కలదానా! ధరించిన రత్నాభరణాల కాంతులు దిగంతాలను తాకేటట్లు శోభిల్లేదానా! వేదసూక్తుల్లో వ్యక్తమయ్యే స్వీయప్రభావం కలదానా! సత్కవుల, మహాభక్తుల భావాకాశ వీధుల్లో ప్రశస్తంగా విహరించేదానా! సరస్వతీదేవీ! నను దయచూడు.

**విశే :** ఆడంబర శబ్దం "ఆడంబర స్తూర్యరవే, గజేంద్రాణాంచ గర్జితే" తూర్యరవంలోను, గజేంద్ర గర్జనంలోను ప్రయుక్తం కావలసి ఉంది. చకార గ్రహణం వలన సంరంభార్థం కూడ గ్రాహ్యం. "ఆడంబరోఽ స్త్రీసంరంభః" ఇతిశేషః. వివిక్త శబ్దార్థం – "వివిచ్యత ఇతి వివిక్తః" వివిక్తే పూత విజనే అని పవిత్రతకు, ఏకాంత స్థలానికి ప్రయుక్తం.

**ఉ. అమ్మల గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాల పె**
**ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి పుచ్చిన యమ్మ, తన్ను లో**
**నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా**
**యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్. 10**

**ప్రతి :** దుర్గ= దుర్గాదేవి; అమ్మల+కన్నయమ్మ; (అమ్మలఁ గన్నయమ్మ (పాఠాంతరం)= అమ్మలకందరికి జన్మకారణమైన అమ్మ; (ఆ+మల+కన్న+అమ్మ= ఆ హిమవంతుని కూతురగు అమ్మ); ముగురమ్మల= లక్ష్మీసరస్వతీ పార్వతులు; మూలపుటమ్మ= ఉత్పత్తికి కారణమైన పరాభట్టారిక; చాల= మిక్కిలి; పెద్ద+అమ్మ= పెద్దకాలంనాటి ముత్తైదువ; సుర+అరుల+అమ్మ : సురారులమ్మ= దేవతల శత్రువులగు రాక్షసుల తల్లియైన దితియొక్క; కడుపు= గర్భం; పాఱడిపుచ్చిన+అమ్మ= వ్యర్థమయ్యేలా చేసిన అమ్మ; తన్నున్= తనను; లోన్= మనస్సునందు; నమ్మిన= విశ్వసించిన; వేల్పు+అమ్మల= దేవతాకాంతల; మనంబులన్= హృదయాలలో; ఉండెడి+అమ్మ= నివసించేతల్లి; మా+అమ్మ= మాకందరకు అమ్మ; మహత్త్వ= మిక్కిలి గొప్ప; కవిత్వ= కవిత్వంయొక్క; పటుత్వ= సామర్థ్యంయొక్క; సంపదల్= ఐశ్వర్య సమృద్ధులను; కృపా+అబ్ధి= దయాసముద్రురాలు; ఇచ్చుతన్= ప్రసాదించుగాక!

**తా :** ఆమె అమ్మలందరికి అమ్మ. ముజ్జగాలకు మూలమైన ముగురమ్మలకు ఆదిమూలమైన అమ్మ. పెద్దకాలంనాటి అందరికన్న అధికురాలైన అమ్మ. రక్కసుల తల్లి అయిన దితి గర్భానికి దుఃఖాన్ని చేకూర్చిన అమ్మ. తనను నమ్ముకొన్న

దేవతాకాంతల మనస్సులలో నివసించే అమ్మ. అందరికీ అమ్మ ఆ దుర్గమ్మ దయాసముద్రురాలు. ఆమె తనకు లక్ష్మియై సంపదను, సరస్వతియై కవిత్వాన్ని, పార్వతియై శక్తిని సమకూర్చాలని పోతన ఇందు స్తుతించారు.

**విశే :** అమ్మ శక్తిస్వరూప – ఆ శక్తి మూడువిధాలు. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి అని. ఇచ్ఛాశక్తి సరస్వతికి, జ్ఞానశక్తి లక్ష్మికి, క్రియాశక్తి పార్వతికి సంకేతం. ఇచ్ఛాశక్తే లక్ష్మి అని, జ్ఞానశక్తియే సరస్వతి అని కూడా చెప్పవచ్చు. ఆ మూడుశక్తుల మూలశక్తియే పరాభట్టారిక. 'మాయ+అమ్మ' అన్న విభాగంకూడా స్ఫురిస్తుంది. మాయకాధారమైన మూలశక్తి అని తాత్పర్యం.

**మ. హరికిం బట్టపుదేవి, పున్నెముల ప్రో, వర్థంపుఁ బెన్నిక్క, చం**
**దురు తోఁబుట్టువు, భారతీ గిరిసుతల్ తోనాడు పూఁబోఁడి, తా**
**మరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా**
**సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్. 11**

**ప్రతి :** సిరి= లక్ష్మీదేవి; హరికిన్= విష్ణువునకు; పట్టపుదేవి= పట్టపురాణి; పున్నెముల+ప్రోవు= పుణ్యాలరాశి; అర్థంపు= సిరిసంపదలకు; పెన్+ఇక్క= పెద్ద నిలయం; చందురు= చంద్రుని; తోఁబుట్టువు= సోదరి; భారతీ, గిరిసుతల్= సరస్వతీపార్వతులు; తోన్+ఆడు= కలసి విహరించు; పూఁబోఁడి= పూవువంటి మేనుకలది; తామరల+అందున్= పద్మములందు; ఉండెడి= వసించెడి; ముద్ద+ఆలు= జవరాలు; జగముల్= లోకములన్నీ; మన్నించు= పూజించు; ఇల్లాలు= గృహలక్ష్మి; భాసురతన్= తన కాంతితోనే; లేములు= దారిద్ర్యములను; పాపు= పోగొట్టు; తల్లి; నిత్యకల్యాణముల్= ఎడతెగని సౌభాగ్యాలను; ఇచ్చున్= ప్రసాదించుగాక!

**తా :** శ్రీదేవి ఆదిదేవుడైన శ్రీమహావిష్ణువునకు పట్టపురాణి. ఆమె పుణ్యాలరాశి. సిరిసంపదలకు కాణాచి. క్షీరసాగర మథన సమయంలో చంద్రునితో కలసి పుట్టింది. సరస్వతీపార్వతులతో కలసి క్రీడించు అలరుబోడి. పద్మాల్లో నివసించే యౌవనవతి. సమస్తలోకాలవారు ఆమెనే పూజిస్తారు. ఒక్క చూపుతోనే దారిద్ర్యాన్ని పటాపంచలు చేసే తల్లి. ఆ ఆదిలక్ష్మి తనకు నిరంతరం సౌభాగ్యం అందజేయాలని పోతన కోరుకొన్నాడు.

**వ. అని యిష్టదేవతలం జింతించి దినకర కుమార ప్రముఖులం దలంచి ప్రథమ కవితా విరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి, హయగ్రీవ దనుజకర పరిమిళిత నిగమ నివహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహాభాగవత కథా సుధారస ప్రయోగికి శుకయోగికి నమస్కరించి; మృదుమధురవచనరచనపల్లవితస్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి, కతిపయ శ్లోకసమ్మోదితసూరు మయూరు నభినందించి, మహా కావ్యకరణ కళావిలాసుం గాళిదాసుం గొనియాడి, కవికమలవిసరరవిన్ భారవిన్ బొగడి విదళితాఘు మాఘు వినుతించి, యాంధ్ర కవితాగౌరవ జనమనోహారి నన్నయసూరిం గైవారంబు సేసి, హరిహర చరణారవింద వందనాభిలాషిం దిక్కనమనీషిన్ భూషించి, మఱియు నితర పూర్వ కవిజన సంభావనంబు గావించి, వర్తమాన కవులకుం బ్రియంబు పలికి, భావికవుల బహూకరించి, యుభయ కావ్యకరణదక్షుండనై. 12**

**ప్రతి :** అని= ఈ విధంగా; ఇష్టదేవతలన్= తాను పూజించేదైవములనందరిని; చింతించి= స్మరించి; దినకర కుమారప్రముఖులన్= సూర్యభగవానుడు; కుమారస్వామి వంటి మిక్కిలి గొప్పవారిని; తలంచి= మనస్సునకు తెచ్చుకొని; ప్రథమ= మొట్టమొదటగా; కవితా= కవిత్వమును; విరచన= నిర్మించుటయనెడు; విద్యావిలాస= కళాచాతుర్యముచే; అతిరేకి= అధికుడైన; వాల్మీకిన్= వాల్మీకి మహాకవిని; నుతియించి= స్తుతిచేసి; హయగ్రీవ= హయగ్రీవుడను; దనుజ= రాక్షసుని; కర= హస్తములచేత; పరిమిళిత= పూర్తిగా కలసిపోయిన; నిగమనివహ= వేదరాశియొక్క; విభాగ= భాగములను; నిర్ణయ= నిశ్చయించు; నిపుణతా= నేర్పుచేత; సముల్లాసునకున్= మిక్కిలి ప్రకాశించిన; వ్యాసునకున్= వ్యాసమహర్షికి; మ్రొక్కి= నమస్కరించి; శ్రీమహాభాగవత= శ్రీమద్భాగవతములోని; కథాసుధారస= కథ అనెడు అమృతమును; ప్రయోగికిన్= ప్రవచనముచే ధారపోసిన; శుకయోగికిన్= (వ్యాసపుత్రుడైన) శుకమహర్షికి; నమస్కరించి= కేలుమోడ్చి; మృదు= మెత్తనైన; మధుర= తియ్యనైన; వచన= నుడికారములయొక్క; రచన= నిర్మాణముచే; పల్లవిత= చిగురింపజేయబడిన; స్థాణునకున్= మ్రోడు కలిగినవానికి; బాణునకున్= కాదంబరీగ్రంథకర్తయైన బాణమహాకవికి; ప్రణమిల్లి= సాష్టాంగ నమస్కారంచేసి; కతిపయ= కొద్దిపాటి; శ్లోక= శ్లోకములచేతనే; సమ్మోదిత= ఆనందింపజేయబడిన; సూరున్= సూర్యుని కల; మయూరున్= (సూర్యశతక కర్తయైన) మయూరుని; అభినందించి= మిక్కిలి స్తుతించి; మహాకావ్య= గొప్పగ్రంథములను; కరణ= నిర్మించుటయనే; కళావిలాసున్= విద్యాచాతురికల్గిన; కాళిదాసున్= కాళిదాస మహాకవిని; కొనియాడి= పొగడి; కవి, కమల, విసర, రవిన్ : కవి= కవులనే; పద్మ= పద్మములు; విసర= సమూహమునకు; రవిన్= సూర్యునివంటి వాడైన; భారవిన్= (కిరాతార్జునీయ కావ్యకర్తయైన) భారవిమహాకవిని; పొగడి= శ్లాఘించి; విదళిత= దూరము చేయబడిన; అఘున్= కావ్యదోషములుకల; మాఘున్= (శిశుపాలవధ కావ్యకర్తయైన) మాఘమహాకవిని; వినుతించి= స్తుతించి; ఆంధ్రకవితా= తెలుగు కవిత్వంపై; గౌరవ= అభిమానం కల్గిన; జన= జనులయొక్క; మనోహారిన్= హృదయాలను దోచుకొన్న; నన్నయసూరిన్= నన్నయభట్టారకునకు; కైవారంబు+చేసి= కైమోడ్పులందించి; హరిహర= హరిహరనాథునియొక్క; చరణ+అరవింద= పాదపద్మములకు; వందన= నమస్కరించుటయందు; అభిలాషిన్= కోరిక కలిగిన; తిక్కనమనీషిన్= తిక్కన మేధావిని; భూషించి= నుడులతో అలంకరించి; మఱియున్= ఇంకను; ఇతర= మిగిలిన; పూర్వకవిజన= పూర్వకవిశ్రేష్ఠులను; సంభావనంబు+కావించి= మనసారా గౌరవించి; వర్తమాన కవులకున్= ఈ కాలమునాటి కవులకు; ప్రియంబు+పలికి= శుభము పలికి; భావికవులన్= రాబోవు కవులందరిని; బహూకరించి= సమ్మానించి; ఉభయకావ్య= సంస్కృతాంధ్ర భాషాకావ్య; కరణ= నిర్మాణమునందు; దక్షుండనై= సామర్థ్యం కల్గినవాడనై...

**తా :** నేను పూజించే ఇష్టదేవతలందరికీ నమస్కరిస్తున్నాను. సూర్యనారాయణ స్వామికి, కుమారస్వామికి వందనాలర్పిస్తున్నాను. సంస్కృతభాషలో తొలుదొల్తగా కవితాసరస్వతి విలాసాలను వెలయింపజేసిన వాల్మీకిని స్తుతిస్తున్నాను. వేదవిభాగం అనాయాసంగా చేసిన వ్యాసునికి, భాగవత ప్రవర్తక యోగియైన శుకయోగీంద్రునకు, బాణ, మాఘ, భారవి, మయూర కాళిదాసులకు, తెలుగులో కవిత్వం చెప్పి, ఆంధ్రుల హృదయాలను దోచుకొన్న నన్నయ భట్టారకునికి, హరిహరాభేదాన్ని వ్యాప్తిచేసిన తిక్కనార్యునికి, భూతభవిష్యద్వర్తమాన కవులందరికి నమస్కరిస్తున్నాను. సంస్కృతభాషలోను, ఆంధ్రభాషలోను కూడ గ్రంథరచన చేయుటలో సమర్థుడనై.

**విశే :** ఇందు ఇష్టదేవతా ప్రార్థనానంతరం సూర్యుని, కుమారస్వామిని నుతించాడు. మహానారాయణోపనిషత్తులో పదునాలుగవ అనువాకం ఆదిత్యుని మండలం ఋగ్వేదమనీ, లోపలి అర్చులు సామములనీ, ఆ అర్చులలోని పురుషుడు యజుస్సులనీ వర్ణించింది. ఆ విధంగా ఆదిత్యుడు వేదాత్మకుడు. ఆ దృష్టితో పోతన సూర్య నమస్కారం చేశారు. కుమారస్వామి బ్రహ్మ

పఠించిన వేదంలోని అపస్వరాన్ని తొలగించి సుస్వరంతో వచించి సుబ్రహ్మణ్యుడయ్యాడని పురాణగాథ. భగవంతులై విద్యలను వ్యాప్తి చేశారు కాబట్టి వారిద్దరిని పోతన ప్రత్యేకంగా ప్రార్థించాడు. ఇక వాల్మీకికి పూర్వం లోకంలో ఛందోవాఙ్మయం ఉంది. కాని కావ్యవాఙ్మయం లేదు. కాబట్టి ప్రథమ కావ్య సృష్టికర్తగా, ఆదికవిగా ఆయన పేరుపొందాడు. హయగ్రీవుడను రాక్షసుడు వేదాలను ముద్ద చేసినట్లు హరించగా, విష్ణువు హయగ్రీవావతారంలో ఆతనిని వధించి వేదాలను ఉద్ధరించాడు. ఆ వేదాలను విభాగించి వ్యాసుడు వేదవ్యాసుడయ్యాడు. ఇక భాగవత కథాసుధారసాన్ని పంచిపెట్టిన యోగి శుకయోగి. ఇందు పోతన వర్తమాన కవులనేకాక, భవిష్యత్తులో కాబోయే కవులను గూడ సంభావించడం మరో విశేషం. మార్గదేశి కవితలలో కవిత్వం చెప్పగల్గడంచే ఉభయ కావ్యకరణ దక్షుడయ్యాడని కూడ చెప్పవచ్చు. కుకవినింద చేయకపోవటాన్నిబట్టి పోతన వ్యక్తిత్వం ఎట్టిదో పాఠకులకు గోచరమవుతుంది.

**అవ :** పోతన మహాకవి తాను వ్రాయబోయే భాగవతాన్ని ఏ రాజులకూ అంకితం ఈయకుండా శ్రీహరికే సమర్పిస్తున్నానని ఇట్లు తెలియజేస్తున్నాడు.

## ✣ కృతిపతి నిర్ణయము ✣

**ఉ. ఇ మ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్**
**సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి, కాలుచే**
**సమ్మెటవ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ**
**బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్. 13**

**ప్రతి :** ఈ= ఈ కాలంనాటి; మనుజ+ఈశ్వర= మనుష్యులకు ప్రభువులైన; అధములకున్= నీచులకు; ఇచ్చి= అంకితమిచ్చి; పురంబులున్= అగ్రహారములను; వాహనంబులున్= వాహనాలు (ఏనుగులును, గుఱ్ఱాలును, రథాలును మొదలగువానిని); సొమ్ములున్= ఆభరణాలను; కొన్ని= కొన్నింటిని, పుచ్చుకొని= స్వీకరించి; చొక్కి= మైమరచి; శరీరము+పాసి= దేహమునువీడి; కాలుచేన్= యమునిచే; సమ్మెట, వ్రేటులన్= సమ్మెట దెబ్బలను; పడక= పొందక; సమ్మతిన్= (శ్రీరామచంద్రుని అంగీకారంతో) ఇష్టంతో; ఈ బమ్మెరపోతరాజు= ఈ బమ్మెర పోతన అను; ఒకఁడు= ఒకానొకడు; జగత్+హితంబుగన్= లోకముల మేలుకొరకై; భాగవతంబున్= తెలుగు భాగవతమును; శ్రీహరికిన్+ఇచ్చి= శ్రీహరికే సమర్పించి; చెప్పెన్= రచించెను.

**తా :** నీచులైన ఈ రాజులకు కావ్యాలు అంకితమిచ్చి, వారిచ్చే అగ్రహారాలు, వాహనాలు, ఆభరణాలు పుచ్చుకొని ఆనందంతో మైమరచి, చచ్చిన తరువాత యమునిచే సమ్మెటదెబ్బలు తినకుండా – బమ్మెర పోతరాజు అనే ఒకానొకడు లోకశ్రేయస్సుకై తన భాగవతాన్ని మనఃపూర్వకంగా శ్రీహరికిచ్చి రచిస్తున్నాడు.

**విశే :** "అధమౌ న్యూన కుత్సితౌ అధో భవః అధమః" అని అధమ శబ్దం తక్కువదానికి, నిందింపబడేదానికి అనే అర్థంలో ప్రయుక్తం.

**తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని**
**దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ, గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు. 14**

**ప్రతి :** చేతులు; ఆరంగన్= నిండునట్లుగా; శివునిన్= పరమేశ్వరుని; పూజింపఁడు+ఏని= అర్చన చేయకున్నచో; నోరు; నొవ్వంగన్= నొప్పి పుట్టునట్లుగా; హరికీర్తిన్= విష్ణుమూర్తి యశస్సును; నుడువఁడు+ఏని= పలుకకున్నచో; దయయున్=

కరుణయును; సత్యంబున్= నిజమును; లోనుగాన్= అంతరంగమునందు; తలపఁడు+ఏనిన్= తలపనివాడైనచో; తల్లుల= కన్నతల్లుల; కడుపు= గర్భాలను; చేటు= చెడగొట్టుటకుదప్ప; కలుగన్= పుట్టుట; ఏటికిన్= ఎందుకు?

**తా :** ఈ లోకంలో పుట్టిన ప్రతివ్యక్తి చేతులారా శివుని పూజించాలి. నోరారా విష్ణువును కీర్తించాలి. దయను, సత్యాన్ని అంతరంగంలో నింపుకోవాలి. అలా చేయనివాడు పుట్టడందేనికి? తల్లుల కడుపు చెడగొట్టుటకు తప్ప.

**విశే :** చేతులు శివునకు, నోరు కేశవునకు అంకితం కావాలని చెప్పడంచే శివకేశవుల అభేదాన్ని పోతన పాటించాడని చెప్పాలి. ఈ అర్పణ కూడ కేవలం బాహ్యంగా కాకుండా మానసికంగా జరగాలని ఆయన భావన. అప్పుడు మాత్రమే చేతులు దయను చూపగలుగుతాయి. నోరు సత్యాన్ని చెప్పగలుగుతుందని ఆయన విశ్వాసం. కాయికంగా శివపూజ, వాచికంగా హరికీర్తన, మానసికంగా దయ సత్యభావన. ఇట్లు త్రికరణాలతో భగవదారాధన ఇందు సూచితం. ఈ పద్యంలో 'తల్లుల' అను పదప్రయోగంచేత జన్మజన్మాంతరాలలోని దౌర్భాగ్యస్థితిని సూచిస్తుంది.

**వ. అని మఱియు మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణకథా ప్రపంచ విరచనా కుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకఁగని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై యున్నయెడ. 15**

**ప్రతి :** అని= అని నిశ్చయించి; మఱియున్= ఇంకను; మదీయ= నాదగు; పూర్వ= గతంలోని; జన్మసహస్ర= వేలపుట్టువులనుండి; సంచిత= సంపాదింపబడిన; తపస్+ఫలంబునన్= తపస్సుయొక్క, పుణ్యంయొక్క ఫలితంచే; శ్రీమత్+నారాయణ= శ్రీమహావిష్ణువుయొక్క; కథా= కథయొక్క; ప్రపంచ= విస్తరమును; విరచనా= వివరించి రచించడంలో; కుతూహలుండను+ఐ= కోరిక కలవాడనై; ఒక్క, రాకా, నిశాకాలంబునన్ : ఒక= ఒకానొక; రాకా= పూర్ణిమనాటి; నిశాకాలంబునన్= రాత్రిసమయాన; సోమ+ఉపరాగంబు= చంద్రగ్రహణము; రాకన్+కని= వచ్చుటనుచూచి; సత్+జన+ అనుమతంబునన్= సత్పురుషుల అనుజ్ఞచే; అభ్రంకష= ఆకాశమును ఒరపిడిపెట్టు; శుభ్ర= ప్రకాశించు; సమ్+ఉత్తుంగ: సముత్తుంగ= మిక్కిలి ఎత్తైన; భంగ+అగు= అలలు కలది అయిన; గంగకున్+చని= గంగానదికి వెళ్లి; క్రుంకులు+ఇడి= మునిగి; వెడలి= బయటకువచ్చి; మహనీయ= గొప్పదైన; మంజుల= మనోహరమైన; పులినతలంబునన్= ఇసుకతిన్నెపై; మహేశ్వర ధ్యానంబు= పరమేశ్వరుని గూర్చిన ధ్యానము; చేయుచున్= ఒనర్చుచు; కించిత్= కొంచెము; ఉత్+మీలిత : ఉన్మీలిత= వికసించిన; నేత్రుండను+ఐ= కన్నులు కలవాడనై; ఉన్న+ఎడన్= ఉన్న సమయమునందు...

**తా :** ఎన్నో వేల జన్మలనుండి కూడబెట్టుకొన్న నా పుణ్యం పండింది. శ్రీమన్నారాయణుని పవిత్రగాథను విస్తరించి రచించాలనే నా కోరిక కలిగింది. అది పూర్ణిమారాత్రి. చంద్రగ్రహణ సమయం. పెద్దల అనుజ్ఞపై గంగలో స్నానంచేసి ఇసుకతిన్నెపై కూర్చుండి అర్ధ నిమీలిత నేత్రాలతో ఈశ్వరధ్యానం చేస్తున్న సమయాన.

**విశే :** పులినం తోయే క్షీణే సతి ఉత్థితం దృశ్యం తత్పులిన మిత్యుచ్యతే. నీళ్లు తగ్గినతర్వాత కనబడే ప్రదేశం పులినం.

"పూర్ణే రాకా నిశాకరే, తస్మిన్ పూర్ణే సతి సా రాకేత్యుచ్యతే శుద్ధేతి భావః" చంద్రుడు పూర్ణుడై ఉన్నచో ఆ పున్నమ రాక అనబడుతుంది. "రాతి దదాతి సుఖమితి రాకా, రా దానే" సుఖాన్ని ఇస్తుంది కాన 'రాక' అయింది.

"ఉపరాగః ఉపరజ్యేతే సూర్యాచంద్రమసావనేన ఉపరాగః" సూర్యచంద్రులు దీనిచే రాగమును పొందింపబడుదురు. "గృహ్యేతే సూర్యాచంద్రమసావనేన గ్రహః" దీనిచేత సూర్యచంద్రులు గ్రహింపబడుదురుగాన గ్రహణం అయింది.

**సీ. మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట నుండ నొప్పువాఁడు,**
**చంద్రమండల సుధాసారంబు పోలిక ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు,**
**వల్లీయుతతమాలవసుమతీజము భంగి బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు,**
**నీలనగాగ్రసన్నిహితభానుని భంగి ఘనకిరీటము దలఁ గలుగువాఁడు.**

**ఆ. పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు, వెడఁద యురమువాఁడు, విపులభద్ర**
**మూర్తివాఁడు, రాజముఖ్యుఁడొక్కరుఁడు నా, కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె. 16**

**ప్రతి :** మెఱుఁగు= మెరుపుతీగ; చెంగటన్= సమీపమున; ఉన్న= ఉండే; మేఘంబు= మబ్బు; కైవడిన్= వలె; ఉవిద= అంగన (సీత); చెంగటన్= ప్రక్కన (పార్శ్వభాగంలో); ఉండన్= ఉండగా; ఒప్పువాఁడు= ప్రకాశించేవాడును; చంద్రమండల= చంద్రబింబంలోని; సుధాసారంబు+పోలికన్= అమృతరసంవలె; ముఖమునన్= మోమునందు; చిఱునవ్వు; మొలచు వాఁడు= మొలకెత్తినవాడును; వల్లీయుత= తీగతో కూడుకొన్న; తమాల= నల్లగా ఉండే (చీకటిమ్రాను) చంద్ర; వసుమతీజము భంగిన్= చెట్టువలె; బలువిల్లు= బలమైన ధనుస్సు; మూఁపునన్= భుజముపై; పరఁగువాఁడు= ఒప్పుగా ఉన్నవాడును; నీలనగ= కాటుక కొండ; అగ్ర= పైభాగమును; సన్నిహిత= మిక్కిలిగా సమీపించిన; భానుని భంగిన్= సూర్యునివలె; ఘనకిరీటము= గొప్ప కిరీటాల్ని; తలన్= శిరస్సునందు; కలుగువాఁడు= కలిగి ఉన్నవాడును; పుండరీకయుగమున్= తామరపూల జంటను; పోలు= సరిపోలు; కన్నులవాఁడు= నేత్రాలు కలవాడును; వెడఁద= విశాలమైన (వెడల్పుగా ఉండే) ఉరమువాఁడు= వక్షఃస్థలం కలవాడును; విపుల= అధికమైన; భద్రమూర్తివాఁడు= మంగళస్వరూపుడైనవాడును (అయిన); ఒక్కరుఁడు= ఒకానొక; రాజముఖ్యుఁడు= రాజ ప్రముఖుడు; నా= నాయొక్క; కన్నుఁగవకున్= కన్నుల జంటకు; ఎదురన్= ఎట్టయెదురుగా; కానఁబడియెన్= కనిపించాడు.

**తా :** నల్లని మబ్బుప్రక్కనున్న మెరుపుతీగలా ఆయనవెంట ఒక తరుణి శోభిస్తూ ఉంది. ఇందు బింబంలోని అమృతంలా ఆయన మోముపై చిరునవ్వు శోభిల్లుతూ ఉంది. తమాలవృక్షాన్ని అంటిపెట్టుకొన్న తీగలా భుజాగ్రంపై పెద్దవిల్లు వ్రేలాడుతూ ఉంది. నీలాద్రి శిఖరంపై ప్రకాశించే సూర్యబింబంలా శిరస్సుపై కిరీటం విరాజిల్లుతూ ఉంది. కెందామరలవంటి నేత్రాలతో, విశాలమైన వక్షఃస్థలంతో, భువన మోహనస్వరూపుడైన ఆ రాజశేఖరుడు నా కందోయికి ప్రత్యక్షమయ్యాడు.

**వ. ఏను నా రాజశేఖరుం దేఱిచూచి భాషింప యత్నంబు సేయునెడ నతడు దా 'రామభద్రుండ మన్నామాంకితంబుగ శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము. నీకు భవబంధంబులు దెగు'నని యానతిచ్చి తిరోహితుండయిన సమున్మీలితనయనుండనై వెఱఁగుపడి చిత్తంబున. 17**

**ప్రతి :** ఏనున్= నేనును; ఆ రాజశేఖరున్= ఆ రాజశ్రేష్ఠుని; తేఱిచూచి= రెప్పవాల్చకుండా చూచి; భాషింపన్= మాట్లాడుటకు; యత్నంబు= ప్రయత్నం; చేయు+ఎడన్= చేసే సమయంలో; అతఁడు= ఆయన; తాన్= తాను; రామభద్రుండన్= రామచంద్రుడను; మత్+నామ+అంకితంబుగన్= నా పేరుమీదుగా (నా పేర అర్పించునట్లుగా); శ్రీమహాభాగవతంబున్= (వ్యాసమహర్షి రచించిన) మహాభాగవతాన్ని; తెనుంగు+చేయము= ఆంధ్రీకరించుము; నీకున్= నీకు, భవబంధంబులు= సంసారబంధనాలు; తెగును= నశించిపోతాయి; అని= అనుచు; ఆనతి+ఇచ్చి= ఆజ్ఞ ప్రసాదించి; తిరోహితుండు+అయినన్= కానరాకుండపోగా; సమ్+ఉత్+మీలిత= బాగుగా వికసించిన; నయనుండను+ఐ= కన్నులు కలవాడనై; వెఱఁగుపడి= ఆశ్చర్యపోయి; చిత్తంబునన్= మనస్సులో...

**తా :** నేను ఆ రాజశ్రేష్ఠుని రెప్పవాల్చకుండా వీక్షించాను. ఏదో మాట్లాడుదామనే ప్రయత్నం చేస్తున్నాను. అంతలో ఆయన "నేను రామభద్రుణ్ణి. నా పేరు మీదుగా భాగవతం తెనిగించు. నీకు భవబంధాలు పటాపంచలవుతాయి" అని ఆనతిచ్చి అంతర్ధానం అయ్యాడు. నేను కన్నులు పూర్తిగా తెరచి చూశాను. ఆశ్చర్యం కలిగింది. అప్పుడు నాలో ఇలా అనుకొన్నాను.

**కం. పలికెడిది భాగవతమఁట!, పలికించెడి వాఁడు రామభద్రుండఁట! నేఁ**
**బలికిన భవహర మగునఁట!, పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా? 18**

**ప్రతి :** పలికెడెది= చెప్పబోయేది; భాగవతము+అఁట= భాగవతం అనే గ్రంథమట; పలికించెడువాఁడు= చెప్పించేవాడు; రామభద్రుండు+అఁట= శ్రీరామచంద్ర మహాప్రభువట; నేన్= నేను; పలికినన్= పలికితే; భవహరము= తిరిగి పుట్టటంలేని స్థితి; అగును+అఁట= కలుగుతుందట; వేఱు+ఒండు= మఱియొక; గాథ= కథను; పలుకఁగన్+ఏలా= వివరించడం ఎందులకు?; పలికెదన్= ఆ భాగవతాన్నే రచిస్తాను.

**తా :** ఆహా! ఏమి నా అదృష్టం! చెప్పబోయేది భాగవతమట! చెప్పించేవాడు శ్రీరామచంద్రుడట! నేను చెపితే సంసారబంధం నుండి విముక్తి కలుగుతుందట. అలాంటప్పుడు ఇంకో గాథ రచించటం ఎందుకు? భాగవతాన్నే రచిస్తాను.

**ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు!, శూలికైనఁ దమ్మిచూలికైన**
**విబుధజనుల వలన విన్నంత కన్నంత, తెలియ వచ్చినంత తేటపఱుతు. 19**

**ప్రతి :** భాగవతము= భగవంతుని గాథ (భగవత్తత్త్వం); తెలిసి= పూర్తిగా తెలిసి; పలుకుట= చెప్పుట; శూలికిన్+ఐనన్= శివునికైనా; తమ్మిచూలికిన్+ఐనన్= బ్రహ్మకైనా; చిత్రంబు= ఆశ్చర్యమే; విబుధజనులవలనన్= దైవజ్ఞులైన విద్వాంసులవల్ల; విన్నంత= వినినంతగా; కన్నంత= గోచరించినంతగా; తెలియవచ్చినంత= బోధపడినంతగా; తేటపఱుతున్= స్పష్టం చేస్తాను.

**తా :** భగవంతుని కథను – భగవత్తత్త్వాన్ని శివుడైనా, బ్రహ్మదేవుడైనా పరిపూర్ణంగా తెలిసి చెప్పగలరా? చెప్పగలిగితే అది ఆశ్చర్యమే. విజ్ఞులవల్ల విన్నంత, నాకు గోచరించినంత, బోధపడినంత తేటతెల్లంగా చెపుతాను.

**విశే :** శివునికి, బ్రహ్మకు చెప్పటం సాధ్యంకాని ఎంతో గొప్ప విషయాన్ని తాను చెప్పటానికి సాహసిస్తున్నానని, ఏదో తాను విన్నంత, కన్నంత తనకు బోధపడినంత చెపుతానని, పోతన ఈ పద్యంలో సవినయంగా లోకానికి విన్నవించుకొన్నాడు.

కాగా, విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత – ఈ మూడూ శ్రవణ, మనన, నిదిధ్యాసలకు సంకేతాలు. ఈ మూడూ ఉంటేగాని భాగవత అవగాహన సాధ్యపడదన్న సూచనకూడ ఈ పద్యంలో లేకపోలేదు.

**క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు, రెండుం**
**గొందఱికి గుణములగు నే, నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్. 20**

**ప్రతి :** కొందఱకున్= కొందరు పండితులకు; తెనుఁగు= తెలుగు; గుణము+అగున్= ఇష్టమగును; కొందఱకును= మరికొందరు విద్వాంసులకు; సంస్కృతంబు= గీర్వాణభాష అంటే; గుణము+అగున్= ఇష్టమగును; కొందఱికిన్= ఇఁకొందరికి; రెండున్= రెండు భాషలుకూడ; గుణములు+అగున్= సమ్మతములగును; నేన్= నేను; కృతులన్= నా రచనలలో; అయ్యైయెడలన్= ఆయాచోట్లలో; అందఱన్= అందరినీ; మెప్పింతున్= మెచ్చుకొనేలా చేస్తాను.

**తా :** కొందరు కేవలం తెలుగు పదాలతో కూడిన కవిత్వమంటే ఇష్టపడతారు. మరికొందరు సంస్కృతపద భూయిష్ఠమైన కవిత్వమంటే చెవికోసుకొంటారు. కొందరు రెండింటిని అభిమానిస్తారు. కాబట్టి నా రచనలో అందరినీ మెప్పించేలా ప్రయత్నిస్తాను.

**మ. ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్**
**తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో**
**తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా**
**జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్. 21**

**ప్రతి :** ఒనరన్= ఒప్పుగా; నన్నయతిక్కనాది కవులు= నన్నయ భట్టారకుడు; తిక్కన సోమయాజి మున్నగు కవులు; ఈ+ఉర్విన్= ఈ భూమిలో; పురాణ+ఆవళుల్= పురాతన గాథలు (రామాయణ భారతాదులను); తెనుఁగున్+చేయుచున్= తెలిగిస్తూ; మత్+పురాకృత= నా పూర్వజన్మలలో చేయబడిన; శుభ+ఆధిక్యంబు= పుణ్యాల గొప్పతనం; తాను+ఎట్టిదో= అది ఎటువంటిదోకాని; మున్ను= ఇంతకుమునుపు; భాగవతమున్= ఈ వ్యాసభాగవతాన్ని; తెనుఁగున్+చేయరు= (వారు) ఆంధ్రీకరించలేదు; దీనిన్= ఈ గ్రంథాన్ని, తెనింగించి= తెలుగులోవ్రాసి; పునర్జన్మంబు= మరలపుట్టుక; లేకుండఁగన్= లేకుండునట్లుగా; నా జననంబున్= నా జన్మను; సఫలంబున్= సార్థకం; చేసెదన్= చేసుకొంటాను.

**తా :** ఇంతకుపూర్వం నన్నయ, తిక్కన మున్నగు మహాకవులు పురాతనగాథలను తెలుగులోనికి అనువదిస్తూ, నా పూర్వపుణ్యపరిపాకం ఎటువంటిదోకాని, ఆ మహాకవులు భాగవతం జోలికి రాలేదు. నేను దీన్ని తెనిగించి మరల జన్మంటూ లేకుండా చేసుకొని, ఈ పుట్టుకను సార్థకం చేసుకొంటాను.

**విశే :** ఈ పద్యంలో పోతన జన్మరాహిత్యానికై భాగవతాంధ్రీకరణకు పూనుకొన్నట్లు స్పష్టంగా తెలియజేశాడు.

**మ. లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం**
**జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో**
**జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబునై**
**వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై. 22**

**ప్రతి :** లలిత= మనోహరమైన; స్కంధము= చెట్టు మొదలుకలది; కృష్ణ= చేవదేరి నల్లనైన; మూలము= వేరుకలది; శుక= చిలుకలయొక్క; ఆలాప= చక్కని పలుకులచే; అభిరామంబు= మనోజ్ఞమైనది; మంజు= సుందరములైన; లతా= తీగలతో; శోభితమున్= ప్రకాశించేది; సువర్ణ= మంచిరంగు కలిగిన; సుమనస్= పుష్పములతో; సుజ్ఞేయమున్= బాగుగా తెలియదగింది; సుందర= అందంగా; ఉజ్జ్వల= శోభించేలా; వృత్తంబున్= గుండ్రంగా ఉండేది; మహాఫలంబున్= ఎంతో పెద్ద పండు కలది; విమల= స్వచ్ఛమైన; వ్యాస= విస్తారమైన; ఆలవాలంబును+ఐ= పాదుకలదై; భాగవత+ఆఖ్య= భాగవతం అనే పేరుగల; కల్పతరువు= కల్పవృక్షం; ఉర్విన్= భూమిలో; సత్+ద్విజ= మంచి పక్షులకు; శ్రేయము+ఐ= ఆశ్రయింపదగినది; వెలయున్= ప్రకాశిస్తుంది.

**తా :** భాగవతం అనే కల్పవృక్షం చూడ ముచ్చటైన కాండం కలదై, చేవదేరి నల్లబడిన తల్లివేరు గలదై, చిలుకల పలుకులచే మనోహరమైనదై, అందమైన తీవలతో అలరారునదై, రంగురంగుల పూలతో గుర్తింపు పొందదగినదై, సుందరంగా శోభిల్లే

గుండ్రని ఆకారం కలద్దై, ఎంతో పెద్ద ఫలాన్ని కలిగి ఉన్నద్దై, స్వచ్ఛం, విస్తారం అయిన పాదుకలద్దై, మంచి మంచి పక్షులకు మేలు చేకూర్చునద్దై భూమిమీద ప్రకాశిస్తూ ఉంది.

## శ్లేషార్థం

**లలితస్కంధము :** లలిత= మనోహరములైన; స్కంధము= స్కంధములు (భాగవత భాగములు) కలది; కృష్ణమూలము= శ్రీకృష్ణుడే మూలాధారముగా కలది; శుక+ఆలాప+అభిరామంబు= శుకమహర్షి ప్రవచనాలచే మనోజ్ఞమైనది; మంజులతా శోభితమున్= సౌకుమార్యంచే శోభించేది; సువర్ణ= సద్గుణులైన; సుమనస్= విద్వాంసులచే; సుజ్ఞేయమున్= బాగుగా తెలియదగినది; సుందర+ఉజ్జ్వల వృత్తంబున్= అందమైన ప్రకాశించే ఇతివృత్తం కలది; మహాఫలంబు= మోక్షమే ఫలముగా కలది; విమల= పవిత్రుడైన; వ్యాస= వ్యాసమహర్షి; ఆలవాలంబును+ఐ= పాదుగా కలద్దై; భాగవత+ఆఖ్య, కల్పతరువు= భగవద్భక్తుల చరిత్ర (లేదా) భగవంతుని వైభవం అనే పేరుగల కల్పవృక్షం; సత్+ద్విజ, శ్రేయము+ఐ= సజ్జనులకు బ్రహ్మవేత్తలకు ఆశ్రయింపదగినది, శుభము కూర్చునద్దై; ఉర్విన్= భూమియందు; వెలయున్= ప్రకాశించును.

**తా :** మనోహరాలైన స్కంధాలు (పంద్రెండు) కలిగినట్టిద్దై, శ్రీకృష్ణుడే మూలంగా ఉన్నట్టిద్దై, శుకమహర్షి ప్రవచనాలచే మనోజ్ఞమైనద్దై, సౌకుమార్యంవల్ల శోభిల్లునద్దై, సద్గుణులైన పండితులచే చక్కగా సేవింపదగినద్దై, అందంగా ప్రకాశించే ఇతివృత్తంతో అలరారునద్దై, పవిత్రుడైన వ్యాసమహర్షి పాదుగా కలద్దై, సజ్జనులకు, బ్రహ్మవేత్తలకు శుభం కూర్చునద్దై భాగవతం అనే కల్పవృక్షం భూమిమీద ప్రకాశిస్తూ ఉంది.

**విశే :** భాగవతపద్యాల్లో పోతనగారి కవితాప్రతిభకు, అద్భుతమైన ఆయన పద్యశిల్పానికి ప్రథమశ్రేణి పతాకలు గ్రంథారంభంలోని ప్రార్థనాపద్యాలు, భాగవతాన్ని గూర్చిన ఈ శ్లేషపద్యం. ఈ విధంగా వృక్షపరంగా, భాగవతపరంగా రెండర్థాలు ఇందు శ్లేషలో తెలియజేయబడ్డాయి.

(భాగవతార్థంలోని లలితాశబ్దం "లలిత" అని అకారాంతంగా ఎలా ఉపయోగింపబడిందనే శంక రాకమానదు. "లలితా అస్మిన్నితి" అనే విగ్రహంలో "అర్శఆదిభ్యోஉచ్" అను సూత్రంద్వారా "లలిత దీనియందు కలది అనే మతుబర్థంలో అచ్ ప్రత్యయం చేరగా "లలితా+అ" అనియుండగా "యస్యేతి చ" అను సూత్రంచే ఆకారలోపం చేయగా "లలిత" అని అవుతుంది.) దీనికి మూలం లేదు. నన్నయగారి లలితాఖ్యానక ఇత్యాది పద్యం స్ఫూర్తిదాయకం.

**వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణ పారిజాతపాదపసమాశ్రయంబునను, హరికరుణా విశేషంబునను, గృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్నిదినంబులకు నేక శిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధ బుధబంధుజనానుజ్ఞాతుండనై. 23**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; భాసిల్లెడు= ప్రకాశించే; శ్రీమహాభాగవతపురాణ= శ్రీమద్భాగవతమహాపురాణమనే; పారిజాతపాదప= పారిజాత (కల్ప) వృక్షంయొక్క; సమాశ్రయంబునను= పూర్తిగా ప్రాపుచెందిన కారణంవల్ల; హరి= విష్ణువుయొక్క; కరుణా= కృపయొక్క; విశేషంబునను= అనుగ్రహంవల్లనూ; కృతార్థత్వంబు= ధన్యత; సిద్ధించెను+అని= లభించిందని; బుద్ధిన్= అంతఃకరణమునందు; ఎఱింగి= తెలిసికొని; లేచి= ఆ ప్రదేశంనుండి పైకిలేచి; మరలి= కదలి; కొన్నిదినంబులకున్= కొద్దిరోజులకు; ఏకశిలానగరంబునకున్= ఓరుగల్లుకు; చనుదెంచి= వచ్చి; అందున్= అచ్చట; గురు= ఉపాధ్యాయులచే; వృద్ధ= పెద్దలచే; బుధ= పండితులచే; బంధుజన= చుట్టములచే; అనుజ్ఞాతుండను+ఐ= అనుమతింపబడినవాడనై. (ఏకశిలానగరం అంటే కొందరు ఒంటిమిట్ట అంటున్నారు).

**తా :** ఈ విధంగా భాగవత పురాణమనే కల్పవృక్షాన్ని సమాశ్రయించాను. శ్రీహరి దయానుగ్రహం సంపాదించాను. జన్మ చరితార్థమయిందని భావించాను. లేచాను. తిరుగు ప్రయాణం కావించి మళ్లీ ఏకశిలానగరం చేరాను. గురువుల, పెద్దల, విద్వాంసుల, బంధువుల ఆశీర్వాదాన్ని, వారి అనుమతిని పొంది...

## ❖ గ్రంథకర్తృవంశ వర్ణనము ❖

**సీ. కౌండిన్యగోత్ర సంకలితుఁ డాపస్తంబ సూత్రుండు పుణ్యుండు సుభగుఁడైన**
**భీమన మంత్రికిఁ బ్రియపుత్త్రుఁ డన్నయ, కలకంఠి తద్భార్య గౌరమాంబ**
**కమలాప్తు వరమునఁ గనిన సోమనమంత్రి వల్లభ మల్లమ, వారి తనయుఁ**
**డెల్లన, యతనికి నిల్లాలు మాచమ వారిపుత్త్రుఁడు వంశవర్ధనుండు**

**ఆ. లలితమూర్తి బహుకళానిధి కేసన, దానమాననీతిధనుఁడు ఘనుఁడు**
**దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ, మనియె శైవశాస్త్రమతముఁ గనియె. 24**

**ప్రతి :** కౌండిన్యగోత్రసంకలితుఁడు= కౌండిన్యగోత్రంతో సంబంధం ఉన్నవాడు; ఆపస్తంబసూత్రుండు= ఆపస్తంబ సూత్రమునకు చెందిన శాఖవాడు; పుణ్యుండు= పుణ్యాత్ముడు; సుభగుఁడు+ఐన= మహాభాగుడైన; భీమనమంత్రికిన్= భీమనామాత్యునకు; ప్రియపుత్రుఁడు= ముద్దుల కుమారుడు; అన్నయ= అన్నయామాత్యుడు; తద్భార్య= ఆయన అర్ధాంగి; గౌరమాంబ= గౌరమ్మ; కలకంఠి= అవ్యక్త మధురమైన కంఠస్వరం కలది; కమల+ఆప్తువరమునన్= కమలబాంధవుడైన సూర్యుని అనుగ్రహంవల్ల; కనిన= కుమారునిగా పొందిన; సోమనమంత్రి= సోమనామాత్యుని; వల్లభ= భార్య; మల్లమ= మల్లమ్మ; వారితనయుఁడు= ఆ పుణ్యదంపతుల పుత్రుడు; ఎల్లన= ఎల్లన్న; అతనికిన్= ఆయనకు; ఇల్లాలు= గృహలక్ష్మి; మాచమ= మాచమ్మ; వారిపుత్రుఁడు= వారి కుమారుడు; కేసన= కేసన్న; లలితమూర్తి= చక్కనివాడు; బహుకళానిధి= పెక్కు విద్యలలో ఆరితేరినవాడు; వంశవర్ధనుండు= కులాన్ని వృద్ధి పొందించినవాడు; దానమాననీతిధనుఁడు= దానం; అభిమానం; వినయం ధనంగా కలవాడు; ఘనుఁడు= గొప్పవాడు; తనకున్= ఆయనకు; లక్కమాంబ= లక్కమ్మ; ధర్మగేహిని= ధర్మపత్ని; కాఁగన్= కాగా; మనియెన్= జీవించాడు; శైవశాస్త్రమతమున్= శైవమత సంప్రదాయాన్ని; కనియెన్= స్వీకరించాడు.

**తా :** పోతనది కౌండిన్యగోత్రం. ఆపస్తంబ సూత్రం. సుకృతాత్ముడు భాగ్యవంతుడు అయిన భీమయామాత్యుడు మూలపురుషుడు. ఆయన కుమారుడు అన్నయ్య. ఆయన భార్య గౌరమ్మ. వారికి సూర్యుని వరప్రసాదంగా జన్మించిన కుమారుడు సోమన్న. ఆయన అర్ధాంగి మల్లమ్మ. వారి కుమారుడు ఎల్లన్న. ఆయన ఇల్లాలు మాచమ్మ. వారి కుమారుడు కేసన. అందగాడు. సకలకళాపారంగతుడు. వంశవృద్ధి కావించినవాడు. మంచిదాత. అభిమానధనుడు. నీతిమంతుడు. ఆయన ధర్మపత్ని లక్కమాంబ. ఆయన శాస్త్రసమ్మతంగా శైవమత సంప్రదాయాన్ని స్వీకరించాడు.

**క. నడవదు నిలయము వెలువడి, తడవదు పరపురుష గుణముఁ దనపతి నుడువుం**
**గడవదు, వితరణ కరుణలు, విడువదు లక్కాంబ విబుధ విసరము వొగడన్. 25**

**ప్రతి :** లక్కాంబ= లక్కమాంబ; నిలయము= ఇల్లు; వెలువడి= వదలి; నడవదు= వెలుపలికి రాదు; పరపురుష= భర్తకంటే వేరైనవాని; గుణమున్= విషయాలను; తడవదు= తలపెట్టదు; తన పతి= తన భర్తయొక్క; నుడువున్= మాటను;

కడవదు= జవదాటదు; విబుధవిసరము= పండితుల సమూహం; పొగడన్= కొనియాడగా; వితరణకరుణలు= దానగుణాన్నీ, దయనూ; విడువదు= విడిచిపెట్టదు.

**తా :** లక్కమాంబ మహాపతివ్రత. ఆమె ఇల్లు విడిచి బయటకు రాదు. పరపురుషులను గూర్చి పట్టించుకోదు. పెనిమిటి మాట జవదాటదు. దానగుణానికి, దయకు ఆమె పెట్టిన పేరు. లక్కమాంబ విద్వాంసుల మన్నన లందుకొన్న పరమసాధ్వి.

**ఉ. మానిను లీడుగారు, బహుమాన నివారిత దీనమానస**
**గ్లానికి, దానధర్మమతిగౌరవమంజులతా గభీరతా**
**స్థానికి, ముద్దసానికి, సదాశివపాదయుగార్చనానుకం**
**పానయవాగ్భవానికిని, బమ్మెర కేసయ లక్కసానికిన్. 26**

**ప్రతి :** బహుమాన= మిక్కిలి ఔదార్యంచే; నివారిత= తీర్చబడిన; దీన= దీనులయొక్క; మానసగ్లానికిన్= మనసులోని దిగులు గలదానికి; దాన= దానానికి; ధర్మ= ధర్మానికి; మతి= బుద్ధికి; గౌరవ= ఆదరానికి; మంజులతా= వినయానికి; గభీరతా= గాంభీర్యానికి; ఆస్థానికిన్= నిలయమైనదానికి; సదాశివ= పరమేశ్వరుని; పాదయుగ= పాదముల జంటను; అర్చనా= సేవించుటయందు; అనుకంపా= దయయందు; నయవాక్= మృదువుగా మాట్లాడుటయందు; భవానికిన్= పార్వతీదేవియైన దానికి; ముద్దసానికిన్= కల్లాకపటాలు ఎరుగని దానికి; బమ్మెరకేసయ= బమ్మెరకేసయ భార్యయైన; లక్కసానికిన్= లక్కమాంబకు; మానినులు= సామాన్యకాంతలు; ఈడు+కారు= సాటిరారు.

**తా :** లక్కమాంబ బీదసాదలపై ఔదార్యం చూపించేది. వారి హృదయాల్లోని దైన్యాన్నిపోగొట్టేది. దానధర్మాలు చేసేది. ఆమె వినయానికి పెట్టిన పేరు. ఆదరం చూపించడంలో ఆమెకు ఎవరూ సాటిరారు. గాంభీర్యం ఆమె సహజగుణం. ఆమె ముద్దరాలు. ఆమెది మృదువైన వాక్కు. పరమేశ్వరుని పాదయుగ్మాన్ని సేవించడంలో అనుగ్రహాన్ని పొందిన పార్వతీదేవితో సమానురాలామె. కేసన భార్యయైన లక్కమాంబకు సాధారణ కాంతలు సాటిరారు.

**విశే :** సదాశివపాదయుగ అన్నచోట ఎల్లవేళల పరమేశ్వరుని పాదయుగాల అర్చన – అనే అర్థం కూడా గ్రహింపదగును.

**క. ఆ మానినికిం బుట్టితి, మే మిరువుర; మగ్రజాతుఁ డీశ్వరసేవా**
**కాముఁడు తిప్పన; పోతన, నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్. 27**

**ప్రతి :** ఆ మానినికిన్= ఆ పూజ్యురాలికి; మేము+ఇరువురము= మేము ఇద్దరము; పుట్టితిమి= కుమారులుగా జన్మించితిమి; తిప్పన= తిప్పన; అగ్రజాతుఁడు= ముందుపుట్టినవాడు – అన్న; ఈశ్వరసేవాకాముఁడు= శివార్చనలో విశేషమైన కోరిక కలవాడు; పోతన నామవ్యక్తుండన్= పోతన అనే పేరుతో తెలియవచ్చేవాడను; సాధు= యోగ్యమైన; నయ= నీతితో; యుక్తుండన్= కూడుకొన్నవాడను.

**తా :** ఆమెకు పుత్రులం ఇద్దరం. అందు పెద్దవాడు తిప్పన. అతడు ఈశ్వరార్చన కళాశీలుడు. నేను చిన్నవాడను. నేను పోతనగా పేరొందినవాడను. పెద్దల అడుగుజాడలలో వినయంతో నడిచేవాడను.

**వ. అయిన నేను నా చిత్తంబునఁ బెన్నిధానంబునుంబోని శ్రీరామచంద్రు సన్నిధానంబుఁ గల్పించుకొని 28**

**ప్రతి :** అయిననేను= అటువంటి నేను; నా చిత్తంబునన్= నా హృదయంలో; పెద్ద+నిధానంబునున్+పోని= పెద్ద నిధివంటి; శ్రీరామచంద్రు= శ్రీరామచంద్ర భగవానుని; సన్నిధానంబున్= సామీప్యమును; కల్పించుకొని= నిల్పుకొన్నవాడనై.

**తా :** చిన్నవాడనైన నేను నా గుండెలలో గొప్ప నిధివంటివాడైన శ్రీరామచంద్రుని నిలుపుకొని

## ❖ షష్ఠ్యంతములు ❖

**ఉ. హారికి, నందగోకులవిహారికిఁ, జక్రసమీర దైత్య సం**
**హారికి, భక్తదుఃఖపరిహారికి, గోపనితంబినీ మనో**
**హారికి, దుష్టసంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా**
**హారికి, బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్. 29**

**ప్రతి :** హారికిన్= మనోహరుడైన వానికి; నంద= నందునియొక్క; గోకుల= వ్రేపల్లెలో; విహారికిన్= విహరించువానికి; చక్రసమీర= తృణావర్తుడనే; దైత్య= రాక్షసుని; సంహారికిన్= చంపినవానికి; భక్త= భక్తులయొక్క; దుఃఖ= తాపాలను; పరిహారికిన్= నాశనం చేయువానికి; గోపనితంబినీ= గోపికా స్త్రీలయొక్క; మనోహారికిన్= హృదయాలను దోచుకొన్నవానికి; దుష్ట= దురాత్ములయొక్క; సంపత్= ఐశ్వర్యమును; అపహారికిన్= తొలగించేవానికి; ఘోషకుటీ= గొల్లపల్లెలోని గుడిసెలలో; పయస్= పాలను; ఘృత= నేయిని; ఆహారికిన్= ఆహారంగా స్వీకరించినవానికి; బాలక= చిన్నపిల్లలపాలిటి; గ్రహ= దయ్యమైన; మహా+అసుర= భయంకర రాక్షసులకు చెందిన (రాక్షసులను); దుర్వనితా= దుష్టస్త్రీయగు పూతనను; ప్రహారికిన్= మట్టుపెట్టినవానికి. (33వ వచనంలోని సమర్పితంబుగా అనుదానితో అన్వయం)...

**తా :** మనోహరుడు నందుని బృందావనంలో అందంగా విహరించేవాడు, తృణావర్తుడనే రాక్షసుని చంపినవాడు, తనను సేవించేవారి తాపత్రయాలను నశింపజేసేవాడు, గోపకాంతల హృదయాలను దోచుకొన్నవాడు, దుర్మార్గుల ఐశ్వర్యాన్ని నాశనం చేసేవాడు, వ్రేపల్లెలో పాలు, నెయ్యి ఆరగించినవాడు, చిన్నపిల్లల పాలిటి పెనుభూతమైన పూతన అనే రక్కసిని మట్టుపెట్టినవాడు అయిన శ్రీకృష్ణునికి

**ఉ. శీలికి, నీతిశాలికి, వశీకృతశూలికి, బాణహస్త ని**
**ర్మూలికి, ఘోరనీరదవిముక్తశిలాహతగోపగోపికా**
**పాలికి, వర్ణధర్మపరిపాలికి, నర్జునభూజయుగ్మ సం**
**చాలికి, మాలికిన్, విపులచక్రనిరుద్ధమరీచిమాలికిన్. 30**

**ప్రతి :** శీలికిన్= మంచి నడవడి కలిగినవానికి; నీతిశాలికిన్= నీతిమంతునికి; వశీకృత= తన అధీనంలో ఉంచుకొన్న; శూలికిన్= శూలాయుధం కల్గిన (శివుడు కల) వానికి; బాణ= బాణాసురుని; హస్త= చేతులను; నిర్మూలికిన్= ఖండించినవానికి; ఘోర= భయంకరాలైన; నీరద= మేఘాలనుంచి; విముక్త= కురిపించబడిన; శిలా= రాళ్లచేత; హత= దెబ్బతిన్న; గోప= గోపాలురను; గోపికా= గోపవనితలను; పాలికిన్= కాపాడినవానికి; వర్ణధర్మ= వర్ణాశ్రమ ధర్మాలను; పరిపాలికిన్= అమలుపరచినవానికి; అర్జున= మద్ది అనే; భూజ= చెట్లయొక్క; యుగ్మ= జంటను; సంచాలికిన్= పెల్లగించినవానికి; మాలికిన్= వనమాలను ధరించేవానికి; విపుల= గొప్పదైన; చక్ర= చేతి చక్రంచే; నిరుద్ధ= కప్పివేయబడ్డ; మరీచిమాలికిన్= సూర్యబింబం కలిగినవానికి. (33వ వచనంతో అన్వయం)...

**తా :** మంచి నడవడి కలవాడు, రాజనీతి బాగా తెలిసినవాడు, త్రిశూలధారియైన శివుని వశం చేసుకొన్నవాడు, బాణాసురుని బాహువులను ఖండించినవాడు, దేవేంద్రుని ఆజ్ఞపై కాలమేఘాలు రాళ్లవర్షం కురియగా, చెల్లాచెదరైన గోపికాగోపబృందాన్ని

కాపాడినవాడు, నాలుగు జాతుల, నాలుగు ఆశ్రమాల ధర్మాలను పరిరక్షించినవాడు, మద్దిచెట్లను పెల్లగించి కుబేరుని పుత్రులైన నలకూబర, మణిగ్రీవులకు శాపవిమోచనం కల్గించినవాడు, వనమాల ధరించేవాడు, (సైంధవవధ సమయంలో) తన సుదర్శనచక్రంతో సూర్యకాంతులను కప్పివేసినవాడు అయిన శ్రీకృష్ణునికి.

**ఉ. క్షంతకుఁ గాళియోరగవిశాలఫణావళినర్తనక్రియా**
**రంతకు, నుల్లసన్మగధరాజ చతుర్విధఘోరవాహినీ**
**హంతకు, నింద్రనందననియంతకు, సర్వచరాచరావళీ**
**మంతకు, నిర్జితేంద్రియసమంచిత భక్తజనానుగంతకున్. 31**

**ప్రతి :** క్షంతకున్= సహనం కలిగినవానికి; కాళియ+ఉరగ= కాళియుడనే సర్పరాజుయొక్క; విశాల= విస్తృతమైన; ఫణా+ఆవళి= పడగల సమూహాలపై; నర్తనక్రియా= నాట్యమాడుటలో; రంతకున్= ఆనందించువానికి; ఉల్లసత్= విజృంభించి ఉప్పొంగే; మగధరాజ= మగధదేశపు రాజైన జరాసంధునియొక్క; చతుర్విధ= నాలుగువిధాలైన; ఘోర= భయంకరమైన; వాహినీ= సేనను; హంతకున్= చంపినవానికి; ఇంద్రనందన= దేవేంద్రుని కుమారుడైన అర్జునునికి; నియంతకున్= సారథియైనవానికి; సర్వ= సమస్తమైన; చర+అచర= స్థావరజంగమాల; ఆవళీ= సమూహాన్ని; మంతకున్= తెలిసినవానికి; నిర్జిత= జయింపబడిన; ఇంద్రియ= ఇంద్రియాలచే; సమ్+అంచిత= బాగా ప్రకాశించిన; భక్తజన= భక్త జనమును; అనుగంతకున్= అనుసరించియుండేవానికి (33వ వచనంతో అన్వయం)...

**తా :** ఓర్పు కలవాడు, కాళియుడనే సర్పరాజు గొప్ప పడగలపై నాట్యమాడ నేర్చినవాడు, తనను వెంటాడిన జరాసంధుని రథగజతురగ పదాతులనే చతురంగ బలాలను చంపినవాడు. అర్జునుని రథసారథి, ఈ కదిలే జీవులతో, కదలని జడాలతో కూడిన ప్రపంచంయొక్క ఉనికిని తెలిసినవాడు, ఇంద్రియాలను జయించిన మహాభక్తుల వెన్నంటి ఉండేవాడు అయిన శ్రీకృష్ణునికి

**ఉ. న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, రుక్మిణీమన**
**స్థాయికి, భూతసమ్మదవిధాయికి, సాధుజనానురాగ సం**
**ధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ, బద్మభవాండభాండ ని**
**ర్మాయికి, గోపికానివహమందిరయాయికి, శేషశాయికిన్. 32**

**ప్రతి :** న్యాయికిన్= న్యాయం కలిగినవానికి; భూసుర+ఇంద్ర= బ్రాహ్మణోత్తమునియొక్క; మృత= చనిపోయిన; నందన= కుమారుని; దాయికిన్= బ్రతికించితెచ్చి ఇచ్చినవానికి; రుక్మిణీ= (భోజనందనయైన) రుక్మిణీదేవియొక్క; మనస్= మనస్సునందు; స్థాయికి= ఉండువానికి; భూత= ప్రాణికోటికి; సమ్మద= ఉత్సాహమును; విధాయికిన్= చేకూర్చువానికి; సాధుజన= మంచివారికి; అనురాగ= ప్రీతి; సంధాయికిన్= కలుగజేసేవానికి; పీతవస్త్ర= పచ్చనిబట్టను; పరిధాయికిన్= కట్టుకొనేవానికి; పద్మభవ+అండ= బ్రహ్మాండాలనే; భాండ= గోళాకారంలో ఉండేవాటిని; నిర్మాయికిన్= సృష్టించేవానికి; గోపికా= గోపకాంతలయొక్క; నివహ= సమూహంయొక్క; మందిర= ఇండ్లవైపు; యాయికిన్= పయనించేవానికి; శేషశాయికిన్= ఆదిశేషునిపై శయనించేవానికి (33వ వచనంతో అన్వయం)...

**తా :** న్యాయం తెలిసినవాడు, చనిపోయిన బ్రాహ్మణ బాలుని బ్రతికించి తెచ్చి గురువుకు ఇచ్చి సంతోషం చేకూర్చినవాడు, రుక్మిణీదేవి గుండెలో నెలవైయుండేవాడు, ప్రాణికోటికి ఉత్సాహాన్ని కలిగించేవాడు, మంచివారికి ప్రీతిని కూర్చేవాడు, పచ్చని పట్టుబట్టను ఎప్పుడూ ధరించి ఉండేవాడు, పెక్కు బ్రహ్మాండ భాండాలను సృజించినవాడు, గోపికల గృహాలవైపు పయనించేవాడు, ఆదిశేషునిపై పరుండి ఉండేవాడు అయిన శ్రీకృష్ణునికి

**విశే :** పోతన నాలుగు పద్యాలలో ఇంచుమించు కృష్ణచరిత్ర అంతా వివరించాడు. రామాజ్ఞపై భాగవతం వ్రాస్తూ, ఆయనను గుండెలనిండా నింపుకొని కృష్ణునకు అంకితం ఇస్తున్నట్లుగా షష్ఠ్యంతాలు వ్రాశాడు. శ్రీరామకృష్ణులపట్ల ఆయనకున్న అచంచలభక్తి, అభేదభావం కనిపిస్తుంది.

**వ. సమర్పితంబుఁగా నే నాంధ్రంబున రచియింపం బూనిన శ్రీమహాభాగవతపురాణంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన. 33**

**ప్రతి :** సమర్పితంబుగాన్= సమర్పణగా; నేను= (పోతననైన) నేను; ఆంధ్రంబునన్= తెలుగులో; రచియింపన్+పూనిన= వ్రాయబోయే; శ్రీమహాభాగవత= శ్రీమద్భాగవతమనే; పురాణంబునకున్= మహాపురాణానికి; కథాప్రారంభంబు= కథయొక్క మొదలు; ఎట్టిది+అనినన్= ఏదనగా...

**తా :** అటువంటి శ్రీకృష్ణునకు నివేదనంగా తెలుగులో శ్రీమద్భాగవతాన్ని వ్రాయడానికి పూనుకొన్నాను. ఆ పురాణానికి కథారంభం ఎలాంటిదంటే

## ✤ కథాప్రారంభము ✤

**సీ. విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వని వలన నేర్పడు ననువర్తనమున**
**వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రా జగుచుఁ జిత్తమునఁ జేసి**
**వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ**
**నికి నెండమావులు నీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధిఁ దా నడరునట్లు**

**ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త**
**కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద, ననఘు సత్యుఁ బరుని ననుదినంబు. 34**

**ప్రతి :** ఎవ్వనివలనన్= ఎవనికారణంగా; విశ్వ= అన్ని లోకాలయొక్క; జన్మ= పుట్టుక; స్థితి= ఉనికి; విలయంబులు= నాశనములు; ఏర్పడున్= ఏర్పడుతున్నాయో; అనువర్తనమునన్= అనుసరించుటచేత; వ్యావర్తనమునన్= వెనుదిరుగుటచేత; కార్యములందున్= చేయదగిన పనులన్నింటియందు; అభిజ్ఞుఁడు+ఐ= అంతా తెలిసినవాడై; తాను+అ= తానే; రాజు+అగుచున్= ప్రభువగుచు, నియామకుడగుచు; ఎవ్వఁడు= ఎవడు; చిత్తమునన్+చేసి= సంకల్పమాత్రంచేత; వేదంబులు= నాల్గువేదాలను; అజునకున్= బ్రహ్మకు; విదితముల్= తేటతెల్లములయ్యేట్లుగా; కావించెన్= చేశాడో; ఎవ్వనికిన్= ఎవనిపట్ల; బుధులు= పండితులు కూడ (జ్ఞానులుకూడ); మోహింతురు= పరమ ప్రీతి కలిగి ఉంటారో; ఎందున్= ఎవనియందు; త్రిగుణసృష్టి= సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడుగుణాలచేత ఏర్పడిన సృష్టి; నీటన్= జలాలలో; ఎండమావులు= మృగతృష్ణలో (తేజస్సులో); కాచాదులన్= గాజువస్తువులు (పృథివిలో) మున్నగువాటిలో; అన్యోన్యబుద్ధిన్= కలిసి మెలసి ఉండే బుద్ధితో;

తాన్= తాను; అడరు+అట్లు= తోచునట్లు; దీపించి= ప్రకాశించి; సత్యముభంగిన్= (అసత్యమైనా) సత్యంవలె; తోఁచున్= కన్పించునో; ఎవ్వఁడు= ఎవడు; స్వప్రభా= స్వీయశక్తి (సత్త)తోనే; నిరస్త= తొలగించబడిన; కుహకుఁడు= మాయకలవాడో; అనఘున్= పాపరహితుని; సత్యున్= సత్యస్వరూపుని; పరునిన్= పరబ్రహ్మమును; అనుదినంబున్= ప్రతిదినమును; కోరి= కోరుకొని; చింతించెదన్= స్మరిస్తాను.

**తా :** ఎవని కారణంగా అన్నిలోకాల పుట్టుక, ఉనికి, వినాశం జరుగుతూ ఉందో, అనుసరించుటచేత, వెనుదిరుగుటచేత అన్ని పనుల్లో అంతా తెలిసినవాడై, అన్నింటికి తానే ప్రభువై, ఎవడు సంకల్పమాత్రంచేత నాలుగు వేదాలు బ్రహ్మదేవునికి తెలియచెప్పాడో, ఎవనిపట్ల పండితులంతా పరమప్రీతితో ఉంటారో, ఎవనియందు సత్త్వరజస్తమోగుణాలవల్ల ఏర్పడిన సృష్టి నీళ్ళు, ఎండమావులు, గాజు మొదలగు వాటిలో తాను కలిసి మెలిసి ఉన్నట్లు తోచేవిధంగా ప్రకాశించి, ఇది సత్యమేమో అన్నట్లు అగుపిస్తూ ఉందో, తన శక్తితో మాయను తొలగించుకొన్నవాడెవడో – ఆలాంటి పాపరహితుని, సత్యస్వరూపుని, పరబ్రహ్మాన్ని ప్రతిదినం నేను కోరి స్మరిస్తాను.

**విశే :** సంస్కృత భాగవతంలోని "జన్మాద్యస్య..." అనే మొదటి శ్లోకానికి పోతన చేసిన అనువాదమిది. ఇందు పరబ్రహ్మ స్వరూప, తటస్థ లక్షణాలు రెండునూ తెలియజేయబడ్డాయి. సత్యం, జ్ఞానం, అనంతం అనేవి పరబ్రహ్మ స్వరూపలక్షణాలు– "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ". "యతోవా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి, తద్బ్రహ్మేతి" ఎవనివలన భూతాలు ఏర్పడుతున్నాయో, పుట్టి జీవిస్తున్నాయో దేనియందు లయమౌతున్నాయో అది బ్రహ్మం అనునది పరబ్రహ్మకు తటస్థలక్షణంగా పేర్కొనబడింది. పరమాత్మ సమస్త వస్తువులందు, సమస్తకార్యాలందు సర్వజ్ఞుడై ప్రకాశిస్తూ ఉంటాడు. అన్నీ ఆయనే – అంతా ఆయనే కదా! భాగవతానికి అద్వైతపరంగా వ్యాఖ్యానం వ్రాసిన శ్రీధరుల వాక్యానుసారం పోతన ఈ అనువాదం చేయడం జరిగింది.

అనువర్తనం అంటే కారణరూపం నుండి కార్యరూపానికి రావటం. వ్యావర్తనం అంటే కార్యరూపం నుండి కారణరూపానికి చేరుకోవటం. మట్టి కారణం. కుండ కార్యం

**వ. ఇట్లు "సత్యం పరం ధీమహి" యను గాయత్రీ ప్రారంభమున గాయత్రీనామబ్రహ్మస్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు. 35**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; "సత్యం పరం ధీమహి"+అను : సత్యం= సత్యమైన; పరం= పరదేవతను; ధీమహి= ధ్యానింతుము అను; గాయత్రీ ప్రారంభమునన్= గాయత్రీ మహామంత్రంతో ఆరంభించడంవల్ల; గాయత్రీనామ బ్రహ్మస్వరూపంబు+ఐ= గాయత్రి అను పేరుగల పరదేవతాస్వరూపమై; మత్స్యపురాణంబులోనన్= (అష్టాదశ మహాపురాణాలలో ఒకటైన) మత్స్యపురాణంలో; గాయత్రిన్+అధికరించి= గాయత్రిని పరిమితం చేసుకోకుండా; ధర్మవిస్తరంబును= ధర్మముల విస్తృతీ; వృత్రాసురవధంబును= వృత్రుడనే రాక్షసుని సంహారమూ; ఎందున్= ఏ గ్రంథములో; చెప్పంబడున్= వివరించబడునో; అది+అ= అదే; భాగవతంబు= భాగవతం; అని= అనబడునని; పలుకుటన్+చేసి= చెప్పియుండుటవల్ల; ఈ పురాణంబు= ఈ పురాణగాథ; శ్రీమహాభాగవతంబు+అనన్= శ్రీమద్భాగవతమనే పేరుతో; ఒప్పుచుండున్= ప్రసిద్ధి గాంచింది.

**తా :** "సత్యం పరం ధీమహి" అనే గాయత్రీమంత్రంతో ప్రారంభమైనందువల్ల గాయత్రీ పరదేవతాస్వరూపమైనదై, గాయత్రిని మించి విరివిగ ధర్మాలు, వృత్రాసురవధ ఏ గ్రంథంలో వివరింపబడునో అది భాగవతమని మత్స్యపురాణం చెప్పినందువల్ల ఈ పురాణం భాగవతమనే పేరుతో ప్రసిద్ధి పొందింది.

**విశే : "యత్రాధికృత్య గాయత్రీం, వర్ణ్యతే ధర్మవిస్తరః,**
**వృత్రాసురవధోపేతం తద్భాగవతమిష్యతే"** అని మత్స్యపురాణం.

గాయని, గాయత్రిని మించి ధర్మాలను విరివిగ వివరించి, వృత్రాసురవధతో కూడి ఉంటే దానిని భాగవతం అంటారు. "జన్మాద్యస్య... సత్యం పరం ధీమహి" అని వ్యాసమహర్షి చెప్పిన ప్రథమశ్లోకంలోని గాయత్రీమంత్ర పదాలద్వారా ఆ పరతత్త్వ స్మరణ జరిగింది. ప్రధానంగా మోక్షధర్మం, ఇతర ధర్మాలు గ్రంథం నిండా మెండుగా ఉన్నాయి. షష్ఠస్కంధంలో వృత్రాసురవధ ఉంది. అందువల్ల మత్స్యపురాణం చెప్పినట్లు ఈ పురాణగ్రంథం భాగవతంగా పేరొందింది.

**సీ. శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ**
**వినఁ గోరువారల విమలచిత్తంబులఁ జెచ్చెర నీశుండు చిక్కుఁ గాక;**
**యితరశాస్త్రంబుల నీశుండు చిక్కునే మంచివారలకు నిర్మత్సరులకుఁ**
**గపట నిర్ముక్తులై కాంక్ష సేయకయును దగిలి యుండుట మహాతత్త్వబుద్ధిఁ**

**తే. బరఁగ నాధ్యాత్మికాదితాపత్రయంబు, నడఁచి పరమార్థభూతమై యధిక సుఖద**
**మై సమస్తంబుఁ గాకయు నయ్యు నుండు, వస్తు వెఱుఁగంగఁ దగు భాగవతమునందు. 36**

**ప్రతి :** శ్రీమంతము+ఐ= మోక్షస్వరూపమై రమణీయమైన; మునిశ్రేష్ఠకృతంబు+ఐన : ముని= మునులలో; శ్రేష్ఠ= ఉత్తముడైన వ్యాసమహర్షిచే; కృతంబు+ఐన= రచించబడినదైన; భాగవతంబున్= భాగవత పురాణాన్ని, సద్భక్తితోడన్ : సత్+భక్తితోడన్= మేలైన భక్తితో; వినన్+కోరువారల= వినాలని కోరే భక్తులయొక్క; విమలచిత్తంబులన్= నిర్మలములైన అంతరంగాలలో; చెచ్చెరన్= వెంటనే; ఈశుండు= పరమాత్మ; చిక్కున్= నివసిస్తాడు (ప్రవేశిస్తాడు); కాక= కాని; ఇతర శాస్త్రంబులన్= ఇతర శాస్త్రాలద్వారా; ఈశుండు= పరమేశ్వరుడు; చిక్కును+ఏ= లోబడతాడా? (లోబడడు); మంచివారలకున్= మంచి మనస్సుకలవారికి; నిర్మత్సరులకున్= అసూయలేనివారికి; కపట= మోసపు స్వభావము నుండి; నిర్ముక్తులు+ఐ= విడుదల పొందినవారై; కాంక్ష+చేయకయును= ఏ విధమైన కోరిక లేకుండ; మహాతత్త్వబుద్ధిన్= గొప్పదైన ఒక్క తత్త్వమునందు మాత్రమే ఇచ్ఛ కలిగి; తగిలి+ఉండుట= మనస్సును లగ్నం చేసి ఉండుట; పరఁగన్= ప్రవర్తిల్లగా; ఆధ్యాత్మిక+ఆది= ఆధ్యాత్మికం; ఆధిభౌతికం, ఆధిదైవికం అనే; తాపత్రయంబున్= మూడువిధాలైన తాపాలను; అడఁచి= అణచివేసి; పరమార్థభూతము+ఐ= జీవిత పరమార్థమైన మోక్షమునకు తగినదై; అధిక సుఖదము+ఐ= మిక్కిలి ఆనందమును ఇచ్చునదై; సమస్తంబున్= సర్వమును; కాకయున్= కాకుండా (అవ్యక్తం); అయ్యున్= అవుతూ (వ్యక్తం); ఉండు= వెలిగే; వస్తువు= పరమాత్మ; భాగవతమునందున్= ఈ భాగవతంలో; ఎఱుఁగంగన్+తగున్= తెలుసుకోదగును.

**తా :** ఈ భాగవతం ముముక్షువులకు ఆనందం కలిగించేది. వేదవ్యాస మహర్షి రచించినది. దీనిని భక్తితో వినగోరేవారి నిర్మలహృదయాలలో భగవంతుడు నివసిస్తాడు. అంతేకాని కుతర్కవాద శాస్త్రాలవల్ల మాత్రం ఆయన లోబడడు. మంచివారు, అసూయ లేనివారు, కర్మఫలితాలపై అపేక్ష లేనివారు, సంసారంలో ప్రవర్తింపజేసే కోరిక లేనివారు, ఒక్క తత్త్వదర్శనమందు

మాత్రమే ఇచ్చు కలవారు దీనియందు ఎప్పుడూ మనస్సును నిలిపి ఉంచాలి. అందువల్ల తాపత్రయం నశిస్తుంది. ఈ గ్రంథంలో పరమపురుషార్థమైన మోక్షం తెలియజేయబడుతుంది. అదే మిక్కిలి ఆనందదాయకం. సత్తు అసత్తుగాక, వ్యక్తం అవ్యక్తం కాక అంతటా ప్రకాశించే పరమాత్మను ఇందులో తెలుసుకోతగును.

**విశే :** ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధిదైవికం – ఈ మూడింటిని తాపత్రయం అంటారు. ఇతర భూతాలవల్ల, ప్రాణులవల్ల, సర్పం, తేలు, పులి మున్నగు విషజంతువువల్ల, క్రూరప్రాణులవల్ల కలిగే దుఃఖాన్ని ఆధిభౌతికం అంటారు. ప్రకృతి వైపరీత్యాలవల్ల కలిగే దుఃఖాన్ని ఆధిదైవికమంటారు. మనఃశరీర సంబంధమైన రుగ్ణత, జ్వరం ఇత్యాదులవల్ల కలిగే దుఃఖాన్ని ఆధ్యాత్మికం అంటారు.

**ఆ. వేదకల్పవృక్షవిగళితమై శుక, ముఖసుధాద్రవమున మొనసియున్న**
**భాగవతపురాణఫలరసాస్వాదన, పదవిఁ గనుఁడు రసికభావవిదులు. 37**

**ప్రతి :** వేద= వేదం అనే; కల్పవృక్ష= కల్పవృక్షము నుండి; విగళితము+ఐ= జారిపడినదై; శుకముఖ= చిలుకయొక్క ముఖస్పర్శచేత; సుధాద్రవమునన్= అమృతరసంతో; మొనసి+ఉన్న= నిండియున్న; భాగవతపురాణ= ఈ భాగవత మహాపురాణమనే; ఫల= పండులోని; రస= సారాన్ని; ఆస్వాదనపదవిన్= తనివితీర త్రావే స్థితిని; రసికభావవిదులు= రసజ్ఞులు, తత్త్వజ్ఞులు అయినవారు; కనుఁడు= పొందుడు.

**తా :** ఈ భాగవతం ఒక మహాఫలం. అది వేదమనే కల్పతరువునుంచి బాగా పండి తనంతట తాను రాలి క్రిందపడింది. దానిని చిలుక ముట్టుకోగా అమృతరసంతో కూడుకొని ఉంది. ఆ ఫలరసాన్ని రసజ్ఞులు, తత్త్వజ్ఞులు తనివితీరా గ్రోలెదరుగాక!

**విశే :** పద్యంలోని శుక శబ్దం కేవలం శుకయోగికే కాక చిలుకకు కూడా చక్కగా అన్వయిస్తుంది. శ్రీమద్భాగవత మహాఫలం వేదం అనే కల్పవృక్షం నుండి లెస్సగా పండి జారిపడినా, అది శుకయోగి ముఖతః వాక్సుధామధురమై కదా మానవాళికి అందింది. లేకుంటే అంత మధురమైన రుచి దానికి ఉంటుందా!

**క. పుణ్యంబై మునివల్లభ, గణ్యంబై కుసుమఫలనికాయోత్థిత సా**
**ద్గుణ్యమయి నైమిశాఖ్యా, రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోన్. 38**

**ప్రతి :** పుణ్యంబు+ఐ= శుభంచేకూర్చునదై (పుణశుభకర్మణి); మునివల్లభ= ఋషిశ్రేష్ఠులచే; గణ్యంబు+ఐ= గొప్ప గాలెక్కించబడినదై; కుసుమ= పూలయొక్క; ఫల= పండ్లయొక్క; నికాయ= రాసులచే; ఉత్థిత= వృద్ధి పొందించబడిన; సాద్గుణ్యము+అయి= గొప్ప ద్రవ్యసమూహాలు కలదై; (మౌర్వ్యాం ద్రవ్యాశ్రితే సర్వశుక్లసంధ్యాదికే గుణః); అరణ్యంబులలోన్= అడవులలో; నైమిశ+ఆఖ్య+అరణ్యంబు= నైమిశమనే పేరుగల అరణ్యం; నుతింపఁదగున్= కొనియాడుటకు అర్హమైంది.

**తా :** ఈ విశ్వంలో చాలా అడవులు ఉన్నాయి. కాని నైమిశారణ్యం మిక్కిలి స్తుతించదగింది. శుభప్రదమయింది. అది మునిగణంచే వాసికెక్కింది. పుష్పఫలసమృద్ధితో వృద్ధి పొందించబడిన ద్రవ్యరాశి కలది.

**విశే :** కలియుగబాధానివారణార్థమై మునిమండలి బ్రహ్మను ప్రార్థించింది. బ్రహ్మ మనోమయమైన చక్రాన్ని సృష్టించి, ఇది ఎక్కడ పడుతుందో, దీనినేమి ఎక్కడ శీర్ణమవుతుందో, అక్కడ మీరు తపస్సులు చేయండని వరమిచ్చాడు. అది విడువబడ్డ ప్రదేశం కాబట్టి అది నైమిశమై క్షేత్రమై విరాజిల్లింది.

వ. మఱియును మధువైరి మందిరంబునుం బోలె మాధవీమన్మథమహితంబై, బ్రహ్మగేహంబునుం బోలె శారదాన్వితంబై, నీలగళసభానికేతనంబునుం బోలె వహ్ని వరుణ సమీరణ చంద్ర రుద్ర హైమావతీ కుబేర వృషభ గాలవ శాండిల్య పాశుపత జటిపటలమండితంబై, బలభేదిభవనంబునుం బోలె నైరావతామృత రంభాగణికాభిరామంబై, మురాసురునిలయంబునుంబోలె నున్మత్తరాక్షసవంశసంకులంబై, ధన దాగారంబునుం బోలె శంఖ పద్మకుంద ముకుంద సుందరంబై, రఘురాము యుద్ధంబునుం బోలె నిరంతర శరానలశిఖాబహుళంబై, పరశురాము భండనంబునుం బోలె నర్జునోద్భేదంబై, దానవ సంగ్రామంబునుంబోలె నరిష్ట జంభనికుంభ శక్తియుక్తంబై, కౌరవసంగరంబునుం బోలె ద్రోణార్జునకాంచనస్యందనకదంబ సమేతంబై, కర్ణుకలహంబునుం బోలె మహోన్నతశల్య సహకారంబై, సముద్రసేతు బంధనంబునుంబోలె నలనీల పనసాద్యద్రిప్రదీపితంబై, భర్గు భజనంబునుం బోలె నానా శోకలేఖా ఫలితంబై, మరుని కోదండంబునుం బోలె బున్నాగశిలీముఖభూషితంబై, నరసింహరూపంబునుం బోలె గేసరకరజ కాంతంబై, నాట్యరంగంబునుం బోలె నటనటీసుషిరాన్వితంబై, శైలజా నిటలంబునుంబోలెఁ జందన కర్పూర తిలకాలంకృతంబై, వర్షాగమంబునుంబోలె నింద్రబాణాసన మేఘ కరక కమనీయంబై, నిగమంబునుం బోలె గాయత్రీ విరాజితంబై, మహాకావ్యంబునుం బోలె సరల మృదులతా కలితంబై, వినతానిలయంబునుం బోలె సుపర్ణ రుచిరంబై, యమరావతీ పురంబునుం బోలె సుమనోలలితంబై, కైటభోద్యోగంబునుం బోలె మధుమానితంబై, పురుషోత్తమసేవనంబునుం బోలె నమృతఫలదంబై, ధనంజయ సమీకంబునుంబోలె నభ్రంకష పరాగంబై, వైకుంఠపురంబునుం బోలె ఖడ్గ పుండరీక విలసితంబై, నందఘోషంబునుం బోలెఁ గృష్ణసార సుందరంబై లంకానగరంబునుంబోలె రామమహిషీవంచక సమంచితంబై, సుగ్రీవ సైన్యంబునుం బోలె గజ గవయ శరభ శోభితంబై, నారాయణస్థానంబునుం బోలె నీలకంఠ కౌశిక భరద్వాజ తిత్తిరి భాసురంబై, మహాభారతంబునుం బోలె నేకచక్ర బక కంక ధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితంబై, సూర్య రథంబునుం బోలె నురుతరప్రవాహంబై, జలదకాల సంధ్యాముహూర్తంబునుం బోలె బహువితత జాతిసౌమనస్యంబై, యొప్పు నైమిశారణ్యంబను శ్రీవిష్ణుక్షేత్రంబునందు శౌనకాదిమహామునులు స్వర్గలోకగీయమానుండగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగాఁ గల సత్ర సంజ్ఞికంబైన యాగంబు సేయుచుండి రందొక్క నాఁడు వారలు రేపకడ నిత్య నైమిత్తికహోమంబు లాచరించి సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతుం జూచి. **39**

ప్రతి : మఱియును= అంతేకాక ఆ నైమిశారణ్యం; మధువైరి= మధువనే రాక్షసుని చంపిన విష్ణువుయొక్క; మందిరంబునున్+ పోలెన్= వైకుంఠభవనంవలె; మాధవీ= లక్ష్మీదేవితో; మన్మథ= మన్మథునితో; మహితంబు+ఐ= పేరుకెక్కినదై (మాధవీ= పువ్వుల గురివింద చెట్టు, మాదీఫలవృక్షం; మన్మథ= వెలగచెట్టు, కామచింతచెట్టు); బ్రహ్మగేహంబునున్+పోలెన్= బ్రహ్మదేవుని సత్యలోకంలాగా; శారదా+అన్వితంబు+ఐ= సరస్వతీదేవితో కూడుకొన్నదై (శారదా= ఏడాకుల అరటిచెట్టు, పచ్చపెసర); నీలగళ= నల్లని కంఠంగల మహేశ్వరునియొక్క; సభానికేతనంబున్+పోలెన్= (కైలాస) సభామండపంవలె; వహ్ని= అగ్ని (చిత్రమూలం); వరుణ= వరుణుడు (ఉలిమిరిచెట్టు); సమీరణ= వాయువు (మరువము); చంద్ర= చంద్రుడు

(పెద్దఏలకి); రుద్ర= ఏకాదశరుద్రులు (రుద్రాక్ష); హైమవతీ= పార్వతి (తెల్లవస, కరకచెట్టు), కుబేర= కుబేరుడు (నందివృక్షం); వృషభ= నంది (అడ్డసర); గాలవ= గాలవుడు (లొద్దుగచెట్టు); శాండిల్య= శాండిల్యుడు (మారేడుచెట్టు); పాశుపత= పాశుపతదీక్ష పొందినవారు (శ్రీవల్లి); జటి= జడలు పెంచినవారి; పటల= సమూహాలచే; మండితంబు+ఐ= ప్రకాశించునట్టిదై, జువ్విచెట్లతో కూడినదై; బలభేది= బలుడనే రాక్షసునికి శత్రువైన దేవేంద్రుని; భవనంబునున్+పోలెన్= సౌధంవలె; ఐరావత= ఐరావతమనే ఏనుగుతో (నారింజ); అమృత= సుధతో (ఉసిరిక); రంభా= రంభ మున్నగు (అరటి); గణికా= దేవవేశ్యలతో (అడవిమొల్ల); అభిరామంబు+ఐ= మనోహరమై; ముర+అసురు= మురుడనే రాక్షసునియొక్క; నిలయంబునున్+పోలెన్= నివాసంలాగా; ఉన్మత్త= బాగా మదించిన (ఉమ్మెత్త); రాక్షస= రక్కసుల (బలురక్కెస, నల్లకచోరము), వంశ= కులంచే (వెదురు); సంకులంబు+ఐ= ఎల్లప్పుడు కూడుకొనియుండునదియై; ధనద+అగారంబునున్+పోలెన్= కుబేరుని నిలయంలాగా; శంఖ= శంఖం (బోరపుష్పి); పద్మ= పద్మం (తామర); కుంద= కుందం (మొల్ల); ముకుంద= ముకుందం (కుందురుష్కమనే గంధపుచెట్టు); సుందరంబు+ఐ= (మహాపద్మశ్చపద్మశ్చ శంఖో మకర కచ్ఛపౌ, ముకుంద కుందనీలాశ్చవరశ్చనిధయోనవ – అనే నవనిధులతో) మనోజ్ఞమైనదై; రఘురాము= శ్రీరామచంద్రుని; యుద్ధంబునున్+పోలెన్= యుద్ధమువలె; నిరంతర= ఎడతెగని; శర= బాణాలయొక్క (రెల్లు); అనలశిఖా= అగ్నిజ్వాలలతో (శక్రపుష్పి); బహుళంబు+ఐ= నిండినదై; పరశురాము= భార్గవరాముని; భండనంబునున్+పోలెన్= సంగ్రామ భూమిలాగా; అర్జున= కార్తవీర్యార్జునుని (మద్ది); ఉద్భేదంబు+ఐ= చీల్చినదై (భూమిని భేదించి పైకి వచ్చే పొదలు మొదలైనవి కలదై); దానవ సంగ్రామంబునున్+పోలెన్= రాక్షస యుద్ధంలాగా; అరిష్ట= అరిష్టుని (వేము, కుంకుడు); జంభ= జంభుని (నిమ్మ); నికుంభ= నికుంభుని (దంతిచెట్టు); శక్తి= శక్తులతో; యుక్తంబు+ఐ= కూడుకొన్నదై; కౌరవసంగరంబునున్+పోలెన్= కురుక్షేత్ర సంగ్రామ భూమివలె; ద్రోణ= ద్రోణుని (తుమ్మిచెట్టు); అర్జున= అర్జునుని (ఏఱుమద్ది); కాంచన= బంగారు (సంపెంగ); స్యందన= రథాలయొక్క (తినాసవృక్షం); కదంబ= సమూహాలతో (కడిమి); సమేతంబు+ఐ= కూడుకొన్నదై; కర్ణకలహంబునున్+పోలెన్= కర్ణుని కయ్యంలాగా; మహా+ఉన్నత= మిక్కిలి గొప్పవాడైన; శల్య= శల్యునియొక్క (మంగచెట్టు); సహకారంబు+ఐ= సహాయంతో కూడుకొన్నదియై (తియ్యమామిడి); సముద్రసేతు బంధనంబునున్+పోలెన్= రామసేతువులాగా; నల= నలుడు (వట్టివేరు); నీల= నీలుడు (నీలిచెట్టు); పనస= పనసుడు (పసనచెట్టు); ఆది= మున్నగువారిచే కొనిరాబడిన; అద్రి= కొండలచే; ప్రదీపితంబు+ఐ= ప్రకాశించునదై; భర్గు= ఈశ్వరుని, భజనంబునున్+పోలెన్= సేవలాగా; నానా= పెక్కురకాలైన; అశోక= నాశనంలేని (అశోకవృక్షం); లేఖా= అక్షరపంక్తుల (తద్వృక్షపంక్తి); ఫలితంబు+ఐ= ఫలాలతోకూడుకొన్నదై; మరుని= మన్మథుని; కోదండంబునున్+పోలెన్= విల్లువలె (చెఱకు); పున్నాగ= పున్నాగపుష్పాల (సురపొన్న); శిలీముఖ= బాణాలచే (తుమ్మెద); భూషితంబు+ఐ= అలంకరించబడినదై; నరసింహరూపంబునున్+పోలెన్= నృసింహుని ఆకారంలాగా; కేసర= జూలుచే (పొగడ, పొన్న); కరజ= గోళ్లచే (కానుగుచెట్టు); కాంతంబు+ఐ= మనోహరమై; నాట్యరంగంబునున్+పోలెన్= రంగస్థలంలాగా; నట= నటులతో (దుండిగచెట్టు) (ఇరుగుడు); నటీ= మహిళానటులతో (కాకిదొండ); సుషిర= వాద్యవిశేషాలతో (గువ్వగుత్తిక); అన్వితంబు+ఐ= కూడుకొన్నదై; శైలజా= పార్వతీదేవియొక్క; నిటలంబునున్+పోలెన్= ఫాలభాగంవలె; చందన= మంచిగంధంతో (మంచిగంధపుచెట్టు); కర్పూర తిలక= కస్తూరిబొట్టుతో (కలిగొట్టు, బొట్టుగుచెట్టు); అలంకృతంబు+ఐ= అలంకరించబడిన; వర్ష+ఆగమంబునున్+పోలెన్= వానయొక్క రాకలాగా; ఇంద్ర= దేవేంద్రుని (మరువము); బాణ+ఆసన= ధనుస్సుతో (నల్లగోరంట) (వేగిస), మేఘ= మబ్బులతో (తుంగముస్తె); కరక= వడగండ్లతో (దానిమ్మచెట్టు); కమనీయంబు+ఐ= సుందరమై; నిగమంబునున్+పోలెన్= వేదంలాగా; గాయత్రీ= గాయత్రీమంత్రంచే (చంద్ర); విరాజితంబు+ఐ= పవిత్రమై; ప్రకాశించినదై; మహాకావ్యంబునున్+పోలెన్= గొప్పకవిచే

ప్రాయబద్ధ గ్రంథంలాగా; సరల= సులభం (తెల్లతెగడ); మృదులతా= సౌకుమార్యంతో (బుజపత్తిరి); కలితంబు+ఐ= కూడుకొన్నదై; వినతానిలయంబునున్+పోలెన్= వినతయొక్క గృహంవలె; సుపర్ణ= గరుత్మంతునిచే (తేలచెట్టు); రుచిరంబు+ఐ= శోభించునదై; అమరావతీపురంబునున్+పోలెన్= దేవేంద్రుని రాజధానియైన అమరావతీనగరంలాగా; సుమనస్= దేవతలచే (జాజి); లలితంబు+ఐ= విలసిల్లునదై; కైటభ+ఉద్యోగంబునున్+పోలెన్= కైటభుడనే రాక్షసుని అధికారంలాగా; మధు= మధువనే రాక్షసునిచే (ఇప్ప); మానితంబు+ఐ= అభిమానించబడినదై; పురుష+ఉత్తమ= శ్రీమహావిష్ణువు; సేవనంబునున్+పోలెన్= సేవవలె; అమృత= మోక్షమనే (ఉసిరిక); ఫలదంబు+ఐ= ఫలాన్ని ఇచ్చునదై (కరకకాయ); ధనంజయ= అర్జునుని; సమీకంబునున్+పోలెన్= యుద్ధరంగంలాగా; అభ్రంకష= ఆకాశాన్నిక్రమ్మిన (ప్రబ్బ); పరాగంబు+ఐ= ధూళితో నిండినదై (పుప్పొడి); వైకుంఠపురంబునున్+పోలెన్= వికుంఠ నగరంవలె; ఖడ్గ= నందకమనే ఖడ్గంచే (ఖడ్గమృగం); పుండరీక= పుండరీకుడనే భక్తునిచే (లేదా) భగవంతుని నేత్రాలు పుండరీకాలు కావున వాటిచే (పెద్దపులి); విలసితంబు+ఐ= ఎక్కువగా ఒప్పునదై; నందఘోషంబునున్+పోలెన్= నందమహారాజుయొక్క వ్రేపల్లెవలె; కృష్ణసార= శ్రీకృష్ణుని శక్తిచే (నల్లఇఱ్ఱి) లేదా (కృష్ణ= ద్రాక్ష; సార= గొంతెమగోరు); సుందరంబు+ఐ= మనోహరమై; లంకానగరంబునున్+పోలెన్= లంకాపురివలె; రామ= శ్రీరాముని (దుప్పి, వాస్తుక); మహిషీ= ధర్మపత్నియైన సీతయొక్క (ఆడుదున్న, ఒకానొక చెట్టు); వంచక= అపహర్తయగు రావణునిచే (నక్క); సమ్+అంచితంబు+ఐ= కూడుకొన్నదై; సుగ్రీవసైన్యంబునున్+పోలెన్= వానరరాజైన సుగ్రీవుని సేనలాగా; గజ= గజుడు (ఏనుగు); గవయ= గవయుడు (గురుపోతు); శరభ= శరభుడు అనే వానరులతో (మీగండ్ల మెకము); శోభితంబు+ఐ= ప్రకాశించినదై; నారాయణ స్థానంబునున్+పోలెన్= నారాయణుని సభాస్థానంవలె; నీలకంఠ= శివునిచే (నెమలి, ముల్లంగి); కౌశిక= దేవేంద్రునిచే (గుడ్లగూబ, గుగ్గిలపుచెట్టు); హంస= సూర్యునిచే (హంస); భరద్వాజ= భరద్వాజ మహర్షిచే (పక్షి, ఏట్రింత); తిత్తిరి= తిత్తిరిపక్షిరూప మహర్షిచే (తీతువు పిట్ట); భాసురంబు+ఐ= ప్రకాశించునదై; మహాభారతంబునున్+పోలెన్= మహాభారతంవలె; ఏకచక్ర= ఏకచక్రపురంలోని (నాగరముస్త, కర్కటశృంగి); బక= బక సంబంధులైనవారిచే (కొంగ, ఒక పువ్వు); కంక= ధర్మరాజు యొక్క (రాపులుగు); ధార్తరాష్ట్ర= ధృతరాష్ట్రుని కుమారులయొక్క (నల్లని ముక్కు, కాళ్లుగల హంస); శకుని= శకునియొక్క (నల్లపిచ్చుక); నకుల= నకులునియొక్క (ముంగిస); సంచార= విహారాలతో; సమ్+మిళితంబు+ఐ= బాగా కూడుకొన్నదై; సూర్యరథంబునున్+పోలెన్= సూర్యభగవానుని రథంవలె; ఉరుతర= గొప్పదైన, ప్రవాహంబు+ఐ= నిరంతరం నడిచేదై (జలప్రవాహాలు కలదై); జలదకాల= మేఘంపట్టే సమయంలో; సంధ్యాముహూర్తంబునున్+పోలెన్= సంధ్యాసమయంవలె; బహు= మిక్కిలి; వితత= విశాలమైన; జాతి= యావజ్జాతికిని (జాజిపూలు); సౌమనస్యంబు+ఐ= మంచి మనస్సును చేకూర్చునదై; ఒప్పు= ప్రకాశించు; నైమిశ+అరణ్యంబు+అను= నైమిశారణ్యమనే; శ్రీవిష్ణుక్షేత్రంబు+అందున్= విష్ణువుయొక్క చక్రంపడిన కారణంగా ఆ పేరుతో ప్రసిద్ధికెక్కిన పుణ్యస్థలంలో (పురాణగాథ); శౌనక+ఆదిమహామునులు= శౌనకుడు మున్నగు మహర్షులు; స్వర్లోకగీయమానుండు+అగు= స్వర్గలోకవాసులచే కూడ స్తోత్రం చేయబడే; హరిన్= శ్రీమహావిష్ణువును; చేరుకొఱకున్= పొందుటకొరకై; సహస్రవర్షంబులు= వేయియేండ్లు; అనుష్ఠానకాలంబుగాన్+కల= చేయుట కాలపరిమితిగాకల; సత్రసంజ్ఞికంబు+ఐన= సత్రమనే పేరు కలిగిన; యాగంబున్= యజ్ఞాన్ని; చేయుచున్+ఉండిరి= నిర్వహిస్తున్నారు; అందున్= ఆ యాగంలో; ఒక్కనాఁడు= ఒకనాడు; వారలు= ఆ మునులు; రేపకడన్= ప్రాతఃకాలమునందే; నిత్య= ఎల్లప్పుడూచేసే; నైమిత్తిక= ఒక విశేషకారణంగా చేసే; హోమంబులు= అగ్నికార్యాలు; ఆచరించి= ఒనరించి (చేసి); సత్కృతుండు+ఐ= వారిచే చక్కగా గౌరవించబడి; సుఖ+ఆసీనుండు+ఐ= సుఖాసనమనే ఆసనంలో కూర్చున్నవాడై; ఉన్న= ఉన్నటువంటి; సూతున్= సూతమహర్షిని; చూచి= వీక్షించి...

**తా :** ఆ నైమిశారణ్యం లక్ష్మీదేవితోను, మన్మథునితోను వాసికెక్కిన మధుసూదనుని వైకుంఠ భవనంలా, శారదాదేవితో కూడుకొన్న బ్రహ్మదేవుని సత్యలోకంలా, అగ్ని, వరుణుడు, వాయుదేవుడు, చంద్రుడు, ఏకాదశరుద్రులు, పార్వతి, కుబేరుడు, నంది, గాలవుడు, శాండిల్యుడు, పాశుపతులు, జటాధారులు మున్నగువారితో కూడుకొన్న మహేశ్వరుని కైలాస సభామండపంలాగా, ఐరావతం, అమృతం, రంభాద్యప్సరసలు మొదలగువారితోనున్న బలసూదనుని సుధర్మాపీఠంలా, రక్కసుల గుంపులతోకూడియున్న మురుడనే రాక్షసుని నివాసంలా, శంఖపద్మకుందముకుందాది నవనిధులతో భాసిల్లే కుబేరుని నిలయంలా, నిరంతరం బాణాగ్ని జ్వాలలతో దీపించే శ్రీరామచంద్రుని సంగరరంగంలా, కార్తవీర్యార్జునుని సంహరించిన భార్గవరాముని సంగ్రామభూమిలా, అరిష్టజంభనికుంభాదిశక్తులతో కూడియుండే రాక్షసుల యుద్ధరంగంలా, ద్రోణార్జునుల బంగారు రథాలతో రాజిల్లే కురుక్షేత్రయుద్ధంలా, శల్యుని సహాయంతోకూడిన కర్ణుని కయ్యంలా, నలనీలపనసాది వానరులచే కొనిరాబడ్డ శిలలచే శోభిల్లే రామసేతువులా, అక్షరమైన అక్షయఫలంతో కూడిన ముక్కంటి సేవలాగా, పున్నాగపుష్పాలు, తుమ్మెదలు కలసి ప్రకాశించే మన్మథుని చెఱకువిల్లులా, గొప్పజూలు, వాడిగోళ్లు కలిగిన నరసింహుని అవతారంలా, నటనటీవాద్యయుక్తమైన రంగస్థలంలా, చందన కర్పూర తిలకంచే అలంకరించబడే పార్వతీదేవి ఫాలభాగంలా, ఇంద్రధనుస్సుతోకూడి మేఘాలతో, వడగండ్లతో కలసిన వానయొక్క రాకలా, గాయత్రీమంత్రంచే పరమపవిత్రమైన వేదంలా, తేలికయైన లలితమైన పదప్రయోగంతో రచించబడిన మహాకవి ఉత్తమకావ్యంలా, గరుత్మంతునిచే ప్రకాశించే తల్లియైన వినతాదేవి మందిరంలా, దేవతలతో విలసిల్లే దేవేంద్రుని రాజధానియైన అమరావతీనగరంలా, మధువనే రాక్షసుని సహకారంతో కూడుకొన్న కైటభుని అధికారంలా, మోక్షఫలాన్ని ప్రసాదించే శ్రీమహావిష్ణువు కైంకర్యంలాగా, ఆకాశాన్నంతా శరాలతో కప్పివేసే అర్జునుని యుద్ధవిహారంలా, నందకపుండరీక సహితమైన వికుంఠనగరంలా, కృష్ణుని బాల్యక్రీడలచే శోభిల్లే నందుని వ్రేపల్లెలా, శ్రీరాముని ధర్మపత్నియైన సీతను అపహరించిన రావణుని లంకాపురిలా, గజగవయ శరభాది వానరులతో కూడియుండే సుగ్రీవుని సైన్యంలాగా, శివుడు, ఇంద్రుడు, భరద్వాజుడు, తిత్తిరి – ఇత్యాదులచే భాసిల్లే నారాయణుని ఆస్థానంలా, భీమధర్మరాజ దుర్యోధనాది శకుని నకుల సంయుక్తంబైన మహాభారతంలా, ఎడతెగక సాగిపోయే సూర్యరథ సంచారంలా, యావత్ప్రజానీకానికి మంచి మనస్సును ప్రసాదిస్తూ సంధ్యాసమయంలా ప్రకాశిస్తుంది. దానికే విష్ణుక్షేత్రమని పేరు. అందు శౌనకాది మహర్షులు శ్రీమహావిష్ణువును పొందగోరి వేయిఏండ్ల కాలపరిమితిగల సత్రయాగాన్ని ఆచరిస్తున్నారు. ఒకనాడు వేకువజాముననే లేచి వారు నిత్యనైమిత్తికాదులు పూర్తి చేసుకొన్నారు. ఆ సమయంలో ఆ పుణ్యనైమిశారణ్యానికి సూతమహర్షి విచ్చేశారు. మునీశ్వరులందరు ఆయనకు సుఖాసనం కూర్చి యథావిధిగా అర్చనలు గావించారు. అనంతరం ఆయనను ఇలా ప్రశ్నించసాగారు.

**విశే :** పోతన ఈ నైమిశపుణ్యక్షేత్రాన్ని అరణ్యంలా వర్ణించే సమయంలో పెక్కు ఉపమానాలు వివరించారు. అవన్నీ శ్లేషార్థంతో చూస్తే అచ్చటి వృక్షాలు, క్రూరమృగాలు స్ఫురిస్తాయి. ఈ నైమిశారణ్యవర్ణన ఆయన సహజపాండిత్య ప్రకటనకు ఒక అద్భుత నిదర్శనం.

## ✤ శౌనకాది ఋషుల ప్రశ్న ✤

**క. ఆ తాపసు లిట్లనిరి వి నీతున్, విజ్ఞాన ఫణిత నిఖిల పురాణ**
**వ్రాతున్, నుతహరిగుణ సం, ఘాతున్, సూతున్, నితాంత కరుణోపేతున్. 40**

**ప్రతి :** వినీతున్= వినయం కల్గినవానిని (లేదా) గురువుచే బాగా శిక్షించబడేవానిని; విజ్ఞాన= మిక్కిలి జ్ఞానంచే (విజ్ఞానులచే); ఫణిత= చెప్పబడిన; నిఖిల= సమస్తమైన; పురాణవ్రాతున్= పురాణసమూహం కలిగినవాడును; హరిగుణ= విష్ణువుయొక్క

సద్గుణాల; సంఘాతున్= సమూహంకలవాడును; నితాంత= ఎల్లప్పుడు; కరుణా+ఉపేతున్= దయాగుణంతో కూడుకొన్నవాడును (అయిన); సూతున్= సూతమహర్షిని; ఆ తాపసులు= ఆ శౌనకాది మహామునులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** సూతుడు గురువైన వ్యాసునివల్ల విశేషమైన జ్ఞానం నేర్చుకొన్నాడు. ఆ జ్ఞానంద్వారా అన్ని పురాణాల సారాంశాన్ని విశేషంగా తెలుసుకొన్నాడు. శ్రీహరి సద్గుణాలను ఎల్లప్పుడూ కీర్తిస్తూ ఉంటాడు. అపారకృపాగుణం కలవాడు. అట్టి సూతమహర్షిని తాపసులు ఇలా ప్రశ్నించారు.

**మ. సమతం దొల్లి పురాణపంక్తు లితిహాసశ్రేణులున్ ధర్మ శా**
**స్త్రములున్ నీవ యుపన్యసింపుదువు వేదవ్యాసముఖ్యుల్ మునుల్**
**సుమతుల్ సూచిన వెన్ని యన్నియును దోఁచున్ నీమదిం; దత్ప్రసా**
**దమునం జేసి యెఱుంగ నేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా! 41**

**ప్రతి :** బుధ+ఇంద్ర+ఉత్తమా!= పండితవర్యులలో శ్రేష్ఠుడైనవాడా!; తొల్లి= మొదటనుంచి; సమతన్= బ్రహ్మజ్ఞానంతో (న్యూనత్వంలేని బుద్ధితో); పురాణపంక్తులు= పురాణ సమూహాలను; ఇతిహాసశ్రేణులున్= ఇతిహాస రాశులను; ధర్మశాస్త్రములున్= ధర్మశాస్త్రాలను; నీవు+అ= నీవొక్కడవే; ఉపన్యసింపుదువు= ప్రవచనం చేయగల్గినవాడవు; వేదవ్యాసముఖ్యుల్= వేదవ్యాసుడు మున్నగు ప్రముఖులైన, మునుల్= మహర్షులు, సుమతుల్= బుద్ధిమంతులైన విద్వాంసులు; చూచిన+అవి= దర్శించినవి; ఎన్ని= ఏవి కలవో; అన్నియున్= ఆ రహస్యములన్నియు, నీ మదిన్= నీ చిత్తములో; తోఁచున్= స్ఫురిస్తాయి; తద్+ప్రసాదమునన్+చేసి= వారి అనుగ్రహంతో; సమస్తంబున్= అన్ని విషయాలను, ఎఱుంగన్ నేర్తువు= తెలుసుకోగలవాడవు.

**తా :** పండితులలో శ్రేష్ఠుడవైనవాడా! విశేషవిజ్ఞానంతో పురాణాలు, ఇతిహాసాలు, ధర్మశాస్త్రాలు మొదటినుంచి ప్రవచించినవాడవు. వ్యాసాది ప్రముఖులు, మహర్షులు, ధీమంతులు ఏ రహస్యాలను దర్శించారో, అవన్నీ నీ మనస్సులో స్ఫురిస్తాయి. వారి అనుగ్రహంవల్ల నీ బుద్ధికి తోచనిదంటూ ఏమీలేదు.

**క. గురువులు ప్రియశిష్యులకుం, బరమరహస్యములు దెలియ బలుకుదు రచల**
**స్థిరకల్యాణం బెయ్యది, పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్. 42**

**ప్రతి :** గురువులు= ఆచార్యులు; ప్రియశిష్యులకున్= ప్రీతిపాత్రులైన శిష్యులకు; పరమరహస్యములు= అత్యంతగోప్యాలైన విషయాలను; తెలియన్= ఎరుకపడేలా; పలుకుదురు= బోధిస్తారు; పురుషులకును= మానవులకు; అచల= చలించని; స్థిర= శాశ్వతమైన; కల్యాణంబు= శుభం; ఏ+అది= ఏదికలదో; నిశ్చయించి= బాగా ఆలోచించి; తగన్= ఉచితమైన రీతిలో; బోధింపు(ము)= ఉపదేశింపుము.

**తా :** సద్గురువులు ప్రియ శిష్యులకు మిక్కిలి గోప్యాలైన విషయాలను కూడ తేటతెల్లం చేస్తారు. కాబట్టి ఈ లోకంలో సకల మానవులకు శాశ్వతానందాన్ని చేకూర్చేది ఏది ఉందో, దాన్ని బాగా పరిశీలించి మాకు ఉపదేశించు.

**క. మన్నాఁడవు చిరకాలము, గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్**
**విన్నాఁడవు వినఁదగినవి, యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్. 43**

**ప్రతి :** చిరకాలము= చాలాకాలం; మన్నాఁడవు= జీవించినవాడవు; పెక్కులు+ఐన= అనేకములైన; గ్రంథ+అర్థంబుల్= పురాతన కావ్యాలలోని పరమార్థాలను; కన్నాఁడవు= గ్రహించినవాడవు; వినన్+తగినవి= వినతగినవన్నీ; విన్నాఁడవు= విన్నావు; పెద్దల+ఒద్దన్= పూజ్యుల దగ్గర; ఉత్తమగోష్ఠిన్= గొప్ప చర్చల్లో; ఉన్నాఁడవు= పాలుపంచుకొన్నవాడవు.

**తా :** మహర్షీ! నీవు చాలాకాలం జీవించావు. పురాణాలలోని పరమార్థం గ్రహించావు. వినదగినవన్నీ విన్నావు. గురువులను సేవించి సత్త్రసంగాలలో పాలు పంచుకొన్నావు.

**చ. అలసులు మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగ సం**
**కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియుఁ జేయఁజాల రీ**
**కలియుగమందు మానవులు; గావున నెయ్యది సర్వసౌఖ్యమై**
**యలవడు? నేమిటం బొడము నాత్మకు శాంతి? మునీంద్ర! చెప్పవే? 44**

**ప్రతి :** ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడవైన ఓ సూతమహర్షీ!; ఈ కలియుగము+అందున్= ఈ కలికాలంలోని; మానవులు= మనుష్యులు; అలసులు= సోమరులు (న లసతీత్యలసః); మందబుద్ధియుతులు= బుద్ధిలో చురుకుతనం లేనివారు; అల్పతర+ఆయువులు= మిక్కిలి తక్కువైన ఆయుస్సు కలవారు; ఉగ్ర= భయంకరాలైన; రోగ= వ్యాధులతో; సంకలితులు= కూడుకొన్నవారు; మందభాగ్యులు= దురదృష్టవంతులు; సుకర్మములు= మంచిపనులు; ఎవ్వియున్= వేనినీ; చేయన్+చాలరు= చేయుటకు సమర్థులు కారు; కావునన్= కాబట్టి, ఏ+అది= ఏది; సర్వసౌఖ్యము+ఐ= అన్నివిధాలా ఆనందాన్ని కలిగించేదై; అలవడున్= సాధ్యపడుతుందో?; ఏమిటన్= దేనివలన; ఆత్మకున్= మనస్సుకు; శాంతి= ప్రశాంతత; పొడమున్= కలుగునో; చెప్పవే= చెప్పుమా!

**తా :** ఋషిసత్తమా! ఈ కలియుగంలోని మానవులందరూ సోమరిపోతులు. దేనిలోనూ బుద్ధిపూర్వకంగా చొరవ చూపించలేరు. అల్పమైన ఆయుస్సు కలవారు. అనేకవిధాలైన రోగాలతో బాధలుపడేవారు. భగవద్ జ్ఞానసంపదలో అల్పులు. సత్కార్యాలు ఏవీ చేయలేనివారు. కాబట్టి అన్నివిధాలా ఆనందం దేనివల్ల చేకూరుతుందో ఆత్మకు ప్రశాంతి దేనివల్ల లభిస్తుందో దానిని మాకు అనుగ్రహించండి.

**సీ. ఎవ్వని యవతార మెల్ల భూతములకు సుఖమును వృద్ధియు సొరిదిఁ జేయు**
**నెవ్వని శుభనామ మే ప్రొద్దు నుడువంగ సంసార బంధంబు సమసిపోవు**
**నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్పంగ భయమంది మృత్యువు పరువువెట్టు**
**నెవ్వని పదనది నేపారు జలములు సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ**

**తే. దపసు లెవ్వని పాదంబు దగిలి శాంతి, తెరువుఁ గాంచిరి వసుదేవదేవకులకు**
**నెవ్వఁ డుదయించెఁ దత్కథలెల్ల వినఁగ, నిచ్చ పుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత! 45**

**ప్రతి :** ఇద్ధచరిత!= పరిశుద్ధమైన చరిత్ర కలవాడా!; ఎవ్వని= ఎవనియొక్క; అవతారము= పుట్టుక; ఎల్లభూతములకున్= అన్ని ప్రాణులకు; సుఖమును= ఇంద్రియప్రీతిని; వృద్ధియున్= పెంపును; సొరిదిన్= క్రమంగా; చేయున్= కలిగిస్తుందో ఎవ్వని= ఎవనియొక్క; శుభనామము= పవిత్రమైన పేరు; ఏ ప్రొద్దున్= ఎల్లప్పుడు; నుడువంగన్= పురశ్చరణ చేయడంచేత;

సంసారబంధంబు= చావుపుట్టుకలనే కట్టుత్రాడు; సమసిపోవున్= ముక్కలు ముక్కలై తెగిపోతుందో?; ఎవ్వని= ఎవనియొక్క; చరితంబున్= గాథను; హృదయంబున్= మనస్సున; చేర్పంగన్= భావించగా; మృత్యువు= చావు; భయము+అంది= భీతినిపొంది; పరువుపెట్టున్= పారిపోతుంది?; ఎవ్వని= ఎవనియొక్క; పదనదిన్= పాదములనెడు నదిలో; ఏపారు= అతిశయించే; జలములన్= నీటికి; సేవింపన్= త్రావగా; నైర్మల్యసిద్ధి= మాలిన్యంలేని స్థితి (స్వరూపస్థితి); కలుగున్= చేకూరుతుందో!; ఎవ్వని= ఎవనియొక్క; పాదంబులన్= పాదాలను; తవిలి= ఆశ్రయించి; తపసులు= యోగులు; శాంతితెరువున్= ప్రశాంతమార్గాన్ని; కాంచిరి= పొందారో!; ఎవ్వఁడు= ఎవడు; వసుదేవదేవకులకున్= వసుదేవునకు, దేవకీదేవికి; ఉదయించెన్= జన్మించాడో!; తత్కథలు= ఆ గాథలను; ఎల్లన్= అన్నీ; వినఁగన్= వినుటకై; ఇచ్ఛ= కోరిక; పుట్టెడున్= కలుగుతున్నది; ఎఱిఁగింపుము= అవన్నీ మాకు వినిపింపుము.

**తా :** పవిత్ర చరిత్రగల ఓ సూతమహర్షీ! ఏ మహానుభావుని అవతారం సమస్తప్రాణులకు ఆనందం, అభివృద్ధి కలిగిస్తుందో, ఏ పవిత్రనామాన్ని పదే పదే పలకడంద్వారా చావుపుట్టుకలు దూరమవుతాయో, ఏ చరిత్రను హృదయంలో భావించినంత మాత్రాన మృత్యుదేవత భయపడి పరుగులు తీస్తుందో, ఏ దివ్యమూర్తి పాదాలనుంచి ఉద్భవించిన నదీజలాలను సేవించినంతనే సమస్తకల్మషాలు దూరమవుతాయో, ఎవరి చరణాలను శరణువేడి భక్తులు తాపశాంతిని పొందుతారో, దేవకీ వసుదేవులకు ఎవడు ముద్దుబిడ్డగా జన్మించాడో, అట్టి వాసుదేవుని కథలు వినాలనే సంకల్పంతో ఉన్నాము. అవన్నీ మాకు వినిపించు.

**విశే :** సుఖం – శోభనాని ఖాని ఇంద్రియాణి అస్మిన్నితి వా సుఖం. ఇంద్రియాలు ఎక్కడ సంప్రీతిని పొందుతాయో అదే సుఖం.

**క. భూషణములు వాణికి నఘ, పేషణములు మృత్యుచిత్త భీషణములు హృ**
**త్తోషణములు కల్యాణ వి, శేషణములు హరి గుణోపచిత భాషణముల్. 46**

**ప్రతి :** హరిగుణ= శ్రీహరి సద్గుణాలచే; ఉపచిత= వృద్ధి పొందిన; భాషణముల్= మాటలు; వాణికిన్= వాగ్దేవతకు; భూషణములు= అలంకారాలు; అఘ= పాపాలను; పేషణములు= మర్దించేవి; మృత్యు= మృత్యుదేవత; చిత్త= మనస్సునకు; భీషణములు= భయాన్ని కలిగించేవి; హృద్= హృదయాలకు; తోషణములు= సంతోషం కలిగించేవి; కల్యాణ= శుభాలను; విశేషణములు= విశేషంగా కూడియుండేవి (విశినష్టి శోభాదినా విశేషకం).

**తా :** శ్రీ మహావిష్ణువు కల్యాణగుణాలను గూర్చి అధికంగా చేసే సంభాషణలు సరస్వతీదేవికి ఆభరణాలు. కల్మషవినాశకాలు. మృత్యుదేవతకు అధికభయంకరాలు. భక్తజనుల హృదయాలకు సంతోషకరాలు. అత్యంత శుభంకరాలు.

**క. కలిదోషనివారకమై, యలఘుయశుల్ వొగడునట్టి హరికథనము ని**
**ర్మలగతిఁ గోరెడు పురుషుఁడు, వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు? మహాత్మా! 47**

**ప్రతి :** మహాత్మా!= ఓ మహానుభావా!; కలి= కలికాలపు; దోష= పాపాలను; నివారకమై= రాకుండా చేయునదై; అలఘు= గొప్ప; యశుల్= కీర్తిని గడించినవారు; పొగడు+అట్టి= కొనియాడే; హరి= విష్ణుమూర్తినిగూర్చి; కథనము= చెప్పుట; నిర్మల= స్వచ్ఛమైన; స్థితిన్= స్థితిని; కోరెడు= కోరుకొనునట్టి; పురుషుడు= మానవుడు; ఏ+వాఁడు= ఎవడు; వెలయన్= ఒప్పుగా; తగిలి= ఆసక్తితో; వినడు= వినకుండా ఉంటాడు?

**తా :** ఓ మహాత్మా! కలికాల పాపాలను పారద్రోలేది, గొప్ప కీర్తిమంతులు ప్రశంసించేది అయిన విష్ణుకథను చెపుతుంటే పవిత్ర స్థితిని కోరుకొనే ఏ పురుషుడు ఆసక్తితో వినడు!

**విశే :** నిర్మలగతిని అంటే స్వచ్ఛమైన ఆత్మస్థితి – మోక్షం.

**ఆ. అనఘ! విను రసజ్ఞులై వినువారికి, మాటమాట కధికమధురమైన**
**యట్టి కృష్ణకథన మాకర్ణనము సేయఁ, దలఁపు గలదు మాకుఁ దనివి లేదు. 48**

**ప్రతి :** అనఘ!= పుణ్యాత్ముడా!; విను= ఆలకింపుము; రసజ్ఞులు+ఐ= బ్రహ్మానందానుభూతిని పొందినవారై; వినువారికిన్= వినునటువంటి వారికి; మాటమాటకున్= ప్రతి మాటకు; అధికమధురము+ఐన+అట్టి= మిక్కిలి మధురమైనటువంటి; కృష్ణకథనము= శ్రీకృష్ణుని చరిత్రం; ఆకర్ణనము+చేయన్= వినుటకు; తలఁపు= కోరిక; మాకున్= మాకు; కలదు= పూర్తిగా ఉంది; తనివి= తృప్తి; లేదు= కలుగదు.

**తా :** బ్రహ్మానందానుభూతి పొందినవారై వినునటువంటి వారికే మాటమాటకు మధురాతిమధురమైన శ్రీకృష్ణుని చరిత్ర, మాకు కూడ వినాలని ఎంతో కోరికగా ఉంది. వింటేగాని తృప్తి కలుగదు.

**విశే :** "రసోవై సః, రసం హ్యేవాయం లబ్ధ్వా ఆనందీభవతి" అను శ్రుతి ప్రకారం జీవుడు పరమాత్మానుభూతి పొందినపుడే ఆనందుడౌతాడు. అతడే రసజ్ఞుడు.

**మ. వరగోవిందకథాసుధారసమహావర్షోరుధారాపరం**
**పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి**
**స్తరదుర్దాంతదురంతదుస్సహజనుస్సంభావితానేకదు**
**స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలం బాఱునే? 49**

**ప్రతి :** బుధ+ఇంద్ర+చంద్ర!= గొప్పవారైన విద్వాంసులలో శ్రేష్ఠుడా!; వర= ఉత్తమమైన; గోవింద= నారాయణుని; కథా= చరిత్రలోని; సుధారస= అమృతసారమనే; మహావర్ష= జడివానయొక్క; ఉరు= గొప్పదైన; ధారా= జల్లులయొక్క; పరంపరలన్= వరుస నీటితుంపరలలో; కాక= తప్ప; ఇతర= మిగిలిన; ఉపాయ= సాధనములందలి; అనురక్తిన్= ఆసక్తిచే; ప్రవిస్తర= మిక్కిలి నిడివియైన; దుర్దాంత= అణగద్రొక్క వీలుకాని; దురంత= అంతంలేని, దుస్సహ= ఓర్చుకోవడానికి వీలుకాని; జనుస్= పుట్టుకలనుంచి; సంభావిత= అతిశయించే; అనేక= పెక్కు; దుస్తర= దాటశక్యంకాని; గంభీర= లోతైన; కఠోర= కఠినమైన; కల్మష= పాపాలతో; కనత్= (భయంతోకూడి) మండుచున్న; దావ+అనలంబు= కారుచిచ్చు; ఆఱును+ఏ= చల్లారునా? (చల్లారదు).

**తా :** ఓ బుధసత్తమా! ఈ విశ్వంలో మిక్కిలి శ్రేష్ఠమైనది నారాయణుని చరిత్ర. అదే అమృతం. దానిలోని సారమే జడివాన. దాని జల్లులు వరుసగా పడితేతప్ప సంసారకల్మషమనే కార్చిచ్చు చల్లారదు. ఇతర మార్గాలవల్ల ఆ చిచ్చు ఆరే అవకాశం లేదు. కారణం ఆ చిచ్చు మిక్కిలి విశాలమైనది. అణగదొక్కడానికి వీలయ్యేది కాదు. అంతంలేనిది. ఓర్చుకోవడానికి శక్యం అయ్యేది కాదు. అనేక జన్మలనుంచి రాశీభూతమై అతిశయిస్తూ వెన్నాడుతూ ఉంటుంది. తరింప శక్యం కానిది. అది ప్రవేశిస్తూ ఉంటే మిక్కిలి భయాన్ని కలిగిస్తుంది. అతికఠినమైనది. అది ఎల్లప్పుడూ వెంటాడే పాపాలతో మండుతూ ఉంటుంది. ఆ సంసార కల్మషమనే కార్చిచ్చు గోవిందుని కథలనే వర్షధారలతో తప్ప చల్లారదు.

**విశే :** గమనే భియం రాతీతి గంభీరం ప్రవేశించే సమయంలో మిక్కిలి భయాన్ని ఇస్తుంది.

**సీ. హరినామకథనదావానలజ్వాలచేఁ గాలవే ఘోరాఘకాననములు**
**వైకుంఠదర్శనవాయుసంఘంబుచేఁ దొలఁగవే భవదుఃఖతోయదములు**
**కమలనాభధ్యానకంఠీరవంబుచేఁ గూలవే సంతాపకుంజరములు**
**నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ దీఱవే షడ్వర్గతిమిరతతులు**

**ఆ. నలిననయనభక్తినావచేఁ గాక సం, సారజలధి దాఁటి చనఁగ రాదు;**
**వేయు నేల! మాకు విష్ణుప్రభావంబుఁ, దెలుపవయ్య సూత! ధీసమేత! 50**

**ప్రతి :** ధీసమేత= బుద్ధితో కూడుకొన్నవాడా!; సూత= సూతమహర్షీ!; హరినామ= శ్రీహరి పేరుయొక్క; కథన= కీర్తనమనే; దావ+అనలజ్వాలచేన్= కార్చిచ్చు మంటచేత; ఘోర+అఘ= భయంకరములైన పాపాలనే; కాననములు= అడవులు; కాలవే= కాలకుండునా?; వైకుంఠ= విష్ణువుయొక్క; దర్శన= సందర్శనమనే; వాయుసంఘంబుచేన్= గాలుల సమూహంచే; భవదుఃఖ= సంసార బాధలనే; తోయదములు= మేఘాలు; తొలఁగవే= చెల్లాచెదరు కాకుండునా?; కమలనాభ= పద్మం బొడ్డునందు కల్గిన గోవిందుని; ధ్యాన= ధ్యానించు యోగమనే; కంఠీరవంబుచేన్= సింహంచే; సంతాప= పరితాపములనే; కుంజరములు= ఏనుగులు; కూలవే= కూలిపోకుండునా?; నారాయణ= వాసుదేవుని; స్మరణ= చింతనమనే; ప్రభాకర= సూర్యునియొక్క; దీప్తిన్= కాంతిచే; షట్+వర్గ= కామక్రోధలోభమోహమద మాత్సర్యాలనెడి అరిషడ్వర్గమనే; తిమిరతతులు= చీకట్ల సమూహాలు; తీఱవే= నశింపకుండునా?; నలిననయన= కమలనేత్రునిపై; భక్తి= ప్రీతి అనే; నావచేన్+కాక= ఓడచే మాత్రమేతప్ప; సంసారజలధిన్= సంసారమనే సముద్రాన్ని; దాఁటి= తరించి; చనఁగన్‌రాదు= వెళ్లుటకు శక్యంకాదు; వేయున్+ఏల= వేయిమాటలేల?; మాకున్= మాకు; విష్ణుప్రభావంబున్= శ్రీమహావిష్ణువుయొక్క మాహాత్మ్యాన్ని; తెలుపుము+అయ్య= వినిపించు స్వామీ!

**తా :** బుద్ధిమంతుడవైన సూతా! భయంకర పాపాలనే అడవులు భస్మం కావాలంటే విష్ణునామ సంకీర్తన అనే కార్చిచ్చు ఒక్కసారి వ్యాపించాలి. సంసార బాధలనే మేఘసమూహాలు చెల్లాచెదరు కావాలంటే గోవింద సందర్శనమనే వాయువు ఒక్కమారు చెలరేగాలి. తాపత్రయాలనే మదేభాలు కూలిపోవాలంటే హరిధ్యానమనే సింహం ఒక్కమారు విజృంభించాలి. కామక్రోధాదులనే అంధకారం తొలగిపోవాలంటే నారాయణ స్మరణమనే సూర్యకాంతి ఒక్కసారిగా వ్యాపించాలి. సంసార సముద్రాన్ని దాటాలంటే కేశవభక్తి అనే నావమాత్రమే దాటించగలదు. పలుమాటలు ఎందులకుగాని శ్రీహరి మాహాత్మ్యాన్ని మాకు వినిపించు.

**వ. మఱియుఁ గపటమానవుండును గూఢుండునైన మాధవుండు రామసహితుండై యతిమానుషంబులైన పరాక్రమంబులు సేసెనఁట! వాని వివరింపుము, కలియుగంబు రాఁగలదని వైష్ణవ క్షేత్రంబున దీర్ఘసత్త్రనిమిత్తంబున హరికథలు విన నెడగలిగి నిలిచితిమి. దైవయోగంబున. 51**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; కపటమానవుండును= మాయామానుష విగ్రహుండును; గూఢుండును= రహస్యముగా నుండువాడును; ఐన= అయినటువంటి; మాధవుండు= లక్ష్మీదేవికి భర్తయైన విష్ణువు (కృష్ణుడు); రామసహితుండు+ఐ= బలరామునితో కూడుకొన్నవాడై; అతిమానుషంబులు+ఐన= మానవులు చేయ శక్యంకాని పనులైనట్టి; పరాక్రమంబులు=

వీరకృత్యాలు; చేసెను+అఁట= కావించాడట!; వానిన్= వాటిని; వివరింపుము= తెలియజేయుము; కలియుగంబు= కలిసమయం; రాఁగలదు+అని= ప్రవేశించబోతున్నదని; వైష్ణవ క్షేత్రంబునన్= ఈ విష్ణుక్షేత్రంలో; దీర్ఘసత్త్రనిమిత్తంబునన్= ఎక్కువ కాలపరిమితి గల సత్త్రయాగ కారణంగా; హరికథలు= విష్ణుచరిత్రలు; వినన్= వినాలని; ఎడ+కలిగి= మనస్సు కలిగి; నిలిచితిమి= స్థిరంగా ఉన్నాము; దైవయోగంబున(న్)= అదృష్టవశంచే.

**తా :** అంతేకాదు కృష్ణుడు మాయామానుషరూపంతో రహస్యంగా ప్రవర్తిస్తూ, రోహిణీపుత్రుడైన బలరామునితో కలసి మానవులు చేయడానికి వీలుకాని సాహసవీరకృత్యాలు ఎన్నో చేశాడని విన్నాము. వాటినన్నీ మాకు వివరించండి. ఘోరకలి రాబోతున్నదని తెలిసి ఈ నైమిశమనే విష్ణుక్షేత్రంలో దీర్ఘసత్రమనే పేరుగల యజ్ఞం చేస్తున్నాము. హరికథలు వినాలనే సంకల్పంతో ఉన్నాము. అదృష్టం మాకు కలిసి వచ్చింది.

**క. జలరాశి దాఁటఁ గోరెడి, కలముజనుల్ కర్ణధారుఁ గాంచిన భంగిన్**
**గలిదోషహరణవాంఛా, కలితులమగు మేము నిన్నుఁ గంటిమి సూతా! 52**

**ప్రతి :** సూతా= సూతమహర్షీ!; జలరాశిన్= సముద్రాన్ని; దాఁటన్= తరించాలని; కోరెడి= ప్రయత్నించే; కలముజనుల్= నావపై పయనించేవారు; కర్ణధారున్= చుక్కాని ధరించిన నావికుని; కాంచిన భంగిన్= చూచినవిధంగా; కలిదోష= కలికల్మషాలను; హరణ= పోగొట్టుకొనే; వాంఛా= కోరికతో; కలితులము+అగు= కూడుకొన్నవారమైన; మేము= శౌనకాదులమైన మేము; నిన్నున్= నిన్ను; కంటిమి= సందర్శించాము.

**తా :** జలనిధిని దాటాలని ప్రయత్నించే ప్రయాణికులు చుక్కాని ధరించియున్న నావికుని చూచి ఎంత సంతోషిస్తారో, కలిఘోర కృత్యాలను దూరం చేసుకోవాలనే కోరికతో నిరీక్షిస్తున్న మాకు నీ దర్శనం లభించింది.

**క. చారుతర ధర్మరాశికి, భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమున కేగన్**
**భారకుఁడు లేక యెవ్వనిఁ, జేరెను ధర్మంబు బలుపు సెడి మునినాథా! 53**

**ప్రతి :** మునినాథా= ఋషీశ్వరా!; చారుతర= మిక్కిలి ఉత్కృష్టమైన; ధర్మరాశికిన్= ధర్మసమూహానికి; భారకుఁడు+అగు= ఆధారభూతుడైన; కృష్ణుఁడు= శ్రీకృష్ణభగవానుడు; ఆత్మపదమునకున్= స్వస్థానమునకు (పరమపదానికి); ఏగన్= తిరిగివెళ్లిపోగా; భారకుఁడు= (తన) బరువును మోసేవాడు; లేక= లేకపోవడంచే; ధర్మంబు= ధర్మం; బలుపు= బలము; చెడి= కోల్పోయి; ఎవ్వనిన్= ఎవనిని; చేరెను= ఆశ్రయించింది?

**తా :** మునీంద్రా! ఉత్కృష్ట ధర్మాలకు పట్టుకొమ్మగా నిలిచిన భగవంతుడైన శ్రీకృష్ణుడు పరమపదానికి చేరుకోగా, ధర్మం బలం కోల్పోయి, దిక్కులేక ఎవరిని ఆశ్రయించిందో!

## ✤ సూతుండు నారాయణ కథాప్రశంస సేయుట ✤

**వ. అని యిట్లు మహనీయగుణగరిష్ఠులయిన శౌనకాదిమునిశ్రేష్ఠు లడిగిన రోమహర్షణ పుత్త్రుండయి యుగ్రశ్రవసుం డనుపేర నొప్పి నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుండు. 54**

**ప్రతి :** అని= అనిపలుకుచు; ఇట్లు= ఈ విధంగా; మహనీయ= గొప్పవైన; గుణ= గుణాలచే; గరిష్ఠులు+అయిన= మిక్కిలి అధికులైన; శౌనక+ఆది= శౌనకుడు మున్నగు; మునిశ్రేష్ఠులు= ఋషిచంద్రులు; అడిగినన్= ప్రశ్నించగా;

రోమహర్షణపుత్త్రుండు+అయి= రోమహర్షణుని కుమారుడై; ఉగ్రశ్రవసుండు+అను పేరన్= ఉగ్రశ్రవసుడనే నామంతో; ఒప్పి= ప్రసిద్ధికెక్కి; నిఖిల= సమస్తమైన; పురాణ= పురాణాలను; వ్యాఖ్యాన= విశేషంగా వివరించి చెప్పడమనే; వైఖరీ= వాక్యరూపమైన వాక్కుతో; సమేతుండు+ఐన= కూడుకొన్నవాడైన; సూతుండు= సూతమహర్షి...

**తా :** ఈ విధంగా సద్గుణాలచే అధికులైన శౌనకాది మహర్షులు ప్రశ్నించారు. అపుడు రోమహర్షణుని పుత్రుడు, ఉగ్రశ్రవసుడనే నామంతో విరాజిల్లేవాడు, పురాణాలను విశేషవ్యాఖ్యానంతో చెప్పే నేర్పుకలవాడు అయిన సూతమహర్షి

**విశే :** భగవంతుని కథ ఆకర్ణించినంత మాత్రం చేతనే అతని రోమాలు హర్షపులకాంకితాలయ్యేవి. అందుచే అతడు రోమహర్షణుడయ్యాడు. అతని కుమారుడు సూతుడు కావున "ఆత్మావై పుత్రనామాసి" అనే సూక్తి ప్రకారం సూతుడుకూడ అటువంటివాడే. భగవంతుని కథలు వినడంలో అతని చెవులు ఎప్పుడూ ఉగ్రంగా ప్రవర్తమై ఉండేవి కావున ఉగ్రశ్రవసుడు అయ్యాడు. వ్యాఖ్యాన శబ్దానికి "వి+ఆఖ్యాన" విశేషపూర్వక వ్యాఖ్యానమని అర్థం.

**మ.** **సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁబో**
**వ మహాప్రీతి నొహో కుమార! యనుచున్ వ్యాసుండు చీరంగ వృ**
**క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం జేసె మున్నట్టి భూ**
**తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.** **55**

**ప్రతి :** ఎవ్వఁడు= ఏ మహాత్ముడు; సముఁడు+ఐ= (బ్రహ్మజ్ఞానంతో) సర్వభూతాలయందు సమానభావంతో సంచరించినవాడై ముక్త, కర్మ, చయుఁడు+ఐ : ముక్త= వదలివేయబడిన; కర్మ= కర్మల; చయుడు+ఐ= సమూహాము కలవాడై; సన్న్యాసి+ఐ: సత్+న్యాసి+ఐ = సత్పదార్థమునందు బుద్ధిని నిలిపి సర్వ కర్మములను పరిత్యజించినవాడై; ఒంటిన్= ఒంటరిగా (ఏకాకియై); పోవన్= పోతున్న సమయంలో; వ్యాసుండు= (తండ్రియైన) వ్యాసమహర్షి; మహాప్రీతిన్= పుత్రవాత్సల్యంతో కూడిన ప్రేమతో; (మహాభీతిన్= పుత్రుని ఏకాంతగమనంవల్ల ఏర్పడిన భయంతో – పాఠాంతరం); ఒహో! కుమార!= ఓ కుమారా!; అనుచున్= అని పిలుస్తూ; చీరంగన్= పిలువగా; వృక్షములున్= చెట్లన్నియు; తత్+మయతన్= తన్మయత్వంతో; ప్రతిధ్వనులు= (ఓ కుమారా! ఓ కుమారా! అని) ప్రతిధ్వనులు; చక్కన్= స్పష్టంగా; చేసెన్= చేశాయో; అట్టి= అటువంటి; భూతమయున్= సర్వభూతాలు తానే అయినవాడును; తపస్+ధన్య+అగ్రణిన్= తపోధనులలో అగ్రేసరుడును; ధీమణిన్= విద్వాంసులలో శ్రేష్ఠుడు అయిన; బాదరాయణిన్= బదరీవనంలో జన్మించిన వ్యాసుని కుమారుడైన శుకమహర్షికి; మున్ను= ముందుగా; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** ఎవడు సర్వభూతాలయందు సమభావం కలవాడై, అన్ని కర్మలు వదలి సన్న్యాసియై ఒంటరిగా వెళ్ళుతుండగా, తండ్రియైన వ్యాసమహర్షి ప్రియమార ఓ కుమారా! అని పిలుస్తూ దగ్గరకురాగా, వృక్షాలన్నీ తన్మయత్వంతో ఓ కుమారా! ఓ కుమారా! అని ప్రతిధ్వనులు చేశాయో – అలాంటివానికి, సర్వభూతాలు తానైనవానికి, తపోధనులలో అగ్రగణ్యుడైనవానికి, విద్వాంసులలో శ్రేష్ఠుడైనవానికి, వ్యాసమహర్షి కుమారుడైన శుకమహర్షికి ముందుగా మొక్కుతున్నాను.

**విశే :** అగ్నిని పుట్టించటానికై అరణులని మథిస్తున్న వ్యాసమహర్షి చిలుకరూపంలో ఉన్న ఘృతాచి అనే అప్సరసనుచూచి కామోద్రేక్తుడయ్యాడు. అప్పుడాయన వీర్యం అరణిలో పడింది. అందుండి శుకుడు జన్మించాడు. ఆయనకు ఆకాశంనుండి దండకమండలువులు అందాయి. ఆయన పుట్టుకతోనే బ్రహ్మజ్ఞాని. ఇదీ శ్రీశుకుని జన్మరహస్యాన్ని చెప్పే పురాణగాథ. మన ఊహకందని పుట్టుక కథ.

కాని, అసహజాలు, అసంభవాలు అనిపించే అనేక ప్రాచీన విజ్ఞాన రహస్యాలను ఒక్కటొక్కటిగ భేదించి, సమన్వయించి చెపుతూ, బహుముఖాలుగా ఎదుగుతున్న ఆధునిక విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు – ముఖ్యంగా Genetic Engineering లాంటివి ఇలాంటి జన్మరహస్యాలను ఎప్పుడు భేదించి ప్రజలకు సమన్వయించి చెపుతాయో!

**సీ. కార్యవర్గంబును గారణ సంఘంబు నధికరించి చరించు నాత్మతత్త్వ**
**మధ్యాత్మ మనఁబడు నట్టి యధ్యాత్మముఁ దెలియఁజేయఁగఁ జాలు దీప మగుచు**
**సకలవేదములకు సారాంశమై యేకమై యసాధారణమగు ప్రభావ**
**రాజకంబైన పురాణ మర్మంబును గాఢసంసారాంధకారపటలి**

**తే. దాఁటఁ గోరెడివారికి దయ దలిర్ప, నే తపోనిధి వివరించె నేర్పడంగ**
**నట్టి శుకనామధేయు మహాత్మగేయు, విమలవిజ్ఞానరమణీయు వేడ్కఁ గొలుతు. 56**

**ప్రతి :** కార్య, వర్గంబును : కార్య= ఫలితముల; వర్గంబును= సమూహమును; కారణ, సంఘంబును : కారణ= ఆ కార్యములకు మూలకారణముల; సంఘంబును= సమూహమును; అధికరించి= సంబంధించి / అన్వయించి; చరించు= ప్రవర్తించే; ఆత్మతత్త్వము= ఆత్మస్వరూపమే; అధ్యాత్మము= అధ్యాత్మం; అనఁబడున్= అనబడుతుంది; అట్టి= అటువంటి; అధ్యాత్మమున్= ఆత్మజ్ఞానాన్ని; తెలియన్+చేయఁగన్+చాలు= ప్రకాశింప చేయగలిగే; దీపము+అగుచున్= జ్యోతియై; సకల= అన్ని; వేదములకున్= వేదములకు; సార+అంశమై= రసభూతమై; ఏకము+ఐ= అద్వితీయమై; అసాధారణము+అగు= అసామాన్యమైన; ప్రభావరాజకంబు+ఐన= మహాప్రభావ సంపన్నమైన; పురాణమర్మంబును= పురాణరహస్యాన్ని; గాఢసంసార= కలచివైచే సంసారమనే (గాహూ విలోడనే – కలియబెట్టునది); అంధకారపటలిన్= చీకట్ల సమూహాన్ని; దాఁటన్+ కోరెడివారికిన్= తరించే కుతూహలం గలవారికి; దయ= కృప; తలిర్పన్= అతిశయిల్లగా; ఏర్పడంగన్= తేటతెల్లమయ్యేటట్లుగా; ఏ తపోనిధి= ఏ తపోమూర్తి; వివరించెన్= ఉపదేశించెనో; అట్టి= అటువంటి; మహాత్మగేయున్= మహానుభావులచే కీర్తించబడ్డవాడును; విమల= నిర్మలమైన; విజ్ఞాన= బ్రహ్మజ్ఞానంతో; రమణీయున్= ప్రకాశించేవాడును అయిన; శుకనామధేయున్= శుకుడనే పేరు గల్గినవానిని; వేడ్కన్= ప్రీతితో; కొలుతున్= సేవిస్తాను.

**తా :** కార్యకారణాలకు అతీతంగా ప్రవర్తిల్లే ఆత్మతత్త్వమే అధ్యాత్మం. ఆలాంటి అధ్యాత్మాన్ని ప్రకాశింపచేసే దీపం, సకల వేదసారం, అద్వితీయం, అసాధారణం, మహాప్రభావ సంపన్నం అయిన పురాణమర్మాన్ని – సంసారమనే చీకట్లనుండి బయటపడాలనుకొనేవారికి ఏ మహాతపస్వి దయతో ఉపదేశించాడో, ఎవడు మహానుభావులచే స్తుతింపబడినాడో, ఎవడు నిర్మలమైన బ్రహ్మజ్ఞానంతో ప్రకాశిస్తున్నాడో, ఆలాంటి శుకమహర్షిని ప్రీతితో సేవిస్తున్నాను.

**విశే :** సువర్ణహారాలను కార్యం అంటారు. ఆ హారాలు తయారు కావడానికి కావలసిన సువర్ణాన్ని ఉపాదానకారణమంటారు. ఆ సువర్ణాన్ని హారంగా మార్చే స్వర్ణకారుని నిమిత్తకారణం అంటారు. ఈ విధంగా కార్యం, ఉపాదాన కారణం, నిమిత్త కారణం అనే భేదం ప్రతివస్తువునకు ఉంటుంది. కాని పరమాత్మనుమాత్రం అభిన్ననిమిత్తోపాదానకారణం అంటారు. అనగా నిమిత్తకారణం వేరు, ఉపాదాన కారణం వేరూ కాదు. రెండూ ఒకటే. అట్టి వస్తువు ఏదైనా ఉందా? అంటే అది ఒక్కటే ఉంది. అదే పరమాత్మ. సాలెపురుగు తన నోటినుంచే దారం సృజించి, దానితోనే ఎలా గూడు నిర్మిస్తుందో, అలాగే పరమాత్మ రెండు కారణాలు తానే అవుతాడు. దాన్ని గూర్చి ప్రవర్తించే ఆత్మస్వరూప వివరణమే అధ్యాత్మమనబడుతుంది.

**కం. నారాయణునకు నరునకు, భారతికిని మ్రొక్కి వ్యాసు పదములకు నమ**
**స్కారము సేసి వచింతు ను, దారగ్రంథంబు దళితతనుబంధంబున్. 57**

**ప్రతి :** నారాయణునకున్= నారాయణునకు (శ్రీకృష్ణునకు); నరునకున్= నరునకు (అర్జునునకు, నరనారాయణులకు); భారతికిన్= సరస్వతికి (వాగ్దేవికి); మ్రొక్కి= నమస్కరించి; వ్యాసుపదములకున్= కృష్ణద్వైపాయనుని పాదాలకు; నమస్కారము+చేసి= ప్రణామంచేసి; దళిత= చీల్చబడిన; తనుబంధంబున్= సంసారబంధనాలుగల; ఉదారగ్రంథంబున్= గొప్పదైన భాగవత గ్రంథాన్ని; వచింతున్= పలుకుతున్నాను.

**తా :** నరనారాయణులకు, వేదమాత సరస్వతికి, వ్యాసమునీంద్రునకు నమస్కరించి, సంసారాన్ని తరింపజేసే ఈ మహాగ్రంథాన్ని భాగవతాన్ని వచిస్తున్నాను.

**విశే. నారాయణం నమస్కృత్య, నరం చైవ నరోత్తమమ్,**
**దేవీం సరస్వతీం వ్యాసం, తతో జయ ముదీరయేత్.**

'జయము' అనే వ్యవహారం భాగవతానికి కూడా ఉన్నది.

**వ. అని ఇట్లు దేవతాగురునమస్కారంబు సేసి యిట్లనియె 'మునీంద్రులారా! నన్ను మీరలు నిఖిల లోక మంగళంబయిన ప్రయోజనం బడిగితిరి. ఏమిటం గృష్ణసంప్రశ్నంబు సేయంబడు నెవ్విధంబున నాత్మ ప్రసన్నంబగు, నిర్విఘ్నయు నిర్హేతుకయునైన హరిభక్తి యే రూపంబునం గలుగు నది పురుషులకుఁ బరమధర్మంబగు, వాసుదేవునియందు బ్రయోగింపంబడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానంబులం బుట్టించు. నారాయణకథలవలన నెయ్యే ధర్మంబులు దగులువడ వవి నిరర్థకంబులు. అపవర్గపర్యంతంబయిన పరధర్మంబునకు దృష్టశ్రుత ప్రపంచార్థంబు ఫలంబు గాదు. ధర్మంబునం దవ్యభిచారియైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు. విషయభోగంబైన కామంబున కింద్రియ ప్రీతి ఫలంబు గాదు. ఎంత తడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు, తత్త్వజిజ్ఞాసగల జీవునకుఁ గర్మంబులచేత నెయ్యది సుప్రసిద్ధం బదియు నర్థంబు గాదు; తత్త్వజిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస యగుటఁ గొందఱు ధర్మంబే తత్త్వంబని పలుకుదురు; తత్త్వవిదులు జ్ఞానంబను పేర నద్వయంబైన యది తత్త్వంబని యెఱుంగుదురు. ఆ తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్యగర్భులచేతం బరమాత్మ యనియు, సాత్త్వతుల చేత భగవంతుం డనియును బలుకంబడు. వేదాంత శ్రవణంబున గ్రహింపంబడి జ్ఞానవైరాగ్యంబులతోడం గూడిన భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మయందుఁ బరమాత్మం బొడగందురు. ధర్మంబునకు భక్తి ఫలంబు, పురుషులు వర్ణాశ్రమధర్మ భేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె సిద్ధి. ఏక చిత్తంబున నిత్యంబును గోవిందు నాకర్ణింపను వర్ణింపనుం దగుఁ జక్రాయుధ ధ్యానం బను ఖడ్గంబున వివేకవంతు లహంకారనిబద్ధంబైన కర్మంబు ద్రుంచివైతురు; భగవంతునియందలి శ్రద్ధయు నపవర్గదంబగు తత్కథాశ్రవణాదులయం దత్యంతాసక్తియుఁ బుణ్య తీర్థావగాహన మహత్సేవాదులచే సిద్ధించు. కర్మనిర్మూలన హేతువులైన కమలలోచను కథలం దెవ్వండు రతిసేయు, విన నిచ్చగించు, వాని కితరంబు లెవ్వియు రుచి**

**పుట్టింపనేరవు. పుణ్యశ్రవణకీర్తనుండైన కృష్ణుండు దన కథలు వినువారి హృదయంబులందు నిలిచి శుభంబు లాచరించు; నశుభంబులు పరిహరించు; నశుభంబులు నష్టంబు లయిన, భాగవతశాస్త్రసేవావిశేషంబున నిశ్చలభక్తి యుదయించు; భక్తి గలుగ రజస్తమోగుణ ప్రభూతంబులైన కామ లోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నం బగుఁ; బ్రసన్నమనస్కుండైన ముక్తసంగుండగు; ముక్తసంగుండైన నీశ్వరతత్త్వజ్ఞానంబు సిద్ధించు; నీశ్వరుండు గానంబడినఁ జిజ్జడగ్రథనరూపంబైన యహంకారంబు భిన్నంబగు; నహంకారంబు భిన్నంబైన నసంభావనాదిరూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు; సంశయ విచ్ఛేదంబైన ననారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించుం గావున. 58**

**ప్రతి :** అని= అని వచిస్తూ; ఇట్లు= ఈ విధంగా; దేవతా= దేవతలకు; గురు= ఆచార్యులకు; నమస్కారంబు+చేసి= మ్రొక్కి; ఇట్లు+అనియెన్= సూతుడు ఇలా అన్నాడు; మునీంద్రులారా!= శౌనకాది మహర్షులారా!; నన్నున్= నన్ను; మీరలు= మీరు; నిఖిలలోక= సమస్త ప్రపంచానికి; మంగళంబు+అయిన= శ్రేయస్సునందించే; ప్రయోజనంబు= పరమార్థాన్ని; అడిగితిరి= తెలియజేయుమన్నారు; ఏమిటన్= దేనివల్ల; కృష్ణసంప్రశ్నంబు= కృష్ణకథావిషయకమైన ప్రశ్న; చేయంబడున్= అడుగబడుతుందో; ఏ+విధంబునన్= ఏ రీతిగా; ఆత్మ= అంతరాత్మ; ప్రసన్నంబు+అగున్= ప్రశాంతి పొందుతుందో; నిర్విఘ్నయున్= ఏ ఆటంకంలేని; నిర్హేతుకయున్+ఐన= ఏ ఫలాపేక్షలేని; హరిభక్తి= విష్ణుప్రీతి; ఏ రూపంబునన్= ఏ ఆకారాన్ని పొందైనాసరే; కలుగున్= చేకూరుతుందో; అది= అట్టి భక్తే; పురుషులకున్= జీవులకు; పరధర్మంబు= ఉత్కృష్టమైన ధర్మం; అగున్= అవుతుంది; వాసుదేవునియందున్= సమస్త జగాలు తనలోగల దేవునియందు (వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణునియందు); ప్రయోగింపన్+పడిన= సమర్పింపబడిన ప్రకాశించే (పురఃప్రకాశనం ప్రయోగః స్యాత్); భక్తియోగంబు= (భగవత్ప్రాప్తికి సాధకాలైన యోగాలలో ఒకటైన) భక్తియోగం; వైరాగ్య= విరక్తిని; విజ్ఞానంబులన్= ఆత్మజ్ఞానాన్ని; పుట్టించున్= ప్రభవింపజేస్తుందో; నారాయణ కథ వలనన్= గోవిందుని గాథలద్వారా; ఏ+ఏ+ధర్మంబులు= ఏఏ ధర్మాలు; తగులు+పడవు= పట్టుబడవో; అవి= ఆ ధర్మాలు; నిరర్థకంబులు= సారంలేనివి (ప్రయోజనం లేనివి); అపవర్గ పర్యంతంబు+అయిన= మోక్షముయొక్క అంచులనుతాకే; పరధర్మంబునకున్= ఉత్కృష్ట ధర్మానికి; దృష్ట= కనిపించే; శ్రుత= వినిపించే; ప్రపంచ+అర్థంబు= లౌకిక ప్రయోజనం; ఫలంబు+కాదు= ఫలితంకాబోదు; ధర్మంబునందున్= పరమధర్మంలో; అవ్యభిచారి+ఐన= తప్పిప్రవర్తింపని; అర్థంబునకున్= చతుర్విధ పురుషార్థాలలో ఒకటైన అర్థానికి; కామంబు= కేవలం కామపురుషార్థం; ఫలంబు= ప్రయోజనం; కాదు= కాబోదు; విషయభోగంబు+ఐన= విశేషమైన ప్రీతిని కలిగించి అనుభవించుటే లక్ష్యంగా కలిగిన; కామంబునకున్= కామానికి; ఇంద్రియప్రీతి= దశేంద్రియాలకు తృప్తి కలిగించడమే; ఫలంబు+కాదు= ప్రయోజనం కాబోదు; ఎంతతడవు= ఎంతకాలం; జీవించున్= బ్రతికియుంటాడో; అంతియ= అంతకాలమే; కామంబునకున్= కామానికి; ఫలంబు= సంతృప్తి; తత్త్వజిజ్ఞాస+కల= తత్త్వం తెలుసుకోవాలనే కోరిక ఉన్న; జీవునకున్= ప్రాణికి; కర్మంబులచేతన్= నిత్యనైమిత్తిక కర్మలచేత; ఏ+అది= ఏది; సుప్రసిద్ధంబు= ప్రసిద్ధంగా లభిస్తుందో; అదియున్= ఆ స్వర్గాది సుఖప్రాప్తి; అర్థంబు+కాదు= పరమప్రయోజనం కాదు; తత్త్వజిజ్ఞాస+అనునది= జ్ఞానాన్ని కూర్చి తెలుసుకోవడమంటే; ధర్మజిజ్ఞాస+అగుటన్= ధర్మాన్ని గూర్చి తెలుసుకోవడమే అని; కొందఱు= కొందరు కర్మవాదులు; ధర్మంబు+ఏ= ధార్మిక విజ్ఞానమే; తత్త్వంబు+అని= తత్త్వం అంటూ; పలుకుదురు= వచిస్తారు; తత్త్వవిదులు= తత్త్వం తెలిసిన వేదాంతులు; జ్ఞానంబు+అను పేరన్= జ్ఞానమనే పేరుతో; అద్వయంబు+ఐన+అది= రెండు కాక ఒక్కటైనది; తత్త్వంబు+అని= 'తత్త్వమని'; ఎఱుంగుదురు= తెలుసుకొంటారు; ఆ తత్త్వంబున్= ఆ తత్త్వమనునదే; ఔపనిషదులచేతన్= ఉపనిషత్తులు (వేదాంతం)

అధ్యయనం చేసినవారిచే; బ్రహ్మము+అనియున్= 'బ్రహ్మం' అని; హైరణ్యగర్భులచేతన్= విరాట్స్వరూపుడైన హిరణ్యగర్భుని ఉపాసించే వారిచే; పరమాత్మ+అనియున్= 'పరమాత్మ' అని; సాత్త్వతులచేతన్= భక్తులచేత; భగవంతుండు+అనియును= 'భగవంతుడు' అని; పలుకన్+పడున్= వ్యవహరించబడుతోంది; వేదాంతశ్రవణంబునన్= వేదాంత వాక్యములను వినుటవల్ల; గ్రహింపన్+పడి= పొందబడినదై; జ్ఞానవైరాగ్యంబులతోడన్= ఆత్మజిజ్ఞాస, విరక్తులతోగూడిన; భక్తిచేతన్= ప్రీతిచే; తత్పరులు+ఐన= బ్రహ్మమందే ఆసక్తి కలిగిన; పెద్దలు= తత్త్వవేత్తలు; క్షేత్రజ్ఞుండు+ఐన= శరీరాన్ని తనకు భోగసాధనగా నెరింగి; ఆత్మయందున్= జీవాత్మలో (ప్రత్యగాత్మలో, వ్యష్టి ఆత్మలో); పరమాత్మన్= సమష్టి పరమాత్మను; పొడగందురు= దర్శిస్తారు; ధర్మంబునకున్= మానవులు ఆచరించే కర్మరూప ధర్మానికి; భక్తి= భక్తియే; ఫలంబు= ప్రయోజనము; పురుషులు= జీవులు (మానవులు); వర్ణ+ఆశ్రమ= వారి వారి వర్ణాల, ఆశ్రమాలయొక్క; ధర్మభేదంబులన్= కర్మలలోని ఉపాయాలనుబట్టి; చేయు= చేసే; ధర్మంబునకున్= ధర్మానికి; మాధవుండు= విష్ణువు; సంతోషించుటయె= ఆనందం పొందుటే; సిద్ధి= పరమప్రయోజనం; ఏకచిత్తంబునన్= ముఖ్య విషయంలో మనస్సు లగ్నం చేస్తూ; నిత్యంబును= ఎల్లప్పుడూ; గోవిందున్= నారాయణుని గురించి; ఆకర్ణింపను= వినడం; వర్ణింపను= కీర్తించడం; తగున్= చేస్తూ ఉండాలి; చక్ర+ఆయుధ+ ధ్యానంబు+అను= చక్రమనే ఆయుధాన్ని కలిగియుండే విష్ణువును ధ్యానించడమనే; ఖడ్గంబునన్= పెద్దకత్తితో; వివేకవంతులు= ప్రకృతి పురుషవిభాగం తెలిసినవారు; అహంకార= అహంకర్తృత్వంతో (నేనే చేసేవాణ్ణి); నిబద్ధంబు+ఐన= మిక్కుటంగా కూడుకొన్న; కర్మంబు= కర్మబంధాలను; త్రుంచివైతురు= ఖండించి వేస్తారు; భగవంతుని+అందలి= పరమాత్మపై; శ్రద్ధయున్= అతిశయించే భక్తియు; అపవర్గదంబు+అగు= ముక్తినిచ్చే; తత్+కథా= ఆ గాథలను; శ్రవణాదులయందున్= ఆసక్తితో వినడంలో; అతి+అంత+ఆసక్తియున్= మిక్కిలి అపేక్షయును; పుణ్యతీర్థ= పవిత్రమైన నదులలో అవగాహన= స్నానం చేయడంవల్ల; మహత్= పూజింపబడే వాటిని; సేవా+ఆదులచేన్= సేవించడం మున్నగు వాటివల్ల; సిద్ధించున్= లభిస్తుంది; కర్మనిర్మూలన= కర్మబంధాలను పూర్తిగా తొలగించడానికి; హేతువులు+ఐన= కారణభూతాలైన; కమలలోచను= తామరపూలవంటి కన్నులు కలవాడైన విష్ణువుయొక్క; కథలందున్= చరిత్రలందు; ఎవ్వండు= ఎవడు; రతి+చేయున్= ప్రీతి కలిగియుంటాడో; వినన్= వినడానికి; ఇచ్చగించున్= కోరికతో ఉంటాడో; వానికిన్= అట్టి పురుషునకు; ఇతరంబులు= మిగిలిన ప్రాపంచిక విషయాలు; ఎవ్వియున్= ఏవీకూడ; రుచి= ఆసక్తిని; పుట్టింపన్+నేరవు= కల్గించడానికి సమర్థాలు కావు; పుణ్యశ్రవణకీర్తనుండు+ఐన= పవిత్ర విషయాలను వినేవారిచే కీర్తించబడే (పవిత్రమైన వానిని వినడంచే సత్కీర్తునుడయ్యే); కృష్ణుండు= విష్ణువు; తన కథలు= తన గాథలను; వినువారి= ఆకర్ణించేవారి; హృదయంబులందున్= గుండెలలో; నిలిచి= స్థిరంగా ఉండి; శుభంబులు= మంగళములు; ఆచరించున్= నెరవేరుస్తాడు; అశుభంబులు= అమంగళములను; పరిహరించున్= పూర్తిగా దూరం చేస్తాడు; అశుభంబులు= అమంగళభావాలు; నష్టంబులు+అయినన్= నశించగా; భాగవత= భగవంతుని గూర్చి వివరించు; శాస్త్ర= శాస్త్రాలను; సేవా= భగవంతుని భజించే భక్తులను సేవించడమనే; విశేషంబునన్= విశేష ధర్మంద్వారా; నిశ్చలభక్తి= స్థిరమైన భక్తి; ఉదయించున్= ప్రభవిస్తుంది; భక్తి= అచంచలమైన భక్తి; కలుగన్= కలగడంతోనే; రజస్తమోగుణ= రజోగుణంవల్ల; తమోగుణంవల్ల; ప్రభూతంబులు+ఐన= అధికమయ్యే; కామలోభాదులకున్= కామం; లోభం మున్నగు అరిషడ్వర్గాలకు; వశంబు+కాక= లోను కాకుండా; చిత్తంబు= హృదయం; సత్త్వగుణంబునన్= సాత్త్విక గుణంచే; ప్రసన్నంబు+అగున్= నిర్మలమవుతుంది; ప్రసన్నమనస్కుండు+ఐనన్= మాలిన్యంలేని మనస్సుకల వాడయితే; ముక్తసంగుండు+అగున్= విడువబడిన బంధం కలవాడవుతాడు; ముక్తసంగుండు+ఐనన్=సంగమం నుండి విడివడినచో; ఈశ్వరతత్త్వజ్ఞానంబు= భగవత్తత్త్వ జిజ్ఞాస; సిద్ధించున్= లభిస్తుంది; ఈశ్వరుండు= ఈశ్వరజ్ఞానం; కానంబడినన్= స్థిరమై దర్శింపబడగా; చిత్+జడ+గ్రథన+రూపంబు+ఐన= జ్ఞానానికి; అజ్ఞానానికి కూర్చబడిన

గ్రంథిరూపంలోనున్న; అహంకారంబు= అహంకర్తృత్వ భావన; భిన్నంబు+అగున్= ఒక్కసారి పగిలిపోతుంది; అహంకారంబు= ఆ అహంకార భావన; భిన్నంబు+ఐనన్= పటాపంచలుకాగా; అసంభావనా+ఆది= అసంభావన; విపరీత భావన అనే; సంశయంబులు= ఒకదానియందొకటి ఆరోపించడమనే చిత్తవృత్తులు; విచ్ఛిన్నంబులు+అగున్= నరకబడతాయి (ఖండించబడతాయి); సంశయ= సందేహనిశ్చయాలు; విచ్ఛేదంబు+ఐనన్= తొలగిపోగానే; న+ఆరబ్ధఫలంబులు+ఐన= ఆరంభించబడిన ప్రారబ్ధం; ఆరంభించబడకుండా ఉన్న సంచితాగాముల యొక్క ఫలరూపమైన; కర్మంబులు= కర్మలన్నీ; నిశ్శేషంబులు+ఐ= మిగులకుండా; నశించున్= నాశనమవుతాయి; కావునన్= కాబట్టి.

**తా :** అని సూతుడు ఈ విధంగా దేవతలకు, గురువులకు కైమోడ్పులర్పించి ఇలా అన్నాడు “శౌనకాది మహర్షులారా! మీరు నన్ను సమస్తలోకాలకు శ్రేయస్సును కలుగజేసే పరమార్థం తెలియజేయుమని ప్రశ్నించారు. దేనివల్ల కృష్ణకథావిషయకమైన ప్రశ్న అడగబడుతుంది? ఏ విధంగా అంతరాత్మ ప్రశాంతత పొందుతుంది? ఏ ఆటంకంలేని, ఏ ఫలాపేక్షలేని విష్ణుభక్తి ఏదోరూపంలో ఏ విధంగా చేకూరుతుంది? అటువంటి ఉత్తమభక్తియే సమస్త జీవులకు ఉత్కృష్టధర్మం అవుతుంది. వాసుదేవునిపై ప్రకటించే భక్తియోగమే వైరాగ్యాన్ని, ఆత్మజ్ఞానాన్ని కలిగిస్తుంది. గోవిందుని గాథల ద్వారా ఏయే ధర్మాలు తెలియజేయబడతాయో, అవే ప్రయోజనం చేకూర్చేవి. తక్కినవన్నీ నిరర్థకాలు. ధర్మార్థకామమోక్షాలు అనే చతుర్విధ పురుషార్థాలలో మోక్షాన్ని ప్రతిపాదించే ధర్మమే ఉత్కృష్ట ధర్మమవుతుంది కాని లౌకిక ప్రయోజనాలను కలిగించే ధర్మం ధర్మంకాదు. అదేవిధంగా ఆ పరమధర్మాన్ని అందించే అర్థమే ప్రయోజనకారి అవుతుంది కాని కేవలం కోరికలు తీర్చుకొనే అర్థ సంపాదన నిరర్థకమే. అదేరీతిగా ధర్మార్థాలతో మోక్షానికి అర్హమైన కామానుభవం సంభావ్యమవుతుంది కాని, కేవలం విషయభోగపరిమితమైన కామం దుష్కామమే. ఎంతకాలం జీవించి ఉంటామో, అంతకాలమే ఇంద్రియాలకు సంతృప్తి. కాబట్టి మోక్షగామి అయిన కామమే సత్కామం అనబడుతుంది. నిత్యనైమిత్తిక కర్మలద్వారా లభించే స్వర్గాది లోకప్రాప్తి ఏదయితే ఉందో, అది తత్త్వజిజ్ఞాస కల జీవులకు పరమప్రయోజనం కాదు. తత్త్వజిజ్ఞాస అంటే ధర్మజిజ్ఞాస అని కర్మవాదులు వచిస్తారు. వారి అభిప్రాయప్రకారంగా ధార్మికవిజ్ఞానమే తత్త్వం అనబడుతుంది. కాని తత్త్వం తెలిసిన వేదాంతులు జ్ఞానమనే పేరుతో రెండు కాకుండా ఎల్లప్పుడూ ఒక్కటై భాసించి నిలిచియుండే దానినే తత్త్వమని చెబుతారు. ఆ తత్త్వమే ఉపనిషత్తులు అధ్యయనం చేసే ఔపనిషదులచే “బ్రహ్మం” అనబడుతుంది. అదే హిరణ్యగర్భోపాసకులచే “పరమాత్మ”గా వ్యవహరించబడుతుంది. అదే సాత్త్వతులచే “భగవంతుడు”గా పిలువబడుతుంది. నిరంతరం ఉపనిషద్వాక్యాలను అనుసంధానం చేస్తూ ఉంటే జ్ఞానం, వైరాగ్యం చేకూరుతాయి. అపుడు వారికి నిర్మలమైన భక్తి ఉదయించి “బ్రహ్మం” గూర్చి మాత్రమే ఆసక్తి కలిగినవారవుతారు. ఆ తత్త్వవేత్తలు దేహాన్ని భోగసాధనమైన దాన్నిగా గుర్తిస్తారు. తమ ప్రత్యగాత్మలో పరమాత్మను దర్శిస్తారు. మానవులు ఆచరించే కర్మరూప ధర్మంద్వారా భక్తి చేకూరడమే పరమప్రయోజనం అవుతుంది. వారి వారి వర్ణాశ్రమ ధర్మాలద్వారా మానవులు కావించే సకల కర్మలకు మాధవుడు సంతోషించడమే సిద్ధి అవుతుంది. ఎల్లప్పుడూ మనస్సును ఏకాగ్రంచేసి నారాయణుని కథలను వినడం కీర్తించడం చేస్తూ ఉండాలి. చక్రాయుధ ధ్యానమనే పెద్దకత్తితో అహంకర్తృత్వమనే కర్మబంధాన్ని ఖండించివేయాలి. భగవంతునిపై అతిశయించే భక్తి కలిగి ఉండాలి. ముక్తిదాయకాలైన విష్ణుగాథలను మిక్కిలి ఆసక్తితో వినాలి. పవిత్రనదులలో స్నానం ఆచరించాలి. పూజార్హులైన వారిని సేవించాలి. కర్మబంధాలను పూర్తిగా తొలగింపజాలిన పుండరీకాక్షు చరిత్రలను వినడానికి అనురక్తి చూపించాలి. ఇటువంటి మానవునికి ఇతర ప్రాపంచిక విషయాలపై అభిరుచి జనించదు. పుణ్యశ్రవణ కీర్తనుడైన విష్ణువు తన గాథలను వినేవారి గుండెలనిండా స్థిరంగా ఉండిపోతాడు. అలా నిలిచి శుభాలు నెరవేరుస్తాడు. అశుభాలు దూరం చేస్తాడు. అమంగళాలు నశించిపోతే,

భగవంతుని గూర్చి వివరించే గ్రంథాలు చదవాలని, భగవంతుని భజించే భక్తులను సేవించాలనే సంకల్పం కలుగుతుంది. అప్పుడు మాత్రమే నిశ్చలభక్తి ఏర్పడుతుంది. అచంచల భక్తి ప్రభవించడంతోనే రజోగుణ తమోగుణాలవల్ల కలిగే కామలోభాదులు నశించిపోతాయి. అపుడు మనస్సు సాత్త్వికగుణంచే ప్రసన్నమవుతుంది. మనస్సు ప్రసన్నమయితే దేనియందు సంగం లేనివాడవుతాడు. ముక్తసంగుడయితే భగవంతుని గూర్చి తెలుసుకోవాలనే ఇచ్ఛ జనిస్తుంది. ఈశ్వరుని గూర్చిన జ్ఞానం తెలిస్తే జ్ఞానాజ్ఞానాలకు కూర్చబడిన గ్రంథి విడివడిపోతుంది. అపుడు అహంకర్తృత్వభావన భిన్నమైపోతుంది. అహంప్రవృత్తి పటాపంచలు కాగా సర్వసంశయాలు తొలగిపోతాయి. సంశయాలు విచ్ఛేదంకాగా ప్రారబ్ధసంచితాగామి కర్మలన్నీ ఏవీ మిగలకుండా నశించిపోతాయి.

**విశే :** వాసుదేవః – వసంత్యస్మిన్ జగన్తీతి వాసుః వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః – సమస్తజగాలు తనలోగల దేవుడు (లేదా) వసుదేవస్య అపత్యం పుమాన్ వాసుదేవః – వసుదేవుని కుమారుడైన వాసుదేవుడు.

సాత్త్వతులు – సాత్ పరమాత్మా, సాత్ అస్తి యేషాం ఇతి సాత్వతః భక్తాః – ఉపాసనచే పరమాత్మను కొలిచేవారు కావున భక్తులు.

అనారబ్ధఫలంబులు – ఆరబ్ధంచ అనారబ్ధంచ అనారబ్ధే తయోఃఫలం అనారబ్ధ ఫలం – ఏకశేషవృత్తి.

**కం. గురుమతులు తపసు లంతః, కరణంబుల శుద్ధిసేయ ఘనతరభక్తిన్**
**హరియందు సమర్పింతురు, పరమానందమున భిన్నభవబంధనులై. 59**

**ప్రతి :** గురుమతులు= మహాబుద్ధిమంతులైన; తపసులు= తపోధనులు; అంతఃకరణంబులన్= మనోబుద్ధి చిత్తాహంకార ప్రవృత్తులను; శుద్ధి+చేయన్= పరిశుద్ధం చేసుకోవడానికై; హరి+అందున్= గోవిందునిపై; ఘనతరభక్తిన్= మిక్కిలి గొప్పదైనభక్తితో; పరమ+ఆనందమునన్= పరబ్రహ్మమునందలి ఆనందానుభూతితో; భిన్నభవబంధనులు+ఐ= తొలగిపోయిన సంసారబంధాలు కలవారై; సమర్పింతురు= తన్నుతామే అర్పించుకొంటారు.

**తా :** కాబట్టి నిరంతరం ధ్యానంచేసే తపశ్శ్రేష్ఠులు తమ అంతరంగాన్ని పరిశుద్ధం చేసుకోవడానికై, హరిపై అచంచలమైన భక్తి కలవారై తమను తాము పూర్తిగా అర్పణం చేసుకొంటారు.

**తరల.పరమపూరుషు డొక్కఁ డాధ్యుఁడు పాలనోద్భవనాశముల్**
**సొరిదిఁ జేయు ముకుంద పద్మజ శూలి సంజ్ఞలఁ బ్రాకృత**
**స్ఫురిత సత్త్వరజస్తమంబులఁ బొందు నందు శుభస్థితుల్**
**హరి చరాచరకోటి కిచ్చు ననంతసత్త్వనిరూఢుఁడై. 60**

**ప్రతి :** పరమపూరుషుఁడు= పరమాత్మయైన విరాట్స్వరూపుడు; ఆధ్యుఁడు= అంతటా ధ్యానించబడేవాడు; ఒక్కఁడు= ఒక్కడే; పాలన+ఉద్భవ+నాశముల్= పోషణ, పుట్టుక, లయం; సొరిదిన్= ఒక క్రమపద్ధతిలో; చేయున్= కావిస్తాడు; ముకుందపద్మజ, శూలి, సంజ్ఞలన్= హరి, బ్రహ్మ, రుద్రుడు అనే పేర్లతో; ప్రాకృతస్ఫురిత= ప్రకృతియందు ప్రకాశించే; సత్త్వ, రజస్+తమంబులన్= సత్త్వగుణాన్ని, రజోగుణాన్ని, తమోగుణాన్ని; పొందున్= స్వీకరిస్తాడు; అందున్= ఆ ముప్పురిలో; అనంతసత్త్వనిరూఢుఁడు+ఐ= అంతులేని శక్తితో ప్రసిద్ధికెక్కినవాడై; హరి= విష్ణువు; చర+అచర+కోటికిన్= జంగమస్థావర సమూహానికి; శుభస్థితుల్= కల్యాణ వైభవాలను; ఇచ్చున్= ప్రసాదిస్తాడు.

**తా :** అంతటా, అందరిచే ధ్యానించబడే ఉత్తమ పురుషుడు (పరమాత్మ) ఒక్కడే. అతడే సృష్టిస్థితిలయములను క్రమంగా కావిస్తాడు. సృష్టి సమయంలో బ్రహ్మ, స్థితివేళలో హరి, లయకాలంలో రుద్రుడు అనే నామాలు ధరిస్తాడు. ప్రకృతిగుణాలైన రజస్సత్త్వతమస్సులను గ్రహిస్తాడు. ఈ ముగ్గురిలో అనంతసత్త్వ సంపన్నుడైన హరి చరాచరాలకు సమస్తశుభాలను ప్రసాదిస్తాడు.

**విశే :** ప్రాణినామగ్రే గచ్ఛంతీతి పురుషాః పూరుషాశ్చ – సమస్త ప్రాణులకు ముందు సత్తారూపంలో ఉండేవాడు కాబట్టి పురుషుడు లేక పూరుషుడు. ఆసమంతాత్ ధ్యాయంత్యేనమిత్యాధ్యః – ధ్యైచింతాయాం – అంతటా ధ్యానించబడేవాడు కాన ఆధ్యుడు. త్రిమూర్తులకు ఏకాత్మకత్వం ఉన్నా సత్త్వగుణసంయుక్తుడు కాన వారిలో హరి విశిష్టుడుగా ఇందు చెప్పబడ్డాడు. ఈ వృత్తం తరలం. ఈ సందర్భం మానవుడు తరించడానికి మార్గసూచకమైన భగవల్లీల తరం – అంటే దాటుట. తరలం అంటే దాటేమార్గం తెలియజెప్పేది. భావానికి తగిన ఛందోవిశేషం. మత్తకోకిలవలెనే తరలం ఆనందనటనం చేస్తూ పాడుకోదగ్గ ఛందోరీతి. న, భ, ర, స, జ, జ, గ – గణాలతో తరలం సాగుతుంది. యతి – పన్నెండో అక్షరం.

**వ. మఱియు నొక్క విశేషంబు గలదు; కాష్ఠంబు కంటె ధూమంబు, ధూమంబు కంటెఁ ద్రయీ మయంబయిన వహ్ని యెట్లు విశేషంబగు నట్లు తమోగుణంబుకంటె రజోగుణంబు, రజోగుణంబు కంటె బ్రహ్మప్రకాశంబగు సత్త్వగుణంబు విశిష్టంబగు; తొల్లి మునులు సత్త్వమయుండని భగవంతు హరి నధోక్షజుం గొలిచిరి; కొందఱు సంసారమందలి మేలు కొఱకు నన్యుల సేవింతురు; మోక్షార్థు లయినవారలు ఘోరరూపులయిన భూతపతుల విడిచి దేవతాంతర నింద సేయక శాంతులయి నారాయణ కథల యందే ప్రవర్తింతురు; కొందఱు రాజసతామసులయి సిరియు నైశ్వర్యంబును బ్రజలనుం గోరి పితృభూతప్రజేశాదుల నారాధింతురు. మోక్ష మిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు; వేద యాగ యోగ క్రియా జ్ఞాన తపోగతి ధర్మంబులు వాసుదేవ పరంబులు; నిర్గుణుం డయిన పరమేశ్వరుండు గలుగుచు లేకుండుచుఁద్రిగుణంబులతోడం గూడిన తన మాయచేత నింతయు సృజియించి గుణవంతుని చందంబున నిజ మాయావిలసితంబు లయిన గుణంబులలోఁ బ్రవేశించి విజ్ఞానవిజృంభితుండై వెలుంగు; నగ్ని యొక్కరుండయ్యుఁ బెక్కుమ్రాఁకులందుఁ దేజరిల్లుచుఁ బెక్కండ్రై తోఁచు తెఱంగున విశ్వాత్మకుండైన పురుషుం డొక్కండ తన వలనం గలిగిన నిఖిలభూతంబులందు నంతర్యామి రూపంబున దీపించు; మహాభూత సూక్ష్మేంద్రియంబులతోడంగూడి గుణమయంబు లయిన భావంబులం దనచేత నిర్మితంబులైన భూతంబులందుఁ దగులు వడక తద్గుణంబు లనుభవంబు సేయుచు; లోకకర్తయైన యతండు దేవ తిర్యఙ్మనుష్యాది జాతులందు లీల నవతరించి లోకంబుల రక్షించు నని మఱియు సూతుం డిట్లనియె. 61**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; ఒక్క విశేషంబు= మరోవిశేషం; కలదు= ఉంది; కాష్ఠంబు కంటెన్= (అగ్నిసమమైన) కొయ్యకన్న; ధూమంబు= (నలుపు; ఎరుపు కలిసిన రంగుతో కూడుకొన్న) పొగ (విశిష్టమయింది); ధూమంబుకంటెన్= ఆ పొగకన్న; త్రయీమయంబు+అయిన= ఆహవనీయ, గార్హపత్య, దక్షిణ రూపయజ్ఞసాధకమైన; వహ్ని= అగ్ని; ఎట్లు= ఏ విధంగా; విశేషంబు+అగున్= విశిష్టమైనదో; అట్లు= ఆ విధంగా; తమస్+గుణంబుకంటెన్= ప్రవృత్తిరహితమైన లయంకన్న; రజస్+గుణంబు= ప్రవృత్తిసహితమైన రజోగుణం (విశిష్టమయింది); రజస్+గుణంబుకంటెన్= (సోపాధిక

జ్ఞానహేతువైన; కించిద్బ్రహ్మదర్శనసత్త కలిగిన) రజోగుణంకన్న; బ్రహ్మప్రకాశంబు+అగు= బ్రహ్మమును దర్శింపజేయగల; సత్త్వగుణంబు= సత్త్వమనే గుణం; విశిష్టంబు+అగు(న్)= ఉత్తమమైనది; తొల్లి= మొదటినుంచి; మునులు= యోగులు; సత్త్వమయుండు+అని= సత్త్వగుణస్వరూపుడుగా ఉన్నాడు కాబట్టి; అధోక్షజున్= ఇంద్రియ జన్యజ్ఞానాన్ని తిరస్కరించే (జితేంద్రియులకు ప్రత్యక్షమయ్యే); భగవంతున్= షడ్గుణైశ్వర్య సంపన్నుడైన; హరిన్= శ్రీమహావిష్ణువును; కొలిచిరి= సేవించారు; కొందఱు= కొంతమంది; సంసారము+అందలి= సంసారంలోని; మేలుకొఱకున్= సుఖంకొరకు; అన్యులన్= ఇతర దేవతలను; సేవింతురు= కొలుస్తారు; మోక్ష+అర్థులు+అయినవారలు= ముక్తిని కోరేవారు మాత్రం; ఘోరరూపులు+అయిన= వికృతస్వరూపం కల్గిన; భూతపతులన్= గణదేవతలను; విడిచి= వదలి; దేవతా+అంతర+నింద+చేయక= ఇతర దేవతలను నిందించకుండా; శాంతులు+అయి= శాంతస్వభావులై; నారాయణ కథల, అందున్+ఏ= విష్ణు కథలందే; ప్రవర్తింతురు= సంచరిస్తూ ఉంటారు; కొందఱు= మరికొంతమంది; రాజస, తామసులు+అయి= రజోగుణంతోను; తమోగుణంతోను కూడుకొన్నవారై; సిరియున్= సంపదను; ఐశ్వర్యంబును= ఈశ్వరుని విభూతిని (అష్టసిద్ధులను); ప్రజలనున్= సంతానములను; కోరి= కోరుకొని; పితృభూతప్రజా+ఈశ+ఆదులన్= పితృదేవతలను, భూతదేవతలను; ప్రజాపతులు మున్నగువారిని; ఆరాధింతురు= పూజిస్తారు; మోక్షము= ముక్తిని; ఇచ్చుటన్+చేసి= ప్రసాదించడంవల్ల; నారాయణుండు= విష్ణువు; సేవ్యుండు= పూజించదగినవాడు; వేద= వేదాలు; యాగ= యాగాలు; యోగ= యోగం; క్రియా= కర్మ; జ్ఞాన= శాస్త్రజ్ఞానం; తపః= తపస్సు; గతి= గమ్యం; ధర్మంబులు= ధర్మాలు; వాసుదేవపరంబులు= విష్ణువును ఉద్దేశించి ప్రవర్తిల్లునట్టివే; నిర్గుణుండు+అయిన= గుణసంగరహితుడైన; పరమ+ఈశ్వరుండు= పరమాత్మ; కలుగుచున్= ఉంటూ; లేకుండుచున్= లేకనూపోతూ; త్రిగుణంబులతోడన్= సత్త్వరజస్తమోగుణాలతో కూడిన; తన మాయచేతన్= తన ప్రకృతిచే; ఇంతయున్= ఈ విశ్వాన్నంతా; సృజియించి= సృష్టించి; గుణవంతుని చందంబునన్= సగుణునిలా; నిజ+మాయా= తన మాయచే; విలసితంబులు+అయిన= ప్రకాశించే; గుణంబులలోన్= ఆ మూడు గుణాల్లోను; ప్రవేశించి= ఆశ్రయించి; విజ్ఞాన విజృంభితుండు+ఐ= విశేషమైన జ్ఞానంతో అతిశయించినవాడై; వెలుంగున్= విరాజిల్లును; అగ్ని= వహ్ని; ఒక్కరుండు+అయ్యున్= ఒకటే అయినా; పెక్కుమ్రాఁకులందున్= అనేక వృక్షాలలో; తేజరిల్లుచున్= ప్రకాశిస్తూ; పెక్కండ్రు+ఐ= పెక్కురూపాలతో; తోఁచు= కనిపించే; తెఱంగునన్= విధంగా; విశ్వ+ఆత్మకుండు+ఐన= విశ్వమయుడైన; పురుషుండు= పరమాత్మ; ఒక్కండు+అ= ఒక్కడే అయినా; తనవలనన్= తనవల్ల; కలిగిన= ఏర్పడిన, నిఖిల భూతంబులందున్= సమస్తభూత కోటియందు; అంతర్యామి రూపంబునన్= 'అంతర్నియామక' రూపంతో; దీపించున్= ప్రకాశిస్తాడు, మహాభూత=స్థూలములు; సూక్ష్మ= సూక్ష్మములు; ఇంద్రియంబులతోడన్= సర్వేంద్రియాలతో; కూడి= కలసి; గుణమయంబులు+అయిన= గుణాత్మకాలైన; భావంబులన్= భావాలద్వారా; తనచేతన్= తనచే; నిర్మితంబులు+ఐన= సృజించబడిన; భూతంబులందున్= ప్రాణులందు; తగులు+పడక= చిక్కుపడకుండా; తద్+గుణంబులు= ఆయాగుణాలను; అనుభవంబు+చేయుచున్= అనుభవిస్తూ; లోకకర్త+ఐన= విశ్వనిర్మాత అయిన; అతండు= ఆ భగవంతుడు; దేవ= దేవతలందు; తిర్యక్= పశుపక్ష్యాదులందు; మనుష్య+ఆదిజాతులందున్= మానవాది జాతులందు; లీలన్= లీలావతారంగా; అవతరించి= జన్మించి; లోకంబులన్= జగాలను; రక్షించున్= కాపాడుతాడు; అని= అంటూ, మఱియున్= ఇంకా; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా చెబుతున్నాడు.

**తా :** అంతేకాకుండా మరో విశేషం కూడ ఉంది. అగ్నితో కలసి మండి ప్రకాశించే కొయ్యకన్న నలుపు ఎరుపు కలిసిన రంగుతో కూడుకొన్న పొగ విశిష్టమయింది. ఆ పొగకన్న ఆహవనీయ గార్హపత్య దాక్షిణాత్య రూపయజ్ఞ సాధకమైన వహ్ని విశిష్టమయింది. అదేవిధంగా ప్రవృత్తిరహితమైన తమోగుణంకన్న ప్రవృత్తి సహితమైన రజోగుణం విశిష్టమయింది.

సోపాధిక జ్ఞానహేతువైన కించిద్బ్రహ్మదర్శనసత్త కల్గిన రజోగుణంకన్న సాక్షాద్బ్రహ్మదర్శనసత్త కల్గిన సత్త్వగుణం మహావిశిష్టమయింది. ఆదికాలం నుండి యోగీశ్వరులు, జితేంద్రియులకు మాత్రమే ప్రత్యక్షమయ్యే షడ్గుణైశ్వర్య సంపన్నుడైన శ్రీమహావిష్ణువును సత్త్వమయునిగా ఉన్నాడు కాబట్టి సేవించారు. కొందరు సంసారంలోని సుఖాన్ని కోరుతూ ఇతర దేవతలను కొలుస్తారు. కాని ముక్తిని కోరేవారు మాత్రం విష్ణువును భజిస్తారు. వారు వివిధరూపులైన గణాధిదేవతలను విడిచి, ఇతర దేవతానింద చేయక శాంతస్వభావులై నారాయణ కథలయందే ప్రవర్తిస్తూ ఉంటారు. మరికొందరు రజోగుణంతోను, తమోగుణంతోను కూడుకొన్నవారై సిరిసంపదలను, సిద్ధులను, సంతానమును వాంఛించి పితృదేవతలను, భూతదేవతలను, ప్రజాపతులను ఆరాధిస్తారు. నారాయణుడు ముక్తిప్రదాతగా సర్వజనులచే పూజించబడుతున్నాడు. వేదాలుకాని, యాగాలుకాని, యోగంకాని, కర్మకాని, జ్ఞానంకాని, తపస్సుకాని, గమ్యంకాని, ధర్మంకాని వాసుదేవపరంగా సార్థకమవుతున్నాయి. నిర్గుణంబైన పరబ్రహ్మ నివృత్తితో ఉన్నా, ఒకప్పుడు ప్రవృత్తిని వహిస్తూ, త్రిగుణాలతో కూడిన తన ప్రకృతిచే ఈ విశ్వాన్ని అంతా సృజిస్తాడు. సగుణుడై విరాజిల్లుతూ ఉంటాడు. అగ్ని ఒకటే అయినా, అది అనేక వృక్షాల్లో వివిధ రూపాలతో ప్రకాశిస్తున్నట్లుగా, విశ్వమయుడైన పరమాత్మ ఒక్కడే అయినా నానావిధరూపాలుగా ఏర్పడిన అనంతభూతకోటిలో అంతర్యామిగా ప్రకాశిస్తూ ఉంటాడు. స్థూలములు, సూక్ష్మములు, ఇంద్రియాలు, త్రిగుణాలు, వాటి తత్త్వాలద్వారా తనచే సృజింపబడిన భూతకోటిలో చిక్కుపడక ఆయాగుణానుభవం పొందుతున్నట్లుంటాడు. విశ్వకర్తయైన ఆ భగవంతుడు దేవతలలోను, పశుపక్ష్యాదులలోను, మానవులలోను లీలావతారంగా క్రిందకు దిగివచ్చి సమస్త జగత్తులను కాపాడుతాడు అని సూతుడు వచిస్తూ ఇంకా ఇలా చెబుతున్నాడు.

**విశే :** కాష్ఠం – కాశతే అగ్నినా సమమితి కాష్ఠం. అగ్నితో కలసి ప్రకాశించేది.

**శ్లో. పార్థివా ద్దారుణోధూమః, తస్మాదగ్నిస్త్రయీమయః** – అని మూలం. స్వతస్సిద్ధప్రకాశరహితమైన కాష్ఠం కన్న ధూమం, ప్రవృత్తిస్వభావంతో ఈషత్కర్మసత్త కలిగిన ధూమంకన్న, సాక్షాత్కర్మసాధనమైన త్రయీమయమైన అగ్ని విశిష్టం – అని శ్రీధరీయం.

**సీ. మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై చారు షోడశ కళాసహితుఁ డగుచుఁ**
**బంచమహాభూతభాసితుండై శుద్ధసత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ**
**జరణోరుభుజముఖశ్రవణాక్షినాసాశిరములు నానాసహస్రములు వెలుఁగ**
**నంబర కేయూర హార కుండల కిరీటాదులు పెక్కువే లమరుచుండఁ**

**తే. బురుష రూపంబు ధరియించి పరుఁ డనంతుఁ, డఖిలభువనైకవర్తనయత్న మమర**
**మానితోదార జలరాశి మధ్యమునను, యోగనిద్రావిలాసియై యొప్పుచుండు. 62**

**ప్రతి :** మహత్= మహత్తత్త్వం; అహంకార= అహంకారం; తన్మాత్ర= శబ్దస్పర్శరూపరసగంధాలనే మాత్రలతోను; సంయుక్తుఁడు+ఐ= కూడుకొన్నవాడై; చారు, షోడశ, కళా, సహితుఁడు+అగుచున్ : చారు= అందమైన; షోడశ= పదునారు; కళా= కళలతో; సహితుఁడు+అగుచున్= కూడుకొన్నవాడై; పంచమహాభూత= నేల, నీరు, నిప్పు, గాలి, నింగి అనే ఐదు మహాభూతాలతో; భాసితుండు+ఐ= ప్రకాశిస్తూ; శుద్ధసత్త్వుఁడు+ఐ= గుణాలకతీతమైనవాడై; సర్వ+అతిశాయి+ అగుచున్= (స్థూలసూక్ష్మకారణాలన్నింటికన్న) అన్నింటిని అతిశయించినవాడై; చరణ= పాదాలు; ఊరు= తొడలు; భుజ= చేతులు (బాహువులు); ముఖ= వదనాలు; శ్రవణ= చెవులు; అక్షి= కన్నులు; నాసా= ముక్కులు; శిరములు= తలలు;

నానాసహస్రములు= వేలకువేలు; వెలుఁగన్= ఒప్పుచుండగా; అంబర= పీతవస్త్రాలు; కేయూర= భుజకీర్తులు; హార= కాంచన ముక్తాహారాలు; కుండల= చెవుల అలంకారాలు; కిరీట= రత్నమకుటాలు; ఆదులు= మున్నగునవి; పెక్కువేలు= వేనవేలు; అమరుచుండన్= అమర్చినట్లు వెలుగుతూ ఉండగా; పురుషరూపంబున్= మనుష్యాకార పురుషోత్తమరూపం; ధరియించి= తాల్చి; అనంతుఁడు= ఆద్యంతరహితుడైన; పరుఁడు= పరమాత్మ; అఖిల= సమస్తమైన; భువన= విశ్వాలలో; ఏక= ముఖ్యంగా; వర్తన= ప్రవర్తించే, యత్నము= ప్రయత్నం; అమరన్= ఏర్పడగా; మానిత= అందరిచే ఆరాధించబడే; ఉదార= గొప్పదైన; జలరాశి= సముద్రంయొక్క; మధ్యమునను= నడిమిభాగంలో; యోగనిద్రావిలాసి+ఐ= యోగమాయానిద్రాముద్రితుడై; ఒప్పుచుండున్= శయనించి ప్రకాశిస్తాడు.

**తా :** ఆ పరమాత్మయే మహత్తత్త్వం, అహంకారం, శబ్దస్పర్శరూపరస గంధాలనే పంచతన్మాత్రలు, అంతఃకరణ చతుష్టయం, పంచేంద్రియాలు అనే సూక్ష్మాలైన పదునారు అంశలతో కూడుకొన్నవాడై, స్థూలాలైన భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే ఐదు మహాభూతాలతో విరాజిల్లుతున్నవాడై, సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం అనే త్రిగుణాలకు అతీతంగా ఉండే శుద్ధసత్త్వంతో భాసిస్తున్నవాడై, చరణాలు, ఊరువులు, భుజాలు, ముఖాలు, శ్రవణాలు, నయనాలు, నాసారంధ్రాలు, శిరస్సులు వేలకు వేలు ప్రకాశిస్తున్నవాడై, పచ్చని పట్టువస్త్రాలు, కేయూరాలు, కాంచనహారాలు, శ్రవణ కుండలాలు, రత్నకిరీటాలు వేలకువేలు కాంతులీనుచుండగా, ఆ ఆద్యంతరహితుడైన పరబ్రహ్మమే సగుణరూపుడై మనుష్యాకార పురుషోత్తమ రూపం ధరించి సమస్త భువనభాండాలను ప్రవర్తింపజేసే మహాయత్నంతో, అందరిచే ఆరాధించబడే గొప్పదైన (క్షీర) సముద్రమధ్యభాగంలో యోగమాయానిద్రాముద్రతో ప్రకాశిస్తూ ఉంటాడు.

**విశే :** "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్" అనే శ్రుతి ప్రకారంగా పరమాత్మ అనంత శీర్షాలు మున్నగువాటితో దర్శనమిస్తాడు.

## ✤ భగవంతుని యేకవింశత్యవతారములు ✤

**వ. అది సకలావతారంబులకు మొదలి గనియైన శ్రీమన్నారాయణదేవుని విరాజమానంబయిన దివ్యరూపంబు; దానిం బరమయోగీంద్రులు దర్శింతురు; అ ప్పరమేశ్వరు నాభికమలంబువలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె; నతని యవయవ స్థానంబులయందు లోకవిస్తారంబులు గల్పింపంబడియె; మొదల న ద్దేవుండు కౌమారాఖ్యసర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె, రెండవ మాఱు జగజ్జననంబు కొఱకు రసాతలగత యయిన భూమి నెత్తుచు యజ్ఞేశుం డయి వరాహదేహంబు దాల్చె;మూఁడవ తోయంబున నారదుండను దేవర్షియై కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు సేసె; నాల్గవపరి ధర్మభార్యాసర్గంబునందు నరనారాయణాభిధానుండై దుష్కరంబైన తపంబు సేసెఁ; బంచమావతారంబునం గపిలుండను సిద్ధేశుండయి యాసురి యను బ్రాహ్మణునకుఁ దత్త్వగ్రామనిర్ణయంబు గల సాంఖ్యంబు నుపదేశించె; నాఱవ శరీరంబున ననసూయాదేవియందు నత్రిమహామునికిం గుమారుండై యలర్కునికిఁ బ్రహ్లాదముఖ్యులకు నాత్మవిద్యఁ దెలిపె; నేడవ విగ్రహంబున నాకూతియందు రుచికి జన్మించి యజ్ఞుం డనఁ బ్రకాశమానుండై యమాది దేవతలం గూడి స్వాయంభువ మన్వంతరంబు రక్షించె; అష్టమ మూర్తిని మేరుదేవియందు నాభికి జన్మించి యురుక్రముం డనం బ్రసిద్ధుండై**

**విద్వజ్జనులకుఁ బరమహంసమార్గంబుం బ్రకటించె; ఋషులచేతఁ గోరంబడి తొమ్మిదవ జన్మంబునఁ బృథుచక్రవర్తియై భూమిని ధేనువుం జేసి సమస్తవస్తువులం బిదికె; చాక్షుషమన్వంతరసంప్లవంబున దశమంబయిన మీనావతారంబు నొంది మహీరూపంబగు నావ నెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె; సముద్రమథన కాలంబునం బదునొకండవమాఱు కమఠాకృతిని మందరాచలంబుఁ దన పృష్ఠకర్పరంబున నేరుపరియై నిలిపె; ధన్వంతరి యను పండ్రెండవ తనువున సురాసుర మథ్యమాన క్షీరపాథోధిమధ్య భాగంబున నమృతకలశహస్తుండై వెడలెఁ; బదుమూఁడవది యయిన మోహినీవేషంబున నసురుల మోహితులంజేసి సురల నమృతాహారులం గావించె; బదునాలుగవదియైన నరసింహరూపంబునం గనకకశిపుని సంహరించెఁ; బదునేనవదియైన కపట వామనావతారంబున బలిని బదత్రయంబు యాచించి మూఁడు లోకంబుల నాక్రమించెఁ; బదునాఱవదియైన భార్గవరామాకృతినిఁ గుపితభావంబుఁ దాల్చి బ్రాహ్మణ ద్రోహులయిన రాజుల నిరువది యొక్క మాఱు వధియించి భూమి నిఃక్షత్త్రంబుఁ గావించెఁ; బదునేడవదియైన వ్యాసగాత్రంబున నల్పమతులయిన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖ లేర్పఱచెఁ; బదునెనిమిదవదైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబునొంది సముద్ర నిగ్రహాది పరాక్రమంబు లాచరించె; నేకోనవింశతి వింశతితమంబులైన రామకృష్ణరూపంబులచే యదువంశంబునందు సంభవించి విశ్వంభరాభారంబు నివారించె; నేకవింశతి తమంబైన బుద్ధనామధేయంబునం గలియుగా ద్యవసరంబున రాక్షస సమ్మోహనంబు కొఱకు మధ్యగయా ప్రదేశంబున జినసుతుండయి తేజరిల్లు; యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికిఁ గల్కి యను పేర నుద్భవింపఁ గలండని యిట్లనియె.** **63**

**ప్రతి :** అది= ఆ విరాట్స్వరూపమే; సకల+అవతారంబులకున్= అన్ని అవతారాలకు; మొదలి= మొట్టమొదటి; గని+ఐన= పుట్టుస్థానమైన గనికాగా; శ్రీమత్+నారాయణ దేవుని= ఆదినారాయణుని; విరాజమానంబు+అయిన= దేదీప్యమానమైన; దివ్యరూపంబు= సగుణరూపం; దానిన్= ఆ విగ్రహస్వరూపాన్ని; పరమయోగి+ఇంద్రులు= గొప్పవారైన భక్తవరేణ్యులు; దర్శింతురు= సందర్శిస్తారు; ఆ+పరమ+ఈశ్వరు= ఆ నారాయణుని; నాభికమలంబువలనన్= నాభిపద్మంనుంచి; సృష్టికర్తలలోనన్= సృజనకారకులైనవారిలో; శ్రేష్ఠుండు+ఐన= ఆద్యుడైన; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; ఉదయించెన్= ఉద్భవించాడు; అతని= ఆ విష్ణుదేవుని; అవయవస్థానంబులయందున్= అవయవ (ఏకదేశ) భాగముల నుండి; లోకవిస్తారంబులు= సకలజగాలు; కల్పింపన్+పడియెన్= ఆవిర్భవించాయి; *మొదలన్= మొదలు; ఆ+దేవుండు= ఆ విష్ణువు; కౌమార+ఆఖ్య+సర్గంబున్= కౌమారం అనే పేరుగల సృష్టిని; ఆశ్రయించి= స్వీకరించి; బ్రహ్మణ్యుండై= కేవలం ఆత్మదర్శనం చేసేవాడై; దుశ్చరంబు+ఐన= ఆచరించడానికి దుష్కరమైన; బ్రహ్మచర్యంబు= బ్రహ్మమునందు మాత్రమే చరించుదీక్షతో; చరియించెన్= ప్రవర్తించాడు; *రెండవమాఱు= రెండోసారి; జగత్+జననంబుకొఱకున్= లోకాలను సృష్టించడానికై; రసాతలగత+అయిన= రసాతలస్థమైన; భూమిన్= పుడమిని; ఎత్తుచున్= పైకెత్తుచు; యజ్ఞ+ఈశుండు+అయి= యజ్ఞాలకు ప్రభువై; వరాహదేహంబు= అవతార ప్రయోజనాన్ని ఉద్దేశించి అప్పటికప్పుడు సంకల్పించి ధరించిన దివ్యవరాహ శరీరాన్ని (కోరలు గల్గిన మహోన్నత భూవరాహదేహాన్ని); తాల్చెన్= ధరించాడు. *మూఁడవతోయంబునన్= మూడోసారి; నారదుండను= నారదుడను పేర; దేవ+ఋషియై= బ్రహ్మర్షియై; కర్మనిర్మోచకంబు+ఐన= కర్మబంధాలను తొలగించే; వైష్ణవతంత్రంబు= వైష్ణవధర్మాన్ని;

చేసెన్= వ్యాప్తి చేశాడు. *నాల్గవపరి= నాలుగోసారి; ధర్మభార్యాసర్గంబునందున్= ధర్మునియొక్క భార్యయైన మూర్తియందు ఉద్భవించి; నరనారాయణ+ అభిధానుండు+ఐ= నరనారాయణ స్వరూపుడై; దుష్కరంబు+ఐన= కఠోరమైన; తపంబు+చేసెన్= తపస్సు చేశాడు. *పంచమ+అవతారంబునన్= ఐదో అవతారంగా; కపిలుండు+అను= కపిలుడనే పేరుతో; సిద్ధ+ఈశుండు+ అయి= సమస్త సిద్ధులు తెలిసినవాడై; ఆసురి+అను= 'ఆసురి' అనబడే; బ్రాహ్మణునకున్= బ్రహ్మర్షికి; తత్త్వగ్రామనిర్ణయంబు+ కల= తత్త్వంయొక్క సమూహంతోగూడిన (24 తత్త్వాలు గల); సాంఖ్యంబున్= సాంఖ్యమనే యోగాన్ని; ఉపదేశించెన్= బోధించాడు. *ఆఱవశరీరంబునన్= ఆరో అవతారంలో; అనసూయాదేవియందున్= అనసూయ అనే మహాపతివ్రతకు; అత్రిమహామునికిన్= అత్రి అనే మహర్షికి; కుమారుండు+ఐ= పుత్రుడై (దత్తాత్రేయుడై); అలర్కునికిన్= అలర్కునకు; ప్రహ్లాదముఖ్యులకున్= ప్రహ్లాదుడు మున్నగువారికి; ఆత్మవిద్యన్= బ్రహ్మవిద్యను; తెలిపెన్= తెలియజేశాడు. *ఏడవవిగ్రహంబునన్= ఏడో అవతారంలో; ఆకూతియందున్= ఆకూతికి; రుచికిన్= రుచిప్రజాపతికి; యజ్ఞుండు+ అనన్= యజ్ఞుడనే పేరుతో; జన్మించి= పుట్టి; ప్రకాశమానుండు+ఐ= విరాజిల్లువాడై; యమ+ఆది+దేవతలన్+కూడి= యముదు మున్నగు దేవతలతో కలిసి; స్వాయంభువమన్వంతరంబున్= స్వాయంభువమన్వంతరాన్ని; రక్షించెన్= కాపాడాడు; *అష్టమమూర్తిని= ఎనిమిదో అవతారంలో; మేరుదేవియందున్= మేరుదేవికి; నాభికిన్= నాభికిని; జన్మించి= పుట్టి; ఉరుక్రముండు+అనన్= ఉరుక్రముడనే పేరుతో (ఋషభుదు); ప్రసిద్ధుండు+ఐ= వాసికెక్కి; విద్వత్+జనులకున్= ఆత్మవేత్తలకు; పరమహంసమార్గంబున్= పరమహంస పరివ్రాజకుల జీవన విధానాన్ని; ప్రకటించెన్= వెల్లడి చేశాడు. *తొమ్మిదవ జన్మంబునన్= తొమ్మిదో అవతారంలో; ఋషులచేతన్= మహర్షులచే; కోరంబడి= ప్రార్థించబడి; పృథుచక్రవర్తి+ఐ= పృథుమహారాజై ఆవిర్భవించి; భూమినిన్= భూదేవిని; ధేనువున్+చేసి= ఆవుగాజేసి; సమస్త వస్తువులన్= అన్ని ఓషధులను; పిదికెన్= పితికాడు. *చాక్షుషమన్వంతర= చాక్షుషమన్వంతరంలోని; సంప్లవంబునన్= జలప్రళయంలో; దశమంబు+అయిన= పదోదైన; మీనావతారంబున్+ఒంది= మత్స్యావతారం ధరించి; మహీరూపంబగునావన్= భూరూపంలోనున్న ఓడను; ఎక్కించి= అధిరోహింపజేసి; వైవస్వతమనువున్= ఏడవవాడైన వైవస్వతమనువును; ఉద్ధరించెన్= రక్షించాడు. *పదునొకండవమాఱు= పదకొండోసారి; సముద్రమథనకాలంబునన్= సాగరాన్ని చిలికే సమయంలో; కమఠ+ఆకృతిని= తాబేలు రూపంలో; మందర+అచలంబున్= మందరపర్వతాన్ని; తన= తనయొక్క; పృష్ఠ= వీపు అనే; కర్పరంబునన్= కపాలంపై; నేరుపరి+ఐ= సమర్థుడై; నిలిపెన్= ధరించాడు. *పంద్రెండవతనువునన్= పంద్రెండో అవతారంలో; ధన్వంతరి+అను= ధన్వంతరి అనే పేరుతో; సుర+అసుర= దేవతలచేత, రాక్షసులచేత; మథ్యమాన= చిలకబడ్డ; క్షీరపాథోధి= పాలకడలియొక్క; మధ్యభాగంబునన్= నడిమి భాగంనుండి; అమృతకలశహస్తుండు+ఐ= అమృత కలశం చేతిలో కలవాడై; వెడలెన్= సాక్షాత్కరించాడు. *పదుమూఁడవది+అయిన= పదమూడోదైన; మోహినీవేషంబునన్= 'మోహిని' అనే అవతారంలో; అసురులన్= రాక్షసులను; మోహితులన్+చేసి= వంచించి; సురలన్= దేవతలను; అమృత+ఆహారులన్= అమృత భోజనులను; కావించెన్= చేశాడు. *పదునాలుగవది+ఐన= పదునాల్గోదైన; నరసింహరూపంబునన్= నరసింహావతారంలో; కనకకశిపునిన్= హిరణ్యకశిపుని; సంహరించెన్= వధించాడు. *పదునేనవది+ఐన= పదిఐదవది అయిన; కపటవామన+ అవతారంబునన్= మాయావటుని రూపంలో; బలిని= బలిచక్రవర్తిని; పదత్రయంబున్= మూడడుగులను; యాచించి= అడిగి; మూఁడులోకంబులన్= ముజ్జగాలను; ఆక్రమించెన్= ఆక్రమించాడు. *పదునాఱవది+ఐన= పదునారోదైన; భార్గవరామ+ఆకృతినిన్= పరశురామావతారంలో; కుపితభావంబున్= కోపావేశాన్ని; తాల్చి= పూని; బ్రాహ్మణద్రోహులు+ అయిన= బ్రహ్మవేత్తలకు హాని కల్గించిన; రాజులన్= ప్రభువులను; ఇరువది+ఒక్క+మాఱు= ఇరవై ఒక్క పర్యాయాలు; వధియించి= చంపి; భూమిన్= ధరణిని; నిస్+క్షత్రంబు= క్షత్రియశూన్యం; కావించెన్= చేశాడు. *పదునేడవది+ఐన=

పదియేడోదైన; వ్యాసగాత్రంబునన్= వ్యాసావతారంలో; అల్పమతులు+అయిన= తక్కువబుద్ధి కలిగిన; పురుషులన్= మానవులపై; కరుణించి= దయచూపి; వేదవృక్షంబునకున్= వేదమనే చెట్టుకు; శాఖలన్= కొమ్మలుగా విభాగాలను; ఏర్పఱచెన్= ఏర్పాటు చేశాడు. *పదునెనిమిదవది+ఐన= పద్దెనిమిదో పర్యాయం; రామ+అభిధానంబునన్= రాముడనే పేరుతో; దేవకార్య+అర్థంబు= దేవతలకు మేలు చేయు పనికొరకు; రాజత్వంబున్+ ఒంది= క్షత్రియుడుగా అవతరించి; సముద్రనిగ్రహ+ఆది= సాగరబంధనం మున్నగు; పరాక్రమంబులు= వీరకృత్యాలు; ఆచరించెన్= కావించాడు (చేశాడు). *ఏక+ఊనవింశతి= పందొమ్మిదవది; వింశతితమంబులు+ఐన= ఇరవైయవదియైన; రామకృష్ణరూపంబులచేన్= బలరాముడు; శ్రీకృష్ణుడు అనే రూపాలతో; యదువంశంబునందున్= యాదవవంశంలో; సంభవించి= జన్మించి; విశ్వంభరాభారంబున్= భూభారాన్ని; నివారించెన్= నిరోధించాడు. *ఏకవింశతితమంబు+ఐన= ఇరవై ఒకటోదైన; బుద్ధనామధేయంబునన్= బుద్ధుడనే పేరుతో; కలియుగ+ఆది+అవసరంబునన్= కలియుగ ప్రారంభ సమయంలో; రాక్షస సమ్మోహనంబుకొఱకున్= దానవులను వంచించుటకై; మధ్యగయాప్రదేశంబునన్= మధ్యగయగా వాసికెక్కిన పుణ్యప్రదేశంలో; జినసుతుండు+అయి= జినపుత్రుడుగా; తేజరిల్లున్= విరాజిల్లుతాడు. *యుగసంధియందున్= కలియుగ సంధిసమయంలో (ఇరవై రెండో పర్యాయం); వసుంధరా+అధి+ఈశులు= భూమిని పాలించు పరిపాలకులు; చోరప్రాయులు+ఐ= తస్కరులతో సమానమైన వారై; సంచరింపన్= ప్రవర్తించగా; విష్ణుయశుండు+అను= విష్ణుయశుడనే పేరు కల్గిన; విప్రునికిన్= బ్రాహ్మణునకు; కల్కి+అను పేరన్= కల్కి అనే నామంతో; ఉద్భవింపన్+కలండు+అని అవతరిస్తాడని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఆ విరాట్స్వరూపమే అన్ని అవతారాలకు మొట్టమొదటిది. అదే అన్నింటికి మూలం. అది శ్రీమన్నారాయణుని దేదీప్యమానమైన సగుణరూపం. పరమయోగులైన వారికి మాత్రమే ఆ దివ్యస్వరూపం గోచరిస్తుంది. ఆ నారాయణుని నాభి పద్మంనుంచి సృష్టికారకులైన వారిలో శ్రేష్ఠుడైన బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. ఆ విష్ణుభగవానుని అవయవ ప్రదేశాలనుండి సకలలోకాలు కల్పించబడ్డాయి. మొట్టమొదట ఆ విష్ణుదేవుడు "కౌమారం" అనే పేరుగల సృష్టిని ఆశ్రయించాడు. కేవలం ఆత్మదర్శనం మాత్రమే చేసేవాడై, దుష్కరమైన బ్రహ్మచర్యాన్ని మాత్రమే ఆచరించే దీక్ష వహించాడు.

రెండోసారి లోకాలను సృష్టించడానికి అనువుగా రసాతలభాగంలో ఉండిపోయిన భూమిని పైకెత్తడానికి యజ్ఞవరాహావతారం ధరించాడు. మూడోపర్యాయం నారదుడనే పేరుతో బ్రహ్మర్షియై కర్మబంధాలను తొలగించే వైష్ణవ ధర్మాన్ని బోధించాడు. నాలుగోసారి ధర్ముని భార్యయైన మూర్తియందు నరనారాయణ రూపంలో అవతరించి దుష్కరమైన తపస్సు ఆచరించాడు.

ఐదో అవతారంలో కపిలుడనే పేరుతో ఉద్భవించి సమస్త సిద్ధులు తెలిసినవాడై 'ఆసురి' అనే బ్రహ్మర్షికి ఇరవై నాలుగు తత్త్వాలతో కూడిన సాంఖ్యయోగాన్ని ఉపదేశించాడు. ఆరో అవతారంలో అత్రికి అనసూయకు పుత్రుడై (దత్తాత్రేయుడై) అలర్కునకు, ప్రహ్లాదుడు మున్నగువారికి బ్రహ్మవిద్యను తెలియజేశాడు. ఏడో పర్యాయం ఆకూతికి, రుచి ప్రజాపతికి యజ్ఞుడై జన్మించి, యముడు మున్నగు దేవతలతో కలిసి స్వాయంభువ మన్వంతరాన్ని కాపాడాడు.

ఎనిమిదో అవతారంలో మేరుదేవికి నాభికి ఉరుక్రముడనే పేరుతో పుట్టి మిక్కిలి ప్రసిద్ధుడై ఆత్మవేత్తలకు పరమహంస పరివ్రాజకుల జీవన విధాన మెటువంటిదో తెలియజేశాడు. తొమ్మిదోసారి ఋషులచే కోరబడి పృథు చక్రవర్తిగా ఆవిర్భవించి భూదేవిని ఆవుగాచేసి ఓషధులనన్నింటిని పితికాడు. పదో పర్యాయం చాక్షుషమన్వంతరంలో మీనావతారం ధరించి భూమిరూపంలోనున్న ఓడలో ఎక్కించి వైవస్వతమనువును కాపాడాడు.

పదకొండోసారి సముద్రాన్ని చిలికే సమయంలో కూర్మావతారం ధరించి మందరపర్వతాన్ని తనవీపుపై నిలిపాడు. పండ్రెండో అవతారంలో సురాసురులచే చిలుకపడ్డ పాలకడలిలో 'ధన్వంతరి' అనే పేరుతో అమృత కలశాన్ని చేతదాల్చి సాక్షాత్కరించాడు. పదమూడోసారి జగన్మోహినియై, అసురులను వంచించి సురలకు అమృతం ఆహారంగా పంచిపెట్టాడు.

పదునాల్గోదైన నరసింహావతారంలో హిరణ్యకశిపుని సంహరించాడు. పదియేనవదైన వామనావతారంలో బలిచక్రవర్తిని మూడడుగులను యాచించి ముజ్జగాలు ఆక్రమించాడు. పదునారోసారి పరశురామావతారంలో ఆవేశం పొంది బ్రహ్మవేత్తలకు హాని కల్గించిన ప్రభువులను ఇరవై యొక్క పర్యాయాలు వధించి భూమిని క్షత్రియ శూన్యం కావించాడు.

పదియేడోసారి వ్యాసరూపంలో అవతరించి అల్పబుద్ధులైన మానవులపై దయచూపించి వేదవృక్షానికి శాఖోపశాఖలు కల్పించాడు. పద్దెనిమిదో పర్యాయం దేవకార్యార్థమై శ్రీరాముడనే పేరుతో క్షత్రియుడుగా అవతరించి 'సాగరబంధనం' మున్నగు సాహసకృత్యాలు ఆచరించాడు. పందొమ్మిది, ఇరవై అవతారాలలో బలరాముడు, శ్రీకృష్ణుడు అనే రూపాలతో యాదవవంశంలో జన్మించి భూభారాన్ని అరికట్టాడు.

ఇరవై ఒకటోసారి కలియుగ ప్రారంభసమయంలో బుద్ధుడనే పేరుతోపుట్టి దానవులను వంచించడానికై "మధ్యగయ" అనే పుణ్యప్రదేశంలో జినసుతుడుగా విరాజిల్లుతాడు. ఇరవై రెండో పర్యాయం కలియుగసంధిసమయంలో భూమిని పాలించే పరిపాలకులే తస్కరప్రాయులై సంచరిస్తూ ఉండగా విష్ణుయశుడనే బ్రాహ్మణోత్తమునకు 'కల్కి' అనే పేరుతో ఆవిర్భవించి అధర్మాన్ని నశింపజేసి కృతయుగ లక్షణాలను యథాతథంగా జరిగేటట్లుగా ఏర్పాటు చేస్తాడు. ఈ విధంగా భగవదవతార విశేషాలను వివరించి సూతుడు ఇంకా శౌనకాది మహామునులకు ఇలా వివరిస్తున్నాడు.

**మ. సరసిం బాసిన వేయుకాలువల యోజన్ విష్ణునందైన శ్రీ**
**కరనానాప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్**
**సురలున్ బ్రాహ్మణసంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్**
**హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లే; దా విష్ణుఁడౌ నేర్పడన్. 64**

**ప్రతి :** సరసిన్= చెరువును; పాసిన= విడిచిపెట్టిన, వదలిన; వేయు= వెయ్యి; కాలువల+ఓజన్= కాలువల విధంగా; విష్ణు+అందున్+ఐన= నారాయణునిద్వారా; శ్రీకర= శ్రేయస్సును కలిగించే; నానా= అనేకవిధాలుగా; ప్రకట= ప్రకటించబడ్డ; అవతారములు= అవతారాలు; అసంఖ్యాతంబులు= లెక్కలేనట్టివి; ఉర్వీ+ఈశులున్= ధరణీపతులును; (చక్రవర్తులును); సురలున్= దేవతలును; బ్రాహ్మణసంయమి+ఇంద్రులు= బ్రహ్మర్షులు; మహర్షులు= మహర్షులు; విష్ణు= విష్ణువుయొక్క; అంశ+అంశజుల్= అంశాంశలవల్ల పుట్టినవారే; బల+అనుజన్ముఁడు= బలరాముని సోదరుడైన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; హరి= విష్ణువే; ఎడ= భేదమనేది; లేదు= (కించిత్తు కూడ) లేదు; ఏర్పడన్= ముమ్మాటికీ స్పష్టంగా; ఆ+విష్ణుఁడు+ఔన్= ఆ శ్రీమహావిష్ణువే అగును.

**తా :** చెరువులోనున్న నీరు పెక్కు కాలువలరూపంగా ప్రవహించినట్లుగా, నారాయణుని ద్వారా ప్రపంచశ్రేయస్సును కలిగించేలా వ్యక్తమయ్యే అవతారాలు అనంతాలు. భూమిని పాలించే చక్రవర్తులు, దేవతలు, బ్రహ్మర్షులు, మహర్షులు అందరూ విష్ణువు అంశలవల్ల, కళాంశలవల్ల జన్మించినవారే. బలరాముని తమ్ముడైన శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీహరి అవతారమే. కృష్ణునకు, విష్ణునకు కించిద్భేదంకూడ లేదు.

**క. భగవంతుం డగు విష్ణుఁడు, జగముల కెవ్వేళ రాక్షసవ్యథ గలుగుం**
**దగ న వ్వేళలఁ దడయక, యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్. 65**

**ప్రతి :** భగవంతుండు+అగు= భగవానుడైన; విష్ణుఁడు= శ్రీమన్నారాయణుడు; జగములకున్= లోకాలకు; ఏ+వేళన్= ఏ సమయంలో; రాక్షసవ్యథ= రక్కసులబాధ; కలుగున్= చేకూరుతుందో; తగన్= తగినట్లుగా; ఆ+వేళలన్= ఆ సమయాలలో; తడయక= ఆలస్యం చేయక; యుగయుగమునన్= ప్రతియుగంలోను; పుట్టి= అవతరించి; ఉద్యత్+లీలన్= విరాజిల్లే లీలతో; కాచున్= రక్షిస్తాడు.

**తా :** ఏ సమయంలో లోకాలు రాక్షసబాధలచే చీకాకుపొందుతూ ఉంటాయో, ఆ సమయంలో భగవానుడైన శ్రీమన్నారాయణుడు ప్రతియుగంలోను లీలావతారంగా ఆవిర్భవించి కాపాడుతూ ఉంటాడు.

**ఆ. అతిరహస్యమైన హరిజన్మకథనంబు, మనుజుఁ డెవ్వఁడేని మాపు రేపుఁ**
**జాల భక్తితోడఁ జదివిన సంసార, దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు. 66**

**ప్రతి :** అతిరహస్యము+ఐన= సులభంగా తెలియరాని; హరిజన్మ కథనంబు= గోవిందుని అవతార గాథ; మనుజుఁడు= మానవుడు; ఎవ్వఁడు+ఏనిన్= ఎవడైనాసరే; మాపున్= సాయంకాలమున; రేపున్= ఉదయమున; చాల= ఎక్కువ; భక్తితోడన్= ప్రీతితో; చదివినన్= పఠిస్తే; సంసారదుఃఖరాశిన్= సంసార దుఃఖసముహాలను; పాసి= విడిచి; తొలఁగిపోవున్= దూరంగా ఉంటాడు.

**తా :** శ్రీమన్నారాయణుని అవతారగాథ ఎన్నో అంతరార్థాలతో విరాజిల్లుతూ ఉంటుంది. దానిని ఏ మానవుడైనా ఉదయం, సాయంకాలం మిక్కిలి శ్రద్ధతో భక్తితో పఠిస్తే చాలు, అతడు భవబంధాలకు లోనుగాక దూరంగా ఉంటాడు.

**వ. వినుం దరూపుండయి చిదాత్మకుండయి పరఁగు జీవునికిం బరమేశ్వరు మాయాగుణంబులైన మహదాదిరూపంబులచేత నాత్మస్థానంబుగా స్థూలశరీరంబు విరచితంబైన, గగనంబునందుఁ బవనాశ్రిత మేఘసమూహంబును, గాలియందుఁ బార్థివధూళిధూసరత్వంబును నే రీతి నా రీతి ద్రష్టయగు నాత్మయందు దృశ్యత్వంబు బుద్ధిమంతులు గాని వారిచేత నారోపింపంబడు. నీ స్థూలరూపంబు కంటె నదృష్ట గుణంబయి యశ్రుతంబైన వస్తువగుటంజేసి వ్యక్తంబు గాక సూక్ష్మంబై కరచరణాదులు లేక జీవునికి నొండొక రూపంబు విరచితంబై యుండు; సూక్ష్ముఁడయిన జీవునివలన నుత్క్రాంతి గమనాగమనంబులం బునర్జన్మంబు దోఁచు; నెప్పు డీ స్థూలసూక్ష్మరూపంబులు రెండు స్వరూప సమ్యగ్జ్ఞానంబునం బ్రతిషేధింపంబడు నపుడు నవిద్యం జేసి యాత్మను గల్పింపంబడు ననియుం దెలియు ననియు జీవుండు బ్రహ్మదర్శనంబున కధికారి యగు; దర్శనంబన జ్ఞానైక స్వరూపంబు విశారదుండైన యీశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనంబడుచున్న మాయ యుపరతయై యెప్పుడు దాన విద్యారూపంబునం బరిణతయగు నప్పుడు జీవోపాధి యయిన స్థూలసూక్ష్మరూపంబు దహించి జీవుండు కాష్ఠంబు లేక తేజరిల్లు వహ్ని చందంబునం దాన యుపరతుం డయి బ్రహ్మ స్వరూపంబునం బొంది పరమానందంబున విరాజమానుం డగు; నిట్లు తత్త్వజ్ఞులు సెప్పుదు రని సూతుం డిట్లనియె. 67**

**ప్రతి :** వినుండు= మహర్షులారా! సావధానంగా వినండి; అరూపుండు+అయి= రూపంలేనివాడై; చిత్+ఆత్మకుండు+ అయి= జ్ఞానమే స్వరూపంగా కలవాడై; పరఁగు= భాసిల్లే; జీవునికిన్= జీవునకు; పరమ+ఈశ్వరు= పరమాత్మయొక్క; మాయాగుణంబులు+ఐన= మాయవల్ల జనించిన గుణాలైన (వ్యక్తమయ్యే); మహత్+ఆదిరూపంబులచేతన్= మహత్తత్త్వం మున్నగు వాటివల్ల; ఆత్మస్థానంబుగాన్= ఆత్మకేంద్రబిందువుగా ఉండే; స్థూలశరీరంబు= స్థూలశరీరం; విరచితంబు+ఐనన్= ఏర్పడగా; గగనంబునందున్= ఆకాశంలో; పవన+ఆశ్రిత= గాలి ఆధారంగా ఉండే; మేఘసమూహంబును= మబ్బుదొంతరలును; గాలియందున్= వాయువులో; పార్థివధూళిధూసరత్వంబును= భూమికి సంబంధించి పైకి లేచే దుమ్ముయొక్క బూడిద రంగులో; ఏ రీతిన్= ఏ విధంగా కనిపిస్తుందో; ఆ రీతిన్= అదేవిధంగా; ద్రష్ట+అగు= సర్వదర్శియైన; ఆత్మ+అందున్= ఆత్మలో; దృశ్యత్వంబు= కార్యసమూహం; బుద్ధిమంతులు కానివారిచేతన్= ఆత్మదర్శనం చేయని వారిచే; ఆరోపింపన్+పడున్= కల్పింపబడుతుంది; ఈ స్థూలరూపంబుకంటెన్= ఈ కనబడుతున్న స్థూలశరీరంకన్న; అదృష్టగుణంబు+ అయి= కనబడని గుణాలు కలదై; అశ్రుతంబు+ఐన= వినిపించనిదైన; వస్తువు= వాస్తవస్థితితో; అగుటన్+చేసి= కూడినదవడంవల్ల; వ్యక్తంబు+కాక= కంటికి కనబడకుండా అవ్యక్తమై; సూక్ష్మంబు+ఐ= సూక్ష్మరూపంతో; కరచరణ+ ఆదులులేక= చేయి; కాలుమున్నగు అవయవాలు లేక; జీవునికిన్= జీవునికి; ఒండొకరూపంబు= మరోశరీరం; విరచితంబు+ ఐ+ఉండున్= ఏర్పడి ఉంది; సూక్ష్ముఁడు+అయిన= సూక్ష్మమైన; జీవునివలనన్= జీవాత్మవల్ల; ఉత్క్రాంతి= మరణానంతరం; గమన+ఆగమనంబులన్= రాకపోకలచే; పునర్జన్మంబు= మళ్లీ జన్మించడం; తోఁచున్= కనబడుతోంది; ఎప్పుడు= ఏ సమయంలో; ఈ స్థూలసూక్ష్మరూపంబులురెండున్= స్థూలదేహం; సూక్ష్మదేహం అనే రెండునూ కూడా; స్వరూప= స్వస్వరూపజ్ఞానంచేత; సమ్యక్+జ్ఞానంబునన్= సరి అయిన జ్ఞానంచేత; ప్రతిషేధింపన్+పడున్= తొలగింపబడతాయో; అపుడు= ఆ సమయంలో; అవిద్యన్+చేసి= మాయవల్ల; ఆత్మను= ఆత్మలో; కల్పింపన్+పడును= ఇదంతా ఆరోపింపబడుతోంది; అనియున్= అని; తెలియును= తెలుస్తుంది; అనియున్= అని తెలిసినంతనే; జీవుండు= జీవుడు; బ్రహ్మదర్శనంబునకున్= ఆత్మదర్శనానికి; అధికారి+అగున్= యోగ్యుడవుతాడు; దర్శనంబు+అనన్= ఆత్మను చూచుట అంటే; జ్ఞాన+ఏక+ స్వరూపంబు= జ్ఞానస్వరూపమే; విశారదుండు+ఐన= విశేషజ్ఞానం కలిగిన (సర్వజ్ఞుడైన); ఈశ్వరునిది+ఐ= పరమాత్మ సంబంధమైన అధీనంలో; క్రీడించుచున్= క్రీడిస్తూ; అవిద్య= అజ్ఞానం; అనంబడుచున్న= అనబడే; మాయ= మాయావిలాసం; ఉపరత+ఐ= ఉపశమించినదై; తాను+అ= తానే; ఎప్పుడు= ఎపుడు; విద్యారూపంబునన్= జ్ఞానస్వరూపంగా; పరిణత+అగున్= మారిపోయినదగునో; అప్పుడు= అపుడు; జీవ+ఉపాధి+అయిన= జీవాత్మదేహం ధరించడానికి హేతువులైన; స్థూలసూక్ష్మరూపంబు= స్థూలరూపం, సూక్ష్మరూపం; దహించి= దగ్ధంచేసి; జీవుండు= జీవుడు; కాష్ఠంబులేక= కట్టె లేకుండానే; తేజరిల్లు= ప్రకాశించే; వహ్నిచందంబునన్= అగ్నివిధంగా; తాను+అ= తానే; ఉపరతుండు+అయి= దేహం (జన్మ) లేకుండా; బ్రహ్మస్వరూపంబునన్+పొంది= పరమాత్మ స్వరూపాన్ని పొంది; పరమ+ఆనందంబునన్= అద్వైతానందంతో; విరాజమానుండు+అగున్= విరాజిల్లుతాడు; ఇట్లు= ఈ విధంగా; తత్త్వజ్ఞులు= తత్త్వవేత్తలు; చెప్పుదురు= వచిస్తారు; అని= అంటూ; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అంటున్నాడు.

**తా :** మహర్షులారా! సావధానంగా వినండి. వాస్తవానికి జీవుడు రూపంలేక జ్ఞానమే స్వరూపంగా కలవాడు. అయినప్పటికి పరమాత్మయొక్క మాయవల్ల జనించే మహత్తత్త్వం మున్నగు వాటివల్ల ఆత్మ కేంద్రబిందువుగా ఉండే స్థూలశరీరం జీవునికి కల్పించబడుతోంది. ఆకాశంలో గాలి ఆధారంగా ఉండే మబ్బులు, వాయువువల్ల భూమికి సంబంధించి పైకిలేచే దుమ్ముయొక్క బూడిదరంగుతో కన్పించినట్లుగా, సర్వదర్శియైన ఆత్మలో నానాదృశ్యాలు ఆత్మదర్శనం చేయని వారిచే కల్పించబడుతున్నాయి. జీవునికి ఈ కనబడుతున్న స్థూలశరీరంకన్న సూక్ష్మశరీరం వేరొకటి ఉంది. అది కనబడని గుణాలు కలదై ఉంటుంది. అది

వినబడేది కాదు. అది నిత్యం వాస్తవస్థితిలో ఉంటుంది. అది కంటికి కనబడక అవ్యక్తమై సూక్ష్మరూపంతో కాలు, చేయి మున్నగు అవయవాలు లేక మరో శరీరంతో ఉంటుంది. ఆ సూక్ష్మశరీరం వల్లనే మరణానంతరం జీవునికి రాకపోకలతో పునర్జన్మ కనబడుతోంది.

ఎప్పుడయితే స్వరూపజ్ఞానం, సమ్యగ్‌జ్ఞానం జీవునకు కలుగుతాయో అప్పుడు స్థూలదేహం, సూక్ష్మదేహం కూడా తొలగిపోతాయి. ఆ సమయంలో మాయవల్ల ఆత్మలో ఈ సంసారమంతా కల్పించబడుతోందని తెలుస్తుంది. అలా తెలిసిన వెంటనే జీవుడు బ్రహ్మ సందర్శనానికి యోగ్యుడవుతాడు. ఆత్మదర్శనం అంటే సమ్యగ్దర్శనమే.

సర్వజ్ఞుడైన ఈశ్వరుని అధీనంలో మాయ ఎప్పుడూ క్రీడిస్తూ ఉంటుంది. ఆ అవిద్య (మాయ) ఉపశమించి తానే విద్యారూపంగా మారిపోయే సమయంలో జీవోపాధి ధరించడానికి హేతువులైన స్థూల సూక్ష్మరూపాలు రెండూ దగ్ధమైపోతాయి. అపుడు జీవుడు కాష్ఠం లేకుండా ప్రకాశించే అగ్నివలె అవుతాడు. తాను దేహం లేకుండా పరమాత్మ స్వరూపాన్నిపొంది అద్వైతానందంతో విరాజిల్లుతాడు. ఈ విధంగా తత్త్వవేత్తలు వచిస్తారని చెబుతూ సూతమహర్షి ఇలా అంటున్నాడు.

**చ. జననము లేక కర్మముల జాడలఁ బోక సమస్తచిత్త వ**
**ర్తనుఁ డగు చక్రికిం గవు లుదారపదంబుల జన్మకర్మముల్**
**వినుతులు సేయుచుండుదురు; వేదరహస్యములందు నెందుఁ జూ**
**చిన మఱి లేవు జీవునికిఁ జెప్పిన కైవడి జన్మకర్మముల్. 68**

**ప్రతి :** జననములేక= పుట్టుక అనేదిలేక; కర్మముల= కర్మలనే; జాడలన్= త్రోవల వెంటకూడా; పోక= వెళ్లకుండా; సమస్త= సకలచరాచర జగత్తుయొక్క; చిత్త= భావాలలో; వర్తనుఁడగు= ప్రవర్తించే; చక్రికిన్= భగవంతునకు (చక్రం కల్గినవానికి); కవులు= వర్ణనాసక్తచిత్తులు; ఉదారపదంబులన్= బ్రహ్మద్యోతకార్థాలైన శబ్దాలచే; జన్మకర్మముల్= అవతారాలు; తత్కృతధర్మాలు; వినుతులు= విశేషస్తుతులుగా; చేయుచుండుదురు= కల్పిస్తూ ఉంటారు; వేదరహస్యములందున్= ఉపనిషద్వాక్యాలలో; ఎందున్= ఎక్కడ; చూచినన్= పరిశీలించినా; జీవునికిన్= జీవునికి; జన్మకర్మముల్= జన్మ, కర్మ; చెప్పిన= ఉన్నాయని వచించిన; కైవడిన్= విధంగా; మఱి= భగవంతునికిమాత్రం; లేవు= ఉండవు.

**తా :** భగవంతునికి పుట్టుక అనేదే లేదు. జన్మ అనేదే లేదంటే కర్మప్రసక్తి మాత్రం ఎలా ఉంటుంది? అయినా సత్కవులు బ్రహ్మను తెలిపే పదజాలంతోనే పరాత్పరునికి జన్మకర్మలు కల్పించి స్తోత్రం చేస్తూ ఉంటారు. వేదాల్లో ఎక్కడచూచినా, జీవునికివలె కర్మ జన్మలు ఉన్నట్లుగా పరమాత్మకు చెప్పబడలేదు.

**మ. భువనశ్రేణి నమోఘలీలుఁ డగుచుం బుట్టించు రక్షించు నం**
**తవిధిం జేయు, మునుంగఁ డందు; బహుభూతవ్రాతమం దాత్మ తం**
**త్రవిహారస్థితుఁడై షడింద్రియ సమస్త ప్రీతియున్ దవ్వులన్**
**దివిభంగిం గొనుఁ; జిక్కఁ డింద్రియములం ద్రిప్పున్ నిబంధించుచున్. 69**

**ప్రతి :** భువనశ్రేణిన్= జగముల సమూహాన్ని; అమోఘ= వ్యర్థంకాని; లీలుఁడు+అగుచున్= విలాసం కలవాడై; పుట్టించున్= కల్పిస్తాడు; రక్షించున్= కాపాడుతాడు; అంతవిధిన్+చేయున్= అంతం – నాశనం – చేసే పనినికూడ చేస్తాడు; అందున్= ఈ క్రియలందు; మునుంగఁడు= నిమగ్నుడుకాడు; బహుభూతవ్రాతమందున్= నానాప్రాణి సమూహాలలో; ఆత్మతంత్ర=

అంతర్యామిరూపంలో; విహారస్థితుఁడు+ఐ= విహరించే స్థితి కలవాడై; షట్+ఇంద్రియ= ఆరింద్రియాలకు; సమస్తప్రీతియున్= మిక్కిలి సుఖాన్ని; దవ్వులన్= దూరాననున్న; దివిభంగిన్= స్వర్గంలాగా; కొనున్= అనుభవిస్తాడు; చిక్కఁడు= వాటికి చిక్కేవాడు కాదు; ఇంద్రియములన్= ఇంద్రియాలనన్నింటిని; నిబంధించుచున్= నియంత్రిస్తూ; త్రిప్పున్= ప్రవర్తింపజేస్తాడు.

**తా :** భగవంతుడు సమస్త లోకాలను సార్థక లీలావిలాసంగా సృష్టిస్తాడు. రక్షిస్తాడు. లయం చేస్తాడు. కాని తాను మాత్రం వాటియందు నిమగ్నుడు కాదు. అనేక ప్రాణికోటులలో అంతర్యామి రూపంలో విహారం చేస్తూ ఉంటాడు. ఇంద్రియ సమూహానికి ప్రీతి కలిగిస్తాడు. స్వర్గం దూరంగా ఉన్నా, దగ్గరగా ఉన్నట్లే భావించి ఆనందించేవిధంగా, ఇంద్రియాలకు దూరంగా ఉంటూ ప్రయోజనాన్ని సంతరిస్తాడు. ఒక్కొక్కప్పుడు ఇంద్రియాలను స్వీయవిషయాలపై ప్రవర్తింపజేస్తూ, ఆ వెనువెంటనే నియంత్రిస్తూ, ఇష్టం వచ్చినట్లు వాటిని తిప్పుతూ ఉంటాడు.

**చ. జగదధినాథుఁడైన హరి సంతతలీలలు నామరూపముల్**
**దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంత గల్గినన్**
**మిగిలి కుతర్కవాది దగ మేరలు సేసి యెఱుంగ నేర్చునే ?**
**యగణిత నర్తనక్రమము నజ్ఞుఁ డెఱింగి నుతింప నోపునే? 70**

**ప్రతి :** జగత్= ప్రపంచానికి; అధినాథుఁడు+ఐన= ప్రభువైన; హరి= విష్ణువుయొక్క; సంతతలీలలు= అనంత క్రీడావిలాసాలు; నామరూపముల్= పేర్లు, ఆకారాలు; తగిలి= ప్రయత్నించి; మనస్+వచస్‌గతులన్= మనోగతిచేగాని, వచనక్రియచేగాని; తార్కికచాతురి= ఊహాచాతుర్యం; ఎంత+కల్గినన్= ఎంత ఉన్నప్పటికిని; మిగిలి= అతిశయించి; కుతర్కవాది= వితర్కం చేసేవాడు; తగన్= ఒప్పునట్లుగా; మేరలు+చేసి= హద్దులేర్పరచి; ఎఱుంగన్+నేర్చునే= గ్రహించడానికి వీలవుతుందా?; న+గణిత= లెక్కించ శక్యంకాని; నర్తనక్రమమున్= నాట్యవిలాసాలను; అజ్ఞుఁడు= తద్రహస్యాలను తెలియనివాడు; ఎఱింగి= తెలుసుకొని; నుతింపన్+ఓపునే= స్తుతి చేయడానికి సమర్థుడవుతాడా?

**తా :** లోకేశ్వరుడైన శ్రీహరి క్రీడావిలాసాలు, నామరూపాలు అనంతాలు. వాటిని మనస్సు గ్రహించలేదు. వాక్కు స్తుతి చేయలేదు. ఎంత ఊహానైపుణ్యంతో, కుతర్కం చేసేవాడైనా ఆ పరమాత్మ క్రియాకలాపాలకు అవధిని ఏర్పాటు చేయలేడు. కళాభిజ్ఞుడు కానివాడు నాట్యంలోని అందచందాలను గ్రహించి అభినందించలేనట్లే, అజ్ఞుడైనవాడు సర్వజ్ఞుని లీలావిలాసాలను గ్రహించలేడు.

**ఉ. ఇంచుక మాయ లేక మది నెప్పుడుఁ బాయని భక్తితోడ వ**
**ర్తించుచు నెవ్వఁడేని హరి దివ్యపదాంబుజగంధరాశి సే**
**వించు నతం డెఱుంగు నరవిందభవాదులకైన దుర్లభో**
**దంచితమైన యా హరి యుదారమహాద్భుత కర్మమార్గముల్. 71**

**ప్రతి :** ఇంచుక= కొంచెమైనను; మాయలేక= వంచనలేక (అశ్రద్ధలేక); మదిన్= మనస్సులో; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; పాయని= విడువని; భక్తితోడన్= సేవారక్తితో; వర్తించుచున్= ప్రవర్తిస్తూ; ఎవ్వఁడేనిన్= ఎవడైనప్పటికి; హరి= విష్ణువుయొక్క; దివ్య= పవిత్రమైన; పద+అంబుజ= పద్మములవంటి పాదాలయొక్క; గంధరాశిన్= సుగంధ సమూహాన్ని; సేవించు+అతండు= ఆఘ్రాణిస్తాడో ఆ వ్యక్తిమాత్రమే; అరవిందభవ+ఆదులకున్+ఐనన్= బ్రహ్మాదులకు సహితం; దుర్లభ= అందుకో శక్యం

కాకుండా ఉండే; ఉదంచితము+ఐన= ఎక్కువగా ప్రకాశించే; ఆ+హరి= ఆ గోవిందునియొక్క; ఉదార= గొప్పవైన; మహా+అద్భుత= మిక్కిలి ఆశ్చర్యకరములైన; కర్మమార్గముల్= లీలాకృత్యాలను; ఎఱుంగున్= తెలుసుకొంటాడు.

**తా :** ఏ భక్తుడు ఇంచుకైనా వంచనలేకుండా, మనస్సులో నిరంతరం ప్రీతి కలిగి నారాయణుని పాదపద్మాల సుగంధాన్ని సేవిస్తాడో, అతడు మాత్రమే బ్రహ్మాదులకు కూడా గ్రహింప శక్యంకాని అత్యద్భుతాలైన హరి కర్మలీలలను తెలుసుకోగలుగుతాడు.

**మ. హరిపాదద్వయభక్తి మీ వలన నిట్లారూఢమై యుండునే**
**తిరుగం బాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్**
**ధరణీదేవతలార! మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్**
**హరిచింతన్ మిముఁ జెంద వెన్నఁడును జన్మాంతర్వ్యథాయోగముల్. 72**

**ప్రతి :** ధరణీదేవతలార!= భూమికి దేవతలైన బ్రాహ్మణులారా!; హరిపాదద్వయభక్తి= శ్రీహరియొక్క పాదద్వంద్వంపై సేవాసక్తి; మీవలనన్= మీద్వారా; ఇట్లు= ఈ విధంగా; ఆరూఢము+ఐ= మిక్కిలి నిష్ఠగలదై; ఉండునే= ఉంటుంది కదా!; మీలోపలన్= మీయందు; హరిపైన్= విష్ణువుపై; చిత్తవృత్తి= మానసిక ప్రవృత్తి; దీపించి= ప్రకాశించి; తిరుగన్+పాఱదు= మళ్లించడానికి శక్యంకాదు; మీరలు= మీరు; మహాధన్యుల్= గొప్పధన్యాత్ములు; సమస్తజ్ఞులున్= సర్వం తెలిసినవారు; హరిచింతన్= నారాయణ స్మరణంచే; జన్మాంతర్వ్యథాయోగముల్= చావు పుట్టుకలయొక్క బాధాకృత్యాలు; ఎన్నఁడున్= ఎప్పటికీకూడా; మిమున్= మిమ్ములను; చెందవు= చేరరావు.

**తా :** భూసురోత్తములారా! శ్రీహరి పాదద్వంద్వంపై మీకు కలిగిన భక్తి అచంచలమైనది. మిక్కిలి నిష్ఠతో కూడుకొన్నట్టిది. మీ మనఃప్రవృత్తి ఆయనయందే ఎడబాటు లేకుండా విరాజిల్లుతూ ఉంటుంది. మీరు ధన్యాత్ములు. సర్వం తెలిసినవారు. నారాయణస్మరణప్రభావంవల్ల చావుపుట్టుకల బాధలు ఎప్పుడూ మిమ్ములను సమీపించలేవు.

**సీ. పుణ్యకీర్తనుఁడైన భువనేశుచరితంబు బ్రహ్మతుల్యంబైన భాగవతము**
**సకలపురాణరాజము దొల్లి లోకభద్రముగ ధన్యముగ మోదముగఁ బ్రీతి**
**భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి శుకుఁ డనియెడు తన సుతునిచేతఁ**
**జదివించె నింతయు సకలవేదేతిహాసములలోపల నెల్ల సారమైన**

**ఆ. యీ పురాణ మెల్ల నెలమి నా శుకయోగి, గంగ నడుమ నిల్చి ఘనవిరక్తి**
**యొదవి మునులతోడ నుపవిష్టుఁడగు పరీ, క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పె వినుఁడు. 73**

**ప్రతి :** పుణ్యకీర్తనుఁడు+ఐన= (పవిత్రుడైన కారణంగా) పవిత్రులచే కీర్తించబడేవాడైన (పవిత్ర కీర్తనం కలవాడైన); భువన+ఈశు= లోకాధినాథుని; చరితంబు= చరిత్రమే; బ్రహ్మతుల్యంబు+ఐన= వేదంతో సమానమైన; భాగవతము= భాగవతమనే మహాగ్రంథం; సకలపురాణరాజము= సమస్త పురాణాలలోను శ్రేష్ఠమైనది; తొల్లి= పూర్వం; లోకభద్రముగన్= విశ్వకల్యాణం కొరకై; ధన్యముగన్= సంపత్కారకంగా; మోదముగన్= సంతోషదాయకంగా; ప్రీతిన్= భక్తితో (ఆసక్తితో); భగవంతుఁడు+అగు= భగవానుఁడైన; వ్యాసభట్టారకుఁడు= వ్యాసమహర్షి; ఒనర్చి= కావించి; శుకుఁడు= శుకమహర్షి; అనియెడు= అనబడే; తన సుతునిచేతన్= తన కుమారునిచే; ఇంతయున్= దీనినంతా; చదివించెన్= పఠింపజేశాడు; సకలవేద+ఇతిహాసములలోపలన్= సమస్తములైన వేదాలలో, ఇతిహాసాలలో; ఎల్లన్= అంతటా; సారము+ఐన=

సారభూతమైన; ఈ పురాణము+ఎల్లన్= ఈ భాగవత పురాణాన్ని అంతా; ఎలమిన్= కూర్మితో; ఆ శుకయోగి= ఆ శుకముని; గంగనడుమన్= గంగానది మధ్యలో; నిల్చి= ఉండి; ఘనవిరక్తి= మిక్కిలి వైరాగ్యం; ఒదవి= కలిగి; మునులతోడన్= మునిబృందంతో; ఉపవిష్టుఁడు+అగు= కూర్చున్న; పరీక్షిత్+నర+ఇంద్రుఁడు= పరీక్షిన్మహారాజు; అడుగన్= ప్రశ్నించగా; చెప్పెన్= ప్రవచనం చేశాడు; వినుఁడు= మునులారా! సావధానంగా వినండి.

**తా :** భాగవతమంటే పుణ్యకీర్తనుడైన జగదీశ్వరుని దివ్యచరిత్రం. ఇది పరబ్రహ్మకు ప్రతిరూపమైనట్టిది. సర్వపురాణాలలోను శ్రేష్ఠమైనట్టిది. దీనిని పూర్వం విశ్వకల్యాణార్థమై భగవంతుండైన వ్యాసమహర్షి అత్యంత పవిత్రంగా, ఆనందమయంగా, అనురాగపూర్వకంగా విరచించాడు. దీనినంతా తన కుమారుడైన శ్రీశుకునిచే పఠింపజేశాడు. ఈ భాగవతం సమస్త వేదాలసారం. సకల పురాణాల సారాంశం. గంగానదీమధ్యభాగంలో సంసారవిరక్తుడై, సకలమునిగణసమేతుడై, ప్రాయోపవిష్టుడైన పరీక్షిన్మహారాజు ప్రశ్నించగా, ఆ శుకమహర్షి దీన్ని ప్రవచించడం జరిగింది. మునీంద్రులారా! సావధానంగా వినండి.

**విశే :** 'గంగ నడుమ' అనగా లక్షణావృత్తిచే గంగాతీరంలో అని అర్థం. 'గంగాయాంఘోషః' – అనుచోట గంగయందు గొల్లపల్లె ఉండడం అసంభవం కాబట్టి, లాక్షణిక వృత్తిద్వారా 'గంగాతీరమందున్న గొల్లపల్లె' అని భావమని ఆలంకారికుల వచనం.

**వ. కృష్ణుఁడు ధర్మజ్ఞానాదులతోడం దనలోకంబునకుఁ జనిన పిమ్మటం గలికాలదోషాంధకారంబున నష్టదర్శనులైన జనులకు నిప్పు డిప్పురాణంబు కమలబంధుని భంగి నున్నది. నాఁ డందు భూరితేజుండయి కీర్తించుచున్న విప్రర్షివలన నేఁ బఠించిన క్రమంబున నా మదికి గోచరించినంతయు వినిపించెద ననిన సూతునకు మునివరుండయిన శౌనకుం డిట్లనియె. 74**

**ప్రతి :** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ధర్మజ్ఞానాదులతోడన్= ధర్మము, జ్ఞానము మున్నగువాటితో కూడుకొని; తనలోకంబునకున్= ఆత్మపదానికి; చనినపిమ్మటన్= వెళ్లిపోయిన తరువాత; కలికాలదోష+అంధకారంబునన్= కలిసమయసంబంధమైన పాపమనే చీకటివల్ల; నష్టదర్శనులు+ఐన= పోయిన చూపుకలవారైన; జనులకున్= ప్రజలకు; ఇప్పుడు= ఈ సమయంలో; ఈ+పురాణంబు= ఈ భాగవతపురాణం; కమలబంధుని= తామరలకు హితుడైన సూర్యుని; భంగిన్= వలె; ఉన్నది= వెలుగులు నింపుతోంది; నాఁడు= ఆనాడు; అందున్= ఆ సమయంలో గంగాతీరంలో; భూరి= గొప్ప; తేజుండు+అయి= బ్రహ్మతేజస్సు కలవాడై; కీర్తించుచున్న= గానం చేయుచున్న; విప్ర+ఋషివలనన్= బ్రహ్మర్షియైన శుకునివల్ల; నేన్= నేను; పఠించిన= ఆకళింపు చేసుకొన్న; క్రమంబునన్= పద్ధతిలో; నామదికిన్= నా మనస్సుకు; గోచరించిన(ది)= స్ఫురించినంత మేరకు; అంతయున్= సర్వమూ; వినిపించెదన్= వినిపిస్తాను; అనిన= అన్న; సూతునకున్= సూతమహర్షికి; మునివరుండు+అయిన= ఋషిశ్రేష్ఠుడైన; శౌనకుండు= శునకపుత్రుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ధర్మజ్ఞానసమేతుడై శ్రీకృష్ణుడు ఆత్మపదానికి వెళ్లిపోయాడు. కలిప్రవేశంతో పాపమనే చీకటిలో కూరుకుపోయి జనులంతా అంధులైపోయారు. అట్టివారికి ఈ భాగవతం సూర్యునిలా ప్రకాశించి వెలుగులను నింపింది. ఆనాడు బ్రహ్మతేజస్సుతో విరాజిల్లుతూ శుకుడు ఈ భాగవతాన్ని కీర్తనం చేశాడు. ఆ సమయంలో నేను ఆకళింపు చేసుకొన్నదానిని స్ఫురించినంతమేరకు క్రమంగా మీకు వినిపిస్తాను అని సూతమహర్షి పలికిన వెంటనే మునిశ్రేష్ఠుడైన శౌనకుడు ఇలా అన్నాడు.

**విశే :** కర్మయోగులు అవలంబించే నానావిధ క్రియారూపమైనది ధర్మం. మహాత్ములు అనుష్ఠించే స్వస్వరూపానుసంధానరూపం జ్ఞానం.

**శా. సూతా! యే యుగవేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠు నే**
**శ్రోతల్ గోరిరి? యేమి హేతువునకై, శోధించి లోకైక వి**
**ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్ను భాగవతముం గల్పించెఁ? దత్పుత్త్రుఁ డే**
**ప్రీతిన్ రాజున కీ పురాణకథఁ జెప్పెం? జెప్పవే యంతయున్. 75**

**ప్రతి :** సూతా!= సూతమహర్షీ!; ఏ యుగవేళన్= ఏ యుగసమయంలో; ఏమిటికిన్= ఏ కారణంచే; ఏ+చోటన్= ఏ ప్రదేశంలో; మునిశ్రేష్ఠున్= యోగీశ్వరుడైన శుకుని; ఏ శ్రోతల్= ఎవరు శ్రోతలుగా ఉంటూ; కోరిరి= ప్రార్థించారు?; ఏమి హేతువునకున్+ఐ= ఏ నిమిత్తంగా; శోధించి= పరిశీలనచేసి; లోక+ఏకవిఖ్యాతిన్= విశ్వప్రసిద్ధితో; వ్యాసుఁడు= కృష్ణద్వైపాయనుడు; మున్ను= పూర్వం; భాగవతమున్= ఈ భాగవతాన్ని; కల్పించెన్= రచించాడు?; తత్పుత్త్రుఁడు= ఆ వ్యాసుని కొడుకైన శుకుడు; ఏ ప్రీతిన్= ఏ ఆసక్తితో; రాజునకున్= పరీక్షిత్తుకు; ఈ పురాణకథన్= ఈ భక్తిప్రధానమైన పురాణాన్ని; చెప్పెన్?= వచించాడు?; అంతయున్= అంతా; చెప్పవు+ఏ= వివపింపవయ్యా!

**తా :** సూతమునీంద్రా! ఏ యుగవేళలో, ఏ ఉద్దేశంతో, ఏ ప్రదేశంలో, ఈ భాగవతాన్ని వినిపించుమని ఏ శ్రోతలు శుకమహాయోగిని కోరారు. ఏ కారణంచే వ్యాసభగవానుడు బాగా పరిశోధించి లోకవిఖ్యాతంగా పూర్వం దీన్ని రచించాడు? ఆయన కుమారుడైన శుకుడు ఎటువంటి ఆదరంతో పరీక్షిన్మహారాజునకు ఈ భాగవత కథ వినిపించాడు? దానినంతా మాకు సవిస్తరంగా వివరించి వినిపించు.

**వ. బుధేంద్రా! వ్యాసపుత్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుం డేకాంతమతి మాయాశయ నంబువలనం దెలిసిన వాఁడు గూఢుండు మూఢుని క్రియ నుండు నిరస్తఖేదుం డదియునుం గాక. 76**

**ప్రతి :** బుధ+ఇంద్రా!= పండితోత్తమా!; వ్యాసపుత్రుండు+ఐన= వ్యాసుని సుతుడైన; శుకుండు+అను= శుకుడనే; మహాయోగి= మౌనివర్యుడు; సమదర్శనుండు= సమస్తప్రాణులను సమదృష్టితో వీక్షించేవాడు; ఏకాంతమతి= ఒంటరిగా ఉండుటయందే బుద్ధికలవాడు; మాయాశయనంబువలనన్= మాయ అనే నిద్రనుండి; తెలిసినవాఁడు= మేల్కొన్నవాడు; గూఢుండు= ఎవరికీ వ్యక్తంకాని తత్త్వం కలవాడు; మూఢునిక్రియన్= అజ్ఞానిలాగా; ఉండున్= ప్రవర్తించేవాడు; నిరస్తఖేదుండు= తొలగింపబడ్డ దుఃఖాలు కలవాడు; అదియున్+కాక= అంతేకాక.

**తా :** పండితశేఖరా! వ్యాసతనూజుడైన శుకుడనువాడు మహాయోగి. సమదర్శి. బ్రహ్మజ్ఞుడు. మాయాతీతుడు. గూఢవర్తనుడు. జ్ఞానశూన్యునిలా వ్యవహరించేవాడు. దూరంగా విసరివేయబడ్డ సంసారదుఃఖం కలవాడు. సంసార క్లేశాలకు దూరంగా ఉండేవాడు. అంతేకాదు.

**తరల. శుకుఁడు గోఁచియు లేక పైఁ జనఁ జూచి తోయములందు ల**
**జ్జకుఁ జలింపక చీర లొల్లక చల్లులాడెడి దేవ క**
**న్యకలు హా శుక, యంచు వెన్కఁ జనంగ వ్యాసునిఁ జూచి యం!**
**శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ! 77**

**ప్రతి :** ధీనిధీ= బుద్ధికి నిధియైనవాడా!; శుకుఁడు= శుకపరబ్రహ్మము; గోఁచియున్= గోఁచికూడ; లేక= లేకుండా (ధరించక); పైన్= అటుగుండా; చనన్+చూచి= వెళ్లడంచూచి; తోయములందున్= జలాలలో; లజ్జకున్= సిగ్గుతో; చలింపక= కదలకుండా; చీరలు+ఒల్లక= బట్టలు ధరించకుండా; చల్లులు+ఆడెడి= జలక్రీడలాడే; దేవకన్యకలు= దేవకాంతలు; హాశుక!= ఓ శుకా!; అంచున్= అంటూ; వెన్కన్+చనంగన్= వెంబడించివచ్చే, వ్యాసునిన్= తండ్రియైన కృష్ణద్వైపాయనుని; చూచి= వీక్షించి; అందఱున్= ఆ దేవతాస్త్రీలందరూ; అంశుకములన్= వస్త్రాలను; ధరియించి= తాల్చి; సిగ్గునన్= లజ్జతో; స్రుక్కిరి= కుంచించుకపోయారు.

**తా :** ధీమంతుడా! ఒకనాడు దేవకాంతలు జలకాలాడుతున్నారు. దిగంబరుడై ఆ దారిగుండా శుకుడు వెళ్లడం వారు చూచారు. అయినా వారు ఏమాత్రం చలించలేదు. కదలలేదు. సిగ్గుపడలేదు. ఒడ్డుకు వచ్చి వస్త్రాలు ధరించలేదు. కాని ఇంతలో కొడుకు వెనుక “ఓ శుకా!” అని అరుస్తూ వస్తున్న వ్యాసులవారిని కూడ చూచారు. ఆయనను చూడడంతోనే ఆ దేవకాంతలు సిగ్గుతో కుంచించుకుపోయారు. గబగబా గట్టుకుచేరి వస్త్రాలు ధరించారు. ఇది ఎంత విచిత్రమో కదా!

**వ. మఱియు నగ్నుండుఁ దరుణుండునై చను తన కొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక వస్త్రధారియు వృద్ధుండును నైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు కారణం బడిగిన వారలు నీ పుత్త్రుండు స్త్రీపురుషులనెడు భేద దృష్టి లేక యుండు; మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు నతనికి మహాంతరంబు గలదని; రట్టి శుకుండు కురుజాంగలదేశంబులు సొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుండయ్యె? మఱియు నున్మత్తుని క్రియ, మూఁగతెఱంగున, జడుని భంగి నుండు న మ్మహాయోగికి రాజర్షి యైన పరీక్షిన్మహారాజుతోడ సంవాదం బెట్లు సిద్ధించె? కథనీయం బయిన శ్రీభాగవత నిగమవ్యాఖ్యానం బేరీతి సాఁగె? న య్యోగిముఖ్యుండు గృహస్థుల గృహంబుల గోవును బిదికినయంత తడవుగాని నిలువంబడం డతండు గోదోహనమాత్రకాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబులగు నండ్రు; పెద్దకాలం బేక ప్రదేశంబున నెట్లుండె? భాగవతోత్తముండైన జనపాలుని జన్మకర్మంబు లే ప్రకారంబులు? వివరింపుము. 78**

**ప్రతి :** మఱియును= అంత; నగ్నుండును= దిగంబరుడు; తరుణుండును+ఐ= నవయువకుడు అయి; చను= వెళ్లే; తన కొడుకున్= తన పుత్రుని; కని= చూచి; వస్త్రపరిధానంబు= చీరలను ధరించడం; ఒనరింపక= చేయకుండా; వస్త్రధారియున్= బట్టలను ధరించియున్నవాడును; వృద్ధుండునున్= కడుముసలివాడును; ఐన= అయినటువంటి; తనున్= తనను; చూచి; చేలంబులు= వస్త్రాలు; ధరియించు= తాల్చిన; దేవరమణులన్= దేవలోక స్త్రీలను; కని= చూచి; వ్యాసుండు= వ్యాసమహర్షి; కారణంబు= దీనికి హేతువు; అడిగినన్= ఏమిటని ప్రశ్నించగా; వారలు= ఆ దేవభామలు; నీ పుత్రుండు= నీ కుమారుడు; స్త్రీపురుషులు+అనెడు= ఆడువారు; మగవారు అనే (స్త్రీ, పుంలింగములనే); భేదదృష్టిలేక= తేడాలేక; ఉండున్= సమదృష్టితో ఉంటాడు; మఱియున్= అంతేకాక; అతండు= ఆ శుకుడు; నిర్వికల్పుండు= వికారాలు లేనివాడు; కానన్= కాబట్టి; నీకున్= తండ్రియైన నీకును; అతనికిన్= నీ కొడుకైన అతనికి; మహా+అంతరంబు= ఎంతో తేడా; కలదు= ఉంది; అనిరి= అని చెప్పారు కదా!; అట్టి శుకుండు= అటువంటి శుకపరబ్రహ్మము; కురుజాంగలదేశంబులు= కురుజాంగల దేశాలు; చొచ్చి= ప్రవేశించి; హస్తినాపురంబునన్= కరినగరంలో; పౌరజనంబులచేన్= పురప్రజలచే; ఎట్లు= ఏ విధంగా; జ్ఞాతుండు+అయ్యెన్= తెలియజేయబడ్డాడు?; మఱియున్= అంతేకాక; ఉన్మత్తునిక్రియన్= పిచ్చివానివలె; మూఁగతెఱంగునన్=

మూగవానివలె; జడునిభంగిన్= మూఢునివలె; ఉండు= కనబడే, ఆ+మహాయోగికిన్= ఆ యోగీశ్వరేశ్వరునకు; రాజర్షి+ఐన= నృపులలో ఋషి అయిన; పరీక్షిన్మహారాజుతోడన్= పరీక్షిత్తునితో; సంవాదంబు= సంభాషణ; ఎట్లు= ఏ విధంగా; సిద్ధించెన్= చేకూరింది?; కథనీయంబు+అయిన= చెప్పదగినదైన; శ్రీభాగవత= శ్రీమద్భాగవతమనే; నిగమవ్యాఖ్యానంబు= వేదార్థరూపమైన వివరణ; ఏ రీతిన్= ఏ పద్ధతిగా; సాఁగెన్?= కొనసాగింది?; ఆ+యోగిముఖ్యుండు= ఆ మునివర్యుడు; గృహస్థుల= యజమానుల (గేస్తుల); గృహంబులన్= ఇండ్లలో; గోవును= ఆవును; పిదికిన+అంత= పాలు పిండినంత; తడవు+కాని= సమయం మాత్రమే; నిలువంబడండు= నిలిచియుంటాడు కాని అంతకుమించియుండడు; అతండు= ఆ యోగి; గోదోహనమాత్రకాలంబు= ఆవుపాలు పిదికినంతసేపు; సంచరించిన= తిరుగాడిన; స్థలంబులు= ప్రదేశాలు; తీర్థంబులు= పుణ్యతీర్థాలు; అగున్= అవుతాయని; అంద్రు= అందురు; పెద్దకాలంబు= అంత ఎక్కువ సమయం; ఏకప్రదేశంబునన్= ఒకేచోట; ఎట్లు+ఉండెన్= ఎలా ఉండిపోయాడు?; భాగవత+ఉత్తముండు+ఐన= భగవద్భక్తులలో శ్రేష్ఠుడైన; జనపాలుని= ఆ రాజుయొక్క; జన్మకర్మంబులు= పుట్టుక; కర్మములు; ఏ ప్రకారంబులు= ఏ తెరంగులు?; వివరింపుము= తెలియపరుచుము.

**తా :** అంత దిగంబరుడు, యౌవనం పొడసూపినవాడు అయిన తన కొడుకునుచూచి ఆ దేవకాంతలు వస్త్రధారణ చేయకుండా– వల్కలధారి, అతివృద్ధుడు అయిన తనను చూచి చీరలు చుట్టుకొన్న వారిని చూచి, దానికి కారణమేమని వ్యాసుడు ప్రశ్నించాడు. అప్పుడు వారు "నీ తనయునికి స్త్రీపురుషులనే భేదభావం ఏ కోశానా లేదు. ఆయన నిర్వికల్పుడు. నీలో ఆ భేదభావం ఇంకా పోలేదు. అందువల్ల నీ కొడుకునకూ, నీకు ఎంతో తేడా ఉంది" అని అన్నారు కదా! అటువంటి శుకయోగి కురుజాంగల దేశాలలో ఎలా అడుగుపెట్టాడు? హస్తినాపుర పౌరులు ఆయనను ఎలా గుర్తించగలిగారు? పిచ్చివానివలె, మూగవానివలె, మందునివలె కనబడే ఆ మహర్షియైన శుకయోగికి, రాజర్షియైన పరీక్షిత్తునకు సంవాదరూప సంభాషణ ఎలా చేకూరింది? ఒక సుదీర్ఘ గాథగా చెప్పడానికి వీలైన భాగవత పురాణ ప్రవచనం ఏ రీతిగా సాగింది? ఆ శుకుడు గృహస్థుల ఇండ్లలో ఆవుపాలు పిండేటంతకాలం మాత్రమే నిలుస్తాడని, ఆయన గోదోహనమాత్రకాలం ఎక్కడెక్కడ ఉంటాడో ఆ ప్రదేశాలన్నీ పుణ్యతీర్థాలవుతాయని వచిస్తారు. అట్టి మహర్షి అన్నిరోజులు ఒకేచోట ఎలా ఉండిపోయాడు? భక్తశిఖామణియైన పరీక్షిన్నృపమణి ఎలా జన్మించాడు? ఏయే కృత్యాలు ఆచరించాడు? ఆ విశేషాలన్నీ సవివరంగా తెలియజేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

**సీ. పాండవ వంశంబు బలము మానంబును వర్ధిల్లఁ గడిమి నెవ్వాఁడు మనియెఁ**
**బరిపంథిరాజులు భర్మాదిధనముల నర్చింతు రెవ్వని యంఘ్రియుగముఁ**
**గుంభజకర్ణాదికురుభటవ్యూహంబు సొచ్చి చెండాడె నే శూరుతండ్రి**
**గాంగేయసైనికాక్రాంత గోవర్గంబు విడిపించి తెచ్చె నే వీరుతాత**

**ఆ. యట్టి గాఢకీర్తి యగు పరీక్షిన్మహారాజు విడువరాని రాజ్యలక్ష్మిఁ**
**బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై యసువు లుండ, నేల యడఁగియుండె? 79**

**ప్రతి :** ఏ+వాఁడు= ఎవడు (ఏ రాజు); కడిమిన్= పరాక్రమంతో; పాండవవంశంబు= పాండవుల కులం; బలము= శక్తి; మానంబును= ప్రతిష్ఠ; వర్ధిల్లన్= వృద్ధి పొందునట్లుగా; మనియెన్= జీవించాడు?; పరిపంథిరాజులు= శత్రురాజులు; భర్మ+ఆదిధనములన్= బంగారు మున్నగు ధనరాసులతో; ఎవ్వని= ఏ రాజేంద్రునియొక్క; అంఘ్రియుగమున్= పాదద్వంద్వాన్ని; అర్చింతురు= పూజిస్తారు?; ఏ శూరుతండ్రి= ఏ వీరునియొక్క జనకుడైన అభిమన్యుడు; కుంభజ=

ద్రోణుడు; కర్ణ+ఆది= కర్ణుడు మున్నగు; కురుభటవ్యూహంబు= కౌరవవీరులతో కూడుకొన్న పద్మవ్యూహమును; చొచ్చి= ప్రవేశించి; చెండాడెన్= భేదించాడు?; ఏ వీరుతాత= ఏ వీరాధివీరుని పితామహుడైన అర్జునుడు; గాంగేయ= భీష్మునిచేత; సైనిక= సైనికులచేత; ఆక్రాంత= ఆక్రమించబడ్డ (భీష్ముడు మున్నగు సైనికులచే); గోవర్గంబున్= ఆవుల సమూహాన్ని; విడిపించి= మళ్లించి; తెచ్చెన్= విరాట నగరానికి తీసుకొనివచ్చాడు?; అట్టి= అటువంటి; గాఢకీర్తి+అగు= అఖండమైన ప్రశస్తికల; పరీక్షిన్మహారాజు= పరీక్షిత్తు అనే చక్రవర్తి; విడువరాని= వదలివేయుటకు వీలులేని; రాజ్యలక్ష్మిన్= సామ్రాజ్యవైభవాన్ని; పరిహరించి= విడిచివేసి; గంగన్= గంగానదిలో; ప్రాయోపవిష్టుఁడు+ఐ= ఆహారం మాని మరణానికి మాత్రమే సిద్ధమైన స్థితియందున్నవాడై; అసువులు= ప్రాణాలు; ఉండన్= మిగిలియుండునట్లుగా (బిగబట్టుకొని); ఏల= ఏ కారణంచేత; అడఁగియుండెన్= క్రుంగి ఉన్నాడు?

**తా :** ఆ పరీక్షిత్తు సాధారణ మానవుడు కాదు కదా! ఏ రాజు తన పరాక్రమంతో పాండవాన్వయ బలధైర్యాలు, కీర్తిప్రతిష్ఠలు వర్ధిల్లునట్లుగా పరిపాలన సాగించి జీవించాడో, శత్రురాజేంద్రులు బంగారు ధనరాసులను తీసుకొనివచ్చి కప్పం చెల్లించి ఏ చక్రవర్తి పాదద్వంద్వాన్ని సేవించారో, ఏ వీరుని తండ్రియైన అభిమన్యుడు కర్ణద్రోణాది వీరులచే పరిరక్షితమైన పద్మవ్యూహాన్ని చీల్చి చెండాడినాడో, ఎవని పితామహుడైన అర్జునుడు భీష్మాధిపత్య రక్షితమైన కౌరవసైన్యాన్ని ఛిన్నాభిన్నంచేసి గోగణాన్ని మళ్లించాడో, అట్టి అఖండ యశస్సంపన్నుడైన పరీక్షిత్తు విడిచిపెట్టరాని సామ్రాజ్యాన్ని వదలివేసి, గంగానదీ తీరంలో ప్రాయోపవేశంచేసి, ప్రాణాలు అరచేతపెట్టుకొని ఏ కారణంచేత క్రుంగి కృశించి ఉన్నాడు.

**ఉ. ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడుం**
**జిత్తములందు గోరరు హసించియు, లోకుల కెల్ల నర్థ సం**
**పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు, రన్యరక్షణా**
**త్యుత్తమమైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో? 80**

**ప్రతి :** ఉత్తమకీర్తులు+ఐన= ఉన్నతమైన ప్రఖ్యాతి కల; మనుజ+ఉత్తములు= మానవశ్రేష్ఠులు; హసించియున్= నవ్వులాటకైనా; ఆత్మహితంబులు= తనకు మాత్రమే మేలు కూర్చు సౌఖ్యాలను; ఎన్నఁడున్= ఎప్పుడూ; చిత్తములందున్= హృదయాలలో; కోరరు= ఇచ్ఛగించరు; లోకులకున్+ఎల్లన్= సమస్త ప్రజలకు; అర్థసంపత్తియున్= ధనసంపదలను; భూతియున్= ఐశ్వర్యాన్ని; సుఖమున్= సౌఖ్యాన్ని; భద్రమున్= శ్రేయస్సును; కోరుదురు= అభిలషిస్తారు; అన్యరక్షణ= ఇతరులను రక్షించడంలో; అతి+ఉత్తమము+ఐన= మిక్కిలి శ్రేష్ఠమైన; మేనున్= శరీరాన్ని; విభుఁడు= రాజు; ఊరక= ఏ కారణం లేకుండా; ఏల= ఎందుచే; విరక్తిన్= వైరాగ్యంతో; పాసెను+ఓ= త్యజించాడో కదా!

**తా :** ఉన్నత ప్రశస్తితో విరాజిల్లే మానవోత్తములు ఎప్పుడూ ఆత్మసుఖాలను అంతరాత్మలో ఏ కోశాన కోరరు. నిత్యం సమస్త జనానికి ధనసంపదలు, ఐశ్వర్యం, సౌఖ్యం, శ్రేయస్సు చేకూరాలని అభిలషిస్తారు. పరీక్షిత్తు లోకోపకార పరాయణుడు కదా! అతడు వైరాగ్యంతో, శరీరాన్ని త్యజించడానికి ఏల సిద్ధపడ్డాడో కదా!

**క. సారముల నెల్ల నెఱుఁగుదు, పారగుఁడవు భాషలందు బహువిధ కథనో**
**దారుఁడవు మాకు సర్వముఁ, బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా! 81**

**ప్రతి :** మహాత్మా= మహానుభావా!; సారములను+ఎల్లన్= సమస్తవేద పురాణేతిహాసాల సారాంశాలనన్నింటిని; ఎఱుఁగుదువు= గ్రహించినవాడవు; భాషలందున్= అనేకవిధాలైన భాషలలో; పారగుఁడవు= తీరం చేరినవాడవు; బహువిధ=

పెక్కురీతులుగా; కథన= గాథలు వివరించడంలో; ఉదారుఁడవు= గొప్పవాడవు; మాకున్= మాకు; సర్వమున్= అంతా; పారము= గట్టు; ముట్టంగన్= ఎక్కినట్లుగా; తెలియన్= స్పష్టమయ్యేలా; పలుకు(ము)= తెలియజేయుము.

**తా :** "మహాపురుషా! అన్ని గ్రంథాల సారాంశాలను గ్రహించావు. పెక్కు భాషలలో పారంగతుడవయ్యావు. పలు రీతులలో గాథలు గొప్పగా వివరిస్తావు. మేమంతా జ్ఞానపారగులమయ్యేలా సర్వం స్పష్టంగా తెలియజేయవయ్యా!" అని శౌనకుడు అడిగాడు.

## ✤ వ్యాసుండు వ్యాకులచిత్తుండై చింతించుట ✤

**వ. అని యడిగిన శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ దృతీయంబైన ద్వాపరయుగంబు దీఱు సమయంబున నుపరిచరవసువు వీర్యంబున జన్మించి వాసవి నాఁ దగు సత్యవతి యందుఁ బరాశరునికి హరికళం జేసి విజ్ఞాని యయిన వేదవ్యాసుండు జన్మించి, యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీ జలంబుల స్నానాదికర్మంబులం దీర్చి శుచియై పరులు లేని చోట నొంటిఁ గూర్చుండి సూర్యోదయ వేళ నతీతానాగతవర్తమానజ్ఞుం డయిన యా ఋషి వ్యక్తంబు గాని వేగంబు గల కాలంబునం జేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబు వొందు. యుగయుగంబుల భౌతిక శరీరంబులకు శక్తి సన్నం బగుఁ, బురుషులు నిస్సత్త్వులు ధైర్యశూన్యులు మందప్రజ్ఞు లల్పాయువులు దుర్బలులు నయ్యెద రని తన దివ్య దృష్టిం జూచి సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి నలువురు హోతలచేత ననుష్ఠింపందగి ప్రజలకు శుద్ధికరంబులయిన వైదిక కర్మంబులగు యజ్ఞంబు లెడతెగకుండు కొఱకు నేకంబైన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణంబులను నాలుగు నామంబుల విభాగించి యితిహాసపురాణంబు లన్నియుఁ బంచమ వేదంబని పల్కెనందు. 82**

**ప్రతి :** అని+అడిగిన= అని అడుగగా; శౌనక+ఆది= శౌనకుడు మొదలుగా గల; మునిశ్రేష్ఠులకున్= ఋషివర్యులకు; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా సమాధానం చెప్పాడు; తృతీయంబు+ఐన= మహాయుగంలోని మూడవదైన; ద్వాపరయుగంబు= ద్వాపరయుగం; తీఱు= పూర్తయ్యే; సమయంబునన్= కాలంలో; ఉపరిచరవసువు= ఆకాశంలో సంచరించే వసువుయొక్క; వీర్యంబునన్= తేజస్సువల్ల (క్రిందపడిన వీర్యంవల్ల); జన్మించి= పుట్టి; వాసవి= వసువుయొక్క పుత్రికగాన వాసవి; నాన్+తగు= అనబడే; సత్యవతియందున్= దాశరాజు కుమార్తెగా పెరిగిన సత్యవతికి; పరాశరునికిన్= పరాశర మహర్షికి; హరికళన్+చేసి= విష్ణువుయొక్క అంశవల్ల; విజ్ఞాని+అయిన= విశేషజ్ఞానం కలవాడైన; వేదవ్యాసుండు= వేదవ్యాస మహర్షి; జన్మించి= ఉద్భవించి; ఒక్కనాఁడు= ఒకరోజున; బదరికా+ఆశ్రమంబునన్= బదరీవనంలోని తన ఆశ్రమంలో; సరస్వతీజలంబులన్= సరస్వతీనది నీళ్ళలో; స్నాన+ఆదికర్మంబులన్= స్నానం మున్నగు నిత్యకృత్యాలు; తీర్చి= పూర్తి చేసుకొని; శుచి+ఐ= పవిత్రుడై (సదాచారవంతుడై); పరులులేనిచోటన్= ఇతరులు ఎవ్వరూలేని ప్రదేశంలో; ఒంటిన్= ఏకాంతంగా; కూర్చుండి= ఆసీనుడై, సూర్య+ఉదయవేళన్= సూర్యుడు ఉదయించే సమయంలో; అతీత= గడచిపోయిన; అనాగత= రాబోవు; వర్తమానజ్ఞుండు+అయిన= ప్రస్తుతం తెలిసినవాడైన; ఆ ఋషి= ఆ ముని; వ్యక్తంబు+కాని= స్పష్టముకాని; వేగంబు+కల= వేగంతో కూడుకొన్న; కాలంబునన్+చేసి= కాలగమనంలో; యుగధర్మంబులకున్= ఆయాయుగధర్మాలకు; భువిన్= భూలోకంలో; సాంకర్యంబు= సంకీర్ణత్వం (ఒకదానితో నింకొకటి

కలయిక); పొందున్= సంభవిస్తుంది; యుగయుగంబులన్= ఒకయుగం తర్వాత వచ్చే మరోయుగంలో; భౌతిక శరీరంబులకున్= పంచభూతాలతో నిండియున్న దేహాలకు; శక్తి= సత్తువ; సన్నంబు+అగున్= సన్నగిల్లుతుంది; పురుషులు= మానవులు; నిస్సత్త్వులు(న్)= సారంలేనివారు; ధైర్యశూన్యులు(న్)= ధీరగుణం లేనివారు; మందప్రజ్ఞులు= తక్కువ బుద్ధికలవారు; అల్ప+ఆయువులు(న్)= స్వల్పమైన ఆయుస్సు కలవారు; దుర్బలులున్= బలం లేనివారును; అయ్యెదరు+అని= అవుతారని; తన దివ్యదృష్టిన్+చూచి= తనయొక్క జ్ఞానదృష్టితో (అపరోక్ష జ్ఞానదృష్టితో) వీక్షించి; సర్వవర్ణ+ఆశ్రమంబులకున్= అన్నివర్ణాల వారికి, అన్ని ఆశ్రమాలవారికి; హితంబు= మేలు; చేయన్+తలంచి= చేకూర్చాలనే అభిప్రాయంతో; నలువురు హోతలచేతన్= హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కులచే; అనుష్ఠింపన్+తగి= ఆచరించబడడానికి వీలైన; ప్రజలకున్= జనులకు, శుద్ధికరంబులు+అయిన= చిత్తశుద్ధి కలిగించే; వైదికకర్మంబులు+అగు= వేదవిహిత కర్మలైన; యజ్ఞంబులు; ఎడతెగక+ఉండుకొఱకున్= ఆగకుండా కొనసాగడానికై; ఏకంబు+ఐన= ఒకటిగాఉన్న; వేదంబున్= వేదాన్ని; ఋగ్యజుస్సామ+అథర్వణంబులను= ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం అనే; నాలుగు నామంబులన్= నాలుగుపేర్లతో; విభాగించి= విభజించి; ఇతిహాసపురాణంబులు+అన్నియున్= అన్ని ఇతిహాసాలను, పురాణాలను; పంచమవేదంబు+అని= పంచమవేదంగా; పల్కెన్= పేర్కొన్నాడు; అందున్= వాటిలో.

**తా :** ఈ విధంగా శౌనకుడు మున్నగు మునిచంద్రులు అడుగగా, వారికి సూతమహర్షి ఇలా సమాధానమిచ్చాడు. ఒక మహాయుగంలో భాగాలైన కృతత్రేతాయుగాలు గడచి, మూడోదైన ద్వాపరయుగం పూర్తయ్యే సమయంలో ఒక వృత్తాంతం జరిగింది. ఉపరిచరవసువనే ఒకరాజు ఉండెడివాడు. ఇంద్రుడిచ్చిన విమానంలో ఆకాశంలో సంచరించే వసువు కావున ఆయనకు ఉపరిచర వసువనే పేరు సార్థకమయింది. ఆయనే వసుమహారాజు. ఆ వసువు తేజస్సువల్ల ఉద్భవించిన కన్య కావున "వాసవి" అనే పేరుతో వాసికెక్కింది సత్యవతి. ఆ పవిత్రక్షేత్రంలో పరాశర మహర్షివల్ల నారాయణాంశతో వ్యాసుడు జన్మించాడు. ఆయన మహాజ్ఞాని. వేదవిభాగం కావించి వేదవ్యాసుడుగా ప్రసిద్ధికెక్కాడు. సరస్వతీనది ప్రవహించే స్థలంలో ఆయన నివాసం. అదే బదరికాశ్రమం. ఆయన ఒకనాడు ఆ నదీజలాలలో స్నానంచేసి కాలోచిత కర్మలాచరించి పరమపవిత్రుడై ఉన్నాడు. ఏకాంతస్థలంలో ఒంటరిగా కూర్చుండి ధ్యానముద్రలో ఉన్నాడు. అంతలో సూర్యోదయమయింది. భూతభవిష్యద్వర్తమానాలు తెలిసిన ఆ ఋషి కనబడకుండా కడువేగంతో పరుగుపెట్టే కాలగమనంలో ఏర్పడే మార్పులను గమనించాడు. భూలోకంలో యుగధర్మాలు సాంకర్యం పొందుతాయని గ్రహించాడు. యుగపరిణామంవల్ల పాంచభౌతిక శరీరాలలో శక్తి సన్నగిల్లుతుందని, మానవులు సత్తువలేనివారు, ధైర్యగుణం లేనివారు, ధారణాశక్తి లేనివారవుతారని భావించాడు. అంతేకాదు. అల్పాయుష్కులు అవుతారని, బలహీనులవుతారని నిశ్చయించాడు. తన తపోదృష్టితో అంతా పరీక్షించి సర్వవర్ణాలవారికి, అన్ని ఆశ్రమాల వారికి మేలు చేకూర్చాలని నిర్ణయించాడు. హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నల్గురు ఋత్విక్కులద్వారా, ఆచరించడానికి వీలుండే వైదిక కర్మలద్వారా ప్రజలకు క్షేమంకరాలైన యజ్ఞాలు నిరంతరం కొనసాగాలని దృష్టి నిలిపాడు. అంతవరకు ఒక్కటిగా ఉన్న వేదాన్ని ఋక్కు, యజుస్సు, సామం, అథర్వం అనే నాలుగు భాగాలుగా విభజించాడు. ఇతిహాస పురాణాలను పంచమవేదంగా పేర్కొని, వాటికి ప్రామాణ్యాన్ని సంతరించాడు.

**విశే :** భగవంతుడు పదియేడో అవతారంలో వ్యాసుడుగా అవతరించి వేదాలు విభజించినట్లుగా చెప్పబడింది. కాని ప్రతి ద్వాపరాంతంలోను భగవానుడు వ్యాసుడుగా ఆవిర్భవించినట్లు అవగతమవుతుంది.

**అవ :** వ్యాసుడు తన శిష్యులను, ఎవరిని వేటియందు నిష్ణాతులను గావించాడో ఇకమీదట వివరించడం జరుగుతోంది.

**సీ. పైలుండు ఋగ్వేదపఠనంబు దొరఁకొనె సామంబు జైమిని సదువుచుండె**
**యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ దుది నథర్వము సుమంతుఁడు పఠించె**
**నఖిలపురాణేతిహాసముల్ మా తండ్రి రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ**
**దమతమ వేద మా తపసులు భాగించి శిష్యసంఘములకుఁ జెప్పిరంత**

**తే. శిష్యు లెల్లను నాత్మీయశిష్యజనుల, కంత బహుమార్గములు చెప్పి యనుమతింపఁ**
**బెక్కు శాఖలు గలిగి యీ పృథివిలోన, నిగమ మొప్పారె భూసురనివహమందు. 83**

**ప్రతి :** పైలుండు= పైలుదు; ఋగ్వేదపఠనంబు= ఋగ్వేదం చదవడం; దొరఁకొనెన్= మొదలుపెట్టాడు; జైమిని= జైమిని మహర్షి; సామంబున్= సామవేదాన్ని; చదువుచుండెన్= చదువసాగాడు; వైశంపాయన+ ఆఖ్యుండు= వైశంపాయనుడనే పేరు గలవాడు; యజువున్= యజుర్వేదాన్ని; కైకొనెన్= స్వీకరించాడు; తుదిన్= చివరగా; సుమంతుఁడు= సుమంతుడనేవాడు; అథర్వమున్= అథర్వవేదాన్ని; పఠించెన్= అధ్యయనం చేశాడు; మా తండ్రి= నా తండ్రిగారైన; రోమహర్షణుఁడు= రోమహర్షణ మహర్షి; నిరూఢిన్= పట్టుదలతో; అఖిలపురాణ+ఇతిహాసముల్= సకల పురాణాలను, ఇతిహాసాలను; తాల్చెన్= ధరించాడు (అభ్యసించాడు); అంతన్= పిమ్మట; ఆ తపసులు= ఆ ఋషులు; తమ తమ వేదము= తాము అధ్యయనంచేసిన వేదాన్ని; భాగించి= విభజించి; శిష్యసంఘములకున్= శిష్యబృందాలకు; చెప్పిరి= బోధించారు; అంతన్= అటుపిమ్మట; శిష్యులు+ఎల్లను= ఆ శిష్యులందరూ; ఆత్మీయ= తమ సంబంధమైన; శిష్యజనులకున్= శిష్యులకు; బహుమార్గములు= అనేక విధాలుగా; చెప్పి= ఉపదేశించి; అనుమతింపన్= అనుజ్ఞ ఇవ్వగా; ఈ పృథివిలోనన్= ఈ భూమియందు; భూసురనివహమందున్= బ్రాహ్మణ సమూహంలో; పెక్కుశాఖలు+కలిగి= అనేక శాఖోపశాఖలు ఉద్భవించి; నిగమము= వేదము; ఒప్పారెన్= విస్తరిల్లింది.

**తా :** పైలుడు ఋగ్వేదం, జైమిని సామవేదం, వైశంపాయనుడు యజుర్వేదం, సుమంతుడు అథర్వవేదం అధ్యయనం చేశారు. నా తండ్రి రోమహర్షణుడు ఇతిహాసాలను, పురాణాలను అభ్యసించాడు. ఈ ఋషులందరు తాము నేర్చుకొన్న వేదాలను వేర్వేరుగా తమ శిష్యులకు బోధించారు. ఆ శిష్యులు అదేవిధంగా తమ తమ శిష్యులకు విభజించి ఉపదేశించారు. ఈ విధంగా భూమండలంపై బ్రాహ్మణసమూహంలో వేదవృక్షం శాఖోపశాఖలై విస్తరిల్లింది.

**విశే :** సూతమహర్షి తండ్రి రోమహర్షణుడు. పురాణేతిహాసాల గాథలు వినే, వినిపించే సమయంలో ఆయన రోమాలు హర్షపులకాంకితాలు అయ్యేవి. అందువల్ల ఆయన రోమహర్షణుడు అయ్యాడు.

**వ. ఇట్లు మేధావిహీనులయిన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపం బడుచున్నవి. మఱియు దీనవత్సలుం డయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విన నర్హంబులు గావు. కావున మూఢుల కెల్ల మేలగు నని భారతాఖ్యానంబు చేసియు న మ్ముని భూతహితంబునందుఁ దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీతటంబున నొంటినుండి హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె. 84**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా (క్రమక్రమంగా); మేధావిహీనులు+అయిన= బుద్ధిమాంద్యం కల్గిన; పురుషులచేతన్= మానవులచే; అట్టి= అటువంటి; వేదంబులు= వేదములు; ధరియింపన్+పడుచున్+ఉన్నవి= ధారణ చేయబడి ఉన్నాయి;

మఱియున్= అంతేకాక; దీనవత్సలుండు+అయిన= దీనులపై వాత్సల్యం కల్గిన; వ్యాసుండు= వ్యాసమహర్షి; స్త్రీశూద్రులకున్= ఉపనయనాది సంస్కారంలేని స్త్రీలకు; శూద్రులకు; త్రైవర్ణికాధములకున్= ఉపనయన సంస్కారం ఉన్నా తత్కర్మలు చేయని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణాలలోని తక్కువ స్థాయివారికి; వేదంబులు= వేదాలు; వినన్= వినుటకు; అర్హంబులు= తగినవి; కావు= కానటువంటివి; కావునన్= కాబట్టి; మూఢులకున్+ఎల్లన్= సామాన్య జనులకందరకు; మేలు+అగును+అని= క్షేమం చేకూరుతుందని; భారత+ఆఖ్యానంబు= భారతమనే ఇతిహాసాన్ని; చేసియున్= రచించికూడ; ఆ+ముని= ఆ వ్యాసుడు; భూతహితంబునందున్= ప్రాణులకు మేలు కూర్చుటలో; తన హృదయంబు= తన మనస్సు; సంతసింపకున్నన్= సంతృప్తి పొందకపోవడంవల్ల; సరస్వతీ తటంబునన్= సరస్వతీనది ఒడ్డున; ఒంటిన్+ఉండి= ఏకాంతంగా కూర్చుండి; హేతువు= దానికి కారణాన్ని; వితర్కించుచున్= ఆలోచిస్తున్నవాడై; తనలోన్= తనలో తాను; ఇట్లు+అనియెన్= ఇలా అనుకొన్నాడు.

**తా :** ఈ విధంగా క్రమక్రమంగా వేదం విభజింపబడి ఏకంగాకాక భిన్నభిన్న శాఖలుగా ప్రజ్ఞాపటిమ పూర్తిగాలేని వారిచే ధారణ చేయబడింది. స్త్రీలు, కర్మసంస్కారంలేని శూద్రులు, కర్మసంస్కారమున్నా ఆచరించకుండా వ్యవహరించే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వేదాలకు, తద్విహిత ధర్మాలకు దూరంగా ఉండిపోయారు. అటువంటివారికి వేదం శ్రవణయోగ్యం కాదు. కాబట్టి సామాన్యులందరికి మేలు కలిగేలా వ్యాసుడు భారతమనే ఇతిహాసం రచించాడు. విశ్వశ్రేయస్సుకై తానింత చేసినా, ఆయన మనస్సు ఎందుకో సంతుష్టి పొందలేదు. తన అసంతృప్తికి హేతువేమిటోయని ఆయన సరస్వతీ నదీతీరంలో ఏకాంతంగా కూర్చుండి ఆలోచించసాగాడు. తనలో తాను ఈ విధంగా అనుకొన్నాడు.

**సీ. వ్రతధారినై వేద వహ్నిగురుశ్రేణి మన్నింతు విహితకర్మములఁ గొఱఁత**
**పడకుండ నడపుదు భారతమిషమునఁ బలికితి వేదార్థభావ మెల్ల**
**మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మము లందుఁ దెలిపితి నేఁ జెల్ల దీనఁ జేసి**
**యాత్మ సంతస మంద దాత్మలో నీశుండు సంతసింపక యున్న జాడ దోఁచె**

**ఆ. హరికి యోగివరుల కభిలషితంబైన, భాగవత విధంబుఁ బలుకనైతి**
**మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి, ననుచు వగచుచున్న యవసరమున. 85**

**ప్రతి :** వ్రతధారిని+ఐ= బ్రహ్మచర్య వ్రతమును చేపట్టి; వేద, వహ్ని, గురు, శ్రేణిన్ : వేద= వేదాలయొక్క; వహ్ని= అగ్నులయొక్క; గురు= ఆచార్యులయొక్క; శ్రేణిన్= సమూహాన్ని; మన్నింతున్= గౌరవించాను; విహితకర్మములన్= ధర్మశాస్త్రమునందు విధింపబడిన కర్మలను; కొఱఁతపడకుండన్= లోపం లేకుండా; నడపుదున్= ఆచరించాను; వేద+అర్థభావము+ఎల్లన్= వేదాలయొక్క అర్థాన్ని, ఆంతర్యాన్ని అంతా; భారతమిషమునన్= మహాభారతరూపంగా; పలికితిన్= వెల్లడించాను; ఏన్= నేను; మునుకొని= మున్ముందుగా; స్త్రీశూద్రముఖ్యధర్మములు= స్త్రీలు, శూద్రులు మున్నగువారి కర్మలనన్నింటిని; అందున్= ఆ గ్రంథంలో; తెలిపితిన్= తెలియజేశాను; చెల్ల!= అయ్యో!; దీనన్+చేసి= ఇంత చేసినా; ఆత్మ= అంతరాత్మ; సంతసము+అందదు= ఆనందం పొందలేదు; ఆత్మలోన్= మనస్సులో; ఈశుండు= పరమేశ్వరుడు; సంతసింపక+ఉన్న= సంతుష్టి పొందకున్న; జాడ= రీతియే; తోఁచెన్= కాన్పించుచున్నది; హరికిన్= విష్ణువునకు; యోగివరులకున్= భక్తముఖ్యులకు; అభిలషితంబు+ఐన= అత్యంత ప్రియమైన; భాగవతవిధంబున్= భాగవత స్వరూపాన్ని; పలుకను+ఐతి= ప్రతిపాదించలేకపోయాను; మోసము+అయ్యెన్= పొరపాటు జరిగిపోయింది; తెలివి= వివేకము;

మొనయదు= కలుగలేదు; మఱచితిన్= విస్మృతి పొందాను; అనుచున్= అని; వగచుచున్+ఉన్న= విచారించుచున్న; అవసరమునన్= సమయంలో...

**తా :** కఠోరమైన బ్రహ్మచర్య వ్రతాన్ని స్వీకరించాను. వేదాలను విభజించాను. అగ్నులను వ్రేల్చాను. పూజ్యులను గౌరవించాను. శాస్త్రవిహితాలైన కర్మలను ఆచరించాను. వేదార్థాన్ని, దాని ఆంతర్యాన్ని మహాభారతరూపంలో వెల్లడించాను. స్త్రీశూద్రాదులు ఒనరించే ధర్మాలన్నీ వివరించాను. ఇంత చేసినా, నా అంతరాత్మ శాంతి పొందడంలేదు. అయ్యో! నా మనస్సులో అంతరాత్మ పరమాత్మతో ఐక్యం కానట్లు, సంతుష్టుడు కానట్లు తోస్తున్నది. అన్నీ ఒనరించాను. కాని విష్ణువునకు, హరిభక్తులకు అత్యంత ప్రియాన్ని చేకూర్చే భాగవత స్వరూపాన్ని ప్రతిపాదించలేకపోయాను. పొరపాటు జరిగిపోయింది. తెలివితక్కువ పని చేశాను. ఎంత విస్మృతిపాలయ్యాను? అని వ్యాసుడు విచారించే సమయంలో

## ❖ వ్యాసునికడకు నారదుండు వచ్చుట ❖

**సీ.** **తన చేతివల్లకీతంత్రీచయంబున సతతనారాయణశబ్ద మొప్ప**
**నాననసంభూత హరిగీతరవసుధా ధారల యోగీంద్రతతులు సొక్కc**
**గపిలజటాభార కాంతిపుంజంబుల దిశలు ప్రభాతదీధితి వహింపc**
**దనులగ్నతులసికాదామగంధంబులు గగనాంతరాళంబుc గప్పికొనcగ**

**ఆ.** **వచ్చె మింటనుండి వాసవీనందను, కడకు మాటలాడc గడcకతోడ**
**భద్రవిమలకీర్తిపారగుc డారూఢ, నయవిశారదుండు నారదుండు.** **86**

**ప్రతి :** తనచేతి= తన చేతులలోని; వల్లకీ= మహతి అనే వీణయొక్క; తంత్రీచయంబులన్= తీగల సమూహమునందు; సతత= ఎల్లప్పుడు; నారాయణశబ్దము= నారాయణనామము; ఒప్పన్= గానం చేయబడుచుండగా; ఆనన= ముఖమునుండి; సంభూత= బయల్వెడలిన; హరిగీతరవ= విష్ణుసంకీర్తన ధ్వనులనే; సుధాధారలన్= అమృత ప్రవాహాలచేత; యోగి+ఇంద్ర, తతులు= మునీశ్వరుల సమూహములు; చొక్కన్= పరవశం చెందుచుండగా; కపిల= గోరోజనములాంటి రంగుగల (రాగిలాగా ఎఱ్ఱనైన పసుపు ఎరుపురంగుల మిశ్రమం); జటాభార= జడల గుంపులయొక్క; కాంతి పుంజంబులన్= వెలుగు సమూహాలచే; దిశలు= దిక్కులు; ప్రభాతదీధితిన్= ఉదయ కాలకాంతిని; వహింపన్= ధరింపగా; తను, లగ్న= మేనిపై కూడుకొన్న; తులసికాదామ= తులసి పూసలదండల (మాలల); గంధంబులు= సువాసనలు; గగన+అంతరాళంబున్= ఆకాశ మధ్యభాగంలో; కప్పికొనcగన్= వ్యాపించగా; భద్ర= మంగళమైన; విమల= స్వచ్ఛమైన; కీర్తి= యశస్సునందు; పారగుcడు= దరికి చేరినవాడైన; ఆరూఢ= ప్రసిద్ధికెక్కిన; నయ= నీతిలో; విశారదుండు= నేర్పరియైన; నారదుండు= నారద మహాముని; మింటనుండి= ఆకాశంనుంచి; వాసవీనందనుకడకున్= సత్యవతీపుత్రుడైన వ్యాసునియొద్దకు; మాటలాడన్= సంభాషించే; కడcకతోడన్= ప్రయత్నంతో; వచ్చెన్= ఏతెంచాడు.

**తా :** నారదుడు ధరించే వీణ మహతి. ఆ విపంచిలోని తీగలపై నారాయణ నామం ఎల్లప్పుడు వినిపిస్తూ ఉండగా, ఆయన ముఖంనుండి హరిసంకీర్తనలు అమృతధారల్లా బయల్వెడలుతున్నాయి. ఆ గీతాలు విని మునీంద్రులు పారవశ్యం చెందుతున్నారు. జేగురు రంగుగల ఆయన జడలకాంతి దిక్కులలో ఉదయకాంతిని వెదజల్లుతోంది. ఆయన మెడలో

ధరించిన తులసిమాలల సువాసనలు భూమ్యాకాశాల మధ్యభాగంలో వ్యాపిస్తున్నాయి. ఆయన లోకానికి క్షేమాన్ని కలిగించే, స్వచ్ఛమైన కీర్తిలో పారం ముట్టినవాడు. ప్రసిద్ధమైన వ్యావహారిక నీతిలో కడునేర్పరి. ఆయన ఏదో మాట్లాడే ప్రయత్నం ఆకాశంనుండి వ్యాసుని కడకు ఏతెంచాడు.

**విశే :** వీణాతు వల్లకీ విపంచీ – అమరం. వల్లతేర్ధ్వని విశేషమితి. వల్లకీ. స్వరవిశేషమును ధరించునది.

**క. కనియెన్ నారదుఁ డంతన్, వినయైకవిలాసు నిగమవిభజన విద్యా**
**జనితోల్లాసున్ భవదుః, ఖ నిరాసున్ గురుమనోవికాసున్ వ్యాసున్. 87**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; నారదుఁడు= నారద మహర్షి; వినయ+ఏక+విలాసున్= వినయమే ముఖ్యమైన శీలంగా కల్గినవాడును; నిగమ విభజన= వేదాలను విభజించడమనే; విద్యా= కళయందు; జనిత= పుట్టిన; ఉల్లాసున్= సంతోషము కలవాడును; భవదుఃఖనిరాసున్= సంసారదుఃఖాలకు దూరంగా తోసివేసినవాడు; గురు= గొప్ప; మనస్+వికాసున్= మనోవికాసం కలవాడును (అయిన); వ్యాసున్= వ్యాసమహర్షిని; కనియెన్= చూచాడు.

**తా :** ఆ విధంగా వచ్చిన నారదుడు వినయశీలి, వేదవిభజనకళాపరమ సంతుష్టుడు, సంసారదుఃఖవిదూరుడు, మానసిక విజ్ఞానప్రకాశుడునైన వ్యాసుని సందర్శించాడు.

**వ. ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు విధివత్క్రమంబునం బూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబుతోడ విపంచికాతంత్రి వ్రేల మీటుచు నిట్లనియె. 88**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నిజ+ఆశ్రమంబునకున్= తన ఆశ్రమమునకు; వచ్చిన= విచ్చేసిన; నారదున్= నారదమహర్షిని; ఎఱింగి= గుర్తించి; లేచి= వెంటనే లేచి; వ్యాసుండు= కృష్ణద్వైపాయనుడు; విధివత్క్రమంబునన్= శాస్త్రములో చెప్పబడిన పద్ధతిగా; పూజించినన్= అర్చించగా; అతండు= నారదమహాముని; లేఁత+నగవు= చిరునవ్వు; నెగడెడి= ఒప్పునట్టి; మొగంబుతోడన్= వదనంతో; విపంచికాతంత్రి= వీణియయొక్క తీగను; వ్రేలన్= వ్రేలితో; మీటుచున్= మీటుతూ; ఇట్లు+ అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా తన ఆశ్రమానికి విచ్చేసిన నారదమహర్షిని గుర్తించి వ్యాసుడు శీఘ్రంగా లేచాడు. యథావిధిగా అర్చించాడు. చిరునవ్వు చిందే వదనంతో మెల్లగా వ్రేలితో వీణమీటుతూ ఇలా అన్నాడు.

**ఉ. ధాతవు! భారతశ్రుతివిధాతవు! వేదపదార్థజాత వి**
**జ్ఞాతవు! కామముఖ్యరిపుషట్కవిజేతవు! బ్రహ్మతత్త్వ ని**
**ర్ణేతవు! యోగినేతవు! వినీతుఁడ వీవు చలించి చెల్లరే!**
**కాతరుకైవడిన్ వగవఁ గారణ మేమి? పరాశరాత్మజా! 89**

**ప్రతి :** పరాశర+ఆత్మజా!= పరాశరపుత్రుడవైన ఓ వ్యాసమునీంద్రా!; ధాతవు= (పురాణ ప్రపంచానికి) సృష్టికర్తవు; భారత= మహాభారతమనే; శ్రుతి= వేదాన్ని; విధాతవు= నిర్మించినవాడవు; వేదపద+అర్థజాత విజ్ఞాతవు= వేదశబ్దముల సంబంధించిన అర్థసమూహము తెలిసినవాడవు; కామముఖ్య= కామం మున్నగు; రిపుషట్క= అంతశ్శత్రువులు ఆరింటిని; విజేతవు= జయించినవాడవు; బ్రహ్మతత్త్వనిర్ణేతవు= పరమాత్మ స్వరూపాన్ని నిర్ణయించినవాడవు; యోగినేతవు= సమస్తమునులకు

నాయకుడవు; వినీతుఁడవు= వినయసంపన్నుడవు; ఈవు= (ఇటువంటి) నీవు; చలించి= స్థైర్యాన్ని కోల్పోయి; చెల్లరే!= ఆశ్చర్యంగా ఉందయ్యా!; కాతరుకైవడిన్= భయం పొందినవానివలె; వగవన్= విచారించడానికి; కారణము+ఏమి= హేతువేమి?

**తా :** పరాశరుని కుమారుడవైన వ్యాసమునీంద్రా! నీవు పురాణప్రపంచ నిర్మాణంలో బ్రహ్మవంటివాడవు. మహాభారతాన్ని పంచమవేదంగా నిర్మించినవాడవు. వేదాలలోని శబ్దాల అర్థం తెలిసినవాడవు. కామం మున్నగు అంతశ్శత్రువులారింటిని జయించినవాడవు. పరబ్రహ్మతత్త్వాన్ని నిర్ణయించినవాడవు. యోగులలో అగ్రేసరుడవు. వినయసంపన్నుడవు. ఇటువంటి నీవు మనఃస్థైర్యం గోల్పోయి పిరికివానిలా విచారించడానికి కారణమేమిటయ్యా! ఆశ్చర్యంగా ఉందే!

**విశే :** కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలు ఆరింటిని అంతశ్శత్రువులంటారు.

**వ. అనినఁ బారాశర్యుం డిట్లనియె 90**

**ప్రతి :** అనినన్= అని నారదుడు పలుకగా; పారాశర్యుండు= పరాశరుని కుమారుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని పల్కిన నారదునితో వ్యాసుడిలా అన్నాడు.

**క. పుట్టితి వజుతనువునఁ జే, పట్టితివి పురాణపురుషు భజనము పదముల్**
**మెట్టితివి దిక్కులం దుది, ముట్టితివి మహాప్రబోధమున మునినాథా! 91**

**ప్రతి :** మునినాథా!= మునీశ్వరా!; అజు= బ్రహ్మదేవునియొక్క; తనువునన్= శరీరమందు; పుట్టితివి= జన్మించావు; పురాణపురుషు= శ్రీమన్నారాయణుని; భజనము= సేవను; చేపట్టితివి= అవలంబించావు; దిక్కులన్= దశదిశలా; పదముల్= పాదములు; మెట్టితివి= మోపితివి; మహాప్రబోధమునన్= గొప్పదైన జ్ఞానంతో; తుదిముట్టితివి= పరాకాష్ఠను అందుకొన్నావు.

**తా :** మునీశ్వరా! నీవు బ్రహ్మమానస పుత్రుడవు. శ్రీమన్నారాయణార్చనను స్వీకరించావు. దశదిశలా సంచరించావు. మిక్కిలి గొప్పదైన జ్ఞానోపదేశంలో పరాకాష్ఠ నందుకొన్నావు.

**వ. అదియునుం గాక నీవు సూర్యునిభంగి మూఁడులోకంబులం జరింతువు; వాయువు పగిది నఖిలజనులలోన మెలంగుదువు; సర్వజ్ఞుండ వగుటం జేసి. 92**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక; నీవు= నీవు; సూర్యునిభంగిన్= సూర్యునివలె; మూఁడులోకంబులన్= త్రిలోకాలలో; చరింతువు= సంచరిస్తావు; వాయువుపగిదిన్= గాలిలా; అఖిలజనులలోన్= జనులందరిలో; మెలంగుదువు= కలసి మెలసి తిరుగుతూ ఉంటుంది; సర్వజ్ఞుండవు= అన్నియు తెలిసినవాడవు; అగుటన్+చేసి= కావడంవల్ల...

**తా :** అంతేకాక నీవు సూర్యునివలె ముల్లోకాలలో సంచరిస్తావు. వాయువువలె సమస్త ప్రాణులలో మెలగుతావు. నీవన్నీ తెలిసినవాడవు. ఆ కారణంచే

**క. నీ కెఱుఁగరాని ధర్మము, లోకములను లేదు బహువిలోకివి నీవున్**
**నాకొఱఁత యెట్టి దంతయు, నాకున్ వివరింపుమయ్య! నారద! కరుణన్. 93**

**ప్రతి :** నారద= నారద మునీంద్రా!; నీకున్= నీకు; ఎఱుఁగరాని= తెలియరాని; ధర్మము; లోకములను= లోకములందు; లేదు; బహువిలోకివి= పెక్కు విషయాలను పరీక్షించి చూచినవాడవు; నా కొఱంత= నాకు వచ్చిన లోటు (తక్కువతనం); ఎట్టిది= ఎటువంటిదో; అంతయున్= అంతా; నీవున్= నీవు; నాకున్= నాకు; కరుణన్= దయతో; వివరింపుము+అయ్యా= తెలియజేయవయ్యా!

**తా :** నారద మునీంద్రా! నీకు తెలియరాని ధర్మమంటూ లోకంలో ఏదీ ఉండదు. పెక్కు విషయాలను పరిశీలించి చూచినవాడవు. నాలో ఏర్పడిన కొరత ఏమిటో నా దిగులుకు కారణమేమిటో దయతో వివరించి చెప్పు.

**వ. అనిన నారదుం డిట్లనియె. 94**

**ప్రతి :** అనినన్= అని అనగా; నారదుండు= నారదమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం :** అని వ్యాసుడు ప్రాధేయపడగా నారదుడు ఈ విధంగా సమాధానమిచ్చాడు.

**ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి, వందులోన నిం**
**చించుక గాని విష్ణు కథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం**
**చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁ గాక నీకు నీ**
**కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా! 95**

**ప్రతి :** ఆర్యపూజితా!= పెద్దలచే పూజించబడేవాడా!; అంచితము+ఐన= విశేషంగా ప్రకాశించే; ధర్మచయము= ధర్మవిషయ సమూహాన్ని; అంతయున్= అంతా; చెప్పితివి= వెల్లడించావు; అందులోనన్= దానిలో; ఇంచుక+ఇంచుక= కొంచెం కొంచెంగా; కాని= కూడా; విష్ణుకథలు= హరిచరిత్రను సూచించే కథలు; ఏర్పడన్= స్పష్టంగా; చెప్పవు= చెప్పవైతివి; ధర్మముల్= ధర్మప్రసంగాలను; ప్రపంచించినన్= విస్తారంగా వర్ణిస్తే; మెచ్చునే= భగవంతుడు సంతోషిస్తాడా?; గుణవిశేషములు= గుణాల గొప్పతనాలను; ఎన్నినన్+కాక= వివరిస్తేతప్ప; నీకున్= నీకు; ఈ కొంచెము= ఈ కొరత; వచ్చుట+ఎల్లన్= రావడమంతా; హరిన్= విష్ణువును; కోరి= మనసార ఇష్టపడి; నుతింపమిన్= స్తుతించకపోయినందువల్లనే.

**తా :** వ్యాసమునీంద్రా! నీవు పెద్దల పూజలందుకొనేవాడవు. విశేషంగా ప్రకాశించే ధార్మిక విషయాలు ఎన్నో చెప్పావు. కాని అందులో విష్ణుకథలు కొంచెం కొంచెం మాత్రమే చెప్పావు. వాసుదేవుని సగుణాత్మక సద్గుణ మహిమలను వర్ణిస్తే తప్ప ఎన్ని ధర్మాలు సోదాహరణంగా చెప్పినా భగవంతుడు సంతసించడు. నీకు ఈ మనోవేదన రావడానికి కారణం హరినామ సంకీర్తనం సమగ్రంగా చేయకపోవటంవల్లనే సుమా!

**మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ**
**సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు; శ్రీ**
**హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ**
**కరమై యుండ; దయోగ్య దుర్మద నదత్కాకోలగర్తాకృతిన్. 96**

**ప్రతి :** హరినామస్తుతి : హరి= శ్రీహరియొక్క; నామ= పేర్లను; స్తుతిచేయు= స్తోత్రముచేయు; కావ్యము= గ్రంథం; సువర్ణ+అంభోజ= బంగారురంగు తామరపూలయొక్క; హంస+ఆవళీ= హంసల గుంపులయొక్క; సురుచి= చక్కనికాంతితో;

భ్రాజితము+ఐన= ప్రకాశించే; మానససరస్= మానససరోవరంవలె; స్ఫూర్తిన్= ఉల్లాసంగా; వెలుంగు+ఒందున్= భాసిల్లుతుంది; శ్రీహరినామస్తుతి= శ్రీహరినామ సంకీర్తనం; లేని= లేకుండునట్టి; కావ్యము= గ్రంథం; విచిత్ర+అర్థ+ అన్వితంబు+అయ్యున్= ఆశ్చర్యాన్ని కలిగించే అర్థాలతో కూడుకొన్నదైనా; అయోగ్య= తగనిదైన (ఉపయోగించుటకు పనికిరాని); దుర్మద= పొగరెక్కి; నదత్= మ్రోతతో కూడుకొన్న; కాకోల= నల్లని కాకులతో నిండిన (విషపూరితమైన); గర్త+ఆకృతిన్= నీటిగుంటలా; శ్రీకరము+ఐ= శోభను కలుగజేసేదై; ఉండదు.

**తా :** మానససరోవరం బంగారురంగు పద్మాలతోను, హంసల గుంపులతోను నిండి ఉంటుంది. శ్రీహరినామ మహిమను వ్యక్తపరచే గ్రంథం ఆ స్వచ్ఛమైన మానససరస్సులా ప్రకాశిస్తుంది. హరిసంకీర్తన లేని గ్రంథంలో ఎన్ని చిత్రవిచిత్రాలైన అర్థాలున్నా అది శోభాకరం కాదు. అది పొగరుతో కూస్తున్న నల్లకాకులతో కూడుకొని, ఉపయోగించటానికి పనికిరాని నీటిగుంటలాంటిది.

**మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వ పా**
**ప పరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్**
**జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచుం**
**దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ! చింతింపుమా! 97**

**ప్రతి :** తత్త్వజ్ఞ!= భగవత్తత్త్వం తెలిసిన వ్యాసమునీంద్రా!; అపశబ్దంబులన్= వ్యాకరణ విరుద్ధ పదాలతో; కూడియున్= కూడుకొనియున్నా; హరిచరిత్ర+ఆలాపముల్= హరికథను వివరించే వాక్యాలు; సర్వపాప= సమస్త పాపాలయొక్క; పరిత్యాగము= పూర్తిగా తొలగించుటను; చేయున్= కావిస్తాయి; కావునన్= కాబట్టి; హరిన్= విష్ణువును; భావించుచున్= తలపులలోనికి తెచ్చుకుంటూ; పాడుచున్= గానంచేస్తూ; జపముల్+చేయుచున్= నామమంత్ర జపంచేస్తూ; వీనులన్+ వినుచున్= చెవులారా వింటూ; అశ్రాంతంబు= ఎల్లప్పుడూ; కీర్తించుచున్= కీర్తిస్తూ; తపసుల్= యోగులును; సాధులు= సజ్జనులును; ధన్యులు= ధన్యాత్ములు; ఔదురుకదా!= అవుతారు కదా!; చింతింపుమా!= ఆలోచించవయ్యా!

**తా :** ద్వైపాయన మహర్షీ! నీవు భగవంతుని తత్త్వం తెలిసినవాడవు కదయ్యా! శ్రీహరి అనంతకల్యాణ గుణసంపన్నుడు కదా! ఆయనను ఎట్లు వర్ణించగలం? స్తుతించే సమయంలో అపశబ్దాలు దొర్లుతాయేమో అనుశంక అవసరం లేదయ్యా! అపభ్రంశ శబ్దాలతో కూడుకొన్న వాక్యాలతో హరిచరిత్ర వ్రాసినా, సర్వపాపాలు పటాపంచలవుతాయి. కాబట్టి సజ్జనులైన భక్తులు, యోగీశ్వరులు ఆ విష్ణువునే మనస్సులో ఎప్పుడూ తలపోస్తూ ఉంటారు. ఆయన లీలలనే గానం చేస్తూ ఉంటారు. ఆయన నామాన్నే జపిస్తారు. ఆయన గాథలను నిరంతరం శ్రవణం చేస్తారు. నిత్యం ఆయనను కీర్తిస్తారు. ఈ విధంగా వారు తమ జన్మలను సార్థకం చేసుకొంటారయ్యా! ఒక్కసారి సావధానంగా ఆలోచించవయ్యా!

**వ. మునీంద్రా! నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు, ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు; భక్తిహీనంబు లయిన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు; గావున మహానుభావుండవు, యథార్థదర్శనుండవు, సకలదిగంతధవళకీర్తివి, సత్యరతుండవు, ధృతవ్రతుండవు నగు నీవు నిఖిల బంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము; హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున**

**నర్థాంతరంబులు వీక్షించి తద్వివక్షాకృత రూప నామంబులంజేసి పృథగ్దర్శనుండైన వాని మతి పెనుగాలిచేతం ద్రిప్పంబడి తప్పంజను నావచందంబున నెలవు సేర నేరదు; కామ్యకర్మంబులందు రాగంబు గల ప్రాకృతజనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీవు వగచుట తగ; దది యెట్టు లనిన వార లదియె ధర్మం బని జుగుప్సితంబు లగు కామ్యకర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱతురు; గావున బుద్ధిమోహంబు జనియింపక తత్త్వజ్ఞుండవై వ్యథా వియోగంబు సేయుమని మఱియు నిట్లనియె. 98**

**ప్రతి :** మునీంద్రా!= వ్యాసమహర్షీ!; నిర్గతకర్మంబై= నిష్కర్మతారూపమైన విషయవాసనలకు లోనుగాని కర్మయైనా; నిరుపాధికంబు+ఐన= ఉపాధినుండి విడుదలను గోరునట్టి (ఉపాధిభూత అజ్ఞానాన్ని నశింపజేసేదైనా); జ్ఞానంబు= విశుద్ధజ్ఞానం; హరిభక్తి= విష్ణుభక్తి; లేకున్నన్= లేకపోతే; విశేషంబుగన్= పరిపూర్ణంగా; శోభితంబు+కాదు= ప్రకాశించదు; ఫలంబు= కర్మఫలాన్ని; కోరక= వాంఛించక; కర్మంబు= ఆ కర్మను; ఈశ్వరునకున్= భగవంతునకు; సమర్పణంబు= పూర్తిగా అర్పణ; చేయక+ఉన్నన్= చేయకపోతే; అది= ఆ కర్మ; ప్రశస్తంబు+ఐ= ఉత్కృష్టమైనదై; ఉండదు= ఒప్పదు; భక్తిహీనంబులు+అయిన= భగవద్భక్తి లేనట్టి; జ్ఞాన= జ్ఞానంయొక్క; వాచా= వాక్కుయొక్క; కర్మ= కర్మయొక్క, కౌశలంబులు= నేర్పులు; నిరర్థకంబులు= ప్రయోజనం లేనటువంటివి; కావునన్= కాబట్టి; మహానుభావుండవు= గొప్పదైన బుద్ధి నిశ్చయం కలవాడవు; యథార్థదర్శనుండవు= సత్యమును దర్శించినవాడవు; సకలదిగంతధవళకీర్తివి= సమస్త దిక్కులయొక్క అంతంవరకు వ్యాపించిన స్వచ్ఛమైన యశస్సు కలవాడవు; సత్యరతుండవు= సత్యమునందు ప్రీతి కలవాడవు; ధృతవ్రతుండవు= ధరించబడిన వ్రతానుష్ఠానం కలవాడవు; అగు= అయినట్టి; నీవు= నీవు; నిఖిలబంధ= సమస్త సంసారబంధాలయొక్క; మోచనంబుకొఱకున్= విముక్తికొరకై; వాసుదేవుని= నారాయణుని (పరబ్రహ్మయొక్క) లీలావిశేషంబులు= లీలల విశేషాలను; భక్తితోడన్= అనురక్తితో; వర్ణింపుము= వివరించుము; హరివర్ణనంబు= గోవిందుని వర్ణన (పరమాత్మ విషయాలను); చేయక= కావించకుండా; ప్రకార+అంతరంబునన్= వేరొకవిధంగా; అర్థ+అంతరంబులు= భిన్నార్థాలు; వీక్షించి= కల్పించి; తద్+వివక్షాకృత= అట్లు చెప్పడంవల్ల స్ఫురించే; రూపనామంబులన్+చేసి= రూపంచేత, నామంచేత; పృథక్+దర్శనుండు+ ఐన= భేదదృష్టి కల్గినవాడైన; వాని+మతి= వానియొక్క బుద్ధి; పెనుగాలిచేతన్= ప్రచండమైన వాయువేగానికి; త్రిప్పన్+పడి= గిరగిర తిరుగుతూ; తప్పన్+చను= దారి తప్పిపయనించే; నావచందంబునన్= పడవలాగా; నెలవు= గమ్యస్థానం; చేర నేరదు= చేరలేదు; కామ్యకర్మంబులందున్= కోరికలను తీర్చిపెంచే కర్మలందు; రాగంబు+కల= అభిమానం కల్గిన; ప్రాకృతజనులకున్= సామాన్య మానవులకు; నియమించిన= విధించిన; ధర్మంబులు= ధార్మిక విషయాలను; చెప్పి= వివరించి; శాసకుండవు+అగు= శాసించేవాడివైన; నీవు= నీ వంటివాడు; వగచుట= విచారించుట; తగదు= భావ్యంకాదు; అది+ఎట్టులు+అనినన్= అదియేవిధం అవుతుందంటే; వారలు= ఆ మూఢమానవులు; అదియె= అదే; ధర్మంబు+అని= కర్తవ్యకర్మయని; జుగుప్సితంబులగు= కలుషితాలైన; కామ్యకర్మంబులు= కోరికలు తీర్చే కర్మలను; చేయుచున్= కావిస్తూ; తత్త్వజ్ఞానంబున్= పరమార్థ జ్ఞానాన్ని; మఱతురు= మరచిపోతారు; కావునన్= కాబట్టి; బుద్ధిమోహంబు= మతిభ్రమణాన్ని; జనియింపక= కల్గనీయకుండా; తత్త్వజ్ఞుండవు+ఐ= జనులకు తత్త్వం ఉపదేశించాలనే జ్ఞానం కలవాడవై; వ్యథావియోగంబు= వారి కష్టాలనుండి విముక్తిని; చేయుము+అని= కల్గించుమని (దిగులును విడనాడుమని); మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** జ్ఞానం నిష్కర్మతారూపం, నిరుపాధికం. జ్ఞానం కలిగిన సమయంలో సమస్తకర్మలనుంచి విముక్తి ఏర్పడుతుంది. అట్లే ఉపాధిభావం కూడ తొలగిపోతుంది. అయినా జ్ఞాని ఇంకా దేహత్యాగం చేయడు, ప్రారబ్ధం పూర్తయ్యేవరకు జీవించే

ఉంటాడు. కాని జీవన్ముక్తుడై ఉంటాడు. ఆ సమయంలో అతడు ఆచరించే కర్మ విషయవాసనలకు లోనుగాకుండా ఉంటుంది. ఉపాధిభూతమైన అజ్ఞానాన్ని తొలగించి విడుదల అయ్యే స్థితిలో ఉంటుంది. అయినా జ్ఞానోత్పత్తి అయిన పిమ్మటకూడా హరిభక్తి లేకపోతే కర్మ పరిపూర్ణంగా శోభించదు.

కర్మలు రెండురకాలు. కామ్యకర్మలు. నిష్కామకర్మలు. ఫలాపేక్షతో చేసే కర్మలు కామ్యకర్మలు. నిష్కామకర్మలు కూడ రెండురకాలు. అవి శుభకారణాలు. భగవంతునికి అర్పించకుండా, ఏ కోరిక లేకుండా ఉండి చేసే కర్మ ఒకటి. ఏ కోరిక లేకుండ భగవంతుని ఉపాసిస్తూ, తదర్పణ కావించే కర్మ వేరొకటి. ఫలాన్ని వాంఛించకుండా పరోపకార పారీణతతో చేసే కర్మలు సత్ఫలితాలనే ఈయవచ్చు. ఈయకపోవచ్చు. అయినా ఈశ్వరునకు సమర్పించే కర్మమాత్రమే ఉత్కృష్టకర్మ అవుతుంది. కారణం దైవం కర్మఫలప్రదాత కాబట్టి. భగవంతునికి సమర్పించే కర్మలో లోపం ఉన్నా తొలగిపోతుంది.

భగవద్భక్తి లేని జ్ఞానం శుష్కజ్ఞానం. భక్తిలేనట్టి వాక్కులు తార్కికవాక్కులు. భక్తివిరహితమైన కర్మ దుష్కర్మ. భక్తిలేని జ్ఞానం, వాక్కు, కర్మ ఎంత గొప్పవైనా నిరర్థకాలే.

కాబట్టి, వ్యాసమహర్షీ! నీవు ఏమీ తక్కువవాడవు కావు. బుద్ధి నిశ్చయంలో గొప్పవాడవు. సత్యాన్ని దర్శించేవాడవు. దిగంతముల వరకు వ్యాపించిన స్వచ్ఛమైన కీర్తి కలవాడవు. సత్యమునందు అనురక్తి కలవాడవు. వ్రతానుష్ఠానపరుడవు. నీకు కావలసినదీ లేదు. కోరదగినదీ లేదు. అయినా సమస్త మానవులయొక్క బంధవిముక్తికోసమై వాసుదేవుని సృష్టిలీలలను భక్తియుక్తంగా వర్ణించవయ్యా! శ్రీహరిని వర్ణించకుండా వేరొకవిధంగా భిన్నార్థాలు కల్పించి, ఇతరవర్ణనలు చేయడంవల్ల ఫలితం ఉండదు. అట్లు భిన్నదృష్టి కలవారికి నామరూపాత్మకమైన ప్రపంచం గోచరిస్తుంది తప్ప అభేదదృష్టి కలుగదు. అటువంటివారి బుద్ధి సుడిగాలిచే గిరగిర త్రిప్పబడి కొట్టుకొనిపోయే నావలాగా తీరం చేరలేదు.

సామాన్య మానవులకు కామ్యకర్మలపై ఆసక్తి ఎక్కువ. వారు చేయవలసిన ధర్మాలేవో చెప్పి శాసించడం నీవంటి వానికి తగదు. ఎందువల్లనంటే మూఢులు అదే ప్రధానమని భావించి కలుషితాలైన కామ్యకర్మలకే అలవాటు పడిపోతారు. అప్పుడు వారు పరమార్థాన్ని మరచిపోతారు. కాబట్టి వారి బుద్ధి పెడదారిపట్టకుండా తత్త్వోపదేశదృష్టి కలవాడవై జ్ఞానాన్ని అందించి వారి తాపత్రయ బాధలు నివారించుమని చెప్పి నారదుడు ఇంకా ఇలా అంటున్నాడు.

**చ. ఎఱిఁగెడు వాఁడు కర్మచయ మెల్లను మాని హరిస్వరూపమున్**
**నెఱయ నెఱింగి యవ్వలన నేరుపుఁ జూపు గుణానురక్తుఁడై**
**తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమానయుక్తుఁడై**
**యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరులీల లెఱుంగఁ జెప్పవే! 99**

**ప్రతి :** ఎఱిఁగెడువాఁడు= సదసద్వివేక జ్ఞానం కల్గినవాడు; కర్మచయము+ఎల్లను= ప్రవృత్తి ధర్మరూపమైన కామ్య; నిష్కామ్య కర్మనంతను; మాని= వదలివైచి; హరిస్వరూపమున్= శ్రీహరియొక్క నిర్వికల్పరూపమును; నెఱయన్= సంపూర్ణంగా; ఎఱింగి= దర్శించి; ఆ+వలనన్= ఆ హరిపై ఆనుకూల్యదృష్టితో; నేరుపున్= అనుభవాన్ని; చూపున్= ప్రదర్శిస్తాడు; గుణ+అనురక్తుఁడు+ఐ= త్రిగుణాల ప్రభావాలకు లోనయినవాడు; తెఱకువలేక= (జనన మరణ సంసారచక్రం నుంచి తప్పించుకోవాలనే) వివేకంలేక; దేహ, ధన+ఆది+అభిమాన, యుక్తుఁడు+ఐ= శరీరం; సంపద మున్నగువాటిపై అహంకార మమకారాలు కలవాడై; క్రుమ్మరుచున్= సంసారచక్రంలో తిరుగుతూ; ఎఱుఁగనివానికిన్= అజ్ఞానంలో ఉండిపోయేవానికి; తెలియన్= అర్థమయ్యేలా; ఈశ్వరులీలలు= భగవంతుని లీలలు; ఎఱుంగన్= స్పష్టమయ్యేలా; చెప్పవే= చెప్పవయ్యా!

**తా :** సదసద్వివేక విచక్షణుడైనవాడు సకల క్రియావ్యాపారాలను వదలివేస్తాడు. శ్రీ మహావిష్ణువుయొక్క నిర్వికల్పాత్మకమైన సచ్చిదానంద రూపాన్ని సంపూర్ణంగా దర్శిస్తాడు. ఆ స్వరూపంపై ఆనుకూల్యదృష్టి కలిగి భగవదనుభవం ప్రదర్శిస్తాడు. ఆ వివేకం లేనివాడు త్రిగుణాలకు లోనయినవాడై, జననమరణరూప సంసార చక్రంలో పరిభ్రమిస్తూ ఉంటాడు. తాను కాని దేహంపై “ఈ దేహమే నేను” అనే అహంకారంతో, తనవికాని సంపదలపై “ఇవి నావి” అనే మమకారంతో అజ్ఞానంలో సంచరిస్తూ ఉంటాడు. అటువంటి అజ్ఞానికి భగవంతుని లీలలు స్పష్టంగా అర్థమయ్యేలా వివరింపుము.

**చ. తన కులధర్మమున్ విడిచి దానవవైరిపదారవిందముల్**
**పనివడి సేవ సేసి పరిపాకము వొందక యెవ్వఁడేనిఁ జ**
**చ్చిన మఱుమేన నైన నది సిద్ధి వహించుఁ దదీయసేవఁ బా**
**సినఁ గులధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్? 100**

**ప్రతి :** తన కులధర్మమున్= తనకులానికి తగినట్లుగా ఆచరించవలసిన ధర్మాన్ని; విడిచి= వదలిపెట్టి; దానవవైరి= రాక్షసాంతకుడైన విష్ణువుయొక్క; పదారవిందముల్= పద్మాలవంటి పాదాలను; పని+పడి= పూనిక వహించి; సేవ+చేసి= సేవిస్తూ; పరిపాకము= కృతార్థతను; పొందక= చెందకుండానే; ఎవ్వఁడు+ఏనిన్= ఎవడైనా; చచ్చినన్= మరణిస్తే; మఱుమేనన్+ఐనన్= తరువాతి జన్మలోనైనా; అది= ఆ భక్తి; సిద్ధి= ఫలరూపాన్ని; వహించున్= ధరిస్తుంది; తదీయసేవన్= ఆ శ్రీహరికి సంబంధించిన సేవను; పాసినన్= వదలిపెడితే; కులధర్మగౌరవము= కులార్హములైన ధర్మాలు అనుష్ఠించడంవల్ల వచ్చే గొప్పతనం; ఎన్నిమేనులన్= ఎన్ని జన్మలకైనా; సిద్ధి= ధన్యత; వహించును+ఎ= లభిస్తుందా?

**తా :** మానవులు తమ వంశాన్ని అనుసరించి, ఆశ్రమాన్నిబట్టి అనుష్ఠించవలసిన ధర్మాలు ఎన్నో ఉన్నాయి. అవి తప్పకుండా చేయవలసిందే. ఎవడైనా ఏ కారణంవల్లనైనా వాటిని చేయలేని స్థితిలో వాటిని విడిచి గోవింద పదారవిందాలను భక్తితో సేవిస్తే, ఆ సేవ సిద్ధి పొందక మరణించినా, అతడికి నష్టమేమీ కలుగదు. అతడు ఈ జన్మలో కాకపోయినా, మరో జన్మలోనైనా తాను చేసిన దానికి ఫలం పొందుతాడు. అలా కాకుండా విష్ణుసేవకు దూరమై కులధర్మాలను పరమనిష్ఠతో ఆచరించినా, అవి సంసారహేతువులు కాబట్టి, వాడు ఎన్ని జన్మలెత్తినా కృతార్థుడు (మోక్షగామి) కాలేడు.

**వ. అది గావున నెఱుక గలవాఁడు హరిసేవకుం బ్రయత్నంబు సేయందగుఁ; గాలక్రమంబున సుఖ దుఃఖంబులు ప్రాప్తంబు లయినను హరిసేవ విడువం దగదు; దానం జేసి యూర్ధ్వంబున బ్రహ్మ పర్యంతంబు గ్రింద స్థావరపర్యంతంబుఁ దిరుగుచున్న జీవులకు నెయ్యది పొందరా దట్టిమేలు సిద్ధించు కొఱకు హరిసేవ సేయవలయు. హరిసేవకుం డగువాఁడు జననంబు నొందియు నన్యుని క్రియ సంసారంబునఁ జిక్కండు; క్రమ్మఱ హరిచరణస్మరణంబుఁ జేయుచు భక్తిరసవశీకృతుం డయి విడువ నిచ్చగింపఁడు; మఱియును. 101**

**ప్రతి :** అది+కావునన్= అదే సత్యం కాబట్టి; ఎఱుక+కలవాఁడు= జ్ఞానం కల్గిన మానవుడు; హరిసేవకున్= శ్రీహరిని సేవించడం కొఱకై; ప్రయత్నంబు= ఎల్లప్పుడూ కృషిని; చేయన్+తగున్= చేయడం మంచిది; కాలక్రమంబునన్= కాలగమనంలో; సుఖదుఃఖంబులు= సుఖాలు; దుఃఖాలు; ప్రాప్తంబులు+అయినను= వచ్చిపడుతున్నా; హరిసేవ= విష్ణుభజన; విడువన్+తగదు= విడిచిపెట్టరాదు; దానన్+చేసి= ఆ శ్రీహరిని కొలవడంవల్ల; ఊర్ధ్వంబునన్= పై లోకాలలో;

బ్రహ్మపర్యంతంబు= చతుర్ముఖ బ్రహ్మవరకును; క్రిందన్= అధోలోకాలలో; స్థావరపర్యంతంబున్= (కదలని) అచరాలవరకు; తిరుగుచున్న= పరిభ్రమిస్తున్న; జీవులకున్= ప్రాణికోటికి; ఏ+అది= ఏదైతే; పొందరాదు= సిద్ధించయోగ్యంకాదో; అట్టి మేలు= అటువంటి శుభం; సిద్ధించుకొఱకున్= ప్రాప్తించడానికై; హరిసేవ= విష్ణుభజనం; చేయవలయున్= కావించాలి; హరిసేవకుండు= హరిసేవాపరాయణుడు; అగువాఁడు= అయినవాడు; జననంబున్+ఒందియున్= ఒకవేళ తిరిగి జన్మను పొందినా; అన్యునిక్రియన్= ప్రాకృత మానవునివలె; సంసారంబునన్= భవబంధంలో; చిక్కండు= చిక్కుకొనడు; క్రమ్మఱన్= మరల; హరిచరణ స్మరణంబున్= వాసుదేవుని పాదచింతన; చేయుచున్= కావిస్తూ; భక్తిరసవశీకృతుండు+అయి= భక్త్యానందంలో పరవశుడై; విడువన్= శ్రీహరిని విడిచిపెట్టడానికి; ఇచ్చగింపఁడు= అంగీకరింపడు; మఱియును= అంతేకాక.

**తా :** ఇట్టి సత్యాన్ని తెలుసుకొన్న మానవుడు కర్మమార్గంపై అత్యంత ప్రీతి ప్రకటించకుండా ఎల్లప్పుడూ శ్రీహరిని సేవించడానికై ప్రయత్నం చేయడం చాలామంచిది. కాలానుసారంగా సుఖాలు కలుగుతూ ఉంటాయి. అప్పుడు సుఖాల్లో మునిగిపోయి మత్తుడై శ్రీహరిని విస్మరించడం తగదు. అలాగే దుఃఖాలు వస్తూ ఉంటే ఆ కష్టాలు భరించలేక హరిని సేవించడం మానరాదు. అందువల్ల పైనున్న బ్రహ్మ మొదలుకొని అధోలోకంలోని స్థావరాలవరకు పరిభ్రమించే జీవకోటికి హరిసేవ కర్తవ్యం. హరిసేవాపరాయణుడు ఒకవేళ తిరిగి జన్మనొందినా, అతడు సామాన్య మానవునిలా సంసారబంధంలో తగుల్కొనడు. ఆ సంస్కారంతో భక్త్యానంద సాగరంలో మునిగినవాడై శ్రీహరిసేవను విడిచిపెట్టకుండా జీవితం కొనసాగిస్తాడు.

**విశే :** ప్రాణులు జంగమాలు, స్థావరాలు అని రెండు విధాలు. కదిలే ప్రాణులు జంగమాలు. కదలని ప్రాణులు స్థావరాలు. వీటినే చరాలు, అచరాలు అంటారు. చరాచరాలలో పరమాత్మ వ్యాపించి ఉంటాడు. కాబట్టి చరాలుగా జన్మించినా, అచరాలుగా ఏర్పడినా విష్ణుభక్తి మానరాదని భావం.

**సీ. విష్ణుండు విశ్వంబు; విష్ణుని కంటెను వేఱేమియును లేదు; విశ్వమునకు**
**భవవృద్ధి లయము లా పరమేశుచే నగు; నీ వెఱుంగుదు గాదె నీ ముఖమున**
**నెఱిఁగింపఁ బడ్డది యేకదేశమున నీ భువనభద్రమునకై పుట్టినట్టి**
**హరికళాజాతుండ వని విచారింపుము; రమణతో హరిపరాక్రమము లెల్ల**

**ఆ. వినుతిసేయు మీవు వినికియుఁ జదువును, దాన మతుల నయముఁ దపము ధృతియుఁ**
**గలిమి కెల్ల ఫలముగాదె పుణ్యశ్లోకుఁ, గమలనాభుఁ బొగడఁ గలిగెనేని. 102**

**ప్రతి :** విశ్వంబు= ప్రపంచమంతా; విష్ణుండు= విష్ణువే; విష్ణునికంటెను= శ్రీమహావిష్ణువుకన్నా; వేఱు= భిన్నమైనది; ఏమియును= ఏదీ; లేదు= కానరాదు; విశ్వమునకున్= సమస్తలోకాలకు; భవ, వృద్ధి, లయములు= పుట్టుక, పెరుగుదల, నాశము; ఆ పరమేశుచేన్+అగున్= ఆ భగవంతునివల్లనే ఏర్పడుతున్నాయి; నీవు= ఓ వ్యాసమహర్షీ! నీవు; ఎఱుంగుదువు+ కాదె= తెలుసుకొన్న విషయమే కదా!; నీ ముఖమునన్= నీ వచనంద్వారా; ఏకదేశమునన్= ఒకచోట (అక్కడక్కడ); ఎఱిఁ గింపఁబడ్డది= తెలియజేయబడ్డదే కదా!; ఈ భువనభద్రమునకున్+ఐ= ఈ విశ్వకల్యాణానికై; పుట్టిన+అట్టి= అవతరించినట్టి; హరికళా, జాతుండవు= విష్ణువుయొక్క అంశచే జన్మించినవాడవు; అనివిచారింపుము= అని తెలుసుకొమ్ము; రమణతోన్= మహావైభవంతో; ఈవు= నీవు; హరిపరాక్రమములు+ఎల్లన్= విష్ణుమూర్తిని శౌర్యం మున్నగు వాటినన్నిటిని; వినుతి+చేయుము= విశేషంగా వర్ణించుము; వినికియున్= శ్రుతపాండిత్యం (శ్రవణం చేయడం); చదువును= వేదశాస్త్రాదులను అధ్యయనం చేయడం; దానము= దాతృత్వం; అతులనయమున్= సాటిలేని నీతి (ధర్మం); తపమున్=

ధ్యానం; ధృతియున్= ధైర్యం; కలిమికిన్= ఇవన్నీ కలిగియున్న సంపదకు; పుణ్యశ్లోకున్= పవిత్రమైన కీర్తిగల; కమలనాభున్= పద్మనాభుని; పొగడన్= వర్ణించడానికి; కలిగెన్+ఏని= సామర్థ్యమున్నచో; ఎల్లఫలము+కాదె= సమస్తమైన ఫలంకదా!

**తా :** ఈ ప్రపంచమంతా విష్ణుమయం. ఈ విశాలవిశ్వంలో విష్ణువుకన్న భిన్నమయింది ఏదీలేదు. ఆ భగవంతుని సంకల్పంవల్లనే సృష్టిస్థితి సంహారాలు ఏర్పడుతున్నాయి. వ్యాసమహర్షీ! నీవు సర్వం తెలిసినవాడవే కదా! ఈ విషయాన్నంతా అక్కడక్కడ మహాభారతం మున్నగువాటిలో నీవు చెప్పియున్నట్టిదే! విశ్వకల్యాణంకోసమై శ్రీహరి అంశతో అవతరించిన వాడవు నీవని గుర్తు ఉంచుకో. మహావైభవంగా ఆ గోవిందుని శౌర్యాదులను సంపూర్ణంగా వర్ణించు. మానవునకు ఉండే పాండిత్యం, వేదాధ్యయనం, దాతృత్వం, ధర్మానుష్ఠానం, తపస్సు, ధైర్యం, సంపద మున్నగు వాటికన్నింటికి పరిపూర్ణఫలం పవిత్ర కీర్తనుడైన పద్మనాభుని స్తుతించడమే కదా!

## ✤ నారదుని పూర్వజన్మ వృత్తాంతము ✤

**వ. మహాత్మా! నేను పూర్వకల్పంబునం దొల్లిటి జన్మంబున వేదవాదుల యింటి దాసికిం బుట్టి పిన్ననాఁడు వారలచేఁ బంపంబడి యొక్క వానకాలంబునఁ జాతుర్మాస్యంబున నేకస్థలనివాసంబు సేయ నిశ్చయించు యోగిజనులకుం బరిచర్య సేయుచు. 103**

**ప్రతి :** మహాత్మా!= గొప్పదైన బుద్ధికలవాడా! (ఆత్మజ్ఞానం కలవాడా!); నేను= నేను; పూర్వకల్పంబునన్= గడచిపోయిన బ్రహ్మకల్పంలో; తొల్లిటి జన్మంబునన్= నాదైన పూర్వజన్మలో; వేదవాదుల= వేదార్థ విచారణ చేసే శ్రోత్రియుల; ఇంటిదాసికిన్= ఇండ్లలో పనిచేస్తూ ఉండే ఒకానొక దాసికి; పుట్టి= కుమారుడుగా జన్మించి; పిన్ననాఁడు= చిన్నతనంలో; వారలచేన్= ఆ వేదవేత్తలచే; పంపన్+పడి= నియోగించబడి; ఒక్కవానకాలంబునన్= ఒక వర్షాకాలంలో; చాతుర్మాస్యంబునన్= నాలుగు నెలలును; ఏకస్థలనివాసంబు= ఒకేచోట నివసించటాన్ని; చేయన్= చేయుటకు; నిశ్చయించు= నిర్ణయించుకొన్న; యోగిజనులకున్= సన్న్యాసులకు; పరిచర్య+చేయుచున్= సేవలు చేస్తూ...

**తా :** నారదుడు తన పూర్వజన్మ వృత్తాంతం ఇలా చెప్పుతున్నాడు. ఓ మహానుభావా! గడచిపోయిన బ్రహ్మకల్పంలో నాదైన పూర్వజన్మలో నేనొక దాసీపుత్రుణ్ణి. నా తల్లి వేదవిచారణ చేసే శ్రోత్రియుల ఇండ్లలో పనిచేస్తూ ఉండేది. నేను చిన్నవాడుగా ఉన్నప్పుడు ఆ వేదవేత్తలు వానకాలంలో ఒకేచోట చాతుర్మాస్యవ్రతం చేస్తున్న యోగులకు సేవ చేయటానికి నన్ను పంపారు. నేను సేవ చేస్తుండగా.

**విశే :** చాతుర్మాస్యవ్రతం నాలుగునెలలు సన్న్యాసులు చేసే వ్రతం. వానకాలంలో ప్రారంభమై శరదృతు పర్యంతం సాగేవ్రతం. ఒకేచోట చేసే వ్రతం. నియమనిష్ఠలతో కూడుకొన్న వ్రతం.

**క. ఓటమితో నెల్లప్పుడుఁ, బాటవమునఁ బనులు సేసి బాలురతో నే**
**యాటలకుఁ బోక యొక జం, జాటంబును లేక భక్తి సలుపుదు ననఘా! 104**

**ప్రతి :** అనఘా!= ఓ పుణ్యాత్ముడా!; ఓటమితోన్= భయభక్తులతో; ఎల్లప్పుడున్= సర్వకాలాల్లోను; పాటవమునన్= సామర్థ్యంతో; పనులు+చేసి= (వారుచెప్పిన) పనులుచేసి; బాలురతోన్= నాతోటి పిల్లలతో; ఏ+ఆటలకున్= ఏ క్రీడలు ఆడడానికి; పోక= వెళ్లక; ఒక= వేరొక; జంజాటంబును= తగులాటమును; లేక= లేకుండా; భక్తిన్= భక్తితో వారికి సేవను; చలుపుదున్= చేశాను.

**తా :** పుణ్యాత్మా! నేను భయభక్తులతో అన్నివేళల ఆ పరమహంసలను సేవించాను. ఓర్పు చూపించి నా నేర్పు ప్రకటించాను. చిన్నవయస్సయినా, ఆటపాటలపై ఆసక్తి ఉండే ప్రాయమయినా, నాతోడి బాలురతో ఆవంకకుపోకుండా మనస్సు కట్టడి చేసుకొని, ఎలాంటి సంబంధం ఎవరితో పెట్టుకోకుండా శ్రద్ధాభక్తులతో వారిని ఆరాధించాను.

**క. మంగళ మనుచును వారల, యెంగిలి భక్షింతు; వాన కెండకు నోడన్;**
**ముంగల నిలుతును నియతిని; వెంగలి క్రియఁ జనుదు నురువివేకము తోడన్. 105**

**ప్రతి :** మంగళము+అనుచును= సమస్త శుభాలను కలుగజేస్తుందని అనుకొంటూ; వారల+ఎంగిలిన్= వారు తినగా మిగిలిన దానిని; భక్షింతున్= భుజించాను; వానకున్= వానలో తడియటానికీ; ఎండకున్= ఎండలో మాడిపోవటానికి; ఓడన్= జంకలేదు; ముంగలన్= వారిముందు; నియతిని= నియమనిష్ఠలతో; నిలుతును= నిలబడియుండేవాడిని; ఉరువివేకముతోడన్= గొప్ప తెలివితో (ఉండికూడా); వెంగలిక్రియన్= వెఱ్ఱివానివలె; చనుదున్= ప్రవర్తించేవాడిని.

**తా :** ఆ సన్న్యాసులు భిక్షాపాత్రలలో మిగిల్చివేసిన ఎంగిలి పదార్థాలను భుజిస్తూ ఉండేవాడిని. ఆ ఉచ్ఛిష్టం సకలపాపనాశకం, సమస్త మంగళకరమని భావించేవాడిని. వానలో తడిసినా, ఎండలో మాడినా వెనుకాడకుండ వారికి సేవ చేశాను. వారు ఏమి ఆజ్ఞాపిస్తారో అని నిరంతరం వారిముందు నియమనిష్ఠలతో నిలబడి ఉండేవాడిని. వివేకం ఉన్న వాడనయినా వారేమి చెప్పినా ఇదికాదు, అదికాదని మారుమాటాడక ఒక వెఱ్ఱివానిలా ప్రవ ర్తించి పనులు నెరవేరుస్తూ ఉండేవాడిని.

**విశే :** "నియతిని" అనే పదం రెండువాక్యాలకు అటూ ఇటూగా కూడ అన్వయిస్తుంది.

**వ. ఇట్లేను వర్షాకాల శరత్కాలంబులు సేవించితి; వారును నాయందుఁ గృపసేసి రంత. 106**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; ఏను= నేను; వర్షాకాల శరత్కాలంబులు= వర్షర్తువు; శరదృతువు నాలుగు మాసాలు; సేవించితిన్= పరిచర్య చేశాను; వారును= ఆ పుణ్యాత్ములుకూడ; నా+అందున్ (నాయందున్)= నాపై; కృప+చేసిరి= దయ చూపించారు; అంత= అటుపిమ్మట.

**తా :** ఈ రీతిగా వర్షాకాల శరత్కాలాలు నాలుగు నెలలూ వారిని భక్తితో ఆరాధించాను. ఆ మహానుభావులు కూడా నాపై దయ చూపించారు. ఆ సమయంలో.

**శా. వారల్ కృష్ణ చరిత్రముల్ చదువఁగా వర్ణింపఁగాఁ బాడఁగా**
**నా రావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం**
**దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నే నంతటం**
**బ్రారంభించితి విష్ణుసేవ కితరప్రారంభదూరుండనై. 107**

**ప్రతి :** వారల్= ఆ వేదవేత్తలు; కృష్ణచరిత్రముల్= విష్ణుగాథలను; చదువఁగాన్= పఠింపగా; వర్ణింపఁగాన్= వివరిస్తూ ఉండగా; పాడఁగాన్= గానం చేస్తూ ఉండగా; ఆ రావంబు= ఆ ధ్వని; సుధారసప్రతిమము+ఐ= అమృతరసంతో సమానమై; అశ్రాంతమున్= నిరంతరం; వీనులన్= చెవులలో; తోరంబు+ఐ= అధికమై; పరిపూర్ణము+ఐనన్= నిండిపోగా; మదిన్= మనస్సులో; సంతోషించి= ఆనందించి; నేను= నేను; అంతటన్= ఆ సమయంలో; ఇతర ప్రారంభదూరుండను+ఐ= మిగిలిన పనులకు దూరంగా ఉన్నవాడనై; విష్ణుసేవకున్= నారాయణసేవకు; ప్రారంభించితిన్= ఉపక్రమించాను.

**తా :** ఆ పరమహంసలు నిత్యం కృష్ణచరిత్రను పఠిస్తూ ఉండేవారు. విశేష వ్యాఖ్యానంతో వివరిస్తూ ఉండేవారు. ఒక్కొక్క సమయంలో నామసంకీర్తనం చేస్తూ ఉండేవారు. ఆ ధ్వనులు అమృతరస ప్రవాహాలై నా చెవులలో నిత్యమూ నిండిపోయాయి. నా హృదయం ఆనందంతో సంతృప్తి చెందింది. క్రమక్రమంగా ఇతర చింతలన్నీ వదలి వేశాను. భక్తితో నారాయణ సేవ ప్రారంభించాను.

**విశే :** ఉదయం పారాయణమూ, మధ్యాహ్నం నామసంకీర్తనం, సాయంసమయం ప్రవచనం – అని ఒక సంప్రదాయం.

**వ. ఇట్లు హరిసేవారతిం జేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండనయిన నాయందు స్థూల సూక్ష్మంబయిన యీ శరీరంబు నిజమాయాకల్పితంబని య మ్మహాత్ములగు యోగిజనుల మూలంబున రజస్తమోగుణపరిహారిణి యయిన భక్తి సంభవించె; నంతఁ జాతుర్మాస్యంబు నిండిన న య్యోగిజనులు యాత్ర సేయువారలై; రివ్విధంబున. 108**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హరిసేవారతిన్+చేసి= విష్ణుభజనాసక్తిచేత, ప్రపంచ+అతీతుండను+ఐ= ప్రాపంచిక విషయాలకు దూరంలో ఉన్నవాడనై; బ్రహ్మరూపకుండను= బ్రహ్మస్వరూపుడను; అయిన+నా+అందున్= అయినట్టి నా విషయంలో; స్థూలసూక్ష్మంబు+అయిన= స్థూలం; సూక్ష్మం అనే భేదాలుగల; ఈ శరీరంబు= ఈ దేహం; నిజమాయాకల్పితంబు+అని= నా అజ్ఞానంచే కల్పింపబడినది మాత్రమేయని; ఆ+మహా+ఆత్ములు+అగు= ఆ మహానుభావులైన; యోగిజనులమూలంబునన్= యోగీశ్వరుల అనుగ్రహకారణంగా; రజస్+తమస్+గుణపరిహారిణి+ అయిన= రజోగుణాన్ని; తమోగుణాన్ని రూపుమాపే; భక్తి= శుద్ధసాత్త్విక భక్తి; సంభవించెన్= ఏర్పడింది; అంతన్= అటుతరువాత; చాతుర్మాస్యంబు= నాలుగు నెలలు (ఆ కాలవ్యవధిగల వ్రతం); నిండినన్= ముగియగా; ఆ+యోగిజనులు= ఆ పరివ్రాజకులు; యాత్ర+చేయువారలు+ఐరి= యాత్రలు చేయడానికై ఉద్యుక్తులయ్యారు; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** ఈ విధంగా నేను అనుష్ఠించిన విష్ణుభక్తివల్ల నేను ప్రాపంచిక వాసనలకు దూరమయ్యాను. ప్రపంచాతీతుణ్ణిగా మారి బ్రహ్మస్వరూపుడను అయ్యాను. స్థూలసూక్ష్మరూపమైన శరీరం నాయందు మాయచే ఆరోపించబడిందని తెలుసుకొన్నాను. ఒక్క విష్ణుభక్తివల్లనే నాకిటువంటి శుద్ధజ్ఞానం ఏర్పడింది. ఆ యోగీంద్రుల అనుగ్రహంవల్ల లోభకారణమైన రజస్సు, అజ్ఞానహేతువైన తమస్సు అంతరించాయి. ఆ మహానుభావుల చాతుర్మాస్యవ్రతం కూడ పూర్తి అయింది. వారు ఆ ప్రదేశం విడిచి మరోప్రదేశానికి వెళ్లడానికి ఉద్యుక్తులయ్యారు.

**మ. అపచారంబులు లేక నిత్యపరిచర్యాభక్తియుక్తుండనై**
**చపలత్వంబును మాని నేఁగొలువఁగా సంప్రీతులై వారు ని**
**ష్కపటత్వంబున దీనవత్సలతతోఁ గారుణ్యసంయుక్తులై**
**యుపదేశించిరి నాకు నీశ్వరరహస్యోదారవిజ్ఞానమున్. 109**

**ప్రతి :** అపచారంబులులేక= పెద్దలపట్ల ఏ తప్పు చేయకుండా; నిత్య= ఎల్లప్పుడూ; పరిచర్యా= సేవతో కూడుకొన్న; భక్తి= ప్రీతితో; యుక్తుండను+ఐ= కూడియున్నవాడనై; చపలత్వంబును= బాల్యానికి సహజమైన చంచలత్వం; మాని= వదలి; నేన్= నేను; కొలువఁగాన్= వారిని సేవించగా; వారు= ఆ యోగులు; సంప్రీతులు+ఐ= మిక్కిలి తృప్తి పొందినవారై; నిష్కపటత్వంబునన్= ఏ వంచనా లేని మనస్సుతో; దీనవత్సలతతోన్= దీనులందు వాత్సల్యంతో; కారుణ్యసంయుక్తులు+ఐ=

దయతో కూడినవారై; నాకున్= నాకు; ఈశ్వర= పరమాత్మకు సంబంధించిన; రహస్య= రహస్యమైన; ఉదార= గొప్ప; విజ్ఞానమున్= బ్రహ్మజ్ఞానాన్ని; ఉపదేశించిరి= బోధించారు.

**తా :** బాల్యానికి సహజమైన చపలత్వాన్ని వీడి, భక్తితో ఆ పెద్దలకు పరిచర్యలు చేయగా, వారు సంతృప్తిచెంది, వాత్సల్యంతో, దయతో, అరకొరలు లేకుండ అమోఘం, అతిరహస్యమైన బ్రహ్మవిజ్ఞానాన్ని నాకు ఉపదేశించారు.

**విశే :** సాధారణంగా శిష్యులొనరించే దోషాలు మూడువిధాలు (1) అకృత్యకరణం (2) కృత్యాకరణం (3) అన్యథాకరణం. అకృత్యకరణమనగా చేయకూడని దానిని చేయడం. కృత్యాకరణమనగా చేయవలసినదానిని చేయకపోవడం. అన్యథాకరణమనగా చెప్పినదానికి భిన్నంగా చేయడం. ఇట్టి త్రివిధ దోషాలు వదలి నారదుడు ఆ పరమహంసలను సేవించాడు.

**రహస్యం :** అతిభద్రంగా పరిరక్షించుకొనవలసినది. అయోగ్యులకు అందరానిదిగా చేయవలసినది.

**వ. ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబుఁ దెలిసితి; నీశ్వరునియందు సమర్పితం బయిన కర్మంబు తాపత్రయంబు మానుప నౌషధంబగు; నే ద్రవ్యంబువలన నే రోగంబు జనియించె నా ద్రవ్యం బా రోగంబు మానుపనేరదు; ద్రవ్యాంతరంబులచేత నైన చికిత్స మానుప నోపు; ఇ వ్విధంబునఁ గర్మంబులు సంసారహేతుకంబు లయ్యు నీశ్వరార్పితంబులై తాము తమ్ముఁ జెఱుపుకొన నోపియుండు; నీశ్వరునియందుఁ జేయంబడు కర్మంబు విజ్ఞానహేతుకంబై నీశ్వరసంతోషణంబును భక్తియోగంబునుం బుట్టించు; నీశ్వరశిక్షంజేసి కర్మంబులు సేయువారలు కృష్ణగుణ నామవర్ణన స్మరణంబులు సేయుదురు; ప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్ష ణానిరుద్ధమూర్తి నామంబులు నాలుగు భక్తిం బలికి నమస్కారంబు సేసి మంత్రమూర్తియు, మూర్తిశూన్యుండు నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుం డగు. 110**

**ప్రతి :** ఏనును= నేనుకూడ; వారి+ఉపదేశంబునన్= ఆ మహర్షుల బ్రహ్మజ్ఞానోపదేశంవల్ల; వాసుదేవుని= దేవదేవుని; మాయా+అనుభావంబున్= మాయయొక్క ప్రభావాన్ని; తెలిసితిన్= తెలుసుకొన్నాను; ఈశ్వరుని+అందున్= వాసుదేవునియందు; సమర్పితంబు+అయిన= పూర్తిగా అర్పించబడిన; కర్మంబు= కర్మమే; తాపత్రయంబున్= ఆధ్యాత్మికం ఆధిదైవికం; ఆధిభౌతికం అనే మూడు తాపాలను; మానుపన్= పోగొట్టే; ఔషధంబు+అగున్= మందు అవుతుంది; ఏ ద్రవ్యంబువలనన్= ఏ పదార్థంచేత; ఏ రోగంబు; జనియించెన్= ఏర్పడుతుందో; ఆ ద్రవ్యంబు= ఆ పదార్థం; ఆ రోగంబున్= ఆ జబ్బును; మానుపన్+నేరదు= పోగొట్టలేదు; ద్రవ్య+అంతరంబులచేతన్+ఐనన్= ఇతర పదార్థాలవల్ల మాత్రమే (సంయోగపదార్థాలు); చికిత్సన్= వైద్యంద్వారా; మానుపన్+ఓపున్= రూపుమాపవచ్చు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; కర్మంబులు= మానవులాచరించే కర్మలు; సంసారహేతుకంబులు+అయ్యున్= భవబంధకారకాలైనప్పటికి; ఈశ్వర+అర్పితంబులు+ఐ= ఈశ్వరునికి సమర్పించబడినవై; తాము= ఆ కర్మలు; తమ్మున్= తమను; చెఱుపుకొనన్= నివృత్తి చేసుకోవడానికి; ఓపున్= సామర్థ్యం కల్గినవవుతాయి; ఈశ్వరునియందున్= భగవంతునియందు; చేయన్+పడు= ఫలసమర్పణచేసే; కర్మంబు= క్రియావిశేషం; విజ్ఞానహేతుకంబై= జ్ఞానప్రాప్తికి కారణమై; ఈశ్వరసంతోషణంబును= పరమేశ్వరునకు సంతోషాన్ని; భక్తియోగంబునున్= అనన్యభక్తియోగాన్ని; పుట్టించున్= ప్రభవింపజేస్తుంది; ఈశ్వరశిక్షన్+చేసి=

ఈశ్వరానుగ్రహంవల్ల; కర్మంబులు= ధర్మానుగుణమైన కర్మలు; చేయువారలు= చేసేవారు; కృష్ణ= శ్రీమహావిష్ణువుయొక్క; గుణ= గుణాలయొక్క (గుణాలు); నామ= మంత్రాలయొక్క (నామాలు); వర్ణన= స్తుతులయొక్క (స్తుతులు); స్మరణంబులు= చింతనములు; చేయుదురు= కావిస్తారు; ప్రణవపూర్వకంబులుగాన్= ఓంకారపూర్వకంగా; వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ+అనిరుద్ధమూర్తినామంబులు= వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, సంకర్షణాయ నమః, అనిరుద్ధాయ నమః అనే వ్యూహమూర్తుల మంత్రాలను; నాలుగు= నాలుగింటిని; భక్తిన్= మహాభక్తితో; పలికి= ఉచ్చరించి; నమస్కారంబు+చేసి= వందనమొనర్చి; మంత్రమూర్తియున్= మంత్రాలే స్వరూపంగా కలవాడును; మూర్తిశూన్యుండును= ఏ ఆకారమూ లేనివాడును; అయిన= అయినటువంటి; యజ్ఞపురుషున్= యజ్ఞస్వరూపుడైన భగవంతుని; పూజించు= అర్చించే; పురుషుండు= జీవుడు (మానవుడు); సమ్యక్+దర్శనుండు+అగున్= ఆత్మజ్ఞానం కలవాడవుతాడు.

**తా :** నేను కూడా ఆ మహాత్ముల దివ్యోపదేశంవల్ల దేవదేవుడైన వాసుదేవుని మాయాప్రభావాన్ని తెలుసుకొన్నాను. మానవులు ఆచరించే కర్మలు మంచివయితే సత్ఫలితాలను, చెడువయితే దుష్ఫలితాలను అందజేస్తాయి. అవే ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం అనే తాపత్రయాలకు మూలకారణాలు అవుతాయి. జీవులు ఆ కర్మఫలితాలను ఈశ్వర సమర్పణం చేస్తే ఈ మూడురకాల తాపాలు రూపుమాపే పరమౌషధం అవుతుంది. అంటే ఫలేచ్ఛతో చేసే యజ్ఞాదికర్మలు జన్మకారకాలు అవుతున్నాయి. ఫలకాంక్ష వదలి చేస్తే, సమస్త కర్మలు ఈశ్వర సమర్పణంగా కావిస్తే సంసార మోక్షానికి కారణమవుతున్నాయని దీని భావం.

ఈ లోకంలో ఏ పదార్థం తినడంవల్ల ఏ రోగం పుడుతుందో, ఆ పదార్థం మితిమీరి భక్షించడంవల్ల ఆ జబ్బు వృద్ధి పొందుతుందే కాని రూపుమాసిపోదు. కాని అదే పదార్థాన్ని వేరే పదార్థంతో కలిపినప్పుడు చికిత్స జరిగి అది ఔషధంగా మారి, తినేవాని రోగం పోగొడుతుంది. ఆ విధంగా సంసారాన్ని ఏర్పరచే కర్మ ఈశ్వరార్పణ బుద్ధితో మిళితమై సంసార నివృత్తి చేసుకోవడానికి కారణమై తన అస్తిత్వాన్ని కోల్పోతుంది.

భగవంతునియందు ఫలసమర్పణచేసే సమస్త కర్మ జ్ఞానప్రాప్తికి కారణ మవుతుంది. ఈశ్వరునకు ఆనందాన్ని కలుగజేస్తుంది. అనన్య నిష్కళంక భక్తియోగాన్ని అనుగ్రహిస్తుంది.

ఈశ్వరానుగ్రహంవల్ల కర్మలాచరించేవారు శ్రీమహావిష్ణు గుణనామవర్ణన స్మరణం కావిస్తారు. "ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః" అని భగవంతుని చతుర్వ్యూహాలకు సంబంధించిన మంత్రాలు నాలుగింటిని మహాభక్తితో పురశ్చరణ చేస్తూ వందనం సమర్పిస్తారు. మంత్రాలే స్వరూపంగా గల్గిన భగవంతుని, భక్తులను అనుగ్రహించడానికి మూర్తిమంతుడైనా, వాస్తవానికి మూర్తరూపంలేని భగవంతుని, "యజ్ఞోవైవిష్ణుః" కావున యజ్ఞస్వరూపుడైన భగవంతుని ఆరాధించి పురుషుడు సమ్యగ్దర్శనం కలిగి ఆత్మజ్ఞాని అవుతాడు.

**క. ఏ నవ్విధమునఁ జేయఁగ, దానవకులవైరి నాకుఁ దనయందలి వి**
**జ్ఞానము నిచ్చెను మదను, ష్ఠానము నతఁ డెఱుఁగు, నీవు సలుపుము దీనిన్. 111**

**ప్రతి :** ఏను= నేను; ఆ+విధమునన్= ఆ రీతిగా; చేయఁగన్= ఆచరించగా; దానవకులవైరి= రాక్షస వంశానికి శత్రువైన విష్ణువు; తన+అందలి+విజ్ఞానమున్= తన స్వరూపాన్ని గూర్చిన జ్ఞానాన్ని; నాకున్= నాకు; ఇచ్చెను= ప్రసాదించాడు; మదనుష్ఠానమున్= నా భక్త్యాచరణాన్ని అంతా; అతఁడు= ఆ భగవంతుడు; ఎఱుఁగున్= తెలుసుకొన్నాడు (గ్రహించాడు); దీనిన్= ఈ భక్తి పద్ధతిని; నీవు= నీవుకూడ; చలుపుము= ఉపాసించవయ్యా!

**తా :** వ్యాసమునీంద్రా! నేను ఉపాసించిన భక్తియోగానికి నారాయణుడు సంతసించి నాకు తన స్వరూప జ్ఞానాన్ని అనుగ్రహించాడు. నా అనుష్ఠానవిధానం ఆ భగవంతునకు తెలుసు. నీవుకూడా ఆ మార్గంలో శ్రీ మహావిష్ణువును ఉపాసించు.

**క. మునికులములోన మిక్కిలి, వినుకులు గలవాఁడ వీవు; విభుకీర్తులు నీ**
**వనుదినముఁ బొగడ వినియెడి, జనములకున్ దుఃఖ మెల్ల శాంతిం బొందున్. 112**

**ప్రతి :** ఈవు= నీవు; మునికులములోనన్= మునుల సమూహంలో; మిక్కిలి= అధికమైన; వినుకులు (వినికి+లు)= విని తెలుసుకొన్నవి (విజ్ఞాన విషయాలు); కలవాఁడవు= పొందినవాడవు; నీవు= నీవంటివాడు; విభుకీర్తులు= నారాయణ సంకీర్తనలను; అనుదినమున్= ప్రతిదినమును; పొగడన్= స్తుతిచేస్తూ ఉండగా; వినియెడి= వినేటటువంటి; జనులకున్= మనీషులకు; దుఃఖము+ఎల్లన్= సమస్త కష్టాలు; శాంతిన్+పొందున్= నాశనమైపోతాయి.

**తా :** నీవు మహర్షి మండలిలో అగ్రగణ్యుడవు. గొప్పజ్ఞానం కలవాడవు. నీవు నారాయణ సంకీర్తన ప్రతిదినం కావిస్తూ ఉంటే, వినే సమస్త మానవుల (జీవుల) దుఃఖాలన్నీ పటాపంచలైపోతాయి.

**వ. ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుం డిట్లనియె. 113**

**ప్రతిప్రదార్థం :** ఇట్లు= ఈ విధంగా; నారదు, జన్మకర్మంబులు= నారద మహర్షియొక్క పుట్టుకను కర్మవిధులను; విని= ఆకర్ణించి; క్రమ్మఱన్= మరల; వ్యాసుండు= ద్వైపాయన మహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా నారదుడు దాసీపుత్రుడుగా జన్మించడం, ఆ జన్మలో ఆత డొనర్చిన సమస్తకార్యాలూ విని, వ్యాసమహర్షి ఇలా అన్నాడు.

**మ. విను మా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పి పో**
**యిన బాల్యంబున వృద్ధభావమున నీ కే రీతి సంచారముల్**
**సనె? నీ కిప్పుడు పూర్వకల్పమతి యే జాడం బ్రదీపించెఁ? ద**
**త్తనువుంబాసిన చంద మెట్లు? చెపుమా! దాసీసుతత్వంబుతోన్. 114**

**ప్రతి :** వినుము= ఆలకించు; ఆ భిక్షులు= ఆ యతీశ్వరులు; నీకున్= బాలుడవైన నీకు; ఇట్లు= ఈ విధంగా; కరుణన్= కృపతో; విజ్ఞానమున్= తత్త్వజ్ఞానాన్ని; చెప్పి= బోధించి; పోయినన్= వెళ్లిపోగా; బాల్యంబునన్= చిన్నతనంలో; వృద్ధభావమునన్= ముసలితనంలో; నీకున్= నీకు; ఏ రీతిన్= ఏ విధంగా; సంచారముల్= జీవన ప్రవృత్తులు; చనెన్= గడిచాయి?; నీకున్= నీకు; ఇప్పుడు= ఈ జన్మలో; పూర్వకల్పమతి= గడచిపోయిన బ్రహ్మకల్పానికి సంబంధించిన స్మృతి; ఏ జాడన్= ఏ విధంగా; ప్రదీపించెన్= ప్రస్ఫురించింది?; దాసీసుతత్వంబుతోన్= దాసీపుత్రునిగా పుట్టిన జన్మప్రవృత్తితో; తత్+తనువున్= ఆ శరీరాన్ని; పాసిన= విడిచిపెట్టిన; చందము= పద్ధతి; ఎట్లు= ఎట్టిదో; చెపుము+ఆ= వివరించవయ్యా!

**తా :** నారదమునీంద్రా! నీవా బాలుడవన్నావు. దాసీపుత్రుడవన్నావు. ఆ యతిపుంగవులు నీకు చిన్నతనంలోనే బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించి వెళ్లిపోయారన్నావు. ఆ తరువాత నీ వెంతకాలం జీవించావు? నీ బాల్యం ఎలా గడిచింది? ముసలితనంలో ఏ రీతిగా సంచరించావు? ఎవరికైనా పూర్వజన్మస్మృతి కలగడమే కష్టం. కాని నీకు పూర్వకల్ప స్మరణం కలిగింది. అది నీకు ఏ విధంగా స్ఫురించింది? దాసీపుత్రుడవైన నీవు ఏ విధంగా శరీరాన్ని వదలిపెట్టావు. ఆ వృత్తాంతాన్ని అంతా వివరించు.

**వ. అని యిట్లు వ్యాసుం డడిగిన నారదుం డిట్లనియె, దాసీ పుత్రుండ నయిన యేను భిక్షుల వలన హరి జ్ఞానంబు గలిగి యున్నంత. 115**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; వ్యాసుండు= వ్యాసమహర్షి; అడిగినన్= ప్రశ్నించగా; నారదుండు= నారదమునీంద్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా సమాధానమిచ్చాడు; దాసీపుత్రుండను+అయిన= దాసియొక్క కుమారుడను ఐన; ఏను= నేను; భిక్షులవలనన్= ఆ యతులవల్ల; హరిజ్ఞానంబు= ఈశ్వరజ్ఞానాన్ని; కలిగి+ఉన్నంతన్= పొంది ఉండగా...

**తా :** వ్యాసుడు ఈ విధంగా ప్రశ్నించగా, నారదుడు ఇట్లు ప్రత్యుత్తరం ఇచ్చాడు. ఒక దాసీతనూజుడనైన నేను ఆ యతీంద్రులవల్ల ఈశ్వరజ్ఞానాన్ని పొందియుండగా ఇలా జరిగింది.

**విశే :** ఇచ్చట భిక్షుశబ్దానికర్థం పరమహంస అనే చెప్పాలి. కేవలం భిక్షాటన చేసుకొనేవారు మాత్రం కాదు. లేనిచో ఆత్మజ్ఞానోపదేశం చేయలేరు కదా!

**సీ. మమ్ము నేలినవారి మందిరంబునఁ గల పనులెల్లఁ గ్రమమున భక్తిఁ జేసి**
**తన పరాధీనతఁ దలఁపదు; సొలసితి నలసితి నాకొంటి ననుచు వచ్చి**
**మాపును రేపును మా తల్లి మోహంబు సొంపార ముద్దాడు; చుంచు దువ్వు;**
**దేహంబు నివురు; మోదించుఁ; గౌఁగిటఁ జేర్చు; నర్మిలి న న్నిట్టు లరసి మనుప**

**ఆ. నేను విడిచి పోక యింట నుండితి నయ్య!, మోహిఁగాక, యెఱుక మోసపోక,**
**మాఱుచింత లేక మౌనినై యేనేండ్ల, వాఁడ నగుచుఁ గొన్ని వాసరములు. 116**

**ప్రతి :** మమ్మున్= మమ్ములను; ఏలినవారి= పోషించేవారియొక్క; మందిరంబునన్= ఇంటియందు; కల= చేయవలసియున్న; పనులు+ఎల్లన్= పనులనన్నింటిని; క్రమమునన్= ఒకదాని తరువాత ఒకటి వరుసగా; భక్తిన్+చేసి= భక్తితో పూర్తిచేసి; తన పరాధీనతన్= తన దాస్యాన్నిగూర్చి (అస్వతంత్రత); తలఁపదు= కించపడేది కాదు; సొలసితిన్= నేను మూర్ఛపొందాను; అలసితిన్= శ్రమ పొందాను; ఆకొంటిన్= ఆకలిని పొందాను; అనుచున్= అనుకొంటూ (అంటూ); వచ్చి= (నాకడకు) ఏతెంచి; మాపును= సాయంసమయంలోను; రేపును= ఉదయసమయంలోను; మా తల్లి= నా జనని; మోహంబు= పుత్రప్రేమ; సొంపారన్= ఎక్కువకాగా; ముద్దాడున్= ముద్దు పెట్టుకొనేది; చుంచు= పిల్లజుట్టును; దువ్వున్= దువ్వుతుండేది; దేహంబున్= మేనును; నివురున్= చేతులతో నిమిరేది; మోదించున్= సంతోషించేది; కౌఁగిటన్= అక్కున; చేర్చున్= చేర్చుకొనేది; అర్మిలిన్= అనురాగంతో; నన్నున్= నన్ను; ఇట్టులు= ఈ విధంగా; అరసి= ఆదరించి; మనుపన్= పెంచుతుండగా; నేను= నేనామెను; విడిచిపోక= వదలిపోలేక; ఇంటన్= ఇంట్లోనే; ఉండితిని+అయ్య!= ఉండిపోయాను వ్యాసమునీంద్రా!; మోహిన్+కాక= తల్లిప్రేమలో మోహాన్ని పొందక; ఎఱుక= ఆత్మజ్ఞానాన్ని; మోసపోక= జారవిడువక; మాఱుచింత లేక= వేరే ఆలోచన లేక; మౌనిని+ఐ= ఎవ్వరితోనూ మాట్లాడక; ఏను+ఏండ్లవాఁడను= అయిదేండ్ల వయస్సు కల్గినవాడను; అగుచున్= అయియుండి; కొన్ని వాసరములు= కొన్ని రోజులు...

**తా :** నా తల్లి తన పనికి మాత్రమే అంకితమైన ఉత్తమవ్యక్తి. మమ్ము పోషించేవారి ఇండ్లలోని పనులన్నీ ఒకదాని తరువాత ఒకటి వరుసగా చేసుకొనిపోయేది. తన దాస్యాన్ని గూర్చికాని, తన పరాధీనతను గూర్చికాని ఆమె కించిత్తూ కించపడేది కాదు. నేనంటే నా తల్లికి పంచప్రాణాలు. నేనుకూడా ఆ యజమానులకు అటూ ఇటూ సేవచేస్తూ అలసిపోయానని,

సొలసిపోయానని, ఆకలిని పొందానని వాపోయేది. ఉదయం, సాయంకాలం పుత్రప్రేమతో నన్ను ముద్దాడేది. జుట్టు దువ్వేది. మేను నిమిరేది. ఆప్యాయతతో అక్కున చేర్చుకొనేది. ఇట్లు నన్ను ఆదరంతో పెంచుతూ ఉండగా, చేసేది దాస్యమనే విషయం విస్మరించి, ఆమెను విడిచిపోలేక ఇంట్లోనే ఉండిపోయాను. ఆ తల్లి అనురాగంలో నేను సంసారవ్యామోహంలో మాత్రం చిక్కుకోలేదు. కలిగిన ఆత్మజ్ఞానాన్ని విస్మరించలేదు. వేరే ధ్యాసలేక, ఎవరితోను మాట్లాడక, నా తల్లి దగ్గరే కొద్దిరోజులు కాలం గడిపాను. అప్పటికి నాకు ఐదేండ్ల వయస్సు మాత్రమే.

**విశే :** "ఈ పద్యంలో తల్లి పుత్రునిపై కన్పరచే ప్రేమ సవివరంగా తెలియజేయబడింది. ఆత్మజ్ఞానం కలిగిన నారదుడు ఆ ప్రేమలో మోహితుడు కాలేదంటే అదే జీవన్ముక్త స్థితి. జీవన్ముక్తుడు సంసారంలో ఉన్నా, తామరాకుమీది నీటిబొట్టులో సంగం లేకుండా జీవిస్తాడనేదానికి ఇది నిదర్శనం.

**క. సదనము వెలువడి తెరువునఁ, జెదరక మా తల్లి రాత్రిఁ జీఁకటివేళన్**
**మొదవుం బిదుకఁగ నొకఫణి, పదభాగముఁ గఱచెఁద్రొక్కఁబడి మునినాథా! 117**

**ప్రతి :** మునినాథా= మునీశ్వరా!; సదనము= ఇంటినుంచి; వెలువడి= బయలుదేరి; తెరువునన్= మార్గంలో; చెదరక= దారితప్పక వెడుతూ; మా తల్లి= నా జనని; రాత్రిన్= ఒక రాత్రియందు; చీఁకటివేళన్= చీకటి సమయంలో; మొదవున్= ఆవును; పిదుకఁగన్= పాలుపిండబోగా; ఒక ఫణి= ఒక పాము; త్రొక్కఁబడి= ఆమెచే త్రొక్కబడడంవల్ల; పదభాగమున్= పాదంయొక్క భాగాన్ని; కఱచెన్= కరిచింది.

**తా :** వ్యాసమునీంద్రా! ఒకనాడు నా తల్లి ఇంటినుండి బయలుదేరింది. రాత్రి సమయం. కటిక చీకటి. అలవాటుపడిన మార్గం కాబట్టి దారి తప్పకుండాపోయి ఆవును పాలు పిండబోయింది. దారిలో ఆమె ఒక పామును తొక్కింది. ఆ సర్పం నా తల్లి కాలిమీద కాటు వేసింది.

**క. నీలాయతభోగఫణా, వ్యాళాననలవిషమహోగ్రవహ్నిజ్వాలా**
**మాలావినిపాతితయై, వ్రాలెన్ ననుఁ గన్నతల్లి వసుమతి మీఁదన్. 118**

**ప్రతి :** నీల= నల్లనైన; ఆయత= పొడవైన; భోగ= శరీరం; ఫణా= పడగగల్గిన; వ్యాళ= పాముయొక్క; (ఆనన= ముఖమునందలి); అనలవిష= అగ్ని అనెడు విషంయొక్క; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; వహ్నిజ్వాలా= నిప్పురవ్వలయొక్క; మాలా= వరుసలచే; వినిపాతిత+ఐ= పడగొట్టబడినదై; ననున్= నన్ను; కన్నతల్లి= కనినతల్లి; వసుమతిమీఁదన్= నేలపై; వ్రాలెన్= పడిపోయింది.

**తా :** ఆ సర్పం కాలనాగం. అది చాలా పొడవైనది. దాని పడగకూడ చాలా పెద్దది. దాని ముఖంనుంచి విషాగ్ని జ్వాలామాలికలు వెలువడ్డాయి. ఆ విషంచే దహింపబడి నా తల్లి నేల వ్రాలిపోయింది.

**ఉ. తల్లి ధరిత్రిపై నొఱఁగి తల్లడపాటునుఁ జెంది చిత్తముం**
**బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి కలంగ కేను నా**
**యుల్లములోన మోహరుచినొందక సంగము వాసె మేలు రా**
**జిల్లె నటంచు విష్ణుపదచింత యొనర్పఁగ బుద్ధి సేయుచున్. 119**

**ప్రతి :** తల్లి= నన్ను కన్నతల్లి; ధరిత్రిపైన్= నేలపై; ఒఱఁగి= పడిపోయి; తల్లడపాటునున్+చెంది= విలవిల గింజుకొంటూ; చిత్తమున్= బుద్ధి; పల్లటిలంగన్= వశం తప్పిపోగా; ప్రాణములు= ప్రాణాలు; పాసినన్= విడిచివేయగా; చూచి= వీక్షించి; ఏను= నేను; కలంగక= కలతచెందక; నా+ఉల్లము+లోనన్= నా మనస్సునందు; మోహరుచిన్= వ్యామోహభావమును; ఒందక= పొందకుండా; సంగము+పాసెన్= బంధం తొలగిపోయింది; మేలు= శుభము; రాజిల్లెన్= విశేషంగా కలిగింది; అటంచున్= అని అనుకొంటూ; విష్ణుపద చింత= హరిపాదస్మరణం; ఒనర్పఁగన్= చేసుకోవడానికి; బుద్ధి+చేయుచున్= అంతఃకరణంలో నిశ్చయించుకొంటూ...

**తా :** మా అమ్మ నేలపై వ్రాలిపోయి విలవిల తన్నుకొంటూ, బుద్ధి వశం తప్పిపోగా ప్రాణాలు విడిచింది. అప్పుడు నేను ఏమాత్రం కలవరం చెందలేదు. నాతల్లి ప్రాణం పోవటాన్ని కళ్లారా చూచినా నేను వికారాన్ని పొందలేదు. మాతృప్రేమతో వ్యామోహంతో చింతించలేదు. నాకు బంధం తెగిపోయిందని, చాల మేలు జరిగిందని భావించి విష్ణు పాదసేవ చేసుకోవాలని నిర్ణయించుకొన్నాను.

**విశే :** మాతృవియోగంతో నారదునకు బుద్ధి కలవరపాటు చెందలేదు. కాని బంధం తెగిపోయిందని, విష్ణుపదచింత చేసుకొనే అవకాశం విశేషంగా ఏర్పడిందని అనుకోవడం అతని పరిపూర్ణ వాసుదేవభక్తికి పరమనిదర్శనం.

**వ. ఉత్తరాభిముఖుండనై యేను వెడలి జనపదంబులుఁ బురంబులును బట్టణంబులును గ్రామంబులుఁ బల్లెలు మందలు మహోద్యానంబులుఁ గిరాత పుళింద నివాసంబులును వనంబులుఁ జిత్రధాతువిచిత్రితంబు లయిన పర్వతంబులు సమద కరికర విదళిత శాఖలు గల శాఖులును, నివారిత పథిక జనశ్రమాతిరేకంబులైన తటాకంబులు బహువిధ విహంగ నినద మనోహరంబులై వికచారవింద మకరంద పాన పరవశ పరిభ్రమద్భ్రమర సుందరంబులైన సరోవరంబులు దాఁటి చనుచు క్షుత్పిపాసాసమేతుండనై యొక్క నదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచినై నీరు ద్రావి గతశ్రముండనై 120**

**ప్రతి :** ఏను= నేను; ఉత్తర+అభిముఖండను+ఐ= ఉత్తరదిక్కు ఎదురుగా ముఖముకలవాడనై; వెడలి= బయలుదేరి; జనపదంబులున్= దేశాలు; పురంబులున్= నగరాలు; పట్టణంబులును= పత్తనాలు; గ్రామంబులున్= చిన్నచిన్న గ్రామాలు; పల్లెలున్= చిన్నచిన్న పల్లెటూళ్లు; మందలును= గోవులు; గోపాలకులు నివసించే ప్రదేశాలు; మహా+ఉద్యానంబులున్= గొప్ప ఉపవనాలు; కిరాత= బోయవాళ్లయొక్క; పుళింద= భిల్లులయొక్క; నివాసంబులును= ఆవాసాలు; వనంబులున్= తమకు తామే చెట్లు పెరిగిన ప్రదేశాలు; చిత్ర= చిత్రమైన వర్ణంకల; ధాతు= గైరికాది ధాతువులచేత; విచిత్రితంబులు+అయిన= విచిత్రంగా చేయబడ్డ; పర్వతంబులున్= కొండలు; సమద= మదంతో కూడుకొన్న; కరి= ఏనుగులయొక్క, కర= తొండాలచేత; విదళిత= విరుగగొట్టబడ్డ; శాఖలు+కల= కొమ్మలుగల్గిన; శాఖులును= వృక్షాలు; నివారిత= పోగొట్టబడ్డ; పథికజన= బాటసారులయొక్క; శ్రమ+అతిరేకంబులు+ఐన= అలసటయొక్క ఆధిక్యం కల్గిన; తటాకంబులున్= చెరువులు; బహువిధ= పెక్కుతెగలైన; విహంగ= పక్షులయొక్క; నినద= ధ్వనులచే; మనోహరంబులు+ఐ= మనస్సు నాకర్షించునవై; వికచ= వికసించిన; అరవింద= తామరలందలి; మకరంద= తేనెను; పాన= త్రాగుటచే; పరవశ= ఇంద్రియాలు మరచి; పరిభ్రమత్= తిరుగుచున్న; భ్రమర= తుమ్మెదలచే; సుందరంబులు+ఐన= అందమైన; సరోవరంబులు= సరస్సులు, దాఁటి= అతిక్రమించి; చనుచున్= ముందుకుసాగిపోతూ; క్షుత్= ఆకలితో; పిపాసా= దాహంతో; సమేతుండను+ఐ= కూడుకొన్నవాడనై; ఒక్క= ఒక; నదీహ్రదంబునన్= నదియొక్క మడుగులో; క్రుంకులు+ఇడి= స్నానంచేసి; శుచిని+ఐ= పవిత్రుడనై; నీరు+త్రావి; గతశ్రముండను+ఐ= పోయిన శ్రమ కలవాడనై.

**తా :** నేను ప్రశస్తమైనదిగా భావించి ఉత్తరదిక్కుగా బయలుదేరాను. విశాలదేశాలు, నగరాలు, పట్టణాలు, గ్రామాలు, పల్లెలు, వ్రేపల్లెలు బోయగూడెములు, భిల్లవాటికలు క్రమంగా దాటిపోయాను. వనాలు, ఉపవనాలు, గైరికాదిధాతు చిత్రితాలైన పర్వతాలు, మదించిన ఏనుగులచే విరుగగొట్టబడిన వృక్షాలు, బాటసారుల మార్గాయాసాన్ని తొలగించే తటాకాలు, బహువిధాలైన పక్షుల కలకలధ్వనులతో మనోహరాలై, వికసించిన తామరపూలలోని మకరందాన్ని త్రాగి మత్తెక్కి పరిభ్రమించే తుమ్మెదలతో నిండిన సరోవరాలు అతిక్రమించాను. ఆకలి, దప్పిక నాకు ఎక్కువ అయ్యాయి. ఒక నది మడుగులో స్నానంచేసి, శుచినై, నీరుత్రాగి శ్రమను పోగొట్టుకొన్నాను.

**విశే :** గిరులపై స్రవించే రసాయన ద్రవాలను గైరికాది ధాతువులంటారు. వనాలు, ఉపవనాలు భేదంతో కనబడుతున్నట్టున్నా, సాదృశ్యంతో ఉంటాయి.

**క. సాలావృక కపిభల్లుక, కోలేభ లులాయ శల్య ఘూక శరభ శా**
**ర్దూల శశ గవయ ఖడ్గ, వ్యాళాజగరాదిభయద వనమధ్యమునన్. 121**

**ప్రతి :** సాలావృక= తోడేళ్లు; కపి= కోతులు; భల్లుక= ఎలుగుబంట్లు; కోల= అడవిపందులు; ఇభ= ఏనుగులు; లులాయ= అడవిదున్నలు; శల్య= ఏదుపందులు; ఘూక= గ్రుడ్లగూబలు; శరభ= శరభమృగాలు; శార్దూల= పెద్దపులులు; శశ= కుందేళ్లు; గవయ= గురుపోతులు; ఖడ్గ= ఖడ్గమృగాలు; వ్యాళ= క్రూరసర్పాలు; అజగర= కొండచిలువలు; ఆది= మున్నగువాటిచేత; భయద= భయాన్ని కల్గించే; వనమధ్యమునన్= అడవియొక్క నడిమిభాగంలో...

**తా :** ఒక అరణ్యం యొక్క నడిమిభాగంలో కాలుపెట్టాను. ఎటుచూచినా తోడేళ్లు, కోతులు, ఎలుగులు, అడవిపందులు, ఏనుగులు, అడవిదున్నలు, ఏదుపందులు, గుడ్లగూబలు, శరభమృగాలు, పెద్దపులులు, కుందేళ్లు, గవయమృగాలు, ఖడ్గమృగాలు, క్రూరసర్పాలు, కొండచిలువలు మున్నగునవే దర్శనమిచ్చాయి.

**వ. దుస్తరంబు లైన నీలవేణు కీచక గుల్మ లతా గహ్వరంబుల పొంత నొక్క రావిమ్రాని దగ్గఱఁ గూర్చుండి యే విన్న చందంబున నా హృదయగతుం బరమాత్మస్వరూపు హరిం జింతించితి. 122**

**ప్రతి :** దుస్తరంబులు+ఐన= దాటడానికి వీలుకాని; నీల= నల్లని గడ్డితుప్పలు; వేణు= వెదురుడొంకలు; కీచక= గాలితో నిండింపబడిన వెదుళ్ళతో కూడిన డొంకలు; గుల్మ= తుప్పలు; లతా= తీగలు (వీటితోకూడిన); గహ్వరంబుల= పెద్ద గుహలయొక్క; పొంతన్= దగ్గరలో; ఒక్క= ఒకానొక; రావిమ్రాని= అశ్వత్థవృక్షంయొక్క మొదలు; దగ్గఱన్= సమీపంలో; కూర్చుండి= కూర్చున్నవాడనై, ఏన్= నేను; విన్న= పరమహంసలద్వారా శ్రవణంచేసిన; చందంబునన్= ప్రకారంగా; నా= నాయొక్క; హృదయగతున్= హృదయమధ్యంలో అధిష్ఠింపబడి ఉన్నవాడైన; పరమాత్మ= పరబ్రహ్మయొక్క; స్వరూపున్= అంతర్యామిరూపుడైన; హరిన్= భగవంతుని; చింతించితిన్= స్మరించాను.

**తా :** ఏ పక్కచూచినా దాటశక్యంకాని గడ్డి తుప్పలతో కూడుకొన్న వెదురుడొంకలు, హోరుగాలితో కూడుకొన్న వెదురువనాలు, పెద్ద పెద్ద తుప్పలు, అల్లుకుపోయిన తీగలు, పెద్ద పెద్ద గుహలు కనిపించాయి. ఒక గుహదగ్గర రావిచెట్టు మూలంలో కూర్చున్నాను. ఆ పరమహంస పరివ్రాజకులు నాకు ఉపదేశించిన భగవత్తత్వాన్ని మననం చేసుకొన్నాను. హృదయమధ్యంలో ఉన్న అంతర్యామి స్వరూపుడైన విష్ణువును ధ్యానం చేశాను.

**శా. ఆనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతోఁ దత్పద**
**ధ్యానారూఢుఁడ నైన నా తలఁపులో న ద్దేవుఁడుం దోఁచె నే**
**నానందాబ్ధిగతుండనై యెఱుఁగ లేనైతిన్ నను న్నీశ్వరున్**
**నానాశోకహమైన యత్తనువు గానన్ లేక య ట్లంతటన్. 123**

**ప్రతి :** ఆనంద+అశ్రులు= సంతోషంతో గూడుకొన్న కన్నీటిబిందువులు; కన్నులన్= నేత్రాలలో; వెడలన్= పొంగిపొర్లగా; రోమాంచంబుతోన్= శరీరమందు రోమాలు పులకించగా వచ్చే గగుర్పాటుతో; తత్+పద= ఆ సర్వేశ్వరుని పాదాలయొక్క; ధ్యాన= చింతనంలో; ఆ రూఢుఁడను+ఐన= పూర్తిగా ఆవిష్కరింపబడినటువంటి వాడనైన; నా= నాయొక్క; తలఁపులోన్= భావంలో; ఆ+దేవుఁడున్= ఆ మహావిష్ణువు; తోఁచెన్= దర్శనమిచ్చాడు; నేను= నేనాసమయంలో; ఆనంద+అబ్ధి= ఆనందమనే సముద్రంలో; గతుండనై= మునిగిపోయినవాడనై; నన్నున్= నన్నును; ఈశ్వరున్= ఆ పరమేశ్వరునికూడ; ఎఱుఁగలేను+ఐతిన్= తెలిసికొనలేకపోయినాను; నానాశోకహము+ఐన= సమస్తములైన దుఃఖాలను నాశనంచేసే; ఆ+తనువు= ఆ విష్ణుస్వరూపాన్ని; కానన్+లేక= చూడలేక; అట్లు= ఆ విధంగా; అంతటన్= ఆ సమయంలో...

**తా :** నా నేత్రాలలో ఆనందబాష్పాలు పొంగిపొర్లాయి. నా శరీరంలో రోమాలు పులకించగా గగుర్పాటు ఏర్పడింది. ఆ సర్వేశ్వరుడే నా గుండెలలో పూర్తిగా నిండిపోయాడు. తదేకధ్యానంతో మునిగిపోయిన నాకు ఆ పరమాత్మ సాక్షాత్కరించినట్లు తోచింది. నేను ఆనందసాగరంలో మునిగి తబ్బిబ్బులయ్యాను. ఆ సమయంలో నేను ఏమిటో నాకు తోచలేదు. హృదయస్థితుడైన పరమాత్మకూడ కాన్పించలేదు. ఆ స్వరూపం మాయమైపోయింది. అనేక దుఃఖాలను పటాపంచలు చేసే ఆ విష్ణుస్వరూపం కనుమరగైపోయింది. నాకు ఇక దిక్కుతోచలేదు.

**విశే :** ఆనందంతో కన్నులలో తిరిగిన నీరు చల్లగా ఉంటుంది. అది కనుగొలకులనుండి పొంగిపొరలుతుంది. దుఃఖంతో కన్నులలో తిరిగిన నీరు వేడిగా ఉంటుంది. అది కన్నుల మొదటనుండి క్రిందకు పడుతుంది. సంతోషం ఏర్పడినపుడు రోమాలు నిక్కపొడుచుకొంటాయి. అవి అచేతనాలైనా, చేతనస్థితిలోనికి వచ్చినట్లుగా పులకాంకితాలు అవుతాయి.

**వ. లేచి నిలుచుండి క్రమ్మఱ న ద్దేవుని దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని యాతురుండునుంబోలెఁ జూచియుం గానలేక నిర్మనుష్యంబైన వనంబునం జరియించుచున్న నన్ను నుద్దేశించి వాగగోచరుండైన హరి గంభీర మధురంబులైన వచనంబుల శోకం బుపశమింపం జేయు చందంబున నిట్లనియె. 124**

**ప్రతి :** లేచి= హఠాత్తుగా లేచి; నిలుచుండి= నిలబడి; క్రమ్మఱన్= మరల; ఆ+దేవుని= ఆ పరమాత్మయొక్క; దివ్య+ఆకారంబున్= దివ్యస్వరూపాన్ని; చూడన్= దర్శించాలనే; ఇచ్ఛించుచున్= కోరుచు; హృదయంబునన్= (మళ్లీ) గుండెలలో; నిలుపుకొని= నింపుకొని; ఆతురుండునున్+పోలెన్= దుఃఖితునిలా; చూచియున్= వీక్షించికూడ; కానలేక= దర్శనాన్ని పొందలేక; నిర్మనుష్యంబు+ఐన= జనసంచారంలేని; వనంబునన్= అడవిలో; చరియించుచున్న= అటూ ఇటూ తిరుగుతున్న; నన్నున్= నన్ను; ఉద్దేశించి= ఉపలక్షించి; వాక్+అగోచరుండు+ఐన= వేదవాక్కులకు అందరానివాడైన; హరి= శ్రీమహావిష్ణువు; గంభీర= గంభీరమైన; మధుర= తియ్యనైన; వచనంబులన్= మాటలతో; శోకంబు= నా దుఃఖాన్ని; ఉపశమింపన్+చేయు= శాంతింపజేసే; చందంబునన్= రీతిగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** హఠాత్తుగా ధ్యానావస్థ నుండి లేచి నిలబడ్డాను. మళ్లీ ఆ దేవదేవుని హృదయంలో దర్శించాలనే ఉత్కంఠతో మళ్లీ ప్రయత్నం చేశాను. గుండెలలో ఆ రూపాన్ని నింపుకొన్నాను. నా యత్నం సిద్ధించలేదు. దుఃఖమే మిగిలింది. చూచికూడా దర్శనం పొందలేకపోయాను. జనసంచారంలేని ఆ అడవిలో పిచ్చిపట్టినవానివలె తిరిగాను. నా పరిస్థితిని శ్రీహరి గమనించాడు. వాక్కులకు గోచరుడు కాని ఆ నారాయణుడు గంభీర మధుర వాక్యాలతో నా దుఃఖాన్ని ఉపశమింపజేస్తూ ఇట్లు పలికాడు.

**ఉ. ఏల కుమార! శోషిలఁగ? నీ జననంబున నన్నుఁ గానఁగాఁ**
**జాలవు నీవు; కామముఖషట్కము నిర్దళితంబు సేసి ని**
**ర్మూలితకర్ములైన మునిముఖ్యులు గాని కుయోగి గానఁగాఁ**
**జాలఁడు; నీదు కోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్. 125**

**ప్రతి :** కుమార!= బాలకుడా!; శోషిలఁగన్= (వ్యర్థంగా) శరీరాన్ని మనస్సును ఆయాసపెట్టడం; ఏల= ఎందులకు?; ఈ జననంబునన్= ఈ జన్మలో, నన్నున్= భగవంతుడనైన నన్ను, నీవు= నీవు, కానఁగాన్= దర్శించడానికి, చాలవు= సమర్థుడవుకావు, కామముఖషట్కము= కామం మొదటిదిగా గల అరిషడ్వర్గాన్ని, నిర్దళితంబు+చేసి= పూర్తిగా నాశనమొనర్చి, నిర్మూలిత కర్ములు+ఐన= సంపూర్ణంగా నశించబడ్డ ప్రారబ్ధకర్మలు కలిగిన, మునిముఖ్యులు+కాని= యోగీశ్వరులేతప్ప, కుయోగి= జితేంద్రియుడు కానియోగి; కానఁగాన్+చాలఁడు= చూడజాలడు; నీదు కోర్కి(నీ+కోర్కి)= నీకాంక్ష, కొనసాగుటకున్+ఐ= అవిచ్ఛిన్నంగా సాగడానికై, నిజమూర్తిన్= నా సాకారరూపాన్ని, చూపితిన్= స్ఫురింపజేశాను.

**తా :** నాయనా! శరీరాన్ని ఏల శుష్కింపజేసుకొంటావు? వృథాగా మనస్సులో ఏల ఆయాసపడతావు? నీవు ఎంత ప్రయత్నించినా ఈ జన్మలో నా భగవత్స్వరూపాన్ని దర్శించలేవు. కామం మున్నగు అరిషడ్వర్గాన్ని పూర్తిగా జయించి, ప్రారబ్ధకర్మ సంపూర్ణంగా నశింపజేసుకొన్న, మునిముఖ్యులే నన్ను దర్శించగలరు. కాని జితేంద్రియులు కాని యోగులు నన్ను సాక్షాత్కరింపజేసుకోలేరు. నీ మనస్సులోని ఆకాంక్ష కొనసాగుటకై క్షణకాలం నా సగుణరూపాన్ని నీకు స్ఫురింపజేశాను.

**క. నావలని కోర్కి యూరక, పోవదు; విడిపించు దోషపుంజములను; మ**
**త్సేవం బుట్టును వైళమ, భావింపఁగ నాదు భక్తి బాలక! వింటే. 126**

**ప్రతి :** బాలక= కుమారా!, నావలని= నన్ను ఉద్దేశించిన, కోర్కి= అభిలాష, ఊరకపోవదు= వ్యర్థంకాదు, దోషపుంజములను= కల్మష సమూహాలను, విడిపించున్= సంపూర్ణంగా నాశనం చేస్తుంది, మత్సేవన్= నాయందలి సేవచేత, భావింపఁగన్= తలపోయగా, నాదు భక్తి (నా+భక్తి)= నాకు సంబంధించిన భక్తి, వైళము+అ= శీఘ్రంగానే, పుట్టును= ప్రభవిస్తుంది, వింటే= విన్నావు కదా!

**తా :** నన్ను ఉద్దేశించి కల్గిన అభిలాష వ్యర్థంకాదు. అది సమస్త దోషాలను నాశనం చేస్తుంది. నన్ను సేవించడంవల్ల భక్తి శీఘ్రంగా నీ మనస్సులో పదిల మవుతుంది. స్పష్టంగా విన్నావు కదా!

**క. నాయందుఁ గలుగ నీ మది, వాయదు జన్మాంతరముల బాలక! నీ వీ**
**కాయంబు విడిచి మీఁదట, మా యనుమతిఁ బుట్టఁగలవు మద్భక్తుఁడవై. 127**

**ప్రతి :** బాలక= వత్సా!; నాయందున్ (నా+అందున్)= నాపై; కలుగన్= లగ్నమైన; నీమది= నీ మనస్సు; జన్మాంతరములన్= వచ్చే జన్మలలో కూడ; పాయదు= విడిచిపెట్టి పోదు; నీవు= నీవు; ఈ కాయంబు= ఈ శరీరాన్ని; విడిచి= వదలివేసి; మీఁదటన్= అటు తరువాత; మా+అనుమతిన్= నా అనుజ్ఞతో; మత్+భక్తుఁడవు+ఐ= నా భక్తుడుగా; పుట్టన్+కలవు= జన్మింపగలవు.

**తా :** కుమారా! నాయందు లగ్నమైన నీ బుద్ధి జన్మాంతరాలలో కూడా వదలిపోయేది కాదు. నీవీ శరీరం విడిచి మరుసటి జన్మలో నా ఆజ్ఞపై నా భక్తునిగా జన్మిస్తావు.

**మ. విను మీ సృష్టి లయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా**
**మినియై పోయెడిఁ బోవఁగాఁ గలుగుఁజూ మీఁదం బునఃసృష్టి యం**
**దు నిరూఢస్మృతితోడఁ బుట్టెదవు; నిర్దోషుండవై నా కృపన్**
**ఘనతం జెందెదు శుద్ధసాత్త్వికులలో గణ్యుండవై యర్భకా! 128**

**ప్రతి :** అర్భకా!= బాలకా!; వినుము= శ్రద్ధగా ఆలకించు; ఈ సృష్టి= ఈ సమస్త ప్రపంచసృష్టి; లయంబున్+ఒంది= నశించి; యుగముల్+వేయి+ఐన= వేయి యుగాలైన; కాలంబు= సమయం; యామిని+ఐ= బ్రహ్మకు రాత్రియై; పోయెడిన్= గడచిపోతుంది; పోవఁగాన్= ఆ రాత్రికాలం గతించిపోగా; మీఁదన్= అటుపిమ్మట; పునస్+సృష్టి= మళ్లీ సృష్టికార్యం; కలుగున్+చూ= మొదలవుతుంది సుమా!; అందున్= ఆ సమయంలో; నిరూఢస్మృతితోడన్= పూర్వజన్మ జ్ఞానంతో; నిర్దోషుండవు+ఐ= తొలగిపోయిన కల్మషాలు కలవాడవై; పుట్టెదవు= ప్రభవిస్తావు; నా కృపన్= నా దయతో; శుద్ధసాత్త్వికులలోన్= ఏ కళంకంలేని స్వచ్ఛమైన సత్త్వప్రధానవృత్తి గలవారిలో; గణ్యుండవు+ఐ= ముందు లెక్కపెట్టదగినవాడవై; ఘనతన్= గొప్పతనాన్ని; చెందెదు= పొందుతావు.

**తా :** ఈ మొత్తం సృష్టి నశించి, వేయి మహాయుగాలైన కాలము బ్రహ్మదేవునికి ఒక రాత్రి అయి గడిచిపోతుంది. ఆ రాత్రి కాలం గడిచిపోయిన తరువాత మళ్ళీ సృష్టి మొదలౌతుంది. ఆ సమయాన దోషాలు తొలగి, పూర్వజన్మ జ్ఞానంతో పుట్టి, నా దయతో శుద్ధసాత్త్వికులలో గణింపదగినవాడవై గొప్పతనాన్ని పొందుతావు.

**విశే :** కలి, ద్వాపర, త్రేతా, కృతయుగాలు కలిస్తే ఒక మహాయుగం అవుతుంది. అట్టి వేయి మహాయుగాలు బ్రహ్మకు ఒక పగలు. అంతే సమయం రాత్రి అవుతుంది. పగలు సమయం పూర్తికాగానే దైనందిన ప్రళయం ఏర్పడుతుంది. భూలోక, భువర్లోక స్వర్లోకాలు పాతాళపర్యంతం నీటిలో మునిగిపోతాయి. వేయి మహాయుగాలకాలం బ్రహ్మకు రాత్రిగా గడచిపోతుంది. అది బ్రహ్మగారి ఒకరోజు ఆయుఃప్రమాణం. ఉదయ సమయంకాగానే బ్రహ్మ మళ్లీ సృష్టి ప్రారంభిస్తాడు.

**వ. అని యిట్లాకాశంబు మూర్తియు, ఋగ్వేదాదికంబు నిశ్వాసంబునుగా నొప్పి, సర్వనియామకంబైన మహాభూతంబు పలికి యూరకున్న నేనును మస్తకంబు వంచి మ్రొక్కి, తత్కరుణకు సంతసించుచు మదంబు దిగనాడి, మచ్చరంబు విడిచి, కామంబు నిర్జించి, క్రోధంబు వర్జించి, లోభమోహంబుల వెడల నడిచి, సిగ్గు విడిచి, యనంతనామంబులు పఠించుచుఁ, బరమభద్రంబు లయిన తచ్చరిత్రంబులం జింతించుచు, నిరంతర సంతుష్టుండనై కృష్ణుని బుద్ధి నిలిపి, నిర్మలాంతఃకరణంబుతోడ విషయ విరక్తుండనై కాలంబున కెదురు సూచుచు భూమిం దిరుగుచు నుండునంతం గొంతకాలంబునకు మెఱుంగు మెఱసిన తెఱంగున మృత్యువు**

**దోఁచినం బంచభూతమయంబయి కర్మ స్వరూపంబైన పూర్వదేహంబు విడిచి హరికృపావశంబున శుద్ధ సత్త్వమయంబైన భాగవతదేహంబు సొచ్చితి; నంతం ద్రైలోక్యంబు సంహరించి ప్రళయకాల పయోరాశిమధ్యంబున శయనించు నారాయణమూర్తి యందు నిదురవోవ నిచ్చగించు బ్రహ్మనిశ్వాసంబు వెంట నతని లోపలం బ్రవేశించితి; నంత సహస్రయుగ పరిమితంబయిన కాలంబు సనిన లేచి లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మనిశ్వాంబు వలన మరీచి ముఖ్యులగు మునులును నేనును జన్మించితిమి; అందు నఖండిత బ్రహ్మచర్యుండనై యేను మూఁడు లోకంబుల బహిరంతరంబులందు మహావిష్ణుని యనుగ్రహంబున నడ్డంబు లేక యీశ్వరదత్తయై బ్రహ్మాభివ్యంజకంబులైన సప్త స్వరంబులు దమయంతన మ్రోయుచున్న యీ వీణాలాపన రతింజేసి నారాయణ కథాగానంబు సేయుచుఁజరియించుచుందు. 129**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; ఆకాశంబు= గగనమండలమే; మూర్తియున్= ఆకారముగా గల్గినదై; ఋక్+వేద+ఆదికంబు= ఋగ్వేదం మున్నగునవి; నిశ్వాసంబునుగాన్= విడిచిపుచ్చే వాయువులుగా గల్గినదై; ఒప్పి= ప్రకాశించి; సర్వనియామకంబు+ఐన= సమస్తానికి నియంతయైన; మహాభూతంబు= విష్ణుతేజం; పలికి= సంభాషించి; ఊరక+ఉన్నన్= ఇక మాట్లాడక మిన్నకుండగా; నేను= నేను; మస్తకంబు= శిరస్సు; వంచి= వాల్చి; మ్రొక్కి= నమస్కరించి; తద్+కరుణకున్= ఆ పరమాత్మ అనుగ్రహానికి; సంతసించుచున్= ఆనందిస్తూ; మదంబున్= మదాన్ని; దిగనాడి= పూర్తిగా విడిచిపుచ్చి; మచ్చరంబున్= మాత్సర్యాన్ని; విడిచి= వదలివేసి; కామంబున్= కామాన్ని; నిర్జించి= జయించి; క్రోధంబున్= క్రోధాన్ని; వర్జించి= త్యజించి; లోభమోహంబులన్= లోభమోహాలను; వెడలన్+అడిచి= తొలగిపోయేటట్లు అణచివేసి; సిగ్గున్= లజ్జను; విడిచి= పారద్రోలి; అనంతనామంబులు= ఆ వాసుదేవుని అనేకములైన నామాలను; పఠించుచున్= ఉచ్చరిస్తూ; పరమభద్రంబులు+ఐన= అత్యంత కల్యాణదాయకాలైన; తద్+చరిత్రంబులన్= ఆ భగవంతుని కథలను; చింతించుచున్= స్మరిస్తూ; నిరంతర సంతుష్టుండను+ఐ= ఎల్లప్పుడూ సంతృప్తి పొందినవాడనై; కృష్ణునిన్= విష్ణువును; బుద్ధిన్= భావంలో; నిలిపి= నిల్పుకొని; నిర్మల+అంతఃకరణంబుతోడన్= ప్రశాంతములైన చిత్తవృత్తులతో; విషయవిరక్తుండను+ఐ= విషయవాసనలపై వైరాగ్యాన్ని పొంది; కాలంబునకున్= మరణసమయం గురించి; ఎదురుచూచుచున్= నిరీక్షిస్తూ; భూమిన్= ధరలో; తిరుగుచున్+ఉండునంతన్= పర్యటిస్తూ ఉండగా; కొంత కాలంబునకున్= కొన్నాళ్లకు; మెఱుంగు= మెరుపుతీగ; మెఱసిన తెఱంగునన్= మెరసిన విధంగా; మృత్యువు= మృత్యుదేవత; తోఁచినన్= ప్రత్యక్షంకాగా; పంచభూతమయంబు+అయి= ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనే ఐదుభూతాలలో ఏర్పడ్డ; కర్మస్వరూపంబు+ఐన= ప్రారబ్ధ కర్మరూపమైన; పూర్వదేహంబున్= ముందటి శరీరాన్ని; విడిచి= వదలివైచి; హరికృపావశంబునన్= శ్రీహరి అనుగ్రహ విశేషంచే; శుద్ధసత్త్వమయంబు+ఐన= కేవల సత్త్వగుణంతో కూడిన; భాగవతదేహంబు= భగవద్భక్తుల శరీరాన్ని (భగవత్సంబంధ శరీరాన్ని); చొచ్చితిన్= ప్రవేశించాను; అంతన్= అటుపిమ్మట; త్రైలోక్యంబు= ముజ్జగాలను; సంహరించి= లయంచేసి; ప్రళయకాల= దైనందిన ప్రళయంలో; పయస్+రాశిమధ్యంబునన్= అంతా జలమయమైనదానిలో; శయనించు= పరుండే; నారాయణునియందున్= శ్రీమహావిష్ణువులో; నిదుర+పోవన్= విశ్రాంతికోసమైన నిద్రపోవడానికై; ఇచ్చగించు= కోరుకొనే; బ్రహ్మ= చతుర్ముఖ బ్రహ్మయొక్క; నిశ్వాసంబువెంటన్= ఉచ్ఛ్వాసనిశ్వాసవాయువులతోపాటు; అతనిలోపలన్= ఆయన ఉదరంలో; ప్రవేశించితిన్= ప్రవేశించాను; అంతన్= అటుతరువాత; సహస్రయుగపరిమితంబు+అయిన= వేయి మహాయుగాల కాలప్రమాణంకల; కాలంబు= సమయం;

చనినన్= గతించిపోగా; లేచి= నిద్రనుండిలేచి; లోకంబులు= (లయమైపోయిన) లోకాలను; సృజియింపన్= సృష్టి చేయుటకు; ఉద్యోగించు= ప్రయత్నించు; బ్రహ్మనిశ్వాసంబువెంటన్= బ్రహ్మదేవుని నిశ్వాసంలోనుండి; మరీచిముఖ్యులు+ అగు= మరీచి మున్నగు; మునులును= మునీంద్రులును; నేనును= నేనూ; జన్మించితిమి= జననమొందాము; అందున్= వారిలో ఏను= నేను; అఖండిత= ఖండింపబడని (స్ఖలితంకాని), భంగములేని; బ్రహ్మచర్యుండను+ఐ= బ్రహ్మచర్యవ్రతం కలవాడనై; మూడులోకంబులన్= త్రిలోకాలలో; బహిస్+అంతరంబులందున్= వెలుపల, లోపలకూడా; మహావిష్ణుని= శ్రీమన్నారాయణుని; అనుగ్రహంబునన్= దయవల్ల; అడ్డంబులేక= ఆటంకం లేకుండా సంచరిస్తూ; ఈశ్వరదత్తయై= పరమేశ్వరునిచే ప్రతిపాదించబడ్డ; బ్రహ్మ+అభివ్యంజకంబులు+అయిన= పరబ్రహ్మ స్వరూపాన్ని తెలియబరచే; సప్తస్వరంబులు= స, రి, గ, మ, ప, ద, ని – అనే ఏడుస్వరాలు; తమ+అంతన్+అ= తమంతట తామే; మ్రోయుచున్+ ఉన్న= మ్రోగుచుండే; ఈ+వీణా+ఆలాపన= దేవదత్తమనే నామాంతరంగల 'మహతి' అనే వీణను స్వరపరచే; రతిన్+చేసి= అత్యంతాసక్తితో; నారాయణకథాగానంబు= హరికథాసంకీర్తనాన్ని; చేయుచున్= కావిస్తూ; చరియించుచుందున్= విహరిస్తూ ఉంటాను.

**తా :** ఆకాశమే ఆకారంగా, ఋగ్వేదాదులే నిశ్వాసాలుగా ప్రకాశించి, విశ్వమంతటిని నియంత్రించే విష్ణువుయొక్క మహాతేజం – ఈ మాటలు పలికి ఊరకుండగా, నేను ఆ దివ్యతేజస్సుకు శిరస్సువంచి నమస్కరించాను. ఆయన కారుణ్యానికి మిక్కిలి సంతసించాను. కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాలను పారద్రోలాను. సిగ్గు వదలివేశాను. ఆ అనంతుని అనేక నామాలను పురశ్చరణ చేశాను. పరమకల్యాణదాయకాలైన హరిగాథావిశేషాలను స్మరించాను. నిత్యసంతుష్టుడనై కాలం గడిపాను. ఆ పరమాత్మను బుద్ధిలో సుప్రతిష్ఠితం చేసుకొన్నాను. చిత్తవృత్తులను శమింపజేశాను. విషయవాసనలపట్ల వైరాగ్యం అవలంబించాను. కాలంకోసమై ఎదురుచూడసాగాను. ప్రపంచమంతా సంచరించాను. ఇంతలో ఆ శుభసమయం ఆసన్నమయింది. ఒక్కసారి మెరుపు మెరిసినట్లయింది. హఠాత్తుగా మృత్యుదేవత ఎదురైంది. పంచభూతాత్మకమైన, ప్రారబ్ధకర్మానుభవరూపమైన ఆ దేహాన్ని విడిచిపెట్టాను. సత్త్వగుణాత్మకమైన భాగవతదేహంలో ప్రవేశించాను. అటుపిమ్మట ఏర్పడిన దైనందిన ప్రళయంలో త్రిలోకాలు ఏకార్ణవమైన స్థితిలో శ్రీమన్నారాయణుడు జలరాశి మధ్యంలో శయనించియున్న సమయంలో, నిద్రకు ఉపక్రమించే బ్రహ్మదేవుని ఊర్పులతోపాటు ఆయన ఉదరంలో ప్రవేశించాను. అలా వేయి మహాయుగాలు గడచిపోయాయి. పరమాత్మ అనుమతితో చతుర్ముఖ బ్రహ్మపునఃసృష్టి ప్రారంభించాడు. బ్రహ్మ నిశ్వాసంలోనుంచి, ప్రాణాలలో నుంచి, ఇంద్రియాలలోనుంచి మరీచ్యాది మహర్షులు, నేనూ జన్మించాము. వారిలో నేను అస్ఖలిత బ్రహ్మచారినై సంచరించాను. త్రికాలలోను లోపలా, బయటా పరమేశ్వరుని అనుగ్రహంవల్ల విహరిస్తున్నాను. ఈశ్వరదత్తమైన దేవదత్తమనే నామాంతరంగల "మహతి" అనే వీణపై పరబ్రహ్మను అభివ్యక్తంచేసే సప్తస్వరాలు తమంతట తాము మోగుతూ ఉండగా, హరికథాగానాన్ని అనుసంధానం చేస్తూ ఇలా లోకసంచారం చేస్తున్నాను.

**ఆ. తీర్థపాదుఁడయిన దేవుండు విష్ణుండు, దన చరిత్ర నేను దవిలి పాడఁ**
**జీరఁబడ్డవాని చెలువున నేతెంచి, ఘనుఁడు నా మనమునఁ గానవచ్చు. 130**

**ప్రతి :** తీర్థపాదుఁడయిన= పాదములందు పుణ్యతీర్థములుకల; దేవుండు= దేవాదిదేవుడయిన; విష్ణుండు= అన్నింటియందు వ్యాపించే మహావిష్ణువు; తనచరిత్రన్= తన లీలలను; నేను= నారదుడనైన నేను; తవిలి= మనస్సు లగ్నంచేసి; పాడన్= గానం చేయగా; చీరఁబడ్డవాని చెలువునన్= పిలువబడ్డవానివలె; ఏతెంచి= వచ్చి; ఘనుఁడు= గొప్పవాడైన ఆ పరమాత్మ; నా మనమునన్= నా హృదయంలో; కానవచ్చున్= సాక్షాత్కరిస్తాడు.

**తా :** వ్యాసమునీంద్రా! పరమపవిత్రాలైన పుణ్యతీర్థాలు పాదాలందు గల దేవుడు శ్రీ మహావిష్ణువు. ఆయనయందు మనస్సు లగ్నంచేసి ఆయన లీలలను గానం చేస్తూ ఉండగా, పిలిచినట్లుగా వచ్చి ఆ పరమపురుషుడు నా గుండెలలో నిండిపోయేవాడు.

**క. విను మీ సంసారం బను, వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే**
**దనఁ బొందెదు వానికి వి, ష్ణుని గుణవర్ణనము తెప్ప సుమ్ము మునీంద్రా! 131**

**ప్రతి :** ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడవైన ఓ వ్యాసమహర్షీ!; వినుము= ఆలకించవయ్యా!; ఈ సంసారంబు+అను= ఈ జననమరణ రూపమైన; సంసారమనే; వననిధిలోన్= సముద్రంలో; మునిఁగి= మునకలువేసి; కర్మవాంఛలచేన్= ఫలాపేక్షతో కూడుకొన్న కోరికలచే; వేదనన్= మనోవేదనను; పొందెదువానికిన్= అనుభవించేవానికి; విష్ణుని= శ్రీమహావిష్ణువుయొక్క; గుణవర్ణనము= నామసంకీర్తనం; తెప్పసుమ్ము= తెప్పలాంటిది సుమా!

**తా :** మహర్షీ! ఈ సంసారమనే సముద్రంలో మునిగితేలుతూ, విషయవాంఛలతో కర్మలు ఆచరిస్తూ మనోవేదన అనుభవించేవాడికి గోవిందనామ సంకీర్తనం, దాన్ని తరించడానికి ఉపయోగపడే తెప్పవంటిది సుమా!

**చ. యమ నియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ గామ రో**
**షములఁ బ్రచోదితంబ యగు శాంతి వహింపదు విష్ణుసేవచేఁ**
**గ్రమమున శాంతిఁ గైకొనిన కైవడి నాదు శరీర జన్మ క**
**ర్మముల రహస్య మెల్ల మునిమండన! చెప్పితి నీవు గోరినన్. 132**

**ప్రతి :** మునిమండన!= మునులకు ఆభరణమైన వ్యాసమునీంద్రా!; యమనియమ+ఆదియోగములన్= యమం, నియమం మున్నగు ఎనిమిదియోగ సాధనలచే; ఆత్మ= మనస్సు; నియంత్రితము+అయ్యున్= నిరోధించబడినప్పటికి; కామరోషములన్= కామక్రోధాలచేత; ప్రచోదితంబు+అ= ప్రేరేపింపబడ్డదే; అగున్= అవుతుంది; విష్ణుసేవచేన్= నారాయణ భజనచే; క్రమమునన్= కాలక్రమంగా; శాంతిన్= శాంత స్థితిని; కైకొనిన= పొందే; కైవడిన్= విధంగా; శాంతి= ఉపశమనం; వహింపదు= పొందదు; నీవు కోరినన్= నీవు అడుగగా; నాదు= నాదైన; శరీర= దేహానికి సంబంధించిన; జన్మకర్మములరహస్యము+ఎల్లన్= జన్మరహస్యాన్ని, కర్మరహస్యాన్ని అంతా; చెప్పితిన్= వివరించాను.

**తా :** మునిగణాభరణుడవైన ద్వైపాయనా! కొందరు మనస్సును నియంత్రించడానికి యమం, నియమం మున్నగు యోగసాధనలు కావిస్తారు. కాని అది నిరోధింపబడ్డట్లు కనబడుతుందే కాని కామం, క్రోధం మున్నగు వాటిచేత పునః ప్రేరేపింపబడి సాధన వ్యర్థమైపోతుంది. ఒక్క నారాయణ సేవద్వారా మాత్రమే ఇంద్రియాలు క్రమంగా శాంతి వహించి, చిత్తానికి ఉపశమనం చేకూరుతుంది. నీవు వివరింపుమని కోరగా నా జన్మరహస్యం, కర్మరహస్యం అంతా తెలియజేశాను.

**విశే :** అష్టాంగయోగాలు హఠయోగానికి అంకితమైపోతే చిత్తశాంతి లభించదు. అవి చిత్తైకాగ్రతకు ఉపయోగిస్తే జ్ఞానసాధనకు కారకాలవుతాయి. యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యానసమాధులను ఎనిమిదింటిని అష్టాంగయోగాలు అంటారు.

**వ. అని యిట్లు భగవంతుం డగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని, వీణ వాయించుచు యదృచ్ఛామార్గంబునం జనియె నని సూతుం డిట్లనియె. 133**

**ప్రతి :** అని= అనిచెప్పి; ఇట్లు= ఈ ప్రకారంగా; భగవంతుండు+అగు= పరమపూజ్యుడు బ్రహ్మమానస పుత్రుడైన; నారదుండు= నారదమహర్షి; వ్యాసముని+ఇంద్రుని= వ్యాసమహామునిని; వీడ్కొని= వెళ్లివస్తానని చెప్పినవాడై; యదృచ్ఛామార్గంబునన్= తన ఇచ్చవచ్చిన త్రోవలో; వీణవాయించుచున్= విపంచి మ్రోగించుకొంటూ; చనియెన్= వెళ్లిపోయాడు; అని= అంటూ; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని ఈ విధంగా నారదుడు వ్యాసునకు చెప్పవలసిందంతా చెప్పి వీడ్కోలు తీసుకొని వీణ వాయించుకొంటూ తనదారిని తాను వెళ్లిపోయాడు. అనంతరం సూతుడు శౌనకాదులతో ఇలా అన్నాడు.

**క. వాయించు వీణ నెప్పుడు, మ్రోయించు ముకుందగీతముల జగములకుం**
**జేయించుఁ జెవుల పండువు, మాయించు నఘాళి నిట్టి మతి మఱి గలఁడే. 134**

**ప్రతి :** ఎప్పుడున్= ఎల్లప్పుడు; వీణన్= మహతీవీణను; వాయించున్= స్వరరాగయుక్తంగా పలికిస్తాడు; ముకుంద గీతములన్= హరికీర్తనలతో; మ్రోయించున్= మ్రోగిస్తాడు; జగములకున్= సమస్తలోకాలకు; చెవులపండువు= వీనులవిందు; చేయించున్= కావిస్తాడు; అఘ+ఆళిన్= పాపసమూహాలను; మాయించున్= పోగొడతాడు; ఇట్టి= ఇటువంటి; మతి= సార్థకమైన బుద్ధి కలవాడు; మఱి= మరెక్కడైనా; కలఁడే= ఉంటాడా?

**తా :** నిరంతరం తన మహతీవీణపై స్వరరాగాలను పలికిస్తాడు. ఆ నాదానుకూలంగా హరికీర్తనలు ఆలపిస్తాడు. ముజ్జగాలకు వీనులవిందు కావిస్తాడు. సమస్త పాపాలు తొలగిస్తాడు. అటువంటి మేటి భక్తుడు మరెందైనా ఉన్నాడా? ఆ నారదమహర్షికి సాటి మరెవ్వరూ లేరు.

**వ. అని నారదుం గొనియాడిన సూతునిం జూచి నారదు మాటలు విన్న వెనుక భగవంతుండైన బాదరాయణుం డేమి సేసె నని శౌనకుం డడిగిన సూతుం డిట్లనియె; బ్రహ్మదైవత్య యైన సరస్వతి పడమటి తీరంబున ఋషులకు సత్త్ర కర్మవర్ధనంబై బదరీతరుషండమండితంబయి "శమ్యాప్రాసం" బనం బ్రసిద్ధంబగు నాశ్రమంబు గలదు. అందు జలంబులు వార్చి కూర్చుండి వ్యాసుండు దన మదిఁ దిరంబు సేసికొని భక్తియుక్తం బయిన చిత్తంబునం బరిపూర్ణుం డయిన యీశ్వరుం గాంచి యీశ్వరాధీనమాయావృతంబైన జీవుని సంసారంబుఁ గని జీవుండు మాయచేత మోహితుండయి గుణవ్యతిరిక్తుండయ్యు మాయాసంగతిం దాను ద్రిగుణాత్మకుండని యభిమానించుచుం ద్రిగుణత్వాభిమానంబునం గర్తయు భోక్తయు నను ననర్థంబు నొందు ననియు; న య్యనర్థంబునకు నారాయణభక్తి యోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లేదనియు నిశ్చయించి, 135**

**ప్రతి :** అని= అని ఈ విధంగా; నారదున్= నారదమునీంద్రుని; కొనియాడిన= పొగడిన; సూతునిన్+చూచి= రోమహర్షణ పుత్రుని వీక్షించి; నారదుమాటలు= ఆ నారదమహర్షి పలుకులను; విన్నవెనుకన్= ఆలకించిన తరువాత; భగవంతుండు+ఐన= భగవానుడైన; బాదరాయణుండు= కృష్ణద్వైపాయనుడు; ఏమి+చేసెను= ఏమి కావించాడు?; అని= అంటూ; శౌనకుండు= శునకపుత్రుడు; అడిగినన్= ప్రశ్నించగా; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; బ్రహ్మదైవత్య+ఐన= బ్రహ్మయే దేవతగాగల; సరస్వతి= సరస్వతీ నదియొక్క; పడమటి తీరంబునన్= పశ్చిమతీరంలో; ఋషులకున్= మునీశ్వరులకు; సత్త్రకర్మవర్ధనంబు+ఐ= సత్త్రయాగాది సత్కర్మలను వర్ధిల్ల చేయునదై, వృద్ధి పొందించునదై; బదరీతరుషండమండితంబు+అయి= రేగుచెట్ల గుంపులతో అందంగా ఉన్న; "శమ్యాప్రాసంబు"; అనన్= అనబడే;

ప్రసిద్ధంబు+అగు= ప్రశస్తి కల్గిన; ఆశ్రమంబు; కలదు; అందున్= ఆ ప్రదేశంలో; జలంబులువార్చి= పుణ్యజలాన్ని ఆచమనంచేసి; కూర్చుండి= సుఖాసనాసీనుడై; వ్యాసుండు= పారాశర్యుడు; తన మదిన్= తన మనస్సును; తిరంబు+చేసికొని= స్థిరంగా ఉంచుకొని; భక్తియుక్తంబు+అయిన= భక్తితో కూడుకొన్న; చిత్తంబునన్= అంతఃకరణంలో; పరిపూర్ణుండు+అయిన= పూర్ణస్వరూపుడైన (అంతటా నిండిపోయిన); ఈశ్వరున్+కాంచి= అంతర్యామియైన పరమేశ్వరుని దర్శించి; ఈశ్వర+అధీన= ఆ భగవంతునికి లోబడియున్న; మాయా+ఆవృతంబు+ఐన= మాయచే ఆవరించబడియున్న; జీవుని= జీవునియొక్క; సంసారంబున్+కని= ఇంద్రియ వృత్తులతో కలసియున్న వ్యాపారాన్ని అవలోకించి; జీవుండు= జీవుడు; మాయచేతన్= మాయచే; మోహితుండు+అయి= ప్రభావితుడై; తాను= తాను; గుణవ్యతిరిక్తుండు+అయ్యున్= త్రిగుణాలకు అతీతుడైయుండి కూడా; మాయాసంగతిన్= మాయయొక్క సంబంధంచే; త్రిగుణాత్మకుండు+అని= సత్త్వరజస్తమోగుణ సంబంధం కలవాడని; అభిమానించుచున్= తనపై అభిమానం ఏర్పరచుకొని; త్రిగుణత్వ+అభిమానంబునన్= ఆ మూడు గుణాల మీది ప్రేమచేత; కర్తయున్= తానే చేయువాడు; భోక్తయున్= తానే ఫలాన్ని అనుభవించువాడు; అను= అనబడే; అనర్థంబున్= కీడును; ఒందున్= పొందుచున్నాడు; అనియున్= అనుకొంటూ; ఆ+అనర్థంబునకున్= ఆ కీడుకు; నారాయణభక్తియోగంబు+కాని= 'హరిభక్తి' అనే యోగంతప్ప; ఉపశమనంబు= శాంతి; వేఱు+ఒకటి= మరొకటి; లేదు+అనియును= కానరాదని; నిశ్చయించి= నిర్ణయం చేసుకొని...

**తా :** సూతమహర్షి నారదుని హరికథాగానాన్ని ప్రశంసించాడు. ఆ మహర్షి చెప్పిన మాటలను శౌనకుడు ఆలకించి ఆయనను ఒక ప్రశ్న వేశాడు. నారదుని పుట్టుపూర్వోత్తరాలు, ఆయన ఉపదేశాలు విన్న వ్యాసుడు ఆ తరువాత ఏం చేశాడని అడిగాడు. దానికి సూతుడు ఇలా సమాధానం చెబుతున్నాడు. నదులలోకెల్ల సరస్వతీనది పరమపవిత్రమైనది. అది బ్రహ్మదేవతాకమైన నది. ఆ కారణంచే యజ్ఞాదులకు, జపతపాలకు ఆలవాలమై బ్రహ్మవేత్తలకు కూడ నిరంతర స్నానయోగ్యమైనది అయింది. ఆ నదికి పడమటితీరంలో "శమ్యాప్రాసం" అనే ప్రసిద్ధమైన ఋష్యాశ్రమం ఒకటి ఉంది. అది విష్ణువుచే రక్షించబడి ఉంటుంది. ఆ కారణంవల్ల సదాచార సంపన్నులైన మునీశ్వరులకు అది నిలయంగా భాసిస్తుంది. అది పెక్కు రేగుచెట్లచే అలంకరించబడి దర్శనీయమై ప్రకాశిస్తుంది. అట్టి పవిత్ర ప్రదేశంలో ఆ నదీజలాలను ఆచమించి, వ్యాసుడు సుఖాసనంలో కూర్చున్నాడు. మనస్సును పదిలపరచుకొన్నాడు. తదేకనిష్ఠతో ధ్యానం కావించాడు. చిత్తంలో అంతర్యామి రూపంలోనున్న పరమాత్మను దర్శించాడు. ఆ పరాత్పరుని అధీనంలో మాయ ఉన్నట్లుగా గ్రహించాడు. కాని జీవుడు మాత్రం ఆ మాయయొక్క అధీనంలో ఉన్నట్లుగా గుర్తించాడు. జీవుడు మాయాసంబంధం కలిగి ఇంద్రియాలతో సంబంధం పెట్టుకొంటున్నాడని తెలుసుకొన్నాడు. త్రిగుణాలకు అతీతుడైన జీవుడు మాయాప్రభావంచే త్రిగుణాభిమానం కలవాడవుతున్నాడని, ఆ అభిమానం వల్లనే "నేను చేస్తున్నాను, నేను అనుభవిస్తున్నాను" అనే కర్తృత్వభోక్తృత్వ రూపమైన అహంకారాన్ని పొందుతున్నాడని నిర్ణయించాడు. ఆ అనర్థం ఉపశమించాలంటే "హరిభక్తి" అనే యోగం తప్ప మరొక్కటి ఏదీ లేదని నిశ్చయించాడు.

**మ.** **అవనీచక్రములోన నే పురుషుఁ డే యామ్నాయమున్ విన్న మా**
**ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపఁగాఁ జాలు భ**
**క్తి విశేషంబు జనించు నట్టి భువనక్షేమంకరంబైన భా**
**గవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పఁగన్.** **136**

**ప్రతి :** అవనీచక్రములోనన్= భూమండలంలో; ఏ పురుషుఁడు= ఏ మానవుడు; ఏ+ఆమ్నాయమున్= ఏ సంహితను; విన్నన్= ఆకర్ణించినంతమాత్రంచేతనే; లోకశరణ్యుపైన్= సమస్తలోకాలకు ఆశ్రయమిచ్చేవానిమీద; మాధవుపైన్= శ్రీమహావిష్ణువుమీద; భవములన్= జన్మపరంపరను; తప్పింపఁగాన్= రూపుమాపడానికి; చాలు= తగినటువంటి; భక్తివిశేషంబు= అచంచలమైన భక్తి; జనించున్= ఏర్పడుతుందో; అట్టి= అటువంటి; భువనక్షేమంకరంబు+ఐన= అఖిల జగాలకు శుభాన్ని కలుగజేసేదైన; భాగవత+ఆమ్నాయమున్= భాగవతమనే సంహితను; బాదరాయణుఁడు= వ్యాసమునీంద్రుడు; తాన్= తాను; నేర్పు= నైపుణ్యం; ఒప్పఁగన్= విలసిల్లగా; కల్పించెన్= రూపొందించాడు.

**తా :** ఈ భూమండలంలో ఏ మానవుడు ఏ గ్రంథంలోని విషయాన్ని శ్రవణం చేసినంతమాత్రంచేతనే శ్రీ మహావిష్ణువుపై అచంచలమైన భక్తి కలిగి జన్మబంధాలు తొలగిపోతాయో, అట్టి సమస్తలోక కల్యాణప్రదమైన "భాగవతం" అనే మహాగ్రంథాన్ని వ్యాసమహర్షి ఎంతో నేర్పుతో రచించాడు.

**వ. ఇట్లు భాగవతంబు నిర్మించి మోక్షార్థియైన శుకునిచేఁ జదివించెనని చెప్పిన విని శౌనకుండు నిర్వాణతత్పరుండును సర్వోపేక్షకుండును నైన శుకయోగి యేమిటికి భాగవతం బభ్యసించె? ననవుడు సూతుం డిట్లనియె. 137**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; భాగవతంబున్= శ్రీమద్భాగవతమనే వేదసమమైన గ్రంథాన్ని; నిర్మించి= రచించి; మోక్ష+అర్థి+ఐన= ముక్తిని మాత్రమే కోరు; శుకునిచేన్= శుకయోగిచే; చదివించెను= పఠింపజేశాడు; అని= అంటూ; చెప్పినన్= సూతుడు చెప్పగా; విని= ఆలకించి; శౌనకుండు= శౌనకుడనే ఆ మహాముని, నిర్వాణతత్పరుండును= స్వస్వరూప జ్ఞానాపేక్షయందు మాత్రమే ఆసక్తికలవాడునూ; సర్వ+ఉపేక్షకుండును= ప్రపంచంలోని సమస్త విషయాలపట్ల ఉపేక్ష వహించేవాడునూ; ఐన= అయినట్టి; శుకయోగి= ఆ శుకబ్రహ్మము; ఏమిటికిన్= ఏ కారణంచే; భాగవతంబు= ఆ భక్తిగ్రంథాన్ని; అభ్యసించెన్= అధ్యయనం చేశాడు?; అనవుడున్= అని అనగా; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** వ్యాసుడు ఆ విధంగా భాగవతం వ్రాసి ముముక్షువైన శుకునిచే చదివించాడని సూతుడు చెప్పగా, శౌనకుడు ఇలా అన్నాడు. శుకపరబ్రహ్మం కేవలం స్వస్వరూప జ్ఞానంకలవాడు కదా! విశ్వంలోని సమస్త విషయాలపట్ల ఉపేక్షాభావం వహించేవాడు కదా! అట్టివాడు భాగవత గ్రంథాధ్యయనం మాత్రం ఎలా చేశాడు? చాలా ఆశ్చర్యంగా ఉందయ్యా! అని ప్రశ్నించగా సూతమహర్షి ఇలా సమాధానమిచ్చాడు.

**క. ధీరులు నిరపేక్షులు నా, త్మారాములునైన మునులు హరిభజనము ని**
**ష్కారణమ చేయుచుందురు, నారాయణుఁ డట్టి వాఁడు నవ్యచరిత్రా! 138**

**ప్రతి :** నవ్యచరిత్రా= నుతింపదగిన చరిత్ర కలవాడా!; ధీరులున్= సుఖదుఃఖములందు చలించని చిత్తవృత్తి కలవారును (భగవద్బుద్ధియందే ఆసక్తి కలవారును); నిర్+అపేక్షులున్= దేనియందు ఆకాంక్షలేనివారును; ఆత్మ+ఆరాములున్= ఆత్మయందే రమించువారును; ఐన= అయినటువంటి; మునులు= యోగులు; హరిభజనము= శ్రీహరి సంకీర్తనాన్ని; నిష్కారణము+అ= ఏ ప్రయోజనాపేక్ష లేకుండగానే; చేయుచున్+ఉందురు= కావిస్తూ ఉంటారు; నారాయణుఁడు= శ్రీమహావిష్ణువు; అట్టివాఁడు+అ= వారి విషయంలో అటువంటివాడే.

**తా :** పవిత్ర చరిత్రా! భగవంతునియందే తప్ప మరే విషయంలోను ఆసక్తిలేనివారు, ప్రాపంచిక విషయాలయందు అనురక్తిలేనివారు, ఆత్మయందే రమించేవారు అయిన యోగీంద్రులు నిర్వ్యాజమైన భక్తితో హరి సంకీర్తనం చేస్తూ ఉంటారు. శ్రీమన్నారాయణుడు అట్టి యోగ్యత కలవాడు.

**క. హరిగుణవర్ణన రతుఁడై, హరితత్పరుఁడైన బాదరాయణి శుభ త**
**త్పరతం బఠించెఁ ద్రిజగ, ద్వరమంగళమైన భాగవత నిగమంబున్. 139**

**ప్రతి :** హరి, గుణ, వర్ణన, రతుఁడు+ఐ : హరి= శ్రీ మహావిష్ణువు యొక్క; గుణ= గుణములను; వర్ణన= వర్ణించుటయందే; తత్పరుడు+ఐ= ఆసక్తి కలవాడై; హరితత్పరుఁడు+ఐన= విష్ణువునందు ఏకాగ్రమైన మనస్సు కలవాడైన; బాదరాయణి= బాదరాయణుని కుమారుడైన శుకుడు; త్రిజగత్= మూడులోకాలకు; వర= శ్రేష్ఠమైన; మంగళము+ఐన= శుభాన్ని ప్రసాదించే; భాగవత, నిగమంబున్= భాగవతసంహితను; శుభతత్పరతన్= శుభము కలగాలనే ఆసక్తితో; పఠించెన్= అధ్యయనం చేశాడు.

**తా :** శుకయోగి శ్రీహరి దివ్యనామాలను, గుణాలను గానం చేయుటయందు ఆసక్తి కలవాడు. ఆయనయందే ఏకాగ్రమైన చిత్తం కలవాడు. ఆయన భాగవతసంహితను మూడులోకాలకు శుభదాయకమయినదిగా భావించాడు. శుభం కలగాలనే, దాన్ని అధ్యయనం చేశాడు.

**క. నిగమములు వేయుఁ జదివిన, సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్**
**సుగమంబు, భాగవతమను, నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా! 140**

**ప్రతి :** బుధా!= పండితుడవైన శౌనకా!; నిగమములు= వేదాలు; వేయున్= వేలకొలది శాఖలుగానున్నవాటిని; చదివినన్= అధ్యయనం చేసినప్పటికి; ముక్తిసుభగత్వంబుల్= ముక్తియొక్క మహాభాగ్యాలు; సుగమంబులు= సులభంగా పొందదగినవి; కావు; భాగవతము+అను= భాగవతమనే; నిగమంబున్= సంహితను; పఠింపన్= అభ్యసిస్తే; ముక్తి, నివసనము= ముక్తియందు ఉనికి; సుగమంబు= సులభమవుతుంది.

**తా :** శౌనకమునిపండితా! వేలకొలదిగానున్న వేదశాఖలనన్నింటిని అధ్యయనం చేసినా ముక్తిసంపద సులభంగా లభించేది కాదు. కాని భాగవతసంహితను అభ్యసిస్తే కైవల్యం సులభంగా లభిస్తుంది.

## ✤ అర్జునుండు పుత్రఘాతియగు అశ్వత్థామ నవమానించుట ✤

**వ. అని పలికి రాజర్షియైన పరీక్షిన్మహారాజు జన్మ కర్మ ముక్తులును, బాండవుల మహాప్రస్థానంబును, కృష్ణకథోదయంబును జెప్పెదం; గౌరవధృష్టద్యుమ్నాదుల యుద్ధంబున వీరులైన వారలు స్వర్గంబునకుం జనిన వెనుక భీము గదాఘాతంబున దుర్యోధనుండు దొడలు విఱిగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురవోవు ద్రౌపదీపుత్త్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించె. అది క్రూరకర్మంబని లోకులు నిందింతురు. 141**

**ప్రతి :** అనిపలికి= అని సూతుడు వచించి; రాజ+ఋషి+ఐన= రాజులలో ఋషివంటివాడైన; పరీక్షిత్+మహారాజు= పరీక్షిత్ మహారాజు యొక్క; జన్మ, కర్మ, ముక్తులును= పుట్టుక, ధర్మాధర్మకృత్యం, మోక్షం అనే విషయాలను; పాండవుల=

పాండురాజు కుమారులయొక్క; మహాప్రస్థానంబును= స్వర్గారోహణకు గావించిన సుదీర్ఘ ప్రయాణాన్ని; కృష్ణకథా= శ్రీకృష్ణుని చరిత్రయొక్క; ఉదయంబును= ఆరంభాన్ని; చెప్పెదన్= వివరిస్తాను; కౌరవ, ధృష్టద్యుమ్న+ఆదుల : కౌరవ= కౌరవులకు; ధృష్టద్యుమ్న+ఆదులకు= ధృష్టద్యుమ్నుడు మున్నగువారికి జరిగిన; యుద్ధంబునన్= కురుక్షేత్ర మహాయుద్ధమునందు; వీరులు+ఐన+వారలు= వీరులైనవారు (మరణించి); స్వర్గంబునకున్= స్వర్గలోకానికి; చనిన+వెనుకన్= వెళ్ళిన పిమ్మట; భీము+గదా+ఘాతంబునన్= భీమసేనుని గదయొక్క దెబ్బకు; దుర్యోధనుండు; తొడలు; విఱిగి; కూలినన్= పడిపోగా; అశ్వత్థామ= ద్రోణుని కుమారుడైన అశ్వత్థామ; దుర్యోధనునకున్= సుయోధనునకు; ప్రియంబు= సంతోషాన్ని; చేయువాఁడు+ఐ= చేకూర్చువాడై; నిదుర+పోవు= నిద్రపోయే; ద్రౌపదీపుత్రుల= ద్రౌపదీదేవియొక్క కుమారుల (ఉపపాండవుల); శిరంబులు= తలలను; ఖండించి= నరకి; తెచ్చి= తీసుకొనివచ్చి; సమర్పించెన్= అర్పించాడు; అది= ఆ పని; క్రూరకర్మంబు+అని= ఘోరమైన కృత్యమని; లోకులు= జనులు; నిందింతురు= దూషిస్తారు.

**తా :** అని చెప్పి సూతుడు – రాజులలో ఋషివంటివాడైన పరీక్షిన్మహారాజు పుట్టుక, అతని ధర్మాధర్మకృత్యాలు, అతడు మోక్షము పొందుట, పాండవుల మహాప్రస్థానము, శ్రీకృష్ణ చరిత్ర వివరిస్తానన్నాడు. కౌరవులకు, ధృష్టద్యుమ్నుడు మొదలగువారికి జరిగిన కురుక్షేత్ర మహాసంగ్రామంలో వీరులంతా స్వర్గానికి వెళ్ళిన తరువాత, భీముని గదదెబ్బకు దుర్యోధనుడు తొడలు విరిగి నేలకూలగా, అశ్వత్థామ అతనికి సంతోషాన్ని కలిగించాలని నిద్రపోతున్న ద్రౌపదీపుత్రుల (ఉపపాండవుల) తలలు నరికి వాటిని తెచ్చి ఆ సుయోధనుడికి అర్పించాడు. అశ్వత్థామ చేసింది క్రూరకృత్యమని లోకులు నిందిస్తారు.

**విశే :** పాండవుల స్వర్గారోహణం కొరకు సాగించిన సుదీర్ఘ ప్రయాణమే మహాప్రస్థానం.

ధృష్టద్యుమ్నుడు మహాభారతయుద్ధంలో పాండవపక్ష సేనాధిపతి. కౌరవపక్ష ప్రథమ సేనాధిపతి కురుపితామహుడు భీష్ముడు. చిత్రమేమంటే కౌరవపక్ష సేనాధిపతులు మారారుగాని, పాండవపక్షాన మొదటినుండి చివరివరకు ధృష్టద్యుమ్నుడే సేనాధిపత్యం వహించాడు.

**ఉ. బాలుర చావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి, యోరువం**
**జాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాల నేడ్చి, పాం**
**చాలతనూజ నేలఁబడి జాలిఁ బడం గని, యెత్తి మంజు వా**
**చాలతఁ జూపుచుం జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్. 142**

**ప్రతి :** బాలురచావు= కన్నకొడుకుల మరణవార్త; కర్ణములన్= చెవులందు; పడ్డన్= తాకగా; కలంగి= చాలా కలతచెంది; అలంగి= మిక్కిలి దుఃఖించి; ఓరువన్+చాలక= సహించలేక; బాష్పతోయకణజాలము= శోకంతో నిండిన కన్నీటి బిందువుల సముదాయం; చెక్కులన్= కపోలములందు; రాలన్= ధారగా కారగా; ఏడ్చి= విలపించి; పాంచాలతనూజ= పాంచాలరాజు కొమార్తెయైన ద్రౌపది; నేలన్+పడి= నేలమీదపడి; జాలిన్; పడన్+కని= దుఃఖపడుటచూచి; ఎత్తి= లేవనెత్తి; మంజు, వాచాలతన్= మనోహరమైన మాటతీరును; చూపుచున్= ప్రదర్శిస్తూ; చికురజాలమున్= ఆమె తలవెంట్రుకలను; దువ్వుచున్= నిమురుతూ; క్రీడి= అర్జునుడు; ఇట్లు+అనున్= ఇలా అన్నాడు.

**తా :** అశ్వత్థామ కరవాలానికి కన్నకొడుకుల తలలు తెగిపోయాయన్న వార్త ద్రౌపది చెవులపడింది. ఆమె చాలా కలత చెందింది. మిక్కిలి దుఃఖించింది. మనస్సులో జీర్ణించుకోలేకపోయింది. శోకంతో కన్నీళ్లు పెల్లుబికి వచ్చి చెక్కిళ్లపై ధారగా

కారగా ఏడ్చి ఏడ్చి నేలపై వివశురాలై పడిపోయింది. ఆమెను చూచి అర్జునుడు చాలా జాలి పొందాడు. నేలపై పడిపోయిన పాంచాలిని లేవనెత్తాడు. సమయానికి తగిన ఓదార్పుతోకూడిన మధురమైన వచోవిన్యాసంతో ఊరటపరిచాడు. ఆమె తలవెంట్రుకలు నిమురుతూ ఇలా సాంత్వన వాక్యాలు పలికాడు.

**మ. ధరణీశాత్మజ వీవు నీకు వగవన్ ధర్మంబె? యా ద్రౌణి ని**
**ష్కరుణుండై విదళించె బాలకుల; మద్గాండీవ నిర్ముక్త భీ**
**కర బాణంబుల నేఁడు వాని శిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ; ద**
**చ్ఛిరముం ద్రొక్కి జలంబు లాడు మిచటన్ శీతాంశుబింబాననా! 143**

**ప్రతి :** శీత+అంశుబింబ+ఆననా!= చల్లని కిరణాలకు నిలయమైన చంద్రబింబంవంటి ముఖం కలదానా!; నీవు= నీవు; ధరణీ+ఈశ+ఆత్మజవు= రాజర్షి ద్రుపదునియొక్క కొమార్తెవు; నీకున్= అటువంటి నీకు; వగవన్= శోకించడం; ధర్మంబు+ఎ= ఉచితమవుతుందా?; ఆ ద్రౌణి= ఆ ద్రోణుని కుమారుడైన అశ్వత్థామ; నిష్కరుణుండు+ఐ= దయలేనివాడై; బాలకులన్= పసిబిడ్డలను; విదళించెన్= నరకివేశాడు; మత్= నాయొక్క; గాండీవ= గాండీవమనే పేరుగల వింటినుండి; నిర్ముక్త= విడువబడ్డ; భీకర= భయంకరములైన; బాణంబులన్= విశిఖములచే; నేఁడు= ఈనాడు; వాని= ఆ దుష్టుని; శిరమున్= తలను; ఖండించి= నరకి; నేన్= నేను; తెత్తున్= తీసుకొని వస్తాను; తద్+శిరమున్= ఆ అశ్వత్థామ శిరస్సును; త్రొక్కి= కాలితో తన్నిన తరువాతనే; ఇచటన్= ఇచ్చట; జలంబులు+ఆడుము= మైలస్నానం చేసెదవుగాక!

**తా :** చంద్రవదనా! నీవు ఒక క్షత్రియకాంతవు. అందులోను ద్రుపదమహారాజు కొమార్తెవు. అట్టి నీవు చనిపోయినవారిని గూర్చి ఇలా శోకించడం తగదు. దాక్షిణ్యం లేనివాడై ఆ అశ్వత్థామ మన బిడ్డలను నరకివేశాడు. ఆతనిని నేను వదలివేస్తాననుకొన్నావా? తగిన ప్రతీకారం చేస్తాను. ఈ గాండీవమనే నా వింటినుండి భయంకరంగా వెలువడే, చీల్చి చెండాడే అమ్ములతో వాని తల నరకివేస్తాను. దానిని నీకు కానుకగా తీసుకొనివస్తాను. ఆ తలను కాలితో తన్ని అటుపిమ్మటనే అశుచిస్నానం ఆచరించెదవు గాక!

**వ. అని యిట్లొడంబఱచి తనకు మిత్త్రుండును సారథియునైన హరి మేలనుచుండం గవచంబు దొడిగి గాండీవంబు ధరియించి కపిధ్వజుండై గురుసుతుని వెంట రథంబు దోలించిన. 144**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; ఒడంబఱచి= ద్రౌపదిని అంగీకరింపజేసి; తనకున్= తనకు; మిత్రుండును= ఆత్మీయ స్నేహితుడును; సారథియున్+ఐన= రథసారథియైన; హరి= శ్రీకృష్ణుడు; మేలు+అనుచున్= బాగుబాగని పొగడుచుండగా; కవచంబు+తొడిగి= కవచమును ధరించి; గాండీవంబు= గాండీవమనే పేరుగల విల్లును; ధరియించి= తాల్చి; కపిధ్వజుండు+ఐ= కపి అయిన ఆంజనేయుడు పతాకంపై కలవాడు; గురుసుతునివెంటన్= గురుపుత్రుడైన అశ్వత్థామను వెన్నాడుతూ; రథంబు= అరదాన్ని; తోలించినన్= నడిపించగా...

**తా :** అని ఈ విధంగా అర్జునుడు అనునయవాక్యాలతో ద్రౌపదిని సమ్మతింపజేశాడు. తనకు నిరంతరం ఆత్మీయుడు, యుద్ధసందర్భాలలో సారథియునైన శ్రీకృష్ణుడుకూడ అందులకు అంగీకరించి మేలుమేలని ప్రశంసించాడు. అర్జునుడు వెంటనే కవచాన్ని ధరించాడు. గాండీవాన్ని చేత దాల్చాడు. కపిధ్వజాన్ని రథంపై ఎత్తించాడు. అశ్వత్థామపై స్యందనాన్ని తోలించాడు.

**శా. తన్నుం జంపెదనంచు వచ్చు విజయున్ దర్శించి తద్ద్రౌణి యా**
**పన్నుండై శిశుహంత గావున నిజ ప్రాణేచ్ఛఁబాఱెన్ వడిన్**
**మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప నా**
**సన్నుండౌ హరుఁజూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియభ్రాంతితోన్. 145**

**ప్రతి :** తన్నున్= తనను; చంపెదను= సంహరిస్తాను; అంచున్= అంటూ; వచ్చు= మీదికి వస్తున్న; విజయున్= అర్జునుని; దర్శించి= చూచి; తద్+ద్రౌణి= ఆ అశ్వత్థామ; శిశుహంత= పసివారిని చంపినవాడు; కావునన్= కాబట్టి; ఆపన్నుండు+ఐ= ఆపదలోనున్నవాడై; నిజప్రాణ+ఇచ్ఛన్= తన ప్రాణాలపైనున్న తీపిచే; మున్ను= పూర్వం; ఆ బ్రహ్మ= ఆ బ్రహ్మదేవుడు; తనయకున్= కన్నకూతురుపై; మోహించి= ఆశించి; క్రీడింపన్= విహరించబోగా; ఆసన్నుండు+ఔ= తనను సమీపిస్తున్న; హరున్= రుద్రుని; చూచి= వీక్షించి; సర్వ+ఇంద్రియభ్రాంతితోన్= సమస్తేంద్రియాలలోను వ్యాపించిన భయంతో; మృగ+ ఆకృతిన్= లేడిరూపంలో; పాఱు= పరుగెత్తే; పగిదిన్= విధంగా; వడిన్= వేగంగా; పాఱెన్= పరుగులు తీశాడు.

**తా :** తనను ఏమైనాసరే సంహరిస్తానని ప్రతిజ్ఞచేసి సన్నద్ధుడై మీదికి వస్తున్న అర్జునుణ్ణి చూశాడు ద్రోణసూనుడు. పసిబాలురను చంపిన పాపంతో పీడించబడినవాడు కాబట్టి ఆపదలోనున్న వాడయ్యాడు. ప్రాణభయంతో పరుగెత్తసాగాడు. పూర్వం బ్రహ్మదేవుడు తనచేతనే సృష్టించబడిన కన్యనే మోహించి క్రీడింప యత్నించిన సమయంలో రుద్రుడు తనవెంటబడగా భయభ్రాంతుడై మృగరూపంతో పరుగెత్తినట్లుగా అశ్వత్థామ అర్జునుని చూచి పరుగులు తీశాడు.

**వ. ఇట్లోపినంత దూరంబునుం బరువిడి వెనుకఁ జూచి రథతురగంబు లలయుటఁ దెలిసి నిలిచి ప్రాణరక్షణంబునకు నొండుపాయంబు లేమి నిశ్చయించి, జలంబుల వార్చి, ద్రోణనందనుండు సమాహిత చిత్తుండై ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయుఁ బ్రాణ సంరక్షణార్థంబు పార్థునిమీఁద బ్రహ్మశిరోనామకాస్త్రంబుం బ్రయోగించిన నది ప్రచండ తేజంబున దిగంతరాళంబులు నిండి ప్రాణి భయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె. 146**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; ఓపిన+అంత= చేతనైనంత; దూరంబున్= దూరంవరకు; పరువు+ఇడి= పరుగెత్తి; వెనుకన్+చూచి= వెనుకకు చూచి; రథతురగంబులు= తన రథపు గుఱ్ఱాలు; అలయుటన్= అలసిపోయినట్లుగా; తెలిసి= నిశ్చయించినవాడై; నిలిచి= ఒక్కక్షణం ఆగి; ప్రాణరక్షణంబునకున్= ప్రాణాలు కాపాడుకోవడానికై; ఒందు= మరొక్క; ఉపాయంబు= విధము; లేమి= లేకపోవడాన్ని; నిశ్చయించి= నిర్ణయించి; ద్రోణనందనుండు= ద్రోణుని కుమారుడైన అశ్వత్థామ; జలంబులన్+వార్చి= ఆచమనంచేసి; సమాహితచిత్తుండు+ఐ= ధ్యానయోగంలో కూర్చున్నవాడై; ప్రయోగంబు+అ+కాని= ఎదుటివారిపై ప్రయోగించు విద్యయేకాని; ఉపసంహారంబు= తిరిగి వెనుకకు మళ్లించు విద్య; నేరకయున్= చేతకాకపోయినా; ప్రాణసంరక్షణ+అర్థంబు= (తన) ప్రాణాలను రక్షించుకొనుట కొరకు; పార్థునిమీఁదన్= అర్జుననిపై; బ్రహ్మశిరస్+నామక+ అస్త్రంబున్= బ్రహ్మశబ్దము శిరస్సున గల మంత్రదేవతాకమైన అస్త్రమును; ప్రయోగించినన్= ప్రయోగించగా; అది= ఆ అస్త్రము; ప్రచండతేజంబునన్= భయంకరమైన తేజస్సుతో; దిక్+అంతరాళంబులు= దిక్కుల మధ్యభాగంలో; నిండి= నిండిపోయి; ప్రాణిభయంకరంబు+ఐ= సమస్తభూతకోటికి భీతి కల్గించునదై; తోఁచినన్= కన్పట్టగా; అర్జునుండు= విజయుడు; హరికిన్= కృష్ణునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అశ్వత్థామ శక్తి ఉన్నంతమేరకు గుఱ్ఱాల నడుపుకొంటూ కొంతదూరం పరుగెత్తాడు. తనను వెన్నంటి తరుముతున్న పార్థుని చూశాడు. తన రథాశ్వాలు అలసిపోయినట్లుగా గుర్తించాడు. తన ప్రాణాలు కాపాడుకోవడానికి ఉపాయం ఏమి ఉందా? అని ఆలోచించాడు. ఒక్కక్షణం ఆగి ఆచమనంచేసి ధ్యానయోగావిష్టుడయ్యాడు. తనకు ప్రయోగం తప్ప ఉపసంహారం తెలియకపోయినా బ్రహ్మశిరోనామకాస్త్ర ప్రయోగమంత్రం జపించాడు. స్వీయ ప్రాణరక్షణార్థం దానిని అభిమంత్రించి అస్త్రంగా అర్జునునిపై ప్రయోగించాడు. అది భయంకరమైన తేజస్సుతో భూమ్యాకాశాల మధ్యభాగం వ్యాపించి సమస్తప్రాణికోటికి భీతి కల్గించడం ప్రారంభించింది. ఆ సమయంలో విజయుడు శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు.

**సీ. పద్మలోచన! కృష్ణ! భక్తాభయప్రద! వినుము సంసారాగ్ని వేఁగుచున్న**
**జనుల సంసారంబు సంహరింపఁగ నీవు దక్క నన్యులు లేరు దలఁచి చూడ**
**సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు ప్రకృతికి నవ్వలి ప్రభుఁడ వాద్య**
**పురుషుండవగు నీవు బోధముచే మాయ నడఁతువు నిశ్రేయసాత్మయందు**

**ఆ. మాయచేత మునిఁగి మనువారలకుఁ గృప సేసి ధర్మముఖ్యచిహ్నమయిన**
**శుభముసేయు దీవు సుజనుల నవనిలోఁ గావఁ బుట్టుదువు జగన్నివాస! 147**

**ప్రతి :** పద్మలోచన= తామరపూలవంటి కన్నులు కలవాడా!; భక్త+అభయ+ప్రద= భక్తులకు అభయాన్ని ప్రసాదించువాడా!; కృష్ణ= శ్రీకృష్ణపరమాత్మా!; వినుము= నా ప్రార్థన ఆలకించు; సంసార+అగ్నిన్= సంసారమనే అగ్నిలో; వేఁగుచున్న= దహింపబడుతున్న; జనుల= జీవులయొక్క; సంసారంబు= భవబంధాన్ని; సంహరింపఁగన్= నాశనం చేయడానికి; నీవు+తక్కన్= నీవుతప్ప; అన్యులు= ఇతరు లెవ్వరూ; లేరు= సమర్థులుకారు; తలఁచి= ఆలోచించి; చూడన్= వీక్షించగా; సాక్షాత్కరించిన= కన్నులముందు ప్రత్యక్షమైన; సర్వ+ఈశ్వరుండవు= పరమాత్మవు; ప్రకృతికిన్= ఈ సృష్టిరూప ప్రకృతికన్న; అవ్వలి= భిన్నమైన (ముందునుండి ఉండే); ప్రభుఁడవు= విభుడవు; ఆద్యపురుషుండవు+అగు= ఈ సృష్టిలోని మొట్టమొదటి విరాట్పురుషుడవైన; నీవు= నీవు; బోధముచేన్= జ్ఞానముచే (చిచ్ఛక్తిచే); మాయన్= అజ్ఞానాన్ని; నిశ్రేయస+ఆత్మయందున్= ఆనందస్వరూపమైన ఆత్మయందు; అడఁతువు= అణగద్రొక్కియుంచుతావు; మాయచేతన్= మాయాప్రభావంతో; మునిఁగి; మనువారలకున్= బ్రదుకువెళ్లబుచ్చేవారికి; కృప+చేసి= దయను చూపించి; ధర్మముఖ్యచిహ్నము+అయిన= ధర్మరూపమైన లక్ష్యమే ప్రధానంగా కల; శుభము= కల్యాణాన్ని; చేయుదువు= ప్రసాదిస్తావు; జగత్+నివాస= జగములే నివాసస్థానంగా కలవాడా!; సుజనులన్= సత్పురుషులను; కావన్= రక్షించడానికై; అవనిలోన్= భూమిపై; ఈవు= నీవు; పుట్టుదువు= అవతరిస్తావు.

**తా :** పుండరీకాక్షా! భక్తరక్షకా! శ్రీకృష్ణా! సంసారాగ్ని జ్వాలల్లో దహించబడుతున్న జనుల తాపాలను రూపుమాపడానికి నీకొక్కనికే శక్తి కలదు. నీవు కన్నులముందు సాక్షాత్కరించిన సగుణరూప పరబ్రహ్మవు. ఈ కనబడే ప్రకృతికన్న అవ్వల వెల్గువాడవు. నీవే ఆదిపురుషుడవు. నీవు నీ చిచ్ఛక్తిచే మాయను లోబఱచుకొని ఉంటావు. అఖండ సచ్చిదానందరూపమైన ఆత్మయందు మాయలో మునిగి జీవభావంలో జీవించేవారిని కృపతో కటాక్షిస్తావు. వారికి ధర్మమే ప్రధాన లక్ష్యమైన కల్యాణాన్ని ప్రసాదిస్తావు. జగన్నివాసా! సజ్జన రక్షణకోసమై ఈ భూమిపై అవతరిస్తావు.

**విశే :** జగన్నివాసుడు – జగత్తులకు నివాసమైనవాడు. జగత్తులందు నివసించువాడు.

**క. ఇది యొక తేజము భూమియుఁ, జదలును దిక్కులును నిండి సర్వంకషమై**
**యెదురై వచ్చుచు నున్నది, విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా! 148**

**ప్రతి :** దేవేశా (దేవ+ఈశా)= దేవతలకు ప్రభువైనవాడా!; ఇది; ఒక తేజము= ఒక కాంతిపుంజం; భూమియున్= పుడమిని; చదలును= ఆకాశమును; దిక్కులును= దిశలును; నిండి= వ్యాపించి; సర్వంకషము+ఐ= అంతటిని ఒరయుచున్నదై; ఎదురు+ఐ= నాకెదురుగుండా; వచ్చుచున్+ఉన్నది= అరుదెంచుచున్నది; విదితముగాన్= ఇదేమిటో అర్థమయ్యేలా; ఎఱుఁగన్= స్పష్టంగా తెలిసేలా; చెప్పవే= చెప్పవలసింది.

**తా :** దేవాధిదేవా! ఇదేదో ఒక కాంతిపుంజం. భూమ్యాకాశాలు, సమస్త దిక్కులు వ్యాపించి, ఎటుచూచినా, అదే, నాకెదురుగా వస్తున్నది. దీనిస్వరూపమేమిటో నాకర్థం కావడంలేదు. నాపై దయతో అదేమిటో స్పష్టంగా తెలియజేయుము.

**వ. అనిన హరి యిట్లనియె. 149**

**ప్రతి :** అనినన్= అని అర్జునుడు పలుకగా; హరి= కృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అర్జును డీవిధంగా పలుకగా ప్రశ్నించగా, శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**శా. జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛమై**
**బ్రహ్మాస్త్రం బదె యేసె; వచ్చె నిదె తద్బాణాగ్ని బీభత్స! నీ**
**బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మరలింపన్ రాదు; సంహార మీ**
**బ్రహ్మపత్య మెఱుంగఁ; దేయుము వడిన్ బ్రహ్మాస్త్రమున్ దీనిపై. 150**

**ప్రతి :** బీభత్స!= యుద్ధభూమిలో పరాక్రమంతో విక్రమించి బీభత్సం సృష్టించే అర్జునా!; దుస్+శీలుండు= దుష్టమైన ప్రవర్తన కలవాడైన; ద్రోణజుఁడు= ద్రోణసుతుడైన అశ్వత్థామ; పాఱి= పారిపోయి; జిహ్మత్వంబునన్= వక్రబుద్ధితో; ప్రాణ+ఇచ్ఛమైన్= ప్రాణరక్షణార్థమై; అది+ఎ= ఆ వచ్చే; బ్రహ్మ+అస్త్రంబు= బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని; ఏసెన్= ప్రయోగించాడు; ఇది+ఎ= ఈ తేజస్సు; తద్+బాణ+అగ్ని= ఆ అస్త్రంయొక్క జ్వాలయై; వచ్చెన్= ఏతెంచుచున్నది; దీనిన్= ఈ అస్త్రాన్ని; నీ బ్రహ్మ+అస్త్రంబునన్= నీ బ్రహ్మాస్త్రంచే; కాని= తప్ప; మరలింపన్+రాదు= త్రిప్పికొట్టటం సాధ్యం కాదు; సంహారము= దాని ఉపసంహరణాన్ని; ఈ బ్రహ్మపత్యము= ఈ బ్రాహ్మణసంతానమైన అశ్వత్థామ; ఎఱుంగఁడు= తెలియదు; వడిన్= వేగంగా; దీనిపైన్= ఈ బ్రహ్మాస్త్రంపై; బ్రహ్మాస్త్రమున్= (నీ) బ్రహ్మాస్త్రాన్ని; ఏయుము= ప్రయోగించు.

**తా :** వివ్వచ్చుడా! ద్రోణుని కుమారుడైన ఆ అశ్వత్థామ కుటిలవర్తనుడు. దుష్టశీలుడు. అతడు పరుగెత్తి పారిపోతూ చేసేదిలేక ఆత్మరక్షణార్థమై వక్రబుద్ధితో బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. ఈ భయంకరమైన తేజస్సు దానిదే. దానిని మరలించాలంటే బ్రహ్మాస్త్రానికి తప్ప మరొక్కదానికి ఆ సామర్థ్యంలేదు. దాని ఉపసంహారం ఆ ద్రోణపుత్రునికి తెలియదు. నీవు ఆలస్యం చేయకుండా దానిపై నీ బ్రహ్మాస్త్రాన్ని (ఉపసంహారాస్త్రంగా) ప్రయోగించు.

**వ. అనిన నర్జునుండు జలంబులు వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి, ద్రోణనందనుం డేసిన బ్రహ్మాస్త్రంబు మీఁదఁ దన బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించిన. 151**

**ప్రతి :** అనినన్= అని కృష్ణుడు పలుకగా; అర్జునుండు= విజయుడు; జలంబులువార్చి= ఆచమించి; హరికిన్= భగవంతునకు; ప్రదక్షిణంబువచ్చి= ప్రదక్షిణంచేసి, చుట్టు తిరిగి; ద్రోణనందనుండు= గురువైన ద్రోణుని పుత్రుడు; ఏసిన= ప్రయోగించిన; బ్రహ్మాస్త్రంబుమీఁదన్= బ్రహ్మశిరోనామకాస్త్రంపై; తన బ్రహ్మాస్త్రంబున్= తన బ్రహ్మాస్త్రాన్ని (ఉపసంహారంగా); ప్రయోగించినన్= ఉపయోగించగా...

**తా :** శ్రీకృష్ణుని వచనాలు వినగానే అర్జునుడు ఆచమించాడు. మంత్ర దేవతను స్మరించాడు. ఆ వాసుదేవునకు ప్రదక్షిణం చేశాడు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రంపై తన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

**మ. అవని వ్యోమములందు నిండి తమలో నా రెండు బ్రహ్మాస్త్రముల్**
**రవి వహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాసంబు గావింపఁగా**
**వివశభ్రాంతి యుగాంతమో యని ప్రజల్ వీక్షింప నా వేళ మా**
**ధవు నాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వంద్వోపసంహారమున్. 152**

**ప్రతి :** ఆ రెండు బ్రహ్మాస్త్రముల్= అశ్వత్థామ, అర్జునుడు ప్రయోగించిన ఆ రెండు బ్రహ్మాస్త్రాలు; అవనివ్యోమములందున్= భూమి, ఆకాశములందు; నిండి= నిండిపోయి; తమలోన్= తమలో తాము; రవి, వహ్ని, ద్యుతిన్= సూర్యునియొక్క అగ్నియొక్క తేజస్సులతో; పోరుచున్= పరస్పరం పోరుసాగిస్తూ; త్రిభువన= మూడుజగాలకు; త్రాసంబు= భీతిని; కావింపఁ గాన్= కల్గింపగా; వివశభ్రాంతిన్= అదుపుతప్పిన భ్రమతో; యుగ+అంతము+ఓ= ప్రళయకాలమో; అని= అని భావిస్తూ; ప్రజల్= లోకులు; వీక్షింపన్= చూడగా; ఆ వేళన్= ఆ సమయంలో; మాధవు= శ్రీకృష్ణపరమాత్మయొక్క; ఆజ్ఞన్= ఆనతితో; విజయుండు= ధనంజయుడు; విశిఖద్వంద్వ= రెండు బాణములయొక్క; ఉపసంహారమున్= ఉపసంహరణను; చేసెన్= కావించాడు.

**తా :** ఆ బ్రహ్మాస్త్రాలు రెండూ భూమ్యాకాశాలమధ్యలో నిండిపోయాయి. సూర్యాగ్ని తేజస్సులతో తమలో తాము పరస్పరం పోరు సాగించాయి. ముజ్జగాలు భీతితో తల్లడిల్లిపోయాయి. సమస్త భూతాలు వారింప శక్యంకాని భయంతో ప్రళయకాలమేమోయని భావించాయి. ఆ సమయంలో శ్రీకృష్ణుని అనుమతిపై అర్జునుడు ఆ రెండు బ్రహ్మాస్త్రాలను ఉపసంహరించాడు.

**వ. ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి, ధనంజయుండు ద్రోణనందనుం గూడ నరిగి తఱిమి పట్టుకొని, రోషారుణిత లోచనుండై యాజ్ఞికుండు రజ్జువునం బశువుం గట్టిన చందంబున బంధించి శిబిరంబు కడకుం గొని చని హింసింతునని తిగిచినం జూచి హరి యిట్లనియె. 153**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; అస్త్రద్వయంబున్= అస్త్రాలు రెండింటిని; ఉపసంహరించి= వెనుకకు మరలించి; ధనంజయుండు= అర్జునుడు; ద్రోణనందనున్= అశ్వత్థామను; కూడన్+అరిగి= వెంబడించి పరుగుతీసి; తఱిమి= వెన్నాడి; పట్టుకొని= ఆతనిని పట్టుకొని; రోష+అరుణిత+లోచనుండు+ఐ= క్రోధంచే ఎఱ్ఱగా చేయబడ్డ నేత్రాలు కలవాడై; యాజ్ఞికుండు= యజ్ఞం చేసేవాడు; రజ్జువునన్= త్రాటిచే; పశువున్= యజ్ఞపశువును; కట్టిన= బంధించిన; చందంబునన్= రీతిగా; బంధించి= కట్టివేసి; శిబిరంబుకడకున్= సేనానివేశం దగ్గరకు; కొని= లాగికొని; చని= వెళ్లి; హింసింతును+అని= చిత్రహింస చేస్తానని; తిగిచినన్= ఈడ్చుచుండగా; చూచి= కనుగొని; హరి= కృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ ప్రకారంగా అన్నాడు.

**తా :** అర్జునుడు ఆ రెండు అస్త్రాలను ఉపసంహరించాడు. అశ్వత్థామను వెన్నంటి తరిమిపట్టుకొన్నాడు. ఆతనిని చూచిన వెంటనే ధనంజయుని నేత్రాలు క్రోధంతో ఎరుపెక్కాయి. యజ్ఞకర్త త్రాటితోయాగ పశువును బంధించినట్లుగా ద్రోణపుత్రుని కట్టివేసి సేనాశిబిరానికి లాగుకొని వెళ్లాడు. ఆతనిని హింసించి తీరుతానని ఈడ్చుకొని వస్తున్న బీభత్సుని చూచి కృష్ణుడు ఇలా అన్నాడు.

**ఉ.** **మాఱుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం**
**దేఱని పిన్నపాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై,**
**పాఱుఁడె వీఁడు పాతకుఁడు, ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం**
**బాఱెడి వీనిఁ గావుము కృపామతి నర్జున! పాపవర్జనా!** **154**

**ప్రతి :** పాపవర్జనా= పాపరహితుడా!; అర్జున!= ధనంజయా!; మాఱుపడంగన్‌లేని= ఎదుర్కొనడానికి శక్తి చాలనట్టి; న+సమర్థులన్= తనతో సమానమైన సామర్థ్యంలేనట్టి; సుప్తులన్= నిద్రిస్తున్నటువంటి; అస్త్రవిద్యలన్= ధనుర్విద్యలలో; తేఱని= ఆరితేరనటువంటి; పిన్నపాపలన్= తన యీడు కానివారిని, చిన్నవారైనటువంటివారిని; నిశీథమునందున్= అర్ధరాత్రి సమయంలో; క్రూరుఁడు+ఐ= పాపబుద్ధి కలవాడై; వధించెన్= చంపివేశాడు; వీఁడు= ఈ; పాతకుఁడు= పాపాత్ముడు; పాఱుఁడు+ఎ= బ్రాహ్మణుడా? (కాదు. కాని); ప్రాణభయంబునన్= ప్రాణాలపైనున్న ఆశతో; వెచ్చనూర్చుచున్= అధికంగా వేడి నిట్టూర్పులు విడుస్తూ; పాఱెడి= పరుగులు తీసిన; వీనిన్= ఈ అశ్వత్థామను; కృపామతిన్= దయాబుద్ధితో; కావుము= రక్షించుము.

**తా :** అర్జునా! నీవైతే పాపకృత్యాలను ఆచరించేవాడవు కావు. ఈ బ్రాహ్మణుడు చూస్తే మహాపాపాత్ముడు. మీ కుమారులతనిని ఎదుర్కొనే శక్తిలేనివారు. అతనితో సమానమైన సామర్థ్యం లేనివారు. పైగా నిద్రిస్తున్నవారు. ధనుర్విద్యలో ఆరితేరనివారు. పోల్చిచూస్తే తనకంటె వయస్సులో చాల చిన్నవారు. అటువంటి చిన్నవాళ్లను రాత్రి సమయంలో క్రూరబుద్ధితో చంపేశాడు. అట్టి మహాపాతకుని విడిచిపుచ్చవలసిన అవసరం లేదు. అయినా ప్రాణాలపై ఆశతో వేడినిట్టూర్పులు విడుస్తూ పరుగెత్తాడు. నీవు దయాబుద్ధి నవలంబించి వీనిపై కనికరం చూపించు.

**చ.** **వెఱచిన వాని, దైన్యమున వేఁదుఱు నొందినవాని, నిద్ర మై**
**మఱచినవాని, సౌఖ్యమున మద్యము ద్రావిన వాని, భగ్నుఁడై**
**పఱచిన వాని, సాధు జడభావము వానిని, గావు మంచు వా**
**చఱచిన వానిఁ, గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా!** **155**

**ప్రతి :** ఫల్గునా= అర్జునా!; వెఱచినవానిన్= భయపడినవానిని; దైన్యమునన్= దిగులుతో; వేఁదుఱున్= పిచ్చితనం; ఒందినవానిన్= పొందినవానిని; నిద్రన్= నిద్రతో; మైమఱచినవానిన్= స్పృహలేనివానిని; సౌఖ్యమునన్= ఆనందంతో; మద్యము= మత్తెక్కించే పానీయాన్ని; త్రావినవానిన్= సేవించినవానిన్; భగ్నుఁడు+ఐ= యుద్ధరంగంలో పరాజితుడై, పఱచినవానిన్= పారిపోయినవానిని; సాధు, జడభావము వానినిన్= మంచివానిని, కార్యోత్సాహం లేనివానిని; కావుము= రక్షించుము; అంచున్= అంటూ; వాచఱచినవానిన్= మొరపెట్టుకొన్నవానిని; కామినులన్= స్త్రీలను; చంపుట= వధించడమనే కృత్యం; ధర్మము+కాదు= సమంజసం కాదు.

**తా :** అర్జునా! భయపడినవానిని, దిగులుతో బుద్ధిమందగించినవానిని, నిద్రలో స్పృహలేనివానిని, ఆనందంతో మద్యపానంచేసి మైమరచినవానిని, యుద్ధరంగంలో పరాజితుడై పారిపోయినవానిని, మంచివానిని, కార్యోత్సాహం లేనివానిని, రక్షించుమని మొరపెట్టుకొన్నవానిని, స్త్రీలను వధించడం అనేది ధర్మం కాదు కదా!

**శా. స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు సాలించి య**
**న్య ప్రాణంబులచేత రక్షణము సేయన్ వాఁ డధోలోక దుః**
**ఖప్రాప్తుండగు రాజదండమున సత్కల్యాణుఁడౌ నైన నీ**
**విప్రుం దండితుఁ జేయ నేటికి మహావిభ్రాంతిచే నుండఁగన్. 156**

**ప్రతి :** ఎవ్వఁడు+ఏనిన్= ఏ మానవుడైనా; కరుణాసంగంబు= దయాదాక్షిణ్యాన్ని; చాలించి= వదలిపెట్టి; స్వప్రాణంబులన్= తన ప్రాణాలను; అన్యప్రాణంబులచేతన్= ఇతరుల ప్రాణాలు (తీయడం) ద్వారా; రక్షణము+చేయన్= రక్షించుకొంటాడో; వాఁడు= అటువంటివాడు; అధస్+లోక= నరకలోకంలో; దుఃఖప్రాప్తుండు+అగున్= దుఃఖమును పొందినవాడవుతాడు; (లేదా) రాజదండమునన్= రాజు విధించిన శిక్షచే; సత్కల్యాణుఁడు= మంచిశ్రేయస్సు పొందినవాడు; ఔను= అవుతాడు; ఐనన్= కాని; ఈ విప్రున్= ఈ బ్రాహ్మణుని; మహావిభ్రాంతిచేన్= మిక్కిలి భయభ్రాంతితో, ఉండఁగన్= ఉండగా; దండితున్= కఠినంగా శిక్షింపబడినవానిగా; చేయన్+ఏటికిన్= చేయడం ఎందులకు?

**తా :** అర్జునా! ఎవడు దయ, దాక్షిణ్యం వదలి తన ప్రాణాలు కాపాడుకోవడంకోసం ఇతరుల ప్రాణాలు బలి చేస్తాడో, అటువంటివాడు నరకలోక బాధలు అనుభవిస్తాడు. లేదా రాజదండనం ద్వారా శిక్ష అనుభవించి ఆ దుఃఖాలు పొందకుండా శ్రేయస్సును పొందుతాడు. కాని ఈ బ్రాహ్మణుడు మహాభయంతో పరితపిస్తున్నాడు. అటువంటి వానిని కఠినంగా శిక్షించడం ఎందులకు? ఒక్కసారి ఆలోచించి చూడు.

**వ. అని యివ్విధంబున గృష్ణుం డానతిచ్చినం బ్రాహ్మణుండు కృతాపరాధుండయ్యు వధ్యుండు గాఁడను ధర్మంబు దలంచి చంపక ద్రుపదరాజపుత్రికిం దన చేసిన ప్రతిజ్ఞం దలంచి, బద్ధుండైన గురు నందనుం దోడ్కొని, కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబుకడకు వచ్చి. 157**

**ప్రతి :** అని= అంటూ; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఆనతి+ఇచ్చినన్= ఆజ్ఞాపించగా; బ్రాహ్మణుండు= విప్రుడు; కృత+అపరాధుండు+అయ్యున్= చేయబడిన తప్పు కలవాడైనా; వధ్యుండు+కాఁడు= చంపదగినవాడు కాదు; అను= అనే; ధర్మంబు= ధర్మవాక్యాన్ని; తలంచి= గుర్తు చేసుకొని; చంపక= అశ్వత్థామను వధించక; ద్రుపదరాజ పుత్రికిన్= ద్రౌపదీదేవికి; తన చేసిన ప్రతిజ్ఞన్= తాను పల్కిన శపథాన్ని; తలంచి= జ్ఞప్తియందుంచుకొని; బద్ధుండు+ఐన= బంధించబడియున్న; గురునందనున్= ద్రోణపుత్రుని; తోడ్కొని= తీసుకొని; కృష్ణుండు= వాసుదేవుడు; సారథ్యంబు+చేయన్= రథాశ్వములను తోలగా; శిబిరంబుకడకున్= సేనానివేశనం దగ్గరకు; వచ్చి= ఏతెంచి.

**తా :** కృష్ణుడు ఈ విధంగా అర్జునునితో ధర్మశాస్త్రానుగుణంగా ప్రసంగించాడు. "తప్పు చేసినా విప్రుని దండింపకూడదు" అనే ధర్మాన్ని గుర్తు తెచ్చుకొని కిరీటి అశ్వత్థామను వధించలేదు. అయినా పాంచాలి సమక్షంలో తాను చేసిన ప్రతిజ్ఞ గుర్తు చేసుకొన్నాడు. త్రాళ్లతో కట్టివేయబడియున్న గురుపుత్రుని రథంపై పడవేశాడు. పార్థసారథి గుర్రాలను వడిగా త్రోలగా సేనలు ఉండే గుడారం కడకు కొనివచ్చాడు.

**క. సురరాజసుతుఁడు చూపెను, దురవధిసుతశోకయుతకు ద్రుపదుని సుతకుం**
**బరిచలితాంగశ్రేణిం, బరుష మహాపాశ బద్ధపాణిన్ ద్రౌణిన్. 158**

**ప్రతి :** దురవధి= హద్దులేని; సుత, శోక, యుతకున్= పుత్రమరణ దుఃఖంతో కూడుకొన్న; ద్రుపదుని సుతకున్= ద్రుపదరాజ తనయకు; పరిచలిత= కంపించుచున్న; అంగశ్రేణిన్= శరీరావయవాలుకల; పరుష= కఠినమైన; మహాపాశ= గట్టిత్రాటిచే; బద్ధ= కట్టివేయబడియున్న; పాణిన్= చేతులుకల; ద్రౌణిన్= ద్రోణతనూజుడైన అశ్వత్థామను; సురరాజసుతుఁడు= దేవతలకు ప్రభువైన ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; చూపెను= చూపించాడు.

**తా :** అంతులేని పుత్రశోకంతో ఉన్న ద్రౌపదికి, గట్టి త్రాటితో చేతులు కట్టివేయబడి, వణుకుతున్న అవయవాలతో ఉన్న అశ్వత్థామను అర్జునుడు చూపాడు.

## ✣ ద్రౌపది యశ్వత్థామను జూచి సంభాషించుట ✣

**వ. ఇట్లర్జునుండు దెచ్చి చూపిన బాలవధ జనిత లజ్జా పరాఙ్ముఖుండైన కృపి కొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె. 159**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; అర్జునుండు= ధనంజయుడు; తెచ్చి= కట్టితెచ్చి; చూపిన= చూపించిన; బాలవధ= చిన్నవారిని చంపుటవల్ల; జనిత= పుట్టిన; లజ్జా= సిగ్గుచేత; పరాక్+ముఖుండు+ఐన= వెనుకకు త్రిప్పుకొన్న ముఖం కలవాడైన; కృపికొడుకున్= కృపి కుమారుడైన అశ్వత్థామను; చూచి= వీక్షించి; మ్రొక్కి= నమస్కరించి; సుస్వభావ+అగు= చక్కని సౌశీల్యంకల; ద్రౌపది= పాంచాలి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తా :** అర్జునుడు ఈ రీతిగా అశ్వత్థామను బంధించి తీసుకొనివచ్చాడు. అతడుకూడ చిన్నపిల్లలను చంపడంవల్ల సిగ్గుచే మొగం చాటేసుకొన్నాడు. ఆలాంటి కృపితనూజుని అశ్వత్థామను ద్రౌపది చూచి, సుశీలయైన ఆమె ఆ గురుపుత్రునకు నమస్కరించి ఇలా అన్నది.

**మ. పరఁగన్ మా మగవార లందఱును మున్ బాణప్రయోగోప సం**
**హరణాద్యాయుధవిద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం**
**చిరి పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు, నీ చిత్తంబులో లేశముం**
**గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే? 160**

**ప్రతి :** పరఁగన్= ఒప్పునట్లుగా (చక్కగా); మా+మగవారలు+అందఱును= నా భర్తలైదుగురును; మున్= పూర్వం; బాణప్రయోగ= బాణాన్ని ప్రయోగించటం; ఉపసంహరణ= వెనుకకు తీయటం; ఆది= మున్నగు; ఆయుధవిద్యలు= శస్త్రవిద్యలు; అన్నియును= అన్నింటిని; ద్రోణాచార్యుచేన్= ద్రోణాచార్యుని; అభ్యసించిరి= అధ్యయనం చేశారు; పుత్ర+ఆకృతిన్+ఉన్న= పుత్రునిరూపంలో ఉన్న; ద్రోణుఁడవు= ద్రోణాచార్యుడవు; నీ చిత్తంబులోన్= నీ హృదయంలో; లేశమున్= కొంచెమైనను; కరుణాసంగము= దయతో పొత్తు; లేక= లేకుండా; శిష్యసుతులన్= శిష్యుల తనూజులను; ఖండింపఁగాన్= నరకివేయడం; పాడి+ఏ= న్యాయమా?

**తా :** పూర్వం ధనుర్విద్య నభ్యసించే సమయంలో నా భర్తలు అయిదుగురు బాణప్రయోగం, బాణోపసంహారం, మొదలైన సమస్త శస్త్రవిద్యలు నీ తండ్రియైన ద్రోణాచార్యులవద్ద అభ్యసించారు. నీవు పుత్రరూపంలోనున్న ద్రోణుడవు. పాండవులు నీకు శిష్యులవంటివారు. అట్టి శిష్యుల కుమారులను దయమాలి నరకివేయడం నీవంటివానికి న్యాయమా?

**విశే :** ప్రయోగం, ఉపసంహారం అనటంవల్ల అస్త్రరూపబాణం అని అర్థం గ్రహించాలి.

**క. భూసురుఁడవు, బుద్ధిదయా, భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా**
**గ్రేసరుఁడవు, శిశుమారణ, మాసురకృత్యంబు; ధర్మమగునే తండ్రీ! 161**

**ప్రతి :** తండ్రీ= నాయనా!; భూసురుఁడవు= భూమికి దేవతవంటి బ్రాహ్మణుడవు; బుద్ధిదయాభాసురుఁడవు= వివేకంతోను; దయతోను ప్రకాశించేవాడవు; శుద్ధ= స్వచ్ఛమైన; వీరభట= శూరజనుల; సందోహ= గుంపులలో; అగ్రేసరుఁడవు= ముందు వర్తించేవాడవు; శిశుమారణము= పసివారిని చంపడమనేది; ఆసురకృత్యంబు= రాక్షస ప్రవృత్తికదా!; ధర్మము+అగునే= (ఇది) ధర్మం అవుతుందా?

**తా :** నాయనా! నీవు బ్రాహ్మణుడవు. బుద్ధి విచక్షణకు, దయాదాక్షిణ్యాలకు నీవుపెట్టినది పేరు. స్వచ్ఛమైన వీరాధివీరులలో నీవు అగ్రగణ్యుడవు. పసిపిల్లలను చంపడం రాక్షస కార్యంకదా! ఇది ధర్మమా? ఇటువంటి ఘోరకృత్యానికి నీవు ఎలా ఒడిగట్టావు?

**శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై, యుద్ధావనిన్ లేరు, కిం**
**చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీఁకటిన్**
**భద్రాకారులఁ బిన్న పాపల రణప్రౌఢ క్రియాహీనులన్**
**నిద్రాసక్తుల సంహరింప నకటా! నీ చేతు లెట్లాడెనో? 162**

**ప్రతి :** శస్త్ర= ఆయుధములను; ధరులు+ఐ= చేపట్టినవారై; ఉద్రేకంబునన్= ఆవేశముతో; రారు= (నీ మీదికి) రాలేదే!; యుద్ధ+అవనిన్= యుద్ధరంగంలో; లేరు= లేరే!; బల+ఉత్సేకంబునన్= బలగర్వంతో; నీకున్= నీకు; కించిత్+ద్రోహంబును: కించిత్= కొంచెమైనా; ద్రోహంబున్= అపకారాన్ని; చేయరు= చేయలేదే!; చీకటిన్= చీకట్లో; భద్ర+ఆకారులన్= అందమైన రూపాలు కలవారిని; పిన్నపాపల= చిన్నపిల్లలను; రణ, ప్రౌఢ, క్రియా, హీనులన్ : రణ= యుద్ధమునందు; ప్రౌఢ= ఆరితేరిన; క్రియా= చేతలు; హీనులన్= లేనివారిని; నిద్రా+ఆసక్తున్ : నిద్రా= నిద్రయందు; ఆసక్తులన్= మిక్కిలి అపేక్ష కలవారిని; సంహరింపన్= చంపుటకు; అకటా= అయ్యో! నీ చేతులు; ఎట్లు= ఏ విధంగా; ఆడెనో= పని చేశాయో!

**తా :** నా కుమారులు ఆయుదాలుపట్టి ఆవేశంతో నీ మీదికి రాలేదే! యుద్ధరంగంలో కూడ లేరే! బలగర్వంతో నీకు ఆవంతకూడ అపకారం చేయలేదే! చీకట్లో, అందమైన ఆ చిన్నపిల్లలను, యుద్ధవిద్యలో ఆరితేరినవారు కానివారిని, గాఢనిద్రలో ఉన్నవారిని చంపటానికి అయ్యో! నీ చేతులెట్లాడాయో!

**విశే :** మనిషిని నొప్పించటానికి కత్తులు, కటారులే అక్కరలేదు. రకరకాల శస్త్రాస్త్రాలు అసలే అక్కరలేదు. మాటలు మహాశక్తిమంతాలు. ప్రయోగించే వైనం తెలియాలే గాని అవి ఆయుధాలకంటె ఎదుటి వ్యక్తిని ఎక్కువగా గాయపరచగలవు. మహాకవి పోతన ద్రౌపది నోట పలికించిన పై మాటల్లో కటువైనది ఒక్కటికూడ లేదు. అయినా, అవి వెన్నపూసిన కత్తిపోట్లలాంటి మాటలు. అశ్వత్థామకు మనస్సు అనేది ఒకటి ఉండాలే గాని, అవి దాన్ని తూట్లు పొడిచే మాటలు.

**ఉ. అక్కట! పుత్త్ర శోక జనితాకుల భార విషణ్ణచిత్తనై**
**పొక్కుచు నున్నభంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ**
**డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ**
**డెక్కడ నిట్టి శోకమున నే క్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో! 163**

**ప్రతి :** అక్కట= అయ్యో!; పుత్త్రశోక= కుమారుల మరణానికి సంబంధించిన శోకంచే; జనిత= పుట్టిన; ఆకుల= వ్యాకులతయొక్క; భార= ఆధిక్యంచే; విషణ్ణ= దుఃఖిస్తున్న; చిత్తను+ఐ= మనస్సు కలదాననై; పొక్కుచున్+ఉన్న= విలపిస్తున్న; భంగిన్= రీతిగా; నినున్= నిన్ను; పోరన్= యుద్ధంలో; నిబద్ధున్+చేసి= కట్టి వేయబడినవానిగా చేసి; కిరీటి= అర్జునుడు; నేఁడు= ఈనాడు; ఇక్కడకున్= ఈ శిబిరానికి; ఈడ్చితెచ్చుట= బరబరలాగుకొని రావడం; సహింపనిది+ఐ= ఓర్వలేనిదై; భవదీయమాత= నీ తల్లియైన కృపి; నేఁడు= ఈ రోజు; ఎక్కడన్= ఏ ప్రదేశంలో; ఇట్టి= నా దుఃఖంతో సమానమైన; శోకమునన్= దుఃఖంతో; ఏ క్రియన్= ఏ విధంగా; ఏడ్చుచున్= రోదిస్తూ; పొక్కుచున్+ఉన్నదో= తల్లడిల్లిపోతున్నదో కదా!

**తా :** పుత్రమరణశోకం నన్నెంతో కలచివేసింది. నా హృదయం దుఃఖంతో నిండిపోయింది. నేను తల్లడిల్లిపోతున్నాను. అర్జునుడు యుద్ధంలో తాళ్లతో నిన్ను కట్టివేసి శిబిరానికి ఈడ్చుకొని వచ్చిన సంగతి తెలిసి అది సహింపలేక నీ తల్లి కూడ ఈ రోజు ఎచ్చట, ఏ రీతిగా, దుఃఖంతో నావలె ఎంతగా తల్లడిల్లిపోతోందో కదా!

**వ. అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె. 164**

**ప్రతి :** అని= అని పలికి; కృష్ణ+అర్జునులన్+చూచి= కృష్ణుని, అర్జునుని ఉద్దేశించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తా :** ద్రౌపది ఈ రీతిగా అశ్వత్థామ హృదయంలో ములుకులవలె గ్రుచ్చుకొనే పలుకులు పలికి, కృష్ణార్జునులను ఉద్దేశించి ఇలా అన్నది.

**ఉ. ద్రోణునితోఁ శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్న దింట న**
**క్షీణతనూజశోకవివశీకృతనై విలపించుభంగి, నీ**
**ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో!**
**ప్రాణవియుక్తుఁడైన నతిపాపము; బ్రాహ్మణహింస మానరే! 165**

**ప్రతి :** ద్రోణకుటుంబిని= ద్రోణుని భార్యయైన కృపి; ద్రోణునితోన్= భర్తయైన ద్రోణాచార్యులతో; శిఖిన్+పడక= అగ్నిప్రవేశం చేయక; ఇంటన్= (పుత్రప్రేమతో) ఇంటిలోనే; ఉన్నది= ఉండిపోయింది; న+క్షీణ= తక్కువకాని; తనూజశోక= పుత్రసంబంధ దుఃఖంచే; వివశీకృతను+ఐ= వశం తప్పిపోతున్నదాననై; విలపించు భంగిన్= ఏడుస్తున్న విధంగా; ఈ ద్రౌణిన్= ఈ అశ్వత్థామను; తెరల్చి తెచ్చుటకున్= బలవంతంగా తొలగించి లాగి తీసుకొని వచ్చినందుకు; దైన్యమున్+ఒందుచున్= భయపడుతూ; ఎంత పొక్కునో!= ఎంత విలపిస్తూ ఉంటుందో కదా!; ప్రాణవియుక్తుఁడు+ఐనన్= (ఇతడు) ప్రాణాలనుండి విడివడిన వాడయితే; అతిపాపము= మిక్కిలి పాపం; బ్రాహ్మణహింసన్= విప్రుని హింసించడం; మానరే= మానివేయండి.

**తా :** భర్తయైన ద్రోణుడు మరణించినా, కృపి పుత్రప్రేమతో సహగమనం చేయకుండా ఇంట్లోనే ఒంటరిగా ఉండిపోయింది. మీరు ఈతనిని బంధించి ఈడ్చుకొని రావడంవల్ల ఆ ఇల్లాలు, నే నేవిధంగా పుత్రశోకంతో దుఃఖిస్తున్నానో, తానుకూడ

అదేవిధంగా గుండెలు పగిలేలా ఎంతగానో విలపిస్తూ ఉంటుంది కదా! ఇతడా బ్రాహ్మణుడు. బంధితుడై యున్నాడు. ప్రాణాలు కోల్పోతే మనకు మహాపాపం. ఈతనిని హింసించడం మానండి.

**క. భూపాలకులకు విప్రులఁ, గోపింపం జేయఁదగదు; కోపించినఁ ద**
**త్కోపానలంబు మొదలికి, భూపాలాటవులఁ గాల్చు భూకంపముగన్. 166**

**ప్రతి :** భూపాలకులకున్= రాజులకు; విప్రులన్= బ్రాహ్మణులను; కోపింపన్= ఆగ్రహం పొందేటట్లుగా; చేయన్+తగదు= చేయడం ఉచితం కాదు; కోపించినన్= వారు కోపిస్తే; తత్+కోప+అనలంబు= ఆ కోపమనే అగ్ని; భూపాల+అటవులన్= భూపాలురనే అడవులను; భూకంపముగన్= పుడమి వడకేటట్లుగా; మొదలికిన్= మొదలంట; కాల్చున్= కాల్చివేస్తుంది.

**తా :** ప్రజాపరిపాలన తత్పరులగు రాజులు బ్రాహ్మణులకు కోపం వచ్చేటట్లు చేయరాదు. వారు కోపిస్తే వారి క్రోధాగ్ని జ్వాలలకు భూమి కంపిస్తుంది. రాజవంశాలు అనే అడవులు సమూలంగా నాశనమైపోతాయి.

**వ. అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యళీకంబును సమంజసంబును శ్లాఘ్యంబునుం గాఁ బలుకు ద్రౌపది పలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి; సమ్మతింపక భీముం డిట్లనియె. 167**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; ధర్మ్యంబును= ధర్మంతో కూడుకొన్నట్లుగా; సకరుణంబును= దయతో కూడుకొన్నట్లుగా; నిర్వ్యళీకంబును= కపటంలేనట్లుగా; సమంజసంబును= తగినవిధంగా; శ్లాఘ్యంబునున్+కాన్= కొనియాడబడునట్లుగా; పలుకు= మాట్లాడుచున్న; ద్రౌపది= ద్రుపదరాజపుత్రియొక్క; పలుకులకున్= మాటలకు; ధర్మనందనుండు= ధర్మపుత్రుడు; సంతసిల్లెన్= సంతోషించాడు; నకుల సహదేవసాత్యకి ధనంజయకృష్ణులు= నకులుడు; సహదేవుడు, సాత్యకి, అర్జునుడు, శ్రీకృష్ణుడు; సమ్మతించిరి= అంగీకరించారు; సమ్మతింపక= ఒడంబడక; భీముండు= భీమసేనుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని పలికిన పాంచాలి మాటలలో ధర్మం, దయ నిష్కపటం, సత్యం తొణికిసలాడాయి. అందరూ ఆమెను కొనియాడారు. ధర్మరాజు సంతసించాడు. నకులుడు, సహదేవుడు, సాత్యకి, అర్జునుడు, వాసుదేవుడు అంగీకారం తెలియజేశారు. భీముడు మాత్రం అందుకు అంగీకరించక ఇలా అన్నాడు.

**విశే :** సంగతం అంజః సమంజసం – సత్యం దీనియందు కూడియుంటుంది.

**చ. కొడుకులఁ బట్టి చంపె నని కోపము నొందదు బాలఘాతుకున్**
**విడువు మటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది; వీఁడు విప్రుఁడే?**
**విడువఁగ నేల? చంపుఁ; డిటు వీనిని మీరలు చంపరేని నా**
**పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్. 168**

**ప్రతి :** కొడుకులన్= కన్న కుమారులను; పట్టి= పట్టుకొని; చంపెను+అని= కుత్తుకలు కోసెనని; కోపమున్+ఒందదు= క్రోధం వహించదు; బాలఘాతుకున్= ఈ శిశుహంతను; విడువుము+అటంచున్= విడిచిపెట్టవలసిందని; చెప్పెడిన్= చెప్పుచున్నది; ద్రౌపది= పాంచాలి; వెఱ్ఱి+అది= వెఱ్ఱిబాగులది; వీఁడు= ఈ అశ్వత్థామ; విప్రుఁడు+ఏ= బ్రాహ్మణుడా?;

విడువఁగన్+ఏల?= వీనిని వదలిపెట్టడం ఎందుకు?; చంపుఁడు= వెంటనే చంపివేయండి; ఇటు= ఇట్లు నేను చెప్పినట్లుగా; వీనిని= ఇతనిని; మీరలు= మీరు; చంపరు+ఏనిన్= చంపకున్నచో; నా పిడికిటిపోటునన్= నా పిడికిటిపోటుతో; శిరమున్= వీనితలను; భిన్నము+చేసెదన్= పగులగొడతాను; ఇందఱున్= మీరందరూ; చూడుఁడు= చూస్తూ ఉండండి.

**తా :** కన్నకొడుకుల గొంతులు గోసి చంపినందులకు కోపం రాకపోగా, ఈ శిశుహంతను విడిచివేయండని అంటుందేమిటి ఈ ద్రౌపది? ఈమె వట్టి వెర్రిబాగులది. వీడు బ్రాహ్మణుడా? వీనిపై కనికరం చూపించడం పనికిరాదు. వెంటనే చంపివేయండి. నా మాటలు మీకు అంగీకారం కాకపోతే చెప్పండి. ఒక్క పిడికిటిపోటుతో ఈ దుష్టుని శిరస్సును ఛిన్నాభిన్నం చేస్తాను.

**వ. అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె; భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండయి రెండు చేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపదపుత్రికను దలంగించి నగుచు భీమున కిట్లనియె. 169**

**ప్రతి :** అని పలికినన్= అని భీముడు పలుకగా; అశ్వత్థామకున్= ద్రోణపుత్రునకు; ద్రౌపది= పాంచాల రాజపుత్రి; అడ్డంబు+వచ్చెన్= అడ్డంగా వచ్చింది; భీముని= వాయుపుత్రునియొక్క; సంరంభంబు+చూచి= ఆర్భాటం చూచి; హరి= కృష్ణుడు; చతుర్భుజుండు+అయి= నాలుగుచేతులు కలవాడై; రెండు చేతులన్= రెండు హస్తాలతో; భీమునిన్= భీమసేనుని; వారించి= గట్టిగా పట్టుకొని; కడమ= మిగిలిన; రెంటను= రెండు చేతులతోను; ద్రుపదపుత్రికను= ద్రౌపదిని; తలంగించి= తప్పించి; నగుచున్= నవ్వుతూ; భీమునకున్= పవననందనునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని భీముడు రౌద్రంగా పలికి అశ్వత్థామ మీదకు ఉరకబోయాడు. ఆతనిని రక్షించడానికై ద్రౌపది అడ్డంగా వచ్చి నిలిచింది. భీముని ఆర్భాటాన్ని చూచాడు కృష్ణుడు. అన్నంత పని చేసేలా ఉన్నాడని భావించాడు. వెంటనే చతుర్భుజమూర్తి అయ్యాడు. రెండు చేతులతో వాయునందనుని గట్టిగా అదిమిపట్టుకొన్నాడు. మిగిలిన రెండు చేతులతో ద్రౌపదిని పక్కకు తప్పించాడు. అపుడు వాసుదేవుడు పవనపుత్రుని ఆవేశం తగ్గించేలా నవ్వుతూ ఇలా అన్నాడు.

**ఉ. అవ్యుఁడు గాఁడు వీఁడు శిశుహంత, దురాత్మకుఁ డాతతాయి హం**
**తవ్యుఁడు బ్రహ్మబంధుఁడగుఁ దప్పదు నిక్కము 'బ్రాహ్మణో న హ**
**న్తవ్య' యటంచు వేదవిదితం బగుఁ గావున ధర్మదృష్టిఁ గ**
**ర్తవ్యము వీనిఁ గాఁచుట యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా! 170**

**ప్రతి :** వీఁడు= ఈ అశ్వత్థామ; అవ్యుఁడు= రక్షింపదగినవాడు; కాఁడు; శిశుహంత= పసివారిని చంపినవాడు; దురాత్మకుఁడు= చెడుబుద్ధి కలవాడు; ఆతతాయి= దుర్మార్గుడు; హంతవ్యుఁడు= చంపదగినవాడు; బ్రహ్మబంధుఁడు= నీచబ్రాహ్మణుడు; అగున్= అయియున్నాడు; నిక్కము= ఇది నిజము; తప్పదు= దీనికి తిరుగులేదు; బ్రాహ్మణః= బ్రాహ్మణుడు; హంతవ్యః న= చంపదగినవాడు కాదు; అటంచున్= అంటూ; వేదవిదితంబు+అగున్= వేదంద్వారా తెలియజేయబడుతోంది; కావునన్= కాబట్టి; వీనిన్= ఈ నీచుని; కాఁచుట= రక్షించుట; ధర్మదృష్టిన్= ధర్మంయొక్క సూక్ష్మదర్శనంతో; కర్తవ్యము= చేయదగిన పని; పాండవ+ఉత్తమా!= పాండవులలో శ్రేష్ఠుడవైన వాయునందనా!; యథాస్థితిన్= సత్యదృష్టితో; చూడుము= పరిశీలించవయ్యా!

**తా :** పాండవవంశ భూషణుడవైన వాయునందనా! ఈ అశ్వత్థామ రక్షింపదగినవాడు కానే కాదు. శిశుహంత, దుష్టబుద్ధి. పరమ కిరాతకుడు. ముమ్మాటికీ చంపదగినవాడే. ఇది వికల్పం లేనిమాట. కాని "బ్రాహ్మణుడు చంపదగినవాడు కాదు" అని వేదం ద్వారా తెలియజేయబడుతోంది. ఈ సూక్ష్మధర్మప్రకారం అతడిని రక్షించడమే న్యాయమనిపిస్తోంది. యథార్థమేమిటో దానిని ఆచరించు.

**విశే : "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహా,**
**క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః".**

నిప్పు పెట్టేవాడు, విషం పెట్టేవాడు, ఆయుధధారియై నిరపరాధులను వధించేవాడు, ధనాపహారి, క్షేత్రహారి, దారాపహర్త ఈ ఆరుగురు "ఆతతాయులు" అని పిలువబడతారు.

**"ఆతతాయిన మాయాంతమపి వేదాంతపారగమ్,**
**జిఘాంసంతం జిఘాంసీయాన్నతేన బ్రహ్మహా భవేత్".**

ఆతతాయి వేదాంతపారగుడైనా వధించవచ్చు. దానివల్ల బ్రహ్మహత్యాదోషం రాదనికూడ ధర్మం కలదు. కాని "బ్రాహ్మణో న హంతవ్యః" అన్నది వేదవాక్యం. కావున ఆ ధర్మప్రకారం కృష్ణు డీవిధంగా భీముని ప్రయత్నాన్ని నిరోధించాడు.

**వ. అని సరసాలాపంబు లాడి పవననందను నొడంబఱచి యర్జునుంజూచి ద్రౌపదికి నాకు భీమసేనునకు సమ్మతంబుగ మున్న నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నా పంపుసేయుమని, నారాయణుం డానతిచ్చిన నర్జునుండును నారాయణానుమతంబున. 171**

**ప్రతి :** అని= అని కృష్ణుడు; సరస+ఆలాపంబులు+ఆడి= చతుర వచనాలు పలికి; పవననందనున్= వాయుపుత్రుని; ఒడంబఱచి= అంగీకరింపజేసి; అర్జునున్+చూచి= ఫల్గును నుద్దేశించి; ద్రౌపదికిన్= ద్రుపదతనయకు; నాకున్= నాకు (తనకు); భీమసేనునకున్= భీమునకు; సమ్మతంబుగన్= అంగీకారమయ్యేటట్లుగా; మున్ను+అ= ముందుగా; నీ చేసిన= నీవు కావించిన; ప్రతిజ్ఞయున్= శపథంకూడ; సిద్ధించు+అట్లు= నెరవేరేటట్లుగా; నా పంపు= నా ఆజ్ఞను; చేయుము+అని= పాలింపుమని; నారాయణుండు= వాసుదేవుడు; ఆనతి+ఇచ్చినన్= అనుజ్ఞ నీయగా; అర్జునుండును= విజయుడుకూడ; నారాయణ+అనుమతంబునన్= గోవిందుని సమ్మతితో...

**తా :** కృష్ణుడు ఈ విధంగా సరసోక్తులతో భీముని శాంతింపజేశాడు. అర్జునుని చూచి "ద్రౌపదికి, నాకు, భీమునకు అంగీకారయోగ్యంగా, ముందుగా నీవు కావించిన శపథంకూడ నెరవేరేటట్లుగా నా ఆజ్ఞ పాలించు" అని హితోపదేశం చేశాడు. అప్పుడు కిరీటి గోవింద వచనానుసారంగా కర్తవ్యోన్ముఖుడయ్యాడు.

**శా. విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే**
**నశ్వత్థామ శిరోజముల్ దఱిఁగి చూడాంతర్మహారత్నమున్**
**శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాతబంధంబులన్**
**విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్. 172**

**ప్రతి :** విశ్వస్తుత్యుఁడు= ప్రపంచమంతటిచేత కొనియాడబడేవాడు; మహావీరుండు= వీరాధివీరుడైనవాడు; శక్రసూనుఁడు= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; ఘోర+అసిచేన్= భయంకరమైన కత్తిచే; అశ్వత్థామ= ద్రోణపుత్రునియొక్క; శిరోజముల్=

తలవెంట్రుకలను; తఱిఁగి= గొఱిగి (తొలగించి); చూడా+అంతర్మహారత్నమున్= జుట్టులోనున్న ప్రకాశించే మణిని; శశ్వత్+కీర్తి= ప్రసిద్ధిచెందిన యశస్సు; వెలుంగన్= ఒప్పునట్లుగా (తటాలున); పుచ్చుకొని= లాగి తీసుకొని; పాశవ్రాతబంధంబులన్= త్రాళ్లగుంపులతో కట్టబడ్డ బంధాలను; విశ్వాసంబునన్= గౌరవభావంతో; ఊడ్చి= ఊడదీసి; శిబిర+ఉర్వీభాగమున్= శిబిర ప్రదేశాన్ని; పాసిపోన్= విడిచివెళ్లేలా; త్రోచెన్= నెట్టివేశాడు.

**తా :** అర్జునుడు విశ్వంలో అందరిచేతా కొనియాడబడేవాడు. వీరాధివీరుడు. పైగా ఇంద్రనందనుడు. అటువంటివాడు భయంకరమైన కత్తి తీశాడు. అతని జుట్టులో ప్రకాశించే మణిని లాగుకొన్నాడు. కట్లు విప్పాడు. శిబిరభాగం నుంచి ఒక్క ఊపున గెంటివేశాడు.

**క. నిబ్బరపు బాలహంతయు, గొబ్బునఁ దేజంబు మణియుఁ గోల్పడి నతుఁడై**
**ప్రబ్బిన వగచే విప్రుఁడు, సిబ్బితితో నొడలి గబ్బు సెడి వడిఁ జనియెన్. 173**

**ప్రతి :** నిబ్బరపు= గుండె నిబ్బరం కలవాడు; బాలహంతయున్= బాలురను చంపినవాడును అయిన; విప్రుఁడు= ఆ బ్రాహ్మణుడు; గొబ్బునన్= శీఘ్రంగా; తేజంబున్= కాంతిని; మణియున్= శిరోరత్నాన్ని; కోల్పడి= పోగొట్టుకొని; నతుఁడు+ఐ= తలవంచినవాడై; ప్రబ్బిన= ఆక్రమించిన; వగచేన్= విచారంతో; సిబ్బితితోన్= సిగ్గుతో; ఒడలి= శరీరంయొక్క; గబ్బు= పొగరు; చెడి= వదలిపోగా; వడిన్= వేగంగా; చనియెన్= వెళ్లిపోయాడు.

**తా :** అత్యంత సాహసంచేసి బాలురను వధించిన ఆ బ్రాహ్మణుడు ఈ విధంగా స్వీయతేజస్సును, మణిని కోల్పోయి భరించరాని అవమానంతో తలవంచుకొన్నాడు. ఆతనిలో ఆవేదన అధికమయింది. సిగ్గుతో కుంచించుకొనిపోయాడు. అతని పొగరంతా క్షణంలో మాయమయ్యింది. మిక్కిలి వేగంగా అక్కడినుండి వెళ్లిపోయాడు.

**ఆ. ధనము గొనుట యొండెఁ దల గొఱుగుట యొండె నాలయంబు వెడల నడచు టొండెఁ,**
**గాని చంపఁదగిన కర్మంబు సేసినఁ జంపఁదగదు విప్రజాతిఁ బతికి. 174**

**ప్రతి :** ధనము= సంపదను; కొనుట= లాగుకోవడం; ఒండెన్= ఒక పద్ధతి; తలన్= వెంట్రుకలను; గొఱుగుట= తల గొఱిగించటం; ఒండెన్= వేరొక పద్ధతి; ఆలయంబు= ఇంటినుండి; వెడలన్+అడచుట= వెళ్లగొట్టడం; ఒండెన్= ఇంకొక పద్ధతి; కాని= అంతేకాని; చంపన్+తగిన= వధింపదగినట్టి; కర్మంబు= కార్యం; చేసినన్= కావించినప్పటికి; విప్రజాతిన్= బ్రాహ్మణజాతిని; పతికిన్= రాజుకు; చంపన్+తగదు= సంహరించడం ధర్మం కాదు.

**తా :** సంపదలనైనా లాగుకోవాలి. అటుకాని పక్షంలో శిరోముండనమైనా కావించాలి. అదీకాని పక్షంలో ఇంటినుంచైనా వెళ్లగొట్టాలి. అంతేకాని చంపదగినట్టి ఘోరకృత్యం చేసినా, బ్రాహ్మణుని వధించడం రాజులకు ధర్మంకాదు.

**విశే :** బ్రాహ్మణులు నిరంతరం వేదాధ్యయనం చేసేవారు కావున బ్రాహ్మణహత్య వేదహత్యగా భావించి ఈ విధంగా చెప్పబడింది. అర్జునుడు ద్రౌణియొక్క మణిని గ్రహించాడు. శిరోజాలు తొలగించాడు. శిబిరంనుంచి బయటకు గెంటివేశాడు. అశ్వత్థామకు మూడుశిక్షలూ విధించాడని పై పద్యంలోని విశేషం.

**వ. ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడల నడిచి, పాండవులు పాంచాలీ సహితులై పుత్త్రులకు శోకించి మృతులైన బంధువుల కెల్ల దహనాదికృత్యంబులు సేసి యుదక ప్రదానంబు సేయు కొఱకు స్త్రీల ముందట**

**నిడికొని గోవిందుండునుం దారును గంగకుం జని తిలోదకంబులు సేసి క్రమ్మఱ విలపించి హరిపాద పద్మజాతపవిత్రంబులయిన భాగీరథీజలంబుల స్నాతులయి యున్న యెడం బుత్త్రశోకాతురు లయిన గాంధారీధృతరాష్ట్రులను, గుంతీద్రౌపదులను జూచి మాధవుండు మునీంద్రులుం దానును బంధుమరణశోకాతురు లయిన వారల వగపు మానిచి మన్నించె నివ్విధంబున. 175**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; అశ్వత్థామన్= ద్రోణనందనుని; ప్రాణ+అవశిష్టున్= ప్రాణాలచేత మాత్రమే మిగిలియున్న వానినిగా; చేసి= కావించి; వెడలన్+అడిచి= బయటకు వెళ్లగొట్టి; పాండవులు= పాండుకుమారులు; పాంచాలీ సహితులు+ఐ= ద్రౌపదితో కూడుకొన్నవారై; పుత్త్రులకున్= సుతులకై; శోకించి= దుఃఖించి; మృతులు+ఐన= చనిపోయిన; బంధువులకున్+ఎల్లన్= చుట్టాలకందరకు; దహన+ఆది+కృత్యంబులు= చితులపై కాల్చుట మున్నగు సంస్కారాలు; చేసి= ఒనరించి; ఉదక ప్రదానంబు= జలతర్పణం (ధర్మోదకాలు); చేయుకొఱకున్= చేయడానికై; స్త్రీలన్= అంతఃపుర స్త్రీలను; ముందటన్+ఇడికొని= ముందుంచుకొని; గోవిందుండునున్= కృష్ణుడును; తారును= తామును; గంగకున్+చని= భాగీరథికిపోయి; తిల+ఉదకంబులు+చేసి= నువ్వులతో కూడిన నీళ్లతో తర్పణాలు కావించి; క్రమ్మఱన్= మళ్లీ తిరిగి; విలపించి= రోదించి; హరి= విష్ణువుయొక్క; పాదపద్మ= పద్మములవంటి పాదములందు; జాత= పుట్టిన; పవిత్రంబులు+అయిన= పుణ్యప్రదములైన; భాగీరథీ జలంబులన్= గంగానది నీళ్ళలో; స్నాతులు+అయి= స్నానాలు చేసినవారై; ఉన్న+ఎడన్= ఉన్న సమయంలో; పుత్త్రశోక+ఆతురులు+అయిన= తమ కుమారుల మరణ సంబంధమైన దుఃఖంచే పీడించబడుతున్న; గాంధారీ ధృతరాష్ట్రులను= గాంధారిని; ధృతరాష్ట్రభూపాలుని; కుంతీద్రౌపదులను= కుంతిని; పాంచాలిని; చూచి; మాధవుండు= కృష్ణుడు; ముని+ఇంద్రులున్= వ్యాసాది మహర్షులతో; తానును= తానుకూడ; బంధుమరణ= కుటుంబసభ్యుల చావునకు సంబంధించిన; శోక= వగపుచే; ఆతురులు+అయిన= వ్యాకులత చెందిన; వారల= వారియొక్క; వగపు= విచారాన్ని; మానిచి= పోగొట్టి; మన్నించెన్= ఊరడించాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** అర్జునుడు ఈ ప్రకారంగా అశ్వత్థామను ప్రాణాలతో మిగిల్చి శిబిరం నుండి వెళ్లగొట్టాడు. పాండవులు ద్రౌపదీ సహితంగా చనిపోయిన కుమారులకై దుఃఖించారు. అనంతరం మృతులైన బంధువుల కందరకు దహనాది సంస్కారాలు కావించారు. స్త్రీజనాలు ముందు నడువగా అందరూ గంగానదికిపోయి ధర్మోదకాలు, తిలతర్పణాలు ఒనరించారు. మళ్లీ వాళ్లలో దుఃఖం పొంగిపొర్లింది. శ్రీహరి పాదారవిందసంజాతపుణ్య గంగాజలాలలో మరల స్నానాలు కావించి అందరూ శుద్ధులయ్యారు. పిమ్మట కృష్ణుడు, వ్యాసాది మహర్షులు పుత్ర మిత్రబంధు శోకార్తులైన గాంధారీధృతరాష్ట్రులను, కుంతీ ద్రౌపదులను ఓదార్చారు. వారి విచారాన్ని పోగొట్టారు. మనస్సులకు శాంతిని చేకూర్చారు.

**శా. పాంచాలీ కబరీవికర్షణ మహాపాపక్షతాయుష్కులం**
**జంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డి**
**ప్పించెన్ రాజ్యము ధర్మపుత్త్రునకుఁ, గల్పించెన్ మహాఖ్యాతిఁ జే**
**యించెన్ మూఁడు తురంగమేధములు దేవేంద్ర ప్రభావంబునన్. 176**

**ప్రతి :** పాంచాలీ= ద్రౌపదీ దేవియొక్క; కబరీ= కొప్పును; వికర్షణ= లాగడమనే; మహాపాప= ఘోరపాపకృత్యంచేత; క్షత= క్షీణించిన; ఆయుష్కులన్= ఆయుస్సులుగల; చంచత్+గర్వులన్= విజృంభించుచున్నమదగర్వంకలవారైన; ధార్తరాష్ట్రులన్=

ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులను; అనిన్= యుద్ధంలో; చంపించి= సంహరింపజేసి; గోవిందుఁడు= శ్రీకృష్ణుడు; ధర్మపుత్త్రునకున్= ధర్మసూనునకు; రాజ్యమున్= కౌరవ సామ్రాజ్యాన్ని; ఇప్పించెన్= ఇప్పించాడు; మహత్+ఖ్యాతిన్= గొప్ప ప్రసిద్ధిని; కల్పించెన్= చేకూర్చాడు; దేవ+ఇంద్ర+ప్రభావంబునన్= మహేంద్ర వైభవంతో; మూఁడు= మూడైన; తురంగమేధములు= అశ్వమేధయాగాలు; చేయించెన్= చేయించాడు.

**తా :** ద్రౌపదిని కొప్పుపట్టి ఈడ్చడం మహాపాపం. ఆ ఘోరకృత్యాన్ని కౌరవులు ఆచరించారు. దానివల్లనే వారి ఆయువు క్షీణించింది. వారు దుర్మదాంధులు. అటువంటి ధృతరాష్ట్ర కుమారులనందరినీ, కృష్ణుడు యుద్ధరంగంలో సంహరింపజేశాడు. అన్నమాట ప్రకారంగా ధర్మరాజుకు రాజ్యం ఇప్పించాడు. మహావిఖ్యాతి చేకూర్చాడు. మహేంద్ర వైభవంతో మూడశ్వమేధాలు చేయించి పాండవుల కీర్తి దశదిశలా వ్యాపించేలా చేశాడు.

**విశే :** సీతాదేవి కొప్పు పట్టుకొని రావణుడు పుత్రమంత్రి బాంధవ సమేతంగా నాశనమయ్యాడు. కౌరవులు ద్రౌపది కొప్పుపట్టి ఈడ్చి యుద్ధంలో బలి అయ్యారు. కాబట్టి విపరీత బుద్ధితో స్త్రీల కొప్పుపట్టడం మహాపాపం అనే విషయం ఈ విధంగా ఋజువయింది. కాగా, భారతీయ సంస్కృతిలో ఎంతటివారైనా సరే – స్త్రీలను కొప్పువట్టి ఈడ్చి అవమానించే పాపానికి పాల్పడితే వాడు ఏలాంటి దుర్గతిని పొందుతాడో రామాయణభారతాలు లోకానికి చక్కగా చాటాయి.

## ✤ శ్రీకృష్ణుం డుత్తరా గర్భస్థుఁడగు నర్భకుని తన చక్రంబుచే రక్షించుట ✤

**వ. అంత వాసుదేవుండు వ్యాస ప్రముఖభూసుర పూజితుండయి యుద్ధవ సాత్యకులు గొలువ ద్వారకాగమన ప్రయత్నంబునం బాండవుల వీడ్కొని రథారోహణంబు సేయు సమయంబునం దత్తరపడుచు నుత్తర సనుదెంచి కల్యాణ గుణోత్తరుండైన హరి కిట్లనియె. 177**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; వాసుదేవుండు= శ్రీకృష్ణపరమాత్మ; వ్యాస= వ్యాసుడు; ప్రముఖ= మున్నగు; భూసుర= బ్రహ్మర్షులచే; పూజితుండు+అయి= పూజింపబడినవాడై; ఉద్ధవసాత్యకులు= ఉద్ధవుడు, సాత్యకి, కొలువన్= తనను సేవించగా; ద్వారకాగమన= ద్వారకానగరానికి వెళ్లే, ప్రయత్నంబునన్= సంరంభంలో; పాండవులన్= పాండుకుమారులను, వీడ్కొని= వదలి; రథ+ఆరోహణంబు= అరదము నెక్కడం; చేయు= కావించే; సమయంబునన్= వేళలో; ఉత్తర= అభిమన్యుని భార్యయైన ఉత్తర; తత్తరపడుచున్= చలిస్తూ; చనుదెంచి= వచ్చి; కల్యాణగుణ= మంగళగుణములచే; ఉత్తరుండు+ఐన= ఉత్తముడైన; హరికిన్= కృష్ణుని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా ప్రార్థించింది.

**తా :** అనంతరం శ్రీకృష్ణపరమాత్మను వ్యాసాదిమహర్షులు అర్చించారు. ఉద్ధవుడు, కృష్ణుడు సాత్యకి వెంటరాగా ద్వారకానగర ప్రయాణానికి ఉద్యుక్తుడయ్యాడు. పాండవులవద్ద సెలవు తీసుకొన్నాడు. రథం ఎక్కబోతున్న సమయంలో ఉత్తర గుండె బాదుకొంటూ పరుగెత్తుకొని వచ్చి, ఉత్తమ గుణాభిరాముడైన శ్రీకృష్ణుని ఈ విధంగా ప్రార్థించింది.

**మ. ఇదె కాలానల తుల్య మైన విశిఖం బేతెంచె దేవేశ! నేఁ**
**డుదరాంతర్గత గర్భ దాహమునకై యుగ్రప్రభన్ వచ్చు చు**
**న్నది దుర్లోక్యము మానుపన్ శరణ మన్యం బేమియున్ లేదు నీ**
**పదపద్మంబులె కాని యొం డెఱుఁగ నీ బాణాగ్ని వారింపవే! 178**

**ప్రతి :** దేవ+ఈశ= దేవదేవా!; ఇది+ఎ= ఇదిగో!; కాల+అనల= ప్రళయాగ్నితో; తుల్యము+ఐన= సమానమైన; విశిఖంబు= బాణము; ఏతెంచెన్= వచ్చింది; నేఁడు= ఇప్పుడు; ఉదర+అంతర్గత= నా కడుపులోనున్న; గర్భదాహమునకున్+ఐ= పసికందును కాల్చుటకై; ఉగ్రప్రభన్= భయంకరమైన కాంతితో; వచ్చుచున్+ఉన్నది= వస్తూ ఉంది; దుర్లోక్యము= చూడడానికి సాధ్యం కాకుండా ఉంది; మానుపన్= దానిని ఆపడానికి; శరణము= (నాకు) రక్షణ ఇవ్వటానికి; అన్యంబు= మరొకటి; ఏమియున్+లేదు= ఏమీలేదు; నీ పదపద్మంబులు+ఎ= తామరపూలవంటి నీ పాదాలే; కాని= తప్ప; ఒండు= మరొక్క శరణమును; ఎఱుఁగన్= తెలియలేను; ఈ బాణాగ్నిన్= ఈ బాణపుమంటలను; వారింపవే= నివారించుమా!

**తా :** దేవదేవా! ఇదేదో ప్రళయాగ్నితో సమానమైన బాణం ఒకటి ఎక్కడనుండో వచ్చింది. నా కడుపులోనున్న పసిగుడ్డును భస్మం చేయాలని భయంకరమైన మంటలతో వస్తూ ఉంది. మిరుమిట్లు గొల్పే కాంతితో తేరిపార చూడడానికి సాధ్యం కాకుండా ఉంది. నీవు తప్ప నన్ను రక్షించే వారెవ్వరూ లేరు. నేను నీ పాదపద్మాలనే నమ్మి ఉన్నాను. వెంటనే ఈ బాణాగ్ని జ్వాలలను నివారించు.

**క. దుర్భర బాణానలమున, గర్భములో నున్న శిశువు ఘన సంతాపా**
**విర్భావంబును బొందెడి, నిర్భరకృపఁ గావుమయ్య నిఖిలస్తుత్యా! 179**

**ప్రతి :** నిఖిలస్తుత్యా!= సమస్త విశ్వంచేత కొనియాడబడేవాడా!; దుర్భర= భరింపరాని; బాణ+అనలమునన్= శరాగ్నిచే; గర్భములోన్+ఉన్న= నా ఉదరంలోనున్న; శిశువు= పిండం; ఘన= గొప్పదైన; సంతాప= బాధయొక్క; ఆవిర్భావంబును= ప్రారంభాన్ని; పొందెడిన్= అనుభవించుచున్నాడు; నిర్భరకృపన్= అతిశయించిన కారుణ్యంతో; కావుము+అయ్య= రక్షించవయ్యా!

**తా :** శ్లాఘనీయ చరిత్రా! భరింపరాని బాణాగ్నితో నా కడుపులోనున్న పసిబిడ్డ తాపం మొదలుకాగా కసుగందిపోతున్నాడు. కారుణ్యదృష్టితో నన్ను రక్షించు.

**క. చెల్లెలి కోడల, నీ మే, నల్లుఁడు శత్రువులచేత హతుఁ డయ్యెను, సం**
**ఫుల్లారవిందలోచన!, భల్లాగ్ని నడంచి శిశువు బ్రతికింపఁగదే! 180**

**ప్రతి :** సంఫుల్ల= బాగా వికసించిన; అరవింద= తామరపూలవంటి; లోచన= కన్నులుగలవాడా!; చెల్లెలికోడలన్= నీ చెల్లెలైన సుభద్రయొక్క కోడలిని; నీ+మేన+అల్లుఁడు= నీ మేనల్లుడైన అభిమన్యుడు; శత్రువులచేతన్= పగవారిచేత; హతుఁడు+అయ్యెన్= చంపబడ్డాడు; భల్ల+అగ్నిన్= ఈ బాణాగ్నిని; అడంచి= అణచివేసి; శిశువున్= నా గర్భాన్ని; బ్రతికింపఁగదే= కాపాడవయ్యా!

**తా :** ఓ విచ్చిన తామరపూలవంటి కన్నులు గల కృష్ణా! నేను నీ ముద్దుచెల్లెలైన సుభద్రయొక్క కోడలిని. నీ మేనల్లుడైన అభిమన్యుడు యుద్ధంలో శత్రువులచే అన్యాయంగా సంహరించబడ్డాడు. ఈ బాణాగ్నికీలలను పటాపంచలుచేసి నా పసిబిడ్డను బ్రదికించు.

**ఆ. గర్భమందుఁ గమల గర్భాండశతములు, నిముడుకొన వహించు నీశ్వరేశ!**
**నీకు నొక్క మానినీగర్భరక్షణ, మెంత బరువు నిర్వహింతు గాక! 181**

**ప్రతి :** కమలగర్భ+అండశతములు= వందలకొలది బ్రహ్మాండాలు; గర్భమందున్= ఉదరంలో; ఇముడుకొనన్= ఒదిగిపోవునట్లుగా; వహించు= భరించే; ఈశ్వర+ఈశ= ప్రభువులకే ప్రభువైనవాడా!; నీకున్= పరమాత్మవైన నీకు; ఒక్క= ఒకానొక; మానసీగర్భరక్షణము= స్త్రీ గర్భాన్ని రక్షించడమనేది; ఎంత బరువు?= ఎంత భారమైన పని?; నిర్వహింతు+కాక!= నా గర్భ రక్షణభారాన్ని వహించెదవుగాక!

**తా :** పరమేశా! ఉదరంలో వందలకొలది బ్రహ్మాండాలను భరించే నీకు ఒక ఆడదాని గర్భాన్ని రక్షించడం ఏమంత బరువైన పని? దయతో నా గర్భసంరక్షణ భారమునకు పూనుకో.

**వ. అనిన నాశ్రితవత్సలుండగు నప్పరమేశ్వరుండు సుభద్రకోడలి దీనాలాపంబు లాలించి, యిది ద్రోణనందనుండు లోక మంతయు నపాండవం బయ్యెడు మని యేసిన దివ్యాస్త్రంబని యెఱింగె; నంతఁ బాండవుల కభిముఖంబయి ద్రోణనందన దివ్యాస్త్ర నిర్గత నిశిత మార్గణంబులు దగ్గఱిన బెగ్గడిలక వారును బ్రత్యస్త్రంబు లందికొని పెనంగు సమయంబున. 182**

**ప్రతి :** అనినన్= అని ఉత్తర ప్రార్థించగా; ఆశ్రితవత్సలుండు+అగు= ఆశ్రయించిన వారియందు వాత్సల్య భావంకల; ఆ+పరమ+ ఈశ్వరుండు= ఆ పరమాత్మ; సుభద్రకోడలి= తన చెల్లెలైన సుభద్రాదేవి కోడలియొక్క; దీన+ఆలాపంబులు= జాలికొల్పే మాటలు; ఆలించి= విని; ఇది= ఈ అస్త్రం; ద్రోణనందనుండు= ద్రోణపుత్రుడైన అశ్వత్థామ; లోకము+అంతయున్= ఈ లోకమంతా; అపాండవంబు= పాండవరహితం; అయ్యెడున్+అని= కావాలని సంకల్పించి; ఏసిన= ప్రయోగించిన; దివ్య+అస్త్రంబు+అని= బ్రహ్మాస్త్ర ప్రభావమని; ఎఱింగెన్= తెలుసుకొన్నాడు; అంతన్= ఆ సమయంలో; పాండవులకున్= పాండుపుత్రులకు; అభిముఖంబు+అయి= ఎదురుగా వచ్చినవై; ద్రోణనందన= అశ్వత్థామయొక్క; దివ్య+అస్త్ర= బ్రహ్మాస్త్రంనుండి; నిర్గత= బయల్వెడలిన; నిశిత= వాడియైన; మార్గణంబులు= బాణములు; దగ్గఱినన్= సమీపించగా; బెగ్గడిలక= భయమందక; వారును= ఆ పాండవులుకూడ; ప్రతి+అస్త్రంబులు= ఉపసంహారాస్త్రాలు; అందికొని= చేపట్టి; పెనంగుసమయంబునన్= పోరాడేవేళలో...

**తా :** ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీకృష్ణుడు తన చెల్లెలయిన సుభద్రకోడలి దీనాలాపాలు ఆలకించాడు. అది అశ్వత్థామ "ఈ లోకంలో పాండవ వంశాకురం లేకుండుగాక!" అని ప్రయోగించిన దివ్యాస్త్రప్రభావమని గుర్తించాడు. ద్రోణపుత్రుని బ్రహ్మాస్త్రంనుంచి బయల్వెడలిన వాడిబాణాలు పాండవులకు ఎదురుగా వచ్చాయి. వారు కూడా భయపడకుండా తమపై వచ్చు అస్త్రాలను పనికిరాకుండా చేసే ప్రత్యస్త్రాలు చేపట్టి పోరాడే సమయంలో

**మ. తనసేవారతిచింత గాని పరచింతా లేశమున్ లేని స**
**జ్జనులం బాండుతనూజులన్ మనుచు వాత్సల్యంబుతో ద్రోణ నం**
**దను బ్రహ్మాస్త్రము నడ్డపెట్టఁ బనిచెన్ దైత్యారి సర్వారి సా**
**ధన నిర్వక్రము రక్షితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్. 183**

**ప్రతి :** తన సేవారతిచింత= తనను సేవించవలెననే ఆసక్తియందలి ఆలోచన; కాని= తప్ప; పరచింతాలేశమున్= ఇతరులను సేవించవలెననే అభిప్రాయం కించిత్తుకూడ (రవంతకూడ); లేని= తలపులలోనికి రానీయని; సత్+జనులన్= సత్పురుషులైన; పాండుతనూజులన్= పాండురాజుకుమారులను; మనుచు= కాపాడే; వాత్సల్యంబుతోన్= ప్రేమభావంతో;

ద్రోణనందను= అశ్వత్థామయొక్క; బ్రహ్మాస్త్రమున్= బ్రహ్మాస్త్రాన్ని; అడ్డపెట్టన్= అడ్డుకొనుటకై; దైత్య+అరి= రాక్షసాంతకుడైన కృష్ణుడు; సర్వ+అరి= అందరు శత్రువులను; సాధన= జయించుటయందు; నిర్వక్రమున్= చెక్కు చెదరనిదైన; రక్షిత= రక్షింపబడిన; అఖిల= సమస్తమైన; సుధాంధస్+చక్రమున్= దేవతాగణములుకలదైన; చక్రమున్= సుదర్శనచక్రాన్ని; పనిచెన్= పంపాడు.

**తా :** పాండవులకు కృష్ణపరమాత్మను సేవించాలనే ఆసక్తి, ఆలోచనతప్ప అన్యచింతాసక్తి రవంతకూడ లేదు. వారు కృష్ణభక్తితో సత్పురుషులుగా కీర్తింపబడ్డారు. అందువల్ల వారిని రక్షించడం నిజకర్తవ్యంగా భావించి వాసుదేవుడు వారిపై ప్రీతి చూపించాడు. ద్రోణపుత్రుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రాన్ని నిరోధించడంకోసమై, శత్రువులను వధించడంలో చెక్కుచెదరనిది, సమస్త దేవతాగణాలను రక్షించేది అయిన తన సుదర్శనచక్రాన్ని ప్రయోగించాడు.

**విశే :** పాండవులు ఎన్ని కష్టాలుపడినా, కృష్ణభక్తి వదలలేదు. కృష్ణుని నమ్మినా తమకు సంకటములు తప్పలేదని నిందించలేదు. అందువల్లనే పాండవులపై కృష్ణపరమాత్మ వాత్సల్యం చూపించాడు. క్షణక్షణానికి మారిపోయే భక్తివారిది కాదు. ఈ దైవంకాదని, ఆ దైవాన్ని కొలుద్దామనే సంకల్పం వారికి ఏ కోశాన లేదు. అందువల్లనే పాండవ సంరక్షణం స్వీయకర్తవ్యంగా భగవానుడు భావించాడు.

**మ. సకల ప్రాణిహృదంతరాళముల భాస్వజ్జ్యోతియై యుండు సూ**
**క్ష్మకళుం డచ్యుతుఁ డయ్యెడన్ విరటజా గర్భంబుఁ దాఁ జక్రహ**
**స్తకుఁడై వైష్ణవమాయఁ గప్పి కురుసంతానార్థియై యడ్డమై**
**ప్రకటస్ఫూర్తి నడంచె ద్రోణతనయబ్రహ్మాస్త్రమున్ లీలతోన్. 184**

**ప్రతి :** సకల= సమస్తమైన; ప్రాణి= భూతకోటియొక్క; హృద్+అంతరాళములన్= హృదయ మధ్యభాగంలో; భాస్వత్= ప్రకాశించే; జ్యోతి+ఐ= కాంతిస్వరూపుడై; ఉండు= ఉన్నట్టి; సూక్ష్మకళుండు= సూక్ష్మస్వరూపంకల; అచ్యుతుఁడు= విష్ణువు; ఆ+ఎడన్= ఆ సమయంలో; విరటజాగర్భంబున్= విరటుని పుత్రికయొక్క గర్భాన్ని; వైష్ణవమాయన్= తన వైష్ణవతేజస్సుతో; కప్పి= తిరోహితంచేసి (కానరాకుండజేసి); కురుసంతాన+అర్థి+ఐ= కురువంశ సంతానాన్ని కోరినవాడై; చక్రహస్తకుఁడు+ఐ= చేతియందు చక్రం కలవాడై; అడ్డము+ఐ= గర్భానికడ్డపడినవాడై; ద్రోణతనయ= ద్రోణపుత్రుడైన అశ్వత్థామయొక్క; బ్రహ్మాస్త్రమున్= బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని; లీలతోన్= అవలీలగా; ప్రకటస్ఫూర్తితోన్= స్పష్టమైన నిజశక్తితో; అడంచెన్= అణచివేశాడు.

**తా :** పరమాత్మ చరాచర జంతుజగత్తులో అంతర్యామి రూపంలో హృదంతరాళంలో సూక్ష్మరూపుడై జ్యోతిర్మయుడై వెలుగొందుతూ ఉంటాడు. ఆ పరాత్పరుడు కురువంశాంకురం నాశనం కాకుండా ఉత్తరాగర్భాన్ని వైష్ణవ తేజస్సుచే కప్పివేశాడు. తన సుదర్శనచక్రాన్ని అశ్వత్థామచే ప్రయోగింపబడ్డ బ్రహ్మాస్త్రానికి అడ్డంగాపెట్టి స్వీయశక్తితో దానిని అణచివేశాడు.

**వ. ఇట్లు ద్రోణతనయుండేసిన ప్రతిక్రియారహితంబయిన బ్రహ్మశిరం బనియెడి దివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకం బయ్యె; నిజమాయా విలసనమున సకలలోక సర్గస్థితి సంహారంబు లాచరించు నట్టి హరికి ధరణీసుర బాణ నివారణంబు విచిత్రంబు గాదు; తత్సమయంబున సంతసించి, పాండవ పాంచాలీ సహితయై గొంతి, గమనోన్ముఖుండయిన హరిం జేరవచ్చి యిట్లనియె. 185**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; ద్రోణతనయుండు= ద్రోణుని కుమారుడు; ఏసిన= ప్రయోగించిన; ప్రతిక్రియారహితంబు+అయిన= నివారణోపాయం ఏదీలేని; బ్రహ్మశిరంబు= బ్రహ్మశిరోనామకము; అనియెడి= అనబడే; దివ్య+అస్త్రంబు= మహాస్త్రం; వైష్ణవతేజంబునన్= విష్ణుసంబంధమైన దీప్తిచే; నిరర్థకంబు= వ్యర్థం; అయ్యెన్= అయిపోయింది; నిజమాయావిలసనమునన్= తన మాయాప్రభావంతో; సకలలోక= సమస్త జగములను; సర్గ= పుట్టించడం; స్థితి= పోషించడం; సంహారంబులు= లయింపజేయడం; ఆచరించు+అట్టి= నిర్వహించేటటువంటి; హరికిన్= వాసుదేవునకు; ధరణీసుర= భూమికి దేవతవంటి బ్రాహ్మణుడగు అశ్వత్థామయొక్క; బాణ= బ్రహ్మాస్త్రమును; నివారణంబు= అడ్డగించటం; విచిత్రంబు+కాదు= ఆశ్చర్యమేమీకాదు; తద్+సమయంబునన్= ఆవేళలో; సంతసించి= ఆనందించి; పాండవపాంచాలీసహిత+ఐ= పాండు కుమారులు ద్రౌపదితోకూడుకొన్నదై; గొంతి= కుంతీదేవి; గమన+ఉత్+ముఖుండు+అయిన= ప్రయాణానికి సిద్ధమైన; హరిన్= శ్రీకృష్ణుని; చేరవచ్చి= సమీపించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా స్తుతించింది.

**తా :** నివారణోపాయం ఏదీలేని బ్రహ్మాస్త్రాన్ని అశ్వత్థామ ప్రయోగించినా, అది విష్ణుతేజస్సుముందు వ్యర్థమైపోయింది. తన మాయాశక్తిచే సకలలోకాలను సృష్టించి, పోషించి, లయింపజేసే వాసుదేవుడు ఒక విప్రుని అస్త్రాన్ని అడ్డుకోవటంలో ఆశ్చర్యం ఏముంది? పాండవ వంశాకురం నిలిచినందులకు కుంతి మిక్కిలి సంతోషించింది. పాండవులూ, ద్రౌపదీ వెంటరాగా శ్రీకృష్ణుని సమీపించింది. ద్వారకానగర ప్రయాణానికి సిద్ధపడిన ఆ పరాత్పరుని ఈ విధంగా స్తుతించింది.

## ❖ కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట ❖

**క. పురుషుం డాద్యుఁడు ప్రకృతికిఁ, బరుఁ డవ్యయుఁ డఖిలభూత బహిరంతర్భా**
**సురుఁడును లోకనియంతయుఁ, బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ! 186**

**ప్రతి :** హరీ= కృష్ణా!; పురుషుండు= శరీరమునందుండువాడు (పురి శరీరే శేతే ఇతి పురుషః); ఆద్యుఁడు= అంతట ధ్యానింపబడేవాడు (ఆ సమంతాత్ ధ్యాయంతి ఏనమిత్యాద్యః); ప్రకృతికిన్= జగత్ప్రారంభంకన్న (ప్రారంభఃక్రియతే అనయేతిప్రకృతిః); పరుఁడు= వేరుగా ఉండేవాడు; అవ్యయుఁడు= నాశనం లేనివాడు; అఖిలభూత= సమస్త ప్రాణులయందు; బహిస్= వెలుపల; అంతస్= లోపల; భాసురుఁడును= ప్రకాశించువాడు; లోకనియంతయున్= సకల జగములకు ప్రభువైనవాడు; పరమ+ఈశ్వరుఁడు= ఈశ్వరులకీశ్వరుడు; ఐన= అయినటువంటి; నీకున్= నీకు; ప్రణతులు= ప్రణామములు; అగున్= అర్పిస్తాను.

**తా :** కృష్ణా! నీవే ఆదిపురుషుడవు. అందరిచేత స్మరింపబడేవాడవు. జగత్తుకన్న వేరుగా ఉండేవాడవు. నాశనం లేనివాడవు. సమస్తభూతములలో లోపల వెలువల ప్రకాశించేవాడవు. లోకేశ్వరుడవు. ప్రభువులకే ప్రభుడవు. అట్టి నీకు నమస్కారములు అర్పిస్తున్నాను.

**వ. మఱియు జవనిక మఱువున నాట్యంబు సలువు నటుని చందంబున మాయా యవనికాంతరాళంబున నిలువంబడి నీ మహిమచేఁ బరమహంసలు వివృతరాగద్వేషులు నిర్మలాత్ములు నయిన మునులకు నదృశ్యమానుండవయి పరిచ్ఛిన్నుండవు గాని నీవు మూఢదృక్కులు గుటుంబవతులు నగు మాకు నెట్లు దర్శనీయుండ వయ్యెదు? శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! గోవింద! పంకజనాభ!**

**పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశ చరణ! హృషీకేశ! భక్తి యోగంబునం జేసి నమస్కరించెద. నవధరింపుము. 187**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; జవనిక= తెర; మఱువునన్= వెనుక; నాట్యంబు= నృత్యం; సలుపు= చేసే; నటుని చందంబునన్= నటునిలాగా; మాయా+యవనికా+అంతరాళంబునన్= మాయ అనే తెరయొక్క లోపల; నిలువన్+పడి= ఉన్నవాడవై; నీ మహిమచేన్= కంటికి కానరాని నీ గొప్పతనంచే; పరమహంసలు= ఆత్మానాత్మ వివేకంతో ఆత్మదర్శనం చేసేవారు; వివృత= తొలగించబడ్డ; రాగద్వేషులు= ప్రీతి, పగ కలవారు; నిర్మల+ఆత్ములు= స్వచ్ఛమైన ఆత్మకలవారు; అయిన= అయినటువంటి; మునులకున్= ఋషులకు కూడ; అదృశ్యమానుండవు+అయి= కనబడకుండనుండువాడవై; పరిచ్ఛిన్నుండవుకాని= దేశకాలాదులచే పరిమితంకాని వాడవైన; నీవు= నీవు; మూఢదృక్కులున్= అజ్ఞాన (భేద) దృష్టికలవారము; కుటుంబవతులును= భర్తృభార్యాపుత్రమిత్రాది సంసారం కలవారము; అగు= అయినటువంటి; మాకున్= మావంటివారికి; ఎట్లు= ఏ రీతిగా; దర్శనీయుండవు= చూడదగినవాడవు; అయ్యెదు= కాగలుగుతావు?; శ్రీకృష్ణ!= శ్రీకృష్ణుడనే నామంతో పిలువబడేవాడా!; వాసుదేవ!= వసుదేవుని కుమారుడా!; దేవకీనందన!= దేవకియొక్క ముద్దుబిడ్డడా!; నందగోపకుమార!= నందగోపుని తనయుడుగా వ్యవహరించబడినవాడా!; గోవింద!= వేదములచే తెలియబడేవాడా! (గోగణాలను పాలించినవాడా!); పంకజనాభ!= పద్మం నాభియందు కలవాడా!; పద్మమాలికా+అలంకృత= తామరపూలమాలలచే అలంకరించబడేవాడా!; పద్మలోచన!= పద్మములవంటి కన్నులుకలవాడా!; పద్మసంకాశచరణ!= పద్మములతో సమానమైన పాదాలు కలవాడా!; హృషీక+ఈశ!= సకలేంద్రియాలకు అధినాథుడా!; భక్తియోగంబునన్+ చేసి= భక్తితోకూడుకొన్న విధానంతో; నమస్కరించెదన్= ప్రణామాలు అర్పిస్తున్నాను; అవధరింపుము= నా విజ్ఞప్తిని స్వీకరించు.

**తా :** అంతేకాక తెరచాటున నిలువబడి నాట్యాన్ని ప్రదర్శించే నటునిలా మాయ అనే తెరమాటున ప్రవర్తించు నీ మహిమ అవాఙ్మానస గోచరమైనది. పరమహంసలు, రాగద్వేషాలు లేనివారు, విమల మనస్కులు అయిన మునీశ్వరులకు గూడ నీవు కానరావు. పరిపూర్ణుడవు. అటువంటి నీవు అజ్ఞానులమై సంసారంలో మునిగిన మాకు ఎలా దర్శనమిస్తావు? శ్రీకృష్ణా! వసుదేవనందనా! దేవకీతనయా! నందగోపుని ముద్దుబిడ్డడా! గోవింద! పద్మనాభా! వనజమాలా విభూషితా! కమలలోచనా! అరవింద సదృశచరణయుగళా! హృషీకేశా! భక్తిపురస్సరంగా నీకు వందనమాచరించెద. నా విన్నప మాలకించు.

**సీ. తనయులతోడ నే దహ్యమానం బగు జతుగృహంబందునుఁ జావకుండఁ**
**గురురాజు వెట్టించు ఘోరవిషంబుల మారుతపుత్త్రుండు మడియకుండ**
**ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ ద్రౌపదిమానంబు దలఁగకుండ**
**గాంగేయ కుంభజ కర్ణాదిఘనులచే నాబిడ్డ లని లోన నలఁగకుండ**

**తే. విరటుపుత్త్రిక కడుపులో వెలయు చూలుఁ ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగకుండ**
**మఱియు రక్షించితివి పెక్కుమార్గములను నిన్ను నేమని వర్ణింతు? నీరజాక్ష! 188**

**ప్రతి :** నీరజ+అక్ష!= తామరపూలవంటి నయనాలుకలవాడా!; దహ్యమానంబు+అగు= భగభగమండుతున్న; జతుగృహంబు+ అందునున్= లక్కయింటిలో కూడ; తనయులతోడన్= కుమారులతోపాటు; నేన్= నేను; చావక+ఉండన్= కాలిభస్మం

కాకుండా; కురురాజు= దుర్యోధనుడు; పెట్టించు= తినిపింపజేసిన; ఘోరవిషంబులన్= కాలకూట విషాదులవల్ల; మారుతపుత్త్రుండు= పవన తనయుడైన భీముడు; మడియకుండన్= మరణింపకుండా; ధార్తరాష్ట్రుఁడు= ధృతరాష్ట్రుని కుమారుడు; సముద్ధతిన్= దురహంకారంతో; చీరలు= కట్టుబట్టలు; ఒలువంగన్= ఊడలాగబోగా; ద్రౌపది= పాంచాలియొక్క; మానంబు= ఆత్మగౌరవం; తలఁగకుండన్= పోకుండునట్లుగా; గాంగేయ= భీష్ముడు; కుంభజ= ద్రోణుడు; కర్ణ= కర్ణుడు; ఆది= మున్నగు; ఘనులచేన్= గొప్పవీరులచే; నా బిడ్డలు= నా కన్నబిడ్డలు; అనిలోనన్= యుద్ధరంగంలో; నలఁగకుండన్= నలిగిపోకుండా; విరటుపుత్త్రిక= ఉత్తరయొక్క; కడుపులోన్= ఉదరంలో; వెలయు= అభివృద్ధి పొందుతున్న; చూలున్= గర్భాన్ని; ద్రోణనందను= అశ్వత్థామయొక్క; శరవహ్నిన్= బాణాగ్నిచే; త్రుంగకుండన్= నాశనం కాకుండా; మఱియున్= ఇంకా; పెక్కుమార్గములను= అనేకవిధాలుగా; రక్షించితివి= కాపాడావు; నినున్= ఈ విధంగా మమ్ము సంరక్షించిన నిన్ను; ఏమి+అని= ఏ రీతిగా; వర్ణింతున్= నుతించగలను?

**తా :** భగ భగ మండిపోతున్న లక్కయింట్లో నేను, నా బిడ్డలు కాలిభస్మమై పోకుండా కాపాడావు. దుర్యోధనుడు తినిపించిన కాలకూట విషపూరితాన్నంతో భీముడు మరణించకుండా రక్షించావు, ధృతరాష్ట్రసూనుడు దుర్మదంతో కట్టుబట్టలొలువబోగా, ద్రౌపది అవమానం పాలుకాకుండా మానసంరక్షణం కావించావు. భీష్మద్రోణ కర్ణాదివీరాధి వీరులచే నా బిడ్డలు యుద్ధరంగంలో నలిగిపోకుండా చేశావు. ఉత్తర కడుపులో పెరుగుతున్న గర్భాన్ని అశ్వత్థామ బాణాగ్నిచే నాశనం కాకుండా చక్రం అడ్డువేశావు. పెక్కు విధాలుగా నన్నూ, నా బిడ్డలను సంరక్షించావు. నిన్ను ఏమని వర్ణించగలనయ్యా!

**మత్తకోకిల.** **బల్లిదుం డగు కంసుచేతను బాధ నొందుచు నున్న మీ**
**తల్లిఁ గాచిన భంగిఁ గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ**
**దల్లడంబునఁ జిక్కకుండఁగఁ దావకీన గుణవ్రజం**
**బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంతదాన జగత్పతీ!** **189**

**ప్రతి :** జగత్పతీ!= లోకేశ్వరా!; బల్లిదుండు+అగు= మహాబలవంతుడైన; కంసుచేతను= కంసునిచేత; బాధన్= వేదనను; ఒందుచున్+ఉన్న= అనుభవించుచున్న; మీ తల్లిన్= నీ తల్లియగు దేవకీదేవిని; కాచిన= రక్షించిన; భంగిన్= రీతిగా; ధార్తరాష్ట్రులచేన్= దుర్యోధనాదులచే; నేన్= నేను; తల్లడంబునన్= బాధలో; చిక్కకుండఁగన్= చిక్కుకోకుండ; కాచితి(వి)= రక్షించితివి; తావకీన= నీ సంబంధమైన; గుణవ్రజంబు+ఎల్లన్= గుణసముదాయమునంతను; సంస్తుతి+చేసి= పొగడి; చెప్పఁగన్= చెప్పడానికి; ఎంతదానన్= నే నెంతటిదానను?

**తా :** జగదీశ్వరా!మహాబలవంతుడైన కంసునిచేత బాధపడుతున్న మీ తల్లిని కాపాడినట్లుగా, దుర్యోధనాదులచేత నేను బాధ పొందకుండా నీవే కాపాడావు. నీ అనంత గుణసముదాయాన్ని వర్ణించడానికి నేను ఏ పాటిదానను?

**క.** **జననము నైశ్వర్యంబును, ధనమును విద్యయును గల మదచ్ఛన్నులు లకిం**
**చనగోచరుఁడగు నిన్నున్, వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా!** **190**

**ప్రతి :** నిఖిల విబుధస్తుత్యా!= సర్వదేవతలచేతను నుతింపబడేవాడా!; జననమున్= ఉత్తమవంశ జన్మమును; ఐశ్వర్యంబును= అనంతవైభవమును; ధనమును; విద్యయును; కల= కల్గిన; మద+ఛన్నులు= మదంచే కప్పబడినవారు; అకించనగోచరుఁడు+అగు= దీనులకు మాత్రమే కన్పించేవాడవైన; నిన్నున్= నిన్ను; వినుతింపఁగన్+లేరు= ప్రస్తుతించలేరు.

**తా :** మాది గొప్ప వంశం లేదా గొప్ప కులం అనే ఆభిజాత్య మదం, ఐశ్వర్యమదం, ధనమదం, విద్యామదం కలిగినవారు దీనులకు మాత్రమే గోచరించే నిన్ను స్తుతించలేరు.

**వ. మఱియు భక్తధనుండును, నివృత్తధర్మార్థకామ విషయుండును, ఆత్మారాముండును, రాగాదిరహితుండును, గైవల్యదాన సమర్థుండును, గాలరూపకుండును, నియామకుండును, నాద్యంతశూన్యుండును, విభుండును, సర్వసముండును, సకల భూతనిగ్రహానుగ్రహకరుండును నైన నిన్నుఁ దలంచి నమస్కరించెద నవధరింపుము. మనుష్యుల విడంబించు భవదీయవిలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు? నీకుం బ్రియాప్రియులు లేరు; జన్మకర్మశూన్యుండ వయిన నీవు తిర్యగాదిజీవుల యందు వరాహాది రూపంబులను, మనుష్యులందు రామాది రూపంబులను, ఋషులయందు వామనాది రూపంబులను, జలచరంబులయందు మత్స్యాది రూపంబులను నవతరించుట లోక విడంబనార్థంబు గాని, జన్మకర్మ సహితుండ వగుటం గాదు. 191**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; భక్తధనుండును= భక్తులే ధనముగా గలవాడును; నివృత్త= తొలగింపబడ్డ; ధర్మ+అర్థకామ విషయుండును= ధర్మం, అర్థం, కామం అనే త్రివర్గ విషయాలు కలవాడును; ఆత్మారాముండును= ఆత్మయందే రమించువాడును; రాగ+ఆదిరహితుండును= రాగం, ద్వేషం మున్నగు ద్వంద్వాలు లేనివాడును; కైవల్యదానసమర్థుండును= ముక్తినిచ్చుటకు సమర్థుడైన వాడును; కాలరూపకుండును= కాలమే స్వరూపంగా కలవాడును; నియామకుండును= సమస్తమును యోగ్యతానుసారంగా నియమించేవాడును; ఆది+అంత+శూన్యుండును= మొదలు; చివర లేనివాడును; విభుండును= సర్వానికి ప్రభువైనవాడును (అంతటిని తన అధికారంలో ఉంచినవాడును); సర్వసముండును= సర్వభూతాలయందు సమానంగా ప్రవర్తించేవాడును; సకలభూత= సమస్త ప్రాణులను; నిగ్రహ+అనుగ్రహకరుండునున్= శిక్షించడం, రక్షించడం చేసేవాడును; ఐన= అయినటువంటి; నిన్నున్= నిన్ను; తలంచి= మనస్సులో భావించి; నమస్కరించెదన్= వందనమాచరిస్తాను; అవధరింపుము= వినుము; మనుష్యులన్= మానవులను; విడంబించు= అనుకరించే; భవదీయ= నీయొక్క; విలసనంబున్= లీలాగతులను; నిర్ణయింపన్= నిశ్చయించి వివరించడానికి; ఎవ్వఁడు= ఎవడు; సమర్థుండు?= అర్హుడు కాగలడు?; నీకున్= పరాత్పరుడవైన నీకు; ప్రియ+అప్రియులు= మిత్రులు, శత్రువులు; లేరు= ఉండరు; జన్మకర్మశూన్యుండవు+ అయిన= జననం; కర్మకలాపం లేనటువంటివాడవైన; నీవు= నీవే; తిర్యక్+ఆది+జీవుల+అందున్= పశుపక్ష్యాది తిర్యగ్జీవులలో; వరాహ+ఆది+రూపంబులను= వరాహం మున్నగు రూపాలలో; మనుష్యులందున్= మానవజాతియందు; రామ+ఆది+ రూపంబులను= శ్రీరాముడు మున్నగు రూపాలలో; ఋషులయందున్= బ్రహ్మవేత్తలలో; వామన+ఆది+రూపంబులను= వామనుడు మున్నగు రూపాలలో; జలచరంబులయందున్= నీటియందు చరించేవాటిలో; మత్స్య+ఆదిరూపంబులను= చేప మున్నగు రూపాలలో; అవతరించుట= జన్మపొందడం; లోకవిడంబన+అర్థంబు+కాని= ప్రపంచమును అనుకరించడానికి తప్ప; జన్మకర్మసహితుండవు= జన్మకర్మల సంబంధంతో కూడుకొనియుండువాడవు; అగుటన్+కాదు= అవడంవల్లకాదు.

**తా :** కృష్ణా! నీవు భక్తులకు కొంగుబంగారం వంటివాడవు. గుణవృత్తులైన ధర్మం, అర్థం, కామం అనే త్రివర్గం లేనివాడవు. రాగం, ద్వేషం ఇత్యాది ద్వంద్వాలు నీ చెంతకు రాలేవు. ముక్తిప్రదాతవు. కాలస్వరూపుడవు. యోగ్యతానుసారంగా సమస్తాన్ని నియమించేవాడవు. ఆది, అంతం లేకుండా ఉండేవాడవు. సృష్టి సర్వస్వాన్ని నీ అధికారంలో ఉంచినవాడవు. అందరియెడ

సమభావంతో వర్తించేవాడవు. సకలప్రాణికోటులను శిక్షించడంలో, రక్షించడంలో కదు సమర్థుడవు. నిన్ను సదా మనస్సులో ధ్యానించి వందనాలు అర్పిస్తున్నాను.

అవతారపురుషుడవైనా, మానవ ప్రవృత్తులను అనుకరించే నీ లీలలు గ్రహించడం ఎవరికీ సాధ్యంకాదు. నీకు కావలసిన వారూ లేరు. అక్కరలేని వారూ లేరు. హితులూ లేరు. అహితులూ లేరు. జన్మకర్మలు అనేవి నీకు లేనేలేవు. తిర్యగ్జంతుజాలాలలో వరాహాదిరూపాలలోను, మానవులలో శ్రీరామాదిరూపంలోను, ఋషులలో వామనాది రూపాలలోను, జలచరాలలో మత్స్యాది రూపంలోను నీ వవతరించడం ఈ లోకంకోసమే కాని సత్యానికి నీకు జన్మమూలేదు. కర్మసంబంధాలు లేవు.

**ఉ. కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో**
**గోపికఁ ద్రాటఁ గట్టిన వికుంచిత సాంజనబాష్పతోయ ధా**
**రా పరిపూర్ణ వక్త్రముఁ గరంబులఁ బ్రాముచు వెచ్చనూర్చుచుం**
**బాపఁడవై నటించుట కృపాపర! నామదిఁ జోద్య మయ్యెడిన్. 192**

**ప్రతి :** కృపాపర!= దయామయుడవైన కృష్ణా!; నీవు= ఆనాడు చిన్నతనంలో నీవు; దధికుంభము= పెరుగుకుండను; భిన్నము+చేయుచున్+ఉన్నచోన్= ముక్కలుముక్కలయ్యేటట్లుగా పగులగొట్టగా; కోపముతోడన్= నీ అల్లరి పనులకు కుపితురాలై; గోపిక= గొల్లభామినియైన యశోద; త్రాటన్+కట్టినన్= త్రాడుతో కట్టివేయగా; వికుంచిత= చిన్నబుచ్చుకొన్న; స+అంజన= కాటుకతో కూడుకొన్న; బాష్పధారా= కన్నీటిధారలతో; పరిపూర్ణ= అంతటానిండిన; వక్త్రమున్= వదనాన్ని; కరంబులన్= చేతులతో; ప్రాముచున్= రుద్దుకొంటూ; వెచ్చన్+ఊర్చుచున్= గట్టిగా నిట్టూరుస్తూ; పాపఁడవు+ఐ= పసిపాపనిలా; నటించుట= ప్రవర్తించడం; నా మదిన్= నా మనస్సులో; చోద్యము= ఆశ్చర్యం; అయ్యెడిన్= అవుతోంది.

**తా :** ఎంతటి మహానుభావుడవు నీవు? ఆనాడు చిన్నతనంలో ఒక పసిపాపడులా ఎలా ప్రవర్తించావయ్యా! ఒకనాడు యశోద కడుపారా పాలుత్రాగని నిన్ను ఒడిలోనుంచి, క్రిందకు దింపి, పొయ్యిపై పొంగుతున్న పాలకుండను దించుటకై లోనికేగగా, కోపంతో నీవు పెరుగుకుండను చిన్నరాతితో పగులగొట్టావు. తిరిగివచ్చి నేలపాలైన పెరుగును చూచి యశోద కుపితురాలయింది. ఒక త్రాటితో నిన్ను రోటికి కట్టివేసింది. నీవు ముఖం చిన్నబుచ్చుకొని, వెక్కి వెక్కి ఏడుస్తూ, కన్నుల కాటుక చెరిగిపోతూ ఉండగా, నయనాలు రుద్దుకొంటూ, గట్టిగా నిట్టూరుస్తూ ఒక చిన్నపిల్లవాడిగా నటించడం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది కృష్ణా!

**విశే :** 'కోపముతోడన్' అనే పదాన్ని కృష్ణునికి అన్వయించవచ్చు. అదేవిధంగా యశోదకు అన్వయించవచ్చు.

**క. మలయమునఁ జందనము క్రియ, వెలయఁగ ధర్మజుని కీర్తి వెలయించుటకై**
**యిలపై నభవుఁడు హరి యదు, కులమున నుదయించె నండ్రు గొంద ఱనంతా! 193**

**ప్రతి :** అనంతా!= ఆదిమధ్యాంతరహితా! (అంతంలేనివాడా!); మలయమునన్= మలయపర్వతంపై; చందనముక్రియన్= మంచిగంధపు చెట్టులా; వెలయఁగన్= ప్రకాశించేటట్లుగా; ధర్మజుని= ధర్మపుత్రుని; కీర్తిన్= ప్రశస్తిని; వెలయించుటకున్+ఐ= వ్యాపింపజేయుటకై; అభవుఁడు= పుట్టుక లేనివాడైనా; హరి= విష్ణువు; ఇలన్= భూమిపై; యదుకులమునన్= యాదవవంశంలో; ఉదయించెన్= అవతరించాడని; కొందఱు= కొంతమంది; అండ్రు= అంటారు.

**తా :** అనంతా! మలయగిరిపై మంచిగంధపు చెట్టు వెలసినట్లుగా ధర్మపుత్రుని కీర్తి వ్యాపింపజేయడానికై, పుట్టుకలేని హరి భూమిపై యాదవకులంలో అవతరించాడని కొందరంటారు.

**క. వసుదేవ దేవకులు తా, పసగతి గతభవమునందుఁ బ్రార్థించిన సం**
**తసమునఁ బుత్త్రత నొందితి, వసురుల మృతి కంచుఁ, గొంద ఱంద్రు మహాత్మా! 194**

**ప్రతి :** మహాత్మా= పరమాత్మా!; వసుదేవదేవకులు= వసుదేవుడు, దేవకి; గతభవమునందున్= పూర్వజన్మలో; తాపసగతిన్= తాపసుల తీరుతో; ప్రార్థించినన్= కోరుకొనగా; సంతసమునన్= సంతోషంతో; అసురుల= రాక్షసుల; మృతికిన్= చావుకోసం; పుత్త్రతన్= కొడుకు కావటాన్ని; ఒందితివి+అంచున్= పొందితివనుచు (కుమారుడుగా అవతరించావని); కొందఱు= మరికొందరు; అంద్రు= అంటారు.

**తా :** పరాత్పరా! వసుదేవుడు, దేవకి పూర్వజన్మలో అధికమైన తపస్సుచేసి నిన్ను పుత్రునిగా జన్మించుమని కోరారు కదా! వారి ప్రార్థన మన్నించి దానవసంహారానికై అవతరించావని మరికొందరు అంటారు.

**విశే :** భగవద్గీతలో భగవానుడు "అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్, ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా" అన్న విషయాన్ని ఇక్కడ సమన్వయం చేసుకోవచ్చు. నేను పుట్టుకలేనివాడను, ఎట్టి మార్పులూ లేనివాడను. సర్వభూతాలకూ ఈశ్వరుణ్ణి. నా మాయ అయిన ప్రకృతిని ఆధారంగా చేసుకొని అవతరిస్తూ ఉంటాను.

**క. జలరాశి నడుమ మునిఁగెడు, కలముక్రియన్ భూరిభారకర్శిత యగు నీ**
**యిలఁ గావ నజుఁడు గోరినఁ, గలిగితి వని కొంద ఱంద్రు గణనాతీతా! 195**

**ప్రతి :** గణన+అతీతా= లెక్కించుటకు సాధ్యంకాని మహిమకలవాడా!; జలరాశి= సముద్రంయొక్క, నడుమన్= మధ్యభాగంలో; మునిఁగెడు= మునిగిపోయే; కలముక్రియన్= ఓడలాగా; భూరి= అధికమైన; భార= బరువుచే; కర్శిత+అగు= కృశించే; ఈ+ఇలన్= ఈ భూమిని; కావన్= రక్షించడానికి; అజుఁడు= బ్రహ్మ; కోరినన్= ప్రార్థించగా; కలిగితివి+అని= అవతరించావని; కొందఱు= వేరేకొందరు; అంద్రు= అంటారు.

**తా :** లెక్కకందని గుణాలు గల స్వామీ! నడి సముద్రంలో మునిగిపోయే ఓడలా, భరించరాని భారంతో క్రుంగిపోయే భూమిని ఉద్ధరించడానికై బ్రహ్మదేవుడు ప్రార్థించగా అవతరించావని వేరే కొందరు అంటారు.

**తే. మఱచి యజ్ఞాన కామ్యకర్మములఁ దిరుగు, వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ జేయ**
**శ్రవణ చింతన వందనార్చనము లిచ్చు, కొఱకు నుదయించి తంద్రు నిన్ గొంద ఱభవ! 196**

**ప్రతి :** అభవ!= పుట్టుక లేనివాడా!; మఱచి= తాను చేరవలసిన గమ్యాన్ని విస్మరించి; అజ్ఞాన= అవిద్యచేత; కామ్యకర్మములన్= కోరికలు సాధించుకొనవలెననే కర్మలచే; తిరుగు= సంసారచక్రంలో తిరుగాడే; వేదనా+ఆతురులకున్= బాధలచే పీడింపబడేవారికి; తద్+నివృత్తిన్+చేయన్= వాటినుండి విముక్తి కల్గించడానికై; శ్రవణ= తన కథలు వినడం; చింతన= తననుగూర్చి స్మరించడం; వందన= తనను నమస్కరించడం; అర్చనములు= తనను పూజించడం; ఇచ్చుకొఱకున్= ప్రసాదించడానికై; ఉదయించితివి= అవతరించావు అని; నిన్= నిన్ను; కొందఱు= ఇంకా మరికొందరు; అంద్రు= అంటారు.

**తా :** జన్మరహితుడా! తమ కర్తవ్యమయిన స్వస్వరూప జ్ఞానాన్ని కొందరు జీవులు విస్మరిస్తారు. అజ్ఞానంలో మునిగి తేలుతారు. నిరంతరం కోరికలతో కర్మలు ఆచరిస్తారు. తత్ఫలితంగా సంసారచక్రంలో పరిభ్రమిస్తూ ఉంటారు. అటువంటి

వారికి విముక్తి కలిగించడానికై, వారు తరించడానికి వీలుగా శ్రవణం, స్మరణం, వందనం, అర్చనం మున్నగు నవవిధ భక్తిమార్గాలు ప్రసాదించడానికై నీవు అవతరించావని మరికొందరు అంటూ ఉంటారు.

**విశే :** పుట్టుకలు లేనివాడు అనేది ఉండటం, నశించటం అనేవానిని కూడ తెలియజేస్తుంది.

**శా. నినుఁ జింతించుచుఁ బాడుచుం బొగడుచున్ నీ దివ్యచారిత్రముల్**
**వినుచుం జూతురుగాక లోకు లితరాన్వేషంబులం జూతురే**
**ఘన దుర్జన్మ పరంపరా హరణ దక్షంబై మహాయోగి వా**
**గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ! విశ్వంభరా! 197**

**ప్రతి :** విశ్వ+ఈశ= విశ్వమంతటికి ఏలిక అయినవాడా!; విశ్వంభరా= సమస్త విశ్వములను భరించువాడా!; ఘన= ఎక్కువైన; దుర్జన్మ= హీనజన్మల; పరంపరా= వరుసలయొక్క; హరణ= పోగొట్టడంలో; దక్షంబు+ఐ= సమర్థమైన; మహాయోగి= గొప్పమునుల యొక్క; వాక్= వాక్యములచే; వినుతంబు+ఐన= కొనియాడదగిన; భవత్= నీయొక్క; పద+అబ్జయుగమున్= పాదపద్మాల జంటను; నినున్= నిన్ను; చింతించుచున్= స్మరిస్తూ; పాడుచున్= నీ కీర్తనలు గానం చేస్తూ; పొగడుచున్= నీ గుణాలను కొనియాడుతూ; నీ దివ్యచారిత్రముల్= నీ పవిత్రమైన గాథలను; వినుచున్= శ్రవణంచేస్తూ; చూతురు+కాక= దర్శిస్తారేతప్ప; లోకులు= జనులు; ఇతర+అన్వేషంబులన్= వేరే ప్రయత్నాలతో; చూతురు+ఏ= దర్శింపగలరా?

**తా :** కృష్ణా! విశ్వేశ్వరా! విశ్వంభరా! నీవు బ్రహ్మాండాలనన్నింటినీ నియమించేవాడవు. అన్ని లోకాలను భరించేవాడవు. నీ పాదపద్మాలు అనంతజన్మ పరంపరలను అంతం చేసేవి. యోగీశ్వరులు నిత్యం వేదవాక్యాలతో ప్రస్తుతించేవి. నిన్ను స్మరిస్తూ, పొగడుతూ, గానం చేస్తూ, నీ కథలు శ్రవణం చేస్తూ ఉండేవారు మాత్రమే నీ పాదపద్మాలను దర్శించగలుగుతారు. అన్యులు ఇతర మార్గాలద్వారా నీ పాదధూళిని కూడ వీక్షించలేరు.

**విశే :** సంసార పరంపర ఎంత భయంకరమైనదో, దీర్ఘమూ, కఠినపదాలు గలదీ అయిన ఈ సమాసం తెలుపుతున్నది.

**వ. దేవా! నిరాశ్రయులమై భవదీయ చరణారవిందంబు లాశ్రయించి నీ వారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల? నీ కరుణావలోకనంబుల నిత్యంబును జూడవేని యాదవసహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు; కల్యాణ లక్షణ లక్షితంబు లయిన నీ యడుగులచేత నంకితంబైన యీ ధరణీమండలంబు నీవు వాసిన శోభితంబు గాదు; నీ కృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు గుసుమఫల భరితంబులై యోషధి తరు లతా గుల్మ నద నదీ సమేతంబులై యుండు. 198**

**ప్రతి :** దేవా= ఈశ్వరా!; నిర్+ఆశ్రయులము+ఐ= వేరే రక్షణలేనివారమై; భవదీయ= నీయొక్క; చరణ+అరవిందంబులు= పద్మములవంటి పాదాలను; ఆశ్రయించి= శరణుగాకోరి; నీవారలము= నీ సంబంధమైనవారము; ఐన= అయినటువంటి; మమ్మున్= మమ్ములను; విడిచి= వదలివేసి; విచ్చేయన్+ఏల= వెళ్లిపోవడం ఎందులకు?; నీ కరుణా+అవలోకనంబులన్= నీ దయతో గూడిన చూపులతో; నిత్యంబును= ఎల్లప్పుడు; చూడవు+ఏనిన్= చూడకుంటే; యాదవ సహితులు+ఐన= యాదవులతో కూడినవారై; పాండవులు= పాండుపుత్రులందరు; జీవునిన్= జీవాత్మను; పాసిన= విడిచిపెట్టిన; ఇంద్రియంబుల చందంబునన్= ఇంద్రియాలవలె; కీర్తిసంపదలులేక= పేరు, ప్రతిష్ఠలేక; తుచ్ఛత్వంబున్= హీనత్వాన్ని; ఒందుదురు=

పొందుతారు; కల్యాణలక్షణలక్షితంబులు+అయిన= శుభచిహ్నాలతో కూడుకొన్నవైన; నీ+అడుగులచేతన్= నీ పాదాలచే; అంకితంబు+ఐన= గుర్తులు పొందిన; ఈ ధరణీమండలంబు= ఈ ధరాచక్రం; నీవు= నీవంటివాడు; పాసినన్= వదలివెళ్లిపోతే; శోభితంబు+కాదు= ప్రకాశించేది కానేరదు; నీ+కృపావీక్షణ+అమృతంబునన్= నీయొక్క కరుణతో కూడుకొన్న చూపులనే అమృతంచేత; ఇక్కడి= ఇచ్చటి; జనపదంబులు= పల్లెలు మొదలైనవి; కుసుమఫలభరితంబులు+ఐ= పూలతోను; పండ్లతోను నిండినవై; ఓషధి= ఔషధములతో (రోగనివారక వృక్షాలతో); తరు= చెట్లతో; లతా= తీగలతో; గుల్మ= పొదలతో; నద= పడమటి దిక్కుగాపారే జలప్రవాహాలతో; నదీ= తూర్పుదిశగా పారే ఏరులతో; సమేతంబులు+ఐ= కూడుకొన్నవై; ఉండున్= ఒప్పుతూ ఉంటాయి.

**తా :** కృష్ణా! మాకు నీకన్న వేరే రక్షకుడు లేడు. నీ పాదపద్మాలనే పూర్తిగా ఆశ్రయించి బ్రతుకుతున్నాము. మమ్ము విడిచిపెట్టి ద్వారకానగరం వెళ్లిపోతావా? నీవు నీ కరుణాకటాక్ష వీక్షణాలతో చూడకపోతే యాదవులుకాని, పాండవులు కాని బ్రతికి బట్టకట్టగలరా? ఇంద్రియాలు జీవుని విడిచి ప్రవర్తించగలవా? నీవులేనిచో మాకు నామరూపాలు లేవు. కీర్తిప్రతిష్ఠలు లేవు. ఇక మాకు హీనదశ రాకుండపోతుందా? పద్మం, వజ్రం, మత్స్యం ఇత్యాది మంగళ చిహ్నాలతో కూడుకొన్నవి నీ పాదాలు. అట్టి నీ అడుగులచే ఈ భూమండలమే పరమపవిత్రమయింది. నీవు మమ్మల్ని విడిచిపెడితే ఈ ప్రాంతం బోసిపోతుంది. కళావిహీనమయిపోతుంది. నీ దయార్ద్రమైన చూపులతో తడుపబడి ఇచ్చట జనప్రదేశాలు పూలతోను, పండ్లతోను నిండిన ఓషధులతోను, చెట్లతోను, తీగలతోను, పొదలతోను, నదీనదాలతోను కన్నుల పండువు చేస్తున్నాయి.

**ఉ. యాదవులందుఁ బాండుసుతులందు నధీశ్వర! నాకు మోహ వి**
**చ్ఛేదము సేయుమయ్య! ఘనసింధువుఁ జేరెడి గంగభంగి నీ**
**పాదసరోజ చింతనముపై ననిశంబు మదీయబుద్ధి న**
**త్యాదరవృత్తితోఁ గదియు నట్లుగఁ జేయఁగదయ్య! యీశ్వరా! 199**

**ప్రతి :** అధి+ఈశ్వర= సమస్త ప్రాణులకు పాలకుడవైనవాడా!; ఈశ్వర!= పరమేశ్వరా!; యాదవులందున్= నా పుట్టింటివారైన యదువంశం వారిమీదా; పాండుసుతులందున్= అత్తింటివారైన పాండుమహారాజు కుమారులందు; నాకున్= నాకు; మోహ= వ్యామోహంయొక్క (మమకారాన్ని); విచ్ఛేదము= నాశనాన్ని; చేయుము+అయ్య!= కావింపవయ్యా!; ఘనసింధువున్= మహాసముద్రాన్ని; చేరెడి= చేరే; గంగభంగిన్= గంగానదిలా; నీ పాదసరోజచింతనముపైన్= నీ పాదాలనే పద్మాలను భావించటంపై; అనిశంబున్= నిరంతరం; మదీయబుద్ధిన్= నా మనస్సును; అతి+ఆదరవృత్తితోన్= మిక్కిలి ప్రీతి విశేషంతో; కదియు+అట్లుగన్= లగ్నమయ్యేటట్లుగా; చేయన్+కద+అయ్య= ఒనరింపవయ్యా!

**తా :** జగదీశ్వరా! పరమేశా! ఆత్మీయులైన యాదవులందు, పాండవులయందు నాకున్న అనురాగపాశాన్ని త్రెంచివేయి. మహాసముద్రంలో కలసిపోయే గంగాతరంగిణిలాగా నా మనస్సు నీ పాదసంస్మరణంలో లగ్నమయ్యేలా చేయవయ్యా! చాలు.

**శా. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!**
**లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా**

**నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!**
**నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!** **200**

**ప్రతి :** శ్రీకృష్ణా= భగవంతుడవైన కృష్ణా!; యదుభూషణా= యాదవ వంశానికి అలంకారమైనవాడా!; నరసఖా= అర్జునునకు ప్రాణమిత్రుడైనవాడా!; శృంగారరత్నాకరా= సౌందర్యానికి సముద్రంవంటివాడా! (శృంగారానికి) జలనిధివంటివాడా; లోకద్రోహి= జగత్తుకు కంటకప్రాయులైన; నర+ఇంద్ర= రాజులయొక్క; వంశ= కులాలను; దహనా= కాల్చివేసేవాడా!; లోక+ఈశ్వరా= జగదీశా!; దేవతా+అనీక= దేవగణాలయొక్క; బ్రాహ్మణ= భూసురులయొక్క; గోగణ= ఆలమందలయొక్క; ఆర్తి= కష్టమును; హరణా!= పోగొట్టువాడా!; నిర్వాణ= మోక్షమును; సంధాయకా!= చేకూర్చువాడా!; నిత్య+అనుకంపా+నిధీ= శాశ్వతమైన దయకు నిధి అయినవాడా!; నీకున్= నీకు; మ్రొక్కెదన్= వందనమాచరిస్తాను; భవలతల్= ఈ చావుపుట్టుకలనే తీగల మొత్తాలను; త్రుంపవే= ఖండించవయ్యా!

**తా :** శ్రీకృష్ణా! యదుకులాలంకారా! అర్జున ప్రాణమిత్రమా! శృంగారసముద్రా! లోకకంటకులైన రాజులను దహించేవాడా! జగదీశ్వరా! దేవతలను, బ్రాహ్మణులను, గోగణాలను ఆర్తినుంచి తొలగించేవాడా! మోక్షప్రదాయకా! కరుణాపయోనిధీ! నీకు నమస్కరిస్తున్నాను. నా భవబంధాలు ఖండించు.

**వ. అని యిట్లు సకల సంభాషణంబుల నుతియించు గొంతిమాటలకు నియ్యకొని, గోవిందుండు మాయా నిరూఢ మందహాస విశేషంబున మోహంబు నొందించి రథారూఢుండై కరినగరంబునకు వచ్చి, కుంతీ సుభద్రాదుల వీడ్కొని, తన పురంబునకు విచ్చేయ గమకించి, ధర్మరాజుచేఁ గించిత్కాలంబు నిలువు మని ప్రార్థితుండై నిలిచె నంత బంధువధశోకాతురుం డయిన ధర్మజుండు నారాయణ వ్యాస ధౌమ్యాదులచేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుండై నిర్వివేకంబగు చిత్తంబున నిట్లనియె.** **201**

**ప్రతి :** అని= అంటూ; ఇట్లు= ఈ విధంగా; సకలసంభాషణంబులన్= తీయదనంతో కూడుకొన్న మాటలతో; నుతియించు= స్తోత్రంచేసే; గొంతిమాటలకున్= కుంతీదేవి వచనాలకు; ఇయ్యకొని= అంగీకరించి; గోవిందుండు= శ్రీహరి; మాయానిరూఢ= మాయచే నిండిన; మందహాస= చిరునవ్వుయొక్క; విశేషంబునన్= ప్రకాశంవల్ల; మోహంబున్= వాస్తవాన్ని మరుగుపరిచే వ్యామోహాన్ని; ఒందించి= పొందించి; రథ+ఆరూఢుండు+ఐ= తేరు ఎక్కినవాడై; కరినగరంబునకున్= హస్తిపురానికి; ఏతెంచి= వచ్చి; కుంతీసుభద్రాదులన్= కుంతిని; సుభద్రను మున్నగువారిని; వీడ్కొని= సెలవుగైకొని; తన పురంబునకున్= తన ద్వారకానగరానికి; విచ్చేయన్= వెళ్లడానికి; గమకించి= ప్రయత్నంచేసి; ధర్మరాజుచేన్= ధర్మసూనునిచే; కించిత్+కాలంబు= మరికొంతకాలం; నిలువుము+అని= ఉండవలసినదిగా; ప్రార్థితుండు+ఐ= కోరబడినవాడై; నిలిచెన్= గజపురంలో ఉండిపోయాడు; అంతన్= ఆ సమయంలో; బంధువధ= చుట్టాలను చంపుటవల్ల కలిగిన; శోక+ఆతురుండు= దుఃఖంచే కలతచెందినవాడు; అయిన= అయినటువంట; ధర్మజుండు= ధర్మపుత్రుడు; నారాయణవ్యాసధౌమ్య+ఆదులచేతన్= కృష్ణుడు; ద్వైపాయనుడు; పురోహితుడైన ధౌమ్యుడు మున్నగువారిచేత; తెలుపంబడియున్= బోధింపబడికూడా; తెలియక= జ్ఞానాన్ని పొందక; మోహితుండు+ఐ= శోకవ్యామోహంతో; నిర్వివేకంబు+అగు= అజ్ఞానంబైన; చిత్తంబునన్= మనస్సులో; ఇట్లు+అనియెన్= ఇలా భావించి పలికాడు.

**తా :** కుంతీదేవి సత్యమధుర వాక్కులతో భగవంతుని ఈ విధంగా ప్రార్థించగా, ఆయన ఆమె వచనాలను స్వీకరించాడు. తన మాయాపూరిత మందహాసంతో ఆమెను తిరిగి ప్రపంచంలో ప్రవర్తించేలాగా వ్యామోహానికి గురి చేశాడు. రథాన్ని

అధిరోహించాడు. హస్తిపురానికి కురుక్షేత్రం నుంచి పాండవసమేతంగా విచ్చేశాడు. కొంతకాలం అక్కడ ఉండి కుంతిని, సుభద్రను, తక్కినవారిని సెలవుగైకొని తనద్వారకకు వెళ్లడానికి పూనుకొన్నాడు. మరికొంతకాలం ఉండుమని ధర్మరాజు బతిమాలగా అచ్చటనే ఉండిపోయాడు.

ధర్మరాజు తాను చేసిన కురుక్షేత్ర సంగ్రామాన్ని కన్నుల ముందుకు తెచ్చుకొని, ఆలోచనలోపడి దుఃఖంలో మునిగిపోయాడు. కృష్ణుడు, వ్యాసుడు, ధౌమ్యుడు ఎన్నివిధాల ఉపదేశం చేసినా, అతని మనస్సుకు ఊరట లభించలేదు. చుట్టాలనందరిని చంపివేశానన్న అతని శోకానికి వారి ఉపశమన వాక్యాలు ఓదార్పునందించలేకపోయాయి. అతనిలో జ్ఞానం అంతరించి అజ్ఞానం ఆవరించింది. ఇలా మనస్సులో భావించి అన్నాడు.

**మ. తన దేహంబునకై యనేకమృగ సంతానంబుఁ జంపించు దు**
**ర్జనుభంగిం గురు బాలక ద్విజ తనూజ భ్రాతృ సంఘంబు ని**
**ట్లనిఁ జంపించిన పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్ నాకు హా**
**యన లక్షావధి నైన ఘోరనరక వ్యాసంగముల్ మానునే? 202**

**ప్రతి :** తన దేహంబునకున్+ఐ= తన శరీరాన్ని రక్షించుకోవడానికై; అనేకమృగసంతానంబున్= పెక్కు జంతువుల మందలను; చంపించు= వేటాడి వధింపజేసే; దుర్జనుభంగిన్= దుష్టునిలాగా; గురు= ఆచార్యుల; బాలక= శిశువుల; ద్విజ= బ్రాహ్మణుల; తనూజ= కుమారుల; భ్రాతృ= సోదరుల; సంఘంబున్= సమూహాన్ని; ఇట్లు= ఈ విధంగా; అనిన్= పోరులో; చంపించిన= సంహరింపజేసిన; పాపకర్మునకున్= పాపాత్మునికి; రాజ్య+ఆకాంక్షికిన్= రాజ్య సంపాదనయందు కోరిక కలవానికి; నాకున్= అయినట్టి నాకు; హాయన+లక్ష+అవధిన్+ఐనన్= లక్షలాది సంవత్సరాల పర్యంతమైనా; ఘోర= భయంకరమైన; నరక= నరకలోక; వ్యాసంగముల్= వాసనలు; మానునే= పోవునా?

**తా :** తన శరీర పోషణకోసం నోరులేని జీవాలైన మృగాలను చంపించే దుర్మార్గునికి, నాకు తేడా ఏముంది కనుక? రాజ్యకాంక్షతో గురువులను, పసివారిని, బ్రాహ్మణులను, సుతులను, సోదరులను సంహారం చేయించాను. నావంటి పాపాత్ముడు ఎందైన ఉంటాడా? ఎన్ని లక్షల సంవత్సరాల పర్యంతం నరకలోక వాసనలు అనుభవించినా ఈ పాపం అడుగంటుతుందా?

**వ. మఱియుఁ బ్రజాపరిపాలనపరుం డయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినం బాపంబు లేదని శాస్త్ర వచనంబు గల, దయిన నది విజ్ఞానంబు కొఱకు సమర్థంబు గాదు; చతురంగంబుల ననేకాక్షౌహిణీ సంఖ్యాతంబులం జంపించితి; హతబంధులయిన సతుల కేను జేసిన ద్రోహంబు దప్పించుకొన నేర్పులేదు; గృహస్థాశ్రమ ధర్మంబులైన తురంగ మేధాది యాగంబులచేతఁ బురుషుండు బ్రహ్మహత్యాది పాపంబులవలన విడివడి నిర్మలుండగు నని నిగమంబులు నిగమించుఁ; బంకంబునఁ బంకిలస్థలంబునకు, మద్యంబున మద్యభాండంబునకు శుద్ధి సంభవింపని చందంబున బుద్ధిపూర్వక జీవహింసనంబు లయిన యాగంబులచేతం బురుషులకుఁ బాపబాహుళ్యంబ కాని పాప నిర్ముక్తిగాదని శంకించెద. 203**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; ప్రజాపరిపాలనపరుండు+అయిన= లోకులను రక్షించుటయందు ఆసక్తికలవాడైన; రాజు= మహారాజు; ధర్మయుద్ధంబునన్= ధర్మరక్షణకోసం చేసే యుద్ధంలో; శత్రువులన్= పగవారిని; వధియించినన్=

చంపినప్పటికీ; పాపంబు= దోషం; లేదు+అని= కాబోదనే; శాస్త్రవచనంబు= ధర్మశాస్త్రం చెప్పినమాట; కలదు= ఉంది; అయినన్= అయినప్పటికీ; అది= ఆ మాట; విజ్ఞానంబుకొఅకున్= దుఃఖాన్ని పోగొట్టే తెలివికై; సమర్థంబు+కాదు= అర్థవంతం కానేరదు; చతురంగంబులన్= రథ, గజ, హయ, పదాతి బలములనే నాలుగు విధాలతోకూడుకొన్న; అక్షౌహిణీ సంఖ్యాతంబులన్= అక్షౌహిణులను సంఖ్యలుగల సైన్యాలను; చంపించితిన్= వధింపజేశాను; హతబంధులు+అయిన= చనిపోయిన చుట్టాలు కలవారైన; సతులకున్= స్త్రీలపట్ల; ఏను= నేను; చేసిన= కావించిన; ద్రోహంబు= కీడునుంచి; తప్పించుకొనన్= బయటపడడానికి; నేర్పులేదు= ఉపాయంలేదు; గృహస్థ+ఆశ్రమధర్మంబులు+ఐన= గృహస్థాశ్రమం నిర్వహించేవారికి వేదాలు విధించిన; తురంగమేధ+ఆదియాగంబులచేతన్= అశ్వమేధం మున్నగు యజ్ఞాలవల్ల; పురుషుండు= జీవుడు (మానవుడు); బ్రహ్మహత్యా+ఆదిపాపంబులవలనన్= బ్రాహ్మణులను చంపటం మున్నగు దోషాలనుంచి; విడివిడి= విముక్తి పొందినవాడై; నిర్మలుండు+అగును+అని= పాపరహితుడవుతాడని; నిగమంబులు= వేదాలు; నిగమించున్= నియమించాయి; పంకంబునన్= బురదచేత; పంకిలస్థలంబునకున్= బురదనిండినచోటుకు; మద్యంబునన్= కల్లుచేత; మద్యభాండంబునకున్= కల్లుకుండకు; శుద్ధి= పరిశుభ్రత; సంభవింపని= చేకూరని; చందంబునన్= విధంగా; బుద్ధిపూర్వక= కోరికతో కూడుకొన్న మనస్సు ప్రకారంగాచేసే; జీవహింసనంబులు+అయిన= జీవహింస ప్రధానంగా గల; యాగంబులచేతన్= యజ్ఞాలవల్ల; పాపబాహుళ్యంబకాని= పాపాలు ఎక్కువ అవటమేకాన; పాపనిర్ముక్తి= పాపాలనుంచి విడివడటం; కాదు+అని= ఏర్పడదని; శంకించెదన్= సందేహిస్తూ దుఃఖిస్తున్నాను.

**తా :** ప్రజలను న్యాయబుద్ధితో పరిపాలించే రాజేంద్రుడు ధర్మయుక్తంగా యుద్ధం కావించి వైరివీరులను చంపడంలో దోషంలేదని శాస్త్రాలు వక్కాణిస్తున్నాయి. ఆ మాట నాకు దుఃఖాన్ని పోగొట్టడంలేదు. రథగజతురగపదాతులనే చతురంగ బలాలతో కూడుకొన్న అక్షౌహిణులకొలది సైన్యాన్ని చంపించాను. నా రాజ్యకాంక్షే ఇంతటి అనర్థానికి దారి తీసింది. ఆత్మీయులనందరిని యుద్ధంలో చంపించి కులకాంతలకు తీరనిద్రోహం చేశాను. నా అపరాధానికి ప్రాయశ్చిత్తం లేదు. పాపనివృత్తికొరకై గృహస్థులకు కొన్ని ధర్మాలు, యాగాలు విధించబడిన మాట సత్యమే. అశ్వమేధయాగం మున్నగు యజ్ఞక్రియలద్వారా బ్రహ్మహత్యాది దోషాలు పరిహారమవుతాయని వేదాలు ఘోషిస్తున్నాయి. కాని బుద్ధిపూర్వకంగా చేసే జీవహింసకు పరిహారం ఉంటుందా? బురదచేత బురద నిండినచోటు పరిశుభ్రమవుతుందా? కల్లుచేత కల్లుకుండ శుద్ధమవుతుందా? కోరికలతో కూడుకొని మనఃపూర్వకంగా చేసే జీవహింసతో కూడుకొన్న యాగాలచేత మానవులపాపం పెరుగుతుందేకాని తరగదని నా సందేహం. అందులకై శోకిస్తున్నాను.

**విశే :** 21870 రథాలు,

21870 గజాలు,

65610 అశ్వాలు,

109350 కాల్బలం.

**218700 = ఒక అక్షౌహిణి**. ఇటువంటి 18 అక్షౌహిణులు కురుక్షేత్ర మహాసంగ్రామంలో పాల్గొన్నాయి.

**క. అని యిట్లు ధర్మసూనుఁడు, మొనసి నిరాహారభావమున దేవనదీ**
**తనయుఁడు గూలిన చోటికిఁ, జనియెఁ బ్రజాద్రోహ పాప చలితాత్ముండై. 204**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా వచించినవాడై; ధర్మసూనుఁడు= ధర్మదేవత కొడుకైన యుధిష్ఠిరుడు; ప్రజాద్రోహ= జనులకు ద్రోహం చేయడంవల్ల కలిగిన; పాప= పాపభయంవల్ల (చేత); చలిత+ఆత్ముండు+ఐ= కలత చెందింపబడిన మనస్సు కలవాడై; నిరాహారభావమునన్= ఆహారమును ముట్టని దీక్షను; మొనసి= పూనుకొని (యున్నవాడై); దేవనదీతనయుఁడు= ఆకాశగంగానదీ పుత్రుడైన భీష్ముడు; కూలిన= పడిపోయిన; చోటికిన్= ప్రదేశానికి; చనియెన్= వెళ్లాడు.

**తా :** ధర్మపుత్రు డీవిధంగా యుద్ధం పేరుతో జనద్రోహం చేశానని, తన పాపానికి పరిహారంలేదని మనస్సులో శోకించాడు. భోజనం చేయాలనే సంకల్పంకూడ ఆయనకు కలగలేదు. ఒక్కసారి భీష్ముని సందర్శించి రావాలనే కాంక్ష ఆయనలో బయలుదేరింది. వెంటనే కురుక్షేత్రానికి పయనమయ్యాడు.

## ✤ ధర్మజుఁడు శ్రీ కృష్ణసహితుండై భీష్మునికడ కేగుట ✤

**వ. అయ్యవసరంబునం దక్కిన పాండవులును ఫల్గునసహితుండైన పద్మలోచనుండును గాంచన సమంచితంబు లయిన రథంబు లెక్కి ధర్మజుం గూడి చనిన నతండు గుహ్యకసహితుం డయిన కుబేరుని భంగి నొప్పె; నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితులై కురుక్షేత్రంబున కేగి దివంబుననుండి నేలం గూలిన దేవత తెఱంగున సంగ్రామ రంగపతితుండైన గంగానందనునకు నమస్కరించి; రంత బృహదశ్వ భరద్వాజ పరశురామ గౌతమ పర్వత నారద బాదరాయణ కశ్యపాంగిరస కౌశిక ధౌమ్య సుదర్శన శుక వసిష్ఠాద్యనేక రాజర్షి దేవర్షి బ్రహ్మర్షులు శిష్యసమేతులై చనుదెంచినం జూచి సంతసించి దేశకాలవిభాగవేదియైన భీష్ముండు వారలకుం బూజనంబులు సేయించి. 205**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; తక్కిన= మిగిలిన; పాండవులును= పాండుపుత్రులును; ఫల్గునసహితుండు+ఐన= అర్జునునితోకూడిన; పద్మలోచనుండును= తామరపూలవంటి కన్నులు కలిగిన కృష్ణుడును; కాంచన సమంచితంబులు+అయిన= బంగారు వస్తువులచే అలంకరించబడ్డ; రథంబులు= రథాలను; ఎక్కి= అధిరోహించి; ధర్మజున్+కూడి= ధర్మనందనునితోకలసి; చనినన్= వెళ్లగా; అతండు= ధర్మరాజు; గుహ్యకసహితుండు+అయిన= యక్షులతో కూడుకొన్న; కుబేరునిభంగిన్= వైశ్రవణునివలె; ఒప్పెన్= ప్రకాశించాడు; ఇట్లు= ఈ విధంగా; పాండవులు= పాండుతనయులు; పరిజనులు+కొలువన్= సేవకులు తమ్ము సేవించగా; పద్మనాభసహితులు+ఐ= తామరపూవు బొడ్డునందు కల్గిన శ్రీమహావిష్ణువుతో కూడుకొన్నవారై; కురుక్షేత్రంబునకున్+ఏగి= కురుక్షేత్రయుద్ధ భూమికి వెళ్లి; దివంబుననుండి= స్వర్గలోకం నుంచి; నేలన్+కూలిన= భూమండలంపై పడిపోయిన; దేవతతెఱంగునన్= దేవతలా ఉన్న; సంగ్రామరంగ= యుద్ధరంగంలో; పతితుండు+ఐన= పడిపోయియున్న; గంగానందనునకున్= మందాకినీ తనయుడైన భీష్మునికి; నమస్కరించిరి= అభివాదం చేశారు; అంతన్= ఆ సమయంలో; బృహదశ్వ= బృహదశ్వుడు; భరద్వాజ= భరద్వాజుడు; పరశురామ= పరశురాముడు; గౌతమ= గౌతముడు; పర్వత= పర్వతుడు; నారద= నారదుడు; బాదరాయణ= వేదవ్యాసుడు; కశ్యప= కశ్యపుడు; ఆంగిరస= ఆంగిరసుడు; కౌశిక= కౌశికుడు; ధౌమ్య= ధౌమ్యుడు; సుదర్శన= సుదర్శనుడు; శుక= శుకుడు; వసిష్ఠ+ఆది= వసిష్ఠుడు మున్నగు; అనేక= పెక్కుమంది; రాజ+ఋషి దేవ+ఋషి బ్రహ్మ+ఋషులు= రాజర్షులు; దేవర్షులు; బ్రహ్మర్షులు; శిష్యసమేతులు+ఐ= శిష్యులతో కలసి; చనుదెంచినన్= రాగా; చూచి= వీక్షించి; సంతసించి= ఆనందంపొంది; దేశకాలవిభాగవేది+ఐన= దేశం; కాలం విభాగం తెలిసియున్న; భీష్ముండు= దేవవ్రతుడు; వారలకున్= వారికందరికి; పూజనంబులు= అర్చనలు; చేయించి= జరుగునట్లు గావించి...

**తా :** ఆ సమయంలో భీమనకులసహదేవులు, కృష్ణార్జునులు బంగారు రథాలు అధిరోహించి ధర్మజునితో కలసి పయనమయ్యారు. అప్పుడు ధర్మరాజు యక్షులతో కొలువుదీరిన కుబేరునిలా ప్రకాశించాడు. పాండవులు ఈ విధంగా పరిజనములు తమ్ముసేవించగా కృష్ణునితో కలసి కురుక్షేత్రానికి వెళ్లారు. దివినుండి భువికి కూలిపడిపోయిన దేవతలా యుద్ధభూమిలో పడియున్న గంగానందనుడయిన భీష్ముణ్ణి దర్శించి నమస్కరించారు. ఆ సమయంలో బృహదశ్వుడు, కశ్యపుడు, ఆంగిరసుడు, కౌశికుడు, ధౌమ్యుడు, సుదర్శనుడు, శుకుడు, వసిష్ఠుడు మున్నగు పెక్కుమంది రాజర్షులు, దేవర్షులు, బ్రహ్మర్షులు శిష్యసమేతులై కృష్ణునిరాక తెలిసికొన్నవారై అచ్చటికేతెంచారు. వారిరాక చూచి భీష్ముడు సంతసించి, ఆయా దేశకాలాలలో పాటించవలసిన మర్యాదలు తెలిసినవాడు కనుక, వచ్చిన వారికందరికి వేరువేరుగా అర్చనలు చేయించాడు.

**క. మాయాంగీకృత దేహుం, డై యఖిలేశ్వరుఁడు మనుజుఁ డైనాఁడని ప్ర**
**జ్ఞాయతచిత్తంబున గాం, గేయుఁడు పూజనము సేసెఁ గృష్ణున్ జిష్ణున్. 206**

**ప్రతి :** గాంగేయుఁడు= గంగానది కుమారుడు; ప్రజ్ఞా+ఆయత్త= మూడుకాలాల జ్ఞానానికి అధీనమైన; చిత్తంబునన్= మనస్సులో; మాయా= తన శక్తియైన మాయచే; అంగీకృత= తానై చేసికొన్న; దేహుండు+ఐ= శరీరం కలవాడగుచు; అఖిల+ఈశ్వరుఁడు= పరమేశ్వరుడు; మనుజుఁడు= మానవుడుగా; ఐనాఁడు+అని= వర్తించుచున్నాడని నిశ్చయించి; జిష్ణున్= జయశీలుడైన; కృష్ణున్= శ్రీకృష్ణపరమాత్మను; పూజనము+చేసెన్= అర్చించాడు.

**తా :** తన ఎదుటనున్న కృష్ణపరమాత్మను వీక్షించాడు భీష్ముడు. సర్వేశ్వరుడు తన మాయతో మానవదేహం ధరించి వచ్చాడని ఆయన యథార్థ స్వరూపాన్ని గ్రహించాడు. తానుకూడ నిరంతరం స్వస్వరూపజ్ఞానం కలవాడు కావున జయశీలుడైన కృష్ణుని మనస్సులో అర్చించాడు.

**విశే : "స్మృతి ర్వ్యతీతవిషయా, మతి రాగామిగోచరా**
**బుద్ధి స్తాత్కాలివేజ్ఞేయా, ప్రజ్ఞా త్రైకాలికౌమతా"**

గడచిపోయిన దానికి సంబంధించిన తెలివిని స్మృతి అనీ, రాబోయే విషయాలకు సంబంధించిన తెలివిని మతి అనీ, అప్పటికి సంబంధించిన దానిని బుద్ధి అనీ, కాలభేదం లేకుండా ప్రవర్తిల్లే తెలివిని ప్రజ్ఞ అనీ అంటారు.

**వ. మఱియు గంగానందనుండు వినయ ప్రేమ సుందరులయిన పాండునందనులం గూర్చుండ నియోగించి మహానురాగ జనిత బాష్ప సలిల సందోహ సమ్మిళిత లోచనుండై యిట్లనియె. 207**

**ప్రతి :** మఱియున్= పిమ్మట; గంగానందనుండు= భీష్ముడు; వినయప్రేమసుందరులు+అయిన= వినమ్రతచేత; ప్రీతిచేత చూడ ముచ్చటగానున్న; పాండునందనులన్= పాండుమహారాజు కుమారులను; కూర్చుండన్= ఆసీనులుకండని; నియోగించి= నియమించి; మహా+అనురాగ= మిక్కిలి ప్రేమచే; జనిత= పుట్టిన; బాష్పసలిలసందోహ= ఆనందంతో జాలువారుతున్న కన్నీటితో; సమ్మిళిత= పూర్తిగా నిండిన; లోచనుండు+ఐ= నయనాలు కల్గినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** తరువాత గాంగేయుడు వినయవినమిత గాత్రులు, పరమప్రేమపాత్రులు, సద్గుణ సుందరమూర్తులు అయిన పాండుపుత్రులను తన సమీపంలో కూర్చుండ నియోగించాడు. పాండవులను చూడడంతోనే ప్రేమ పొంగిపొర్లింది. ఆనందబాష్పాలు ఒక్కసారి కన్నులందు క్రమ్ముకొన్నాయి. వారితో అనురాగంతో ఇలా అన్నాడు.

**ఆ. ధరణిసురులు హరియు ధర్మంబు దిక్కుగా, బ్రదుకఁదలఁచి మీరు బహువిధముల**
**నన్నలార! పడితి రాపత్పరంపర, లిట్టి చిత్రకర్మ మెందుఁ గలదు? 208**

**ప్రతి :** అన్నలార= నాయనలారా!; ధరణిసురులున్= భూమికి దేవతలైన బ్రాహ్మణులును; హరియున్= కృష్ణుడును; ధర్మంబున్= ధర్మజీవనమును; దిక్కుగాన్= రక్షణగా; బ్రతుకన్+తలఁచి= జీవింపదలచినవారై; బహువిధములన్= పెక్కు రీతులుగా; మీరు= మీరలు; ఆపత్+పరంపరలు= కష్టాల పరంపరలను; పడితిరి= అనుభవించారు; ఇట్టి= ఇటువంటి; చిత్రకర్మము= విపరీత పరిణామం; ఎందున్= ఎక్కడ; కలదు?= ఉంటుంది?

**తా :** నాయనలారా! విప్రులను, శ్రీకృష్ణుని, ధర్మాన్ని ఆశ్రయించి జీవించే మీరే ఎన్నో కష్టాలు అనుభవించారంటే, ఇంతకన్న దురదృష్ట విషయం ఏముంటుంది?

**ఉ. సంతస మింతలేదు మృగశాప వశంబునఁ బాండు భూవిభుం**
**డంతము నొందియుండ మిము నర్భకులం గొనివచ్చి కాంక్షతో**
**నింతల వారిఁగాఁ బెనిచె నెన్నఁడు సౌఖ్యము పట్టు గాన దీ**
**గొంతి యనేకదుఃఖములఁ గుందుచు నుండును; భాగ్య మెట్టిదో! 209**

**ప్రతి :** సంతసము= సంతోషం; ఇంతలేదు= ఇసుమంతైనాలేదు; మృగశాపవశంబునన్= మృగరూపంలోనున్న మునీంద్రుని శాపంవల్ల; పాండుభూవిభుండు= పాండురాజు; అంతమున్= మృత్యువును; ఒంది+ఉండన్= పొందియుండగా; అర్భకులన్= పసికందులైన; మిమున్= మిమ్ములను; కొనివచ్చి= తన అరచేతులలో తీసుకొని; కాంక్షతోన్= మీయందే ఆశపెట్టుకొన్నదై; ఇంతల+వారిఁగాన్= ఇంత ప్రయోజకులయ్యేటట్లుగా; పెనిచెన్= పెంచి పెద్ద చేసింది; ఎన్నఁడున్= ఏనాడుకూడా; సౌఖ్యము= సుఖంయొక్క; పట్టు= కుదురు; ఈ గొంతి= మీ తల్లియైన ఈ కుంతీదేవి; కానదు= అనుభవించి యెరుగదు; అనేక దుఃఖములన్= ఎప్పుడూ పెక్కు కష్టాలతోనే; కుందుచున్= దుఃఖిస్తూ; ఉండును= ఉండిపోయింది; భాగ్యము= ప్రారబ్ధకర్మము; ఎట్టిదో= ఎటువంటిదో కదా!

**తా :** పాపం! మీ తల్లి కుంతీదేవి ఇసుమంతైనా సుఖమంటే ఎరుగదు. మృగరూపంలో ముని శపించగా, పాండుమహారాజు మరణించడం జరిగింది. అప్పటికి మీరు పసివారు. మిమ్మల్ని అరచేతులలో పెట్టుకొని పెంచింది. మీయందే ఆశలన్నీ ఉంచి పెద్ద చేసింది. మిమ్మల్ని ఇంత ప్రయోజకులు అయ్యేటట్లుగా తీర్చిదిద్దింది. అయినా ఒకనాడూ కుదురుగా సౌఖ్యం అనుభవించి యెరుగదు. నిరంతరం దుఃఖంతో క్రుంగిపోయింది. ఇది ఎంతటి ప్రారబ్ధ కర్మమోకదా!

**విశే :** ఇందు "ఇంతలు" అని అవ్యయాన్ని బహువచనాంతంగా ప్రయోగించి పోతన కుంతి పాండవులను పెంచిన విశేషాన్ని తెలియజేయడం జరిగింది. ఒక తపోధనుడైన ఋషిపుత్రుడు మృగరూపంలో భార్యతో విహరిస్తూ ఉండగా, పాండురాజు ప్రయోగించిన ఐదు బాణాలకు అతడు హతుడయ్యాడు. సర్వభూతహితకాలమది. ఆ సమయంలో పాండురాజు బాణాలు వేశాడు. అందువల్ల ముని శపించాడు. స్త్రీసంగం పొందినచో మృతుడ వవుతావనే శాపానికి గురయ్యాడు రాజు. తరువాతికాలంలో పాండురాజు మాద్రీసంగమం చేసి మరణించాడు. ఆనాటినుంచి తన పుత్రులను, మాద్రీ తనయులను కుంతి పెంచి పెద్ద చేసింది. భాగ్యం శుభకర్మనూ, అశుభకర్మనూ తెలియజేస్తుంది.

**ఉ. వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం**
**బాయుచు నుండు కైవడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై**

**పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ జరింపదు కాల; మన్నియుం**
**జేయుచునుండుఁ; గాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్.** **210**

**ప్రతి :** వాయువశంబులు+ఐ= గాలిలో చిక్కుకొని లోబడినవై; ఎగసి= ఎగిరి; వారిధరంబులు= మేఘాలు; మింటన్= ఆకాశంలో; కూడుచున్= కలుసుకొంటూ; పాయుచున్= విడిపోతూ; ఉండుకైవడిన్= ఉండేవిధంగా; సర్వమున్= సమస్తమైన; ప్రపంచమున్= విశ్వం; కాలతంత్రము+ఐ= కాలానికి లోబడినదై; పాయుచున్= విడివడుతూ; కూడుచున్= కలుస్తూ; ఉండున్= ఉంటుంది; కాలము= కాలం; ఒక భంగిన్= ఒకేరీతిగా; చరింపదు= సాగదు; అన్నియున్= ఎన్నింటినో; చేయుచున్+ఉండున్= కావిస్తూ ఉంటుంది; కాలము= కాలచక్రం; విచిత్రము= చిత్రాతిచిత్రమైనది; ఎట్టివారికిన్= ఎటువంటివారికైనా; దుస్తరము= దాటశక్యం కానిది.

**తా :** గాలికి పైకి ఎగిరిన మేఘాలు ఆకాశంలో కలుసుకొంటూ, విడిపోతూ ఉంటాయి. అదేవిధంగా సమస్త ప్రపంచంలోని భూతసముదాయాలు కాలప్రభావంవల్ల కలుస్తూ, విడివడుతూ ఉంటాయి. ఎప్పుడూ కాలచక్రం ఒకే రీతిలో సాగదు. అన్నింటికి కాలమే మూలం. కాలం చాలా విచిత్రమైనది. తేలికగా అయిపోతాయనుకొన్న వానిని కష్టపడి సాధించవలసినవిగాను, కష్టసాధ్యాలైన వానిని సులభంగానూ కాలం మార్చివేస్తుంది. ఎంతటివారైనా కాలగమనానికి లోబడవలసినవారే.

**ఉ. రాజఁట ధర్మజుండు, సురరాజసుతుండఁట ధన్వి, శాత్రవో**
**ద్వేజకమైన గాండివము విల్లఁట, సారథి సర్వభద్ర సం**
**యోజకుఁ డైన చక్రి యఁట, యుగ్రగదాధరుఁడైన భీముఁ డ**
**య్యాజికిఁ దోడు వచ్చునఁట, యాపద గల్గుటిదేమి చోద్యమో!** **211**

**ప్రతి :** ధర్మజుండు= ధర్మపుత్రుడు; రాజు+అఁట= అందరిని శాసించగలిగే ఱేడుకదా!; సురరాజసుతుండు= దేవేంద్రుని కుమారుడైన అర్జునుడు; ధన్వి+అఁట= మేటి విలుకాడు కదా!; శాత్రవ+ఉద్వేజకము+ఐన= వైరులకు మిక్కిలి వెరపు కల్గించే; గాండివము= అగ్నిదేవుడిచ్చిన గాండీవం; విల్లు+అఁట= ధనుస్సు కదా!; సర్వ= సమస్తములైన; భద్ర= మంగళాలను; సంయోజకుఁడు+ఐన= చక్కగా చేకూర్చువాడైన; చక్రి= విష్ణువు; సారథి+అఁట= రథాన్ని నడిపేవాడు కదా!; ఉగ్రగదాధరుఁడు+ఐన= భయంకరమైన గదను ధరించి యుండువాడైన; భీముఁడు= భీమసేనుడు; ఆ+ఆజికిన్= ఆ యుద్ధానికి; తోడు= సహాయకుడుగా; వచ్చున్+అఁట= ఏతెంచియున్నాడు కదా!; ఆపద+కల్గుట= అయినా కష్టాలు సంభవించడం; ఇది+ఏమి= అనేది ఎంత?; చోద్యము+ఓ!= ఆశ్చర్యమోకదా!

**తా :** కన్నెర్రజేస్తే చాలు సాగరాలనన్నిటినీ ఏకీకృతం చేయగల్గిన ధర్మతనయుడు శాసించే రాజుగా ఉన్నా, దేవేంద్రుని అంశచేత ప్రభవించిన అర్జునుడు ధనుర్ధారిగా ఉన్నా, ఖాండవవన దహనసమయంలో అగ్నిదేవుడు మెచ్చియిచ్చిన శత్రువుల గుండెలలో దడ పుట్టించే గాండీవం విల్లుగా ఉన్నా, సర్వమంగళ విధాయకుడైన శ్రీహరి రథసారథిగా ఉన్నా, భయంకర గదాయుధధారియైన పవనపుత్రుడు యుద్ధానికి కొండంత అండగా ఉన్నా, పాండవులైన మీరు ఇక్కట్టుల పాలగుట తప్పలేదు. ఎంత ఆశ్చర్యమో కదా!

**ఆ. ఈశ్వరుండు విష్ణు డెవ్వేళ నెవ్వని, నేమి సేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు**
**నతని మాయలకు మహాత్ములు విద్వాంసు, లడఁగి మెలఁగుచుందు రంధు లగుచు.** **212**

**ప్రతి :** ఈశ్వరుండు= జగన్నియంతయైన; విష్ణుఁడు= శ్రీమహావిష్ణువు; ఏ+వేళన్= ఏ సమయంలో; ఎవ్వనిన్= ఎవరికి; ఏమి= ఏమేమి; చేయున్= కావిస్తాడో; పురుషుఁడు= జీవుడు (సామాన్య మానవుడు); ఏమి= దానిని ఏమి; ఎఱుఁగున్= గ్రహించగలడు?; అతని మాయలకున్= ఆయన మాయావిలాసాలకు; మహాత్ములు= మహానుభావులైన; విద్వాంసులు= ఆత్మజ్ఞానులుకూడ; అంధులు+అగుచున్= దిక్కుకాననివారై; అడఁగి= అణగిమణగి; మెలఁగుచున్+ఉందురు= ప్రవర్తిస్తూ ఉంటారు.

**తా :** జగదీశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఏ సమయంలో ఎవరికి ఏమి చేస్తాడో ఎవరు చెప్పగలరు? సాధారణ మానవులకు అది అవగతంకాని మాయ. ఆ మాయకు లోబడి మహానుభావులైన ఆత్మజ్ఞానం కలవారు సహితం దిక్కు కాననివారై అణగి మణగి ప్రవర్తిస్తూ ఉంటారు.

**వ. కావున దైవతంత్రంబైన పనికి వగవం బనిలేదు; రక్షకులు లేని ప్రజల నుపేక్షింపక రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయణుండు, తేజోనిరూఢుండు గాక యాదవులందు గూఢుండై తన మాయచేత లోకంబుల మోహాతిరేకంబు నొందించు; నతని రహస్య ప్రకారంబులు భగవంతుం డైన పరమేశ్వరుం డెఱుంగు; మఱియు దేవర్షియగు నారదుండును భగవంతుండగు కపిలమునియు నెఱుంగుదురు; మీరు కృష్ణుండు దేవకీ పుత్రుండని మాతులేయుండని తలంచి దూత సచివ సారథి బంధు మిత్ర ప్రయోజనంబుల నియమింతు; రిన్నిటం గొఱంత లేదు; రాగాదిశూన్యుండు, నిరహంకారుం, దద్వయుండు, సమదర్శనుండు, సర్వాత్మకుండు నయిన యీశ్వరునకు నతోన్నత భావ మతివైషమ్యంబు లెక్కడివి? లేవు. అయిన భక్తవత్సలుండు గావున నేకాంతభక్తులకు సులభుండై యుండు. 213**

**ప్రతి :** కావునన్= కాబట్టి; దైవతంత్రంబు+ఐన= దైవం కల్పించిన; పనికిన్= పనికి; వగవన్= విచారించవలసిన; పనిలేదు= పని ఉండరాదు; రక్షకులు= దిక్కు అయినవారు; లేని= లేనటువంటి; ప్రజలన్= జనులను; రక్షింపన్= కాపాడుటకై; ఉపేక్షింపక= జాగుసేయక; పుండరీక+అక్షుండు= తామరపూలవంటి నయనాలు కల్గిన శ్రీకృష్ణుడు; సాక్షాత్కరించిన= ప్రత్యక్షంగా ఉన్న; నారాయణుండు= శ్రీమహావిష్ణువు; తేజస్+నిరూఢుండు+కాక= తన దివ్యతేజస్సుచే వ్యక్తం కాకుండా; యాదవులందున్= యదువంశస్థులలో; గూఢుండు+ఐ= రహస్యంగా ఉన్నవాడై; తన మాయచేతన్= తన అధీనంలోనున్న మాయద్వారా; లోకంబులన్= సమస్త జగాలను; మోహ+అతిరేకంబున్= వ్యామోహం యొక్క అతిశయాన్ని; ఒందించున్= పొందిస్తూ ఉంటాడు; అతని రహస్య ప్రకారంబులు= ఆ కృష్ణునియొక్క మిక్కిలి తెలియరాని చేష్టలు; భగవంతుండు+ఐన= భగవానుడైన; పరమ+ఈశ్వరుండు= మహేశ్వరుడు (పరమాత్మయే); ఎఱుంగున్= తెలియును; మఱియున్= అంతేకాక; దేవ+ఋషి+అగు= దేవతలలో ఋషియైన; నారదుండును= నారద మునీంద్రుడును; భగవంతుండు+అగు= భగవానుని అవతారమైన; కపిలమునియున్= కపిల మహర్షియును; ఎఱుంగుదురు= తెలిసినవారే; మీరు= పాండవులైన మీరు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; దేవకీపుత్రుండు+అని= దేవకియొక్క కుమారుడని; మాతులేయుండు+అని= మేనమామ కుమారుడని; తలంచి= భావించి; దూత= రాయబారిగా; సచివ= మంత్రిగా; సారథి= రథం నడుపువానిగా; బంధు= చుట్టముగా; మిత్ర= స్నేహితుఁడుగా; ప్రయోజనంబులన్= మీ పనులలో; నియమింతురు= వినియోగించుకొంటున్నారు; ఇన్నిటన్= ఇందువల్ల (వీటన్నింటివల్ల); కొఱంతలేదు= ఆయనకు లోపం కాబోదు; రాగ+ఆది+శూన్యుండు= రాగం; ద్వేషం మున్నగు భావాలు లేనివాడును; నిర్+అహంకారుండు= అహంభావం లేనివాడను;

న+ద్వయుండు= రెండవది లేనివాడు; సమదర్శనుండు= అంతటిని బ్రహ్మముగా చూచేవాడును; సర్వ+ఆత్మకుండున్= సకల భూతాత్మస్వరూపుడును; అయిన= అయినటువంటి; ఈశ్వరునకున్= పరమేశ్వరునకు; నత= తక్కువ; ఉన్నత= ఎక్కువ; భావ= అభిప్రాయాలతో కూడుకొన్న; మతివైషమ్యంబులు= బుద్ధిభేదాలు; ఎక్కడివి?= ఎక్కడ ఉంటాయి?; లేవు= ఉండనే ఉండవు; అయినన్= అయినప్పటికి; భక్తవత్సలుండు= తనను సేవించే వారిపై మిక్కిలి ఎక్కువ అనురాగం కలిగి ఉండేవాడు; కావునన్= కాబట్టి; ఏకాంత భక్తులకున్= అనన్యభక్తితో భజించేవారికి; సులభుండు+ఐ= తేలికగా లభ్యమయ్యేవాడుగా; ఉండున్= ఉంటాడు.

**తా :** కాబట్టి దైవనియంత్రిత సంకల్పానికి విచారించవలసిన పనిలేదు. దిక్కులేని జనులను ఉద్ధరించడానికై నారాయణుడు శ్రీకృష్ణరూపంలో ప్రత్యక్షమయ్యాడు. ఆయన తన దివ్యత్వాన్ని మరుగుపరచి, యాదవులలో గూఢంగా సంచరిస్తున్న పరమేశ్వరుడు. మాయను స్వాధీనపరచుకొన్నవాడై సమస్తలోకాలను మోహంలో ముంచి తేలుస్తూ ఉంటాడు. ఆయన రహస్యవర్తనం మహేశ్వరునికే (భగవంతునికే) ఎరుక. నారదుడు, కపిలుడు కూడ ఆ విషయం తెలిసినవారే. మీరు కృష్ణుని దేవకీపుత్రుడని, మేనమామ కుమారుడని భావించి దూతగా, మంత్రిగా, రథసారథిగా, బంధువుగా, స్నేహితుడుగా ఆయనను వినియోగించుకొన్నారు. అయినా ఆయనకు ఎటువంటి కొరత రాదు. రాగద్వేషాదులు లేనివాడు, అహంకార శూన్యుడు, అద్వయుడు, అందరియందు సమబుద్ధి కలవాడు, సర్వభూతాత్మ స్వరూపుడు అయిన జగదీశ్వరునకు తక్కువ ఎక్కువ అనే (భావాలతో కూడుకొన్న) బుద్ధిభేదాలు ఎక్కడుంటాయి కనుక? అవి ఏ కోశానా ఆయనయందు కానరావు. అయినప్పటికి భక్తులపై వాత్సల్యం కలవాడు కాబట్టి అనన్య భక్తితో సేవించేవారికి సులభంగా అందుబాటులో ఉంటాడు.

**విశే :** వాత్సల్యం – తల్లిదండ్రులకు కన్నవారి మీద ఉండే అనురాగం.

**సీ. అతిభక్తి నెవ్వని యందుఁ జిత్తముఁ జేర్చి యెవ్వని నామ మూహించి పొగడి**
**కాయంబు విడుచుచుఁ గామ కర్మాదినిర్మూలనుండై యోగి ముక్తి నొందు**
**నట్టి సర్వేశ్వరుం డఖిలదేవోత్తంసుఁ డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు**
**నందాఁక నిదె మహాహర్షుఁడై వికసిత వదనారవిందుఁడై వచ్చె నేఁడు**

**తే. నాల్గు భుజములు గమలాభనయనయుగము నొప్పఁగన్నుల ముందట నున్నవాఁడు**
**మానవేశ్వర! నా భాగ్యమహిమఁ జూడు మేమి సేసితినో పుణ్య మితనిఁగూర్చి 214**

**ప్రతి :** అతిభక్తిన్= మిక్కిలి అనురక్తితో; ఎవ్వని+అందున్= ఏ పరమాత్మయందు; చిత్తమున్+చేర్చి= మనస్సు లగ్నంచేసి; ఎవ్వనినామము= ఏ దేవునియొక్క పవిత్రనామాన్ని; ఊహించి= భావించి; పొగడి= కొనియాడి; కాయంబున్= దేహాన్ని; విడుచుచున్= విడిచిపెడుతూ; కామకర్మ+ఆది= కోరికలచే ఏర్పడే కర్మలద్వారా కలిగే జనన మరణాలనుండి; నిర్మూలనుండు+ఐ= తొలగింపబడ్డవాడై; యోగి= యోగసిద్ధి పొందినవాడు; ముక్తిన్= మోక్షాన్ని; ఒందున్= పొందుతాడో; అట్టి= అటువంటి; సర్వ+ఈశ్వరుండు= సమస్త లోకేశుడు; అఖిలదేవ+ఉత్తంసుఁడు= సకల దేవతాశ్రేష్ఠుడు; ఏ+వేళన్= ఏ సమయంలో; ఏను= నేను; ప్రాణంబులు= ఐదు ఊపిరులను; విడుతున్= విడుస్తానో; అందాఁకన్= ఆ సమయానికి; ఇదె= ఇదిగో!; మహాహర్షుఁడు+ఐ= మిక్కిలి సంతోషం కలవాడై; వికసితవదన+అరవిందుఁడు+ఐ= వికసించియున్న ముఖపద్మంకలవాడై; నేఁడు= ఈనాడు; వచ్చెన్= వచ్చియున్నాడు; నాల్గుభుజములు= నాలుగు చేతులును; కమల+ఆభ=

పద్మములతో సమానమైన; నయనయుగమున్= కన్నుగవయును; ఒప్పన్= ప్రకాశిస్తూ ఉండగా; కన్నులముందటన్= నా నయనసన్నిధిలో; ఉన్నవాఁడు= కూర్చుండియున్నాడు; మానవ+ఈశ్వర= నరాధిపా!; నా భాగ్యమహిమ= నా అదృష్టంయొక్క గొప్పతనం; చూడుము= చూడు; ఇతనిన్+కూర్చి= ఈ మహాత్ముని ఉద్దేశించి; ఏమి= ఎటువంటి; పుణ్యము= సుకృతం; చేసితిని+ఓ= చేసియుంటినో కదా!

**తా :** ఉత్తమయోగి అనన్యభక్తితో ఏ పరమాత్మయందు మనస్సు లగ్నం చేసి, ఏ దేవదేవుని పవిత్రనామం బుద్ధియందు ధారణచేసి ఉచ్చరిస్తూ, తనువు చాలించి, కోరికలచే ఏర్పడే కర్మలద్వారా కలిగే జననమరణాలనుండి విముక్తి పొంది మోక్షఫలాన్ని అనుభవిస్తాడో, అటువంటి సకలలోకేశ్వరుడు అఖిలదేవతా సార్వభౌముడు నేను ప్రాణాలు విడిచే సమయానికి నయనానందకరుడై, చూడ ముచ్చట అయిన ముఖపద్మంతో నాముందు ప్రత్యక్షమైనాడు. నేడు చతుర్భుజుడై, విప్పారిన తామలవంటి కనులతో నా కన్నులకు గోచరమగుచున్నాడు. ధర్మరాజా! నా అదృష్టవిశేషం పండింది. ఈ మహాత్మునికోసం గతజన్మలో ఎంత సుకృతం ఆచరించానోకదా!

**వ. అని యిట్లు ధనంజయ సంప్రాపిత శరపంజరుం డయిన కురుకుంజరుని వచనంబులు వినయంబున నాకర్ణించి మునులందఱు వినుచుండ ధర్మనందనుండు మందాకినీనందనువలన నరజాతి సాధారణంబులగు ధర్మంబులును, వర్ణాశ్రమ ధర్మంబులును, రాగవైరాగ్యోపాధులతోఁ గూడిన ప్రవృత్తి నివృత్తి ధర్మంబులును, దానధర్మంబులును, రాజ ధర్మంబులును, స్త్రీ ధర్మంబులును శమదమాదికంబులును, హరి తోషణంబులగు ధర్మంబులును, ధర్మార్థ కామ మోక్షంబులును, నానావిధోపాఖ్యానేతిహాసంబులును, సంక్షేప విస్తారరూపంబుల నెఱింగె; నంత రథిక సహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు స్వచ్ఛంద మరణులైన యోగీశ్వరులచేత వాంఛితంబగు నుత్తరాయణంబు సనుదెంచిన నది దనకు మరణోచితకాలంబని నిశ్చయించి. 215**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; ధనంజయ= అర్జునునిచే; సంప్రాపిత= ఏర్పరుపబడ్డ; శరపంజరుండు= అమ్ములతో ఏర్పడిన గూడు కలవాడు; అయిన= అయినటువంటి; కురుకుంజరుని= కురువంశశ్రేష్ఠుని (కుంజరమనగా ఏనుగు; ఇక్కడ శ్రేష్ఠతావాచకం); వచనంబులు= పలుకులు; ఆకర్ణించి= విని; మునులు+అందఱున్= ఋషులెల్లరూ; వినుచుండన్= వింటూండగా; ధర్మనందనుండు= ధర్మసూనుడు; మందాకినీనందనువలనన్= గంగాసూనునివల్ల; నరజాతి= మానవజాతికి; సాధారణంబులు+అగు= సామాన్యములైన; ధర్మంబులును= ధర్మాలను; వర్ణ+ఆశ్రమధర్మంబులును= నాలుగు వర్ణాల; నాలుగు ఆశ్రమాల ధర్మాలను; రాగవైరాగ్య+ఉపాధులతోన్= అనురాగం; వైరాగ్యం అనే వానికి ఆధారాలయిన; కూడిన= కూడుకొన్న; ప్రవృత్తి నివృత్తి ధర్మంబులును= సంసారంలో మెలగటానికి, తొలగటానికి కావలసిన ధర్మాలను; దానధర్మంబులును= దానాలకు సంబంధించిన ధర్మాలను; రాజధర్మంబులును= రాజ్యాన్ని పరిపాలించే మహారాజు ఆచరించే ధర్మాలను; స్త్రీధర్మంబులును= స్త్రీలు ఆచరించవలసిన ధర్మాలను; శమదమ+ఆదికంబులును= బాహ్యేంద్రియాలు; అంతరింద్రియాలు మున్నగు వాటి నిగ్రహ స్వరూపాన్ని, హరితోషణంబులు+అగు= విష్ణుప్రీతిదాయకాలైన; ధర్మంబులును= ధర్మాలను; ధర్మ+అర్థకామ మోక్షంబులును= ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే నాలుగు పురుషార్థాలను; నానావిధ= పెక్కురీతులైన; ఉప+ఆఖ్యాన= చిన్నకథలు; ఇతిహాసంబులును= పెద్ద పెద్ద చరిత్రలను; సంక్షేపవిస్తారరూపంబులన్= సంక్షిప్తరూపంలోను; వివరణ రూపంలోను కూడా; ఎఱింగెన్= తెలుసుకొన్నాడు; అంతన్= ఆ సమయంలో; రథికసహస్రంబులకున్= రథికులు వేలకొలదికి; గమికాఁడు+ఐన= నాయకుడైన; భీష్ముండు= భీష్మపితామహుడు;

స్వచ్ఛందమరణులు+ఐన= కావలసినపుడు చనిపోవ కలిగినవారైన; యోగి+ఈశ్వరులచేతన్= సంయమీశ్వరులచే; వాంఛితంబు+అగు= కోరబడే; ఉత్తరాయణంబు= ఉత్తరాయణ పుణ్యకాలం; చనుదెంచినన్= రాగా; అది= ఆ సమయం; తనకున్= తనకుకూడా; మరణ+ఉచితకాలంబు+అని= చనిపోవడానికి తగిన వేళయని; నిశ్చయించి= నిర్ణయించి.

**తా :** అర్జునుడు ఏర్పరచిన అంపశయ్యపై పరుండిన భీష్మపితామహుడు ఈ విధంగా కృష్ణునిపై పరాభక్తిని ప్రకటించాడు. ధర్మరాజు గాంగేయునివల్ల మునుల సమక్షంలో మానవజాతి ఆచరించే సామాన్య ధర్మాలు, నాలుగు వర్ణాల ధర్మాలు, నాలుగు ఆశ్రమాల ధర్మాలు, రాగవైరాగ్య కారణాలైన ప్రవృత్తి నివృత్తి ధర్మాలు, దానభేదాధికార ధర్మాలు, రాజ్యపాలన చేసే నరేంద్రులు ఆచరించే ధర్మాలు, స్త్రీలకు యోగ్యాలయిన ధర్మాలు, శమదమాది షడ్గుణ లక్షణాలు, శ్రీహరికి ప్రీతిపాత్రములైన భాగవత ధర్మాలు, ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలు, అనేకవిధాలైన ఉపాఖ్యానాలు, ఇతిహాసాలు కొన్ని సంక్షేపంగా, మరికొన్ని సవివరంగా ఆలకించాడు. మహారథులకు అధినాయకుడైన శాంతనవుడు సంయమీశ్వరులు స్వచ్ఛందమరణం కోరుకొనే ఉత్తరాయణ పుణ్యకాలం సమీపించడం తెలుసుకొని, తానుకూడ ఇంక తనువు చాలించాలని నిశ్చయించుకొన్నాడు.

**విశే :** భీష్ముడు తన తండ్రియైన శంతను మహారాజునుండి స్వచ్ఛందమరణాన్ని వరంగా పొందాడు.

సంసారంలో మెలగటానికి, తొలగటానికి కావలసిన ధర్మాలలో ప్రవృత్తి ధర్మం రాగానికీ, నివృత్తి ధర్మం వైరాగ్యానికీ కారణం అవుతుంది.

వర్ణాలు నాలుగు – బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర నామాలు కలవి. ఆశ్రమాలు నాలుగు (1) బ్రహ్మచర్యం (2) గార్హస్థ్యం (3) వానప్రస్థం (4) సంన్యాసం.

**శా. ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ**
**గ్జాలంబున్ హరిమోముపైఁ బఱపి తత్కారుణ్యదృష్టిన్ విని**
**ర్మూలీభూత శరవ్యథా నిచయుఁడై మోదించి భీష్ముండు సం**
**శీలం బొప్ప నుతించెఁ గల్మషగజ శ్రేణీహరిన్ శ్రీహరిన్. 216**

**ప్రతి :** ఆలాపంబులుమాని= సంభాషించడం మాని (మౌనం వహించి); చిత్తమున్= మనస్సును; మనీషా+ఆయత్తమున్+చేసి= బుద్ధికి వశమైన దానినిగాచేసి; దృక్+జాలంబున్= చూపుల సమూహాన్ని; హరిమోముపైన్= శ్రీకృష్ణుని ముఖంపై; పఱపి= వ్యాపింపజేసి (విసరి); తద్+కారుణ్యదృష్టిన్= ఆయన కృపావిలోకనంచే; వినిర్మూలీభూత= పూర్తిగా నాశనం చేయబడ్డ; శరవ్యథానిచయుఁడు+ఐ= బాణములవల్ల ఏర్పడిన గాయపు బాధలు కలవాడై; భీష్ముండు= గంగాపుత్రుడు; మోదించి= సంతోషించి; కల్మషగజశ్రేణీహరిన్= పాపములనే ఏనుగుల సమూహాలకు సింహంవంటివాడైన; శ్రీహరిన్= కృష్ణపరమాత్మను; సంశీలంబు+ఒప్పన్= శాంతస్వభావం (ఆత్మజ్ఞానం) ప్రకాశించగా; నుతించెన్= ఇట్లు స్తోత్రం చేశాడు.

**తా :** భీష్ముడు తన ఉపదేశ వాక్యాలకు స్వస్తి పలికాడు. పూర్తిగా మౌనం వహించాడు. తన చూపులను పరమాత్మపై కేంద్రీకరించాడు. అటువంటి మహాత్ములకు మరణ సమయంలో కర్మశేషాలన్నీ తొలగిపోతాయి. కృష్ణుని కరుణాకటాక్ష వీక్షణాలచే కాయంపై గాయాలబాధ పూర్తిగా ఉపశమించింది. పూర్ణ స్వస్థచిత్తుడయ్యాడు. శ్రీహరి పాపాలనే ఏనుగులకు సింహంవంటివాడు. జ్ఞానియై పరమభక్తుడైన ఆతడు ఆ పరాత్పరుని ఈ విధంగా స్తోత్రం చేయసాగాడు.

**వ. ఇట్లు పీతాంబరధారియుఁ జతుర్భుజుండు నాదిపూరుషుండుఁ బరమేశ్వరుండునగు హరియందు నిష్కాముండై విశుద్ధంబగు ధ్యాన విశేషంబుచే నిరస్తదోషుం డగుచు ధారణావతియైన బుద్ధిని సమర్పించి, పరమానందంబు నొంది ప్రకృతివలననైన సృష్టి పరంపరలఁ బరిహరించు తలంపున మందాకినీ నందనుం డిట్లనియె. 217**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; పీతాంబరధారియున్= పచ్చనిబట్ట ధరించేవాడును; చతుర్భుజుండున్= నాలుగుచేతులు కలవాడును; ఆదిపూరుషుండున్= పురాణపురుషుడును; పరమేశ్వరుండున్= సమస్తమును నియమించేవాడును (పరమాత్మయును); అగు= అయినటువంటి; హరియందున్= మహావిష్ణువునందు; నిష్కాముండు+ఐ= ఏ కోరికలు లేనివాడై; విశుద్ధంబు+అగు= నిర్మలమైన; ధ్యానవిశేషంబుచేన్= ఏకాగ్రచిత్తంతో; నిరస్తదోషుండు+అగుచున్= తొలగిపోయిన పాపాలు కలవాడై; ధారణావతి+ఐన= చెదరకుండా నిలిచి ఉండే; బుద్ధిని= నిశ్చయజ్ఞానాన్ని; సమర్పించి= ఆయనయందే లగ్నంచేసి; పరమ+ఆనందంబున్+ఒంది= బ్రహ్మానందానుభూతిని పొందినవాడై; ప్రకృతివలనన్+ఐన= ప్రకృతివల్ల ఏర్పడే; సృష్టిపరంపరలన్= జన్మబంధాలను; పరిహరించుతలంపునన్= పూర్తిగా తొలగించుకొనే ఉద్దేశంతో; మందాకినీ నందనుండు= గంగాతనయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా నుతించాడు.

**తా :** భీష్ముని నేత్రాలకు మహావిష్ణుస్వరూపం గోచరమయింది. పీతాంబరుడు, చతుర్భుజుడు, పురాణ పురుషుడు, పరమేశుడు అయిన హరిని చిత్తంలో ధ్యానించడానికి కోరికలను పూర్తిగా విసర్జించాడు. ఏకాగ్ర మనస్కుడయ్యాడు. బాహ్యప్రకృతిని నిరోధించాడు. సమస్త విఘ్నాలు తొలగిపోయాయి. సమాధిస్థితికి చేరాడు. బుద్ధిని ఆయనపై (కృష్ణునిపై) నిలిపాడు. కానవచ్చేది సగుణస్వరూపమయినా, బ్రహ్మానందానుభూతిని పొందాడు. ఇక ఇటువంటివి పునరావృత్తం కాకూడదనుకొన్నాడు. జన్మబంధాలు పూర్తిగా నశింపజేసుకోవాలనే సంకల్పంతో ఈ రీతిగా ప్రస్తుతించాడు.

**విశే :** ధారణ నిండుగా ఉన్న బుద్ధిని మేధ అంటారు.

## ✤ భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట ✤

**మ. త్రిజగన్మోహన నీలకాంతిఁ దను వుద్దీపింపఁ బ్రాభాత నీ**
**రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక**
**వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా**
**విజయుం జేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్. 218**

**ప్రతి :** త్రిజగత్+మోహన= మూడులోకాలను మోహింపజేసే; నీలకాంతిన్= నీలిరంగుగల కాంతితో; తనువు= శరీరము; ఉత్+దీపింపన్= మిక్కిలి ప్రకాశించగా; ప్రాభాత= ఉదయకాలపు; నీరజబంధు= పద్మబంధుడైన సూర్యునియొక్క; ప్రభము+ఐన= కాంతివంటి కాంతి కల్గినదైన; చేలము= వస్త్రము; పయిన్= దేహంపై; రంజిల్లన్= ఒప్పుచుండగా; నీల+అలక= నల్లని ముంగురుల; వ్రజ= గుంపులతో; సంయుక్త= కూడుకొన్న; ముఖ+అరవిందము= పద్మంవంటి వదనం; అతిసేవ్యంబు+ఐ= మిక్కిలి సేవింపదగినదై; విజృంభింపన్= గొప్పగా వెల్గుచుండగా; మా విజయున్= మా అర్జునునితో; చేరెడు= కలసియుండే; వన్నెలాఁడు= సోయగములవాడు; ఎల్లప్పుడున్= నిరంతరం; మదిన్= నా మనస్సులో; ఆవేశించున్= నిలిచియుండునుగాక!

**తా :** కృష్ణా! మూడులోకాలను మోహింపజేసే నీలవర్ణ దేహకాంతి నీది. అటుపై బాలసూర్యుని కాంతులతో విరాజిల్లే పట్టువస్త్రం ధరిస్తావు. అంతేకాక నీ ముఖారవిందంపై నల్లని ముంగురులు ఎగురుతూ ఒయ్యారం ఒలకబోస్తాయి. అటువంటి మనోహరరూపంతో అర్జునుని అట్టి మంగళస్వరూపం నా అంతరంగంలో నిలిచియుండుగాక!

**విశే :** అనంతమైన ఆకాశం నీలవర్ణంతో గోచరించినట్లే, అగాధ సముద్రజలాలు నల్లరంగులో కనబడినట్లే, అనంత కల్యాణగుణ సంపన్నుడైన పరమాత్మ సగుణరూపం కూడ నీలవర్ణంతో చర్మచక్షువులకు దర్శనీయమవుతుంది. అంతేకాక సత్త్వరజస్తమోగుణాల వర్ణాలు నీలవర్ణంలో విలీనమవుతాయి. నల్లరాయికూడ జీవలక్షణం కలది. నరనారాయణాభిన్న స్వరూపం తాను దర్శించాలని భీష్ముడు కోరుకోవడం జరిగింది.

**మ. హయరింఖాముఖధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై**
**రయజాతశ్రమ తోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో**
**జయముం బార్థున కిచ్చు వేడ్క నని నా శస్త్రాహతిం జాల నొ**
**చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్. 219**

**ప్రతి :** హయ= గుఱ్ఱాలయొక్క; రింఖా= కాలిగిట్టల; ముఖ= ముందుభాగాలనుండి లేచిన; ధూళి= దుమ్ముచేత; ధూసర= బూడిదరంగుచే; పరిన్యస్త= అంతటా వ్యాపించిన; అలక+ఉపేతము+ఐ= ముంగురులతో కూడుకొన్నదై; రయ= వేగంగా రథాన్ని నడపడంచేత; జాత= పుట్టిన; శ్రమ= అలసటచేత; తోయబిందుయుతము+ఐ= చెమట చుక్కలతో కూడుకొన్నదై; రాజిల్లు= ప్రకాశించే; నెమ్మోముతోన్ (నెఱి+మోముతోన్)= అందమైన ముఖంతో; జయమున్= విజయాన్ని; పార్థునకున్= పృథాపుత్రుడైన ధనంజయునకు; ఇచ్చు= చేకూర్చే; వేడ్కన్= కుతూహలంతో; అనిన్= యుద్ధంలో; నా+శస్త్ర+ఆహతిన్= నా ఆయుధాల దెబ్బకు; చాలన్= మిక్కిలి; నొచ్చియున్= నొప్పి పుట్టినవాడవైనా; పోరించు= ప్రోత్సాహంతో పోరు సల్పేటట్లుగా చేసిన; మహానుభావున్= గొప్పవాడైన శ్రీకృష్ణుని; మదిలోన్= మనస్సులో; అశ్రాంతమున్= నిరంతరం; చింతింతున్= ధ్యానిస్తున్నాను.

**తా :** అందమైన ముఖం, గుఱ్ఱాల కాలిగిట్టలనుండి పైకి లేచిన దుమ్ము పైన వ్యాపించగా రంగు చెడిపోయింది. వింతకాంతులతో మెరసే ముంగురులు కూడా కళావిహీనాలయ్యాయి. రథాన్ని వేగంగా నడపడంవల్ల ముఖమంతా చెమట బిందువులు వ్యాపించాయి. ముఖంపై చెమటతో తడిసి, దానిపై బూడిదరంగు, అటుపై శోభను మరుగుపరచే ముంగురులు. ఎంత శ్రమపడ్డావయ్యా! ఇక అర్జునుడు నా బాణప్రహారాలకు తట్టుకోలేక మిక్కిలి వేదనను అనుభవించాడు. కవచం చీలిపోయి తీవ్రబాధకు గురి అయ్యాడు. అయినా అర్జునునికి యుద్ధంలో విజయం కలిగించాలని ప్రోత్సహించి పోరించావు. అట్టి విజయమోహనరూపం నా మనస్సులో ఎల్లప్పుడూ సుస్థిరమైయుండుగాక!

**మ. నరు మాటల్ విని, నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ**
**బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం**
**బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు, నీ**
**పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై. 220**

**ప్రతి :** నరు= అర్జునుని; మాటల్= పలుకులను; విని= ఆలకించి; నవ్వుతోన్= నవ్వు చిందిస్తూ; ఉభయసేనా= ఇరుసేనలయొక్క; మధ్యమక్షోణిలోన్= నడుమ యుద్ధభూమిలో; పరులు= పగవారు; ఈక్షింపన్= చూచుచుండగా; రథంబు= అరదమును;

నిల్పి= నిలబెట్టి; పరభూపాల+ఆవళిన్= శత్రురాజుల సమూహాలను; చూపుచున్= పేరుపేరున చూపిస్తూ; పరభూప+ ఆయువులు+ఎల్లన్= వైరిరాజుల ఆయువులనన్నింటిని; చూపులన్+అ= చూపులతోడనే; శుంభత్+కేళిన్= ప్రకాశించే క్రీడగా; వంచించు= లోబరచుకొన్న; ఈ+పరమ+ఈశుండు= ఈ సర్వనియంతయైన ఈశ్వరుడు; హృత్+పద్మ+ఆసన+ఆసీనుఁ డు+ఐ= నా హృదయం అనే పద్మంలో కూర్చుండి; వెలుంగుచున్+ఉండెడును= భాసించుచుండును గాక!

**తా :** కృష్ణా! ఆనాడు అర్జునుడు రథంపై అధివసించి పోరు కోరివచ్చిన వీరులను చూచే ఉద్దేశంతో రథాన్ని నిలుపుమని కోరాడు కదా! అప్పుడు నీవు ఆ మాటలు విని చిరునవ్వు చిందించి ఉభయసేనల మధ్యలో రథం నిలిపావు. శత్రురాజులందరూ ఆ చోద్యం వీక్షించారు. నీవు వారిని పేరుపేరునా విజయునకు పరిచయం చేస్తూ వారి ఆయువులను నీ చూపులతోనే ఆకర్షించి లోబరచుకొన్నావు. అట్టి సర్వలోకనియంతవైన నీవు నా హృదయపద్మంలో సదా విరాజిల్లుచుందువు గాక!

**క. తనవారిఁ జంపఁజాలక, వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్**
**ఘనయోగవిద్యఁ బాపిన, మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్. 221**

**ప్రతి :** తనవారిన్= తన జనములను; చంపన్+చాలక= చంపడానికి ఇష్టంలేక; వెనుకకున్= యుద్ధరంగము నుండి మరలి; పోన్= పోవడానికి; ఇచ్చగించు= నిశ్చయించుకొన్న; విజయుని= అర్జునుని; శంకన్= అజ్ఞానాన్ని (సందేహాన్ని); ఘనయోగవిద్యన్= గొప్పదైన ఆత్మజ్ఞానాన్ని చేకూర్చే విద్యతో (భగవద్గీతతో); పాపిన= పోగొట్టిన; మునివంద్యుని= యోగులచే ప్రస్తుతించబడే శ్రీకృష్ణుని; పాదభక్తి= చరణములందు భక్తి; నాకున్= నాకు; మొనయున్= ప్రాప్తించుగాక!

**తా :** కృష్ణా! అర్జునుడు యుద్ధంలో పాల్గొన్న వేలకొలది వీరులందరూ తన వారేనని, అట్టి గురువులను, వృద్ధులను, హితులను చంపుటకు ఇష్టపడక వెనుకకు మరలిపోవడానికి నిశ్చయించాడు కదా! ఆ అర్జునునికి ఏర్పడిన కర్తవ్య సందేహాన్ని నీ అత్యద్భుతమైన భగవద్జ్ఞానోపదేశంచే పోగొట్టి కిరీటిని కర్తవ్యపరాయణుని గావించావు. నీవు సమస్తయోగిజన సంస్తుత్యుడవు. నీ పాదకమలాలపై నాకు భక్తి సదా ప్రాప్తించుగాక!

**సీ. కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ**
**నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి గదలఁ**
**జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ బై నున్న పచ్చని పటము జాఱ**
**నమ్మితి నాలావు నగుఁబాటు సేయక మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ**

**తే. గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు**
**విడువు మర్జున యనుచు మద్విశిఖ వృష్టిఁ దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు. 222**

**ప్రతి :** కుప్పించి+ఎగసినన్= రథమునుండి ఎగిరి పైనుండి క్రిందకు దుముకగా; కుండలంబుల కాంతి= ధరించియున్న శ్రవణ కుండలాల కాంతి; గగనభాగంబు+ఎల్లన్= భూమి; ఆకాశాలమధ్య భాగమంతా; కప్పికొనఁగన్= వ్యాపించగా; ఉఱికినన్= దూకిన సమయంలో; ఓర్వక= భరించలేక; ఉదరంబులోన్+ఉన్న= కడుపులోనున్న; జగములవ్రేఁగునన్= లోకాల బరువుకు; జగతి= విశ్వమంతా; కదలన్= కంపించగా; చక్రంబున్= చక్రాన్ని; చేపట్టి= ధరించి; చనుదెంచు= ఉరికే; రయమునన్= వేగంలో; పైన్+ఉన్న= భుజాలపైనున్న; పచ్చనిపటము= బంగారు ఉత్తరీయం; జాఱన్= జారిపోగా; నమ్మితిన్= (విశ్వసించి) నమ్మకంతో ఉన్నాను; నా లావు= నా బలాన్ని (గురించి); నగుఁబాటు+చేయక= నలుగురిలో

నవ్వులపాలు కావించక; మన్నింపుము+అని= క్షమించుమని; క్రీడి= అర్జునుడు; మరలన్= వెనుకకు; దిగువన్= లాగుచుండగా; కరికిన్= ఏనుగుమీదికి; లంఘించు= దుమికే; సింహంబుకరణిన్= సింహంలాగా; మెఱసి= ప్రకాశించి; నేఁడు= ఈనాడు; భీష్మునిన్= ఈ గంగాతనయుని; చంపుదున్= సంహరిస్తాను; నిన్నున్= నిన్ను; కాతున్= సంరక్షిస్తాను; విడువుము= నన్ను విడిచిపెట్టు; అర్జున!= ధనంజయా!; అనుచున్= అంటూ; మత్+విశిఖ+వృష్టిన్= నా బాణవర్షాన్ని; తెరలి= తప్పించుకుంటూ; చనుదెంచు= నాపైకి వచ్చే; దేవుండు= దేవాదిదేవుడు; నాకున్= నాకు; దిక్కు= రక్ష అగుగాక!

**తా :** ఆనాడు యుద్ధరంగంలో నా శరవర్షానికి తట్టుకోలేక, నన్ను చంపి అర్జునుని సంరక్షించాలనే ఉద్దేశంతో నాపైకి చక్రాన్ని చేబట్టి, దుముకుచున్న నీ వీరగంభీరస్వరూపం నాకు ఇప్పటికీ కన్నుల గట్టినట్లుగానే ఉంది. రథంపై నుండి ఎగిరి దూకుతున్నప్పుడు నీ కుండలాల కాంతి ఆకాశమండలమంతా వ్యాపించింది. ముందుకు లంఘిస్తున్నప్పుడు కుక్షిలోనున్న పిండాండం కదలిపోగా, దాని బరువుకు వెలుపలనున్న బ్రహ్మాండమంతా కంపించింది. చక్రాన్ని చేత ధరించి ముందుకు దూకుతున్నప్పుడు పైనున్న బంగారు ఉత్తరీయం క్రిందకుజారిపోయినా, భక్తరక్షణార్థం నడుము కట్టిన స్వామి, వేషాన్ని చక్కదిద్దుకోవడంలో ముచ్చట చూపలేదు. నా పరాక్రమంపై నాకు విశ్వాసం ఉందని, నమ్ముకొన్న నన్ను నలుగురిలో నవ్వులపాలు చేయవద్దని, క్రీడి వెనుకకులాగుతున్నా ఆ ఆర్తత్రాణ పరాయణుడు పట్టించుకోలేదు. ఏనుగుపై లంఘించే సింహం పిల్లలా ముందుకు దుమికి వేశాడు. ఈ రోజు భీష్ముని చంపి, అర్జునుని రక్షిస్తానని అరిచాడు. నన్ను విడిచిపెట్టు. ఈ గాంగేయుని సంగతి నేటితో సరి అని పైనబడిన భక్తరక్షణ పరాయణుడు నాకు సదా రక్షగానుండుగాక!

**మ. తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు వొమ్మంచు న**
**ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్**
**మునికోలన్ వడిఁ బూని ఘోటకములన్ మోదించి తాడించుచున్**
**జనులన్ మోహము నొందఁ జేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్. 223**

**ప్రతి :** తనకున్ భృత్యుఁడు= (ఈ అర్జునుడు) నాకు సేవకుడు; వీనిన్= ఇతనిని; కాచుట= రక్షించడం; మహాధర్మంబు= ఉత్తమధర్మం; పొమ్ము+అంచున్= అని నిశ్చయించుకొంటూ; అర్జునసారథ్యము= ధనంజయుని రథం నడపడానికి; పూని= పూనుకొని; పగ్గములు= కళ్లెములు; చేన్= చేతితో; చోద్యంబుగాన్= ఒయ్యారంగా; పట్టుచున్= పట్టుకొంటూ; మునికోలన్= సెలకోల (కొరడా)ను; వడిన్= రెండవచేతితో వేగంగా; పూని= ధరించి; ఘోటకములన్= గుఱ్ఱాలను; మోదించి= ఉత్సాహంతో; తాడించుచున్= అదలిస్తూ; జనులన్= చూచే ప్రజానీకానికి; మోహమున్= ఆశ్చర్యమును; ఒందన్+చేయు= కలిగించే; పరమ+ఉత్సాహున్= పరమానందమూర్తిని; ప్రశంసించెదన్= స్తోత్రం చేస్తాను.

**తా :** అర్జునుడు ప్రస్తుతం తనకు కింకరుడు. సేవకుని రక్షించడం స్వామికి ధర్మం. అంతకన్న పరమధర్మం మరొక్కటి లేదు. అందువల్ల అర్జునరక్షణార్థమై తనమాట ప్రక్కకు బెట్టి, భీష్ముని చంపడానికై రథం నుంచి దుముకడం జరిగింది. స్వామి రథంపై నొగల నడుమ కూర్చున్న తీరు నయనానందకరం. ఒక చేతితో పగ్గాలు, మరొక చేతితో సెలకోల ధరించి ఒయ్యారంగా గుఱ్ఱాలను అదలించిన తీరు ఆశ్చర్యదాయకం. ఆ రూపం చూచే జనులకు మోహం కలుగకమానదు. అట్టి ఉత్సాహమూర్తిని ప్రశంసిస్తున్నాను.

**విశే :** కృష్ణ సారథ్య వైభవాన్ని లీలాశుకుడు ఈ విధంగా పరమరమణీయంగా వర్ణించాడు.

**"నఖనియమిత కండూన్ పాండవస్యందనాశ్వాన్**
**అనుదినమభిషించన్ అంజలిస్థైః పయోభిః,**
**అవతు వితత గాత్రః తోత్రసంస్యూతమౌళిః**
**దశనవిధృతరశ్మిర్దేవకీపుణ్యరాశిః"**

కృష్ణుడు అర్జునుని గుఱ్ఱాలను దోసిళ్ళతో నీళ్లుపోసి కడిగి శుభ్రపరచేవాడు. గోళ్లతో గీరి వాటి నవను (దురదను) పోగొట్టి లాలించేవాడు. వాటికి ఎంతో ప్రియం చేకూర్చేవాడు. ఆ సమయంలో పగ్గాలను నోటితో పట్టుకొన్నాడట. సెలకోలను నెత్తిపై పెట్టుకొన్నాడట. అట్టి ఆశ్చర్యకర్తమూర్తి మమ్ములను రక్షించుగాక! అంటాడు కవి.

**క. పలుకుల నగవుల నడపుల, నలుకల నవలోకనముల నాభీరవధూ**
**కులముల మనముల తాలిమి, కొలుకులు వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్. 224**

**ప్రతి :** పలుకులన్= తియ్యని మాటలతో; నగవులన్= చిరునవ్వులతో; నడపులన్= ప్రవర్తనలతో; అలుకలన్= (ప్రణయ) కోపాలతో; అవలోకనములన్= వాలుచూపులతో; ఆభీరవధూకులముల= గోపకాంతల బృందములయొక్క; మనముల= చిత్తములయొక్క; తాలిమి= ఓర్పుయొక్క; కొలుకులు= సంబంధములు; వదలించు= దోచుకొన్న; ఘనునిన్= మహానుభావుని; మదిలోన్= మనస్సునందు; కొలిచెదన్= సేవిస్తాను.

**తా :** మధుర వచనాలతో, మందహాసాలతో, వింత ప్రవర్తనలతో, ప్రణయ కోపాలతో, వాలుచూపులతో గోపభామినుల వలపులు దోచుకొన్న బాలకృష్ణుని మనస్సులో సేవిస్తాను.

**ఆ. మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని సభా, మందిరమున యాగమండపమునఁ**
**జిత్ర మహిమతోడఁ జెలువొందు జగదాది, దేవుఁ డమరు నాదు దృష్టియందు. 225**

**ప్రతి :** మునులన్= మహర్షులును; నృపులున్= రాజశ్రేష్ఠులును; చూడన్= వీక్షిస్తూ ఉండగా; మును= పూర్వం; ధర్మజుని= ధర్మసూనుని; సభామందిరమునన్= పేరోలగంలో; యాగమండ(ట)పమునన్= రాజసూయయాగ మహామండపంలో; చిత్రమహిమతోడన్= ఆశ్చర్యం పొందించే; చెలువు+ఒందు= తేజస్సుతో విలసిల్లిన; జగత్+ఆదిదేవుఁడు= లోకేశ్వరేశ్వరుడు; నాదు దృష్టియందున్= నా చూపులలో; అమరున్= నిలుచుగాక!

**తా :** మహర్షులు, రాజశ్రేష్ఠులు ఎందరో చూస్తూ ఉండగా, ధర్మపుత్రుని పేరోలగంలో రాజసూయయాగ మహామండపంలో, విభ్రాంతి గొలిపే మూర్తిమత్త్వంతో విలసిల్లి, యాగపూజలందుకొన్న యజ్ఞేశ్వరుడైన పరమేశ్వరుడు నా చూపులలో నిలుచుగాక!

**మ. ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో**
**లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ**
**న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ**
**పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై. 226**

**ప్రతి :** ఒక సూర్యుండు= ఒకడేయైన భానుడు; సమస్త జీవులకున్= సమస్త జీవరాశులకు; తాన్= తాను; ఒక్కొక్కఁడు+ఐ= వేర్వేరుగా; తోఁచు= కానవచ్చే; పోలికన్= విధంగా; ఏ దేవుఁడు= ఏ భగవంతుడు; సర్వకాలము= ఎల్లప్పుడు; మహాలీలన్=

గొప్ప విలాసంతో; నిజ+ఉత్పన్న= తనచే సృష్టించబడ్డ; జన్యకదంబంబుల= జీవసమూహాలయొక్క; హృద్+సరస్+ రుహములన్= హృదయపద్మాలలో; నానావిధ= అనేకవిధాలుగా; అనూన= ఎక్కువైన; రూపకుఁడు+ఐ= రూపాలు కలిగినవాడై; ఒప్పుచున్+ఉండున్= విలసిల్లుతూ ఉంటాడో; అట్టి= అటువంటి, హరిన్= మహావిష్ణువును (పరమాత్మను); ఏన్= నేను; శుద్ధుండను+ఐ= పవిత్రుడనై (నిర్మలుడనై); ప్రార్థింతున్= ప్రార్థిస్తున్నాను.

**తా :** ఒకే ఒక సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. సృష్టిలోని సమస్త జీవరాశులకు ఒక్కొక్కరికి ఒక్కొక్కడుగా కానవస్తున్నాడు. అదేవిధంగా ఒకే పరమాత్మ నిరంతరం తన లీలావిలాసంతో తాను సృష్టించిన సమస్తప్రాణికోటి హృదయపద్మాలలో నానావిధ రూపాలతో విలసిల్లుతున్నాడు. అట్టి భగవంతుని నా నిర్మల హృదయంలో ప్రార్థిస్తున్నాను.

**విశే :** ఇదే అద్వైత భావన. సర్వంలో ఏకత్వం చూడటం.

**వ. అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్ముండగు కృష్ణుని హృదయంబున నిలిపికొని, నిశ్వాసంబులు మాని నిరుపాధికంబయిన వాసుదేవ బ్రహ్మంబునందుం గలసిన భీష్మునిం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూరకయుండు తెఱంగున నుండిరి; దేవ మానవ వాదితంబులై దుందుభి నినాదంబులు మొరసె; మృతుండయిన భీష్మునికి ధర్మజుండు పరలోక క్రియలు సేయించి ముహూర్తమాత్రంబు దుఃఖితుండయ్యె; నంత నచ్చటి మునులు కృష్ణునిఁ దమ హృదయంబుల నిలిపికొని సంతుష్టాంతరంగు లగుచుం దదీయ దివ్యావతారనామంబులచే స్తుతియించి స్వాశ్రమంబులకుం జనిరి; పిదప నయ్యుధిష్ఠిరుండు గృష్ణసహితుండై గజపురంబునకుం జని గాంధారీ సమేతుండయిన ధృతరాష్ట్రు నొడంబఱచి, తత్సమ్మతంబున వాసుదేవానుమోదితుండై పితృపైతామహంబైన రాజ్యంబు గైకొని, ధర్మ మార్గంబునం బ్రజాపాలనంబు సేయుచుండె నని చెప్పిన విని సూతునకు శౌనకుం డిట్లనియె. 227**

**ప్రతి :** అని= అంటూ; ఇట్లు= ఈ రీతిగా; మనోవాగ్దర్శనంబులన్= మనస్సుద్వారా, మాటలద్వారా, సందర్శనంద్వారా; పరమ+ఆత్ముండు+అగు= పరమాత్మ అయిన; కృష్ణుని= వాసుదేవుని; హృదయంబునన్= హృదయాకాశంలో; నిలిపికొని= పదిలపరచుకొని; నిశ్వాసంబులు మాని= శ్వాసను నిరోధించి; నిర్+ఉపాధికంబు+అయిన= ఉపాధి సంబంధంలేని (ప్రత్యేక లక్షణాలతో వేరు చేయటానికి వీలయినది. పరమాత్మ – అటువంటి ఉపాధులు లేనివాడు); వాసుదేవ బ్రహ్మంబునందున్= సర్వవ్యాపకమైన పరబ్రహ్మంలో; కలసినన్= లీనంకాగా; భీష్మునిన్+చూచి= ఆ గంగాతనయుని వీక్షించి; సర్వజనులు= సమస్త జనములు; దివస+అవసానంబునన్= సంధ్యాసమయంలో; విహంగంబులు= పక్షులు; ఊరక+ఉండు+తెఱంగునన్= మౌనం వహించిన విధంగా; ఉండిరి= ఉండిపోయారు; దేవమానవవాదితంబులు+ఐ= దేవతలచేత; మానవులచేత మ్రోయింపబడినవై; దుందుభినినాదంబులు= వాద్యవిశేషాల ధ్వనులు; మొరసెన్= మిన్నుముట్టాయి; మృతుండు+అయిన= మరణించిన; భీష్మునికిన్= భీష్మాచార్యులవారికి; ధర్మజుండు= ధర్మరాజు; పరలోకక్రియలు= ఊర్ధ్వలోక సంస్కారాలు; చేయించి= జరిపించి; ముహూర్తమాత్రంబు= కొద్దికాలం; దుఃఖితుండు+ అయ్యెన్= విచారించాడు; అంతన్= ఆ సమయంలో; అచ్చటిమునులు= అచ్చటకు చేరిన మునీశ్వరులు; కృష్ణునిన్= శ్రీకృష్ణుని; తమ హృదయంబులన్= తమ మనస్సులలో; నిలిపికొని= నిల్పుకొని; సంతుష్ట+అంతరంగులు= ఆనందంతో నిండిన అంతఃకరణం కలవారు; అగుచున్= అవుతూ; తదీయ= అతనికి సంబంధించిన; దివ్య+అవతార= గొప్పవైన అవతారముల; నామంబులచేన్= పవిత్ర నామాలతో; స్తుతియించి= కొనియాడి; స్వ+ఆశ్రమంబులకున్= తమ తమ

నెలవులకు; చనిరి= వెళ్లిపోయారు; పిదపన్= అటుపిమ్మట; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; కృష్ణసహితుండు+ఐ= కృష్ణునితో కూడుకొన్నవాడై; గజపురంబునకున్= హస్తిపురికి; చని= వెళ్లి; గాంధారీ సమేతుండు+అయిన= గాంధారీదేవితో కూడుకొనియున్న; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్ర మహారాజును; ఒడంబఱచి= ఒప్పించి (ఓదార్చి); తద్+సమ్మతంబునన్= ఆయన అంగీకారంతో; వాసుదేవ+అనుమోదితుండు+ఐ= శ్రీహరి అనుమతి పొందినవాడై; పితృపైతామహంబు+ఐన= తండ్రితాతల నుండి వచ్చిన; రాజ్యంబు= కౌరవ సామ్రాజ్యాన్ని; కైకొని= స్వీకరించి; ధర్మమార్గంబునన్= న్యాయపద్ధతితో; ప్రజాపాలనంబు= జనసంరక్షణ; చేయుచు+ఉండెను+అని= కావించాడని; చెప్పినన్= వచింపగా; విని= ఆకర్ణించి; సూతునకున్= సూతమహర్షికి; శౌనకుండు= శౌనకుడనే మహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** భీష్ముడు ఇట్లు త్రికరణశుద్ధిగా పరమాత్మను స్తుతించి తన హృదయపద్మంలో సుప్రతిష్ఠితం చేసుకొన్నాడు. శ్వాసను నిరోధించాడు. ఉపాధి విహీనమైన పరబ్రహ్మలో తన ఆత్మను లీనం చేశాడు. అది చూచి సమస్త జనులు పగలు గడచినపిమ్మట సంధ్యాసమయంలో పక్షులు మౌనం వహించినట్లు అయిపోయారు. దేవలోకంలోను, మానవ లోకంలోను దుందుభులు మోగాయి. భీష్మునికి పరలోకక్రియలు కావించి ధర్మపుత్రుడు ముహూర్తకాలం చింతించాడు. అక్కడికి వచ్చిన మునీశ్వరులు అందరూ కృష్ణునిరూపం మనస్సులో నిలుపుకొని ఆయన దివ్యావతారాలను, పవిత్ర నామాలను స్మరించుకొంటూ తమ తమ ఆశ్రమాలకు వెళ్లిపోయారు. అటుపిమ్మట ధర్మనందనుడు సోదరసమేతుడై దేవకీనందనునితో కలసి హస్తిపురికి పయనమై వెళ్లాడు. గాంధారీ ధృతరాష్ట్రులను ఒప్పించాడు. వారి అంగీకారంతో, వాసుదేవుని ఆమోదంతో తన పూర్వులు ఏలిన సామ్రాజ్యాన్ని స్వీకరించి ధర్మపరిపాలన గావించాడు. ఈ విధంగా చెప్పగా శౌనకుడు సూతమహర్షితో ఇలా అన్నాడు.

**ఆ. ధనము లపహరించి తనతోడఁ జెనకెడు, నాతతాయిజనుల నని వధించి**
**బంధు మరణ దుఃఖ భరమున ధర్మజుఁ, డెట్లు రాజ్యలక్ష్మి నిచ్చగించె. 228**

**ప్రతి :** ధనములు= తన సిరిసంపదలన్నీ; అపహరించి= ఊడబెరికి; తనతోడన్= తిరిగి తనను; చెనకెడు= ఎదిరించే; ఆతతాయి జనులన్= శస్త్రపాణులైన దాయాదులను; అనిన్= యుద్ధంలో; వధించి= చంపి; బంధుమరణ దుఃఖభరమునన్= చుట్టాలు చనిపోవడంవల్ల ఏర్పడే పెద్ద దుఃఖంతో; ధర్మజుఁడు= ధర్మరాజు; ఎట్లు= ఏ విధంగా; రాజ్యలక్ష్మిన్= రాజ్యసంపదను; ఇచ్చగించెన్= ఇష్టపడ్డాడు?

**తా :** దుర్యోధనాదులు తన సిరిసంపదలన్నీ అపహరించారు. అటుపై తనతో యుద్ధానికి సిద్ధమయ్యారు. అట్టి శస్త్రధారులైన దాయాదులనందరినీ యుద్ధంలో ధర్మజుడు మట్టుపెట్టాడు. కాని అమాయకులు ఎందరో ఆ యుద్ధంలో బలైపోయారు. సహజంగా అహింసావాది ధర్మరాజు. హింస అతనికి ఏ కోశాన రుచింపదు. అట్టివాడు బంధుమరణశోకం దిగమ్రింగి రాజ్యలక్ష్మిని స్వీకరించడం ఆశ్చర్యమే. అది ఏ విధంగా సానుకూలపడింది?

**వ. అనిన సూతుం డిట్లనియె. 229**

**ప్రతి :** అనినన్= అని ప్రశ్నింపగా, సూతుండు= సూతపౌరాణికుడు, ఇట్లు+అనియెన్= ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు.

**తా :** అని ప్రశ్నించిన శౌనకునకు సూతమునీంద్రుడు ఇలా వివరించాడు.

**క. కురుసంతతికిఁ బరీక్షి, న్నరవరు నంకురము సేసి నారాయణుఁ డీ**
**ధరణీ రాజ్యమునకు నీ, శ్వరుగా ధర్మజుని నిలిపి సంతోషించెన్. 230**

**ప్రతి :** కురుసంతతికిన్= కురువంశ సంతానానికి; పరీక్షిత్+నరవరున్= పరీక్షిత్తు అనే మానవశ్రేష్ఠుని; అంకురము+చేసి= మొలకగా నిలిపి; ఈ ధరణీరాజ్యమునకున్= ఈ భూమండల సమస్త సామ్రాజ్యానికి; ధర్మజున్= ధర్మరాజును; ఈశ్వరుగాన్= ప్రభువుగా; నిలిపి= స్థాపించి; నారాయణుఁడు= కృష్ణుడు; సంతోషించెన్= ఆనందించాడు.

**తా :** ఆనాడు ఉత్తర ప్రార్థింపగా, తన చక్రాన్ని అడ్డువేసి పరీక్షిత్తును కాపాడి పాండవ వంశాంకురాన్ని నిలిపినవాడు శ్రీకృష్ణుడు. కాబట్టి ఆయన మాట తనకు జవదాటరానిది. ఆయన ఆదేశానుసారంగా రాజ్యస్వీకరణకు అంగీకరించాడు ధర్మతనయుడు. దుఃఖాన్ని దిగమ్రింగుకొన్నాడు. ధర్మపరిపాలన కావించి ప్రజారక్షణ చేయడం తన కర్తవ్యమని భావించాడు. శ్రీకృష్ణపరమాత్మయే సమస్త సామ్రాజ్యానికి ధర్మజుని అభిషిక్తుణ్ణి కావించాడు. ఒక ధర్మమూర్తి భూమికి నాయకుడు కావడమనేది ఆయనకు పరమానందదాయకమయింది. పరమాత్మ ఆనందించడమే భక్తుని లక్షణంకదా! కాబట్టి ధర్మరాజు రాజ్యస్వీకారం చేయవలసి వచ్చింది.

**వ. ఇట్లు జగంబు పరమేశ్వరాధీనంబుగాని స్వతంత్రంబు గా దనునది మొదలగు భీష్ముని వచనంబులం, గృష్ణుని సంభాషణంబుల ధర్మనందనుండు ప్రవర్ధమాన విజ్ఞానుండును, నివర్తిత శంకాకళంకుండును నై నారాయణాశ్రయుండైన యింద్రుండునుంబోలెఁ జతుస్సాగర వేలాలంకృతంబగు వసుంధరా మండలంబు సహోదరసహాయుండై యేలుచుండె. 231**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; జగంబు= ప్రపంచం; పరమ+ఈశ్వర+అధీనంబు+కాని= ఈశ్వరుని వశమై వర్తించేదే కాని; స్వతంత్రంబుకాదు= తన అధీనంలో నడిచేది కాదు; అనునది= అనేది; మొదలగు= మున్నగు; భీష్ముని= భీష్మాచార్యుని; వచనంబులన్= ఉపదేశాలవల్ల; కృష్ణుని= శ్రీకృష్ణపరమాత్మయొక్క; సంభాషణంబులన్= ప్రబోధాలవల్ల; ధర్మనందనుండు= ధర్మపుత్రుడు; ప్రవర్ధమానవిజ్ఞానుండును= పెంపొందించుకొన్న విశేషజ్ఞానం కలవాడును; నివర్తిత= తొలగింపబడ్డ; శంకాకళంకుండునున్= సందేహమనే మాలిన్యం కలవాడును; ఐ= అయినవాడై, నారాయణ+ఆశ్రయుండు+ఐన= శ్రీమహావిష్ణువు రక్షకుడుగా కలవాడైన; ఇంద్రుండునున్+పోలెన్= దేవేంద్రునిలా; చతుః+సాగర= నాల్గు సముద్రాలయొక్క; వేలా= చెలియలికట్టచేత; అలంకృతంబు+అగు= శోభితంబైన; వసుంధరామండలంబున్= భూవలయాన్ని; సహోదర సహాయుండు+ఐ= సోదరుల సహకారం కలవాడై; ఏలుచున్+ఉండెన్= పరిపాలించసాగాడు.

**తా :** ఈ సమస్తప్రపంచం ఈశ్వరాధీనమై ప్రవర్తించేదేతప్ప, తన అధీనంలో నడిచేది కాదని ధర్మజుడు గ్రహించాడు. భీష్మాచార్యుని ఉపదేశాలవల్ల, ఆతనిలోని మానవకర్తవ్య విజ్ఞానం పెంపొందింది. శ్రీకృష్ణపరమాత్మ ప్రబోధాలవల్ల ఆతని సందేహాలన్నీ నివృత్తి పొందాయి. ఉపేంద్రుడు రక్షకుడుగా మహేంద్రుడు స్వర్గరాజ్యాన్ని పరిపాలిస్తున్నట్లే, శ్రీకృష్ణమూర్తి అండదండలతో చతుస్సముద్ర వేలావలయితంబైన భూమండలాన్ని సోదరసహకారంతో పాలించసాగాడు.

**సీ. సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండు గురియించు; నిల యెల్ల కోర్కుల నీనుచుండు**
**గోవులు వర్షించు ఘోషభూములఁ బాలు; ఫలవంతములు లతాపాదపములు;**
**పండు సస్యములు దప్పక ఋతువుల నెల్ల; ధర్మ మెల్లెడలను దనరి యుండు;**
**దైవభూతాత్మతంత్రము లగు రోగాది భయములు సెందవు ప్రజల కెందుఁ;**

**ఆ. గురుకులోత్తముండు గుంతీతనూజుండు, దానమాన ఘనుఁడు ధర్మజుండు**
**సత్యవాక్య ధనుఁడు సకల మహీరాజ్య, విభవభాజి యయిన వేళయందు. 232**

**ప్రతి :** కురుకుల+ఉత్తముండు= కురువంశశ్రేష్ఠుడును; దానమానఘనుఁడు= యాచకులకు దానములిచ్చుటయందు; ఇతరులను మన్నించుటయందు గొప్పవాడును; సత్యవాక్యధనుఁడు= సత్యవచనమే ధనముగా గలవాడును; కుంతీతనూజుండు= కుంతీదేవి కుమారుడైన; ధర్మజుండు= ధర్మసూనుడు; సకలమహీరాజ్య= సమస్త ధరణీసామ్రాజ్యంయొక్క; విభవభాజి= వైభవాన్ని పొందినవాడు; అయిన= అయి విలసిల్లిన; వేళ+అందున్= సమయంలో; సంపూర్ణ(దృ) వృష్టిన్= పుష్కలమైన వర్షాన్ని; పర్జన్యుండు= మేఘుడు; కురియించున్= కురియించాడు; ఇల= భూదేవత; ఎల్లకోర్కులన్= అన్ని కోరికలను సస్యాదిరూపంలో; ఈనుచున్+ఉండున్= ప్రసవించింది; ఘోషభూములన్= పశువులు ఉండే గోశాలలో; గోవులు= ఆవులు; పాలు= క్షీరాన్ని; వర్షించున్= వృష్టిరూపంగా ఇచ్చాయి; లతాపాదపములు= తీగలు, చెట్లు; ఫలవంతములు= పుష్పాలు, ఫలాలు కలిగి ఉన్నాయి; ఋతువులన్+ఎల్లన్= ఋతువులు అన్నింటియందు; సస్యములు= పంటలు; తప్పక= క్రమంతప్పక; పండున్= పండాయి; ఎల్ల+ఎడలను= అన్ని ప్రదేశాలలోను; ధర్మము= ధర్మం; తనరి+ఉండున్= వెల్లివిరిసింది; ఎందున్= ఎక్కడా కూడా; ప్రజలకున్= జనులకు; దైవభూత+ఆత్మతంత్రములు+అగు= ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికరూపాలైన; రోగ+ఆది+భయములు= ఆధి, వ్యాధి మున్నగు జబ్బుల బాధలు; చెందవు= బాధించలేదు.

**తా :** ధర్మరాజు కౌరవవంశంలో గొప్పవాడు. కుంతీపుత్రులలో అగ్రజుడు యాచకులకు దానమీయడంలో ఘనుడు. ఇతరులను గౌరవించడంలో సాటిలేనివాడు. సత్యమార్గ గమనం, సత్యవచన పాలనం అతనికి మూలధనాలు. అతడు రాజ్యపాలన చేసే సమయంలో భూమండలమంతా సుఖశాంతులతో విరాజిల్లింది. మేఘుడు సకాలంలో కుంభవృష్టి కురియించాడు. భూమి బంగారుపంటలను పండించి అన్ని కోరికలను తీర్చింది. గోశాలాప్రదేశాలలో నిండు పొదుగులతో ఆవులు పాలను కుండలకొద్దీ ఇచ్చాయి. లతలు చక్కగా పుష్పించాయి. వృక్షాలు సంపూర్ణంగా ఫలించాయి. ఋతుధర్మం తప్పకుండా పంటలు పండాయి. ధర్మం సర్వప్రదేశాల్లోను సర్వవిధాల వెల్లివిరిసింది. ఆధిదైవికాలు, ఆధిభౌతికాలు, ఆధ్యాత్మికాలు అయిన ఆధివ్యాధులు అడుగంటాయి. ప్రజలు ఎక్కడా ఈతిబాధలు లేక శాంతిసౌఖ్యాలతో తులతూగారు.

**విశే :** రాజు ధర్మాత్ముడై పరిపాలిస్తే, ప్రజలు సుఖసంతోషాలతో వర్ధిల్లుతారు. రాజు అధర్మాత్ముడై ప్రజాపీడనం గావిస్తే, జనులు ఈతిబాధలతో తల్లడిల్లిపోతారు. రాజు ధర్మరాజు కాన లోకులు పూర్ణకాములయ్యారు. రాజా కాలానికి కారణం అంటారు. అది ఇక్కడ నిరూపణకు వస్తున్నది.

## ✤ శ్రీకృష్ణుండు ద్వారకా నగరంబున కేగుట ✤

**వ. అంతఁ గృష్ణుండు చుట్టాలకు శోకంబు లేకుండం జేయుకొఱకును సుభద్రకుఁ బ్రియంబు సేయుకొఱకును గజపురంబునం గొన్ని నెలలుండి, ద్వారకానగరంబునకుం బ్రయాణంబు సేయం దలంచి ధర్మనందనునకుం గృతాభినందనుం డగుచు నతనిచే నాలింగితుండై యామంత్రణంబు వడసి కొందఱు దనకు నమస్కరించినం గౌఁగిలించికొని కొందఱు దనుం గౌఁగిలింప నానందించుచు రథారోహణంబు సేయు నవసరంబున సుభద్రయు ద్రౌపదియుఁ గుంతియు నుత్తరయు గాంధారియు ధృతరాష్ట్రుండును విదురుండును యుధిష్ఠిరుండును యుయుత్సుండును గృపాచార్యుండును నకులసహదేవులును వృకోదరుండును ధౌమ్యుండును సత్సంగంబువలన ముక్తదుస్సంగుండగు బుధుండు సత్కృత్కాల సంకీర్త్యమానంబై రుచికరంబగు నెవ్వని యశంబు నాకర్ణించి విడువనోపం డట్టి హరితోడి వియోగంబు**

**సహింపక దర్శన స్పర్శనాలాపశయనాసన భోజనంబులవలన నిమిషమాత్రంబును హరికి నెడ లేని వారలైన పాండవులం గూడికొని హరి మరలవలయునని కోరుచు హరి చనిన మార్గంబు సూచుచు హరివిన్యస్త చిత్తులయి లోచనంబుల బాష్పంబు లొలుక నంత నిలువంబడి రయ్యవసరంబున. 233**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; చుట్టాలకున్= బంధువులకు; శోకంబు= దుఃఖం; లేకుండన్= కల్గకుండా; చేయుకొఱకున్= చేయడానికై; సుభద్రకున్= చెల్లెలయిన సుభద్రకు; ప్రియంబు= సంతోషం; చేయుకొఱకును= చేకూర్చడానికై; గజపురంబునన్= హస్తిపురంలో; కొన్నినెలలు+ఉండి= కొంతకాలం వసించి; ద్వారకానగరంబునకున్= ద్వారకానగరానికి; ప్రయాణంబు+చేయన్= వెళ్ళడానికి; తలంచి= నిశ్చయించి; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; కృత+అభినందనుండు+అగుచున్= చేయబడిన నమస్కారం కలవాడై; అతనిచేన్= బదులుగా ధర్మపుత్రునిచే; ఆలింగితుండు+ఐ= కౌగిలింపబడినవాడై; ఆమంత్రణంబు+పడసి= సుఖంగా పోయిరమ్మనే వచనాన్ని స్వీకరించి; కొందఱు= కొంతమంది; తనకున్= తనకు పూజ్యభావంతో; నమస్కరించినన్= వందనం చేయగా; కౌఁగిలించికొని= ఆలింగనం చేసుకొని; కొందఱు= మరికొందరు; తనున్= తననే; కౌఁగిలింపన్= ఆలింగనం చేసుకొనగా; ఆనందించుచున్= సంతోషిస్తూ; రథ+ఆరోహణంబు= అరదమెక్కుట; చేయు+అవసరంబునన్= చేసేవేళలో; సుభద్రయున్= సుభద్రయు; ద్రౌపదియున్= ద్రౌపదియు; కుంతియున్= కుంతియు; ఉత్తరయున్= ఉత్తరయు; గాంధారియున్= గాంధారియు; ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్రుడును; విదురుండును= విదురుడును; యుధిష్ఠిరుండును= ధర్మరాజును; యుయుత్సుండును= యుయుత్సుడును; కృపాచార్యుండును= గురువైన కృపుడును; నకులసహదేవులును= నకులుడును, సహదేవుడును; వృకోదరుండును= భీముడును; ధౌమ్యుండును= (పురోహితుడైన) ధౌమ్యుడును (మున్నగువారు); సత్సంగంబువలనన్= సత్పురుషుల సాంగత్యంబువల్ల; ముక్తదుస్సంగుండు+అగు= విడువబడిన చెడుసావాసములు కలవాడైన; బుధుండు= విద్వాంసుడు; సకృత్+కాల= ఒకసారి అయినా; సంకీర్త్యమానంబై= కీర్తింపబడితే చాలు; రుచికరంబగు= ప్రీతికరమయిన; ఎవ్వని యశంబున్= ఎవరి కీర్తిగానాన్ని; ఆకర్ణించి= విని; విడువన్+ఓపండు= విడిచిపెట్ట సమర్థుడుకాడో; అట్టి= అటువంటి; హరితోడి= కృష్ణునితో; వియోగంబు= ఎడబాటును; సహింపక= ఓర్వలేక; దర్శన= చూచుటవల్ల; స్పర్శన= తాకుటవల్ల; ఆలాప= సంభాషణవల్ల; శయన= పరుండుటవల్ల; ఆసన= కూర్చుండుటవల్ల; భోజనంబులవలనన్= ఆహారస్వీకరణంవల్ల; నిమిషమాత్రంబును= క్షణకాలంకూడా; హరికిన్= విష్ణువుతో; ఎడలేని= వియోగంలేని; వారలు+ఐన= వారయినట్టి; పాండవులన్= పాండుపుత్రులను; కూడికొని= మరల కలిసికొనగా; హరి= కృష్ణుడు; మరలవలయును+అని= తిరిగి రావలయునని; కోరుచున్= కోరుకొంటూ; హరి+చనిన= శ్రీహరివెళ్లిన; మార్గంబు= దారిని; చూచుచున్= వీక్షిస్తూ; హరి= కృష్ణునియందు; విన్యస్త= ఉంచబడిన; చిత్తులయి= మనస్సు కలవారై; లోచనంబులన్= కన్నులనుండి; బాష్పంబులు= నీటిబిందువులు; ఒలుకన్= కారగా; అంతన్= అటుపిమ్మట (కొంచెం ఒత్తిగిలి); నిలువంబడిరి= మారుమాటాడలేక నిలుచుండిపోయారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** అటుపిమ్మట శ్రీకృష్ణుడు బంధువుల దుఃఖాన్ని తొలగించడంకోసం సుభద్రకు సంతోషాన్ని చేకూర్చడంకోసం హస్తిపురిలో కొన్నిమాసాలు ఉండిపోయి ద్వారకానగరానికి పయనమయ్యాడు. ధర్మతనయుడు పెద్దవాడు కాబట్టి పూజ్యభావంతో నమస్కరించాడు. ధర్మనందనుడు దానికి బదులుగా నందనందనుని అమందానంద కందళిత హృదయారవిందుడై కౌగిలించుకొన్నాడు. ఆతనిద్వారా సుఖంగా పోయిరమ్మనే మంగళాంగీకారాన్ని స్వీకరించాడు. ఆ సమయంలో కొందరు

తనకు భక్తిపురస్సరంగా వందనం ఆచరింపగా, పరమాత్మ వారిని కౌగిలించుకొన్నాడు. మరికొందరు పెద్దవారు నేరుగా తనను ఆలింగనం చేసుకొనగా, వారికి శుభాకాంక్షలు అందజేశాడు. అనంతరం సర్వాంగసుందరంగా అలంకరించబడ్డ రథాన్ని అధిరోహించబోయే సమయంలో ద్రౌపదీ సుభద్రలు, కుంతీగాంధారులు, ఉత్తర, విదుర ధృతరాష్ట్రులు, యుధిష్ఠిరయుయుత్సులు, కృపాచార్యుడు, భీమనకుల సహదేవులు, ధౌమ్యుడు మున్నగువారు ఆయనను అపారప్రీతి విశేషంతో వీక్షించారు. సజ్జన సాంగత్యంచేసి దుర్జనసాంగత్యం వదలిపెట్టిన బుద్ధిమంతుడు ఎవరి పవిత్రగాథలు ఒక్కమారు వింటే చాలు, మరల విడిచిపెట్టలేడో, అటువంటి శ్రీకృష్ణుని ఎడబాటు వారు సహించలేకపోయారు. నిరంతరం ఆయనను చూస్తూ, తాకుతూ, ఆయనతో సంభాషిస్తూ, ఆయనతో కలసి శయనిస్తూ, కూర్చుంటూ, భుజిస్తూ, ఒక్కక్షణంకూడ ఆయనతో వియోగాన్ని సహించలేని పాండవుల దగ్గరకు కృష్ణుడు మళ్ళీ వచ్చాడు. వారందరూ మళ్ళీ తిరిగి రావాలని ఆయనను కోరారు. అటుపిమ్మట హరి పయనమైన దిశగా దృష్టి సారించారు. ఆయనకే మనస్సు సమర్పించుకున్నారు, అనుకోకుండా వారి నయనాలలో బాష్పబిందువులు క్రమ్ముకొన్నాయి. తేరు సాగిపోతూ ఉండగా అల్లంత దూరంలో నిల్చుండిపోయారు.

**సీ. కనకసౌధములపైఁ గౌరవకాంతలు గుసుమవర్షంబులు గోరి కురియ**
**మౌక్తికదామ సమంచిత ధవళాతపత్రంబు విజయుండు పట్టుచుండ**
**నుద్ధవ సాత్యకు లుత్సాహవంతులై రత్న భూషితచామరములు వీవ**
**గగనాంతరాళంబు గప్పి కాహళభేరి పటహ శంఖాది శబ్దములు మొరయ**

**ఆ. సకలవిప్రజనులు సగుణనిర్గుణరూప, భద్రభాషణములు పలుకుచుండ**
**భువన మోహనుండు పుండరీకాక్షుండు, పుణ్యరాశి హస్తిపురము వెడలె. 234**

**ప్రతి :** కౌరవకాంతలు= కురునగరమందలి విలాసినులు; కనకసౌధములపైన్= బంగారు మేడలనుండి; కుసుమవర్షంబులు= పూలవానలు; కోరి= ప్రీతితో; కురియన్= కురియింపగా; విజయుండు= అర్జునుడు; మౌక్తికదామ= ముత్యాలదండలతో; సమంచిత= ప్రకాశించుచున్న; ధవళ= తెల్లనైన; ఆతపత్రంబున్= గొడుగును; పట్టుచుండన్= పట్టుకొనగా; ఉద్ధవసాత్యకులు= ఉద్ధవుడు, సాత్యకి; ఉత్సాహవంతులు+ఐ= మిక్కిలి ప్రీతికలవారై; రత్న= మణులచే; భూషిత= అలంకరింపబడ్డ; చామరములు= చమరీమృగముల రోమములతో చేయబడ్డ విసనకఱ్ఱలు; వీవన్= వీచుచుండగా; గగనాంతరాళంబు= భూమ్యాకాశాల మధ్యభాగంలో; కప్పి= వ్యాపించి; కాహళ= బాకాలు; భేరి= నగారాలు; పటహ= తప్పెటలు; శంఖ= శంఖములు; ఆది= మున్నగు వాద్యముల; శబ్దములు= నాదాలు; మొరయన్= మ్రోగుచుండగా; సకలవిప్రజనులు= సమస్త బ్రాహ్మణ జనములు; సగుణనిర్గుణరూప= సగుణపరబ్రహ్మమునకు, నిర్గుణ పరబ్రహ్మమునకు సరిపోవునట్టి; భద్రభాషణములు= స్వస్తి వాచకములు; పలుకుచుండన్= వచించుచుండగా; భువనమోహనుండు= జగన్మోహనుడైన; పుండరీక+అక్షుండు= పద్మనయనుడైన; పుణ్యరాశి= పుణ్యములకు నిధియైన కృష్ణుడు; హస్తిపురము= హస్తినాపురిని; వెడలెన్= దాటి వెళ్ళిపోయాడు.

**తా :** ప్రయాణ సమయంలో శ్రీకృష్ణుని వీక్షించాలని కౌరవకాంతల తహతహ. వారు బంగారు మేడలపై అధిరోహించారు. ఆ పరాత్పరుని కనులార సందర్శించి ప్రీతిదాయకంగా పుష్పవర్షం కురియించారు. విజయుడు వెనుక నిల్చున్నవాడై ముత్యాల దండలచే అలంకరించబడ్డ, రత్నదండంతో కూడుకొన్న శ్వేతచ్ఛత్రాన్ని చేతబట్టాడు. ఉద్ధవుడు, సాత్యకి పరమానందంతో కృష్ణునకు అటూ, ఇటూ నిలబడి వింజామరలు వీస్తున్నారు. మంగళసూచకంగా బాకాలు, నగారాలు, తప్పెటలు, శంఖాలు ఒక్కసారి మ్రోగి భూమ్యాకాశాల మధ్యభాగంలో వ్యాపించాయి. సమస్త బ్రాహ్మణోత్తములు సగుణ నిర్గుణ

బ్రహ్మములకు అన్వయించునట్లుగా కృష్ణునకు స్వస్తివాచకాలు పలికారు. జగన్మోహనమూర్తి, పద్మనయనుడు, సకల పుణ్యరాశి అయిన శ్రీకృష్ణదేవుడు పురజనుల పురాకృతసుకృతంలాగా భాసించి హస్తిపురవీథుల వెంట సాగిపోతున్నాడు.

**వ. తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖర భాగంబుల నిలిచి గోపాలసుందరుని సందర్శించి, వర్గంబులై మార్గంబుల రెండు దెసలం గరారవిందంబులు సాచి యొండొరులకుం జూపుచుం దమలోనం దొల్లిటం బ్రళయంబున గుణంబులం గూడక జీవులు లీనరూపంబులై యుండం బ్రపంచంబు ప్రవర్తింపని సమయంబున నొంటి దీపించు పురాణపురుషుం డితండనువారును, జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట యెట్లను వారును, జీవోపాధి భూతంబు లయిన సత్త్వాదిశక్తుల లయంబు జీవుల లయంబను వారును, గ్రమ్మఱ సృష్టికర్తయైన యప్పరమేశ్వరుండు నిజవీర్య ప్రేరితయై నిజాంశ భూతంబులైన జీవులకు మోహిని యగుచు సృష్టి సేయ నిశ్చయించి నామరూపంబులు లేని జీవులందు నామరూపంబులు గల్పించుకొఱకు, వర్తిల్లు స్వమాయ నంగీకరించు ననువారును, నిర్మలభక్తి సముత్కంఠావిశేషంబుల, నకుంఠితులై జితేంద్రియులగు విద్వాంసు లిమ్మహానుభావు నిజరూపంబు దర్శింతు రనువారును, యోగమార్గమునంగాని దర్శింపరాదను వారునునై మఱియును. 235**

**ప్రతి :** తద్+సమయంబునన్= ఆ సమయంలో; పౌరసుందరులు= ఉత్తమురాండ్రైన పట్టణ స్త్రీలు; ప్రాసాద శిఖర భాగంబులన్= మేడల పై ప్రదేశములందు; నిలిచి= నిలబడి; గోపాలసుందరునిన్= అందగాడైన గోపాలమూర్తిని; సందర్శించి= ఆలోకించి; వర్గంబులు+ఐ= రెండు తెగలై; మార్గంబుల= దారులయొక్క; రెండు దెసలన్= రెండుదిక్కులా; కరారవిందంబులు= పద్మాలవంటి చేతులను; చాచి= పొడుగుగా చాపి; ఒండొరులకున్= ఒకరికొకరు; చూపుచున్= చూపించుచు; తమలోనన్= తమతో తాము; తొల్లిటన్= పూర్వం; ప్రళయంబునన్= ప్రలయకాలంలో; గుణంబులన్= సత్త్వరజస్తమోగుణాలతో; కూడక= సంబంధంలేక; జీవులు= సమస్త జీవులు; లీనరూపంబులై= పరబ్రహ్మమునందు కలిసిపోయి; ఉండన్= ఉండగా; ప్రపంచంబు= సృష్టి; ప్రవర్తింపని= ఏర్పడని; సమయంబునన్= వేళయందు; ఒంటి= కేవలుడై; దీపించు= ప్రకాశించే; పురాణపురుషుండు= పురాతనుడైనవాడు; ఇతండు= ఈ కృష్ణుడే; అనువారును= అనువారు కొంతమంది; జీవులకున్= జీవులందరకూ; బ్రహ్మత్వంబు కలుగన్= బ్రహ్మభావం ప్రాప్తించగా; లయంబు సిద్ధించుట= లీనమైపోవడమనేది; ఎట్లు= ఎట్లు కుదురుతుంది; అనువారున్= అనువారు మరికొంతమంది; జీవ+ఉపాధిభూతంబులు+ అయిన= జీవులకు ఆధారభూతములుగానున్న; సత్త్వాదిశక్తులలయంబు= సత్త్వ రజస్తమోగుణాల కలయికే; జీవులలయంబు= జీవులకేర్పడేలయం; అనువారును= అనువారు వేరే కొంతమంది; క్రమ్మఱన్= మరల; సృష్టికర్తయైన= సృష్టికార్యం చేసేవాడయిన; ఆ+పరమేశ్వరుండు= ఆ పరమాత్మ; నిజవీర్యప్రేరిత+ఐ= తన ఆత్మశక్తిచే ప్రేరేపింపబడి; నిజాంశభూతంబులు+ఐన= తన అంశ స్వరూపాలైన; జీవులకున్= సమస్త జీవులకు; మోహిని+అగుచున్= మోహింపజేసే మాయ అగుచూ; సృష్టి+చేయన్= పుట్టించడానికై; నిశ్చయించి= సంకల్పించి; నామరూపంబులులేని= నామం; రూపంలేని; జీవులందున్= జీవులలో; నామరూపంబులు= నామం, రూపం; కల్పించుకొఱకున్= కల్పించడానికై; వర్తిల్లు= తన అధీనంలో ఉండి ప్రవర్తించే; స్వమాయన్= స్వీయమాయను; అంగీకరించున్= స్వీకరిస్తాడు; అనువారును= అనేవారు ఒక కొంతమంది; నిర్మలభక్తి= అనన్యమైన భక్తియొక్క; సముత్కంఠావిశేషంబులన్= కుంటుపడని ఉత్కంఠ యొక్క విశేష శ్రద్ధచే; అకుంఠితులై= మొక్కవోని; జితేంద్రియులగు= ఇంద్రియ నిగ్రహం కల్గిన; విద్వాంసులు= విజ్ఞానులు; ఈ+మహానుభావు= ఈ పరమాత్మయొక్క;

నిజరూపంబు= స్వస్వరూపాన్ని; దర్శింతురు= సందర్శిస్తారు; అనువారును= అనేవారు వేరే కొంతమంది; యోగమార్గంబునన్= కేవలం సమాధి యోగవిధిద్వారా; కాని= తప్ప; దర్శింపరాదు= చూచుటకు శక్యంకాదు; అనువారును= అనేవారు కొంతమంది; ఐ= అయి; మఱియును= అంతేకాక...

**తా :** గోపాల చూడామణి, పరమసుందర శిరోమణియైన కృష్ణపరమాత్మను చూచే ఉత్కంఠతో పౌరసుందరీమణులు రాజమార్గంబునకు ఇరువైపులనున్న మేడల పై భాగాలను అధిరోహించారు. వారు రెండుతెగలుగా, ఇరుదెసలా నిల్చున్నవారై, విచ్చిన పద్మాల్లాంటి అరచేతులు కల్గిన బాహువులు చాచి పరస్పరం కృష్ణుని చూపిస్తూ తమలోతాము ఇలా భాషింపసాగారు.

కొందరు "సృష్టి ప్రారంభానికి ముందు, ప్రళయ కాలాంతంలో గుణాలు క్షోభించడానికి ముందు, సామ్యస్థితిలో ఉండగా అవిశేషమైన ఆత్మ ఒకటే ఉంటుంది. అప్పుడు సత్త్వాది గుణప్రవర్తకాలైన మహదహంకారాదుల ఉత్పత్తియే ఉండదు. ప్రపంచమన్నదేలేదు. జగత్తును సృష్టించే సమస్త శక్తులు పరమాత్మలో అంతర్లీనమై ఉంటాయి. సమస్త జీవులు ఆ ఆత్మలోనే కలిసిపోతాయి. అపుడు ఆత్మస్వరూపుడైన కేవలుడొక్కడే ఉంటాడు. అతడే పురాతనుడు. అతడే పురాణ పురుషుడు. ఈ కృష్ణు డతడే" అని వచించారు.

మరికొందరు "జీవులు బ్రహ్మస్వరూపములుకదా! జీవులు బ్రహ్మముకంటె వేరైనప్పుడు కదా లీనత్వం సంభవిస్తుంది. జీవుడు బ్రహ్మమే అయినప్పుడు లీనత్వమనేది ఎలా పొసగుతుంది?" అని సందేహం వ్యక్తం చేశారు.

వేరేకొందరు "జీవులకు బ్రహ్మత్వం స్వభావసిద్ధం. కాని మాయవల్ల జీవుడు అనే పరిగణనకు సత్త్వరజస్తమోగుణాలతో సంబంధం ఏర్పడుతుంది. అప్పుడే అతడు జీవుడు అనబడుతున్నాడు. జీవోపాధి భూతాలైన సత్త్వాదిశక్తుల లయమే జీవలయం" సంశయాన్ని తొలగిస్తూ మాటాడారు.

వేరే మరికొందరు "ప్రళయాంతం అయిన పిమ్మట సృష్టిని ప్రారంభించే సమయంలో పరమాత్మ సృజనచేసే సంకల్పాన్ని పొంది తన వశంలోనున్న మాయను స్వీకరించి, నామరూపాలతో సంబంధం లేకయున్న జీవునకు నామరూపాలు కల్గింపగోరి, జీవాత్మలను మోహింపజేసే మాయను ప్రవర్తింపజేసి సృష్టిస్తాడు" అని తెలియజేశారు.

మరికొందరు "విమలమైన భక్తి, భగవంతుని దర్శించాలనే ఉత్కంఠ కలిగిన, ఇంద్రియ నిగ్రహంతో కూడుకొన్న విద్వాంసులు మాత్రమే ఈ మహానుభావుని సత్యరూపాన్ని దర్శించగలుగుతారు" అని వచించారు.

ఆ సర్వేశ్వర సాక్షాత్కారం కూడ యోగమార్గం ద్వారానే సాధ్యపడుతుందని కొందరు తెలియజేశారు.

**విశే :** ఇక్కడ కవి చమత్కారంగా సృష్టితత్త్వానికి సంబంధించిన కాపిలం, కాణాదం, యోగం, అద్వైతం మొదలైన సిద్ధాంతాలను ప్రస్తావించాడు.

**మ. రమణీ! దూరము వోయెఁ గృష్ణురథమున్; రా దింక వీక్షింప నీ**
**కమలాక్షుం బొడగానలేని దినముల్ గల్పంబులై తోఁచు; గే**
**హములం దుండఁగ నేల పోయి పరిచర్యల్ సేయుచున్ నెమ్మి నుం**
**దము రమ్మా, యనె నొక్క చంద్రముఖి కందర్పాశుగభ్రాంతయై. 236**

**ప్రతి :** ఒక్క= ఒకానొక; చంద్రముఖి= నిండు జాబిల్లివంటి మోముకల్గిన ఇంతి; కందర్ప= మన్మథునియొక్క; ఆశుగ= పూవుటమ్ములచే; భ్రాంతయై= కృష్ణ విరహానికి గురియై; రమణీ= ఓ సుందరీ!; కృష్ణురథమున్= శ్రీకృష్ణునితేరు;

దూరము+పోయెన్= కడుదవ్వుగా వెళ్లిపోయింది; ఇంకన్= ఇకపై; వీక్షింపన్‌రాదు= మన కన్నులకు కన్పించేది కాదు; ఈ కమల+అక్షున్= పద్మములవంటి కన్నులున్నవానిని; పొడగానలేని= వీక్షింపగాలేని; దినముల్= రోజులు; కల్పంబులు+ఐ= కల్పసదృశాలై; తోఁచున్= తోస్తాయి; గేహములందున్= ఈ ఇండ్లే శాశ్వతమనుకొంటూ; ఉండఁగన్+ఏల= ఇక్కడే ఉండిపోవడం ఏల?; పోయి= కృష్ణునివెంట వెళ్లి; పరిచర్యల్+చేయుచున్= ఆయనకు సపర్యలు కావిస్తూ; ఉందము= హాయిగా ఉండిపోదాము; రమ్ము+ఆ= రావే పోదాము; అనెన్= అని అంది.

**తా :** ఇంతవరకు ఆధ్యాత్మిక జ్ఞానం కల్గిన స్త్రీల వచనాలు వివరించబడ్డాయి. ఇక భక్తిభావ సంపన్నలైన ఇంతుల హృదయాలు ఆవిష్కరించబడుతున్నాయి. ఆ సమయంలో జాబిల్లివంటి నెమ్మోము కల్గిన ఒక పూఁబోడి పూవిలుకాని పూవుటమ్ములకు గురియై కృష్ణవిరహంచే పరితపించి ఇలా అంటోంది. ఓ చెలీ! శ్రీకృష్ణుని తేరు అల్లంతదూరంలో సాగిపోతోంది. ఇక ఆ అరదం మన కన్నులకు కన్పించేటట్లు లేదు. ఆ తమ్మికంటిని వీక్షింపగా లేని క్షణాలు కల్పాలుగా తోస్తాయి. ఈ ఇండ్లు మనకు శాశ్వతాలు కావు. వీటిని నమ్ముకొని ఇక్కడే ఉండిపోవడం ఎందులకు? ఆయన వెంటపోయి ఆయనకు సపర్యలందిస్తూ హాయిగా కాలం గడుపుదాము. రావే పోదాము అని వచించింది.

**విశే :** కల్పము : కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగూ కలిపితే మహాయుగం. అటువంటి మహాయుగాలు డెబ్బై యొకటి అయితే మన్వంతరం. అట్టి మన్వంతరాలు పదునాల్గయితే ఒక కల్పము.

**మ. తరుణీ! యాదవరాజు గాఁడితఁడు; వేదవ్యక్తుఁడై యొక్కఁడై**
**వరుసన్ లోకభవస్థితి ప్రళయముల్ వర్తింపఁగాఁ జేయు దు**
**స్తర లీలారతుఁడైన యీశుఁ, డితనిన్ దర్శించితిం బుణ్య భా**
**సుర నే నంచు నటించె నొక్కతె మహాశుద్ధాంతరంగంబునన్. 237**

**ప్రతి :** తరుణీ= ఓ కాంతా!; ఇతఁడు= వీడు; యాదవరాజు+కాఁడు= యదుకుల ప్రభువుకాఁడు; వేదవ్యక్తుఁడై= వేదాలచే తెలిసికోదగినవాడై; ఒక్కఁడై= కేవలుడై; వరుసన్= ఒక క్రమపద్ధతిలో; లోకభవస్థితి ప్రళయముల్= విశ్వంయొక్క పుట్టుక; పోషణ, లయం; వర్తింపఁగాన్= ప్రవర్తిల్లేలా; చేయు= చేసే; దుస్తర= తరింప (ఊహింప) శక్యంకాని; లీలారతుఁడైన= విలాసపు ఆటలో తగులంగల; ఈశుఁడు= పరమేశ్వరుడు; ఇతనిన్= ఈ దేవదేవుని; దర్శించితిన్= చూడగలిగాను; ఏన్= నేను; పుణ్యభాసురన్= అదృష్టవంతురాలను; అంచున్= అంటూ; ఒక్కతె= ఒకానొకతె; మహాశుద్ధ+అంతరంగంబునన్= అతి నిర్మలమైన మనస్సుతో; నటించెన్= ఆనందంతో ఆడింది.

**తా :** ఓ సఖీ! ఇతడు యాదవవంశ విభుడు మాత్రమేకాదు, వేదాలద్వారా తెలియబడే పరమాత్మ. సృష్టికి పూర్వం, ప్రళయానికి చివర విలసిల్లే కేవలుడు. విశ్వసృష్టి స్థితిలయాలు కల్పించే ఆదిదేవుడు. ఊహింపశక్యంకాని లీలావిలాసరతుడు. ఈయన లీలలు తెలుసుకోవడం చాలా కష్టం. నా అదృష్టవశంచే ఈ పరాత్పరుని దర్శించగలిగాను అని ఒక అంగన పవిత్ర హృదయంలో పొంగిపొరలే ఆనందంతో గంతులు వేసింది.

**విశే :** శుద్ధాంతమంటే అంతఃపురం. ఆ అంతఃపురం రంగంలో అనే మరొక అర్థాన్ని కూడా సంభావింపవచ్చు.

**క. తామసగుణు లగు రాజులు, భూమిం బ్రభవించి ప్రజలఁ బొలియింపఁగ స**
**త్త్వామలతనుఁడై యీతఁడు, భామిని! వారల వధించుఁ బ్రతికల్పమునన్. 238**

**ప్రతి :** భామిని= ఓ కాంతా!; తామసగుణులగు= తమోగుణం ప్రధానంగా కల్గిన; రాజులు= భూపాలురు; భూమిన్= ధరణిపై; ప్రభవించి= పుట్టి; ప్రజలన్= జనులను; పొలియింపఁగన్= చచ్చేటట్లు హింసించుచుండగా; సత్త్వ= వీర్యంతో కూడుకొన్న; అమల= సత్త్వగుణంతో కూడుకొన్న విమలమైన; తనుఁడై= శరీరం కలవాడై; ఈతఁడు= ఈ భగవంతుడు; ప్రతి కల్పమునన్= ప్రతియుగంలోను; వారలన్= ఆ దుష్టులను; వధించున్= సంహరిస్తాడు.

**తా :** ఓ చెలియా! యుగపరిణామంలో ఈ భూమిలో తమోగుణ ప్రధానులైన ప్రభువులు ఉద్భవించి లోకులను హింసిస్తూ ఉంటారు. ఆ సమయంలో ప్రతి యుగంలోను పరమాత్మ తనదైన శరీరంతో అవతరించి ఆ దుష్టులను వధిస్తూ ఉంటాడని మరో అంగన వచించింది.

**విశే :** "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని భగవద్గీతావచనం.

సాధువుల పరిరక్షణకోసం, పాపుల వినాశనంకోసం ధర్మాన్ని చక్కగా నెలకొల్పటంకోసం నేను ప్రతియుగంలో అవతరిస్తాను.

**వ. ఇదియునుంగాక 239**

**ప్రతి :** ఇదియునున్+కాక= ఇంతేకాక.

**తా :** ఇంతేకాకుండా.

**సీ. ఈ యుత్తమశ్లోకుఁ డెలమి జన్మింపంగ యాదవకుల మెల్ల ననఘ మయ్యె;**
**నీ పుణ్యవర్తనుఁ డేప్రొద్దు నుండంగ మధురాపురము దొడ్డ మహిమఁ గనియె**
**నీ పూరుష శ్రేష్ఠు నీక్షింప భక్తితో ద్వారకావాసులు ధన్యులైరి**
**యీ మహాబలశాలి యెఱిఁగి శిక్షింపంగ నిష్కంటకం బయ్యె నిఖిలభువన**

**తే. మీ జగన్మోహనాకృతి నిచ్చగించి పంచశర భల్ల జాల విభజ్యమాన**
**వివశ మానసమై వల్లవీసమూహ మితని యధరామృతము గ్రోలు నెల్లప్రొద్దు. 240**

**ప్రతి :** ఈ+ఉత్తమశ్లోకుఁడు= మిక్కిలి గొప్పదైన కీర్తిగల్గిన ఈ కృష్ణుడు; ఎలమిన్= ప్రీతితో; జన్మింపంగన్= అవతరించగా; యాదవకులము+ఎల్లన్= యదువంశమంతా; అనఘము+అయ్యెన్= శ్లాఘింపబడినదయింది; ఈ పుణ్యవర్తనుఁడు= పవిత్రమైన ప్రవర్తన కల్గిన ఈ వాసుదేవుడు; ఏ ప్రొద్దున్= ఎల్లకాలం; ఉండంగన్= వసింపగా; మధురాపురము= మధురానగరం; దొడ్డమహిమన్= సాటిలేని గొప్పతనాన్ని; కనియెన్= పొందినది; ఈ పూరుషశ్రేష్ఠున్= పురుషోత్తముడైన ఈ దేవకీనందనుని; భక్తితోన్= అనురక్తితో; ఈక్షింపన్= చూడడంవల్ల; ద్వారకావాసులు= ద్వారకా నగరంలో నివసించేవారు; ధన్యులు+ఐరి= ధన్యజీవులు కాగలిగారు; ఈ మహాబలశాలి= గొప్ప బలంతో విరాజిల్లే ఈ మధుసూదనుడు; ఎఱిఁగి= తప్పుడు పనులను గుర్తించి; శిక్షింపంగన్= శిక్షింపగా; నిఖిలభువనము= సమస్త ప్రపంచం; నిష్కంటకంబు+అయ్యెన్= కంటక విహీనమయింది (బాధలేక ప్రశాంతిని పొందింది); ఈ+జగత్+మోహన+ఆకృతిన్= సమస్త లోకాలను మోహింపజేసే సుందరమైన ఆకారం కల ఈ శ్రీకృష్ణమూర్తిని; ఇచ్చగించి= మదిలో కోరి; పంచశర= మన్మథునియొక్క; భల్లజాల=

బాణసమూహముచే; విభజ్యమాన= చీల్చబడుతున్న; వివశ= అధీనం తప్పిపోయిన; మానసము+ఐ= మనస్సు కల్గినదై; వల్లవీసమూహము= గోపకామినీబృందము; ఎల్లప్రొద్దున్= నిరంతరం; ఇతని= ఈ దేవదేవుని; అధర+అమృతమున్= పెదవులందలి తియ్యని తేనెను; క్రోలున్= ఆస్వాదించింది.

**తా :** ఈ పవిత్ర కీర్తనుడు జన్మించడంవల్ల యాదవవంశం వాసి గాంచింది. ఈ సత్యమార్గ ప్రవర్తకుడు నివసించడంవల్ల మధురానగరం పేరు పొందింది. ఈ పురుషోత్తముడు సదా విహరించడంవల్ల ద్వారకానగరం ధన్యమయింది. ఈ శౌర్యశాలి దురాత్మకులను శిక్షించడంవల్ల, సదాత్మకులను రక్షించడంవల్ల సమస్తవిశ్వం బాధలు లేనిదయింది. ఈ విశ్వమోహనమూర్తి సౌందర్యాన్ని వీక్షించి, అలరువిల్తుని అమ్ములు రొమ్ములు చీల్చగా, పరవశించిన హృదయాలతో వ్రేపల్లెలోని గోపకామినీ సమూహం నిరంతరం అధరామృతపానం చేసినట్లుగా ప్రేమసాగరంలో ఓలలాడింది అని ఇంకొక భామిని భాషించింది.

**విశే :** భగవంతునియందు ప్రేమభావం పెంపొందించుకోవటం ధర్మవిరుద్ధం కాదు.

**ఉ. ఈ కమలాక్షు నీ సుభగు నీ కరుణాంబుధిఁ బ్రాణనాథుఁగాఁ**
**జేకొని వేడ్కఁ గాఁపురము సేయుచు నుండెడి రుక్మిణీ ముఖా**
**నేక పతివ్రతల్ నియతి నిర్మలమానసలై జగన్నుతా**
**స్తోక విశేషతీర్థములఁ దొల్లిటి బాముల నేమి నోఁచిరో! 241**

**ప్రతి :** ఈ కమలాక్షున్= ఈ తామరపూలవంటి కన్నులు గలవానిని; ఈ సుభగున్= ఈ అందగానిని; ఈ కరుణా+అంబుధిన్= దయకు సముద్రమైన ఈతనిని; ప్రాణనాథుఁగాన్= భర్తగా; చేకొని= పొంది; వేడ్కన్= ప్రీతితో; కాఁపురము= సంసారము; చేయుచున్+ఉండెడు= కావిస్తూ ఉన్న; రుక్మిణీ= భీష్మకుని పుత్రిక; ముఖ= మున్నగు; అనేక పతివ్రతల్= పెక్కు సాధ్వీమణులు; నియతిన్= నిష్ఠతో; నిర్మలమానసలై= స్వచ్ఛమైన మనస్సు కలవారై; తొల్లిటి= పూర్వమందైన; బాములన్= జన్మలందు; జగత్+నుత= లోకంచే కొనియాడబడే; అస్తోక= ఎక్కువయైన; విశేషతీర్థములన్= గొప్ప పుణ్యతీర్థములందు; ఏమి నోఁచిరో= ఎట్టి మంచి నోములు నోచియుండిరో కదా!

**తా :** ఈ పద్మాలవంటి నేత్రాలున్న ఈతనిని, ఈ సౌభాగ్యమూర్తిని, ఈ కరుణావారాశిని భర్తగా చేపట్టి, ప్రీతితో ఆయనకు సపర్యలు చేస్తూ, సంసారం నిర్వహిస్తూ ఉండే అదృష్టం రుక్మిణి మున్నగు పతివ్రతాశిరోమణులకు చేకూరింది. వారు పూర్వజన్మలలో నిష్కళంక చిత్తాలతో ఏ పుణ్యతీర్థాలు సేవించారో కదా! ఎటువంటి మంచినోములు నోచియున్నారో కదా! అని వేరొక అంగన సంభాషించింది.

**వ. అని యిట్లు నానా విధంబులుగాఁ బలుకు పురసుందరుల వచనంబు లాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలె; ధర్మజుండును హరికి రక్షకంబులై కొలిచి నడువం జతురంగ బలంబులం బంచిన దత్సేనాసమేతులై దనతోడి వియోగంబున కోర్వక దూరంబు వెనుతగిలిన కౌరవుల మరలించి కురుజాంగల పాంచాల దేశంబులు దాటి, శూరసేన యామున భూములం గడచి బ్రహ్మావర్త, కురుక్షేత్ర, మత్స్య, సారస్వత, మరుధన్వ, సౌవీరాభీరసైంధవ విషయంబు లతిక్రమించి, తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు నానర్త**

**మండలంబు సొచ్చి పద్మబంధుండు పశ్చిమ సింధు నిమగ్నుండయిన సమయంబునఁ బరిశ్రాంతవాహుండై చనిచని. 242**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; నానావిధంబులుగాన్= పెక్కురీతులుగా; పలుకు= భాషించే; పురసుందరుల= పౌరభామినుల; వచనంబులు= వాక్యములను; ఆకర్ణించి= విని; కటాక్షించి= వారిని కనుగొనలతో చూచి; నగుచున్= నవ్వుకొంటూ; నగరంబు= హస్తిపురాన్ని; వెడలెన్= దాటిపోయాడు; ధర్మజుండును= ధర్మరాజుకూడ; హరికిన్= శ్రీకృష్ణునకు; రక్షకంబులై= అంగరక్షకులై; కొలిచి= సేవించి; నడువన్= వెంబడించడానికై; చతురంగబలంబులన్= రథ, గజ, తురగ, పదాతి సైన్యములను; పంచినన్= పంపగా; తనతోడి= తనతో; వియోగంబునకున్= ఎడబాటుకు; ఓర్వక= సహించలేక; తద్+సేనా+సమేతులై= ఆ సేనలతో కూడుకొని; దూరంబు= కడుదవ్వు; వెను+తవిలిన= వెంటవచ్చినటువంటి; కౌరవులన్= కురువంశీయులగు ధర్మజాదులను; మరలించి= వెనుకకు మళ్లించి; కురు, జాంగల, పాంచాల దేశంబులు; దాటి= నిర్గమించి, శూరసేన; యామునదేశములన్ (భూములన్)= యమునానదీ తీరప్రదేశాలను; కడచి= దాటిపోయి; బ్రహ్మావర్త; కురుక్షేత్ర; మత్స్య; సారస్వత; మరు= ఉదకంలేని దేశాలు, ధన్వ= స్వల్పంగా ఉదకం ఉన్న దేశాలు సౌవీర, ఆభీర; సైంధవ విషయంబులు= సౌవీర, ఆభీర, సైంధవ దేశాలను; అతిక్రమించి= దాటి; తద్+తద్+దేశవాసులు= ఆయా ప్రదేశాలలో నివసించేవారు; ఇచ్చిన= సమర్పించిన; కానుకలు= ఇష్టంగా సమర్పించే వస్తువులు; కైకొనుచున్= స్వీకరిస్తూ; ఆనర్తమండలంబు= ఆనర్తదేశమును; చొచ్చి= ప్రవేశించి; పద్మబంధుండు= తామరలకు హితుడైన సూర్యుడు; పశ్చిమసింధు= పడమటి సముద్రంలో; నిమగ్నుండు+అయిన= క్రుంకే; సమయంబునన్= వేళలో; పరిశ్రాంతవాహుండై= అలసిపోయిన గుఱ్ఱాలు కలవాడై; చనిచని= వెళ్లి వెళ్లి...

**తా :** ఈ విధంగా అనేక విధాలుగా భాషించే పౌరభామినుల వాక్యాలు విని, శౌరి వారిని క్రీగంటచూస్తూ, నవ్వుకొంటూ హస్తిపురాన్ని దాటిపోయాడు. ధర్మరాజు ఆయనకు రక్షణగా చతురంగ బలాలను పంపించాడు. ఆ సైన్యంతోపాటు తన ఎడబాటును ఓర్వలేక వెన్నంటి వచ్చుచున్న ధర్మతనయాదులను బుజ్జగించి వెనుకకు పంపించివేశాడు. క్రమంగా సాగిపోతూ కురు, జాంగల, పాంచాల, శూరసేన, యామునదేశ, బ్రహ్మావర్త, కురుక్షేత్ర, మత్స్య, సారస్వత, మరు, ధన్వ, సౌవీర, ఆభీర, సైంధవ దేశాలు దాటివెళ్లాడు. ఆయాదేశవాసులు ప్రీతితో సమర్పించిన కానుకలు స్వీకరించాడు. మళ్లీ ప్రయాణం సాగించి ద్వారకకు ఆనుకొనియున్న ఆనర్తమండలాన్ని చేరుకొన్నాడు. అప్పటికే సూర్యుడు అస్తమించాడు. సంధ్యాసమయమయింది. అశ్వాలా అలసిపోయి ఉన్నాయి. అల్లంతదూరంలో ద్వారకానగరం దర్శనమిచ్చింది.

## ❖ శ్రీకృష్ణుడు ద్వారకానగరంబు ప్రవేశించుట ❖

**మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్ర శృంగారకన్**
**గలహంసావృత హేమపద్మపరిఖా కాసారకన్ దోరణా**
**వళి సంఛాదిత తారకన్ దరులతా వర్గానువేలోదయ**
**త్ఫలపుష్పాంకుర కోరకన్ మణిమయ ప్రాకారకన్ ద్వారకన్. 243**

**ప్రతి :** జలజాత+అక్షుఁడు= నీటియందు పుట్టిన తామరపూలవంటి కన్నులుకల; శౌరి= శ్రీకృష్ణుడు; మహా= గొప్పవైన; సౌధ+అగ్ర= మేడలపై భాగములలో; శృంగారకన్= బంగారు కలశాలు కలిగిన, (బృందారకన్= సంచరించే దేవతలు

కలిగిన); కలహంస= రాజహంసలచేత; ఆవృత= చుట్టుకొనబడిన; హేమపద్మ= బంగారురంగు పద్మములు కల; పరిఖాకాసారకన్= అగడ్తరూపంలో మడుగు కలిగిన; తోరణ+ఆవళి= ముఖద్వార పంక్తులచే, సంఛాదిత= కప్పివేయబడ్డ; తారకన్= నక్షత్రాలు కలిగిన; తరు= చెట్లయొక్క; లతా= తీగలయొక్క; వర్గ= గుంపులతో; అనువేలా= కూడిన చెలియలికట్టలో; ఉదయత్= జనించిన; ఫల= పండ్లు; పుష్ప= పూలు; అంకుర= చిగుళ్లు; కోరకన్= మొగ్గలు కలిగిన; మణిమయప్రాకారకన్= రత్నములచే పొదుగబడిన ప్రహరీగోడ కలిగిన; ద్వారకన్= ద్వారకానగరాన్ని; డగ్గఱెన్= సమీపించాడు.

**తా :** తామరపూలవంటి కన్నులను విప్పార్చి కృష్ణుడు ద్వారకానగరాన్ని తేరిపార జూచాడు. అది సువర్ణ కలశాలతో విరాజిల్లే ఎత్తైన మేడలతో కనువిందు చేస్తోంది. నగరం చుట్టూ పెద్ద చెరువులాంటి అగడ్త. ఆ అగడ్తలో బంగారురంగు తామరపూలు. అందు కలహంసలు విహరిస్తున్నాయి. నగరంలో ఎటుచూచినా ఎత్తైన ముఖద్వారాలు. అవి చుక్కలను తాకుతున్నట్లు దర్శనమిస్తున్నాయి. పండ్లతో, పూలతో, చిగుళ్లతో, మొగ్గలతో నిండిన లతానికుంజాలు, గొప్ప వృక్షాలూ ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. నగరంచుట్టూ మణులచే చెక్కబడిన ప్రాకారం. మనోహర ద్వారతోరణాలతో ద్వారకానగరం సార్థక నామధేయమయింది.

**విశే :** ఈ పద్యమున ద్వారక శబ్దమునకు విశేషణములుగా శృంగారక, కాసారక, తారక, కోరక అను శబ్దములు ఆయా సమాసాంత ఘటితములుగా కూర్చబడి చెవులకు ఇంపు చేకూరుస్తున్నాయి.

**వ. ఇట్లు తన ప్రియపురంబు డగ్గఱి** **244**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తన ప్రియపురంబు= తనకు అత్యంత సంతోషదాయకమైన నగరాన్ని; డగ్గఱి= సమీపించి.

**తా :** ఈ విధంగా ప్రకాశించే, తనకు అత్యంత ప్రీతిదాయకమైన ద్వారకానగరాన్ని సమీపించాడు కృష్ణుడు.

**మత్త. అన్యసన్నుత సాహసుండు మురారి యొత్తె యదూత్తముల్**
**ధన్యులై వినఁ బాంచజన్యము దారితాఖిలజంతు చై**
**తన్యమున్ భువనైక మాన్యము దారుణధ్వని భీత రా**
**జన్యమున్ బరిమూర్ఛితాఖిలశత్రు దానవసైన్యమున్.** **245**

**ప్రతి :** అన్యసన్నుత= ఆత్మీయులచేతనేకాక పరులచే సైతం కొనియాడబడే; సాహసుండు= ధైర్యంకల; మురారి= మురుడనే రాక్షసునకు శత్రువైన కృష్ణుడు; దారిత= చీల్చబడిన; అఖిల= సమస్తమైన; జంతు= ప్రాణికోటియొక్క; చైతన్యమున్= తెలివి కలదియు; భువన+ఏక+మాన్యమున్= సమస్త లోకాలలో ప్రధానంగా పొగడదగినట్టిదియు; దారుణధ్వని= భయంకరమైన ధ్వనిచే; భీత= వెఱపు పొందిన; రాజన్యమున్= రాజకుమారులు కల్గినట్టిదియు; పరిమూర్ఛిత= (ఆ ధ్వనిని విన్నంతమాత్రంచేతనే) వివశత చెందింపబడిన; అఖిల= సమస్తమైన; శత్రు= పగవారైన; దానవసైన్యమున్= రాక్షసుల సేన కలదియును; (ఐన) పాంచజన్యమున్= పాంచజన్యమనే పేరు గల తన శంఖాన్ని; యదు+ఉత్తముల్= యాదవశ్రేష్ఠులు; ధన్యులు+ఐ= చరితార్థులై; వినన్= వినేలా; ఒత్తెన్= ధ్వనింపజేశాడు (మోయించాడు).

**తా :** శ్రీకృష్ణుని ధైర్యసాహసాలను ఆత్మీయులేకాక పరులుకూడ అభినందిస్తారు. మురుడనే రాక్షసుని సంహరించడం ఆయన సాహసానికి ఒక నిదర్శనం. ద్వారకానగరం సమీపిస్తూనే ఆయన పాంచజన్యాన్ని పూరించాడు. దానినుండి వచ్చే ధ్వని సమస్త ప్రాణులను నిశ్చేష్టులను చేస్తుంది. సమస్త లోకాలవారు ఆ శంఖాన్ని ప్రశంసిస్తారు. ఆ ధ్వనిని వినడంతోనే

శత్రురాజుల గుండెలు గుభేలుమంటాయి. వైరిపక్షమైన రాక్షస సైన్యమంతా మూర్ఛాగ్రస్తమవుతుంది. ఆ ధ్వనిని విని భక్తలోక శిఖామణులైన యదువంశస్థులందరూ ధన్యాత్ములౌతారు. తనపై ప్రీతి కల్గియుండే యాదవులకు సంతోషదాయకంగా కృష్ణుడు ఆ శంఖాన్ని పూరించాడు.

**పాంచజన్యము :** బలరామకృష్ణులు గురుదక్షిణ చెల్లించుటకై ప్రభాస క్షేత్రంలో సముద్ర తీరానికి వెళ్లారు. సముద్రుడు వారి ఆగమనవార్తను తెలుసుకొని ఎదురువచ్చి, గురుపుత్రుని తాను అపహరించలేదని, తన జలములలో పంచజనుడనే అసురుడు నివసించుచున్నాడని, ఆతడాపని చేసియుండవచ్చునని వచించాడు. అపుడు కృష్ణుడు పంచజనుని సంహరించి, ఆతని ఉదరములోని శంఖాన్ని గ్రహించాడు. ఈ కథ భాగవతంలోనిది.

**శా. శంఖారావము వీనులన్ విని జనుల్ స్వర్ణాంబర ద్రవ్యముల్**
**శంఖాతీతము కొంచు వచ్చిరి దిదృక్షాదర్పితోత్కంఠన**
**ప్రేంఖద్భక్తులు వంశకాహళమహా భేరీగజాశ్వావళీ**
**రింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తులై. 246**

**ప్రతి :** శంఖ+ఆరావము= పాంచజన్యశంఖ ధ్వని; వీనులన్= చెవులారా; విని= విన్నవారై; జనుల్= ద్వారకావాసులు; స్వర్ణ+అంబర+ద్రవ్యముల్= బంగారములు; అమూల్యములైన వస్త్రములు; విలువైన కానుకలు; శంఖ+అతీతము= శంఖం అనే సంఖ్యకుమించి; కొంచున్= తీసికొని; దిదృక్షా= కృష్ణుని చూడవలెననే కోరికతో; దర్పిత= పెరిగిన; ఉత్కంఠన= కుతూహలంతో; ప్రేంఖత్= పొంగిపొరలుచున్న; భక్తులు= భక్తి కలిగినవారై; వంశ= వేణువులు; కాహళ= బాకాలు; మహాభేరీ= గొప్ప నగారాలు; గజ= ఏనుగులు; అశ్వ= గుఱ్ఱములయొక్క; ఆవళీ= సమూహాల; రింఖా+ఆరావములు= కాలిగిట్టల చప్పుళ్లు; ఉల్లసిల్లన్= ఎక్కువకాగా; దనుజ+అరిన్= దానవాంతకుడైన కృష్ణుని; చూడన్= వీక్షించుటకై ఆసక్తులు+ఐ= ఆసక్తిగలవారై; వచ్చిరి= ఏతెంచిరి.

**తా :** పాంచజన్య శంఖధ్వని వినడానికి యాదవుల చెవులు అలవాటుపడినటువంటివే. ఆ రావం చెవులబడగానే ద్వారకావాసులలో ఉత్సాహం ఉరకలు వేసింది. భక్తి పరవళ్లు త్రొక్కింది. అతిశయించే ఆసక్తితో కృష్ణుని సందర్శించడానికై రాసాగారు. కొందరు వేణువులు ఆలపించారు. మరికొందరు బాకాలు ఊదారు. వేరేకొందరు పెద్ద పెద్ద నగారాలు మ్రోగించారు. కొందరు స్వాగతం పలకడానికై బారులు తీర్చేలా ఏనుగులను సిద్ధం చేశారు. మరికొందరు గుఱ్ఱాల గుంపులతో వచ్చారు. వాటి కాలిగిట్టల చప్పుళ్ళు ఒక్కమారుగా ధ్వనించాయి. యాదవులు ఉపాయనాలుగా బంగారం, అముల్యాలైన వస్త్రాలు, విలువగల వస్తువులు చేకొని గుంపులు గుంపులుగా స్వామిని వీక్షించడానికై వచ్చారు.

**విశే :** ఈ ఉపమానం వల్ల ఆయా వ్యక్తులు తెచ్చియిచ్చే కానుకలన్నీ, ఆ వాసుదేవుని అనుగ్రహం వల్ల పొందినవే అనే అర్థం ధ్వనిస్తుంది.

**క. బంధులుఁ బౌరులుఁ దెచ్చిన, గంధేభ హయాదులైన కానుకలు దయా**
**సింధుఁడు గైకొనె నంబుజ, బంధుఁడు గొను దత్త దీప పంక్తులభంగిన్. 247**

**ప్రతి :** దయాసింధుఁడు= కరుణాసముద్రుడైన కృష్ణుడు; బంధులున్= ఆత్మీయులైన చుట్టాలు; పౌరులున్= పురవాసులు; తెచ్చిన= సమర్పించిన; గంధ+ఇభ= మదించిన (పట్టపు) ఏనుగులు; హయ= ఉత్తమాశ్వాలు; ఆదులు+ఐన= మొదలైన;

కానుకలు= బహుమానాలు; అంబుజబంధుఁడు= తామరలకు ఇష్టుడైన సూర్యభగవానుడు; కొను= స్వీకరించే; దత్త= (భక్తులచే) ఈయబడిన; దీపపంక్తుల= దీపాల వరుసల; భంగిన్= వలె; కైకొనెన్= గ్రహించాడు.

**తా :** కృష్ణుడు కృపకు సముద్రం వంటివాడు. కాబట్టి ఆత్మీయులు, పురవాసులు తనకు సమర్పించిన మత్తేభాలు, ఉత్తమాశ్వాలు మున్నగు ఉపాయనాలు స్వీకరించాడు. ధనకనకవస్తు వాహనాలు ఆయనకు అన్నీ సమృద్ధిగా ఉన్నాయి. అయినా భక్తితో వారిచ్చేవి కాదనకుండా కైకొన్నాడు. సూర్యుడు కాంతిస్వరూపుడు. ఆయన నుండే అనంతకోటి దీపకాంతులు వెదజల్లబడుతూ ఉంటాయి. అయినా భక్తులు ఆరాధనలో సమర్పించే దీపపంక్తులను ఆయన గ్రహిస్తాడు. అందువల్లనే సూర్యుడు ఉపమానంగా ఇచట స్వీకరించబడ్డాడు.

**వ. ఇట్లాత్మారాముండును బూర్ణకాముండునైన యప్పరమేశ్వరునికి నుపాయనంబు లిచ్చుచు నాగరులు వికసితముఖులయి గద్గద భాషణంబులతోడ దయ్యకుండ నడపునయ్యకు నెయ్యంపుఁ జూపుల నడ్డంబు లేని బిడ్డల చందంబున మ్రొక్కి యిట్లనిరి. 248**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; ఆత్మారాముండును= తన స్వరూపమందే రమించువాడును; పూర్ణకాముండును= పరిపూర్ణములైన (పరిసమాప్తి పొందింపబడిన) కోరికలు కలవాడును; ఐన= అయినటువంటి; ఆ+పరమేశ్వరునికిన్= ఆ సర్వలోకపాలకునకు; ఉపాయనంబులు= ఉడుగరలు; ఇచ్చుచున్= చెల్లించుచూ; నాగరులు= ద్వారకానగర నివాసులు; వికసితముఖులు+అయి= వికసించిన వదనాలు కలవారవుతూ; గద్గద భాషణంబులతోడన్= బొంగురుపోయిన కంఠంతో కూడిన మాటలు కలవారై; దయ్యకుండన్= అలసిపోకుండా; నడపు+అయ్యకు= కాపాడే నల్లనయ్యకు; నెయ్యము+చూపులన్= ప్రేమతో కూడిన విలోకనాలతో; అడ్డంబులేని= ఆటంకం లేకుండా; బిడ్డలచందంబునన్= కన్నతండ్రివద్ద చేరే చిన్నపిల్లలవలె; మ్రొక్కి= నమస్కరించి; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** పరమాత్మ పూర్ణకాముడు. ఆయనకు ఏ కోరికలు ఉండవు. అటుపై ఆత్మారాముడు. బాహ్యవిషయాలపై ప్రీతి కనబరచే ప్రసక్తిలేదు. అంతేకాక పరమేశ్వరుడు. ఏ వస్తులోపం ఆయనకు ఉండదు. అయినా వారిచ్చే కానుకలు స్వీకరించాడు. ఆ కారణంచే పురవాసుల వదనారవిందాలు వికసించాయి. తమ్ము కంటికి రెప్పలాగా కాపాడే నల్లనయ్య వద్దకు చేరారు. కన్నతండ్రివద్దకు ఆప్యాయంగా చేరే చిన్నబిడ్డలలాగా ఆయన చెంత మూగారు. మాట్లాడే సమయంలో వారి కంఠాలు బొంగురుపోయాయి. అందరూ ఆయన పాదాలకు నమస్కరించి ఇలా అన్నారు.

**శా. నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా, నీ సేవ సంసార సం**
**తాపధ్వంసినియౌఁ గదా, సకలభద్రశ్రేణులం బ్రీతితో**
**నాపాదింతు గదా, ప్రపన్నులకుఁ గాలాధీశ! కాలంబు ని**
**ర్వ్యాపారంబు గదయ్య చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్. 249**

**ప్రతి :** నీ పాద+అబ్జము= నీ పద్మమువంటి పాదం; బ్రహ్మపూజ్యముకదా= పితామహునిచే పూజింపబడినటువంటిది కదా!; నీసేవ= నిన్ను సేవించడం; సంసార= సంసారంలో ఏర్పడే; సంతాప= దుఃఖాలను; ధ్వంసిని+ఔ+కదా= నాశనం చేసేది కదా!; సకల= సమస్తమైన; భద్రశ్రేణులన్= శుభపరంపరలను; ప్రీతితోన్= అనురక్తితో; ప్రపన్నులకున్= శరణు కోరి వచ్చేవారికి; ఆపాదింతు(వు)+కదా= కల్గింతువు కదా!; కాల+అధి+ఈశ= కాలమును నియమించువాడా!; కాలంబు=

అందరినీ ప్రవర్తింపజేసే కాలం; నిర్వ్యాపారంబుకద+అయ్య= నీ విషయంలో తన ప్రభావాన్ని నెఱపలేదు కదా!; నినున్= నిన్ను; వర్ణింపన్= పొగడుటకు; బ్రహ్మాదులున్= బ్రహ్మ మున్నగువారు కూడ; చాలరు= సమర్థులు కారు.

**తా :** ప్రభూ! నీ చరణారవిందాలు బ్రహ్మపూజ్యాలు. నీ పాదసేవ భవతాపాలను నశింపజేసేది. నీవు శరణుజొచ్చిన వారికి శుభపరంపరలను అనుగ్రహించే కరుణామూర్తివి. కాలస్వరూపా! నీవు కాలాన్నే నియమిస్తావు. అందరినీ కాలం నియంత్రిస్తుంది. నీవు ఆ కాలాన్నే శాసిస్తావు. బ్రహ్మాది దేవతలు అయినా నిన్ను నుతింప సమర్థులు కారు.

**విశే :** త్రివిక్రమావతార సమయంలో బ్రహ్మ విష్ణు పాదాల్ని కడిగాడని ఐతిహ్యం.

**క. ఉన్నారము సౌఖ్యంబున, విన్నారము నీ ప్రతాపవిక్రమకథలన్**
**మన్నారము ధనికులమై, కన్నారము తావకాంఘ్రి కమలములు హరీ! 250**

**ప్రతి :** హరీ= కృష్ణా!; సౌఖ్యంబునన్= క్షేమంగా; ఉన్నారము= జీవిస్తున్నాము; నీ ప్రతాపవిక్రమ కథలన్= నీయొక్క ధైర్యపరాక్రమ గాథలన్నీ; విన్నారము= వినడం జరిగింది; ధనికులము+ఐ= భాగ్యవంతులమై; మన్నారము= బ్రతుకుతున్నాము; తావక+అంఘ్రికమలములు= ఇప్పుడు నీ పదపద్మాలను; కన్నారము= దర్శిస్తున్నాము.

**తా :** కృష్ణా! నీ దయవల్ల మేము క్షేమంగా జీవిస్తున్నాము. నీ ధైర్యపరాక్రమాలను ఎప్పటికప్పుడు వింటూనే ఉన్నాము. నీ అనుగ్రహంవల్ల సిరిసంపదలతో తులతూగుతున్నాము. ఈనాటికి మళ్లీ మాకు నీ పాదపద్మాలను దర్శించే భాగ్యం చేకూరింది.

**క. ఆరాటము మది నెఱుఁగము, పోరాటము లిండ్లకడలఁ బుట్టవు పురిలోఁ**
**జోరాటన మెగయదు నీ, దూరాటన మోర్వలేము తోయజనేత్రా! 251**

**ప్రతి :** తోయజనేత్రా= పద్మాలవంటి కన్నులతో విరాజిల్లే స్వామీ!; మదిన్= మనస్సులందు; ఆరాటము= ఏ కలతను; ఎఱుఁగము= పొందలేదు; ఇండ్లకడలన్= ఇండ్లదగ్గర; పోరాటములు= జగడాలు; పుట్టవు= కలుగలేదు; పురిలోన్= నగరంలో; చోర+అటనము= దొంగల సంచారం; ఎగయదు= ఏర్పడలేదు; నీ+దూర+అటనము= ఇకపై నీవు సుదూర దేశాలకు పోవుట; ఓర్వలేము= సహించలేము.

**తా :** తామరపూలవంటి కన్నులు కలవాడా! నీ దయావిశేషంవల్ల మనస్సులలో ఏ కలతలు లేకుండా ఉన్నాము. ఇండ్లవద్ద పరస్పరం పొరుగింటి కలహాలు లేకుండా కాలం గడుపుతున్నాము. మన పట్టణంలో ఎక్కడా దొంగల సంచారం లేదు. అయినా నీవు సుదూర ప్రాంతాలకు వెళ్లిపోవడంవల్ల నీ వియోగాన్ని సహించలేకపోతున్నాము.

**ఉ. తండ్రుల కెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవు మా**
**తండ్రివి తల్లివిం బతివి దైవమవున్ సఖివిన్ గురుండ; వే**
**తండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁ జేసిరి; వేల్పు లైన నో**
**తండ్రి! భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మా విధంబునన్. 252**

**ప్రతి :** దేవ= దేవదేవా!; తండ్రులకెల్లన్= అందరి తండ్రులకు; తండ్రి+అగు= తండ్రియైన; ధాతకున్= బ్రహ్మకు; తండ్రివి= నీవు తండ్రివి; నీవు= నీవే; మాతండ్రివిన్= మాకు తండ్రివంటివాడవు; తల్లివిన్= తల్లివంటి వాడవు; పతివి= విభుడవు;

దైవమవున్= దేవుడవు; సఖివిన్= స్నేహితుడవు; గురుండవు= ఆచార్యుడవు; ఏ తండ్రులు= ఏ కన్నతండ్రులు; నీ క్రియన్= నీ విధంగా; ప్రజలన్= తమ సంతానమును; ధన్యులన్= భాగ్యవంతులుగా (కృతార్థులుగా); చేసిరి= చేశారు?; ఓ తండ్రి= ఓ జనకా!; వేల్పులు+ఐనన్= దేవతలైనా; మావిధంబునన్= మావలె; భవత్+ముఖ+అంబుజమున్= నీ వదనారవిందాన్ని; ధన్యతన్= కృతార్థతతో; కానరు= చూడలేరు.

**తా :** ఓ తండ్రీ! తండ్రులందరికీ తండ్రి అయిన బ్రహ్మదేవునికి నీవు తండ్రివి. నీవే మాకు తండ్రివంటివాడవు. తల్లివంటివాడవు. నీవే విభుడవు. దైవమవు. స్నేహితుడవు. గురుడవు. ఏ కన్నతండ్రులు నీవిధంగా తమ సంతానం అమితానందం పొందేలా ధన్యం కావించారు? దేవతలయినా మావలె నీవదనారవిందాన్ని వీక్షించి కృతార్థులు కాలేరు.

**క. చెచ్చెరఁ గరినగరికి నీ, విచ్చేసిన నిమిషమైన వేయేండ్లగు నీ**
**వెచ్చోటికి విచ్చేయక, మచ్చికతో నుండుమయ్య మా నగరమునన్. 253**

**ప్రతి :** చెచ్చెరన్= మాటిమాటికి; కరినగరికిన్= హస్తిపురానికి; నీ+విచ్చేసిన= నీవు వెళ్లియున్న; నిమిషము+ఐనన్= ప్రతిక్షణంకూడ; వేయి+ఏండ్లు+అగున్= మాకు వేయేండ్లతో సమానమవుతోంది; నీవు= ఇకపై నీవు; ఏ+చోటికిన్= ఏ ప్రదేశానికి; విచ్చేయక= వెళ్లకుండా; మా నగరమునన్= మన పట్టణంలో; మచ్చికతోన్= ప్రేమతో; ఉండుము+అయ్య= నివసించు స్వామీ!

**తా :** కృష్ణా! నీవు మాటిమాటికి గజపురికి వెళ్లియున్న ప్రతిక్షణం మాకు వేలయేండ్లతో సమానమవుతోంది. ఇకపై నీవు ఎచ్చటికి వెళ్లకుండా మన నగరమందే ప్రీతితో నివసించవలసింది.

**ఆ. అంధకారవైరి యపరాద్రి కవ్వలం, జనిన నంధమయిన జగముభంగి**
**నిన్నుఁ గానకున్న నీరజలోచన!, యంధతమసమతుల మగుదుమయ్య! 254**

**ప్రతి :** నీరజలోచన= నీటినుండి పుట్టిన పద్మములవంటి కన్నులు కలవాడా!; అంధకారవైరి= చీకటికి శత్రువగు సూర్యభగవానుడు; అపర+అద్రికిన్= పశ్చిమ పర్వతానికి; అవ్వలన్= అవతల దిక్కుకు; చనినన్= వెళ్లగా; జగము= లోకమంతా; అంధము+అయిన= గ్రుడ్డిదైపోయిన; భంగిన్= విధంగా; నిన్నున్= నిన్ను; కానక+ఉన్నన్= చూడకున్నచో; అంధతమసమతులము= కటిక చీకటిని పొందిన బుద్ధి కలవారము; అగుదుము+అయ్య= అయిపోతాము కదా!

**తా :** కృష్ణా! చీకటిని పారద్రోలే సూర్యుడు పడమటి కొండ కవ్వలి దిక్కుకు వెళ్లిపోగా, అంధకారంలో జగమంతా మున్గిపోయినట్లు, నిన్ను చూడకున్నచో మేమందరం కటిక చీకటిలో కొట్టుమిట్టాడుతుంటాము.

**విశే :** అంధశబ్దం అంధము, అంధకారము, అంధతమసము – అనే పదాలలో ప్రయుక్తమయింది.

**వ. అని యిట్లు ప్రజలాడెడి భక్తియుక్త మధుర మంజులాలాపంబులు గర్ణకలాపంబులుగా నవధరించి, కరుణావలోకనంబులు వర్షించుచు హర్షించుచుఁ దనరాక విని మహానురాగంబున సంరంభ వేగంబుల మజ్జనభోజనశయనాది కృత్యంబు లొల్లక యుగ్రసేనాక్రూర వసుదేవ బలభద్ర ప్రద్యుమ్న సాంబ చారుదేష్ణ గద ప్రముఖ యదుకుంజరులు కుంజర తురగ రథారూఢులై దిక్కుంజరసన్నిభంబయిన యొక్క కుంజరంబు ముందట నిడుకొని, సూతమాగధ నట నర్తక వందిసందోహంబుల మంగళ భాషణంబులును,**

**భూసురాశీర్వాద వేదఘోషణంబులును, వీణావేణు భేరీపటహశంఖ కాహళ ధ్వానంబులును, రథారూఢ విభూషణ భూషిత వారయువతీ గానంబులును, నసమానంబులై చెలంగ నెదురుకొని యథోచిత ప్రణామాభివాదన పరిరంభ కరస్పర్శన సంభాషణ మందహాస సందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి, వారలుం దానును భుజగేంద్ర పాలితంబైన భోగవతీనగరంబు చందంబున స్వ సమాన బల యదు భోజ దాశార్హ కుకు రాంధక వృష్ణివీరపాలితంబును, సకల కాల సంపద్యమానాంకుర పల్లవ కోరక కుట్మల కుసుమ ఫలమంజరీపుంజ భార వినమిత లతా పాదపరాజ విరాజితోద్యాన మహోవనోపవనారామ భాసితంబును, వనాంతరాళ రసాల సాల శాఖాంకుర ఖాదనక్షుణ్ణకషాయ కంఠ కలకంఠ మిథునకోలాహల ఫల రసాస్వాద పరిపూర్ణ శారికా కీరకుల కలకల కహ్లార పుష్పమకరంద పాన పరవశ భృంగభృంగీకదంబ ఝుంకారసరోవర కనకకమల మృదులకాండఖండ స్వీకారమత్త వరాటాయత్త కలహంసనివహ క్రేంకారసహితంబును, మహోన్నతసౌధజాల రంధ్ర నిర్గత కర్పూర ధూపధూమపటల సందర్శన సంజాత జలధర భ్రాంతి విభ్రాంత సముద్ధతపింఛ నర్తనప్రవర్తమాన మత్తమయూర కేకారవ మహితంబును, నానారూపతోరణధ్వజ వైజయంతికా నికాయ నిరుద్ధతారకాగ్రహప్రకాశంబును, ముక్తాఫల విరచిత రంగవల్లి కాలంకృత మందిరద్వార దేహళీవేదికా ప్రదేశంబును, ఘనసార గంధసార కస్తూరికా సంవాసిత వణిగ్గేహగేహళీ నికర కనకగళంతికా వికీర్యమాణ సలిలధారా సంసిక్తవిపణి మార్గంబును, ప్రతినివాస బహిరంగణ సమర్పిత రసాలదండ ఫలకుసుమ గంధాక్షత ధూపదీప రత్నాంబరాది వివిధోపహార వర్గంబును, ప్రవాళనీలమరకతవజ్ర వైడూర్య నిర్మిత గోపురాట్టాలకంబును, విభవనిర్జిత మహేంద్రనగరాలకంబును నైన పురవరంబుం బ్రవేశించి రాజమార్గంబున వచ్చు సమయంబున. 255**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ రీతిగా; ప్రజలు= జనులు; ఆడెడి= పలికే; భక్తియుక్త= భక్తితో కూడుకొన్న; మధుర= మనస్సునకు ఇంపైన; మంజుల= చెవులకు సొంపైన; ఆలాపంబులు= సంభాషణలు; కర్ణకలాపంబులుగాన్= శ్రవణములకు భూషణములుకాగా; అవధరించి= విని; కరుణా+అవలోకనంబులు= దయతో కూడుకొన్న చూపులు; వర్షించుచున్= కురియించుచు; హర్షించుచున్= సంతోషిస్తూ; తనరాక విని= తానువచ్చుట అనే వార్తను విన్నవారై; మహా+అనురాగంబునన్= మిక్కిలి ప్రేమతో; సంరంభవేగంబులన్= తొందరయొక్క అతిశయంతో; మజ్జన= స్నానం; భోజన= ఆహారం; శయన= నిద్ర; ఆది= మున్నగు; కృత్యంబులు= అత్యవసర కార్యములను; ఒల్లక= అంగీకరించక; ఉగ్రసేన+అక్రూర; వసుదేవ, బలభద్ర, ప్రద్యుమ్న, సాంబ, చారుధేష్ణ; గద= ఉగ్రసేనుడు; అక్రూరుడు, వసుదేవుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు, చారుధేష్ణుడు, గదుడు; ప్రముఖ= మున్నగు; యదుకుంజరులు= యాదవశ్రేష్ఠులు; కుంజరతురగరథ+ఆరూఢులు+ఐ= ఏనుగులను, గుఱ్ఱములను, రథములను అధిరోహించినవారై; దిక్+కుంజర= దిగ్గజంతో; సన్నిభంబు+అయిన= సమానమయిన; ఒక్క కుంజరంబున్= ఒక భద్రగజాన్ని; ముందటన్= ముందుభాగంలో; ఇడుకొని= నిలిపికొని; సూత= పౌరాణికులు; మాగధ= వంశమహిమలు కీర్తించువారలు; నట= నటులు; నర్తక= నాట్యము చేయువారి; వంది= సమయానికి తగినవిధంగా స్తుతి కావించువారి; సందోహంబుల= గుంపులయొక్క; మంగళ= శుభప్రదములైన; భాషణంబులును= మాటలును; భూసుర= బ్రాహ్మణులయొక్క; ఆశీర్వాద= ఆశీర్వచనపూర్వకమైన; వేదఘోషణంబులును= వేదధ్వనులును;

వీణా= వీణల; వేణు= పిల్లనగ్రోవుల; భేరీ= నగారాల; పటహ= తప్పెటల; శంఖ= శంఖముల; కాహళ= బాకాల; ధ్వానంబులును= మ్రోతలును; రథ+ఆరూఢ= తేరులను అధిరోహించిన; విభూషణ= ఆభరణాలచే, భూషిత= అలంకరింపబడ్డ; వారయువతీ= వేశ్యాస్త్రీలయొక్క; గానంబులునున్= పాటలును; అసమానంబులై= సాటిలేనివై; చెలంగన్= విజృంభింపగా; ఎదురుకొని= ఎదురేగి; యథా+ఉచిత= తగినవిధంగా; ప్రణామ= సాష్టాంగము; అభివాదన= నమస్కారము; పరిరంభ= కౌగిలింత; కరస్పర్శన= హస్తచాలనపూర్వక స్పర్శ; సంభాషణ= పలకరింపు; మందహాస సందర్శన= చిరునవ్వు కనబరచుట; ఆది= మున్నగు; విధానంబులన్= పద్ధతులతో; బహుమానంబులు+చేసి= గౌరవాదులను చెల్లించి; వారలున్= వారును; తానును= తానును; భుజగ+ఇంద్ర+పాలితంబు+ఐన= నాగరాజులచే పరిపాలింపబడే; భోగవతీనగరంబు= పాతాళలోక రాజధాని; చందంబునన్= విధంగా; స్వసమాన= తనతో సమానమైన; బల= బలరాముడు (బలసంపదకల); యదు= యదువంశస్థుల; భోజ= భోజవంశస్థుల; దాశార్హ= దశార్హ దేశస్థుల; కుకుర= కుకుర దేశస్థుల; అంధక= అంధక వంశస్థుల; వృష్ణి= వృష్ణి వంశస్థుల; వీర= వీరులచే; పాలితంబును= రక్షింపబడుచున్న; సకలకాల= అన్ని ఋతువులలోను; సంపద్యమాన= పొందబడియున్న; అంకుర= మొలకలు; పల్లవ= చిగుళ్ళు; కోరక= మొగ్గలు; కుట్మల= అరవిరి మొగ్గలు; కుసుమ= పూలు; ఫల= పండ్లు; మంజరీపుంజ= గుత్తుల గుంపులయొక్క; భార= బరువుచే; వినమిత= వంగిన; లతా= తీగలచేత; పాదపరాజ= పెద్దచెట్లచేత; విరాజిత= ప్రకాశించిన; ఉద్యాన= ఉద్యానవనములచే; మహావన= మహావనములచే; ఉపవన= ఉపవనములచే; ఆరామ= తోటలచే; భాసితంబును= విలసిల్లుచున్న; వన+అంతరాళ= వనాల నడిమి ప్రదేశాలలో; రసాలసాల= తీయమామిడి చెట్లయొక్క; శాఖా+అంకుర= కొమ్మలయందలి చిగుళ్లను; ఖాదన= తినుటచేత; క్షుణ్ణ= పూర్తిగా; కషాయ= వగరుబట్టిన; కంఠ= గొంతులుగల; కలకంఠ= కోయిలలయొక్క; మిథున= జంటలయొక్క; కోలాహల= కలకల నినాదాలతో కూడుకొన్న; ఫలరస= పండ్లయందలి రసములను; ఆస్వాద= త్రావుటచేత; పరిపూర్ణ= తృప్తి పొందిన; శారికా= గోరువంకల; కీరకుల= చిలుకల గుంపులయొక్క; కలకల= కలకల ధ్వనులతో కూడుకొన్న; కహ్లారపుష్ప= ఎఱ్ఱ కలువలందలి (తామరలందలి); మకరంద= తేనెను; పాన= త్రాగుటచే; పరవశ= ఒడలు మరచిన; భృంగ= మగతుమ్మెదల; భృంగీ= ఆడుతుమ్మెదల; కదంబ= గుంపులయొక్క; ఝంకార= ఝంకారములతో కూడుకొన్న; సరోవర= జలాశయాలలో; కనకకమల= బంగారు రంగు తామరపూలలోని; మృదులకాండ= మెత్తని తూడుల; ఖండ= తునుకలను; స్వీకార= గ్రహించుటచే (తినుటచేత); మత్త= మైమరచిన; వరాట= ఆడుహంసలకు; ఆయత్త= అధీనమైయున్న; కలహంస= రాజహంసల; నివహ= గుంపులయొక్క; క్రేంకారసహితంబును= క్రేంకార ధ్వనులతో కూడుకొన్న; మహా+ఉన్నత= మిక్కిలి ఎత్తైన; సౌధ= మేడలయొక్క; జాల= గవాక్షముల; రంధ్ర= సందులనుండి; నిర్గత= బయటకు వచ్చుచున్న; కర్పూర= కర్పూర దీపములయొక్క; ధూప= అగరు ధూపములయొక్క; ధూమ= పొగలయొక్క; పటల= గుంపులను; సందర్శన= చూచుటచే; సంజాత= పుట్టిన; జలధర= మేఘములనే; భ్రాంతి= భ్రమచే; విభ్రాంత= ఒడలు తెలియక; సముద్ధత= పైకి ఎత్తబడిన; పింఛ= పురులు కలవై; నర్తన= నాట్యమునందు; ప్రవర్తమాన= వర్తించుచున్న; మత్త= మదించిన; మయూర= నెమళ్లయొక్క; కేకారవ= కేకలతో; మహితంబును= గొప్పగా నిండియున్నటువంటి; నానారూప= అనేక విధములైన; తోరణ= మకర తోరణములయొక్క; ధ్వజ= విజయధ్వజములయొక్క; వైజయంతికా= టెక్కెములయొక్క; నికాయ= సమూహాలచే; నిరుద్ధ= అడ్డగించబడిన; తారకా= నక్షత్రములయొక్క; గ్రహ= గ్రహములయొక్క; ప్రకాశంబును= కాంతి కల్గినటువంటి; ముక్తాఫల= ముత్యాలచే; విరచిత= ఏర్పాటు చేయబడిన; రంగవల్లికా= ముగ్గులచే; అలంకృత= అలంకరింపబడిన; మందిర= భవనముల; ద్వార= ద్వారభాగాల; దేహళీ= గడపల; వేదికా= అరుగుల; ప్రదేశంబును= ప్రదేశాలు కలిగినటువంటి; ఘనసార= పచ్చకర్పూరం; గంధసార= చందనం; కస్తూరికా= కస్తూరి మున్నగువానిచే;

సంవాసిత= సువాసనలు కలదిగా నొనర్పబడిన; వణిక్= వర్తకులయొక్క; గేహ= ఇండ్లయొక్క; గేహళీ= గడపలయొక్క; నికర= సమూహములనుండి; కనక= బంగారు; గళంతికా= ధారాపాత్రలనుండి; వికీర్యమాణ= వెదజల్లబడుతున్న; సలిలధారా= నీటిధారలచేత; సంసిక్త= తడుపబడుచున్న; విపణిమార్గంబును= అంగళ్లరాజమార్గం కలిగినటువంటి; ప్రతినివాస= ప్రతి గృహంయొక్క; బహిః+అంగణ= బయటి చావడిలో; సమర్పిత= ఉంచబడిన; రసాలదండ= చెరకు గడలు; ఫల= పండ్లు, కుసుమ= పూలు; గంధ= సుగంధములు; అక్షత= మంగళాక్షతలు; ధూప= అగరుధూపములు; దీప= నానావిధ దీపాలు; రత్న+అంబర= రత్నాలు పొదిగిన పీతాంబరములు; ఆది= మొదలైన; వివిధ= పెక్కు విధములైన; ఉపహార వర్గంబును= పూజోపచారద్రవ్యాలు (పెక్కురీతుల కానుకలకు ఉపయోగించు వస్తువులు) కలిగినటువంటి; ప్రవాళ= పగడములు; నీల= ఇంద్రనీలములు; మరకత= పచ్చరాయి; వజ్ర= రత్నాలు; వైదూర్య= విదూరదేశంలో పుట్టిన రత్నాలచే; నిర్మిత= నిర్మించబడ్డ; గోపుర+అట్టాలకంబును= గోపురాలు, బురుజులు కలిగినటువంటి; విభవ= తనదైన మహావైభవంతో; నిర్జిత= జయింపబడిన; మహేంద్ర నగర= దేవేంద్రుని రాజధానియైన అమరావతి; అలకంబును= కుబేరుని రాజధానియైన అలకాపురం కలదియును; ఐన= అయినటువంటి; పురవరంబున్= నగర రాజమును; ప్రవేశించి= చొచ్చి; రాజమార్గంబునన్= మహారాజపథంలో; వచ్చు= ఏతెంచే; సమయంబునన్= వేళలో...

**తా :** కృష్ణుడు ఈ రీతిగా జనులు పలికే భక్తిప్రపత్తులతో గూడిన వచనాలు ఆలకించాడు. అవి మనస్సునకింపై, వినడానికి సొంపై, వీనులవిందు గావించాయి. పరమాత్మ ఆ పలుకులకు ఆనందించి వారిపై క్రీగంటిచూపులు ప్రసరింపజేసి దయావర్షం కురియించాడు. తన ఆగమన వార్త విన్న ద్వారకావాసుల హృదయాలలో ప్రేమ పొంగిపొరలింది. వారు కృష్ణుని చూడాలనే సంరంభంలో స్నానం, భోజనం, నిద్ర మున్నగు అత్యవసర కృత్యాలన్నీ వదలివేశారు. ఉగ్రసేనుడు, అక్రూరుడు, వసుదేవుడు, బలభద్రుడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు, చారుదేష్ణుడు, గదుడు మున్నగు యాదవశ్రేష్ఠులందరూ రథాలను, ఏనుగులను, గుఱ్ఱాలను అధిరోహించినవారై ఒక దిగ్గజం వంటి భద్రగజాన్ని ముందిడుకొని ఎదురువచ్చారు. పౌరాణికులు పురాణస్తోత్రాలను, మాగధులు వంశ కీర్తనాన్ని కావించారు. నటీనటులు విచిత్రవేషాలు అభినయించారు. నర్తకులు నాట్యం చేశారు. వందిజనాలు స్తుతి పాఠాలు కావించారు. ఎటుచూచినా మంగళదాయకాలైన వచనాలే. ఒకవైపు భూసురోత్తముల వేదాశీర్వచనాలు, మరొకవైపు వీణానాదాలు, పిల్లనగ్రోవులు, నగారాలు, తప్పెటలు, శంఖస్వనాలు, బాకాలమ్రోతలు మిన్ను మన్ను మధ్యభాగంలో వ్యాపించాయి. నానావిధాభరణాలు ధరించి వారవనితలు తేరులపైనెక్కి గానాలు కావించారు. ఈ విధమైన స్వాగతం ఆ సమయంలో కృష్ణునకు వారు అందించి సత్కరించారు. వాసుదేవుడు కూడ తగినవిధంగా వసుదేవాదులకు సాష్టాంగప్రణామాలు ఆచరించాడు. కొందరిని ఆలింగనం చేసుకొన్నాడు. మరికొందరిని హస్తస్పర్శచే గౌరవించాడు. వేరే కొందరిని పలకరించి మన్నించాడు. చిరునవ్వుతోనే కొందరిని సంతోషింపజేశాడు. భుజగశ్రేష్ఠులచే రక్షించబడుచున్న భోగవతీ నగరంలా భాసించే, తనతో సమానమైన బలసంపన్నులైన యదుభోజదాశార్హకుకురాంధకవృష్ణి వీరులచే సంరక్షించబడుతున్న ద్వారకానగరాన్ని శ్రీకృష్ణుడు ప్రవేశించాడు.

ఆ మహానగరం అన్ని ఋతువులలోనూ సమృద్ధిగా లభించే అంకురాలతో, చివుళ్లతో, మొగ్గలతో, పొదలతో, పూలతో, పండ్లగుత్తులతో నిండిన భారంతో వంగిన లతానికుంజాలతో, వృక్షరాజాలతో విలసిల్లే ఉద్యానవనాలతో, మహావనాలతో, ఉపవనాలతో, నయనాభిరామాలుగా భాసించే తోటలతో ప్రకాశమానమై ఉంటుంది. ఆ వనాల నడుమ తీయమామిడి చెట్లయొక్క క్రొత్త చిగుళ్ళను కొరకడం వలన కషాయకంఠం కల్గిన కలకంఠ మిథునాల కుహూనినాదాలు కోలాహలంగా వినవస్తూ ఉంటాయి. పరిపక్వత చెందిన పండ్లలోని రసాలను సంతృప్తిగా ఆస్వాదించిన గోరువంకల, చిలుకల కలకల ధ్వనులు శ్రవణపేయంగా వినవస్తాయి. జలాశయాల్లో కహ్లారపుష్పాలమకరందాన్ని త్రాగి మత్తెక్కిన తుమ్మెద గుంపుల

ఝుంకారధ్వనులు, సరోవరాలలో బంగారు తామరతూండ్లను తిని మైమరచిన కలహంసదంపతుల క్రేంకారధ్వనులు వీనులవిందు కావిస్తాయి. మిక్కిలి ఎత్తైన మేడల గవాక్షాలలో నుండి బయటకువచ్చే కర్పూరదీపాల, అగరుధూపాల పొగలుచూచి నీలమేఘాలని భ్రమించి పురివిప్పి నాట్యంచేసే మయూరాల కేకారవాలు వినడానికి ఇంపుగా ఉంటాయి. ఎటుచూచినా కనువిందొనరించే సుందర తోరణాలు, విజయధ్వజాలు, వైజయంతికా పంక్తులు, ఆకాశంలో నక్షత్ర గ్రహమండలాలను కప్పివేస్తూ ఉంటాయి. మందిర ద్వారాలు, గడపలు, అరుగులు ముత్యాలముగ్గులతో అలంకరింపబడి ఉంటాయి. పచ్చకర్పూరం, చందనం, కస్తూరివంటి సుగంధద్రవ్యాల పరీమళాలతో వర్తకుల గృహాలు విలసిల్లుతూ ఉంటాయి. ఆ ఇండ్లద్వార బంధాలనుండి ధారాపాత్రలనుండి వెదజల్లబడే పన్నీరుతో రాజమార్గాలు తడుపబడుతూ ఉంటాయి. ప్రతి గృహప్రాంగణంలో చెఱకు గడలు, పండ్లు, పూలు, సుగంధాలు, మంగళాక్షతలు, అగరుధూపాలు, దీపపంక్తులు, పీతాంబరాలు మున్నగు అనేకవిధాలైన వస్తువులు దర్శనమిస్తాయి. పగడాలతో, ఇంద్రనీలాలతో, మరకత వజ్రవైడూర్యమణులతో నిర్మించబడ్డ గోపురాలు, బురుజులు, చంద్రశాలలు అంతటా కానవస్తాయి. ఆ నగరం తన మహావైభవంతో దేవేంద్రుని అమరావతీ పట్టణాన్ని, కుబేరుని అలకాపురిని తిరస్కరిస్తున్నట్లు కనిపిస్తుంది. అటువంటి ద్వారకానగరంలో వాసుదేవుడు రాజమార్గంగుండా వస్తున్నాడు.

**విశే :** సూతాః పౌరాణికాః ప్రోక్తాః మాగధా వంశశంసకాః,
వందినస్త్వమల ప్రజ్ఞాః ప్రస్తావ సదృశోక్తయః.

సూతులు పురాణ కథలను చక్కగా చెప్పేవారు. మాగధులు వంశం గొప్పతనాన్ని కీర్తిస్తూ ఉంటారు. వందులు స్వచ్ఛమైన ప్రజ్ఞ కలవారై సమయోచితమైన మాటలతో కీర్తిగానం చేస్తూ ఉంటారు.

**మత్త. కన్నులారఁగ నిత్యమున్ హరిఁ గాంచుచున్ మనువారల**
**య్యు న్నవీన కుతూహలోత్సవయుక్తి నాగర కాంత ల**
**త్యున్నతోన్నత హర్మ్యరేఖల నుండి చూచిరి నిక్కి చే**
**సన్నలం దమలోనఁ దద్విభుసౌకుమార్యము సూపుచున్. 256**

**ప్రతి :** కన్నులు+ఆరఁగన్= కన్నులు నిండేటట్లుగా; నిత్యమున్= నిరంతరం; హరిన్= కృష్ణుని; కాంచుచున్= చూస్తూ; మనువారలు+అయ్యున్= జీవించేవారయినా; నవీన= కొంగ్రొత్తదైన; కుతూహల= కోరికతోకూడిన; ఉత్సవ= పండుగ; యుక్తిన్= విధంగా; నాగరకాంతలు= నగరంలోని స్త్రీలు; అతి+ఉన్నత= మిక్కిలి ఎత్తయిన; ఉన్నత హర్మ్యరేఖల నుండి= మేడలయొక్క పైభాగములనుండి; నిక్కి= నిటారుగా నిలబడి; చేసన్నలన్= చేతి సంజ్ఞలతో; తమలోనన్= తమలో తాము; తద్+విభు= ఆ ప్రభువుయొక్క; సౌకుమార్యము= లావణ్యాన్ని; చూపుచున్= ఇతరులకు చూపిస్తూ; చూచిరి= వీక్షించారు.

**తా :** ఆ పట్టణంలోని నగరకాంతలు నిరంతరం నయనపర్వంగా కృష్ణుని చూచేవారయినా, వారికి తృప్తి కలుగలేదు. కొంగ్రొత్త కోరికతో పండుగ జరుపుకొనే విధంగా, అందరూ ఎత్తయిన మేడలు అధిరోహించారు. వాటి పైభాగంలో నిటారుగా నిలబడ్డారు. చేతి సంజ్ఞలతో తమలోతాము చూపుకొంటూ కృష్ణుని సోయగాన్ని వీక్షించసాగారు.

**విశే :** పండుగలు నిత్యం వచ్చేవయినా, అవి ఎప్పుడూ కొత్తదనాన్ని నింపేవే. అట్లే కృష్ణుని ఎప్పుడూ వారు చూచేవారయినా, ఆయనలో కొంగొత్తదనం కానుపిస్తుందని వారి భావన.

**సీ. కలుముల నీనెడు కలకంఠి యెలనాఁగ వర్తించు నెవ్వాని వక్షమందు**
**జనదృక్చకోరకసంఘంబునకు సుధా పానీయపాత్రమే భవ్యముఖము**
**సకలదిక్పాలక సమితికి నెవ్వాని బాహుదండంబులు పట్టుఁగొమ్మ**
**లాశ్రితశ్రేణి కే యధిపుని పాదరాజీవ యుగ్మంబులు చేరుగడలు**

**ఆ. భువనమోహనుండు పురుషభూషణుఁ, డెవ్వఁ డట్టి కృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర**
**రాజమాన లగుచు రాజమార్గంబున, రాజముఖులు గుసుమరాజిఁ గురియ. 257**

**ప్రతి :** ఏ+వాని= ఎవ్వనియొక్క; వక్షమందున్= ఎదపై; కలుములన్= సంపదలను; ఈనెడు= ప్రసవించే (ఇచ్చే); కలకంఠి= అవ్యక్తమధురమైన కంఠధ్వనికల; ఎలనాఁగ= స్త్రీ రత్నమయిన లక్ష్మీదేవి; వర్తించున్= వసించి భాసించునో; ఏ భవ్యముఖము= ఏ మహాత్మునియొక్క పవిత్రవదనం; జనదృక్= లోకుల చూపులనే; చకోరక సంఘంబునకున్= చకోర పక్షుల సముదాయానికి; సుధాపానీయపాత్రము= అమృతపానం చేయడానికి వీలైన పాత్రమయిన చంద్రబింబమో; ఎవ్వాని= ఎవనియొక్క; బాహుదండములు= దండములవంటి పొడవైన బాహువులు; సకల= సమస్తమైన; దిక్పాలక= దిక్పాలకులయొక్క; సమితికిన్= సమూహానికి; పట్టు+కొమ్మలు= ఆశ్రయించే సాధనములో; ఏ+అధిపుని= ఏ ఈశ్వరుని; పాదరాజీవ యుగ్మంబులు= పాదపద్మాలు; ఆశ్రితశ్రేణికిన్= ఆపన్నులైన భక్తబృందాలకు; చేరుగడలు= శరణములో; ఎవ్వఁడు= ఎవడు; భువనమోహనుండు= జగన్మోహనుడో; పురుషభూషణుఁడు= పురుషోత్తముడో; అట్టి= అటువంటి; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; రాజమార్గంబునన్= చతురంగ బలాలు నడిచే ఘంటాపథంలో; రాజముఖులు= చంద్రబింబంవంటి ముఖం కల్గిన నగరకాంతలు; హర్మ్యశిఖరరాజమానలు+అగుచున్= సౌధాగ్రాలపై ప్రకాశిస్తున్నవారై; కుసుమరాజిన్= పుష్పవృష్టిని; కురియన్= కురియించగా; అరిగెన్= వెళ్లాడు.

**తా :** ఏ మహావిష్ణువు ఎదపై సిరిసంపదలు వర్షించే నారీరత్నమైన లక్ష్మీదేవి స్థిరనివాసం ఏర్పరచుకొందో, ఏ మహానుభావుని పవిత్రవదనం చూచేవారి చూపులనే చకోరపక్షులకు అమృతపానం చేయడానికి వీలైన చంద్రబింబమో, సమస్త దిక్పాలురకు ఏ పరమేశ్వరుని బాహుదండాలు పట్టుకొమ్మలవుతాయో, సకల భక్తబృందాలకు ఏ పుణ్యపురుషుని పాదపద్మాలే శరణ్యాలో, ఎవడు ఈ సమస్తలోకాలలో మోహనరూపుడో, అట్టి పురుషోత్తముడు రాజమార్గంలో, కొందరు చంద్రవదనలు సౌధాగ్రాలపై విలసిల్లి పుష్పవృష్టి కురియించగా, సాగిపోయాడు.

**ఉ. జలజాతాక్షుఁడు సూడ నొప్పె ధవళచ్ఛత్రంబుతోఁ జామరం**
**బులతోఁ బుష్ప పిశంగచేలములతో భూషామణి స్ఫీతుఁడై**
**నలినీబాంధవుతో శశిధ్వజముతో నక్షత్రసంఘంబుతో**
**బలభిచ్చాపముతోఁ దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్. 258**

**ప్రతి :** జలజాత+అక్షుఁడు= తామరపూలవంటి నయనాలు కల్గిన శ్రీకృష్ణుడు; ధవళ+ఛత్రంబుతోన్= తెల్లని గొడుగుతోను; చామరంబులతోన్= వింజామరలతోను; పుష్పపిశంగచేలములతోన్= పూలతోనిండిన పచ్చని బట్టలతోను; భూషామణిస్ఫీతుఁడై= ఆభరణములందలి రత్నములచే ఎక్కువగా ప్రకాశించుచున్నవాడై; నలినీబాంధవుతోన్= తామరలకు బంధువైన సూర్యునితోను; శశిధ్వజముతోన్= చంద్రపతాకతో; (శశిద్వయముతోన్= ఇద్దరు చంద్రులతో); నక్షత్ర సంఘంబుతోన్= తారా సమూహాలతో;

బలభిత్+చాపముతోన్= ఇంద్రధనుస్సుతో; తటిత్+లతికతోన్= మెఱపు తీగతోను; భాసిల్లు= విలసిల్లు; మేఘ+ఆకృతిన్= నీలమేఘంలాగా; చూడన్+ఒప్పెన్= దర్శనీయుడయ్యాడు.

**తా :** శిరస్సుపైన శ్వేతచ్ఛత్రం, ఇరువైపులా వింజామరలు, శరీరంపై వర్షింపబడిన పూలతో నిండిన పట్టువస్త్రం. కంఠంలో రత్నాభరణాలు – వీటితోకూడియున్న పద్మాక్షుడైన కృష్ణుడు సూర్యబింబంతోను, చంద్రమండల ద్వయంతోను, నక్షత్ర సమూహంతోనున్న ఇంద్రధనుస్సుతోను, మెఱపుతీగతోను భాసిల్లే నీలమేఘంలా విలసిల్లాడు.

**వ. ఇట్లరిగి తల్లిదండ్రుల నివాసంబు సొచ్చి దేవకీ ప్రముఖులయిన తల్లుల కేడ్వురకు మ్రొక్కిన. 259**

**ప్రతి :** ఇట్లు+అరిగి= ఈ విధంగా వెళ్లి; తల్లిదండ్రుల= జననీజనకుల; నివాసంబు+చొచ్చి= ఆవాసంలో ప్రవేశించి; దేవకీప్రముఖులు+అయిన= దేవకి మొదలైన; తల్లులకున్= తల్లులైన; ఏడ్గురకున్= ఏడుగురికి; మ్రొక్కినన్= నమస్కరించగా.

**తా :** శ్రీకృష్ణుడు జననీజనకుల మందిరానికి చేరాడు. దేవకి మున్నగు ఏడ్గురు తల్లులకు నమస్కరించాడు. వసుదేవుడు వృకదేవ, ఉపదేవ, దేవరక్షిత, శ్రీదేవ, శాంతిదేవ, సహదేవ, దేవకి అనే ఏడుగురిని వివాహమాడాడని విష్ణుపురాణ వచనం.

**క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకముల నునిచి చన్నుల తుదిఁ బా**
**లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా! 260**

**ప్రతి :** అనఘా= పుణ్యాత్ముడా!; బిడ్డఁడు= కొడుకు; మ్రొక్కినన్= నమస్కరింపగా; తల్లులు= వసుదేవుని భార్యలైన ఆ తల్లులేడుగురు; జడ్డనన్= తటాలున; అంకములన్+ఉనిచి= ఒడికి చేరదీసుకొని; చన్నులతుదిన్= స్తనాగ్రములలో; పాలు+ఒడ్డగిలన్= పాలు జనించినట్లుకాగా; ప్రేమభరమునన్= వాత్సల్యాతిరేకంతో; అక్షిజలములన్= ఆనందబాష్పాలతో; జడ్డుపడన్= ప్రీతి ఎక్కువకాగా; తడిపిరి= తడియునట్లు చేశారు.

**తా :** పరీక్షిన్మహారాజా! (శౌనక మునీంద్రా!) కొడుకావిధంగా నమస్కరించగా, దేవకి మున్నగువారు తటాలున ఆయనను ఒడిలోనికి తీసుకొన్నారు. పుత్రవాత్సల్యంతో వారి చన్నులలో పాలు స్రవించినట్లయింది. కుమారునిపై ప్రేమతో ఆనందబాష్పాలు చిందించారు.

**విశే :** దేవకి కన్నతల్లి కావున ఆమె చన్నులపాలు చిందుట సహజమే. కాని వసుదేవుని భార్యలందరికి అదే భావం కలిగింది. దీనినిబట్టి కృష్ణునకు వారిపై గల మాతృప్రేమ, ఆ తల్లులకు కృష్ణునిపై గల పుత్రవాత్సల్యం అభివ్యక్తమవుతోంది.

## ❖ శ్రీకృష్ణుఁ డంతఃపురకాంతలం జూడఁ బోవుట ❖

**వ. తదనంతరంబ యష్టోత్తరశతషోడశ సహస్ర సౌధకాంతంబయిన శుద్ధాంతభవనంబు సొచ్చి హరి దన మనంబున– 261**

**ప్రతి :** తదనంతరంబు+అ= అటుపిమ్మట; అష్టోత్తరశతషోడశసహస్ర= ఎన్మిదికిపైగానున్న నూరు; పదహారువేలయిన (16108); సౌవర్ణసౌధ= బంగారు మేడలచే; కాంతంబు+అయిన= మనోహరమయిన; శుద్ధాంతభవనంబు= అంతఃపుర మందిరం; చొచ్చి= ప్రవేశించి; హరి= కృష్ణుడు; తనమనంబునన్= తన భావంలో.

**తా :** అటుతర్వాత పదునారువేల నూట ఎనిమిది బంగారురంగు మేడలతో కూడుకొన్న ప్రాసాదాంతఃపురం ప్రవేశించి కృష్ణుడు ఇలా అనుకొన్నాడు.

**విశే :** శ్రీకృష్ణునకు 16108 భార్యలు. అందు ఎనమండుగురు పట్టపురాణులు. మిగిలిన 16100 మంది రాజకన్యలు. కృష్ణుడు నరకాసురుని సంహరించి వారిని వివాహమాడాడు. వారందరివీ వేరువేరు ప్రాసాదాలు. అవి సువర్ణమయాలు.

**మ. ఒక భామా భవనంబు మున్ను సొర వేఱొక్కర్తు లోఁగుందునో**
**సుకరాలాపము లాడదో, సొలయునో, సుప్రీతి నీక్షింపదో,**
**వికలత్వంబున నుండునో యనుచు న వ్వేళన్ వధూగేహముల్**
**ప్రకటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁడై భార్గవా! 262**

**ప్రతి :** భార్గవా= భృగువంశంలో జన్మించిన శౌనకా!; ఒక భామాభవనంబున్= ఒక దేవీమందిరాన్ని; మున్ను= ముందుగా; చొరన్= ప్రవేశించినచో; వేఱు+ఒక్కర్తు= మరొక్కసుందరి; లోన్+కుందునో= లోలోపల దుఃఖిస్తుందేమో!; సుకర+ఆలాపములు= సరసవచనాలను, ఆడదో= మాట్లాడదేమో!; సొలయునో= విరసత్వాన్ని పొందుతుందేమో!; సుప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; ఈక్షింపదో= చూడదేమో!; వికలత్వంబునన్= కళావిహీనంగా అందం కానరాకుండగా; ఉండునో= ఉండిపోతుందేమో!; అనుచున్= అనుకొంటూ; ఆ+వేళన్= ఆ సమయంలో; బహురూపవ్యక్తుఁడై= పెక్కురూపములుగా కన్పడుతున్నవాడై; వధూగేహముల్= ఆ కాంతల సౌధములను; ప్రకట+ఆశ్చర్యవిభూతిన్= స్పష్టమైన అద్భుత వైభవంతో; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తా :** శౌనకమునీంద్రా! ముందుగా ఒక దేవీమందిరంలో ప్రవేశిస్తే, మరొక్క సతీమణి కుందుతుందేమో! మరల నేను ఆ సుందరి అంతఃపురంలోకి వెళ్లే సమయంలో నాతో సరసాలాపాలు పల్కునో, పల్కదో! తాను విరసురాలై వ్యథ చెందుతుందేమో! నన్ను ప్రేమతో వీక్షిస్తుందో, వీక్షించదో! కళావిహీనురాలై అందం కానరాకుండగా ఉండిపోతుందేమో! అని భావిస్తూ ఆ సమయంలో తన యోగశక్తితో పెక్కురూపములుగా కన్పడుతున్నవాడై కృష్ణుడు అందరి మందిరాలలో ఒకేసారి ప్రవేశించాడు.

**విశే :** భగవద్గీతలో పదో అధ్యాయంలో విభూతియోగంలో పరమాత్మ వివిధ విభూతులు భిన్న భిన్నరూపాలలో చెప్పబడ్డాయి. కాని ఒకేవ్యక్తి అదేరూపంలో పెక్కుమందిగా భాసిల్లడమనేది ఆశ్చర్య విభూతి. అది ఇందు వివరించబడింది. బ్రహ్మసూత్రాలలో దేవతాధికరణంలో ఒక వ్యక్తి యోగశక్తితో నానారూపాలుగా మారవచ్చని తెలియజేయబడింది.

**వ. ఆ సమయంబున 263**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ వేళలో.

**తా :** కృష్ణు డావిధంగా అందరి అంతఃపురాలలో ప్రవేశించే సమయంలో.

**క. శిశువులఁ జంకల నిడి తను, కృశతలు విరహాగ్నిఁ దెలుప గృహగేహళులన్**
**రశనలు జాఱఁగ సిగ్గున, శశిముఖు లెదురేగి రపుడు జలజాక్షునకున్. 264**

**ప్రతి :** గృహగేహళులన్= ఇంటిగడపలలో; శిశువులన్= చంటిబిడ్డలను; చంకలన్+ఇడి= చంకలలో నెత్తుకొని; తనుకృశతలు= శరీరాలు చిక్కిపోవటాలు; విరహ+అగ్నిన్= ఎడబాటు వలని తాపాన్ని; తెలుపన్= తెలియజేయగా; సిగ్గునన్= లజ్జతో;

రశనలు= మొలనూళ్లు; జాఱఁగన్= జారిపోతుండగా; శశిముఖులు= చంద్రబింబంవంటి ముఖం కల సతీమణులు; అపుడు= ఆ సమయంలో; జలజ+అక్షునకున్= తామరపూలవంటి కన్నులుగల కృష్ణునకు; ఎదురు+ఏగిరి= ఎదురువెళ్లిరి.

**తా :** తామరపూలవంటి నేత్రాలు విప్పారజేసి వీక్షిస్తూ కృష్ణుడు అంతఃపుర గృహాల్లో అడుగుపెట్టాడు. ఆయన ద్వారంవద్ద కనబడ్డాడో, లేదో వారందరూ చంటిబిడ్డలను చంకలకెత్తుకొని ఎదురువెళ్లారు. కృష్ణవిరహంతో వారి శరీరాలు శుష్కించి ఉన్నాయి. సిగ్గుతో దిగ్గనలేచి తమ మొలనూళ్ళు జారిపోతూ ఉండగా ఎదురువెళ్లారు.

**విశే :** సంతానవతులైన స్త్రీలు పిల్లల్ని చంకనెత్తుకొని భర్తకెదురువెళ్లి స్వాగతం సత్కారం జరపడం సనాతన సంప్రదాయం.

**మ. పతి నాయింటికి మున్ను వచ్చె, నిదె నా ప్రాణేశుఁ డస్మద్గృహా**
**గతుఁడయ్యెన్ మును సేరెఁబో తొలుత మత్కాంతుండు నాశాలకే**
**నితరాలభ్య సుఖంబు గంటి నని తా రింటింట నర్చించి ర**
**య్యతివల్ నూఱుఁ బదాఱు వేలు నెనమంద్రవ్వేళ నాత్మేశ్వరున్. 265**

**ప్రతి :** పతి= నా భర్త; నా+ఇంటికిన్= నా ఇంటికే; మున్ను= మొదటగా; వచ్చెన్= వచ్చినాడు; నా ప్రాణ+ఈశుఁడు= నా ప్రాణేశ్వరుడు; ఇదె= ఇదిగో; మును= ముందుగా; అస్మత్= మా(నా)యొక్క; గృహ+ఆగతుఁడు+అయ్యెన్= ఇంటికే వచ్చిన వాడైనాడు; నా శాలకున్= నా మందిరానికే; మత్+కాంతుండు= నా ప్రియుడు; తొలుతన్= మొట్టమొదటగా; చేరెన్+పో= చేరినాడు; ఏన్= నేను; ఇతర= ఇతర కాంతలచే; అలభ్య= పొందరాని; సుఖంబు= ఆనందాన్ని; కంటిని= పొందాను; అని= అనుకొంటూ; తారు= వారు; ఇంటన్+ఇంటన్= ప్రతి గృహమునందును; నూఱున్+పదాఱువేలున్+ ఎనమంద్రు= పదహారువేల నూటయెనిమిది మంది; ఆ+అతివల్= ఆ కాంతలు; ఆత్మేశ్వరున్= తమ ప్రాణనాథుని; ఆ+వేళన్= ఆ సమయంలో; అర్చించిరి= పూజించారు.

**తా :** కృష్ణుడు యోగశక్తిచే అందరి ఇండ్లకు ఒకేసారి ప్రవేశించగా “నా భర్త నా ఇంటికే ముందుగా వచ్చాడు. నా ప్రాణేశ్వరుడు ఇదిగో నా ప్రాంగణంలోనే అడుగుపెట్టాడు. నా ప్రియుడు నా మందిరానికే తొలుతగా చేరాడు. నేనే ఇతర కాంతలు పొందలేని భర్తృసుఖం పొందగలిగాను” అని భావిస్తూ ఆ పదహారు వేల నూట ఎనిమిదిమంది అంగనలు తమ ప్రాణనాథుని సముచితరీతిని అర్చించారు.

**వ. వారలం జూచి హరి యిట్లనియె. 266**

**ప్రతి :** వారలన్= ఆ అంతఃపురాంగనలను; చూచి= వీక్షించి; హరి= కృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** కృష్ణుడు అంతఃపుర కాంతలను విలోకించి ఇలా అన్నాడు.

**మ. కొడుకుల్ భక్తి విధేయు లౌదురు గదా? కోడండ్రు మీ వాక్యముల్**
**గడవంజాలక యుందురా? విబుధసత్కారంబు గావింతురా?**
**తొడవుల్ వస్త్రములుం బదార్థరస సందోహంబులుం జాలునా?**
**కడమల్ గావు గదా, భవన్నిలయముల్ గల్యాణయుక్తంబులే! 267**

**ప్రతి :** కొడుకుల్= కుమారులు; భక్తివిధేయులు= భక్తితో మీ మాటలకు లోబడియుండేవారు; ఔదురు+కదా= అయి ఉన్నారా?; కోడండ్రు= కోడళ్లు; మీ వాక్యముల్= మీ మాటలను; కడవన్+చాలక= జవదాటక; ఉందురా= ప్రవర్తిస్తున్నారా?; విబుధ= పండితులకు; సత్కారంబు= సన్మానము; కావింతురా= చేస్తున్నారా?; తొడవుల్= ఆభరణాలు; వస్త్రములున్= చీరలు; పదార్థ= సమస్త వస్తువులయొక్క; రస= మధురరసాలయొక్క; సందోహంబులున్= సమృద్ధులు; చాలునా= సరిపోతున్నాయా?; కడమల్= లోటుపాటులు; కావు+కదా= లేవుకదా?; భవత్+నిలయముల్= మీ మందిరాలు; కల్యాణయుక్తంబులే= శుభంతో కూడినవై ఉన్నవా?

**తా :** మీ కొడుకులు వినయం, విధేయత మీపట్ల చూపుతున్నారా? కోడండ్రు మీ మాటలు జవదాటక ప్రవర్తిస్తున్నారా? ఇంటికివచ్చిన పండిత ప్రవరులను మీరు సత్కరిస్తున్నారా? నగలు, చీరలు, ఇతర వస్తువులు, ఆహార పదార్థాలు, మధురరసాలు సమృద్ధిగా లభిస్తున్నాయా? ఎక్కడా ఏ లోటుపాటులు లేవు కదా! మీ మందిరాలు మంగళనిలయాలే కదా?

**సీ. తిలక మేటికి లేదు తిలకినీతిలకమ? పువ్వులు దుఱుమవా పువ్వుఁబోఁడి?**
**కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి? తొడవులు దొడువవా తొడవుతొడవ?**
**కలహంసఁ బెంపుదే కలహంసగామిని? కీరముఁ జదివింతె కీరవాణి?**
**లతలఁ బోషింతువా లతికాలలితదేహ? సరసి నోలాడుదే సరసిజాక్షి?**

**ఆ. మృగికి మేఁత లిడుదె మృగశాబలోచన? గురుల నాదరింతె గురువివేక?**
**బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి? యనుచు సతుల నడిగె నచ్యుతుండు. 268**

**ప్రతి :** తిలకినీతిలకమ= తిలకమును ధరించు పుణ్యస్త్రీలలో శ్రేష్ఠురాలా!; తిలకము= నుదుట తిలకం; ఏటికిన్= ఏ కారణంచే; లేదు= దిద్దుకోలేదేమి?; పువ్వుఁబోఁడి= పూవువలె సుకుమారమైన మేను కలదానా!; పువ్వులు= కొప్పులో పూలు; తుఱుమవా= తురుముకోలేదేమి?; కస్తూరికాగంధి= కస్తూరివంటి మేని సువాసన గలదానా!; కస్తూరి= శరీరంపై కస్తూరిని; అలఁదవా= పూసుకోలేదేమి?; తొడవుతొడవు+అ= సొమ్ములకు సొమ్మువంటిదానా!; తొడవులు= ఆభరణాలు; తొడువవా= ధరించలేదేమి?; కలహంసగామిని= రాజహంసయొక్క నడకవంటి నడకకలదానా!; కలహంసన్= కలహంసను; పెంపుదు+ఏ= పెంచుతున్నావా?; కీరవాణి= చిలుక పలుకులవంటి పలుకులు కలదానా!; కీరమున్= చిలుకను; చదివింతె= పలుకులు నేర్పుతున్నావా?; లతికాలలితదేహ= తీగతో సమానమైన మనోహరమైన దేహంకలదానా!; లతలన్= తీగలను; పోషింతువా= ప్రాకులకు కూర్చుతూ పెంచుతున్నావా?; సరసిజాక్షి= తామరలవంటి కన్నులు కలదానా!; సరసిన్= సరస్సులో; ఓలాడుదు+ఏ= జలకాలాడుతున్నావా?; మృగశాబలోచన= లేడిపిల్లయొక్క కన్నులవంటి కన్నులు కలదానా!; మృగికిన్= లేడికి; మేఁతలు= మేత; ఇడుదు+ఎ= వేయుచున్నావా?; గురువివేక= గొప్పజ్ఞానం కలదానా!; గురులన్= పెద్దలను; ఆదరింతు+ఎ= గౌరవించుచున్నావా?; బంధుచింతామణి= బంధువుల కోర్కెలు తీర్చు చింతామణి రత్నము వంటిదానా!; బంధుజనులన్= బంధువులను; ప్రోతు+ఎ= ఆదరించుచున్నావా?; అనుచున్= అంటూ; అచ్యుతుండు= కృష్ణుడు; సతులన్= భార్యలను; అడిగెన్= సరసాలాడుతూ ప్రశ్నించాడు.

**తా :** కాంతాతిలకమా! నుదుట తిలకం దిద్దుకోలేదేమి? పువ్వుఁబోణీ! కొప్పున పువ్వులు తురుముకోలేదేమి? కస్తూరిగంధీ! మేనిపై కస్తూరి పూసుకోలేదేమి? భూషణ విభూషణాంగీ! భూషణాలు ధరించలేదేమి? హంసగామినీ! హంసలను పెంచుతున్నావా, లేదా? చిలుకలకొలికీ! చిలుకలకు పలుకులు నేర్పుతున్నావా, లేదా! లతాంగీ! లతలను ప్రాకులకు

కూరుస్తున్నావా, లేదా? సరోజాక్షీ! సరస్సులలో జలకాలు ఆడుతున్నావా, లేదా? హరిణలోచనా! హరిణాలకు మేత వేయుచున్నావా, లేదా? ముద్దుగుమ్మా! పెద్దలను గౌరవిస్తున్నావా, లేదా! బంధుచింతామణీ! బంధువులను ఆదరిస్తున్నావా, లేదా? అని శ్రీకృష్ణుడు భార్యలతో సరసాలాపాలు కావించాడు.

**వ. అని యడిగిన వారలు హరిం బాసిన దినంబులందు శరీరసంస్కార కేళీ విహార హాస వన మందిర గమనమహోత్సవ దర్శనంబు లొల్లని యిల్లాండ్రు కావున. 269**

**ప్రతి :** అని+అడిగినన్= అని అడుగగా; వారలు= వారు; హరిన్+పాసిన= కృష్ణునితో ఎడబాటు పొందిన; దినంబులందున్= రోజులలో; శరీర సంస్కార= బుద్ధిపూర్వకంగా మేని కలంకారాలు; కేళీవిహార= క్రీడావిలాసాలు; హాస= మందహాస విన్యాసాలు; వన= ఉద్యానవన సంచారాలు; మందిరగమన= మహోత్తమ భవనదర్శన గమనాలు; మహోత్సవదర్శనంబులు= పండుగదినాల వేడుకలను చూడటాలూ; ఒల్లని= అంగీకరించని; ఇల్లాండ్రు= గృహిణులు; కావునన్= కాబట్టి.

**తా :** కృష్ణుడు దూరంగా ఉన్న సమయాలలో ఆయన సతీమణులు మాంగల్యప్రదములైన ఆభరణాలు తప్ప బుద్ధిపూర్వకంగా మేనికి అలంకార సంస్కారాలు అంగీకరించరు. క్రీడావిహారాలకు వెళ్లుటకు ఇచ్ఛగింపరు. మందహాసాలు చిందింపరు. ఉద్యానవనవిహారాలు పాటింపరు. సుందరభవన సందర్శనాభిలాష ప్రదర్శింపరు. పర్వోత్సవ సందర్శనాలు కావింపరు. పతివ్రతానియమాలకు అంకితమైన ఇల్లాండ్రువారు.

**మ. సిరి చాంచల్యముతోడిదయ్యుఁ దనకున్ జీవేశ్వరుం డంచుఁ నే**
**పురుషశ్రేష్ఠు వరించె నట్టి పరమున్ బుద్ధిన్ విలోకంబులన్**
**గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ గల్యాణ బాష్పంబు లా**
**భరణశ్రేణులుగాఁ బ్రతిక్షణ నవ ప్రాప్తానురాగంబులన్. 270**

**ప్రతి :** సిరి= లక్ష్మీదేవి; చాంచల్యము= మిక్కిలి చలించే చంచలస్వభావం; తోడిది= తోడవిలసిల్లేది; అయ్యున్= అయినా; తనకున్= తనకు; జీవ+ఈశ్వరుండు= ప్రాణనాథుడు; అంచున్= అంటూ; ఏ పురుషశ్రేష్ఠున్= ఏ పురుషోత్తముని, వరించెన్= కోరి నిల్కడగా ఉండిపోయెనో; అట్టి= అటువంటి; పరమున్= పరమాత్మను; సతుల్= ఆ స్త్రీలు; కల్యాణబాష్పంబులు= ఆనందబాష్పాలు; ఆభరణశ్రేణులుగాన్= భూషణావళికాగా; ప్రతిక్షణ= క్షణక్షణానికి; నవ= క్రొత్తగా; ప్రాప్త= ఏర్పడిన; అనురాగంబులన్= ప్రేమలతో; బుద్ధిన్= మనస్సుతో; విలోకంబులన్= చూపులతో; కరయుగ్మంబులన్= బాహుద్వయంతో; కౌఁగిలించిరి= ఆలింగనం చేసుకొన్నారు.

**తా :** లక్ష్మీదేవి చంచల స్వభావురాలు. ఆమె ఎప్పుడూ ఒకచోట స్థిరంగా ఉండేదికాదు. అయినా ఆమె తనకు విష్ణువు ప్రాణేశ్వరుడని భావించి ఆయన వక్షఃస్థలంలో శాశ్వతంగా ఉండిపోయింది. అట్టి సర్వోత్తముడైన కృష్ణుని సతీమణులందరూ వీక్షించారు. వెంటనే వారికి ఆనందంతో కన్నీళ్లు నిండాయి. అవే వారికి ఆభరణాలయ్యాయి. క్షణక్షణం కృష్ణుని తేరిపార చూస్తూ ఉండగా వారిలో కొంగ్రొత్త అనురాగం ఉదయించింది. వారు మనస్సుతో, చూపులతో, బాహుద్వయంతో ఆలింగనం కావించుకొన్నారు. పరమాత్మలో ఐక్యమయ్యే రీతిగా వారి త్రికరణ శుద్ధితోకూడిన స్థితి కానవచ్చింది.

**విశే :** "దృష్టిభిరంతరాత్మనా దురంతభావాః పరిరేభిరే పతిమ్" అని మూలం. ఉపాధిరహితమైన జీవుడు పరమాత్మలో ఐక్యమైపోవడం సహజం. ఆ ధర్మం వారి ప్రవృత్తిలో గోచరించింది.

**మత్త. పంచబాణుని నీఱు సేసిన భర్గునిం దనవిల్లు వ**
**ర్జించి మూర్ఛిలఁ జేయఁజాలు విశేష హాస విలోకనో**
**దంచితాకృతులయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవున్**
**సంచలింపఁగఁ జేయ నేమియుఁ జాలరైరి బుధోత్తమా! 271**

**ప్రతి :** బుధోత్తమా= పండితవర్యా!; పంచబాణుని= మన్మథుని; నీఱు= బూడిద; చేసిన= కావించిన; భర్గునిన్= ఈశ్వరునైనా; తన విల్లున్= తన ధనుస్సు అయిన పినాకాన్ని; వర్జించి= వదలివేసి; మూర్ఛిలన్= పరవశమయ్యేటట్లు; చేయన్+చాలు= చేయగల్గిన; విశేషహాస= సుందరదరహాసాలతో; విలోకన= వాల్చూపులతో; ఉత్+అంచిత= మనోహరంగా ప్రకాశించే; ఆకృతులు+అయ్యున్= ఆకారం కలవారయినప్పటికి; కాంతలు= ఆ సతీమణులు; దంభచేష్టలన్= తమ శృంగార చేష్టలతో; మాధవున్= శ్రీకృష్ణపరమాత్మను; ఏమియున్= కొంచెమైనా; సంచలింపఁగన్= చలించేటట్లుగా; చేయన్= చేయడానికి; చాలరు+ఐరి= సమర్థులు కాలేకపోయిరి.

**తా :** పండితవర్యా! శ్రీకృష్ణుని సాధ్వీమణులు జగన్మోహన లావణ్యం కలవారు. వారి చిరునవ్వులు, వాల్చూపులు, సుందరరూపాలు అసామాన్యములైనవి. మన్మథుని బూడిద చేసిన పరమశివునైనా పరవశమయ్యేటట్లు, చేతిలోని ధనుస్సు అయిన పినాకాన్ని అవ్వలపారవైచేటట్లు చేయగల్గినవారు వారు. అయినా వారు తమ శృంగార చేష్టలతో మాధవుని మనస్సును మాత్రం కొంచెంకూడా కదల్చలేకపోయారు.

**విశే : "అరవిందమశోకం చ చూతం చ నవమల్లికా,**
**నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః".**

అని పంచబాణునకు "అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం" అయిదు బాణాలని అమరకోశం. ఆ అయిదు బాణాలవల్లనే మన్మథునికి పంచబాణుడనే పేరు సార్థకమయింది. ఈశ్వరుని తపోభంగం కావించే సమయంలో, ఆయన కంటిమంటలో పంచబాణుడు పంచత్వం పొంది బూడిద అయ్యాడు – అని పురాణగాథ. ఈశ్వరుని ధనుస్సునకు పినాకమని పేరు.

**వ. ఇవ్విధంబున సంగరహితుండైన కంసారి సంసారి కైవడి విహరింప నజ్ఞాన విలోకులయిన లోకులు లోక సామాన్య మనుష్యుండని తలంతు, రాత్మాశ్రయయైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోడం గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతితోడం గూడియు నా ప్రకృతి గుణంబులైన సుఖదుఃఖంబులఁ జెందకయుండుఁ, బరస్పరసంఘర్షణంబులచే వేణువులవలన వహ్నిఁ బుట్టించి వనంబుల దహించు మహావాయువు చందంబున భూమికి భారహేతువులై యనేకాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజులగు రాజుల కన్యోన్య వైరంబులు గల్పించి నిరాయుధుండై సంహారంబు సేసి, శాంతుండై పిదపం గాంతామధ్యంబునఁ బ్రాకృతమనుష్యుండునుం బోలె సంచరించుచుండె నా సమయంబున 272**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; సంగరహితుండు+ఐన= విషయాలతో సంబంధం లేనివాడయిన; (కంసారి= కంసమర్దనుడైన కృష్ణుడు); సంసారికైవడిన్= సామాన్య సంసారివలె; విహరింపన్= సంచరింపగా; అజ్ఞానవిలోకులు+ అయిన= అవిద్యతోకూడిన దృష్టికలవారైన; లోకులు= జనములు; లోకసామాన్యమనుష్యుండు+అని= లోకములో అందరిలా

సామాన్య మానవునిగా జీవించువాడని; తలంతురు= భావింతురు; ఆత్మా(శయ+ఐన= ఆత్మతో కూడియున్న; బుద్ధి= బుద్ధివృత్తి; ఆత్మ+అందున్న= ఆ ఆత్మయందు స్వాభావికంగా ఉన్న; ఆనందాదులతోడన్= ఆనందం, సత్యం, జ్ఞానం అనేవాటితో; కూడని= కలియని; తెఱంగునన్= విధంగా; ఈశ్వరుండు= పరమేశ్వరుడు; ప్రకృతితోడన్= త్రిగుణాత్మికయైన ప్రకృతితో; కూడియున్= కలసియున్నప్పటికిని; ఆ ప్రకృతిగుణంబులు+ఐన= ఆ ప్రకృతికి స్వభావసిద్ధం అయిన గుణాలగు; సుఖదుఃఖంబులన్= సుఖదుఃఖాలతో; చెందక= కలియకుండా; ఉండున్= ఉంటాడు; పరస్పర సంఘర్షణంబులచేన్= ఒకదానినొకటి రాపిడి చేయడంతో; వేణువులవలనన్= వెదుళ్లనుండి; వహ్నిన్= అగ్నిని; పుట్టించి= జనింపజేసి; వనంబులన్= అడవులను; దహించు= కాల్చివేసే; మహావాయువు= తీవ్రమైన పెనుగాలి; చందంబునన్= విధంగా; భూమికిన్= ధరణికి; భారహేతువులై= బరువుకు కారణాలై; అనేక= పెక్కు; అక్షౌహిణులతోడన్= అక్షౌహిణుల సైన్యంతో; ప్రవృద్ధ= అభివృద్ధి పొందింపబడ్డ; రాజులకున్= భూపాలకులకు; అన్యోన్యవైరంబులు= పరస్పర కలహాలు; కల్పించి= కల్గునట్లుచేసి; నిరాయుధుండు+ఐ= శస్త్రాస్త్రాలు పట్టనివాడై; సంహారంబు+చేసి= నాశనం కల్పించి; శాంతుండు+ఐ= పరమశాంతుడై; పిదపన్= అనంతరం; కాంతామధ్యంబునన్= స్త్రీజనం నడుమ; ప్రాకృత మనుష్యుండునున్+పోలెన్= సామాన్య మానవునిలా; సంచరించుచుండెన్= ప్రవర్తించసాగాడు; ఆ సమయంబునన్= ఆ వేళలో...

**తా :** సర్వసంగపరిత్యాగి అయిన యోగేశ్వరుడైన కృష్ణుడు లోకవిడంబనార్థం సంసారిలాగా విహరించడం చూచారు సామాన్యులు. అవిద్యతో కూడుకొన్నవారు కాబట్టి లోకులందరూ ఆయనను సామాన్య మానవునిగానే భావించారు. వారు సామాన్యులు కావున తమతోడి వ్యక్తిగానే భ్రమించారు. బుద్ధివృత్తి ఎల్లప్పుడు ఆత్మతోకూడి ఉంటుంది. కాని ఆత్మగుణాలయిన సచ్చిదానంద లక్షణాలు బుద్ధికి అంటవు. అలా అంటి ఉంటే "నేను సుఖిని, నేను దుఃఖిని, నేను పురుషుడను, నేను స్త్రీని" అనే వ్యవహార జ్ఞానం ఏర్పడదు. అట్లే పరమేశ్వరుడు త్రిగుణాత్మికయైన ప్రకృతితో కలసియున్నా, ఆ ప్రకృతి గుణాలయిన సుఖదుఃఖాలను పొందకుండా ఉంటాడు. వాయుసంచలనంవల్ల వెదురు గడలకు పరస్పరం రాపిడి కలుగుతుంది. దానినుండి అగ్ని పుడుతుంది. అది అరణ్యాలను కాల్చివేసే మహాప్రభంజనంగా మారిపోతుంది. అట్లే శ్రీకృష్ణుడు భూమికి భారం కలిగించే, పెక్కు అక్షౌహిణుల సైన్యం కలవారయిన రాజులమధ్య అన్యోన్యకలహం కలిగేటట్లుచేసి నిమిత్తమాత్రుడుగా ఉండిపోయాడు. తాను ఒక పరమశాంతునిగా, సాక్షిభూతునిగా మిగిలిపోయాడు. ఈనాడు అంతఃపుర మందిరాలలో నారీజన మధ్యంలో ప్రాకృత మానవునిలా విహరించసాగాడు.

**విశే :** త్రిగుణాత్మిక – సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలే స్వరూపంగా గలది.

**క. యతు లీశ్వరుని మహత్త్వము, మిత మెఱుఁగని భంగి నప్రమేయుఁడగు హరి**
**స్థితి నెఱుఁగక కాముకుఁడని, రతములు సలుపుదురు తిగిచి రమణులు సుమతీ! 273**

**ప్రతి :** సుమతీ= గొప్పబుద్ధి కలిగినవాడా!; యతులు= జ్ఞానులు; ఈశ్వరుని= పరమేశ్వరుని; మహత్త్వము= తత్త్వంయొక్క; మితము= అవధిని; ఎఱుఁగనిభంగిన్= తెలియలేనట్లు; అప్రమేయుఁడు+అగు= ప్రమాణములకు అందనివాడైన; హరిస్థితిన్= కృష్ణుని వ్యక్తిత్వమును; ఎఱుఁగక= తెలియజాలక; కాముకుఁడు+అని= చెలరేగే కామం కలవాడు అని; రమణులు= స్త్రీలు; తిగిచి= ఆకర్షించి; రతములు= క్రీడలను; చలుపుదురు= అనుభవిస్తారు.

**తా :** బుద్ధిమంతుడా! జ్ఞానులు కూడ పరమేశ్వరుని నిర్గుణ తత్త్వంయొక్క విస్తృతమైన అవధిని తెలియలేరు. అట్లే ఏ ప్రమాణములకు అందని సగుణస్వరూపుడైన శ్రీకృష్ణుని వ్యక్తిత్వాన్ని కూడ కొందరు కానలేరు. ఆ కారణంచే కాంతలందరూ ఆయనను కాంతారతుడని భావించి విహారాలతో క్రీడించారు.

**క. ఎల్లప్పుడు మా యిండ్లను, వల్లభుఁడు వసించు, నేమ వల్లభలము శ్రీ**
**వల్లభున కనుచు గోపీ, వల్లభుచే సతులు మమతవలఁ బడి రనఘా! 274**

**ప్రతి :** అనఘా= పాపరహితుడా!; ఎల్లప్పుడున్= నిరంతరం; మా+ఇండ్లను= మా మందిరాలలోనే మందిరంలోనే; వల్లభుఁడు= నా ప్రియుడు; వసించున్= ఉంటాడు; శ్రీవల్లభునకున్= లక్ష్మీపతికి; ఏము+అ= మేమే (నేనే); వల్లభలము= ప్రియురాండ్రము; అనుచున్= అనుకొంటూ; గోపీవల్లభుచేన్= గోపీమనోహరునిచే; సతులు= ఆయన కాంతలందరూ; మమతవలన్= వలపుల వలలో; పడిరి= చిక్కుకొన్నారు.

**తా :** పుణ్యాత్ముడవైన శౌనక మునీంద్రా! ఆ కృష్ణుని సాధ్వీమణులందరూ, ఎవరికివారే నా ప్రియుడు నా మందిరంలోనే ఉన్నాడని, ఆ లక్ష్మీపతికి నేనే అనురాగవతినైన భార్యనని అనుకొంటూ, ఆ గోపీమనోహరుని వలపుల వలలో చిక్కుకొన్నారు.

**విశే :** సత్యానికి కృష్ణునకు వారిపై ఏ అనురాగబంధసంగం లేకపోయినా, వారే మమకార సంగబంధంలో తగుల్కొన్నారని భావం.

**వ. అని చెప్పిన విని శౌనకుండు సూతున కిట్లనియె. 275**

**ప్రతి :** అని= అని; చెప్పినన్= వచింపగా; విని= ఆకర్ణించి; శౌనకుండు= శౌనక మహాముని; సూతునకున్= సూత పౌరాణికునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని ఈ రీతిగా సూతుడు వచింపగా శౌనక మహాముని విని మరల ఆ పౌరాణికునితో ఇలా అన్నాడు.

**అవ :** అశ్వత్థామ ఉత్తర గర్భంలో నున్న శిశువును నిర్మూలించుటకై ప్రయోగించిన బ్రహ్మశిరస్సు బాణాగ్ని నుండి బాలు డేవిధంగా రక్షింపబడినాడు? అతడు పెరిగి పెద్దయై, చివరకు తన శరీరత్యాగం చేసిన తీరు ఏ విధమో తెలుపవలసిందిగా శౌనకుడు సూతుని అడిగిన సందర్భం.

## ❖ ఉత్తరకుఁ బరీక్షిత్తు జన్మించుట ❖

**సీ. గురునందనుండు సక్రోధుఁడై యేసిన బ్రహ్మశిరోనామబాణవహ్నిఁ**
**గంపించు నుత్తరగర్భంబు గ్రమ్మఱఁ బద్మలోచనుచేత బ్రదికె నండ్రు,**
**గర్భస్థుఁడగు బాలుఁ గంసారి యేరీతి బ్రతికించె మృత్యువు భయము వాపి**
**జనియించి యతఁ డెన్ని సంవత్సరము లుండె? నెబ్భంగి వర్తించె? నేమి సేసె?**

**ఆ. వినుము శుకుఁడు వచ్చి విజ్ఞాన పద్ధతి, నతని కెట్లు సూపె? నతఁడు పిదపఁ**
**దన శరీర మే విధంబున వర్జించె? విప్రముఖ్య! నాకు విస్తరింపు. 276**

**ప్రతి :** విప్రముఖ్య!= బ్రాహ్మణులలో శ్రేష్ఠుడవైన ఓ సూతమహర్షీ!; గురునందనుండు= ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామ; స+క్రోధుఁడు+ఐ= కోపంతో కూడుకొన్నవాడై; ఏసిన= ప్రయోగించిన; బ్రహ్మశిరోనామ= బ్రహ్మ శిరస్సు అను పేరుగల; బాణ+వహ్నిన్= బాణము నిప్పుచేత; కంపించు= వణకునటువంటి; ఉత్తర గర్భంబున్= అభిమన్యుని ఇల్లాలైన ఉత్తర కడుపులోని శిశువును; క్రమ్మఱన్= మరల; పద్మలోచనుచేతన్= తామరవంటి కన్నులు గల శ్రీకృష్ణునిచేత; బ్రదికెన్+ అండ్రు= జీవించెనని అంటారు కదా!; గర్భస్థుఁడు+అగు+బాలున్= ఉత్తర గర్భమునందున్నవాడైన పసివానిని;

మృత్యువు+భయము+పాపి= మరణ భీతిని పోగొట్టి; కంస+అరి= కంసునికి శత్రువైన శ్రీకృష్ణుడు; ఏ రీతిన్= ఏ విధంగా; బ్రతికించెన్= జీవించునట్లు చేసినాడు; అతఁడు= ఆ గర్భస్థ శిశువు; జనియించి= పుట్టి; ఎన్ని+సంవత్సరములు+ఉండెన్= ఎన్ని యేండ్లు ఉండినాడు, ఎంతకాలం జీవించినాడు; ఏ+భంగిన్= ఏ విధంగా; వర్తించెన్= మెలగినాడు; ఏమి+చేసెన్= ఏమేమి చేసినాడు; వినుము సూతమహర్షీ! ఆసక్తిగల మా ప్రార్థన ఆలకించు; శుకుఁడు= వ్యాసుని కుమారుడైన శుకమహర్షి; వచ్చి= పరీక్షిత్తు కడకు విచ్చేసి; అతనికిన్= ఆ రాజునకు; విజ్ఞాన పద్ధతిన్= పరబ్రహ్మతత్త్వమైన విశిష్ట జ్ఞానము తీరును; ఎట్లు= ఏ రీతిగా; చూపెన్= తెలియజేసినాడు?; అతఁడు= ఆ పరీక్షిన్మహారాజు; పిదపన్= అటుపైన; తన శరీరము= తన దేహము; ఎట్లు= ఏ విధంగా; వర్జించెన్= విడిచినాడు?; నాకున్= నాకు; విస్తరింపు= విరివిగా వివరించి చెప్పు.

**తా :** ఓ సూతమహర్షీ! కౌరవపాండవుల గురువైన ద్రోణుని పుత్రుడు, అశ్వత్థామ మంచిని మరచి మహాకోపంతో ప్రయోగించిన బ్రహ్మాస్త్రం అగ్ని ఉత్తర కడుపులోని పసిపాపను వణకింపగా శ్రీకృష్ణుడు తన మాయతో ఆ బాలునికి మరణభీతి లేకుండా చేసి బ్రతికించినాడు. అతడు జన్మించి ఎన్నియేండ్లు ఉండినాడు? ఏ విధంగా ప్రవర్తించినాడు? ఏయే కార్యక్రమాలు నిర్వర్తించినాడు? అతనికి శుకమహర్షి పరబ్రహ్మతత్త్వమును ఏ రీతిలో ప్రబోధించి చరితార్థుని గావించినాడు? చివరకు పరీక్షిత్తు తన శరీరాన్ని ఏ విధంగా త్యజించినాడు? నాకు వివరంగా తెలుపవలెనని ప్రార్థించుచున్నాను' అని శౌనకుడు సూతుని అడిగినాడు.

**విశే :** ఈ పద్యంలో ఆరు ప్రశ్నలు ఉన్నవి. అందు పరీక్షిత్తు పుట్టడం మొదలు గిట్టడం వరకు గల జీవిత విశేషాల పరామర్శ ఉన్నది. పరీక్షిత్తు పుట్టుకయే ఒక అద్భుత సంఘటన. ముల్లోకాలనే దహింపగల బ్రహ్మాస్త్రం నుండి తప్పించుకొని ప్రాణాలతో బయటపడటం అన్నది సాధారణ విషయం కాదు. శ్రీహరి మాయాప్రభావం, ఆయన అద్వితీయ వాత్సల్యంవల్లనే అట్టి ప్రాణప్రదమైన స్థితి సంభవించింది. మృత్యుభీతి నుండి గర్భస్థ బాలుని కాపాడి బ్రతికించిన సంఘటన మరి ఎచ్చటనూ కానరానిది. అది కంసారి అయిన శ్రీకృష్ణుని వల్లనే సాధ్యమైనది.

**వ. అనిన సూతుం డిట్లనియె. ధర్మనందనుండు చతుస్సముద్ర ముద్రితాఖిల జంబూద్వీపరాజ్యంబు నార్జించియు, మిన్ను ముట్టిన కీర్తి నుపార్జించియు, నంగనా తురంగ మాతంగ సుభట కాంచనాది దివ్యసంపదలు సంపాదించియు, వీరసోదర విప్ర విద్వజ్జన వినోదంబులఁ బ్రమోదించియు, వైభవంబు లలవరించియుఁ గ్రతువు లాచరించియు, దుష్టశిక్షణ శిష్టరక్షణంబు లొనరించియు, ముకుంద చరణారవింద సేవారతుండై సమస్త సంగంబులందు నభిలాషంబు వర్జించి యరిషడ్వర్గంబు జయించి, రాజ్యంబు సేయుచు.**

**277**

**ప్రతి :** అనినన్= అని శౌనకుడు అడుగగా; సూతుండు= సూతుడు ఉగ్రశ్రవసుడు; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= సమాధానం ఇచ్చినాడు; ధర్మనందనుండు= ధర్మరాజు; చతుస్+సముద్ర+ముద్రిత+అఖిల+జంబూద్వీప+రాజ్యంబున్= నాల్గు సముద్రములచే గుర్తులుగా చేయబడిన సమస్త జంబూద్వీపంతో కూడిన సామ్రాజ్యాన్ని; ఆర్జించియున్= సంపాదించియు; మిన్ను+ముట్టిన= ఆకాశాన్నంటిన; కీర్తిన్= యశస్సును; ఉప+ఆర్జించియున్= సంపాదించియు; అంగనా+ తురంగ+మాతంగ+సుభట+కాంచన+ఆది+దివ్యసంపదలు= స్త్రీలు, గుఱ్ఱములు, ఏనుగులు, మంచియోధులు, బంగారం మొదలగు శ్రేష్ఠములైన ఐశ్వర్యములు; సంపాదించియున్= సమకూర్చుకొనియు; వీరసోదరవిప్ర+విద్వత్+జన వినోదంబులన్= వీరులైన తమ్ముల, బ్రాహ్మణుల, పండితుల వేడుకలు లేదా కాలక్షేపాలయందు; ప్రమోదించియున్= మిక్కిలి సంతోషించియు; వైభవంబులు= గొప్ప సంపదలు; అలవరించియున్= గ్రహించియు; క్రతువులు= యజ్ఞములు; ఆచరించియున్=

నిర్వహించియు; దుష్టశిక్షణ= చెడ్డవారిని దండించుట; శిష్టరక్షణంబులు= మంచివారిని కాపాడుటలు; ఒనరించియున్= చేసియు; ముకుంద+చరణ+అరవింద+సేవారతుండు+ఐ= మహావిష్ణువు పాదపద్మముల పరిచర్యయందు ఆసక్తికలవాడై; సమస్త+సంగంబులందున్= అన్ని సంసర్గములందును; అభిలాషంబు= కోరిక, ఆసక్తి; వర్జించియున్= విడిచిపెట్టియు; అరిషడ్వర్గంబున్= లోపలి పగవారిని; జయించియున్= గెలిచియు; రాజ్యంబు+చేయుచున్= సామ్రాజ్యపాలన గావించుచు.

**తా :** అప్పుడు సూతుడిట్లనినాడు. ధర్మరాజు నాలుగు సముద్రములు సరిహద్దులుగాగల సమస్త జంబూద్వీప సామ్రాజ్యాన్ని సంపాదించి, ఆకాశాన్నంటు కీర్తితో, దాసదాసీజనం, గుఱ్ఱాలు, ఏనుగులు, కాల్బలం, బంగారం మొదలైన సంపదలతో పాలించినాడు. వీరులైన సహోదరులతో, విద్వాంసులతో కలిసి వినోద కాలక్షేపాలు జరిపినాడు. వైభవాలను అనుభవించుచు, యజ్ఞయాగాదులు నిర్వహించినాడు. దుర్మార్గులను దండించి, మంచివారిని, తక్కిన సమస్త జనులను కాపాడినాడు. ఇన్ని ధర్మాలు నిర్వహించుచునే నిరంతరం శ్రీకృష్ణపదారవింద సేవాతత్పరుడై, ఏహ్యములైన బాహ్యసంబంధముల కోరికలు వీడి, కామ, క్రోధ, లోభ, మోహ మద మత్సరములనే ఆరు అంతశ్శత్రువులగుంపును తతిమి అజాత శత్రువను నామ సార్థక్యంతో పరిపాలన సాగించినాడు.

**విశే :** ఇచ్చట సోదరులు వీర సోదరులు. ఈ వీరత్వమే వారి ప్రస్తుత వైభవానికి ప్రధాన కారణం. అందుకే ఇటవెంటనే 'వైభవంబు లలవరించియు' అని ప్రయోగింపబడినది. ఇది ఎంతో అర్థవంతం. ఔచిత్యవంతం, ఎంతోకాలంగా పాండవులు క్లేశములు అనుభవించగా ఇప్పుడు వారికి ఐశ్వర్యాలు ప్రాప్తించినవి. వైభవా లనుభవించుటకు సర్వ సమర్థులు కాని ఇట 'అలవరించియు' అనుక్రియచే క్రమక్రమంగా వారు అలవాటుపడుచున్నారని భావం. భాగవతం భావగతమనుట ఇట్టిదే.

కర్తవ్యపరాయణుడైన ధర్మజుడు వైభవాలను అభ్యాసం చేసికొనుచు, సర్వప్రజాసంరక్షణకై కంకణం కట్టుకున్నాడు. అందుకే యజ్ఞయాగాదులు నిర్వహించుచున్నాడు. ధర్మసంస్థాపనమన్నది దుష్టశిక్షణలో శిష్టరక్షణలో ఉన్నదన్న గీతాసూక్తిని స్మరణకు తెచ్చుకున్నాడు. అనంతరం నిరంతరం గీతాచార్యుడైన ముకుందుని పాదపద్మాలపై హృదయం నిల్పినాడు. ఎప్పుడు శ్రీకృష్ణ పదసేవాతత్పరతయే తన సర్వస్వమని భావించినాడో అప్పుడు అన్ని పొత్తులనుండి అప్రయత్నంగానే కోరిక పూర్తిగా సడలినది. ఇచ్చట 'సమస్త సంగంబులందు నభిలాషంబు వర్జించి' అను ప్రయోగంలోని 'సంగము' విశేషార్థ స్ఫోరకం. ఈ పదంలోనే 'సంగమము, సంగము' అనునవికూడా ఇమిడి ఉన్నవి. సంగంలో పొత్తు, సాంగత్యం, సంపర్కం, సమాసక్తి వంటి ఎన్నో అర్థాలున్నాయి. ముకుందపదసేవ ఎప్పుడు గాఢంగా ఏర్పడిందో అప్పుడు అన్ని సంబంధాలపై కోరిక తొలగిపోయింది. ఇక చివరగా అంతశ్శత్రువులను నిర్జించినాడు. అంతకంటె వలసినదేమున్నది? సర్వజన రంజకత్వమే ధర్మజుని ధర్మపరిపాలనాలక్ష్యం.

'జంబూద్వీపాధిపత్యం' 'యశశ్చ త్రిదివంగతః' 'కామాస్సుర స్పృహ్యా ముకుందమనసః' వంటి ప్రయోగాలు మూలంలో సూత్రప్రాయాలు. పోతన ఇచ్చట కొంత విస్తరించి అభివర్ణించినాడు.

'క్రతవః తదుపార్జితా లోకాశ్చ, 'సురాణాం స్పృహణీయః తే సంపదాదయః' 'కామాఃవిషయాః' 'ముకుంద ఏవమనసోయస్యేతి' అని శ్రీధరుని భావార్థ దీపిక. ఇందలి వివరణ తర్వాతి పద్యంలో కొంత అనుసరింపబడింది.

**తే. చందనాదుల నాఁకట స్రగ్గువాఁడు, దనివి నొందని కైవడి ధర్మసుతుఁడు**
**సంపదలు పెక్కు గలిగియుఁ జక్రిపాద, సేవనంబులఁ బరిపూర్తి సెందకుండె. 278**

**ప్రతి :** ఆఁకటన్= ఆఁకలితో; స్రగ్గువాఁడు= క్రుంగువాడు; చందన+ఆదులన్= గంధం మొదలైన వానితో; తనివిన్= తృప్తిని; ఒందని= పొందని; కైవడిన్= విధంగా; ధర్మసుతుఁడు= యముని కుమారుడైన ధర్మరాజు; చక్రి= విష్ణువుయొక్క; పాద+సేవనంబులన్= పాదముల కొలువు మరియు దానికి సంబంధించిన అనుభవాలతో (అనగా పాదసేవాసక్తి కలిగినవాడై); పెక్కు= అనేకవిధములైన; సంపదలు= ఐశ్వర్యములు; కలిగియున్= పొంది ఉండియు; పరిపూర్తిన్= పరిపూర్ణముగా నిండియుండుటను అనగా పూర్తి సంతృప్తిని; చెందక+ఉండెన్= పొందకుండినాడు.

**తా :** ఆకలిబాధతో నకనకలాడువాడు మంచి గంధం మొదలగువానిని పూసికొనుటతో తృప్తిని తానెట్లు పొందడో, అట్లే విష్ణుపాద సేవలందు ఆసక్తిగల ధర్మరాజు అనేక సంపదలు కలిగియుండియు పరిపూర్ణ తృప్తిని పొందలేదు.

**వ. అంతం గొన్ని దినంబులకు నభిమన్యు కాంతాగర్భంబునందున్న డింభకుండు దశమమాసపరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున దురంతంబైన యశ్వత్థామ బాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు. 279**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; కొన్నిదినంబులకున్= కొన్నాళ్లకు; అభిమన్యుకాంతాగర్భంబునందు+ఉన్న= అభిమన్యుని ఇల్లాలైన ఉత్తర గర్భములో ఉన్న; డింభకుండు= పిల్లవాడు (శిశువు); దశమమాస+పరిచ్ఛేద్యుండు+ఐ= పదవ నెలచే ప్రత్యేకింపబడినవాడై అనగా గర్భములో పదినెలల గడువు నిండినవాడై; గర్భ+అంతరాళంబునన్= కడుపులోపల; దురంతంబు+ఐన= అంతులేని దగు; అశ్వత్థామ= అశ్వత్థామయొక్క; బాణ+అనలంబునన్= బాణాగ్నిచేత; దందహ్యమానుండు+ఐ= కాల్చబడుచున్నవాడై; తల్లడిల్లుచున్= బాధపడుచు.

**తా :** అటుపై కొన్ని దినాలకు అభిమన్యుని భార్యయగు ఉత్తరగర్భంలో ఉన్న పసికందుకు పదినెలల గడువు పూర్తి అయింది. అశ్వత్థామ ప్రయోగించిన బాణాగ్నివలన ఆ పసివానికి భరింపరాని పరితాపం కలిగింది. దహింపబడుచు బాధతో ఇట్లు మొర పెట్టుకొనినాడు.

**ఉ. కుయ్యిడ శక్తి లే దుదరగోళములోపల నున్న వాఁడ ది**
**క్కెయ్యది? దా ననాథ నని యెప్పుడుఁ దల్లి గణింప విందు నేఁ**
**డియ్యిషువహ్ని వాయుటకు నెయ్యది మార్గము? నన్నుఁ గావ నే**
**యయ్య గలండు? గర్భజనితాపద నెవ్వఁ డెఱుంగు దైవమా! 280**

**ప్రతి :** దైవమా!= ఓ దేవుడా!; కుయ్యి+ఇడన్= మొరపెట్టుకొనగా; శక్తి= బలము; సామర్థ్యము లేదు= లేకున్నది (చాలకున్నది); ఉదర+గోళము+లోపలన్= కడుపులోని గుండ్రని ప్రదేశమునందు; ఉన్నవాఁడన్= ఉన్నట్టివాడను, ఉన్నాడను; తల్లి= జనని; తాన్= తాను; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అనాథను= భర్త లేనిదానను; అని= అంటూ; గణింపన్= చెప్పగా; విందున్= వినుచుందును; దిక్కు= శరణము లేక దారి; ఎయ్యది= ఏది?; నేఁడు= ఈ దినము, ఇప్పుడు; ఈ+ఇషు= ఈ బాణముయొక్క; వహ్ని= అగ్ని; పాయుటకున్= తొలగిపోవుటకు; మార్గము= ఉపాయము; ఎయ్యది= ఏది?; నన్నున్= నన్ను; కావన్= కాపాడుటకు; ఏ+అయ్య= ఏ తండ్రి, ఏ పూజ్యుడు; కలండు= ఉన్నాడు?; గర్భ= తల్లి కడుపులో; జనిత= పుట్టిన; ఆపదన్= విపత్తును; ఎవ్వఁడు= ఎవరు; ఎఱుంగున్= తెలియును?

**తా :** ఓ దైవమా! నే నిప్పుడు తల్లి గర్భగోళంలో ఉన్నాను. మొర పెట్టుకొనుటకు శక్తిలేదు. నాకు దిక్కెవ్వరు? నా తల్లి ఎల్లప్పుడు నేను భర్తలేనిదానను, అనాథను అని దుఃఖింపగా విన్నాను. ఇప్పటి ఈ బాణాగ్ని తొలగిపోవు ఉపాయమేది? నన్ను రక్షించు ప్రభువు ఎవడు? గర్భమునందు కలిగిన ఈ విపత్తును ఎవడు గ్రహింపగలడు? దైవమే కాపాడవలెను.

**క. చిచ్చఱకోలవశంబునఁ, జచ్చి బహిర్గతుఁడఁ గాని సమయమునను దాఁ**
**నుచ్చలితగర్భవేదనఁ, జచ్చును మా తల్లి ఘోరసంతాపమునన్. 281**

**ప్రతి :** చిచ్చఱ+కోల వశంబునన్= అగ్నిమయమైన బాణము మూలముగా; చచ్చి= ప్రాణము గోల్పోయి; బహిఃగతుఁడన్= బయటపడినవాడను; కాని= కానట్టి; సమయమునను= సందర్భమునందు; మాతల్లి= మా అమ్మ; తాన్= తాను; ఘోరసంతాపమునన్= భయంకరమైన గొప్ప తాపమువలన; ఉత్+చలిత+గర్భవేదనన్= మిక్కిలి ఊపివేసే, గర్భశోకముతో; చచ్చున్= మృతి చెందును.

**తా :** ఈ నిప్పులు గ్రక్కుబాణమునకు లోనై నేను కడుపులోనే చనిపోయి, పిండం బయటికి రానప్పుడు గర్భం చెదరిపోయినదని మా అమ్మ తెలిసికొన్నచో ఆ గర్భశోకమునకు తట్టుకొనలేక భయంకర యాతనతో తాను మరణించును.

**క. చెచ్చెర బాణజ్వాలలు, వచ్చిన విష్ణుండు గావవచ్చు ననుచుఁ దాఁ**
**ముచ్చటలు సెప్పు సతులకు, నిచ్చలు మాయవ్వ నేఁడు నిజమయ్యెడినో! 282**

**ప్రతి :** చెచ్చెర (చెర+చెర)= శీఘ్రముగా; బాణజ్వాలలు= బాణమునుండి మంటలు; వచ్చినన్= రాగా; విష్ణుండు= సర్వవ్యాపకుడైన శ్రీహరి; కావన్= కాపాడగా; వచ్చున్= చనుదెంచును; అనుచున్= అనుచు; మా+అవ్వ= మా అమ్మ; తాన్= తాను; నిచ్చలు= నిత్యము; ఎల్లప్పుడు సతులకున్= తోడి స్త్రీలకు; ముచ్చటలు= కబురులు, ఇష్టాగోష్ఠిమాటలు; చెప్పున్= పలుకును; నేఁడు= ఈ దినము; నిజము+అయ్యెడిన్+ఓ!= యథార్థము కానున్నదో!

**తా :** ఆగ్నేయాస్త్రపు మంటలు అతిశీఘ్రంగా సమీపింపగా తప్పక శ్రీమహావిష్ణువు రక్షింపగలడని నిత్యమూ మా అమ్మ సహచరులైన స్త్రీలతో ప్రసంగించే మాటలు నేడు నిజం కాగలవో!

**శా. రాఁడా చూడ, సమస్తభూతములలో రాజిల్లువాఁ డిచ్చటన్**
**లేఁడా? పాఱుని చిచ్చఱమ్ముఁ దొలఁగన్ లీలాగతిం ద్రోచి నా**
**కీఁడా నేఁడభయప్రదాన మతఁ డూహింపన్ నతత్రాత మున్**
**గాఁడా? యెందఱిఁ గావఁడీ యెడల మత్కర్మంబు దా నెట్టిదో! 283**

**ప్రతి :** చూడన్= (నన్ను) చూచుటకై, కాపాడుటకై; రాఁడా= రాకుండునా!; సమస్త+భూతములలోన్= అన్ని జీవులలో; రాజిల్లువాఁడు= ప్రకాశించువాడు; ఇచ్చటన్= ఈ ప్రదేశమున; లేఁడు+ఆ= ఉన్నాడు కదా! (లేకపోవునా!); పాఱుని= బ్రాహ్మణుడైన అశ్వత్థామయొక్క; చిచ్చఱ+అమ్మున్= అగ్నిబాణమును; అతఁడు= ఆ విష్ణువు; లీలా+గతిన్= విలాసమగురీతిలో; తొలఁగన్= వీడగా, ప్రక్కకేగునట్లుగా; త్రోచి= తప్పించి, నిర్లక్ష్యముచేసి; నాకున్= నాకు; నేఁడు= ఈ దినము, ఇప్పుడు; అభయప్రదానము= భయములేని గొప్ప రక్షణము; ఈఁడా= ఒసగడా!; ఊహింపన్= ఆలోచింపగా; మున్= మునుపు; నతత్రాత= నమస్కరించువారిని రక్షించువాడు; కాఁడు+ఆ= కానివాడా!; ఎందఱిన్= ఎంతమందిని; కావఁడు= కాపాడలేదు!; ఈ+ఎడలన్= ఈ స్థితిలో, ఈ విషయమున; మత్+కర్మంబు= నాయొక్క కర్మము; తాన్= తాను; ఎట్టిది+ఓ= ఎటువంటిదో!

**తా :** అన్ని జీవులలో ఇచ్చటనే ప్రకాశించుచున్నవాడు మొరపెట్టుకొను నన్ను చూచుటకు (రక్షించుటకు) రాకపోవునా? తప్పకవచ్చి తీరును. అశ్వత్థామ ప్రయోగించిన అగ్నిబాణమును అవలీలగా తొలగించి నాకు ఈనాడు అభయప్రదానము

చేయకపోవునా? ఆలోచింపగా ఆయన మొదటినుండి నమస్కరించిన వారిని కాపాడినవాడే కదా! ఎంతమందిని ఆయన రక్షింపలేదు! ఈ సమయమున నా కర్మము ఎట్లున్నదో!

**వ. అని గతప్రాణుండై భ్రూణగతుండైన శిశువు చింతించు సమయంబున** **284**

**ప్రతి :** అని= ఆ ప్రకారముగా; గత+ప్రాణుండు+ఐ= పోయిన ప్రాణములు కలవాడై; భ్రూణగతుండు+ఐన= గర్భమునందున్నవాడైన; శిశువు= పసికందు; చింతించు= విచారించు; సమయంబునన్= సందర్భమునందు...

**తా :** ఆ ప్రకారంగా ప్రాణాలుపోయి పిండంలో ఉన్న బాలుడు ఆలోచించే సమయంలో.

**సీ. మేఘంబుమీఁది క్రొమ్మెఱుఁగు కైవడి మేని పైనున్న పచ్చని పటమువాఁడు**
**గండభాగంబులఁ గాంచన మణిమయ మకరకుండల కాంతి మలయువాఁడు**
**శరవహ్ని నడఁగించు సంరంభమునఁ జేసి కన్నుల నునుఁగెంపు గలుగువాఁడు**
**బాలార్కమండల ప్రతిమాన రత్నహాటక విరాజిత కిరీటంబు వాఁడు**

**తే. కంకణాంగద వనమాలికా విరాజ, మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ**
**డొక్క గదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ, విష్ణుఁ డావిర్భవించె న వ్వేళయందు.** **285**

**ప్రతి :** మేఘంబుమీఁది= మబ్బుపైని; క్రొత్త+మెఱుఁగు కైవడిన్= తొలకరి మబ్బునందలి మెరుపువలె; మేని+పైన్+ఉన్న= దేహంపైన గల; పచ్చని+పటమువాఁడు= పసుపువన్నె పచ్చడము (వస్త్రము) గలవాడు అనగా పీతాంబరము ధరించినవాడు; గండ+భాగంబులన్= చెక్కిళ్ల ప్రదేశములందు; కాంచన= బంగారుతో చేసిన; మణి+మయ= రత్నములు నింపిన (పొదిగిన); మకర= మొసలి గుర్తుగల; కుండల= చెవిపోగుల; కాంతి= వెలుగు; మలయువాఁడు= వ్యాపించునట్టివాడు; శర+వహ్నిన్= బాణముల అగ్నిని; అడఁగించు= అణచివేయు (తొలగించు); సంరంభమునన్+చేసి= ఆతురపాటుతో, వేగిరపాటుతో; కన్నుల= నేత్రములందు; నునుఁగెంపు= లేత ఎఱ్ఱదనము; కలుగువాఁడు= కలిగినవాడు; బాల+అర్క+మండల= ఉదయ సూర్యబింబముతో; ప్రతిమాన= సమానమైన; రత్న+హాటక+విరాజిత= రత్నములతో; బంగారముతో మిక్కిలి వెలుగొందు; కిరీటంబు+వాఁడు= మకుటముగలవాడు; కంకణ+అంగద+వనమాలికా+విరాజమానుఁడు= మురుగులు, భుజకీర్తులు, తోమాల (వైజయంతిమాల)తో మిక్కిలి వెలుగొందువాడు; న+సమానుఁడు= సాటిలేనివాడు; అంగుష్ఠ+మాత్ర+దేహుఁడు= బొటనవ్రేలంత శరీరము కలవాడు; చేతన్= చేతిలో; ఒక్క+గదన్= ఒక గదను; తాల్చి= ధరించి; నేత్ర+ఉత్సవముగన్= కన్నుల పండువుగా; ఆ+వేళ+అందున్= ఆ సమయమునందు; విష్ణుఁడు= సర్వవ్యాపకుడైన శ్రీమన్నారాయణుడు; ఆవిర్భవించెన్= పుట్టెను.

**తా :** తల్లి కడుపులో తల్లడిల్లే ఆ పిల్లవాడు ఆపదలనుండి కాపాడే అభయప్రదాతను పదే పదే భావించి, ధ్యానించే సందర్భంలో కన్నులపండువుగా మహావిష్ణువు తనయెదుట కనిపించినాడు. తొలకరి మబ్బుపైన క్రొత్త మెరుపుతీగవలె, అతడు తన దేహంపై తళతళమని తళుకులీనే పసుపుపచ్చని పట్టుపుట్టాన్ని ధరించినాడు. అతడు తన చెక్కిళ్లపై మణులు పొదిగిన బంగారు చెవికమ్మలు దాల్చి ప్రకాశించినాడు. ఇక బాణాగ్నిని తొలగించే వేగిరపాటుతో కన్నులెఱ్ఱజేసినాడు. బాలసూర్య మండలమునకు సాటిగా రత్నాలు తాపిన బంగారు కిరీటంతో వెలుగులు చిమ్మినాడు. చేతికి మురుగులు, భుజములకు భుజకీర్తులు, వక్షఃస్థలంపై వనమాల శోభిల్లగా సాటిలేనివాడై బొటనవ్రేలెడంత రూపంలో ఒకచేతిలో గద పట్టుకొని కన్పించినాడు.

**విశే :** ఈ పద్యంలో 'వనమాలికా విరాజమానుడు' అని ఉన్నది. దీనిని సదా ధరించటం వల్లనే విష్ణువు 'వనమాలి' అయినాడు. ఈ వనమాలయే వైజయంతి. వైజయంతీ పుష్పమాల ధర్మ సంజ్ఞకం. అది విజయానికి కారణం. 'యతో ధర్మ స్తతో జయః' అను ప్రమాణాన్నిబట్టి ధర్మంకూడా జయహేతువే. వైజయంతీ పరిమళ వాయువు చామరంతో వ్యాపిస్తుంది. చామరాన్ని వీవటంచేత తాపం అణగిపోతుంది. అధర్మంనుండి పుట్టిన తాపం ధర్మంవల్ల సమసిపోతుంది. ఇట బాణాగ్ని అణగారుటకు, దాని తాపం చల్లారుటకు గద వైజయంతీమాలలు పేర్కొనబడినవి. అవి అంగుష్ఠమాత్ర దేహునికి ఆభరణాలుగా అగుపించినా, శత్రుసంహారంలో, తాపం చల్లార్చటంలో ఎంతటి మహత్తరప్రయోజనాన్ని సాధించినాయో నిశిత పరిశీలన వలన నిరూపింపబడ్డాయి.

**వ. ఇట్లు భక్త పరాధీనుండయిన పరమేశ్వరుం డావిర్భవించి మంచు విరియించు మార్తాండుచందంబున శిశువునకు దశదిశలం దనచేతి యఖండిత మహోల్కాజాలసన్నిభంబైన గదాదండంబు మండలాకారంబుగ. జిఱజిఱం ద్రిప్పి విప్రుని చిచ్చుఱమ్ము వేఁడిమి పోఁడిమిఁ జెఱచి, డింభకుని పరితాపవిజృంభణంబు నివారించి, గర్భంబు గందకుండ రక్షించి యర్భకునికి నానందంబు గల్పించిన 286**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; భక్త+పర+అధీనుండు= భక్తులకు మిగుల లోబడినవాడు; అయిన= అయినట్టి; పరమేశ్వరుండు= శ్రీమహావిష్ణువు; ఆవిర్భవించి= అవతరించి, సంభవించి; మంచున్= మంచును, హిమమును; విరియించు= నశింపజేయు; నిర్మూలించు; మార్తాండు+చందంబునన్= సూర్యునివలె; శిశువునకున్= బాలునకు; దశదిశలన్= పది దిక్కులలో; తన చేతి= తన చేతియొక్క; అఖండిత= ముక్కలుకాని (మొక్కపోవని); మహా+ఉల్కా+సన్నిభంబు+ఐన= గొప్ప తోకచుక్క లేదా అరిష్ట సూచకంగా ఆకాశంనుండి పడే కాంతి సమూహంతో సమానమైన; గదా దండంబున్= దుడ్డుకఱ్ఱవంటి గదను; మండల+ఆకారంబుగన్= గుండ్రని ఆకృతితో; జిఱజిఱన్= గిరగిర; త్రిప్పి= తిరుగజేసి; విప్రుని= బ్రాహ్మణుని (అశ్వత్థామ యొక్క); చిచ్చుఱమ్ము= నిప్పులు చిమ్మే అమ్మును; వేఁడిమి+పోఁడిమిన్= వేడియొక్క లక్షణాన్ని; చెఱచి= పోగొట్టి, నశింపజేసి; డింభకుని= బాలకునియొక్క; పరితాప+విజృంభణంబు= సంతాపముయొక్క; అతిశయాన్ని నివారించి= అడ్డగించి; గర్భంబు= కడుపులోని బిడ్డ; కందకుండన్= కమిలిపోకుండ; రక్షించి= కాపాడి; అర్భకునికిన్= బాలునికి; ఆనందంబు= సంతోషము; కల్పించినన్= కలిగించగా

**తా :** ఈ రీతిగా భక్తులకు లొంగిన విష్ణువు సాక్షాత్కరించి మంచును తొలగించే సూర్యునివలె బాలునికి పది దిక్కులలో తన చేతి గదను గుండ్రంగా గిరగిరమని తిప్పినాడు. అప్పుడు అది మొక్కవోవని గొప్పనిప్పుమంటవలె గుప్పుగుప్పుమని తిరిగినది. దానితో అశ్వత్థామ ప్రయోగించిన ఆగ్నేయాస్త్రముయొక్క వేడిమి అణగిపోయింది. బాలకుని చుట్టుముట్టిన సంతాపం నివారింపబడింది. ఎప్పుడు దేహాన్ని చుట్టుకొన్న మంటలు తొలగిపోయినవో అప్పుడు శిశువునకు ఎంతో సంతోషం కలిగింది.

**మ. గదఁ జేఁబట్టి పరిభ్రమించుచు గదాఘాతంబులం దుర్భయ**
**ప్రదమై వచ్చు శరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించు నీ**
**సదయుం డెవ్వఁడొకో యటంచు మదిలోఁ జర్చించుచున్ శాబకుం**
**డెదురై చూడ నదృశ్యుఁడయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా! 287**

**ప్రతి :** విప్ర+ఉత్తమా!= బ్రాహ్మణశ్రేష్ఠుడా!; గదన్= గదను; చేన్= చేతిలో; పట్టి= ధరించి; పరిభ్రమించుచున్= అంతట తిరుగుచు; గదా+ఆఘాతంబులన్= గదయొక్క దెబ్బలచే; దుర్+భయ+ప్రదము+ఐ= చెడ్డదైన భీతిని మిక్కిలి కలిగించునదియై; వచ్చు= సమీపమునకు నడచు; శర+అగ్నిన్= బాణముయొక్క అగ్నిని; తుత్తుమురుగాన్= పొడి పొడిగా; భంజించి= విరిచి, నశింపజేసి; రక్షించు= కాపాడు; ఈ+సదయుండు= ఇట్టి దయగలవాడు; ఎవ్వఁడు+ఒకో= ఎవ్వడో; అటంచున్= అనుచు; మదిలోన్= మనస్సులో; చర్చించుచున్= విమర్శించుచు; శాబకుండు= బాలుడు; ఎదురు+ఐ= ఎదుటివాడై అభిముఖముగా; చూడన్= పరికింపగా; సర్వ+ఈశుండు= అందరకు ప్రభువైన వాడగు; హరి= మహావిష్ణువు; అదృశ్యుఁడు= మాయమైనవాడు; అయ్యెన్= అయినాడు.

**తా :** ఓ బ్రాహ్మణోత్తమా! గదను చేతబట్టి అటునిటు అంతట తిరుగుచు, బాలునికి మిక్కిలి భీతిని కలిగించి చెంతకు వచ్చే బాణాగ్నిని, తన గదాప్రసారములచే పొడి పొడి గావించి నన్ను కాపాడే ఈ దయామయుడు ఎవ్వడై ఉండునో అని బాలకుడు తలపోయుచు చూచుచుండగా అంతలోనే విష్ణువు అంతర్ధానమైనాడు.

**వ. అంత ననుకూల శుభగ్రహోదయంబును, సర్వగుణోత్తర ఫలసూచకంబును నైన శుభలగ్నంబునం బాండవ వంశోద్ధారకుం డయిన కుమారుండు జన్మించిన, ధర్మనందనుండు ధౌమ్యాది భూసుర వర్గంబు రప్పించి, పుణ్యాహంబు సదివించి జాతకర్మంబులు సేయించి, కుమారు జన్మ మహోత్సవ కాలంబున భూసురులకు విభవాభిరామంబు లయిన గో భూ హిరణ్య హయానేక గ్రామంబులును, స్వాదు రుచి సంపన్నంబు లయిన యన్నంబు లిడిన వారలు తృప్తులై ధర్మపుత్త్రున కిట్లనిరి. 288**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; అనుకూల= సరిపడు; శుభ+గ్రహ+ఉదయంబును= మంగళకరములగు స్థానములలో, గ్రహములయొక్క ఔన్నత్యమును, అనగా అనుకూలించిన శుభ స్థానములలో గ్రహముల సంచారం; సర్వగుణ+ఉత్తర+ ఫలసూచకంబును= అన్ని మంచిగుణములయొక్క భావికాలమునందలి ఫలితమును, సూచించునట్టిదియును; ఐన= అయినటువంటి; శుభలగ్నంబునన్= మంగళ ముహూర్తమునందు; పాండవవంశ+ఉద్ధారకుండు= పాండవులయొక్క వంశమును ఉద్ధరించువాడు; అయిన= అయినట్టి; కుమారుండు= పుత్త్రుడు; జన్మించినన్= పుట్టగా; ధర్మనందనుండు= ధర్మరాజు; ధౌమ్య+ఆది భూసుర వర్గంబున్= పురోహితుడైన ధౌమ్యుడు మొదలగు బ్రాహ్మణుల సమూహమును; రప్పించి= తన కడకు వచ్చునట్లుచేసి; పుణ్యాహంబుల= అశుద్ధినివారక కర్మలకు సంబంధించిన మంత్రములు; చదివించి= పఠింపజేసి; దీనినే పుణ్యాహవాచనంబులు అంటారు; జాతకర్మంబులు+చేయించి= పుట్టిన వెంటనే బిడ్డలకు తల్లిదండ్రులు చేయు సంస్కారములు నిర్వహింపజేసి; కుమార+జన్మ+మహా+ఉత్సవ+కాలంబునన్= పుత్త్రుని పుట్టుకయొక్క గొప్ప పండుగ సమయమున; భూసురులకున్= బ్రాహ్మణులకు; విభవ+అభిరామంబులు+అయిన= వైభవముతో శోభించునట్టివైన, గో, భూ, హిరణ్య; హయ+అనేక గ్రామంబులును= ఆవులు, భూమి, బంగారము, గుఱ్ఱములు, పెక్కు గ్రామములును; స్వాదు రుచి సంపన్నంబులు= ఇంపైన చవి నింపునట్టివి; అయిన= అయినట్టి; అన్నంబులు= భోజనములు; ఇడినన్= పెట్టగా; వారలు= వారు; తృప్తులు+ఐ= తనివినందినవారై; ధర్మపుత్త్రునకున్= ధర్మనందనునకు; ఇట్లు= ఈ విధముగా; అనిరి= చెప్పినారు.

**తా :** ఆ సమయాన అనుకూలించే మంచి గ్రహములన్నీ ఉన్నత స్థానాల్లో ఉన్నవి. అన్నింటి మంచిగుణములయొక్క భావిఫలితం సూచింపబడింది. అట్టి శుభముహూర్తంలో పాండవవంశాన్ని నిలిపి ఉద్ధరింపగల కుమారుడు పుట్టినాడు.

అపుడు ధర్మరాజు తమ పురోహితుడైన ధౌమ్యుని, పలువురు బ్రాహ్మణులను రప్పించి పుణ్యాహవాచనం జరిపించి, పుట్టిన వెంటనే బిడ్డలకు చేయవలసిన అనేక సంస్కార క్రియలను నిర్వహింపజేసినాడు. అటుపై బ్రాహ్మణులకు, కుమారుడు పుట్టిన గొప్ప పండుగను పురస్కరించుకొని ఎంతో వైభవంతో గోవులు, భూమి, బంగారం, గుఱ్ఱములు, అగ్రహారాలు దానంచేసి, ఆ బ్రాహ్మణులను ఇష్టాన్నసంతృప్తులను చేసినాడు. వారందరూ సంతోషంతో ధర్మజునితో ఇట్లా పలికినారు.

**చ. ప్రకటిత దైవ యోగమునఁ బౌరవ సంతతి యంతరింపఁగా**
**వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు విష్ణుఁ డనుగ్రహించి శా**
**బకు బ్రదికించెఁ గావున నృపాలక! శాబకుఁ డింక శాత్రవాం**
**తకుఁ డగు, విష్ణురాతుఁ డన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కుఁ బూజ్యుఁడై. 289**

**ప్రతి :** నృపాలక!= నరులను పాలించే ఓ ధర్మరాజా!; ప్రకటిత= వ్యక్తం కావింపబడిన; దైవయోగమునన్= దైవము అనుకూలించడం చేత; పౌరవ+సంతతి= మీ పురువంశమునకు చెందిన సంతానం; అంతరింపఁగాన్= నశింపగా; వికలతన్= కలవరపాటును; ఒందన్+ఈక= పొందనీయకుండ; ప్రభవిష్ణుఁడు= ప్రభావము ప్రకటించేవాడు; విష్ణుఁడు= సర్వవ్యాపకుడైన మహావిష్ణువు; అనుగ్రహించి= దయచూపి; శాబకున్= బాలకుని; బ్రదికించెన్= జీవింపజేశాడు; కావునన్= కాబట్టి; ఇంకన్= ఇటుపైన; శాబకుఁడు= బాలుడు; శాత్రవ+అంతకుఁడు= శత్రువుల సమూహమును, అంతము నొందించువాడు; అగున్= అగును; పూజ్యుఁడు+ఐ= పూజింపదగినవాడై; ధాత్రిన్= భువిలో; విష్ణురాతుఁడు= విష్ణువుచే కొనిరాబడిన వాడు (విష్ణువుచే ఈయబడినవాడు); అనన్= అనగా; ప్రసిద్ధికిన్+ఎక్కున్= ఖ్యాతి వహిస్తాడు.

**తా :** ధర్మజా! మీ పురువంశపు సంతతి పూర్తిగా నశింపబోతున్నదన్న సమయంలో మీ అదృష్టవశమున మీ వంశ విచ్ఛిత్తి జరుగనీయకుండ అత్యంత ప్రభావంకల విష్ణువు దయచూపి ఈ పిల్లవానిని బ్రతికించినాడు. కనుక ఇక ఇతడు శత్రు సమూహాన్ని అంతమొందించి, విష్ణురాతుడు అనే పేరుతో ప్రఖ్యాతి వహిస్తాడు.

**వ. అనిన భూదేవోత్తములకు నరదేవోత్తముం డిట్లనియె. 290**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; వినిన= ఆలకించిన; భూదేవ+ఉత్తములకున్= భూలోకదేవతలైన బ్రాహ్మణశ్రేష్ఠులకు; నర దేవ+ఉత్తముండు= రాజశ్రేష్ఠుడు ధర్మరాజు; ఇట్లు= ఈ విధముగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని పల్కిన బ్రాహ్మణోత్తములకు నరపాలకులలో శ్రేష్ఠుడైన ధర్మరాజు ఈ రీతిగా అన్నాడు.

**శా. ఓ పుణ్యాత్మకులార! నా పలుకు మీ రూహింపుఁడా మ్రొక్కెదన్**
**మా పెద్దల్ శ్రుతకీర్తులై సదయులై మన్నారు రాజర్షులై**
**యీ పిన్నాతఁడు వారిఁ బోలెడిఁగదా యెల్లప్పుడున్ మాధవ**
**శ్రీపాదాంబుజ భక్తియుక్తుఁ డగుచున్ జీవించునే? చూడరే! 291**

**ప్రతి :** ఓ+పుణ్య+ఆత్మకులార!= పుణ్యస్వరూపులైన ఓ బ్రాహ్మణులారా!; మీరు= మీరందరు; నా పలుకు= నాయొక్క మాటలు; ఊహింపుఁడు+ఆ+= ఆలోచింపుడీ; మ్రొక్కెదన్= నమస్కరింతును; మా పెద్దల్= మాయొక్క వంశములోని పెద్దవారు; శ్రుతకీర్తులు+ఐ= చెవికెక్కిన యశస్సు కలవారై; స+దయులు+ఐ= దయతో కూడినవారై; రాజ+ఋషులు+ఐ=

రాజులలో ఋషులై; మన్నారు= జీవించారు; ఈ పిన్న+ఆతఁడు= ఈ చిన్నవాడు; వారిన్= ఆ మా పూర్వులైన పెద్దవారిని; పోలెడిన్+కదా!= సరిపోలుతాడు గదా!; ఎల్లప్పుడున్= అన్నివేళలలో; మాధవ శ్రీపాద+అంబుజ భక్తి యుక్తుఁడు= విష్ణువుయొక్క శుభమైన పాదపద్మములందు భక్తితో కూడినవాడు; అగుచున్= అగుచు; జీవించున్+ఏ= బ్రతుకునా?; చూడరు+ఏ= కనుగొనరే! జాతకము చూచి చెప్పండి.

**తా :** పుణ్యమూర్తులైన ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా! నా మాటలు విని ఆలోచింపుడు. మా పెద్దలు పేరుప్రతిష్ఠలతో ఎంతో కీర్తి గడించినవారై దయామయులై, జీవించారు. వారందరు రాజర్షులు. ఈ బాలుడు ఎల్లప్పుడు వారికి సమానుడవుతాడా? నిరంతరం శ్రీమహావిష్ణువుయొక్క పాదపద్మాలపై భక్తి కలిగినవాడై జీవిస్తాడా? చూచి చెప్పండి.

**వ. అనిన విని నరేంద్రా! భవదీయపౌత్త్రుండు మనుపుత్త్రుండయిన యిక్ష్వాకుని చందంబునం బ్రజల రక్షించు; శ్రీరామచంద్రుని భంగి బ్రహ్మణ్యుండు సత్యప్రతిజ్ఞుండు నగు; దేగ వెంట నంటిన బిట్టు భీతంబై వెనుకకు వచ్చిన కపోతంబుఁ గాచిన శిబిచక్రవర్తి రీతి శరణ్యుండును వితరణఖనియు నగు; దుష్యంతసూనుండైన భరతు పగిది సోమాన్వయజ్ఞాతివర్గంబులకు యజ్వలకు ననర్గళ కీర్తి విస్తరించు; ధనంజయ కార్తవీర్యుల కరణి ధనుర్ధరాగ్రేసరుండగుఁ; గీలి పోలిక దుర్ధర్షుం డగు; సముద్రుని తెఱంగున దుస్తరుండగు; మృగేంద్రంబు కైవడి విక్రమశాలి యగు; వసుమతివోలె నక్షయ క్షాంతి యుక్తుండగు; భానుని లాగునఁ బ్రతాపవంతుండగు; వాసుదేవు వడువున సర్వభూతహితుం డగుఁ; దల్లిదండ్రుల మాడ్కి సహిష్ణుం డగు. మఱియును. 292**

**ప్రతి :** అనినన్= అని ధర్మజుడు అడుగగా; విని= బ్రాహ్మణులు ఆలకించి; నరేంద్రా!= ఓ రాజా!; భవదీయపౌత్త్రుండు= మీయొక్క మనుమడు; మను పుత్త్రుండు+అయిన= మనువుయొక్క కుమారుడైన; ఇక్ష్వాకుని చందంబునన్= ఇక్ష్వాకు మహారాజువలె; ప్రజలన్= జనులను; రక్షించున్= కాపాడుతాడు; శ్రీరామచంద్రుని భంగిన్= దశరథుని కుమారుడైన శ్రీరామునివలె; బ్రహ్మణ్యుండు= వేదధర్మాన్ని అనుసరించి జీవించేవాడు అనగా వేదాన్ని చక్కగా చదివి ఆచరణలో ఉంచినవాడు; సత్యప్రతిజ్ఞుండున్+అగున్= చేసిన ప్రతినలు నిజంగా నిలబెట్టుకొనగలవాడు ఔతాడు; దేగ= సాళువము; వెంటన్+అంటినన్= వెంబడించి తాకగా; బిట్టు= మిక్కిలి; భీతంబు+ఐ= భయపడినదై, వెనుకకున్; వచ్చిన= మరలి వచ్చినట్టి; కపోతంబున్= పావురాన్ని; కాచిన= రక్షించిన; శిబిచక్రవర్తి రీతిన్= శిబి అనే సార్వభౌముని విధంగా; శరణ్యుండును= శరణు చొచ్చుటకు తగినవాడును; వితరణఖనియున్= దానమునకు గనివంటివాడును; అగున్= ఔతాడు; దుష్యంత సూనుండు+ఐన= దుష్యంతునియొక్క కుమారుడైన; భరతు పగిదిన్= భరతునివలె; సోమ+అన్వయ చంద్రవంశమునందలి; జ్ఞాతి+వర్గంబులకున్= దాయాదుల సమూహానికి; యజ్వలకున్= విధ్యుక్తంగా యజ్ఞం నిర్వర్తించేవారికి; అనర్గళ= అడ్డంకిలేని; కీర్తిన్= యశస్సును; విస్తరించున్= వ్యాపింపజేస్తాడు; ధనంజయ కార్తవీర్యుల కరణిన్= అర్జునుడు మఱియు కార్తవీర్యార్జునులవలె; ధనుర్ధర (ధనుః+ధర)+అగ్రేసరుండు+అగున్= విల్లును దాల్చినవాళ్లలో మొదటివాడు ఔతాడు; కీలి పోలికన్= అగ్ని మాదిరిగా; దుర్ధర్షుండు+అగున్= తిరస్కరింపదగనివాడు ఔతాడు; సముద్రుని తెఱంగునన్= సాగరంవలె; దుస్+తరుండు= దాటరానివాడు; అగున్= ఔతాడు; మృగ+ఇంద్రంబు కైవడిన్ = సింహమువలె విక్రమశాలి+ అగున్= పరాక్రమముతో ప్రకాశించువాడౌతాడు; వసుమతి+పోలెన్= భూదేవివలె; అక్షయ+క్షాంతియుక్తుండు+ అగున్= నాశంలేని ఓర్పుతో కూడుకొన్నవాడు ఔతాడు; భానునిలాగునన్= సూర్యునివలె; ప్రతాపవంతుండు+అగున్= తేజస్సు కలవాడౌతాడు; వాసుదేవు+వడువునన్= వసుదేవుని పుత్త్రుడైన కృష్ణునివలె; సర్వ+భూతహితుండు+అగున్= అన్ని

ప్రాణులకు మేలు కలిగించువాడౌతాడు; తల్లిదండ్రుల మాడ్కిన్= జననీజనకులవలె; సహిష్ణుండు+అగున్= ఓర్పుగలవాడు ఔతాడు; మఱియును= ఇంకను.

**తా :** ఆ విధంగా యుధిష్ఠిరుడు అడుగగా బ్రాహ్మణులు యిట్లన్నారు : ధర్మరాజా! నీ మనుమడు మనువు తనయుడైన ఇక్ష్వాకునివలె జనులను పాలిస్తాడు. శ్రీరామచంద్రునివలె వేదధర్మాలను నిలిపి తాను కావించిన ప్రతిజ్ఞలను నెరవేరుస్తాడు. డేగ తరుముకొనిరాగా శరణుజొచ్చిన పావురాన్ని రక్షించిన శిబి చక్రవర్తివలె శరణాగతులై అండజేరిన వాళ్లను కాపాడుతాడు. దానగుణంలో గనివంటివాడౌతాడు. దుష్యంతుని కుమారుడైన భరతునివలె చంద్రవంశం వారైన తన బంధువులకు, యజ్ఞయాగాదులు కావించే బ్రాహ్మణులకు ఎనలేని కీర్తిని విస్తరిల్లజేస్తాడు. అర్జున కార్తవీర్యార్జునులవలె విలుకాండ్రలో మొట్టమొదట గణింపదగినవాడౌతాడు. అగ్నిహోత్రునివలె తిరస్కరింపరానివాడవుతాడు. సింహంలాగా పరాక్రమాన్ని ప్రకటిస్తాడు. సముద్రంలాగా తరించడానికి అసాధ్యుడౌతాడు. భూదేవివలె అపరిమితమైన ఓర్పును ప్రదర్శిస్తాడు. సూర్యునివలె తేజస్సుతో శత్రువులను తపింపజేస్తాడు. వాసుదేవునివలె సమస్త ప్రాణికోటికి మేలు కలిగిస్తాడు. తల్లిదండ్రులవలె ప్రజలయెడ సహనం కలిగి ఉంటాడు. ఇంతేకాదు, ఇంకను ఎందఱో ప్రసిద్ధ ప్రభువుల గుణాలను తనలో ఇమిడించుకొన్నాడు.

**విశే :** ఖని – ఎందరు ఎంత ప్రమాణంలో తీసుకున్నా తరుగువోనిది. దానివలె ఇస్తూ ఉంటాడని భావం.

**సీ. సమదర్శనంబున జలజాతభవుఁ డనఁ బరమప్రసన్నత భర్గుఁ డనఁగ**
**నెల్లగుణంబుల నిందిరావిభుఁ డన నధికధర్మమున యయాతి యనఁగ**
**ధైర్యసంపద బలిదైత్యవల్లభుఁ డన నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ**
**రాజితోదారత రంతిదేవుం డన నాశ్రిత మహిమ హేమాద్రి యనఁగ**

**తే. యశము నార్జించుఁ, బెద్దల నాదరించు, నశ్వమేధంబు లొనరించు, నాత్మసుతుల**
**ఘనులఁ బుట్టించు, దండించు ఖలులఁ బట్టి, మానధనుఁడు నీ మనుమండు మానవేంద్ర! 293**

**ప్రతి :** మానవ+ఇంద్ర!= మానవులలో శ్రేష్ఠుడవైన యుధిష్ఠిర మహారాజా!; మానధనుఁడు= అభిమానమే ధనముగా గల; నీ+మనుమఁడు= నీ పుత్రుని పుత్రుడు; సమదర్శనంబునన్= అందరిని సమానంగా చూడటంలో; జలజాతభవుఁడు= విష్ణువుయొక్క నాభికమలమున పుట్టినవాడగు బ్రహ్మదేవుడు; అనన్= అనేట్లుగా; పరమ ప్రసన్నతన్= మిక్కిలి సుముఖత్వంచేత; నిర్మలత్వంచేత; భర్గుఁడు= శివుడు; అనఁగన్= అనేట్లుగాను; ఎల్ల గుణంబులన్= అన్ని కల్యాణ గుణములచేత; ఇందిరా విభుఁడు+అనన్= లక్ష్మీదేవి భర్తగాను; విష్ణుమూర్తి అనేట్లు; అధిక+ధర్మమునన్= గొప్ప ధర్మగుణంచే; యయాతి+అనఁగన్= యయాతి మహారాజుగా; ధైర్య+సంపదన్= ధైర్యంయొక్క సమృద్ధిచేత; బలి దైత్యవల్లభుఁడు+అనన్= బలి అను రాక్షస ప్రభువు అనేట్లు; అచ్యుతభక్తిన్= విష్ణుభక్తి విషయంలో; ప్రహ్లాదుఁడు+అనఁగన్= ప్రహ్లాదుడుగా; రాజిత+ఉదారతన్= వెలుగొందే; దానగుణంచే, ప్రాభవంగల ఔదార్యంచే; రంతిదేవుండు+అనన్= రంతిదేవుడు అనేట్లుగా; ఆశ్రిత+మహిమన్= ఆశ్రయింపదగిన గొప్పతనంచే; హేమ+అద్రి+అనఁగన్= మేరుపర్వతం అనేట్లు; యశమున్= కీర్తిని; ఆర్జించున్= సంపాదిస్తాడు; పెద్దలన్= గొప్పవారిని, గురువులను; ఆదరించున్= గౌరవిస్తాడు; అశ్వమేధంబులు= గుఱ్ఱమును పశువు గావించి చేసే యాగాలను; ఒనరించున్= నిర్వహిస్తాడు; ఆత్మ+సుతులన్= తన కుమారులను; ఘనులన్= గొప్పవారిని; పుట్టించున్= జన్మింపజేస్తాడు; ఖలులన్= నీచులను, దుర్మార్గులను; పట్టి= పట్టుకొని; దండించున్= శిక్షిస్తాడు.

**తా :** ఓ ధర్మరాజా! నీ మనుమడైన ఈ బాలుడు అభిమానమే ధనముగా గలవాడై, అందరిని సమదృష్టితో చూడడంలో బ్రహ్మవంటివాడవుతాడు. ఇతరులను అధిక ప్రసన్న దృష్టితో అనుగ్రహించటంలో శివుడు. సమస్త ప్రశస్త కల్యాణ గుణాలలో సాక్షాత్తు మహావిష్ణువును, ధర్మాన్ని ఆచరించడంలో యయాతిని, ధైర్యసంపత్తిలో దానవశ్రేష్ఠుడైన బలిచక్రవర్తిని పోలుతాడు. విష్ణుభక్తిలో ప్రహ్లాదుని వంటివాడవుతాడు. ఔదార్యంలో రంతిదేవునికి దీటుగా ఉంటాడు. మేరువువలె ఆశ్రయింపదగినవాడవుతాడు. ఇతడు కీర్తిని సంపాదిస్తాడు. పెద్దలను మన్నిస్తాడు. అశ్వమేధ యాగాలు చేస్తాడు. గొప్ప కొడుకులను కంటాడు. దుష్టులను దండిస్తాడు.

**భుజంగ ప్రయాతము**

**హరించుం గలిప్రేరితాఘంబు లెల్లన్**
**భరించున్ ధరన్ రామభద్రుండువోలెన్**
**జరించున్ సదా వేద శాస్త్రానువృత్తిన్**
**వరించున్ విశేషించి వైకుంఠు భక్తిన్.** **294**

**ప్రతి :** కలిప్రేరిత+అఘంబులు= కలిచేత, ప్రేరేపింపబడిన పాపాలు; ఎల్లన్= అన్నింటిని; హరించున్= పోగొడతాడు; ధరన్= భూమిని; రామభద్రుండు+పోలెన్= శ్రీరామునివలె; భరించున్= పోషిస్తాడు, కాపాడుతాడు; సదా= ఎల్లప్పుడు; వేదశాస్త్ర+అను+వృత్తిన్= వేదాలను, శాస్త్రాలను అనుసరించే ప్రవర్తనతో; చరించున్= మెలగుతాడు; విశేషించి= ప్రత్యేకించి; వైకుంఠు+భక్తిన్= విష్ణువునందలి భక్తిని; వరించున్= కోరి స్వీకరిస్తాడు.

**తా :** కలిపురుషుని ప్రేరణచే కలిగిన పాపాలన్నింటిని నశింపజేస్తాడు. శ్రీరామచంద్రునివలె పుడమిని రక్షిస్తాడు. వేదశాస్త్రాలను అనుసరించిన ప్రవర్తనతో మెలగుతాడు. అన్నింటిని మించి అతిముఖ్యంగా విష్ణువునందలి భక్తిని వరించి తరిస్తాడు.

**విశే :** పోతన సామాన్యంగా సాధారణ వృత్తాలనే గ్రహిస్తాడు. ఎక్కడో అరుదుగా విశేష వృత్తాలు ప్రయోగిస్తాడు. ప్రస్తుత వృత్తం భుజంగ ప్రయాతం. ఇందువరుసగా నాలుగు యగణములుంటాయి.

భుజంగ ప్రయాతం అంటే పాములాగా ప్రయాణించి పోయేది అని అర్థం. ఈ పద్యంయొక్క నడక అనగా లయ పాము నడకను పోలి ఉంటుందని భావం. భుజంగ ప్రయాతవృత్తంలో పరీక్షిత్తు జీవన విధానం నాలుగు వాక్యాలలో తెలుపబడింది. అటుపై వచనంలో 'తక్షక సర్ప' ప్రసక్తి వస్తుంది. ఈ విశేష వృత్తం పరీక్షిత్తు జీవిత వృత్తం ముగియటంతో ముడిపెట్టబడింది. సహజ పాండిత్య బిరుదాంచితుడైన పోతన రచనలో ఇచ్చట ఈ పద్యము అప్రయత్నంగా అర్థ స్ఫోరకంగా సహజరీతిలో సాగింది.

**వ. ఇట్లు పెక్కేండ్లు జీవించి, భూసురకుమారప్రేరితం బయిన తక్షకసర్పవిషానలంబునం దనకు మరణంబని యెఱింగి, సంగవర్జితుండయి ముకుంద పదారవింద భజనంబు సేయుచు, శుకయోగీంద్రుని వలన నాత్మవిజ్ఞానసంపన్నుండై, గంగాతటంబున శరీరంబు విడిచి, నిర్గతభయశోకం బయిన లోకంబుఁ బ్రవేశించునని జాతకఫలంబు సెప్పి లబ్ధకాములయి భూసురులు సని రంత.** **295**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పెక్కు+ఏండ్లు= అనేక సంవత్సరాలు; జీవించి= బ్రతికి; భూసుర కుమార ప్రేరితంబు= ఒక బ్రాహ్మణుని పుత్రునిచే (శృంగిచే) ప్రేరేపింపబడింది; అయిన= అయినట్టి; తక్షక సర్ప విష+అనలంబునన్= తక్షకుడు అనే

పేరుగల పాముయొక్క విషం అనే అగ్నిచేత; తనకున్= తనకు; మరణంబు+అని= చావని; ఎఱింగి= తెలిసికొని; సంగ వర్జితుండు+అయి= తగులములు, వీడినవాడై; ముకుంద పద+అరవింద భజనంబు= విష్ణువుయొక్క పాదపద్మాల సేవను; చేయుచున్= చేస్తూ; శుకయోగి+ఇంద్రుని వలనన్= యోగిశ్రేష్ఠుడైన శుకునివలన; ఆత్మవిజ్ఞాన సంపన్నుండు+ఐ= ఆత్మజ్ఞానం అనే సంపద కలవాడై; గంగాతటంబునన్= భాగీరథీ నది ఒడ్డున; శరీరంబున్= దేహాన్ని; విడిచి= వీడి; నిర్గత+భయశోకంబు+ అయిన= పోయిన భయమూ, దుఃఖమూ కలిగిన; లోకంబున్= లోకాన్ని; ప్రవేశించును= చేరుకుంటాడు; అని= అంటూ; జాతకఫలంబు= జన్మ లగ్నమునకు సంబంధించిన ఫలితం; చెప్పి= వివరించి; లబ్ధ+కాములు+అయి= పొందబడిన కోర్కెలు కలవారై; భూసురులు= బ్రాహ్మణులు; చనిరి= పోయిరి; అంతన్= అటుపై

**తా :** ఈ విధంగా పరీక్షిత్తు చాలా సంవత్సరాలు జీవిస్తాడు. ఒక బ్రాహ్మణ కుమారుడైన శృంగిచే ప్రేరేపింపబడ్డ తక్షకుడనే పాము విషాగ్నిచేత చనిపోతానని తెలిసికొని, అన్ని సంబంధాలను వదలిపెట్టి, విష్ణుని పాదపద్మాలను సేవిస్తూ, చివరగా శుకయోగీంద్రునివలన ఆత్మజ్ఞానాన్ని పొంది, గంగానదీతీరంలో తన శరీరం విడిచి, భయమూ, శోకమూ లేని లోకాన్ని పొందుతాడు అని బ్రాహ్మణులు జాతక ఫలితాన్ని సవిస్తరంగా వివరించి, తమ కోర్కెలు తీరేట్లు సంభావనలు పొందినవారై వెళ్లినారు.

**విశే :** సాధారణంగా జాతకఫలం చెప్పేవారు ఇచ్చకాలు పలుకుతూ ఉంటారు. వినేవాళ్ళు అవే అపేక్షిస్తూ ఉంటారు. కానీ ఇక్కడ జ్యౌతిషికులు అంతకాలంలో జరిగే అనర్థాన్ని కూడా విస్పష్టంగా చెప్పారు. విన్న ధర్మరాజు ఉద్విగ్నుడైపోకుండా, అటువంటి మాటలు చెప్పినవారికి సంతోషంతో దక్షిణలిచ్చాడు!

**క. తన తల్లి కడుపులోపల, మును సూచిన విభుఁడు విశ్వమున నెల్లఁ గలం**
**డనుచుఁ బరీక్షింపఁగ జను, లనఘుఁ బరీక్షిన్నరేంద్రుఁ డంద్రు మునీంద్రా! 296**

**ప్రతి :** ముని+ఇంద్రా!= ఓ మునిశ్రేష్ఠుడా!; తన+తల్లి= తన జననియైన ఉత్తర; కడుపులోపలన్= గర్భమునందు; మును= పూర్వం; చూచిన= కనుగొన్న; విభుఁడు= ప్రభువైన దైవం; ఎల్లన్= అంతట; విశ్వమునన్= ప్రపంచంలో; కలండు= ఉన్నాడు; అనుచున్= అని తలంచుతూ; పరీక్షింపఁగన్= పరిశీలింపగా; జనులు= లోకులు; న+అఘున్= పాపరహితుణ్ణి; పరీక్షిత్+నర+ఇంద్రుఁడు= పరీక్షిన్మహారాజు; అంద్రు= అని అంటారు.

**తా :** తల్లి కడుపులో ఉన్నప్పుడు ముందు తాను ఏ వాసుదేవుని చూచాడో అతడే ఈ సమస్త ప్రపంచంలో ఉన్నాడని కన్నులు విప్పి జన్మించే సమయంలో పరీక్షించడంవల్ల (అన్నివైపులా చూడటం వలన) మానవులు అతణ్ణి పరీక్షిత్తు అని పిలిచినారు.

**ఆ. కళలచేత రాజు క్రమమునఁ బరిపూర్ణుఁ, డయిన భంగిఁ దాత లనుదినంబుఁ**
**బోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యెను ధర్మ, పటలపాలకుండు బాలకుండు. 297**

**ప్రతి :** రాజు= చంద్రుడు; కళలచేతన్= తన పదహారు కళలచే; క్రమమునన్= వరుసగా; పరిపూర్ణుఁడు= చక్కగా నిండినవాడు; అయిన+భంగిన్= అయినవిధంగా; తాతలు= పితామహులు, తండ్రికి తండ్రులైనవారు; అనుదినంబున్= ప్రతి దినమూ; పోషణంబు+చేయన్= పోషింపగా; ధర్మపటల పాలకుండు= ధర్మాల సముదాయాన్ని పాలించేవాడు; బాలకుండు= బాలుడైన పరీక్షిత్తు; పూర్ణుఁడు+అయ్యెన్= విద్యాబుద్ధులతో నిండినవాడు అయినాడు.

**తా :** శుక్లపక్ష చంద్రుడు క్రమక్రమంగా కళలతో నిండి ఎలా పరిపూర్ణుడు ఔతాడో అట్లే తాతలు తనను ప్రతిదినం ఎంతో గారాబంగా పోషింపగా పరీక్షిత్తు ధర్మసమూహాన్ని పాలించేంతటి విద్యాబుద్ధులతో పరిపూర్ణుడు కాగలిగాడు.

**వ. మఱియు ధర్మనందనుండు బంధుసంహారదోషంబు వాయుకొఱకు నశ్వమేధయాగంబు సేయం దలంచి, ప్రజలవలనం గరదండంబుల నుపార్జితంబయిన విత్తంబు సాలక చిత్తంబునఁ జింతించునెడ నచ్యుత ప్రేరితులై భీమార్జునాదులు, దొల్లి మరుత్తుండను రాజు మఖంబు సేసి పరిత్యజించి నిక్షేపించిన సువర్ణ పాత్రాదికంబైన విత్తం బుత్తరదిగ్భాగంబువలన బలవంతులై తెచ్చిన, నా రాజసత్తముండు సమాయత్త యజ్ఞోపకరణుండై సకల బంధు సమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు సేసి, పురుషోత్తము నుద్దేశించి మూఁడు జన్నంబులు గావించెఁ దదనంతరంబ కృష్ణుండు బంధుప్రియంబు కొఱకుఁ గరినగరంబునఁ గొన్నినెల లుండి ధర్మ పుత్రాదులచే నామంత్రణంబు వడసి, యాదవ సమేతుండయి ధనంజయుఁడు దోడరా నిజనగరంబునకుం జనియె, నంతకు మున్ను విదురుండు తీర్థయాత్రకుఁజని మైత్రేయు ముందటఁ గర్మయోగవ్రతాది విషయంబు లయిన ప్రశ్నంబులఁ గొన్నిటిం జేసి యతనివలన నాత్మ విజ్ఞానంబు దెలిసి, కృతార్థుండై హస్తినాపురంబునకు వచ్చిన. 298**

**ప్రతి :** మఱియున్= ఇంకను; ధర్మనందనుండు= ధర్మరాజు; బంధుసంహారదోషంబు= బంధువులను చంపడంవలన కలిగిన దోషాన్ని; పాయుకొఱకున్= తొలగించుకోవడానికి; అశ్వమేధయాగంబు= అశ్వమేధమను యజ్ఞాన్ని; చేయన్+తలంచి= నిర్వహింప, నెంచి; ప్రజలవలనన్= జనులవలన; కరదండంబులన్= పన్నుచేత, దుష్టశిక్షణచేత; ఉప+ఆర్జితంబు+అయిన= సంపాదింపబడిన; విత్తంబు= ధనం; చాలక= సరిపోక; చిత్తంబునన్= మనస్సులో; చింతించు+ఎడన్= ఆలోచించే సందర్భంలో; అచ్యుత ప్రేరితులు+ఐ= కృష్ణునిచే ప్రేరేపింపబడినవారై; భీమ+అర్జున+ఆదులు= భీముడు, అర్జునుడు మొదలైనవారు; తొల్లి= పూర్వం; మరుత్తుండు+అనురాజు= మరుత్తుడనే పేరుగల ప్రభువు; మఖంబు+చేసి= యజ్ఞంచేసి; పరిత్యజించి= విడిచిపెట్టి; నిక్షేపించిన= దాచి ఉంచిన; సువర్ణపాత్ర+ఆదికంబు+ఐన= బంగారు పాత్రలు మొదలైన; విత్తంబు= ధనాన్ని; ఉత్తరదిక్+భాగంబువలనన్= ఉత్తర దిక్ప్రదేశంనుండి; బలవంతులు+ఐ= బలము కలవారై; తెచ్చినన్= తీసికొనిరాగా; ఆ రాజ సత్తముండు= ఆ రాజశ్రేష్ఠుడు; సమ్+ఆయత్త, యజ్ఞ+ఉపకరణుండు+ఐ= మిక్కిలిగా సమకూర్చుకోబడిన యజ్ఞానికి కావలసిన పరికరాలు కలవాడై; సకలబంధు సమేతంబుగన్= అందరు బంధువులతో కూడినవాడై; కృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణి; ఆహ్వానంబు+చేసి= పిలిచి; పురుష+ఉత్తమున్= పురుష శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని; ఉద్దేశించి= తలంపు ననుసరించి; మూఁడు= మూడు; జన్నంబులు= యజ్ఞములు; కావించెన్= చేసెను; తద్+అనంతరంబు+అ= అటుపైన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; బంధుప్రియంబు కొఱకున్= బంధువుల ప్రీతికొఱకు; కరినగరంబునన్= హస్తినాపురంలో; కొన్నినెలలు+ఉండి= కొన్ని మాసములు నివసించి; ధర్మపుత్ర+ఆదులచేన్= ధర్మరాజు మొదలైన వారిచే; ఆమంత్రణంబున్+పడసి= అనుమతిని పొంది; యాదవసమేతుండు+అయి= యాదవులతో కూడినవాడై; ధనంజయుఁడు= అర్జునుడు; తోడన్+రాన్= తనకు తోడుగా రాగా; నిజనగరంబునకున్= తన నగరమైన ద్వారకకు; చనియెన్= వెళ్ళాడు; అంతకున్+మున్ను= దానికి మునుపు; విదురుండు= విదురుడు; తీర్థయాత్రకున్+చని= తీర్థయాత్రకు పోయి; మైత్రేయు ముందటన్= మైత్రేయుని సమక్షంలో; కర్మయోగవ్రత+ఆదివిషయంబులు+అయిన= కర్మయోగానికి సంబంధించిన వ్రతాలు మొదలైన విషయాలకు సంబంధించిన; ప్రశ్నంబులన్= ప్రశ్నలను; కొన్నిటిన్+చేసి= కొన్నిటిని గురించి; అతని+వలనన్= అతనినుండి;

ఆత్మ+విజ్ఞానంబున్= ఆత్మసంబంధమైన విశిష్ట జ్ఞానాన్ని; తెలిసి= గ్రహించి; కృత+అర్థుండు+ఐ= నెరవేరిన ప్రయోజనము గలవాడై; హస్తినాపురంబునకున్= హస్తినగరమునకు; వచ్చినన్= రాగా...

**తా :** పరీక్షిత్తు పెరిగి పెద్దవాడౌతుండగా ధర్మరాజు అశ్వమేధ యాగం చేయదలచినాడు. బంధువులను యుద్ధంలో సంహరించిన దోషాన్ని పోగొట్టుకొనడానికై అశ్వమేధయాగాన్ని సంకల్పించినాడు. చాలినంత ధనం లేదని చింతిల్లినాడు. అప్పుడు కృష్ణుడు పూర్వం మరుత్తుడనే రాజు యజ్ఞాన్ని నిర్వహించడానికై ఆర్జించిన ధనాన్ని, తాను యజ్ఞం నిర్వహింపని కారణంగా భూమిలో నిక్షిప్తం గావించియుండినాడు. దానిని తీసికొని యజ్ఞం చేయుమని ప్రోత్సహించినాడు. భీమార్జునులు ఉత్తరంవైపు పోయి అక్కడ దాచియున్న ధనాన్ని తీసికొని వచ్చినారు. ధర్మరాజు శ్రీకృష్ణునుద్దేశించి మూడు యజ్ఞాలు నిర్వహించినాడు. ద్వారకనుండి హస్తినాపురానికి వచ్చిన శ్రీకృష్ణుడు కొన్ని మాసాలు ధర్మరాజాదులతో గడపి, ద్వారకకు పయనింపగా అర్జునుడు కూడా శ్రీకృష్ణునితో ద్వారకకు పోయినాడు. అంతకుమునుపు విదురుడు మైత్రేయుని కర్మయోగ రహస్యాన్ని గురించి కొన్ని ప్రశ్నలడిగి, అతనివల్ల ఆత్మజ్ఞాన సంపన్నుడై హస్తినాపురానికి విచ్చేసినాడు.

**క. బంధుఁడు వచ్చె నటంచును, గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం**
**బంధములు నెఱపి ప్రీతి న, మంథరగతిఁజేసి రపుడు మన్నన లనఘా! 299**

**ప్రతి :** అనఘా!= పాపంలేనివాడా! ఓరాజా!; అపుడు= ఆ సమయంలో; గాంధారీవిభుఁడు= గాంధారి భర్తయైన ధృతరాష్ట్రుడు; మొదలుగాన్+అందఱు= మొదలైన రాజబంధువులు మొత్తం; ప్రీతిన్= సంతోషంతో; సంబంధములు= చుట్టరికాలు; నెఱపి= ప్రకటించి; బంధుఁడు= చుట్టమైన విదురుడు; వచ్చెను+అట+అంచును= యాత్రలనుండి విచ్చేసినాడంటూ; మన్ననలు= సన్మానపూర్వకాలైన ఆదరణలు; అమంథరగతిన్= దండిగా; చేసిరి= కావించినారు.

**తా :** ఆత్మబంధువైన విదురుడు తీర్థయాత్రలు పూర్తిచేసుకొని హస్తినాపురానికి రాగానే, ధృతరాష్ట్రుడు మొదలైన చుట్టాలు మొత్తం ఎంతో సంతోషంతో ఎదురేగి స్వాగతం పలికారు.

**వ. అంత ధర్మనందనుండు విదురునికి మజ్జనభోజనాది సత్కారంబులు సేయించి సుఖాసీనుండై తనవార లందఱు విన నిట్లనియె. 300**

**ప్రతి :** అంతన్= అటుపైన; ధర్మనందనుండు= యముని పుత్రుడైన ధర్మరాజు; విదురునికిన్= తీర్థయాత్రలనుండి విచ్చేసిన విదురునికి; మజ్జన భోజన+ఆది సత్కారంబులు= స్నానం; భోజనం మొదలైన మర్యాదలు; చేయించి= ఒనర్చి; సుఖ+ఆసీనుండు+ఐ= సంతోషంగా కూర్చున్నవాడై; తనవారలు+అందఱున్= తనకు సంబంధించిన చుట్టాలు మొత్తం; వినన్= వినగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ధృతరాష్ట్రుడు మొదలైన బంధువుల స్వాగత సత్కారాల అనంతరం ధర్మరాజు విదురునికి తన యింట్లో స్నానభోజనాది సత్కార క్రియలు నిర్వర్తించి అతడు సుఖాసీనుడై ఉన్న సందర్భంలో ఆయన దగ్గర చేరి, బంధువులందరు వింటుండగా ఇట్లా అడిగినాడు.

**సీ. ఏ వర్తనంబున నింతకాలము మీరు సంచరించితి రయ్య? జగతిలోన**
**నే తీర్థములు గంటి? రెక్కడ నుంటిరి? భావింప మీవంటి భాగవతులు**

**తీర్థసంఘంబుల ధిక్కరింతురు గదా! మీయందు విష్ణుండు మెఱయు కతన**
**మీరె తీర్థంబులు; మీ కంటె మిక్కిలి తీర్థంబు లున్నవె? తెలిసిచూడ**

**తే. వేఱు తీర్థంబు లవనిపై వెదక నేల; మిమ్ముఁ బొడగని భాషించు మేలె చాలు?**
**వార్త లేమంద్రు లోకులు వసుధలోన? మీకు సర్వంబు నెఱిఁగెడి మేధ గలదు. 301**

**ప్రతి :** అయ్య!= పూజ్యులైన విదుర మహాశయా!; జగతిలోనన్= లోకములో; మీరు= తమరు; ఇంతకాలము= ఇంత సమయం; ఏ వర్తనంబునన్= ఏ ప్రదేశంలో ఏ విధంగా మెలగుతూ; సంచరించితిరి= తిరిగినారు?; ఏ తీర్థములు= ఏ పుణ్యనదులు, క్షేత్రాలు; కంటిరి= చూచినారు?; ఎక్కడన్+ఉంటిరి?= ఏయే ప్రదేశాల్లో ఉండినారు?; భావింపన్= ఆలోచించగా; మీవంటి= మీబోటి; భాగవతులు= భగవద్భక్తులు; తీర్థసంఘంబులన్= పవిత్ర నదులను క్షేత్రాలను; ధిక్కరింతురు కదా?= లెక్కచేయరు కదా!; మీయందున్= మీలో; విష్ణుండు= విశ్వమంతట వ్యాపించిన భగవంతుడు; మెఱయు+కతనన్= ప్రకాశించటం వలన; మీరు= మీరే; తీర్థంబులు= పుణ్యనదులు, క్షేత్రాలు గదా!; తెలిసిచూడన్= పరికించి చూడగా; మీకంటెన్= మిమ్ములను మించి; మిక్కిలి= అధికంగా అతిశయించిన; తీర్థంబులు+ఉన్నవె?= తీర్థాలు ఉన్నాయా?; అవనిపైన్= పుడమిలో; వేఱుతీర్థంబులు= ఇతర తీర్థాలను; వెదకన్+ఏల?= అన్వేషించడం ఎందుకు?; మిమ్మున్= మిమ్ములను; పొడగని= చూచి; భాషించు= మాటాడే; మేలు+ఎ= శ్రేయస్సే; చాలున్= చాలును; కావలసినంత తృప్తి కలుగుతుంది; వసుధలోనన్= లోకంలో; లోకులు= జనులు; వార్తలు+ఏమి+అంద్రు= వార్తలు ఏమి అంటున్నారు?; మీకున్= మీకు; సర్వంబు= సమస్తం; ఎఱిఁగెడి= తెలిసికొనే; మేధ= ప్రజ్ఞ; కలదు= ఉన్నది.

**తా :** అయ్యా! మీరు ఇంతకాలం ఏయే ప్రదేశాలలో పర్యటించినారు? ఏయే పుణ్యతీర్థాలు చూచినారు? ఎక్కడెక్కడ నివసించినారు? మీవంటి భగవద్భక్తులు తీర్థాలను లెక్కచేయరు గదా! మీలోనే విష్ణువు ప్రకాశిస్తున్నాడు కావున అన్ని తీర్థాలు మీరే! బాగా ఆలోచించి చూస్తే మిమ్ము మించిన పుణ్యతీర్థాలు పుడమిలో ఎక్కడ ఉన్నాయి? మిమ్ము చూచి మాటాడితే చాలు సర్వశ్రేయస్సులు కలుగుతాయి. ఇక ఇతర తీర్థాలను వెతకవలసిన అవసరమే లేదు. మీరు సర్వజ్ఞులు. పుడమిలో లోకులు ఏమనుకొంటున్నారు? వార్తలేమి? మీరెక్కడ ఉన్నా లోకంలోని విశేషాలు అన్నీ తెలిసికోగలరు.

**మత్త. తండ్రి సచ్చినమీఁద మా పెదతండ్రిబిడ్డలు దొల్లి పె**
**క్కండ్రు సర్పవిషాగ్ని బాధల గాసిఁబెట్టఁగ మమ్ము ని**
**ల్లాండ్ర నంతముఁ బొందకుండఁగ లాలనంబున మీరు మా**
**తండ్రి భంగి సముద్ధరింతురు తద్విధంబు దలంతురే? 302**

**ప్రతి :** తండ్రి= మా తండ్రియైన పాండురాజు; చచ్చినమీఁదన్= చనిపోయిన తరువాత; తొల్లి= పూర్వం; మాపెదతండ్రిబిడ్డలు= మా పెదనాయనయైన ధృతరాష్ట్రుని కుమారులు; పెక్కండ్రు= పలువురు; సర్ప+విష+అగ్ని+బాధలన్= పాములచేత, విషంచేత, నిప్పుచేత దుఃఖాలను; గాసిన్= శ్రమను, వెతను; పెట్టఁగన్= కలిగింపగా; మమ్మున్= మమ్ములను; ఇల్లాండ్రన్= (మా) భార్యలను; అంతమున్= చావును; పొందకుండఁగన్= కలుగకుండా; మీరు= తమరు; లాలనంబునన్= బుజ్జగిపుతో; మాతండ్రి భంగిన్= మా తండ్రి పాండురాజులాగా; సముద్ధరింతురు= చక్కగా పైకి తీసికొని వచ్చినారు; తద్+విధంబున్= ఆ వైనమును; తలంతురు+ఏ= అనుకొనుచున్నారా, స్మరింతురా?

**తా :** మా తండ్రి మరణానంతరం మా పెదతండ్రి కుమారులు పలువురు మమ్ము పాములతో కరిపించారు. విషాన్నం తినిపించారు. ఇల్లు తగులబెట్టారు. ఒకటీ రెండూ కాదు. నానావిధాలుగా బాధలు పెట్టి వెతలు కలిగించారు. ఆ సందర్భాలలో మీరు మమ్ము, మా భార్యలను, మా తల్లిని చావునుండి కాపాడి, బుజ్జగించి, మా తండ్రివలె పైకితీసికొని వచ్చినారు. అన్ని కష్టాలనుండి ఉద్ధరించినారు. ఆ విషయాలను అన్నింటిని మీరెప్పుడైన తలచుకొందురా?

**విశే :** కౌరవులు పాండవులను తుదముట్టించుటకు చేసిన ప్రతి ప్రయత్నాన్ని విదురుడు ఎప్పటికప్పుడు చారుల మూలంగా తెలియజేసి కాపాడిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. లక్క ఇల్లు కాల్చడానికి దుర్యోధనుడు చేసే కుటిలయత్నాన్ని గూఢచారులవలన విదురుడు ముందుగానే గ్రహించి, తన శిష్యులను ధర్మరాజు దగ్గరికి పంపి విషయాన్ని తెలియబరచాడు. నీతికోవిదుడు, వివేకవంతుడైన విదురుడు తండ్రిలేని పాండవులపై చూపిన ప్రేమాభిమానాలకు లెక్కలేనన్ని నిదర్శనాలున్నవి. తండ్రి లేనిలోటు తీర్చి పాండవుల అభ్యుదయానికి అనుక్షణ రక్షణకు కంటికి రెప్పవలె తోడ్పడినవాడు విదురుడే అన్న విషయం ప్రస్తుత పద్యంలో ప్రస్ఫుటమైనది.

**క. పక్షులు తమఱెక్కలలోఁ, బక్షంబులు రాని పిల్లపదుపుల మమతన్**
**రక్షించిన క్రియ మీరలు, పక్షీకరణంబు సేయ బ్రతికితిమి గదే! 303**

**ప్రతి :** పక్షులు= పిట్టలు; తమ+ఱెక్కలలోన్= తమ రెక్కలకింద; పక్షంబులురాని= రెక్కలు రానట్టి; పిల్లపదుపులన్= చిన్నపిల్లల గుంపును; మమతన్= మమకారంతో; అభిమానంతో; రక్షించిన క్రియన్= కాపాడిన విధంగా; మీరలు= మీరు; పక్షీకరణంబు+చేయన్= పక్షపాతం చూపగా; బ్రతికితిమి+కదే!= జీవించాము కదా!

**తా :** పక్షులు తమ పిల్లలను రెక్కలలోదాచి, వాటికి రెక్కలువచ్చి ఎగిరేవరకు ఎంతో మమకారంతో ఎట్లా కాపాడుతాయో అట్లా మీరు మమ్ములను రక్షించినందువల్లనే మేము బ్రతుక కలిగినాము. లేనిచో మేము జీవించి ఉండేవారమా?

**క. మన్నారా ద్వారకలో, నున్నారా? యదువు లంబుజోదరు కరుణన్**
**గన్నారా? లోకులచే, విన్నారా? మీరు వారి విధ మెట్టిదియో? 304**

**ప్రతి :** మన్నారా?= (అందరు) జీవించి ఉన్నారా?; యదువులు= యాదవులు; ద్వారకలోన్= ద్వారకానగరిలో; ఉన్నారా= (సుఖంగా) ఉన్నారా?; అంబుజ+ఉదరు= శ్రీకృష్ణుని; కరుణన్= అనుగ్రహాన్ని; కన్నారా= పొందినారా?; మీరు= తమరు; వారి= ఆ యదువుల; విధము+ఎట్టిదియో= క్షేమ మెట్లున్నదో; లోకులచేన్= ప్రజలచే, విన్నారా= వినినారా?

**తా :** మీరు తీర్థయాత్రా సందర్భంలో ద్వారకకు వెళ్లినారు కదా! అచ్చట యాదవులు సుఖంగా జీవిస్తున్నారా? శ్రీకృష్ణుని అనుగ్రహం వారు పొందుతున్నారా? ఆ వాసుదేవుని చూచినారా? వారెట్లున్నారో లోకుల వలన మీరేమైనా విన్నారా?

**విశే :** పోతన తన భాగవత ప్రారంభములో 'కొందఱకుఁ దెనుఁగు గుణమగు' అనినాడు. కాని అంతలోనే నేను "అందఱ మెప్పింతుఁ గృతుల నయ్యెడలన్" అని చెప్పిన మాటను అక్షరాలా పాటించి అందరి మెప్పును పొందగలిగినాడు. ప్రస్తుత పద్యము 'మన్నారా?' అను క్రియాపదముతో ప్రారంభమైనది. ఈ క్రియకు అనుగుణంగా ప్రతిపాదం ప్రారంభంలో క్రియాపదాలనే వాడి పద్యాన్ని అనుప్రాసాలంకార శోభితం కావించినాడు. అవి యేదో అదేపనిగా అతికించినట్లు గాక సహజంగా వాటికవే వచ్చి కుదురుకొన్నట్లు చేశారు.

మూలాన విదురుని (తండ్రి) 'తాత' అని ధర్మజుడు సంబోధించియున్నాడు. ఇక క్రియాపదములు 'దృష్టాః శ్రుతా(వా) 'సుఖమాసతే' అనునవి ఉన్నవి. 'యదవః స్వపుర్యాం' అను పదములను 'యదువులు, ద్వారకలో' అని తెనిగించినాడు. 'మన్నారా?' అను ఎత్తుగడలో ఒక విశేషమున్నది. యాదవులు శాపగ్రస్తులు. శాపప్రభావముతో వారిలో వారు కలహించుకొని వంశనాశకులు కాబోవుచున్నారు. విదురుడు ద్వారక చేరునప్పటికే ఆ శాపము ఫలించినదా? అను అనుమానము కలిగితీరును. అందువలన మొట్టమొదటగా యాదవులు జీవించియున్నారా అనగా మన్నారా? అని కుశల ప్రశ్న ధర్మజుడు వేసినాడు. జీవించియున్నచో సుఖంగా ఉన్నారా? అని అడుగుట సమంజసము. 'కృష్ణదేవతాః' అను మూల ప్రయోగమునుబట్టి కృష్ణుడే దైవముగా గల యదువులు ఆయన అనుగ్రహమును పొందినారా? అనునది తర్వాతి ప్రశ్న. దీనినే పోతన 'అంబుజోదరు కరుణ గన్నారా?' అని తన కృష్ణభక్తిని కూడా అందులో చొప్పించినాడు. 'కన్నారా?' అను పదము 'పొందినారా?' అను అర్థములో యదువులకు, 'చూచినారా?' అను అర్థములో విదురునికి రెండువిధముల అన్వయించును.

ఎంతో సౌందర్య స్ఫూర్తితో సాగిన ఈ కందంలో అన్నీ ప్రశ్నలే. ఇందులో చివరిది లోకులవలన వారి వృత్తాంతం తెలుసుకోవడంలో యథార్థస్థితి యేమిటో తెలుస్తుందని ధర్మజుని అభిప్రాయం. యదువులను ప్రత్యక్షంగా చూచినపుడు వారు పైకి సుఖంగా ఉన్నట్లే కన్పడవచ్చు. అప్పుడు అంతఃకలహాలు బయటపడవు. అట్టివేమైనా ఉంటే లోకులు చక్కగా పసిగట్టగలరు. అందుకే మూలంలో లేని ఈ ప్రశ్నను పోతన తాను స్వయంగా కల్పించినాడు. ఆయన ఎంత భక్తుడో అంతటి లోకహిత దృష్టి గలవాడు. లోకులచే విన్నారా? అనేది వదంతులకు పుకారులకు సంబంధించినది కాక యథార్థ పరిస్థితిని తెలియడమే అని గ్రహింపవలసి ఉంది.

యదువులు అన్నచోట ఒక వ్యాకరణ విశేషం ఉన్నది. యదువు ఒక రాజు పేరు. యదువు వంశంలోని వారు అనే అర్థంలో ఒక తద్ధితప్రత్యయం చేరి 'యాదవ' అనే రూపం అవుతుంది కాబట్టి యదువంశంవారు 'యాదవులు' అనే కావాలి. కానీ కొన్ని సందర్భాలలో ఆ తద్ధితప్రత్యయం లోపిస్తుంది. అప్పుడు యదువులు అని మాత్రమే ఉంటుంది. 'రఘువులు' అనేదికూడ ఇటువంటిదే.

**చ. అన విని ధర్మరాజునకు నా విదురుండు సమస్తలోక వ**
**ర్తనముఁ గ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి యదుక్షయంబు సె**
**ప్పిన నతఁ డుగ్రశోకమున బెగ్గిలు చుండెడి నంచు నేమియున్**
**విను మని చెప్పఁడయ్యె; యదువీరుల నాశము భార్గవోత్తమా! 305**

**ప్రతి :** భార్గవ+ఉత్తమా!= భృగువంశస్థులలో శ్రేష్ఠుడవైన ఓ కౌశిక మునీ! (శౌనకమహర్షి తక్కిన మునులకు చెప్పే సందర్భం); అనన్= అని ధర్మరాజు అడుగగా; విని= ఆకర్ణించి; ఆ విదురుండు= (తీర్థ యాత్రలనుండి వచ్చిన) ఆ విదురుడు; ధర్మరాజునకున్= ధర్మజునికి; క్రమంబుతోడన్= వరుసగా; సమస్త లోక వర్తనమున్= అన్ని దేశముల వృత్తాంతాన్ని; విశదంబుగన్= స్పష్టంగా; చెప్పి= తెలిపి, యదుక్షయంబు= యాదవ వినాశము; చెప్పినన్= తెలిపినచో; అతఁడు= ఆ ధర్మరాజు; ఉగ్ర+శోకమునన్= భయంకరమైన దుఃఖంతో; బెగ్గిలుచుండెడిన్= కలత చెందుతాడు; అంచున్= అని తలపోసి; యదువీరుల నాశము= యాదవశూరుల చేటును; వినుము+అని= ఆకర్ణింపుమని; ఏమియున్= ఏ మాత్రము; చెప్పఁడు+అయ్యెన్= తెలుపలేదు.

**తా :** ఈ విధంగా ప్రశ్నించిన ధర్మరాజు మాటలు విని విదురుడు సమాధానంగా లోకమునందలి అన్ని విషయములను వరుసగా విశదీకరించి చెప్పినాడు. కాని యాదవుల వినాశాన్ని గూర్చి ఏమీ చెప్పలేదు. అలా చెపితే ధర్మజుడు భరింపరాని దుఃఖంతో మిక్కిలి క్రుంగి కృశిస్తాడని భావించి చెప్పలేదు.

**ఆ. మేలు సెప్పెనేని మే లండ్రు లోకులు, చెట్టయండ్రు కీడు చెప్పెనేని**
**నంతమీఁద శూద్రుఁడైన కతంబున, శిష్టమరణ మతఁడు సెప్పఁడయ్యె. 306**

**ప్రతి :** లోకులు= జనులు; మేలు= మంచి; చెప్పెన్+ఏనిన్= చెప్పినచో; మేలు+అండ్రు= మంచి అందురు; కీడు= అశుభం; చెప్పెన్+ఏనిన్= తెలిపితే; చెట్ట+అండ్రు= చెడుగు అందురు; అంతమీఁదన్= అటుపైన; శూద్రుఁడు+ఐన కతంబునన్= శూద్రుడైన కారణంచేత; అతఁడు= ఆ విదురుడు; శిష్ట+మరణము= మంచివారైన యదువుల మరణవార్త; చెప్పఁడు+అయ్యెన్= తెలుపలేదు.

**తా :** లోకులు మంచి విషయం చెప్పినచో మేలు మేలు అని మెచ్చుకొంటారు. చెడ్డ విషయం చెపితే అశుభం అని ఛీత్కారం చేస్తారు. పైగా సదయ హృదయుడైన విదురుడు శూద్ర స్త్రీకి జన్మించినవాడు కనుక మంచివారైన యదువీరుల మరణవార్తను ధర్మరాజుకు చెప్పలేకపోయాడు.

**విశే :** శిష్టుడు అంటే కొన్ని ప్రత్యేకమైన నియమనిష్ఠలతో జీవనం సాగించేవాడు.

**వ. అది యెట్లనిన మాండవ్యమహాముని శాపంబునం దొల్లి యముండు శూద్ర యోనియందు విదురుండై జన్మించియున్న నూఱు వత్సరంబు లర్యముండు యథాక్రమంబునం బాపకర్ముల దండించె; నిట యుధిష్ఠిరుండు రాజ్యంబుఁ గైకొని లోకపాలసంకాశు లయిన తమ్ములుం దానును గులదీపకుండైన మనుమని ముద్దుసేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖియై యుండెనంత. 307**

**ప్రతి :** అది= విదురుడు శూద్రుడు కావటం; ఎట్లు= ఏ విధం; అనినన్= అన్నచో; తొల్లి= పూర్వం; మాండవ్యమహాముని శాపంబునన్= మాండవ్యుడు అనే మహర్షి శాపంచే; యముండు= యమధర్మరాజు; శూద్రయోనియందున్= శూద్ర స్త్రీ గర్భమునందు; విదురుండు+ఐ= విదురుడు అనే పేరుగలవాడై, జన్మించి+ఉన్నన్= పుట్టియుండగా; నూఱు వత్సరంబులు= వందయేండ్లు; అర్యముండు= సూర్యుడు; యథాక్రమంబునన్= క్రమాన్ని అతిక్రమించకుండా; పాపకర్ములన్= పాపకర్మలు చేసినవారిని; దండించెన్= శిక్షించెను; ఇటన్= ఇచ్చట; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; రాజ్యంబున్+కైకొని= సామ్రాజ్యాన్ని గ్రహించి; లోకపాల+సంకాశులు+అయిన= లోకపాలకులతో సమానులైన; తమ్ములున్= సోదరులైన నలుగురును; తానును= స్వయంగా తానున్నూ; కులదీపకుండు+అయిన= (తమ) వంశమునకు దీపమువంటి వాడైన (పాండవుల కులాన్ని వెలిగించేవాడైన); మనుమనిన్= పౌత్రుడైన పరీక్షిత్తును; ముద్దు+చేయుచున్= ఆదరిస్తూ; పెద్దకాలంబు= చాలకాలం; మహా+వైభవంబునన్= గొప్ప విభవంతో; సుఖి+ఐ= సుఖం కలవాడై; ఉండెన్= ఉన్నాడు; అంతన్= అటుపైన.

**తా :** విదురుడు ధర్మస్వరూపుడు. పూర్వం మాండవ్యుడనే మహాముని శాపంవల్ల యముడు శూద్ర స్త్రీ గర్భంలో విదురుడైపుట్టి వంద యేండ్లు జీవించినాడు. ఆ నూరు సంవత్సరాలు యముని తండ్రియైన సూర్యుడే క్రమం తప్పకుండా యథావిధిగా యమధర్మరాజు స్థానంలో ఉండి పాపాత్ముల పాపకర్మలకు తగినట్లు శిక్షలు విధించినాడు.

ఇక ధర్మరాజు రాజ్యాన్ని స్వీకరించి, దిక్పాలుర వంటి సోదరులతోకూడి, కులదీపకుడైన మనుమడు పరీక్షిత్తును అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసి ఎంతోకాలం మిక్కిలి వైభవంతో సుఖంగా ఉండినాడు.

**క. బాలాజన శాలా ధన, లీలావన ముఖ్య విభవలీన మనీషా**
**లాలసు లగు మానవులను, గాలము వంచించు దురవగాహము సుమతీ! 308**

**ప్రతి :** సుమతీ!= మంచి మనస్సు కలవాడా!; బాలా+జన= కన్యలు, స్త్రీలు; శాలా+ధన= ఇండ్లు, ధనం; లీలావన= విహరించే తోటలు; ముఖ్యవిభవ= మొదలైన వైభవాలలో; లీన= మునిగిన; మనీషా= బుద్ధియందు; లాలసులు+అగు= ఆసక్తి కలవారైన; మానవులను= నరులను; కాలము= కాలం; వంచించున్= మోసగిస్తుంది; దురవగాహము= తెలియరానిది (పూర్తిగా బోధపడనిది).

**తా :** మంచి మనస్సుగల శౌనకా! విన్నావు కదా! కన్నెప్రాయపు కాంతాజనాలు, ఆనంద భవనాలు, అపారధనాలు, అందాలవనాలు మొదలైన భోగభాగ్యాలపై అమితమైన ఆసక్తిని పెంచుకొని అందులో పూర్తిగా మునిగిపోయి, అనుక్షణం అదే సౌఖ్యమని అందుకై అఱ్ఱులుచాచే మానవులను కాలం మోసం చేస్తుంది. వంచనాశీలమైన కాలప్రవాహం దురవగాహమైంది.

## ❖ గాంధారీ ధృతరాష్ట్రులు దేహత్యాగము చేయుట ❖

**వ. అది నిమిత్తంబుగాఁ గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 309**

**ప్రతి :** అది= కాల ప్రభావం ఊహకందనిది; నిమిత్తంబుగాన్= తెలియనగు ఆధారంగా; కాలగతి= కాలగమనం; ఎఱింగి= గ్రహించి; విదురుండు= విదురుడు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రునికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పినాడు.

**తా :** అందువలన ధర్మస్వరూపుడైన విదురుడు కాలతత్త్వాన్ని తెలిసినవాడై ధృతరాష్ట్రుని సమీపించి ఈ విధంగా ప్రబోధం చేశాడు.

**మ. కనకాగార కళత్ర మిత్ర సుత సంఘాతంబులన్ ముందటం**
**గని ప్రాణేచ్ఛల నుండు జంతువుల నే కాలంబు దుర్లంఘ్యమై**
**యనివార్యస్థితిఁ జంపునట్టి నిరుపాయంబైన కాలంబు వ**
**చ్చె నుపాంతంబున, మాఱు దీనికి మదిం జింతింపు ధాత్రీశ్వరా! 310**

**ప్రతి :** ధాత్రీ+ఈశ్వరా!= ధృతరాష్ట్ర మహారాజా!; కనక= బంగారము; అగార= గృహములు; కళత్ర= భార్యలు; మిత్ర= స్నేహితులు; సుత సంఘాతంబులన్= పుత్రుల సమూహములను; ముందటన్+కని= తమ ఎదుటచూచి; ప్రాణ+ఇచ్ఛలన్= ప్రాణమందలి మక్కువచే; ఉండు= జీవించే; జంతువులన్= ప్రాణులను; ఏ+కాలంబు= ఏ కాలం; దుర్+లంఘ్యము+ఐ= దాటరానిదై; అనివార్యస్థితిన్= అడ్డగింపరాని స్థితిలో; చంపున్= చంపుతుందో; అట్టి= అటువంటి; నిరుపాయంబు+ఐన= ఉపాయంలేనిదైన; కాలంబు= మరణము; ఉప+అంతమునన్= సమీపమునకు; వచ్చెన్= వచ్చినది; దీనికిన్= ఇటువంటి కాలమునకు; మాఱు= మఱియొక కర్తవ్యాన్ని; మదిన్= మనస్సునందు; చింతింపు= ఆలోచింపుము.

**తా :** ధృతరాష్ట్ర మహారాజా! ప్రపంచంలోని ప్రాణులైన ఈ మానవులు, బంగారం, భవనాలు, పుత్ర మిత్ర కళత్ర పరివారాన్ని నిరంతరం తమ యెదుట చూస్తూనే ప్రాణాలపై తీపితో ఉన్నారు. వారిని కాలం తప్పక హరించి తీరుతుంది.

ఈ కాలాన్ని ఎదిరించే శక్తి ఎవ్వరికీ లేదు. దాన్ని నివారించే దారిలేదు. ఏ ఉపాయాలు కూడా అక్కడ పనిచేయవు. అటువంటి కాలం ఇప్పుడు నీ సమీపానికి వచ్చి నీ కొరకు ఎదురుచూస్తున్నది. దీనికి ప్రతిక్రియ ఆలోచించు.

**శా. పుట్టంధుండవు, పెద్దవాఁడవు, మహాభోగంబులా లేవు, నీ**
**పట్టెల్లం జెడిపోయె; దుస్సహ జరాభారంబు పైఁగప్పె; నీ**
**చుట్టా లెల్లను బోయి; రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై**
**కట్టా! దాయలపంచ నుండఁదగవే కౌరవ్యవంశాగ్రణీ! 311**

**ప్రతి :** కౌరవ్యవంశ+అగ్రణీ!= కురురాజ వంశమందు ముఖ్యమైనవాడా!; పుట్టు+అంధుండవు= పుట్టుకచేత గ్రుడ్డివాడవు; పెద్దవాఁడవు= వృద్ధుడవు; మహా+భోగంబులు+ఆ= గొప్పసుఖాలా?; లేవు= కలుగవు; నీ+పట్టు+ఎల్లన్= నీ (అధికారము) ఆలంబనమంతా; చెడిపోయెన్= నశించినది; దుస్సహ= సహింపరాని; జరాభారంబు= ముసలితనపు బరువు; పైన్= పైన; కప్పెన్= క్రమ్ముకొన్నది; నీ+చుట్టాలు+ఎల్లనున్= నీ బంధువులందరూ; పోయిరి= మరణించారు; ఆలుమగఁడున్= భార్యాభర్తలు మీరిరువురు; శోకంబునన్= దుఃఖంలో; మగ్నులు+ఐ= మునిగినవారై; కట్టా!= అయ్యో!; దాయల+పంచన్= దాయాదుల వాకిట్లో; ఉండన్+తగవు+ఏ= నివసించటం పాడియా?

**తా :** ఓ కురుకులశ్రేష్ఠా! నీవు పుట్టుకతోనే గ్రుడ్డివాడవు. వయస్సు దాటిపోయినవాడవు. అనుభవింపదగిన మహాభోగాలా అంతరించినవి. నీ అధికారం, మాట చెల్లుబడి, పట్టుదల, దేహపటుత్వం ఒక్కటేమి అన్నింటిలోనూ నీ పట్టు నశించింది. మోయరాని బరువుగా ముసలితనం పైనపడింది. నీ బంధువులందరూ గతించినారు. ఇప్పుడు భార్యాభర్తలు మీరిరువురు కడగండ్ల కడలిలో గట్టెక్కలేక మునిగి తేలుతున్నారు. అయ్యయ్యో! ఎంత కష్టం. ఇట్టి సమయంలో పగవారి పంచలో పడి జీవించటం ఏమి న్యాయం?

**విశే :** 'పుట్టంధుండవు' అనే శార్దూలంలోని ఈ ఎత్తుగడ తక్కిన చెప్పబోయే అన్ని విషయాలకు ఆధారపీఠం. ఎంతో జీవితాశగల ధృతరాష్ట్రునిలో విదురుడు వైరాగ్యాన్ని నింపుతున్నాడు. ముసలితనం పులివలె పైకి దూకి నిన్ను కబళిస్తున్నది. నా అన్నవారు ఒక్కరు నీకు లేరు. ఇంతకుముందు ఎవరిని తాను నానాహింసలకు గురి చేసెనో వారే ఇప్పుడు తనకు గతి అయినారు. వారు దాయాదులు. పైకి తనవారే. కాని నిజానికి పెరవారే. పూర్తిగా పగవారు. ఇదే మూలమున 'పరగేహముపాససే' – ఇతరుల గృహాన్ని ఉపాసిస్తున్నావు' అని అన్నది. ఇది 'దాయల పంచనుండఁ దగవే!' అని అచ్చమైన తెలుగు పలుకుబడిలో తెలుపబడినది. 'నీపట్టెల్లంజెడిపోయె' వాక్యములోని అచ్చ తెలుగు 'పట్టు' శబ్దము యొక్క సామర్థ్యము అనేకార్థస్ఫురణతో ఎంతో ఔచిత్యకారకమైనది. కౌరవ్యవంశాగ్రణీ! అనే సంబోధనలో మీ వంశంలో వెనుకటివారు ఏ జీవన ప్రణాళికతో కాలం గడిపారో భావించి నిర్ణయం తీసుకో అనే హెచ్చరిక ఉన్నది.

**క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయభార్యఁ, బాడడవులకుం**
**గొట్టితిరి, వారు మనుపఁగ, నెట్టైన భరింపవలెనె?యీ ప్రాణములన్. 312**

**ప్రతి :** గృహమునన్= లక్క యింటియందు; చిచ్చు= నిప్పు; పెట్టితిరి= మీరు పెట్టినారు; తదీయ+భార్యన్= వారి ఇల్లాలిని; పట్టితిరి= నిర్బంధం చేసి పట్టుకొన్నారు; పాడు+అడవులకున్= దుష్టమైన అరణ్యములకు; కొట్టితిరి= వెడలగొట్టినారు; వారు= ఆ పాండవులు; మనుపఁగన్= పోషింపగా; ఎట్టు+ఐనన్= ఏ విధంగానైన; ఈ ప్రాణములన్= ఈ జీవములను; భరింపవలెను+ఎ= నిలబెట్టుకోవలెనా?

**తా :** మీరు పాండవుల యింటికి చిచ్చుపెట్టినారు. వారి ఇల్లాలిని నిండు కొలువులో చెరబట్టినారు. వారిని అన్యాయంగా అడవులకు వెడలగొట్టినారు. అప్పుడు అన్ని తప్పు పనులు చేసి ఇప్పుడు వారి అండజేరి, వారు పెట్టిన తిండి తిని ప్రాణాలు నిలుపుకోవలెనా?

**విశే :** క్రియాపదాలతో కంద పద్యాలను సహజ సుందరంగా ప్రారంభించటం పోతన రచనలోని విశిష్టత. నాలుగు పాదాలలో అనుప్రాసపూర్వకంగా ప్రాసను అప్రయత్నంగా నిబంధించటం ఆయన ప్రత్యేకత. పెట్టితిరి, పట్టితిరి, కొట్టితిరి అనే మూడు క్రియాపదాల్లోని కౌరవుల దుష్టచేష్టలు సామాన్య పాఠకుణ్ణి కూడా వెంటనే ఆకర్షించి ఆయా సన్నివేశాలు హృదయాలలో హత్తుకొనేట్లు చేస్తాయి. "ఎట్లైనా ఈ ప్రాణాలను భరింపవలెనా?' అనే వాక్యంలో ఎంతో ఎత్తి పొడుపు ధోరణి ఉన్నది. ఏ విధంగానైనా ధృతరాష్ట్రునిలో వైరాగ్యం కలిగించవలెనని విదురుని ప్రయత్నం. ఎవరిని సర్వనాశనం చేయాలనుకొన్నారో వారినే ఆశ్రయించి బ్రదకటం పరమనీచమైన పని అని విదురుని భావం.

**క. బిడ్డలకు బుద్ధి సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొం; డిదె పైఁ**
**బడ్డాఁడని భీముం డొఱ, గొడ్డెము లాడంగఁ గూడుఁ గుడిచెద వధిపా! 313**

**ప్రతి :** అధిపా!= రాజా!; బిడ్డలకున్= (తన) కుమారులకు; బుద్ధి+చెప్పని= చీవాట్లుపెట్టి తెలివి గరపని; గ్రుడ్డికిన్= ఈ గుడ్డివానికి; పిండంబు= పితృదేవతలకిచ్చే అన్నపు ముద్ద; వండి= వంటచేసి; కొని+పొండు= తీసికొనిపోయి వేయండి; ఇదె= ఇదిగో; పైన్+పడ్డాడు= మాపైన (మా ఇంటిమీద) పడినాడు; అని= అంటూ; భీముండు= భీముడు; ఒఱగొడ్డెములు+ ఆడంగన్= మనస్సు నొప్పించు మాటలు పలుకగా; కూడున్= తిండి; కుడిచెదవు= తినుచున్నావు.

**తా :** రాజా! 'ఆనాడు తన బిడ్డలకు బుద్ధి చెప్పలేని ఈ గుడ్డివాడు సిగ్గులేకుండ మా ఇంటిమీద పడ్డాడు. వీనికింత పిండం వండి పెట్టండి' అని భీముడు మనస్సు నొప్పించే మాటలు పలుకగా విని కూడా ఆ దిక్కుమాలిన తిండి తినక తప్పదా? ఎందుకా బ్రతుకు?

**విశే :** సాధారణంగా 'పిండం' అనేమాట చచ్చినవారికి శ్రాద్ధంలో పెట్టేది అనే అర్థంలో రూఢికెక్కినది. 'పిండం' పెట్టండి అని భీముడు అంటున్నాడంటే నిన్ను చచ్చినవానినిగా జమ కట్టాడయ్యా! అని విదురుని ఆవేదనతో కూడిన మాట.

**క. కనియెదవో బిడ్డల నిఁక, మనియెదవో, తొంటికంటె మనుమల మాటల్**
**వినియెదవో, యిచ్చెద ర, మ్మనియెదవో దానములకు నవనీసురులన్ 314**

**ప్రతి :** ఇఁకన్= ఇటుపిమ్మట; బిడ్డలన్= సంతానాన్ని; కనియెదవు+ఓ= చూచెదవా?; తొంటికంటెన్= ఇంతకుముందుకంటె; మనియెదవు+ఓ= సుఖముగ జీవించెదవా?; మనుమల+మాటల్= మనుమల ముద్దుపలుకులు; వినియెదవు+ఓ= ఆకర్ణింతువా?; దానములకున్= దానాలు గ్రహించటానికి; అవనీసురులన్= భూదేవులైన బ్రాహ్మణులను; ఇచ్చెదన్= ఇస్తున్నాను; రమ్ము= రావలసినది; అనియెదవు+ఓ= అని పలికెదవా?

**తా :** ఈ జన్మలో ఇకమీద నీకన్న కొడుకులను చూడగలవా? పూర్వంకంటె గొప్పగా ఎక్కువకాలం జీవిస్తావా? మనుమల ముద్దుపలుకులు వినగలవా? బ్రాహ్మణులను పిలిచి దానాలిస్తానని అనగలవా?

**క. దేహము నిత్యము గాదని, మోహముఁ దెగఁ గోసి సిద్ధమునివర్తనుఁడై**
**గేహము వెలువడు నరుఁ డు, త్సాహముతోఁ జెందు ముక్తిసంపద ననఘా! 315**

**ప్రతి :** అనఘా!= పాపరహితుడా!; దేహము= ఈ శరీరం; నిత్యము= శాశ్వతం; కాదు+అని= కాదని (తెలిసికొని); మోహమున్= అజ్ఞానాన్ని; తెగన్+కోసి= తొలగునట్లు, ఛేదించి; సిద్ధ మునివర్తనుఁడు+ఐ= సిద్ధులయొక్క మునులయొక్క నడవడి వంటి నడవడి గలవాడై; గేహము= ఇల్లు; వెలువడు నరుఁడు= విడిచిపోయే మానవుడు; ఉత్సాహముతోన్= సంతోషంతో; ముక్తిసంపదన్= మోక్ష సమృద్ధిని; చెందున్= పొందుతాడు.

**తా :** ఈ దేహం శాశ్వతం కాదన్న సత్యాన్ని తెలిసికొని, దీనిపై గల భ్రాంతిని వ్యామోహాన్ని పూర్తిగా త్రెంచివేసి ఎంతో సంతోషంతో ఏ మానవుడు సిద్ధులు, మునులవలె వర్తిస్తాడో అతడు తప్పక మోక్షలక్ష్మిని తన వశం చేసికొని తీరుతాడు.

**విశే :** ఇంటినుండి వెడలిపోవటం ఏడుస్తూ కాదు. ఉత్సాహంతో పెండ్లి మొదలైనవానికి పోయినట్లు చేయాలి అనే అర్థం ఉత్సాహ శబ్దంలో ధ్వనిస్తుంది.

**వ. అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గం బుపదేశించిన, నతండు ప్రజ్ఞాచక్షుండై, సంసారంబు దిగనాడి, మోహపాశంబువలన నూడి, విజ్ఞానమార్గంబునం గూడి, దుర్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించిన 316**

**ప్రతి :** అని= అంటూ; విదురుండు= విదురుడు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రునికి; విరక్తిమార్గంబు= వైరాగ్యపుదారి; ఉపదేశించినన్= ప్రబోధింపగా; అతండు= ఆ ధృతరాష్ట్రుడు; ప్రజ్ఞాచక్షుండు+ఐ= తెలివి అనే కన్నులు గలవాడై సంసారంబున్= ఆలుబిడ్డలతో ఉండటమనే ఐహిక బంధాన్ని; దిగనాడి= విడిచిపెట్టి; మోహపాశంబువలనన్= అజ్ఞానము (భ్రాంతి) అను త్రాటినుండి; ఊడి= పట్టువదలించుకొని; విజ్ఞానమార్గంబునన్= విజ్ఞానము (తెలివి) అనే దారియందు; కూడి= చేరి; దుర్గమంబు+అగు= సులభంగా చేరరాని; హిమవత్+నగంబునకున్= హిమవత్పర్వతానికి; నిర్గమించినన్= వెడలగా.

**తా :** ఈ విధంగా విదురుడు ధృతరాష్ట్రునికి వైరాగ్యానికి దారిని ఉపదేశించినాడు. ఆ ప్రబోధంతో ధృతరాష్ట్రుడు జ్ఞాననేత్రుడు అయినాడు. వెంటనే సంసారం వీడినాడు. అంతటితో అతని మోహపాశాలు తెగిపోయినవి. అజ్ఞానం పోయి విజ్ఞానం వికసించింది. ఇక తన నివాసం ఇది కాదని గమనించటానికి వీలుకాని హిమవత్పర్వతంవైపు ప్రయాణం సాగించినాడు.

**శా. అంధుండైన పతిన్ వరించి, పతిభావాసక్తి నేత్రద్వయీ**
**బంధాచ్ఛాదనమున్ ధరించి, నియమప్రఖ్యాతయై యున్న త**
**ద్గాంధారక్షితినాథు కూఁతురును యోగప్రీతి చిత్తంబులో**
**సంధిల్లం బతివెంట నేగె, నుదయత్సాధ్వీగుణారూఢయై. 317**

**ప్రతి :** అంధుండు+ఐన= గ్రుడ్డివాడైన; పతిన్= భర్తను; వరించి= కోరి, ఇష్టపడి; పతిభావ+ఆసక్తిన్= భర్తపొందిన అనుభవంలోని కుతూహలముతో; నేత్రద్వయీ+బంధ+ఆచ్ఛాదనమున్= రెండు కన్నులను కప్పే గంతను; ధరించి= తాల్చి; నియమ+ప్రఖ్యాత+ ఐ= పతివ్రతా నియమంలో మిక్కిలి కీర్తి పొందినదై; ఉన్న= ఉన్నట్టి; తద్+గాంధారక్షితినాథు కూఁతురు= ఆ గాంధార దేశపు రాజు కొమార్తెయగు గాంధారియు; యోగ ప్రీతి= భర్తతో చేరియుండుటలోని సంతోషం; చిత్తంబులోన్= తన మనస్సులో; సంధిల్లన్= కూడిరాగా; ఉదయత్+సాధ్వీగుణ+ఆరూఢ+ఐ= పెంపొందుచున్న, ఉత్తమ స్త్రీ లక్షణములందు స్థిరత్వంకలదియై; పతివెంటన్= భర్తవెంబడి; ఏగెన్= పోయినది.

**తా :** గ్రుడ్డివాడైన భర్తను ప్రేమించి పతి చూడలేని ప్రపంచాన్ని తాను కూడా చూడరాదని భర్త అనుభూతినే పొందగోరి, కన్నులకు గంత కట్టుకొని, ఎంతో నియమంతో సమస్త ప్రజల మెప్పును పొందిన గాంధార దేశపు మహారాజు గారాబు కూతురు గాంధారి. సాధ్వీమతల్లియైన ఆ ఇల్లాలు కలిసియుండుటంలో అభిలాషగల చిత్తంతో భర్తవెంట బయలుదేరింది.

**విశే :** ఇక్కడ వరించటమంటే అనుసరించటం (వివాహానికి ఇష్టపడడం, గంతలు కట్టుకోవడం).

**చ. వెనుకకు రాక చొచ్చు రణవీరునికైవడి, రాజదండనం**
**బునకు భయంబు లేక వడిఁ బోయెడు ధీరుని భంగి, నప్పు డా**
**వనిత దురంతమైన హిమవంతము పొంత వనాంతభూమికిం**
**బెనిమిటితోడ నించుకయు భీతి వహింపక యేగెఁ బ్రీతితోన్. 318**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; ఆ వనిత= ప్రఖ్యాతిగాంచిన ఆ గాంధారి; వెనుకకున్+రాక= వెనుతిరుగక; చొచ్చు= (రణరంగమున) ముందుకు దూకే; రణ+వీరుని+కైవడిన్= యుద్ధవీరునివలె; రాజదండనంబునకున్= రాజుయొక్క శిక్షకు; భయంబు+లేక= భీతి లేకుండ; వడిన్= వేగముతో; పోయెడు= ముందుకుపోయే; ధీరుని+భంగిన్= ధైర్యము కలవాని విధంగా; దురంతము+ఐన= చొరనలవి కాని; హిమవంతము+పొంతన్= హిమవత్పర్వత సమీపంలో; వనాంతభూమికిన్= అడవి నడుమగల ప్రదేశానికి; ప్రీతితోన్= ఇష్టంతో; ఇంచుకయున్= లేశమైన; భీతి వహింపక= భయాన్ని పొందక; పెనిమిటితోడన్= భర్తతో; ఏగెన్= వెళ్ళింది.

**తా :** అప్పుడా గాంధారి వెనుతిరుగకముందు కేగే యుద్ధవీరునివలె, రాజదండనకు జడియక చకచక ముందుకు సాగే ధీరునివలె, తిరుగులేని నిర్భీతితో తరిగిపోని మహాప్రీతితో తన భర్త వెంబడి, హిమవంతం ప్రాంతంలోని దుర్గమారణ్య మధ్య ప్రదేశాలకు వెళ్లింది.

**విశే :** ఇక్కడ ఈ రెండు పోలికలు గమనింపదగినవి. సాధారణంగా సుఖాలకు అలవాటుపడిన వ్యక్తి కోరి కష్టాలు తెచ్చుకోవటం సంభవింపదు. రణవీరుడు వీరస్వర్గ సుఖభావనతో చావటానికి సిద్ధపడతాడు. రాజదండన పొందినవానికి యమదండన ఉండదని ఒక భావన. రాజదండన భరించటం కష్టమైనా యమదండన కష్టతరం కనుక దానిని తప్పించుకోవటానికి ధీరుడు ఉత్సాహంతో ముందుకు దూకుతాడు. ఇది వివేకి లక్షణం. గాంధారికి అటువంటి వివేకం కలిగిందని కవి తెలియజేస్తున్నాడు. ఇది అలంకార ధ్వని.

**వ. ఇట్లు విదురసహితులై గాంధారీ ధృతరాష్ట్రులు వనంబునకుం జనిన మఱునాఁడు ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు సేసి నిత్యహోమంబు గావించి బ్రాహ్మణోత్తములకు గో హిరణ్య తిల వస్త్రాది దానంబులు సేసి నమస్కరించి, గురువందనంబుకొఱకుఁ బూర్వప్రకారంబునం దండ్రి మందిరంబునకుం జని యందు విదుర సహితు లయిన తల్లిదండ్రులం గానక మంజుపీఠంబునఁ గూర్చున్న సంజయున కిట్లనియె. 319**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విదురసహితులు+ఐ= విదురునితో కూడుకొన్నవారై; గాంధారీధృతరాష్ట్రులు= (దంపతులైన) గాంధారి ధృతరాష్ట్రులు; వనంబునకున్= (హిమవంతమునందలి) అడవులకు; చనినన్= పోగా; మఱునాఁడు= మరుసటి దినం; ధర్మనందనుండు= ధర్మరాజు; ప్రభాతంబునన్= ఉదయమున; సంధ్యావందనంబు+చేసి= సంధ్యవార్చి; బ్రాహ్మణ+

ఉత్తములకున్= శ్రేష్ఠులైన విప్రులకు; గో= ఆవులు; హిరణ్య= బంగారు; తిల= నువ్వులు; వస్త్ర+ఆది= వస్త్రములు మొదలగు; దానంబులు= దానములను; చేసి= ఒనరించి; నమస్కరించి= ప్రణామాలుచేసి; గురువందనంబు కొఱకున్= పెద్దలకు నమస్కరించుటకై; పూర్వప్రకారంబునన్= మునుపటి రీతిగా; తండ్రి+మందిరంబునకున్= పెదతండ్రి ఇంటికి; చని= పోయి; అందున్= అచ్చట; విదుర సహితులు+అయిన= విదురునితో కలిసియున్నవారైన; తల్లిదండ్రులన్= పెద్దమ్మ పెదనాయనలగు గాంధారీ ధృతరాష్ట్రులను; కానక= కాంచక; మంజుపీఠంబునన్= చక్కని పీఠముమీద; కూర్చున్న= కూర్చొని ఉన్న; సంజయునకున్= సంజయునికి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అనినాడు.

**తా :** ఈ విధంగా విదురునితో కూడి గాంధారీ ధృతరాష్ట్రులు అడవికి వెళ్లినారు. మరుసటిదినం ఉదయాన ధర్మజుడు, సంధ్యావందనం నిర్వర్తించి ఉత్తములైన బ్రాహ్మణులకు గోవులు, బంగారం, నువ్వులు, వస్త్రాలు మొదలైన దానాలు ఇచ్చి నమస్కారాలుచేసి, పెద్దలైన తల్లిదండ్రులకు నమస్కరించటానికై యథావిధి పెదతండ్రి ఇంటికి పోయినాడు. అక్కడ విదురుడు, గాంధారీ ధృతరాష్ట్రులు కనిపించలేదు. సంజయుడు మాత్రమే ఒక చక్కని పీఠంపై సుఖాసీనుడై ఉన్నాడు. అప్పు డతనితో ధర్మరాజు ఇట్లన్నాడు.

**విశే :** ధృతరాష్ట్రాదుల వనగమనం భారతంలో వేరువిధంగా ఉన్నది.

**సీ. మా తల్లిదండ్రు లీ మందిరంబున లేరు, సంజయ! వారెందుఁ జనిరి నేఁడు**
**ముందఱ గానఁడు ముదుసలి మా తండ్రి పుత్త్ర శోకంబునఁ బొగులుఁ దల్లి**
**సౌజన్యనిధి ప్రాణసఖుఁడు మా పినతండ్రి మందబుద్ధులమైన మమ్ము విడిచి**
**యెటఁబోయిరో ముప్వు రెఱిఁగింపు గంగలోఁ దన యపరాధంబుఁ దడవికొనుచు**

**ఆ. భార్యతోడఁ దండ్రి పరితాపమునఁ బడుఁ, గపట మింత లేదు కరుణ గలదు**
**పాండుభూవిభుండు పరలోకగతుఁడైన, మమ్ముఁ బిన్నవాండ్ర మనిచె నతఁడు. 320**

**ప్రతి :** సంజయ!= ఓ సంజయా!; మా+తల్లిదండ్రులు= మా జననీజనకులైన గాంధారీధృతరాష్ట్రులు; ఈ మందిరంబునన్= ఈ ఇంటిలో; లేరు= లేరు; నేఁడు= ఇప్పుడు; వారు= ఆ ఇరువురు; ఎందున్= ఎచ్చటకు; చనిరి= పోయిరి; మాతండ్రి= మా పెదనాయన; ముదుసలి= వృద్ధుడు; ముందఱ= ముందుదారి; కానఁడు= కనలేడు; తల్లి= తల్లియైన గాంధారి; పుత్త్ర శోకంబునన్= పుత్ర దుఃఖంతో; పొగులున్= దుఃఖిస్తున్నది; మాపినతండ్రి= మా పినతండ్రి విదురుడు; సౌజన్య నిధి= మంచితనానికి స్థానము (నివాసము); ప్రాణసఖుఁడు= నాకుప్రాణమిత్రుడు; మందబుద్ధులము+ఐన= తెలివి లేనివారమైన; మమ్మున్= మమ్ములను; విడిచి= వదలివేసి; ముప్వురు= ఆ ముగ్గురు (తలిదండ్రులు; పినతండ్రి); ఎటన్= ఎచ్చటకు; పోయిరి+ఓ= పోయినారో; ఎఱిఁగింపు= తెలుపుము; తండ్రి= మా పెదనాయన; భార్యతోడన్= పత్నితో కూడ; తన+అపరాధంబున్= తన తప్పును; తడవికొనుచున్= తలచుకొనుచు; పరితాపమునన్= మిక్కిలి పశ్చాత్తాపంతో; గంగలోన్= గంగానదిలో; పడున్= దూకును; కపటము= మోసం; ఇంత+లేదు= కొంచెమైనాలేదు; కరుణ= దయ; కలదు= ఉన్నది; అతఁడు= ఆ మాపెదతండ్రి; పాండుభూవిభుండు= మా తండ్రియైన పాండురాజు; పరలోక+గతుఁడు+ఐనన్= మరణింపగా; పిన్నవాండ్రన్= చిన్నపిల్లలము; మమ్మున్= మమ్ము; మనిచెన్= బ్రతికించాడు.

**తా :** సంజయా! మా తల్లిదండ్రులు ఈ భవనంలో కన్పించటం లేదు. వారిప్పుడు ఎటుపోయినారో తెలియదు. మా తండ్రి కంటిచూపులేని మూడుకాళ్ల ముసలి. ఇక మా తల్లి పుత్త్రశోకంతో కన్నీరు మున్నీరుగా పొగిలిపోతుంటుంది. మా పినతండ్రిగారు

విదురుడు మందబుద్ధులమైన మమ్ము వదలి వెళ్లినాడు. ఆయన ప్రాణసమానుడైన మిత్రుడు. సౌజన్యమూర్తి. ఈ ముగ్గురు మమ్మిక్కడ వదలి ఎచ్చటికిపోయిరో తెలియుట లేదు. మా పెదతండ్రి తాను చేసిన తప్పులను తలచుకొంటూ, పశ్చాత్తాపంతో భార్యతోగూడ గంగలో దూకినాడేమో అని అనుమానంగా ఉన్నది. నీకు తెలిస్తే చెప్పవలసింది. ఆయన చాలా అమాయకుడు, కపటం లేనివాడు. కరుణ కలవాడు. మా తండ్రి పాండు భూపాలుడు పరలోకగతుడు కాగా చిన్నపిల్లలమైన మమ్ము పెంచి పెద్ద చేసినాడు.

**వ. అనిన సంజయుండు దయాస్నేహంబుల నతికర్శితుం డగుచుఁ, దన ప్రభువు వోయిన తెఱం గెఱుంగక, కొంత దడ వూరకుండి, తద్వియోగ దుఃఖంబునఁ గన్నీరు కరతలంబునఁ దుడిచికొనుచు, బుద్ధి బలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి, తన భర్తృపాదంబుల మనంబున నెన్నుచు ధర్మజున కిట్లనియె. 321**

**ప్రతి :** అనినన్= అని ధర్మజుడు పలుకగా; సంజయుండు= సంజయుడు; దయా+స్నేహంబులన్= జాలి, ప్రేమలతో; అతి+కర్శితుండు+అగుచున్= మిక్కిలి కృశించినవాడయి; తన+ప్రభువు+పోయిన= తన అధిపతి చనినటువంటి; తెఱంగు= దారి; ఎఱుంగక= తెలియక; కొంత తడవు= కొంచెముసేపు; ఊరకుండి= మిన్నకుండి; తద్+వియోగ+దుఃఖంబునన్= తన ప్రభువుయొక్క ఎడబాటువలన కల్గిన దుఃఖంతో; కన్నీరు= కంటిబాష్పములు; కరతలంబునన్= చేతితో; తుడిచికొనుచున్= తడిపోవునట్లు ఒత్తుకొనుచు; బుద్ధిబలంబునన్= మిక్కిలి తెలివిచే; చిత్తంబున్= మనస్సును; ధైర్య+ఆయత్తంబు= ధీరత్వానికి అధీనం; చేసి= కావించి; తన భర్తృపాదంబులన్= తన యజమాని పాదములను; మనంబునన్= మనస్సునందు; ఎన్నుచున్= తలపోయుచు; ధర్మజునకున్= ధర్మతనయునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ధర్మజుని మాటలు విన్న సంజయుడు ఎంతో జాలి, ప్రేమ నిండిన గుండెతో తన ప్రభువు ఎక్కడికి వెళ్ళినాడో తెలియక మిక్కిలి దిగులుతో కొంతసేపు మౌనం వహించినాడు. ధృతరాష్ట్రుడు వెళ్లినందుకు కన్నీరు పొంగి పొరలిరాగా మెల్లగా తుడుచుకొనినాడు. ఎంతో బుద్ధిబలం కలవాడు కావటంవల్ల తన మనస్సును దిటవుపరచుకొని, ప్రభువు పాదాలనే మనస్సులో స్మరిస్తూ సంజయుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**తే. అఖిల వార్తలు మున్ను నన్నడుగుచుండు, నడుగఁ డీ రేయి మీ తండ్రి యవనినాథ!**
**మందిరములోన విదురుతో మంతనంబు, నిన్న యాడుచు నుండెను నేఁడు లేఁడు. 322**

**ప్రతి :** అవనినాథ!= ఓ రాజా!; మీతండ్రి= మీ పెదతండ్రి; మున్ను= పూర్వము; నన్నున్= నన్ను; అఖిలవార్తలు= అన్ని వృత్తాంతాలు; అడుగుచుండున్= అడుగుతూ ఉండేవాడు; ఈ రేయి= ఈ రాత్రి; అడుగఁడు= అడుగలేదు; నిన్న= నిన్నటి దినం; మందిరంబులోనన్= మేడలో; విదురుతోన్= పినతండ్రి విదురునితో; మంతనంబు= సంభాషణం; ఆడుచున్+ఉండెను= జరుపుతుండినాడు; నేఁడు= ఈ దినం; లేఁడు= కనిపించడు.

**తా :** రాజా! మీ పెదతండ్రిగారు ప్రతిదినం వార్తలేమిటి? అని నన్ను అడుగుతుండేవాడు. ఈ రాత్రి నన్ను అడుగలేదు. నిన్న విదురునితో మందిరంలో ఎంతో ప్రీతిగా సంభాషణలు సాగిస్తుండినాడు. కాని నేడు కంటికి కనిపించకుండా వెళ్లినాడు.

**వ. విదుర గాంధారీ ధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుఁబోయిరో వారల నిశ్చయంబులెట్టివో యెఱుంగనని సంజయుండు దుఃఖించు సమయంబునఁ దుంబురు సహితుండై నారదుండు వచ్చిన, లేచి నమస్కరించి తమ్ములుం దానును నారదుం బూజించి, కౌంతేయాగ్రజుం డిట్లనియె. 323**

**ప్రతి :** విదుర, గాంధారీ, ధృతరాష్ట్రులు= విదురుడు, గాంధారి, ధృతరాష్ట్రుడు; నన్నున్= నన్ను; వంచించి= మోసగించి; ఎందున్= ఎచ్చటకు; పోయిరి+ఓ= వెళ్లిరో; వారల= ఆ ముగ్గురియొక్క; నిశ్చయంబులు= నిర్ణయాలు; ఎట్టివో= ఎటువంటివో; ఎఱుంగను= తెలియను; అని= అంటూ; సంజయుండు= సంజయుడు; దుఃఖించు సమయంబునన్= విలపించేవేళ; తుంబురు సహితుండు+ఐ= తుంబురునితో కూడినవాడై, నారదుండు= నారద మహర్షి; వచ్చినన్= రాగా; లేచి= పైకిలేచి; నమస్కరించి= ప్రణామంచేసి; తమ్ములున్= తన సోదరులును; తానును= తానుకూడ; నారదున్= నారదమహర్షిని; పూజించి= సేవించి; కౌంతేయ+అగ్రజుండు= కుంతి కుమారులలో పెద్దవాడైన ధర్మరాజు; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తా :** "విదురుడు, గాంధారి, ధృతరాష్ట్రుడు ఈ ముగ్వురు నాకు చెప్పకుండ నా కన్నుగప్పి ఎక్కడకు వెళ్లిరో తెలియదు. వారు ఎట్టి నిర్ణయమునకు వచ్చి వెళ్లిపోయిరో తెలియుటలేదు" అని సంజయుడు దుఃఖించినాడు. ఇంతలోనే అదే సమయములో నారదుడు తుంబురునితో కలిసి అచ్చటకు వచ్చినాడు. అప్పుడు ధర్మరాజు తన తమ్ములు తాను లేచి వారికి నమస్కరించినారు. పిమ్మట అజాతశత్రువు బ్రహ్మమానసపుత్రుడైన నారదునిట్లు ప్రశ్నించాడు.

**ఉ. అక్కట! తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ! వారు నేఁ**
**డెక్కడ వోయిరో యెఱుఁగ, నెప్పుడు బిడ్డల పేరు గ్రుచ్చి తాఁ**
**బొక్కుచునుండుఁ దల్లి యెటు వోయెనొకో! విపదంబురాశికిన్**
**నిక్కము కర్ణధారుఁడవు నీవు, జగజ్జనపారదర్శనా! 324**

**ప్రతి :** మహాత్మ!= గొప్ప ఆత్మగల నారద మహర్షీ!; అక్కట!= అయ్యో!; తల్లిదండ్రులు= నా జననీజనకులు; గృహంబునన్= ఇంటిలో; లేరు= కనిపింపకున్నారు; వారు= వారలు; నేఁడు= ఇప్పుడు; ఎక్కడ= ఎచటకు; పోయిరి+ఓ= వెళ్లినారో; ఎఱుఁగన్= తెలియను; తల్లి= గాంధారి; ఎప్పుడున్= ఎల్లప్పుడు; బిడ్డలపేరు= మరణించిన తన కుమారుల నామం; గ్రుచ్చి= నొక్కి పలికి; తాన్= తాను; పొక్కుచునుండున్= కుమిలిపోతూ ఉంటుంది; ఎటు+పోయెను+ఒకో!= ఎక్కడికి వెళ్లిందో కదా!; జగత్+జన పారదర్శనా!= లోకమునందలి, జనుల గమ్యాన్ని (దర్శించిన) తెలిసినవాడా!; విపత్+అంబురాశికిన్= ఆపద అనే సముద్రానికి; నీవు= నీవు; కర్ణధారుఁడవు= ఓడ నడిపేవాడవు; నిక్కము= నిజం.

**తా :** దేవర్షీ! నీవు సర్వజ్ఞుడవు. ముల్లోకాల్లో నీకు తెలియంది లేదు. ఆపద అనే సముద్రాన్ని దాటించటానికి నీవు నిజంగా కర్ణధారుడవు. మహాత్మా! మా తల్లిదండ్రులు ఇంటిలో కనిపించటంలేదు. ఇప్పుడు వారెక్కడికి వెళ్లినారో తెలియటం లేదు. ఎల్లప్పుడు తన బిడ్డలను పేరుపేరున తలచుకొని తల్లడిల్లే మా తల్లి ఇపుడెటుపోయిందో! ఏమయిందో అని ధర్మరాజు అన్నాడు.

**వ. అనిన సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె; ఈశ్వర వశంబు విశ్వంబు. ఈశ్వరుండ భూతంబుల నొకటితో నొకటిఁజేర్చు, నెడఁబాపు. సూచీ భిన్ననాసిక లందు రజ్జుప్రోతంబు లగుచుఁ గంఠరజ్జువులఁ గట్టంబడిన బలీవర్దంబులంబోలెఁ గర్తవ్యాకర్తవ్యవిధాయక వేదలక్షణ యగు వాక్తంత్రియందు వర్ణాశ్రమ లక్షణంబులు గల నామంబులచే బద్ధులైన లోకపాల సహితంబులై లోకంబీశ్వరాదేశంబు వహించుఁ; గ్రీడాసాధనంబులగు నక్షకందు కాదుల కెట్లు సంయోగ వియోగంబు లట్లు క్రీడించు; నీశ్వరునికిఁ**

**క్రీడాసాధనంబులైన జంతువులకు సంయోగ వియోగంబు లగుచుండు. సమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబును దేహరూపంబున నధ్రువంబునై యుండు; మఱియు నొక్క పక్షంబున ధ్రువంబు నధ్రువంబునుంగాక యుండు; శుద్ధబ్రహ్మస్వరూపంబున ననిర్వచనీయంబుగ రెండునై యుండు. అజగరంబుచేత మ్రింగం బడిన పురుషుం దన్యుల రక్షింప లేని తెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మ గుణాధీనంబైన దేహంబు పరుల రక్షింప సమర్థంబు గాదు. కరంబులు గల జంతువులకుఁ గరంబులు లేని చతుష్పదంబు లాహారంబు లగుఁ; జరణంబులు గల ప్రాణులకుం జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబు లగు; నధికజన్మంబు గల వ్యాఘ్రాదులకు నల్పజన్మంబులు గల మృగాదులు భోజ్యంబు లగు, సకల దేహి దేహంబులందు జీవుండు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవిక యగు; అహస్త సహస్తాది రూపంబైన విశ్వమంతయు నీశ్వరుండుగాఁ దెలియుము. అతనికి వేఱు లేదు; నిజమాయా విశేషంబున మాయావియై జాతిభేద రహితుండైన యీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్య రూపంబుల నంతరంగ బహిరంగంబుల దీపించుఁ గాన యనాథులు దీనులు నగు నాదు తల్లిదండ్రులు ననుం బాసి యే మయ్యెదరో, యెట్లు వర్తింతురో యని వగవం బని లేదు. అజ్ఞానమూలం బగు స్నేహంబున నైన మనోవ్యాకులత్వంబు పరిహరింపు మని మఱియు నిట్లనియె. 325**

**ప్రతి :** అనినన్= అని ధర్మరాజు పలుకగా; సర్వజ్ఞుండు+ఐన= సర్వము తెలిసిన; నారదుండు= నారదుడు (నారము అనగా జ్ఞానము, దానినిచ్చువాడు); ధర్మజునకున్= ధర్మనందనునికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనినాడు; విశ్వంబు= సమస్త జగత్తు; ఈశ్వర+వశంబు= పరమేశ్వరుని అధీనం; ఈశ్వరుండు+అ= ఆ ఈశ్వరుడే; భూతంబులన్= ప్రాణులను; ఒకటితోన్+ఒకటిన్= ఒకరితో ఒకరిని; చేర్చున్= కలుపును; ఎడబాపున్= విడదీస్తాడు; సూచీ భిన్న నాసికల+అందున్= సూదితో పొడిచిన ముక్కుల్లో; రజ్జు+ప్రోతంబులు+అగుచున్= త్రాడు దూర్చబడ్డవి ఔతూ; కంఠ+రజ్జువులన్= మెడత్రాళ్లతో (పలుపులతో); కట్టఁబడిన= బంధింపబడిన; బలీవర్దంబులన్+పోలెన్= ఎద్దులవలె; కర్తవ్య+అకర్తవ్య+విధాయక+వేద లక్షణ+అగు= చేయదగినది; చేయదగనిది అనే వాటిని, విధించిన, వేదముయొక్క లక్షణం కలదియైన; వాక్+తంత్రి+అందున్= మాట అనే తీగయందు; వర్ణ+ఆశ్రమ లక్షణంబులు+కల= వర్ణాశ్రమ ధర్మములు కలిగిన; నామంబులచేన్= పేర్లచే; బద్ధులు+ఐన= కట్టబడిన వారైన; లోకపాల సహితంబులు+ఐ= ఇంద్రాది దిక్పాలకులతో కూడినవియై; లోకంబు= విశ్వము; ఈశ్వర+ఆదేశంబు= ఈశ్వరుని ఆజ్ఞను; వహించున్= మోస్తుంది; క్రీడాసాధనంబులు+అగు= ఆటవస్తువులైన; అక్ష+కందుక+ఆదులకున్= పాచికలు, బంతులు మొదలైన వానికి; ఎట్లు= ఏ విధంగా; సంయోగ వియోగంబులు= కలియుట, విడిపోవుటలు; అట్లు= ఆ రీతిగా; క్రీడించున్= ఆటలాడుతాడు; ఈశ్వరుని+క్రీడాసాధనంబులు+ఐన= పరమేశ్వరుని ఆటవస్తువులైన; జంతువులకున్= ప్రాణులకు; సంయోగ+వియోగంబులు= కలియుటలు విడిపోవుటలు; అగుచున్+ఉండున్= కలుగుతుంటాయి; సమస్త జనంబును= ప్రజలు అందరును; జీవరూపంబునన్= ప్రాణిరూపమున; ధ్రువంబును= స్థిరమైనది; దేహ+రూపంబునన్= శరీరరూపంలో; అధ్రువంబున్+ఐ= అస్థిరమైనదై; ఉండున్= ఉంటుంది; మఱియున్= ఇంకను; ఒక్క+పక్షంబునన్= ఒకప్రక్క; ధ్రువంబున్+అధ్రువంబునున్+కాక= స్థిరమూ; అస్థిరమూ కాకుండా; ఉండున్= ఉంటుంది; శుద్ధ+బ్రహ్మస్వరూపంబునన్= పరిశుద్ధమైన, పరబ్రహ్మస్వరూపంతో; అనిర్వచనీయంబుగన్= ఇది ఇట్టిది అని వివరించటానికి వీలుకానిదిగా; రెండున్+ఐ+ఉండున్= రెండు విధాలుగా ఉంటుంది; అజగరంబుచేతన్=

కొండ చిలువచేత; మ్రింగన్‌పడిన+పురుషుండు= కబళింపబడిన మనుష్యుడు; అన్యులన్= ఇతరులను; రక్షింపలేని= కాపాడలేని; తెఱంగునన్= విధంగా; పంచభూతమయంబు+ఐ= నేల, నీరు, నిప్పు, గాలి, నింగి అనే పంచభూతాలమయమై; కాల+కర్మ+గుణ+అధీనంబు+ఐన= కాలము, కర్మము, గుణము అనే వాటికి లొంగియున్న; దేహంబు= శరీరము; పరులన్= ఇతరులను; రక్షింపన్= కాపాడటానికి; సమర్థంబు+కాదు= యోగ్యమైంది కాదు; కరంబులు+కల= చేతులు కలిగిన; జంతువులకున్= ప్రాణులకు; కరంబులులేని= చేతులులేని; చతుష్పదంబులు= నాలుగు పాదములు కలిగిన ప్రాణులు; ఆహారంబులు+అగున్= భోజనాలు ఔతున్నాయి; చరణంబులుకల= పాదములు ఉండెడి; ప్రాణులకున్= జీవులకు, చరణంబులు లేని; తృణ+ఆదులు= గడ్డి మొదలగునవి; భక్షణీయంబులు+అగున్= తినదగినవి అగుచున్నవి; అధిక+జన్మంబు+కల= పెద్ద పుట్టుకకల; వ్యాఘ్ర+ఆదులకున్= పులులు మొదలగువానికి; అల్పజన్మంబులు కల= చిన్న పుట్టుక కలిగిన; మృగ+ఆదులు= జింకలు మొదలైనవి; భోజ్యంబులు= భుజింపదగినవి; అగున్= ఔతున్నాయి; సకల+ దేహి దేహంబులందున్= అన్ని ప్రాణుల శరీరాలలో; జీవుండు= జీవాత్మ; కలుగుటన్+చేసి= ఉండుటచేత, జీవునికిన్= ప్రాణికి; జీవుండు+అ= ప్రాణియే; జీవిక= జీవించటానికి ఆధారం; అగున్= ఔతున్నది; అహస్త= చేతులులేని; సహస్త= చేతులు గల; ఆది= మొదలైన; రూపంబు+ఐన= రూపము కలిగినది అయిన; విశ్వము+అంతయున్= సమస్త జగత్తును; ఈశ్వరుండు+కాన్= పరమాత్మగా; తెలియుము= తెలిసికొనుము; అతనికిన్= ఆ పరమేశ్వరునికి; వేఱు= అన్యము (భేదము); లేదు= లేదు; నిజ= తనయొక్క; మాయావిశేషంబునన్= అవిద్యవలని అతిశయంచేత; మాయావి+ఐ= మాయకలవాడై; జాతి, భేద; రహితుండు+ఐన= పుట్టుక మొదలైన భేదాలు లేనివాడైన; ఈశ్వరుండు= పరమాత్మ; బహుప్రకారంబులన్= అనేక విధాలుగా; భోగి+భోగ్య+రూపంబులన్= అనుభవించేవాడు, అనుభవింపబడేవాడు అనబడే రూపాలతో, అంతరంగ; బహిరంగంబులన్= లోపలను, వెలుపలను; దీపించున్= వెలుగుతున్నాడు; కానన్= కాబట్టి, అనాథులు= దిక్కులేనివారు; దీనులున్+అగు= జాలిగొలిపే వారూ ఐన; నాదు+తల్లిదండ్రులు= నా జననీజనకులు; ననున్+పాసి= నన్ను వదలివెళ్లి; ఏమి+అయ్యెదరు+ఓ= ఏమౌతారో; ఎట్లు= ఏ విధంగా; వర్తింతురు+ఓ= ఉందురో; అని= ఆ ప్రకారంగా తలచి; వగవన్+పని+లేదు= దుఃఖింపవలసిన పనిలేదు; అజ్ఞాన+మూలంబు+అగు= అజ్ఞానానికి పునాదియైన; స్నేహంబునన్+ ఐన= ప్రేమచేత కలిగిన; మనోవ్యాకులత్వంబు= మానసికమైన కలతను; పరిహరింపుము+అని= విడువుమని తెలిపి; మఱియున్= ఇంకను; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ధర్మరాజు మాటలు విన్న సర్వజ్ఞుడైన నారదుడిలా చెప్పినాడు. ఈ జగత్తు మొత్తం ఈశ్వరుని అధీనం. ఆ పరమేశ్వరుడు ఒకదానితో ఒకటి కలిపి, మరల అంతలోనే విడదీస్తాడు. ముక్కులకు బెజ్జంవేసి తాడు దూర్చి దానిని, మెడలకు పలుపులు తగిలించిన ఎద్దులను కర్షకుడు తన స్వాధీనం చేసుకొన్నవిధంగా భగవంతుడు కర్తవ్యాలను అకర్తవ్యాలను తెలపడానికై సలక్షణమైన వేదవాక్యాలనే త్రాళ్లచే ప్రాణులను కట్టివేస్తున్నాడు. అందులో వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు, వాటి లక్షణాలు, వాటికై వినియోగించే పేర్లచే బద్ధమైన ఈ లోకమంతా ఇంద్రాది దిక్పాలకులతో కూడ ఈశ్వరాధీనమై ఉన్నది. క్రీడాకారుడు తన ఇష్టం వచ్చినట్లుగా పాచికలు, బంతుల వంటి ఆటవస్తువులను కలిపి, అంతలోనే విడదీస్తాడు. ఇదేవిధంగా భగవంతుడు ప్రాణులను కలిపి, విడదీస్తాడు. సృష్టిలో సంయోగ వియోగాలన్నవి సహజం.

సమస్త ప్రాణికోటి జీవులుగా స్థిరాలు, దేహాలుగా అస్థిరాలు అంటే ఆత్మరూపంలో నిత్యం, శరీరరూపంలో అనిత్యం. కాని ఇవి నిజంగా స్థిరాలుగాని, అస్థిరాలుగాని కావు. పరిశుద్ధమైన పరబ్రహ్మం అనిర్వచనీయం. అది నిత్యానిత్యమై ఉంటుంది. కొండచిలువ పట్టుకొన్న మనుష్యుడు, మరో మనుష్యునికి సాయం చేయలేడు. అలాగే పంచభూతాల కలయికయైన దేహం కాలకర్మాధీనం. సంసారపంకనిర్మగ్నం. అది పరులను కాపాడలేదు.

చేతులున్న ప్రాణులకు చేతులు లేని నాలుగుకాళ్ల జంతువులు, కాళ్లుండి కదలగలిగే ప్రాణులకు కాళ్లులేని గడ్డిపోచ మొదలైనవి ఆహారమౌతున్నాయి. పెద్ద జంతువులైన పెద్దపులులు మొదలైనవి చిన్న జంతువులైన జింకలు మొదలైన వాటిని తింటున్నాయి. అన్ని దేహాలలోనూ జీవుడున్నాడు. ఒక దేహాన్ని మరో దేహం తింటున్నందువల్ల జీవికి జీవుడే జీవనాధారమైన ఆహారమౌతున్నాడు. చేతులున్న ప్రాణులతో, చేతులు లేని ప్రాణులతో నిండిన ఈ విశ్వాన్నంతటినీ ఈశ్వర స్వరూపంగా తెలిసికో. ఆయనకంటె అన్యంలేదు. తెలిసినవాడికి అన్నీ భగవంతునిలోని భాగాలే. మహామాయావియైన ఈశ్వరుడు గారడీవానివలె తన మాయావిశేషంచేత అనేక రూపాలు ధరించి తానే భోక్తయై, భోజ్యమై వెలుపల, లోపల అంతట తానై విరాజిల్లుతున్నాడు.

కాబట్టి ఓ ధర్మరాజా! దీనులు, దిక్కులేనివారు, అనాథులు నన్ను వదలి వారు ఏమౌతారో, ఎలా జీవిస్తారో! ఎక్కడున్నారో ఏమో అనే విచారం విడిచిపెట్టు. అజ్ఞాన కారణంగా ఈ దేహాలపై మమకారం పెంచుకొని అనవసరంగా మనస్సును కలతపరచుకొని దుఃఖించవద్దు. ఈ మనోవ్యాకులతను పూర్తిగా తొలగించుకో.

**విశే :** శుద్ధబ్రహ్మ స్వరూపంబున అనిర్వచనీయంబుగ రెండునైయుండు ధ్రువము, అధ్రువము అన్న విచారణ జీవులకు, ప్రపంచానికే కాని శుద్ధబ్రహ్మమునకు కాదని తాత్పర్యం. బ్రహ్మము జ్ఞానస్వరూపంగా ధ్రువము. జగత్తు వస్తువు కనుక అనిత్యము.

**ఆ. అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁడగు విష్ణుఁ, డసురనాశమునకు నవతరించి**
**దేవకృత్య మెల్లఁ దీర్చి చిక్కిన పని, కెదురుసూచుచుండు నిప్పు డధిప! 326**

**ప్రతి :** అధిప! = ఓరాజా!; అట్టి = అటువంటి; కాలస్వరూపుఁడు = కాలమే రూపమైనవాడు; అఖిల+ఆత్ముఁడు = సర్వమూ తానే అయినవాడు; అగు = అయిన; విష్ణుఁడు = సర్వవ్యాపకుడైన భగవంతుడు; అసుర+నాశమునకున్ = రాక్షసులను నశింపజేయటానికి; అవతరించి = పుట్టి; దేవకృత్యము+ఎల్లన్ = దేవతల పని అంతటిని; తీర్చి = నిర్వహించి; చిక్కిన+పనికిన్ = మిగిలిన కార్యానికి; ఇప్పుడు = ఈ సమయంలో; ఎదురుచూచుచున్ ఉండున్ = వేచి ఉన్నాడు.

**తా :** అట్టి కాలస్వరూపుడు, సర్వాంతర్యామియైన విష్ణువు రాక్షసులను సంహరించటానికై అవతరించినాడు. దేవకార్యాలను నెరవేర్చినాడు. ఇప్పుడు మిగిలిన పనికై వేచియున్నాడు.

**మత్త. ఎంత కాలము గృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు, మీ**
**రంత కాలము నుండుఁ డందఱు నవ్వలం బనిలేదు, వి**
**భ్రాంతి మానుము; కాలముం గడవంగ నెవ్వరు నోప, రీ**
**చింత యేల నరేంద్రసత్తమ! చెప్పెదన్ విను మంతయున్. 327**

**ప్రతి :** నరేంద్ర సత్తమ = రాజులలో ఉత్తముడైనవాడా! (ధర్మరాజా!); ఈశ్వరుఁడు = భగవంతుడు; కృష్ణుఁడు = శ్రీకృష్ణుడు; ఈ+ధరిత్రిన్ = ఈ భూమిపై; ఎంతకాలము = ఎంత సమయం; చరించున్ = తిరుగుతాడో (మనుగడ సాగిస్తాడో); అంతకాలము = అంతకాలం; మీరు = మీరు; అందఱున్ = అందరు; ఉండుఁడు = నివసించండి; ఆ+వలన్ = అటుపైన; పని+లేదు = అక్కరలేదు; విభ్రాంతి = విశేషమైన భ్రమ; మానుము = విడువుము; ఎవ్వరున్ = ఎంతవారైనను; కాలమున్ =

కాలమును (చావును); కడవన్+కన్= తప్పించుకొనగా; ఓపరు= సమర్థులుకారు; ఈ చింత= ఈ విచారము; ఏల?= ఎందుకు?; అంతయున్= (నీ తండ్రిని గూర్చిన వృత్తాంతము) సర్వమును; చెప్పెదన్= వివరింతును; వినుము= ఆలకింపుము.

**తా :** శ్రీకృష్ణ భగవానుడు ఈ భూమి మీద ఉన్నంతకాలం మీరందరు ఉండండి. ఆయన తన అవతారం చాలించగానే అటుపైన మీరు ఉండవలసిన పనిలేదు. మహారాజా! భ్రాంతిని విడిచిపెట్టు. ఎంతవారయినా కాలాన్ని తప్పించుకోలేరు. నీకీ విచారం ఎందుకు? ఏమి జరిగిందో సమస్తం నీకిప్పుడు చెపుతాను. విను.

**వ. ధృతరాష్ట్రుండు గాంధారీవిదుర సహితుండై హిమవత్పర్వతదక్షిణ భాగంబున నొక్క మునివనంబునకుం జని తొల్లి సప్తర్షులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడు ప్రవాహంబులయి పాఱిన పుణ్యతీర్థంబునం గృతస్నానుండై యథావిధి హోమం బొనరించి, జలభక్షణంబు గావించి, సకల కర్మంబులు విసర్జించి, విఘ్నంబులం జెందక నిరాహారుండయి, యుపశాంతాత్ముండయి పుత్త్రార్థదారైషణంబులు వర్జించి, విన్యస్తాసనుండై ప్రాణంబుల నియమించి, మనస్సహితంబులైన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయంబులం బ్రవర్తింపనీక నివర్తించి హరిభావనచే ధారణాయోగంబు వహించి, రజస్సత్త్వతమోరూపంబు లగు మలంబుల మూఁటిని హరించి మనంబు నహంకారాస్పదంబైన స్థూలదేహంబువలనం బాపి, బుద్ధియందు నేకీకరణంబు సేసి, యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి, క్షేత్రజ్ఞునియందుఁ బొందించి, దృష్టంబైన యీశ్వరునివలన క్షేత్రజ్ఞునిం బాపి, మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపు కైవడి, నాధారభూతం బైన బ్రహ్మమందుఁ గలిపి, లోపలి గుణక్షోభంబును, వెలుపలి యింద్రియ విక్షేపంబును లేక నిర్మూలిత మాయాగుణవాసనుం డగుచు నిరుద్ధంబు లగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి, యఖిలాహారంబులను వర్జించి, కొఱడు చందంబున. 328**

**ప్రతి :** ధృతరాష్ట్రుండు= (నీ తండ్రియైన) ధృతరాష్ట్రుడు; గాంధారీ విదురసహితుండు+ఐ= భార్య గాంధారి, తమ్ముడు విదురునితో కలిసినవాడై; హిమవత్ పర్వత= హిమవంతమను కొండకు; దక్షిణ భాగంబునన్= దక్షిణపువైపున; ఒక్క మునివనంబునకున్= ఋషులు గల ఒక అడవికి; చని= పోయి; తొల్లి= పూర్వం; సప్తర్షులకున్= ఏడుగురు ఋషులకు; సంతోషంబు+చేయుకొఱకున్= ఆనందాన్ని కలిగించటానికై; ఆకాశగంగ= దివినుండి దిగివచ్చిన గంగ, ఏడు ప్రవాహంబులు+అయి= ఏడుపాయలుగా చీలి; పాఱిన= ప్రసరించిన; పుణ్యతీర్థంబునన్= పవిత్రమైన తీర్థంలో కృత స్నానుండు+ఐ= స్నానము గావించినవాడై; యథావిధి= శాస్త్రరీతిలో; హోమంబు+ఒనరించి= అగ్నికార్యములు నిర్వర్తించి; జల+భక్షణంబున్+కావించి= నీటిని ఆహారంగా గ్రహించి; సకల+కర్మంబులు విసర్జించి= అన్ని పనులు వదలివేసి; విఘ్నంబులన్+చెందక= ఆటంకములు పొందక; నిర్+ఆహారుండు+అయి= ఆహారం లేనివాడై; ఉపశాంత+ఆత్ముండు+అయి= ఉపశమనం పొందిన మనస్సు కలవాడై; పుత్త్ర, అర్థ, దార+ఏషణంబులు= సంతానం, ధనం, భార్య అనే మూడింటిలోగల గాఢమైన కోరికలు; వర్జించి= విడిచి; విన్యస్త ఆసనుండు+ఐ= బాగుగా ఉంచబడిన ఆసనము కలవాడై; ప్రాణంబులన్+నియమించి= ప్రాణాలను అదుపులో ఉంచి; మనస్+సహితంబులు+ఐన= మనస్సుతో కూడినవైన; చక్షుస్+ఆది+ఇంద్రియంబులన్+ఆఱింటిని= కన్ను మొదలగు ఆరు ఇంద్రియాలను; విషయంబులన్= శబ్ద స్పర్శరూపరసగంధాదులందు; ప్రవర్తింపన్+ఈక= మెలగునట్లు చేయక; నివర్తించి= వెనుకకు మరలించి, (ప్రవృత్తిని నివృత్తివైపు సాగునట్లుచేసి); హరి+భావనచేన్= హరియందు నిరంతర స్మరణచే; ధారణా+యోగంబు= మనస్సును

పూర్తిగా పరమునందే నిలుకడగా నిలుపుటను; వహించి= ధరించి; రజస్+సత్త్వ+తమస్+రూపంబులు+అగు= రాజసికం, సాత్త్వికం, తామసికం అనే మూడు రూపాలు కలిగిన; మలంబులన్ మూఁటిని= మాలిన్యాలను మూడింటిని; హరించి= నాశనంచేసి; మనంబున్= మనస్సును; అహంకార+ఆస్పదంబు+ఐన= నేను అనే అహంభావానికి నెలవైన; స్థూలదేహంబువలనన్+పాపి= స్థూల దేహంనుండి తొలగించి; బుద్ధియందున్= మనస్సుకంటె ఉత్కృష్టమైన బుద్ధియందు; ఏకీకరణంబు= ఒక్కటిగా అగుట; చేసి= కావించి; అట్టి= అటువంటి; విజ్ఞాన+ఆత్మను= విశేష జ్ఞానం గల ఆత్మను; దృశ్య+అంశంబు వలనన్= చూచుట అనే అంశంవలన; వియోగించి= వేరగునట్లుచేసి; క్షేత్రజ్ఞునియందున్= పరమాత్మయందు; పొందించి= ప్రాప్తించునట్లుచేసి; దృష్టంబు+ఐన= చూడబడిన; ఈశ్వరునివలనన్= పరమాత్మ వలన; క్షేత్రజ్ఞునిన్= క్షేత్రం (దృశ్యం) తెలిసినవాణ్ణి (ద్రష్టను); పాపి= తొలగించి; మహాకాశంబుతోడన్= (శరీరానికి వెలుపల ఉన్న) పెద్ద ఆకాశంతో; ఘట+ఆకాశమున్= కుండలోని ఆకాశాన్ని; కలుపు+కైవడిన్= ఒకటిగా చేర్చేవిధంగా; ఆధారభూతంబు+ఐన= అన్నిటికి ఆధారమై ఒకటిగా ఉన్న; బ్రహ్మమందున్+కలిపి= బ్రహ్మంలో విలీనంచేసి; లోపలి= అంతర్గతాలైన; గుణక్షోభంబును= గుణానికి సంబంధించిన ఘర్షణము; వెలుపలి= బయటగల; ఇంద్రియ విక్షేపంబును= ఇంద్రియాల కదలిక; లేక= లేకుండ; నిర్మూలితమాయా గుణవాసనుండు+అగుచున్= నిర్మూలింపబడిన, మాయయు, గుణాల సంస్కారం కలవాడౌతూ; నిరుద్ధంబులు= అడ్డగింపబడినవి; అగు= అయిన; మనస్+చక్షుస్+ఆది+ఇంద్రియంబులు= మనస్సు, కన్ను మొదలగు ఇంద్రియాలు; కలిగి= పొంది; అఖిల+ఆహారంబులను= అన్నివిధాలైన ఆహారాలను; వర్జించి= విడిచిపెట్టి; కొఱడు+ చందంబునన్= మ్రోడువలె.

**తా :** ధృతరాష్ట్రుడు విదురునితో తన భార్య గాంధారితో కలిసి హిమగిరికి దక్షిణ దిక్కున గల ఋషుల ఆశ్రమానికి వెళ్లినాడు. అచ్చట ఆకాశగంగయైన మందాకిని సప్తర్షుల సంప్రీతికై ఏడుపాయలుగా చీలిపోయి ప్రవహిస్తుండగా సప్తస్రోతస్సు అనే పుణ్యతీర్థంలో స్నానం ముప్పూటలా చేసి, అగ్నికార్యాన్ని యథావిధిగా నిర్వరిస్తూ నీటిని మాత్రమే త్రాగుతూ, పుత్రాదులపై ఆసక్తిని వీడినాడు. క్రమంగా ఆసన స్థితిని పొంది, ప్రాణాయామం చేయుచు, ఇంద్రియాలను, మనస్సును విషయాలపై ప్రవర్తింపనీయక, నివృత్తిచేసి, శ్రీహరిని ధ్యానిస్తూ సత్త్వరజస్తమోగుణాల మాలిన్యాలను పూర్తిగా నశింపజేసి గుణాతీతుడయినాడు.

యోగమార్గంలో ఇప్పుడు మనస్సును విజ్ఞానాత్మలోను, దాన్ని క్షేత్రజ్ఞునిలోను, ఆ ద్రష్టను ఘటాకాశమనే మహాకాశంలోవలె అంతటికి ఆధారమైన బ్రహ్మమందు విలీనం చేసి వాసనలు పూర్తిగా నశింపజేసినాడు. ఇంద్రియాలను, మనస్సును నిరోధించి, పూర్తిగా ఆహారాన్ని విడిచిపెట్టి, అంతరింద్రియ, బాహ్యేంద్రియ సంక్షోభం లేకుండా మాయను నిరోధించి మోడు (స్థాణువు) వలె పర్ణశాల వేదికపై నిశ్చలంగా ఉన్నాడు.

**మ.** **ఉటజాంతస్థల వేదికన్ నియతుఁడై యున్నాఁడు నేఁడాదిగా**
**నిటపై నేనవనాఁడు మేన్ విడువఁగా నిజ్యాగ్ని యోగాగ్ని త**
**త్పటు దేహంబు దహింపఁ జూచి, నియమ ప్రఖ్యాత గాంధారి యి**
**ట్టటు వో నొల్లక ప్రాణవల్లభునితో నగ్నిం బడున్ భూవరా!** **329**

**ప్రతి :** భూవరా!= రాజా!; ఉటజ+అంతఃస్థల వేదికన్= ఆకుటింటి (పర్ణశాల) లోపలిచోట గల అరుగుమీద; నియతుఁడు+ఐ= నియమము కలవాడై; ఉన్నాఁడు= జీవించి ఉన్నాడు; నేఁడు+ఆదిగాన్= ఈ దినం మొదలుకొని; ఇటపైన్=

ఇటమీద; ఏనవనాఁడు= అయిదవ దినం; మేన్= శరీరాన్ని; ఇజ్యా+అగ్ని= యజ్ఞాగ్ని; యోగ+అగ్ని= యోగంవల్ల రగుల్కొన్న అగ్ని; విడువన్‌కాన్= వదలివేయగా; తద్ పటు+దేహంబు= అతని బలిష్ఠమైన శరీరం; దహింపన్= కాలగా; చూచి= వీక్షించి; నియమ+ప్రఖ్యాత= నియమంచే మిక్కిలి ఖ్యాతి కలిగిన; గాంధారి= గాంధార దేశపు రాజుకొమార్తెయైన ధృతరాష్ట్రుని భార్య; ఇట్టు+అటు+పోన్+ఒల్లక= సందేహంతో ఇటుగాని అటుగాని పోవటానికి అంగీకరింపక; ప్రాణవల్లభునితోన్= భర్తతో; అగ్నిన్= అగ్నియందు; పడున్= పడనున్నది.

**తా :** మహారాజా! మీ తండ్రి ధృతరాష్ట్రుడు నేటికి అయిదవనాడు యోగాగ్నిలో దేహత్యాగం చేయటానికి సంసిద్ధుడై ఉన్నాడు. ఆ విధంగా యోగాగ్నిలో కాలిపోవటం చూచి మహాపతివ్రత అయిన గాంధారి ఇటు అటు అని తట పటాయించక, తన ప్రాణేశ్వరునితో ఆ అగ్నిజ్వాలలో పడి బూడిద కావటానికి నిర్ణయించుకొన్నది.

**క. అంతట వారల మరణము, వింత యగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా**
**సంతాప మొదవఁ బ్రీత, స్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా! 330**

**ప్రతి :** అధిపా!= రాజా!; అంతటన్= అటుపైన; వారల= గాంధారీ ధృతరాష్ట్రుల; మరణము= మృతి; వింత= ఆశ్చర్యము; అగుచున్= కలిగిస్తూ; చూడన్+పడినన్= కంటపడగా; విదురుఁడు= (ధృతరాష్ట్రుని తమ్ముడైన) విదురుడు; చింతా సంతాపము= దుఃఖం, బాధ; ఒదవన్= కలుగగా; ప్రీత+స్వాంతుండు+ఐ= ప్రీతి చెందిన హృదయం కలవాడై; తీర్థములకున్= తీర్థయాత్రలకు; చనియెడున్= బయలుదేరుతాడు.

**తా :** అప్పుడు అన్నవదినెలైన ఆ యిరువురి మరణాన్ని కన్నులార చూచిన విదురుడు ఆ వింత సన్నివేశానికి ఆశ్చర్యచకితుడై కొంతసేపు చింతాక్రాంతుడై, అటుపై సంతోషస్వాంతుడై తీర్థయాత్రలకు బయలుదేరనున్నాడు.

**వ. అని విదురాదుల వృత్తాంతం బంతయు ధర్మనందనుని కెఱింగించి తుంబురు సహితుండయిన నారదుండు స్వర్గంబునకు నిర్గమించిన వెనుక, ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె. 331**

**ప్రతి :** అని= ఆ ప్రకారముగా; విదుర+ఆదుల= విదురుడు మొదలగువారి; వృత్తాంతంబు+అంతయున్= సమాచారము సమస్తము; ధర్మనందనునికిన్= ధర్మరాజుకు; ఎఱింగించి= తెలిపి; తుంబురు+సహితుండు+అయిన= తుంబురునితో కలిసినవాడైన; నారదుండు= నారదమహర్షి; స్వర్గంబునకున్= దేవలోకమునకు; నిర్గమించిన వెనుకన్= వెళ్లిన తరువాత; ధర్మజుండు= ధర్మరాజు; భీమునిన్= (తమ్ముడైన) భీముణ్ణి; చూచి= కాంచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ఈ విధంగా విదుర గాంధారీ ధృతరాష్ట్రుల వృత్తాంతాన్ని సమస్తం సవిస్తరంగా వివరించిన నారదుడు తుంబురునితో కలిసి స్వర్గలోకానికి వెళ్లినాడు. అటుపైన అజాతశత్రువు తన తమ్ముని భీముణ్ణి చూచి ఇలా అన్నాడు.

## ✤ ధర్మరాజు దుర్నిమిత్తంబులం గని చింతించుట ✤

**సీ. ఒక కాలమునఁ బండు నోషధిచయము వే ఱొక కాలమునఁ బండకుండు నండ్రు**
**క్రోధంబు లోభంబు క్రూరత బొంకును దీపింప నరులు వర్తింతు రండ్రు**
**వ్యవహారములు మహావ్యాజయుక్తము లండ్రు సఖ్యంబు వంచనాసహిత మండ్రు**
**మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు సుతులు దండ్రులఁ దెగఁ జూతు రండ్రు**

**తే. గురుల శిష్యులు దూషించి కూడ రంద్రు, శాస్త్రమార్గము లెవ్వియు జరుగ వంద్రు**
**న్యాయపద్ధతి బుధులైన నడవరంద్రు, కాలగతి వింతయై వచ్చెఁ గంటె నేఁడు. 332**

**ప్రతి :** ఒక కాలమునన్= నిర్దిష్టమైన ఒక సమయంలో; పండు= ఫలించే; ఓషధి చయము= మందులకు సంబంధించిన మొక్కల మొత్తం (ధాన్యాల సమూహం); వేఱు+ఒకకాలమునన్= మఱియొక కాలంలో; పండక+ఉండున్= పండటం లేదు; అంద్రు= అందురు; క్రోధంబు= కోపం; లోభంబు= అత్యాశ; క్రూరత= నొప్పించుట; బొంకును= అసత్యం పలకడం; దీపింపన్= అధికంకాగా; నరులు= మానవులు; వర్తింతురు= నడుస్తారు; అంద్రు= అందురు; వ్యవహారములు= తగవులు; మహా, వ్యాజ యుక్తములు= గొప్ప మిషతో (మోసం, స్వార్థం) కూడినవి; అంద్రు= అంటారు; సఖ్యంబు= మైత్రి, స్నేహం; వంచనాసహితము= ద్రోహంతో కూడింది; అంద్రు= అంటారు; మగలతోన్= భర్తలతో; ఇల్లాంద్రు= భార్యలు; మచ్చరించెదరు= పట్టుదలలు, స్పర్ధలు పెంచుకొంటారు; అంద్రు= అంటారు; సుతులు= పుత్రులు; తంద్రులన్= (జన్మనిచ్చిన) జనకులను; తెగన్+చూతురు= చంపుటకు యత్నిస్తారు; అంద్రు= అంటారు; శిష్యులు= శిష్యులు; గురువులన్= (తమకు విద్యనేర్పిన) గురువులను; దూషించి= తిట్టి; కూడరు= కలిసి ఉండరు; అంద్రు= అంటారు; శాస్త్ర+మార్గములు= శాస్త్రాలలో చెప్పిన విధులు, నియమాలు; ఎవ్వియున్= ఏవికూడా; జరుగవు= సాగకున్నవి; అంద్రు= అందురు; బుధులు+ఐనన్= తెలివిగలవారైనను, పండితులైనను; న్యాయ+పద్ధతిన్= స్వధర్మం నుండి తప్పని దారియందు; నడవరు= నడువ (వర్తింప) కున్నారు; అంద్రు= అందురు; నేఁడు= ఇప్పుడు; కాలగతి= కాలపరిస్థితి; వింత+ఐ= ఆశ్చర్యకరమై; వచ్చెన్= సమీపించినది; కంటె= చూచితివా?

**తా :** తమ్ముడూ! భీమసేనా! చూచితివి కదా! కాలగమనంలో ఎంత వింతమార్పులు వచ్చినవో! పంటలు ఓషధుల మొక్కలు సరియైన కాలంలో పండకున్నవి. క్రోధం, లోభం, క్రూరత్వం, అసత్యంతో ప్రజలు వర్తించుచున్నారు. ఏ వ్యవహారంలోనైనా వ్యాపారాలలోనైనా మోసం పెచ్చు పెరిగిపోతుంది. స్నేహంలో ద్రోహమే కన్పిస్తుంది. భార్యలు భర్తలను స్పర్ధతో ద్వేషంతో చూస్తున్నారు. కొడుకులు కన్నతంద్రులపై కచ్చెతో ప్రాణాలు తీయుటకే పూనుకొంటున్నారు. ఇక శిష్యులు తమకు విద్యాబుద్ధులు నేర్పిన గురువులనే దూషిస్తున్నారు. శాస్త్రాలు చెప్పిన విధులేవి కూడా సాగుటలేదు. విజ్ఞులు సైతం న్యాయమార్గంలో నడవటం లేదు. కాలమిప్పుడు వింతగా పూర్తిగా తారుమారైంది.

**మ. హరిఁ జూడన్ నరుఁ డేఁగినాఁడు; నెల లేడయ్యెం గదా రారు కా**
**లరు లెవ్వారును; యాదవుల్ సమదలోలస్వాంతు; లీ వేళ సు**
**స్థిరులై యుండుదురా? మురారి సుఖియై సేమంబుతో నుండునా?**
**యెరవై యున్నది చిత్త; మీశ్వరకృతం బెట్లో కదే! మారుతీ! 333**

**ప్రతి :** మారుతీ= వాయుకుమారా! భీమా!; హరిన్= శ్రీకృష్ణుని; చూడన్= చూచుటకు; నరుఁడు= అర్జునుడు; ఏఁగినాఁడు= ద్వారకకు వెళ్లినాడు; ఏడు+నెలలు+అయ్యెన్‌కదా!= ఏడుమాసాలు అయినవి కదా!; కాలరులు= వార్తాహరులు; ఎవ్వారును= ఎవ్వరుకూడా; రారు= రాలేదు; యాదవుల్= యాదవులు; స మదలోల స్వాంతులు= మదంతో కూడిన; చంచలమైన, హృదయాలు కలవారు; ఈ వేళన్= ఈ సందర్భంలో; సుస్థిరులు+ఐ= మంచి స్థిరత్వం కలవారై; ఉండుదురా= ఉండియుందురా?; మురారి= మురుని శత్రువైన శ్రీకృష్ణుడు; సుఖి+ఐ= సుఖం కలవాడై; సేమంబుతోన్= క్షేమంగా; ఉండునా= ఉన్నాడా?; చిత్తము= మనస్సు; ఎరవు+ఐ= మరొకతీరుగా, విపరీతంగా; ఉన్నది= ఉంది; ఈశ్వరకృతంబు= దైవయోగము; ఎట్లో+కదే!= ఏ తీరోకదా!

**తా :** భీమసేనా! మాధవుని వెంట అర్జునుడు ద్వారకకుపోయి ఇప్పటికి ఏడునెలలు గడచిపోయాయి. నేటిదాక అతడు తిరిగిరాలేదు. కనీసం వార్తాహరులు కూడా ఎవ్వరు రాలేదు. యాదవులు పొగరు పట్టిన స్వభావం కలవారు. వారిలో చాంచల్యం ఎక్కువ. వాళ్లు ప్రశాంతచిత్తులై ఉండగలరా? వాసుదేవుడు సుఖంగా క్షేమంగా ఉన్నాడా? మనస్సు ఎందుకో ఒక విధంగా ఉంది. ఇంతకు దైవసంకల్పం ఏ విధంగా ఉన్నదో! ఏమో!

**క. మానసము గలఁగు చున్నది, మానవు బహుదుర్నిమిత్త మర్యాదలు, స**
**న్మానవ దేహక్రీడలు, మాన విచారింప నోపు మాధవుఁ డనుజా! 334**

**ప్రతి :** అనుజా!= తమ్ముడా!; మానసము= చిత్తం; కలఁగుచున్నది= కలత చెందుతున్నది; బహుదుర్నిమిత్త మర్యాదలు= పలు చెడ్డ శకునాల హద్దులు; మానవు= మానకున్నాయి; సత్+మానవ+దేహక్రీడలు= ఉత్తమ మానవుడుగా; శరీరమెత్తి ఆడే ఆటలు; మానన్= విడుచుటకు; మాధవుఁడు= కృష్ణుడు; విచారింపన్+ఓపున్= ఆలోచించుచుండవలెను (ఇట); ఓపున్= సమర్థుడౌతాడు అని అర్థవిశేషం.

**తా :** తమ్ముడూ! భీమసేనా! నా మనస్సు కలత చెందుతుంది. అనేక దుశ్శకునాలు గోచరిస్తున్నాయి. వాసుదేవుడు తన లీలామానుష దేహాన్ని చాలింపవలెనని తలంచున్నాడేమో!

**క. మనవులు సెప్పక ముందఱ, మన దార ప్రాణ రాజ్య మాన శ్రీలన్**
**మనుపుదు నని మాధవుఁడిట, మనమునఁ దలపోసి మనిచె మనలం గరుణన్. 335**

**ప్రతి :** మాధవుడు= లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణుడు; ఇటన్= ఇచ్చట; మనవులు+చెప్పక ముందఱన్= (మన) విన్నపాలు విన్నవించకముందే; మన= మనకు సంబంధించిన; దార= ధర్మపత్నిని; ప్రాణ= ప్రాణాలను; రాజ్య= రాజ్యాన్ని; మాన= అభిమానాన్ని; శ్రీలన్= సంపదలను; మనుపుదున్= రక్షిస్తాను; అని= అంటూ; మనమునన్= మనస్సులో; తలపోసి= భావించి; కరుణన్= దయతో; మనలన్= మన అందరిని; మనిచెన్= బ్రదికించినాడు.

**తా :** శ్రీకృష్ణుడు మనం విన్నవింపకమునుపే మన కష్టనష్టాలు గుర్తించి, స్వయంగా అన్నీ తానై మన ధర్మపత్నిని, మన మానప్రాణాలను, రాజ్యాన్ని, సిరిసంపదలను కాపాడుతానని తలచి, అట్లే దయతో మనలను పోషించి బ్రతికించినాడు.

**క. నారదుఁడాడిన కైవడిఁ, గ్రూరపుఁగాలంబు వచ్చుఁ గుంభిని మీఁదన్**
**ఘోరములగు నుత్పాతము, లారభటిం జూడఁబడియె ననిలజ! కంటే. 336**

**ప్రతి :** అనిలజ!= వాయుకుమారా! భీమసేనా!; నారదుఁడు= నారద మహర్షి; ఆడిన+కైవడిన్= పలికినవిధంగా; కుంభినిమీఁదన్= భూమిపై; క్రూరము+కాలంబు= ఘోరమైన కాలం; వచ్చున్= వస్తున్నది; ఘోరములు+అగు= భయంకరాలైన; ఉత్పాతములు= అపశకునాలు అనగా తెలియకుండ కలిగే కీడులు; ఆరభటిన్= ఆర్భాటంతో; చూడన్+పడియెన్= (ప్రత్యక్షంగా) కన్పడుతున్నాయి!; కంటే!= చూచినావా!

**తా :** వాయునందనా! భీమా! నారదుడు చెప్పినట్లుగానే చాలా చెడ్డకాలం వచ్చింది. ఈ భూమిపై భయంకరాలై మునుపెన్నడూ చూడని ఉపద్రవాలు కన్పిస్తున్నాయి. చూచావు కదా!

## ❖ ధర్మజుఁడు భీమునికి కొన్ని ఉత్పాతాలు చెప్పట ❖

**సీ.** **ఓడక ముందట నొక సారమేయంబు మొఱుఁగుచు నున్నది మోర యెత్తి**
**యాదిత్యుఁ డుదయింప నభిముఖంబై నక్క వాపోయె మంటలు వాతఁ గలుగ**
**మిక్కిలుచున్నవి మెఱసి గృధ్రాదులు గర్దభాదులు దీర్చి క్రందుకొనియె**
**నుత్తమాశ్వంబుల కుదయించెఁ గన్నీరు మత్తగజంబుల మదము లుడిగెఁ**

**ఆ.** **గాలు దూతభంగిఁ గదిసెఁ గపోతము, మండ దగ్ని హోమమందిరములఁ**
**జుట్టుఁ బొగలు దిశల సొరిది నాచ్ఛాదించెఁ, దరణి మాసెఁ జూడు ధరణి గదలె.** **337**

**ప్రతి :** ఒకసారమేయంబు= ఒక కుక్క; ముందటన్= ముందువైపు; ఓడక= జంకక; మోర+ఎత్తి= పొడవైన ముఖాన్ని పైకెత్తి; మొఱుఁగుచున్+ఉన్నది= అరుస్తున్నది; నక్క= జంబుకము; ఆదిత్యుఁడు+ఉదయింపన్= సూర్యుడు పుట్టగనే; అభిముఖంబు+ఐ= ఎదురై; వాతన్= నోటిలో; మంటలు= నిప్పులు, అగ్నిజ్వాలలు; కలుగన్= కలుగగా; వాపోయెన్= ఏడ్చింది; గృధ్ర+ఆదులు= గద్దలు మొదలైనవి; మెఱసి= విజృంభించి; మిక్కిలుచున్నవి= ఎక్కువౌతున్నాయి; గర్దభ+ఆదులు= గాడిదలు మొదలైనవి; తీర్చి= ఏర్పాటుగాచేరి; క్రందుకొనియెన్= గుంపుగా కూడినవి; ఉత్తమ+అశ్వంబులకున్= శ్రేష్ఠములైన గుఱ్ఱాలకు; కన్నీరు= కంటినీరు; ఉదయించెన్= కలిగింది; మత్తగజంబుల మదములు= మదించిన యేనుగుల క్రొవ్వుకారుటలు; ఉడిగెన్= మానినవి; కాలు దూత భంగిన్= యముని దూతవలె; కపోతము= పావురం; కదిసెన్= సమీపించింది; హోమ+మందిరములన్= యజ్ఞవాటికలలో; అగ్ని= నిప్పు; మండదు= జ్వలించటం లేదు; పొగలు= ధూమము; దిశల+చుట్టన్= అన్నిదిక్కుల చుట్టూ; సొరిదిన్= వరుసగా; ఆచ్ఛాదించెన్= కప్పివేసింది; తరణి= సూర్యుడు; మాసెన్= కాంతిహీనుడైనాడు; ధరణి= భూమి; కదలెన్= కంపించింది; చూడు= కనుగొనుము.

**తా :** అదిగో! అటుచూడు. ఒక కుక్క మనముందే ముఖం పైకెత్తి మొరుగుతుంది. ఇక నక్క సూర్యు డుదయిస్తూండగా ఎదురుగా నోటివెంట నిప్పులమంటతో ఏడుస్తుంది. గద్దలు మొదలైనవి గుంపులు గుంపులుగా తిరుగుతున్నాయి. గాడిదలు మొదలైన జంతువులు గుంపులుగా గుమిగూడి ఉన్నాయి. ఉత్తమజాతి గుఱ్ఱాలు కన్నీరు కారుస్తున్నాయి. మదపుటేనుగుల చెక్కిళ్లనుండి మదజలం కారడం మానింది. పావురాలు యమదూతలవలె పైకి వస్తున్నాయి. హోమవాటికలలో అగ్నిహోత్రుడు మండటం లేదు. దట్టంగా పొగలు దిక్కులెల్ల చుట్టుముట్టి క్రమ్ముకొన్నాయి. సూర్యబింబం మసకవేసి మలినంగా ఉంది. భూమి కంపిస్తున్నది.

**క.** **వాతములు విసరె, రేణు, వ్రాతము లాకసముఁ గప్పె, వడి సుడిగొని ని**
**ర్ఘాతములు వడియె, ఘన సం, ఘాతంబులు రక్తవర్షకలితము లయ్యెన్.** **338**

**ప్రతి :** వాతములు= గాలులు; విసరెన్= వీచాయి; రేణు+వ్రాతములు= ధూళి సమూహాలు (దుమ్ము మొత్తము); వడిన్= వేగంగా; సుడిగొని= సుడులు తిరుగుతూ; ఆకసమున్= ఆకాశాన్ని; కప్పెన్= ఆవరించాయి; నిర్ఘాతములు+పడియెన్= పిడుగులు పడ్డాయి; ఘన+సంఘాతంబులు= మబ్బులగుంపులు; రక్త+వర్ష+కలితములు= నెత్తుటి వానతో కూడినవి; అయ్యెన్= అయినవి.

**తా :** విపరీతంగా గాలులు వీచినవి. దుమ్ము మొత్తం సుడులు తిరుగుతూ వడివడిగా ఆకాశాన్ని కప్పివేసింది. పైనుండి పిడుగులు పడుతున్నాయి. మేఘాలు నెత్తుటి వాన కురుస్తున్నాయి.

**క. గ్రహములు పోరాడెడి నా, గ్రహములు వినఁబడియె, భూత కలకలములు దు**
**స్సహము లగుచు శిఖికీలా, వహములక్రియఁ దోఁచె గగనవసుధాంతరముల్. 339**

**ప్రతి :** గ్రహములు= సూర్యుడు మొదలైన గ్రహాలు; పోరు+ఆడెడిన్= ఒకదానితో ఒకటి పోరాడుతున్నాయి; ఆగ్రహములు= కోపాలు (కోపంతో ఒకదాన్ని మరొకటి పట్టుదలతో ఆక్రమించుకొన్నప్పుడు కలిగే శబ్దాలు); వినన్+పడియెన్= వినిపించినవి; భూత+కలకలములు= ప్రాణుల అలజడులు; దుస్సహములు= సహింపరానివిగా; అగుచున్= పరిణమిస్తూ; శిఖి+కీలావహముల క్రియన్= నిప్పులమంటలను ధరించినవాటివలె; గగన+వసుధా+అంతరముల్= ఆకాశానికీ, భూమికీ నడుమగల ప్రదేశాలు; తోఁచెన్= కన్పట్టినవి.

**తా :** గ్రహాలు ఆగ్రహంతో పోరాడుకొంటున్నాయి. ఎటుచూచినా భూతాల కలకలధ్వనులే వినబడుతున్నాయి. మన్నుమిన్ను ఒక్కటై భగభగమని మండుతున్నట్లు తోస్తున్నది.

**క. దూడలు గుడువవు చన్నులు, దూడలకున్ గోవు లీవు దుగ్ధము లొడలం**
**బీడలు మానవు పశువులఁ, గూడవు వృషభములు తఱపి కుఱ్ఱల నెక్కున్. 340**

**ప్రతి :** దూడలు= లేగలు; చన్నులు= పొదుగులు; కుడువవు= త్రాగటంలేదు; దూడలకున్= ఆ లేగదూడలకు; గోవులు= ఆవులు; దుగ్ధములు= పాలు; ఈవు= ఇవ్వటంలేదు; ఒడలన్= దేహాలలో; పీడలు= వ్యాధులు, బాధలు; మానవు= తొలగటం లేదు; వృషభములు= ఎద్దులు; పశువులన్= ఆవులను; కూడవు= కలియటం లేదు; తఱపి+కుఱ్ఱలన్= చిన్నవయస్సు గల ఆఱునెలల ఆవుదూడలను; ఎక్కున్= దాటుతున్నాయి.

**తా :** దూడలు పాలు తాగటం లేదు. ఆవులు పాలివ్వటం లేదు. పశువులకు పట్టిన వ్యాధులు వదలిపోవటం లేదు. ఆబోతులు పశువులను ఋతువునుబట్టి కలియటం లేదు. కోడెలు కొదమపిల్లలను దాటుతున్నాయి.

**క. కదలెడు వేల్పుల రూపులు, వదలెడుఁ గన్నీరు వానివలనం జెమటల్**
**వొదలెడిఁ బ్రతిమలు వెలిఁజని, మెదలెడి నొక్కొక్క గుడిని మేదినియందున్. 341**

**ప్రతి :** వేల్పుల రూపులు= దేవతావిగ్రహముల మూర్తులు; కదలెడున్= చలిస్తున్నాయి; కన్నీరు= కంటినీరు; వదలెడున్= కారుచున్నది; వానివలనన్= ఆ దేవతాప్రతిమలనుండి; చెమటల్= స్వేదము; పొదలెడిన్= కలుగుతున్నది; మేదినియందున్= భువిలో; ఒక్కొక్కగుడిని= ఒక్కొక్క గుడిలో; ప్రతిమలు= విగ్రహములు; వెలిన్+చని= వెలుపలికిపోయి; మెదలెడిన్= తిరుగుచున్నవి.

**తా :** దేవాలయాలలోని దేవతావిగ్రహాలు కొన్ని కదలుతున్నాయి. కొన్ని కన్నీరు కార్చుతున్నాయి. మఱికొన్ని ఉక్కకు తాళలేక చెమర్చుతున్నాయి. ఇక కొన్ని గుడినుండి వెలుపలికి వెళ్లుతున్నాయి.

**క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు గుంఁడ్రలు గొలిపెన్**
**లోకంబులు విభ్రష్ట, శ్రీకంబులు గతి నశించి శిథిలము లయ్యెన్. 342**

**ప్రతి :** కాకంబులు= కాకులు; వాపోయెడిన్= ఏడుస్తున్నాయి; ఘూకంబులు= గుడ్లగూబలు; పగలు= పగటిపూట; నగరన్= రాచనగరులో; గుంఁడ్రలు గొలిపెన్= పరిభ్రమిస్తున్నాయి; లోకంబులు= జగములు; విభ్రష్ట+శ్రీకంబులు=

మిక్కిలి నశించిన శోభ కలవి; గతి= బ్రతుకుదెరువు, గమనము; నశించి= నాశనమయి; శిథిలములు+అయ్యెన్= పాడుబడ్డాయి.

**తా :** కాకులు కావుకావుమని అరుస్తూ ఏడుస్తున్నాయి. గుడ్లగూబలు, పట్టపగలే నగరిలో గుండ్రంగా తిరుగుతున్నాయి. లోకాలు తమ శోభను కోల్పోయి గతితప్పి పాడుబడ్డాయి.

**మ. యవ పద్మాంకుశ చాప చక్ర ఝష రేఖాలంకృతంబైన మా**
**ధవు పాదద్వయ మింక మెట్టెడు పవిత్రత్వంబు నేఁడాదిగా**
**నవనీకాంతకు లేదు పో; మఱి మదీయాంగంబు వామాక్షి బా**
**హువు లాకంపము నొందుచుండు; నిల కే యుగ్రస్థితుల్ వచ్చునో! 343**

**ప్రతి :** యవ= ధాన్యపుగింజ; పద్మ= తామర; అంకుశ= ఏనుగును నడపించుటకై దాని కుంభస్థలమున పొడుచు ఆయుధము; చాప= ధనుస్సు; చక్ర= చక్రము; ఝష= చేప అనువానియొక్క; రేఖా= గీఱలచే; అలంకృతంబు+ఐన= అలంకరింపబడినదైన; మాధవు= శ్రీకృష్ణుని; పాదద్వయము= అడుగుల జంట; ఇంకన్= ఇటుపై; మెట్టెడు= త్రొక్కునట్టి; పవిత్రత్వంబు= నిర్మలత్వము; నేఁడు+ఆదిగాన్= ఈ దినం మొదలుగా; అవనీకాంతకున్= భూదేవికి; లేదు పో= లేదేమో; మఱి= ఇంకను; మదీయ+అంగంబు= నా శరీరం; వామ+అక్షి= ఎడమకన్ను; బాహువులు= భుజములు; ఆకంపము= మిక్కిలిగా అదరటాన్ని; ఒందుచుండున్= పొందుతున్నవి; ఇలకున్= ఈ భూమికి; ఏ+ఉగ్ర+స్థితుల్= ఎటువంటి భయంకర పరిస్థితులు; వచ్చును+ఓ!= రాగలవో!

**తా :** భీమసేనా! యవధాన్యము, పద్మం, అంకుశం, చాపం, చక్రం, చేప చిహ్నముల శుభరేఖలతో అలంకరించబడిన వాసుదేవుని పాదాల జంట మోపుటచే పావనమైన భాగ్యం ఈ భూదేవికి ఇకలేదేమో! నా ఎడమ కన్ను ఎడమభుజం మాటిమాటికి అదురుతున్నాయి. ఈ లోకానికి ఇంకా ఎటువంటి భయంకర పరిస్థితులు దాపురించనున్నాయో కదా!

**వ. మఱియు మహోత్పాతంబులు పెక్కులు పుట్టుచున్నయవి; మురాంతకుని వృత్తాంతంబు వినరాదని కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమయంబున. 344**

**ప్రతి :** మఱియున్= ఇంకను; మహా+ఉత్పాతంబులు= హఠాత్తుగా సంభవించే ఘోరమైన ఆపదలను సూచించే లక్షణాలు; పెక్కులు= అనేకములు; పుట్టుచున్నయవి= కలుగుచున్నవి; ముర+అంతకుని= శ్రీకృష్ణుని; వృత్తాంతంబు= వార్త; వినరాదు= వినిపించుటలేదు; అని= ఆ విధముగా తలచి; కుంతీసుత+అగ్రజుండు= కుంతి కుమారులలో మొదట పుట్టినవాడైన ధర్మరాజు; భీమునితోన్= తమ్ముడైన భీమసేనునితో; విచారించు= ఆలోచించు; సమయంబునన్= సందర్భమున...

**తా :** ఇంకను ఎన్నో ఉత్పాతాలు కలుగుతున్నవి. అచ్చట ద్వారకలో శ్రీకృష్ణుడు ఎట్లున్నాడో తెలియుటలేదు అని ధర్మజుడు భీమునితో పలుకుతూ మిగుల దిగులుతో ఉన్నాడు. ఆ సమయంలో –

## ✤ అర్జునుండు ద్వారక నుండి వచ్చి కృష్ణ నిర్యాణంబుఁ దెల్పుట ✤

**క. ఖేదమున నింద్రసూనుఁడు, యాదవ పురినుండి వచ్చి యగ్రజుఁ గని త**
**త్పాదముల నయన సలిలో, త్పాదకుఁడై పడియె దీను భంగి నరేంద్రా! 345**

**ప్రతి :** నర+ఇంద్రా!= రాజా!; ఇంద్రసూనుఁడు= ఇంద్రుని కొడుకైన అర్జునుడు; ఖేదమునన్= దుఃఖముతో; యాదవపురినుండి= ద్వారకనుండి; వచ్చి= చనుదెంచి; అగ్రజున్= అన్నయైన ధర్మజుని; కని= చూచి; నయన+సలిల+ఉత్పాదకుఁడు+ఐ= కంటినీరు కలుగజేయువాడై; దీను+భంగిన్= జాలిగొలుపు వానివలె; తత్+పాదములన్= ఆతని కాళ్లమీద; పడియెన్= పడినాడు.

**తా :** రాజా! అంతలో ద్వారకా నగరమునుండి వచ్చిన అర్జునుడు కన్నులనిండ నీరు నింపుకొని, భరింపరాని దుఃఖంతో దీనుడై అన్న పాదాలపై వాలినాడు.

**క. పల్లటిలిన యుల్లముతోఁ, దల్లడపడుచున్న పిన్నతమ్మునిఁ గని వె**
**ల్వెల్ల నగు మొగముతో జను, లెల్లను విన ధర్మపుత్రుఁ డిట్లని పలికెన్. 346**

**ప్రతి :** ధర్మపుత్త్రుఁడు= ధర్మనందనుడగు అజాత శత్రువు; పల్లటిలిన= చలించిన; ఉల్లముతోన్= మనస్సుతో; తల్లడపడుచు+ఉన్న= చలిస్తున్న; పిన్న+తమ్మునిన్= చిన్న తమ్ముడైన అర్జునుని; కని= చూచి; వెల్వెల్లన+అగు= మిక్కిలి పాలిపోయిన; మొగముతోన్= ముఖంతో; జనులు+ఎల్లనున్= ప్రజలందరు; వినన్= ఆలకింపగా; ఇట్లు= ఈ విధంగా; పలికెన్= అడిగినాడు.

**తా :** అల్లకల్లోలమై చాలా ఎక్కువగా కదలిపోయిన మనస్సుతో తల్లడిల్లుతున్న చిన్నతమ్ముణ్ణి చూచి ధర్మరాజు ముఖం వెలవెలపోయింది. అప్పుడు అందరు వినుచుండగా ఆయన అర్జునునితో ఇట్లు పలికినాడు.

**సీ. మాతామహుండైన మన శూరుఁ డున్నాడె? మంగళమే మన మాతులునకు ?**
**మోదమే నలుగురు ముగురు మేనత్తల? కానందమే వారి యాత్మజులకు?**
**నక్రూర కృతవర్మ లాయుస్సమేతులే? జీవితుఁడే యుగ్రసేనవిభుఁడు?**
**కల్యాణయుక్తులే గద సారణాదులు? మాధవుతమ్ములు మానధనులు?**

**తే. నందమే మన సత్యకనందనునకు? భద్రమే శంబరాసురభంజనునకుఁ?**
**గుశలమే బాణదనుజేంద్రు కూఁతుపతికి? హర్షమే పార్థ! ముసలికి, హలికి, బలికి? 347**

**ప్రతి :** పార్థ!= అర్జునా!; మన= మనయొక్క; మాతామహుండు+ఐన= తల్లితండ్రియైన; శూరుఁడు= కుంతిభోజుడు; ఉన్నాఁడె= క్షేమంగా ఉన్నాడా?; మన+మాతులునకున్= మన మేనమామకు; మంగళము+ఏ= శుభమా? నలుగురు ముగురు= నలువురు ముగ్గురు; మేన+అత్తలకున్= మేనత్తలకు, మోదము+ఏ= సంతోషమా?; వారి+ఆత్మజులకున్= ఆ మేనత్తల బిడ్డలకు; ఆనందమే?= సౌఖ్యమా?; అక్రూర కృతవర్మలు= అక్రూరుడు, కృతవర్మ; ఆయుస్+సమేతులు+ఏ= ఆయుస్సుతో కూడి ఉన్నారా?; ఉగ్రసేన విభుఁడు= ఉగ్రసేన మహారాజు; జీవితుఁడు+ఏ= జీవించియున్నాడా?; మాధవు తమ్ములు= శ్రీకృష్ణుని తమ్ములు; మానధనులు= మానమే ధనముగా కలవారు; గద సారణ+ఆదులు= గదుడు; సారణుడు మొదలైనవాళ్లు; కల్యాణయుక్తులు+ఏ= శుభంగా ఉన్నారా?; మన సత్యకనందనునకున్= మన సాత్యకికి; నందము+ఏ= సంతోషమా?; శంబర+అసుర+భంజనునకున్= శంబరుడు అను రాక్షసుని చంపినవాడైన ప్రద్యుమ్నునికి; భద్రము+ఏ= క్షేమమా?; బాణదనుజ+ఇంద్రు+కూఁతు పతికిన్= బాణుడు అనే రాక్షసశ్రేష్ఠుని కొమార్తెయగు ఉషాదేవి భర్తయైన

అనిరుద్ధునికి; కుశలము+ఏ= క్షేమమా?; ముసలికిన్= ముసలము (రోకలి) ఆయుధంగా గలవాడును; హలికిన్= హలము (నాగలి) ఆయుధంగా గలవాడును; బలికిన్= బలముగలవాడును అయిన బలరామునకు; హర్షము+ఏ= సంతోషమా?

**తా :** అర్జునా! మన మాతామహుడు శూరసేనునకు క్షేమమే కదా! మన మేనమామ వసుదేవునకు సుఖమే కదా! మన మేనత్తలు ఏడుగురు సంతోషంగా ఉన్నారు కదా! వారి కొడుకులందరూ క్షేమమే కదా! అక్రూరకృతవర్మలు ఆరోగ్యముతో ఉన్నారు గదా! ఉగ్రసేన మహారాజు తిన్నగా తిరుగుతున్నాడు కదా! మానధనులైన వాసుదేవుని సోదరులు – గదుడు సారణుడు ఇంకా తక్కినవారు కుశలవంతులే కదా? మన సాత్యకికి ప్రద్యుమ్నునకు అనిరుద్ధునకు కుశలమా? మన పెద్దబావ బలరాముడు సుఖంగా ఉన్నాడా?

**విశే :** మేనత్తలు ఏడుగురు : రోహిణి, దేవకి, ఉపదేవి, వృకదేవి, సప్తమి, శృకంధర, జన. వీరుకాక శ్రద్ధ అనే ఒక వైశ్యకాంత కూడా ఉన్నది.

**వ. మఱియు నంధక మధు భోజ దశార్హ వృష్ణి సాత్వతులు మొదలయిన యదువంశ వీరులును, హరికుమారులైన సాంబ సుషేణ ప్రముఖులును, నారాయణానుచరులైన యుద్ధవాదులును, గృష్ణ సహచరులైన సునంద నందాదులును సుఖానందులే? యని యందఱ నడిగి ధర్మజుండు గ్రమ్మఱ నిట్లనియె. 348**

**ప్రతి :** మఱియున్= ఇంకను; అంధక, మధు, భోజ, దశార్హ, వృష్ణి, సాత్వతులు= అంధకులు, మధువులు, భోజులు, దశార్హులు, వృష్ణులు, సాత్వతులు మొదలు+అయిన; యదువంశవీరులును= మున్నగు యాదవకులవీరులూ; హరికుమారులు+ఐన= శ్రీకృష్ణుని పుత్రులైన; సాంబ, సుషేణ+ప్రముఖులును= సాంబుడు, సుషేణుడు మొదలైనవారు; నారాయణ+అనుచరులు+ఐన= కృష్ణుని అనుసరించి తిరుగువారైన; ఉద్ధవ+ఆదులును= ఉద్ధవుడు మొదలైనవారూ; కృష్ణసహచరులు+ఐన= కృష్ణుని సహవాసం కలవారైన; సునందనంద+ఆదులును= సునందుడు; నందుడు మొదలైనవారూ; సుఖ+ఆనందులు+ఏ= సుఖంగా ఆనందంగా ఉన్నారా?; అని= అంటూ; అందఱన్= అందరిని; అడిగి= యోగక్షేమాలు విచారించి; ధర్మజుండు= ధర్మరాజు; క్రమ్మఱన్= మరల; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అంధకులు, మధువులు, భోజకులు, దశార్హులు, వృష్ణులు, సాత్వతులు మున్నుగా గల యాదవవీరులు, శ్రీకృష్ణుని కుమారులైన సాంబసుషేణాదులు, శ్రీకృష్ణుని అనుచరులైన ఉద్ధవాదులు, శ్రీకృష్ణుని మిత్రులైన సునందుడు నందుడు మొదలైనవారు, సుఖంగా ఉన్నారా? అంటూ ధర్మరాజు మరల ఈ విధంగా అర్జుననితో అన్నాడు.

**సీ. వైకుంఠవాసుల వడువున నెవ్వని, బలమున నానందభరితు లగుచు**
**వెఱవక యాదవ వీరులు వర్తింతు రమరులు గొలువుండునట్టి కొలువు**
**చవికె నాకర్షించి చరణసేవకులైన బంధుమిత్రాదుల పాదయుగము**
**నెవ్వఁడు ద్రొక్కించె నింద్రపీఠము మీఁద వజ్రంబు జళిపించి వ్రాలువాని**

**తే. ప్రాణవల్లభ కెంగేలఁ బాదు సేసి, యమృతజలములఁ బోషింప నలరు పారి**
**జాత మెవ్వఁడు గొనివచ్చి సత్యభామ, కిచ్చె నట్టి మహాత్మున కిపుడు శుభమె? 349**

**ప్రతి :** ఎవ్వని+బలమునన్= ఏ మహాపురుషుని బాహుబలముచే; వైకుంఠవాసుల వడువునన్= వైకుంఠంలో నివసించే వారివలె; యాదవవీరులు= యదువంశంలోని శ్రేష్ఠులు; వెఱవక= జంకక; ఆనంద భరితులు+అగుచున్= ఆనందంతో నిండినవారై; వర్తింతురు= మెలగుతున్నారో; ఎవ్వఁడు= ఏ మహానుభావుడు; అమరులు= దేవతలు; కొలువు+ఉండు+అట్టి= ఒడ్డోలగం ఉండునట్టి; కొలువు చవికెన్= ఆస్థాన మండపమును; ఆకర్షించి= ఆకర్షణచేసి (లాగి); చరణసేవకులు+ఐన= తన పాదసేవ చేసేవారైన; బంధు+మిత్ర+ఆదుల+పాదయుగమున్= బంధువులు, స్నేహితులు మొదలైనవారి పాదాలజంటచే; త్రొక్కించెన్= నడచునట్లు చేసినాడో; ఇంద్రపీఠము మీఁదన్= ఇంద్ర పదవిలో; వజ్రంబు= వజ్రాయుధము; జళిపించి= త్రిప్పుతు; వ్రాలువాని= అతిశయించు ఇంద్రుడియొక్క; ప్రాణవల్లభ= ప్రాణేశ్వరి శచీదేవి; కెంపు+కేలన్= ఎఱ్ఱని చేతితో; పాదు+చేసి= నీళ్లు నిలిచే పల్లంచేసి; అమృతజలములన్= అమృతమనేనీటితో; పోషింపన్= పెంచగా; అలరు= శోభించే; పారిజాతము= పారిజాత వృక్షాన్ని; కొని+వచ్చి= తీసికొనివచ్చి; సత్యభామకున్= (సత్రాజిత్తు తనయ అయిన) సత్యాదేవి అనే తన ప్రియభామకు; ఇచ్చెన్= ఇచ్చాడో; అట్టి= అటువంటి; మహా+ఆత్మునకున్= శ్రీకృష్ణ పరమాత్మకు; ఇపుడు= ఇప్పుడు; శుభము+ఎ= క్షేమమా?

**తా :** అర్జునా! ఏ పురుషోత్తముని అండదండల వల్ల వైకుంఠంలో నివసించేవాళ్లవలె ద్వారకలో నివసిస్తూ యాదవ శ్రేష్ఠులు నిర్భయులై ఆనందంగా ఉన్నారో, ఏ మహానుభావుడు దేవతలు కొలువు తీరే సుధర్మామండపంలో తన పాదసేవకులైన భక్తులను, బంధువులను, మిత్రులను అడుగులు మోపునట్లు చేశాడో, ఏ మహాత్ముడు వజ్రాయుధంతో తన ఆటోపాన్ని ప్రదర్శించే ఇంద్రుని ఇల్లాలు శచీదేవి తన చేతులతో పాదుచేసి, అమృతం పోసిపెంచిన పారిజాతవృక్షాన్ని దివినుండి భువికి తెచ్చి తన ప్రియురాలైన సత్యభామకిచ్చి సంతృప్తిపరచాడో ఆ మహాత్ముడు వాసుదేవుడు క్షేమంగా ఉన్నాడా?

**శా.** **అన్నా! ఫల్గున! భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుండు గోవిందుఁ డా**
**పన్నానీకశరణ్యుఁ డీశుఁడు జగద్భద్రానుసంధాయి శ్రీ**
**మన్నవ్యాంబుజ పత్రనేత్రుఁడు సుధర్మామధ్య పీఠంబునం**
**దున్నాఁడా బలభద్రుఁగూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్?** **350**

**ప్రతి :** అన్నా!= నాయనా!; ఫల్గున!= అర్జునా!; భక్తవత్సలుఁడు= భక్తులయందు వాత్సల్యం కలవాడు; బ్రహ్మణ్యుండు= వేదాన్ని చక్కగా చదివి, అందలి ధర్మాన్ని నిలబెట్టేవాడు; గోవిందుఁడు= గోవులకు అధిపతి; ఆపన్న+అనీక+శరణ్యుఁడు= ఆపద పొందిన జనసమూహానికి రక్షకుడైనవాడు; ఈశుఁడు= ప్రభువు; జగత్+భద్ర+అనుసంధాయి= లోకాలకు శుభాన్ని చేకూర్చేవాడు; శ్రీమత్+నవ్య+అంబుజపత్ర నేత్రుఁడు= శోభాకరమైన క్రొత్త తామర ఆకులవంటి కన్నులు కలవాడు; సుధర్మా మధ్యపీఠంబునందున్= సుధర్మ అనే సభ నడుమగల సింహాసనంపై; బలభద్రున్= అన్నయైన బలరాముని; కూడి= కలిసి; సుఖి+ఐ= సుఖం కలవాడై; ఉత్సాహి+ఐ= ఉత్సాహం కలవాడై; ఉన్నాఁడా= ఉన్నాడు కదా!

**తా :** నాయనా! అర్జునా! భక్తులపై వాత్సల్యం కురిపించేవాడు, వేదధర్మాన్ని ఉద్ధరించే బ్రహ్మణ్యుడు, ఆపన్న శరణ్యుడు, సర్వేశ్వరుడు, లోకాలకు మేలు కలిగించేవాడు, ఎంతో శోభతో అప్పుడప్పుడే వికసిస్తున్న తామరరేకుల వంటి కన్నులు కలవాడు అయిన గోవిందుడు ద్వారకలో సుధర్మ సింహాసనం మధ్య అన్నగారైన బలరామునితోకూడ సుఖంగా, ఉత్సాహంగా ఉన్నాడు కదా!

**క. ఆ రామకేశవులకును, సారామలభక్తి నీవు సలుపుదువుగదా?**
**గారాములు సేయుదురా?, పోరాముల బంధు లెల్లప్రొద్దు జితారీ! 351**

**ప్రతి :** జిత+అరీ!= జయింపబడిన శత్రువులు కలవాడా! అర్జునా!; నీవు= నీవు; ఆ రామ కేశవులకును= ప్రసిద్ధులైన ఆ బలరామునికి కృష్ణునికి; సార+అమల భక్తిన్= శ్రేష్ఠమైన, నిర్మలమైన భక్తిని; సలుపుదువు+కదా!= నిర్వహింతువు కదా!; బంధులు= చుట్టాలు; పోరాములన్= రాకపోకలతో; ఎల్లప్రొద్దు= అన్ని సమయాలు; గారాములు+చేయుదురు+ఆ= గౌరవములు కావింతురా! (ప్రేమపూర్వకంగా గౌరవాదరాలు చూపుదురా?)

**తా :** విజయా! ఆ బలరామకృష్ణులను నీవు స్థిరమైన భక్తితో ఆసక్తితో సేవిస్తావు కదా! అక్కడ మనచుట్టాలు అందరు నిన్ను నిత్యం ఆప్యాయంగా అనురాగంతో ఆదరించినారు కదా!

**విశే :** ధర్మరాజు కుశల ప్రశ్నలలో ఇది చివరిది. యాదవులు అర్జునునికి అతిసన్నిహితులు. అందును ఆ వంశంలో అతిముఖ్యులు బలరామశ్రీకృష్ణులు. ఆ ఇద్దరు సుఖంగా ఉన్నారంటే వారి రక్షణలో ఉన్న యాదవులందరూ సుఖంగా ఉత్సాహంగా ఉన్నట్లే. ఆ ఇరువురిని అర్జునుడు ఎంతో భక్తిశ్రద్ధలతో సేవిస్తున్నాడు. కాబట్టి వాళ్ల అండదండలలో నుండే చుట్టాలందరూ అర్జునుని యెడ ఎంతో గౌరవాదరాభిమానాలు కల్గి ఉంటారని ధర్మజుని ఉద్దేశ్యం. బంధువుల రాకపోకల ప్రసక్తి, చుట్టాల రాకపోకలు చూపే ఆదరాభిమానాలు సర్వసాధారణ గృహస్థుల్లో వారి సుఖసంతోషాలకు సంకేతం.

**శా. మున్నుగ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరుచో**
**సన్నాహంబునఁ గాలకేయుల ననిం జక్కాడుచోఁ బ్రాభవ**
**స్కన్నుండై చను కౌరవేంద్రు పనికై గంధర్వులం దోలుచోఁ**
**గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి! చెపుమా కల్యాణమే చక్రికిన్? 352**

**ప్రతి :** తండ్రి!= నాయనా! అర్జునా!; మున్ను= పూర్వము; ఉగ్ర+అటవిలోన్= భయంకరమైన అడవిలో; వరాహమునకున్+ఐ= పందికై; ముక్కంటితోన్= మూడుకన్నులు గల శివునితో; పోరుచోన్= యుద్ధం చేసేప్పుడుగాని; సన్నాహంబునన్= ప్రయత్నంతో; అనిన్= యుద్ధంలో; కాలకేయులన్= కాలకేయాది రాక్షసులను; చక్కాడుచోన్= చెండాడు నప్పుడుగాని; ప్రాభవ స్కన్నుండు+ఐ= వైభవం జారిపోయినవాడై; చను= పోవు; కౌరవ+ఇంద్రు పనికై= కౌరవశ్రేష్ఠుడైన దుర్యోధనుని కార్యానికై; గంధర్వులన్= గంధర్వులను; తోలుచోన్= పారద్రోలునప్పుడుగాని; కన్నీరు= కంటినీరు; ఎన్నఁడున్= ఎప్పుడును; తేవు= నీవు తేలేదు; చక్రికిన్= కృష్ణునికి; కల్యాణము+ఏ= శుభమా!; చెపుమా= తెలుపుమా!

**తా :** తండ్రీ! అర్జునా! ఎందుకు కన్నీరు కారుస్తున్నావు? ఏమైంది? పూర్వం భయంకరమైన అరణ్యంలో పందికై ఫాలాక్షునితో పోరాటం సాగించినప్పుడుగాని, సర్వసన్నాహాలతో, కాలకేయాది రాక్షసులను కదనరంగంలో చెండాడినప్పుడుగాని, కౌరవేంద్రుని విడిపించటానికి గంధర్వులతో యుద్ధంలో తలపడినప్పుడు కాని కంటనీరు పెట్టి ఎరుగవే? ఇప్పుడేమి కష్టం వచ్చిందో చెప్పు. శ్రీకృష్ణుడు క్షేమంగా ఉన్నాడు కదా?

**వ. అదియునుంగాక 353**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాకుండా.

**తా :** అది మాత్రమే కాకుండా, మరేవైనా విశేష విషయాలున్నాయా?

**క. ఓడితివో శత్రువులకు, నాడితివో సాధుదూషణాలాపములం**
**గూడితివో పరసతులను, వీడితివో మానధనము వీరుల నడుమన్? 354**

**ప్రతి :** శత్రువులకున్= వైరులకు; ఓడితివి+ఓ= ఓడిపోయినావా?; సాధు దూషణ+ఆలాపములన్= సజ్జనులను నిందించే మాటలను; ఆడితివి+ఓ= పలికినావా?; పరసతులను= ఇతరుల భార్యలను; కూడితివి+ఓ= సంగమించినావా?; వీరుల+నడుమన్= శూరులమధ్య; మాన+ధనము= అభిమానము అనే ధనాన్ని; వీడితివి+ఓ= వదలివేసినావా?

**తా :** అదిగాక నీవు పగవారితో పోరాడి ఓడిపోలేదు కదా! సజ్జనులను నిందించే మాటలాడలేదు కదా! పరస్త్రీలను కూడలేదు కదా! శత్రువీరుల నడుమ అభిమానాన్ని వీడలేదు కదా!

**క. తప్పితివో, యిచ్చెద నని, చెప్పితివో కపటసాక్షి చేసిన మేలుం**
**దెప్పితివో శరణార్థుల, రొప్పితివో ద్విజులఁ బసుల, రోగుల, సతులన్ 355**

**ప్రతి :** ఇచ్చెదను= దానం చేస్తాను; అని= అనిచెప్పి; తప్పితివి+ఓ= మాట తప్పినావా?; కపటసాక్షి= దొంగ సాక్ష్యం; చెప్పితివి+ఓ= చెప్పినావా?; చేసినమేలున్= ఇతరులకు చేసిన మంచిని; దెప్పితివి+ఓ= తిరిగి చెప్పినావా? (లేక) చేసిన= ఇతరులు చేసిన మేలును; తప్పితివా?= మరచినావా?; శరణ+అర్థులన్= శరణుజొచ్చినవారిని; ద్విజులన్= విప్రులను; పసులన్= గోవులను; సతులన్= స్త్రీలను; రొప్పితివి+ఓ= తరుమగొట్టినావా?

**తా :** దానమిస్తానని చెప్పి అన్నమాట తప్పలేదు కదా! దొంగ సాక్ష్యం చెప్పలేదు కదా! ఇతరులు చేసిన మేలును మరువలేదు కదా! లేదా ఇతరులకు చేసిన మేలును మాటికి చెప్పలేదు కదా! శరణుజొచ్చినవారిని, బ్రాహ్మణులను, గోవులను, రోగులను, స్త్రీలను బాధించటం, కోపించటం, తరమటం చేయలేదు కదా!

**క. అడిచితివో భూసురులను?, గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా?**
**విడిచితివో యాశ్రితులను?, ముడిచితివో పరుల విత్తములు లోభమునన్? 356**

**ప్రతి :** భూసురులను= భువిలో దేవతలైన బ్రాహ్మణులను; అడిచితివి+ఓ= కొట్టితివా?; బాలవృద్ధగురువులు= పిల్లలు, ముదుసలివారు, పెద్దలు; వెలికాన్= పంక్తిలో చేరకుండా ఉండగా; కుడిచితివి+ఓ= భుజించితివా?; ఆశ్రితులను= ఆశ్రయించిన వారిని; విడిచితివి+ఓ= వదలిపెట్టితివా?; లోభమునన్= ఆశతో; పరులవిత్తములు= ఇతరుల ధనాలు; ముడిచితివి+ఓ= ముడివేసికొంటివా? (ముల్లె కట్టుకొన్నావా?)

**తా :** పూజింపదగిన బ్రాహ్మణులను మోదినావా? పిల్లలు, ముసలివారు, పెద్దలు వెలిగా భుజించినావా? ఆశ్రయించినవారిని విడిచినావా? ఇతరుల ధనాలను దురాశతో మూటకట్టుకున్నావా? మఱి ఎందుకు నీకీ విచారం?

**వ. అని పలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు, గద్గదస్వరంబున మహానిధిం గోలుపోయిన పేదచందంబున నిట్టూర్పులు నిగిడించుచు, నర్జునుం డన్న కిట్లనియె. 357**

**ప్రతి :** అని పలికినన్= ఆ ప్రకారం, ధర్మరాజు పలుకగా; కన్నీరు= కంటినీరు; కరతలంబునన్= అరచేతితో; తుడుచుకొనుచున్= తడి పోవునట్లు ఒత్తుకొంటూ; గద్గద స్వరంబునన్= బొంగురుపోయిన కంఠధ్వనితో; మహానిధిన్= గొప్ప నిక్షేపాన్ని;

కోలుపోయిన= పోగొట్టుకొన్న; పేదచందంబునన్= పేదవానివలె; నిడు+ఊర్పులు= దీర్ఘ నిశ్వాసాలను; నిగిడించుచున్= వ్యాపింపజేస్తూ; అర్జునుండు= అర్జునుఁడు; అన్నకున్= ధర్మరాజుకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పినాడు.

**తా :** ధర్మరాజు ఈ విధంగా ప్రశ్నించగా అరచేతులతో అశ్రువుల తడి ఒత్తుకొంటూ, డగ్గుత్తికగల కంఠస్వరంతో, పెన్నిధిని పోగొట్టుకొన్న పేదవానివలె, వేడివేడి నిట్టూర్పులు నిగిడిస్తూ అర్జునుడు అన్న గారితో ఈ విధంగా అన్నాడు.

**క. మన సారథి, మన సచివుఁడు, మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్**
**మన విభుఁడు, గురుఁడు, దేవర మనలను దిగనాడి చనియె మనుజాధీశా! 358**

**ప్రతి :** మనుజ+అధి+ఈశా!= ఓ మహారాజా!; మన సారథి= మన తేరు నడిపినవాడు అనగా నడిపించినవాడు; మన+ సచివుఁడు= మన మంత్రి అనగా మనకు ఉపాయాలు ఉపదేశించినవాడు; మన+వియ్యము= మన వియ్యంకుడు; మనసఖుండు= మన మిత్రుడు; మన+బాంధవుఁడున్= మన బంధువు; మన విభుఁడు= మన ప్రభువు; గురుఁడు= జ్ఞానబోధ చేసినవాడు; దేవర= దేవుడు; మనలను= మన అందరిని; దిగనాడి= విడిచి; చనియెన్= శ్రీ వైకుంఠమునకు పోయినాడు.

**తా :** మహారాజా! మన సారథి, మన మంత్రి, మన వియ్యం, మన మిత్రుడు, మన బంధువు, మన గురువు, మన దేవుడు సర్వమూ తానైన వాసుదేవుడు మనలను వదలిపెట్టి వైకుంఠమునకు వెళ్లిపోయినాడయ్యా!

**క. కంటకులు నృపులు సూడఁగ, మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్**
**గెంటించి మనము వాలుం, గంటిం జేకొంటి మతని కరుణన కాదే! 359**

**ప్రతి :** కంటకులు= క్షుద్రశత్రువులైన; నృపులు= రాజులు; చూడఁగన్= చూస్తుండగా; మింటన్= ఆకాశంలో; కంపించు= మిక్కిలి చలించే; యంత్రమీనమున్= యంత్రంలో ఉన్న చేపను అనగా మత్స్యయంత్రాన్ని; కోలన్= అమ్ముతో; గెంటించి= పడగొట్టి; మనము= మనమైదుగురం; వాలుంగంటిన్= వాలుచూపులు కలదానిని ద్రౌపదిని; చేకొంటిమి= స్వీకరించితిమి; అతని= ఆ వాసుదేవుని; కరుణన్+అ+కాదే!= అనుగ్రహంవల్లనే కదా!

**తా :** మనలను పలువురు క్షుద్రులైన రాజులు ఈర్ష్యతో చూస్తుండగా ఆకాశంలో తిరుగుతున్న మత్స్యయంత్రాన్ని అవలీలగా బాణంతో పడగొట్టి ద్రౌపదిని స్వీకరించింది ఆ మహాత్ముని కరుణవల్లనే కదా!

**క. దండి ననేకులతో నా, ఖండలుఁ డెదు రయిన గెలిచి ఖాండవవనముం**
**జండార్చికి నర్పించిన, గాండీవము నిచ్చెఁ జక్రి గలుగుట నధిపా! 360**

**ప్రతి :** అధిపా!= రాజా!; దండిన్= సమృద్ధంగా; అనేకులతోన్= పెక్కుమందితో; ఆఖండలుఁడు= ఇంద్రుడు; ఎదురు+ఐనన్= ఎదిరింపగా; గెలిచి= జయించి; ఖాండవవనమున్= ఖాండవం అనే పేరుగల అరణ్యాన్ని; చండ+అర్చికిన్= అగ్ని దేవునికి; అర్పించినన్= అప్పగింపగా; గాండీవమున్= గాండివమును; ఇచ్చెన్= అగ్నిదేవుడు నాకు ఒసగినాడు; చక్రి= సుదర్శన చక్రంగల శ్రీకృష్ణుడు; కలుగుటన్= లభించుటచేతనే.

**తా :** రాజా! దండిగా అమరసేనలతో ఇంద్రుడు ఎదురై నిల్చినా గెల్చి ఖాండవ వనాన్ని అగ్నిదేవునికి అప్పగించి అతని నుండి గాండీవాన్ని గైకొన్నది చక్రధరుడైన ఆ శ్రీకృష్ణుని చలువవల్లనే కదా!

**క. దిక్కుల రాజుల నెల్లను, మక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము**
**న్నెక్కుట జన్నము సేయుట, నిక్కము హరి మనకు దండ నిలిచినఁ గాదే! 361**

**ప్రతి :** దిక్కుల= అష్టదిక్కులకు సంబంధించిన; రాజులన్= ప్రభువులను; ఎల్లను= అందరిని; మక్కించి= కాంతివిహీనులను చేసి; ధనంబు+కొనుట= ధనాన్ని తీసుకురావటం; మున్ను= మునుపు; మయకృతసభన్= మయునిచే నిర్మింపబడిన సభాభవనాన్ని; ఎక్కుట= అధిష్ఠించటం; జన్నము+చేయుట= యజ్ఞం చేయటం; హరి= శ్రీకృష్ణుడు; మనకున్= మనకు; దండన్= ప్రాపుగా; నిలిచినన్+కాదు+ఏ= ఉండినందువల్లనే కదా!; నిక్కము= ఇది నిజం.

**తా :** అన్ని దిక్కుల రాజులను జయించి ధనరాసులను గైకొన్నది, మయసభను అందుకొన్నది, రాజసూయ యాగం నిర్వర్తించింది నిజానికి వాసుదేవుడు మనకు అండగా నిలిచినందువల్లనే కదా!

**మ. ఇభజిద్వీర్య! మఖాభిషిక్త మగు నీ యిల్లాలి ధమ్మిల్లమున్**
**సభలో శాత్రవు లీడ్చినన్ ముదువ కా చంద్రాస్య దుఃఖింపఁగా**
**నభయం బిచ్చి ప్రతిజ్ఞ సేసి భవదీయారాతికాంతాశిరో**
**జభరశ్రీల హరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్! 362**

**ప్రతి :** ఇభజిత్+వీర్య!= ఏనుగును జయించే సింహంవంటి శౌర్యం కలవాడా!; మఖ+అభిషిక్తము+అగు= యజ్ఞంలో అభిషేకం చేయబడినదైన; నీ+ఇల్లాలి ధమ్మిల్లమున్= నీ భార్య జుట్టుముడిని; సభలోన్= సభయందు; శాత్రవులు= శత్రువులు; ఈడ్చినన్= పట్టిలాగగా; ముదువక= ముడివేయక; ఆ చంద్ర+ఆస్య= ఆ చంద్రునివంటి ముఖం కలదియైన ద్రౌపది; దుఃఖింపన్+కాన్= విలపింపగా; అభయంబు+ఇచ్చి= రక్షణ ఒసగి; ప్రతిజ్ఞ+చేసి= శపథంచేసి; భవదీయ+అరాతి+కాంతాశిరోజభరశ్రీలన్= నీ శత్రుస్త్రీల జుట్టు ముడి అనే సిరులను; విధవలు+ఐ= భర్తలు లేనివారై; సౌభాగ్యముల్= మంచి భాగ్యములు; వీడఁగన్= తొలగిపోగా; హరింపఁడు+ఏ= నాశనం చేయడా?

**తా :** ఓ సింహపరాక్రమా! మహారాజా! రాజసూయ యజ్ఞాంతమందు ఆచరించే అవభృథ స్నానంతో పవిత్రమైన నీ యిల్లాలి జుట్టుపట్టిలాగి యీడ్చుకొని వచ్చి నిండు సభలో నీ శత్రువులు అవమానం చేసినప్పుడు ఆ సతి ఆవేదనతో ఆక్రోశించే వేళ ఆమెకు అభయమిచ్చి ప్రతిజ్ఞ చేసి, నీ శత్రు భార్యల కేశసంపదను వారి సౌభాగ్యాన్ని హరించి మనకు జయం కలిగించిన ఆప్తబంధుడు ఆయనే కదా!

**శా. వైరుల్ గట్టిన పుట్టముల్ విడువఁగా వారింప నా వల్లభుల్**
**రా రీ వేళ, నుపేక్ష సేయఁదగవే, రావే, నివారింపవే?**
**లేరే త్రాతలు! కృష్ణ! యంచు సభలో లీనాంగియై కుయ్యిడం**
**గారుణ్యంబున భూరివస్త్రకలితంగాఁ జేయఁడే ద్రౌపదిన్? 363**

**ప్రతి :** వైరుల్= శత్రువులు; కట్టిన= (తాను) ధరించిన; పుట్టముల్= వస్త్రములు; విడువఁగాన్= వీడునట్లు చేయగా; వారింపన్= అడ్డుకోవటానికి; నా వల్లభుల్= నా భర్తలు; ఈ వేళన్= ఈ సమయంలో; రారు= రాకున్నారు; ఉపేక్ష+చేయన్= నిర్లక్ష్యం చేయటం; తగవు+ఏ= న్యాయమా?; రావే= త్వరగా రమ్ము!; నివారింపవే= అడ్డగింపవా?; లేరే+త్రాతలు= నన్ను

రక్షించేవారు ఎవ్వరూ లేరా; కృష్ణ!= ఓ కృష్ణా!; అంచున్= అని పలుకుచు; సభలోన్= కొలువులో; లీన+అంగి+ఐ= ఒడలు ముడుచుకొన్నదై; కుయ్యి+ఇడన్= మొర పెట్టుకోగా; కారుణ్యంబునన్= దయతో; ద్రౌపదిన్= ద్రౌపదిని; భూరి వస్త్ర కలితన్+కాన్= అధికంగా, వస్త్రాలు పొందబడిన దానిగా; చేయఁడు+ఏ= చేసినాడు కదా!

**తా :** ఆనాటి నిండు కొలువులో కట్టుకొన్న చీరలను క్రూరులైన కౌరవులు లాగివేసినప్పుడు నివారించటానికి నా భర్తలు రావటం లేదు. నీవు నిర్లక్ష్యం చేయటం తగునా? ఇక నన్ను రక్షించే వారే లేరా? వచ్చి వారింపవా? కృష్ణా! అని ద్రౌపది మానభంగ భయంతో ఒడలు ముడుచుకొని ప్రార్థింపగా కరుణతో అక్షయవస్త్ర ప్రదానంచేసి కాపాడిన మహానుభావుడు కృష్ణుడే కదా!

**సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు వంపఁ బదివేల శిష్యుల భక్తిఁ గొలువఁ**
**జనుదెంచి మనము పాంచాలియుఁ గుడిచిన వెనుక నాహారంబు వేఁడికొనినఁ**
**బెట్టెద ననవుడుఁ బెట్టకున్న శపింతు ననుచుఁ దోయావగాహమున కేగఁ**
**గడవల నన్న శాకములు దీఱుటఁ జూచి పాంచాలపుత్త్రిక పర్ణశాల**

**తే. లోనఁ దలఁచిన విచ్చేసి లోవిలోని, శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి, తపసి**
**కోప ముడిగించి, పరిపూర్ణకుక్షిఁ జేసె, నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు? 364**

**ప్రతి :** ఒకనాఁడు= ఒక దినం; దుర్వాసుఁడు= దుర్వాస మహర్షి; దుర్యోధనుఁడు= దుర్యోధనుడు; పంపన్= పంపగా; పదివేల శిష్యులు= పదివేలమంది శిష్యులు; భక్తిన్+కొలువన్= తన్ను భక్తితో సేవింపగా; చనుదెంచి= వచ్చి; మనము= అన్నదమ్ములమైన మనము; పాంచాలియున్= పాంచాల రాజపుత్రికయైన ద్రౌపది; కుడిచినవెనుకన్= భుజించిన తర్వాత; ఆహారంబు= భోజనము; వేఁడికొనినన్= పెట్టుమని ప్రార్థించగా; పెట్టెదన్= పెట్టెదను; అనవుడున్= అనిన అనంతరం; పెట్టక+ఉన్నన్= మీరు పెట్టకుంటే; శపింతున్+అనుచున్= శపిస్తానని పలుకుతూ; తోయ+అవగాహమునకున్= నీటిలో మునుగటానికి; ఏగన్= దుర్వాసుడు పోగా; కడవలన్= కుండలలో; అన్న+శాకములు= కూడు కూరలు; తీఱుటన్= ఐపోవటాన్ని, లేకపోవుట; చూచి= కాంచి; పాంచాలపుత్త్రిక= ద్రౌపది; పర్ణశాలలోనన్= ఆకుల గుడిసెలో; తలఁచినన్= కృష్ణుణ్ణి తలచుకోగా; విచ్చేసి= వచ్చి; లోవి లోని= వంటపాత్రలోని; శిష్ట+శాక+అన్న+లవమున్= మిగిలిన కూర, కూడు అనువానికి సంబంధించిన కణాన్ని; ప్రాశించి= భుజించి; తపసికోపము= దుర్వాసముని కోపాన్ని; ఉడిగించి= మానిపించి; పరిపూర్ణకుక్షిన్= నిండిన పొట్టకలవాణ్ణిగా; చేసెన్= చేశాడు; ఇట్టి= ఇటువంటి; త్రైలోక్యసంతర్పి= ముల్లోకములకు పరిపూర్ణ తృప్తిని కలిగించేవాడు; ఎందున్= ఎక్కడ; కలఁడు= ఉన్నాడు?

**తా :** పూర్వమొకనాడు ముక్కోపి అయిన దుర్వాసుడు దుర్యోధనుడు ప్రార్థించి పంపగా, పాండవులను అవమానించటానికి పదివేలమంది శిష్యులను వెంటబెట్టుకొని మనవద్దకు వచ్చినాడు. అప్పటికే మనమందరమూ, పాంచాలీ భుజించి ఉన్నాము. అదే సమయంలో ఆ మునీంద్రుడు మాకు అన్నం పెడతారా? పెట్టరా? పెట్టకపోతే నేను శాపం పెడతాను అని నీట మునగటానికి వెంటనే ఏటికిపోయినాడు. అప్పుడు పర్ణశాలలోనికి పోయి పాంచాలి పాత్రలను పరికించి చూచింది. ఎక్కడగాని ఒక్క మెతుకు కూడా కన్పించలేదు. అప్పుడు ఆమె నిశ్చలహృదయంతో శ్రీకృష్ణభగవానుణ్ణి తలచుకొన్నది. తత్క్షణమే ఆ దయామయుడు ప్రత్యక్షమై వంటపాత్రలో అడుగున అంటుకొని ఉన్న ఒక్క మెతుకును తన నోటిలో

వేసికొన్నాడు. అంతే! ఇక ఏమున్నది? మునీశ్వరునితోపాటు పదివేలమంది శిష్యుల కడుపులన్నీ పూర్తిగా నిండిపోయాయి. వారెంతో శాంతించి తేపులతో పొట్టలు తడుముకొంటూ వెళ్లినారు. సంకల్పమాత్రం చేతనే ముల్లోకాలకు పరిపూర్ణ తృప్తిని కలిగించే అట్టి మహానుభావుడు మనకు మరెక్కడ లభిస్తాడు?

**సీ. పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని బలమున నా కిచ్చెఁ బాశుపతము?**
**నెవ్వని లావున నిమ్మేన దేవేంద్రు పీఠార్ధమున నుండఁ బెంపుఁ గంటిఁ?**
**గాలకేయ నివాతకవచాది దైత్యులఁ జంపితి నెవ్వని సంస్మరించి?**
**గోగ్రహణమునాఁడు కురుకులాంభోనిధిఁ గడచితి నెవ్వని కరుణఁ జేసి?**

**ఆ. కర్ణ సింధురాజ కౌరవేంద్రాదుల, తలల పాగ లెల్లఁ దడవి తెచ్చి,**
**యే మహాత్ము బలిమి నిచ్చితి విరటుని, పుత్త్రి యడుగ బొమ్మపొత్తికలకు. 365**

**ప్రతి :** పందికై= వరాహమునకై; పోరాడన్= యుద్ధం చేయగా; ఫాల+అక్షుఁడు= నుదుటిపై కన్ను గలవాడైన పరమశివుడు; ఎవ్వని+బలమునన్= ఏ మహనీయుని శక్తిచే; పాశుపతమున్= పశుపతికి సంబంధించిన దివ్యాస్త్రాన్ని, నాకున్+ఇచ్చెన్= నాకు ఒసగినాడు; ఎవ్వని+లావునన్= ఏ మహాత్ముని బలంచే; ఈ+మేనన్= ఈ శరీరంతో; దేవ+ఇంద్రు= దేవతలలో శ్రేష్ఠుడైన మహేంద్రుని; పీఠ+అర్ధమునన్= అర్ధ సింహాసమున; ఉండన్= వసింపగా; పెంపున్= గౌరవం; కంటిన్= పొందాను; కాలకేయ నివాత కవచ+ఆది= కాలకేయుడు, నివాత కవచుడు (బాణములచే ఛేదింపరాని కవచం కలవాడు) మొదలైన; దైత్యులన్= రాక్షసులను; ఎవ్వని= ఏ పురుషోత్తముణ్ణి; సంస్మరించి= మిక్కిలి తలచుకొని; చంపితిన్=సంహరించాను; గోగ్రహణము+నాఁడు= ఉత్తర గోగ్రహణ సందర్భమున; కురుకుల+అంభోనిధిన్= కురువంశమనే సముద్రాన్ని; ఎవ్వని= ఏ దివ్యపురుషుని; కరుణన్+చేసి= దయవల్ల; కడచితిన్= దాటాను; ఏ+మహా+ఆత్ము బలిమిన్= ఏ మహనీయుని అనుగ్రహ బలంతో; కర్ణ సింధురాజ కౌరవ+ఇంద్ర+ఆదుల= కర్ణుడు, సైంధవుడు, దుర్యోధనుడు మొదలైన వారి; బొమ్మ పొత్తికలకున్= బొమ్మలకు కట్టు మెత్తని సన్నని చిన్న వస్త్రములకు; తలల+పాగలు+ఎల్లన్= శిరస్సులకు చుట్టుకొన్న దుస్తులను; తడవి+తెచ్చి= వెదకి తీసికొనివచ్చి; విరటుని+పుత్త్రి= విరాట మహారాజు కొమార్తె ఉత్తర; అడుగన్= కోరగా; ఇచ్చితిన్= ఇచ్చినాను.

**తా :** అన్నా! నేను పూర్వం అడవి పందికై శివునితో పోరాడి, అతడిచ్చిన పాశుపతమనే దివ్యాస్త్రాన్ని ఆ కృష్ణుని అనుగ్రహం వల్లనే కదా పొందగలిగినాను. ముల్లోకాలకు ప్రభువైన దేవేంద్రుని అర్ధసింహాసనాన్ని ఆ మహనీయుని కృపవల్లనే కదా అధిష్ఠించినాను. కాలకేయుడు, నివాత కవచుడు మొదలైన రాక్షసులను ఆ మహనీయుని బలంవల్లనే కదా సంహరింపగలిగినాను. ఉత్తర గోగ్రహణ సందర్భంలో కౌరవసైన్య సముద్రాన్ని ఆయన కరుణవల్లనే కదా అవలీలగా దాటగలిగినాను. ఆ సందర్భంలోనే విరాటుని కొమార్తె ఉత్తర 'బొమ్మ పొత్తికలను తెచ్చి ఇమ్మ'ని అడిగితే కర్ణ సైంధవ సుయోధనాదుల పట్టుకుచ్చుల తలపాగాలు తెచ్చి ఆమె ముచ్చటను తీర్చింది ఆ పురుషోత్తముని అండదండల వల్లనే కదా!

**మ. గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశ చక్రంబులో**
**గురుశక్తిన్ రథయంతయై నొగలపైఁ గూర్చుండి యా మేటి నా**

**శరముల్ వాఱక మున్న వారల బలోత్సాహాయు రుద్యోగ త**
**త్పరతల్ చూడ్కుల సంహరించె నమితోత్సాహంబు నా కిచ్చుచున్.** **366**

**ప్రతి :** గురుభీష్మ+ఆదులు= ద్రోణుడు; భీష్ముడు మొదలైనవారు; కూడిపన్నిన= చేరి ఒడ్డిన; కురుక్షోణీ+ఈశ చక్రంబులోన్= కురుభూమికి రాజులైనవాళ్ల వ్యూహంలో; గురుశక్తిన్= గొప్ప శక్తితో; రథయంత+ఐ= రథము తోలువాడై; నొగలపైన్= రథం ముందు భాగంపై; కూర్చుండి= ఆసీనుడయి; ఆ మేటి= ఆ సమర్థుడు (కృష్ణుడు); నా శరముల్= నా బాణములు; పాఱక+మున్న= ప్రసరించకముందే; అమిత+ఉత్సాహంబు= విస్తారమైన, ధైర్యం; నాకున్= నాకు; ఇచ్చుచున్= కలిగిస్తూ; వారల= ఆ కౌరవుల; బల+ఉత్సాహ+ఆయుస్+ఉద్యోగ+తత్పరతల్= బలం; ఉత్సాహం, ఆయుస్సు, ప్రయత్నం, నిశ్చలత్వములు; చూడ్కులన్= తన చూపులతో; సంహరించెన్= నశింపజేశాడు.

**తా :** భీష్మద్రోణాది మహాయోధులతో కూడిన కురుక్షేత్ర మహాసంగ్రామంలోని వివిధ వ్యూహాల్లో నాకు సారథ్యం వహించి, నొగలపై కూర్చుండి నా బాణ పరంపరలు ప్రసారం కాకముందే తన చూపులతో శత్రువుల శక్తిని ఉత్సాహాన్ని, ఆయుస్సును, తదేక దీక్షను అపహరించి నాకు అమితమైన ఆనందాన్ని అందించిన సారథి ఆయనే.

**మ.** **అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె**
**ల్వ సమర్థంబులు గాని కైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ**
**ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్ర ప్రపంచంబు నా**
**దెసకున్ రాక తొలంగె మాధవు దయాదృష్టిన్ నరేంద్రోత్తమా!** **367**

**ప్రతి :** నర+ఇంద్ర+ఉత్తమా!= రాజశ్రేష్ఠా! (ధర్మరాజా); అసుర+ఇంద్రుండు= రాక్షసశ్రేష్ఠుడు (హిరణ్యకశిపుడు); ఒనరించు= చేయు; కృత్యములు= పనులు; ప్రహ్లాదున్= ప్రహ్లాదుణ్ణి; ప్రవేశించి= చొచ్చి; గెల్వన్= జయించటానికి; సమర్థంబులు+కాని+కైవడిన్= శక్తికలవి కాని విధంగా; కృప+అశ్వత్థామ, గాంగేయ, సూర్యసుత; ద్రోణ= కృపుడు, అశ్వత్థామ, భీష్ముడు, కర్ణుడు, ద్రోణుడు అను వారియొక్క; ధనుస్+విముక్త= విండ్లనుండి విడువబడ్డ; బహు= అనేకములైన; దివ్య+అస్త్ర= శ్రేష్ఠములైన (దేవతాసంబంధములైన) బాణములయొక్క; ప్రపంచంబు= సముదాయం; మాధవు దయాదృష్టిన్= శ్రీకృష్ణుని, దయగల చూపువల్ల; నా దెసకున్ రాక= నా వైపునకు రాకుండ; తొలంగెన్= తొలగిపోయింది.

**తా :** మహారాజా! పూర్వం హిరణ్యకశిపుని క్రూరకార్యాలు ప్రహ్లాదునిపై పని చేయక విఫలాలైనట్లే కృపాచార్యుడు, అశ్వత్థామ, భీష్ముడు, కర్ణుడు, ద్రోణుడు ప్రయోగించిన దివ్యాస్త్రాల ప్రభావం నా వైపునకు రాకుండా ఆ మాధవుని దయగల చూపులతో ప్రక్కకు తొలగిపోయింది.

**చ.** **వసుమతి దివ్యబాణముల వ్రక్కలు వాపి కొలంకు సేసి, నా**
**రసములు మాటుగాఁ బఱపి రథ్యములన్ రిపు లెల్లఁ జూడ సా**
**హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు, నా**
**కసురవిరోధి భద్రగతి నండయి వచ్చినఁ గాదె భూవరా!** **368**

**ప్రతి :** భూవరా!= రాజా!; రణ+అవనిన్= యుద్ధభూమియందు; సైంధవున్+చంపునాఁడు= సైంధవుని వధించునప్పుడు; వసుమతిన్= భూమిని; దివ్యబాణములన్= మహిమగల అస్త్రములతో; వ్రక్కలువాపి= బీటలువారునట్లు గావించి;

కొలంకు+చేసి= మడుగొనరించి; నారసములు= బాణములు; మాటుగాన్= మరుగుగా; పఱపి= వ్యాపింపజేసి; సాహసమునన్= మిక్కిలి తెగువతో; రిపులు= శత్రువులు; ఎల్లన్= అందరు; చూడన్= చూచుచుండగా; రథ్యములన్= గుఱ్ఱములను; నీటన్= నీటియందు; పెట్టితిన్= ఉంచితిని; నాకున్= నాకు; అసురవిరోధి= రాక్షస శత్రువగు కృష్ణుడు; భద్రగతిన్= శుభానికి ఆధారంగా; అండ+అయి= ఆశ్రయమై, రక్షణయై; వచ్చిననన్కాదె= లభించినందువల్లనే కదా!

**తా :** రాజా! సైంధవుని నాటి రణరంగంలో చంపేటప్పుడు శత్రువులందరు చూస్తుండగనే, భూమిని దివ్యాస్త్రాలతో వ్రయ్యలు చేసి కొలను నిర్మించి సూర్యుడు కనిపించకుండా బాణాలతో కప్పి, అలసిన గుఱ్ఱాలకు నీరుపెట్టి దప్పిక తీర్చినది, ఆ శ్రీకృష్ణుని శుభసంకల్పం నాకు రక్షణగా ఉండుటవల్లనే కదా!

**సీ. చెలికాఁడ! రమ్మని చీరు నన్నొకవేళ మన్నించు నొకవేళ మఱఁది యనుచు**
**బంధుభావంబునఁ బాటించు నొకవేళ, దాతయై యొకవేళ ధనము లిచ్చు,**
**మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు, బోధియై యొకవేళ బుద్ధిసెప్పు,**
**సారథ్య మొనరించుఁ జన విచ్చి యొకవేళఁ, గ్రీడించు నొకవేళ, గేలిసేయు,**

**తే. నొక్క శయ్యాసనంబున నుండుఁ, గన్న, తండ్రి కైవడిఁ జేసిన తప్పుఁ గాచు,**
**హస్తములు వట్టి పొత్తున నారగించు, మనుజవల్లభ! మాధవు మఱవ రాదు. 369**

**ప్రతి :** మనుజవల్లభ!= రాజా!; ఒకవేళన్= ఒక సమయంలో; నన్నున్= నన్ను; చెలికాఁడ!= మిత్రుడా!; రమ్ము+అని రా అని; చీరున్= పిలుస్తాడు; ఒకవేళన్= ఒకప్పుడు; మఱఁది+అనుచున్= మఱది అని పలుకుతూ; మన్నించున్= గౌరవిస్తాడు; ఒకవేళన్= ఒక తరి; బంధుభావంబునన్= చుట్టరికంతో; పాటించున్= ఆదరిస్తాడు; ఒకవేళన్= ఒక సందర్భంలో; దాత+ఐ= వితరణశీలియై, దానం చేసేవాడై; ధనములు+ఇచ్చున్= విత్తములు ఇస్తాడు; ఒకవేళన్= ఒకప్పుడు; మంత్రి+ఐ= బుద్ధిసహాయుడై; మంత్రము+ఆదేశించున్ రహస్యాలను, సలహాలను చెప్పి ఆజ్ఞాపిస్తాడు; ఒకవేళన్= ఒకమారు; బోధి+ఐ= జ్ఞానియై; బుద్ధి+చెప్పున్= తెలివిని ఉపదేశిస్తాడు; ఒకవేళన్= ఒక సమయంలో; చనవు+ఇచ్చి= అనురాగముచూపి; సారథ్యము+ఒనరించున్= రథము నడపును; ఒకవేళన్= ఒకప్పుడు; క్రీడించున్= ఆటాడును; గేలిసేయున్= పరిహాసమాడును; ఒక్క= ఒక; శయ్యా+ఆసనంబునన్= పడుకమీద, పీఠముమీద; ఉండున్= ఉంటాడు; కన్నతండ్రి+కైవడిన్= కనిన తండ్రివలె; చేసిన తప్పున్= కావించిన అపరాధమును; కాచున్= సహించును; హస్తములు+పట్టి= చేతులుపట్టుకొని; పొత్తునన్= సహపంక్తితో, వదలని స్నేహంతో; ఆరగించున్= భుజిస్తాడు, మాధవున్= (అట్టి) శ్రీకృష్ణుని; మఱవన్+రాదు= మఱవడానికి వీలుకాదు.

**తా :** రాజా! ఆ వాసుదేవునికి నాపై ఎంత ప్రేమ! ఆదరం! అభిమానం! ఒకమారు చెలికాడా! రా అని పిలిచేవాడు. ఒక పర్యాయం ముద్దులమరదీ! అని గౌరవించేవాడు. ఒకప్పుడు ఆత్మబంధువై ఆదరించేవాడు. ఒక సందర్భంలో ఎంతో ఔదార్యంతో బహుధనాలు బహూకరించేవాడు. ఒక సమయంలో మంత్రియై హితోపదేశం చేసేవాడు. ఒక్కొక్కప్పుడు గురువై కర్తవ్యబోధ సల్పేవాడు. మరొక్కమారు సారథియై చనవు చూపేవాడు. వేఱొకమారు ఆత్మీయుడై హాస్యమాడేవాడు. ఎన్నో ఆటలు పట్టించేవాడు. ఇంకొకమారు ఒకే పడుకపై ప్రక్కన కూర్చొని కన్నతండ్రివలె చేసిన తప్పులు సహించేవాడు. మరొక పర్యాయం నా చేతులు పట్టుకొని సహపంక్తిలో కూర్చొని కలిసి మెలసి ఆరగించేవాడు. అటువంటి మాధవుణ్ణి మరచిపోగలనా?

**విశే :** వదలి ఉండటాన్ని సహించనివాడు బంధువు. ఎప్పుడూ అనుమతితో ఉండేవాడు సుహృత్తు. ఒక పనిలో కలసి ఉండేవాడు మిత్రుడు. సమప్రాణుడు సఖుడు.

**క. విజయ, ధనంజయ, హనుమ, ద్ధ్వజ, ఫల్గున, పార్థ, పాండుతనయ, నర, మహేం**
**ద్రజ, మిత్రార్జున యంచును, భుజములు దలకడవ రాకపోకలఁ జీరున్. 370**

**ప్రతి :** విజయ!= విజయము కలవాడా!; ధనంజయ!= దిగ్విజయ సందర్భమున ధనములను గెలుచుకొని వచ్చినవాడా!; హనుమత్+ధ్వజ= హనుమంతుని జెండా గుర్తుగా కలవాడా!; ఫల్గున!= ఫల్గునీ నక్షత్రమున పుట్టినవాడా!; పార్థ!= పృథాదేవి (కుంతి) పుత్రుడా!; పాండుతనయ!= పాండు రాజకుమారుడా!; నర= నరుడా!; మహేంద్రజ!= ఇంద్రుని పుత్రుడా!; మిత్రఅర్జున!= మిత్రుడైన అర్జునా! (= తెల్లని కీర్తి కలవాడా!); అంచును= అని పల్కుచు; భుజములుతల కడవన్= భుజములు తలదాటునట్లు (ఎత్తి); రాకపోకలన్= వచ్చి, పోవు సందర్భములలో; చీరున్= పిలుస్తాడు.

**తా :** రాకపోకలు చేసేప్పుడు కృష్ణుడు చేతులుచాచి ఎంతో ఆప్యాయంగా విజయా! ధనంజయా! కపిధ్వజా! ఫల్గునా! పార్థా! పాండుకుమారా! నరుడా! ఇంద్రతనయా! మిత్రా! అర్జునా! కిరీటీ! సవ్యసాచీ అని ఒక్కొక్కమారు పిలిచేవాడు.

**విశే :** వివిధ సందర్భాల్లో పలు విధాలుగా విజయునిపై గల విశేష ప్రీతితో శ్రీకృష్ణుడు పిలిచేవాడు. సహస్ర నామాలతో సంబోధింపబడు శ్రీకృష్ణుడే అర్జునుని ఎన్నో పేర్లతో ఎందుకు పిలిచెడివాడో బాహ్యదృష్టితో చూచినప్పుడు అర్థం కాదు. అందేదో పరమార్థమున్నది. విజయుని విజయనామ సార్థక్యంలో తక్కిన పేర్లన్నీ అంతర్భాగాలే. కావుననే పోతన విజయనామమును ప్రారంభంలోనే పేర్కొన్నాడు. ఆ విజయుని తొలి విజయం సకల దిక్కులకేగి తన విక్రమంతో ధనాన్ని జయించి దాన్ని సార్థకంచేసి ధనంజయుఁడైనాడు. ఈతని విజయ పరంపరలనన్నిటిని స్వయంగా జెండాలో నెలకొని చూచేవాడు హనుమంతుడు. హనుమంతుడు సామాన్యుడు కాదు; శివాంశ సంభూతుడు. అన్ని విజయాలు అతని సంస్మరణ మాత్రంతో సిద్ధిస్తాయి. అతని గుర్తు గల ధ్వజం మహోన్నతం. మహిమాన్వితం. ఫల్గునుడు అంటే ఫల్గునీ నక్షత్రంలో పుట్టినవాడు కావటమేకాక మహావేగంగా పాదరసంవలె ప్రసరించేవాడు. అట్టివాడు పృథాపుత్రుడై పుట్టి సత్కార్య సాధనలో నియుక్తుడైనాడు. అన్ని జన్మల్లో నరజన్మం శ్రేష్ఠమైంది. అట్టి శ్రేష్ఠత్వానికి నిదర్శనంగా, సర్వమానవాళికి ప్రతినిధిగా నరనామ సార్థకతను సాధించినవాడు. ఇక మిత్రశబ్దం సహజంగా సూర్యునికున్నది. నిస్స్వార్థంగల మిత్ర ధర్మానికి మించింది లేదు. నిజమైన మిత్రులు శ్రీకృష్ణార్జునులు.

**క. వారిజగంధులు దమలో, వారింపఁగ రాని ప్రేమ వాదము సేయన్**
**వారిజనేత్రుఁడు నను౯ దగ, వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా! 371**

**ప్రతి :** నృపా!= రాజా!; వారిజనేత్రుఁడు= పద్మాలవంటి కన్నులు గలవాడు (శ్రీకృష్ణుడు); వారిజగంధులు= పద్మం వంటి సువాసన గలవారు (పద్మినీజాతి స్త్రీలు); తమలోన్= వారిలోవారు; వారింపఁగన్‌రాని= తీర్చటానికి వీలుకాని; ప్రేమవాదము= ప్రణయ కలహం; చేయన్= చేయగా; అలుకన్ వారింపన్= ఆ కలహాన్ని తీర్చటానికి; ననున్= నన్ను; తగన్= ఒప్పిదముగా తప్పనిసరిగా; వారి+ఇండ్లకున్= ఆయాకాంతల గృహాలకు; పనుపున్= నియోగిస్తాడు (పంపును).

**తా :** రాజా! అప్పుడప్పుడు అంతఃపురకాంతలతో ప్రణయకలహం కలిగినప్పుడు వారి పొలయలుకను తీర్చటానికి నన్ను బతిమాలి వారి యిండ్లకు పంపే వారిజాక్షుడైన వాసుదేవుని ఎట్లు మరవగలను?

**క. నిచ్చలు లోపలి కాంతలు, మచ్చికఁ దనతోడ నాడు మాటలు నాకున్**
**ముచ్చటలు సెప్పు మెల్లన, విచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా! 372**

**ప్రతి :** నృపా!= రాజా!; నిచ్చలు= ప్రతిదినం; లోపలికాంతలు= అంతఃపుర స్త్రీలు; మచ్చికన్= చనవుతో; తనతోడన్= తనతో; ఆడుమాటలు= సంభాషించే పలుకులు; నాకున్= నాకు; మెల్లనన్= తిన్నగా; తొడలమీఁదన్= నా తొడలపైకి; విచ్చేసి= వచ్చి; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా, గుట్టు లేకుండ; ముచ్చటలు+చెప్పున్= సల్లాపాలు చెప్పేవాడు.

**తా :** రాజా! కృష్ణుడు తానెంతో చనవుగా నా దగ్గరచేరి ఒడిలో కూర్చుండి ప్రతిదినం ప్రియురాళ్లతో తాను జరిపే రహస్య సంభాషణలను అన్నింటిని సవిస్తరంగా నా చెవిలో చెప్పుతూ ఉండేవాడు.

**చ. అటమటమయ్యె నా భజన మంతయు భూవర! నేఁడు సూడుమా**
**యిటువలె గారవించు జగదీశుఁడు గృష్ణుఁడు లేని పిమ్మటం**
**బటుతర దేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁబోక నేఁ**
**గటకట! పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో? 373**

**ప్రతి :** భూవరా!= రాజా!; నేఁడు= ఈనాడు; చూడుమా= కాంచుమా!; నా+భజనము+అంతయున్= నా పూజ సమస్తం; అటమటము+అయ్యెన్= వ్యర్థమైనది; ఇటువలెన్= ఈ విధముగా; గారవించు= ఆదరించే; జగత్+ఈశుఁడు= లోకానికి ఈశ్వరుడు; కృష్ణుఁడు= కృష్ణభగవానుడు; లేని+పిమ్మటన్= లేకపోయిన తరువాత; వెంటన్+పోక= ఆయనతో పోకుండ; పటుతర దేహ లోభమునన్= మిక్కిలి గట్టిదైన, దేహం మీది దురాశతో; ప్రాణములు+ఉన్నవి= అసువులు నిలిచి ఉన్నవి; నేన్= నేను; కటకట!= అయ్యయ్యో!; పూర్వజన్మమునన్= తొలిపుట్టువులో; కర్మములు= కృత్యములు; ఎట్టివి= ఎటువంటివి; చేసినాఁడను+ఓ= చేసినానో కదా!

**తా :** రాజా! నా సేవలన్నియు ఈనాడు పూర్తిగా వ్యర్థములైనవి. ప్రతిదినం నన్నెంతో ఆదరించే ఆ జగదీశ్వరుడైన కృష్ణుడు ఈ లోకం వీడి వెళ్లిపోయిన తరువాత నా ప్రాణాలు కూడా ఆయనవెంట పోకుండా, ఈ కఠినకర్కశ దేహాన్ని అంటిపెట్టుకొని ఉన్నాయి. అయ్యయ్యో! పూర్వజన్మలో నేనెట్టి పాపకృత్యాలు చేసినాడనో కదా!

**శా. కాంతారంబున నొంటిఁ దోడుకొని రాఁగాఁ జూచి గోవిందు శు**
**ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయత్తులై తాఁకి నా**
**చెంతన్ బోయలు మూఁగి పట్టికొన నా సీమంతినీ సంఘమున్**
**భ్రాంతిన్ భామిని భంగి నుంటి విడిపింపన్ లేక ధాత్రీశ్వరా! 374**

**ప్రతి :** ధాత్రీ+ఈశ్వరా!= రాజా!; గోవిందు= శ్రీకృష్ణుని; శుద్ధాంత+స్త్రీలన్= అంతఃపుర స్త్రీలను; పదాఱువేలన్= పదునాఱువేలమందిని; ఒంటిన్= ఒంటరిగా; కాంతారంబునన్= అడవిలో; తోడుకొని+రాఁగాన్= వెంటబెట్టుకొని వస్తుండగా; బోయలు= కిరాతులు; చెంతన్= నా సమీపమున; చూచి= కని; మద రాగ+ఆయత్తులు+ఐ= పొగరుచే; కామంచే సిద్ధపడినవారై; తాఁకి= ఎదుర్కొని; మూఁగి= చుట్టుముట్టి; ఆ+సీమంతినీ సంఘమున్= ఆ అంతఃపుర స్త్రీలను అందరిని; పట్టుకొనన్= బంధించగా; భ్రాంతిన్= మతిభ్రమణంతో (తల తిరుగుటతో); విడిపింపన్ లేక= వారినుండి విడిపించుటకు శక్తిలేక; భామిని+భంగిన్= ఒక స్త్రీ (అబల) వలె; ఉంటిన్= ఉండిపోయితిని.

**తా :** ఆ మహానుభావుడు దేహాన్ని చాలించిన తరువాత ఆయన అంతఃపుర కాంతలను పదహారు వేలమందిని వెంటబెట్టుకొని అరణ్యమధ్యంలో వస్తుండగా మదోన్మత్తులైన కిరాతులు ముట్టడించి చుట్టుముట్టి పట్టుకొన్నారు. వారి బారినుండి ఆ స్త్రీలను విడిపించలేక ఒక ఆడుదానివలె ఏమీ చేయలేని దుస్థితిలో చూస్తూ అట్లే ఊరక ఉండిపోయినాను.

**శా. ఆ తే రా రథికుండు నా హయము లా యస్త్రాసనం బా శర**
**వ్రాతం బన్యులఁ దొల్లి జంపును దుదిన్ వ్యర్థంబులై పోయె మ**
**చ్చేతోఽధీశుఁడు చక్రి లేమి, భసిత క్షిప్తాజ్యమాయావి మా**
**యా తంత్రోషరభూమి బీజముల మర్యాదన్ నిమేషంబునన్. 375**

**ప్రతి :** ఆ+తేరు= ఆ రథము; ఆ+రథికుండున్= ఆ రథమునెక్కి యుద్ధము చేయువాడు; ఆ+హయములు= ఆ గుర్రాలు; ఆ+అస్త్ర+ఆసనంబు= ఆ ధనుస్సు; ఆ+శరవ్రాతంబు= ఆ బాణముల సమూహము; అన్యులన్= పరులను (శత్రువులను); తొల్లి= పూర్వం; చంపున్= తుదముట్టించినవి; తుదిన్= చివరలో; మత్+చేతస్+అధి+ఈశుఁడు= నా హృదయాధినాథుడు; చక్రి= సుదర్శనాయుధుడు శ్రీకృష్ణుడు; లేమిన్= లేకపోవటంతో; భసితక్షిప్త+ఆజ్య= బూడిదలో ఉంచిన నేయి; మాయావి= మాయ చేయువాని; మాయాతంత్ర= ఇంద్రజాలము, గారడివిద్య; ఊషరభూమిన్= చవిటి నేలలో; బీజముల మర్యాదన్= విత్తనములవలె; నిమేషంబునన్= ఱెప్పపాటు కాలములో; వ్యర్థంబులు+ఐ+పోయెన్= నిరుపయోగములై పోయినవి.

**తా :** ఆత్మేశ్వరుడైన ఆ శ్రీహరి లేకపోవటంతో పూర్వం శత్రుసమూహాన్ని నిర్మూలిస్తూ ఉండే ఆ రథం, అందున్న నేను, ఆ గుఱ్ఱాలు, ఆ విల్లు, ఆ బాణాలు అన్నీ బూడిదలో పోసిన నేయివలె, మాయావి ప్రయోగించిన మాయయైన ఇంద్రజాలంవలె చవిటినేలలో చల్లిన విత్తనాలవలె కనురెప్పపాటు కాలంలో నిరుపయోగాలైపోయాయి.

**మ. యదువీరుల్ మునినాథు శాపమునఁ గాలాధీనులై, యందఱున్**
**మదిరాపాన వివర్ధమాన మదసమ్మర్దోగ్ర రోషాంధులై**
**కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి నీఱైరి, న**
**ష్టదశం జిక్కిరి నల్వురేవు రచటన్ సర్వంసహావల్లభా! 376**

**ప్రతి :** సర్వంసహావల్లభా!= భూనాథుడవైన ఓరాజా!; యదువీరుల్= యాదవశ్రేష్ఠులు; అందఱున్= ఎల్లవారును; కాల+అధీనులు+ఐ= కాలానికి (యముడికి) లొంగినవారై; మునినాథు+శాపమునన్= మునీశ్వరుని (దుర్వాసుని) శాపముచే; మదిరాపాన= కల్లు త్రాగటంచే; వివర్ధమాన= పెచ్చు పెరిగిన; మద= గర్వంతో; సమ్మర్ద= ఘర్షణతో కూడిన; ఉగ్ర= భయంకరమైన; రోష= కోపముచే; అంధులు+ఐ= కన్నులు కాననివారై; తమలోనన్= తమలో తాము, పరస్పరం; కదనంబుల్= యుద్ధాలు; ముష్టిహతులన్= పిడికిటిపోటులతో; కావించి= ఒనర్చి; నీఱు+ఐరి= బూడిద అయినారు; నష్టదశన్= నశించిన అవస్థలో; అచటన్= అచ్చట; నల్వురు= నలుగురు; ఏవురు= అయిదుగురు; చిక్కిరి= మిగిలిరి.

**తా :** భూవల్లభా! యాదవవీరులందరు కాలకర్మవశాన విధివైపరీత్యంతో మునిశాపోపహతులై, మద్యం త్రాగి, మత్తెక్కి మైమరచి ఆగ్రహావేశాలతో, ద్వేషరోషాలతో కన్ను మిన్ను గానక, తమలో తామే పోరాడినారు. ముష్టిఘాతాలతో ఒకరినొకరు కొట్టుకొని ప్రాణాలు వదలినారు. పోయినవారు పోగా చివరకు నలుగురైదుగురు మాత్రమే మిగిలినారు. ఇది అంతా దుర్వాసాదుల శాపప్రభావమే.

**క. భూతములవలన నెప్పుడు, భూతములకు జన్మ మరణ పోషణములు ని**
**ర్ణీతములు సేయుచుండును, భూతమయుం డీశ్వరుండు భూతశరణ్యా! 377**

**ప్రతి :** భూతశరణ్యా!= జీవులకు శరణమైనవాడా! (రాజా!); ఎప్పుడున్= ఎల్లప్పుడు; భూతములవలనన్= జీవులవలన; భూతములకున్= జీవులకు; జన్మ మరణ పోషణములు= పుట్టడం, చనిపోవడం, పోషింపబడటం; భూతమయుండు= జీవులలో నిండియున్నవాడు; ఈశ్వరుండు= భగవంతుడు; నిర్ణీతములు= నిర్ణయింపబడినవి అయి ఉంటాయో; చేయుచుండున్= కావిస్తూ ఉంటాడు.

**తా :** ఆశ్రితవత్సలా! పరమేశ్వరుడు సర్వభూతాంతర్యామి. ఆయన ప్రాణులకు సృష్టి, సంహార, సంరక్షణలను తోటి ప్రాణులవలననే నిర్ణయిస్తాడు.

**క. బలములు గల మీనంబులు, బలవిరహిత మీనములను భక్షించు క్రియన్**
**బలవంతు లయిన యదువులు, బలరహితులఁ జంపి రహితభావముల నృపా! 378**

**ప్రతి :** నృపా!= రాజా!; బలములు కల మీనంబులు= బలము కలిగిన చేపలు; బల విరహిత మీనములను= బలము లేని చేపలను; భక్షించు క్రియన్= తినేవిధంగా; బలవంతులు+అయిన యదువులు= బలము కలవారైన యాదవులు; బలరహితులన్= బలము లేనివాళ్లను; అహితభావములన్= శత్రుత్వములతో; చంపిరి= వధించినారు.

**తా :** బలంగల పెద్ద చేపలు, బలంలేని చిన్న చేపలను మ్రింగుతున్నాయి. అట్లే బలవంతులైన యదువీరులు, దయాహీనులై నిష్కారణ కోపావేశాలతో శత్రుత్వాన్ని పెంచుకొని తమతోడి యాదవులనే రూపుమాపినారు.

**మ. బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రత్యర్థిభావోద్యమం**
**బులు గల్పించి, వినాశమున్ నెఱపి, యీ భూభారముం బాపి, ని**
**శ్చలబుద్ధిం గృతకార్యుఁడై చనియె, నా సర్వేశ్వరుం డచ్యుతుం**
**డలఘుం డేమని చెప్పుదున్ భగవదాయత్తంబు పృథ్వీశ్వరా! 379**

**ప్రతి :** పృథ్వీ+ఈశ్వరా!= భూపతీ!; ఆ సర్వ+ఈశ్వరుండు= అందరికి ప్రభువు; అచ్యుతుండు= నాశం లేనివాడు; అలఘుండు= గొప్పవాడు; బలహీన+అంగులకున్= బలంలేని శరీరం గలవారికి; బల+అధికులకున్= ఎక్కువ బలంగలవారికి; ప్రత్యర్థిభావ+ఉద్యమంబులు= శత్రుత్వంయొక్క ప్రయత్నాలు; కల్పించి= లేనివి కలిగించి; వినాశమున్= మిక్కిలి చేటు; నెఱపి= కల్గించి; ఈ భూ భారమున్= ఈ భూమి భారాన్ని; పాపి= పోగొట్టి; నిశ్చల+బుద్ధిన్= చలనంలేని బుద్ధితో; కృత+కార్యుఁడు+ఐ= చేయవలసినది చేసినవాడై; చనియెన్= వెళ్లినాడు; భగవత్+ఆయత్తంబు= సమస్తం దేవునికి అధీనం; ఏమి+అని చెప్పుదున్= ఏమని తెలుపగలను?

**తా :** పృథ్వీనాథా! సర్వేశ్వరుడు, అచ్యుతుడు, అప్రమేయుడు అయిన శ్రీకృష్ణుడు బలవంతులకు, బలహీనులకు నడుమ పగలు పుట్టించి, ఒకరినొకరు సంహరించుకొనే వినాశాన్ని కలిగించి, ఈ భూభారాన్ని తీర్చి తాను వచ్చినపని పూర్తి చేసుకొని ఎంతో నిబ్బరంతో నిశ్చలబుద్ధి కలవాడై వెళ్లిపోయినాడు. ఇక ఏమని చెప్పగలను? ఆ జగదీశ్వరుని సంకల్పం ప్రకారమే అంతా జరిగిపోయింది.

**వ. మఱియు దేశకాలార్థ యుక్తంబులు, నంతఃకరణ సంతాప శమనంబులు నయిన హరివచనంబులం దలంచి, చిత్తంబు పరాయత్తంబయి యున్నది అని యన్నకుం జెప్పి, నిరుత్తరుండై, నిరంతర హరిచరణారవింద చింతామలబుద్ధియై శోకంబు వర్జించి, సదా ధ్యానభక్తి విశేషంబులం గామక్రోధాదుల జయించి, తొల్లి తన కుభయ సేనామధ్యంబున నచ్యుతుం డానతిచ్చిన గీతలు దలంచి, కాలకర్మ భోగాభినివేశంబులచేత నావృతంబయిన విజ్ఞానంబుఁ గ్రమ్మఱ నధిగమించి, హేతుమద్భావంబున శోకహేతు వహంకార మమకారాత్మకం బయిన ద్వైతభ్రమం బనియును, ద్వైత భ్రమంబునకుఁ గారణంబు దేహం బనియును, దేహంబునకు బీజంబు లింగం బనియును, లింగంబునకు మూలంబు గుణంబు లనియును, గుణంబులకు నిదానంబు ప్రకృతి యనియును, 'బ్రహ్మాహ' మనియెడు జ్ఞానంబున లీనయై ప్రకృతి లేకుండు ననియు, ప్రకృతి యడంగుటయ నైర్గుణ్యం బనియును, నైర్గుణ్యంబువలనఁ గార్య లింగనాశం బనియును, గార్యలింగనాశంబున నసంభవంబగు ప్రకృతిం బాసి క్రమ్మఱ స్థూలశరీరప్రాప్తుండు గాక పురుషుండు సమ్యగ్భోగంబున నుండు ననియును నిశ్చయించి, యర్జునుండు విరక్తుండై యూరకుండె; ధర్మజుండు భగవదీయమార్గంబుఁ దెలిసి, యాదవుల నాశంబు విని నారదు వచనంబులం దలంచి, నిశ్చల చిత్తుండై స్వర్గమార్గ గమనంబునకు యత్నంబు సేయుచుండె నా సమయంబున. 380**

**ప్రతి :** మఱియున్= ఇంకను; దేశ కాల+అర్థ యుక్తంబులు= దేశంతో, కాలంతో, ప్రయోజనంతో కూడినవి; అంతఃకరణ సంతాప శమనంబులును= హృదయపు అధికతాపాన్ని, శమింపజేసేవి; అయిన= అయినట్టి; హరి వచనంబులన్+తలంచి= శ్రీకృష్ణుని వాక్కులు తలచుకొని; చిత్తంబు= మనస్సు; పర+ఆయత్తంబు+అయి+ఉన్నది= పరుడైన భగవంతునికి అధీనమైంది; అని= ఆ ప్రకారంగా; అన్నకున్= అగ్రజుడైన ధర్మరాజుకు; చెప్పి= నివేదించి; నిర్+ఉత్తరుండు= సమాధానం లేనివాడై; నిరంతర= ఎల్లప్పుడు; హరి= విష్ణుని; చరణ+అరవింద= పాదపద్మములను; చింతా= ధ్యానించుటవలన; అమలబుద్ధి+ఐ= నిర్మలమైన బుద్ధికలవాడై; శోకంబు= దుఃఖాన్ని; వర్జించి= విడిచి; సదా= ఎల్లప్పుడు; ధ్యానభక్తి విశేషంబులన్= ధ్యానం; భక్తి అతిశయముచే; కామక్రోధ+ఆదులన్= కోరిక, కోపం మొదలైన ఆరు లోపలి శత్రువులను; జయించి= గెలిచి; తొల్లి= పూర్వం; తనకున్= తనకు; ఉభయ సేనామధ్యంబునన్= రెండు, సేనలకు నడుమ; అచ్యుతుండు= నాశం లేనివాడైన శ్రీకృష్ణుడు; ఆనతి+ఇచ్చిన= ఉపదేశించిన; గీతలు= గీతావాక్యములు; తలంచి= స్మరించి; కాలకర్మ= కాలం, కర్మ వీటి; భోగ= అనుభూతియందు; అభినివేశంబుల చేతన్= అభిలాష కలిగియుండుటలచేత; ఆవృతంబు+అయిన= కప్పబడిన; విజ్ఞానంబున్= విజ్ఞానాన్ని; క్రమ్మఱన్= మరల; అధిగమించి= పొంది; హేతుమత్+భావంబునన్= కారణము తెలిసికొనిన లక్షణంచేత; శోకహేతువు= దుఃఖకారణం; అహంకార మమకార+ఆత్మకంబు+అయిన= నేను, నాది అనే భావంకల; ద్వైతభ్రమంబు+అనియును= రెండున్నట్లుగా కనిపించే భ్రాంతి అనీ; ద్వైతభ్రమంబునకున్= అట్టి ద్వైతభ్రాంతికి; కారణంబు= హేతువు; దేహంబు+అనియును= శరీరం అనీ; దేహంబునకున్= అట్టి శరీరానికి; బీజంబు= విత్తనం; లింగంబు+అనియును= చిహ్నమనీ; లింగంబునకున్ మూలంబు= గుర్తుకు మూలం; గుణంబు+అనియును= గుణమనీ; గుణంబులకున్ నిదానంబు= గుణాలకు హేతువు; ప్రకృతి అనియును= ప్రకృతి అనీ; బ్రహ్మ+అహమ్ అనియెడు= బ్రహ్మము నేను అనే; జ్ఞానంబునన్= జ్ఞానంలో; లీనయై : లీన+ఐ= స్వరూపం తెలియకుండా కలసిపోయినదై; ప్రకృతి= ప్రకృతి; లేకుండును+అనియును=

లేకపోవుననీ; ప్రకృతి అడంగుట+అ= అట్లు ప్రకృతి అణగిపోవటమే; నైర్గుణ్యంబు+అనియును= గుణాలు లేకపోవటమనీ; నైర్గుణ్యంబువలనన్= గుణాలు లేకుండటంచేత; కార్య లింగనాశంబు+అనియును= ఫలితమూ, చిహ్నామూ నశించటమనీ; కార్యలింగనాశంబునన్= ఈ ఫలితమూ; చిహ్నామూ నశించటంవల్ల; అసంభవంబు= పుట్టటానికి, వీలులేకుండటం; అగు= అయిన; ప్రకృతిన్= ప్రకృతిని; పాసి= తొలగి; క్రమ్మఱన్= మరల; స్థూల శరీరప్రాప్తుండు+కాక= స్థూలమైన శరీరం కలవాడు కాకుండా; పురుషుండు= జీవుడు; సమ్యక్+భోగంబునన్= (చక్కని) పరిపూర్ణమైన అనుభవంలో; ఉండును+అనియును= ఉన్నాడనీ; నిశ్చయించి= నిర్ణయించి; అర్జునుండు= అర్జునుడు; విరక్తుండు+ఐ= వైరాగ్యం కలవాడై; ఊరక+ఉండెన్= మాటాడకుండినాడు; ధర్మజుండు= ధర్మనందనుడు; భగవదీయ మార్గంబున్= భగవంతుని దైనమార్గాన్ని; తెలిసి= గ్రహించి; యాదవుల నాశంబున్= యాదవుల మరణాన్ని; విని= ఆకర్ణించి; నారదు+వచనంబులన్= (పూర్వము దేవర్షి) నారదుడు చెప్పిన మాటలను; తలంచి= స్మృతికి తెచ్చుకొని; నిశ్చలచిత్తుండు+ఐ= చలింపని మనస్సు కలవాడై; స్వర్గ మార్గ గమనంబునకున్= స్వర్గము దారివెంట పయనించటానికి; యత్నంబు+చేయుచుండెన్= ప్రయత్నం చేస్తుండినాడు; ఆ సమయంబునన్= ఆ సందర్భంలో...

**తా :** అని ఈ విధంగా అర్జునుడు అన్నకు చెప్పి, దేశకాలాదులను అనుసరించేవి, మానసిక సంతాపాన్ని ఉపశమింపజేసేవి ఐన వాసుదేవుని వాక్కులు తలచుకొని పరమేశ్వరాయత్తమైన చిత్తంతో మౌనం వహించినాడు. సదా గోవింద పాదారవింద సంస్మరణచే స్వచ్ఛమైన బుద్ధికలవాడై శోకాన్ని వదలివేసినాడు. నిరంతరం ధ్యానరూపమైన భక్తివిశేషంతో కామక్రోధాది శత్రువులను జయించినాడు. పూర్వం కురుక్షేత్రంలో కౌరవ పాండవ సేనామధ్యంలో భగవానుడు వాసుదేవుడు తనకు ప్రబోధం చేసిన గీతావాక్యాలు మననం చేసికొన్నాడు. కాలానుగుణంగా కర్మలను అనుభవించటంవల్ల మరుగుపడిన గీతావిజ్ఞానాన్ని మరల స్మరణమాత్రంతో పొందగలిగినాడు.

అర్జునుడు కార్యకారణభావాన్ని అనుసరించి శోకానికి అహంకార మమకారాలతో కూడిన ద్వైతభ్రాంతియే కారణమని, అట్టి భ్రాంతికి శరీరం, ఆ శరీరానికి లింగం, ఆ లింగానికి గుణాలు, అట్టి గుణాలకు ప్రకృతి – ఒకదానికొకటి కారణాలుగా గ్రహించినాడు. 'అహంబ్రహ్మాస్మి' అనే జ్ఞానంతో ప్రకృతి విలీనమౌతుందని అలా ప్రకృతి నశించటమే గుణరాహిత్యమని, ఈ గుణరాహిత్యమే లింగ శరీరవినాశమని, అట్టి వినాశమే జన్మరాహిత్యమని తెలుసుకొన్నాడు. ప్రకృతిని పరిత్యజించిన పురుషుడు తిరిగి స్థూల శరీరాన్ని పొందక బ్రహ్మైక్యాన్ని పొందుతాడని నిశ్చయించుకొన్న అర్జునుడు పూర్తిగా విరక్తి చెందినాడు. ధర్మజుడు భగవంతుడైన శ్రీకృష్ణుని అవతార సమాప్తిని, యాదవుల వినాశాన్ని విని పూర్వం దేవర్షి నారదుడు తనకు ప్రబోధించిన వాక్యాలను జ్ఞప్తికి తెచ్చుకొని, అచంచల హృదయుడై, నిశ్చలతత్త్వమే జీవన్ముక్తి అని పుణ్యలోకప్రాప్తికి ప్రయత్నాలు సాగించినాడు.

**క. యదువుల నాశము మాధవు, పదవియు విని కుంతి విమలభక్తిన్ భగవ**
**త్పదచింతాతత్పరయై, ముదమున సంసారమార్గమునకుం బాసెన్. 381**

**ప్రతి :** కుంతి= కుంతీదేవి; యదువుల+నాశమున్= యాదవుల మరణాన్ని; మాధవు+పదవియున్= కృష్ణుని విష్ణులోక ప్రాప్తిని; విని= ఆలకించి; విమలభక్తిన్= నిర్మలమైన భక్తితో; భగవత్+పదచింతాతత్పర+ఐ= భగవంతుని, పాదాలను, ధ్యానించటంలో నిష్ఠకలదియై; ముదమునన్= సంతోషంతో; సంసార మార్గమునకున్= ఇహలోక సంబంధమైన దారికి; పాసెన్= తొలగెను.

**తా :** కుంతీదేవి యాదవుల మరణాన్ని, మాధవుని నిర్యాణాన్ని ఆలకించి, నిర్మలమైన భక్తితో, హరిచరణ సంస్మరణయందే పరిపూర్ణ నిష్ఠ కలదియై ఎంతో సంతోషంతో ప్రశాంతంగా ప్రాణాలు పరిత్యజించినది.

**వ. ఇట్లు కంటకంబునం గంటకోన్మూలనంబు సేసి కంటకంబులు రెంటిని పరిహరించు విన్నాణి తెఱంగువ, యాదవరూప శరీరంబునంజేసి యీశ్వరుండు లోకకంటక శరీరంబులు సంహరించి నిజ శరీరంబు విడిచె; సంహారంబునకు నిజశరీర పరశరీరంబులు రెండు నీశ్వరునకు సమంబులు. నిజరూపంబున మెలంగుచు రూపాంతరంబులు ధరియించి క్రమ్మఱ నంతర్ధానంబు నొందు నటుని కైవడి లీలాపరాయణుండైన నారాయణుండు మీన కూర్మాది రూపంబులు ధరియించుం బరిహరించునని చెప్పి మఱియు నిట్లనియె. 382**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కంటకంబునన్= ముల్లుతో; కంటక+ఉన్మూలనంబు+చేసి= ముల్లును పైకి తీసి పూర్తిగా నాశనం చేసి; కంటకంబులు= ముళ్లు; రెంటిని= రెండింటిని; పరిహరించు= తొలగించే; విన్నాణి తెఱంగునన్= విజ్ఞానివలె; యాదవరూప+శరీరంబునన్+చేసి= యాదవుని రూపమున దేహముండుటచేత; ఈశ్వరుండు= పరమేశ్వరుడు; లోక+కంటక+శరీరంబులు= జగత్తుకు బాధాకరములైన దేహములు; సంహరించి= నాశనం చేసి; నిజ+శరీరంబు= తన దేహమును; విడిచెన్= వదలెను; సంహారంబునకున్= వినాశానికి; నిజ శరీర పరశరీరంబులు= తన దేహము; ఇతరుల దేహములు; రెండున్= రెండును; ఈశ్వరునకున్= పరమేశ్వరునికి; సమంబులు= సమానములు; నిజ రూపంబునన్= తన స్వరూపంతో; మెలంగుచున్= వర్తించుచు; రూప+అంతరంబులు= ఇతర రూపములు; ధరియించి= తాల్చి; క్రమ్మఱన్= మరల; అంతర్ధానంబున్+ఒందు= కనపడకుండే స్థితిని పొందే; నటునికైవడిన్= అభినయించు పాత్రధారునివలె; లీలాపరాయణుండు= లీలయందు నిమగ్నమైనవాడు; ఐన= అయినట్టి; నారాయణుండు= నీరు నివాసముగా గల శ్రీమహావిష్ణువు; మీన కూర్మ+ఆదిరూపంబులు= చేప, తాఁబేలు మొదలైన ఆకారములు; ధరియించున్= తాల్చును; పరిహరించును= విడిచివేయును; అని= ఆ ప్రకారంగా; చెప్పి= వివరించి; మఱియున్= ఇంకను; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనినాడు.

**తా :** ఈ విధంగా ముల్లుతో ముల్లును పెకలించి ఆ రెండింటిని పారవేసే విజ్ఞానివలె, పరమేశ్వరుడు, యాదవ శరీరాన్ని ధరించి, జగత్తుకు కంటకాలుగా ఉన్న ఇతరుల శరీరాలను అంతంచేసి, తన శరీరాన్ని కూడా వదలివేసినాడు. పరమేశ్వరునికి సంహార విషయంలో స్వపరదేహాలనే భేదం లేదు. రెండూ సమానమే. స్వస్వరూపంలో ప్రవర్తించే శ్రీమన్నారాయణుడు క్రీడామాత్రంగా అప్పుడప్పుడు మత్స్యకూర్మాది రూపాలు ధరించి, వాటిని విడిచి ఒక నటునివలె మెలగి చివరలో స్వస్వరూపాన్నే పొందుతాడు.

**క. ఏ దినమున వైకుంఠుఁడు, మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచి నాఁ**
**డా దినమున నశుభప్రతి, పాదకమగు కలియుగంబు ప్రాప్తం బయ్యెన్. 383**

**ప్రతి :** వైకుంఠుఁడు= వైకుంఠంలో ఉండే శ్రీమన్నారాయణుడు; ఏ దినమునన్= ఏనాడు; మేదినిపైన్= భూమిమీద; తాల్చినట్టి= ధరించినట్టి; మేను= శరీరం; విడిచినాఁడు= వదలినాడో; ఆ దినమునన్= ఆ దినమునందే; అశుభప్రతిపాదకము+అగు= అశుభమును కలిగించే; కలియుగంబు= కలియుగం; ప్రాప్తంబు+అయ్యెన్= సంప్రాప్తించినది.

**తా :** లీలామానుషరూపాన్ని దాల్చిన శ్రీమన్నారాయణుడు ఏ దినం తన అవతారమును చాలించెనో ఆనాడే అమంగళకరమైన కలియుగము ఆరంభమైనది.

## ✤ ధర్మరాజు పరీక్షితునకుఁ బట్టము గట్టి మహాప్రస్థానంబున కేగుట ✤

**సీ. కలివర్తనంబునఁ గ్రౌర్యహింసాసత్య దంభ కౌటిల్యాద్యధర్మచయము**
**పురముల గృహముల భూములఁ దమలోనఁ గలుగుట దలపోసి కరిపురమున**
**మనుమని రాజవై మను మని దీవించి సింధుతోయకణాభిషిక్తుఁ జేసి**
**యనిరుద్ధనందనుండైన వజ్రునిఁ దెచ్చి మధురఁ బట్టము గట్టి మమతఁ బాసి**

**ఆ. కరుల హరుల భటులఁ గంకణాదికముల, మంత్రిజనుల బుధుల మానవతుల**
**నఖిల మయిన ధనము నభిమన్యుసుతునకు, నప్పగించి బుద్ధి నాశ్రయించి. 384**

**ప్రతి :** కలివర్తనంబునన్= కలిప్రవర్తించుటతో; క్రౌర్య= దయలేనితనం; హింసా= బాధించటం; అసత్య= అసత్యం; దంభ= కపటం; కౌటిల్య= మోసగించటం; ఆది+అధర్మచయము= మొదలైన అధర్మాల సమూహం; పురములన్= పట్టణములలో; గృహములన్= ఇండ్లలో; భూములన్= భూములలో; తమలోనన్= తమలో; కలుగుట= వర్తించుట; తలపోసి= ఆలోచించి, పరిశీలించి; కరిపురమునన్= హస్తినలో; మనుమనిన్= పౌత్రుని; రాజవు+ఐ= ప్రభుడవై; మనుము+అని= జీవింపుమని; దీవించి= ఆశీర్వదించి; సింధు తోయ కణ+అభిషిక్తున్+చేసి= సముద్రాల నీటిబిందువులతో, పట్టాభిషేకం కలవానినిగా ఒనరించి; అనిరుద్ధనందనుండు= అనిరుద్ధుని కొడుకు; ఐన= అయినట్టి; వజ్రునిన్+తెచ్చి= వజ్రుని తీసికొనివచ్చి; మధురన్= మధురా నగరంలో; పట్టము+కట్టి= పట్టాభిషిక్తునిచేసి; మమతన్= మమకారాన్ని; పాసి= వదలి; కరులన్= ఏనుగులను; హరులన్= గుఱ్ఱాలను; భటులన్= శూరులను; కంకణ+ఆదికములన్= ఆభరణాలు మొదలైనవానిని; మంత్రి జనులన్= మంత్రులను; బుధులన్= ప్రజ్ఞావంతులను; మానవతులన్= స్త్రీలను; అఖిలము+ఐన ధనమున్= సమస్తమైన సంపదను; అభిమన్యుసుతునకున్= పరీక్షితునికి; అప్పగించి= అధీనంచేసి; బుద్ధిన్= జ్ఞానాన్ని; ఆశ్రయించి= శరణుజొచ్చి...

**తా :** కలి ప్రవేశించగానే క్రౌర్యం, హింస, అసత్యం, ఆడంబరం, కుటిలత్వం మొదలైన వాటితో అధర్మం పట్టణాల్లో ఇండ్లలో సమస్త ప్రదేశాల్లో విస్తరించిందని గ్రహించిన ధర్మరాజు మనుమడైన పరీక్షితుని హస్తినాపుర సామ్రాజ్యానికి పట్టాభిషిక్తునిజేసినాడు. పవిత్ర సముద్రజలాలతో అభిషేకించి ఆశీర్వదించినాడు. అనిరుద్ధుని కుమారుడైన వజ్రుని మధురానగరానికి అధిపతిగా చేసినాడు. మమకారం వదలి ఏనుగులు, గుఱ్ఱాలు, సైనికులు, కంకణాలు మొదలైన సమస్తాభరణాలు, అమాత్యులను, విద్వాంసులను, స్త్రీలను సకల ధన కనక వస్తువాహనాలను అభిమన్యుని కుమారుడైన పరీక్షితుని అధీనం గావించి ధర్మనందనుడు విరక్తితో బుద్ధియోగాన్ని ఆశ్రయించినాడు.

**వ. విరక్తుండైన దర్మనందనుండు ప్రాజాపత్యం బనియెడి యిష్టిఁ గావించి యగ్నుల నాత్మారోపణంబు సేసి, నిరహంకారుండును, నిర్దళితాశేష బంధనుండునునై సకలేంద్రియంబుల మానసంబున నడంచి, ప్రాణాధీనవృత్తి యగు మానసంబును బ్రాణమందును, బ్రాణము నపానమందును, నుత్సర్గసహితం బయిన యపానము మృత్యువు నందును, మృత్యువును పంచభూతంబులకు నైక్యంబైన దేహంబు నందును,**

**దేహమును గుణత్రయంబు నందును, గుణత్రయంబు నవిద్యయందును, సర్వారోపహేతు వగు నవిద్యను జీవునియందును, జీవుం డయిన తన్ను నవ్యయంబయిన బ్రహ్మమందును లయింపఁజేసి బహిరంతరంగ వ్యాపారంబులు విడిచి, నారచీరలు ధరియించి మౌనియు నిరాహారుండును ముక్తకేశుండునునై, యున్మత్త పిశాచ బధిర జడుల చందంబున నిరపేక్షకత్వంబున. 385**

**ప్రతి :** విరక్తుండు+ఐన= వైరాగ్యవంతుడైన; ధర్మనందనుండు= ధర్మజుడు; ప్రాజాపత్యంబు+అనియెడి= ప్రాజాపత్యము అనెడి; ఇష్టిన్= యజ్ఞాన్ని; కావించి= చేసి; అగ్నులన్= అగ్నులను; ఆత్మ+ఆరోపణంబు+చేసి= తనయందు, ఆరోపించుట కావించి; నిర్+అహంకారుండును= అహంకారం లేనివాడును; నిర్దళిత= చీల్చబడిన; అశేష బంధనుండునున్+ఐ= సమస్త బంధాలు కలవాడును అయి; సకల+ఇంద్రియములన్= అన్ని ఇంద్రియములను; మానసంబునన్= మనస్సులో; అడంచి= అణచివేసి; ప్రాణ+అధీనవృత్తి+అగు= ప్రాణాలకు లొంగి వర్తించే; మానసంబును= మనస్సును; ప్రాణమునందును= ప్రాణమునందును; ప్రాణమున్= ప్రాణమును; అపానంబునందును= అపానమునందు; ఉత్సర్గ+సహితంబు+అయిన= వెలువడుట అను లక్షణముతో కూడిన; అపానమున్= అపానమును; మృత్యువునందును= మరణమునందును; మృత్యువును= మరణమును; పంచభూతంబులకున్= పృథివ్యాది పంచభూతాలకు; ఐక్యంబు+ఐన= ఏకత్వము కలిగిన; దేహంబు+అందును= శరీరంలోను; దేహమును= శరీరాన్ని; గుణత్రయంబునందును= సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణాలలోను; గుణత్రయంబును= మూడుగుణాలను; అవిద్యయందును= అజ్ఞానంలోను; సర్వ+ఆరోపహేతువు+అగు= అన్నిటికి ఆరోపించుటకు కారణమైన; అవిద్యను= అజ్ఞానాన్ని; జీవునియందును= జీవాత్మలోనూ; జీవుండు+అయిన తన్నున్= జీవుడయిన తనను; అవ్యయంబు+అయిన బ్రహ్మము+అందును= తరుగని బ్రహ్మములోను, లయింపన్+చేసి= లీనమగునట్లు చేసి; బహిరంతరంగ వ్యాపారంబులు= వెలుపలి, లోపలి ప్రపంచంతో సంబంధం గల పనులు; విడిచి= వదలివేసి, నారచీరలు+ ధరియించి= నారతో చేసిన వస్త్రములు తాల్చి; మౌనియున్= మౌనము పూనువాడును; నిర్+ఆహారుండును= ఆహారం లేనివాడును; ముక్తకేశుండునున్+ఐ= విరియబోసుకొన్న తలవెంద్రుకలు కలవాడును అయి; ఉన్మత్త పిశాచ బధిర జడుల చందంబునన్= పిచ్చివాడు, దయ్యము పట్టినవాడు, చెవిటివాడు, తెలివి తక్కువవాడువలె; నిర్+అపేక్షకత్వంబునన్= దేనియందునూ ఆసక్తిలేకుండే భావంతో...

**తా :** వైరాగ్యవంతుడైన ధర్మరాజు ప్రాజాపత్యమనే యాగంచేసి, గార్హపత్యం మొదలైన అగ్నులను ఆత్మయందు తాను ఆరోపించుకొన్నాడు. నిరహంకారుడై, సంసారబంధాలను పూర్తిగా త్రెంచివేసి, వాక్కు మొదలైన అన్ని యింద్రియాలను మనస్సునందు, మనస్సును ప్రాణమునందు, ప్రాణాన్ని అపానమందు, అపానాన్ని మృత్యువునందు, మృత్యువును పాంచ భౌతికమైన శరీరమునందు, శరీరాన్ని సత్త్వరజస్తమోగుణములందు, ఆ మూడుగుణాలను అవిద్యయందు, ఆరోపాలకు అన్నింటికి కారణమైన అవిద్యను జీవాత్మయందు, జీవాత్మను అవ్యయమైన పరమాత్మయందు లయమగునట్లు చేసినాడు. సర్వసంగ పరిత్యాగియై నారచీరలు ధరించినాడు. మౌనంతో నిరాహారుడై, తలవిరబోసికొని, పిచ్చివానివలె, పిశాచము పట్టినవానివలె, చెవిటివలె, జడునివలె ఎట్టి అపేక్షలు లేనివాడయినాడు.

**విశే :** ప్రజాపతి దేవతగా గల ఒక యజ్ఞం.

**క. చిత్తంబున బ్రహ్మము నా, వృత్తముఁ గావించికొనుచు విజ్ఞానధనా**
**యత్తులు దొల్లి వెలింగెడి, యుత్తరదిశ కేగె నిర్మలోద్యోగమునన్. 386**

**ప్రతి :** చిత్తంబునన్= మనస్సునందు; బ్రహ్మమున్= పరమాత్మను; ఆవృత్తమున్+కావించికొనుచున్= మరల మరల తలచుకొంటూ; విజ్ఞాన ధన+ఆయత్తులు= విజ్ఞానము అనెడి ధనాన్ని సిద్ధం చేసికొన్నవారు; తొల్లి= పూర్వము; వెలింగెడి= ప్రకాశించే; ఉత్తరదిశకున్= ఉత్తరపు దిక్కునకు; నిర్మల+ఉద్యోగమునన్= నిర్మలమైన ప్రయత్నంతో; ఏగెన్= వెళ్లినాడు.

**తా :** మనస్సులో పరబ్రహ్మాన్ని పదే పదే మననం చేసికొంటూ పూర్వం విజ్ఞానవంతులు అనుసరించిన ఉత్తరపు దిక్కునకు ధర్మనందనుడు నిర్మల ప్రయత్నంతో ఏకాగ్రచిత్తుడై పయనించినాడు.

**సీ. అంత నాతని తమ్ము లనిలపుత్త్రాదులు గలిరాకచేఁ బాపకర్ము లగుచుఁ**
**జరియించు ప్రజల సంచారంబు లీక్షించి యఖిలధర్మంబుల నాచరించి**
**వైకుంఠ చరణాబ్జ వర్తితహృదయులై తద్భక్తినిర్మలత్వమును జెంది**
**విషయయుక్తులకుఁ బ్రవేశింపఁగా రాక నిర్ధూతకల్మష నిపుణమతులు**

**తే. బహుళ విజ్ఞానదావాగ్ని భసితకర్ములైన, యేకాంతులకు లక్ష్యమై వెలుంగు**
**ముఖ్యనారాయణ స్థానమునకుఁ జనిరి, విగతరజమైన యాత్మల విప్రముఖ్య! 387**

**ప్రతి :** విప్రముఖ్య!= బ్రాహ్మణశ్రేష్ఠుడా!; అంతన్= అటుపిమ్మట; ఆతని= ఆ ధర్మజుని; తమ్ములు= సోదరులు; అనిలపుత్త్ర+ఆదులు= భీముడు మొదలైనవారు; కలి+రాకచేన్= కలిప్రవేశంచేత; పాపకర్ములు+అగుచున్= పాపకార్యాలు (కర్మలు) చేసినవారౌతూ; చరియించు= తిరిగే; ప్రజల+సంచారంబులు= జనుల ప్రవర్తనలు; ఈక్షించి= చూచి; అఖిల+ధర్మంబులన్= అన్ని ధర్మాలను; ఆచరించి= నిర్వహించి (చేసి); వైకుంఠ= విష్ణుమూర్తి యొక్క; చరణ అబ్జ= పాదపద్మములందు; వర్తిత+హృదయులు+ఐ= ప్రవర్తించిన మనస్సులు కలవారై; తద్+భక్తిన్= వానియందలి భక్తితో; నిర్మలత్వమును+చెంది= పవిత్రతను పొంది; విషయ యుక్తులకున్= ఇంద్రియార్థాలతో కూడుకొన్నవారికి; ప్రవేశింపన్ కాన్‌రాక= ప్రవేశించుటకు వీలుకాక; నిర్ధూత, కల్మష, నిపుణమతులు= విడువబడిన మాలిన్యముగల నేర్పు గల మనస్సు కలవారు; బహుళ విజ్ఞాన దావ+అగ్ని= ఎక్కువ విజ్ఞానమనే కారుచిచ్చుచే; భసిత కర్ములు= భస్మమైన కర్మలు కలవారు; ఐన= అయినట్టి; ఏకాంతులకున్= దైవమొక్కడే అనుస్థితి సిద్ధించినవారికి; లక్ష్యము+ఐ= పొందగలిగినదై; వెలుంగు= ప్రకాశించే; ముఖ్య నారాయణ స్థానమునకున్= ప్రధానమైన నారాయణుని సన్నిధికి; విగత+రజము+ఐన+ఆత్మలన్= తొలగింపబడిన రజోగుణము గల ఆత్మలతో; చనిరి= పోయినారు.

**తా :** బ్రాహ్మణశ్రేష్ఠా! అనంతరం ధర్మజుని సోదరులైన భీమసేనాదులు కలిప్రభావంతో ప్రజలందరూ పాపమార్గంలో సంచరించటం గ్రహించినారు. సకల ధర్మకార్యాలు నిర్వహించినారు. శ్రీమన్నారాయణుని పాదపద్మాలను తమ హృదయంలో పదిలపరచుకొన్నారు. ఆయనమీది భక్తిచే పవిత్రులయినారు. ఈ విధంగా రజోగుణం లేని హృదయాలతో విషయాసక్తి గలవారు ప్రవేశింపరానిదీ, పాపరహితులు, విజ్ఞానవంతులైన ఏకాంతభక్తులకు గమ్యమై వెలుగొందే విష్ణులోకాన్ని చేరినారు.

**వ. అంత విదురుండు ప్రభాస తీర్థంబున హరియందుఁ జిత్తంబు సేర్చి, శరీరంబు విడిచి, పితృవర్గంబు తోడ దండధరుం దగుటం జేసి నిజాధికార స్థానంబునకుం జనియె; ద్రుపదరాజపుత్రియుఁ బతులవలన నుపేక్షితయై జగత్పతియైన వాసుదేవునందుఁ జిత్తంబు సేర్చి తత్పదంబు సేరె నిట్లు. 388**

**ప్రతి :** అంతన్= పిమ్మట; విదురుండు= విదురుడు; ప్రభాస తీర్థంబునన్= ప్రభాసతీర్థంలో; హరియందున్= మహావిష్ణునిలో; చిత్తంబు= మనస్సు; చేర్చి= నిమగ్నంచేసి; శరీరంబు= దేహము; విడిచి= వదలి; పితృవర్గంబుతోడన్= పితృదేవతలతో; దండధరుండు+అగుటన్+చేసి= యముడు కావటంచేత; నిజ+అధికార స్థానంబునకున్= తనకు అధికారం ఉన్న తావునకు; చనియెన్= పోయినాడు; ద్రుపద రాజపుత్రికయున్= ద్రుపదుని కూతురైన ద్రౌపదియు; పతులవలనన్= భర్తలవల్ల; ఉప+ఈక్షిత+ఐ= నిర్లక్ష్యం చేయబడినదై; జగత్ పతి+ఐన= లోకములకు ప్రభువైన; వాసుదేవు+అందున్= హరియందు; చిత్తంబు= మనస్సు; చేర్చి= కలిపి; తద్+పదము= ఆతని లోకాన్ని; చేరెన్= ప్రవేశించింది; ఇట్లు= ఈ విధంగా...

**తా :** అటుపై విదురుడు పవిత్ర ప్రభాస తీర్థంలో భగవంతునిపై మనస్సు లగ్నంచేసి, శరీరాన్ని త్యజించినాడు. పూర్వజన్మలో తాను యమధర్మరాజు కావున పితృదేవతలతో కలిసి తన అధికార పీఠాన్ని అధిష్ఠించినాడు. ద్రౌపది భర్తలచేత ఉపేక్షింపబడినదై దేవదేవుడైన వాసుదేవుని యందే తన హృదయాన్ని నిలిపి, ఆ పరమేశ్వరుని స్థానాన్నే పొందింది.

**క. పాండవకృష్ణుల యానము, పాండురమతి నెవ్వఁడైనఁ బలికిన విన్నన్**
**ఖండితభవుఁడై హరిదా, సుండై కైవల్యపదము సొచ్చు నరేంద్రా!. 389**

**ప్రతి :** నరేంద్రా!= రాజా!; పాండవ కృష్ణుల యానము= పాండవులయొక్క, కృష్ణునియొక్క ప్రయాణం; పాండుర+మతిన్= స్వచ్ఛమైన మనస్సుతో; ఎవ్వఁడు+ఐనన్= ఎవ్వడైనను; పలికినన్= ఉచ్చరించినను అనగా చదివినను; విన్నన్= వినినను; ఖండిత భవుఁడు+ఐ= ఖండింపబడిన జన్మలు కలవాడై; హరిదాసుండు+ఐ= శ్రీహరికి సేవకుడై; కైవల్యపదము= మోక్షపదవిని; చొచ్చున్= ప్రవేశిస్తాడు.

**తా :** రాజా! పాండవుల మహాప్రస్థానాన్ని, శ్రీకృష్ణుని పరమపదయానం చదివినవాడూ, వినినవాడూ భవబంధ విముక్తుడై, శ్రీహరి భక్తుడై కైవల్యపదాన్ని పొందుతాడు. శ్రీ కైవల్యపదంబు చేరుటకే గదా ఈ గ్రంథం వ్రాయబడింది.

**విశే :** ఇది ఫలశ్రుతి పద్యం, మూలకర్త వ్యాసుడు కూడా ప్రథమస్కంధం పదిహేనవ అధ్యాయం 51వ శ్లోకంలో ఫలశ్రుతిని పేర్కొన్నాడు. ఎవడు భగవత్ప్రియులైన పాండవుల మహాప్రయాణాన్ని శ్రద్ధతో వింటాడో అతడు సమస్తమంగళాల సిద్ధి గడిస్తాడు' అని మూలఫలశ్రుతిలోని భావం. సమస్త శుభాలు, పవిత్రభక్తి, మోక్షసిద్ధి అనే మూడు ఫలితాలు ఇందు పేర్కొనబడ్డాయి. పోతనకూడా సంసార బంధవిచ్ఛేదం హరిభక్తితో కావటం భాగవతుడు కైవల్యపదం చేరడం అనే మూడు ప్రయోజనాలను తెలిపినాడు. మూలంలోని భావమే అనువాదంలో క్రొత్తదనాన్ని సంతరించుకుంది.

**వ. అంత నటం బరీక్షిత్కుమారుండు జాతకర్మవిదులైన పెద్దలు సెప్పిన చందంబున భూసురోత్తమశిక్షావశంబున మహాభాగవత శేఖరుండై ధరణీపాలనంబు సేయుచు నుత్తరుని పుత్రిక నిరావతి యను మత్తకాశినిం బెండ్లియయి, జనమేజయ ప్రముఖులైన నలువురు కొడుకుల నుత్పాదించి, గంగా పులినతలంబునఁ గృపాచార్యుండు గురుత్వంబు సేయ యాగభాగంబులకు వచ్చిన దేవతల నీక్షించుచు, భూరిదక్షిణంబులుగా మూఁడశ్వమేధంబు లాచరించి, దిగ్విజయకాలంబున గోమిథునంబుఁ దన్ను శూద్రుండును రాజచిహ్న ముద్రితుండును నగు కలిం బట్టి నిగ్రహించె నని చెప్పిన, శౌనకుండు పౌరాణికున కిట్లనియె. 390**

**ప్రతి :** అంతన్= అటుపై; అటన్= అచ్చట; పరీక్షిత్ కుమారుండు= బాలుడైన పరీక్షిత్తు; జాతకర్మవిదులు+ఐన పెద్దలు= పుట్టినప్పుడు చేయవలసిన శాస్త్రోక్త కర్మలు తెలిసిన పెద్దలు; చెప్పిన చందంబునన్= చెప్పినవిధంగా; భూసుర+ఉత్తమ

శిక్షా వశంబునన్= బ్రాహ్మణశ్రేష్ఠుల బోధవలనను; మహా+భాగవతశేఖరుండు+ఐ= గొప్ప భాగవతులలో మేల్బంతియై; ధరణీపాలనంబు+చేయుచున్= భూమిని పరిపాలిస్తూ; ఉత్తరుని పుత్త్రికన్= ఉత్తరుని కొమార్తెను; ఇరావతి అను మత్తకాశినిన్= ఇరావతి అనే పేరుగల యౌవనవతిని; పెండ్లి+అయి= వివాహమాడి; జనమేజయ ప్రముఖులు+ఐన= జనమేజయుడు మొదలైన; నలువురు కొడుకులన్+ఉత్పాదించి= నలుగురు కుమారులను పుట్టించి; గంగా పులిన తలంబునన్= గంగానది ఇసుక బయలుపై; కృపాచార్యుండు= కృపాచార్యుడు; గురుత్వంబు+చేయన్= గురువర్యుడుగా వర్తిల్లగా; యాగ భాగంబులకున్= యజ్ఞమున వారి వారి భాగాలకు; వచ్చిన= విచ్చేసిన; దేవతలన్+ఈక్షించుచున్= దేవతలను చూచుచు; భూరి దక్షిణంబులుగాన్= ఎక్కువ దక్షిణలు కలవిగా; మూఁడు+అశ్వమేధంబులు= మూడు అశ్వమేధయాగములు; ఆచరించి= చేసి; దిగ్విజయ కాలంబునన్= దిక్కులను జయించిన సమయంలో; గోమిథునంబున్= గోవుల జంటను (ఆవు మఱియు ఎద్దు); తన్నన్= తాచునట్టి; శూద్రుండును= శూద్ర రూపమున ఉన్నవాడును; రాజ చిహ్న ముద్రితుండునున్+అగు= పరిపాలకుని వేషం కల గుర్తులతో ముద్రింపబడిన వాడును అయిన; కలిన్= కలిని; పట్టి= బంధించి; నిగ్రహించెన్= అణచెను; అని= అంటూ; చెప్పినన్= చెప్పగా; శౌనకుండు= శౌనకుడు; పౌరాణికునకున్= సూతునితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అనంతరం అచ్చట హస్తినాపురంలో రాకుమారుడు పరీక్షిత్తు దైవజ్ఞులైన పెద్దలు చెప్పినట్లు విప్రశ్రేష్ఠుల సమక్షంలో సమస్త విద్యలు నేర్చినాడు. మహాభక్తవర్యుడుగా రాజ్యపాలన సాగించినాడు. అంత పరీక్షిత్తు ఉత్తరుని కొమార్తె ఇరావతిని పెండ్లాడి జనమేజయుని వంటి నలుగురు కుమారులకు తండ్రి అయినాడు. గంగానదీ తీరంలో కృపాచార్యుని పర్యవేక్షణలో మూడు అశ్వమేధ యాగాలు చేసి ఆ యజ్ఞాలలో దేవతలకు ప్రత్యక్షంగా హవిర్భాగాలు అందించినాడు. జైత్రయాత్రకు బయలుదేరి, దిక్కులన్నింటిని జయించే సందర్భంలో ఒకచోట గోమిథునాన్ని తన్నుతూ రాజచిహ్న ముద్రితుడై శూద్రుని వేషంలో ఉన్న క్షుద్రుడగు కలిపురుషుని పట్టి శిక్షించినాడు అని చెప్పగానే శౌనకుడు సూతునితో ఈ విధంగా అన్నాడు.

## ✤ పరీక్షిన్మహారాజు భూధర్మదేవతల సంవాదం బాలించుట ✤

**క. భూవరరూపుఁడు శూద్రుఁడు, గోవుం దా నేల తన్నెఁ గోరి పరీక్షి**
**ద్భూవరుఁడు దిశల గెలుచుచు, నే విధిఁ గలి నిగ్రహించె నెఱిఁగింపఁగదే. 391**

**ప్రతి :** భూవరరూపుఁడు= రాజు రూపమునందున్నవాడగు; శూద్రుఁడు= శూద్రుడు; గోవున్= ధేనువును; తాను= తాను; ఏల?= ఎందుకు?; తన్నెన్= తన్నినాడు?; పరీక్షిత్+భూవరుఁడు= పరీక్షిన్మహారాజు; కోరి= దిగ్విజయాన్ని వాంఛించి; దిశలన్, గెలుచుచున్= దిక్కులను జయిస్తూ; ఏ విధిన్= ఏ విధంగా; కలిన్= కలిని; నిగ్రహించెన్= అణచినాడు?; ఎఱిఁ గింపన్+కదే! = తెలియజేయవలసింది సుమా!

**తా :** అయ్యా! సూతమహర్షీ! రాజువేషంలో ఉన్న శూద్రుడు గోవును ఎందుకు తన్నినాడు? జైత్రయాత్ర గావించే రాజు పరీక్షిత్తు కలిని ఏ విధంగా నిగ్రహించినాడు? సవిస్తరంగా నాకు తెలియజేయవలసింది.

**మ. అరవిందాక్ష పదారవింద మకరందాసక్తులై యున్న స**
**త్పురుషశ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి, దు**

**ర్నరవార్తాకథన ప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి, వా**
**సరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండఁ జన దీ సంసార మోహంబునన్. 392**

**ప్రతి :** అరవింద+అక్ష= పద్మముల వంటి కన్నులు కలవాడగు విష్ణుమూర్తియొక్క; పద+అరవింద మకరంద+ఆసక్తులు+ఐ= పాదపద్మముల, తేనెయందు, అపేక్షకలవారై; ఉన్న= ఉన్నట్టి; సత్+పురుష+శ్రేష్ఠుల= మంచివారిలో ముఖ్యులైన వారి; వృత్తముల్= వృత్తాంతములు; వినక= ఆకర్ణింపక; దుర్+బుద్ధిన్= చెడుతలంపుతో; విలంఘించి= హద్దులుమీరి; దుర్+నరవార్తాకథన ప్రపంచములు= దుష్టులైన మనుష్యుల, వృత్తాంతాలు చెప్పుకోవటం, వివరించటం; కర్ణప్రాప్తముల్+చేసి= చెవులచే పొందబడ్డవిగా చేసి; వాసరముల్= దినములు; సంసారమోహంబునన్= సంసారమందలి భ్రాంతిలో; వ్యర్థతన్= నిరుపయోగంగా; త్రోచుచు+ఉండన్= గడపటం; చనదు= తగదు.

**తా :** అరవిందాక్షుడైన నందనందనుని పాదారవిందాల మకరందం ఆనందంగా ఆస్వాదించి, పరవశులైన ఉత్తమ పురుషుల పవిత్ర చరిత్రలు వినకుండా మితిమీరిన మాత్సర్యంతో మతిహీనులైన దుర్జనుల దుష్టచరిత్రలకు చెవులొగ్గి సంసార వ్యామోహ బంధాలలో చిక్కుకొని పరమార్థాన్ని మరచి, వ్యర్థంగా కాలం గడపటం ఎంత అవివేకం?

**సీ. మనుట నిత్యము గాదు మరణంబు నిజ మని యెఱిఁగి మోక్షస్థితి నిచ్చగించు**
**నల్పాయువు లగు మా కన్యదుర్జన చరిత్రము లోలిఁ గర్ణ రంధ్రములఁ బెట్టి**
**బంగారు వంటి యీ బ్రదికెడు కాలంబుఁ బోనాడఁగా నేల పుణ్యచరిత!**
**మాధవపదపద్మ మకరందపానంబు సేయింపవే యేము సేయునట్టి**

**ఆ. సత్త్రయాగమునకు సన్మునీంద్రులు సీర, వాఁడె దండధరుఁడు వచ్చెఁ జూడు**
**చంపఁ డొకనినైన జన్న మయ్యెడుదాఁక, వినుచునుండుఁ దగిలి విష్ణుకథలు. 393**

**ప్రతి :** పుణ్యచరిత!= పవిత్ర చరిత్రకలవాడా!; మనుట= బ్రతకటం; నిత్యము+కాదు= శాశ్వతం కాదు; మరణంబు= చావు; నిజము+అని= యథార్థమని; ఎఱిఁగి= తెలిసి; మోక్షస్థితిన్= మోక్షమనే స్థితిని; ఇచ్చగించు= ఇష్టపడునట్టి; అల్ప+ఆయువులు+అగు= అల్పమైన ఆయుస్సు కలవారగు; మాకున్= మాకు; అన్యదుర్జన+చరిత్రములు= ఇతరములగు దుర్మార్గుల చరిత్రలు; ఓలిన్= వరుసగా; కర్ణ+రంధ్రములన్+పెట్టి= చెవుల లోపల ఉంచి; బంగారువంటి= బంగారమువలె విలువైన; ఈ బ్రతికెడు+కాలంబున్= ఈ జీవించే సమయాన్ని; పోన్+ఆడన్+కాన్+ఏల= పోగొట్టుకోవటం ఎందుకు?; మాధవ+పద+పద్మ= విష్ణుమూర్తి పాదపద్మముల; మకరంద+పానము= తేనె త్రాగుటను; చేయింపవే= కలిగింపుమా?; ఏము= మేము; చేయు+అట్టి= కావించునట్టి; సత్త్రయాగమునకున్= సత్త్రయాగానికి; సత్+ముని+ఇంద్రులు= ఉత్తములైన మునివర్యులు; చీరన్= పిలువగా; వాఁడె= అతడే; దండధరుఁడు= యముడు; వచ్చెన్= వచ్చినాడు; చూడు= చూచితివా; జన్నము= యజ్ఞము; అయ్యెడుదాఁకన్= పూర్తి అయ్యేవరకు; ఒకనిన్+ఐనన్= ఒక్కరినికూడ; చంపఁడు= చంపలేదు; తగిలి= ఆసక్తి కలిగి; విష్ణుకథలు= శ్రీమన్నారాయణుని గాథలు; వినుచున్+ఉండున్= ఆలకించుచు ఉండినాడు.

**తా :** పుణ్యచరిత్రా! బ్రతుకు శాశ్వతం కాదు. మరణమే సత్యం. 'పుట్టిన ప్రాణి గిట్టక తప్పదు' ఈ సత్యాన్ని గుర్తించి మోక్షాన్ని కాంక్షించే అల్పాయుస్సు కల మేము అపవిత్రుల అల్పచరిత్రలు ఆలకిస్తూ బంగారం వంటి కాలాన్ని పాడుచేసుకోవటం పాడికాదు. కావున మాకు గోవింద పాదారవింద మకరంద ధారలు అనుగ్రహించు. మేము చేసే ఈ

సత్రయాగానికి మునీంద్రులను ఆహ్వానింపగా ఆ దినమే అంతకుడైన యముడు ఆగంతుకుడై విచ్చేసినాడు. చూచితివా! ఈ యజ్ఞం పూర్తి అయ్యేదాక ఆయన ఏ ఒక్కరి ప్రాణాన్నికూడ తీయలేదు. ఎంతో ఆసక్తితో విష్ణుకథలు వింటూ మైమరచి అక్కడనే ఉండిపోయినాడు.

**క. మందునకు మందబుద్ధికి, మందాయువునకు నిరర్థమార్గునకును గో**
**విందచరణారవింద మ, రందము గొనఁ దెఱపి లేదు రాత్రిందివముల్. 394**

**ప్రతి :** మందునకున్= సోమరికి; మందబుద్ధికిన్= బుద్ధిబలము లేనివానికి; మంద+అయువునకున్= అల్పమైన ఆయుస్సు కలవానికి; నిర్+అర్థ+మార్గునకున్= ప్రయోజనంలేని మార్గం కలవానికి; గోవింద చరణ+అరవింద మరందము= విష్ణుమూర్తి అడుగు తామరల తేనెను; కొనన్= ఆస్వాదించుటకు, గ్రహించటానికి; రాత్రిందివముల్= రాత్రి, పగలు; తెఱపిలేదు= అవకాశం లేదు.

**తా :** సోమరులు, మందబుద్ధులు, అల్పమైన ఆయుస్సు కలవారు ప్రయోజనంలేని దారులలో కాలాన్ని వ్యయం చేస్తూ పయనిస్తున్నారు. అట్టివారికి హరిచరణ కమల సుధాధారలు చవిచూడటానికి రాత్రింబవళ్ళలో అవకాశమే లేదు.

**వ. అని శౌనకుండు పలికిన సూతుం డిట్లనియెఁ బరీక్షిన్నరేంద్రుండు నిజవాహినీ సందోహ సురక్షితంబగు కురుజాంగలదేశంబునం గలి ప్రవేశంబు నాకర్ణించి, యుద్ధకుతూహలత నంగీకరించి, యొక్క నాఁడు సముల్లాసంబున బాణాసనంబు గైకొని, నీల నీరద నిభతురంగ నివహ యోజితంబును, ఫలిత మనోరథంబును నైన రథంబు నారోహణంబు సేసి, మృగేంద్ర ధ్వజంబు వెలుంగ రథ కరి తురంగమ సుభట సంఘటితంబగు వాహినీచక్రంబు నిర్వక్రంబుగం గొలువ, దిగ్విజయార్థంబు వెడలి పూర్వదక్షిణ పశ్చిమోత్తర సముద్రలగ్నంబు లయిన, యిలావృత రమ్యక హిరణ్మయ హరివర్ష కింపురుష భద్రాశ్వ కేతుమాల భారత వర్షంబులు నుత్తర కురుదేశంబులును జయించి, పుష్కల ధనప్రదాన పూర్వికలగు సపర్యల నభ్యర్చితుండై తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు మంగళ పాఠక సంఘాత జేగీయమాన పూర్వరాజవృత్తాంతంబు లాకర్ణింపుచుఁ బాఠకపఠితపద్యంబుల వలనం బాండవులకు భక్తవత్సలుండైన పుండరీకాక్షుం డాచరించిన సారథ్య, సఖ్య, సాచివ్య, సభాపతిత్వ, వీరాసనత్వ, దూతభావాది కర్మంబులు నశ్వత్థామాస్త్ర తేజంబు వలనఁ దన్ను రక్షించుటయు, యాదవ పాండవులందలి స్నేహానుబంధంబును, వారలకుం గలిగిన భగవద్భక్తివిశేషంబును విని, విశ్వంభరుని భక్త వాత్సల్యంబునకు నాశ్చర్యంబు నొందుచు, వందిబృందంబులకు మహార్ఘంబులగు హారాంబరాభరణాది సందోహంబుల నొసంగుచుఁ, బద్మనాభ పాదపద్మ భజన పరతంత్ర పవిత్రమానసుండై యుండె; నయ్యెడ వృషభ రూపంబున నేకపాదంబున సంచరించు ధర్మదేవుండు దన సమీపంబున లేఁ గలేని లేఁగటి కుఱ్ఱి చందంబున హతప్రభయై నేత్రంబుల సలిలంబులు గురియుచు గోరూపయై యున్న ధాత్రి కిట్లనియె. 395**

**ప్రతి :** అని= ఆ ప్రకారంగా; శౌనకుండు= శౌనకుడు; పలికినన్= పలుకగా; సూతుండు= సూతుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనినాడు; పరీక్షిత్+నర+ఇంద్రుండు= రాజైన పరీక్షిత్తు; నిజ వాహినీ సందోహ సురక్షితంబు+అగు= తన సైన్య

సమూహాలచే బాగుగా రక్షింపబడే; కురు జాంగలదేశంబునన్= కురుభూమియందలి అడవులతో కూడిన పల్లమైన ప్రదేశంలో; కలి= కలి; ప్రవేశంబున్= చొరబడుటను; ఆకర్ణించి= విని; యుద్ధకుతూహలతన్= యుద్ధమునందలి కుతూహలమును; అంగీకరించి= సమ్మతించి; ఒక్కనాఁడు= ఒకదినము; సమ్+ఉల్లాసంబునన్= మిక్కిలి సంతోషంతో; బాణ+ఆసనంబు= విల్లు; కైకొని= గ్రహించి; నీలనీరద నిభ తురంగ నివహ యోజితంబును= నల్లని మబ్బులతో, సమానమైన గుఱ్ఱముల గుంపుచే, పూన్చబడినదియు; ఫలిత మనోరథంబునున్+ఐన= ఫలించిన కోరిక గలదియునైనట్టి; రథంబున్= తేరును; ఆరోహణంబు+చేసి= ఎక్కి, మృగ+ఇంద్ర ధ్వజంబు= సింహముగల పతాకం; వెలుంగన్= ప్రకాశింపగా; రథ కరి తురంగమ సుభట సంఘటితంబు+అగు= రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, మంచియోధులు అనువానితో కూర్చబడినదియగు; వాహినీచక్రంబు= సైన్య సమూహము (చక్రాకారముగా ఏర్పాటు చేసిన సేన); నిర్+వక్రంబుగన్= లోపము లేకుండ; కొలువన్= సేవింపగా; దిక్+విజయ+అర్థంబు= దిక్కులను జయించుటకొఱకై; వెడలి= బయలుదేరి; పూర్వ దక్షిణ పశ్చిమ+ఉత్తర సముద్ర లగ్నంబులు= తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తర దిక్కులగల, సముద్ర తీరముల తగిలియున్నవియు; అయిన= అయినట్టి; ఇలావృత రమ్యక హిరణ్మయ హరివర్ష కింపురుష భద్రాశ్వ కేతుమాలా+ భారతవర్షంబులు= 1.ఇలా వృతము 2.రమ్యకము 3.హిరణ్మయము 4.హరివర్షము 5.కింపురుషము 6.భద్రాశ్వము 7.కేతుమాల 8.భారతము అనే హిమాలయానికి ఉత్తరంలో ఒక కేంద్రము చుట్టును గల ఎనిమిది వర్షములు; ఉత్తర కురుదేశంబులును= కురుభూములలో ఉత్తరానగల రాజ్యాలు (సరస్వతి, దృష ద్వతి, ఆప్య అను నదుల మధ్యభాగము కురుభూమి); జయించి= గెలిచి; పుష్కల ధన ప్రదాన పూర్వికలు+అగు+సపర్యలన్= సమృద్ధిగా, ధనమును, దానపూర్వకంగా ఒసగునట్టి సేవలచే (కానుకలు మొదలైన వానిచేత); అభి+అర్చితుండు+ఐ= మిక్కిలి పూజింపబడినవాడై; తత్+తత్+ దేశవాసులు= ఆయా దేశాల్లో వసించేవారు; ఇచ్చిన కానుకలు= ఒసగిన బహుమానములు; కైకొనుచున్= గ్రహిస్తూ; మంగళ+పాఠక= మంగళ గీతములు పాడే గాయకులయొక్క; సంఘాత= సమూహంచే; జేగీయమాన= గానం చేయబడుచున్న; పూర్వరాజ= పూర్వులైన ప్రభువులయొక్క; వృత్తాంతంబులు= కథలు; ఆకర్ణించుచున్= వింటూ; పాఠక+పఠిత+పద్యంబులవలనన్= పాఠకులచే చదువబడుతున్న పద్యాలవల్ల; పాండవులకున్= పాండవులకు; భక్తవత్సలుండు+ఐన= భక్తులయందు వాత్సల్యం గలవాడైన; పుండరీక+అక్షుండు= తెల్లదామరల వంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; ఆచరించిన= చేసిన; సారథ్య= రథంతోలటం; సఖ్య= స్నేహం చేయటం; సాచివ్య= మంత్రిత్వం నెరపడం; సభాపతిత్వ= సభల్లో నిర్ణయాలు చేసే ఆధిపత్యం; వీరాసనత్వ= ధర్మనిర్ణయం చేసే పీఠంపై కూర్చోవటం; దూతభావ= రాయబారం; ఆదికర్మంబులన్= మొదలైన పనులచే; అశ్వత్థామ+అస్త్ర+తేజంబు+ వలనన్= అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రము యొక్క అగ్నివలన; తన్నున్+రక్షించుటయున్= తనను కాపాడటమూ; యాదవ పాండవుల+అందలి= యాదవులు, పాండవులు అను వారిపైగల; స్నేహ+అనుబంధంబు= ప్రేమబాంధవ్యములును; వారలకున్= ఆ పాండవులకు; కలిగిన= ఏర్పడిన; భగవత్+భక్తి+విశేషంబునున్= భగవంతునియెడ విశేషమైన భక్తిని; విని= ఆకర్ణించి; విశ్వంభరుని= లోకాలను పోషించే వాడైన శ్రీకృష్ణుని; భక్తవాత్సల్యంబునకున్= భక్తులయందలి ప్రేమభావానికి; ఆశ్చర్యంబున్+ఒందుచున్= ఆశ్చర్యపడుతూ; వంది+బృందంబులకున్= తన వంశాదులను కీర్తించేవారి సమూహానికి; మహా+అర్ఘంబులు+అగు= మిక్కిలి వెలగల్గిన; హార+అంబర+ఆభరణ+ఆది+సందోహంబులన్= దండలు, వస్త్రములు, నగలు మొదలగువాని సమూహములను; ఒసంగుచున్= ఇస్తూ; పద్మనాభ= విష్ణుమూర్తియొక్క; పాదపద్మ= పాదపద్మములను; భజన= సేవించటంలో; పరతంత్ర= నిమగ్నమైన; పవిత్రమానసుండు+ఐ= పరిశుద్ధమైన మనస్సు కలవాడై; ఉండెన్= ఉండినాడు; ఆ+ఎడన్= ఆ సందర్భంలో; వృషభరూపంబునన్= ఎద్దురూపంలో; ఏకపాదంబునన్= ఒక్కకాలితో; సంచరించు= తిరిగే;

ధర్మదేవుండు= ధర్మదేవుడు; తన+సమీపంబునన్= తనకు దగ్గరగా; లేఁగ+లేని= అప్పుడే పుట్టిన దూడలేని; లేఁగటి+కుఱ్ఱి; చందంబునన్= తరిపి ఆవు మాదిరి; హత ప్రభ+ఐ= కాంతిని గోల్పోయినదై; నేత్రంబులన్= కన్నులలో; సలిలంబులు= నీరు; కురియుచున్= వర్షిస్తూ; గో రూప+ఐ+ఉన్న= ఆవు రూపము కలదియై ఉన్న; ధాత్రి= భూదేవి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనినది.

**తా :** ఆ విధంగా పలికిన శౌనకుని మాటలు విని సూతుడిట్లన్నాడు. మునీంద్రా! తన సేనాసమూహంచే కాపాడబడే కురుజాంగల దేశంలో కలిపురుషుడు ప్రవేశించినాడని పరీక్షిత్తు విన్నాడు. ఒకనాడు కదన కుతూహలంతో విల్లు ధరించి నీలమేఘములను పోలిన గుఱ్ఱాలు కట్టిన మనోరథంవంటి రథంపై ఎక్కి సింహధ్వజం వెలుగుతుండగా రథగజతురగపదాతులతో కూడిన సేనావాహినితో విజయయాత్రకు బయలుదేరినాడు. తూర్పు దక్షిణము పడమర ఉత్తర దిశలలో సాగర తీరాల్లో ఉన్న ఇలావృతం, రమ్యకం, హిరణ్మయం, హరివర్షం, కింపురుషం, భద్రాశ్వం, కేతుమాల, భారతం అనే పేర్లు గల ఎనిమిది వర్షాలను, ఉత్తర కురుదేశాలను, జయించి, ఆయా దేశవాసులు తెచ్చి యిచ్చిన కానుకలు గ్రహించినాడు. వందిమాగధులచే పొగడబడే తన పూర్వరాజుల వృత్తాంతాలు విన్నాడు. స్తోత్ర పాఠకులు పఠించే పద్యాలవలన భక్తవత్సలుడైన శ్రీకృష్ణుడు పాండవులకు సారథిగా, ఇష్టసఖుడుగా, సచివుడుగా, సభాపతిగా, సంరక్షకుడుగా, దూతగా ఆచరించిన కృత్యాలు, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం విరజిమ్మే అగ్నిశిఖల నుండి తనను రక్షించిన వృత్తాంతం తెలిసికొన్నాడు. యాదవులకు పాండవులకు గల పరస్పర స్నేహబాంధవ్యాలను, శ్రీకృష్ణునిపై వారికి గల భక్తిప్రపత్తులను గ్రహించినాడు. విశ్వంభరుని భక్తవాత్సల్యానికి ఆశ్చర్యచకితుడయినాడు. స్తుతి పాఠకులకు మిక్కిలి వెలగల బహుమూల్యాలైన హారములు, వస్త్రాలు, ఆభరణాలు బహూకరించినాడు. పద్మనాభుని పాదపద్మారాధనలో పరవశుడై పవిత్ర మానసంతో ఉండినాడు.

ఆ సమయంలో వృషభాకారం ధరించి, ఒంటికాలిపై తిరిగే ధర్మదేవుడు చెంత దూడలేని తరపి ఆవువలె పూర్తిగా కాంతిని కోల్పోయి ఆర్తితో కన్నీరు గార్చుచున్న గోరూపధారిణియైన భూదేవితో ఇట్లన్నాడు.

**మ. నయనాంభఃకణజాల మేల విడువన్ నాతల్లి! నీ మేను సా**
**మయమై యున్నది; మోము వాడినది; నీ మన్నించు చుట్టాలకున్**
**భయదుఃఖంబులు నెందు నొందవు గదా? బంధించి శూద్రుల్ పద**
**త్రయహీనన్ ననుఁ బట్ట వత్తు రనియో, తాపంబు నీ కేటికిన్? 396**

**ప్రతి :** నాతల్లి!= మా అమ్మవైన ఓ భూదేవీ!; నయన+అంభస్+కణజాలము= కంటి నీటి బిందువుల జాలు; విడువన్= వదలగా!; ఏల?= ఎందుకు?; నీమేను= నీ శరీరం; స+ఆమయము+ఐ= అనారోగ్యంతో కూడినదై; ఉన్నది= కన్పట్టుచు ఉన్నది; మోము= ముఖము; వాడినది= మ్లానమైపోయినది; నీ+మన్నించు= నీవు ఆదరించే; చుట్టాలకున్= బంధువులకు; భయదుఃఖంబులు= భీతి, శోకములు; ఎందున్= ఎందైనా; ఒందవుకదా!= పొందలేదు కదా!; శూద్రుల్= శూద్రులు; పద+త్రయ+హీనన్= మూడుకాళ్లు లేనివాడను; ననున్= నన్ను; పట్టన్= బంధింపగా; వత్తురు+అనియో!= వచ్చుచున్నారనియా?; తాపంబు= బాధ; నీకున్+ఏటికిన్= నీకెందుకు?

**తా :** తల్లీ! భూదేవీ! నీ కన్నులనుండి ఏకధారగా కన్నీరు కారుచున్నది ఎందుకు? నీ దేహం వ్యాధితో కూడుకొనియున్నది. నీముఖం ఎందుకావిధంగా వాడిపోయింది? నీ ప్రియబంధువులకు భయదుఃఖాలు కలుగలేదు కదా! శూద్రులు ఒంటికాలితో కుంటినై ఉన్న నన్నుపట్టి బంధింతురని బాధపడుచుంటివా? ఎందుకు తల్లీ నీకీబాధ?

**సీ. మఖములు లేమి నమర్త్యుల కిటమీఁద మఖభాగములు లేక మాను ననియొ?**
**రమణులు రమణుల రక్షింప రనియొ తత్పుత్రులఁ దండ్రులు ప్రోవ రనియొ?**
**భారతి గుజనులఁ బ్రాపించు ననియొ సద్విప్రులు నృపుల సేవింతు రనియొ?**
**కులిశ హస్తుఁడు వాన గురియింపకుండఁగఁ బ్రజలు దుఃఖంబులఁ బడుదు రనియొ?**

**ఆ. హీనవంశజాతు లేలెద రనియొ, రాజ్యములు పాడి గలిగి జరుగవనియొ?**
**మనుజు లన్నపానమైథున శయనాస, నాది కర్మసక్తు లగుదు రనియొ? 397**

**ప్రతి :** అమర్త్యులకున్= దేవతలకు; మఖములు లేమిన్= యజ్ఞములు లేకపోవుటవలన; మఖభాగములు= యజ్ఞములోని భాగములు; లేక= లేకుండ; మానున్+అనియొ?= ఆగిపోవుననియా?; రమణులు= భర్తలు; రమణులన్= భార్యలను; రక్షింపరు+అనియొ?= కాపాడరనియా?; తత్‌పుత్రులన్= వారి కుమారులను; తండ్రులు= తండ్రులు; ప్రోవరు+అనియొ?= రక్షింపరనియా?; భారతి= సరస్వతి; కుజనులన్= చెడ్డవారిని; ప్రాపించును+అనియొ?= పొందుననియా?; సత్+విప్రులు= మంచి బ్రాహ్మణులు; నృపులన్= రాజులను; సేవింతురు+అనియొ?= సేవించెదరనియా?; కులిశహస్తుఁడు= వజ్రంచేత గలవాడైన ఇంద్రుడు; వానన్+కురియింపకుండఁగన్= వాన కురియనీయకుండ చేయగా; ప్రజలు= జనులు; దుఃఖంబులన్= కష్టములను లేక బాధలను; పడుదురు+అనియొ?= పొందుదురనియా?; హీన+వంశ+జాతులు= తక్కువ కులమున పుట్టినవారు; ఏలుదురు+అనియొ?= పాలించెదరనియా?; రాజ్యములు= దేశములు; పాడి కలిగి= న్యాయము కలిగి; జరుగవు+అనియొ?= వర్తింపవనియా?; మనుజులు= మానవులు; అన్న+పాన+మైథున+శయన+ఆసన+ఆది+కర్మ+సక్తులు+అగుదురు+అనియొ?= అన్నం, పానీయం, స్త్రీ పురుష సంబంధం, శయనించటం, కూర్చుండుట మొదలైన పనుల్లో ఆసక్తి కలవారు అయ్యెదరనియా?

**తా :** యజ్ఞాలు లేనందువల్ల దేవతలకు యాగాల్లో భాగాలు లభింపవనియా? భర్తలు భార్యలను భరింపరని, పిల్లలను తల్లిదండ్రులు కాపాడరని బాధపడుతున్నావా? సరస్వతి దుర్జనులను ఆశ్రయిస్తుందని, ఉత్తమ బ్రాహ్మణులు రాజులకు సేవలు చేస్తారని, ఇంద్రుడు వర్షాలు కురిపించనందువల్ల ప్రజలు కష్టాలపాలు ఔతారని దుఃఖించుచుంటివా? హీనవంశాలవారు రాజ్యాలు ఏలుతారని, న్యాయం నశించిపోతుందని, మానవులు ఆహార నిద్రామైథునాది కర్మలలో ఆసక్తులు ఔతారని చింతిస్తున్నావా? ఎందుకు దుఃఖిస్తున్నావు?

**మ. జననీ! నీ భర మెల్ల డించుటకునై చక్రాయుధుం డిన్ని హా**
**యనముల్ దాను నరాకృతిన్ మెలఁగి నిత్యానందముం జేసి పో**
**యిన నే నింక ననాథ నైతిఁ; గుజనుం డెవ్వాఁడు శాసించునో**
**పెనుదుఃఖంబుల నేమి పొందు ననియో భీతిల్లి చింతించుటల్. 398**

**ప్రతి :** జననీ!= తల్లీ!; నీభరము+ఎల్లన్= నీ బరువునంతయును; డించుటకున్+ఐ= తగ్గించుటకై; చక్రాయుధుండు= శ్రీకృష్ణుడు; ఇన్నిహాయనముల్= ఇన్ని సంవత్సరాలు; తాను= తాను; నర+ఆకృతిన్= మానవాకారంతో; మెలఁగి= వర్తించి; నిత్య+ఆనందమున్+చేసి= శాశ్వతమైన ఆనందాన్ని కలిగించి; పోయినన్= పోగా; ఏన్= నేను; ఇంకన్= ఇక; అనాథన్+ఐతిన్= దిక్కులేని దాననైతిని; కుజనుండు= చెడ్డవాడు లేక శీలం లేనివాడు; ఎవ్వాఁడు= ఎవడు; శాసించును+ఓ=

శిక్షించునో; పెను+దుఃఖంబులన్= పెద్ద కష్టములను; ఏమి+పొందున్+అనియో!= ఏమి కలుగుననియో; భీతిల్లి= భయపడి; చింతించుటల్= దుఃఖించుటలు?

**తా :** తల్లీ! భూభారాన్ని తగ్గించటానికి చక్రధారియైన శౌరి ఇన్ని సంవత్సరాలు మానవాకారం తాల్చి, ఆనందాన్ని కల్గించి ఇపుడు అవతారం చాలించినాడు కదా! ఇక నేను దిక్కులేని దాననైనాను. ఏ దుర్మార్గుడు ఇకపై నన్ను పాలిస్తాడో! ఎలాంటి ఇక్కట్లు కలుగుతాయో? అని దిగులుపడి తల్లడిల్లుతున్నావా?

**క. దెప్పర మగు కాలముచే, నెప్పుడు దేవతలకెల్ల నిష్టం బగు నీ**
**యొప్పిదముఁగృష్ణుఁ డరిగినఁ, దప్పెఁగదా! తల్లి! నీవు తల్లడపడఁగన్. 399**

**ప్రతి :** తల్లి!= అమ్మా! భూదేవీ!; దెప్పరము+అగు= దుర్భరమగు; కాలముచేన్= కాలంచేత; ఎప్పుడు= ఎల్లప్పుడు; దేవతలకున్+ఎల్లన్ వేల్పులందరికీ; ఇష్టంబు+అగు= ప్రీతికరమైన; నీ+ఒప్పిదము= నీ అంగీకారం (సౌభాగ్యము), కృష్ణుఁడు+అరిగినన్= కృష్ణుడు వెడలిపోగా; నీవు= నీవు; తల్లడపడఁగన్= చలించగా; తప్పెన్+కదా!= తప్పినది కదా!

**తా :** తల్లీ! అన్ని అనర్థాలకు ఆలవాలమైన కాలంలో అనగా మహాదుర్భరమైన సందర్భంలో; దేవతలకు కూడ స్తుతిపాత్రమైన నీ సౌభాగ్యం కృష్ణుడున్నంతవరకు శోభాయమానంగా ఉండింది. కృష్ణుడు వెళ్లిపోగానే అదృష్టం మారింది. అనర్థం వాటిల్లింది.

**వ. అనిన భూదేవి యిట్లనియె. 400**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; భూదేవి= గోరూపములో ఉన్న భూదేవి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనినది.

**తా :** ఏకపాదుడైన ధర్ము డావిధంగా పలుకగా భూదేవి ఈ విధంగా అన్నది.

**క. ఈ లోకంబునఁ బూర్వము, నాలుగు పాదముల నీవు నడతువు నేఁ డా**
**శ్రీలలనేశుఁడు లేమిని, గాలముచే నీకు నొంటి కాలయ్యెఁ గదే! 401**

**ప్రతి :** పూర్వము= తొల్లి; ఈ లోకంబునన్= ఈ లోకంలో; నీవు= నీవు; నాలుగు పాదములన్= నాలుగు చరణాలతో; నడతువు= నడుచుచుంటివి; నేఁడు= ఈనాడు; ఆ శ్రీలలనా+ఈశుఁడు= ఆ ఇందిరావల్లభుడైన గోవిందుడు; లేమిని= లేకపోవుటచే; కాలముచేన్= కాలప్రభావంచేత; నీకున్= నీకు; ఒంటికాలు+అయ్యెన్+కదే!= నడచుటకు ఒక్క కాలు అయినది కదా!

**తా :** పూర్వం ధర్మ దేవతాస్వరూపుడవైన నీవు ఈ లోకంలో నాల్గు పాదాలతో నడుస్తూ ఉంటివి. ఈనాడు ఇందిరావల్లభుడైన గోవిందుడు లేకపోవటం చేత కాలప్రభావంవల్ల ఒంటికాలితో నడుస్తున్నావు.

**వ. మఱియు సత్య శౌచ దయా క్షాంతులును, ద్యాగసంతోషార్జవంబులును, శమ దమ తపంబులును, సమత్వంబును, పరాపరాధ సహనంబును, లాభంబు గలయెడ నుదాసీనుండై యుండుటయును, శాస్త్రవిచారంబును, జ్ఞానవిరక్తులును, నైశ్వర్య శౌర్యప్రభా దక్షత్వంబులును, స్మృతియును, స్వాతంత్ర్యంబును. గౌశల కాంతి ధైర్యమార్దవ ప్రతిభాతిశయ ప్రశ్రయశీలంబును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోబలంబులును,**

**సౌభాగ్యగాంభీర్య స్థైర్యంబులును, శ్రద్ధాకీర్తి మాన గర్వాభావంబులును ననియెడి ముప్పది తొమ్మిది గుణంబులు; నవియునుంగాక బ్రహ్మణ్యతా శరణ్యతాది మహా గుణసమూహంబును శ్రీకృష్ణదేవుని యందు వర్తిల్లుంగావున. 402**

**ప్రతి :** మఱియున్= ఇంకను; సత్య శౌచ దయా క్షాంతులును= సత్యం, పరిశుభ్రత, దయ, ఓర్పులును, త్యాగసంతోష+ ఆర్జవంబులును= త్యాగం, సంతోషం, ఋజువైన ప్రవర్తనయును; శమ దమ తపంబులును= శాంతి, ఇంద్రియ నిగ్రహం, తపస్సు; సమత్వంబును= సమభావమును; పర+అపరాధ సహనంబును= ఇతరుల తప్పుపట్ల ఓర్పును; లాభంబు+కలయెడన్= లాభమున్నచోట; ఉదాసీనుండు+ఐ+ఉండుటయును= ఏదీ పట్టించుకోనివాడుగా ఉండుట; శాస్త్రవిచారంబును= శాస్త్రాలను అభ్యసించటం; జ్ఞాన విరక్తులును= జ్ఞానము వైరాగ్యమును; ఐశ్వర్య శౌర్య ప్రభా దక్షత్వంబులును= ఐశ్వర్యం, శౌర్యం, తేజస్సు, సామర్థ్యములును; స్మృతియును= గతించిన విషయాలను స్మరించటం; స్వాతంత్ర్యంబును= స్వతంత్రతయును; కౌశల= నేర్పరితనము; కాంతి ధైర్య మార్దవ ప్రతిభా+అతిశయ+ప్రశ్రయ శీలంబును= కాంతి, ధైర్యము, మృదుత్వము, నవనవోన్మేషమైన ప్రతిభ ఇతరులను మించగలుగుట, నమ్మకముగల శీలము (లక్షణము); జ్ఞానేంద్రియ= జ్యానేంద్రియముల; కర్మేంద్రియ= కర్మేంద్రియముల, మనోబలంబులును= మనస్సుయొక్క బలములును, సౌభాగ్య+గాంభీర్య+స్థైర్యంబులును= అదృష్టము కలిసివచ్చుట, గంభీరమైన స్వభావము, స్థిరత్వములును; శ్రద్ధా+కీర్తి+మాన+గర్వ+అభావంబులును= శ్రద్ధ, కీర్తి, అభిమానము, గర్వం లేకుండుట; అనియెడి= అను; ముప్పది తొమ్మిది గుణంబులు= ముప్పది తొమ్మిది గుణాలు; అవియునున్+కాక= అవియేకాక; బ్రహ్మణ్యతా+శరణ్యతా+ఆది+మహాగుణసమూహంబును= వేదములను అనుసరించి జీవించుట; శరణు జొచ్చుటకు తగియుండుట మొదలైన గొప్ప గుణముల మొత్తమును; శ్రీకృష్ణదేవునియందున్= దివ్యుడైన శ్రీకృష్ణునియందు; వర్తిల్లున్+కావునన్= ప్రవర్తిల్లును కాబట్టి.

**తా :** సత్యం, శౌచం, దయ, ఓర్పు, త్యాగం, సంతోషం, ఋజుత్వం, శమం, దమం, తపస్సు, సమభావం, తితిక్ష, ఉపరతి, శ్రుతం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం, శౌర్యం, తేజస్సు సామర్థ్యం, స్మృతి, స్వాతంత్ర్యం, కౌశలం, కాంతి, ధైర్యం, మృదుత్వం, ప్రతిభ, వినయం, శీలం, జ్ఞానేంద్రియ పటుత్వం, కర్మేంద్రియ పటుత్వం, మనోబలం, సౌభాగ్యం, గాంభీర్యం, స్థైర్యం, శ్రద్ధ, కీర్తి, గౌరవం, నిరహంకారం అనే ముప్పది తొమ్మిది సుగుణాలే కాకుండ, వేదవిజ్ఞానం, శరణాగత పరిరక్షణం మొదలైన గొప్ప గుణగణాలు శ్రీకృష్ణపరమాత్మయందు వర్ధిల్లుచుండినవి.

**క. గణనాతీతము లగు స, ద్గుణములు గల చక్రి చనిన ఘోరకలి ప్రే**
**రణమునఁ బాప సమూహ, వ్రణయుతులగు జనులఁ జూచి వగచెదఁ దండ్రీ! 403**

**ప్రతి :** తండ్రీ!= ఓ తండ్రీ!; గణన+అతీతములు+అగు= లెక్కకు మిక్కిలి అయినవి అగు; సద్గుణములు= మంచి గుణములు; కల= ఉన్న; చక్రి= శ్రీకృష్ణుడు; చనినన్= వెళ్ళిపోగా; ఘోర కలి ప్రేరణమునన్= భయంకరమైన కలిపురుషుని ప్రేరణచే; పాపసమూహవ్రణయుతులు+అగు= పాపముల సమూహము అనెడి గాయములతో కూడుకొన్నవారగు; జనులన్= ప్రజలను; చూచి= కనుగొని; వగచెదన్= దుఃఖించుచున్నాను.

**తా :** ఓ తండ్రీ! లెక్కించటానికి వీలుకాని సద్గుణాలు కల చక్రధరుడు అవతార పరిసమాప్తి చేయగానే కలి పురుషుని ప్రేరణ కారణంగా భయంకర పాపకార్యాలకు పాల్పడిన ప్రజాసమూహాన్ని చూడగానే నాకు దుఃఖం పొంగి పొరలి వస్తున్నది.

**క. దేవతలకు ఋషులకుఁ బితృ, దేవతలకు నాకు నీకు ధీరులకును నా**
**నా వర్ణాశ్రమములకును, గోవులకును బాధ యనుచుఁ గుందెద ననఘా! 404**

ప్రతి : అనఘా!= ఓ పుణ్యమూర్తీ!; దేవతలకున్= అమరులకు; ఋషులకున్= ద్రష్టలైన మునులకు; పితృదేవతలకున్= పితృదేవతలకు; ధీరులకున్= ధైర్యము గలవారికి; నానావర్ణ+ఆశ్రమములకును= అనేక విధములైన వర్ణాశ్రమాలకు, గోవులకును= ఆవులకు; నీకున్= నీకు; నాకున్= నాకు; బాధ+అనుచున్= దుఃఖమనుచు; కుందెదన్= దుఃఖిస్తున్నాను.

తా : ఓ పుణ్యాత్ముడా! ఈ కలియుగంలో ఒకరికననేల? దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, ధైర్యవంతులకు, వర్ణ ధర్మాలు, ఆశ్రమ ధర్మాలు ఆచరించేవారికి, గోవులకు, నీకు, నాకు బాధలు పడే కాలం ప్రాప్తించెనే అని దుఃఖిస్తున్నాను.

**సీ. బ్రహ్మాదు లెవ్వని భద్రకటాక్ష వీక్షణము వాంఛింతురు సత్తపములఁ**
**గమలాలయము మాని కమల యెవ్వని పాద కమలంబు సేవించుఁ గౌతుకమునఁ**
**బరమ యోగీంద్రులు భవ్య చిత్తములందు నిలుపుదు రెవ్వని నియతితోడ**
**వేదంబు లెవ్వని విమలచారిత్రముల్ వినుతింపఁగా లేక వెగడు వడియె**

**ఆ. నట్టి వాసుదేవు నబ్జ వజ్రాంకుశ, చక్ర మీన శంఖ చాప కేతు**
**చిహ్నితంబులైన శ్రీచరణము లింక సోఁకవనుచు వగపు సోఁకె నయ్య! 405**

ప్రతి : అయ్య!= తండ్రీ!; ఎవ్వని= ఎవనియొక్క; భద్రకటాక్షవీక్షణము= శుభమైన కడగంటిచూపు; సత్+తపములన్= మంచి తపస్సులతో; బ్రహ్మ+ఆదులు= బ్రహ్మ మొదలైనవారు; వాంఛింతురు= కోరుతారో; ఎవ్వని= ఎవనియొక్క; పాదకమలంబు= పాదపద్మము; కౌతుకమునన్= కుతూహలంతో; కమల+ఆలయమున్= తన నివాసమగు తామరను; మాని= వీడి; కమల= లక్ష్మి; సేవించున్= సేవించునో; ఎవ్వనిన్= ఎవనిని; నియతితోడన్= నియమంతో; భవ్య చిత్తములందున్= పవిత్రములైన హృదయాలలో; పరమయోగి+ఇంద్రులు= శ్రేష్ఠులైన యోగీశ్వరులు; నిలుపుదురు= నిలుపుతారో; ఎవ్వని= ఎవనియొక్క; విమలచారిత్రముల్= నిర్మలమైన చరిత్రలు (ప్రవర్తనములు); వినుతింపన్+కాన్+లేక= స్తోత్రము చేయలేక; వేదంబులు= శ్రుతులు; వెగడు+పడియెన్= మౌనము వహించునో; అట్టి= అటువంటి; వాసుదేవు= శ్రీకృష్ణునియొక్క; అబ్జ వజ్ర+అంకుశ, చక్ర మీన, శంఖ, చాప, కేతు, చిహ్నితములు+ఐన= పద్మరేఖ, వజ్రరేఖ, అంకుశరేఖ, చక్రరేఖ, మత్స్యరేఖ, శంఖరేఖ, ధనూరేఖ, పతాకరేఖల గుర్తులుంచబడినవి అగు; శ్రీచరణములు= సంపదలిచ్చు పాదములు; ఇంకన్= ఇకమీద; సోఁకవు= స్పృశింపవు; అనుచున్= అనుచు; వగపు= శోకము; సోఁకెన్= తాకినది, స్పృశించినది.

తా : తండ్రీ! బ్రహ్మాది దేవతలు ఎంతోకాలం తపస్సు చేసి ఏ దేవుని శుభప్రదమైన కడగంటిచూపు కాంక్షింతురో, పద్మాలయ అయిన లక్ష్మీదేవి తన నివాసాన్ని కూడా విడిచి ఎంతో కుతూహలంతో ఏ దేవదేవుని పాదపద్మాలు ఆరాధిస్తున్నదో, పరమనిష్ఠాగరిష్ఠులైన మునిశ్రేష్ఠులు తమ పవిత్ర హృదయ పీఠికలపై ఏ దేవుని పావన స్వరూపాన్ని నియమపూర్వకంగా నిలుపుకొంటున్నారో, సమస్త వేదాలు ఏ దేవుని దివ్యచరిత్రలు సరిగా వర్ణింపజాలక విస్మయం వహిస్తున్నాయో, అట్టి దేవాదిదేవుడైన వాసుదేవుని పద్మ, వజ్ర, అంకుశ, శంఖ, చక్ర, చాప, మత్స్య ధ్వజ రేఖలతో అలంకరింపబడిన శ్రీచరణము లికమీద నా మీద సోకవు గదా! అని శోకం చెందుతున్నాను.

**విశే :** సీసంలోని మూడు నాలుగు పాదములకు మూలము గాని వ్యాఖ్యానంగాని లేదు. ఇవి పూర్తిగా పోతన కల్పించినవి. యోగులకు వేదములకు ఇందు ప్రాధాన్యము. భగవంతుని తెలియుటకు ఏ ప్రమాణములు ముఖ్యమైనవో వాని ప్రాముఖ్యమును పోతన తాను కల్పించిన రెండు పాదములలో ఎంతో రమ్యముగా ప్రతిపాదించినాడు.

**క. హరిపాదంబులు సోఁకెడి, సిరికతమున నఖిలభువనసేవ్యత్వముతో**
**స్థిర నైతి నిన్ని దినములు, హరి నా గర్వంబు మాన్చి యరిగె మహాత్మా! 406**

**ప్రతి :** మహాత్మా!= ఓ మహానుభావా!; హరిపాదంబులు= విష్ణుని పాదములు; సోఁకెడి= స్పృశించెడి; సిరికతమునన్= సంపద కారణంగా; అఖిల భువన సేవ్యత్వముతోన్= సమస్త లోకాలు సేవింపదగిన స్థితిలో; ఇన్ని దినములు= ఇన్నాళ్లు; స్థిరన్+ఐతిన్= స్థిరత్వమును పొందినాను; హరి= విష్ణువు; నాగర్వంబు= నా అహంకారము; మాన్చి= పోగొట్టి; అరిగెన్= వెడలినాడు.

**తా :** మహాత్మా! భగవంతుని పాదపద్మాలు సోకగలిగే మహాభాగ్యం మూలంగానే నేను అఖిల లోకాలకు ఆరాధ్యురాలనై ఎంతో సంతోషించి పొంగి పులకించినాను. ఆ ప్రభువు నా అభిమానపూర్వక గర్వాన్ని సర్వమూ అంతంచేసి అంతర్థానమయినాడు.

**క. లీలాకారము దాల్చెను, శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో**
**న్మూలనము సేయుకొఱకును, నాలుగు పాదముల నిన్ను నడిపించుటకున్. 407**

**ప్రతి :** శ్రీలలనా+ఈశుండు= లక్ష్మీనాథుడైన మహావిష్ణువు; ఖలులన్= దుష్టులను; శిక్షించి= దండించి; భవ+ఉత్+మూలనము= సంసార నిర్మూలనం; చేయుకొఱకును= చేయుటకు; నాలుగు పాదములన్= నాలుగు పాదాలతో; నిన్నున్= నిన్ను; నడిపించుటకున్= నడిచేట్లు చేయటానికి; లీలా+ఆకారమున్+తాల్చెను= లీలామానుష దేహాన్ని ధరించినాడు.

**తా :** శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ శిష్టరక్షణ గావించి, సంసారబంధాలను పెకలించటం కొఱకు, ధర్మస్వరూపుడవైన నిన్ను నాలుగు పాదాలతో నడిపించటానికి లీలామానుష రూపం ధరించినాడు.

**ఉ. ఆ మధురోక్తు లా నయము లా దరహాసము లా దయారసం**
**బా మురిపంబు లా తగవు లా గమనక్రియ లా మనోహర**
**ప్రేమకరావలోకనము ప్రీతిఁ గనుంగొనలేమి మాధవుం**
**గామిను లేల? నిర్దళితకర్ములు యోగులుఁ బాయ నేర్తురే! 408**

**ప్రతి :** ఆ మధుర+ఉక్తులు= ఆ తీయని మాటలు; ఆ+నయములు= ఆ నీతి మార్గములు; ఆ+దరహాసములు= ఆ చిరునవ్వులు; ఆ+దయారసంబు= ఆ దయ (కరుణ)ను అనుభవింపజేయుట; ఆ+మురిపంబులు= ఆ ముద్దు ముచ్చటలు; ఆ+తగవులు= ఆ ప్రణయ కలహములు, న్యాయపు తీరులు; ఆ గమనక్రియలు= ఆ అందపు నడకల రీతులు; ఆ మనోహర ప్రేమకర+అవలోకనము= ఆ మనస్సును హరించు ప్రేమను పుట్టించే చూపులు; ప్రీతిన్= ఇష్టంతో; కనుంగొనలేమిన్= చూడలేకపోవటంచేత; మాధవున్= శ్రీకృష్ణుని; కామినులు+ఏల?= కేవలం కామముగల స్త్రీలే ఏల?; నిర్దళిత+కర్ములు= చీల్చబడిన కర్మబంధములు కలవారు; యోగులున్= యోగులును; పాయన్ నేర్తురే?= విడిచిపెట్టగలరా?

**తా :** మాధవుని లీలలు మరచిపోలేనివి. ఆ తీయతీయని మాటలు, ఆ నీతిమార్గములు, ఆ చిరునవ్వులు, ఆ కనికరాలు, ఆ ముద్దుమురిపాలు, ఆ ప్రణయ కలహాలు, ఆ సురుచిరమందయానాల సొంపులు, మనస్సులను హరించే ఆ దివ్యమధుర కటాక్షవీక్షణాలు ఇక చూడజాలమేమో? అనే విచారంతో ఒక్క స్త్రీ లేమిటి, సర్వసంగ పరిత్యాగులైన యోగులు కూడా ఆ దయామయుని వియోగాన్ని సహించలేరు.

**క. మెల్లన నాపై యాదవ, వల్లభుఁ డడుగిడఁగ మోహవశనై నే రం**
**జిల్లఁగ రోమాంచము క్రియ, మొల్లములై మొలచు సస్యములు మార్గములన్. 409**

**ప్రతి :** యాదవవల్లభుఁడు= యాదవులకు ప్రేమపాత్రుడు; మెల్లన= మెల్లగా; నాపైన్= నామీద; అడుగిడఁగన్= పాదము ఉంచగా; నేన్= నేను; మోహవశను+ఐ= మోహంతో ఒడలు మరచినదాననై; రంజిల్లఁగన్= సంతోషింపగా; రోమాంచము+ క్రియన్= గగుర్పాటువలె; మొల్లములు+ఐ= దట్టములై; సస్యములు= పైరుపచ్చలు; మార్గములన్= బాటల్లో; మొలచున్= మొలకెత్తును.

**తా :** ఆ గోపికావల్లభుడు నాపై మెల్లమెల్లగా అడుగు లిడి నడిచేటప్పుడు నా ఒడలెల్ల పారవశ్యంతో గగుర్పాటు చెందేది. ఆ సందర్భంలో నా శరీరం నిండా మొలచిన పులకాంకురాలు దట్టంగా పైరు మొలచినట్లు అడుగడుగునా దారి వెంబడి పొడచూపేది.

**వ. అని యిట్లు పూర్వవాహిని యైన సరస్వతీతీరంబున ధర్మదేవుండును భూమియు వృషధేనురూపంబుల భాషింప రాజర్షియైన పరీక్షిద్భూవరుండు డగ్గఱియె; నా సమయమున. 410**

**ప్రతి :** అని= ఈ ప్రకారము; ఇట్లు= ఈ విధంగా; పూర్వవాహిని+ఐన= తూర్పునకు ప్రవహించే; సరస్వతీ తీరంబునన్= సరస్వతి నది ఒడ్డున; ధర్మదేవుండును= ధర్మదేవుడు; భూమియున్= భూదేవియు; వృషభ, ధేను, రూపంబులన్= ఎద్దు, ఆవు రూపాలలో; భాషింపన్= మాటాడగా; రాజర్షి+ఐన= రాజ ఋషియైన; పరీక్షిత్+భూవరుండు= పరీక్షిన్మహారాజు; డగ్గఱియెన్= సమీపించెను; ఆ సమయంబునన్= ఆ వేళలో...

**తా :** ఈ విధంగా ఎద్దు ఆవు రూపాలలో ఉన్న ధర్మదేవుడు భూదేవి తూర్పు వైపు పారే సరస్వతి నది ఒడ్డున మాటాడుకొనే సమయంలో అచ్చటికి రాజర్షి పరీక్షిన్మహారాజు విచ్చేసినాడు. అప్పుడు

## ❖ కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట ❖

**శా. కైలాసాచల సన్నిభంబగు మహాగంభీర గోరాజముం**
**గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండు జం**
**ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం గారుణ్య నిర్ముక్తుఁడై**
**నేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా నిర్ఘాతపాదాహతిన్. 411**

**ప్రతి :** కాలక్రోధుఁడు= యమునివలె కోపం కలవాడు; దండహస్తుఁడు= కఱ్ఱ చేతియందు గలవాడు; నృప+ఆకారుండు= రాజు వేషము ధరించినవాడు; క్రూరుండు= పరులను పీడించేవాడు; జంఘాలుండు= బలమైన పిక్కలతో మిక్కిలి వడిగా నడిచేవాడు; శూద్రుఁడు ఒక్కఁడు= శూద్రుడు ఒకడు; ఆసురగతిన్= రాక్షసుని విధంగా; కారుణ్య నిర్ముక్తుఁడు+ఐ=

దయను పూర్తిగా విడిచినవాడై; నిర్ఘాత+పాద+ఆహతిన్= పిడుగువంటి కాలితాపుతో; కైలాస+అచల సన్నిభంబు= కైలాస పర్వతమునకు సమానమైనది; అగు= అయినట్టి; మహా+గంభీర గోరాజమున్= గంభీరంగా ఎత్తుగా ఉన్న శ్రేష్ఠమైన ఎద్దును; నేలన్+కూలఁగన్= నేలపై కూలబడగా; పంచితిలఁగాన్= మూత్రం విసర్జించేటట్లు; తన్నెన్= తన్నినాడు.

**తా :** కైలాస పర్వతంవలె తెల్లగా గంభీరంగా ఎత్తుగా ఉన్న శ్రేష్ఠమైన వృషభాన్ని, కాలునివలె క్రోధం కలవాడు, కఠోరచిత్తుడు, దండహస్తుడు, రాజవేషధారి, బలిష్ఠమైన పిక్కలతో వడివడిగా నడిచేవాడు ఐన ఒక శూద్రుడు కటిక రాక్షసునివలె కనికరం లేకుండా త్వరత్వరగా వచ్చి కాలితో తన్నినాడు. పిడుగుపాటువంటి ఆ తన్నుకు ఆ ఎద్దు నేలమీద కూలబడింది. మూత్ర విసర్జన చేసింది.

**వ. మఱియును. 412**

**ప్రతి :** మఱియును= ఇంకను.

**తా :** వాడు అంతటితో ఊరకుండలేదు.

**శా. ఆలోలాంగక నశ్రుతోయకణ జాలాక్షిన్ మహాంభారవన్**
**బాలారూఢ తృణావళీకబళలోభ వ్యాప్త జిహ్వాగ్ర నాం**
**దోళస్వాంత నజీవవత్స నుదయద్దుఃఖాన్వితన్ ఘర్మ కీ**
**లాలాపూర్ణ శరీర, నా మొదవు నుల్లంఘించి తన్నెన్ వడిన్. 413**

**ప్రతి :** ఆలోల+అంగకన్= మిక్కిలి చలించే అవయవాలు కలది; అశ్రు, తోయ, కణ, జాల+అక్షిన్= కంటి నీటి బిందువుల సమూహం కల కన్నులు కలది; మహా+అంభారవన్= పెద్దగా అంబా అని అరచే దాన్ని; బాల+ఆరూఢ= లేతగా మొలకెత్తిన; తృణ+ఆవళీ+కబళ+లోభ+వ్యాప్త జిహ్వా+అగ్రన్= గడ్డిపరకల మొత్తపు ముద్దయందలి లోభంచే, చాపిన నాలుకయొక్క చివరిభాగం కలదీ; ఆందోళన స్వాంతన్= సంశయించే మనస్సు కలదీ; అజీవవత్సన్= చనిపోయిన దూడకలదీ; ఉదయత్+దుఃఖ+అన్వితన్= పుట్టుచున్న (ఉబికి వచ్చుచున్న) దుఃఖం కలదీ; ఘర్మ కీలాల+ఆపూర్ణ+శరీరన్= చెమట నీటితో మిక్కిలి నిండిన దేహం కలదీ ఐన; ఆ+మొదవున్= ఆ ఆవును; ఉల్లంఘించి= ఎగిరిదూకి; వడిన్= వేగంగా; తన్నెన్= తన్నినాడు.

**తా :** ఒడలెల్ల గడగడ వడకుతూ కన్నుల వెంబడి ఏకధారగా కన్నీరు కారుస్తూ ఉన్నదానిని, గొంతెత్తి గట్టిగా 'అంబా' అని అరచే దానినీ, జంపుగా పెరిగిన లేత పచ్చికను మేయటానికి నాలుక చాచిన దానినీ, చెదరిన గుండె కలదానినీ, లేగదూడ లేక ఒంటరిగా ఉన్నదానినీ, పొంగిపొరలి వచ్చే ఏడ్పు కలదానినీ చెమటనీటితో నిండిన దేహం కలదీ భయోపేత అయినదీ ఐన ఆ గోమాతను ఆ పాపాత్ముడు పైకెగిరి వడిగా తన్నినాడు.

**వ. ఇ ట్లా ధేనువృషభంబులు రెంటిం గంటకుండై తన్నుచున్న రాజ లక్షణ ముద్రితుం దయిన శూద్రునిం జూచి సువర్ణ పరికర స్యందనారూఢుండగు నభిమన్యునందనుండు గోదండంబు సగుణంబు సేసి మేఘగంభీర రవంబులగు వచనంబుల నిట్లనియె. 414**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఆ ధేను వృషభంబులు+రెంటిన్= ఆ గోవును, ఎద్దును రెండింటిని; కంటకుండు+ఐ= బాధ పెట్టుతున్నవాడై; తన్నుచున్న= కాలితో తన్నుతున్న; రాజలక్షణ+ముద్రితుండు+అయిన= రాజలక్షణాలచే ముద్రింపబడినవాడైన; శూద్రునిన్+చూచి= శూద్రుడైన కలిని కనుగొని; సువర్ణ, పరికర, స్యందన+ఆరూఢుండు+అగు= బంగారు ఉపకరణాలతో చేసిన రథాన్ని ఎక్కినవాడైన; అభిమన్యునందనుండు= అభిమన్యుని కొడుకు పరీక్షిత్తు; కోదండంబు= విల్లు; సగుణంబు+చేసి= అల్లెత్రాటి నెక్కించి; మేఘగంభీర, రవంబులు+అగు= మేఘంవలె గంభీరములైన శబ్దాలు కలవి అగు; వచనంబులన్= వాక్కులతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికినాడు.

**తా :** ఈ విధంగా ఆ ఎద్దును ఆవును రెండింటిని తన ఎదుటనే కాలితో తన్నుచున్న రాజలాంఛనాలు గల కంటకుడైన శూద్రుని చూచి, కాంచన రథారూఢుడై ఉన్న పరీక్షిన్నరేంద్రుడు విల్లెక్కుపెట్టి మేఘ గంభీర వాక్కులతో ఈ విధంగా అన్నాడు.

**శా. నిన్నుం గొమ్ములఁ జిమ్మెనో? కదిసెనో? నిర్భీతివై గోవులం**
**దన్నం గారణమేమి? మద్భుజసనాథక్షోణి నే వేళలం**
**దు న్నేరంబులు సేయ రా; దెఱుఁగవా ధూర్తత్వమున్ భూమిభృ**
**త్సన్నాహంబు నొనర్చె దెవ్వఁడవు? నిన్ శాసించెదన్ దుర్మతీ! 415**

**ప్రతి :** దుర్మతీ!= దుష్టమైన మనస్సు కలవాడా!; నిన్నున్= నిన్ను; కొమ్ములన్= కొమ్ములతో; చిమ్మెనో?= పొడిచిందా?; కదిసెను+ఓ= నిన్ను సమీపించి మార్కొన్నదా?; నిర్భీతివి+ఐ= భయం లేనివాడవై; గోవులన్= ఎద్దును, ఆవును; తన్నన్= తన్నుటకు; కారణము+ఏమి= హేతువేమి; మత్+భుజ+సనాథక్షోణిన్= నా బాహువులచే రక్షణ పొందుతున్న భూమియందు; ఏ వేళలందున్= ఎటువంటి సందర్భాల్లోనూ; నేరంబులు= అపరాధములు; చేయన్‌రాదు= ఆచరింపగూడదు; ఎఱుఁగవా?= తెలియవా?; ధూర్తత్వమున్= మోసమును; భూమి+భృత్+సన్నాహంబున్= రాజువలె ప్రయత్నాన్ని అనగా ఆటోపం చూపటాన్ని; ఒనర్చెదు= చేస్తున్నావు; ఎవ్వఁడవు?= నీవెవ్వడవు?; నిన్= నిన్ను; శాసించెదన్= శిక్షించెదను.

**తా :** దుర్మతీ! ఎవడవురా నీవు? నిన్ను కొమ్ములతో పొడిచిందా? నిన్నెదుర్కొన్నదా? ఏ పాపమూ ఎరుగని ఈ గోవులను అన్యాయంగా ఎందుకు తన్నినావు? నా భుజాదండంతో సంరక్షింపబడే ఈ భూమండలంలో ఎప్పుడు ఎవ్వరు ఎట్టి నేరాలు చేయరాదని నీకు తెలియదా? మోసపు వేషాన్ని ధరించి ఇప్పుడు ఇక్కడ రాజువలె రాజసం ఒలకబోస్తున్నావు? నిన్ను కఠినంగా శిక్షిస్తాను.

**క. గాండీవియుఁ జక్రియు భూ, మండలిఁ బెడఁబాసి చనిన మదమత్తుఁడవై**
**దండింపఁ దగని వారల, దండించెదు నీవ తగుదు దండనమునకున్. 416**

**ప్రతి :** గాండీవియున్= అర్జునుడును; చక్రియున్= శ్రీకృష్ణుడును; భూమండలిన్= భూమండలమును; పెడఁబాసి= ఎడబాసి; చనినన్= పోగా; మద మత్తుఁడవు+ఐ= క్రొవ్వుచే మదించినవాడవై; దండింపన్= దండించటానికి; తగని వారలన్= అర్హులు కానివారిని సాధువులను; దండించెదు= శిక్షిస్తున్నావు; నీవు+అ= నీవే; దండనమునకున్= శిక్షకు; తగుదు= తగి ఉన్నావు.

**తా :** గాండీవాన్ని ధరించిన అర్జునుడు, చక్రాన్ని ధరించిన శ్రీకృష్ణుడు ఈ భూమండలాన్ని విడిచివెళ్లగానే, నీవు మదంచే ఉన్మత్తుడవై దండింప తగని సాధువులను దండిస్తున్నావు. నీవే దండనార్హుడవు, నీకిప్పుడు ప్రచండమైన రాజదండన తప్పదు.

**వ. అని వృషభంబు నుద్దేశించి యిట్లనియె. 417**

**ప్రతి :** అని= ఆ విధంగా పలికి; వృషభంబున్+ఉద్దేశించి= ఎద్దునుద్దేశించి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అనినాడు.

**తా :** అని పలికి పరీక్షిన్మహారాజు ఎద్దునుచూచి ఈ విధంగా అన్నాడు.

**మ. కురుధాత్రీశ్వర బాహు వప్ర యుగళీ గుప్తక్షమా మండలిం**
**బరికింపన్ భవదీయనేత్రజనితాంభశ్శ్రేణిఁ దక్కన్ జనుల్**
**దొరఁగం జేయ రధర్మసంజనిత జంతుశ్రేణి బాష్పంబులన్**
**గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తిదేవోత్తమా! 418**

**ప్రతి :** గోమూర్తిదేవోత్తమా!= వృషభరూపంలో ఉన్న ఉత్తముడవైన ఓ ధర్మదేవా!; కురుధాత్రీ+ఈశ్వర= కురువంశపు రాజుల; బాహు వప్ర యుగళీ= బాహువులనే ప్రాకారాల జంటచే; గుప్త+క్షమామండలిన్= రక్షింపబడిన భూమండలమును; పరికింపన్= వీక్షింపగా; భవదీయ నేత్ర= నీ కన్నులనుండి పుట్టిన; అంభస్+శ్రేణిన్+తక్కన్= నీటిజాలును తప్ప; జనుల్= ప్రజలు; తొరఁగన్+చేయరు= స్రవించేట్లు చేయరు; అధర్మ+సంజనిత= అధర్మంచే పుట్టింపబడిన; జంతు శ్రేణి బాష్పంబులన్= జీవసమూహపు కన్నీటిని; గురుశక్తిన్= గొప్ప సామర్థ్యంతో; ఇతనిన్= ఈ కలిని; విదళింతున్= చీల్చెదను; చూడుము= కనుగొనుము.

**తా :** ఈ వృషభరూపంలో ఉన్న శ్రేష్ఠుడవైన ధర్మదేవా! కురువంశ క్షత్రియుల బాహుదండాలనే కోటగోడల నడుమ సురక్షితమై ఉన్న ఈ భూమండలంలోని ప్రజలు నీ కన్నులనుండి జాలువారే కన్నీటి ధారలు తప్ప అధర్మ బాధితులైన మరి యే ఇతర జీవుల కన్నీటిధారలు ఇంతవరకు చూచి ఎరుగరు. ఇదిగో చూడు. ఇప్పుడే ఈ దుర్మార్గుణ్ణి పటిష్ఠమైన నా పరాక్రమంతో చీల్చి చెండాడుతాను.

**క. జాలిఁ బడ నేల? నా శర, జాలంబుల పాలు సేసి చంపెద వీనిన్**
**భూలోకంబున నిపుడే, నాలుగు పాదముల నిన్ను నడిపింతుఁ జుమీ! 419**

**ప్రతి :** జాలిన్+పడన్+ఏల?= దిగులు పొందనేల?; నా+శరజాలంబుల= నా బాణసమూహముల; పాలు+చేసి= స్వాధీనం అయ్యేట్లు చేసి; వీనిన్= ఇతనిని; చంపెదన్= హతమార్చెదను; ఇపుడు+ఏ= ఈ క్షణమే; భూలోకంబునన్= భూలోకంలో; నిన్నున్+నిన్ను; నాలుగు పాదములన్= నాలుగుకాళ్లతో; నడిపింతున్+చుమీ= నడిచేట్లు చేస్తాను సుమా!

**తా :** ఓ ధర్మస్వరూపా! నీవు దిగులు పడవద్దు. నా బాణపరంపరలతో ఈ పాపాత్ముని రూపుమాపుతున్నాను. నిన్ను ఇప్పుడే ఈ భూమిపై నాలుగుపాదాలతో నడిపిస్తాను సుమీ!

**ఉ. వాచవియైన గడ్డిఁ దిని వాహినులందు జలంబు ద్రావఁగా**
**నీ చరణంబు లెవ్వఁడిటు నిర్దళితంబుగఁ జేసె; వాఁడు దా**

**ఖేచరుఁడైన, వాని మణి కీలిత భూషణ యుక్త బాహులన్**
**వే చని త్రుంచివైతు వినువీథికి నేగిన నేల డాఁగినన్.** **420**

**ప్రతి :** వాచవి+ఐన= నోటికి రుచియైన; గడ్డిన్= తృణసముదాయమును; తిని= భుజించి; వాహినులందున్= నదులయందు; జలంబున్= నీటిని; త్రావఁగాన్= త్రాగుతుండగా; ఎవ్వఁడు= ఎవడు; నీ చరణంబులు= నీ కాళ్లు; ఇటు= ఈ విధంగా; నిర్దళితంబుగన్+చేసెన్= బ్రద్దలగునట్లు చేసెనో; వాఁడు= అతడు; తాన్= తాను; ఖేచరుఁడు+ఐనన్= ఆకాశంలో తిరిగేవాడైనా; వాని= అతనియొక్క; మణి+కీలిత+భూషణయుక్త= రత్నములు తాపిన ఆభరణములతో కూడిన; బాహులన్= చేతులను; వే= వేగంగా; చని= వెళ్ళి; వినువీథికిన్= ఆకాశమార్గానికి; ఏగినన్= పోయినా; నేలన్= భూమిలో; దాఁగినన్= కనిపింపక మరుగుపడినా; త్రుంచివైతున్= ఖండిస్తాను.

**తా :** నీవు నీ నోటికి రుచించే పచ్చిగడ్డిని అడవులలో మేసి, అక్కడనే నదుల్లో స్వచ్ఛమైన నీరు త్రాగి స్వేచ్ఛగా జీవిస్తుండగా ఏ పాపాత్ముడు నీ పాదాలు ఈ విధంగా విరుగగొట్టినాడో వాడు ఖేచరుడయినా, భూచరుడైనా నింగిపైకి పారినా, నేలలోకి దూరినా ఆ దుష్టుని మణికంకణ మండితములైన రెండుచేతులనూ ఇప్పుడే ముక్కలు ముక్కలుగా ఖండించి వేస్తాను.

**వ. అని మఱియు గోరూప యయిన భూదేవితో నిట్లనియె.** **421**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; మఱియున్= ఇంకను; గోరూప+అయిన= ఆవురూపమున గల; భూదేవితోన్= భూదేవితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనినాడు.

**తా :** అని పలికి పరీక్షిత్తు గోరూపధారిణియగు భూదేవితో ఈ విధంగా అన్నాడు.

**చ. అగణితవైభవుం డగు మురాంతకుఁ డక్కట! పోయె నంచు నె**
**వ్వగలఁ గృశించి నేత్రముల వారికణంబులు దేకు మమ్మ! లో**
**బెగడకు మమ్మ! మద్విశిఖబృందములన్ వృషలున్ వధింతు నా**
**మగఁటిమిఁ జూడవమ్మ! వెఱ మానఁ గదమ్మ! శుభప్రదాయినీ!** **422**

**ప్రతి :** శుభప్రదాయినీ!= శుభములనిచ్చుదానా! (భూదేవీ!); అగణిత+వైభవుండు+అగు= లెక్కపెట్టరాని వైభవము కలవాడైన; ముర+అంతకుఁడు= మురుడు అను రాక్షసుని నాశనంచేసిన శ్రీకృష్ణుడు; పోయెను= (భూలోకాన్ని వీడి వైకుంఠానికి) వెళ్లినాడు; అక్కట!= అయ్యో!; అంచున్= అని తలుస్తూ; నెఱ+వగలన్= నిండు దుఃఖంతో; కృశించి= చిక్కిపోయి; నేత్రములన్= కన్నులలో; వారి కణంబులు= నీటి బిందువులు; తేకుము+అమ్మ!= తేవలదు తల్లీ!; లో బెగడకుము+అమ్మ!= లోపల దుఃఖపడకుము అమ్మా!; మత్ విశిఖ బృందములన్= నా బాణాల సమూహాలతో; వృషలున్= శూద్రుడైన కలిని; వధింతున్= చంపుతాను; నా+మగఁటిమిన్= నా శౌర్యాన్ని; చూడవమ్మ= చూడుము తల్లీ!; వెఱన్= భయమును; మానన్+కద+అమ్మ!= విడువుమమ్మా!

**తా :** అమ్మా! కల్యాణదాయినివైన ఓ భూదేవీ! అనంతవైభవాలు గల శ్రీకృష్ణస్వామి ఈ లోకాన్ని వదలి వెళ్లినాడనే ఆవేదనతో కృశించి కన్నీరు మున్నీరుగా ఏడువకు తల్లీ! మనసులో దిగులు పడవద్దు. భయాన్ని వీడు. నా బాణాలతో వాని నిప్పుడే నేలకూల్చివేస్తాను చూడు తల్లీ!

**క. సాధువులగు జంతువులకు, బాధలు గావించు ఖలుల భంజింపని రా**
**జాధము నాయుస్స్వర్గ, శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ! 423**

**ప్రతి :** తల్లీ= అమ్మా! భూదేవీ; సాధువులు+అగు= హింస ఎరుగని చక్కని మంచిస్వభావం కల; జంతువులకున్= జీవులకు; బాధలు= కష్టాలు; కావించు= కలిగించే; ఖలులన్= దుష్టులను; భంజింపని= నాశనం చేయని; రాజ+అధము= రాజులలో నీచుడైనవాని; ఆయుస్ స్వర్గ+శ్రీధనములు= ఆయుస్సు, స్వర్గసుఖములు, ఐశ్వర్యం, ధనములు; వీటిఁబోవున్= వ్యర్థములై పోవును; సిద్ధము= యథార్థము.

**తా :** తల్లీ! నిరపరాధులైన సాధువులను బాధించి వేధించే దుర్మార్గులను రాజైనవాడు తప్పక శిక్షించి తీరవలెను. అలా శిక్షింపక ఉపేక్షిస్తే ఆ రాజాధముని ఆయుస్సు, ఐశ్వర్యం స్వర్గసుఖంతో కూడ సర్వమూ వ్యర్థం. ఇది ముమ్మాటికి యథార్థం.

**క. దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్**
**స్రష్ట విధించెఁ బురాణ, ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ! 424**

**ప్రతి :** సాధ్వీ= సాధుశీలం కలదానా!; దుష్ట జన నిగ్రహంబును= దుర్మార్గులైన జనులను అదుపులో ఉంచుటయు; శిష్ట+జన+అనుగ్రహంబున్= మంచివారైన జనులను అనుగ్రహించుటయు; చేయఁగన్= ఒనరించుటకై; స్రష్ట= సృష్టికర్త (బ్రహ్మ); నృపులన్= రాజులను; విధించెన్= నియమించెను; పురాణద్రష్టలు= ప్రాచీన సంప్రదాయములు ఎరిగినవారు; చెప్పుదురు= వక్కాణింతురు; పరమధర్మము= (ఇది) మహాశ్రేష్ఠమైన ధర్మము.

**తా :** సాధ్వీమణివైన ఓ పృథ్వీమాతా! బ్రహ్మదేవుడు దుష్టశిక్షణకు శిష్టరక్షణకు ప్రభువులను సృష్టించెనని ప్రాచీనులైన శాస్త్రవేత్తలు చెపుతున్నారు. కావున రాజునైన నాకు ఆర్తరక్షణ అనేది పరమధర్మం.

**వ. అనిన ధర్మనందన పౌత్రునకు వృషభమూర్తినున్న ధర్మదేవుం డిట్లనియె. 425**

**ప్రతి :** అనిన= అని పలికిన; ధర్మనందన పౌత్రునకున్= ధర్మజుని మనుమడైన పరీక్షిత్తునకు; వృషభమూర్తిన్+ఉన్న= ఎద్దు రూపంలో ఉన్న; ధర్మదేవుండు= ధర్మదేవుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ఇట్లు పలికిన ధర్మనందనుని మనుమడగు పరీక్షిత్తుకు ఎద్దురూపంలో ఉన్న ధర్మదేవుడు ఈ విధంగా అన్నాడు.

**ఉ. క్రూరులఁ జంపి, సాధువులకున్ విజయం బొనరించునట్టి యా**
**పౌరవ వంశజాతుఁడవు భాగ్యసమేతుఁడ వౌదు తొల్లి మీ**
**వా రిటువంటి వా రగుట వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్య సం**
**చారము సేసెఁ గాదె నృపసత్తమ! భక్తిలతానిబద్ధుఁడై. 426**

**ప్రతి :** నృపసత్తమ!= రాజులలో శ్రేష్ఠుడా!; క్రూరులన్= దుర్మార్గులను; చంపి= సంహరించి; సాధువులకున్= మంచివారికి; విజయంబు= విజయము (గెలుపు); ఒనరించు+అట్టి= కలిగించునట్టి; ఆ+పౌరవ వంశ జాతుఁడవు= ప్రసిద్ధమైన పౌరవ వంశమునందు పుట్టినవాడవు; భాగ్య సమేతుఁడవు+ఔదు= అదృష్టవంతుడవు అగుచున్నావు; తొల్లి= పూర్వం; మీవారు= మీ పూర్వులు; ఇటువంటివారు+అగుటన్= ఇట్టివారు అయినందువలన; వారిజనేత్రుఁడు= తామరలవంటి కన్నులు కలవాడైన

కృష్ణుడు; మెచ్చి= సంతోషించి; భక్తిలతానిబద్ధుఁడు+ఐ= భక్తి అనే తీగలచే కట్టబడినవాడై; దౌత్య సంచారము+చేసెన్+కాదె= దూతగా తిరుగుటను కావించెను గదా!

**తా :** రాజశ్రేష్ఠుడవైన పరీక్షిన్నరేంద్రా! నీవు దుర్జనులను నిగ్రహించి సజ్జనులను అనుగ్రహించే పురువంశంలో పుట్టినవాడవు. ఎంతో అదృష్టవంతుడవు. మీ పూర్వులింతటి ధర్మస్వరూపులగుట వలననే భగవంతుడైన శ్రీకృష్ణుడు మీ వారి భక్తికి ఎంతో సంతోషించి, దూతయై రాయబారం నిర్వహించినాడు.

**వ. నరేంద్రా! యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము; మావలన దుఃఖంబు నొందెదు పురుషుండు లేఁడు; వాదివాక్య భేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబు నాచ్ఛాదించి, తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభువని చెప్పుదురు. దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; మీమాంసకులు గర్మంబునకుం బ్రాభవంబుం బ్రకటింతురు;లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; ఇందెవ్వరికిని సుఖదుఃఖ ప్రదానంబు సేయ విభుత్వంబు లేదు; పరులవలన దుఃఖంబు వచ్చిన నధర్మంబు పరులు సేసిరని విచారింప వలదు; తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరునివలన సర్వంబు నగుచుండు ననిన ధర్మదేవునికి ధర్మనందన పౌత్త్రుం డిట్లనియె. 427**

**ప్రతి :** నరేంద్రా!= రాజా!; ఏము= మేము; ప్రాణులకున్= జీవులకు; దుఃఖహేతువులము+కాము= దుఃఖాన్ని కలిగించే కారణాలు కాజాలము; మా వలనన్= మా వలన; దుఃఖంబున్+ఒందెదు= దుఃఖాన్ని పొందే; పురుషుండు లేఁడు= జీవుడు లేడు; వాది+వాక్య భేదంబులన్= వాదించే వాని మాటల్లో గల వేరు వేరు విధాలచే; యోగి+ఈశ్వరులు= యోగి పుంగవులు; మోహితులు+ఐ= మోహింపబడినవారై; భేదంబున్+ఆచ్ఛాదించి= భేదబుద్ధిని కప్పిపుచ్చి; తమకున్= తమకు; ఆత్మసుఖదుఃఖంబులన్= సుఖాన్నీ, దుఃఖాన్నీ; ఇచ్చు+ప్రభువు= ప్రసాదించేది ఈశ్వరుడు; అని చెప్పుదురు= అని అంటారు; దైవజ్ఞులు= జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, గ్రహ దేవతా+ఆదులకున్= గ్రహములు, దేవతలు మొదలైనవానికి; ప్రభుత్వంబు= అధికారం; సంపాదింతురు= కలిగిస్తారు; మీమాంసకులు= కర్మకాండను విశ్వసించేవారు; కర్మంబునకున్= కర్మకు; ప్రాభవంబున్= ప్రాధాన్యాన్ని; ప్రకటింతురు= చాటుతారు; లోకాయతికులు= స్వభావానికి కర్తృత్వం చెప్పే చార్వాక మతంవారు; స్వభావంబునకున్= స్వభావానికి; ప్రభుత్వంబున్= అధికారాన్ని; సంపాదింతురు= గడింతురు; ఇందు+ఎవ్వరికిన్= దీనిలో ఎవ్వరికి కూడా; సుఖదుఃఖ ప్రదానంబు+చేయన్= సుఖాన్ని, దుఃఖాన్ని ఈయగల; విభుత్వంబు లేదు= ప్రాభవం లేదు; పరులవలనన్= ఇతరులవలన; దుఃఖంబు= దుఃఖము; వచ్చినన్= కలిగితే; అధర్మంబు= అధర్మమును; పరులు+చేసిరి+అని= ఇతరులు చేసినారని; విచారింపన్ వలదు= చింతింపవద్దు; తర్కింపను= వాదించుటకుగాని; నిర్దేశింపను= నిరూపించుటకుగాని; రాని= వీలుకాని; పరమ+ఈశ్వరుని వలనన్= సర్వేశ్వరుని వలన; సర్వంబు= అంతయును; అగుచుండున్= కలుగుచుండును; అనినన్= అని పలుకగా; ధర్మదేవునికిన్= ధర్మదేవునికి; ధర్మనందన పౌత్త్రుండు= ధర్మరాజు మనుమడైన పరీక్షిత్తు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** "రాజా! మేము ఇతర ప్రాణులను బాధపెట్టము. మా వలన ఏ ప్రాణికిగాని ఎట్టి ఆపద కలుగదు. నానావిధ వాదోపవాదాలకు సమ్మోహితులైన యోగీంద్రులు ఆత్మయే సుఖదుఃఖ కారకుడగు ప్రభువని అంటారు. దైవజ్ఞులు గ్రహాలకు, దేవతలకు ప్రభుత్వాన్ని ఆపాదిస్తారు. మీమాంసకులు కర్మ ప్రాధాన్యాన్ని అంగీకరిస్తున్నారు. స్వభావమే ప్రధానమన్న

లోకాయతికులు ప్రకృతికే ప్రాధాన్యమంటారు. కాని ఇందెవ్వరికి కూడా సుఖం దుఃఖం కలిగిందని, మరి ఎవరో కీడు చేసినారని తలంచుట పొరపాటు. బుద్ధికి మనస్సుకు అతీతుడైన పరమేశ్వరుని వల్లనే సర్వమూ నిర్వహింపబడుతుంది" అని పలికిన ధర్మదేవతతో ధర్మరాజు మనుమడైన పరీక్షిత్తు ఈ విధంగా అన్నాడు.

**ఆ. ధర్మమూర్తి వయ్య ధర్మజ్ఞ వృషరూప, పరమధర్మ మీవు పలుకు త్రోవ**
**పాపకర్మ చేయు పాపంబు సూచింపఁ, బాపకర్ముఁ డేఁగు పథము వచ్చు. 428**

**ప్రతి :** ధర్మజ్ఞ!= ధర్మం తెలిసినవాడా!; వృషరూప!= ఎద్దు రూపంలో ఉన్నవాడా!; అయ్య!= అయ్యా!; ధర్మమూర్తివి= (నీవు) ధర్మస్వరూపుడవు; ఈవు= నీవు; పలుకుత్రోవ= చెప్పేదారి; పరమధర్మము= ఉత్కృష్టమైన ధర్మం; పాపకర్మి= పాపాత్ముడు; చేయు+పాపంబున్= చేసే పాపకార్యాన్ని; సూచింపన్= ప్రకటింపగా; పాపకర్ముఁడు= పాపాత్ముడు; ఏఁగు= పోవు; పథము వచ్చున్= దారియే కలుగుతుంది.

**తా :** ఎద్దు రూపంలో ఉన్న ఓ ధర్మజ్ఞుడా! నీవు ధర్మమూర్తివి. నీవు పలికే తీరు పరమధర్మం. పాపాత్ముడు చేసే పాపాన్ని తెలుపుటకు కూడా నీవు ఇష్టపడవు. పాపకర్ముల పాపాన్ని ప్రకటించే వారికి ఆ పాపఫలం తప్పక అంటుకొంటుందని పెద్దలు చెపుతారు.

**విశే :** అంతా పరమేశ్వరుని వల్లనే జరుగుతున్నదని తెలియవలె. అంతేగాని, ఇతరులవల్ల అపకారం కలిగిందని భ్రాంతి చెంది అతనిని నిందిస్తే చివరికి అదే మార్గంలో ఇతడు కూడ నడవడం జరుగుతుంది. అంటే అతని గతియే ఇతనికి కూడ పడుతుంది. సుఖదుఃఖాలు దైవగతివల్ల కలుగుతున్నాయని తెలియటం ఉత్తమమార్గం.

**వ. మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మానసంబులకు వధ్యఘాతుక లక్షణంబగు వృత్తి సులభంబునం దెలియరాదు; నీవు ధర్మదేవతవు; కృతయుగంబునం దప శ్శౌచ దయా సత్యంబులను నాలుగు నీకుం బాదంబు లని చెప్పుదురు; త్రేతాయుగంబునఁ బూర్వోక్తపాద చతుష్కంబునం దపశ్శౌచదయా సత్యంబులం దొక్క పాదంబు క్షీణం బయ్యె; ద్వాపరంబునం బాదద్వయంబు నశించెం; గలియుగంబందు నివ్వడువున నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నంబయ్యె, నవశిష్టంబగు భవదీయ చతుర్థ పాదంబున ధర్మంబు గల్యంతంబున నిగ్రహింప గమకించుచున్నయది, విను మదియునుంగాక. 429**

**ప్రతి :** మఱియున్= ఇంకను; దేవమాయ వలనన్= దేవుని మాయవలన; భూతంబుల= జీవుల; వాక్+మానసంబులకున్= వాక్కుకు, మనస్సుకు; వధ్య ఘాతుక లక్షణంబు+అగు= చంపదగినవాడు, చంపేవాడు అనే లక్షణాలు కల; వృత్తి= ప్రవర్తన; సులభంబునన్= తేలికగా; తెలియరాదు= గ్రహింప వీలుకాదు; నీవు= నీవు; ధర్మదేవతవు= ధర్మదేవతవు; కృతయుగంబునన్= కృతయుగములో; తపస్+శౌచ+దయాసత్యంబులు= తపస్సు, శుచిత్వం, దయ, సత్యం; అను నాలుగు= అనేవి నాలుగు; నీకున్= నీకు; పాదంబులు+అని= కాళ్లు అని; చెప్పుదురు= పెద్దలు చెబుతారు; త్రేతాయుగంబునన్= త్రేతాయుగంలో; పూర్వ+ఉక్త= ముందు చెప్పబడిన; పాదచతుష్కంబునన్= కాళ్ళు నాలుగింటిలో; తపస్+శౌచ దయా+సత్యంబులందున్= తపస్సు, శుచిత్వం, దయ, సత్యములలో; ఒక్కపాదంబు= ఒక పాదం; క్షీణంబు+అయ్యెన్= తగ్గుదల (కృశించినది) పొందింది; ద్వాపరంబునన్= ద్వాపరయుగంలో; పాదద్వయంబు= పాదముల జంట, రెండుపాదాలు; నశించెన్= క్షీణించెను; కలియుగంబందున్= కలియుగంలో; ఈ+వడువునన్= ఈ విధంగా; ఇప్పుడు= ఇపుడు; నీకున్=

నీకు; పాదత్రయంబు= మూడుకాళ్లు; భగ్నంబు+అయ్యెన్= విరిగిపోయెను; అవశిష్టంబు+అగు= మిగిలినట్టి; భవదీయ చతుర్థ పాదంబునన్= నీ నాల్గవ పాదంతో; ధర్మంబు= ధర్మము; కలి+అంతంబునన్= కలియుగం చివర; నిగ్రహింపన్= శిక్షించటానికి; గమకించుచున్+ఉన్న+అది= ప్రయత్నిస్తున్నది; వినుము= ఆకర్ణింపుము; అదియునున్+కాక= అంతేకాకుండా.

**తా :** వాక్కుకు, మనస్సుకు అతీతమైన దైవమాయవలన జీవులకు చంపదగినవాడు, చంపేవాడు అనే వీరిద్దరి స్వరూపం అంత సులువుగా తెలియదగింది కాదు. నీవు ధర్మదేవతవు. కృతయుగంలో నీకు తపము, శౌచం, దయ, సత్యం అనే నాలుగు పాదాలు ఉండినవని చెపుతారు. త్రేతాయుగంలో ఆ నాల్గింటిలో ఒకటి నశించింది. ద్వాపరయుగం రాగానే రెండు పాదాలు లోపించినవి. ఇప్పుడు కలియుగంలో మూడుపాదాలు భగ్నమైనవి. సత్యం ఒక్కటే మిగిలి ఉన్నది. దానిని కూడా కలియుగం చివరలో అధర్మం ఆక్రమించి శిక్షించటానికి కాచుకొని ఉన్నది. ఇదిగో ఇటు చూడు.

**మ. భరముం బాపి రమావిభుండు గరుణం బాదంబులం ద్రొక్కఁగా**
**స్థిరయై వేడుక నింతకాలము సుఖశ్రీ నొందె భూదేవి; త**
**చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్ శాసింతు రంచున్ నిరం**
**తర శోకంబున నీరు గన్నుల నిడెన్ ధర్మజ్ఞ! వీక్షించితే. 430**

**ప్రతి :** ధర్మజ్ఞ= ధర్మం తెలిసినవాడా!; రమావిభుండు= లక్ష్మీదేవి భర్త (విష్ణువు); భరమున్+పాపి= బరువును తొలగించి; కరుణన్= దయతో; పాదంబులన్= పాదాలతో; త్రొక్కఁగాన్= అదుమగా; భూదేవి= భూదేవత; స్థిర+ఐ= నిలుకడ కలదియై; వేడుకన్= సంతోషంతో; ఇంతకాలము= ఇప్పటిదాక, ఇంతకాలము; సుఖశ్రీ= సుఖసంపదను; పొందెన్= పొందినది; తద్+చరణ+స్పర్శము= ఆతని పాదాల స్పర్శ; లేమిన్= లేకుండుటచే; శూద్రకులజుల్= శూద్ర జాత్రిలో పుట్టినవారు; శాసింతురు+అంచున్= పరిపాలిస్తారు అని తలచుచు; నిరంతర శోకంబునన్= ఎడతెగని దుఃఖంతో; కన్నులన్= కన్నులలో; నీరు+ఇడెన్= నీరు ఉంచినది (కన్నీరు విడిచినది); వీక్షించితి+ఏ= చూచినావా?

**తా :** ధర్మాన్ని తెలిసిన ఓ ధర్మదేవా! శ్రీకృష్ణుడు అవతరించి భూభారాన్ని తొలగించినాడు. ఆయన దివ్యపాదస్పర్శతో భూదేవి ఎంతో సంతోషించి, పులకింతలతో మైమరచిపోయింది. ఇప్పుడు అట్టి పాదస్పర్శకు దూరమై పాపాత్ములు తనపై క్రూరంగా పెత్తనం చూపిస్తారేమోనని భీతిచెంది కన్నీరు కారుస్తున్న భూమాతను చూచినావా!

### ❖ పరీక్షిన్మహారాజు గలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయుట ❖

**వ. అని యటు ధరణీ ధర్మదేవతల బుజ్జగించి మహారథుండయిన విజయపౌత్త్రుండు క్రొక్కారు మెఱుంగు చక్కదనంబు ధిక్కరించి దిక్కులకు వెక్కసంబయిన యడిదంబు బెడిదంబుగ జడిపించి పాపహేతువయిన కలిని రూపుమాప నుద్యోగించిన, వాఁడు రాజరూపంబు విడనాడి, వాడిన మొగంబుతోడ భయవిహ్వలుండై హస్తంబులు సాఁచి తత్పాదమూల విన్యస్త మస్తకుండై ప్రణామంబు సేసి. 431**

**ప్రతి :** అని= అంటూ; అటు= ఆ ప్రకారంగా; ధరణీ+ధర్మదేవతలన్= భూదేవిని, ధర్మదేవతను; బుజ్జగించి= ఓదార్చి (లాలించి); మహారథుండు+అయిన= మహారథుడైన; విజయపౌత్త్రుండు= అర్జునుని మనుమడు (పరీక్షిత్తు); క్రొత్త+కారు+మెఱుంగు= తొలకరి మబ్బులోని మెఱపుయొక్క; చక్కదనంబున్= అందాన్ని (సౌందర్యాన్ని); ధిక్కరించి=

ఎదిరించి; దిక్కులకున్= దెసలకు; వెక్కసంబు+అయిన= దుస్సహమైన; అడిదంబు= ఖడ్గం; బెడిదంబుగన్= భయంకరంగా (కఠినముగా); జడిపించి= కంపింపజేసి; పాపహేతువు+అయిన= పాపానికి కారణమైన; కలిని= కలిపురుషుని; రూపుమాపన్= చంపటానికి; ఉద్యోగించినన్= యత్నింపగా; వాఁడు= ఆ కలి; రాజరూపంబున్= క్షత్రియుని రూపాన్ని; విడనాడి= విడిచి; వాడిన మొగంబుతోడన్= వాడిపోయిన ముఖంతో; భయ+విహ్వలుండు+ఐ= భీతిచే అవయవాలు స్వాధీనం తప్పినవాడై; హస్తంబులు+చాఁచి= చేతులు ముందుకు చాపి; తద్+పాద మూల విన్యస్త మస్తకుండు+ఐ= ఆతని పాదముల మొదట ఉంచబడిన శిరస్సు కలవాడై; ప్రణామంబు+చేసి= నమస్కరించి.

**తా :** ఈ విధంగా పరీక్షిత్తు భూదేవిని ధర్మదేవతను ఓదార్చినాడు. మహారథుడు, అర్జునుని మనుమడు ఐన ఆ మహావీరుడు తొలకరి మెఱపు తీగెవలె తళతళ మెరుస్తూ, కన్నులకు మిరుమిట్లుగొలిపే తన ఖడ్గాన్ని చివాలున భీతి కలిగించేట్లు జళిపించి చంపుటకై పూనుకొన్నాడు. ఆ మహారాజును చూచి, కలి వెంటనే తన రాజ చిహ్నాలనన్నిటిని విడిచి, వడలిన వదనంతో భయకంపితుడై ఆ రాజు పాదముల పై శిరస్సునుంచి నమస్కారంచేసి.

**క. కంపించె దేహమెల్లం, జంపకు మో రాజతిలక! శరణాగతు ర**
**క్షింపు మని తనకు మ్రొక్కినఁ, జంపక కలిఁజూచి నగుచు జనపతి పలుకున్. 432**

**ప్రతి :** ఓ రాజతిలక!= ఓ రాజులలో శ్రేష్ఠుడా!; దేహము+ఎల్లన్= నా శరీరం అంతా; కంపించెన్= వణకెను; శరణ+ఆగతున్=శరణుజొచ్చినవాడను; చంపకుము= చంపవద్దు; రక్షింపుము= కాపాడుము; అని= అట్లు పలికి; తనకున్= తనకు; మ్రొక్కినన్= నమస్కరింపగా; చంపక= సంహరింపక; కలిన్= కలిపురుషుని; చూచి= కనుగొని; నగుచున్= నవ్వుతూ; జనపతి= (పరీక్షిత్తు) రాజు; పలుకున్= ఇట్లు మాటాడినాడు.

**తా :** ఓ రాజోత్తమా! భయంతో నా దేహమంతా వణకుతున్నది. నన్ను చంపకు. నీ శరణుజొచ్చిన నన్ను కాపాడు మని వేడుకొన్నాడు. పరీక్షిత్తు కలిపురుషుని చంపక నవ్వుతూ ఈ విధంగా అన్నాడు.

**క. అర్జునకీర్తిసమేతుం, డర్జున పౌత్త్రుండు భయ రసావృత జనులన్**
**నిర్జితులఁ జంప నొల్లఁడు, దుర్జనభావంబు విడిచి తొలఁగు దురాత్మా! 433**

**ప్రతి :** దురాత్మా!= చెడ్డ మనస్సు కలవాడా!; అర్జునకీర్తిసమేతుండు= తెల్లని కీర్తితో కూడినవాడు; అర్జునపౌత్త్రుండు= అర్జునుని మనుమడు; భయరస+ఆవృత జనులన్= భయం అనే భావంతో ఆవరింపబడిన ప్రజలను; నిర్జితులన్= ఓడిన వారిని; చంపన్+ఒల్లఁడు= చంపుటకు ఇష్టపడడు; దుర్జనభావంబు= ధూర్తస్వభావం; విడిచి= వదలిపెట్టి; తొలఁగు= తొలగి పొమ్ము.

**తా :** ఓరీ! దుర్మార్గుడా! నిర్మల కీర్తిగల అర్జునుని మనుమడు ఓడినవారిని, ధైర్యం వీడి, భయంతో కంపించేవారిని చంపటానికి ఇష్టపడడు. కావున నీవు నీ ధూర్తస్వభావాన్ని విడిచి దూరంగా తొలగిపో!

**వ. నీవు పాపబంధుండవు. మదీయబాహుపాలితం బయిన మహీమండలంబున నిలువ వలవదు; రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్యలోభ చౌర్య దౌర్జన్య దురాచార మాయాకలహ కపట కలుషాలక్ష్మ్యాది ధర్మేతరసమూహంబు లాశ్రయించు; సత్యధర్మంబులకు నివాసంబగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞ విస్తార**

**నిపుణు లయిన వారు యజ్ఞేశ్వరుం డయిన హరింగూర్చి యాగంబు సేయుచున్న వారు; యజించు వారలకు సుఖప్రదానంబుసేయుచు, సకల భూతాంతర్యామియై భగవంతుం డయిన హరి జంగమస్థావరంబులకు నంతరంగ బహిరంగముల సంచరించు వాయువు చందంబున నాత్మరూపంబు మనోరథంబు నిచ్చుం; గావున నీ విం దుండ వలవ దనుచు దండహస్తుండయిన జముని కైవడి మండలాగ్రంబు సాఁచిన రాజవర్యునకుం గలి యిట్లనియె. 434**

**ప్రతి :** నీవు= నీవు; పాపబంధుండవు= పాపులకు చుట్టమవు; మదీయ బాహు పాలితంబు+అయిన= నా భుజాలచే రక్షింపబడుతున్న; మహీమండలంబునన్= భూమండలంలో; నిలువన్+వలవదు= నిలువ వీలుపడదు; రాజదేహంబునందున్= రాజుయొక్క శరీరమునందు; వర్తించు= నడచు; నిన్నున్= నిన్ను; అసత్య లోభ చౌర్య దౌర్జన్య= అసత్యము, దురాశ, దొంగతనము, చెడ్డతనము, దురాచార మాయా= చెడ్డ నడవడి, మోసము; కలహ, కపట, కలుష= దెబ్బలాట, చిత్తశుద్ధి లేకుండుట, మలినత్వము; అలక్ష్మీ+ఆది= శుభలక్షణములు లేకుండుట మొదలైన; ధర్మ+ఇతర+సమూహంబులు= ధర్మమునకు విరుద్ధములైన గుణముల గుంపులు; ఆశ్రయించున్= ప్రాప్తించును; సత్య ధర్మంబులకున్= సత్యమునకు ధర్మమునకు; నివాసంబు+అగు= స్థానమైన; బ్రహ్మావర్త దేశంబునన్= కురుభూమియందు (ఇది సరస్వతి, దృషద్వతి అను నదుల నడిమి ప్రదేశము); యజ్ఞ విస్తార నిపుణులు= యజ్ఞమును పెంపొందించుటలో నేర్పరులు; అయినవారు= అయినట్టివారు; యజ్ఞ+ఈశ్వరుండు+అయిన= యజ్ఞానికి అధిపతి అయినట్టి; హరిన్+కూర్చి= విష్ణువును గురించి; యాగంబు= యజ్ఞము; చేయుచున్నవారు= కావించుచున్నారు; యజించు వారలకున్= యజ్ఞం చేసేవారికి; సుఖప్రదానంబు+చేయుచున్=సుఖాన్ని కలిగిస్తూ; సకల భూత అంతర్యామి+ఐ= అన్ని జీవుల లోపలనున్నవాడై; భగవంతుండు+అయిన హరి= షడ్గుణ సంపన్నుడైన విష్ణువు; జంగమ స్థావరంబులకున్= చేతనాచేతనములకు; అంతరంగ బహిరంగములన్= లోపల, వెలుపల; సంచరించు వాయువు చందంబునన్= కదిలే గాలివలె; ఆత్మరూపంబు= నిజస్వరూపము; మనోరథంబున్= కోరికను; ఇచ్చున్= ఇచ్చును; కావునన్= కాబట్టి; నీవు= నీవు; ఇందున్= ఇచ్చట; ఉండన్+వలవదు= ఉండుటకు వీలుపడదు; అనుచున్= అని తెలుపుచు; దండ హస్తుండు+అయిన= దండమును చేతియందు కలవాడైన; జముని కైవడిన్= యమునివలె; మండల+అగ్రంబున్= కత్తిని; చాఁచినన్= ముందుకు పోవునట్లు చేయగా; రాజవర్యునకున్= రాజశ్రేష్ఠునకు; కలి= కలి పురుషుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** పరమ పాపాత్ముడవైన నీవు పాపాలకు బాంధవుడివి. అట్టి నీకు నేను పాలించే ఈ భూమండలంలో స్థానం లేదు. రాజవేషధారివైన నీలో అసత్యం, లోభం, దొంగతనం, దౌర్జన్యం, దురాచారం, మోసం, కలహం, కపటం, కాలుష్యం, దౌర్భాగ్యం మొదలైన ధర్మవ్యతిరేక లక్షణాలు అన్నీ గూడు కట్టుకొని ఉన్నాయి. సత్యానికి, ధర్మానికి ఆలవాలమైన ఈ బ్రహ్మావర్తదేశంలో యజ్ఞవేత్తలైన పెద్దలు యజ్ఞేశ్వరుడైన శ్రీమహావిష్ణువును యజ్ఞాలతో ఆరాధిస్తున్నారు. సమస్త చరాచర ప్రపంచంలో, లోపల వెలువల అంతట నిండియున్న వాయువువలె సర్వాంతర్యామియైన ఆ స్వామివారికి సర్వశుభాలు కలిగిస్తూ, వారి మనోరథాలు తీరుస్తున్నాడు. కనుక నీవు ఈ ప్రదేశంలో ఉండటానికి వీలులేదు అని యమునివలె కత్తిని పైకెత్తగా అపుడు కలి చక్రవర్తితో ఇలా పలికినాడు.

**క. జగతీశ్వర! నీ యడిదము, ధగధగితప్రభలతోడఁ దఱచుగ మెఱయన్**
**బెగడెం జిత్తము గుండెలు, వగిలెడి నెందుఁ నిఁక జొత్తు భావింపఁ గదే! 435**

**ప్రతి :** జగతీ+ఈశ్వర!= రాజా!; నీ+అడిదము= నీ ఖడ్గము; ధగధగితప్రభలతోడన్= తళతళలాడే కాంతులతో; తఱచుగన్= ఎక్కువగా; మెఱయన్= ప్రకాశింపగా; చిత్తము= నా మనస్సు; బెగడెన్= అదరిపడినది; గుండెలు= గుండెలు; పగిలెడిన్= వ్రక్కలౌతున్నాయి; ఇఁకన్= ఇటుపై; ఎందున్= ఎచ్చట; చొత్తున్= ప్రవేశిస్తాను; భావింపన్+కదే!= ఆలోచింపుమా!

**తా :** జగత్ప్రభూ! ధగధగమనే కాంతులతో మెరుస్తున్న నీ కరవాలాన్ని చూచి నా గుండెలు పగులుతున్నాయి. చిత్తం తత్తరపడుతుంది. ఇప్పుడు నే నెక్కడికి పోగలను? ఎక్కడ ఉండగలను? నీవే ఆలోచించు.

**వ. నరేంద్రా! నిన్ను, నారోపితశరశరాసను సర్వప్రదేశంబులందును విలోకించుచున్న వాఁడ; నే నెక్కడ నుండుదు నానతిమ్మనిన రాజన్య శేఖరుండు ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబు లనియెడు నాలుగు స్థానంబుల నిచ్చి మఱియు నడిగిన సువర్ణమూలంబగు నసత్య మద కామ హింసా వైరంబు లనియెడు పంచప్రదేశంబుల నొసంగి, యితరస్థలంబుల స్పృశియింపకుండ నియమించె, నిట్లు కలినిగ్రహంబు సేసి హీనంబు లయిన తపశ్శౌచదయ లనియెడు మూఁడు పాదంబులు వృషభమూర్తి యయిన ధర్మదేవుని కిచ్చి, విశ్వంభరకు నిర్భరం బయిన సంతోషంబు సంపాదించి. 436**

**ప్రతి :** నర+ఇంద్రా!= రాజా!; నిన్నున్= నిన్ను; ఆరోపిత శర శరాసనున్= ఎక్కుపెట్టబడిన విల్లు, అమ్ములు గలవానిని; సర్వ ప్రదేశంబులు+అందును= అన్ని తావులయందును; విలోకించుచు+ఉన్నవాఁడన్= చూచుచున్నాడను; నేను= నేను; ఎక్కడన్+ఉండుదున్= ఎచ్చట ఉండగలను?; ఆనతి+ఇమ్ము+అనినన్= ఆజ్ఞ నొసగుము అనగా; రాజన్యశేఖరుండు= రాజశ్రేష్ఠుడు; ప్రాణివధ= జీవులను చంపుట; స్త్రీ= స్త్రీ దోషము; ద్యూత= జూదము; పానంబులు= మద్యము త్రాగుటలు; అనియెడు నాలుగు స్థానంబులన్= అను నాలుగు ప్రదేశములను; ఇచ్చి= ఒసగి; మఱియున్= ఇంకను; అడిగినన్= కలి అడుగగా; సువర్ణ, మూలంబు+అగు= బంగారము కారణమైనది అగు; అసత్య మద కామ హింసావైరంబులు= అసత్యమాడుచోటు, మదించినవారు ఉండే తావు, అధికమైన ఆసక్తితో బాధపడేచోటు; బంగారంకోసం ప్రాణాలు తీసేచోటు, బంగారుకై కయ్యములాడే తావు; అనియెడు పంచ ప్రదేశంబులన్= అనే అయిదు తావులను; ఒసంగి= ఇచ్చి; ఇతర స్థలంబులన్= తక్కిన ప్రదేశములను; స్పృశియింపకుండన్= తాకకుండ; నియమించెన్= కట్టడి చేశాడు; ఇట్లు= ఈ విధంగా; కలిన్= కలిని; నిగ్రహంబు+చేసి= హద్దులలో పెట్టి; హీనంబులు+అయిన= దీనస్థితిలో విడువబడినవియైన; తపస్+శౌచ దయలు= తపస్సు, శుచిత్వం, దయలు; అనియెడు మూఁడు పాదంబులు= అనే మూడు పాదాలు; వృషభమూర్తి అయిన= ఎద్దురూపంలో ఉన్నవాడైన; ధర్మ దేవునికిన్= ధర్మదేవతకు; ఇచ్చి= ఒసగి; విశ్వంభరకున్= అంతయు భరించునట్టి భూదేవికి; నిర్భరంబు+అయిన= భరింపరానిది అయిన, అనగా పట్టరానిది అగు; సంతోషము= అధికమైన ఆనందము; సంపాదించి= (గడించి) కలుగజేసి.

**తా :** ఓ రాజేంద్రా! అటు ఇటు ఎటు చూచినా అంతట ధనుస్సు ధరించిన నీ రూపమే కన్పిస్తుంది. మరి నే నెచ్చట తలదాచుకోవాలో నీవే ఆనతిమ్ము' అని అలమటిస్తున్న కలిపురుషుని అభ్యర్థనను ఆలకించి ఆ పరీక్షిత్తు అతనికి జూదం, మద్యపానం, స్త్రీలు, ప్రాణివధ అనే నాలుగు స్థానాలు ఇచ్చినాడు. అతడు ఇంకను అర్థించగా అయిదవ స్థానంగా సువర్ణాన్ని అనుగ్రహించినాడు. ఆ సువర్ణం కారణంగా అసత్యం, మదం, కామం, హింస, వైరం అనే మఱి ఐదు స్థానాలు కలికికి కలిసి వచ్చాయి. ఈ స్థానాలు తప్ప మఱి యే ఇతర స్థలాలను స్పృశింపరాదని కలిని పరీక్షిత్తు గట్టిగా కట్టడి

చేసినాడు. ఈ విధంగా ఆ మహారాజు కలి పురుషుని నిగ్రహించి, అంతకుమునుపు పోగొట్టుకొన్న తపస్సు, శౌచం, దయ అనే మూడు పాదాలను ఎద్దురూపంలో ఉన్న ధర్మదేవతకు అర్పించి భూదేవికి అపరిమితమైన ఆనందాన్ని కలిగించినాడు.

**క. గజనామధేయపురమున, గజరిపుపీఠమున ఘనుఁడు గలిదమనుం డ**
**గ్గజవైరిపరాక్రముఁ డై, గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్. 437**

**ప్రతి :** కలిదమనుండు= కలిని లొంగదీసినవాడు; ఘనుఁడు= గొప్పవాడు (పరీక్షిత్తు); గజనామధేయ పురమునన్= గజమనే పేరుగల నగరము హస్తినాపురంలో; గజరిపు+పీఠమునన్= సింహాసనమున; ఆ+గజవైరి పరాక్రముఁడు+ఐ= సింహము వంటి పరాక్రమం కలవాడై; గజిబిజి= కలత, బాధ; లేకుండన్= లేకుండ; కౌరవలక్ష్మిన్= కౌరవుల సంపదను; తాల్చెన్= ధరించెను, వహించెను.

**తా :** కలిదర్పమును అణచిన సింహపరాక్రముడైన ఆ రాజసింహుడు హస్తినాపురంలో సింహాసనాసీనుడై కౌరవ సామ్రాజ్య లక్ష్మిని గౌరవ పూర్వకంగా కలతలను పూర్తిగా అణచి పరిపాలించినాడు.

**వ. ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామబాణపావకంబు వలన బ్రదికి, వృషభమూర్తి యయిన ధర్మదేవతకు నభయం బిచ్చిన పరీక్షిన్నరేంద్రుండు బ్రాహ్మణ శాపప్రాప్తతక్షకాహిభయంబు వలనఁ బ్రాణంబులు వోవు నని యెఱింగి సర్వసంగంబులు వర్జించి, శుకునకు శిష్యుండై విజ్ఞానంబు గలిగి, గంగాతరంగిణీ తీరంబునం గళేబరంబు విడిచె వినుఁడు. 438**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృష్ణుని అనుగ్రహంబునన్= శ్రీకృష్ణుని కృపచేత; అశ్వత్థామ బాణ పావకంబువలనన్= అశ్వత్థామ బాణాగ్ని నుండి; బ్రదికి= జీవించి; వృషభమూర్తి+అయిన= ఎద్దురూపంలో ఉన్నవాడైన; ధర్మదేవతకున్= ధర్మదేవునికి; అభయంబు+ఇచ్చిన= రక్షణ ఒసగిన; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; బ్రాహ్మణ శాపప్రాప్త= బ్రాహ్మణుని శాపం వలన కలిగిన; తక్షక+అహి భయంబు+వలనన్= తక్షకుడు అనే పాము భయంవలన; ప్రాణంబులు= ప్రాణాలు; పోవున్= పోవును; అని ఎఱింగి= అని తెలిసికొని; సర్వసంగంబులు= సమస్త వాంఛలు; వర్జించి= విడిచి; శుకునకున్= శుకమహర్షికి; శిష్యుండు+ఐ= శిష్యుడై; విజ్ఞానంబు కలిగి= విశిష్ట జ్ఞానమును పొంది; గంగా తరంగిణీ తీరంబునన్= గంగానది ఒడ్డున; కళేబరంబు= శరీరము; విడిచెన్= త్యజించెను; వినుఁడు= ఆకర్ణించండి.

**తా :** ఈ విధంగా వాసుదేవుని అనుగ్రహంవల్ల అశ్వత్థామ బాణాగ్ని జ్వాలలనుండి బ్రతికి బయటపడి, ఎద్దురూపంలోనున్న ధర్మదేవతకు అభయమిచ్చిన పరీక్షిత్తు, మునిశాపకారణంగా తక్షకుని విషాగ్ని జ్వాలల వలన తప్పక మరణం ప్రాప్తిస్తుందని తెలుసుకొని, సర్వసంగ పరిత్యాగియై శుకయోగీంద్రుని ఆశ్రయంతో పరిపూర్ణ పరమార్థాన్ని గ్రహించి, చివరగా గంగానది ఒడ్డున తన శరీరాన్ని విడిచినాడు అని చెప్పి సూతుడు శౌనకునితో ఇంకా ఇట్లన్నాడు.

**క. హరివార్త లెఱుఁగు వారికి, హరిపదములు దలఁచువారి కనవరతంబున్**
**హరికథలు వినెడివారికి, మరణాగత మోహసంభ్రమము లేదనఘా! 439**

**ప్రతి :** అనఘా!= పాపరహితుడా!; హరివార్తలు= విష్ణువుయొక్క వృత్తాంతాలు (రహస్యములు); ఎఱుఁగువారికిన్= తెలుసుకునేవారికి; హరి పదములు= విష్ణుచరణాలు; తలఁచు వారికిన్= స్మరించేవారికి; అనవరతంబున్= ఎల్లప్పుడు;

హరికథలు= విష్ణుని చరిత్రలు; వినెడివారికిన్= ఆలకించెడివారికి; మరణ+ఆగత మోహసంభ్రమము= మృత్యువు వలన (వచ్చెడి) కలిగెడి భ్రాంతి, తొట్రుపాటు; లేదు= ఉండదు.

**తా :** పవిత్రుడా! పాపరహితుడా! హరిలీలలు తెలుసుకొనేవారు, హరిపాద స్మరణ చేసేవారు, నిరంతరం హరిచరిత్రలు ఆలకించేవారు వారి మరణ సమయంలోకూడా ఎట్టి భ్రాంతిని, తొట్రుపాటును పొందరు.

**క. శుభచరితుఁడు హరి యరిగినఁ, బ్రభవించి ధరిత్రి నెల్లఁ బ్రబ్బియుఁ గలి దా**
**నభిమన్యుసుతుని వేళను, బ్రభవింపక యడఁగి యుండె భార్గవముఖ్యా! 440**

**ప్రతి :** భార్గవముఖ్యా!= భృగువంశమున ప్రధానమైనవాడా! (శౌనక మహర్షీ!); శుభచరితుఁడు= శుభమగు నడవడి కలవాడు; హరి= విష్ణువు; అరిగినన్= పోగా, అవతారం చాలింపగా; కలి= కలిపురుషుడు; ప్రభవించి= పుట్టి; ధరిత్రిన్+ఎల్లన్= భూమి అంతటా; ప్రబ్బియున్= అతిశయించియు; తాన్= తాను; అభిమన్యుసుతుని+వేళను= పరీక్షిత్తు కాలంలో; ప్రభవింపక= పుట్టక, ప్రభావం చూపక; అడఁగి+ఉండెన్= అణగిమణగి ఉండినాడు.

**తా :** (శౌనక మహర్షీ!) భృగువంశశ్రేష్ఠా! పుణ్యచరిత్రుడైన వాసుదేవుడు తన అవతారం ముగించిన తరువాత లోకమంతటా విజృంభించిన కలి అభిమన్యుని పుత్రుడైన పరీక్షిత్తు కాలంలో తన ప్రభావం చూపక ఎంతో అణగిమణగి ఉండినాడు.

**వ. ఇవ్విధంబునఁ జతుస్సముద్రముద్రితాఖిలమహీమండలప్రాజ్యసామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నా యభిమన్యుసంభవుండు. 441**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; చతుః+సముద్ర ముద్రిత= నాలుగు సముద్రాలచే గుర్తింపబడిన; అఖిల మహీమండల= సమస్తమైన భూవలయముతో కూడిన; ప్రాజ్య సామ్రాజ్యంబు= విస్తారమైన పెద్ద రాజ్యాన్ని; పూజ్యంబుగాన్= పూజింపదగినదిగా; చేయుచున్= కావిస్తూ; ఆ+అభిమన్యు సంభవుండు= ఆ అభిమన్యునికి పుట్టినవాడగు పరీక్షిత్తు.

**తా :** ఈ ప్రకారంగా నాలుగు సముద్రాల నడుమ గల విశాల భూమండలాన్ని చక్రవర్తియై ఆ అభిమన్యుపుత్రుడు ఏకచ్ఛత్రంగా పరిపాలన గావించినాడు.

**ఉ. చేసినఁ గాని పాపములు సెందవు; చేయఁ దలంచి నంతటం**
**జేసెద నన్న మాత్రమునఁ జెందుఁ గదా కలివేళఁ బుణ్యముల్;**
**మోసము లే దటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరంద ము**
**ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడని తేఁటి కైవడిన్. 442**

**ప్రతి :** చేసినన్+కాని= ఆచరించితేతప్ప; పాపములు= పాపాలు; చెందవు= కలుగవు; చేయన్= సత్కార్యములు చేయుటకు; తలంచిన+అంతటన్= స్మరించిన వెంటనే; కలివేళన్= కలికాలంలో; పుణ్యముల్= పుణ్యములు; చేసెదను= చేస్తాను; అన్నమాత్రముననన్= అన్నంతనే; చెందున్+కదా!= లభిస్తాయి కదా!; నృపముఖ్యుఁడు= రాజశ్రేష్ఠుడైన పరీక్షిత్తు; మోసము= వంచన లేక ప్రమాదం; లేదు+అటంచున్= ఉండదంటూ; మరందము= తేనె; ఉల్లాసముతోడన్= ఉత్సాహంతో; క్రోలి= జుర్రి, ఆస్వాదించి; విరులన్= పూలను; తెగన్‌చూడని= పాడు చేయుటకు ఆలోచించని; తేఁటికైవడిన్= తుమ్మెదవలె; కలిన్= కలిపురుషుని; కాచెన్= కాపాడెను.

**తా :** ఈ కలియుగంలోని విశేషమేమంటే పాపాలు చేస్తేనే వాటి ఫలితాలు కలుగుతాయి. ఇక పుణ్యాల విషయమా? చేయాలని అనుకొంటే చాలు. వెంటనే అవి ఫలితం ఇస్తాయి. కనుకనే అభిమన్యు కుమారుడైన పరీక్షిత్తు కలి విజృంభణను అణచి, ఇక కలివల్ల ప్రమాదం కలుగదని నిశ్చయించుకొని అతనిని ప్రాణాలతో విడిచి పెట్టినాడు. తుమ్మెద నెమ్మదిగా నేర్పుతో పూలలోని తేనెను మాత్రమే ఉల్లాసంతో ఆస్వాదించి, విరుల కెటువంటి చేటు కలిగింపక వదలివేస్తుంది కదా!

**వ. మఱియుం బ్రమత్తులై యధీరులగు నరులయందు వృకంబు చందంబున నొదిగి కాచుకొని యుండి చేష్టించుంగాని ధీరులైన వారికిం గలివలని భయంబు లేదని కలినంతంబు నొందింపఁడయ్యె ననిన విని ఋషులు సూతున కిట్లనిరి. 443**

**ప్రతి :** మఱియున్= ఇంకను; ప్రమత్తులు+ఐ= పొరపాటుపడినవారై; అధీరులు+అగు= ధైర్యములేనివారగు; నరులయయదున్= మానవులయందు; వృకంబు+చందంబునన్= తోడేలువలె; ఒదిగి= పొంచి; కాచుకొని+ఉండి= వేచియుండి; చేష్టించున్+కాని= ప్రవర్తిస్తుందిగాని; ధీరులు+ఐన+వారికిన్= ధైర్యము కలవారికి; కలివలని భయంబు= కలిపురుషునివలన భీతి; లేదు= ఉండదు; అని= ఆ ప్రకారం భావించి; కలిన్= కలిపురుషుని; అంతంబున్+ఒందింపఁడు+అయ్యెన్= నాశనము గావింపనివాడైనాడు; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ఋషులు= మునులు; సూతునకున్= సూతునికి; ఇట్లు= ఈ విధంగా; అనిరి= చెప్పినారు.

**తా :** అంతేకాక పొంచిపైకి దూకే తోడేలువలె ప్రమత్తులు, చంచల చిత్తులు ఐన మానవులను మాత్రమే కలి పురుషుడు బాధిస్తాడు. ధీరులకు కలివలన భయం కలుగదని తలచిన ఆ మహారాజు కలిని రూపుమాపక వదలిపెట్టినాడని చెప్పగా విని శౌనకాది మహర్షులు సూతుని కొనియాడుతూ ఇట్లన్నారు.

**సీ. పౌరాణికోత్తమ! బ్రదుకుము పెక్కేండ్లు తామరసాక్షుని ధవళయశము**
**మరణశీలురమైన మా కెఱింగించితి కల్పితంబగు క్రతుకర్మమందుఁ**
**బొగలచేఁ బొగిలి యబుద్ధచిత్తులమైన మము హరి పదపద్మ మధుర రసము**
**ద్రావించితివి నీవు, ధన్యుల మైతిమి స్వర్గ మేనియు నపవర్గమేని**

**తే. భాగవత సంగ లవ భాగ్యఫలము కీడె?, ప్రకృతిగుణహీనుఁడగు చక్రి భద్రగుణము**
**లీశకమలాసనాదులు నెఱుఁగ లేరు, వినికి వినఁజాల మనియెడి వెఱ్ఱి గలఁడె? 444**

**ప్రతి :** పౌరాణిక+ఉత్తమ!= పురాణ రహస్యములు తెలిసినవారిలో శ్రేష్ఠుడా!; పెక్కు+ఏండ్లు= అనేక సంవత్సరాలు; బ్రదుకుము= జీవింపుము; తామరస+అక్షుని= పద్మములవంటి కన్నులు గలవాని (విష్ణుని); ధవళయశము= స్వచ్ఛమైన; మరణశీలురము+ఐన= చనిపోయే స్వభావం కలవారమైన; మాకున్= మాకు; ఎఱింగించితి= తెలియజేసినావు; కల్పితంబు+అగు= కల్పింపబడిన; క్రతు కర్మమందున్= యజ్ఞకార్యమందు; పొగలచేన్= పొగలతో; పొగిలి= కష్టపడి; అబుద్ధ చిత్తులము+ఐన= జ్ఞానం పండని చిత్తం కలవారమైన; మమున్= మమ్ము; హరి, పదపద్మ, మధుర, రసము= విష్ణువు పాదాలనెడి పద్మాల తీయని రసమును; నీవు= నీవు; త్రావించితివి= త్రాగించినావు; ధన్యులము+ఐతిమి= కృతార్థులమయినాము; స్వర్గము+ఏనియున్= స్వర్గలోకమైనను; అపవర్గము+ఏనిన్= మోక్షమైనను; భాగవత= భాగవతుల (భగవద్భక్తుల) తోడి; సంగ, లవ, భాగ్య, ఫలమునకున్= కలయికయొక్క కొంచెమైన అదృష్ట ఫలితానికి; ఈడు+ఎ=

సాటియా?; ప్రకృతి గుణహీనుఁడు+అగు చక్రి= ప్రకృతియందలి త్రిగుణములు లేనివాడైన విష్ణువు; భద్రగుణములు= శుభములైన గుణములు; ఈశ కమల+ఆసన+ఆదులున్= ఈశ్వరుడు, పద్మం ఆసనంగాగల బ్రహ్మ మొదలైనవారూ; ఎఱుఁగగన్+లేరు= తెలియజాలరు; వినికి= వినవలసిన దానిని; వినన్+చాలము= వినజాలము; అనియెడి వెఱ్ఱి+కలఁడె?= అనే పిచ్చివాడు ఉన్నాఁడా?

**తా :** పౌరాణిక శిరోమణీ! నీవు చిరకాలం వర్ధిల్లు. మరణస్వభావం గల మాకు అమృతమయమైన విష్ణు వినిర్మలయశోవ్యాప్తికి చెందిన లీలావిశేషాలు వినిపించినావు. మహాభారమైన యజ్ఞకార్యాలు ప్రారంభించి క్రమ్ముకొన్న హోమాల పొగలతో పొగిలే మాచే గోవింద చరణారవింద మధురమకరందమును తనివితీర త్రాగించినావు. మేము ధన్యులమైనాము. స్వర్గమే కాదు అపవర్గం కూడ భాగవతులైన భక్తుల సాంగత్య భాగ్యఫలంలో సహస్రాంశానికైనా సాటిరాదు సుమా! ప్రాకృతగుణాతీతుడైన శ్రీమన్నారాయణుని గుణవిశేషాలు పరమేశ్వర బ్రహ్మాదులు కూడ తెలియలేరు. అట్టి భగవంతుని గూర్చి వీనులవిందుగా వినడానికి ఇచ్ఛగింపని వెఱ్ఱివాడు ఎక్కడైనా ఉంటాడా?

**క. శ్రీపంబులు ఖండిత సం, తాపంబులు గల్మషాంధతమస మహోద్య**
**ద్దీపంబులు పాషండ దు, రాపంబులు విష్ణువందనాలాపంబుల్. 445**

**ప్రతి :** శ్రీపంబులు= సంపదలను పాలించేవి (రక్షించునవి); ఖండిత= ఖండింపబడిన; సంతాపంబులు= అధిక తాపములు (బాధలు) కలవి; కల్మష+అంధ తమస మహా+ఉద్యత్+దీపంబులు= పాపమనెడి కారుచీకటికి, గొప్పవియగు, పైకెత్తిన, పెద్ద దీపములు; పాషండ దుర్+ఆపంబులు= నాస్తికులకు పొందరానివి; విష్ణు వందన+ఆలాపంబుల్= విష్ణువునకు నమస్కరించుటలు, ఆయనను గూర్చి మాటాడుటలు.

**తా :** ఆనందనందనునికి చేసే వందనాలు అతని గురించి చేసే సంకీర్తనలు సంపత్కరాలు. పాపాలను, సంతాపాలను పూర్తిగా హరించేవి. అవి దివ్యకాంతులీనెడి దివ్వెలై కటికచీకట్లను పోగొట్టేవి. పాషండులకు పొందరానివి.

**క. పావనములు దురితలతా, లావనములు నిత్యమంగళ ప్రాభవ సం**
**జీవనములు లక్ష్మీసం, భావనములు వాసుదేవు పదసేవనముల్. 446**

**ప్రతి :** వాసుదేవు పద సేవనముల్= వాసుదేవుని (శ్రీకృష్ణుని) పాదముల సేవలు; పావనములు= పవిత్రములైనవి; దురిత లతా లావనములు= పాపములనెడి తీగెలను కోసివేసేవి; నిత్య మంగళ= శాశ్వతములైన శుభముల; ప్రాభవ సంజీవనములు= వైభవములను పెంపొందించేవి; లక్ష్మీ సంభావనములు= లక్ష్మీదేవిచేత పూజింపబడేవి.

**తా :** వాసుదేవుని పాదసేవలు పావనత్వమును ప్రసాదించేవి. దురితములనే తీగెలను ఖండించేవి. నిత్య కల్యాణ ప్రాభవంతో చైతన్యం కలవి, శ్రీదేవీ సేవలను ఆమోదించేవి.

**ఆ. పరమభాగవతుఁడు పాండవపౌత్త్రుండు, శుకుని భాషణముల శుద్ధబుద్ధి**
**యై విరాజమానుఁడై ముక్తి యగు విష్ణు, పాదమూల మెట్లు వడసె ననఘ! 447**

**ప్రతి :** అనఘ!= పాపరహితుఁడా!; పరమభాగవతుఁడు= శ్రేష్ఠుడైన భగవద్భక్తుడు; పాండవపౌత్త్రుండు= పాండవుల మనుమడు; శుకుని+భాషణములన్= శుకమహర్షి మాటలతో; శుద్ధ బుద్ధి+ఐ= పరిశుద్ధమైన బుద్ధి కలవాడై; విరాజమానుఁ

డు+ఐ= మిగుల వెలుగొందుతున్నవాడై; ముక్తి+అగు= మోక్షమగు; విష్ణు పాదమూలము= శ్రీమన్నారాయణుని పాదముల సన్నిధి; ఎట్లు+పడసెన్= ఏ విధంగా పొందెను?

**తా :** పుణ్యాత్ముడా! పరమభాగవతోత్తముడు, పాండవ పౌత్రుడు అయిన పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి సూక్తులతో వినిర్మల బుద్ధియై మిక్కిలి తేజరిల్లుతూ ముక్తికి ఆలవాలమైన వాసుదేవుని పాదమూలాన్ని ఏ విధంగా పొందినాడు?

**వ. మహాత్మా! విచిత్రయోగనిష్ఠా కలితంబును, విష్ణుచరిత లలితంబును, బరమ పుణ్యంబును, సకలకల్యాణ గుణగణ్యంబును, భాగవత జనాపేక్షితంబును నైన పారీక్షిత భాగవతాఖ్యానంబు వినిపింపు మనిన సూతుం డిట్లనియె. 448**

**ప్రతి :** మహాత్మా!= మహానుభావా!; విచిత్ర, యోగనిష్ఠా, కలితంబును= అద్భుతమైన యోగసంబంధమైన నిష్ఠతో; విష్ణు, చరిత, లలితంబును= విష్ణుని ప్రవర్తనవలన విలసిల్లునది; పరమపుణ్యంబును= గొప్ప పుణ్యము కలది; సకల, కల్యాణ, గుణ, గణ్యంబును= సమస్తములైన శుభములగు గుణములతో లెక్కింపదగినది; భాగవత జన+అపేక్షితంబునున్= భగవద్భక్తులగు జనులచే కోరబడినది; ఐన= అయినట్టి; పారీక్షిత= పరీక్షిత్తుకు సంబంధించిన; భాగవత+ఆఖ్యానంబు= భాగవత కథ; వినిపింపుము= ఆలకింపజేయుము; అనినన్= అని అడుగగా; సూతుండు= సూతుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పినాడు.

**తా :** మహానుభావా! అత్యద్భుత యోగ విద్యాసముపేతము, విష్ణు కథాపరిపూతము, పరమపుణ్యము, సమస్త కల్యాణగుణ గణగణనీయము, భక్తజనులకు అపేక్షితము అయిన పరీక్షిత్తు శ్రవణం చేసిన భాగవత కథను మాకు వినిపింపుమని అడుగుతున్న మహర్షులతో సూతుడిలా చెప్పినాడు.

**విశే :** పరమ పవిత్రమగు భాగవత పురాణము కేవలము అనంతుని లీలాభివర్ణనమునకు ప్రాధాన్యమీయలేదు. అత్యాశ్చర్యకరమైన జ్ఞానయోగమార్గ నిష్ఠలతో కూడియున్నది. విష్ణుచరిత్రతో అంతర్యామిత్వమును పొందే సాధనా విశేషం కలది కావడంవల్ల ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది. శుకుడు పరీక్షిత్తునకు అతని ప్రాణ ప్రయాణానికి ముందు ఉపదేశించినది కావటం వల్ల భగవద్భక్తులకు పరమపుణ్యప్రదమూ, అత్యంత ప్రీతిపాత్రమూ ఐనది. ఇది త్రిగుణాతీతమైన కల్యాణగుణ సమృద్ధం.

**క. మిముబోంటి పెద్దవారలు, కమలాక్షుని చరిత మడుగఁగాఁ జెప్పెడి భా**
**గ్యము గలిగె నేఁడు నా జ, న్మము సఫలం బయ్యె వృద్ధమాన్యుఁడ నగుటన్. 449**

**ప్రతి :** మిముబోఁటి= మీవంటి; పెద్దవారలు= పూజింపదగినవారు; కమల+అక్షుని= విష్ణుని; చరితము= చరిత్రను; అడుగఁగాన్= ప్రశ్నింపగా; చెప్పెడి+భాగ్యము= చెప్పగల అదృష్టం; నేఁడు= ఈనాడు; వృద్ధ+మాన్యుఁడన్+అగుటన్= పెద్దలచే గౌరవింపబడినవాడను కావడంవల్ల; నా జన్మము= నా పుట్టుక; సఫలంబు+అయ్యెన్= ఫలించింది.

**తా :** అయ్యా! పెద్దలైన మీవంటివారు అడగటమూ, కమలాక్షుడైన విష్ణుని కథలు చెప్పగలగడమూ అనేది నాకు మహాభాగ్యం. పెద్దలచే సమ్మాన్యమైన నా జన్మ ధన్యమైంది. నా జీవితం సఫలం.

**క. కులహీనుఁడు నారాయణ, విలసత్కథనములు గడఁక వినిపించినఁ ద**
**త్కులహీనతఁ బాసి మహో, జ్జ్వల కులజత్వమును బొందు సన్మునులారా! 450**

**ప్రతి :** సత్+మునులార!= ఉత్తమ మునులారా!; కులహీనుఁడు= కులంచే తక్కువవాడు; నారాయణ+విలసత్+కథనములు= శ్రీమన్నారాయణుని ఒప్పిదమైన కథలు; కడఁకన్= పట్టుదలతో; వినిపించినన్= వినిపించినచో; తద్+కులహీనతన్= ఆ కులం తక్కువతనాన్ని; పాసి= తొలగి; మహా+ఉత్+జ్వల కులజత్వమును= గొప్పగా వెలుగొందుచున్న కులంలో పుట్టుటను; పొందున్= పొందును.

**తా :** తక్కువకులంలో జన్మించినవాడైనా, శ్రీమన్నారాయణుని విశిష్ట కథలను వినిపిస్తే, ఉన్నత కులగౌరవాన్ని పొందుతాడు.

**సీ.** **ఎవ్వని గుణజాల మెన్న జిహ్వాలు లేక నలినగర్భాదు లనంతుఁ డంద్రు**
**కోరెడు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి ప్రార్థించె నెవ్వని పాదరజము**
**బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన జలము ధన్యత నిచ్చె జనుల కెల్ల**
**భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు నెవ్వఁ డర్థాకృతి నేపు మిగులు**

**ఆ.** **నే మహాత్ము నాశ్రయించి శరీరాది, సంగకోటినెల్ల సంహరించి**
**ప్రాభవమున మునులు పారమహంస్యంబు, నొంది తిరిగి రాక యుందు రెలమి.** **451**

**ప్రతి :** ఎవ్వని గుణజాలము= ఎవ్వని గుణాల సమూహాన్ని; ఎన్నన్= గణించుటకు; జిహ్వాలు లేక= నాలుకలు లేక; నలినగర్భ+ఆదులు= బ్రహ్మమొదలైనవారు; అనంతుఁడు+అంద్రు= అంతంలేనివాడు అనుచున్నారో; కోరెడు= కాంక్షించే; విబుధ+ఇంద్రకోటిన్= దేవతల నాయకుల సమూహాన్ని; ఒల్లక= సమ్మతింపక; లక్ష్మి= శ్రీదేవి; ఎవ్వని పాదరజము= ఎవని కాలిదుమ్మును; ప్రార్థించెన్= మిక్కిలి కోరుకొన్నదో; ఎవ్వని పాద+పద్మంబు= ఎవని అడుగు దామర చరణాంబుజము, కడిగిన జలము= కడిగిన నీరు; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; జనులకు+ఎల్లన్= లోకులకు అందరికి; ఇచ్చెన్= ఇచ్చెనో; ఎవ్వఁడు= ఎవడు; భగవంతుఁడు+అనియెడి= భగవంతుడు అనే; భద్రశబ్దమునకున్= మంగళకరమైన శబ్దానికి; అర్థ+ఆకృతిన్= అర్థముయొక్క ఆకారంతో; ఏపు+మిగులున్= అతిశయిస్తాడో; ఏ+మహా+ఆత్మున్ ఆశ్రయించి= ఏ మహానుభావుని ప్రాపు పొంది; శరీర+ఆది సంగకోటిన్= శరీరం మొదలైన సాంగత్యాల సమూహాన్ని; ఎల్లన్= అంతటిని; సంహరించి= వీడి= ఉజ్జగించి; ప్రాభవమునన్= మహిమతో; మునులు= మౌనులు; పారమహంస్యంబున్= పరమహంసత్వమును, సన్న్యాస స్థితిని; ఒంది= పొంది; ఎలమిన్= ఆనందంతో; తిరిగిరాక+ఉందురు= మరలిరాకుండ ఉన్నారో.

**తా :** ఏ దేవదేవుని గుణగణాలు గణించటానికి నాలుకలు చాలక నలువ (బ్రహ్మ) మొదలగు దేవతలు 'అనంతుడు' అని అనుచున్నారో, తనను కోరు తక్కిన ముక్కోటి దేవతలను కాదని శ్రీదేవి ఎవని పాదధూళిని పరిగ్రహించిందో, బ్రహ్మదేవుడు ఎవని పాదపద్మాలు కడిగిన పవిత్రజలాన్ని అఖిల జగత్తుకు అనుగ్రహించినాడో, 'భగవంతుడు' అనే పరమపవిత్ర శబ్దానికి అర్థస్వరూపమై ఎవడు అతిశయించి విరాజిల్లుతున్నాడో, ఏ మహాత్ముని ప్రాపుగాంచి మహామునులు సర్వసంగ పరిత్యాగులై 'పరమహంస' పదాన్ని అందుకొని మరలిరాకున్నారో ఆ వాసుదేవుని దివ్యగాథలు పరిపూర్ణంగా గ్రహించటానికి ఎవరికి సాధ్యమౌతుంది?

**విశే :** పరమహంస – వీతరాగుడై సంసారాన్ని వదలివైచి వెళ్ళిపోయిన సంన్యాసి.

**చ.** **క్రమమున మింటికై యెగయుఁగాక విహంగము మింటిదైన పా**
**రముఁ గన నేర్చునే? హరిపరాక్రమ మోపినయంతఁ గాక స**

**ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁడౌ మునులార! నాదు చి**
**త్తమునకు నెంత గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్. 452**

**ప్రతి :** మునులార!= మహర్షులారా!; విహంగము= పక్షి; క్రమమునన్= ఒక పద్ధతిలో; మింటికి+ఐ= ఆకాశానికి; ఎగయున్+కాక= ఎగురునుగాక; మింటిది+ఐన= నింగికి చెందినది అయిన; పారమున్= తుది హద్దును; కనన్+నేర్చును+ఏ= చూడటానికి సమర్థమౌతుందా?; హరి+పరాక్రమము= విష్ణుమూర్తి సామర్థ్యం; ఓపిన+అంతన్+కాక= చేతనైనంత మాత్రమే కాకుండ; సర్వమున్= అంతయు; వివరింపన్= తెలియజేయుటకు; ఎవ్వఁడు= ఎవడు; ప్రవర్తకుఁడు+ఔన్= సమర్థుడు ఔతాడు; నాదు చిత్తమునకున్= నా మనస్సునకు; ఎంత= ఎంతవరకు; కానఁబడెన్= గోచరించినదో; అంతయున్= దానినంతటిని; మీకున్= మీకు; తప్పక= లోటు రాకుండా; చెప్పెదన్= వివరిస్తాను.

**తా :** మునివర్యులారా! పక్షి తన శక్తికొలది ఎంత పైకి ఎగిరినప్పటికి ఆకాశం అంతు కనుగొనలేదు. అట్లే వాసుదేవుని మహావైభవాన్ని తనకు తెలిసినంత మేరకు తప్ప సమగ్రంగా వివరించి చెప్ప గల సమర్థుఁడెవడు? నా మనస్సుకు అందినంతవరకు మీకు తప్పక వివరిస్తాను. ఆలకించండి.

**క. వేదండపురాధీశుఁడు, గోదండము సేతఁ బట్టికొని గహనములో**
**వేదండాదుల నొకనాఁ, డే దండలఁ బోవ నీక యెగచెన్ బలిమిన్. 453**

**ప్రతి :** వేదండపుర+అధీశుఁడు= హస్తినాపురమునకు రాజు (పరీక్షిత్తు); కోదండము= విల్లు; చేతన్+పట్టికొని= చేతియందు ధరించి; గహనములోన్= అడవిలో; వేదండ+ఆదులన్= ఏనుగులు మొదలైన జంతువులను; ఏ+దండలన్= ఏ ప్రక్కలకు; పోవన్+ఈక= పోనీయకుండ; బలిమిన్= బలముతో; ఎగచెన్= తరిమెను.

**తా :** హస్తినాపురరాజేంద్రుడైన పరీక్షిత్తు ఒకనాడు వింటిని చేతబట్టి అడవులలో ఏనుగులు మొదలైన జంతువులు తప్పించుకొని పోనీయకుండ పరాక్రమంతో వెంటనంటి వేటాడసాగినాడు.

**క. ఒగ్గములు ద్రవ్వి పడు మని, యొగ్గెడు పెనుఁదెరల వలల నురలు మృగములన్**
**దగ్గఱి చంపెడు వేడుక, వెగ్గలమై చిత్తమందు వెంటాడింపన్. 454**

**ప్రతి :** ఒగ్గములు+త్రవ్వి= గోతులు త్రవ్వి; పడుము+అని= (అందులో) కూలుము అని; ఒగ్గెడు= సిద్ధపరచే; పెను+తెరలన్= పెద్ద తెరలను; వలలన్= వలలందు; ఉరలు= చిక్కుకొను; మృగములన్= జంతువులను; దగ్గఱి= సమీపించి; చంపెడు= సంహరించే; వేడుక= ఉత్సాహము; వెగ్గలము+ఐ= అధికమై; చిత్తమందున్= మనస్సులో; వెంట+ఆడింపన్= వెంటపడి వేటాడింపగా.

**తా :** పెద్ద పెద్ద గోతులు త్రవ్వి, జంతువులను అందులో పడేటట్లు తోలి వలలు, ఉచ్చులు మొదలైనవి పన్ని వాటిలో చిక్కుకొన్న మృగాలను సమీపించి చంపవలెననే ఉత్సాహము, మృగాలను వెంటబడి వేటాడేటట్లు చేయగా.

**క. కోలముల గవయ వృక శార్దూ, లములఁ దరక్షు ఖడ్గ రోహిత హరి శుం**
**డాలముల శరభ చమర, వ్యాలముల వధించె విభుఁడు వడి నోలములన్. 455**

**ప్రతి :** విభుఁడు= రాజు (పరీక్షిత్తు); వడిన్= వేగంగా; ఓలములన్= రక్షణగా దాగుడు ప్రదేశాలలో (ఉండి); కోలములన్= అడవి పందులను; గవయ= గురుపోతులను; వృక= తోడేళ్ళను; శార్దూలములన్= పెద్ద పులులను; తరక్షు= సివంగి

(క్షుద్ర శార్దూలము); ఖడ్గ= ఖడ్గ మృగము; రోహిత= కేసరి మృగము; హరి= సింహము; శుండాలములన్= ఏనుగులను; శరభ= (మీగండ్లమెకము) శరభము; చమర= సవరపు మెకము; వ్యాలములన్= పాము, పులి లేక తులువ యేనుగులను; వధించెన్= చంపినాడు.

**తా :** ఆ మహారాజు ఎంతో నైపుణ్యంతో, అడవి పందులను, అడవి ఎద్దులను, తోడేళ్లను, పెద్ద పులులను, సివంగులను, ఖడ్గ మృగాలను, కేసరి మృగాలను (అడవి గొఱ్ఱెలను) సింహాలను, ఏనుగులను, శరభాలను, సవర మృగాలను, కొండ చిలువలు మొదలైన వాటిని పడగొట్టినాడు.

## ❖ పరీక్షితుఁడు వేఁటాడి శమీకునిపై మృతసర్పము నెత్తివైచుట ❖

**క. మృగయులు మెచ్చ నరేంద్రుఁడు, మృగరాజు పరాక్రమమున మెఱసి హరించెన్**
**మృగధర మండలమునఁ గల, మృగ మొక్కటి దక్క సర్వమృగముల నెల్లన్. 456**

**ప్రతి :** నర+ఇంద్రుఁడు= రాజు (పరీక్షిత్తు); మృగయులు= వేటగాండ్రు; మెచ్చన్= మెచ్చుకోగా; మృగరాజు పరాక్రమమునన్= సింహముయొక్క శౌర్యంతో; మెఱసి= ప్రకాశించి; మృగధరమండలమునన్+కల= జింకను చిహ్నముగా కల చంద్రుని మండలమునందున్న; మృగము+ఒక్కటి+తక్కన్= ఒక్క మృగమును తప్ప; సర్వ మృగములన్+ఎల్లన్= సమస్త మృగముల (జంతువులను) నన్నింటిని; హరించెన్= చంపెను.

**తా :** ఆ నరేంద్రుడు సింహపరాక్రమంతో వేటగాళ్లు మెచ్చేట్లు చంద్రమండలంలోని మృగాన్నితప్ప అరణ్యంలోని అన్ని మృగాలనూ వేటాడి చంపాడు.

**వ. ఇట్లు వాటంబయిన వేఁటతమకంబున మృగంబుల వెంబడిం బడి యెగచుచుం జరించుటం జేసి బుభుక్షాపిపాసల వలన మిగులఁ బరిశ్రాంతుండయి ధరణీకాంతుండు చల్లని నీటికొలంకులు గానక కలంగెడు చిత్తంబుతోఁ జని యొక్క తపోవనంబు గని యందు. 457**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వాటంబయిన= అనుకూలమైన; వేఁట తమకంబునన్= వేటపై గల ఆసక్తితో; మృగంబుల వెంబడిన్+పడి= జంతువుల వెంటపోయి; ఎగచుచున్= తరుముచు; చరించుటన్+చేసి= తిరగటంవల్ల; బుభుక్షాపిపాసల వలనన్= ఆకలిదప్పికలవలన; మిగులన్= మిక్కిలి; పరిశ్రాంతుండు+అయి= అలసట చెందినవాడై; ధరణీకాంతుండు= భూభర్త అయిన పరీక్షిత్తు; చల్లనినీటికొలంకులు= శీతల జలాలుగల మడుగులను; కానక= కనుగొనలేక; కలంగెడు= కలత పొందే; చిత్తంబుతోన్= మనస్సుతో; చని= పోయి; ఒక్క తపోవనంబున్= తపస్వులుండే ఒక అరణ్యమును; కని= చూచి; అందున్= అచ్చట.

**తా :** ఈ విధంగా రాజు వేటపైన గాటమైన ఆసక్తితో మృగాల వెంటబడి తరుముతూ పరుగులతో తిరిగి తిరిగి, ఆకలిదప్పికల వలన అలసిపోయినాడు. అప్పు డతడు చల్లని నీటికోసం వెదకి వెదకి విసిగి వేసారి, చివరకు ఒక తపోవనం చేరినాడు.

**సీ. మెలఁగుట చాలించి మీలితనేత్రుఁడై శాంతుఁడై కూర్చుండి జడత లేక**
**ప్రాణ మనోబుద్ధి పంచేంద్రియంబుల బహిరంగవీథులఁ బాఱనీక**

జాగరణాదిక స్థానత్రయము దాఁటి పరమమై యుండెడి పదముఁ దెలిసి
బ్రహ్మభూతత్వ సంప్రాప్త్యవిక్రియుఁ డయి యతిదీర్ఘజటలుఁ ద న్నావరింప

తే. నలఘు రురు చర్మధారియై యలరుచున్న, తపసిఁ బొడగని శోషితతాలుఁ డగుచు
నెండి తడిలేక కుత్తుక నెలుఁగు డింద, మందభాషల నిట్లను మనుజవిభుఁడు. 458

**ప్రతి :** మనుజవిభుఁడు= రాజు (పరీక్షిత్తు); మెలఁగుట= సంచరించుట; చాలించి= నిలిపివేసి; మీలిత+నేత్రుఁడు+ఐ= మూసిన కన్నులు కలవాడై; శాంతుఁడు+ఐ= శాంతము కలవాడై; కూర్చుండి= కూర్చొని; జడతలేక= మాంద్యము లేక; ప్రాణ మనస్+బుద్ధి పంచ+ఇంద్రియంబులన్= ప్రాణము, మనస్సు, బుద్ధి, అయిదు ఇంద్రియాలు; బహిరంగ వీథులన్= వెలుపలి మార్గములందు; పాఱన్+ఈక= ప్రసరింపనీయకుండ; జాగరణ+ఆదిక= మేల్కాంచుట మొదలైన; స్థానత్రయము= మూడుతావులు (జాగ్రత్స్వప్న సుషుప్తులు); దాఁటి= అతిక్రమించి; పరమము+ఐ+ఉండెడి= ఉత్తమమై ఉన్న; పదమున్+తెలిసి= స్థానమును ఎఱిగి; బ్రహ్మ భూతత్వ సంప్రాప్తి+అవిక్రియుఁడు+అయి= బ్రహ్మముగా మారిపోయిన స్థితి సిద్ధించటంచేత వికారాలు లేనివాడయి (కాలు చేయి కదల్చనివాడై); అతిదీర్ఘజటలు= మిక్కిలి పొడవైన జడలు; తన్నున్= తనను; ఆవరింపన్= క్రమ్ముకొనియుండగా; న+లఘు= పెద్దదియగు; రురు చర్మధారి+ఐ= లేడి తోలుచర్మం ధరించినవాడై; అలరుచున్న= ఒప్పుతున్న; తపసిన్= ఋషిని; పొడగని= చూచి; శోషితతాలుఁడు+అగుచున్= ఎండిపోయిన దవడలు కలవాడౌతూ; ఎండి= ఎండిపోయి; తడిలేక= చెమ్మలేక; కుత్తుకన్= గొంతులో; ఎలుఁగు+డిందన్= కంఠస్వరము నశింపగా; మందభాషలన్= మెల్లని పలుకులతో; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు.

**తా :** అచ్చట పరీక్షిత్తు కన్నులు మూసికొని, ప్రశాంతంగా కూర్చొని తపస్సు చేసే శమీక మహామునిని చూచినాడు. ఆ ముని పొడవైన జడలతో జింకచర్మం ధరించి పంచేంద్రియాలను నిగ్రహించి, ప్రాణం, మనస్సు, బుద్ధిని స్వాధీనపరచుకొని, జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అనెడి అవస్థలుదాటి నాల్గవదియైన సమాధి అవస్థలో ఏకాగ్రచిత్తుడై బ్రహ్మానుసంధానస్థితిలో ఎట్టి వికారాలు లేనివాడై ఉన్నాడు.

అప్పుడు పరీక్షిత్తు నెమ్మదిగా ఆ మునిని సమీపించి, దవడలు ఎండి, నాలుక తడి ఆరిపోగా, హీనమైన కంఠస్వరంతో నట్టుపడుతున్న పలుకులతో మెల్లమెల్లగా ఇట్లన్నాడు.

క. తోయములు దెమ్ము మా కీ, తోయము వేఁటాడ వెరవు దొరకదు ఘన చే
తోయుత! డప్పి జనించెను, తోయము వారలును లేరు దుస్సహ మనఘా! 459

**ప్రతి :** అనఘా= పాపరహితుఁడా!; ఘనచేతస్+యుత!= గొప్ప చేతస్సు (ప్రజ్ఞ)తో కూడినవాడా!; తోయములు= నీరు; మాకున్= మాకు; తెమ్ము= తీసికొని రమ్ము; ఈ తోయము= ఈ విధము; వేఁటాడన్= వేటాడటానికి; వెరవు= ఉపాయము; దొరకదు= లభింపదు; డప్పి= దాహము; జనించెను= కలిగినది; తోయమువారలును= సాటివారు (పరివారమగువారు); లేరు= (ఇప్పుడు ఇట) లేరు; దుస్సహము= సహింప శక్యం కావడం లేదు.

**తా :** ఓ పుణ్యాత్ముడా! మహాప్రజ్ఞాధురీణుడా! మాకు వెంటనే నీరు తెచ్చియిమ్ము. ఈ సమయంలో వేటాడలేక భరింపరాని దాహం కలిగింది. తోడుగా పరివారము చెంతలేరు. వారు దూరంగా ఉన్నారు.

వ. అని భూవరుండు శమీకమహాముని సమాధి నిష్ఠానిమీలిత నేత్రుండును విస్మృత బాహ్యాంతరింద్రియ కృత సంచారుండును హరిచింతాపరుండునునై యుండుటం దెలియలేక. 460

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; భూవరుండు= రాజు; శమీకమహామునిన్= శమీక మహర్షిని; సమాధినిష్ఠా= సమాధియందలి స్థిరత్వంచే; నిమీలిత నేత్రుండును= మూసిన కన్నులు గలవాడును; విస్మృత= మరచిన; బాహ్య+అంతః+ఇంద్రియ= వెలుపలి, లోపలి, ఇంద్రియాలచే; కృతసంచారుండును= చేయబడిన సంచారము కలవాడు; హరిచింతా పరుండునున్+ఐ= విష్ణుని ధ్యానించడంలో ఆసక్తి కలవాడును అయి; ఉండుటన్= ఉండటాన్ని; తెలియలేక= గ్రహించలేక.

**తా :** ఆ శమీకముని మాటాడలేదు. ఆ ముని కన్నులు మూసికొని సమాధిలో, బాహ్యేంద్రియజ్ఞానంలేక పరమేశ్వర ధ్యానంలో నిమగ్నుడై ఉన్నాడని పరీక్షిత్తు తెలుసుకోలేకపోయాడు.

ఉ. కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్న వాఁడు, చే
సన్నల నైన రమ్మనఁడు, సారజలంబులు దెచ్చి పోయఁ డే
మన్ననలైనఁ జేయఁడు, సమగ్రఫలంబులు వెట్టఁడింత సం
పన్నత నొందెనే తన తపశ్చరణాప్రతిమ ప్రభావముల్. 461

**ప్రతి :** బ్రాహ్మణుఁడు= విప్రుడైన ఈ ముని; కన్నులు మూసి= కన్నులు మూసికొని; గర్వముతోడుతన్+ఉన్నవాఁడు= అహంకారంతో ఉన్నాడు; చే సన్నలన్+ఐన= చేతి సైగలతోనైన; రమ్ము+అనఁడు= రా అని చెప్పడు; సారజలంబులు= మంచినీళ్లు; తెచ్చి= తీసికొనివచ్చి; పోయఁడు= విడువడు; ఏ మన్ననలు+ఐనన్= ఎటువంటి గౌరవం కూడ; చేయఁడు= ఒనరింపడు; సమగ్ర ఫలంబులు+పెట్టఁడు= పండిన పండ్లు తినుటకు ఈయడు; తన= అతని; తపస్+చరణ= తపస్సు చేయటంవలన; న+ప్రతిమ= సాటిలేని; ప్రభావముల్= మహత్త్వములు (గొప్పతనములు); ఇంత= ఇంతగా; సంపన్నతన్= సంపద కలిగి ఉండటాన్ని, సమృద్ధిగా ఉండటాన్ని; ఒందెనే= పొందెనా?

**తా :** ఈ బ్రాహ్మణుడు అహంకారంతో కన్నులు మూసికొని ఉన్నాడు. ఉలుకడు పలుకడు. పోనీ రండి అని చేతి సైగలైన చేయడు. త్రాగుటకు మంచినీళ్లు ఇవ్వడు. మహారాజును గదా మర్యాదగా నాకు ఏవైనా పండ్లు తెచ్చి పెట్టడు. తపస్సుయొక్క ప్రభావంతో ఇంతగా కన్నులు మూసికొనిపోయే సంపదలు ఒనగూడినవా?

ఆ. వారిఁగోరుచున్న వారికి శీతల, వారి యిడుట యెట్టివారి కయిన
వారితంబుగాని వలసిన ధర్మంబు, వారి యిడఁడు దాహవారి గాఁడు. 462

**ప్రతి :** వారిన్= నీటిని కోరుచున్న; వారికిన్= ఆశిస్తున్న వారికి; శీతలవారి= చల్లని నీరు; ఇడుట= ఇవ్వడం; ఎట్టివారికి+అయినన్= ఎంతటివారికైన; వారితంబు+కాని= అడ్డగింపబడని; వలసిన ధర్మంబు= తప్పక చేయవలసిన కర్తవ్యం; వారి= నీరు; ఇడఁడు= ఈయడు; దాహవారి+కాఁడు= దప్పికను నివారించేవాడు కాదు.

**తా :** దప్పికతో నోరెండి ఇంటిముంగిటికి వచ్చి నీరడిగిన అతిథికి చల్లని నీరు తెచ్చి ఇవ్వటం ఎంతటివారికైనా అవశ్య కర్తవ్యం. కాని ఈ మౌని నాకు నీరిచ్చి దప్పిక తీర్చడేమి?

చ. అని మనుజేశ్వరుండు మృగయాపరిఖేద నితాంత దాహ సం
జనిత దురంత రోషమున సంయమి దన్నుఁ దిరస్కరించి పూ
జనములు సేయఁడంచు మృతసర్పము నొక్కటి వింటికోపునం
బనివడి తెచ్చి వైచె నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్. 463

**ప్రతి :** అని= ఆ ప్రకారంగా; మనుజ+ఈశ్వరుండు= రాజు; మృగయాపరిఖేద= వేటవలని బాధచే; నితాంత దాహ= మిక్కిలి దప్పికచే; సంజనిత= కలిగిన; దురంత రోషమునన్= అంతులేని కోపంతో; సంయమి= మౌని; తన్నున్= తనను; తిరస్కరించి= లెక్క చేయకుండా; పూజనములు= సేవలు; చేయఁడు+అంచున్= చేయలేదనుచు; మృతసర్పమున్= చచ్చిన పామును; ఒక్కటిన్= ఒకదానిని; వింటికోపునన్= వింటికొనతో; పనివడి= పూనుకొని; తెచ్చి= తీసికొనివచ్చి; అటు= ఆ ప్రకారంగా; బ్రహ్మముని+ఇంద్రుని= బ్రహ్మర్షిశ్రేష్ఠుని; అంస+వేదికన్= వేదికవంటి భుజంపై; వైచెన్= వేసెను.

**తా :** ఆ విధంగా పరీక్షిత్తు వేటలో మిక్కిలి అలసి గొంతెండి అంతులేని రోషంతో లోలోపల కుమిలిపోతూ, కోపాన్ని ఆపుకోలేక, మహర్షి తిరస్కారాన్ని భరింపనివాడై వింటికొప్పుతో ఒక చచ్చిన పామును అదేపనిగా తీసికొనివచ్చి ఆ బ్రహ్మర్షి మూపుపై పడవేసినాడు.

వ. ఇట్లతండు ప్రత్యాహృత బాహ్యాంతరింద్రియుం డగుట నిమీలితలోచనుండు గా నోపునో యట్లుగాక గతాగతులగు క్షత్త్రబంధులచే నేమియని మృషాసమాధి నిష్ఠుండు గానోపునో, యని వితర్కించుచు వృథారోష దర్పంబున ముని మూఁపున గతాసువయిన సర్పంబు నిడి నరేశ్వరుండు దనపురంబునకుం జనియె; నంత సమీపవర్తులైన మునికుమారు లంతయుం దెలియం జూచి శమీకనందనుండైన శృంగికడకుం జని. 464

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అతండు= అతడు; ప్రత్యాహృత= ప్రత్యాహారము చేయబడి (వెనుకకుగొని రాబడిన); బాహ్య+అంతర్+ఇంద్రియుండు= వెలుపలి, లోపలి ఇంద్రియాలు కలవాడు; అగుటన్= అగుటచేత; నిమీలిత లోచనుండు+ కాన్+ఓపును+ఓ= కన్నులు మూసినవాడు అయి ఉండునో; అట్లుగాక= అలాకాక; గత+ఆగతులు+అగు= వచ్చి పోవువారగు; క్షత్ర బంధులచేన్= సామాన్య రాజులచే; ఏమి+అని= ఏమి అక్కర అని; మృషాసమాధి+నిష్ఠుండు= కపటమైన సమాధిలో నిలిచినవాడు; కాన్+ఓపున్+ఓ= అయి ఉండునో; అని= అట్లు; వితర్కించుచున్= మిగుల సందేహిస్తూ; వృథారోష దర్పంబునన్= వ్యర్థమైన రోషంతో, గర్వముతో; మునిమూఁపునన్= మునియొక్క భుజస్కంధంమీద; గత+అసువు+అయిన= పోయిన ప్రాణాలు కలదైన; సర్పంబున్= పామును; ఇడి= ఉంచి; నర+ఈశ్వరుండు= రాజు; తన పురంబునకున్+చనియెన్= తన నగరానికి వెళ్లినాడు; అంతన్= అటుపై; సమీపవర్తులు+ఐన= చెంతనున్నవారగు; మునికుమారులు= మునిపుత్రులు; అంతయున్= సమస్తము; తెలియన్+చూచి= తెలియగా గ్రహించి; శమీకనందనుండు+ఐన= శమీకుని పుత్రుడైన; శృంగి కడకున్= శృంగిచెంతకు; చని= పోయి.

**తా :** ఈ ముని నిజంగా ధ్యానంలో నిష్ఠాగరిష్ఠుడై కన్నులు మూసి కూర్చొని ఉన్నాడా? లేక ఎప్పుడు వచ్చిపోయే సామాన్య రాజులతో మనకేమి పని అని దొంగజపం చేస్తున్నాడా? అని తనలో తలపోయుచు చచ్చి పడియున్న పామును తెచ్చి మునిమూపుమీద వేసి హస్తినాపురానికి వెళ్లినాడు. అప్పుడు చుట్టుప్రక్కల గల మునికుమారులు ఇదంతా చూచి శమీకమునికుమారుడైన శృంగి దగ్గరకు వెళ్ళి.

## ✤ శమీకపుత్త్రుం డగు శృంగి పరీక్షితుని శపించుట ✤

**క. నరగంధగజస్యందన, తురగంబుల నేలు రాజు తోయాతురుఁడై**
**పరఁగన్ నీ జనకుని మెడ, నురగముఁ దగిలించి పోయె నోడక తండ్రీ! 465**

**ప్రతి :** తండ్రీ= నాయనా!; నర+గంధగజ+స్యందన తురగంబులన్= నరులు (కాలిబంటులు), మదపుటేనుగులు, రథములు, గుఱ్ఱాలను; ఏలు= పాలించు; రాజు= ప్రభువు; తోయ+ఆతురుఁడు+ఐ= నీటికై ఆత్రము కలవాడై; పరఁగన్= స్పష్టంగా; నీ జనకునిమెడన్= నీ తండ్రి మెడలో; ఉరగమున్= పామును; ఓడక= జంకక; తగిలించిపోయెన్= వేసిపోయినాడు.

**తా :** తండ్రీ! భటులు, ఏనుగులు, రథాలు, గుఱ్ఱాలు గల సేనతో రాజ్యాన్ని ఏలే రాజొకడు వచ్చి, నీటికోసమై తహతహపడి, మంచి చెడ్డ ఆలోచింపక నీ తండ్రిమెడలో పామును వేసివెళ్లినాడు.

**వ. అని పలికిన సమానవయోరూపమునికుమార లీలాసంగి యయిన శృంగి శృంగంబులతోడి మూర్తి ధరించినట్లు విజృంభించి రోషసంరంభంబున నదరిపడి బల్యన్నంబుల భుజించి పుష్టంబు లగు నరిష్టంబులుం బోలె బలిసియు ద్వారంబులం గాచికొని యుండు సారమేయంబుల పగిది దాసభూతులగు క్షత్త్రియాభాసు లెట్టు బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితు లయిరి? అట్టివార లెట్లు తద్గృహంబుల భాండసంగతంబగు నన్నంబు భుజింప నర్హు లగుదురు? తత్కృతంబు లయిన ద్రోహంబు లెట్లు నిజ స్వామిం జెందు నని మఱియు నిట్లనియె. 466**

**ప్రతి :** అని= అట్లు; పలికినన్= చెప్పగా; సమాన వయస్+రూప= తనతో సమానమైన వయస్సు, రూపములుగల; మునికుమార లీలాసంగి= ముని కుమారులతో ఆటలందున్న; అయిన= అయినట్టి; శృంగి= శృంగి; శృంగంబులతోడి= కొమ్ములతోడి; మూర్తి ధరించినట్లు= స్వరూపాన్ని దాల్చినవిధంగా; విజృంభించి= చెలరేగి; రోష సంరంభంబునన్= రోషమువలని తొట్రుపాటుతో; అదరిపడి= ఉలికిపడి; బలి+అన్నంబులన్= బలిగా పెట్టిన అన్నములను; భుజించి= తిని; పుష్టంబులు+అగు= పోషింపబడినవగు; అరిష్టంబులున్+పోలెన్= కాకులవలె; బలిసియున్= పోతరించియు; ద్వారంబులన్+కాచికొని+ఉండు= వాకిళ్ళకడ వేచి ఉండే; సారమేయంబుల పగిదిన్= కుక్కలవలె; దాసభూతులు+అగు= బానిసలగు; క్షత్రియ+ఆభాసులు= రాజుల వేషమున ఉన్నవారు; ఎట్టు= ఎట్లు; బ్రాహ్మణ+ఉత్తములచేన్= బ్రాహ్మణశ్రేష్ఠులచే; స్వ+రక్షకులుగన్= తమ రక్షకులుగా; నిరూపితులు+అయిరి= నిరూపింపబడిన వారైనారు?; అట్టివారలు= అటువంటివారు; ఎట్లు= ఏ విధంగా; తద్+గృహంబులన్= ఆ ఇండ్లలో; భాండసంగతంబు+అగు= కుండలలో ఉన్నది అగు; అన్నంబు= అన్నము; భుజింపన్= తినుటకు; అర్హులు+అగుదురు?= పాత్రులౌదురు?; తద్+కృతంబులు+అయిన= వారిచే కావింపబడినవి అగు; ద్రోహంబులు= ద్రోహకార్యములు; ఎట్లు= ఏ విధంగా; నిజ+స్వామికిన్= తమ ప్రభువునకు; చెందును= చెందగలవు; అని= అట్లు పలికి; మఱియున్= ఇంకను; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ఆ మాటలు విని, ముని కుమారులతో ఆడుతున్న శృంగి, కొమ్ములతో రూపం దాల్చినట్లు విజృంభించి, రోషావేశంతో అదరిపడుతూ ఇట్లన్నాడు “ఈ రాజులు బలి పెట్టిన పిండాలు తిని బలిసిన కాకులు. ద్వారాల కడ కాచుకొని ఉన్న కుక్కలు! దాసులైన ఈ క్షత్రియులమని అనుకొనేవారిని భూసురోత్తములు తమ గృహరక్షకులుగా ఎట్లు నియమించినారు? ద్వారపాలకులుగా మాత్రమే ఉండదగినవారు వంట యింటిలో ప్రవేశించి వండిన అన్నం తినటానికి ఎలా అర్హులౌతారు? వారు చేసే ద్రోహకార్యాలకు యజమాని ఎందుకు బాధ్యుడౌతాడు?

ఉ. ఆడఁడు తన్ను దూషణము, లాశ్రమవాసులఁ గాని వైరులం
గూడఁడు, కందమూలములు గూడుగఁ దించు సమాధినిష్ఠుఁడై
వీడఁడు లోని చూడ్కులను, విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం
జూడఁడు మద్గురుండు; ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్? **467**

**ప్రతి :** మత్+గురుండు= నా తండ్రి; తన్నున్= తనను; దూషణములు+ఆడఁడు= నిందలు పలుకడు; ఆశ్రమవాసులన్+కాని= ఆశ్రమంలో నివసించేవారినే కాని; వైరులన్= శత్రువులను; కూడఁడు= చేరడు; కందమూలములు= గడ్డలు దుంపలు; కూడుగన్= భోజనంగా; తించున్= తింటూ; సమాధినిష్ఠుఁడు+ఐ= ధ్యానంలో నిష్ఠ కలవాడై; లోని చూడ్కులను= లోపలి చూపులను; వీడఁడు= విడిచిపెట్టడు; విష్ణునిన్+తక్కన్= హరిని తప్ప; పర ప్రపంచమున్= ఇతర లోకమును; చూడఁడు= చూచి ఎఱుగడు; రాచవానికిన్= రాజైనవానికి; ఫణిన్= పామును; చుట్టఁగన్= (మెడలో) చుట్టగా; ఏటికిన్= ఎందుకు?

**తా :** మా తండ్రి తనను నిందింపలేదు. ఆశ్రమవాసులతోనే గాని శత్రువులతో కూడలేదు. కందమూలాలు తిని, నిశ్చల సమాధిలో అంతర్దృష్టిని విడువక నిరంతరం తన ఇష్టదైవాన్ని తప్ప అన్య ప్రపంచాన్ని చూడకుండ తానేమో, తన లోకమేమో అన్నట్లున్న ఆయనపై ఆ రాచవాడు అరాజకంగా పామును మెడలో చుట్టడం ఎందుకు?

**విశే :** ఈ పద్యం పూర్తిగా పోతన కల్పితం. దీనికి మూలం లేదు. క్రియాపదంతో పద్యాన్ని ఆరంభించటం గడుసరితనం. అది చాల కష్టసాధ్యం. కాని ఆయనకది సహజ విలాసం. అది ఒక్కపాదంతోనే కాదు. నాల్గు పాదాలలో అనుప్రాస మనోజ్ఞంగా ఉంది. ఈ పద్యంలో 'ఆడడు'తో ఆరంభమైన క్రియ కూడడు, వీడడు, చూడడు అని తక్కిన పాదాలలో అప్రయత్నంగా తమకు తామై వచ్చి కుదురుకొన్నాయి.

ఉ. పోము హిరణ్య దానములఁ బుచ్చుకొనంగ, ధనంబు లేమియుం
దేము, సవంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా
రాము, వనంబులన్ గృహవిరాములమై నివసింపఁ జెల్లరే
పామును వైవఁగాఁ దగునె బ్రహ్మమునీంద్రుభుజార్గళంబునన్? **468**

**ప్రతి :** హిరణ్యదానములన్= బంగారుదానములను; పుచ్చుకొనంగన్= గ్రహించటానికి; పోము= వెళ్ళము; ధనంబులు+ఏమియున్= ధనములు ఏమికూడా; తేము= తేలేదు; దీవనలు= ఆశీస్సులు; సవంచనంబులుగన్= మోసంతో కూడినవిగా; ఇచ్చుచున్= అనుగ్రహిస్తూ; వేసరింపఁగాన్= విసుగు పుట్టింపగా; రాము= రాలేదు; గృహ విరాములము+ఐ= ఇండ్లపై ఆసక్తి వీడినవారమై; వనములన్= అడవులలో; నివసింపన్= వసింపగా; చెల్లరే= తగదే; బ్రహ్మ మునీంద్రు= బ్రహ్మర్షియొక్క; భుజా+అర్గళంబునన్= గడియ మ్రానువంటి భుజమునందు; పామున్= సర్పమును; వైవఁగాన్= వేయగా; తగునె?= న్యాయమా?

**తా :** రాజుల కడకు మేము హిరణ్యదానాలు గ్రహించటానికి పోలేదు. ధనములు తేలేదు. ఆశీర్వాదములని చెప్పి మోసంచేసి వారి ద్వారాల కడ నిలిచి విసిగించలేదు. ఇండ్లపై కూడ ఆసక్తిని వీడి ఆడవులలో పడి ఉన్నాము. అట్టియెడ బ్రహ్మర్షి అయిన మా తండ్రిమెడలో పామును వేయటం తగునా?

**క. పుడమిఁగల జనులు వొగడఁగఁ, గుడుతురు గట్టుదురుగాక కువలయపతులై**
**యడవుల నిడుమలఁ బడియెడి, బడుగుల మెడ నిడఁగఁ దగునె పన్నగశవమున్? 469**

**ప్రతి :** కువలయపతులు+ఐ= (భూవలయమునకు అధిపతులై) రాజులై; పుడమిన్+కల= భువియందున్న; జనులు= ప్రజలు; పొగడఁగన్= ప్రశంసింపగా; కుడుతురు= (ఇష్టాన్నము) భుజింతురు; కట్టుదురు+కాక= కట్టుకొందురుగాక; అడవులన్= అరణ్యములలో; ఇడుమలన్+పడియెడి= బాధలుపడెడి; బడుగుల= అశక్తుల; మెడన్= మెడలో; పన్నగశవమున్= చచ్చిన పామును; ఇడఁగన్+తగును+ఎ= ఉంచుట సమంజసమా?

**తా :** ప్రాజ్య సామ్రాజ్యాన్ని ఏలే సమ్రాట్టులు తమ్ము ప్రజలు పొగడగా పంచభక్ష్యపరమాన్నాలు భుజింపవచ్చు. విలువగల వలువలు ధరించవచ్చు. అంతేకాని అడవులలో ఇడుమలుపడే బడుగు (తాపసుల) జడదారుల మెడలో చచ్చిన పామును చుడతారా?

**క. భగవంతుఁడు గోవిందుఁడు, జగతిం బెడఁబాసి చనిన శాసింపంగాఁ**
**దగువారు లేమి దుర్జను, లెగసి మహాసాధుజనుల నేఁచెద రకటా! 470**

**ప్రతి :** భగవంతుఁడు= షడ్గుణపూర్ణుడు; గోవిందుఁడు= శ్రీకృష్ణుఁడు; జగతిన్= లోకమును; పెడఁబాసి= విడిచి; చనినన్= పోగా; శాసింపంగాన్= శాసనం చేయటానికి; తగువారలు= యోగ్యులైనవారు; లేమిన్= లేకుండటంతో; దుర్జనులు= చెడ్డవారు; ఎగసి= విజృంభించి; మహాసాధుజనులన్= మిక్కిలి మంచివారిని; ఏఁచెదరు= బాధ పెడతారు; అకటా!= అయ్యో!.

**తా :** భగవంతుడు శ్రీకృష్ణుడు లోకాన్ని విడిచి వెళ్లిన అనంతరం సమర్థుడైన శాసకుడు లేకపోవటం వలన దుర్మార్గులు చెలరేగి నిరపరాధులైన సాధువులను బాధిస్తున్నారు.

**క. బాలకులార! ధరిత్రీ, పాలకు శపియింతు ననుచు బలువడిని విలో**
**లాలకుఁడగు మునికుంజర, బాలకుఁ డరిగెం త్రిలోకపాలకు లదరన్. 471**

**ప్రతి :** బాలకులార!= (ముని కుమారులైన) పిల్లలారా!; ధరిత్రీపాలకున్= రాజును; శపియింతును= శపించెదను; అనుచున్= అని పలుకుచు; బలువడిని= మిక్కిలి వేగంగా; విలోల+అలకుఁడు+అగు= మిక్కిలి చెదరిన ముంగురులు కలవాడగు; మునికుంజర బాలకుఁడు= మునిశ్రేష్ఠుని కుఱ్ఱవాడు; త్రిలోక పాలకులు= ముల్లోకములను పాలించువారు; అదరన్= ఉలికిపడగా; అరిగెన్= వెళ్ళాడు.

**తా :** బాలకులారా! నే నిప్పుడే ఆ రాజుకు శాపం పెడతాను అని మునిబాలకుడైన శృంగి ముల్లోకాలను ఏలే వారికే అదరుపాటు కలిగేట్లుగా వడివడిగా వెడలినాడు.

**విశే :** షడ్గుణాలు – ఐశ్వర్యం, వీర్యం, యశస్సు, సంపద, జ్ఞానం, విజ్ఞానం.

**వ. ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శంబు సేసి. 472**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రోషించి= రోషపడి (కోపించి); కౌశికీనదికిన్= కౌశికి అనే పేరుగల నదికి; చని= పోయి; జల+ఉపస్పర్శంబు= నీటిని తాకుట (సంకల్పము చేయుట); చేసి= కావించి.

**తా :** కౌశికి నదికి రోషంతో వెళ్లి, నీళ్లు చేతిలోకి తీసికొన్నాడు.

**ఉ. ఓడక వింటికోపున మృతోరగముంగొని వచ్చి మాఱు మా**
**టాడక యున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మద**
**క్రీడఁ జరించు రాజు హరకేశవు లడ్డిన నైనఁ జచ్చుఁ బో**
**యేడవనాఁడు తక్షకఫణీంద్ర విషానలహేతి సంహతిన్. 473**

**ప్రతి :** ఓడక= జంకక; వింటికోపునన్= వింటికొనతో; మృత+ఉరగమున్= చచ్చిన పామును; కొని= తీసికొని; వచ్చి= ఏతెంచి; మాఱుమాట+ఆడక+ఉన్న= బదులు పలుకు పలుకకున్న; మత్+జనకు= నా తండ్రియొక్క; అంస+తలంబునన్= మూపుపై; పెట్టి= ఉంచి; దుర్మద+క్రీడన్= పొగరుపట్టిన విలాసంతో; చరించు= తిరిగే; రాజు= ప్రభువు (పరీక్షిత్తు); హర+కేశవులు= శివుడు, విష్ణువు; అడ్డినన్+ఐనన్= తనకు అడ్డు వచ్చినప్పటికి; ఏడవనాఁడు= ఏడవ దినము; తక్షక+ఫణి+ఇంద్ర= తక్షకుడు అనే సర్పరాజుయొక్క; విష+అనల హేతి సంహతిన్= విషమనే అగ్ని శిఖల (మంట) సమూహంతో; చచ్చున్+పో= మరణిస్తాడు పో, మరణించుగాక!

**తా :** లేశమైన సంకోచం లేకుండ చచ్చిన పామును తీసికొని వచ్చి మా తండ్రి భుజంపై పడవేసి దురహంకారంతో కన్ను మిన్ను కానని ఆ రాజు హరిహరులు అడ్డుపడినా నేటికి ఏడవ దినం తక్షకుని విషాగ్ని జ్వాలలకు దగ్ధమయిపోతాడు.

**వ. అని శమీకమహామునికుమారుం డయిన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి, నిజాశ్రమంబునకుం జనుదెంచి కంఠలగ్న కాకోదర కళేబరుండైన తండ్రిం జూచి. 474**

**ప్రతి :** అని= ఆ విధంగా; శమీక మహాముని కుమారుండు+అయిన శృంగి= శమీక మహర్షి కొడుకైన శృంగి; పరీక్షిత్+నర+ఇంద్రునిన్= పరీక్షిన్మహారాజును; శపియించి= శాపం ఇచ్చి; నిజ+ఆశ్రమంబునకున్= తన ఆశ్రమానికి; చనుదెంచి= వచ్చి; కంఠలగ్న= మెడకు తగుల్కొన్న; కాకోదర+కళేబరుండు+ఐన= పాము శరీరం కలవాడైన; తండ్రిన్= జనకుని; చూచి= కనుగొని.

**తా :** అని శమీక మునీంద్రుని కొడుకు పరీక్షిన్మహారాజును శపించి ఆశ్రమం చేరి ధ్యాన నిమగ్నుడైన తండ్రిని చూచినాడు. అప్పుడు ఆయన మెడలో ఆ చచ్చినపాము వ్రేలాడుతూనే ఉన్నది.

**క. ఇయ్యెడ నీ కంఠమునను, నియ్యురగ కళేబరంబు నిటు వైచిన యా**
**యయ్య నిఁక నేమి సేయుదు, నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ! 475**

**ప్రతి :** తండ్రీ!= అయ్యా!; ఈ+ఎడన్= ఈ సందర్భంలో; నీకంఠమునను= నీ మెడయందు; ఈ+ఉరగ కళేబరంబున్= ఈ పాము శరీరాన్ని; ఇటు= ఈ విధంగా; వైచిన= వేసిన; ఆ+అయ్యన్= ఆ పెద్దమనుష్యుని (దొరగారిని); ఇఁకన్= ఇంక; ఏమి+చేయుదున్= ఏమి చేయగలను?; నృపులకున్= రాజులకు; నెయ్యంబులు= స్నేహములు; లేవు+సుమ్ము= లేవు సుమా!

**తా :** అయ్యో! తండ్రీ! ఈ సందర్భంలో నీ మెడలో చచ్చిన పామును పడవేసిన ఆ దొరగారిని ఏమి చేస్తాను? రాజులకు స్నేహధర్మాలు లేవు సుమా!

**శా. ప్రారంభంబున వేఁట వచ్చి ధరణీపాలుండు, మా తండ్రిపై**
**నేరం బేమియు లేక సర్పశవమున్ నేఁ డుగ్రుఁ డై వైచి నాఁ**
**డీరీతిన్ ఫణి గ్రమ్మఱన్ బ్రదుకునో, హింసించునో కోఱలన్,**
**రారే తాపసులార! దీనిఁ దివరే, రక్షింపరే, మ్రొక్కెదన్. 476**

**ప్రతి :** తాపసులార! = మునీశ్వరులారా!; ధరణీపాలుండు = రాజు; ప్రారంభంబునన్ = యత్నముతో; వేట+వచ్చి = వేటకై వచ్చి; మా తండ్రిపైన్ = మా తండ్రిమీద; నేరంబు+ఏమియున్+లేక = తప్పు ఏమియూ లేక; సర్పశవమున్ = చచ్చిన పామును; నేఁడు = ఈనాడు; ఉగ్రుఁడు+ఐ = భయంకరుడై; వైచినాఁడు = వేశాడు; ఈ రీతిన్ = ఈ విధంగా; ఫణి = పాము; క్రమ్మఱన్ = మరల; బ్రదుకును+ఓ = జీవించునో; కోఱలన్ = కోరలతో; హింసించును+ఓ = బాధించునో; రారే! = రండు; దీనిన్ = ఈ పామును; తివరే = తీసివేయరే; రక్షింపరే! = కాపాడరే!; మ్రొక్కెదన్ = నమస్కరిస్తున్నాను.

**తా :** ఓ తాపసులారా! ఎవరో రాజు వేటకైవచ్చి నిరపరాధియైన నా తండ్రిమీద నిష్కారణంగా నిర్దయుడై ఈ చచ్చిన పామును మెడలో పడవేసి వెళ్ళినాడు. భయంకరమైన సర్పం మరలా బ్రతుకుతుందో ఏమో! క్రూరమైన కోరలతో కాటు వేస్తుందో ఏమో! మీకు నమస్కరిస్తున్నాను. రండి. ఈ పామును తీసి పారవేయండి. మా తండ్రిని కాపాడండి.

**విశే :** ఆశ్రమమునకు వచ్చిన శృంగి తండ్రి మెడలో పామును చూచినాడు. అది ఇంకను కొన ఊపిరితో ఉన్నదేమో అన్న సందేహమున్నది. బాలుడు కావున అట్టి సందేహం సహజం. కావున భయంతో ముందుగా ఆ పామును తొలగించండి అని ఆశ్రమవాసులను నమస్కరించి వేడుకొన్నాడు.

**వ. అని వెఱపున సర్పంబుఁ దిగుచు నేర్పు లేక యెలుంగెత్తి యేడ్చుచున్న కుమారకు రోదనధ్వని విని యాంగిరసుండయిన శమీకుండు సమాధి సాలించి మెల్లన కన్నులు దెఱచి మూఁపున వ్రేలుచున్న మృతోరగంబు నీక్షించి, తీసి పాఱవైచి, కుమారకుం జూచి. 477**

**ప్రతి :** అని = అని పలుకుతూ; వెఱపునన్ = భయంతో; సర్పంబున్ = పామును; తిగుచు నేర్పు = తీసివేసే నైపుణ్యం; లేక = (తెలియక) లేక; ఎలుంగు+ఎత్తి = కంఠస్వరం ఎత్తి (గొంతెత్తి); ఏడ్చుచున్న = రోదిస్తూన్న; కుమారకు రోదన ధ్వని = కొడుకు ఏడ్పు చప్పుడు; విని = ఆలకించి; ఆంగిరసుండు+అయిన = అంగిరసుని వంశం వాడైన; శమీకుండు = శమీకుడు; సమాధి = యోగస్థితి (ధ్యానము తరువాతి స్థితి); చాలించి = విరమించి; మెల్లన = తిన్నగా; కన్నులు = నేత్రములు; తెఱచి = విచ్చి; మూఁపునన్ = భుజంపై; వ్రేలుచు+ఉన్న = వ్రేలాడుచున్న; మృత+ఉరగంబున్ = చచ్చిన పామును; వీక్షించి = చూచి; తీసిపాఱవైచి = చేతితో తొలగించి, విసరివేసి; కుమారకున్ = పుత్రుని; చూచి = కాంచి...

**తా :** అట్లు పలుకుతూ భయంతో ఆ పామును తొలగించే నేర్పు లేక బిగ్గరగా కొడుకు ఏడ్చినాడు. ఆ కుమారుని ఆక్రందన ధ్వని విని, శమీక మహాముని తన సమాధి చాలించి మెల్లగా కన్నులు తెరచినాడు. భుజంపై వ్రేలాడుతున్న భుజంగాన్ని తీసి దూరంగా పారవేసి, కొడుకును జూచి

**క. ఏ కీడు నాచరింపము, లోకులకున్ మనము సర్వలోక సములమున్**
**శోకింప నేల పుత్రక!, కాకోదర మేల వచ్చెఁ గంఠంబునకున్? 478**

**ప్రతి :** పుత్త్రక!= కుమారా!; మనము= మనము; లోకులకున్= జనులకు; ఏ కీడున్ ఆచరింపము= ఏ హానియూ చేయము; సర్వ లోక సములమున్= లోకులు అందరిని సమంగా ఆదరింతుము; శోకింపన్+ఏల?= నీవు దుఃఖించటం ఎందుకు?; కాకోదరము= పాము; కంఠంబునకున్= నా మెడకు; ఏలవచ్చెన్= ఎందుకు వచ్చినది?

**తా :** నాయనా! మనం ఎవరికీ ఏ కీడు చేసినవారము కాము. లోకులందరినీ సమానంగా ఆదరిస్తాము. నీవు ఎందుకు ఏడుస్తున్నావు? ఈ సర్పం నా మెడకు ఎలా వచ్చింది?

**వ. అని యడిగినఁ దండ్రికిఁ గొడుకు రాజు సర్పంబు వైచుటయుం దాను శపించుటయును వినిపించిన, న మ్ముని తన దివ్య జ్ఞానంబున న మ్మానవేంద్రుండు పరీక్షిన్నరేంద్రుండని యెఱింగి కొడుకువలన సంతసింపక యిట్లనియె. 479**

**ప్రతి :** అని= అట్లు; అడిగినన్= ప్రశ్నింపగా; తండ్రికిన్= జనకునికి; కొడుకు= తనయుడు; రాజు= ప్రభువు; సర్పంబు= పామును; వైచుటయున్= పడవేయుట; తాను= తాను; శపించుటయునున్= శాపము పెట్టుటా; వినిపించినన్= తెలియజేయగా; ఆ+ముని= ఆ ఋషి; తన దివ్యజ్ఞానంబునన్= తన దివ్యదృష్టితో; ఆ+మానవ+ఇంద్రుండు= ఆ రాజు; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; అని+ఎఱింగి= అని తెలిసికొని; కొడుకువలనన్= కుమారుని వలన (సుతుడు చేసిన పనివలన); సంతసింపక= సంతోషపడక; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని ప్రశ్నించినాడు. అప్పుడు కుమారుడు శృంగి, రాజు వచ్చి పాము వేయటం, తాను ఆ రాజును శపించటం తెలిపినాడు. వెంటనే శమీకుడు తన దివ్యదృష్టితో ఆ రాజు పరీక్షిన్మహారాజని తెలుసుకొని, కొడుకు చేసిన పనికి బాధపడి ఇట్లన్నాడు.

**క. బెట్టిద మగు శాపమునకు, దట్టపు ద్రోహంబు గాదు; ధరణీకాంతుం**
**గట్టా! యేల శపించితి, పట్టీ! తక్షక విషాగ్నిపాలగు మనుచున్? 480**

**ప్రతి :** పట్టీ!= కుమారా!; బెట్టిదము+అగు= కఠినమగు; శాపమునకున్= శాపానికి; దట్టపు+ద్రోహంబు= రాజు చేసినది గట్టి కీడు; కాదు= కాదు; ధరణీకాంతున్= భూమికి భర్త అయిన పరీక్షిత్తును; తక్షక విష+అగ్ని పాలు= తక్షకుని విషము అనే అగ్నికి అధీనం; అగుము= కమ్ము; అనుచున్= అని; ఏల+శపించితి= ఎందుకు శపించినావు; కట్టా!= అయ్యో!

**తా :** కుమారా! ఇంతటి కఠోర శాపాన్ని పెట్టటానికి అంతటి గొప్ప కీడు ఆ మహారాజు ఏమీ చేయలేదు. తక్షక విషాగ్ని జ్వాలలపాలు కమ్మని ఆ ధరణీనాథుని అయ్యయ్యో! ఎందుకు శపించినావు?

**విశే :** 'అల్పీయసి ద్రోహ ఉరుర్దమో ధృతః' – ఇది మూలంలోని చివరిపాదం. 'అల్పమైన తప్పునందు అధికదండన ధరింపబడింది (ఈయబడినది) అని ఇందలి భావం. దీనినే పోతన – బెట్టిదమగుశాపము దట్టపుద్రోహంబు కాదు' అని ద్విత్వ టకారప్రాసతో పదాలు కూర్చినాడు. 'కట్టా యేల శపించితి' అను వాక్యంలో అహో! బతాంహో మహదజ్ఞతేకృతం అను మూలమునందలి భావమే కొంత సున్నితంగా ప్రశ్నార్థకంగా ప్రయుక్తమైనది.

**ఆ. తల్లి కడుపులోన దగ్ధుఁడై క్రమ్మఱఁ, గమలనాభు కరుణఁ గలిగినాఁడు;**
**బలిమి గలిగి ప్రజలఁ బాలించుచున్నాఁడు, దిట్టవడుగ! రాజుఁ దిట్టఁ దగునె? 481**

**ప్రతి :** దిట్టవడుగ!= గట్టివడుగా; తల్లి కడుపులోనన్= మాతృగర్భమునందు; దగ్ధుండు+ఐ= దహింపబడినవాడై; క్రమ్మఱన్= మరల; కమలనాభు+కరుణన్= పద్మనాభుడైన శ్రీకృష్ణుని దయవలన; కలిగినాండు= ప్రభవించినాడు; బలిమికలిగి= శక్తి కలిగి; ప్రజలన్= జనులను; పాలించుచున్+ఉన్నాండు= ఏలుచున్నాడు; రాజున్= (అట్టి) ప్రభువును; తిట్టన్+తగునె= శపింపతగునా?

**తా :** సమర్థుడవైన బ్రహ్మచారీ! పాపము! పరీక్షిత్తు తన తల్లి గర్భమునందే దహింపబడి, శ్రీకృష్ణుని అనుగ్రహంతో బ్రతికి బయటపడినాడు. ఇప్పుడు పరాక్రమంతో ప్రజలను పరిపాలిస్తున్నాడు. అటువంటి రాజును శపించవచ్చునా?

**ఉ. కాపరి లేని గొఱ్ఱియల కైవడిఁ గంటక చోరకోటిచే**
**నే పఱి యున్న దీభువన మీశుఁడు గృష్ణుఁడు లేమి; నిట్టిచో**
**భూ పరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింపఁ జెల్లరే!**
**యీ పరిపాటి ద్రోహమున కిట్లు శపింపఁగ నేల బాలకా? 482**

**ప్రతి :** బాలకా!= బాలుడా!; ఈ భువనము= ఈ లోకము; ఈశుఁడు= ప్రభువు; కృష్ణుఁడు= శ్రీకృష్ణభగవానుడు; లేమిన్= లేకపోవుటచే; కాపరిలేని= రక్షకుడులేని; గొఱ్ఱియల+కైవడిన్= గొర్రెలవలె; కంటకచోర+కోటిచేన్= కఠినులు క్షుద్రశత్రువులైన దొంగల గుంపుచే (కంటక శబ్దముచే ముండ్లవలె ప్రజలను బాధించే కఠినాత్ములు); ఏపు+అఱి= ఉత్సాహం నశించి (పుష్టిని కోల్పోయి); ఉన్నది= ఉన్నది; ఇట్టిచోన్= ఇట్టియెడ; ఇతండు= ఇతడు; సమబుద్ధిన్= సమత్వబుద్ధితో; భూపరిపాలనంబు= భూరక్షణ అనగా ప్రజాసంరక్షణ; ఒనరింపన్= చేయగా; చెల్లరే= అయ్యో!; ఈ పరిపాటి= ఇంతమాత్రపు; ద్రోహమునకున్= తప్పునకు; ఇట్లు= ఈ విధంగా; శపింపన్+ఏల?= శపించటం ఎందుకు?

**తా :** బాలకా! ప్రభువైన కృష్ణుడు లేకపోవటంచేత లోకము పుష్టిని కోల్పోయి ఏపు చెడినది. ప్రజలు కాపరిలేని గొర్రెలవలె కడగండ్లకు లోనైనారు. దొంగలు, దుండగులు విచ్చలవిడిగా చెలరేగినారు. ఇట్టి స్థితిలో మహారాజు అందరిని సమదృష్టితో ఎంతో సమర్థంగా పాలిస్తున్నాడు. ఏదో జరిగిన చిన్న తప్పిదానికి అయ్యో! రాజును ఎందుకు శపించినావు?

**విశే :** ఇచ్చట బాలకా! అన్న సంబోధనలో ఓరి అమాయకుడా! తెలియక ఎంత తప్పు చేసితివి? అని సూచన. మూలంలో పుత్రుడు చేసిన పనిని వినిన వెంటనే 'అజ్ఞ!' అనగా మూర్ఖా! అని సంబోధించినాడు. 'బాలకుడు' శబ్దంలో 'మూర్ఖుడు' అనే అర్థాన్ని కూడ సందర్భమునుబట్టి గ్రహించవచ్చు.

**సీ. పాపంబు నీచేతఁ బ్రాపించె మన; కింక రాజు నశించిన రాజ్యమందు**
**బలవంతుఁ డగువాఁడు బలహీను పశు దార హయ సువర్ణాదుల నపహరించు;**
**జారచోరాదులు సంచరింతురు; ప్రజ కన్యోన్యకలహంబు లతిశయిల్లు;**
**వైదికంబై యున్న వర్ణాశ్రమాచార ధర్మ మించుక లేక తప్పిపోవు;**

**ఆ. నంతమీఁద లోకు లర్థకామంబులఁ, దగిలి సంచరింప ధరణి నెల్ల**
**వర్ణసంకరములు వచ్చును మర్కట, సారమేయ కులము మేరఁ బుత్ర! 483**

**ప్రతి :** పుత్ర!= కుమారా!; మనకున్= మనకు; నీ చేతన్= నీవలన; పాపంబు= చేటు; ప్రాపించెన్= మూడింది; ఇంకన్= ఇకమీద; రాజు= ప్రభువు; నశించినన్= మృతిని పొందగా; రాజ్యమందున్= రాజ్యంలో; బలవంతుఁడు+అగువాఁడు=

బలం కలిగినవాడు; బలహీను= బలములేనివానియొక్క; పశు దార హయ సువర్ణ+ఆదులన్= పశువులను, భార్యను, గుఱ్ఱములను, బంగారం మొదలైనవానిని; అపహరించున్= దొంగిలిస్తాడు, దోపిడి చేస్తాడు; జార చోర+ఆదులు= వ్యభిచారులు, దొంగలు మొదలైనవారు; సంచరింతురు= తిరుగుతారు; ప్రజకున్= జనులకు; అన్యోన్య కలహంబులు= ఒకరితో ఒకరు కలహించుకోవటం; అతిశయిల్లున్= ఎక్కువౌతుంది; వైదికంబు+ఐ= వేదమునకు సంబంధించినదై; ఉన్న= ఉండే; వర్ణ+ఆశ్రమ+ఆచార ధర్మము= వర్ణముల, ఆశ్రమముల, ఆచారములకు చెందిన ధర్మము; ఇంచుక+లేక= కొంచెం కూడా లేక; తప్పిపోవున్= తొలగిపోతుంది; అంతమీఁదన్= అటుపైన; లోకులు= ప్రజలు; అర్థ+కామంబులన్= అర్థము (ధనము) కామములపై; తగిలి= ఆసక్తి కలిగి; సంచరింపన్= త్రిమ్మరుచుండగా; ధరణిన్+ఎల్లన్= భూమి అంతట; వర్ణసంకరములు= అన్ని వర్ణాలు కలసిపోవటం; మర్కట+సారమేయ కులము= కోతులు, కుక్కల సమూహము; మేరన్= (దూరము) వరకు; వచ్చును= సంక్రమిస్తుంది.

**తా :** కుమారా! నీ మూలంగా మనకు పాపం ప్రాప్తించింది. రాజు మరణింపగా ఆ రాజ్యంలో అరాచకం హద్దులు మీరుతుంది. బలం కలవాడు బలంలేని వానిపైబడి అతని సర్వస్వాన్నీ అపహరిస్తాడు. జారులు, చోరులు ఎచ్చట చూచినా బారులు తీరి విచ్చలవిడిగా విహరిస్తారు. ప్రజల్లో పరస్పర కలహాలు పెరిగిపోతాయి. వైదికములైన వర్ణాశ్రమములు, ధర్మాలు పూర్తిగా నశిస్తాయి. ధర్మం నశించిపోగా అర్థ కామాలపై ఆసక్తి పెరుగుతుంది. చివరకు రాజ్యమంతటా కోతుల్లో, కుక్కల్లోవలె వర్ణసంకరం ఏర్పడుతుంది.

**విశే :** సంకరం అంటే మళ్ళీ వేరు చేయటానికి వీలు లేకుండా కలసిపోవటం. తిలతండులవత్ సంసృష్టిః క్షీరనీరవత్ సంకరః. నువ్వులూబియ్యము కలిస్తే సంసృష్టి. పాలునీరూ కలిసినట్లు ఉండటం సంకరం.

**ఉ. భారతవంశజుం బరమభాగవతున్ హయమేధయాజి నా**
**చారపరున్ మహానయవిశారదు రాజకులైకభూషణున్**
**నీరము గోరి నేఁడు మన నేలకు వచ్చిన యర్థి భక్తి స**
**త్కారము సేసి పంపఁ జనుఁగాక, శపింపఁగ నీకు ధర్మమే? 484**

**ప్రతి :** భారతవంశజున్= భరతవంశంలో పుట్టినవానిని; పరమభాగవతున్= శ్రేష్ఠుడైన భగవద్భక్తుని (అందరిలో భగవంతుని చూచు ఉత్తమ భక్తుని); హయమేధయాజిన్= అశ్వమేధ యాగం చేసినవానిని; ఆచారపరున్= ధర్మాన్ని ఆచరించే ఆసక్తి కలవానిని; మహానయవిశారదున్= మిక్కిలి నీతిగల నేర్పరిని; రాజకుల+ఏకభూషణున్= రాజవంశాలన్నింటికి ఒకే అలంకారమైన వానిని; నేఁడు= ఈనాడు; నీరమున్= నీటిని; కోరి= ఆశించి; మన నేలకున్= మన ఆశ్రమభూమికి; వచ్చిన= విచ్చేసిన; అర్థిన్= వేడుకొనువానిని; భక్తిన్= భక్తితో; సత్కారము+చేసి= గౌరవించి; పంపన్+చనున్+కాక= పంపదగును కాని; నీకున్= నీకు; శపింపన్+కన్= శపింపగా; ధర్మము+ఏ= న్యాయమా?

**తా :** ఆ రాజు పవిత్రమైన భారత వంశంలో పుట్టినవాడు. పరమ భాగవతుడుగా పేరు కెక్కినవాడు, అశ్వమేధం చేసినవాడు, సదాచార సంపన్నుడు. గొప్ప రాజనీతిజ్ఞుడు. రాజకులాలంకారుడు అంతటి మహారాజు దప్పిక చెంది నీటికోసం మన తపోవనానికి విచ్చేయగా ఎంతో ఆదరంతో అతిథిసత్కారాలు చేయక ఊరక పంపటం ఉచితం కాదు. సత్కారం చేయకపోగా శపించటం యేమి న్యాయం? ఇది ధర్మమా?

**క. భూపతికి నిరపరాధమ, శాపము దా నిచ్చె బుద్ధి చాపలమున మా**
**పాపఁడు, వీఁడొనరించిన, పాపము దొలఁగింపు కృష్ణ! పరమేశ! హరీ! 485**

**ప్రతి :** కృష్ణ!= కృష్ణా!; పరమేశ!= పరమేశ్వరా!; హరీ!= పాపములను హరించువాడా!; బుద్ధిచాపలమునన్= బుద్ధి చలించటంవలన; మా పాపఁడు= మా పసివాడు; తాన్= తాను; భూపతికిన్= రాజునకు; నిరపరాధము+అ= తప్పులేకయే; శాపము+ఇచ్చెన్= శాపమొసగినాడు; వీఁడు+ఒనరించిన= వీడు చేసిన; పాపము= పాపమును; తొలఁగింపుము= తొలగిపోవునట్లు చేయుము.

**తా :** ఓ పరమేశ్వరా! శ్రీకృష్ణా! హరీ! మా పిల్లవాడు బుద్ధిచాపల్యంతో నిరపరాధియైన పరీక్షిన్మహారాజునకు శాపం పెట్టి పాపం కట్టుకొన్నాడు. వీడు చేసిన దోషాన్ని తొలగించుము తండ్రీ!

**విశే :** నిరపరాధము – తప్పు లేకపోవటం కాదు. చిన్ని తప్పు అని అర్థం. 'నఞ్' అర్థక శబ్దాలకు ఉన్న ఆరు అర్థాలలో అల్పత్వం కూడా ఒకటి.

**క. పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ, బడుచుందురు గాని పరమభాగవతులు దా**
**రొడఁబడరు మాఱు సేయఁగఁ, గొడుకా! విభుఁ డెగ్గుసేయఁ గోరఁడు నీకున్. 486**

**ప్రతి :** కొడుకా!= కుమారా!; పరమ భాగవతులు= ఉత్తమ భగవద్భక్తులు; పొడిచినన్= ఎత్తిపొడిచినను, దెప్పినను; తిట్టినన్= నిందించినను; కొట్టినన్= కొట్టినను, శిక్షించినను; పడుచున్+ఉందురు= అనుభవింతురు; కాని= కాని; తారు= తాము; మాఱు+చేయఁగన్= ప్రతీకారము చేయటానికి; ఒడఁబడరు= సమ్మతింపరు; నీకున్= నీకు; విభుఁడు= ప్రభువు; ఎగ్గు+చేయన్= కీడు కలిగింపగా; కోరఁడు= తలపెట్టడు.

**తా :** కుమారా! పరమభక్తులైనవారు కొట్టినా, తిట్టినా శాంతంతో సహిస్తారే కాని ప్రతీకారం చేయటానికి సమ్మతింపరు. ఆ మహారాజు నీకు కించిత్తుకూడా కీడు చేయడు.

**క. చెలఁగరు కలఁగరు సాధులు, మిళితములయి పరులవలన మేలుం గీడున్**
**నెలకొనిన నైన నాత్మకు, నొలయవు సుఖదుఃఖచయము లుగ్రము లగుచున్. 487**

**ప్రతి :** సాధులు= మంచి నడతగల మహనీయులు; చెలఁగరు= (ఉత్సాహంతో) పొంగిపోరు; కలఁగరు (దిగులుతో)= క్రుంగిపోరు; పరులవలనన్= ఇతరుల వలన; ఉగ్రములు+అగుచున్= భయంకరములౌతూ; మేలున్+కీడున్= మంచీచెడూ; మిళితములు+అయి= కలగలుపులు అయి; నెలకొనినన్+ఐనన్= సంభవించినా; ఆత్మకున్= ఆత్మకు; సుఖదుఃఖచయములు= సుఖముల దుఃఖముల సమూహములు; ఒలయవు= కలుగవు.

**తా :** సాధుస్వభావంగల సజ్జనులు ఇతరులు చేసిన ఉపకారానికి పొంగిపోరు, అపకారానికి క్రుంగిపోరు. మహనీయుల ఆత్మలను సుఖదుఃఖాలు ఆవహింపవు.

**వ. అని యిట్లు శమీక మహామునీంద్రుండు గ్రమ్మతింప శక్తి లేని కొడుకు సేసిన పాపంబునకు సంతాపంబు నొంది, తన శిష్యునొక మునికుమారునిం బిలిచి, యేతద్వృత్తాంతం బంతయు రాజున కెఱింగించి రమ్మని**

**పంచె; నంత నా యభిమన్యుపుత్త్రుండు శమీకముని శిష్యునివలన శాపవృత్తాంతంబు విని, కామక్రోధాది విషయాసక్తుండగు తనకుం దక్షకవిషాగ్ని విరక్తి బీజం బగు ననుచుఁ గరినగరంబునకుం జని యేకాంతంబున. 488**

**ప్రతి :** అని= అని పలికి; ఇట్లు= ఈ విధంగా; శమీక మహాముని+ఇంద్రుండు= మహామునిశ్రేష్ఠుడైన శమీకుడు; క్రమ్మఱింపన్= మరలించుటకు; శక్తిలేని= సామర్థ్యంలేని; కొడుకు= కుమారుడు; చేసిన= ఒనరించిన; పాపంబునకున్= (శాపము అనెడి) పాపకార్యానికి; సంతాపంబున్+ఒంది= మిక్కిలి బాధపడి; తనశిష్యున్= తన ఛాత్రుని; ఒక మునికుమారునిన్= ఒక మునిపుత్త్రుని; పిలిచి= ఆహ్వానించి; ఏతద్+వృత్తాంతంబు+అంతయున్= ఈ జరిగిన సంగతినెల్లా; రాజునకున్= ప్రభువుకు; ఎఱింగించి= తెలిపి; రమ్ము+అని పంచెన్= మరలిరా అని పంపెను; అంతన్= అటుపై; ఆ+అభిమన్యు పుత్త్రుండు= ఆ అభిమన్యుని కుమారుడు (పరీక్షిత్తు); శమీకముని= శమీక మహర్షియొక్క; శిష్యునివలనన్= ఛాత్రునివల్ల; శాప+వృత్తాంతంబు= శాపవార్త; విని= ఆకర్ణించి; కామ, క్రోధ+ఆది విషయ+ఆసక్తుండు+అగు= కామము, కోపము మొదలైన ఇంద్రియాలకు చెందినవాటిపై అధికమగు ఆశ కలవాడగు; తనకున్= తనకు; తక్షక విష+అగ్ని= తక్షకుని విషమను అగ్ని; విరక్తి బీజంబు+అగును= వైరాగ్యానికి విత్తనం ఔతుంది; అనుచున్= అని తలుస్తూ; కరినగరంబునకున్= హస్తినాపురానికి; చని= పోయి; ఏకాంతంబునన్= ఒంటరితనంతో.

**తా :** అని ఈ విధంగా శమీక మహాముని తన కుమారుడు గావించిన తిరుగులేని శాపరూపమైన పాపానికి మిక్కిలి తాపం చెందినాడు. వెంటనే తన శిష్యుడైన ఒక మునిపుత్త్రుని పిలిచి జరిగిన వృత్తాంతమంతా మహారాజుకు తెలిపి రమ్మని పంపినాడు. అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు మునిశిష్యునివలన శమీక మహామునికుమారుని శాపవృత్తాంతం విని, కామ క్రోధాది విషయజాలంలో తగుల్కొన్న తనకు తక్షకుని విషజ్వలనజ్వాలలు వైరాగ్యానికి మూలమైనవని భావించి, హస్తినాపురి చేరి ఒంటరిగా ఉండినాడు.

## ❖ పరీక్షితుఁడు విప్రశాపం బెఱింగి ప్రాయోపవిష్టుం డగుట ❖

**ఉ. ఏటికి వేఁట వోయితి? మునీంద్రుఁడు గాఢసమాధి నుండఁగా**
**నేటికిఁ దద్భుజాగ్రమున నేసితి సర్పశవంబుఁ దెచ్చి? నేఁ**
**డేటికిఁ బాపసాహసము లీక్రియఁ జేసితి? దైవ యోగమున్**
**దాఁటఁగ రాదు వేగిరమ; తథ్యము గీడు జనించు ఘోరమై. 489**

**ప్రతి :** వేట= వేటనుద్దేశించి; ఏటికిన్+పోయితిన్= ఎందుకు పోయితిని; ముని+ఇంద్రుఁడు= మునిశ్రేష్ఠుడు; గాఢ సమాధిన్+ఉండఁగాన్= నిశ్చలమైన సమాధిలో ఉన్నప్పుడు; తద్+భుజ+అగ్రమునన్= ఆయన భుజముల పైన; సర్ప+శవంబున్= చచ్చిన పామును; తెచ్చి= తీసికొనివచ్చి; ఏటికిన్= ఎందుకు; ఏసితిన్= వైచితిని; నేఁడు= ఇపుడు; పాప సాహసములు= పాపాన్ని కలిగించే సాహసపు పనులు; ఈ క్రియన్= ఈ విధంగా; ఏటికిన్+చేసితిన్= ఎందుకు కావించితిని? వేగిరమ= శీఘ్రమే; ఘోరము+ఐ= భయంకరమై; కీడు= హాని; జనించున్= పుట్టును; తథ్యము= నిజము; దైవయోగమున్= (విధి) దైవ (సంకల్పము) నియోగమును; దాఁటఁగన్+రాదు= దాటుటకు వీలు కాదు, తప్పించుకొనుటకు శక్యం కాదు.

**తా :** నేను వేటకై అడవికి ఎందుకుపోవాలి? ఆ మహాముని నిశ్చల ధ్యానంలో నిమగ్నుడై ఉన్నప్పుడు చచ్చినపామును తెచ్చి ఆయన మెడలో ఎందుకు వేశాను? ఈ విధమైన పాపాకార్యాలు ఎందుకు చేశాను? ఇది కలి ప్రభావమే. దైవసంకల్పాన్ని ఎవరూ దాటలేరు. ఇది తప్పదు. నేను చేసిన పాపానికి ఫలితం అనుభవించి తీరవలసిందే.

**ఉ. పామువిషాగ్ని కీలలను బ్రాణము లేఁగిన నేఁగుఁగాక, యీ**
**భూమియు రాజ్యభోగములుఁ బోయిన నిప్పుడ పోవుఁ గాక, సౌ**
**దామనిఁ బోలు జీవనముఁ దథ్యముగాఁ దలపోసి యింక నే**
**నేమని మాఱు దిట్టుదు మునీంద్రకుమారకు దుర్నివారకున్. 490**

**ప్రతి :** పాము= సర్పముయొక్క; విష+అగ్ని కీలలను= విషముయొక్క నిప్పు మంటలచే; ప్రాణములు= జీవములు; ఏఁగినన్= పోయినను; ఏఁగున్+కాక= పోవునుగాక; ఈ భూమియున్= ఈ రాజ్యము; రాజ్య భోగములున్= సామ్రాజ్య సౌఖ్యములు; ఇప్పుడు+అ= ఈ క్షణమే; పోయినన్+పోవున్+కాక= నశించిన నశించుగాక; సౌదామనిన్+పోలు= మెరుపుతీగెకు సాటియైన; జీవనమున్= బ్రతుకును; తథ్యముగాన్= సత్యముగా; తలపోసి= ఎంచి; ఇంకన్= ఇటుపై; దుర్+నివారకున్= వారించుటకు సాధ్యము కానివానిని; ముని+ఇంద్ర+కుమారకున్= మునిశ్రేష్ఠుని పుత్రుని; ఏన్= నేను; ఏమి+అని= ఏమని; మాఱుతిట్టుదున్= తిరిగి శాపమివ్వగలను?

**తా :** తక్షకుని విషాగ్ని జ్వాలలకు నా ప్రాణాలు పోయినా పోనిమ్ము. ఈ సామ్రాజ్యం, ఇందలి భోగభాగ్యాలు ఇప్పుడే నశించినా నశించనీ. మెరుపుతీగెవంటి బ్రతుకు శాశ్వతమని యెంచి, నివారించటానికి సాధ్యంకాని ఆ మునిసత్తముని పుత్రుని నేను ఏమని తిరిగి శపించగలను?

**విశే :** ఇట రాజు తాను శపించుట వ్యర్థము. పైగా అది క్రౌర్యము. మునికుమారుని దుర్నివారకుడనుట విధియే అతని నోట శపింపజేసినదని భావం. తాను తప్పక ఫల మనుభవించి తీరవలెనన్న నిర్ణయంతో ఉన్న భాగవతోత్తముడైన పరీక్షిత్తు సాధుస్వభావము ఇక్కడ చక్కగా తెలియవస్తున్నది.

**ఆ. రాజ ననుచుఁ బోయి రాజ్యగర్వంబున, వనముకొఱకు వారివనము సొచ్చి**
**దండశూకశవముఁ దండ్రిపై వైచినఁ, బొలియఁ దిట్ట కేల పోవు సుతుఁడు? 491**

**ప్రతి :** రాజను= నేను దొరను; అనుచున్= అని పలుకుచు; పోయి (అడవికి)= చని, రాజ్య గర్వంబునన్= రాజ్యసంబంధమైన అహంకారంతో; వనము కొఱకున్= నీటికోసము; వారి+వనము+చొచ్చి= వారి తపోవనమును ప్రవేశించి; తండ్రిపైన్= జనకుని మీద; దండశూకశవమున్= పాము శవమును; వైచినన్= పడవేయగా; పొలియన్= చచ్చునట్లు; సుతుఁడు= కుమారుడు; ఏల+తిట్టక+పోవున్= ఎందుకు శపింపక ఉంటాడు?

**తా :** నేను మహారాజును గదా! అని అహంకారంతో వారి తపోవనాన్ని ప్రవేశించి తండ్రిపై చచ్చిన పామును పడవేయగా కొడుకు నన్ను చనిపోవునట్లు శపింపక ఊరక నోరు మూసికొని కూర్చుంటాడా? నిజానికి ఆ బాలుని తప్పు ఏమున్నది?

**క. గోవులకును బ్రాహ్మణులకు, దేవతలకు, నెల్లప్రొద్దుఁ దెంపునఁ గీడుం**
**గావించు పాపమానస, మే విధమునఁ బుట్టకుండ నే వారింతున్. 492**

**ప్రతి :** గోవులకునున్= ఆవులకు; బ్రాహ్మణులకున్= భూదేవులకు; దేవతలకున్= వేల్పులకు; ఎల్లప్రొద్దున్= ఎల్లప్పుడును; తెంపునన్= సాహసంతో; కీడున్= హానిని; కావించు= కలిగించే; పాపమానసము= పాపపుబుద్ధి; పుట్టకుండన్= కలుగకుండ; ఏ విధమునన్= ఏ రీతిగా; నేన్= నేను; వారింతున్= అడ్డగిస్తాను?

**తా :** గోవులకు బ్రాహ్మణులకు, దేవతలకు కారణం లేకుండా దుస్సాహసంతో కీడు కలిగించే దుష్టబుద్ధిని ఏ విధంగా పుట్టకుండ నివారిస్తాను?

**వ. అని వితర్కించె. 493**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; వితర్కించెన్= విశేషముగా ఆత్మవిచారము (విమర్శ) చేసికొన్నాడు.

**తా :** అని తనలో తాను విశేషంగా తర్కించుకొన్నాడు.

**విశే :** పరీక్షిత్తు శాపాన్ని గూర్చి బాధపడటం లేదు. తాను చేసిన పనిని గూర్చి సంశయమనేది లేదు. తన తప్పును తాను తెలిసికొని పరిపూర్ణపశ్చాత్తాపంలో ఉన్నాడు. తనకు గలిగిన దుష్టసంకల్పానికి పాపబుద్ధికి ఏమిటి కారణం. ఇట్టి 'పాపమానసము భవిష్యత్తులో కలుగరాదు. అది ఏడుదినముల బ్రతుకులోనే కాదు. భవిష్యజ్జన్మలో కూడ ఇట్టి సంకల్పము లుండరాదని పూర్తిగా ఆత్మవిచారంలో నిమగ్నుడయ్యాడు.

**క. దామోదర పదభక్తిం, గామాదుల గెల్చినాఁడు గావునఁ గరుణన్**
**భూమీశుఁ డలుగఁ డయ్యెను, సామర్థ్యము గలిగి దోషసంగిన్ శృంగిన్. 494**

**ప్రతి :** భూమి+ఈశుఁడు= రాజు; దామ+ఉదర= కృష్ణునియొక్క; పదభక్తిన్= పాదములందు భక్తితో; కామ+ఆదులన్= కామం, క్రోధం మొదలైన వానిని; గెల్చినాఁడు= జయించినాడు; కావునన్= కాబట్టి; కరుణన్= దయతో; సామర్థ్యము= శక్తి; కలిగి= ఉండి; దోష+సంగిన్= దోషము అంటినవానిని; శృంగిన్= శృంగిని ఉద్దేశించి; అలుగఁడు+అయ్యెన్= కోపగింపడయ్యెను.

**తా :** శ్రీకృష్ణభగవానుని పాదపద్మములపై భక్తి ప్రపత్తులు గల పరీక్షిత్తు కామక్రోధాదులైన అంతశ్శత్రువులను జయించినవాడు కావటంవలన కరుణామయుడై తనను శపించిన శృంగిపై ఆగ్రహింపలేదు. శపించు శక్తి సామర్థ్యములుండియు పరమశాంతచిత్తుడు అయినాడు.

**వ. అంత మునికుమారుండు శపించిన వృత్తాంతంబుఁ దక్షకుండు విని యెదరు వేచియుండె; నిటఁ దక్షకవ్యాళ విషానల జ్వాలాజాలంబునం దనకు సప్తమ దినంబున మరణంబని యెఱింగినవాఁడు గావున, భూపాలుండు భూలోక స్వర్గలోక భోగంబులు హేయంబులని తలంచి, రాజ్యంబు విసర్జించి, నిరశన దీక్షాకరణంబు సంకల్పించుకొని. 495**

**ప్రతి :** అంతన్= పిమ్మట; మునికుమారుండు= మునిపుత్రుడు (శృంగి); శపించిన వృత్తాంతంబున్= శాపం పెట్టిన వార్తను; తక్షకుండు= తక్షకుడు అను సర్పరాజు; విని= ఆలకించి; ఎదరు= సమయము; వేచి+ఉండెన్= కాచుకొని ఉండినాడు; ఇటన్= ఇచ్చట; తక్షకవ్యాళ= తక్షకుడనే సర్పముయొక్క; విష+అనల= విషసంబంధమైన నిప్పుయొక్క;

జ్వాలా జాలంబునన్= మంటల సమూహంతో; తనకున్= తనకు; సప్తమదినంబునన్= ఏడవనాడు; మరణంబు= చావు; అని+ఎఱింగినవాఁడు= అని తెలిసికొనినవాడు; కావునన్= కాబట్టి; భూపాలుండు= రాజు; భూలోక స్వర్గలోక భోగంబులు= భూలోకమునకు, స్వర్గలోకమునకు చెందిన సుఖములు; హేయంబులు+అని తలంచి= విడువదగినవి అని తలపోసి; రాజ్యంబున్= రాజ్యాన్ని; విసర్జించి= విడిచి; నిర్+అశన దీక్షా+ఆచరణంబు= ఆహారం మానిన దీక్షను చేయటం; సంకల్పించి= తలపోసి.

**తా :** మునికుమారుడు శృంగి రాజును శపించిన వార్తను విని తక్షకుడు సమయానికై ఎదురుచూస్తున్నాడు. పరీక్షిత్తు తనకు ఏడవనాడు తక్షకుని దారుణవిషాగ్నిజ్వాలలవల్ల మరణం తప్పదని నిర్ణయించుకొనినాడు. భూలోకభోగాలు, స్వర్గలోకసౌఖ్యాలు పూర్తిగా విడువదగినవని భావించాడు. రాజ్యాన్ని పరిత్యజించినాడు. నిరాహారదీక్షను సాగించటానికి నిశ్చయించుకొన్నాడు.

**మ. తులసీసంయుతదైత్యజిత్పదరజస్స్తోమంబుకంటెన్ మహో**
**జ్జ్వలమై దిక్పతిసంఘసంయుతజగత్సౌభాగ్యసంధాయియై**
**కలిదోషావలి నెల్లఁ బాపు దివిషద్గంగా ప్రవాహంబు లో**
**పలికిం బోయి మరిష్యమాణుఁ డగుచుం బ్రాయోపవేశంబునన్. 496**

**ప్రతి :** తులసీ+సంయుత= తులసితోకూడిన; దైత్యజిత్= రాక్షసుల జయించిన విష్ణునియొక్క; పదరజస్+స్తోమంబు+కంటెన్= పాదముల రేణువుల (మొత్తము) సమూహంకన్నా; మహా+ఉజ్జ్వలము+ఐ= మిక్కిలి ప్రకాశించునట్టిదై; దిక్+పతి+సంఘ= దిక్పాలకుల సమూహముతో; సంయుత= కూడిన; జగత్+సౌభాగ్య సంధాయి+ఐ= లోకములకు సౌభాగ్యమును కూర్చునదియై; కలి దోష ఆవలిన్= కలియుగమందలి దోషముల వరుసను; ఎల్లన్= అంతటిని; పాపు= పోగొట్టే; దివిషద్+గంగా= దేవలోకమునందలి గంగయొక్క; ప్రవాహంబులోపలికిన్= నీటివెల్లువ లోపలకు; పోయి= వెళ్ళి; ప్రాయోపవేశంబునన్= నిరాహార దీక్షలో; మరిష్యమాణుఁడు= మరణింపబోతున్నవాడు; అగుచున్= అయినవాడవుతూ...

**తా :** తులసీదళాలతో విరాజిల్లే శ్రీమహావిష్ణుపాదపద్మాల పుప్పొడితో కలిసి మిక్కిలి ప్రకాశంతో ప్రవహిస్తూ దిక్పాలకులకు సకలసౌభాగ్యసంపదలు కలిగించి, సమస్తదోషాలను కడిగివేసే గంగానదీతీరంలో ప్రాయోపవేశంతో ప్రాణాలు విడవడానికి ప్రభువు సంకల్పించాడు.

**క. చిత్తము గోవిందపదా, యత్తముఁ గావించి మౌనియై తనలో నే**
**తత్తఱము లేక భూవర, సత్తముఁడు వసించె ముక్తసంగత్వమునన్. 497**

**ప్రతి :** భూవరసత్తముఁడు= రాజులలో మిక్కిలి ఉత్తముడు (పరీక్షిత్తు); చిత్తము= మనస్సు; గోవింద పద+ఆయత్తమున్= గోవిందుని పాదములకు అధీనము (నిలుపబడినది); కావించి= ఒనరించి; మౌని+ఐ= మౌనము దాల్చినవాడై; తనలోన్= తనయందు; ఏ+తత్తఱము= ఎట్టి ఆకులపాటు, సంభ్రమము; లేక= లేకుండ; ముక్త+సంగత్వమునన్= విడిచిన తగులములు గల స్థితిలో; వసించెన్= ఉండినాడు.

**తా :** ఆ రాజసత్తముడైన పరీక్షిత్తు తన చిత్తమును గోవిందుని పాదములందు నిలిపి, సర్వసంగ పరిత్యాగియై లోపల ఎట్టి వికారాలూ లేకుండా మౌనంతో ఉండినాడు.

**వ. ఇట్లు పాండవపౌత్త్రుండు ముకుందచరణారవింద వందనానందకందాయమాన మానసుండై విష్ణుపదీతీరంబునం బ్రాయోపవేశంబున నుండుట విని సకలలోక పావనమూర్తులు మహానుభావులు నగుచుఁ దీర్థంబులకుం దీర్థత్వంబు లొసంగ సమర్థులైన యత్రి విశ్వామిత్ర మైత్రేయ భృగు వసిష్ఠ పరాశర చ్యవన భరద్వాజ పరశురామ దేవల గౌతమ కశ్యప కణ్వ కలశసంభవ వ్యాస పర్వత నారదప్రముఖులైన బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి పుంగవులును కాండర్షులయిన యరుణాదులును, మఱియు నానాగోత్రసంజాతులైన మునులును శిష్య ప్రశిష్యసమేతులై చనుదెంచిన వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి పూజించి దండప్రణామంబు లాచరించి, కూర్చుండ నియోగించి. 498**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పాండవ పౌత్త్రుండు= పాండవులమనుమడు (పరీక్షిత్తు); ముకుంద చరణ+అరవింద= విష్ణు పాదపద్మముల; వందన+ఆనంద= నమస్కరించుట వలన కలిగిన ఆనందంచే; కందాయమాన మానసుండు+ఐ= మేఘముగా అగుచున్న మనస్సు కలవాడై; విష్ణుపదీ+తీరంబునన్= గంగాతీరమున; ప్రాయోపవేశంబునన్= ప్రాయోపవేశమునందు; ఉండుట+విని= ఉండటం ఆలకించి; సకల లోక+పావనమూర్తులు= అన్ని లోకములను పవిత్రంచేసే స్వరూపం కలవారు; మహా+అనుభావులున్= గొప్ప అనుభవం కలవారును; అగుచున్= అగుచు; తీర్థంబులకున్= తరింపజేయు నదులకు; తీర్థత్వంబులు= తీర్థసంబంధ పవిత్రభావములు; ఒసంగన్= కలిగించుటకు; సమర్థులు+ఐన= సామర్థ్యం కలిగినవారైన; అత్రి= అత్రి; విశ్వామిత్ర= విశ్వామిత్రుడు; మైత్రేయ= మైత్రేయుడు; భృగు= భృగువు; వసిష్ఠ= వసిష్ఠుడు; పరాశర= పరాశరుడు; చ్యవన= చ్యవనుడు; భరద్వాజ= భరద్వాజుడు; పరశురామ= పరశురాముడు; దేవల= దేవలుడు; గౌతమ= గౌతముడు; కశ్యప= కశ్యపుడు; కణ్వ= కణ్వుడు; కుంభసంభవ= అగస్త్యుడు; వ్యాస= వ్యాసుడు; పర్వత= పర్వతుడు; నారద= నారదుడు; ప్రముఖులు+ఐన= మొదలగు వారైన; బ్రహ్మ+ఋషి= బ్రహ్మత్వాన్ని దర్శించినవారు; దేవర్షి= దేవత్వాన్ని దర్శించినవారు; రాజ+ఋషి= రాజధర్మమును దర్శించినవారిలో; పుంగవులును= శ్రేష్ఠులును; కాండ+ఋషులు+అయిన= వేదవిభాగములను కాండలుగా చేసిన ఋషులైన; అరుణ+ఆదులును= అరుణుడు మొదలైనవారును; మఱియున్= ఇంకను; నానా గోత్ర సంజాతులు+ఐన= అనేక గోత్రాలలో పుట్టినవారైన; మునులును= మౌనులును; శిష్య ప్రశిష్య సమేతులు+ఐ= శిష్యులు వారి శిష్యులతో కూడినవారై; చనుదెంచినన్= రాగా; వారలకున్= వారికి; ప్రతి+ఉత్థానంబు= లేచి ఎదురుగా వచ్చి ఆహ్వానించుట; చేసి= కావించి; పూజించి= అర్ఘ్యపాద్యాదులతో అర్చించి; దండప్రణామంబులు= దండమువలె ఎనిమిది అంగాలు నేలతాకేట్లు సాగిలపడి నమస్కారములు; ఆచరించి= ఒనరించి; కూర్చుండన్= కూర్చుండగా; నియోగించి= నియమించి...

**తా :** ఈ విధంగా పాండవపౌత్త్రుడైన పరీక్షిత్తు హరిచరణారవిందములకు ప్రణమిల్లుతూ ఆనందాన్ని పొందిన హృదయపద్మం కలవాడై, విష్ణుపాదాలనుండి పుట్టిన గంగ గట్టున ప్రాయోపవిష్టుడై ఉన్నాడన్న సంగతి విన్నవారై, సకలలోక పవిత్రులై, మహోదార చరిత్రులై, తీర్థములకు తీర్థత్వమును ప్రసాదించే సర్వసమర్థులైన, అత్రి, విశ్వామిత్రుడు, మైత్రేయుడు, భృగువు, వసిష్ఠుడు, పరాశరుడు, చ్యవనుడు, భరద్వాజుడు, పరశురాముడు, దేవలుడు, పర్వతుడు, నారదుడు మొదలైన బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షులు, అరుణుడు మొదలగు కాండర్షులు ఇంకను వివిధ గోత్రాలలో పుట్టిన మహర్షులు శిష్యులతో ప్రశిష్యులతో కలిసి అచ్చటికి విచ్చేసినారు. పరీక్షిన్నరేంద్రుడు ఆ విధంగా అక్కడికి వచ్చిన మునీంద్రులకు ఎదురేగి, అర్ఘ్యపాద్యాదులిచ్చి, అర్చించి, సాష్టాంగ నమస్కారాలు చేసి, సుఖాసీనులను గావించినాడు.

**విశే : ఉరసా శిరసా దృష్ట్యా వచసా మనసా తథా**
**పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణమోఽష్టాంగ ఉచ్యతే**

రొమ్మును, తలను, చూపును నేలకు తాకునట్లు చేసి, మాటతో, మనస్సుతో, పాదములతో, చేతులతో కర్ణములతో చేయు నమస్కారాన్ని సాష్టాంగ నమస్కారం అంటారు.

**క. క్రమ్మఱ న మ్మునివిభులకు, నమ్మనుజేంద్రుండు మ్రొక్కి హర్షాశ్రుతతుల్**
**గ్రమ్మఁగ ముకుళితకరుఁడై, సమ్మతముగఁ జెప్పె నాత్మసంచారంబున్. 499**

**ప్రతి :** ఆ+మనుజ+ఇంద్రుండు= ఆ రాజు (పరీక్షిత్తు); క్రమ్మఱన్= మరల; ఆ+మునివిభులకున్= ఆ మునిశ్రేష్ఠులకు; మ్రొక్కి= నమస్కరించి; హర్ష+అశ్రుతతుల్= ఆనందబాష్పముల వరుసలు; క్రమ్మఁగన్= పైకి ఉబుకగా; ముకుళితకరుఁ డు+ఐ= మోడ్చిన చేతులు కలవాడై; ఆత్మసంచారంబున్= తన ప్రవర్తనను (తాను చేసిన దోషాన్ని); సమ్మతముగన్= అంగీకారముగా; చెప్పెన్= చెప్పినాడు.

**తా :** ఆ మహారాజు ఆనందబాష్పాలు పొంగిపొరలగా, మరల ఆ మునీశ్వరులముందు చేతులు మోడ్చి ఈ విధంగా విన్నవించుకొన్నాడు.

**ఉ. ఓపిక లేక, చచ్చిన మహోరగముం గొని వచ్చి, కోపినై**
**తాపసు మూఁపుపై నిడిన దారుణ చిత్తుఁడ; మత్తుఁడన్ మహా**
**పాపుఁడ మీరు పాపతృణపావకు లుత్తము లయ్యలార! నా**
**పాపము వాయు మార్గము గృపాపరులార! విధించి చెప్పరే. 500**

**ప్రతి :** అయ్యలార!= తండ్రులార!; ఓపిక= ఓర్పు; లేక= లేకుండ; చచ్చిన= మరణించిన; మహా+ఉరగమున్= పెద్ద పామును; కొని వచ్చి= తీసికొని వచ్చి; కోపిని+ఐ= కోపం కలవాడనై; తాపసు+మూఁపుపైన్= తపస్వి భుజంపై; ఇడిన= ఉంచిన; దారుణ చిత్తుఁడన్= కఠినమైన మనస్సు కలవాడను; మత్తుఁడన్= మదించినవాడను; మహాపాపుఁడన్= గొప్ప పాపము చేసినవాడను; కృపాపరులార= దయ ప్రధానంగా గల మహనీయులారా!; మీరు= తమరు; పాప తృణ పావకులు= పాపము అనే గడ్డికి నిప్పువంటివారు; ఉత్తములు= శ్రేష్ఠులు; నా పాపము= నా చేసిన కిల్బిషము; పాయు= తొలగే; మార్గము= దారి; విధించి= నిర్ణయించి; చెప్పరు+ఏ= సెలవియ్యరే!

**తా :** దయానిధులైన తపోధనులారా! నేను ఓర్పును కోల్పోయి, కోపాన్ని ఆపుకోలేక చచ్చిన పామును తెచ్చి మునీంద్రుని మూపుపై వేసిన క్రూరచిత్తుణ్ణి. మదించినవాడను. మహాపాపిని. మీరు పాపాలనే గడ్డిని దహించే అగ్నిహోత్రులు. ఉత్తములు. సంయమిసత్తములు. అయ్యలారా! నా పాపం పరిహారమయ్యే దారిని నిర్ణయించి చెప్పండి.

**ఉ. భూసురపాద రేణువులు పుణ్యులఁ జేయు నరేంద్రులన్; ధరి**
**త్రీసురులార! మీ చరణరేణుకణంబులు మేను సోఁక నా**
**చేసిన పాప మంతయు నశించెఁ; గృతార్థుఁడ నైతి; నెద్ది యేఁ**
**జేసిన ముక్తిపద్ధతికిఁ జెచ్చెరఁ బోవఁగ వచ్చుఁ జెప్పరే. 501**

**ప్రతి :** ధరిత్రీసురులార!= బ్రాహ్మణులారా!; భూసుర పాద రేణువులు= బ్రాహ్మణుల పాదముల దుమ్ము (ధూళి); నర+ఇంద్రులన్= రాజులను; పుణ్యులన్+చేయున్= పుణ్యవంతులను చేస్తుంది; మీ చరణ రేణుకణంబులు= మీ పాద ధూళి లేశములు; మేనున్= శరీరమును; సోఁకన్= స్పృశింపగా; నా+చేసిన= నేను ఒనర్చిన; పాపము+అంతయున్= దురితం మొత్తము; నశించెన్= నాశనమైనది; కృత+అర్థుఁడన్+ఐతిన్= నెరవేరిన ప్రయోజనం కలవాడను; ఎద్ది= ఏది; ఏన్= నేను; చేసినన్= ఆచరించినచో; చెచ్చెరన్ (చెర+చెర)= వెంటనే; ముక్తి+పద్ధతికిన్= మోక్ష విధానానికి; పోవఁ గన్+వచ్చున్= వెళ్ళవచ్చునో; చెప్పరు+ఏ= చెప్పండి.

**తా :** మహీసురులారా! మహనీయులైన మహర్షుల పాదధూళి లేశమైనను మహీపతుల పాపాలను పారద్రోలి పవిత్రులను చేస్తుంది. మీ పాదరేణువులు తగిలినంతనే నా పాపం పటాపంచలయింది. నేను కృతార్థుడ నయ్యాను. ఇప్పుడు నేనేమి చేస్తే వెంటనే నాకు ముక్తి లభిస్తుందో దయచేసి తెలపండి.

**క. భీకరతరసంసార, వ్యాకులతన్ విసిగి దేహవర్జనగతి నా**
**లోకించు నాకుఁ దక్షక, కాకోదరవిషము ముక్తి కారణమయ్యెన్. 502**

**ప్రతి :** భీకరతర= మిక్కిలి భయంకరమైన; సంసారవ్యాకులతన్= సృష్టి (పుట్టుక)కి సంబంధించిన చింత (చీకాకు)తో; విసిగి= విసుగు చెంది; దేహ వర్జన+గతిన్= శరీరమును విడిచే దారిని; ఆలోకించు= వెదకే; నాకున్= నాకు; తక్షక కాకోదర విషము= తక్షకుడు అనే పాము విషము; ముక్తి+కారణము= ముక్తికి హేతువు; అయ్యెన్= అయినది.

**తా :** మిక్కిలి భయంకరమైన సంసారబంధంలో చిక్కుకొన్న చీకాకుతో, విసిగి వేసారి, త్వరగా శరీరం విడిచే దారి వెదకుతున్న నాకు తక్షకుని మహావిషం మోక్షహేతువైనది.

**క. ఏపారు నహంకార, వ్యాపారములందు మునిఁగి వర్తింపంగా**
**నా పాలిటి హరి భూసుర, శాపవ్యాజమున ముక్తసంగుం జేసెన్. 503**

**ప్రతి :** ఏపారు= అతిశయించిన; అహంకార= అహంకారపు; వ్యాపారములందున్= ప్రవర్తనల యందు; మునిఁగి= నిమగ్నమై; వర్తింపంగాన్= ప్రవర్తిస్తుండగా; నా పాలిటి హరి= నా వశమగు విష్ణువు (నా వాడైన హరి); భూసుర శాప వ్యాజమునన్= బ్రాహ్మణుని శాపం అనే నెపంతో; ముక్తసంగున్= విడువబడిన సంసారబంధం కలవానినిగా; చేసెన్= ఒనరించాడు.

**తా :** అతిశయించిన అహంకారపు నడవడితో సంసారంలో మునిగి ఉన్న నాకు నా పాలిటి భగవంతుడు బ్రాహ్మణ శాపం అనే మిషతో సంసారబంధ ముక్తిని ప్రసాదించినాడు.

**విశే :** తాను చేసిన తప్పిదానికి తగిన శిక్ష పొందుట దైవకృపయే అని పరీక్షిత్తు భావన. ఇట్టి భావన అహంకారాన్ని పూర్తిగా తొలగిస్తుంది. మహర్షులు రావటానికి ముందున్న పరీక్షిత్తు భావనకు, ఇప్పుడు వారి సన్నిధిలో ఏర్పడిన భావనకు వ్యత్యాసమున్నది. 'సత్సంగత్వే నిస్సంగత్వం' అనే ఆదిశంకరుల అనుభవ ప్రాధాన్యం గల సూక్తి ఈ సందర్భంలో చక్కగా సమన్వయింపబడింది. బ్రాహ్మణ శాపవ్యాజంతో వైరాగ్యం కలిగించి మోక్షాన్ని ప్రసాదించే 'హరి'ని పరీక్షిత్తు 'నా పాలిటి హరి' అనటం అభేద సూచకం.

మ. ఉరగాధీశు విషానలంబునకు మే నొప్పింతు; శంకింప; నీ
శ్వరసంకల్పము నేఁడు మానదు; భవిష్యజ్జన్మ జన్మంబులన్
హరిచింతారతియున్, హరిప్రణుతి, భాషాకర్ణనాసక్తియున్,
హరిపాదాంబుజసేవయుం గలుగ మీ రర్థిం బ్రసాదింపరే! 504

**ప్రతి :** మేను= దేహము; ఉరగ+అధి+ఈశు= సర్పరాజుయొక్క; విష+అనలంబునకున్= విషమనే అగ్నికి; ఒప్పింతున్= అప్పగింతును; శంకింపను= సందేహింపను; ఈశ్వరసంకల్పము= దైవసంకల్పము; నేఁడు= ఈనాడు; మానదు= ఆగదు; భవిష్యత్ జన్మ జన్మంబులన్= రాబోయే అనేక జన్మలలో; హరి చింతారతియున్= విష్ణువును తలంచుటంలో ఆసక్తీ; హరి ప్రణుతి భాషా+ఆకర్ణన+ఆసక్తియున్= హరిని, మిక్కిలి పొగడే పలుకులను వినటంలోని కోరికా; హరిపాద+అంబుజ+సేవయున్= విష్ణు పాదపద్మములను సేవించటమూ; కలుగన్= ప్రాప్తింపగా; మీరు= తమరు; అర్థిన్= ప్రీతితో; ప్రసాదింపరు+ఏ= నాకు అనుగ్రహించండి.

**తా :** తక్షక విషాగ్నికి నా దేహమును తప్పక అప్పగిస్తాను. ఇందులో సందేహంలేదు. ఈశ్వర సంకల్పం నేడు జరిగి తీరుతుంది. రాబోయే అనేక జన్మలలో శ్రీకృష్ణుని (హరి) చింతనయందు ఆసక్తి, శ్రీకృష్ణుని స్తోత్ర వాఙ్మయ శ్రవణాభిలాష, శ్రీకృష్ణచరణ కమలసేవకలిగి ఉండేట్లు మీరు అనుగ్రహించండి.

క. చూడుఁడు నా కల్యాణము, పాడుఁడు గోవిందు మీఁది పాటలు దయతో
నాడుఁడు హరిభక్తుల కథ, లే దహములలోన ముక్తి కేఁగఁగ నిచటన్. 505

**ప్రతి :** ఏడు+అహములలోనన్= ఏడుదినాలలో; ముక్తికిన్= మోక్షమునకు; ఏఁగఁగన్= నేను పోగా; ఇచటన్= ఇచ్చట; నా+కల్యాణము= నాశుభము (మేలు); చూడుఁడు= భావించండి; గోవిందుమీఁది= గోవిందుని మీద; పాటలు= గీతములు; దయతోన్= కరుణతో; పాడుఁడు= మీరు ఆలాపించండి; హరిభక్తుల+కథలు= విష్ణుభక్తుల కథలు; ఆడుఁడు= సంభాషించండి.

**తా :** మీరు నా శ్రేయస్సును కాంక్షించండి. ఆ గోవిందుని మీది గీతాలు పాడండి. హరిభక్తుల చరిత్రలు వినిపించండి. ఏడుదినాలలో నాకు కైవల్యప్రాప్తి కలిగించండి.

క. అమ్మా! నినుఁ జూచిన నరుఁ, బొమ్మాయని ముక్తి కడకుఁ బుత్తు వఁట కృపన్
లెమ్మా నీ రూపముతో, రమ్మా నా కెదుర గంగ! రమ్యతరంగా! 506

**ప్రతి :** రమ్యతరంగా!= మనోహరములైన అలలు కలదానా!; గంగ!= ఓ గంగానదీ!; అమ్మా!= తల్లీ!; నినున్= నిన్ను; చూచిన= దర్శించిన; నరున్= మానవుని; కృపన్= దయతో; ముక్తి కడకున్= మోక్షసమీపానికి; పొమ్ము+ఆ+అని= పో అని; పుత్తువు+అఁట= పంపెదవట!; నీ+రూపముతోన్= నీ ఆకృతితో; లెమ్మా= పైకిలే; నాకున్= నాకు; ఎదురన్= ఎదురుగా; రమ్మా= రావమ్మా!

**తా :** అమ్మా! గంగమ్మా! నీ అలలు ఎంత అందంగా ఉన్నాయి తల్లీ! నిన్ను దర్శించిన వారిని దయతో దారి తెలిపి మోక్షానికి చేరుస్తావని విన్నాను. కదలిపైకి లేచి రావమ్మా! నీ రూపంతో ఎదురుగా వచ్చి సాక్షాత్కరింపవమ్మా!

**వ. అని తనకు మీఁద నయ్యెడి జన్మాంతరంబులందును హరిపాదభక్తి సౌజన్యంబులు సంధిల్లుంగాత మని గంగాతరంగిణీ దక్షిణకూలంబునం బూర్వాగ్ర దర్భాసనంబున నుత్తరాభిముఖుండై యుపవేశించి, జనమేజయు రప్పించి, రాజ్యభారంబు సమర్పించి, యత్నంబు సంసారబంధంబునకుం దప్పించి చిత్తంబు హరికి నొప్పించి పరమభాగవతుండైన పాండవపౌత్రుండు ప్రాయోపవిష్టుండై యున్న సమయంబున. 507**

**ప్రతి :** అని= ఆ ప్రకారంగా; తనకున్= తనకు; మీఁదన్+అయ్యెడి= భవిష్యత్తులో జరిగే; జన్మ+అంతరములందును= ఇతర జన్మములందు కూడా; హరిపాదభక్తి= విష్ణు పాదములందు భక్తి; సౌజన్యంబులు= సుజనత్వములు లేక మంచి నడవడులు; సంధిల్లున్+కాతన్+అని= ప్రాప్తించుగాక అని; గంగా తరంగిణీ= గంగానదియొక్క; దక్షిణ+కూలంబునన్= దక్షిణ తీరంలో; పూర్వ+అగ్రదర్భ+ఆసనంబునన్= తూర్పువైపు, కొనలు (చివరలు)గల, దర్భాసనంపై; ఉత్తర+అభిముఖుండు+ఐ= ఉత్తరపు దిక్కుకు ఎదురుమొగంకలవాడై; ఉపవేశించి= కూర్చుండి; జనమేజయున్= పుత్రుడైన జనమేజయుణ్ణి; రప్పించి= పిలిపించి; రాజ్యభారంబున్+సమర్పించి= సామ్రాజ్యపు బాధ్యతను అప్పగించి; యత్నంబు= ప్రయత్నము; సంసారబంధంబునకున్= సంసారబంధంనుండి; తప్పించి= మరలజేసి; చిత్తంబున్= మనస్సును; హరికిన్= విష్ణువునకు; ఒప్పించి= ఒప్పగించి; పరమభాగవతుండు+ఐన= భగవద్భక్త శ్రేష్ఠుడైన; పాండవపౌత్రుండు= పాండవుల మనుమడు (పరీక్షిత్తు); ప్రాయోపవిష్టుండు+ఐ= ఆహారాదులు వర్జించి, మరణంకోసం కూర్చున్నవాడై; ఉన్నసమయంబునన్= ఉన్న వేళలో.

**తా :** ఆ విధంగా రాబోయే జన్మలలో తనకు భగవద్భక్తి సౌజన్యాలు ప్రాప్తించుగాక అని ప్రార్థించినాడు. అప్పుడు తన తనయుడైన జనమేజయుని రప్పించి రాజ్యభారం అతనికి అప్పగించినాడు. గంగానదీ దక్షిణ తీరంలో తూర్పువైపు దర్భల కొనలు ఉండేట్లుగా ఆసనం వేయించి, దానిపై ఉత్తరాభిముఖంగా కూర్చున్నాడు. తన చిత్తాన్ని సంసారబంధాల నుంచి మరలించి పరమేశ్వరాయత్తం కావించినాడు. ఇలా భాగవతోత్తముడైన పాండవపౌత్రుడు ప్రాయోపవిష్టుడై ఉన్న సమయంలో.

**విశే :** నిజానికి ముక్తి పొందినవానికి జన్మాంతరాలు ఉండవు. ఒకవేళ ఏ కారణంగానైనా మోక్షం లభింపక మరొక జన్మ కలిగితే – పరీక్షిత్తు అప్పటి స్థితిని తెలుపుకుంటున్నాడు.

**క. ఒత్తిలి పొగడుచు సురలు వి, యత్తలమున నుండి మెచ్చి యలరుల వానల్**
**మొత్తములై కురిసిరి నృప, సత్తముపై భూరిభేరిశబ్దంబులతోన్. 508**

**ప్రతి :** సురలు= దేవతలు; వియత్+తలమునన్+ఉండి= ఆకాశం ప్రదేశంనుంచి; మెచ్చి= మెచ్చుకొని; ఒత్తిలి= గట్టిగా; పొగడుచున్= స్తుతిస్తూ; నృప+సత్తముపైన్= రాజులలో శ్రేష్ఠుడైన పరీక్షిత్తుమీద; భూరిభేరిశబ్దంబులతోన్= పెద్ద దుందుభినినాదాలతో; అలరుల+వానల్= పుష్పవర్షములు; మొత్తములు+ఐ= సమూహములై; కురిసిరి= కురిపించారు.

**తా :** దేవతలు ఆకాశంనుండి పూలవానలు కురిపించినారు. అంతేకాదు ఎంతో పొగడుతూ, గుణగణాలుగానం చేస్తూ, దుందుభులు మ్రోగించినారు.

**వ. ఆ సమయంబున సభాసీను లయిన ఋషు లిట్లనిరి. 509**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు; సభా+ఆసీనులు+అయిన= సభలో కూర్చున్నవారైన; ఋషులు= మహర్షులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** ఆ సందర్భమున సభలో కూర్చున్న మహర్షులు ఆ రాజర్షితో ఇట్లు పలికినారు.

**మ. క్షితినాథోత్తమ! నీ చరిత్రము మహాచిత్రంబు; మీ తాత లు**
**గ్ర తపోధన్యులు విష్ణుపార్శ్వపదవిం గామించి రాజన్య శో**
**భితకోటీరమణి ప్రభాన్వితమహాపీఠంబు వర్జించి రు**
**న్నతులై; నీవు మహోన్నతుండవు గదా నారాయణధ్యాయివై. 510**

**ప్రతి :** క్షితినాథ+ఉత్తమ!= రాజశ్రేష్ఠుడా!; నీ చరిత్రము= నీ నడవడి; మహాచిత్రంబు= గొప్ప ఆశ్చర్యకరము; మీ తాతలు= మీ పితామహులు; ఉగ్రతపస్+ధన్యులు= భయంకరమైన తపస్సుచే చరితార్థులైనవారు; విష్ణుపార్శ్వ పదవిన్= విష్ణువు ప్రక్కనుండటం అనే ఉన్నత స్థితిని; కామించి= కోరి; రాజన్య= రాజులచే; శోభిత= శోభించే; కోటీర, మణి, ప్రభా+అన్విత= కిరీటములందలి రత్నపుకాంతులతో కూడిన; మహాపీఠంబున్= గొప్ప సింహాసనాన్ని; ఉన్నతులు+ఐ= గొప్పవారై; వర్జించిరి= విడిచిరి; నీవు= నీవు; నారాయణధ్యాయివి+ఐ= నారాయణుని ధ్యానించువాడవై; మహా+ఉన్నతుండవు కదా!= మిక్కిలి ఉన్నతమైన స్థితిలో ఉన్నవాడవు సుమా!

**తా :** రాజశ్రేష్ఠా! నీ చరిత్ర చిత్రమైనది మీ పితామహులు మహాతపస్సంపన్నులు, వారు వాసుదేవుని నిత్య సాన్నిధ్యాన్ని వాంఛించి, నానా రాజకిరీట రత్నప్రభారాజితో రాజిల్లే రాజపీఠాన్ని విడిచి మహాత్యాగ విరాజితులైనారు. వారెంతో ఉన్నతులు అనుకొంటిమి కాని నిరంతర నారాయణ నామ పారాయణుడవైన నీవు వారికంటె మహోన్నతుడవు.

**మ. వసుధాధీశ్వర! నీవు మర్త్యతనువున్ వర్జించి నిశ్శోకమై**
**వ్యసనచ్ఛేదకమై రజోరహితమై వర్తించు లోకంబు స**
**ర్వసమత్వంబునఁ జేరునంతకు భవద్వాక్యంబులన్ వించు నే**
**దెసకుం బోవక చూచుచుండెదము నీ దివ్యప్రభావంబులన్. 511**

**ప్రతి :** వసుధా+అధి+ఈశ్వర!= భూమండలమంతటికీ ప్రభువైనవాడా!; నీవు= నీవు; మర్త్యతనువున్= మానవ శరీరాన్ని; వర్జించి= విడిచి; నిస్+శోకము+ఐ= శోకంలేనిదై; వ్యసన+ఛేదకము+ఐ= ఆపదలులేక పాపాలను త్రుంచి వేయునదియై; రజస్+రహితము+ఐ= రజోగుణము లేనిదై; వర్తించు= ఉండే; లోకంబు= లోకం; సర్వ+సమత్వంబునన్= సమమే అనే భావంతో; చేరు+అంతకున్= చేరేంతవరకు; భవత్+వాక్యంబులన్= నీ మాటలను; వించున్= ఆలకిస్తూ; ఏ+దెసకున్+పోవక= ఏ దిక్కునకు వెళ్ళకుండా; నీ+దివ్య+ప్రభావంబులన్= నీ లోకాతీత మహిమలను; చూచుచున్+ఉండెదము= వీక్షిస్తూ ఉంటాము.

**తా :** మహీపాలా! నీవు మనుష్యదేహాన్ని వదలి, శోకం, వ్యసనం, రజోగుణంలేని పుణ్యలోకాన్ని చేరేంతవరకు, మేము ఎక్కడికి పోము. నీ మాటలు వింటూ నీ దివ్యప్రభావాన్ని తిలకిస్తూ ఇక్కడనే ఉంటాము.

**విశే :** పరీక్షిత్తు తాను తప్పునకు సంబంధించి నారాయణ ధ్యానంలో నిమగ్నుడై ఉన్నాడు. పూర్తిగా తప్పునకు సంబంధించిన శోకం తొలగిపోవాలి. అట్లే చచ్చిన పామును తెచ్చి ఋషిని అవమానించిన రజోగుణ దోషంకూడా నిశ్శేషం కావాలి. వేట రాజులకు దుష్టశిక్షణ విషయంలో ఉచితమే కావచ్చు కాని అది సప్తవ్యసనాలలో ఒక ప్రధానవ్యసనమే కదా! దాని వలననే

కదా ఇంత అనర్థం వాటిల్లింది. కాబట్టి వ్యసన సంబంధ సంస్కారంకూడ నిర్మూలమై సర్వసమభావ మేర్పడినప్పుడే విష్ణులోకప్రాప్తికి అర్హత లభిస్తుంది. అది సత్సంగత్వంలో తప్పక త్వరలో సిద్ధించి తీరుతుంది. సప్తపదోచ్చారణ మాత్రసాధ్యం కదా సఖ్యం. అట్టి సఖ్యం తప్పక ఏడుదినాలలో పరిపూర్ణ ఫలసిద్ధిని పొంది నిస్సంగత్వ నిర్మోహత్వాదులను కూడ అతిక్రమించి దివ్యత్వంలో నెలకొని తీరుతుంది. సత్సంగ ప్రభావం అనంత మహిమాన్వితమైంది. సర్వసంగపరిత్యాగులైన మహర్షులకు దానిమహత్వం తెలుస్తుంది. రాజర్షియైన పరీక్షిత్తులో కూడ సర్వసంగపరిత్యాగం, వైరాగ్యం అప్రయత్నంగానే అతి త్వరలోనే సిద్ధించినాయి.

**వ. అని యిట్లు పక్షపాతశూన్యంబులును మహనీయ మాధుర్య గాంభీర్య సౌజన్య ధుర్యంబులును నైన భాషణంబు లాడుచు మూఁడు లోకంబులకు నవ్వలిదైన సత్యలోకంబునందు మూర్తి మంతంబులై నెగడుచున్న నిగమంబుల చందంబునం దేజరిల్లుచున్న ఋషులం జూచి భూవరుండు నారాయణ కథాశ్రవణ కుతూహలుం డయి నమస్కరించి యిట్లనియె. 512**

**ప్రతి :** అని= అని పలుకుతూ; ఇట్లు= ఈ విధంగా; పక్షపాతశూన్యంబులును= ఒకవైపే మ్రొగ్గుచూపటం లేనివి; మహనీయ= గొప్పవియగు; మాధుర్య= తీయదనం; గాంభీర్య సౌజన్య= గాంభీర్యము మంచితనం – వీటిచే; ధుర్యంబులునున్= శ్రేష్ఠమైనవియు; ఐన= అయినట్టి; భాషణంబులు+ఆడుచున్= పలుకులు పలుకుచు; మూఁడులోకంబులకున్= భూలోక, భువర్లోక సువర్లోకములు అనే మూడింటికి; అవ్వలది+ఐన= అవతలిది అయిన; సత్యలోకంబునందున్= సత్యలోకంలో; మూర్తిమంతంబులు+ఐ= ఆకారాన్ని దాల్చినవియై; నెగడుచు+ఉన్న= ప్రసిద్ధి చెందుతున్న; నిగమంబుల చందంబునన్= వేదములవలె; తేజరిల్లుచున్+ఉన్న= ప్రకాశించుచున్న; ఋషులన్= మహర్షులను; చూచి= వీక్షించి; భూవరుండు= రాజు; నారాయణ కథాశ్రవణ= శ్రీమన్నారాయణునియొక్క కథలను వినడంలో; కుతూహలుండు+అయి= ఆసక్తికలవాడై; నమస్కరించి= ప్రణామంచేసి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని యిట్లు నిష్పక్షపాతంగా మహర్షులు పలికిన మధురగంభీరాలైన మంచిమాటలు విని, ముల్లోకములకు అవతల గల సత్యలోకంలో ఆకృతులు దాల్చి వెలుగు వేదములవలె విరాజిల్లు మహర్షులకు మహారాజు నమస్కరించి విష్ణుకథలు లీలలు వినే ఆసక్తితో ఇట్లు అన్నాడు.

**క. ఏడు దినంబుల ముక్తిం, గూడఁగ నే రీతి వచ్చు గురుసంసార**
**క్రీడన మే క్రియ నెడతెగుఁ, జూడుఁడు మా తండ్రులార! శ్రుతివచనములన్. 513**

**ప్రతి :** మా తండ్రులార!= మా అయ్యలారా! (మహామునివర్యులారా!); ఏడు దినంబులన్= ఏడు దినాలలో; ముక్తిన్= మోక్షమును; కూడఁగన్= పొందగా; ఏ రీతిన్= ఏ విధంగా; వచ్చున్= సంభవిస్తుంది; శ్రుతి వచనములన్= వేదవాక్కులతో; గురు సంసార క్రీడనము= బరువైన సంసారపు ఆట; ఏ క్రియన్= ఏ రీతిగా; ఎడతెగున్= విడివడుతుంది; చూడుఁడు= బాగుగా పరిశీలించండి.

**తా :** తండ్రులారా! వేదవాక్యాలు బాగా పరిశీలించి ఏడు దినాలలో ఏ విధంగా ముక్తి పొందవచ్చునో తెలపండి. గురుతరమైన ఈ సంసార క్రీడనుండి ఎల్లా విడివడాలో ఆలోచించి ఆదుకొనండి.

**శా. ప్రాప్తానందులు బ్రహ్మబోధన కళాపారీణు లాత్మప్రభా**
**లుప్తాజ్ఞానులు మీర లార్యులు దయాళుత్వాభిరాముల్ మనో**
**గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుం గానవచ్చుం గదా!**
**సప్తాహంబుల ముక్తి కేఁగెడు గతిం జర్చించి భాషింపరే! 514**

**ప్రతి :** మీరలు= మీరు; ఆర్యులు= గౌరవింపదగిన ప్రవర్తన కలవారు; ప్రాప్త+ఆనందులు= పొందిన ఆనందం కలవారు; బ్రహ్మ బోధన కళాపారీణులు= బ్రహ్మమును బోధించే కళయందు అంతు (హద్దు) ముట్టినవారు; ఆత్మ ప్రభా= తమ, తేజస్సుచే; లుప్త+అజ్ఞానులు= లోపించిన అజ్ఞానం కలవారు; దయాళుత్వ+అభిరాముల్= దయాస్వభావంచే సుందరమైనవారు; మనస్+గుప్తంబుల్= మనస్సున దాచబడినవి; సకల+అర్థజాలములు= సమస్త ప్రయోజనముల సమూహములు; మీకున్= మీకు; కానవచ్చున్+కదా!= గోచరించును కదా!; సప్త+అహంబులన్= ఏడు దినాలలో; ముక్తికిన్= మోక్షమునకు; ఏఁగెడుగతిన్= పోయే (దారిని) ఉపాయాన్ని; చర్చించి= విమర్శించి; భాషింపరే!= వివరించండి.

**తా :** (మా తండ్రులారా!) మీరు ఆర్యులు, ఆనందస్వరూపులు, బ్రహ్మజ్ఞానపారీణులు, ఆత్మ తేజోవిరాజిత విజ్ఞానులు, ఆత్మతత్త్వజ్ఞులు, దయార్ద్ర హృదయులు, మనస్సులో దాచబడిన సకలార్థ సమూహం కలవారు. మీరు తపశ్శక్తిచేత అన్నింటిని స్పష్టంగా చూడగలవారు. ఏడు దినాలలో మోక్షం ప్రాప్తించే ఉపాయాన్ని బాగా విచారణ చేసి నాకు తెలపండి.

**వ. అని యుత్తరానందనుం డాడిన వచనంబులకు మును లందఱుఁ బ్రత్యుత్తరంబు విమర్శించు నెడ దైవయోగంబున. 515**

**ప్రతి :** అని= ఇట్లు; ఉత్తరానందనుండు= ఉత్తరకొడుకు (పరీక్షిత్తు); ఆడిన+వచనంబులకున్= మాటాడిన మాటలకు; మునులు+అందఱున్= సమస్త ఋషులు; ప్రతి+ఉత్తరంబు= మారు సమాధానము; విమర్శించు+ఎడన్= చర్చించి తెలుపబోవు సందర్భమున; దైవయోగంబునన్= దైవానుగ్రహంచే...

**తా :** అని పలుకుతున్న ఉత్తరానందనుని ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తర మివ్వడానికి మహర్షులందరు సమాలోచనలు జరుపుతున్నారు. ఆ సందర్భంలో దైవయోగం వలన

### ✤ శుకమహర్షి పరీక్షిన్మహారాజు నొద్ద కేతెంచుట ✤

**సీ. ప్రతినిమేషము పరబ్రహ్మంబు నీక్షించి మదిఁ జొక్కి వెలుపల మఱచువాఁడు**
**కమలంబుమీఁది భృంగముల కైవడి మోముపై నెఱపిన కేశపటలివాఁడు**
**గిఱి వ్రాసి మాయ నంగీకరించని భంగి వసనంబుఁ గట్టక వచ్చువాఁడు**
**సంగిగాఁడని వెంటఁ జాటు భూతములు నా బాలుర హాసశబ్దములవాఁడు**

**తే. మహిత పద జాను జంఘోరు మధ్య హస్త, బాహు వక్షో గళానన ఫాల కర్ణ**
**నాసికా గండ మస్తక నయన యుగళుఁ, డైన యవధూతమూర్తివాఁ డరుగుదెంచె. 516**

**ప్రతి :** ప్రతి+నిమేషము= ప్రతి కనురెప్పపాటు కాలంలోను; పరబ్రహ్మంబున్= బ్రహ్మమగు పరమాత్మను; ఈక్షించి= చూచి; (అంతర్ముఖముగా కని); మదిన్= మదిలో; చొక్కి= పరవశించి; వెలుపలన్= వెలుపలి ప్రపంచాన్ని; మఱచువాఁ

దు= మరచిపోయేవాదు; కమలంబు+మీఁది= తామరపైని; భృంగములకైవడిన్= తుమ్మెదలవలె; మోముపైన్= ముఖంమీద; నెఱపిన= వ్యాపించిన; కేశపటలివాఁడు= వెంట్రుకల గుంపు (కల)వాడు; గిఱివ్రాసి= వలయాకారపు (రేఖ) గీత గీసి; మాయను+అంగీకరించని భంగిన్= మాయను ఒప్పుకొనని విధంగా; వసనంబున్+కట్టక వచ్చువాఁడు= వస్త్రమును ధరింపక విచ్చేసేవాడు; సంగికాఁడు+అని= (ఏమి) అంటనివాడు అని; వెంటన్+చాటు= తనవెంట చాటుచున్న; భూతములునాన్= భూతములనగా; బాలుర= పిల్లల; హాస శబ్దములవాఁడు= నవ్వుల సవ్వడులవాడు; మహిత= గొప్పవి అగు; పద= కాళ్లు; జాను= మోకాళ్లు; జంఘా= పిక్కలు; ఊరు= తొడలు; మధ్య= నడుము; హస్త= చేతులు; బాహు= భుజములు; వక్షస్= ఱొమ్ము; గళ= గొంతు; ఆనన= ముఖము; ఫాల= నొసలు; కర్ణ= చెవులు; నాసికా= ముక్కు; గండ= చెక్కిళ్లు; మస్తక= తల; నయనయుగళుఁడు= కన్నుదోయి కలవాడైన; అవధూత మూర్తివాఁడు= దిగంబరమైన ఆకారం కలవాడు; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తా :** అనుక్షణం అంతర్ముఖంగా పరబ్రహ్మ స్వరూపాన్ని చూచి పరవశించిన హృదయంతో బాహ్యప్రపంచాన్ని మరచినవాడు, తామరపైన గండుతుమ్మెదలవలె ముద్దులు మూటగట్టే మొగంపై ముంగురులు ముసురుకొన్నవాడు, గీతగీసి మాయను సమ్మతింపని విధంగా వస్త్రాలు ధరింపక దిగంబరుడై తిరిగేవాడు, ఇతదు సర్వసంగపరిత్యాగియైన యోగి అని చాటుతున్నట్లు పరిహాసాలు పలికే బాలురు వెంట వచ్చేవాడును, సహజసుందరములైన కాళ్లు, పిక్కలు, తొడలు, నడుము, చేతులు, భుజములు, ఉరము, కంఠము, ముఖము, నొసలు, వీనులు, కన్నులు, ముక్కు, చెక్కిళ్లు, తల కలిగిన ఒక అవధూత అనుకోకుండా అచ్చటికి విచ్చేశాడు.

**ఉ. ఈరని లోకులం గినిసి, యెగ్గులు వల్కనివాఁడు, గోరికల్**
**గోరనివాఁడు, గూటువలఁ గూడని వాఁడు, వృథాప్రపంచముం**
**జేరనివాఁడు, దైవగతిఁ జేరిన లాభము సూచి తుష్టుఁడై**
**నేరని వానిచందమున నేర్పులు సూపెడు వాఁడు, వెండియున్. 517**

**ప్రతి :** ఈరు+అని= ఇవ్వరు అని; లోకులన్= ప్రజలను; కినిసి= కోపగించి; ఎగ్గులు+పల్కనివాఁడు= నిందలు మాటాడనివాడు; కోరికల్= వాంఛలు; కోరనివాఁడు= ఆశింపనివాడు; కూటువలన్= జనసమూహములను; కూడనివాఁడు= చేరనివాడు, కలియనివాడు; వృథా ప్రపంచమున్= పనికిమాలిన జగత్తును; చేరనివాఁడు= సమీపించనివాడు (తగులనివాడు); దైవగతిన్+చేరిన లాభము= దైవగతిచే కలిగిన ప్రయోజనమును; చూచి= పొంది; తుష్టుఁడై= సంతోషించినవాడై; నేరనివాని చందమునన్= ఏమీ నేర్పులేని వానివలె; నేర్పులు+చూపెడువాఁడు= అమాయికమగు చాకచక్యములు, ప్రదర్శించేవాడు; వెండియున్= మఱియు.

**తా :** ఇవ్వలేదని లోకులపై కోపించి ఎగ్గులు పలుకడు. కావలెనని ఏ కోరికలను కోరడు. జనసమూహంలో చేరడు. వ్యర్థమైన సంభాషణలను చేయడు. అంతేకాదు వ్యర్థమైన ప్రపంచ విషయాలలో ప్రవేశింపడు. దైవవశమున తనకు కలిగిన దానితో సంతృప్తి చెంది, ఏమీ తెలియని అమాయకునివలె సామాన్యంగా కనిపిస్తాడు.

**ఆ. అ మ్మహాత్ము షోడశాబ్దవయోరూప, గమన గుణ విలాస కౌశలములు**
**ముక్తికాంత సూచి మోహిత యగు నన, నితరకాంత లెల్ల నేమి సెప్ప! 518**

**ప్రతి :** ఆ+మహా+ఆత్ము= ఆ మహాత్ముని; షోడశ+అబ్ద= పదునారేండ్ల; వయస్+రూప, గమన= వయస్సు, రూపం, నడక; గుణ విలాస కౌశలములు= గుణము, శోభ, నేర్పరితనాలు; ముక్తికాంత+చూచి= ముక్తి అనెడి కాంత వీక్షించి; మోహిత+అగున్+అనన్= మోహింపబడుతుంది అనగా; ఇతర కాంతలు+ఎల్లన్= తక్కిన కాంతలందరిని గూర్చి; ఏమి+చెప్పన్= చెప్పేది ఏమి?

**తా :** ఆ మహాత్ముని పదునారేండ్ల నవయౌవనం, ఆ సుందరమందగమనం, ఆ గుణవిశేషాలు, ఆ విలాసం, ఆ నేర్పులు చూచి ముక్తియే ముచ్చటపడి మోహింపగా, ఇక ఇతర కాంతల విషయం చెప్పవలసిన దేమున్నది?

**ఆ. వెఱ్ఱితనము మాని విజ్ఞానమూర్తియై, బ్రహ్మభావమునను బర్యటింప**
**వెఱ్ఱి యంచు శుకుని వెంట నేతెంతురు, వెలఁదు లర్భకులును వెఱ్ఱు లగుచు. 519**

**ప్రతి :** వెఱ్ఱితనమున్+మాని= పిచ్చితనాన్ని (అవివేకాన్ని) వీడి; విజ్ఞానమూర్తి+ఐ= విజ్ఞానం ఆకారమైనవాడై; బ్రహ్మభావమునను= పరబ్రహ్మయందు నెలకొన్న తలంపుతో; పర్యటింపన్= తిరుగగా; వెఱ్ఱి+అంచున్= పిచ్చివాడంటూ; శుకుని+వెంటన్= శుకమహర్షివెంట; వెఱ్ఱులు+అగుచున్= పిచ్చివారై; వెలఁదులు= స్త్రీలు; అర్భకులును= బాలురును; ఏతెంతురు= వస్తూ ఉంటారు.

**తా :** వెఱ్ఱితనం లేక పూర్తిగా విజ్ఞానమూర్తియై బ్రహ్మజ్ఞానస్ఫూర్తితో తిరిగే శుకమహర్షిని వెఱ్ఱివాడని భావించి, అతనివెంట వెఱ్ఱియెత్తినట్లు స్త్రీలు, బాలకులు వెంటనంటి వస్తున్నారు.

**వ. ఇట్లు వ్యాసనందనుండైన శుకుం డరుగుదెంచిన నందలి మునీంద్రు లమ్మహానుభావుని ప్రభావంబు లెఱుంగుదురు గావున నిజాసనంబులు డిగ్గి ప్రత్యుత్థానంబు సేసిరి; పాండవ పౌత్త్రుండు నా యోగిజన శిఖామణికి నతిథిసత్కారంబులు గావించి దండప్రణామంబు సేసి పూజించె; మఱియు గ్రహనక్షత్ర తారకామధ్యంబునం దేజరిల్లు రాకాసుధాకరుండునుంబోలె బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యంబునం గూర్చుండి విరాజమానుండైన శుకయోగీంద్రుం గనుంగొని. 520**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వ్యాసనందనుండు+ఐన= వ్యాసుని కుమారుడైన; శుకుండు= శుకమహర్షి; అరుగుదెంచినన్= రాగా; అందలి= అందున్న; ముని+ఇంద్రులు= మునీశ్వరులు; ఆ+మహా+అనుభావుని= ఆ గొప్ప ప్రభావంకల మహనీయుని; ప్రభావంబులు= మాహాత్మ్యాలు; ఎఱుంగుదురు= తెలియుదురు; కావునన్= కాబట్టి; నిజ+ఆసనంబులు= తమ పీఠములు; డిగ్గి= దిగి; ప్రతి+ఉత్థానంబు= లేచి ఎదురేగుట; చేసిరి= కావించారు; పాండవపౌత్త్రుండును= పాండవుల మనుమడుకూడ (పరీక్షిత్తు); ఆ+యోగి జనశిఖామణికిన్= ఆ యోగులకు తలపై మెఱయు మణివంటి వానికి (యోగులలో శ్రేష్ఠునకు); అతిథి సత్కారంబులు= అతిథులకు చేసే మర్యాదలు; కావించి= చేసి; దండ ప్రణామంబు+చేసి= కఱ్ఱవలె భూమిపై సాగిలబడి నమస్కారము గావించి; పూజించెన్= అర్చించెను. మఱియున్= ఇంకను; గ్రహ నక్షత్ర తారకామధ్యంబునన్= గ్రహములకు, నక్షత్రములకు, తారకలకు, నడుమ (నక్షత్రములు అనగా గ్రహములు తిరుగు దారిలోని విభాగములు. తారకలు అనగా మినుకు మినుకుమనే చుక్కలు); తేజరిల్లు= ప్రకాశించే; రాకా+సుధాకరుండునున్+పోలెన్= పున్నమనాటి చంద్రునివలె; బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యంబునన్= బ్రహ్మర్షుల, దేవర్షుల, రాజర్షుల నడుమ; కూర్చుండి= కూర్చొని, ఆసీనుడై; విరాజమానుండు+ఐన= మిక్కిలి ప్రకాశిస్తున్న వాడైన; శుకయోగి+ఇంద్రున్= శుకయోగి శ్రేష్ఠుని; కనుంగొని= చూచి...

**తా :** ఈ విధంగా వ్యాసుని పుత్రుడైన శుకమహర్షి అక్కడికి రాగా ఆ మహానుభావుని మహత్త్వం తెలిసిన మునివర్యులందరూ తమ తమ ఆసనాలనుండి లేచి ఎదురు వచ్చి స్వాగతమిచ్చినారు. పాండవపౌత్రుడైన పరీక్షిత్తు ఆ మహాయోగీశ్వరునికి అతిథి సత్కారాలుచేసి, సాగిలబడి మ్రొక్కి పూజలు గావించినాడు. గ్రహ నక్షత్ర తారకల నడుమ మిక్కిలి వెలుగు లీను పున్నమనాటి చంద్రునివలె అక్కడ ఉన్న బ్రహ్మర్షి దేవర్షి రాజర్షుల మధ్య శుకయోగీంద్రుడు విరాజిల్లినాడు.

**ఉ. ఫాలము నేల మోపి, భయభక్తులతోఁడ నమస్కరించి, భూ**
**పాల కులోత్తముండు కరపద్మములన్ ముకుళించి, నేఁడు నా**
**పాలిటిభాగ్య మెట్టిదియొ, పావనమూర్తివి పుణ్యకీర్తి వీ**
**వేళకు నీవు వచ్చితి వివేకవిభూషణ! దివ్య భాషణా! 521**

**ప్రతి :** భూపాలకుల+ఉత్తముండు= రాజవంశశ్రేష్ఠుడు; ఫాలము= నుదురు; నేలన్= నేలపై; మోపి= చేర్చి; భయభక్తులతోడన్= భయముతో, భక్తితో; నమస్కరించి= నమస్కారంచేసి; కరపద్మములన్= తామరలవంటి చేతులను; ముకుళించి= ముడిచి; వివేకవిభూషణ!= మంచిచెడ్డలను నిర్ణయించుటయే విశిష్టమైన ఆభరణంగా గలవాడా!; దివ్యభాషణా!= దివ్యమైన వాక్కులు కలవాడా!; నేఁడు= ఈ దినము; నా పాలిటిభాగ్యము= నా అధీనమైన (వశమైన) అదృష్టం; ఎట్టిది+ఒ= ఎటువంటిదో; పావనమూర్తివి= పవిత్రమైన ఆకారంకలవాడవు; పుణ్యకీర్తివి= పవిత్రమైన కీర్తి కలవాడవు; ఈ+వేళను= ఈ సందర్భంలో; నీవు= నీవు; వచ్చితి= వచ్చేసినావు.

**తా :** కురుకుల శ్రేష్ఠుడైన పరీక్షిత్తు భయభక్తులతో మరల నెన్నుదురునేల తాకేట్లు నమస్కారంచేసి చేతులు జోడించి ఇలా విన్నవించుకొన్నాడు. "మహానుభావా! వివేకమే ఆభరణమైనవాడా! దివ్యములైన భాషణములు కలవాడా! నా అదృష్టమెటువంటిదో కాని నీవు పావనమూర్తివి, పుణ్యకీర్తివి సరియైన సమయానికి నీ విప్పుడు విజయం చేసినావు.

**మ. అవధూతోత్తమ! మంటి, నేఁడు నిను డాయం గంటి; నీవంటి వి**
**ప్ర వరుం బేర్కొను నంతటన్ భసితమౌఁ బాపంబు; నా బోఁటికిన్;**
**భవదాలోకన భాషణార్చన పదప్రక్షాళన స్పర్శనా**
**ది విధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే? 522**

**ప్రతి :** అవధూత+ఉత్తమ!= అవధూతలలో శ్రేష్ఠుడా!; నేఁడు= ఈ దినము; మంటిన్= బ్రతికినాను; డాయన్= సమీపింపగా; నినున్+కంటిన్= నిన్ను చూచినాను; నీవంటి విప్రవరున్= నీవంటి బ్రాహ్మణశ్రేష్ఠుని, పేర్కొను+అంతటన్= పేరును ఉచ్చరించిన వెంటనే; పాపంబు= పాపము; భసితము+ఔన్= బూడిద ఔతుంది; నా బోఁటికిన్= నావంటి వానికి; భవత్+ఆలోకన= తమను చూడటం; భాషణ= తమతో మాటాడటం; అర్చన= తమర్ని పూజించటం; పద ప్రక్షాళన= తమరి కాళ్లు కడగటం; స్పర్శన= తమర్ని తాకటం; ఆది విధానంబులన్= మొదలైన పద్ధతులచే; ముక్తి= మోక్షం; చేపడుట= లభించుట; చింతింపన్= ఆలోచింపగా; ఆశ్చర్యము+ఏ?= ఆశ్చర్యమౌనా? కాదని భావం.

**తా :** అవధూతలలో శ్రేష్ఠుడా! నీ ఆగమనంవల్ల ధన్యుణ్ణి అయినాను. నీ సందర్శనంవల్ల నా జన్మ తరించింది. నీవంటి బ్రహ్మజ్ఞాని పావననామం ఉచ్చరించిన మాత్రాన చేసిన పాపాలన్నీ భస్మీపటలమౌతాయి. ఇక నిన్ను దర్శించి, నీ మాటలు

విని, నిన్ను అర్చించి, నీ కాళ్ళు కడిగి నీళ్ళు మీద చల్లుకొని, నిన్ను స్పృశించి, నీ సేవ చేసుకునే మహాభాగ్యం లభించిన నావంటి వానికి మోక్షం సంప్రాప్తించడంలో ఆశ్చర్యమేముంటుంది?

**విశే :** అవధూత అంటే పొరలు తీసివేసినవాడు. స్థూలంగా దిగంబరుడు. కానీ సూక్ష్మార్థంలో జీవునియందున్న పరబ్రహ్మము చుట్టూ ఉన్న పొరలను తొలగించుకొన్నవాడు.

**క. హరిచేతను దనుజేంద్రులు, ధరఁ ద్రుంగెడు భంగి నీ పదస్పర్శముచే**
**గురుపాతక సంఘంబులు, పొరిమాలుఁ గదయ్య యోగిభూషణ! వింటే. 523**

**ప్రతి :** యోగిభూషణ!= యోగులకు అలంకారమైనవాడా!; ధరన్= భువిలో; హరిచేతను= విష్ణువుచే; దనుజ+ఇంద్రులు= రాక్షస రాజులు; త్రుంగెడు+భంగిన్= తెగిపడు విధముగా; నీ పదస్పర్శముచేన్= నీ పాదాలు తాకటంచేత; గురుపాతక సంఘంబులు= భరింపగూడని పాపముల సమూహాలు; పొరిమాలున్+కద+అయ్య!= నశించిపోవును గదా తండ్రీ!; వింటే= విన్నావా?

**తా :** భగవంతుడైన వాసుదేవునివలన లోకకంటకులైన నిశాచరులు నశించినట్లే పరమయోగివైన నీ పాదస్పర్శ వలన మా మహాపాపాలు మొత్తం రూపు మాసిపోతాయి.

**మ. ఎలమిన్ మేనమఱందియై సచివుఁడై యే మేటి మా తాతలన్**
**బలిమిం గాచి సముద్రముద్రితధరం బట్టంబుఁ గట్టించె, న**
**య్యలఘుం డీశుఁడు చక్రి రక్షకుఁడుగా కన్యుల్ విపద్రక్షకుల్**
**గలరే? వేఁడెద భక్తి నా గుణనిధిం గారుణ్యవారాన్నిధిన్. 524**

**ప్రతి :** ఏ మేటి= ఏ మహనీయుడు (శ్రేష్ఠుడు, ప్రభువు); ఎలమిన్= ప్రేమతో; మేనమఱందియై= మేనత్త కొడుకై; సచివుఁడు+ఐ= మంత్రియై; మా తాతలన్= మా తాతలను; బలిమిన్= శక్తితో; కాచి= కాపాడి; సముద్ర ముద్రిత ధరన్= సముద్రంచే ముద్రింపబడిన భూమిని (సముద్ర తీర రేఖలు సరిహద్దులుగా గల భూమిని); పట్టంబున్+కట్టించెన్= పట్టాభిషేకం చేయించినాడో; ఆ+అలఘుండు= ఆ గొప్పవాడు; ఈశుఁడు= ప్రభువు (అధికారము కలవాడు); చక్రి= చక్రాన్ని తాల్చినవాడు; రక్షకుఁడుగాక= కాపాడేవాడు కాని; అన్యుల్= ఇతరులు; విపద్+రక్షకుల్= ఆపదలనుండి రక్షించేవారు; కలరే?= ఉన్నారా?; భక్తిన్= భక్తితో; ఆ గుణనిధిన్= అట్టి గుణములకు నిధియైనవానిని; కారుణ్యవారాన్నిధిన్= దయకు సముద్రునివంటివానిని; వేఁడెదన్= వేడుకొంటున్నాను.

**తా :** ఏ మహానుభావుడు ప్రియమైన మఱదియై, మంత్రియై మా పితామహులైన పాండవులను నాల్గు సముద్రముల తీర రేఖలు గల విశాలమైన ఈ ధరణీచక్రానికి చక్రవర్తులను గావించెనో, ఆ మహామహుడు, లోకేశ్వరుడు, ఆ చక్రాయుధుడు అందరికి రక్షకుడై ఉన్నాడు. ఆపదలో ఉన్నవారిని ఆదుకొని ఆదరాభిమానాలతో కాపాడే రక్షకుడు ఆయన తప్ప అన్యులు ఎవ్వరున్నారు? ఆ సర్వసద్గుణ సంపన్నుని, కారుణ్యపయోనిధిని భక్తితో వేడుకొంటున్నాను.

**సీ. అవ్యక్తమార్గుండ వైన నీ దర్శన మాఱడి పో నేర; దభిమతార్థ**
**సిద్ధి గావించుట సిద్ధంబు; నే డెల్లి దేహంబు వర్జించు దేహధారి**

కేమి చింతించిన నేమి జపించిన నేమి గావించిన నేమి వినిన
నేమి సేవించిన నెన్నఁడు సంసార పద్ధతిఁ బాసిన పదవి గలుగు?

తే. నుండు మనరాదు గురుఁడవు యోగివిభుఁడ, వావుఁ బిదికిన తడవెంత యంత సేపు
గాని యొక దెస నుండవు కరుణతోడఁ జెప్పవే తండ్రి! ముక్తికిఁ జేరు తెరువు! 525

**ప్రతి :** అవ్యక్త మార్గుండవు= ఇతరులకు అంతుపట్టని మార్గం కలవాడవు; ఐనన్= అయినప్పటికి; నీ దర్శనము= నిన్ను దర్శించటం; ఆఱడిపోనేరదు= వ్యర్థం కానేరదు; అభిమత+అర్థ సిద్ధిన్+కావించుట= కోరిన ప్రయోజనం సిద్ధింపజేయటం; సిద్ధంబు= నిక్కువం; నేఁడు+ఎల్లి= ఈ దినమో, రేపో; దేహంబు= శరీరాన్ని; వర్జించు= విడిచే; దేహ+ధారికిన్= శరీరం ధరించినవానికి; ఏమి+చింతించినన్= ఏమి ఆలోచిస్తే; ఏమి జపించినన్= ఏ మంత్రాన్ని జపిస్తే; ఏమి+కావించినన్= ఏమి చేస్తే; ఏమి వినినన్= ఏమి ఆలకిస్తే; ఏమి సేవించినన్= ఏమి కొలిస్తే; ఎన్నఁడు= ఎపుడు; సంసారపద్ధతిన్+పాసిన= సంసార, మార్గము తొలగిన; పదవి= ముక్తి; కలుగున్= సిద్ధించును; ఉండుము+అనన్+ రాదు= (నిన్ను) నిలువుమని చెప్పరాదు; గురుఁడవు= అజ్ఞానాన్ని పోగొట్టేవాడవు; యోగివిభుఁడవు= యోగిశ్రేష్ఠుడవు; ఆవున్= గోవును; పిదికిన తడవు+ఎంత= పాలు పిదికిన సమయము ఎంతో; అంతసేపుకాని= అంతసేపు కూడ; ఒకదెసన్= ఒకచోట; ఉండవు= స్థిరంగా నిలిచి ఉండవు; తండ్రి!= అయ్యా!; కరుణతోడన్= దయతో; ముక్తికిన్= మోక్షమునకు; చేరు= సమీపించే; తెరువు= దారి; చెప్పవు+ఏ= చెప్పుమా?

**తా :** అయ్యా! నీవు అవధూతలలో అగ్రగణ్యుడవు. అవ్యక్తమైన గతి కలవాడవు. నీ దర్శనం వ్యర్థం కాదు. నా అభిమతం తప్పక ముమ్మాటికి ఫలించి తీరుతుంది. ఈనాడో రేపో ఈ దేహాన్ని త్యజించటానికి సంసిద్ధంగా ఉన్న జీవికి సంసారబంధాలు సమసి మోక్షం ప్రాప్తించటానికి, చింతింపవలసింది, జపింపవలసింది, చేయవలసింది; వినవలసింది, సేవలందింపవలసింది ఏమేమి కలవో దయదలచి విశదీకరించండి అని వేడుకొంటున్నాను. నీవు జగద్గురుడవు, యోగీశ్వరుడవు, నీకు తెలియందేముంది? గోవును పాలు పిదికేంతసేపు తప్ప అంతకంటె ఎక్కువసేపు ఎక్కడగాని ఉండవు. దయగల తండ్రీ! మోక్షమార్గాన్ని నాకు తెలియజెప్పు.

వ. అని పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె నని చెప్పి. 526

**ప్రతి :** అని= ఈ విధంగా; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; బాదరాయణిన్= వ్యాసుని కుమారుడైన శుకుని; అడిగెన్= అడిగినాడు; అనిచెప్పి= అని తెలిపి.

**తా :** ఈ విధంగా పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుని ప్రశ్నించినాడు.

**విశే :** బాదరాయణుడంటే వ్యాసుడు. బాదరాయణి అంటే వ్యాసుని కుమారుడైన శుకుడని అర్థం. బాదరాయణుడు అంటే బదరీవనం అయనంగా కలవాడు.

క. రాజీవపత్త్రలోచన!, రాజేంద్ర కిరీట ఘటిత రత్న మరీచి
భ్రాజితపాదాంభోరుహ!, భూజన మందార! నిత్యపుణ్యవిచారా! 527

**ప్రతి :** రాజీవపత్రలోచన!= తామరరేకులవంటి కన్నులు కలవాడా!; రాజేంద్ర కిరీట+ఘటిత= రాజాధిరాజుల కిరీటములలో పొదిగిన (చెక్కిన); రత్నమరీచి= రత్నముల కాంతులచే; భ్రాజిత= ప్రకాశించే; పాద+అంభోరుహ!= పాదపద్మములు

కలవాడా!; భూజన మందార!= భూమిపై గల, జనులకు పారిజాతమైనవాడా!; నిత్య= ఎల్లప్పుడు; పుణ్యవిచారా= కల్యాణ (శుభకర) భావనలు కలవాడా!

**తా :** తామర రేకులవంటి కన్నులు కలవాడా! రాజాధిరాజుల కిరీటాలలో చెక్కిన రత్నాల కాంతులచే ప్రకాశించే పాదపద్మాలు కలవాడా! భువిలోని జనులకు కల్పవృక్షము అయినవాడా! నిరంతర విశ్వకల్యాణ భావనకలవాడా, నిత్యధర్మచింతన కలవాడా!

**విశే :** పోతన తన భాగవతాన్ని తన ఇష్టదైవమైన శ్రీరామునికి అంకితమిచ్చినాడు. ఆయన ఆకార గుణవిశేషాలను సంబోధనాత్మక విశేషణములలో వివరించి ప్రతి స్కంధము చివర మంగళాశాసనంగా చేయటం మన ప్రాచీన వాఙ్మయ సంప్రదాయం. పోతన తనకు ముందున్న కవులు పాటించిన విధానంలోని ఔచిత్యాన్ని గ్రహించి స్కంధాంతంలో కనీసం రెండు పద్యాలలోనైనా అంకిత మొసగిన కృతిభర్తను ప్రశంసింపదలచినాడు. ప్రస్తుత కందపద్యములో శ్రీరామాభినుతితోపాటు లోకకల్యాణ సంసిద్ధిని కూడ పోతన సూచించినాడు.

**మా. అనుపమగుణహారా! హన్యమానారివీరా!**
**జనవినుతవిహారా! జానకీచిత్తచోరా!**
**దనుజఘనసమీరా! దానవశ్రీవిదారా!**
**ఘనకలుషకఠోరా! కంధిగర్వాపహారా! 528**

**ప్రతి :** అనుపమ (న+ఉపమ)= సాటిలేని; గుణహారా!= కల్యాణ గుణాలే హారంగా గలవాడా!; హన్యమాన+అరి వీరా!= చంపబడుతున్న శత్రువీరులు కలవాడా!; జన వినుత విహారా!= లోకంచే పొగడబడే సంచారం కలవాడా!; జానకీ చిత్తచోరా!= జనకుని పుత్రిక మనస్సును దొంగిలించినవాడా!; దనుజ ఘన సమీరా!= దానవులనే మేఘాలకు గాలియైనవాడా!; దానవ శ్రీవిదారా!= రాక్షసుల సిరిని బ్రద్దలు చేసినవాడా!; ఘన కలుష కఠోరా!= కఠినులైన పాపులకు కఠోరమైనవాడా!; కంధి గర్వ+అపహారా!= సముద్రుని గర్వాన్ని తొలగించినవాడా!

**తా :** సాటిలేని కల్యాణ గుణాలే పుష్పమాల అయినవాడా! చంపబడుతున్న వైరి వీరులు కలవాడా! లోక జన వినుత విహారా! సీతామానసచోరా, రాక్షసమేఘాలకు సమీరమైనవాడా, దానవ వైభవాన్ని చీల్చి చెండాడినవాడా, కఠిన పాపాత్ములకు కఠోరమైనవాడా! సముద్రుని గర్వాన్ని అపహరించినవాడా!

**విశే :** ప్రస్తుత పద్యము పేరు మాలిని. దీనికి నాలుగు చరణాలు. ప్రతి చరణంలో వరుసగా 'న, న, మ, య, య' అనే గణాలు ఉంటాయి. 9వ అక్షరం యతిస్థానం. సాధారణంగా పూర్వ మహాకవులు ఆశ్వాసాంతంలో ఇట్టి విశేష వృత్తాలు ప్రయోగించటం పరిపాటి. కావ్య మధ్యంలో కూడ పలువురు కవులు ప్రయోగించి ఉన్నారు.

**గద్యము : ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర, కేసనమంత్రి పుత్ర, సహజపాండిత్య, పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు నైమిశారణ్య వర్ణనంబును శౌనకాదుల ప్రశ్నంబును, సూతుండు నారాయణ కథాసూచనంబు సేయుటయు, వ్యాసచింతయు, నారదాగమనంబును, నారదుని పూర్వకల్ప వృత్తాంతంబును, పుత్రశోకాతురయైన ద్రుపదరాజ నందన కర్జునుం డశ్వత్థామం దెచ్చి యొప్పించి గర్వ పరిహారంబు సేయించి విడిపించుటయు, భీష్మ నిర్యాణంబును,**

**ధర్మనందను రాజ్యాభిషేకంబును, గోవిందుని ద్వారకాగమనంబును, విరాట కన్యకా గర్భ విద్యమానుండైన యర్భకు నశ్వత్థామ బాణానలంబు వలనం బాపి విష్ణుండు రక్షించుటయుఁ, బరీక్షిజ్జన్మంబును, గాంధారీ ధృతరాష్ట్ర విదురుల నిర్గమంబును, నారదుండు ధర్మరాజునకుఁ గాల సూచనంబు సేయుటయుఁ, గృష్ణనిర్యాణంబు విని పాండవులు మహాపథంబునం జనుటయు, నభిమన్యు పుత్త్రుండు దిగ్విజయంబు సేయుచు శూద్రరాజలక్షణ లక్షితుండగు కలిగర్వంబు సర్వంబు మాపి గోవృషాకారంబుల నున్న ధరణీ ధర్మదేవతల నుద్ధరించుటయు, శృంగి శాపభీతుండై యుత్తరానందనుండు గంగాతీరంబునం బ్రాయోపవేశంబున నుండి శుక సందర్శనంబు సేసి, మోక్షోపాయం బడుగుటయు నను కథలు గల ప్రథమస్కంధము. 529**

**ప్రతి :** ఇది= ఈ రచన; శ్రీ పరమేశ్వర= శ్రీ పరమాత్మునియొక్క; కరుణాకలిత= దయచే కలిగిన; కవితా విచిత్ర= కవితచే విచిత్రుడైన; కేసనమంత్రి పుత్త్ర= కేసనామాత్యుని కుమారుడగు; సహజపాండిత్య= సహజసిద్ధమైన వైదుష్యంకల; పోతన+అమాత్య= పోతనామాత్యునిచేత; ప్రణీతంబు+ఐన= రచింపబడిన; శ్రీ మహాభాగవత పురాణంబునందున్= శ్రీ మహాభాగవత మహాపురాణంలో; నైమిశ+అరణ్య+వర్ణనంబును= నైమిశం అనే అడవి వర్ణన; శౌనక+ఆదుల ప్రశ్నంబును= శౌనకుడు మొదలగువారి ప్రశ్నయు; సూతుండు= సూతుడు; నారాయణ కథాసూచనంబు+చేయుటయున్= శ్రీ మహావిష్ణువు కథాసూచన కావించుటయు; వ్యాసచింతయున్= వ్యాసునికి కలిగిన విచారము; నారద+ఆగమనంబును= నారదుని రాకయు; నారదుని పూర్వకల్పవృత్తాంతంబును= నారద మహర్షి పూర్వజన్మ వృత్తాంతము; పుత్త్రశోక+ఆతుర+ఐన= పుత్త్రులను గూర్చిన దుఃఖంచే కలత చెందినదియైన; ద్రువద రాజనందనకున్= ద్రౌపదికి; అర్జునుండు= అర్జునుడు; అశ్వత్థామన్+తెచ్చి= అశ్వత్థామను తీసికొని వచ్చి; ఒప్పించి= అప్పగించి; గర్వ పరిహారంబు+చేయించి= గర్వాన్ని పోగొట్టటం చేసి; విడిపించుటయున్= వదలిపెట్టుటయు; భీష్మనిర్యాణంబును= భీష్ముని మరణమూ; ధర్మనందనురాజ్య+అభిషేకంబును= ధర్మజుని పట్టాభిషేకమూ; గోవిందుని ద్వారకా+ఆగమనంబును= ద్వారకకు శ్రీకృష్ణుని రాకయు; విరాటకన్యకా= ఉత్తరయొక్క; గర్భ విద్యమానుండు+ఐన= గర్భంలో ఉన్నవాడైన; అర్భకున్= బాలుని; అశ్వత్థామ బాణ+అనలంబువలనన్= అశ్వత్థామయొక్క బాణాగ్నినుండి; పాపి= తొలగించి; విష్ణుండు= శ్రీకృష్ణుడు; రక్షించుటయున్= కాపాడుటయు; పరీక్షిత్+జన్మంబును= పరీక్షిత్తు పుట్టుకయు; గాంధారీ ధృతరాష్ట్ర విదురుల+నిర్గమంబును= గాంధారి, ధృతరాష్ట్రుడు, విదురుడు ఇల్లు విడిచి పోవుటయు; నారదుండు= నారద మహర్షి; ధర్మరాజునకున్= ధర్మరాజుకు; కాల సూచనంబు+చేయుటయున్= భవిష్యత్తును గూర్చి సూచించుటయు; కృష్ణ నిర్యాణంబు విని= శ్రీకృష్ణుని మరణమును ఆకర్ణించి; పాండవులు= పాండురాజు కుమారులు; మహాపథంబునన్+చనుటయున్= మహాప్రస్థానము చేయుటయు; అభిమన్యు పుత్త్రుండు= పరీక్షిత్తు; దిక్+విజయంబు+ చేయుచున్= దిక్కులు జయించుచు; శూద్ర రాజ లక్షణ లక్షితుండు అగు= శూద్రుడు, రాజకుమార లక్షణములతో లక్షితుడైన; కలిగర్వంబు= కలిపురుషుని అహంకారము; సర్వము= అంతయు; మాపి= లేకుండజేసి (తొలగించి); గో వృష+ఆకారంబులన్= ఆవు, ఎద్దుల ఆకారాలతో; ఉన్న= ఉన్నట్టి; ధరణీ ధర్మదేవతలను= భూదేవిని, ధర్మదేవతను; ఉద్ధరించుటయున్= రక్షించుటయు; శృంగి శాప భీతుండు+ఐ= శృంగి శాపంచే భయము కలవాడై; ఉత్తరానందనుండు= ఉత్తర కొడుకు పరీక్షిత్తు; గంగాతీరంబునన్= గంగానది ఒడ్డున; ప్రాయోపవేశంబునన్+ఉండి= ఆహారాదులు లేకుండ మరణానికి సన్నద్ధుడై ఉండి; శుక సందర్శనంబు+చేసి= శుకమహర్షిని దర్శించి; మోక్ష+ఉపాయంబు+అడుగుటయున్= ముక్తికి వెరవు అడుగుట; అనుకథలు+కల= అనే వృత్తాంతాలు కలిగిన; ప్రథమ స్కంధము= మొదటి స్కంధము (సమాప్తం).

**తా :** ఇది శ్రీ పరమేశ్వరుని అనుగ్రహంవల్ల ప్రాప్తించిన అద్భుతమైన కవిత్వం కలవాడూ, కేసనమంత్రి కుమారుడూ, సహజమైన పాండిత్యం కలవాడూ అయిన పోతనామాత్యుడు రచించిన శ్రీ మహాభాగవత పురాణం. అందులో నైమిశారణ్యా వర్ణన, శౌనకాదిమునుల సంప్రశ్నము, సూతుని నారాయణ కథాసూచన, వ్యాసుల వారి విచారం. నారదాగమనం, ఆయన పూర్వజన్మ వృత్తాంతం, ద్రౌపదీ పుత్రశోకం, అర్జునుడు అశ్వత్థామను బంధించి తేవడం, అశ్వత్థామ గర్వపరిహారం. భీష్మ నిర్యాణం, ధర్మరాజు పట్టాభిషేకం, శ్రీకృష్ణుని ద్వారకాగమనం, ఉత్తరాగర్భస్థుడైన అర్భకుని అశ్వత్థామయొక్క అస్త్ర జ్వాలలనుండి శ్రీకృష్ణుడు కాపాడటం, పరీక్షిత్తు జననం, గాంధారీ ధృతరాష్ట్ర విదురుల నిష్క్రమణం, నారదుడు ధర్మరాజుకు చేసిన కాలసూచన, శ్రీకృష్ణనిర్యాణం, పాండవుల మహాప్రస్థానం, పరీక్షిత్తు దిగ్విజయం, కలి గర్వభంజనం, ధరణీధర్మదేవుల సముద్ధరణం, పరీక్షిత్తుకు శృంగి శాపం, గంగాతీరంలో పరీక్షిత్తు ప్రాయోపవేశం, శ్రీ శుకసందర్శనం, మోక్షమార్గాన్ని పరీక్షిత్తు అభ్యర్థించడం అనే కథలతో కూడిన ప్రథమస్కంధం.

**విశే :** ఈ వచనాన్ని స్కంధాంత గద్యం లేదా ఆశ్వాసాంత గద్యం అని అంటారు. పూర్వకవులు అందరు దీనిని ఒక సంప్రదాయంగా పాటించినారు. ఇందులో గ్రంథకర్తను గురించిన వివరములు. ఆయా స్కంధాల (ఆశ్వాసముల) లోని విషయాను క్రమణిక సంగ్రహరూపంలో సింహావలోకనంవలె సమీక్షింపబడుతుంది. వచనానికి పర్యాయపదమే గద్యం. పద్యం – గద్యం – చంపువు ఏదైనా గ్రంథాంతంలో తప్పక అనివార్యంగా ఉండి తీరవలెనని పూర్వ కవులందరు ఒక నియమంగా పాటించినారు. పద్యంకన్నా గద్య రచన కష్టతరమని, పలువురి అభిప్రాయం. కావుననే 'గద్యం కవీనాం నికషం వదంతి' అను ఆభాణకం ఏర్పడింది.

ముఖ్యంగా ఈ గద్య ప్రారంభంలో గ్రంథకర్త తల్లిదండ్రులు, ఒక్కొక్కప్పుడు పితామహుల ప్రసక్తి, గ్రంథకర్త బిరుదావళి ఉంటుంది. సాధారణంగా గ్రంథకర్తయే గద్యాన్ని రచిస్తాడు. కొన్ని సందర్భాలలో గ్రంథకర్త శిష్యులుగాని, లేక తరువాతి పరిష్కర్తలైన పండితులుగాని వ్రాయవచ్చు.

గ్రంథకర్తృ నిర్ణయానికి స్కంధాంత (ఆశ్వాసాంత) గద్యమే పరమ ప్రమాణం. సాధారణంగా కావ్య పీఠిక దైవస్తుతి, పూర్వ కవిస్తుతి, కృతిపతి ప్రస్తుతి, గ్రంథ ప్రాశస్త్యం చివరలో కవివంశాదిక వర్ణన ఉంటాయి. తన జన్మకు కారకులైన తల్లిదండ్రుల ప్రసక్తి వంశాభివర్ణనలో అంతర్భాగంగా ఉంటుంది. అచ్చట తా నెవరి కుమారుడో తెలుపుటయే ప్రధానం. 'బమ్మెర పోత రాజొకడు భాగవతమ్ము చెప్పె జగద్ధితమ్ముగన్' అని గ్రంథ నిర్మాణ ప్రారంభంలో తన పేరు తెల్పినాడు. అనంతర వంశవర్ణనలో భీమనమంత్రి నుండి మొదలుపెట్టి క్రమంగా అన్నయ, సోమన ఎల్లనలు వారి భార్యలు చివరగా తన తండ్రి కేసన తల్లి లక్కమాంబలు వారి గుణగణాలు వారికి పుట్టిన వారిలో అన్న తిప్పన అని, తాను పోతన అని వివరించినాడు.

ఇది గ్రంథనిర్మాణ సందర్భం. కాని గ్రంథరచనా కాలంలోనో, గ్రంథం పూర్తి అయినప్పుడో ఇంత గొప్ప గ్రంథాన్ని ఫలాని ఆయన పుత్రుండు. సహజ పాండిత్యముతో వ్రాసెనని ప్రచారము ఏర్పడింది. కాబట్టి గద్యంలో అప్పుడెంతో ప్రసిద్ధికెక్కిన 'సహజ పాండిత్యం' అని ప్రత్యేకించి చెప్పుట జరిగింది. ప్రజల వ్యవహారంలో 'సహజ పాండిత్య' అన్నది రూఢంగా వ్యాపించింది. ఇట్టి ప్రచారం పొందిన బిరుదువంటిది పోతన తన గద్యంలో అనివార్యంగా, అప్రయత్న ధోరణిలో వ్యక్తం చేసినాడు.

***:: శ్రీకృష్ణార్పణమస్తు ::***

శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## ద్వితీయస్కంధము

**శ్రీమద్భక్తచకోరక, సోమ! వివేకాభిరామ! సురవినుత గుణ**
**స్తోమ! నిరలంకృతాసుర, రామాసీమంతసీమ! రాఘవరామా! 1**

**ప్రతిపదార్థం :** శ్రీమత్= శ్రీయుతులైన; భక్తచకోరక= భక్తులనెడు చకోరపక్షులకు; సోమ!= చంద్రునివంటివాడా!; వివేక+ అభిరామ!= విచారణజ్ఞానంచేత శోభిల్లువాడా!; సుర= దేవతలచేత; వినుత= స్తుతింపబడిన; గుణస్తోమ!= గుణాల సమూహం కలవాడా!; నిర్+అలంకృత= అలంకారరహితంగా చేయబడిన; అసురరామా= రాక్షస వనితలయొక్క; సీమంతసీమ!= పాపటబొట్టులు కలవాడా!; రాఘవరామా!= రఘువంశంలో జన్మించిన శ్రీరామా!;

**తాత్పర్యం :** భక్తి సంపదచే శ్రీమంతులైన భక్తులనే చకోరపక్షులపాలి చంద్రుడవూ, వివేకంతో విలసిల్లేవాడవూ, దేవతల స్తుతికి పాత్రమైన సద్గుణసముదాయం కలవాడవూ, రాక్షసస్త్రీల పాపటబొట్టులు తొలగించినవాడవూ అయిన ఓ రఘువంశజుడవగు శ్రీరామా! అవధరించు.

**విశేషం :** శ్రీరామచంద్రుడు స్వనామాంకితంగా భాగవతం తెనుగుసేయుమని పోతనకు ఆనతిచ్చాడు. కాన పోతన తన భాగవతానువాదాన్ని శ్రీరామునికే వినిపించాడు. అందుచే స్కంధాదిలో ఆ దేవుని సంబోధించి అవధరించుమని ప్రార్థించాడు.

భగవద్భక్తిని మించిన సంపద లేదు. అందువల్ల భక్తులు శ్రీమంతులుగా పేర్కొనబడ్డారు. చంద్రుడు చకోరపక్షులకు ఆహ్లాదం కల్గించినట్లే శ్రీరాముడు భక్తులకు ఆహ్లాదం కల్గిస్తాడు. అందుచేత భక్తులు చకోరాలుగానూ, భగవంతుడు చంద్రుడుగానూ రూపించబడ్డారు. రాక్షసస్త్రీలు తమ భర్తలు రామునిచే యుద్ధంలో వధింపబడడంవల్ల సీమంతంలోని అలంకారాలకు దూరమయ్యారు. (విధవలయ్యారు).

**వ. మహనీయగుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె; అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2**

**ప్రతి :** మహనీయ= పూజనీయమైన; గుణ= గుణాలచేత; గరిష్ఠులు+అగు= అధికులైన; ఆ+ముని శ్రేష్ఠులకున్= ఆ మునివర్యులకు; నిఖిల= సమస్తమైన; పురాణ= పురాణాలయొక్క; వ్యాఖ్యాన= అర్థవివరణకుచెందిన; వైఖరీ= వాక్కుల పద్ధతితో; సమేతుండు+ఐన= కూడిన; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజుకు; శుకయోగి+ఇంద్రుండు= శుకుడనే యోగిశ్రేష్ఠుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** నైమిశారణ్యంలో భాగవతశ్రవణం చేయాలన్న కోరికతో చేరిన మునులు ఉన్నతగుణవంతులు. వారిని చూచి సర్వపురాణాలనూ విశదీకరించడంలో నిపుణుడైన సూతుడు ఇలా అన్నాడు.

ఆ రీతిగా ప్రాయోపవేశం చేసి ముక్తిమార్గం చూపుమని అడిగిన పరీక్షిన్మహారాజు నుద్దేశించి యోగివర్యుడైన శుకుడు ఈ విధంగా చెప్పాడు.

## ✤ శుకుఁడు పరీక్షిత్తునకు ముక్తి మార్గంబుఁ దెల్పుట ✤

**సీ. క్షితిపతి! నీ ప్రశ్న సిద్ధంబు మంచిది యాత్మవేత్తలు మెత్తు రఖిలశుభద**
**మాకర్ణనీయంబు లయుతసంఖ్యలు గల వందు ముఖ్యంబిది యఖిలవరము**
**గృహములలోపల గృహమేధులగునరు లాత్మతత్త్వము లేశమైన నెఱుఁగ**
**రంగనారతుల నిద్రాసక్తిఁ జను రాత్రి పోవుఁ గుటుంబార్థబుద్ధి నహము**

**ఆ. పశుకళత్రపుత్రబాంధవ దేహాది, సంఘమెల్లఁ దమకు సత్యమనుచుఁ**
**గాఁపురములుసేసి కడపటఁ జత్తురు, కనియుఁ గాన రంత్యకాలసరణి. 3**

**ప్రతి :** క్షితిపతి!= రాజా!; నీ ప్రశ్న= నీ వడిగిన ప్రశ్న; సిద్ధంబు= పరిపక్వమైనది; మంచిది= మేలైనది; ఆత్మవేత్తలు= ఆత్మతత్త్వం తెలిసినవారు; మెత్తురు= మెచ్చుకుంటారు; అఖిలశుభదము= సమస్తశుభాలను చేకూర్చేది; ఆకర్ణనీయంబులు= వినదగినవి; అయుతసంఖ్యలు= పదివేల సంఖ్యలు గలవి; కలవు= ఉన్నాయి; అందున్= వాటిలో; ఇది= ఇప్పుడు; నీవడిగిన ఈ ప్రశ్న; ముఖ్యంబు= ప్రధానమైనది; అఖిలవరము= అన్ని ప్రశ్నలలోను మిన్నయైనది; గృహములలోపలన్= ఇండ్లలో; గృహమేధులు+అగు= గృహస్థులగు; నరులు= మనుజులు; లేశము+ఐనన్=కొంచెంకూడా; ఆత్మతత్త్వమున్= ఆత్మకు సంబంధించిన విజ్ఞానాన్ని; ఎఱుఁగరు= తెలియరు; రాత్రి= రాత్రికాలం; అంగనారతులన్= స్త్రీలతో రమించుటలతోనూ; నిద్రా+ఆసక్తిన్= నిద్రయందలి అపేక్షతోనూ; చనున్= కడచిపోతుంది; అహము= పగటికాలం; కుటుంబ+అర్థబుద్ధిన్= కుటుంబంకొరకైన బుద్ధితో (కుటుంబపోషణ కవసరమైన ధనం ఆర్జించాలన్న అపేక్షతో); పోవున్= కడచిపోతుంది; పశు= పశువులు; కళత్ర= భార్యలు; పుత్ర= కుమారులు; బాంధవ= చుట్టాలు; దేహ+ఆది= శరీరం మొదలైన; సంఘము+ఎల్లన్= సమూహమంతా; తమకున్= తమపాలిటికి; సత్యము= శాశ్వతం; అనుచున్= అనుకొంటూ; కాఁపురములు= సంసారాలు; చేసి= నిర్వహించి; కడపటన్= చివరికి; చత్తురు= మరణిస్తారు; అంత్యకాలసరణిన్= అవసాన సమయగతిని; కనియున్= చూచి కూడా; కానరు= చూడరు.

**తా :** రాజా! నీ విప్పుడడిగిన ప్రశ్న చాలా మేలైనది. ఎంతో సమంజసమైన, పరిపక్వమైన ప్రశ్న ఇది. ఆత్మతత్త్వం తెలిసినవాళ్ళు ఈ ప్రశ్నను అభినందిస్తారు. ఇది సకలశుభాలనూ చేకూరుస్తుంది. లోకంలో వినదగినవిషయాలు వేలకొలదిగా ఉన్నాయి. అందులో ఇది మిక్కిలి ముఖ్యమైనది. సంసారంలో మునిగి తేలే గృహస్థులకు ఆత్మతత్త్వం ఏ మాత్రం తెలియదు. వాళ్ళకు స్త్రీసంగమంతోనూ, నిద్రతోనూ రాత్రికాలం గడచిపోతుంది. పగలంతా కుటుంబవ్యవహారాలతో, ధనార్జనబుద్ధితో సరిపోతుంది. పశువులూ, భార్యలూ, బిడ్డలూ, చుట్టాలూ, శరీరమూ ఇత్యాదిగాగల పరివారమంతా శాశ్వతమని నమ్మి వాళ్ళు కాపురాలు సాగిస్తారు. చివరికొకనాడు శాశ్వతంగా కన్నుమూసి కాటిపాలవుతారు. అంత్యకాలానికి చెందిన ఈ దుఃస్థితి తెలిసికూడా తెలియనివారుగానే ఉండిపోతారు.

**విశే :** ప్రథమస్కంధం చివర పరీక్షిత్తు, శుకయోగిని చూచి 'కరుణతో ముక్తికి చేరే తెరువు, చెప్పుమని అడిగినాడు. ఈ ప్రశ్న చాలా శ్రేష్ఠమైనదనీ, ఆత్మజ్ఞులకు సమ్మతమైనదనీ, సామాన్యజనులు ఈ విషయం పట్టించుకోకుండా ఇహలోక సౌఖ్యాలలోనే ఆసక్తులై ఉంటారనీ ఇక్కడ శుకుడు చెప్పాడు. ప్రశ్న చాలా శ్రేష్ఠమైనదనడంవల్ల అందుకు చెప్పబోయే సమాధానం మహత్తరమైనదనీ, దానిని అత్యంత శ్రద్ధాసక్తులతో విని గ్రహించాలనీ పాఠకులను హెచ్చరించినట్లైనది.

**క. కావున సర్వాత్మకుఁడు మ, హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ దాకర్ణింపన్**
**సేవింపను వర్ణింపను, భావింపను భావ్యుఁ డభవభాజికి నధిపా! 4**

**ప్రతి :** అధిపా!= రాజా!; కావునన్= ఆ కారణంచేత; అభవభాజికిన్= మోక్షం పొందగోరేవానికి; సర్వ+ఆత్మకుఁడు= సర్వానికీ అంతర్యామియైనవాడు; మహావిభవుఁడు= గొప్పవైభవం కలవాడు; విష్ణుఁడు= అంతటా వ్యాపించువాడు; ఈశుఁడు= ప్రభువు అయిన భగవంతుడు; ఆకర్ణింపన్= వినుటకు; సేవింపనున్= సేవించుటకును; వర్ణింపనున్= వాక్కులతో వర్ణించుటకును; భావింపనున్= చిత్తంలో భావించుటకును; భావ్యుఁడు= అవశ్యం తగినవాడై ఉన్నాడు.

**తా :** రాజా! మోక్షాపేక్షగలవానికి అన్నింటికి ఆత్మ అయినవాడు, మహావైభవం కలవాడూ, సర్వవ్యాపీ, జగదీశ్వరుడూ అయిన విష్ణువే వినడానికీ, సేవించడానికీ, వర్ణించడానికీ, భావించడానికీ అన్నివిధాలా తగినవాడు.

**విశే :** ఆకర్ణించుట, వర్ణించుట శ్రవణేంద్రియ వాగింద్రియ వ్యాపారాలు. తక్కిన ఇంద్రియాలకు కూడా ఇవి ఉపలక్షకాలు. సేవించడం శరీరంతో చేయదగిన పని. భావించడం మనోవ్యాపారం. అన్నివిధాలా విష్ణువు ఆరాధనీయుడని భావం.

**ఆ. జనులకెల్ల శుభము సాంఖ్యయోగము; దాని, వలన ధర్మనిష్ఠవలన నయిన**
**నంత్యకాలమందు హరిచింతసేయుట, పుట్టువులకు ఫలము భూవరేంద్ర! 5**

**ప్రతి :** భూవర+ఇంద్ర!= రాజేంద్రా!; జనులకు+ఎల్లన్= ప్రజల కందరికీ; సాంఖ్యయోగము= 'సాంఖ్య' మనే యోగం; శుభము= కల్యాణకరం; దానివలనన్= ఆ సాంఖ్యయోగంవలనకానీ; ధర్మనిష్ఠవలనన్+అయినన్= ధర్మమునందు నిష్ఠతోనయినా; అంత్యకాలము+అందున్= అవసాన సమయంలో; హరిచింత= శ్రీహరిని గూర్చిన భావన; చేయుట= అనుష్ఠించడం; పుట్టువులకున్= జన్మలకు; ఫలము= ప్రయోజనం.

**తా :** ఆత్మానాత్మవివేకమనే సాంఖ్యయోగంతోకానీ, ధర్మానుష్ఠానంతోకానీ చివరికాలంలో శ్రీహరిని చింతించాలి. అలా చేయడమే మానవజన్మ దాల్చినందుకు ఫలం.

**తే. అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి, విధినిషేధనివృత్తి సద్విమలమతులు**
**సేయుచుందురు హరిగుణచింతనములు, మానసంబుల నేప్రొద్దు మానవేంద్ర! 6**

**ప్రతి :** మానవ+ఇంద్ర= రాజా!; సద్విమలమతులు= ఉత్తమమూ, నిర్మలమూ అయిన బుద్ధిగలవారు; విధినిషేధనివృత్తిన్= శాస్త్రం విధించిన విధినిషేధాలను విడనాడుటలో; అరసి= చక్కగా పరిశీలించి; నిర్గుణబ్రహ్మంబున్= గుణరహితమైన బ్రహ్మాన్ని; ఆశ్రయించి= అండగాగొని; మానసంబులన్= చిత్తములయందు; ఏ ప్రొద్దున్= ఎల్లవేళలా; హరిగుణచింతనములు= విష్ణువు కల్యాణగుణాలను స్మరించడం; చేయుచుందురు= చేస్తూ ఉంటారు.

**తా :** రాజా! ఉత్తమమూ, నిర్మలమూ అయిన బుద్ధిగల మహాత్ములు శాస్త్రంలో చెప్పిన విధినిషేధాలు వర్జించి గుణరహితమైన పరబ్రహ్మాన్ని ఆశ్రయిస్తారు. మనస్సులో ఎల్లవేళలా శ్రీహరిగుణాలను చింతిస్తూ ఉంటారు.

**విశే :** బ్రహ్మం నిర్గుణం. దాని నాశ్రయించి కూడా నిర్మలబుద్ధిమంతులు హరిగుణచింతనతో కాలం గడపడం విశేషం. శాస్త్రం 'ఈ పని చేయాలి' అని చెప్పిందంటే అది విధి. 'ఇది చేయరాదు' అని చెప్పిందంటే అది నిషేధం. 'నైర్గుణ్యస్థాః, అని మూలం. త్రిగుణాతీతులైనవారు నిర్గుణబ్రహ్మాన్ని ఆశ్రయించి ఉంటారు గాన, వారు శాస్త్రీయమైన విధినిషేధాలకు పరవశులు కారు.

సీ. ద్వైపాయనుండు నాదు తండ్రి, ద్వాపరవేళ బ్రహ్మసమ్మితమైనభాగవతముఁ
బఠనంబు సేయించెఁ: బ్రహ్మతత్పరుఁడనై యుత్తమశ్లోకలీలోత్సవమున
నాకృష్టచిత్తుండనై పఠించితి; నీవు హరిపాద భక్తుఁడవగుటఁజేసి
యెఱిఁగింతు వినవయ్య! యీ భాగవతమున విష్ణుసేవాబుద్ధి విస్తరిల్లు:

ఆ. మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు, భవభయంబులెల్లఁబాసిపోవు;
యోగిసంఘమునకు నుత్తమవ్రతములు, వాసుదేవనామవర్ణనములు. 7

**ప్రతి :** నాదు తండ్రి= నా జనకుడు; ద్వైపాయనుండు= వ్యాసుడు; ద్వాపరవేళన్= ద్వాపరసమయంలో; బ్రహ్మసమ్మితము+ఐన= వేదంతో సమానమైన; భాగవతమున్= భాగవతాన్ని; పఠనంబు+చేయించెన్= (నాచే) చదివించాడు; బ్రహ్మతత్పరుఁడను+ ఐ= బ్రహ్మమునందు ఆసక్తిగలవాడనై; ఉత్తమశ్లోక= సత్కీర్తిమంతుడైన శ్రీమన్నారాయణునియొక్క; లీలా+ఉత్సవమునన్= అవతారలీలయందలి వేడుకతో; ఆకృష్టచిత్తుండను+ఐ= ఆకర్షింపబడినమనస్సుగలవాడనై; పఠించితిన్= చదివితిని; నీవు, హరిపాదభక్తుండవు+అగుటన్+చేసి= నీవు విష్ణుచరణాలయందు భక్తిగలవాడవగుటవల్ల; ఎఱిఁగింతున్= నీకు తెలియజేస్తాను; వినవయ్య!= ఆలకించవయ్యా!; ఈ భాగవతమునన్= ఈ భాగవత శ్రవణంచేత; విష్ణుసేవాబుద్ధి= విష్ణువుయొక్క పరిచర్య చేయాలనే తలంపు; విస్తరిల్లున్= అధికమవుతుంది; మోక్షకామునకునున్= మోక్షంపై కోరిక గలవానికి; మోక్షంబు= ముక్తి; సిద్ధించున్= కల్గుతుంది; భవభయంబులు+ఎల్లన్= సంసారభయాలన్నీ; పాసిపోవున్= తొలగిపోతాయి; వాసుదేవనామవర్ణనములు= విష్ణుదేవునియొక్క నామాలను విశదీకరించి చెప్పుటలు; యోగిసంఘమునకున్= యోగుల సముదాయానికి; ఉత్తమవ్రతములు= శ్రేష్ఠమైన వ్రతాలై ఉన్నవి.

**తా :** నా తండ్రి వ్యాసభగవానుడు. ద్వాపరయుగంలో భాగవతం నాచేత చదివించాడు. నేను పరబ్రహ్మంలో లగ్నమైన చిత్తం కలిగి భగవంతుని అవతారలీలలు నన్నాకర్షించడంవల్ల దీన్ని పఠించాను. నీవు పంకజాక్షుని పాదపద్మాలను ఆశ్రయించిన భక్తుడివి. అందుచేత నీకు భాగవతతత్త్వం వివరిస్తాను. వినవయ్యా మహారాజా! భాగవతశ్రవణంవల్ల విష్ణువును సేవించాలనే బుద్ధి విస్తరిస్తుంది. మోక్షం కోరేవాడికి ముక్తి లభిస్తుంది. జన్మ జరామరణాది సంసారభయాలన్నీ సమసి పోతాయి. యోగివర్యులకు వాసుదేవుని నామకీర్తనలు ఉత్తమమైన వ్రతాలు.

తరలం. హరినెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁబోవ నేర్చునె? వాఁడు సం
సరణముం బెడఁబాయఁడెన్నఁడు; సత్య మా హరినామ సం
స్మరణమొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా! 8

**ప్రతి :** హరిన్= విష్ణువును; ఎఱుంగక= తెలుసుకోకుండా; ఇంటిలోన్= గృహంలో; బహుహాయనంబులు= పెక్కుసంవత్సరాలు; మత్తుఁడు+ఐ= మత్తెక్కినవాడై; పొరలుచుండెడి= ప్రవర్తిస్తూవుండే; వెఱ్ఱి= వివేకం లేనివాడు; ముక్తికిన్= మోక్షానికి; పోవనేర్చునె?= పోగలడా?; వాఁడు= అట్టి అవివేకి; ఎన్నఁడున్= ఎప్పటికీ; సంసరణమున్= సంసారాన్ని; పెడఁబాయఁడు= దూరంచేసికోడు; సత్యము= ఇది నిజం; నృపా!= రాజా!; ఆ హరినామసంస్మరణము= ఆ శ్రీహరినామాన్ని స్మరించడం; ఒక్క ముహూర్తమాత్రము= పండ్రెండు క్షణాలకాలం; (రెండు గడియలకాలం); చాలు= సరిపోతుంది; ముక్తిదము+ఔన్= అది మోక్ష మిచ్చేదవుతుంది.

**తా :** రాజా! విష్ణుదేవుని తెలుసుకోకుండా మత్తెక్కి సంసారంలో అనేక సంవత్సరాలతరబడి పొర్లుతూ సతమతమవుతుండే అవివేకి ముక్తికెలా పోగలడు? వాడు సంసారంనుండి ఎన్నటికీ ముక్తుడు కాలేడు. ఇది నిక్కం. ఒక్క ముహూర్తకాలమైనా హరిని స్మరిస్తే చాలు, అది ముక్తిని ప్రసాదిస్తుంది.

**విశే :** 'తరలం' వృత్తాన్నే 'ధ్రువకోకిలం' అంటారు. నాలుగు పాదాల్లోను 'నభరసజజగ' అనే గణాలు ఉంటాయి. 12వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం తప్పనిసరి.

**సీ. కౌరవేశ్వర! తొల్లి ఖట్వాంగుఁడనువిభుం డిల నేడుదీవుల నేలుచుండి**
**శక్రాదిదివిజులు సంగ్రామభూముల నుగ్రదానవులకు నోడివచ్చి**
**తమకుఁ దో డడిగిన ధరనుండి దివి కేఁగి దానవవిభులనందఱ వధింప**
**వరమిత్తు మనుచు దేవతలు సంభాషింప "జీవితకాలంబు సెప్పుఁ డిదియ**

**ఆ. వరము నాకు నొండువర మొల్ల" ననవుడు, "నాయు వొకముహూర్తమంత తడవు,**
**గల" దటంచుఁ బలుక గగనయానమున న, మ్మానవేశ్వరుండు మహికి వచ్చి. 9**

**ప్రతి :** కౌరవ+ఈశ్వర!= కౌరవులకు ప్రభుడవైన ఓ పరీక్షిన్మహారాజా!; తొల్లి= పూర్వం; ఖట్వాంగుఁడు+అను= ఖట్వాంగుడనే పేరుగల; విభుండు= రాజు; ఇలన్= భూమిపై; ఏడుదీవులన్= సప్తద్వీపాలను; ఏలుచు+ఉండి= పరిపాలిస్తూవుండి; శక్ర+ఆది దివిజులు= ఇంద్రుడు మొదలయిన దేవతలు; సంగ్రామభూములన్= యుద్ధభూములలో; ఉగ్రదానవులకున్= భయంకరులైన రక్కసులకు; ఓడి వచ్చి= ఓడిపోయి వచ్చి; తమకున్= తమకును; తోడు+అడిగినన్= సాయం అడుగగా; ధరన్+ఉండి= భూమినుండి; దివికిన్= స్వర్గానికి; ఏఁగి= పోయి; దానవవిభులన్= రాక్షసప్రభువులను; అందఱన్= అందరినీ; వధింపన్= చంపగా; దేవతలు= సురలు; వరము+ఇత్తుము+అనుచున్= వరం ఇస్తాము అంటూ; సంభాషింపన్= చెప్పగా; జీవితకాలంబున్= నేను జీవించేకాలాన్ని; చెప్పుఁడు= చెప్పండి; ఇది+అ= ఇదే; నాకున్ వరము= నేను కోరేవరం; ఒండు వరము= వేరేవరాన్ని; ఒల్లన్= అభిలషింపను; అనవుడున్= అనగా; ఆయువు= నీ జీవితకాలం; ఒక ముహూర్తము+అంత తడవు= రెండు గడియలంత సమయం; కలదు= ఉన్నది; అటంచున్= అంటూ; పలుకన్= దేవతలు చెప్పగా; ఆ+మానవ+ఈశ్వరుండు= ఆ రాజు; గగనయానమునన్= ఆకాశగమనంతో; మహికిన్= భూమికి; వచ్చి= ఏతెంచి...

**తా :** కౌరవనాథా! పూర్వం ఖట్వాంగుడనేరాజు సప్తద్వీపాలనూ పరిపాలిస్తుండేవాడు. ఇంద్రాదిదేవతలు యుద్ధభూమిలో భయంకరులైన దానవులచే ఓడిపోయారు. ఓడి ఆ రాజుచెంతకు వచ్చి తమకు సాయం చేయుమని అర్థించారు. ఆయన భువినుండి దివికేగి దానవేశ్వరులనందరినీ సంహరించాడు. అందుకు సంతసించిన దేవతలు ఖట్వాంగుణ్ణి ఏదైనా వరం కోరుకొమ్మన్నారు. "నే నెంతకాలం జీవిస్తానో చెప్పండి! ఇదే నేను కోరే వరం, వేరే వరం నా కక్కరలేదు" అని అతడన్నాడు. "నీకు ఆయువింక ఒక్క ముహూర్తకాలం (రెండుగడియలు) మాత్రమే ఉన్నది" అని ఆ వేల్పులన్నారు. వెనువెంటనే ఆ భూపాలుడు విమానయానంతో భూలోకానికి వచ్చాడు.

**క. గిరులంబోలెడి కరులను, హరులం దన ప్రాణదయితలై మనియెడి సుం**
**దరులను, హితవరులను, బుధవరులను వర్జించి గాఢవైరాగ్యమునన్. 10**

**ప్రతి :** గిరులన్+పోలెడి= పర్వతాలను పోలు; కరులనున్= ఏనుగులను; హరులన్= గుఱ్ఱాలను; తన ప్రాణదయితలు+ఐ= తనకు ప్రాణప్రియలై; మనియెడి= వర్తించే; సుందరులను= వనితలను; హితవరులనున్= హితులలో శ్రేష్ఠులను; బుధవరులనున్= పండితవర్యులను; గాఢవైరాగ్యమునన్= దృఢమైన విరక్తితో; వర్జించి= విడచి...

**తా :** అలా దివినుండి వచ్చిన ఖట్వాంగమహారాజు కొండలవంటి గజాలనూ, గుఱ్ఱాలనూ, ప్రాణప్రియలైన సుందరీమణులనూ, సన్నిహితులైన హితులనూ, పండితశ్రేష్ఠులనూ ప్రగాఢమైన వైరాగ్యంతో పరిత్యజించాడు.

**విశే :** వర్జించటం అంటే ఎవరితోనూ తగులం లేకుండా వైరాగ్యాన్ని పొందాడని భావం.

**క. గోవిందనామకీర్తనఁ, గావించి భయంబు దక్కి ఖట్వాంగధరి**
**శ్రీవిభుఁడు సూరగొనియెను, గైవల్యముఁ దొల్లి రెండుగడియలలోనన్. 11**

**ప్రతి :** ఖట్వాంగధరిశ్రీవిభుఁడు= ఖట్వాంగుడనే రాజు; గోవిందనామ కీర్తనన్= గోవిందుని నామాన్ని కీర్తించుటను; కావించి= చేసి; భయంబు+తక్కి= చావువలని భయం వీడి; తొల్లి= పూర్వం; రెండు గడియలలోనన్= రెండు గడియలకు పరిమితమైన ముహూర్తకాలములో; కైవల్యమున్= మోక్షాన్ని; చూరగొనియెను= కొల్లగొన్నాడు.

**తా :** ఆ రీతిగా సర్వసంగ పరిత్యాగం చేసిన ఖట్వాంగమహారాజు గోవిందనామ సంకీర్తన చేస్తూ, మరణభయం వదలిపెట్టి రెండు గడియలకాలంలోనే ముక్తిపొందాడు.

**విశే :** "శరీరేంద్రియాదివిరహిత ఆత్మనః। అద్వితీయతయా అవస్థానం కైవల్యమ్ ॥". శరీరంతో, ఇంద్రియాలతో సంబంధంలేని ఆత్మ రెండవది లేకుండా ఉండటాన్ని కైవల్యం అంటారు.

**వ. వినుము. నీకు నేఁడు దివసంబులకుం గాని జీవితాంతంబు గాదు; తావత్కాలంబునకుం బారలౌకిక సాధనభూతంబగు పరమకల్యాణంబు సంపాదింపవచ్చు. నంత్యకాలంబు దగ్గఱినన్ బెగ్గడిలక దేహి దేహపుత్ర కళత్రాది సందోహంబువలని మోహసాలంబు నిష్కామకరవాలంబున నిర్మూలనంబు సేసి గేహంబు వెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు నేకాంతశుచి ప్రదేశంబున విధివత్ప్రకారంబునం గుశాజినచేలంబుల తోడం గల్పితాసనుండై మానసంబున నిఖిలజగత్పవిత్రీకరణ సమర్థంబై యకారాది త్రివర్ణ కలితంబై బ్రహ్మబీజంబయిన ప్రణవంబు సంస్మరించుచు వాయువుల జయించి విషయంబులవెంట నంటిపాఱెడి యింద్రియంబుల బుద్ధిసారథియై మనోనామకంబులైన పగ్గంబుల బిగ్గఁబట్టి మ్రొగ్గం దిగిచి దట్టంబులైన కర్మఘట్టంబుల నిట్టట్టు మెట్టెడి మనంబును శేముషీబలంబున నిరోధించి భగవదాకారంబు తోడ బంధించి నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులం గ్రమంబున ధ్యానంబు సేయుచు రజస్తమో గుణంబులచేత నాక్షిప్తంబును విమూఢంబునగు చిత్తంబునం దద్గుణంబులవలన నయ్యెడి మలంబులం ధారణావశంబునం బోనడిచి నిర్మలచిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుం జను. ధారణానియమంబు గలుగ సుఖాత్మకం బగు విషయంబు నవలోకించు యోగికి భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబ మోక్షంబు సిద్ధించు ననిన యోగీంద్రునకు నరేంద్రుం డిట్లనియె. 12**

**ప్రతి :** వినుము= ఆలకించు; నీకున్= నీకు; ఏడుదివసంబులకున్+కాని= ఏడు దినాలకుగాని; జీవిత+అంతంబు= మరణం; కాదు= సిద్ధించదు; తావత్కాలంబునకున్= అప్పటికి; పారలౌకికసాధనభూతంబు+అగు= పరలోక ప్రాప్తికి సాధనమైన; పరమకల్యాణంబు= శ్రేష్ఠమైనశుభాన్ని; సంపాదింపవచ్చున్= ఆర్జించవచ్చు; అంత్యకాలంబు= మరణసమయం; డగ్గఱినన్= సమీపిస్తే; బెగ్గడిలక= భయపడక; దేహి= దేహంగల జీవాత్ముడు; దేహ= శరీరం; పుత్ర= బిడ్డలు; కళత్ర= భార్య; ఆది= మొదలైన; సందోహంబువలని= సమూహముపట్లగల; మోహసాలంబున్= వ్యామోహమనేవృక్షాన్ని; నిష్కామకరవాలంబునన్= కోరికలు లేమి అనేఖడ్గంతో (విరక్తితో); నిర్మూలనంబున్ చేసి= నిర్మూలించి, ఖండించి; గేహంబు వెడలి= ఇల్లు వదలి; పుణ్యతీర్థజల+అవగాహంబున్= పవిత్రతీర్థజలాలలో మునుగుటను; చేయుచున్= నిర్వహిస్తూ; ఏకాంతశుచి ప్రదేశంబునన్= జనసమ్మర్దంలేని శుద్ధమైనచోట; విధివత్ప్రకారంబునన్= విధిననుసరించి; కుశ+అజిన+చేలంబులతోడన్= దర్భలు, జింకచర్మం, వస్త్రంతో; కల్పిత+ఆసనుండు+ఐ= తయారుచేసుకున్న ఆసనం (పీఠం) కలవాడై; మానసంబునన్= మనస్సులో; నిఖిల= సమస్తమైన; జగత్= జగాలను; పవిత్రీకరణ= పవిత్రం చేయుటయందు; సమర్థంబు+ఐ= నైపుణ్యం కలదై; అకార+ఆది= అకారం మొదలైన; త్రివర్ణ= మూడు అక్షరాలతో (అకార+ఉకార+మకారాలతో); కలితంబు+ఐ= కూడినదై; బ్రహ్మబీజంబు+అయిన= వేదవృక్షానికి మూలమైన; ప్రణవంబు= ఓంకారాన్ని; సంస్మరించుచున్= స్మరిస్తూ; వాయువులన్= ప్రాణవాయువులను; జయించి= గెలిచి; విషయంబులవెంటన్+ అంటి= శబ్దస్పర్శరూపరసగంధాలనే విషయాల ననుసరించి; పాఱెడి= ప్రసరించే; ఇంద్రియంబులన్= చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు అనే జ్ఞానేంద్రియాలను; బుద్ధిసారథి+ఐ= బుద్ధి అనే సారథి కలవాడై; మనోనామకంబులు+ఐన= మనస్సు అనే పేరుగల; పగ్గంబులన్= పగ్గాలతో; బిగ్గన్‌పట్టి= బిగియబట్టి; మ్రొగ్గన్ తిగిచి= మోకరిల్లేటట్లు లాగి; దట్టంబులు+ఐన= దృఢమైన; కర్మఘట్టంబులన్= కర్మతీరాలలో; ఇట్టు+అట్టు= ఇటునటు; మెట్టెడి= తిరిగే; మనంబునున్= చిత్తాన్ని; శేముషీబలంబునన్= ప్రజ్ఞాబలంతో; నిరోధించి= అడ్డగించి; భగవత్+ఆకారంబుతోడన్= భగవంతుని స్వరూపంతో; బంధించి= కట్టి; నిర్విషయంబు+ఐన= విషయచింతలేని; మనంబునన్= చిత్తంలో; క్రమంబునన్= క్రమంగా; భగవత్+పాద+ఆది+అవయవంబులన్= భగవంతుని పాదాలు మొదలయిన అవయవాలను; ధ్యానంబు చేయుచున్= ధ్యానిస్తూ; రజస్+తమస్ గుణంబులచేతన్= రజోగుణ తమోగుణాలచేత; ఆక్షిప్తంబునున్= ఆకర్షింపబడినదీ; విమూఢంబును= మిక్కిలి మోహితమైనదీ; అగు= అయిన; చిత్తంబునన్= మనస్సులో; తద్గుణంబుల వలనన్= రజస్తమోగుణాల వల్ల; అయ్యెడి= కలిగే; మలంబులన్= దోషాలను; ధారణావశంబునన్= చిత్తాన్ని స్థిరీకరించుటతో; పోన్+అడిచి= నశింపజేసి; నిర్మలచిత్తంబునన్= నిర్మలమైనమనస్సుతో; పరమంబు+ఐన= శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన; విష్ణుపదంబునకున్= వైకుంఠానికి; చనున్= పోవును; ధారణానియమంబు= చిత్తస్థైర్యానికి చెందిన నియమం; కలుగన్= సిద్ధించగా; సుఖ+ఆత్మకంబు+అగు= సుఖస్వరూపమైన; విషయంబున్= స్థానాన్ని; అవలోకించు= చూచునట్టి; యోగికిన్= యోగంతో కూడినవానికి; భక్తిలక్షణంబు+ఐన= భక్తి లక్షణంగాగల; యోగ+ఆశ్రయంబునన్= యోగాన్ని ఆశ్రయించడంచేత; వేగంబు+అ= శీఘ్రంగా; మోక్షంబు= ముక్తి; సిద్ధించున్= ప్రాప్తించును; అనిన= అని చెప్పిన; యోగి+ఇంద్రునకున్= యోగివర్యుడైన శుకునకు; నర+ఇంద్రుండు= రాజవర్యుడైన పరీక్షిత్తు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** రాజా! విను. నీకు ఏడుదినాల తరువాతనే కదా మరణం! అప్పటివరకూ పరలోకసాధనమైన పరమశుభాన్ని ఆర్జించడానికి ఎంతో అవకాశం ఉంది. అవసానసమయం సమీపించగానే భయపడకుండా దేహధారిఅయినవాడు శరీరం, పుత్రులు, భార్య మొదలయిన వారిపైగల మోహమనే వృక్షాన్ని నిష్కామమనే ఖడ్గంతో తెగనరకాలి. ఇల్లు వదలిపోయి

పావనమైన తీర్థజలాలలో స్నానమాడుతూ ప్రశాంతమైన ఏకాంతప్రదేశం చేరుకోవాలి. అక్కడ శాస్త్రం విధించినట్లు దర్భలూ, జింకచర్మం, వస్త్రం పరచుకొని కూర్చోవాలి. జగమంతా పవిత్రం చేయగలదీ, అకార–ఉకార–మకారాలనే మూడక్షరాలతో కూడినదీ, బ్రహ్మబీజం అయిన ఓంకారాన్ని మనస్సులో స్మరిస్తూ ఉచ్ఛ్వాస నిశ్వాసాలను వశపరచుకోవాలి. ఆపై విషయాలను వెన్నంటి పరుగిడే ఇంద్రియాలను బుద్ధి అనే సారథితోనూ, మనస్సు అనే పగ్గంతోనూ బిగబట్టి నిగ్రహించాలి. గట్టి కర్మబంధాలలో చిక్కుకొని ఊగిసలాడే చిత్తాన్ని ప్రజ్ఞాబలంతో నిరోధించి భగవంతునిమీద నిశ్చలంగా నిలపాలి. విషయచింతలులేని చిత్తంతో ఆ దేవుని కరచరణాదులైన అవయవాలను క్రమంగా ధ్యానించాలి. రజోగుణ తమోగుణాలచేత ఆకర్షింపఁబడి మోహానికి లోనయ్యే మనస్సును ఆ గుణాలవల్ల కల్గిన మాలిన్యాలనూ ధారణతో తొలగించి నిర్మలం చేయాలి. అలా చేసినవాడు సర్వోత్కృష్టమైన విష్ణుపదం చేరుకుంటాడు. ధారణానియమం సిద్ధిస్తే అతడు సుఖమయమైన విషయాన్ని దర్శిస్తాడు. అట్టి యోగి భక్తిలక్షణమైన యోగాన్ని ఆశ్రయించి మోక్షం చూరగొంటాడు. ఈ విధంగా పలికిన శుకయోగీంద్రునితో పరీక్షిన్నరేంద్రుడు ఇలా అన్నాడు.

**విశే :** రజోగుణం మాలిన్యం విక్షేపం; తమోగుణం మాలిన్యం ఆవరణం.

**క. ధారణ యే క్రియ నిలుచును?, ధారణ కే రూప? మెద్ది ధారణ యనఁగా?**
**ధారణ పురుష మనోమల, మేరీతి హరించు? నాకు నెఱిఁగింపఁగదే! 13**

**ప్రతి :** ధారణ= చిత్తాన్ని నిలువరించటం; ఏ క్రియన్= ఎలా; నిలుచును= నిలబడును; ధారణకు+ఏ రూపము= ఆ ధారణకు రూపమేది? ధారణ అనఁగాన్= ధారణ అంటే; ఎద్ది= ఏది? పురుష మనోమలము= పురుషుని మనస్సులోని దోషాన్ని; ధారణ, ఏ రీతిన్ హరించున్= ధారణ ఎలా పోగొడుతుంది?; నాకున్+ఎఱిఁగింపన్+కదే!= ఈ విషయం నాకు తెలియపరచండి!

**తా :** మునివర్యా! ధారణ ఎలా నిలుస్తుంది? ధారణ స్వరూపం ఎలాంటిది? ధారణ అంటే ఏమిటి? అది జీవుని చిత్తమాలిన్యాన్ని ఎలా పరిహరిస్తుంది? దయతో ఈ విషయం నాకు తెలపండి!

**వ. అనిన విని రాజునకు నవధూతవిభుం డిట్లనియె. 14**

**ప్రతి :** అనినన్ విని= రాజు అలా అనగా ఆలకించి; రాజునకున్= పరీక్షిత్తునకు; అవధూతవిభుండు= అవధూతల్లో శ్రేష్ఠుడైన శుకయోగి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తా :** రాజు చెప్పిన మాటలు విని అవధూతల్లో మేటి అయిన శుకయోగి ఆ రాజునుద్దేశించి ఇలా పలికాడు.

**విశే :** 'అవధూత' శబ్దానికి నిర్వచనం ఇలా చెప్పబడి ఉన్నది.

**అక్షరత్వా ద్వరేణ్యత్వా ద్ధూతసంసారబంధనాత్ ।**
**తత్త్వమస్యర్థ సిద్ధత్వా దవధూతోఽభిధీయతే ॥**

క్షరం (వినాశం) లేని ఆత్మస్వరూపుడు, శ్రేష్ఠపురుషుడు, సంసారబంధం వదలించుకొన్నవాడు 'తత్త్వమసి' అన్న మహావాక్యార్థాన్ని అనుభవంలోకి తెచ్చుకొన్నవాడు అవధూత అవుతాడు. పై లక్షణ శ్లోకంలో ప్రథమపాదం మొదట 'అ' అనీ, ఆ పాదం మధ్యలో 'వ అనీ, రెండవపాదం మొదట' 'ధూ' అనీ, మూడవపాదం మొదట 'త' అని ఉన్న నాలుగక్షరాలను

కలిపితే 'అవధూత' శబ్దం సిద్ధిస్తుంది. అవధూతలు ఆత్మ వినాశనం లేనిదని గ్రహించి, సంసారాన్ని వదలించుకొని 'తత్+త్వం+అసి' అను ఉపదేశరూపమైన మహావాక్యాన్ని అనుభవంలోకి తెచ్చుకొంటారు. అందుచే వారు శ్రేష్ఠపురుషులు.

**ఆ. పవనములు జయించి పరిహృతసంగుఁడై, యింద్రియముల గర్వమెల్ల మాపి**
**హరి విశాలరూపమందుఁ జిత్తముఁజేర్చి, నిలుపవలయు బుద్ధినెఱపి బుధుఁడు. 15**

**ప్రతి :** బుధుఁడు= పండితుడు; పవనములు= శ్వాసవాయువులను; జయించి= అరికట్టి; పరిహృతసంగుఁడు+ఐ= పరిహరింపబడిన తగులం కలవాడై; ఇంద్రియముల= శ్రోత్రం మొదలయిన ఇంద్రియాలయొక్క; గర్వము+ఎల్లన్= సమస్త మదాన్ని; మాపి= అణచి; హరివిశాలరూపము+అందున్= శ్రీహరిదైన విస్తృత రూపంలో; బుద్ధి నెఱపి= బుద్ధిని వికసింపచేసి; చిత్తమున్ చేర్చి= మనస్సును జతపరచి; నిలుపవలయున్= నిలుచునట్లు చేయాలి.

**తా :** పండితుడైనవాడు శ్వాసవాయువుల నరికట్టి సంసారంతోడి సంగాన్ని త్యజించాలి. ఇంద్రియాలను జయించాలి. ఆపై బుద్ధిబలంతో మనస్సును విష్ణుదేవుని విశాలమైన రూపంమీదే స్థిరంగా నిలపాలి.

**విశే :** హరి విశాలరూపం అంటే విశ్వమంతటిలో విష్ణువునే చూడటం.

**వ. వినుము. భగవంతుండైన హరివిరాడ్విగ్రహంబునందు భూతభవిష్యద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు. ధరణీసలిలతేజస్సమీరణగగనాహంకారమహత్తత్త్వంబు లనియెడి సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు ధారణాశ్రయం బయిన వైరాజపురుషుండు దేజరిల్లు, నమ్మహాత్మునికిఁ బాదమూలంబు పాతాళంబు, పార్ష్ణిభాగ పాదాగ్రభాగంబులు రసాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు, జంఘలు తలాతలంబు, జానుద్వయంబు సుతలం, బూరువులు వితలా తలంబులు, జఘనంబు మహీతలంబు, నాభీవివరంబు నభస్థలంబు, వక్షంబు గ్రహతారకాముఖ జ్యోతిస్సమూహసమేతంబగు నక్షత్రలోకంబు, గ్రీవంబు మహర్లోకంబు, ముఖంబు జనలోకంబు, లలాటంబు తపోలోకంబు, శీర్షంబు సత్యలోకంబు, బాహుదండంబు లింద్రాదులు, గర్ణంబులు దిశలు, శ్రవణేంద్రియంబు శబ్దంబు, నాసాపుటంబు లశ్వినీదేవతలు, ఘ్రాణేంద్రియంబు గంధంబు, వదనంబు వహ్ని, నేత్రంబు లంతరిక్షంబు, చక్షురింద్రియంబు సూర్యుండు, రేయింబగళ్లు ఱెప్పలు, భ్రూయుగ్మవిజృంభణంబు బ్రహ్మపదంబు, తాలువులు జలంబు, జిహ్వేంద్రియంబు రసంబు, భాషణంబులు సకలవేదంబులు, దంష్ట్రలు దండధరుండు, దంతంబులు పుత్రాదిస్నేహకళలు, నగవులు జనోన్మాదకరంబు లయిన మాయావిశేషంబులు, కటాక్షంబు లనంతసర్గంబులు, పెదవులు వ్రీడాలోభంబులు, స్తనంబులు ధర్మంబులు, వె న్నధర్మమార్గంబు, మేఢ్రంబు ప్రజాపతి, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబులు, శల్యసంఘంబులు గిరులు, నాడీనివహంబులు నదులు, తనూరుహంబులు తరువులు, నిశ్వాసంబులు వాయువులు, ప్రాయంబు నిరవధికం బయిన కాలంబు, కర్మంబులు నానావిధజంతు నివహసంవృత సంసరణంబులు, శిరోజంబులు మేఘంబులు, కట్టుపుట్టంబులు సంధ్యలు, హృదయంబు ప్రధానంబు, సర్వవికారంబులకు నాశ్రయంబైన మనంబు చంద్రుండు, చిత్తంబు మహత్తత్త్వం, బహంకారంబు రుద్రుండు, నఖంబు లశ్వాశ్వతర**

**ర్యష్టగజంబులు, కటిప్రదేశంబు పశుమృగాదులు, విచిత్రంబులైన యాలాప నైపుణ్యంబులు పక్షులు, బుద్ధి మనువు, నివాసంబు పురుషుండు, షడ్జాదు లైన స్వరవిశేషంబులు గంధర్వ విద్యాధర చారణాప్సర స్సమూహంబులు, స్మృతి ప్రహ్లాదుండు, వీర్యంబు దైత్యదానవానీకంబై యుండు, మరియు న మ్మహీవిభునకు ముఖంబు బ్రాహ్మణులును, భుజంబులు క్షత్త్రియులు, నూరులు వైశ్యులును, జరణంబులు శూద్రులును, నామంబులు నానా విధంబులైన వసురుద్రాది దేవతాభిధానంబులును, ద్రవ్యంబులు హవిర్భాగంబులును, కర్మంబులు యజ్ఞ ప్రయోగంబులును నగు, నిట్టి సర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబు ముముక్షు వైనవాఁడు మనంబున ననుసంధానంబు సేయవలయునని వక్కాణించి వెండియు నిట్లనియె. 16**

**ప్రతి :** వినుము= ఆలకించు; భగవంతుండు+ఐన= జ్ఞానం మున్నగు షడ్గుణాలుగలవాడైన; హరివిరాట్+విగ్రహంబునందున్= విష్ణుదేవుని యొక్క విరాట్ శరీరంలో; భూతభవిష్యద్వర్తమానంబు+ఐన= గతించిన, రానున్న; నేటికాలానికి చెందిన; విశ్వంబు= ప్రపంచం; విలోక్యమానంబు+అగున్= చూడబడుచున్న దవుతున్నది; ధరణీ= భూమి; సలిల= జలం; తేజస్= అగ్ని; సమీరణ= వాయువు; గగన= ఆకాశం; అహంకార= అహంకారం; మహత్త్వంబులు= మహత్తత్త్వాలు; అనియెడి= అనబడునట్టి; సప్త+ఆవరణంబులచేతన్= పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్తు అనే ఏడింటిచేత; ఆవృతంబు+అగు= కప్పబడియున్న; మహా+అండ+కోశంబు+ఐన= గొప్ప అండకోశమగు; శరీరంబునందున్= దేహమునందు; ధారణా+ఆశ్రయంబు+అయిన= ధారణకు నెలవైన; వైరాజపురుషుండు= వైరాజుడనబడే పురుషుడు; తేజరిల్లున్= ప్రకాశిస్తూవుంటాడు; ఆ+మహాత్మునికిన్= ఆ మహాపురుషునికి; పాదమూలంబు= కాలిమొదలు; పాతాళంబు= పాతాళలోకం; పార్ష్ణిభాగ పాద+అగ్రభాగంబులు= కాలిమడమ కాలికొనభాగాలు; రసాతలంబు= రసాతలలోకం; గుల్ఫంబులు= చీలమండలు; మహాతలంబు= మహాతలలోకం; జంఘలు= పిక్కలు; తలాతలంబు= తలాతలలోకం; జానుద్వయంబు= మోకాళ్ళ జంట; సుతలంబు= సుతలలోకం; ఊరువులు= తొడలు; వితలాతలంబులు= వితలం, అతలం అనే లోకాలు; జఘనంబు= కటిప్రదేశం; మహీతలంబు= భూతలం; నాభీవివరంబు= బొడ్డులోని రంధ్రం; నభస్+స్థలంబు= ఆకాశస్థలం; వక్షంబు= రొమ్ము; గ్రహ= ఆదిత్యాదిగ్రహాలు; తారకా= నక్షత్రాలు; ముఖ= మొదలైన; జ్యోతిస్+సమూహ= జ్యోతిస్సుల బృందంచేత; సమేతంబు+అగు= కూడియున్న; నక్షత్రలోకంబు= అశ్విని మొదలైన నక్షత్రాల లోకం; గ్రీవంబు= మెడ; మహర్లోకంబు= మహర్లోకం; ముఖంబు= వదనం; జనలోకంబు= జనలోకం; లలాటంబు= ఫాలం, నుదురు; తపోలోకంబు= తపోలోకం; శీర్షంబు= శిరస్సు; సత్యలోకంబు= సత్యలోకం; బాహుదండంబులు= భుజదండాలు; ఇంద్ర+ఆదులు= ఇంద్రుడు మొదలయినవారు; కర్ణంబులు= చెవులు; దిశలు= దిక్కులు; శ్రవణ+ఇంద్రియంబు= శ్రోత్రమనే ఇంద్రియం; శబ్దంబు= శబ్దం; నాసాపుటంబులు= ముక్కు పుటాలు; అశ్వినీదేవతలు= అశ్వినులనే దేవతలు; ఘ్రాణ+ఇంద్రియంబు= ముక్కు అనే ఇంద్రియం; గంధంబు= గంధం; వదనంబు= ముఖం; వహ్ని= అగ్ని; నేత్రంబులు= కన్నులు; అంతరిక్షంబు= ఆకసం; చక్షుస్+ఇంద్రియంబు= నేత్రేంద్రియం; సూర్యుండు= భాస్కరుడు; రేయింబగళ్ళు= రాత్రి మరియు పగలు; ఱెప్పలు= కనురెప్పలు; భ్రూయుగ్మవిజృంభణంబు= కనుబొమ్మల వికాసం; బ్రహ్మపదంబు= బ్రహ్మస్థానం; తాలువులు= దవడలు; జలంబు= నీరు; జిహ్వా+ఇంద్రియంబు= నాలుక అనే ఇంద్రియం; రసంబు= రసం; భాషణంబులు= పలుకులు; సకలవేదంబులు= సమస్తవేదాలు; దంష్ట్రలు= కోరలు; దండధరుండు= యముడు; దంతంబులు= పళ్లు; పుత్ర+ఆదిస్నేహకళలు= పుత్రుడు మొదలయిన స్నేహలేశాలు; నగవులు= నవ్వులు;

ఉన్మాదకరంబులు+అయిన= ప్రజలకు ఉన్మాదం కల్గించేవి అయినట్టి; మాయావిశేషంబులు= ప్రకృతియనబడు మాయకు చెందిన విశేషాలు; కటాక్షంబులు= కడగంటి చూపులు; అనంత సర్గంబులు= అంతంలేని సృష్టులు; పెదవులు= వాతెరలు; వ్రీడాలోభంబులు= సిగ్గుమరియు లోభం; స్తనంబులు= చన్నులు; ధర్మంబులు= ధర్మాలు; వెన్ను= వీపు; అధర్మమార్గంబు= అధర్మపు త్రోవ; మేఢ్రంబు= మగగురి, శిశ్నం; ప్రజాపతి= సృష్టికర్త (బ్రహ్మ); వృషణంబులు= బీజాలు; మిత్రావరుణులు= మిత్రుడు, వరుణుడు అనుదేవతలు; జఠరంబు= గర్భం; సముద్రంబులు= సాగరాలు; శల్యసంఘంబులు= ఎముకలరాసులు; గిరులు= కొండలు; నాడీనివహంబులు= నాడులసమూహాలు; నదులు= ఏరులు; తనూరుహంబులు= వెండ్రుకలు; తరువులు= చెట్లు; నిశ్వాసంబులు= నిట్టూర్పులు; వాయువులు= గాలులు; ప్రాయంబు= వయస్సు; నిర్+అవధికంబు+ఐన= అవధిలేని; కాలంబు= సమయం; కర్మంబులు= కర్మలు; నానావిధ= వివిధాలైన; జంతు= ప్రాణులయొక్క; నివహ= సమూహాలచే; సంవృత= చుట్టబడి ఉన్న; సంసరణంబులు= సంసారాలు; శిరోజంబులు= తలవెండ్రుకలు; మేఘంబులు= మబ్బులు; కట్టుపుట్టంబులు= ధరించే వస్త్రాలు; సంధ్యలు= సంధ్యాకాలాలు; హృదయంబు= మనస్సు; ప్రధానంబు= అవ్యక్తం; సర్వవికారంబులకున్= అన్ని వికారాలకూ; ఆశ్రయంబు+ఐన= నెలవైన; మనంబు= మనస్సు; చంద్రుండు= చంద్రుడు; చిత్తంబు= మనస్సు; మహత్తత్త్వంబు= మహత్తు అనబడే తత్త్వం; అహంకారంబు= అంతఃకరణరూపమైన అహంకారం; రుద్రుండు= రుద్రుడనే దేవుడు; నఖంబులు= గోళ్ళు; అశ్వ= గుర్రాలు; అశ్వతరీ= ఆడు కంచరగాడిదలు; ఉష్ట్ర= ఒంటెలు; గజంబులు= ఏనుగులు; కటిప్రదేశంబు= మొల; పశుమృగాదులు= పశువులు; మృగాలు మొదలైనవి; విచిత్రంబులు+ఐన= వింతగొల్పునట్టి; ఆలాప నైపుణ్యంబులు= మాటనేర్పరితనాలు; పక్షులు= పులుగులు; బుద్ధి= మతి; మనువు= స్వాయంభువమనువు; నివాసంబు= ఆశ్రయం; పురుషుండు= మనుజుడు; షడ్జ+ఆదులు+ఐన= షడ్జం మొదలయిన; స్వరవిశేషంబులు= స్వరభేదాలు; గంధర్వ= గంధర్వులు; విద్యాధర= విద్యాధరులు; చారణ= చారణులు; అప్సరస్+ సమూహంబులు= అచ్చరల బృందాలు; స్మృతి= స్మరణం; అసురశ్రేష్ఠుడైన ప్రహ్లాదుండు; వీర్యంబు= పరాక్రమస్థానం; దైత్యదానవ+అనీకంబు+ఐ+ఉండున్= దితిపుత్రులు, దానవులయొక్క సమూహం అయి ఉండును; మఱియున్= ఇంకను; ఆ+మహీవిభునకున్= ఆ భూపాలకునకు; ముఖంబు= వదనం; బ్రాహ్మణులును= విప్రులును; భుజంబులు= బాహువులు; క్షత్రియులున్= రాజులు; ఊరులు= తొడలు; వైశ్యులును= వైశ్యకులంవారును; చరణంబులు= పాదాలు; శూద్రులును= నాల్గవ వర్ణంవారును; నామంబులు= పేరులు; నానావిధంబులు+ఐన= వివిధాలైన; వసు= అష్టవసువులు; రుద్ర+ఆది= ఏకాదశరుద్రులు మొదలయిన; దేవతా+అభిధానంబులును= దేవతలపేళ్ళును; ద్రవ్యంబులు= గుణవంతమైన పదార్థాలు; హవిర్భాగంబులును= అగ్నిహోత్రాలలో వ్రేల్వదగిన అన్నాదివస్తువుల భాగాలును; కర్మంబులు= క్రియలు; యజ్ఞ ప్రయోగంబులున్+అగున్= యజ్ఞనిర్వహణాలు అవుతున్నాయి; ఇట్టి= ఇటువంటి; సర్వమయుండు+ఐన= సర్వాత్మకుడైన; పరమేశ్వరుని= పరమాత్మునియొక్క; విగ్రహంబు= మూర్తిని; ముముక్షువు+ఐనవాఁడు= మోక్షాపేక్షగలవాడు; మనంబునన్= చిత్తంలో; అనుసంధానంబు= ధ్యానం; చేయవలయున్+అని= కావించాలని; వక్కాణించి= చెప్పి; వెండియున్= మరియు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** రాజా! విను. భగవానుడైన విష్ణుని విరాట్ విగ్రహంలో జరిగిన, జరుగనున్న, జరుగుతున్న ప్రపంచమంతా గోచరిస్తుంది. భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్తత్త్వం అనే ఏడు ఆవరణాలు మహాండకోశమైన విరాట్పురుషుని శరీరాన్ని కప్పి ఉన్నాయి. ఆ శరీరంలో ధారణకు ఆశ్రయమై వైరాజపురుషుడు భాసిస్తున్నాడు. ఆ మహాత్మునికి పాతాళం అరికాలు; రసాతలం కాలిమడమ, మునివ్రేళ్ళు; మహాతలం చీలమండలు; తలాతలం పిక్కలు; సుతలం మోకాళ్ళ జంట; వితలం అతలం తొడలు; భూతలం పిరుదు; ఆకసం బొడ్డు; గ్రహాలూ, తారకలూ,

జ్యోతిస్సమూహంతో కూడిన నక్షత్రలోకం వక్షఃస్థలం; మహర్లోకం మెడ; జనలోకం ముఖం; తపోలోకం నొసలు; సత్యలోకం శిరస్సు; ఇంద్రాదులు భుజదండాలు; దిక్కులు చెవులు; శబ్దం శ్రోత్రేంద్రియం; అశ్వినీదేవతలు ముక్కుపుటాలు; గంధం ఘ్రాణేంద్రియం; అగ్ని నోరు; అంతరిక్షం కళ్ళు, సూర్యుడు నేత్రేంద్రియం, రేపవళ్ళు కనురెప్పలు, బ్రహ్మపదం కనుబొమలు, జలాలు దవడలు, రసం జిహ్వేంద్రియం. సకలవేదాలు భాషణాలు, యముడు కోరలు, పుత్రాదులమీది స్నేహ కళలు దంతాలు, జనులకు పిచ్చి కల్గించే మాయావిలాసాలు నవ్వులు, తుదిలేని సృష్టులే కడగంటి చూపులు; సిగ్గు, లోభం పెదవులు, ధర్మమార్గాలు రొమ్ములు; అధర్మమార్గం వెన్ను, ప్రజాపతి పురుషాంగం, మిత్రావరుణులు వృషణాలు, సముద్రాలు కడుపు, కొండలు ఎముకలు, నదులు నాడులు, చెట్లు రోమాలు, గాడ్పు నిట్టూర్పులు, కడలేని కాలమే ప్రాయం. పలువిధాలైన ప్రాణులతో గూడిన సంసారాలు కర్మలు, మబ్బులు శిరోజాలు, సంధ్యలు కట్టుబట్టలు, ప్రధానం హృదయం, చంద్రుడు వికారాల కన్నింటికి స్థానమైన మనస్సు. మహత్తత్వం చిత్తం. రుద్రుడు అహంకారం, గుర్రాలు, కంచరగాడిదలు, ఒంటెలు, ఏనుగులు గోళ్ళు; పశువులు, మృగాదులు కటిప్రదేశం, పక్షులు చిత్రమైన మాటలనేర్పులు, మనువు బుద్ధి, పురుషుడు నివాసం, గంధర్వులు, విద్యాధరులు, చారణులు, అప్సరసలు షడ్జం మొదలయిన స్వరాలు; ప్రహ్లాదుడు స్మృతి, దైత్యులు, దానవులు వీర్యం. అంతేకాదు, ఆ మహాప్రభువునకు బ్రాహ్మణులు ముఖం, క్షత్రియులు భుజాలు, వైశ్యులు తొడలు, శూద్రులు పాదాలు, వసువులు రుద్రులు, హవిర్భాగాలు ద్రవ్యాలు, యజ్ఞప్రయోగాలు కర్మలవుతున్నాయి. ఇట్టి విశ్వమయుడైన విరాట్పురుషుని విగ్రహాన్ని మోక్షం కోరేవాడు తన మనస్సులో అనుసంధానం చేసుకోవాలి అని చెప్పి శ్రీశుకమహర్షి ఇంకా ఇలా చెప్పినాడు.

**విశే :** ఇచ్చట చిత్తస్థైర్యంకొరకై విరాట్ దేహానికీ, జీవునకూ, ఈశ్వరునికీ అభేదోపాసన చెప్పబడింది. దేహాన్ని, జీవుణ్ణీ ఈశ్వరునిలో లయింపజేసి ఆ ఈశ్వరుణ్ణే ధ్యానించాలి అన్నది సారాంశమని శ్రీధరుడు వివరించాడు.

**క. హరిమయము విశ్వ మంతయు, హరి విశ్వమయుండు, సంశయము పని లే దా**
**హరిమయము గాని ద్రవ్యము, పరమాణువు లేదు వంశపావన! వింటే. 17**

**ప్రతి :** వంశపావన!= కులాన్ని పవిత్రం కావించే ఓ పరీక్షిన్మహారాజా!; విశ్వము+అంతయున్= ఈ ప్రపంచమంతా; హరిమయము= విష్ణుతత్త్వంతో నిండి ఉన్నది; హరి= విష్ణువు; విశ్వమయుండు= ప్రపంచమంతా తానే అయినవాడు; సంశయము= (ఈ విషయంలో) సందేహం; పని లేదు= అక్కర లేదు; ఆ హరిమయము= ఆ విష్ణుమయం; కాని= కానట్టి; ద్రవ్యము= పదార్థం; పరమాణువు లేదు= సూక్ష్మాతి సూక్ష్మమైన అణువు (కూడా) లేదు.

**తా :** వంశపావనుడవైన ఓ పరీక్షిన్మహారాజా! ఈ విశ్వమంతా విష్ణుమయమే. విష్ణుదేవుడు విశ్వమయుడు. ఇందులో ఏ మాత్రం సందేహించ వలసిన పనిలేదు. విష్ణుమయం కాని వస్తువు ఈ జగత్తులో ఒక్క పరమాణువు గూడా లేదు.

**విశే :** విశ్వం, విష్ణువులను దారం, వస్త్రం అనువాని సంబంధంతో గమనింపవచ్చు.

**సీ. కలలోన జీవుండు కౌతూహలంబునఁ బెక్కు దేహంబులఁ బేరు వడసి**
**యింద్రియంబులవెంట నెల్ల వృత్తంబులు నీక్షించి మఱి తన్ను నెఱుఁగుకరణి**
**నఖిలాంతరాత్మకుఁడగు పరమేశ్వరుఁ డఖిలజీవుల హృదయముల నుండి**
**బుద్ధివృత్తుల నెల్ల బోద్ధయై వీక్షించు బద్ధుండు గాఁడు ప్రాభవమువలన**

**తే. సత్యుఁ డానందబహుళ విజ్ఞానమూర్తి, యతని సేవింప నగుఁగాక, యన్యసేవఁ**
**గలుగనేరవు కైవల్య గౌరవములు, పాయ దెన్నఁడు సంసారబంధ మధిప! 18**

**ప్రతి :** అధిప!= రాజా!; జీవుండు= జీవుడు; కలలోనన్= స్వప్నంలో; కౌతూహలంబునన్= అనుభవానికి రాని కోరిక యందలి ఆశతో; పెక్కు దేహంబులన్= పలు శరీరాలలో; పేరువడసి= పేరుపొంది; ఇంద్రియంబుల వెంటన్= ఇంద్రియాలతో; ఎల్లవృత్తంబులన్= అన్ని ప్రవృత్తులనూ; ఈక్షించి= చూచి; మఱి= ఆపై; తన్నున్= తనను; ఎఱుఁగు కరణిన్= తెలిసికొనే విధంగా; అఖిల+అంతరాత్మకుఁడు+అగు= అంతటికీ అంతరాత్మగా ఉన్న; పరమేశ్వరుఁడు= భగవంతుడు; అఖిల జీవుల= సకల జీవులయొక్క; హృదయములన్+ఉండి= హృదయస్థానాలలో ఉంటూ; బుద్ధివృత్తులన్+ఎల్లన్= బుద్ధిలోని ప్రవృత్తుల నన్నింటినీ; బోద్ధ+ఐ= తెలుసుకొనేవాడై; వీక్షించున్= చూచును; ప్రాభవమువలనన్= తనదైన ప్రభుత్వంవల్ల; బద్ధుండు కాఁడు= బంధనంలో చిక్కుకొనడు; సత్యుఁడు= శాశ్వతుడు; ఆనందబహుళ విజ్ఞానమూర్తి= ఆనందంతో పరిపూర్ణుడైన విజ్ఞాన శరీరుడూ అయిన; అతనిన్= ఆ పరమాత్ముణ్ణి; సేవింపన్+అగున్+కాక= సేవించడంవల్ల సిద్ధిస్తాయిగాని; అన్యసేవన్= ఇతరులను సేవించడంవల్ల; కైవల్యగౌరవములు= మోక్షంవల్ల సిద్ధించే గొప్పతనాలు; కలుగనేరవు= సిద్ధించవు; సంసారబంధము= ఈ సంసారంతో కలిగిన బంధనం; ఎన్నఁడున్= ఎన్నటికినీ; పాయదు= తొలగదు.

**తా :** రాజా! జీవుడు కలలో తనకంతవరకూ తీరని కోరికలమీది ఉబలాటంతో పలుశరీరాలు ధరిస్తాడు. పలుపేర్లతో వ్యవహరింపబడతాడు. తన ఇంద్రియాలతో విశేషా లన్నింటినీ గమనిస్తాడు. ఆ మీదట తన్ను తెలుసుకొంటాడు. ఇట్లే అంతటికీ అంతరాత్మయయిన పరమాత్మ అన్నిప్రాణుల హృదయాలలో ఉండి ప్రజ్ఞతో బుద్ధి వృత్తులనన్నింటినీ పరిశీలిస్తాడు. తానే అన్నిటికీ ప్రభువు కావడంవల్ల దేనికీ బద్ధుడు కాడు. ఆయన సత్యస్వరూపుడూ, ఆనందపరిపూర్ణుడూ అయిన విజ్ఞానమూర్తి. ఆయనను సేవించినప్పుడే ముక్తి సిద్ధిస్తుంది. తదితరుల సేవతో మోక్షం సిద్ధించదు. ఈ సంసారబంధం వీడదు.

**మ. బహువర్షంబులు బ్రహ్మ తొల్లి జగముత్పాదింప విన్నాణి గా**
**క హరిప్రార్థన ధారణావశమునం గాదే! యమోఘోల్లస**
**న్మహనీయోజ్జ్వల బుద్ధియై భువననిర్మాణ ప్రభావంబుతో**
**విహరించెన్ నరనాథ! జంతునివహావిర్భావనిర్ణేతయై. 19**

**ప్రతి :** నరనాథ!= రాజా!; తొల్లి= పూర్వం; బ్రహ్మ= చతుర్ముఖుడు; బహువర్షంబులు= పెక్కు సంవత్సరాలు; జగము+ ఉత్పాదింపన్= జగత్తును సృష్టించడానికి; విన్నాణి గాక= నేర్పరికాక; హరిప్రార్థనన్= విష్ణుదేవుని ప్రార్థించడంచేత; ధారణావశమునన్+కాదే= (మరలపొందిన) సృష్టి క్రమాన్ని స్మరించి బుద్ధిలో నిలుపుకోవటంవలన కదా!; అమోఘ= సార్థకమైన; ఉల్లసత్= ప్రకాశించెడు; మహనీయ= పూజనీయమగు; ఉజ్జ్వలబుద్ధి+ఐ= తేజరిల్లెడు బుద్ధి కలవాడై; జంతు= ప్రాణులయొక్క; నివహ= సమూహంయొక్క; ఆవిర్భావ= సృష్టికార్యంలో; నిర్ణేత+ఐ= నిర్ణయాన్ని పొందినవాడై; భువననిర్మాణ ప్రభావంబుతోన్= జగత్తును సృష్టించు మహిమతో; విహరించెన్= విహరించినాడు.

**తా :** రాజా! పూర్వం బ్రహ్మ జగత్తును సృష్టించాలనుకొన్నాడు. పలు సంవత్సరాలు అందుకై ప్రయత్నించాడు. అయినా అందుకు తగిన నేర్పు బ్రహ్మకు సిద్ధించలేదు. ఆపై హరిని ఏకాగ్రమైన చిత్తంతో ప్రార్థించాడు. ఆ హరి కృపవల్ల మళ్ళీ

సృష్టిక్రమాన్ని స్మరించగలిగాడు. ఆ ధారణతో ప్రాణులను సృష్టించే విధానంలో నేర్పు గడించాడు. ఫలప్రదమైన, పూజనీయమైన బుద్ధివికాసంతో ఈ జగన్నిర్మాణంలో సమర్థుడై విహరించాడు.

**వ. విను. మూఢుండు శబ్దమయ వేదమార్గంబైన కర్మఫల బోధన ప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాది నానాలోక సుఖంబుల నిచ్చగించుచు మాయామయ మార్గంబున వాసనా మూలంబున నిద్రించువాఁడు గలలు గను తెఱంగునం బరిభ్రమించుచు నిరవద్య సుఖలాభంబుం జెందఁడు; తన్నిమిత్తంబున విద్వాంసుండు నామమాత్ర సారంబులగు భోగ్యంబులలోన నెంత దేహనిర్వహణంబు సిద్ధించు నంతియ కైకొనుచు నప్రమత్తుండై సంసారంబు సుఖం బని నిశ్చయింపక యొండు మార్గంబున సిద్ధి గలదని చూచి పరిభ్రమణంబు సేయుచుండు. 20**

**ప్రతి :** విను= ఆలకించు; మూఢుండు= వివేకం లేనివాడు; శబ్దమయ వేదమార్గంబు+ఐన= శబ్దమే తనస్థితి అయిన వేదం బోధించిన త్రోవయగు; కర్మఫల బోధన ప్రకారంబునన్= యజ్ఞాదికర్మలకు ఫలాలను బోధించు విధానంతో; వ్యర్థంబులు+ఐన= నిరర్థకాలగు; స్వర్గాది నానాలోక సుఖంబులన్= స్వర్గం మొదలైన వివిధ ప్రపంచసుఖాలను; ఇచ్చగించుచున్= అభిలషిస్తూ; మాయామయ మార్గంబునన్= మాయా స్వరూపమైన త్రోవలో; వాసనామూలంబునన్= పూర్వ సంస్కారంతో; నిద్రించువాఁడు= నిద్రపోవు మనుజుడు; కలలుగను తెఱంగునన్= స్వప్నాలను కన్నట్లు; పరిభ్రమించుచున్= ఇటూ అటూ తిరుగుతూ; నిరవద్య సుఖలాభంబున్= దోషరహితమైన సుఖప్రాప్తిని (మోక్షసుఖాన్ని); చెందఁడు= పొందదు; తత్+నిమిత్తంబునన్= ఆ కారణం వల్ల; విద్వాంసుండు= ఆత్మజ్ఞుడైన పండితుడు; నామమాత్ర సారంబులు+అగు= పేరుకు మాత్రమే సారవంతమైన అనగా ఏమాత్రమూ సారంలేని; భోగ్యంబులలోనన్= భోగార్హమైన వస్తువులలో; ఎంతన్= ఎంతమాత్రం చేత; దేహనిర్వహణంబు= శరీర ధారణం; సిద్ధించున్= కల్గుతుందో; అంతియ= అంతమాత్రమే; కైకొనుచున్= గ్రహిస్తూ; అప్రమత్తుండు+ఐ= జాగరూకుడై; సంసారంబు= ఆలుబిడ్డలతోడి ఉనికి; సుఖంబు+అని= సుఖకరమని; నిశ్చయింపక= నిర్ణయించక; ఒండుమార్గంబునన్= మరొక త్రోవలో (సంసారభిన్నమైన మార్గమునందు); సిద్ధి= జీవితలక్ష్య ప్రాప్తి; కలదని చూచి= ఉన్నదని గ్రహించి; పరిభ్రమణంబు+చేయుచుండున్= పరిభ్రమిస్తూ ఉంటాడు.

**తా :** అవివేకియైన మానవుడు శబ్దప్రధానమైన వేదంలోని కర్మకాండ బోధించినట్లు నిరర్థకాలైన స్వర్గాదిసుఖాలు కోరుతాడు. నిద్రించేవాడు పూర్వసంస్కారంతో కలలు కన్నట్లు మాయామయమైన మార్గంలో పరిభ్రమిస్తాడు. అంతేకాని శాశ్వతమైన మోక్షసుఖం పొందలేడు. వివేకవంతుడు అలా చేయడు. అతడు నిస్సారమైన భోగాలలో శరీరధారణకు అవసరమైనంత మేరకే భోగస్వీకారం చేస్తాడు. కడు జాగరూకుడై ఉంటాడు. సంసారం సుఖమని భావించడు. దాని కతీతమైన త్రోవలో పోతేనే సిద్ధి కల్గుతుందని భావించి అలా ప్రవర్తిస్తాడు.

**సీ. కమనీయ భూమిభాగములు లేకున్నవే! పడియుండుటకు దూదిపఱుపు లేల?**
**సహజంబులగు కరాంజలులు లేకున్నవే! భోజనభాజనపుంజ మేల?**
**వల్కలాజిన కుశావళులు లేకున్నవే! కట్ట దుకూలసంఘంబు లేల?**
**గొనకొని వసియింప గుహలు లేకున్నవే! ప్రాసాదసౌధాదిపటల మేల?**

**తే. ఫలరసాదులు గురియవే పాదపములు, స్వాదుజలముల నుండవే సకలనదులు**
**పొసఁగ భిక్షము వెట్టరే పుణ్యసతులు, ధనమదాంధుల కొలువేల తాపసులకు? 21**

**ప్రతి :** కమనీయ భూమిభాగములు= ఇంపైన భూప్రదేశాలు; లేక+ఉన్నవి+ఏ= లేవా?; పడియుండుటకున్= పరుండటానికి; దూదిపఱుపులు+ఏల?= దూదితో చేసిన పడకలు ఎందుకు?; సహజంబులు+అగు= స్వతస్సిద్ధమైన; కర+అంజలులు= దోసిళ్ళు; లేక+ఉన్నవే= లేవా?; భోజన భాజనపుంజము= భుజించుటకు అర్హమైన పాత్రల సమూహం; ఏల= ఎందుకు?; వల్కల= నారచీరలయొక్క; అజిన= మృగ చర్మాలయొక్క; కుశ= దర్భచాపలయొక్క; ఆవళులు= పంక్తులు; లేకున్నవి+ఏ= లేవా?; కట్టన్= ధరించుటకు; దుకూలసంఘంబులు= సన్న వస్త్రాలరాశులు; ఏల= ఎందుకు?; గొనకొని= ప్రయత్నించి; వసియింపన్= నివసించడానికి; గుహలు= కొండలబిలాలు; లేకున్నవి+ఏ= లేవా?; ప్రాసాద= నగళ్ళు; సౌధ+ఆది= రాజగృహాలయొక్క; పటలము= సముదాయం; ఏల= ఎందుకు?; పాదపములు= చెట్లు; ఫలరస+ఆదులు= పండ్లు; రసాలు మున్నగువాటిని; కురియవు+ఏ= వర్షించడం లేదా?; సకలనదులు= అన్నినదులు; స్వాదుజలములన్= తియ్యని నీళ్ళతోగూడి; ఉండవు+ఏ= లేవా?; పుణ్యసతులు= సాధ్వీమణులు; పొసఁగన్= ఆదరంతో; భిక్షము పెట్టరు+ఏ= భిక్షం ఇయ్యకున్నారా!; తాపసులకున్= తపస్వులకు; ధనమద+అంధుల= ధనగర్వంతో గుడ్డివారైనవారి; కొలువు+ఏల= సేవ ఎందుకు?

**తా :** సంసారంపట్ల విరక్తుడైన వివేకవంతుడు ఇలా భావన చేస్తాడు: పడుకోవడానికి తగినంత చదునైన చక్కని నేల ఉండగా దూదిపరుపు లెందుకు? పుట్టుకతో వచ్చిన దోసిళ్ళు ఉన్నాయి కదా? మరి భుజించడానికి కంచాలు మొదలైనవి ఎందుకు? నారచీరలూ, జింకచర్మాలూ, దర్భచాపలూ ఉన్నవి కదా! ఇక కట్టుకోవడానికి పట్టు పుట్టాలెందుకు? నివసించడానికనువైన కొండ గుహలున్నాయి కదా! ఇక మేడలూ, రాజప్రాసాదాలూ ఎందుకు? చెట్లు తగినట్లు ఫలరసాలను ప్రసాదిస్తున్నాయి కదా! నదులలో తియ్యని నీటికి లోటు లేదుకదా! పుణ్యస్త్రీలు పుష్కలంగా భిక్షలిస్తూనే ఉన్నారు కదా! ఇవన్నీ ఉండగా తపోధనులైనవారు, ధనమదంతో కన్నూ, మిన్నూ కానని సంపన్నులను ఎందుకు సేవించాలి?

**క. రక్షకులు లేనివారల, రక్షించెద ననుచుఁ జక్రి రాజై యుండన్**
**రక్షింపు మనుచు నొక నరు, నక్షముఁ బ్రార్థింపనేల యాత్మజ్ఞులకున్? 22**

**ప్రతి :** రక్షకులు= కాపాడేవాళ్ళు; లేనివారలన్= లేని జనులను; రక్షించెదన్ అనుచున్= నేను కాపాడుతానంటూ; చక్రి= చక్రధారియైన శ్రీహరి; రాజు+ఐ+ఉండన్= రాజు అయివుండగా; ఆత్మజ్ఞులకున్= ఆత్మతత్త్వ మెరిగిన వివేకులకు; అక్షమున్= అసమర్థుడైన; ఒక నరున్= ఒక మనుజుణ్ణి; రక్షింపుము+అనుచున్= కాపాడమంటూ; ప్రార్థింపన్+ఏల?= వేడుకొనవలసిన పని ఏమున్నది?

**తా :** దిక్కులేని వారికి దిక్కై తాను కాపాడుతానంటూ చక్రధారియైన శౌరి తానున్నాడు. అలాంటప్పుడు ఆత్మజ్ఞులైన వివేకవంతులు అసమర్థుడైన ఒక మనుజుణ్ణి రక్షించుమంటూ ప్రార్థింపవలసిన అవసర మేమున్నది?

**వ. అని యిట్లు స్వతస్సిద్ధుండును, నాత్మయుఁ, బ్రియుండును, నిత్యుండును, సత్యుండును, భగవంతుండును నైన వాసుదేవుని భజించి తదీయ సేవానుభవానందంబున సంసార హేతువగు నవిద్యవలన బుద్ధిమంతుండు విడువంబడుం గావున. 23**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; స్వతస్+సిద్ధుండును= తన హృదయంలోనే సిద్ధమైయున్నవాడూ; ఆత్మయున్= అంతర్యామిరూపుడూ; ప్రియుండును= ప్రీతి విషయమైనవాడూ, ఇష్టుడునూ; నిత్యుండును= మిథ్యకానివాడును; సత్యుండును=

సత్యస్వరూపుడును; భగవంతుడునున్= షడ్గుణైశ్వర్యసంపన్నుడునూ (జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు అనే ఆరుగుణాలు గలవాడు) అయిన; వాసుదేవునిన్= వసుదేవుని సుతుడగు కృష్ణుని; భజించి= సేవించి; తదీయ సేవా+అనుభవ+ ఆనందంబునన్= ఆ దేవుని సేవను అనుభవించుటచే కల్గు ఆనందంతో; బుద్ధిమంతుండు= వివేకశాలి; సంసారహేతువు+అగు= సంసారానికి కారణమైన; అవిద్యవలనన్= అజ్ఞానంనుండి; విడువన్+పడున్+కావునన్= విముక్తుడవుతాడు కాబట్టి...

**తా :** ఈ విధంగా భావించి బుద్ధిమంతుడైనవాడు, జీవుల హృదయంలో స్వతస్సిద్ధంగా ఉన్నవాడూ, అంతర్యామీ, ప్రీతిపాత్రుడూ, నిత్యుడైనవాడూ, సత్యస్వరూపుడూ, షడ్గుణైశ్వర్యసంపన్నుడైన భగవానుడగు వాసుదేవుణ్ణి సేవిస్తాడు. ఆ సేవవలన కలిగే ఆనందం అనుభవిస్తాడు. తద్ద్వారా సంసారానికి హేతువైన అవిద్య అనే ప్రకృతినుండి విడుదల పొందుతాడు కాబట్టి–

**విశే :** 1.అంతర్యామి అంటే హృదయగుహలో సూక్ష్మమైన అగ్నిజ్వాల రూపంలో ఉండి దేహయంత్రాన్ని నడిపేవాడు.
2. వాసుదేవుడు – అన్నింటిలో తానూ, అన్నీ తనలోనూ ఉండి ప్రకాశించేవాడు.

**మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయచింతాయత్తుఁడై చిక్కి వా**
**సరముల్ ద్రోసెడువాఁడు కింకరగదా సంతాడితోరస్కుఁడై**
**ధరణీశోత్తమ! దండభృన్నివసన ద్వారోపకంఠోగ్ర వై**
**తరణీవహ్ని శిఖాపరంపరలచే దగ్ధుండు గాకుండునే? 24**

**ప్రతి :** ధరణీశ+ఉత్తమ!= రాజోత్తమా!; హరిన్= శ్రీ మన్నారాయణుని; చింతింపక= ధ్యానించకుండా; మత్తుఁడు+ఐ= మదించినవాడై; విషయచింతా+ఆయత్తుఁడు+ఐ= శబ్దస్పర్శాది విషయసుఖాల చింత కధీనుడై; చిక్కి= తగుల్కొని; వాసరముల్= దినాలు; త్రోసెడువాఁడు= గడిపేవాడు; కింకర= యమకింకరులయొక్క; గదా= గదలచేత; సంతాడిత= మొత్తబడిన; ఉరస్కుఁడు+ఐ= వక్షఃస్థలంగలవాడై; దండభృత్= యమునియొక్క; నివసన= నివాసమగు యమపురియొక్క; ద్వార= ద్వారంయొక్క; ఉపకంఠ= సమీపమందలి; ఉగ్ర= భీకరమైన; వైతరణీ= వైతరణి అనే నదిలోని; వహ్నిశిఖా= అగ్నిజ్వాలలయొక్క; పరంపరలచేన్= శ్రేణులచేత; దగ్ధుండు= కాల్చబడినవాడు; కాక+ఉండును+ఏ= కాకుండా ఉంటాడా?

**తా :** నృపశ్రేష్ఠా! శ్రీహరిని ధ్యానించకుండా మదోన్మత్తచిత్తుడై విషయభోగాలనే చింతిస్తూ దినాలు గడిపేవాడికి యమభటుల గదల దెబ్బలు తప్పవు. అతడు యమపురద్వారం వద్ద వైతరణీనదిలోని అగ్ని జ్వాలల్లోపడి మలమల మాడిపోతాడు.

**విశే :** యమనగరద్వారానికి సమీపంలో వైతరణి అనే నది ఉన్నది. మామూలు నదులలో నీరు ప్రవహిస్తుంది. కాని వైతరణీనది అగ్నిమయి కాన అందులో అగ్నిజ్వాలలు ఎగసిపడుతుంటాయి.

**క. మొత్తుదురు గదల, మంటల, కెత్తుదు రడ్డంబు, దేహ మింతింతలుగా**
**నొత్తుదు, రసిపుత్త్రికలను, హత్తుదురు కృతాంతభటులు హరివిరహితులన్. 25**

**ప్రతి :** కృతాంత భటులు= యమభటులు; హరివిరహితులన్= హరిచింతన లేనివారిని; గదలన్= గదలతో; మొత్తుదురు= మోదుతారు; మంటలకున్= అగ్ని జ్వాలలకు; అడ్డంబు= అడ్డంగా; ఎత్తుదురు= ఎత్తుతారు; దేహము= వారి శరీరం; ఇంతింతలుగాన్= ముక్కలు ముక్కలయ్యేటట్లు; ఒత్తుదురు= పిసికివేస్తారు; అసిపుత్త్రికలను= (ఆపై) చురకత్తులను; హత్తుదురు= దూరుస్తారు.

**తా :** భగవచ్చింతనలేని పాషండులను యమకింకరులు గదలతో మోదుతారు. వాళ్ళ దేహాలను మంటలపాలు చేసి మాడుస్తారు. వాటిని ముక్కలు ముక్కలయ్యేటట్లు పిసికి ఆపై వాటిలోకి చురకత్తులు దూరుస్తారు.

**వ. మఱియు హరి చరణ కమలగంధ రసాస్వాదనం బెఱుంగని వారలు నిజకర్మబంధంబుల దండధర మందిర ద్వార దేహళీ సమీప జాజ్వల్యమాన వైతరణీ తరంగిణీ దహనదారుణ జ్వాలా జాల దందహ్యా మానదేహులం గూడి శిఖిశిఖావగాహంబుల నొందుచుండుదురు; మఱియు విజ్ఞానసంపన్నులై మను ప్రపన్నులు మాయాపన్నులు గాక విన్నాణంబునం దమతమ హృదయాంతరాళంబులం బ్రాదేశమాత్ర దివ్యదేహుండును, దిగిభరాజశుండా దండసంకాశదీర్ఘ చతుర్బాహుండును, కందర్పకోటి సమానసుందరుండును, ధృతమందరుండును, రాకావిరాజమాన రాజమండలసన్నిభ వదనుండును, సౌభాగ్యసదనుండును, బ్రభాతకాల భాసమాన భాస్కరబింబ ప్రతిమానవిరాజిత పద్మరాగరత్న రాజీవిరాజమాన కిరీటకుండలుండును, శ్రీవత్సలక్షణ లక్షిత వక్షోమండలుండును. రమణీయ కౌస్తుభరత్నఖచిత కంఠికాలంకృత కంధరుండును, నిరంతర పరిమళమిళిత వనమాలికా బంధురుండును, నానావిధ గంభీర హారకేయూర కటకకంకణ మేఖలాంగుళీయక విభూషణ వ్రాతసముజ్జ్వలుండును. నిటలతట విలంబమాన విమలస్నిగ్ధ నీలకుంచిత కుంతలుండును. తరుణచంద్ర చంద్రికాధవళ మందహాసుండును, బరిపూర్ణ కరుణావలోకన భ్రూభంగ సంసూచిత సుభగ సంతతానుగ్రహ లీలావిలాసుండును, మహాయోగిరాజ వికసిత హృదయకమల కర్ణికామధ్య సంస్థాపిత విలసిత చరణకిసలయుండును, సంతతానందమయుండును, సహస్రకోటి సూర్య సంఘాతసన్నిభుండును, విభుండును నైన పరమేశ్వరుని మనోధారణావశంబున నిలిపికొని తదీయగుల్ఫచరణజాను జంఘాద్యవయవంబులం గ్రమంబున నొక్కొక్కటిని బ్రతిక్షణంబును ధ్యానంబు సేయుచు నెంతకాలంబునకుఁ బరిపూర్ణ నిశ్చలభక్తి యోగంబు సిద్ధించు నంతకాలంబునుం దదీయచింతా తత్పరులై యుండుదురని మఱియు నిట్లనియె. 26**

**ప్రతి :** మఱియున్= ఇంకను; హరి= విష్ణువుయొక్క; చరణకమల= పాదపద్మాలయొక్క; గంధరస+ఆస్వాదనంబు= వాసనారసములయొక్క చవిచూచుటను; ఎఱుంగనివారలు= తెలియనివారు; నిజకర్మబంధంబులన్= తమకర్మరూపమైన బంధాలచేత; దండధర= యమునియొక్క; మందిరద్వార= గృహద్వారమందలి; దేహళీ= గడపయొక్క; సమీప= సన్నిధిలో; జాజ్వల్యమాన= మంటలు చిమ్ముతున్న; వైతరణీతరంగిణీ= వైతరణి అనే నదిలోని; దహన= అగ్నియొక్క; దారుణ= భీకరమైన; జ్వాలాజాల= మంటల సమూహంచేత; దందహ్యమాన= దహింపజేయబడుతున్న; దేహులన్= శరీరాలు గలవారిని; కూడి= చేరి; శిఖిశిఖా+అవగాహంబులన్= అగ్నిజ్వాలలో మునుగుటను; ఒందుచుండుదురు= పొందుతూ ఉంటారు; మఱియున్= ఇంకను; విజ్ఞానసంపన్నులు+ఐ= విశేషజ్ఞానంకలవారై; మను= జీవించు; ప్రపన్నులు= శరణాగతులు; మాయా+ఆపన్నులు+కాక= మాయచే ఆపదపాలైనవారు కాక; విన్నాణంబునన్= విజ్ఞానంతో; తమ తమ హృదయ+ అంతరాళంబులన్= తమవైన హృదయాలలోపల; ప్రాదేశమాత్రదివ్యదేహుండును= జుత్తెడు కొలతగల దివ్యమైన శరీరం కలవాడూ; దిక్+ఇభరాజ= శ్రేష్ఠమైన దిగ్గజాలయొక్క; శుండాదండ= దండంవంటి తొండాలతో; సంకాశ= సమానమైన;

దీర్ఘ= పొడవైన; చతుర్బాహుండును= నాల్గు చేతులుగలవాడును; కందర్పకోటి= కోటిమన్మథులతో; సమాన= సదృశమైన; సుందరుండును= అందం గలవాడూ; ధృతమందరుండును= ధరించిన మందరాద్రి గలవాడూ; రాకా= పున్నమనాడు; విరాజమాన= ప్రకాశించే; రాజమండల= చంద్రమండలంతో; సన్నిభ= సమానమైన; వదనుండును= ముఖం కలవాడూ; సౌభాగ్యసదనుండును= అందచందాలకు నిలయమైనవాడూ; ప్రభాతకాల= ఉదయకాలంలో; భాసమాన= ప్రకాశించే; భాస్కరబింబ= సూర్యబింబానికి; ప్రతిమాన= దీటైన; విరాజిత= విరాజిల్లెడు; పద్మరాగ= పద్మరాగాలనే; రత్నరాజీ= రత్నాల పంక్తులచే; విరాజమాన= భాసిస్తున్న; కిరీట కుండలుండును= కిరీటమూ, చెవిప్రోగులూ గలవాడూ; శ్రీవత్స= శ్రీవత్సమనే; లక్షణ= మచ్చచే; లక్షిత= అంకితమైన; వక్షస్+మండలుండును= వక్షఃస్థలం కలవాడూ; రమణీయ= సుందరమైన; కౌస్తుభరత్న= కౌస్తుభమనే రత్నంతో; ఖచిత= తాపబడిన; కంఠికా= కంటెతో; అలంకృత= అలంకరించబడిన; కంధరుండును= మెడగలవాడూ; నిరంతర= ఎడతెగని; పరిమళ= సుగంధం చేత; మిళిత= మిశ్రితమైన; వనమాలికా= మెడనుండి పాదాలవరకు వ్యాపించి ఉండే పుష్పమాలికచే; బంధురుండును= సుందరమైనవాడూ; నానావిధ= అనేక విధాలైన; గంభీరహార= పెద్దపెద్దహారాలూ; కేయూర= భుజకీర్తులూ; కటక= కడియాలూ; కంకణ= మురుగులూ; మేఖలా= మొలనూలూ; అంగుళీయక= ఉంగరాలనెడి; విభూషణవ్రాత= అలంకార సమూహాలచే; సముజ్జ్వలుండును= మిక్కిలి ప్రకాశించేవాడూ; నిటలతట= ఫాలప్రదేశంలో; విలంబమాన= వ్రేలాడునట్టి; విమల= నిర్మలమై; స్నిగ్ధ= నిగనిగలాడే; నీల= నల్లని; కుంచిత= వక్రమైన; కుంతలుండును= వెంట్రుకలుగలవాడూ; తరుణచంద్ర= నిండు చందమామయొక్క; చంద్రికా= వెన్నెలలాగా; ధవళ= తెల్లనైన; మందహాసుండును= చిరునవ్వుగలవాడూ; పరిపూర్ణ= నిండైన; కరుణా+అవలోకన= దయాదృష్టియందలి; భ్రూభంగ= భ్రూవిలాసాలతో, బొమముడితో; సంసూచిత= చక్కగా సూచింపబడిన; సుభగ= మనోహరమైన; సంతత= ఎడతెగని; అనుగ్రహలీలా= అనుగ్రహించుటయను లీలయొక్క; విలాసుండును= విలాసం కలవాడూ; మహాయోగిరాజ= గొప్ప యోగిశ్రేష్ఠులయొక్క; వికసిత= వికసించిన; హృదయకమల= హృదయమనే పద్మంయొక్క; కర్ణికా మధ్య= దుద్దునడుమ; సంస్థాపిత= స్థాపించబడి; విలసిత= విలసిల్లినట్టి; చరణకిసలయుండును= పాదాలనే చివుళ్ళు కలవాడూ; సంతత+ఆనందమయుండును= ఎల్లవేళలా ఆనందపూర్ణుడై ఉండేవాడూ; సహస్రకోటి= వెయ్యికోట్ల; సూర్యసంఘాత= సూర్యులసమూహంతో; సన్నిభుండును= సదృశమైనవాడూ; విభుండును= ప్రభువూ ఐన, వ్యాపకుడూ అయిన; పరమేశ్వరునిన్= పరమాత్ముని; మనోధారణావశంబునన్= చిత్తధారణ అధీనంలో; నిలిపికొని= ఉంచుకొని; తదీయ= ఆ పరమేశ్వరునియొక్క; గుల్ఫ= చీలమండలు; చరణ= పాదాలు; జాను= మోకాళ్ళు; జంఘా+ఆది+ అవయవంబులన్= పిక్కలు మొదలయిన అంగాలను; క్రమంబునన్= వరుసగా; ఒక్కొక్కటినిన్= ఒక్కొక్క అవయవాన్ని; ప్రతిక్షణంబునున్= క్షణక్షణంలోనూ; ధ్యానంబు+చేయుచున్= ధ్యానిస్తూ; ఎంతకాలంబునకున్= ఎంత సమయానికి; పరిపూర్ణ నిశ్చల భక్తియోగంబు= నిండైన కదలిక లేని భక్తియోగం; సిద్ధించున్= సిద్ధిస్తుందో; అంతకాలంబునున్= అంతకాలంవరకూ; తదీయచింతాతత్పరులు+ఐ= ఆ పరమాత్మధ్యానమునందాసక్తులై; ఉండుదురు+అని= ఉంటారని చెప్పి; మఱియున్= ఇంకనూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అంతేకాదు. శ్రీహరి పాదపద్మాలలోని పరిమళం మకరందానికున్న మాధుర్యం చవిచూడడానికి విముఖులైనవాళ్ళు తమతమ కర్మబంధాలలో చిక్కుకొంటారు. తద్ద్వారా యమనగరద్వారంవద్ద ప్రవహించే వైతరణీనదిలోని భగభగమండే అగ్ని జ్వాలల్లో కాలిపోతున్న వాళ్ళతో జతగూడుతారు. విశిష్టజ్ఞానులై జీవించే శరణాగతులు మాయకు లోబడక నేర్పుతో తమ తమ హృదయాలలోని భగవంతుని ధ్యానిస్తారు.

ఆ భగవానుడు జుత్తెడు కొలతగల శరీరం కలవాడు, దిగ్గజాల తొండాలలాగా పొడవైన నాలుగు చేతులుగలవాడు, చక్కదనంలో కోటి మంది మన్మథులకు దీటైనవాడు, మందరగిరిని ధరించినవాడు, పున్నమ నాటి జాబిల్లిని పోలిన మోము కలవాడు, సౌభాగ్యానికి నెలవైనవాడు, ప్రాతఃకాలపు సూర్య బింబంలాగా ప్రకాశించే పద్మరాగమణులు పొదిగిన కిరీట కుండలాలు తాల్చినవాడు, వక్షఃస్థలంలో శ్రీవత్సమనే పుట్టుమచ్చ గలవాడు, కమనీయమైన కౌస్తుభరత్నం పొదిగిన కంఠాభరణం మెడలో అలంకరించుకొన్నవాడు. ఎప్పుడూ సువాసన లీనే వనమాలతో ఒప్పారేవాడు, పలువిధాలైన పెద్దపెద్దహారాలూ, భుజకీర్తులూ, కడియాలూ, మురుగులూ, మొలనూలూ, ఉంగరాలూ మొదలగు సొమ్ములతో శోభిల్లేవాడు, నొసట ముసురుకొన్న నిగనిగలాడే నీలి ముంగురులు గలవాడు, రాకాచంద్రుని వెన్నెలవలె తెల్లని మందహాసం కలవాడు, కరుణామయమైన కడగంటి చూపులతోడి భ్రూవిలాసాలతో భక్తులపై పరమానుగ్రహం ప్రసరింపజేసేవాడు, మహాయోగీశ్వరుల హృదయపద్మాలలో చివుళ్ళవంటి తన అడుగులు మోపినవాడు, సదా ఆనందస్వరూపుడు, వేయికోట్ల సూర్యులతో సమానమైనవాడు, లోకాలకు ప్రభువు అయిన ఆ పరమేశ్వరుణ్ణి విజ్ఞాన సంపన్నులు మనోధారణతో చిక్కబట్టి ఆ దేవుని చీలమండలు, అడుగులు, మోకాళ్ళు, పిక్కలు మున్నగు అవయవాలలో ఒక్కొక్కదానిని అనుక్షణం క్రమంగా ధ్యానిస్తారు. అచంచలమైన పూర్ణభక్తియోగం సిద్ధించేవరకూ ఆ పరమేశ్వరుని ధ్యానంలో నిమగ్నులై ఉంటారు.

ఇలా చెప్పి శుకుడు మళ్ళీ ఈ రీతిగా అన్నాడు.

**సీ. ఆసన్నమరణార్థియైన యతీశుండు కాలదేశములను గాచికొనఁడు**
**తనువు విసర్జించు తలఁపు జనించిన భద్రాసనస్థుఁడై ప్రాణపవను**
**మనసుచేత జయించి మానసవేగంబు బుద్ధిచే భంగించి బుద్ధిఁదెచ్చి**
**క్షేత్రజ్ఞుతోఁ గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలోపలఁ జేర్చి యాత్మను బ్రహ్మమందుఁ**

**తే. గలిపి యొక్కటి గావించి గారవమున, శాంతితోడ నిరూఢుఁడై సకలకార్య**
**నివహ మెల్లను దిగనాడి నిత్యసుఖము, వలయు నని చూచు నటమీఁద వసుమతీశ! 27**

**ప్రతి :** వసుమతీ+ఈశ= రాజా!; ఆసన్నమరణ+అర్థి+ఐన= దగ్గరపడిన మరణాన్ని కోరుకొనేవాడగు; యతి+ఈశుండు= సన్న్యాసిశ్రేష్ఠుడు; కాలదేశములను= కాలాన్నీ దేశాన్నీ; కాచికొనఁడు= ఎదురుచూడడు; తనువు= శరీరాన్ని; విసర్జించు= వదలిపెట్టే; తలఁపు= భావన; జనించినన్= కలిగితే; భద్ర+ఆసనస్థుఁడు+ఐ= సుఖాసనంలో కూర్చున్నవాడై; మనసుచేతన్= చిత్తంతో; ప్రాణపవనున్= ప్రాణవాయువును; జయించి= గెలిచి; బుద్ధిచేన్= నిశ్చయాత్మకమైన చిత్తంతో; మానసవేగంబున్= చిత్తవేగాన్ని; భంగించి= నిగ్రహించి; బుద్ధిన్+తెచ్చి= బుద్ధిని తీసుకొని వచ్చి; క్షేత్రజ్ఞుతోన్+కూర్చి= జీవాత్మతో చేర్చి; క్షేత్రజ్ఞున్= జీవాత్మని; ఆత్మలోపలన్= శుద్ధాత్మలో; చేర్చి= కూర్చి; ఆత్మనున్= శుద్ధాత్మను; బ్రహ్మము+అందున్= పరతత్త్వంలో; కలిపి= చేర్చి; ఒక్కటి+కావించి= ఒకటిగా చేసి; గారవమునన్= గౌరవంతో; శాంతితోడన్= మనశ్శాంతితో; నిరూఢుఁడు+ఐ= నిలదొక్కుకొన్నవాడై; సకలకార్యనివహము+ఎల్లనున్= సమస్తమైన పనుల నెల్లను; దిగనాడి= పరిత్యజించి; అట మీఁదన్= ఆపై; నిత్యసుఖము= శాశ్వతసుఖం; వలయునని= కావలెనని; చూచున్= చూస్తాడు.

**తా :** రాజా! ప్రారబ్ధకర్మ తీరేసరికి శరీరం పరిత్యజించాలనుకొన్న సన్న్యాసి దేశకాలాల కోసం ఎదురుచూడడు. మరణించాలన్న భావన కల్గగానే అతడు సుఖాసనస్థ డవుతాడు. మనస్సుతో ప్రాణవాయువును నిగ్రహిస్తాడు. మనోవేగాన్ని బుద్ధితో

అరికడతాడు. బుద్ధిని క్షేత్రజ్ఞుడనబడే జీవాత్మతో పొందుపరుస్తాడు. జీవాత్మను శుద్ధాత్మలో చేరుస్తాడు. శుద్ధాత్మను పరమాత్మలో లీనం చేస్తాడు. అలాచేసి శాంతుడై పనులన్నింటినీ వదలిపెడతాడు. ఆపై శాశ్వతసుఖం కావాలని అభిలషిస్తాడు.

**వ. వినుము! పరమాత్మయైన బ్రహ్మంబునకుఁ దక్క కాల దేవ సత్త్వరజస్తమో గుణాహంకార మహత్తత్త్వ ప్రధానంబులకుఁ బ్రభుత్వంబు లేదు, కావునం బరమాత్మ వ్యతిరిక్తంబు లేదు, దేహాదులయం దాత్మత్వంబు విసర్జించి యన్యసౌహృదంబు మాని పూజ్యం బయిన హరిపదంబుం బ్రతిక్షణంబును హృదయంబున నాలింగనంబు సేసి వైష్ణవంబయిన పరమపదంబు సర్వోత్తమంబని సత్పురుషులు దెలియుదు, రివ్విధంబున విజ్ఞాన దృగ్వీర్యజ్వలనంబున నిర్దగ్ధవిషయవాసనుండై క్రమంబున నిరపేక్షత్వంబున. 28**

**ప్రతి :** వినుము= ఆలకించు; పరమాత్మ+ఐన= పరమతత్త్వమైన; బ్రహ్మంబునకున్+తక్క= బ్రహ్మానికి తప్ప; కాల= కాలానికీ; దేవ= బ్రహ్మాది దేవతలకూ; సత్త్వ= సత్త్వగుణానికీ; రజస్= రజోగుణానికీ; అహంకార= అహంకారానికీ; మహత్తత్త్వ= మహత్తత్త్వానికీ; ప్రధానంబులకున్= ప్రకృతికీ; ప్రభుత్వంబు= ఆధిపత్యం (శాసించే అధికారం) లేదు; దేహాదుల+అందున్= శరీరం మొదలైనవాటియందు; ఆత్మత్వంబు= ఆత్మ అనే భావాన్ని; విసర్జించి= వదలి; అన్యసౌహృదంబు= ఇతర విషయాలతో మైత్రిని; మాని= వదలిపెట్టి; పూజ్యంబు+అయిన= మాననీయంబైన; హరిపదంబున్= విష్ణుచరణమును; ప్రతిక్షణంబునున్= అనుక్షణం; హృదయంబునన్= చిత్తంలో; ఆలింగనంబు చేసి= అన్నివైపులా ఆనుకొని ఉండేట్లుచేసి; వైష్ణవంబు+అయిన= విష్ణుదేవునికి చెందిన; పరమపదంబు= పరమస్థానమగు వైకుంఠం; సర్వ+ఉత్తమంబు+అని= సర్వశ్రేష్ఠమని; సత్+పురుషులు= సజ్జనులు; తెలియుదురు= ఎరుగుదురు; ఈ+విధంబునన్= ఇట్లు; విజ్ఞాన దృక్= విజ్ఞాన దృష్టియొక్క; వీర్యజ్వలనంబునన్= బలమనే అగ్ని జ్వాలలో; నిర్దగ్ధవిషయవాసనుండు+ఐ= పూర్ణంగా కాల్చివేయబడిన విషయవాసనలు గలవాడై; క్రమంబునన్= క్రమంగా; నిరపేక్షత్వంబునన్= ఎట్టి కోరికా లేని స్థితితో...

**తా :** రాజా! విను. పరమాత్మయైన పరబ్రహ్మానికి తప్ప కాలానికి లోబడిన బ్రహ్మాదులైన దేవతలకూ, సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలకూ, అహంకారానికీ, మహత్తత్త్వానికీ, సమస్త సృష్టికీ మూలమైన ప్రధానమనబడే ప్రకృతికీ ఎట్టి ఆధిపత్యమూ లేదు. అందుచేత పరమాత్మకంటె భిన్నమైన పదార్థమేదీ లేదు. సత్పురుషులు శరీరాదులపై ఆత్మభావన వదలుతారు. ఇతర విషయాలపై వ్యామోహం విడనాడుతారు. పూజనీయమైన మాధవుని పాదపద్మాలను మనస్సులో అనుక్షణమూ నిల్పుకొని ఉంటారు. వైకుంఠమే అన్నిటికంటె ఉత్తమ స్థానమని గ్రహిస్తారు. ఈ రీతిగా శాస్త్రజ్ఞాన బలమనే మంటలో విషయవాసనలను తగులబెట్టి వారు దేనిపైనా అపేక్ష లేకుండా ఉంటారు.

**సీ. అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ బీడించి, ప్రాణంబు బిగియఁబట్టి,**
**నాభితలముఁజేర్చి, నయముతో మెల్లన హృత్సరోజముమీఁది కెగయఁబట్టి,**
**యటమీఁద నురమందు హత్తించి, క్రమ్మఱఁ దాలు మూలమునకుఁ దఱిమి నిలిపి,**
**మమతతో భ్రూయుగమధ్యంబు సేర్చి, దృక్కర్ణనాసాస్య మార్గములు మూసి,**

**ఆ. యిచ్చ లేని యోగి యెలమి ముహూర్తార్ధ, మింద్రియానుషంగ మింత లేక**
**ప్రాణములను వంచి బ్రహ్మరంధ్రము చించి, బ్రహ్మమందుఁ గలయుఁ బౌరవేంద్ర! 29**

**ప్రతి :** పౌరవేంద్ర= పూరువంశరాజులలో శ్రేష్ఠుడా!; అంఘ్రిమూలమునన్= పాదమూలంతో (మడమతో); మూలాధారచక్రంబున్= మూలాధారమనే చక్రాన్ని; పీడించి= అదిమిపెట్టి; ప్రాణంబున్= ప్రాణవాయువును; బిగియన్‌పట్టి= బిగబట్టి; నాభితలమున్= బొడ్డున్నచోట; చేర్చి= చేరునట్లుచేసి; నయముతోన్= మృదువుగా; మెల్లనన్= నెమ్మదిగా; హృత్సరోజము మీఁదికిన్= హృదయమనే పద్మంపైకి; ఎగయన్+పట్టి= ప్రాకు నట్లుచేసి; అటమీఁదన్= ఆపైన; ఉరము+ అందున్= వక్షమునందు; హత్తించి= నిలిపి; క్రమ్మఱన్= మరల; తాలుమూలమునకున్= దవడ మొదటి ప్రదేశానికి; తఱిమి నిలిపి= తీసుకొనివెళ్ళి నిల్పి; మమతతోన్= అభిమానంతో; భ్రూయుగమధ్యంబు= రెండు కనుబొమ్మలనడుమ; చేర్చి= పొందించి; దృక్= నేత్రాలు; కర్ణ= చెవులు; నాసా= ముక్కు; ఆస్య= నోరు– వీటియొక్క; మార్గములు= దారులు; మూసి= నిరోధించి; ఇచ్ఛలేని యోగి= ఏ కోరికలూ లేని యోగాభ్యాసి; ఎలమిన్= ప్రేమతో; ముహూర్త+అర్ధము= అర్ధ ముహూర్తకాలం; ఇంద్రియానుషంగము= ఇంద్రియాలతోడి సంబంధం; ఇంతలేక= ఇసుమంత కూడాలేక; ప్రాణములను వంచి= ప్రాణవాయువులను నిగ్రహించి; బ్రహ్మరంధ్రము చించి= నడినెత్తి పైనున్న బ్రహ్మరంధ్రాన్ని భేదించుకొని; బ్రహ్మమందున్= పరబ్రహ్మంలో; కలయున్= కలిసిపోతాడు.

**తా :** రాజా! యోగియైనవాడు కాలిమడమతో మూలాధార చక్రాన్నీ గుదస్థానాన్ని, అదిమిపడతాడు. ఆ మీదట ప్రాణ వాయువును బిగబట్టి బొడ్డు వద్దగల మణిపూరక చక్రానికి తీసుకుపోతాడు. అక్కడనుండి హృదయంలోని అనాహతచక్రానికీ, అందుండి వక్షస్థలంలోని విశుద్ధచక్రానికీ, అక్కడనుండి తాలుమూలానికీ, అచ్చటనుండి కనుబొమ్మల మధ్యగల ఆజ్ఞాచక్రానికీ ప్రాణవాయువును తరలిస్తాడు. ఆపై కళ్ళు, చెవులు, ముక్కు, నోరు ఇవి మూసుకొని ఏ కోరికలూ లేనివాడై అర్ధముహూర్తసమయంలో ఇంద్రియాలతో ఎట్టి సంబంధమూ లేకుండా ప్రాణాలను నిగ్రహిస్తాడు. పిదప నెత్తిపై గల బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకొని బ్రహ్మంలో లీనమై పోతాడు.

**వ. మఱియు దేహత్యాగకాలంబున నింద్రియంబులతోడి సంగమంబు విడువనివాఁడు వానితోడన గుణసముదాయ రూపంబగు బ్రహ్మాండంబునందు ఖేచరసిద్ధ విహారయోగ్యంబును నణిమాదిక సకలైశ్వర్య సమేతంబును నైన పరమేష్ఠి పదంబుఁ జేరు, విద్యాతపోయోగ సమాధిభజనంబు సేయుచుఁ బవనాంతర్గత లింగశరీరులైన యోగీశ్వరులకు బ్రహ్మాండ బహిరంతరాళంబులు గతి యని చెప్పుదు, రేరికిం గర్మంబుల నట్టి గతిఁ బొంద శక్యంబు గాదు, యోగి యగువాఁడు బ్రహ్మలోకంబునకు నాకాశపథంబునం బోవుచు సుషుమ్నానాడివెంట నగ్ని యను దేవతం జేరి జ్యోతిర్మయంబైన తేజంబున నిర్మలుండై యెందునుం దగులు వడక తారామండలంబుమీఁద సూర్యాది ధ్రువాంతపదంబులఁ గ్రమక్రమంబున నతిక్రమించి హరిసంబంధంబయిన శింశుమార చక్రంబుఁ జేరి యొంటరి యగుచుఁ బరమాణుభూతంబైన లింగ శరీరంబుతోడ బ్రహ్మవిదులకు నెలవైన మహర్లోకంబుఁ జొచ్చి మహాకల్పకాలంబు క్రీడించుఁ; గల్పాంతంబైన ననంతముఖానల జ్వాలా దందహ్యమానంబగు లోకత్రయంబు నీక్షించుచుఁ దన్నిమిత్త సంజాతానల దాహంబు సహింపంజాలక – 30**

**ప్రతి :** మఱియున్= ఇంకను; దేహత్యాగకాలంబునన్= శరీరాన్ని త్యజించే సమయంలో; ఇంద్రియంబులతోడి సంగమంబు= ఇంద్రియాలతో సాంగత్యం; విడువనివాఁడు= వదలనివాడు; వానితోడన= ఆ ఇంద్రియాలతో గూడనే; గుణసముదాయ

రూపంబు+అగు= గుణసమూహరూపమైన; బ్రహ్మాండంబునందున్= బ్రహ్మాండంలో; ఖేచరసిద్ధవిహారయోగ్యంబును= ఖేచరులకూ సిద్ధులకూ విహరింపదగినట్టిదీ; అణిమాదిక సకల+ఐశ్వర్యసమేతంబునున్+ఐన= అణిమ మొదలయిన సమస్తైశ్వర్యాలతో కూడినదీ అయిన; పరమేష్ఠిపదంబున్= బ్రహ్మస్థానాన్ని; చేరున్= చేరుకొంటాడు; విద్యాతపోయోగ సమాధిభజనంబున్= విద్య, తపస్సు, యోగం, సమాధి – వీటిని సేవించుటను; చేయుచున్= అభ్యసిస్తూ; పవనాంతర్గత లింగశరీరులు+ఐన= గాలిలో లీనమైన సూక్ష్మశరీరం కలవారగు; యోగీశ్వరులకున్= యోగిశ్రేష్ఠులకు; బ్రహ్మాండ బహిరంతరాళంబులు= బ్రహ్మాండమనే ఈ విశ్వంయొక్క వెలి, లోపలి ప్రదేశాలు; గతి యని చెప్పుదురు= గమ్యస్థానమని అంటారు; ఏరికిన్= ఎవరికిగానీ; కర్మంబులన్= కర్మలచేత; అట్టిగతి= అలాంటి గమ్యస్థానం; పొందశక్యంబు గాదు= చేరుటకు వీలుగాదు; యోగియగువాఁడు= యోగమార్గంలో నడచువాడు; బ్రహ్మలోకంబునకున్= బ్రహ్మకు నెలవైన లోకానికి; ఆకాశపథంబునన్= గగనమార్గంలో; పోవుచున్= పోతూ; సుషుమ్నానాడివెంటన్= సుషుమ్న అనునాడి ద్వారా; అగ్నియను= అనలుడనే; దేవతన్+చేరి= దేవతచెంతకు వెళ్ళి; జ్యోతిర్మయంబు+ఐన= జ్యోతిస్స్వరూపంబగు; తేజంబునన్= తేజస్సుతో; నిర్మలుండు+ఐ= మాలిన్యంలేనివాడై; ఎందునున్= దేనిలోనూ; తగులు+పడక= చిక్కుకొనక; తారామండలంబు మీఁదన్= నక్షత్రమండలంపైన; సూర్యాది ధ్రువ+అంతపదంబులన్= సూర్యుడు మొదలుగా ధ్రువుని వరకూగల స్థానాలను; క్రమక్రమంబునన్= వరుస వరుసగా; అతిక్రమించి= దాటి; హరిసంబంధంబు+అయిన= విష్ణువుతో సంబంధం కల; శింశుమార చక్రంబున్+చేరి= శింశుమార మనే ఒక జ్యోతిర్మండలాన్ని చేరుకొని; ఒంటరి+అగుచున్= ఏకాకియై; పరమాణుభూతంబు+ఐన= పరమాణువువలె సూక్ష్మమైన; లింగశరీరంబుతోడన్= సూక్ష్మశరీరంతో; బ్రహ్మవిదులకున్= బ్రహ్మజ్ఞులకు; నెలవు+ఐన= స్థానమైన; మహర్లోకంబున్+చొచ్చి= మహర్లోకంలో ప్రవేశించి; మహా కల్పకాలంబు= మహాకల్ప మున్నంతవరకూ; క్రీడించున్= రమిస్తూవుంటాడు; కల్ప+అంతంబు+ఐన= మహాకల్పం పూర్తి కాగానే; అనంత= శేషునియొక్క; ముఖ+అనల= ముఖమునందలి అగ్నియొక్క; జ్వాలా= మంటలచే; దందహ్యమానంబు+అగు= కాల్చివేయబడుచున్న; లోకత్రయంబున్= ముల్లోకాలనూ; ఈక్షించుచున్= చూస్తూ; తద్+నిమిత్త= అది కారణంగా; సంజాత= కలిగిన; అనలదాహంబు= అగ్నిచే కాలుటను; సహింపన్+చాలక= ఓర్చుకోలేక...

**తా :** శరీరం పరిత్యజించే వేళలో ఇంద్రియాలతో సంబంధం వీడనివాడు వాటితో కూడ గుణమయమైన బ్రహ్మాండంలో ఖేచరులు, సిద్ధులు విహరించడానికి తగినదీ, అణిమ, మహిమ మొదలయిన ఐశ్వర్యాలన్నింటితో గూడినదీ అయిన బ్రహ్మలోకం చేరుకొంటాడు. విద్య, తపస్సు, యోగం, సమాధి–వీటిని అనుష్ఠిస్తూ లింగశరీరాన్ని వాయువులో లీనం చేసిన యోగివర్యులు బ్రహ్మాండం లోపలా, వెలుపలా సంచరిస్తూ ఉంటారని పెద్దలంటారు. కేవలం కర్మలతో అట్టిగతిని ఎవరూ పొందలేరు. బ్రహ్మలోకాభిముఖుడైన యోగి సుషుమ్నానాడి ద్వారా బయలుదేరి ఆకసంలో పయనిస్తూ అగ్ని దేవతను చేరుకొంటాడు. అక్కడ జ్యోతిర్మయమైన ప్రకాశంతో పుణ్యపాపాలు తొలగించుకొని నిర్మలుడై భాసిస్తాడు. అతడు దేనిలోనూ తగులువడడు. నక్షత్రపథం అతిక్రమించి పోతాడు. ఆపైన సూర్యమండలం మొదలు ధ్రువమండలం వరకూ అన్ని మండలాలనూ వరుసగా దాటుకొంటాడు. చివరికి విష్ణుసంబంధమైన శింశుమార చక్రం చేరుతాడు. అక్కడ ఒంటరిగా పరమాణుస్వరూపమైన లింగశరీరంతో బ్రహ్మవేత్తలకు నెలవైన మహర్లోకం ప్రవేశిస్తాడు. అక్కడే ఉండి మహాకల్పకాలం వరకూ క్రీడిస్తాడు. కల్పాంత కాలంలో అనంతుని వదనంనుండి వెలువడే కరాళాగ్ని జ్వాలల్లో దగ్ధమవుతున్న ముల్లోకాలనూ చూస్తాడు. అందువల్ల కలిగే అగ్నిదాహం సహించలేక అక్కడనుండి బ్రహ్మలోకం చేరుకొంటాడు.

**విశే :** అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, వశిత్వం, ఈశత్వం అనేవి అష్టైశ్వర్యాలు.

**సీ.** **ఇలమీఁద మనువు లీరేడ్వురుఁ జనువేళ దివసమై యెచ్చోటఁ దిరుగుచుండు,**
**మహనీయ సిద్ధవిమాన సంఘము లెందు దినకరప్రభములై తేజరిల్లు,**
**శోకజరామృత్యుశోషణ భయదుఃఖ నివహంబు లెందు జనింపకుండు,**
**విష్ణుపదధ్యాన విజ్ఞానరహితుల శోకంబు లెందుండి చూడవచ్చు,**

**ఆ.** **పరమసిద్ధయోగి భాషణామృత మెందు, శ్రవణపర్వమగుచు జరుగుచుండు**
**నట్టి బ్రహ్మలోకమందు వసించును, రాజవర్య! మరల రాఁడు వాఁడు.** **31**

**ప్రతి :** రాజవర్య!= రాజశ్రేష్ఠా!; వాఁడు= అలా బ్రహ్మలోకం చేరుకున్నయోగి; ఏ+చోటన్= ఏ ప్రదేశంలో; ఇలమీఁదన్= భూమిమీద; ఈరు+ఏడ్వురున్= పదునలుగురు; మనువులు చనువేళ= అంతరించిపోయే సమయం; దివసము+ఐ= ఒక్కదినమై; తిరుగుచుండున్= ప్రవర్తిస్తూ ఉండునో; ఎందున్= ఏచోట; మహనీయ= పూజనీయులగు; సిద్ధ= సిద్ధులయొక్క; విమానసంఘములు= విమానసమూహాలు; దినకరప్రభములు+ఐ= సూర్యుని కాంతివంటి కాంతిగలవై; తేజరిల్లున్= ప్రకాశించునో; ఎందున్= ఏ చోట; శోక= దుఃఖం; జరా= ముసలితనం; మృత్యు= మరణం; శోషణ= శుష్కించడం; భయ= భీతి; దుఃఖ= విషాదాలయొక్క; నివహంబులు= సమూహాలు; జనింపక+ఉండున్= కలుగకుండునో; ఎందు+ఉండి= ఏచోట నుండి; విష్ణు= విష్ణువుయొక్క; పద= చరణాలయొక్క; ధ్యానవిజ్ఞాన= ధ్యానరూపమైన విజ్ఞానంచే; రహితులు= శూన్యులైనవారియొక్క; శోకంబులు= వగపులు; చూడవచ్చున్= కనవచ్చునో; ఎందున్= ఏచోట; పరమ= శ్రేష్ఠులగు; సిద్ధయోగి= సిద్ధులయొక్కయు; యోగులయొక్కయు; భాషణ+అమృతము= వచనామృతం; శ్రవణపర్వము= చెవులపండువు అగుచున్ జరుగుచు+ఉండున్= అవుతూ సాగుతూవుంటుందో; అట్టి బ్రహ్మలోకము+అందున్= అటువంటి బ్రహ్మలోకంలో; వసించును= నివసిస్తాడు; మరలన్= మళ్ళీ; రాఁడు= ఆలోకంనుండి తిరిగిరాడు.

**తా :** భూలోకంలో పదునలుగురు మనువులూ పుట్టి గిట్టే కాలమంతా కలిస్తే బ్రహ్మలోకంలో ఒక్కదిన మవుతుంది. అక్కడ మహనీయులైన సిద్ధుల విమానాలు సూర్యతేజంతో విరాజిల్లుతుంటాయి. శోకం, వార్ధక్యం, చావు, కృశత్వం, భయం, దుఃఖం, ఇలాంటి బాధలు లేని చోటది. హరిచరణాలను ధ్యానించాలనే తెలివిలేక మూఢులైనవారి శోకస్థితిని ఆ లోకంనుండి చూడవచ్చు. శ్రేష్ఠులైన సిద్ధులూ, యోగులూ అక్కడ అమృతప్రాయంగా మాట్లాడుకోవడాన్ని చెవుల పండువుగా వినవచ్చు. రాజేంద్రా! అట్టి బ్రహ్మలోకంలో అతడు నివసిస్తాడు. ఆ లోకంనుండి మళ్ళీ తిరిగిరాడు.

**విశే :** పదునాలుగురుమనువులు: స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుడు, భౌచ్యుడు.

**వ.** **మఱియు నొక్క విశేషంబు గలదు. పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతు లైన వారు కల్పాంతరంబునం బుణ్యతారతమ్యంబుల నధికారవిశేషంబు నొందువార లగుదురు, బ్రహ్మాది దేవతాభజనంబునం జనువారు బ్రహ్మజీవిత కాలం బెల్ల బ్రహ్మ లోకంబున వసియించి ముక్తు లగుదురు. నారాయణ చరణకమల భక్తి పరాయణత్వంబునం జనినవారు నిజేచ్ఛావశంబున నిరర్గళ గమనులై బ్రహ్మాండంబు భేదించి మహోన్నత వైష్ణవపదారూఢులయి తేజరిల్లుదు, రీశ్వరాధిష్ఠితంబైన ప్రకృతియంశంబున మహత్తత్త్వంబగు, మహత్తత్త్వాంశంబున నహంకారంబగు, నహంకారాంశంబున శబ్దతన్మాత్రంబగు, శబ్దతన్మాత్రాంశంబున**

**గగనంబగు, గగనాంశంబున స్పర్శతన్మాత్రంబగు, స్పర్శతన్మాత్రాంశంబున సమీరణంబగు, సమీరణాంశంబున రూపతన్మాత్రంబగు, రూపతన్మాత్రాంశంబువలనఁ దేజంబగు, తేజోఽంశంబున రసతన్మాత్రంబగు, రసతన్మాత్రాంశంబువలన జలంబగు, జలాంశంబున గంధతన్మాత్రం బగు, గంధతన్మాత్రాంశంబునఁ బృథివి యగు, వాని మేళనంబునం జతుర్దశ భువనాత్మకంబైన విరాడ్రూపంబగు; నా రూపంబునకుఁ గోటియోజన విశాలంబైన యండకటాహంబు ప్రథమావరణంబైన పృథ్వియగు, దీనిఁ బంచాశత్కోటివిశాలంబని కొందఱు వలుకుదురు, అయ్యావరణంబు మీఁద సలిల తేజస్సమీర గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడి యావరణంబులు క్రమంబున నొండొంటికి దశగుణోత్తరాధికంబులై యుండు, నట్టి యేడింటిమీఁదఁ బ్రకృత్యావరణంబు మహావ్యాపకం బగు; బ్రహ్మాండంబు భేదించి వైష్ణవపదారోహణంబు సేయువాఁడు నిర్భయుండై మెల్లన లింగ దేహంబునఁ బృథివ్యాత్మకత్వంబు నొంది యట్టి పృథివ్యాత్మకత్వంబున ఘ్రాణంబున గంధంబును, జలాత్మకత్వంబున రసనేంద్రియంబున రసంబును, దేజోరూపకత్వంబున దర్శనంబున రూపంబును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మకత్వంబున శ్రవణంబున శబ్దంబును, నతిక్రమించి భూతసూక్ష్మేంద్రియ లయస్థానంబైన యహంకారావరణంబున సంప్రాప్తుండై యందు మనోమయంబును, దేవమయంబునునైన సాత్త్వికాహంకార గమనంబున మహత్తత్త్వంబు సొచ్చి, గుణత్రయంబున లయించి, ప్రధానంబు నొంది, ప్రధానాత్మకత్వంబున దేహంబును, నుపాధిపరంపరావసానంబునం బ్రకృతిం బాసి యానందమయుండై యానందంబునం బరమాత్మరూపంబైన వాసుదేవ బ్రహ్మంబునందుఁ గలయునని చెప్పి వెండియు నిట్లనియె. 32**

**ప్రతి :** మఱియున్= ఇంకను; ఒక్కవిశేషంబు+కలదు= ఒక విశేషం ఉంది; పుణ్య+అతిరేకంబునన్= పుణ్యంయొక్క అతిశయంచేత; బ్రహ్మలోకగతులు+ఐనవారు= బ్రహ్మలోకం చేరినవారు; కల్ప+అంతరంబునన్= మరొక కల్పమునందు; పుణ్యతారతమ్యంబులన్= పుణ్యంయొక్క హెచ్చుతగ్గులనుబట్టి; అధికార విశేషంబున్= విశిష్టమైన అధికారాలను; ఒందువారలు+అగుదురు= పొందేవారవుతున్నారు; బ్రహ్మ+ఆది దేవతా భజనంబునన్= బ్రహ్మ మొదలయిన దేవతలను సేవించుటచే; చనువారు= శరీరం త్యజించేవారు; బ్రహ్మజీవితకాలంబు+ఎల్లన్= బ్రహ్మ జీవించినంత సమయంవరకూ; బ్రహ్మలోకంబునన్= బ్రహ్మలోకంలో, సత్యలోకంలో; వసియించి= నివసించి; ముక్తులు+అగుదురు= భవబంధంనుండి తొలగినవారవుతారు; నారాయణ= శ్రీహరియొక్క; చరణకమల= పాదపద్మాలయందలి; భక్తిపరాయణత్వంబునన్= భక్తితత్పరతతో; చనినవారు= మరణించినవారు; నిజ+ఇచ్ఛావశంబునన్= తమ ఇచ్ఛ వచ్చినట్లు; నిరర్గళగమనులు+ఐ= ఆటంకం లేని గమనం కలవారై; బ్రహ్మ+అండంబు భేదించి= బ్రహ్మాండాన్ని భేదించుకొని; మహా+ఉన్నత వైష్ణవపద+ఆరూఢులు+అయి= మిక్కిలి ఉన్నతమైన వైష్ణవస్థానాన్ని అధిరోహించినవారై; తేజరిల్లుదురు= ప్రకాశిస్తారు; ఈశ్వర+అధిష్ఠితంబు+ఐన= ఈశ్వరునిచే అధిష్ఠింపబడిన; ప్రకృతి+అంశంబునన్= ప్రకృతియొక్క అంశంతో; మహత్తత్త్వంబు+అగున్= మహత్తత్త్వం కలుగుతుంది; మహత్తత్త్వ+అంశంబునన్= ఆ మహత్తత్త్వంయొక్క అంశంతో; అహంకారంబు+అగున్= అహంకారం జనిస్తుంది; అహంకార+అంశంబునన్= అహంకారంయొక్క అంశంతో; శబ్దతన్మాత్రంబు+అగున్= శబ్దతన్మాత్రం ఉద్భవిస్తుంది; శబ్దతన్మాత్రా+అంశంబునన్= శబ్దతన్మాత్రయొక్క అంశంతో; గగనంబు+అగున్= ఆకాశం కలుగుతుంది;

గగన+అంశంబునన్= ఆకాశం అంశంతో; స్పర్శతన్మాత్రంబు+అగున్= స్పర్శతన్మాత్ర కల్గుతుంది; స్పర్శతన్మాత్రా+అంశంబునన్= స్పర్శ తన్మాత్రయొక్క అంశంతో; సమీరణంబు+అగున్= వాయువు జనిస్తుంది; సమీరణ+అంశంబునన్= వాయువుయొక్క అంశంతో; రూపతన్మాత్రంబు+అగున్= రూపతన్మాత్ర కలుగుతుంది; రూపతన్మాత్రా+అంశంబువలనన్= రూపతన్మాత్రయొక్క అంశంనుండి; తేజంబు+అగున్= తేజస్సు కల్గుతుంది; తేజస్+అంశంబునన్= తేజస్సుయొక్క అంశంనుండి; రసతన్మాత్రంబు+ అగున్= రసతన్మాత్ర కలుగుతుంది; రసతన్మాత్రా+అంశంబువలనన్= రసతన్మాత్రయొక్క అంశంనుండి; జలంబు+అగున్= జలం ఏర్పడుతుంది; జల+అంశంబునన్= జలంయొక్క అంశంనుండి; గంధతన్మాత్రంబు+అగున్= గంధతన్మాత్రం కల్గుతుంది; గంధతన్మాత్రా+అంశంబునన్= గంధతన్మాత్రంయొక్క అంశంనుండి; పృథివి+అగున్= భూమి జనిస్తుంది; వాని మేళనంబునన్= పై చెప్పిన పంచభూతాల కలయికవల్ల; చతుర్దశభువన+ఆత్మకంబు+ఐన= పదునాల్గులోకాలే స్వరూపంగాకల; విరాట్+ రూపంబు+అగున్= విరాట్స్వరూపం కలుగుతుంది; ఆ రూపంబునకున్= ఆ విరాట్స్వరూపానికి; కోటియోజన విశాలంబు+ ఐన= కోటియోజనాల విస్తీర్ణంకల; అండకటాహంబు= అండరూపమైన కప్పెర; ప్రథమ+ఆవరణంబు+ఐన= మొదటి ఆవరణమైన; పృథ్వి+అగున్= భూమి అవుతుంది; దీనిన్= ఈ భూమిని; పంచాశత్కోటి విశాలంబు+అని= ఏబదికోట్ల యోజనాల విస్తృతి గలదని; కొందఱు పలుకుదురు= కొంతమంది వచిస్తారు; ఆ+ఆవరణంబు మీఁదన్= ఆ ఆవరణంపైన; సలిల= జలం; తేజస్= అగ్ని; సమీర= వాయువు; గగన= ఆకాశం; అహంకార= అహంకారం; మహత్తత్త్వంబులు+అనియెడి= మహత్తత్త్వంబులుఅనే; ఆవరణంబులు= ఆవరణాలు (పఱవు); క్రమంబునన్= వరుసగా; ఒండు+ఒంటికిన్= ఒకదానికొకటి; దశగుణ+ఉత్తర+అధికంబులు+ఐ= పదిరెట్లు పెద్దవియై; ఉండున్= ఉంటాయి; అట్టి= అటువంటి; ఏడింటిమీఁదన్= పృథివి మొదలైన పంచభూతాలు, మరియు అహంకార మహత్తత్త్వా లేడింటిపైన; ప్రకృతి+ఆవరణంబు= ప్రకృతి అనే ఆచ్ఛాదనం; మహావ్యాపకంబు+అగున్= గొప్పగా వ్యాపించినదై ఉంటుంది; బ్రహ్మ+అండంబున్= అజాండమును; భేదించి= చీల్చుకొని; వైష్ణవపద+ఆరోహణంబు+చేయువాఁడు= విష్ణుపదం అధిరోహించేవాడు; నిర్భయుండు+ఐ= భయంలేనివాడై; మెల్లనన్= తిన్నగా; లింగదేహంబునన్= సూక్ష్మశరీరంలో; పృథివీ+ఆత్మకత్వంబున్+ఒంది= పృథివీభూత స్వరూపంపొంది; అట్టి పృథివీ+ఆత్మకత్వంబునన్= అటువంటి పృథివీస్వరూపంతో; ఘ్రాణంబునన్= ముక్కుతో; గంధంబునున్= వాసనను; జల+ఆత్మకత్వంబునన్= జలస్వరూపంతో; రసనా+ఇంద్రియింబునన్= జిహ్వేంద్రియంతో; రసంబునున్= రసాన్నీ; తేజస్+రూపకత్వంబునన్= తేజోరూపంతో; దర్శనంబునన్= నేత్రంతో; రూపంబునున్= రూపాన్ని; సమీరణ+ఆత్మకత్వంబునన్= వాయుస్వరూపంతో; దేహంబునన్= శరీరంలో; స్పర్శనంబునున్= స్పర్శనూ; గగన+ఆత్మకత్వంబునన్= ఆకాశస్వరూపంతో; శ్రవణంబునన్= చెవితో; శబ్దంబునున్= ధ్వనిని; అతిక్రమించి= దాటి; భూతసూక్ష్మ+ఇంద్రియలయస్థానంబు+ఐన= పంచభూతాలకూ; సూక్ష్మేంద్రియాలకూ లయప్రదేశమైన; అహంకార+ఆవరణంబునన్= అహంకారమనే ఆచ్ఛాదనంలో; సంప్రాప్తుండు+ఐ= చేరినవాడై; అందున్= అందులో; మనోమయంబునున్= మనస్స్వరూపం; దేవమయంబునున్+ఐన= దేవస్వరూపం ఐన; సాత్త్విక+అహంకార గమనంబునన్= సాత్త్వికాహంకారంలో ప్రవేశించుటతో; మహత్తత్త్వంబున్+చొచ్చి= మహత్తత్త్వంలో ప్రవేశించి; గుణత్రయంబునన్= సత్త్వం మొదలగు మూడు గుణాలలో; లయించి= లీనమై; ప్రధానంబున్+ ఒంది= ప్రకృతిని పొంది; ప్రధాన+ఆత్మకత్వంబునన్= ప్రకృతిస్వరూపంతో; దేహంబునున్= శరీరాన్ని; ఉపాధిపరంపరా+ అవసానంబునన్= ఉపాధులన్నీ తొలగిపోవడంతో; ప్రకృతిన్+పాసి= ప్రకృతిని గూడ వదలి; ఆనందమయుండు+ఐ= ఆనందరూపుడై; ఆనందంబునన్= ఆ ఆనందంతో; పరమాత్మరూపంబు+ఐన= పరమాత్ముని స్వరూపమైనట్టి; వాసుదేవ బ్రహ్మంబు+అందున్= వాసుదేవుడనే పరబ్రహ్మంలో; కలియున్+అని= కలిసిపోతాడని; చెప్పి= వచించి, పలికి; వెండియున్= మరలా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇంకనూ ఒక విశేషం ఉన్నది. గొప్ప పుణ్యంవల్ల బ్రహ్మలోకం చేరినవారు మరొక కల్పంలో తమ సుకృతంయొక్క హెచ్చుతగ్గుల ననుసరించి ఆ యా అధికారాలు పొందుతారు. బ్రహ్మాదిదేవతలను భజించి శరీరత్యాగం చేసినవారు ఆ బ్రహ్మ జీవించినంతకాలం బ్రహ్మలోకంలో జీవించి ఆపై ముక్తిపొందుతారు. శ్రీహరి పాదపద్మాలపై మిక్కిలి భక్తి గలిగి దేహం వీడినవారు స్వేచ్ఛతో నిరాటంకంగా పయనించి బ్రహ్మాండాన్ని ఛేదించుకొని అత్యున్నతమైన వైష్ణవస్థాన మధిష్ఠించి ప్రకాశిస్తారు. ఈశ్వరుదధిష్ఠించిన ప్రకృతి యొక్క అంశంనుండి మహత్తత్త్వం జనిస్తుంది. మహత్తత్త్వాంశతో అహంకారం కల్గుతుంది. అహంకారాంశనుండి శబ్దతన్మాత్ర ఉదయిస్తుంది. శబ్దతన్మాత్రాంశం నుండి ఆకాశం పుడుతుంది. ఆకాశంలో స్పర్శతన్మాత్ర ప్రభవిస్తుంది. స్పర్శతన్మాత్రఅంశం నుండి వాయువు జనిస్తుంది. వాయువు అంశం నుండి రూపతన్మాత్ర కల్గుతుంది. రూపతన్మాత్రాంశం నుండి తేజస్సు జనిస్తుంది. తేజోంశం నుండి రసతన్మాత్ర కల్గుతుంది. రసతన్మాత్ర అంశం నుండి జలం జనిస్తుంది. జలాంశంనుండి గంధతన్మాత్ర కల్గుతుంది. గంధతన్మాత్రాంశం నుండి పృథ్వి ఉదయిస్తుంది. వీటన్నింటి కలయికవల్ల పదునాల్గు భువనాలతో గూడిన విరాట్ స్వరూపం ఉద్భవిస్తుంది. ఆ రూపానికి కోటి యోజనాల విస్తీర్ణమైన పెద్ద బానవంటిది మొదటి ఆవరణమైన భూమి అవుతుంది. కొందరు దీన్ని ఏబది కోట్ల యోజనాల వైశాల్యం కలదని వర్ణిస్తారు. ఈ ఆవరణం మీద జలం, తేజం, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్తత్త్వం అనే ఆరు ఆవరణాలున్నాయి. అవి క్రమంగా ఒకదానికంటె ఒకటి పదేసిరెట్లు పెద్దవి. ఆ ఏడావరణాల మీద ఎనిమిదవదైన ప్రకృత్యావరణం గొప్పగా వ్యాపించి ఉన్నది.

ఈ బ్రహ్మాండాన్ని ఛేదించుకొని విష్ణుపదం అధిష్ఠించినవాడు మరణాది భయంలేని వాడవుతాడు. అతడు మెల్లమెల్లగా లింగశరీరంతో పృథివీతత్త్వం పొందుతాడు. ఆ తత్త్వంలో ఘ్రాణేంద్రియంతో గంధం గ్రహిస్తాడు. జలస్వరూపుడై రసనేంద్రియంతో రసాన్ని ఆస్వాదిస్తాడు. తేజోరూపుడై నేత్రేంద్రియంతో రూపాన్ని గ్రహిస్తాడు. వాయుస్వరూపుడై త్వగింద్రియంతో స్పర్శాన్ని గ్రహిస్తాడు. గగన స్వరూపుడై శ్రోత్రేంద్రియంతో శబ్దగ్రహణం చేస్తాడు. అన్నింటినీ అతిక్రమించి ఆ యోగి ఆకాశాదులైన పంచభూతాలకూ, సూక్ష్మేంద్రియాలకూ లయస్థానమైన అహంకారావరణం చేరుకుంటాడు. అక్కడ మనోమయమూ, దేవమయమూ ఐన సాత్త్వికాహంకారంతో మహత్తత్త్వంలో ప్రవేశిస్తాడు. ఆపై సత్త్వరజస్తమోగుణాలు లయించిన ప్రకృతిని పొందుతాడు. ఆ ప్రకృత్యాత్మకత్వంతో దేహాన్నీ, ఉపాధి పరంపరలన్నీ ముగిసిన తరువాత ప్రకృతినీ పరిత్యజించి ఆనందమయు డవుతాడు. ఆ ఆనందంతో పరమాత్మ స్వరూపమైన వాసుదేవ పరబ్రహ్మంలో లీనమవుతాడు. ఈ విధంగా చెప్పి శుకయోగి పరీక్షిన్నరేంద్రునితో ఇంకా ఇలా అన్నాడు.

**విశే :** దేనితో ఒకదాని జ్ఞానం కలుగుతుందో అది మాత్ర. తన్మాత్ర అంటే దానికి సంబంధించిన జ్ఞానాన్ని కలిగించేది అని భావం. తన్మాత్రలు – శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనేవి. శబ్దాన్నిబట్టి ఆకాశాన్ని తెలుసుకుంటాము కనుక శబ్దం ఆకాశతన్మాత్ర. ఇలాగే తక్కినవి.

**ఆ. పరమభాగవతులు పాటించు పథ మిది, యీ పథమున యోగి యేఁగెనేని**
**మగుడి రాఁడు వాఁడు మఱి సంశయము లేదు, కల్పశతము లైనఁ గౌరవేంద్ర! 33**

**ప్రతి :** కౌరవ+ఇంద్ర= కౌరవశ్రేష్ఠా!; పరమభాగవతులు= ఉత్తములైన భగవద్భక్తులు; పాటించు= అనుసరించు; పథము+ఇది= మార్గమిది; ఈ పథమునన్= ఈ మార్గంలో; యోగి= యోగానుష్ఠానపరుడు; ఏఁగెనేని= పయనిస్తే; వాఁడు= అట్టి యోగి;

కల్పశతములైనన్= వందలాది కల్పాలు గడచినా; మగుడి రాఁడు= మరల తిరిగిరాడు; మఱి సంశయము లేదు= ఇంక సందేహం లేదు.

**తా :** కౌరవశ్రేష్ఠా! ఇది భాగవతోత్తములు అనుసరించే త్రోవ. ఈ మార్గాన పయనించిన యోగి వందలాది యుగాలు గడచినా మళ్ళీ తిరిగి రాడు. ఇందులో సందేహం లేదు.

**వ. వినుము, నీవడిగిన సద్యోముక్తియుఁ గ్రమముక్తియు ననియెడు నీ రెండు మార్గంబులు వేదగీతలందు వివరింపంబడియె, వీనిం దొల్లి భగవంతుండైన వాసుదేవుండు బ్రహ్మచేత నారాధితుండై చెప్పె, సంసార ప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదు లయిన మోక్షమార్గంబులు పెక్కులు గల, వందు భక్తిమార్గంబుకంటె సులభంబు లేదు. 34**

**ప్రతి :** వినుము= ఆలకించు; నీవు+అడిగిన; సద్యోముక్తియున్= వెంటనే కల్గు మోక్షం; క్రమముక్తియున్= క్రమంగా వచ్చే మోక్షం; అనియెడు= అనునట్టి; ఈ రెండు మార్గంబులు= ఈ రెండు తోవలు; వేద గీతలందున్= శ్రుతిగీతలలో; వివరింపన్+పడియెన్= విశదీకరింపబడినవి; తొల్లి= పూర్వం; భగవంతుండు+ఐన= భగవానుడగు; వాసుదేవుండు= శ్రీహరి; బ్రహ్మచేతన్= విధాతచేత; ఆరాధితుండు+ఐ= పూజింపబడినవాడై; వీనిన్= ఈ రెండుతోవలనూ; చెప్పెన్= వివరించాడు; సంసార ప్రవిష్టుండు+ఐనవానికిన్= సంసారంలో ప్రవేశించినవానికి; తపస్+యోగ+ఆదులు+ఐన= తపస్సు, యోగం మొదలైన; మోక్షమార్గంబులు= మోక్షపుదారులు; పెక్కులు= అనేకం; కలవు= ఉన్నాయి; అందులోన్= ఆ మార్గాలలో; భక్తిమార్గంబుకంటెన్= భక్తియోగంకంటె; సులభంబు= సుకరమైన మార్గం; లేదు.

**తా :** రాజా! సద్యోముక్తి, క్రమముక్తి అనే రెండు మార్గాలను గురించి నీవు నన్నడిగావు. ఇవి రెండు వేదగీతలలో వివరింపబడి ఉన్నాయి. పూర్వం బ్రహ్మదేవుడు తన్ను ఆరాధింపగా విష్ణుదేవుడు ఆయనకు వీటిని గురించి బోధించాడు. సంసారంలో ప్రవేశించినవానికి, తపస్సు, యోగం మొదలయిన ఎన్నో మోక్షమార్గాలు ఉన్నాయి. అన్నింటికంటె భక్తిమార్గం సులభమైనది.

### ✤ శుకుఁడు పరీక్షిత్తునకు భక్తిమార్గంబె ముఖ్యంబని తెలుపుట ✤

**మ. విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు ముమ్మాఱు ధ**
**ర్మ నయజ్ఞత్వముతోడ నెంతయుఁ బరామర్శించి మోక్షంబు ద**
**క్కిన మార్గంబున వెంట లేదనుచు భక్తిం జింత సేసెన్ జనా**
**ర్దను నాత్మాకృతి నిర్వికారుఁ డగుచుం దన్మార్గనిర్ణేతయై. 35**

**ప్రతి :** వినుము= ఆలకించుము; అంభోజభవుండు= బ్రహ్మదేవుడు; మున్ను= పూర్వం; మదిలోన్= చిత్తంలో; వేదంబున్= శ్రుతిని; ముమ్మాఱు (మూఁడు+మాఱు)= మూడుసార్లు; ధర్మనయత్వముతోడన్= ధర్మనీతి విధిని గుర్తెరిగిన వివేకంతో; ఎంతయున్= మిక్కిలిగా; పరామర్శించి= సమీక్షించి; మోక్షంబు= ముక్తి; తక్కిన మార్గంబున వెంటన్= భక్తికంటె వేరైన తోవలో పయనిస్తే; లేదు+అనుచున్= సిద్ధించదనుచు; భక్తిన్= భక్తితో; నిర్వికారుఁడు+అగుచున్= వికారంలేనివాడై; తత్+మార్గనిర్ణేత+ఐ= ఆ భక్తిమార్గాన్ని నిర్ణయించేవాడై; ఆత్మాకృతిన్= ఆత్మస్వరూపుడైన; జనార్దనున్= మహావిష్ణువును; చింత+చేసెన్= ధ్యానించాడు.

**తా :** రాజా! ఇది ఇంకా వివరంగా చెబుతాను, విను. పూర్వం బ్రహ్మ మనస్సులో ధర్మనీతి పరాయణమైన దృష్టితో మూడు పర్యాయాలు వేదాన్ని పరామర్శించాడు. అలా పరామర్శించి భక్తితో తప్ప మరొక మార్గాన మోక్షం లభించదని నిశ్చయించుకొన్నాడు. ఆ మార్గాన్నే తరణోపాయంగా నిర్ణయించుకొని వికారానికి లోబడకుండా ఆత్మస్వరూపుడైన జనార్దనుణ్ణి భక్తితో ధ్యానించాడు.

**సీ. అఖిలభూతములందు నాత్మరూపంబున నీశుండు హరి యుండు నెల్లప్రొద్దు**
**బుద్ధ్యాది లక్షణంబులఁ గానఁబడును మహత్సేవనీయుఁ డహర్నిశంబు**
**వందనీయుఁడు భక్తవత్సలుం డత్యంతనియతుఁడై సతతంబు నియతబుద్ధి**
**నాత్మరూపకుఁడగు హరికథామృతమును గర్ణపుటంబులఁ గాంక్ష దీరఁ**

**తే. గ్రోలుచుండెడు ధన్యులు కుటిలబహుళ, విషయ మలినీకృతాంగముల్ వేగ విడిచి**
**విష్ణుదేవుని చరణారవిందయుగము, కడకుఁ జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర! 36**

**ప్రతి :** కౌరవ+ఇంద్ర!= కౌరవనాథా!; అఖిల భూతములు+అందున్= సకలప్రాణులందు; ఆత్మరూపంబునన్= ఆత్మరూపంతో; ఈశుండు= ఈశ్వరుడైన; హరి= శ్రీమన్నారాయణుడు; ఎల్లప్రొద్దు= ఎల్లవేళలా; ఉండున్= ఉంటాడు; బుద్ధి+ ఆదిలక్షణంబులన్= బుద్ధిమొదలైన లక్షణాలచేత; కానన్+పడును= కనిపిస్తాడు; మహత్+సేవనీయుఁడు= పెద్దలైన వారిచే సేవింపదగినవాడు; అహర్నిశంబు= రేయింబవళ్ళు; వందనీయుఁడు= నమస్కరింపదగినవాడు; భక్తవత్సలుండు= భక్తులపట్ల వాత్సల్యం కలవాడు; అత్యంత నియతుఁడు+ఐ= మిక్కిలి నియమంకలవాడై; సతతంబు= ఎల్లవేళలా; నియతబుద్ధిన్= నియమించుకొన్న బుద్ధితో; ఆత్మరూపకుఁడు+అగు= ఆత్మస్వరూపుడైన; హరికథా+అమృతమును= శ్రీహరియొక్క కథ అనే సుధను; కర్ణపుటంబులన్= దొప్పలవంటి చెవులతో; కాంక్ష+తీరన్= తనివితీరా; గ్రోలుచు+ఉండెడు= ఆస్వాదించునట్టి; ధన్యులు= పుణ్యాత్ములు; కుటిల= కుటిలమైన; బహుళ విషయ= అనేక విషయాలచే; మలినీకృత+అంగముల్= మలినంగా చేయబడిన శరీరాలను; వేగన్= శీఘ్రంగా; విడిచి= త్యజించి; విష్ణుదేవుని చరణ+అరవిందయుగము కడకున్= విష్ణుని పాదపద్మాల జంట చెంతకు; చనుదురు= పోతారు; సిద్ధంబు= నిక్కం.

**తా :** రాజా! జగదీశ్వరుడైన శ్రీహరి సకల జీవులలో సదా ఆత్మరూపుడై ఉన్నాడు. బుద్ధి మొదలయిన లక్షణాలతో ఆ దేవుడు మనకు గోచరిస్తాడు. ఉత్తములకు ఆయన సేవింపదగినవాడు. సకలవేళలా నమస్కరింపదగినవాడు. భక్తులపై వాత్సల్యం కలవాడు. నియమనిష్ఠలు కలిగి ఏకాగ్రమైన బుద్ధితో ఆత్మస్వరూపుడగు శ్రీహరి కథాసుధను తనివి దీరా, చెవులారా గ్రోలేవారు ధన్యులు. అట్టివారు కుటిలమైన పలువిషయాలతో చెడిపోయిన తమ శరీరాలను పరిత్యజించి విష్ణుదేవుని పాదపద్మాలను చేరుకొంటారు. ఇది సిద్ధమైన విషయం.

**క. మానుషజన్మము నొందిన, మానవులకు లభ్యమానమరణులకు మహా**
**జ్ఞానులకుఁ జేయవలయు వి, ధానము నిగదింపఁబడియె ధరణీనాథా! 37**

**ప్రతి :** ధరణీనాథా= భూనాథా!; మానుషజన్మమున్= మానవుల పుట్టుకను; ఒందిన= పొందిన; మానవులకున్= మనుజులకు; లభ్యమాన మరణులకున్= ఆసన్నమైన మృతి కలవారికి; మహాజ్ఞానులకున్= గొప్ప జ్ఞానం కలవారికి; చేయవలయు= చేయవలసినట్టి; విధానము= పద్ధతి; నిగదింపన్+పడియెన్= చెప్పబడింది.

**తా :** రాజా! మానవులుగా జన్మించిన వారూ, మరణం ఆసన్నమైనవారూ, మహాజ్ఞానులూ, చేయవలసిన కర్తవ్యం ఇలా చెప్పడమైనది.

**వ. వినుము. బ్రహ్మవర్చసకాముఁడైన వానికి వేదవిభుండగు చతుర్ముఖుండును, నింద్రియ పాటవకామునకు నింద్రుండును, బ్రజాకామునకు దక్షాది ప్రజాపతులును, భోజనకామునకు నదితియు, స్వర్గకామునకు నాదిత్యులును, రాజ్యకామునకు విశ్వదేవతలును, దేశప్రజా ధనకామునకు సాధ్యులును, శ్రీకామునకు దుర్గయుఁ, దేజస్కామునకు నగ్నియు, వసుకామునకు వసువులును, వీర్యకామునకు వీర్యప్రదులగు రుద్రులును, నాయుష్కామునకు నశ్వినీదేవతలును, బుష్టికామునకు భూమియుఁ, బ్రతిష్ఠా కామునకు లోకమాతలైన గగనభూదేవతలును, సౌందర్యకామునకు గంధర్వులును, గామినీకామునకు నప్సరసయైన యూర్వశియు, సర్వాధిపత్యకామునకు బ్రహ్మయుఁ, గీర్తికామునకు యజ్ఞంబులును, విత్తసంచయకామునకుం బ్రచేతసుండును, విద్యాకామునకు నుమావల్లభుండును, దాంపత్య ప్రీతికామునకు నుమాదేవియు, ధర్మార్థకామునకు నుత్తమశ్లోకుండగు విష్ణువును, సంతానకామునకుఁ బితృదేవతలును, రక్షాకామునకు యక్షులును, బలకామునకు మరుద్గణంబులును, రాజత్వకామునకు మనురూప దేవతలును, శత్రుమరణ కామునకుఁ గోణపాలకుండైన రాక్షసుండును, భోగకామునకుం జంద్రుండును భజనీయు లగుదురు. మఱియును. 38**

**ప్రతి :** వినుము= చక్కగా ఆలకించు; బ్రహ్మవర్చసకాముఁడు+ఐనవానికిన్= బ్రహ్మవర్చస్సు కోరేవానికి; వేదవిభుండు+అగు= వేదప్రభువైన; చతుర్ముఖుండునున్= బ్రహ్మయు; ఇంద్రియ పాటవకామునకున్= ఇంద్రియాల సామర్థ్యం కోరేవానికి, ఇంద్రుండును; ప్రజాకామునకున్= సంతానం కోరేవానికి; దక్షాది ప్రజాపతులునున్= దక్షుడు మొదలగు ప్రజాపతులు; భోజనకామునకున్= అన్నం కోరేవానికి; అదితియున్= అదితిదేవి; స్వర్గకామునకున్= స్వర్గంకోరేవానికి; ఆదిత్యులును= అదితి పుత్రులును; రాజ్యకామునకున్= రాజ్యం కోరేవానికి; విశ్వదేవతలును= విశ్వదేవతలూ; దేశప్రజాధనకామునకున్= దేశాన్ని, ప్రజలను, ధనాన్ని కోరేవానికి; సాధ్యులును= సాధ్యులనువారు; శ్రీకామునకున్= సిరిని కోరేవానికి; దుర్గయున్= దుర్గాదేవియు; తేజస్కామునకున్= తేజస్సు కోరేవానికి; అగ్నియు; వసుకామునకున్= అర్థం కోరేవానికి; వసువులును= వసువులనువారూ; వీర్యకామునకున్= వీర్యం కోరేవానికి; వీర్యప్రదులగు రుద్రులును= వీర్యం ఇచ్చే రుద్రులును; ఆయుస్+ కామునకున్= ఆయువు కోరేవానికి, అశ్వినీ దేవతలును= అశ్వినీ దేవతలు; పుష్టికామునకున్= పుష్టి కోరేవానికి; భూమియున్= భూమి; ప్రతిష్ఠాకామునకున్= ప్రతిష్ఠను కోరేవానికి; లోకమాతలు+ఐన గగన భూదేవతలును= లోకానికి తల్లులైన ఆకాశభూదేవతలును; సౌందర్యకామునకున్= అందంకోరే వానికి; గంధర్వులును= గంధర్వులూ; కామినీకామునకున్= ప్రియునితోడి కలయికగోరే స్త్రీని కోరేవానికి; అప్సరస+ఐన+ఊర్వశియున్= అచ్చరఅగు ఊర్వశియు; సర్వ+ ఆధిపత్యకామునకున్= అందరి మీదా అధికారం కోరేవానికి; బ్రహ్మయున్= బ్రహ్మదేవుడూ; కీర్తికామునకున్= యశస్సు కోరేవానికి; యజ్ఞంబులును= యజ్ఞాలూ; విత్తసంచయకామునకున్= ధనరాశిని కోరేవానికి; ప్రచేతసుండును= వరుణుండును; విద్యాకామునకున్= విద్య కోరేవానికి; ఉమావల్లభుండును= పార్వతీనాథుడగు శివుడును; దాంపత్య ప్రీతికామునకున్= దాంపత్య సుఖం కోరేవానికి; ఉమాదేవియున్= పార్వతియు; ధర్మ+అర్థకామునకున్= ధర్మాన్నీ, అర్థాన్నీ కోరేవానికి;

ఉత్తమశ్లోకుండు+అగు= పుణ్యశ్లోకుడైన; విష్ణువును= శ్రీహరియు; సంతానకామునకున్= బిడ్డలు కోరేవానికి; పితృదేవతలును= పితృదేవతలూ; రక్షాకామునకున్= రక్షణ కోరేవానికి; యక్షులును= యక్షులు; బలకామునకున్= శక్తిని కోరేవానికి; మరుద్గణంబులును= మరుత్తులనే దేవతల బృందాలును; రాజత్వకామునకున్= రాచరికం కోరేవానికి; మనురూపదేవతలును= మనువులుగానున్న దేవతలును; శత్రుమరణకామునకున్= శత్రువులు మరణించాలని కోరేవానికి; కోణపాలకుండు+ ఐన రాక్షసుండును= నైరృతి దిశను పాలించే నిరృతియు; భోగకామునకున్= భోగం కోరేవానికి; చంద్రుండును= చంద్రదేవుడూ; భజనీయులు అగుదురు= సేవింపదగిన వారవుతారు; మఱియును= ఇంకా...

**తా :** రాజా! విను. బ్రహ్మవర్చస్సు కోరేవాడు వేదవిభుడగు చతుర్ముఖ బ్రహ్మను సేవించాలి. అట్లే ఇంద్రియశక్తి కోరేవాడు ఇంద్రుణ్ణి, సంతతికోరేవాడు దక్షుడు మొదలయిన ప్రజాపతులనూ, భోజనం ఆశించేవాడు అదితినీ పూజించాలి. స్వర్గాభిలాషి ఆదిత్యులనూ, రాజ్యాభిలాషి విశ్వదేవతలనూ, దేశప్రజలనూ, సంపదనూ స్వాధీనం చేసుకోగోరేవాడు సాధ్యులనూ, సిరిని వరించేవాడు దుర్గనూ ఉపాసించాలి. తేజస్సు కోరేవాడు అగ్నినీ, ధనాభిలాషి వసువులనూ, వీర్యార్థి రుద్రులనూ, ఆయువు అభిలషించేవాడు అశ్వినీదేవతలనూ, పుష్టికామి భూమినీ అర్చించాలి. ప్రతిష్ఠను అపేక్షించేవాడు లోకమాతలగు ఆకాశభూదేవతలనూ, అందచందాలు కోరేవాడు గంధర్వులనూ, కామినులను కామించేవాడు అప్సరసయైన ఊర్వశినీ, సర్వాధికారం కాంక్షించేవాడు పరమేష్ఠినీ భజించాలి. కీర్తికోరువాడు యజ్ఞమూర్తియైన విష్ణువునూ, ధనంకోరేవాడు వరుణుణ్ణీ, విద్యార్థి శివుణ్ణీ, దాంపత్య సుఖాభిలాషి పార్వతినీ కొలవాలి. ధర్మార్థాలపై అభిలాష కలవాడు పుణ్యచరిత్రుడైన విష్ణువునూ, సంతానార్థి పితృదేవతలనూ, రక్షణ కోరేవాడు యక్షులనూ, బలం కోరేవాడు మరుద్గణాలనూ, రాచరికంపై అభిలాష గలవాడు మను రూపంలో ఉన్న దేవతలనూ, శత్రుమరణం వాంఛించేవాడు నిరృతినీ, భోగాభిలాషి చంద్రుణ్ణీ ఆరాధించాలి ఇంకా,

**విశే :** వసువులు ఎనమండుగురు. 1. ఆపుడు 2. ధ్రువుడు 3. సోముడు 4. అధ్వరుడు 5. అనిలుడు 6. ప్రత్యూషుడు 7. అనలుడు 8. ప్రభాసుడు.

వీర్యప్రదులగు రుద్రులు పదునొకండుగురు. 1. అజుడు 2. ఏకపాదుడు 3. అహిర్బుధ్న్యుడు 4. త్వష్ట 5. రుద్రుడు 6. హరుడు 7. శంభుడు 8. త్ర్యంబకుడు 9. అపరాజితుడు 10. ఈశానుడు 11. త్రిభువనుడు.

**క. కామింపకయును సర్వముఁ, గామించియునైన ముక్తిఁ గామించి తగన్**
**లో మించి పరమపురుషుని, నేమించి భజించుఁ దత్త్వనిపుణుం డధిపా! 39**

**ప్రతి :** అధిపా!= రాజా!; కామింపకయునున్= దేనినీ కోరకున్నా; సర్వమున్= అన్నింటినీ; కామించియును+ఐనన్= కోరియైనా; తగన్= తగినట్లు; ముక్తిన్= మోక్షాన్ని; కామించి= కోరి; మించి= అతిశయించి; లోన్= హృదయంలో; పరమపురుషునిన్= పరమేశ్వరుని; నేమించి= నియమించి (ప్రతిష్ఠించి); తత్త్వనిపుణుండు= పరతత్త్వసాధనలో నైపుణ్యం కలవాడు; భజించున్= సేవిస్తాడు.

**తా :** రాజా! పై చెప్పిన వాటినన్నింటినీ కోరినా, కోరకున్నా, పరతత్త్వసాధనలో నేర్పుగలవాడు మోక్షం మాత్రం తప్పక అభిలషిస్తాడు. తదనుగుణంగా తన హృదయంలో పరమేశ్వరుణ్ణి నెలకొల్పి భజిస్తాడు.

**మ. అమరేంద్రాదులఁ గొల్చుభంగి జనుఁ డా యబ్జాక్షు సేవింపఁగా**
**విమలజ్ఞాన విరక్తి ముక్తు లొదవున్ వేయేల? భూనాథ! త**

**త్కమలాధీశ కథాసుధారస నదీకల్లోలమాలా పరి**
**భ్రమ మెవ్వారికినైనఁ గర్ణయుగళీపర్వంబు గాకుండునే? 40**

**ప్రతి :** భూనాథ!= ఓ రాజా!; వేయి+ఏల= పలుమాట లెందుకు?; జనుఁడు= మానవుడు; అమర+ఇంద్ర+ఆదులన్= దేవేంద్రుడు మొదలయినవారిని; కొల్చుభంగిన్= ఆరాధించేవిధంగా; ఆ+అబ్జ+అక్షున్= ఆ పద్మనేత్రుని; సేవింపన్+కాన్= సేవిస్తే; విమల= నిర్మలమగు; జ్ఞాన= జ్ఞానం; విరక్తి= వైరాగ్యం; ముక్తులు= మోక్షం అనేవి; ఒదవున్= సిద్ధిస్తాయి; లభిస్తాయి; తద్+కమలా+అధీశ= ఆ లక్ష్మీవల్లభునియొక్క; కథాసుధారస= కథ అనే అమృతరసంగల; నదీ= నదియొక్క; కల్లోలమాలా= అలల పంక్తియందు; పరిభ్రమము= సంచారం; ఏ+వారికిన్+ఐనన్= ఎట్టివారికైనా; కర్ణయుగళీ పర్వంబు= రెండు చెవులకు పండుగ; కాక+ఉండును+ఏ= కాకుండా ఉంటుందా?

**తా :** రాజా! పెక్కుమాట లెందుకు? పైని వివరించిన కోరికలతో ఇంద్రాది దేవతలను సేవించినట్లే, పద్మపత్రనేత్రుడైన విష్ణుని భజిస్తే నిర్మలమైన, జ్ఞానం, వైరాగ్యం, మోక్షం సిద్ధిస్తాయి. ఆ లక్ష్మీనాథుని కథాసుధారసం నిండుగా ఉన్ననదీ తరంగాలలో ఓలలాడడం గొప్పఅదృష్టం. శ్రీహరికథలు చెవులపండువు చేయకుండా ఉండునా?

**వ. అని యిట్లు రాజునకు శుకుండు సెప్పె ననిన విని శౌనకుండు సూతున కిట్లనియె. 41**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; రాజునకున్= పరీక్షిన్మహారాజుకు; శుకుండు+చెప్పెను+అనినన్= శుకయోగి వివరించాడనగా; విని= ఆలకించి; శౌనకుండు= శౌనకమహర్షి; సూతునకున్= సూతునకు; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ రీతిగా పరీక్షిన్మహారాజుకు శుకయోగి చెప్పాడని సూతుడు పలుకగా ఆకర్ణించిన శౌనక మహర్షి ఆ సూతునితో ఇలా అన్నాడు.

**క. వరతాత్పర్యముతో నిటు, భరతాన్వయవిభుఁడు శుకుని పలుకులు విని స**
**త్వరతాయుతుఁడై శ్రేయ, స్కరతామతి నేమి యడిగె గణుతింపఁగదే! 42**

**ప్రతి :** ఇటు= ఈ లాగున; భరత+అన్వయ విభుఁడు= భరతవంశానికి చెందిన ప్రభువు; వరతాత్పర్యముతోన్= మంచి తత్పరతతో (శ్రద్ధతో); శుకుని పలుకులు= శుకయోగిమాటలు; విని; సత్వరతాయుతుఁడు+ఐ= వడిగలవాడై; శ్రేయస్కరతామతిన్= శ్రేయస్సును కల్గించుకోవాలన్న బుద్ధితో; ఏమి+అడిగెన్= ఏమని ప్రశ్నించాడో; గణుతింపన్+కదే= వివరించవయ్యా!

**తా :** ఈ రీతిగా శుకుడు పలికిన పలుకులను మిక్కిలి శ్రద్ధతో విన్న పరీక్షిత్తు శ్రేయోభిలాషతో వెనువెంటనే ఏమని ప్రశ్నించినాడో విశదీకరించి చెప్పు.

**క. ఒప్పెడి హరికథ లెయ్యవి, సెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠల్**
**గుప్పలు గొనుచున్నవి; రుచు, లుప్పతిలన్ నీ మనోహరోక్తులు వినఁగన్. 43**

**ప్రతి :** రుచులు+ఉప్పతిలన్= చవులూరగా; నీ మనోహర+ఉక్తులు= నీ మనోజ్ఞమైన పలుకులు; వినఁగన్= ఆలింపగా, మాకున్= మాకు; ఒప్పెడి= ఇంపైన; హరికథలు+ఏ+అవి= విష్ణుకథలు ఎటువంటివి; చెప్పెడినో+అనుచున్= చెబుతాడో అంటూ; చిత్త+ఉత్కంఠల్= మనస్సుయొక్క ఉబలాటాలు; కుప్పలు+కొనుచు+ఉన్నవి= రాసులవుతున్నవి.

**తా :** చవులూరేటట్లుగా ఉన్న మనోహరమైన నీమాటలు వింటుంటే ఇంకా ఏలాంటి మంచి మంచి విష్ణుకథలు చెపుతాడో అని మా మనస్సులలో ఉబలాటం పెల్లుబుకుతున్నది.

**వ. అనిన విని సూతుం డిట్లనియె. 44**

**ప్రతి :** అనినన్ విని= అని చెప్పగా విన్న తర్వాత; సూతుండు+ఇట్లు+అనియెన్= సూతుడిలా అన్నాడు.

**తా :** శౌనకు డావిధంగా చెప్పడం విని, సూతు డీరీతిగా అన్నాడు.

**క. తూలెడి కూఁకటితోడను, బాలురతో నాడుచుండి బాల్యమున మహీ**
**పాలుఁడు హరిచరణార్చన, హేలాలసుఁ డగుచు నుండె నెంతయు నియతిన్. 45**

**ప్రతి :** మహీపాలుఁడు= పరీక్షిత్తు; బాల్యమునన్= పిన్నతనంలో; తూలెడి= చలించునట్టి; కూఁకటితోడనున్= జులపాల జుట్టుతో; బాలురతోన్= పిల్లలతో; అడుచు+ఉండి= క్రీడిస్తూ ఉండి; ఎంతయున్ నియతిన్= మిక్కిలి నియమంతో; హరి= విష్ణువుయొక్క; చరణ= పాదాలయొక్క; అర్చనహేలా= పూజించడమనే మానసికవికారంచేత; అలసుఁడు+అగుచున్+ఉండెన్= అలసత్వానికి గురి అయ్యేవాడు.

**తా :** మునులారా! ఆ పరీక్షిత్తు బాల్యంలో సైతం తూలిపడే జులపాల జుట్టుతో తోడిబాలురతో గూడి ఆడుకొనే దినాలలో గూడ శ్రద్ధతో హరిపాదాలను అర్చించేవాడు.

**వ. అట్టి పరమభాగవతుండైన పాండవేయునకు వాసుదేవపరాయణుండైన శుకుండిట్లనియె. 46**

**ప్రతి :** అట్టి పరమభాగవతుండు+ఐన= అలాంటి ఉత్తమ భగవద్భక్తుడైన; పాండవేయునకున్= పరీక్షిత్తునకు; వాసుదేవ పరాయణుండు+ఐన= శ్రీకృష్ణభక్తుడైన; శుకుండు+ఇట్లు+అనియెన్= శుకుడిలా అన్నాడు.

**తా :** అలాంటి భాగవత శ్రేష్ఠుడైన పరీక్షిత్తుతో వాసుదేవుని భక్తుడైన శుకయోగి ఇలా చెప్పాడు.

**సీ. వాసుదేవ శ్లోకవార్త లాలించుచుఁ గాల మే పుణ్యుండు గడుపుచుండు**
**నతని యాయువుదక్క నన్యుల యాయువు నుదయాస్తమయముల నుగ్రకరుఁడు**
**వంచించి కొనిపోవు, వాఁడది యెఱుఁగక జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు**
**నంగనాపుత్ర గేహారామ విత్తాది సంసారహేతుకసంగసుఖముఁ**

**తే. దగిలి వర్తింపఁ గాలంబు తఱి యెఱింగి, దండధరకింకరులు వచ్చి తాడనములు**
**సేసి కొనిపోవఁ బుణ్యంబు సేయ నైతిఁ, బాపరతి నైతి నని బిట్టు పలవరించు. 47**

**ప్రతి:** వాసుదేవశ్లోకవార్తలు= శ్రీకృష్ణుని కీర్తికి సంబంధించిన వార్తలు; ఆలింపుచున్= వింటూ; కాలము= సమయాన్ని; ఏ పుణ్యుండు= ఏ పవిత్రాత్ముడు; గడుపుచు+ఉండున్= గడుపుతూ ఉంటాడో; అతని+ఆయువు+తక్కన్= అట్టివాని ఆయుస్సు తప్ప; అన్యుల= ఇతరులయొక్క; ఆయువున్= జీవితకాలాన్ని; ఉగ్రకరుఁడు= సూర్యుడు; ఉదయ+అస్తమయములన్= ఉదయంలోనూ, అస్తమయంలోనూ, రేపట, మాపట; వంచించి= మోసగించి; కొనిపోవున్= తీసుకుపోతాడు; వాఁడు= అట్టి వ్యర్థజీవనుడు; అది= అలా సూర్యుడు మోసగిస్తాడనే సంగతి; ఎఱుఁగక= తెలియక; పెక్కు+ఏండ్లు= అనేక సంవత్సరాలు;

జీవింతున్= బ్రదుకుతాను; సిద్ధము+అనుచున్= ఇది నిక్కమంటూ; అంగనా= స్త్రీలు; పుత్ర= పుత్రులు; గేహ= ఇల్లు; ఆరామ= తోటలు; విత్త+ఆది= ధనం మొదలయిన; సంసారహేతుక= సంసారం కారణంగా కలిగిన; సంగ= కలయికయొక్క; సుఖమున్= సౌఖ్యాన్ని; తగిలి వర్తింపన్= ఆశించి జీవిస్తుండగా; కాలంబు తఱి= అతనికి కాలం సమీపించడం; ఎఱింగి= గ్రహించి; దండధర కింకరులు= యమభటులు, వచ్చి; తాడనములు+చేసి= దెబ్బలు కొట్టి; కొనిపోవన్= (యమపురికి) తీసుకొనిపోగా; పుణ్యంబు+చేయన్+ఐతిన్= నేను పుణ్యకార్యాలు చేయకుంటిని; పాపరతిన్+ఐతిన్= పాపకార్యాలపట్ల ఆసక్తి గలవాడనైతిని; అని= అని తలచి; బిట్టు= ఎంతగానో; పలవరించున్= దుఃఖిస్తాడు.

**తా :** ఏ పుణ్యాత్ముడు భగవంతుని ఖ్యాతిని ప్రకటించే కథలు వింటూ కాలం గడుపుతాడో, అతని ఆయుస్సు తప్ప ఇతరుల ఆయువును సూర్యుడు ఉదయాస్తమయాలతో మోసగించి లాగుకొనిపోతుంటాడు. ఆ సంగతి గ్రహింపక మూఢుడు "నేను తప్పక చాలా సంవత్సరాలు జీవిస్తాను" అనుకుంటాడు. సంసారానికి హేతువులైన ఆలుబిడ్డలు, ఇల్లువాకిళ్ళు, తోటలు, దొడ్లు, ధనం మొదలైన వాటి తగులంలో చిక్కుకుంటాడు. అతనికి ఆయువుతీరగానే యమభటులు వచ్చి వాణ్ణి నానావిధబాధలకు గురిచేస్తూ యమపురికి తీసుకుపోతారు. అప్పుడు వాడు "అయ్యో! నేను పుణ్యం చేయలేదే! పాపం చేశానే!" అంటూ గోడు గోడున ఏడుస్తాడు.

**వ. అది గావున. 48**

**ప్రతి :** అది కావునన్= అందువల్ల;

**తా :** ఆ కారణం వల్ల.

**సీ. అలరుజొంపములతో నభ్రంకషంబులై బ్రదుకవే వనములఁ బాదపములు!**
**ఖాదన మేహనాకాంక్షలఁ బశువులు జీవింపవే గ్రామసీమలందు!**
**నియతిమై నుచ్ఛ్వాసనిశ్వాసపవనముల్ ప్రాప్తింపవే చర్మభస్త్రికలును!**
**గ్రామసూకర శునకశ్రేణు లింటింటఁ దిరుగవే దుర్యోగదీనవృత్తి!**

**తే. నుష్ట్రఖరములు మోయవే యురుభరములఁ, బుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు**
**లడవులందు నివాసములందుఁ బ్రాణ, విషయభరయుక్తితో నుంట విఫలమధిప! 49**

**ప్రతి :** అధిప!= రాజా!; వనములన్= అడవులలో; పాదపములు= చెట్లు; అలరుజొంపములతోన్= పూగుత్తులతో; అభ్రంకషంబులు+ఐ= ఆకాశాన్ని ఒరసికొంటున్నవై; బ్రదుకవు+ఏ= జీవింపవా?; గ్రామసీమలందున్= గ్రామప్రదేశాలలో; పశువులు= జంతువులు; ఖాదన మేహన+ఆకాంక్షలన్= ఆహారమైథునాలపై కోరికలతో; జీవింపవు+ఏ= బ్రదుకవా?; చర్మభస్త్రికలునున్= కొలిమితిత్తులు; నియతిమైన్= నియమప్రకారంగా; ఉచ్ఛ్వాస నిశ్వాస పవనముల్= ఊపిరి వెలికి లోనికి పీల్చుకొనుటకు సంబంధించిన గాలులను; ప్రాప్తింపవే= పొందుటలేదా?; గ్రామసూకర శునకశ్రేణులు= ఊరపందులు, కుక్కలగుంపులు; దుర్యోగదీనవృత్తిన్= దుష్టయోగంవల్ల ప్రాప్తించిన దీనవర్తనంతో; ఇంటింటన్ (ఇంటన్+ఇంటన్)= ప్రతియింటియందూ; తిరుగవు+ఏ= తిరుగుటలేదా?; ఉష్ట్రఖరములు= ఒంటెలు, గాడిదలు; ఉరుభరములన్= పెద్దబరువులను; మోయవు+ఏ= మోయుటలేదా?; పుండరీక+అక్షున్= పద్మనేత్రుడగు శ్రీహరిని; ఎఱుఁగని= తెలియని; పురుషపశువులు= పశువులవంటి మానవులు; అడవులందున్= అరణ్యాలలోనూ; నివాసములు+అందున్= ఇండ్లలోనూ;

విషయభరయుక్తితోన్= సంసారవిషయాలకు సంబంధించిన భారం పైన వేసికొంటూ; ఉంటన్= జీవించి ఉండడం; విఫలము= వ్యర్థం.

**తా :** ఓ రాజా! పూగుత్తులతో ఆకసమంటుతూ అడవులలో చెట్లు జీవించడం లేదా? ఆహార మైథునాది వాంఛలతో పశువులు పల్లెసీమల్లో బ్రతకడం లేదా? కొలిమి తిత్తులు గూడా ఎడతెరపిలేకుండా ఊపిరి లోనికి వెలికి పీల్చుకొని వదలటాన్ని, సాగిస్తున్నాయి గదా! ఊరపందులు, కుక్కలు గుంపులు గుంపులుగా ఇల్లిల్లు తిరుగుతూ దిక్కుమాలి దీనంగా తిరగడం లేదా! ఒంటెలు, గాడిదలు పెద్దపెద్ద బరువులు మోస్తున్నాయి కదా! అదేరీతిగా పద్మనేత్రుడైన శ్రీమన్నారాయణుని తెలియనేరని నరపశువులు అడవులందో, గృహాలందో సంసార విషయాలలో ఆసక్తిగల్గి జీవిస్తున్నారు. వారి బ్రతుకు వ్యర్థం.

**సీ. విష్ణుకీర్తనములు వినని కర్ణంబులు కొండల బిలములు కువలయేశ!**
**చక్రిపద్యంబులఁ జదువని జిహ్వలు గప్పల జిహ్వలు కౌరవేంద్ర!**
**శ్రీమనోనాథు నీక్షింపని కన్నులు కేకిపింఛాక్షులు కీర్తిదయిత!**
**కమలాక్షు పూజకుఁగాని హస్తంబులు శవము హస్తంబులు సత్యవచన!**

**ఆ. హరిపద తులసీదళామోద రతి లేని, ముక్కు పందిముక్కు మునిచరిత్ర!**
**గరుడగమను భజనగతి లేని పదములు, పాదపముల పాదపటల మనఘ! 50**

**ప్రతి :** కువలయ+ఈశ!= భూనాథా!; విష్ణుకీర్తనములు= విష్ణుదేవుని స్తుతులు; వినని= ఆలింపని; కర్ణంబులు= చెవులు; కొండలబిలములు= కొండ గుహలు; కౌరవ+ఇంద్ర!= కౌరవప్రభూ!; చక్రిపద్యంబులు= శ్రీహరిపై అల్లిన స్తుతి పూర్వకమైన పద్యాలు; చదువని= పఠింపని; జిహ్వలు= నాలుకలు; కప్పల జిహ్వలు= కప్పల నాలుకలు; కీర్తిదయిత!= కీర్తి ప్రియుడా!; శ్రీమనోనాథున్= లక్ష్మీదేవియొక్క చిత్తవిభుడైన విష్ణువును; వీక్షింపని= చూడని; కన్నులు= నేత్రాలు; కేకిపింఛ+అక్షులు= నెమలి పింఛపు కన్నులు; సత్యవచన!= సత్యంపలుకువాడా!; కమల+అక్షు పూజకున్= పద్మాక్షుని అర్చనకు; కానిహస్తంబులు= ఉపయోగించని చేతులు; శవము హస్తంబులు= మరణించిన శరీరంయొక్క చేతులు; మునిచరిత్ర!= మునుల చరిత్రం వంటి చరిత్ర కలవాడా!; హరి= విష్ణువుయొక్క; పద= చరణములందలి; తులసీదళ= తులసి ఆకుయొక్క; ఆమోదరతి= పరిమళమందు ఆసక్తి; లేని ముక్కు= ఇష్టపడని ముక్కు; పందిముక్కు= పందిముక్కువంటిది; అనఘ!= పాపరహితుడా!; గరుడగమను= గరుడవాహనుడైన హరియొక్క; భజనగతిలేని పాదములు= భజనకోసం వెళ్లని కాళ్లు; పాదపముల= వృక్షాలయొక్క; పాదపటలము= వ్రేళ్లసమూహం.

**తా :** భూపతీ! విష్ణుని నామసంకీర్తనలు వినని వీనులు కొండగుహలు. కురునాథా! చక్రధారి మీద పద్యాలు చదువని నాలుకలు కప్పల నాలుకలు. కీర్తిప్రియుడా! శ్రీకాంతుని చూడలేని కన్నులు నెమలిఈకల కన్నులు. సత్యవచనుడా! పద్మనేత్రుని పూజకు ఉపకరించని చేతులు పీనుగుయొక్క చేతులు. రాజర్షీ! శ్రీహరి చరణాలమీది తులసీదళాల పరిమళం ఆఘ్రాణించని ముక్కు పందిముక్కు. పాపరహితా! గరుడవాహనుని సేవకు వెళ్లని పాదాలు చెట్ల వ్రేళ్ళు, విష్ణు పరం గాని చెవులు, నాలుకలు, మొదలయినవి వ్యర్థమైనవని తాత్పర్యం.

**సీ. నారాయణుని దివ్యనామాక్షరములపైఁ గరఁగని మనములు కఠినశిలలు**
**మురవైరికథలకు ముదితాశ్రురోమాంచ మిళితమై యుండని మేను మొద్దు**

**చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న కనకకిరీటంబు గట్టెమోపు**
**మాధవార్పితముగా మనని మానవు సిరి వనదుర్గచంద్రికావైభవంబు**

**ఆ. కైటభారిభజన గలిగి యుండనివాఁడు, గాలిలోన నుండి కదలు శవము**
**కమలనాభుపదముఁ గనని వాని బ్రతుకు, పసిఁడికాయలోని ప్రాణి బ్రతుకు. 51**

**ప్రతి :** నారాయణుని= శ్రీహరియొక్క; దివ్యనామ+అక్షరములపైన్= దివ్యమైన పేళ్లలోని అక్షరాలమీద; కరఁగని= ద్రవించని; మనములు= మనస్సులు; కఠినశిలలు= కరకు బండలు; మురవైరి కథలకున్= మురాసురుని శత్రువగు శ్రీహరికి సంబంధించిన కథలకు; ముదిత+అశ్రు= ఆనందబాష్పాలు; రోమాంచ= పులకింతలచే; మిళితము+ఐ= కూడినదై; ఉండనిమేను= ఉండనట్టి శరీరం; మొద్దు= కొమ్మలు నరికిన చెట్టు; చక్రికిన్= చక్రధారియగు హరికి; మ్రొక్కని= నమస్కరింపని; జడుని= మూఢునియొక్క; ఔదలన్= శిరసుపై, ఉన్న; కనక కిరీటంబు= స్వర్ణ మకుటం; కట్టెమోపు= కట్టెలమోపు; మాధవ+అర్పితముగాన్= శ్రీహరికి సమర్పింపబడిన విధంగా; మనని= జీవింపని; మానవు సిరి= మనుజుని సంపద; వన దుర్గ= చొరరాని అడవిలోని; చంద్రికావైభవంబు= వెన్నెలయొక్క విభవం; కైటభ+అరిభజన=కైటభుడనే రక్కసునికి శత్రువైన విష్ణువుయొక్కసేవ; కలిగి+ఉండనివాఁడు= లేనివాడు; గాలిలోననుండి= వాయువు లోపలనుండి; కదలు= చలించే; శవము= పీనుగు; కమలనాభుపదమున్= పద్మనాభుని పాదాన్ని; కననివాని= చూడలేనివాని; బ్రతుకు= జీవితం; పసిఁడి కాయలోని= పొత్తినూలి కాయయందలి; ప్రాణి బ్రతుకు= జీవియొక్క (సాలెపురుగుయొక్క) జీవితం.

**తా :** శ్రీమన్నారాయణుని యొక్క పవిత్రనామాక్షరస్మరణతో ద్రవించనివి మనస్సులు కావు, అవి కరకుబండలు. పద్మనాభుని కథలకు ఆనందబాష్పాలు రాలగా పొంగి పులకించనిది శరీరం కాదు, అది కదలని మెదలని వట్టి మొద్దు. పరమాత్మునికి ప్రణమిల్లని మూఢుని తలమీదిది బంగారు కిరీటం కిరీటం కాదు, అది కట్టెలమోపు. భగవంతునికి అర్పితం కాని మానవుని ఐశ్వర్యం ఐశ్వర్యం కాదు, అది అడవిగాసిన వెన్నెల. వాసుదేవుని సేవింపనివాడు. ప్రాణవాయువు లోపల ఉండి కదిలే పీనుగు. పద్మనాభుని పాదాల నాశ్రయింపనివాని జీవితం పొత్తినూలికాయలోని సాలెపురుగు జీవితం.

**వ. అని యిట్లు వలికిన వైయాసి వచనంబుల కౌత్తరేయుండు కందళితహృదయుండై నిర్మలమతి విశేషంబున. 52**

**ప్రతి :** అని యిట్లు పలికిన= అని ఈ రీతిగా వచించిన; వైయాసి వచనంబులకున్= వ్యాసుని కుమారుడగు శుకుని మాటలకు; ఔత్తరేయుండు= ఉత్తరాసుతుడైన పరీక్షిత్తు; కందళిత హృదయుండు+ఐ= వికసించిన చిత్తం కలవాడై; నిర్మల మతి విశేషంబునన్= స్వచ్ఛమైన బుద్ధి విశేషంతో...

**తా :** ఈ రీతిగా పలికిన శుకయోగి పలుకులకు పరీక్షిత్తు చిత్తం వికసించింది. అతడు నిర్మలమైన బుద్ధి విశేషం కలవాడై.

**విశే :** వ్యాసుని కుమారుడు వైయాసి. తద్ధితాంతరూపం.

**ఆ. సుతుల హితుల విడిచి, చుట్టాల విడిచి యి, ల్లాలి విడిచి, బహుబలాళి విడిచి**
**రాజు హృదయ మిడియె రాజీవనయనుపై, ధనము విడిచి, జడ్డుఁదనము విడిచి. 53**

**ప్రతి :** సుతులన్= పుత్రులను; హితులన్= హితం చెప్పువారిని; విడిచి= వదలి; చుట్టాలన్= బంధువులను; విడిచి= వదలి; ఇల్లాలిన్= ధర్మపత్నిని; విడిచి= వీడి; బహుబల+ఆళిన్= పెద్ద పరిజనాన్నీ; విడిచి= విడనాడి; ధనమున్ విడిచి= సంపదను వదలి; జడ్డుఁదనమున్= జడత్వమును; విడిచి= త్యజించి; రాజు= పరీక్షిత్తు; రాజీవనయనుపైన్= పద్మనేత్రుడైన శ్రీహరిమీద; హృదయము+ఇడియెన్= చిత్తం నిలిపాడు.

**తా :** ఆ రాజు బిడ్డలనూ, హితులనూ, బంధువులనూ, భార్యనూ, ఇతర పరిజనాన్ని, ధనాన్నీ, జడత్వాన్నీ వదలిపెట్టినాడు. కమలనేత్రుడైన మాధవునిపై చిత్తం నిలిపాడు.

**వ. ఇట్లు మృత్యుభయంబు నిరసించి ధర్మార్థకామంబులు సన్న్యసించి పురుషోత్తమునందుఁ జిత్తంబు విన్యసించి హరిలీలాలక్షణంబు లుపన్యసింపు మను తలంపున నరేంద్రుం డిట్లనియె. 54**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మృత్యుభయంబున్= మరణిస్తానన్న భీతిని; నిరసించి= నిరాకరించి; ధర్మ+అర్థకామంబులు= ధర్మం, అర్థం, కామం – అనే త్రివర్గాన్ని; సన్న్యసించి= పరిత్యజించి; పురుష+ఉత్తమునందున్= పరమపురుషుడైన శ్రీహరియందు; చిత్తంబున్= మనస్సును; విన్యసించి= నిలిపి; హరిలీలాలక్షణంబులు= భగవంతుని లీలలకు చెందిన లక్షణాలను; ఉపన్యసింపుము= చెప్పుము; అను తలంపునన్= అన్న భావంతో; నర+ఇంద్రుండు= రాజు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ రీతిగా మరణభయాన్ని విడనాడి, ధర్మార్థకామాలనే త్రివర్గాన్ని తిరస్కరించి, పరమ పురుషునియందే మనస్సును కేంద్రీకరించి శ్రీహరి లీలావిశేషాలను శుకుడు వర్ణిస్తుండగా వినాలనే తలంపుతో పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

**క. సర్వాత్ము వాసుదేవుని, సర్వజ్ఞుఁడ వైన నీవు సంస్తుతి సేయన్**
**సర్వభ్రాంతులు వదలె మ, హోర్వీసురవర్య! మానసోత్సవ మగుచున్. 55**

**ప్రతి :** మహా+ఉర్వీసురవర్య= ఓ గొప్ప భూసుర శ్రేష్ఠుడా; సర్వజ్ఞుఁడవు+ఐన నీవు= సర్వమూ తెలిసిన నీవు; సర్వ+ఆత్మున్= అంతటికీ ఆత్మ అయిన; వాసుదేవునిన్= వసుదేవుని కుమారుడైన భగవంతుణ్ణి; సంస్తుతి సేయన్= కీర్తించగా; మానస+ఉత్సవము+అగుచున్= మనసుకు సంతోషదాయకమవుతూ; సర్వభ్రాంతులు= భ్రమలన్నీ; వదలెన్= తొలగాయి.

**తా :** విప్రోత్తమా! సర్వమూ తెలిసిన నీవు సర్వానికీ ఆత్మ అయిన వాసుదేవుణ్ణి కీర్తించేసరికి నాకుగల భ్రాంతులన్నీ తొలగిపోయాయి. నా మనస్సు సంతోష పరవశమయింది.

**సీ. ఈశుండు హరి విష్ణుఁ డీ విశ్వ మే రీతిఁ బుట్టించుఁ రక్షించుఁ బొలియఁజూచు**
**బహుశక్తియుతుఁడగు భగవంతుఁ డవ్యయుఁ డాది నే శక్తుల నాశ్రయించి**
**బ్రహ్మశక్రాదిరూపముల వినోదించెఁ గ్రమముననో యేకకాలముననొ**
**ప్రకృతిగుణంబులఁబట్టి గ్రహించుట నేకత్వమున నుండు నీశ్వరుండు**

**ఆ. భిన్నమూర్తి యగుచుఁ బెక్కువిధంబుల, నేల యుండు? నతని కేమి వచ్చె**
**నుండకున్నఁ? దాపసోత్తమ! తెలుపవే!, వేడ్క నాకు సర్వవేది వీవు! 56**

**ప్రతి :** తాపస+ఉత్తమ= మునిశ్రేష్ఠా!; ఈశుండు= సర్వానికీ ప్రభువూ; హరి= శ్రీహరి; విష్ణుఁడు= సర్వవ్యాపకుడూ అయిన భగవానుడు; ఈ విశ్వమున్= ఈ ప్రపంచాన్ని; ఏ రీతిన్ పుట్టించున్= ఏ విధంగా సృష్టిస్తాడు; రక్షించున్= కాపాడుతాడు; పొలియన్+చూచున్= సంహరిస్తాడు; బహుశక్తియుతుఁడు+అగు= అనేకశక్తులతో గూడినవాడును; భగవంతుఁడు= షడ్గుణైశ్వర్య సంపన్నుడును; అవ్యయుఁడు= తరుగులేనివాడగు ఆ పరమాత్ముడు; ఆదిన్= మొదట; ఏ శక్తులన్= ఎట్టి శక్తులను; ఆశ్రయించి= ఆశ్రయంగా చేసుకొని; బ్రహ్మశక్ర+ఆదిరూపములన్= బ్రహ్మ ఇంద్రుడు మున్నగు రూపాలతో; వినోదించెన్= క్రీడించాడు; ప్రకృతి గుణంబులన్= ప్రకృతికి సంబంధించిన సత్త్వరజస్తమోగుణాలను; పట్టి గ్రహించుట= పరిగ్రహించడం; క్రమముననో= క్రమంగా సంభవించిందా?; ఏకకాలముననొ= ఒకే సమయంలో జరిగిందా?; ఏకత్వమునన్= ఒకే ఒకడుగా; ఉండు+ఈశ్వరుండు= ఉండే భగవంతుడు; భిన్నమూర్తి+అగుచున్= వేరువేరు మూర్తులుగలవాడవుతూ; పెక్కువిధంబులన్= పలువిధాలుగా; ఏల+ఉండున్= ఎందుకుంటాడు? ఉండక+ఉన్నన్= ఆ విధంగా ఉండకుంటే; అతనికిన్= ఆ దేవునికి; ఏమి వచ్చెన్= ఏమవుతుంది?; ఈవు= నీవు; సర్వవేదివి= అంతా తెలిసినవాడవు; వేడ్కన్= వేడుకతో; నాకున్ తెలుపవు+ఏ= నాకు ఎరిగించు.

**తా :** మునివర్యా! సర్వేశ్వరుడూ, సర్వవ్యాపీ అయిన శ్రీహరి ఈ జగత్తును ఏ రీతిగా సృష్టిస్తూ, రక్షిస్తూ, సంహరిస్తున్నాడు? అవ్యయుడైన ఆ దేవుడు అనేక శక్తులు కలిగినవాడు. అతడు మొదట ఏ శక్తుల సాయంతో బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన రూపాలు దాల్చి వినోదించాడు? ఆయన సత్త్వరజస్తమస్సులనే ప్రకృతికి సంబంధించిన గుణాలను, పరిగ్రహించడం క్రమంగా జరుగుతుందా? లేక ఒకే సమయంలో జరుగుతుందా? ఏకమూర్తి అయిన ఈశ్వరుడు అనేక మూర్తులు ధరించి ఎందుకలా అనేక విధాల ప్రవర్తిస్తాడు? అలా ప్రవర్తించకపోతే ఆయనకు వచ్చే నష్టమేమి? నీవు అంతా తెలిసిన మహానుభావుడవు. నా కీవిషయాలు తెలియ జెప్పు.

**వ. అనిన న య్యుత్తరానందను వచనంబులకు నిరుత్తరుండు గాక సదుత్తరప్రదాన కుతూహలుండై లోకోత్తరగుణోత్తరుండైన తాపసోత్తముండు దన చిత్తంబున. 57**

**ప్రతి :** అనినన్= అని పరీక్షిత్తు ప్రశ్నించగా; ఆ+ఉత్తరానందను వచనంబులకున్= ఆ ఉత్తరయొక్క కుమారుడైన పరీక్షిత్తు మాటలకు; నిర్+ఉత్తరుండు కాక= సమాధానమీయకుండా ఉండలేక; సత్+ఉత్తర ప్రదానకుతూహలుండు+ఐ= మంచి సమాధానం ఇవ్వాలన్న ఉత్సాహం కలవాడై; లోక+ఉత్తరగుణ+ఉత్తరుండు+ఐన= శ్రేష్ఠమైన గుణాలచే మహితుడైన; తాపస+ఉత్తముండు= మునివర్యుడగు శుకుడు; తన చిత్తంబునన్= తన మనస్సులో...

**తా :** పరీక్షిన్మహారాజు ఆ విధంగా అడిగే సరికి మౌనం వహించకుండా తగిన సమాధానం చెప్పాలన్న కుతూహలంతో ఉత్తమగుణ సంపన్నుడైన శుకుడు తన మనస్సులో ఇలా భగవంతుణ్ణి ప్రార్థించాడు.

**మ. పరుఁడై, యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థాన సం**
**హరణక్రీడనుఁడై, త్రిశక్తియుతుఁడై, యంతర్గతజ్యోతియై,**
**పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు దు**
**స్తరమార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్. 58**

**ప్రతి :** పరుఁడు+ఐ= ప్రకృతికంటె జీవునికంటె భిన్నుడై (శ్రేష్ఠుడై); ఈశ్వరుఁడు+ఐ= సర్వానికి ప్రభువై; మహామహిముఁడు+ఐ= గొప్ప ప్రభావం కలవాడై; ప్రాదుర్భవ+స్థాన+సంహరణక్రీడనుఁడు+ఐ= సృష్టిస్థితి సంహారాలనే

క్రీడలు గలవాడై; త్రిశక్తియుతుండు+ఐ= త్రిమూర్తుల శక్తులు గలవాడై; అంతర్గతజ్యోతి+ఐ= లోననుండే వెలుగై; పరమేష్ఠి= బ్రహ్మ; ప్రముఖ= మున్నగు; అమర+అధిపులకున్= దేవాధిపతులకు; ప్రాపింపన్‌రాక+ఉండు= పొందుటకు వీలుగాకున్నట్టి; దుస్తరమార్గంబునన్= తరింపరాని త్రోవలో; తేజరిల్లు= ప్రకాశించునట్టి; హరికిన్= మహావిష్ణువునకు; తత్త్వ+అర్థిని+ఐ= పరతత్త్వంపై అభిలాషగలవాడనై; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** ప్రకృతికంటే, జీవునికంటె భిన్నుడై, (శ్రేష్ఠుడై), అంతటికీ అధిపతియై, గొప్ప మహిమలుగలవాడై, సృష్టిస్థితి సంహారాలనే క్రీడలు గావించువాడై, త్రిమూర్తుల శక్తులు గలవాడై, అందరికీ అంతరాత్మగా వెలుగొందుచున్నవాడై, బ్రహ్మ మున్నగు దేవాధిపులు అందుకోజాలని దుస్తరపథంలో ప్రకాశించేవాడైన శ్రీహరికి నేను తత్త్వప్రాప్తి మీద అభిలాషగలిగి ప్రణమిల్లుతున్నాను.

**వ. మఱియు సజ్జనదురిత సంహారకుండును, దుర్జననివారకుండును, సర్వరూపకుండును, బరమహంసాశ్రమ ప్రవర్తమాన మునిజన హృదయ కమల కర్ణికా మధ్య ప్రదీపకుండును, సాత్వత శ్రేష్ఠుండును, నిఖిల కల్యాణ గుణ గరిష్ఠుండును, బరమ భక్తియుక్త సులభుండును, భక్తిహీనజన దుర్లభుండును, నిరతిశయ నిరుపమ నిరవధిక ప్రకారుండును, నిజస్వరూప బ్రహ్మవిహారుండును నైన య ప్పరమేశ్వరునకు నమస్కరించెద. 59**

**ప్రతి :** మఱియున్= ఇంకను; సత్+జన దురిత సంహారకుండును= సత్పురుషులయొక్క పాపాలను సంహరించేవాడూ; దుర్జన నివారకుండును= దుర్జనులను నివారించువాడూ; సర్వరూపకుండును= అన్నిరూపాలు గలవాడూ; పరమహంస+ఆశ్రమ= అత్యంత విరక్తాశ్రమంలో; ప్రవర్తమాన= ప్రవర్తించువారైన; మునిజన= తాపసజనులయొక్క; హృదయకమల= చిత్త పద్మంయొక్క; కర్ణికామధ్య= దుద్దుయొక్క నడిమి భాగాన్ని; ప్రదీపకుండును= ప్రకాశింపజేసేవాడూ; సాత్వతశ్రేష్ఠుండును= భాగవతులలో మిక్కిలి గొప్పవాడును; నిఖిల= సమస్తమైన; కల్యాణగుణ= మంగళకర గుణాలచే; గరిష్ఠుండునూ= గొప్పవాడైనవాడునూ; పరమభక్తియుక్తసులభుండును= శ్రేష్ఠమైన భక్తి గలవారికి సులభుడైనవాడునూ; భక్తిహీనజన దుర్లభుండును= భక్తిలేని జనులకు లభించనివాడును; నిరతిశయ= తనకంటె అతిశయంలేని; నిరుపమ= సాటిలేని; నిరవధిక= హద్దులులేని; ప్రకారుండును= ప్రవృత్తి గలవాడును; నిజస్వరూప బ్రహ్మవిహారుండును= తన స్వరూపమైన బ్రహ్మంలో విహరించేవాడునూ; ఐన ఆ+పరమ+ఈశ్వరునకున్= అయినట్టి ఆ పరమేశ్వరునికి; నమస్కరించెదన్= ప్రణమిల్లుతున్నాను.

**తా :** సజ్జనుల పాపాలను పరిహరించేవాడూ, దుర్జన శిక్షకుడూ, అన్ని రూపాలూ తన రూపమే అయినవాడూ, పరమహంసాశ్రమంలో ఉండే మునుల హృదయపద్మం మధ్య వెలుగొందేవాడూ, యదుకుల తిలకుడూ, సకల కల్యాణ గుణశోభితుడూ, ఉత్తమభక్తులకు సులభమైనవాడూ, భక్తిలేనివారికి దుర్లభుడూ, అత్యుత్తమమూ, అనుపమమూ, అనంతమూ అయిన ప్రవర్తన గలవాడూ, స్వస్వరూపమయిన బ్రహ్మంలో విహరించేవాడూ అయిన ఆ పరమేశ్వరునికి ప్రణమిల్లుతున్నాను.

**విశే :** సాత్వతులు అంటే ఒకవిధమైన భాగవతులు. ఆ సంప్రదాయానికి బలరాముడు ప్రవర్తకుడు.

**ఉ. ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం**
**బే విభులీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ దో**

**షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునంద్రు నే**
**నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్. 60**

**ప్రతి :** ఏ విభు= ఏ ప్రభువుయొక్క; వందన+అర్చనములు= నమస్కారాలు, పూజలు; ఏ విభు చింతయున్= ఏ ప్రభుని ధ్యానం; నామకీర్తనంబు= నామోచ్చారణ; ఏ విభులీలలు= ఏప్రభుని విలాసాలు; అద్భుతములు= ఆశ్చర్యమైనవి; ఎప్పుడున్= ఎల్లవేళలా; సంశ్రవణంబు+చేయన్= చక్కగా వినగా; దోష+ఆవలిన్+పాసి= పాపసమూహం వీడి; లోకము= జగత్తు; శుభ+ఆయతవృత్తిన్= మంగళంతో విస్తృతమైన వర్తనం; చెలంగును+అంద్రు= ప్రకాశిస్తుందని చెబుతారో; అట్టి అఘ+ ఓఘనివర్తనున్= అటువంటి పాపరాశిని తొలగించువాడూ; భద్రకీర్తనున్= మంగళకరమైన కీర్తనంగలవాడు; ఆ విభున్= ఆ ప్రభువైన పరమేశ్వరుని; ఆశ్రయించెదన్= ఆశ్రయిస్తాను, కనిపెట్టుకొని ఉంటాను.

**తా :** ఏ పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి చేసే ప్రణామం, పూజ, ధ్యానం, నామసంకీర్తనం అమోఘమైనవో, ఏ ప్రభుని లీలలు వింటే దోషాలన్నీ తొలగి లోకం మంగళాయతనమవుతుందని పెద్దలు చెబుతున్నారో, అట్టి పాపరాశిపరిహారకుడూ, భద్రమయ కీర్తనుడూ అయిన భగవంతుణ్ణి ఆశ్రయిస్తున్నాను.

**ఉ. ఏ పరమేశు పాదయుగ మెప్పుడు గోరి భజించి నేర్పరుల్**
**లోపలి బుద్ధితో నుభయలోకములందుల జడ్డుఁబాసి, యే**
**తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు: రే**
**నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్. 61**

**ప్రతి :** నేర్పరుల్= నిపుణులైనవారు; ఎప్పుడున్= ఎల్లవేళలా; ఏ పరమేశు= ఏ పరమాత్మయొక్క; పాదయుగమున్= చరణ ద్వయాన్ని; కోరి భజించి= అక్కరతో సేవించి; లోపలి= అంతర్ముఖమైన; బుద్ధితోన్= నిశ్చయాత్మకమైన చిత్తంతో; ఉభయలోకములందులన్= ఇహపరలోకాలలోని; జడ్డున్= జాడ్యాన్ని; పాసి= పోగొట్టుకొని; ఏ తాపము లేక= ఏ విధమైన సంతాపమూలేకుండా; తారు= తాము; బ్రహ్మగతిన్= బ్రహ్మాన్ని చేరే త్రోవలో; గతశ్రములు+ఐ= శ్రమలేనివారై; చరింతురు= సంచరిస్తారో; అఘ+ఓఘనివర్తనున్= పాపరాశి నివారకుడూ; భద్రకీర్తనున్= మంగళకరమైన కీర్తనంగలవాడు, అగు; ఆ పరమేశున్= ఆ దేవుణ్ణి ఉద్దేశించి; ఏను= నేను; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** ఏ పరమాత్ముని చరణయుగళిని ఎల్లకాలాల్లోనూ కోరి సేవించి నిపుణులైనవారు అంతర్ముఖమైన బుద్ధితో ఇహపరలోకాలకు చెందిన జాడ్యం వదలుకొని ఏ విధమైన తాపం లేనివారై పరబ్రహ్మను పొందుటకుపాయమైన మార్గంలో శ్రమలేకుండా చరిస్తారో, అట్టి పాపసంఘవినాశకుడూ, మంగళప్రదకీర్తనుడూ అయిన పరమేశ్వరునికి నేను ప్రణామం చేస్తున్నాను.

**చ. తపములఁ జేసియైన, మఱి దానము లెన్నియుఁ జేసియైన, నే**
**జపములఁ జేసియైన, ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే**
**యపదములై దురంత విపదంచితరీతిగ నొప్పుచుండు న**
**య్యపరమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్. 62**

**ప్రతి :** తపములన్= తపస్సులను; చేసి+ఐనన్= ఆచరించి అయినా; మఱి= ఇంకా; దానములు+ఎన్నియున్= ఎన్నో దానాలు; చేసి+ఐనన్= నిర్వర్తించి అయినా; ఏ జపములన్= ఎట్టి జపాలను; చేసి+ఐనన్= నిర్వహించి అయినా;

ఫలసంచయము= ఆ తపోదానాదులవల్ల కలిగే ఫలరాశిని; ఎవ్వనిన్+చేర్పకున్నన్= ఏ దేవునికి సమర్పింపనిచో; హేయపదములు+ఐ= ఆ తపోదానాదులు నింద్యాలై; దురంత విపత్+అంచితరీతిగన్= అంతంలేని ఆపదలతో కూడిన విధంగా; ఒప్పుచుండున్= వెలయునో; అఘ+ఓఘనివర్తనున్= పాపసంచయ వినాశకుడూ; భద్రకీర్తనున్= మంగళమయ కీర్తనుడు అయిన; ఆ+అపరిమితున్= ఆ పరిమితిలేని పరమాత్మను; భజించెదన్= సేవిస్తాను.

**తా :** ఎన్ని తపస్సులు చేసినా, ఎన్ని దానాలాచరించినా, ఎన్ని జపాలు నిర్వహించినా వాటివల్ల కలిగే ఫలాలను ఏ పరమేశ్వరుడికి సమర్పించకుంటే అవన్నీ నిందాస్పదాలై ఆపదలతో గూడినట్లు పరిణమించునో, అట్టి పాపనివారకుడూ, మంగళకీర్తనుడూ, పరిమితి లేనివాడూ అయిన పరమేశ్వరుణ్ణి సేవిస్తాను.

**విశే :** అపరిమితున్ – ఏ కొలతలకూ అందనివాడు – అప్రమేయుడు.

**మ. యవన వ్యాధ పుళింద హూణ శక కంకాభీర చండాల సం**
**భవులుం దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి భా**
**గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులై కల్యాణులై యుందు రా**
**యవికారుం బ్రభవిష్ణు నాదు మదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్. 63**

**ప్రతి :** యవన= యవనులు; వ్యాధ= బోయజాతివారు; పుళింద= పుళిందులు; హూణ= హూణులు; శక= శకులు; కంక= కంకులు; ఆభీర= ఆభీరులు; చండాల= చండాలురు అనే ఈ జాతులలో; సంభవులున్= పుట్టినవారు; తక్కిన= మిగిలిన; పాపవర్తనులున్= పాపప్రవృత్తి గలవారున్నూ; ఏ భద్ర+ఆత్మున్= మంగళకరుడైన ఏ దేవుని; సేవించి= భజించి; భాగవతశ్రేష్ఠులన్= భగవద్భక్తులలో శ్రేష్ఠులైనవారిని; డాసి= ఆశ్రయించి; శుద్ధతనులు+ఐ= నిర్మలమైన శరీరాలు కలవారై; కల్యాణులు+ఐ= మంగళమయులై; ఉందురు= ఉంటారో; ఆ అవికారున్= ఆ వికారంలేనివానిని; ప్రభవిష్ణున్= అన్ని విధాలా సమర్థుడైనవాడగు విష్ణుదేవుని; నాదు మదిలోన్= నా చిత్తంలో; అశ్రాంతమున్= ఎల్లవేళలా; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** యవనులు, కిరాతులు, పుళిందులు, హూణులు, శకులు, కంకులు, ఆభీరులు, చండాలురు అనే వారికి చెందిన జాతులలో జనించినవారునూ, మిగిలిన పాపశీలురునూ ఏ పరమ పావనుడైన భగవానుని సేవించి, ఉత్తములైన భాగవతులను ఆశ్రయించి శుద్ధశరీరులై, మంగళాకారులై ఉంటారో అట్టి వికారరహితుడూ, సర్వసమర్థుడూ అయిన పరమాత్మకు సదా నమస్కరిస్తాను.

**మ. తపముల్ సేసిననో, మనోనియతినో, దానవ్రతావృత్తినో**
**జపమంత్రంబులనో, శ్రుతిస్మృతులనో, సద్భక్తినో యెట్లు ల**
**బ్ధపదుండౌనని బ్రహ్మరుద్రముఖరుల్, భావింతు రెవ్వాని న**
**య్యపవర్గాధిపుఁ దాత్మమూర్తి సులభుండౌఁగాక నా కెప్పుడున్. 64**

**ప్రతి :** తపముల్= తపస్సులు; చేసిననో= చేసియో; మనోనియతినో= చిత్త నిగ్రహంతోనో; దానవ్రత+ఆవృత్తినో= మరల మరల దానాలు చేయటంచేతనో; జపమంత్రంబులనో= జపాలూ, మంత్రాలతోనో; శ్రుతిస్మృతులనో= వేదాలూ,

స్మృతులతోనో; సద్భక్తినో= మంచి భక్తితోనో?; ఎట్లు= ఏ విధంగా; లబ్ధపదుండు+ఔనని= చరణాలు పొందగలడో అని; బ్రహ్మరుద్రముఖరుల్= విధాత, శివుడు మున్నగువారు; ఏ+వానిన్= ఏ దేవుణ్ణి; భావింతురు= భావిస్తారో; ఆ+అపవర్గాధిపుఁడు= ఆ మోక్షాధిపతి; ఆత్మమూర్తి= ఆత్మస్వరూపుడగు విష్ణుడు; ఎప్పుడున్= ఎల్లవేళలా; నాకున్= నాకు; సులభుండు+ ఔఁగాక!= శ్రమ లేకుండా లభించువాడగుగాక!

**తా :** తపస్సులతోనో, చిత్తనిగ్రహంతోనో, నానా దానాలతోనో, వ్రతాలతోనో, జపాలతోనో, మంత్రాలతోనో, శ్రుతిస్మృతుల అధ్యయనంవల్లనో, లేక ఉత్తమ భక్తితోనో, ఇలా దేనివల్ల ఆయన దివ్యచరణాలు లభిస్తాయి? అని బ్రహ్మరుద్రాదులు ఏ పరమాత్మణ్ణి భావిస్తుంటారో ఆ మోక్షవిభుడూ, ఆత్మస్వరూపుడూ నాకు సదా సులభుడవుగాక!

**విశే :** 'లబ్ధపదుండు' అనే పదానికి 'భగవచ్చరణములు పొందినవా' డనే అర్థమే కాక 'దివ్యస్థానం (వైకుంఠం) పొందినవాడు' అన్న అర్థం కూడా చెప్పవచ్చు.

**క. శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర, జాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియున్**
**భూపతియు యాదవశ్రే, ణీ పతియున్ గతియునైన నిపుణు భజింతున్. 65**

**ప్రతి :** శ్రీపతియున్= లక్ష్మీవిభుడూ; యజ్ఞపతియున్= యజ్ఞానికి ప్రభువూ; ప్రజాపతియున్= ప్రజలకు భర్తా; బుద్ధిపతియున్= బుద్ధికి నాథుడూ; జగత్+అధిపతియున్= లోకానికి ప్రభుడూ; భూపతియున్= భూమికి భర్తా; యాదవశ్రేణీపతియున్= యాదవ వర్గానికి విభుడూ; గతియున్+ఐన= అందరకూ చేరుకోనయినవాడూ అయిన; నిపుణున్= నేర్పరియైన భగవానుణ్ణి; భజింతున్= సేవిస్తాను.

**తా :** లక్ష్మీదేవికీ, యజ్ఞానికీ, ప్రజలకూ, బుద్ధికీ, జగత్తుకూ, భూమికీ, యాదవకులానికీ పతీ గతీ అయిన భగవంతుణ్ణి నేను భజిస్తాను.

**మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో, యచ్ఛిన్నుఁడో, ఛిన్నుఁడో,**
**గుణియో, నిర్గుణుఁడో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వ మా**
**ర్గణులై యే విభు పాదపద్మభజనోత్కర్షంబులం దత్త్వవీ**
**క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్. 66**

**ప్రతి :** అణువో= అణుస్వరూపుడో; కాక= అలా కాక; కడున్= మిక్కిలి; మహావిభవుఁడో= అంతటా వ్యాపించిన మహాస్వరూపుడో; అచ్ఛిన్నుఁడో= దిక్కాలాదులచే అపరిచ్ఛిన్నుడో; లేక ఛిన్నుఁడో= పరిచ్ఛిన్నుడో; గుణియో= గుణాలుగలవాడో; (లేక) నిర్గుణుఁడో= గుణాలు లేనివాడో; అటంచున్= అంటూ; విబుధుల్= పండితులు; కుంఠీభవత్+తత్త్వమార్గణులు+ఐ= వ్యర్థమగుచున్న తత్త్వాన్వేషణగలవారై; ఏ విభు= ఏ ప్రభునియొక్క; పాదపద్మభజన+ఉత్కర్షంబులన్= చరణకమల సేవయొక్క అతిశయంచే; తత్త్వవీక్షణమున్= తత్త్వంయొక్క దర్శించుటను; చేసెదరు= కావింతురో; అట్టి పరమున్= అటువంటి పరాత్పరుని; సర్వ+ఆత్మున్= అన్నిటికీ ఆత్మఅయిన వానిని; విష్ణున్= సర్వవ్యాపకుడైన శ్రీహరిని; సేవించెదన్= భజిస్తాను.

**తా :** ఆ దేవుడు అణుస్వరూపుడా? లేక విభుస్వరూపుడా? దిక్కాలాదులచే పరిచ్ఛిన్నుడా? లేక అపరిచ్ఛిన్నుడా? సగుణుడా? నిర్గుణుడా అంటూ పండితులు తమ తత్త్వాన్వేషణ ప్రయత్నం విఫలం కాగా, ఏ దేవుని చరణకమలసేవా పరాయణులై తత్త్వాన్ని దర్శిస్తున్నారో అట్టి సర్వోత్కృష్టుడూ, విశ్వాత్ముడూ అయిన విష్ణుదేవుని నేను భజిస్తాను.

**మ. జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిన్ సంధింప నూహించి యే**
**భగవంతుండు సరస్వతిం బనుప నా పద్మాస్య దా నవ్విభున్**
**మగనింగా నియమించి తద్భువనసామ్రాజ్యస్థితిన్ సృష్టి పా**
**రగుఁ జేసెన్ మును బ్రహ్మ: నట్టి గుణి నారంభింతు సేవింపఁగన్. 67**

**ప్రతి :** ఏ భగవంతుండు= ఏ దేవుడు; బ్రహ్మకున్= విధాతకు; మదిన్= చిత్తంలో; జగదుత్పాదనబుద్ధిన్= లోకాలను సృష్టించాలన్న బుద్ధిని; సంధింపన్= కల్గించుటకు; ఊహించి= తలచి; సరస్వతిన్= వాణీదేవిని; పనుపన్= పంపగా; ఆ పద్మ+ఆస్య= ఆ కమలవదన; తాను, ఆ+విభున్= ఆ ప్రభువైన బ్రహ్మను; మగనిగాన్= భర్తగా; నియమించి= ఏర్పరచి; మును= పూర్వం; బ్రహ్మను= విధాతను; తద్భువన సామ్రాజ్యస్థితిన్= ఆ లోకాలయొక్క సామ్రాజ్యస్థానంలో; సృష్టి పారగున్ చేసెన్= సృష్టించడంలో నిపుణుణ్ణిగా చేసిందో; అట్టి= అటువంటి; గుణిన్= గుణవంతుడైన భగవంతుణ్ణి; సేవింపఁగన్= భజించడానికి; ఆరంభింతున్= ప్రారంభిస్తాను.

**తా :** బ్రహ్మకు జగన్నిర్మాణం చేయాలన్న బుద్ధి పుట్టించాలని ఏ భగవానుడు పూర్వం సరస్వతిని పంపగా ఆమె బ్రహ్మను తనకు భర్తగా స్వీకరించి లోకసామ్రాజ్యంలో ఆయనను సృష్టి నిపుణుణ్ణిగా చేసిందో, అట్టి సగుణుడైన భగవంతుణ్ణి సేవించుట కుపక్రమిస్తాను.

**సీ. పూర్ణుఁడయ్యును మహాభూత పంచకయోగ, మున మేనులను పురములు సృజించి**
**పురములలో నుండి పురుషభావంబున, దీపించు నెవ్వడు ధీరవృత్తిఁ**
**బంచభూతములను పదునొకం డింద్రియ, ములఁ బ్రకాశింపించి భూరిమహిమ**
**షోడశాత్మకుఁ డన శోభిల్లి జీవత్వ, నృత్తవినోదంబు నెఱపుచుండు**

**తే. నట్టి భగవంతుఁ డవ్యయుం డచ్యుతుండు, మానసోదిత వాక్పుష్పమాలికలను**
**మంజు నవరస మకరంద మహిమ లుట్ట, శిష్టహృద్భావలీలలఁ జేయుఁగాత! 68**

**ప్రతి :** ఎవ్వఁడు= ఏ భగవంతుడు; పూర్ణుఁడు+అయ్యునున్= అంతటా నిండిన స్వరూపుడై కూడా; మహాభూత పంచక యోగమునన్= పంచమహాభూతాల (పృథివ్యప్తేజో వాయ్వాకాశాల) సమ్మేళనంతో; మేనులు+అను= శరీరాలు అనే; పురములు= నగరాలు; సృజించి= నిర్మించి; పురములలోనుండి= ఆ నగరాలలో నుండి; ధీరవృత్తిన్= ధైర్యంతో; పురుషభావంబునన్= పురుషుడన్నపేరుతో; దీపించున్= ప్రకాశించునో; పంచభూతములను= ఐదుభూతాలను; పదునొకండు+ఇంద్రియములన్= కర్మేంద్రియాలు ఐదు, జ్ఞానేంద్రియాలు ఐదు, మనస్సు అనే పదునొకండు ఇంద్రియాలను; భూరిమహిమన్= గొప్పప్రభావంతో; ప్రకాశింపించి= ప్రకాశింపజేసి; షోడశాత్మకుఁడు+అనన్= పదునారు కళలుగలవాడనగా; శోభిల్లి= వెలుగొంది; జీవత్వ= జీవభావమనెడు; నృత్త వినోదంబున్= నృత్తవిలాసం; నెఱపుచుండున్= ప్రదర్శిస్తూంటాడో; అట్టి భగవంతుఁడు= అట్టి షడ్గుణైశ్వర్య సంపన్నుడగు దేవుడు; అవ్యయుండు= వ్యయం లేనివాడు; అచ్యుతుండు= చ్యుతి లేనివాడు; మానస= చిత్తమందు; ఉదిత= ఉదయించిన; వాక్పుష్ప= వాక్కులనే పూలయొక్క; మాలికలను= మాలలను; మంజు= మనోజ్ఞమైన; నవరస= తొమ్మిదిరసాలు అనే; మకరందమహిమలు= తేనెయొక్క ప్రభావాలు; ఉట్టన్= జాలువారగా; శిష్టహృద్భావలీలలన్= సజ్జనుల హృదయాలలోని భావవిలాసాలను; చేయున్+గాత!= కావించు గాక!

**తా :** తాను పరిపూర్ణుడై అంతటా వ్యాపించి ఉండికూడా పృథివ్యాదులగు ఐదు మహాభూతాలను కలిపి శరీరాలనే పురాలను నిర్మించి వాటిలో పురుషుడనే పేరుతో ఎవడు ధీరుడై ప్రకాశిస్తుంటాడో, పంచభూతాలనూ, పదునొకండు ఇంద్రియాలనూ, ప్రకాశించునట్లు చేసి మహామహిమతో షోడశకళాస్వరూపుడై వెలుగొందుతూ ఎవడు జీవత్వమనే నృత్తకళావిలాసం ప్రదర్శిస్తుంటాడో, అట్టి అవ్యయుడూ, అచ్యుతుడూ అయిన భగవంతుడు మనోజ్ఞమైన నవరసాలనే తేనెలు జాలువారగా నా మనస్సునుండి పుట్టిన వాక్కులనే పూలదండలతో సజ్జనుల హృదయసీమల నలరించుగాక!

**విశే : పంచభూతాలు**= పృథివి, అప్పు (నీరు), తేజస్సు, వాయువు, ఆకాశం. ఈ పద్యంలో పేర్కొనబడిన పంచభూతాలు పదునొకండు ఇంద్రియాలు మొత్తం పదునారింటిని కళలుగా గల పరమాత్మ షోడశాత్మకుడని చెప్పబడినాడు. ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, మనస్సు – కలిసి పదునొకండు ఇంద్రియాలు. 'ఇంద్రియాణి దశైకం చ' అని భగవద్గీత.

**పదునొకండింద్రియములు**= వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనేవి ఐదు కర్మేంద్రియాలు, శ్రోత్రం, చర్మం, చక్షువు, జిహ్వ, ఘ్రాణం–అనేవి ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు చేరి పదునొకండింద్రియాలు.

**నవరసాలు** : శృంగారం, హాస్యం, కరుణం, రౌద్రం, వీరం, భయానకం, బీభత్సం, అద్భుతం, శాంతం–అనేవి నవరసాలు. నర్తకులు నృత్తసమయంలో నవరసాలు ఒలికిస్తూ సామాజికుల హృదయాలను రంజింప జేస్తారన్న ప్రక్రియ ఇక్కడ నిర్దేశించబడింది.

**ఉ. మానధనుల్, మహాత్ములు, సమాధినిరూఢులు, యన్ముఖాంబుజ**
**ధ్యానమరందపానమున నాత్మభయంబులఁ బాసి ముక్తులై**
**లూనత నొంద: రట్టి మునిలోక శిఖామణికిన్ విశంకటా**
**జ్ఞానతమో నభోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్. 69**

**ప్రతి :** మానధనుల్= మానం ధనంగా గలవారు; మహాత్ములు= విశాలహృదయులైన మహనీయులు; సమాధి నిరూఢులు= సమాధి నిష్ఠగలవారూ అయినవారు; యత్+ముఖ+అంబుజ ధ్యానమరందపానమునన్= ఎవని ముఖపద్మాన్ని ధ్యానించడం అనే మకరందమును త్రాగుటచేత; ఆత్మన్= చిత్తంలో; భయంబులన్+పాసి= భయాలను వీడి; ముక్తులు+ఐ= మోక్షం పొందినవారై; లూనతన్+ఒందరు= భంగపాటు పొందరో; అట్టి= అటువంటి; మునిలోక శిఖామణికిన్= తాపసబృంద శిరోమణికి; విశంకట= విరివిగా వ్యాపించిన; అజ్ఞాన తమస్= అజ్ఞానమనే చీకటికి; నభోమణికిన్= సూర్యుడైనవానికి; సాధుజన+అగ్రణికిన్= సజ్జనులలో మొదటివాడగు వ్యాసునికి; ఏను= నేను; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** మానమే ధనంగా గలవారూ, మహితాత్ములూ, సమాధి నిపుణులూ అయినవారు ఏ మహనీయుని ముఖపద్మధ్యానమనే తేనె నాస్వాదిస్తూ, భయరహితులై భవబంధ విముక్తులై విరాజిల్లుతారో, అట్టి ముని జనాగ్రగణ్యుడూ, గాఢమైన అజ్ఞానమనే చీకటికి సూర్యుడూ, సజ్జనులలో ముఖ్యుడూ అయిన వేదవ్యాస భగవానునికి నేను నమస్కరిస్తాను.

**విశే :** ఇక్కడ 58వ పద్యంనుండి 69వ పద్యంవరకూ, పంద్రెండు గద్యపద్యాలలో హరివందనం, గురువందనం ఆచరించబడినది. 69వ పద్యం గురువందనపరం. ఏదైనా ఒక కార్యం ప్రారంభించేటప్పుడు భగవత్ప్రార్థన చేయడం సంప్రదాయం. 'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని చ ప్రథన్తే కావ్యాని'–అన్నట్లు కావ్యాలలో మొదట,

మధ్యలో, చివర విఘ్ననివారణంకొరకు భగవంతుణ్ణి వినుతించడం కద్దు. పరీక్షిత్తు కోరిక మేరకు భగవత్తత్త్వం వివరించడమనే మహాకార్యం నిర్వర్తించడానికి ఉపక్రమిస్తూ ఇక్కడ శుకయోగి భగవత్ప్రార్థన కావించాడని గ్రహించాలి. భగవత్తుల్యుడైన గురువునకు గూడ వందనం చేయడం సంప్రదాయం. తన భాగవత ప్రవచనం నిర్విఘ్నంగా కొనసాగడానికీ, ఫలప్రదం కావడానికీ ఈ హరి గురువందనం ఉపకరిస్తుంది.

**వ. అని యిట్లు హరి గురువందనంబు సేసి శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. 70**

**ప్రతి :** అని యిట్లు= అని ఈ రీతిగా; హరిగురువందనంబు= శ్రీహరికీ, గురువునకూ నమస్కారంచేసి; శుకయోగీంద్రుండు= యోగిశ్రేష్ఠుడైన శుకుడు; రాజేంద్రునకున్= రాజవర్యుడైన పరీక్షిన్మహారాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఇలా శ్రీహరికీ వ్యాసభగవానునికీ ప్రణామాలు సమర్పించి శుకయోగి పరీక్షిన్మహారాజుతో ఇలా అన్నాడు.

**మ. అవిరోధంబున నీవు నన్నడుగు నీ యర్థంబు మున్ బ్రహ్మ మా**
**ధవుచేతన్ విని నారదుం డడిగినం దథ్యంబుగాఁ జెప్పె; మా**
**నవలోకేశ్వర! నారదుండు వెనుకన్ నాకుం బ్రసాదించె; సం**
**శ్రవణీయంబు మహాద్భుతంబు వినుమా సందేహవిచ్ఛేదమున్. 71**

**ప్రతి :** మానవలోక+ఈశ్వర= మనుజలోకానికి ప్రభువైన ఓ రాజా; అవిరోధంబునన్= విరోధం లేకుండా; నీవు నన్ను+అడుగు= నన్ను నీవు ప్రశ్నించునట్టి; ఈ+అర్థంబు= ఈ విషయం; మున్= పూర్వం; బ్రహ్మ= పితామహుడు; మాధవుచేతన్ విని= శ్రీహరినుండి విని; నారదుండు+అడిగినన్= నారదముని ప్రశ్నించగా; తథ్యంబుగాన్= యథార్థంగా; చెప్పెన్= చెప్పినాడు; వెనుకన్= ఆ తరువాత; నారదుండు= నారదముని; నాకున్ ప్రసాదించెన్= నాకు తెలియజెప్పినాడు; సంశ్రవణీయంబు= చక్కగా వినదగినది; మహా+అద్భుతంబు= మిక్కిలి ఆశ్చర్యకరమైనది; సందేహ విచ్ఛేదమున్= సంశయం తొలగించేదీ అయిన ఆ విషయాన్నీ; వినుము+ఆ= వినవలసింది.

**తా :** మనుజేంద్రా! ఇప్పుడు నీవు నన్నడిగిన విషయాన్నే పూర్వం బ్రహ్మ నారాయణుని ద్వారా విన్నాడు. నారదుడు ప్రశ్నిస్తే దానినే ఆయన వివరించాడు. తదుపరి నారదుడు నాకది ఎరిగించాడు. వినదగినదీ, ఆశ్చర్యావహమైనదీ, సంశయం తొలగించేదీ అయిన ఆ విషయం నీకు చెబుతాను విను.

## ❖ నారదుండు బ్రహ్మను బ్రపంచ ప్రకారంబు నడుగుట ❖

**వ. నారదుండు బ్రహ్మ కిట్లనియె. 72**

**ప్రతి :** నారదుండు= నారదమహర్షి; బ్రహ్మకున్= విధాతకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** నారదముని బ్రహ్మను ఇలా ప్రశ్నించాడు.

**మ. చతురాస్యుండవు; వేల్పుపెద్దవు; జగత్సర్గానుసంధాయి; వీ**
**శ్రుతిసంఘాతము నీ ముఖాంబుజములన్ శోభిల్లు; శబ్దార్థ సం**
**యుతమై సర్వము నీ కరామలకమై యుండుంగదా! భారతీ**
**సతి యిల్లాలంట నీకు; నో జనక! నా సందేహముం బాపవే! 73**

**ప్రతి :** ఓ జనక= ఓ తండ్రీ; చతురాస్యుండవు= నాలుగు ముఖాలు కలిగినవాడవు; వేల్పుపెద్దవు= దేవతలలో పెద్దవాడవు; జగత్+సర్గ+అనుసంధాయివి= లోకాల సృష్టికి సంధానకర్తవు; ఈ శ్రుతిసంఘాతము= ఈ వేదసమూహం; నీ ముఖ+అంబుజములన్= నీ వదన పద్మాలలో; శోభిల్లున్= ప్రకాశిస్తున్నది; శబ్దార్థ సంయుతము+ఐ= శబ్దాలతోనూ, అర్థంతోనూ కూడినదై; సర్వము= ఈ విశ్వమంతా; నీ కర+ఆమలకము+ఐ= నీకు చేతిలోని ఉసిరికయై; ఉండున్‌కదా= ఉంటున్నదిగదా! నీకున్= నీకు; భారతీసతి= సరస్వతి; ఇల్లాలు+అఁట!= గృహిణియట; నా సందేహమున్= నా సంశయాన్ని; పాపుము+ఏ (పాపవే)= తొలగింపుమా!

**తా :** ఓ తండ్రీ! నీవు చతుర్ముఖుడవు. సురలలో పెద్దవు. లోకాలకు సృష్టికర్తవు, ఈ వేదాలన్నీ నీ ముఖపద్మాలలోనే విరాజిల్లుతున్నాయి. వాగర్థమయమైన ఈ విశ్వమంతా నీ అరచేతి ఉసిరికపండువలె నీకు తేటతెల్లమై ఉన్నది. పైగా సరస్వతీదేవి నీకు ఇల్లాలు. ఇదిగో, ఈ నా సందేహం తీర్చు.

**శా.** **ప్రారంభాదివివేక మెవ్వఁ డొసఁగుం? బ్రారంభసంపత్తి కా**
**ధారం బెయ్యది? యేమి హేతువు? యదర్థం బే స్వరూపంబు సం**
**సారానుక్రమ మూర్ణనాభిపగిదిన్ సాగించె దెల్లప్పుడుం**
**భారం బెన్నఁడు లేదు! నీ మనువు దుష్ప్రాపంబు వాణీశ్వరా!** **74**

**ప్రతి :** వాణీ+ఈశ్వరా!= సరస్వతీనాథా!; ప్రారంభాది వివేకము= జగత్తు సృష్టించడానికి పూనుకొనుటకవసరమైన తెలివిని; ఎవ్వఁడు+ఒసఁగున్= నీ కెవడు ఇస్తున్నాడు?; ప్రారంభసంపత్తికిన్= అలా జగత్తును నిర్మించే సంపదకు; ఆధారంబు= ఆదరువు; ఏ+అది= ఏది?; హేతువు+ఏమి= అందుకు కారణమేమి?; యత్+అర్థంబు= (సృష్టి) ఎందుకొరకు?; ఏ స్వరూపంబు= దాని స్వరూపమేమి?; ఎల్లప్పుడున్= ఎల్లవేళలా; సంసార+అనుక్రమమున్= సంసారానికి చెందిన వరుసగా వచ్చే పద్ధతుల తీరును; ఊర్ణనాభిపగిదిన్= సాలీడులాగా; సాగించెదు= కొనసాగిస్తున్నావు; ఎన్నఁడున్= ఎప్పుడును; భారంబు లేదు= బరువు లేదు; నీ మనువు= నీ జీవనం; దుష్ప్రాపంబు= ఇతరులకు పొందశక్యం గానిది.

**తా :** సరస్వతీనాథా! ఈ జగత్తుయొక్క సృష్టిని ప్రారంభించడాని కవసరమైన విజ్ఞానాన్ని నీకు ఎవడిస్తున్నాడు? ఆ ప్రారంభ సంపదకు మూలమేమి? ఈ సృష్టి నిర్మాణానికి హేతువేమి? దీనివల్ల ఒనగూడే ప్రయోజనమేమి? దీని స్వరూపమెట్టిది? సాలెపురుగులాగా విశ్రాంతి లేకుండా ఎల్లప్పుడూ సంసార నిర్మాణక్రమాన్ని కొనసాగిస్తున్నా నీకు శ్రమలేకుండా ఉన్నది. నీ జీవనవిధానం అందరికీ అందేది కాదు.

**శా.** **నాకుం జూడఁగ నీవు రాజ వనుచున్నాఁడన్ యథార్థస్థితిన్**
**నీకంటెన్ ఘనుఁ డొక్క రాజు గలఁడో? నీ వంతకున్ రాజవో?**
**నీ కే లాభము రాఁదలంచి జగముల్ నిర్మించె, దీ చేతనా**
**నీకం బెందు జనించు నుండు నడఁగున్? నిక్కంబు భాషింపుమా!** **75**

**ప్రతి :** నాకున్+చూడఁగన్= నాకు నేను పరిశీలింపగా; నీవు రాజవు+అనుచున్నాఁడన్= నీవే సర్వాధిపతివి అని అంటున్నాను; యథార్థస్థితిన్= సత్యస్థితిలో; నీ కంటెన్ ఘనుఁడు= నీ కంటె గొప్పవాడు; ఒక్క రాజు= ఒక ప్రభువు; కలఁడు+ఓ= ఉన్నాడా?; నీవు+అంతకున్= నీవే అంతటికీ; రాజవు+ఓ= ప్రభుడవో; నీకు+ఏ లాభము= నీకు ఏ ప్రయోజనం; రాన్+

తలంచి= రానున్నదని భావించి; జగముల్ నిర్మించెదు= లోకాలను సృష్టిస్తున్నావు?; ఈ చేతన+అనీకంబు= ఈ జీవసమూహం; ఎందున్ జనించున్= ఎక్కడ పుడుతున్నది?; ఉండున్= ఎక్కడ ఉంటున్నది?; అడఁగున్= ఎక్కడ లీనమవుతున్నది?; నిక్కంబున్= నిజాన్ని; భాషింపుము+ఆ= చెప్పుమా!

**తా :** నా మట్టుకు నేను నీవే ప్రభుడవని భావిస్తున్నాను. నిజానికి నీకంటే అధికుడైన ప్రభువు మరొకడున్నాడా? నీవే అంతటికీ ప్రభుడవా? అయితే ఏ ప్రయోజనం ఆశించి నీ వీలోకాలు సృష్టిస్తున్నావు? ఈ జీవసముదాయం ఎక్కడ ఉద్భవిస్తున్నది? ఎక్కడ ఉంటున్నది? ఎక్కడ చివరకు లయమవుతున్నది? నిజం చెప్పు దేవా!

**మ. సదసత్సంగతి నామ రూప గుణ దృశ్యం బైన విశ్వంబు నీ**
**హృదధీనంబు గదా! ఘనుల్ సములు నీ కెవ్వారలున్ లేరు, నీ**
**పద మత్యున్నత, మిట్టి నీవు తపముం బ్రావీణ్యయుక్తుండవై**
**మది నే యీశ్వరుఁ గోరి చేసితివి? తన్మార్గంబు సూచింపవే! 76**

**ప్రతి :** సత్+అసత్+సంగతిన్= సత్తు అసత్తుల కలయికవల్ల; నామరూపగుణ దృశ్యంబు+ఐన= నామరూపగుణాలతో కనిపిస్తున్న; విశ్వంబు= ప్రపంచం; నీ హృత్+అధీనంబు గదా!= నీ హృదయానికి వశపడి వున్నది గదా!; నీకున్ ఘనుల్ సములు= నీకంటె అధికులు, నీకు సాటి రాగలవారు; ఏ+వారలున్= ఎవరునూ లేరు; నీ పదము= నీ స్థానం; అతి+ఉన్నతము= మిక్కిలి ఉన్నతమైనది; ఇట్టి నీవు= ఇంత గొప్పవాడవైన నీవు; మదిన్= చిత్తంలో; ఏ ఈశ్వరున్ కోరి= ఏ దేవుణ్ణి ఉద్దేశించి; ప్రావీణ్యయుక్తుండవు+ఐ= నేర్పుతో గూడినవాడవై; తపమున్+చేసితివి= తపస్సు చేసినావో; తత్+మార్గంబు= ఆ దారి; సూచింపవే (సూచింపుము+ఏ)= నిర్దేశింపుమా!

**తా :** సత్తు (పరమాత్మ) అసత్తు (మాయ)ల కలయిక వల్ల నామరూపగుణాలతో గూడి కనిపించే ఈ జగత్తు నీ హృదయానికి అధీనమైనదే కదా! నీ కంటె అధికులు, నీతో సమానులూ ఎవరూ లేరు. నీ స్థానం మిక్కిలి దొడ్డది. ఇట్టి నీవు ఏ పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి నేర్పుతో తప మొనర్చావు? ఆ దారి ఏదో చెప్పవయ్యా!

**శా. అంభోజాసన! నీకు నీశుఁడు గలం డంటేనిఁ దత్పక్ష మం**
**దంభోజాతభవాండ మే విభుని లీలాపాంగసంయుక్తిచే**
**సంభూతం బగు వర్తమాన మగు సంఛన్నంబగుం దద్విభున్**
**సంభాషింపఁగ వచ్చునేఁ దలఁప నే చందంబువాఁ డాకృతిన్? 77**

**ప్రతి :** అంభోజ+ఆసన= పద్మాసనా!; నీకున్= నీకు; ఈశుఁడు= ప్రభువు; కలండు+అంటేనిన్= ఉన్నాడన్నచో; తత్పక్షమందున్= ఆ పక్షంలో; అంభోజాతభవ+అండము= ఈ బ్రహ్మాండం; ఏ విభుని= ఏ ప్రభువుయొక్క; లీలా+అపాంగ సంయుక్తిచేన్= లీలాకటాక్ష యోగంతో; సంభూతంబు+అగున్= జనిస్తుందో; వర్తమానమగున్= స్థితి గల్గి వుండునో; సంఛన్నంబు+అగున్= లీనమై యుండునో; తద్+విభున్= అట్టి ప్రభువును; తలఁపన్= ఆలోచింపగ; ఆకృతిన్= ఆకారంచే; ఏ చందంబువాఁడు= ఏ విధంగా ఉండువాడో; సంభాషింపఁగన్ వచ్చునే?= వర్ణించడానికి వీలగునా?

**తా :** పద్మజా! నీకు గూడా ఒక ఏలిక ఉన్నాడంటావా? అట్లైతే ఈ బ్రహ్మాండం ఏ ప్రభుని కటాక్షవిలాసంతో జనిస్తున్నదో, వర్ధిల్లుతున్నదో, గిట్టుతున్నదో ఆ ప్రభువును గూర్చి ఆయన స్వరూపమెట్టిదని ముచ్చటించుకోవడానికి వీలవుతుందా?

**విశే :** 'లీల' అంటే కర్మబంధ సంబంధం ఏ మాత్రమూలేకుండా భగవంతుడు చేసే కార్యం.

**క. తోయజసంభవ! నా కీ, తోయము వివరింపు, చాలc దోcచిన నే నా**
**తోయమువారికి నన్యుల, తోయములం జెందకుండ ధ్రువ మెఱిcగింతున్. 78**

**ప్రతి :** తోయజసంభవ= కమలసంభవా!; నాకున్ ఈ తోయము= నాకు ఈ విధం; వివరింపు= వివరంగా చెప్పు; చాలన్ తోcచినన్= నాకు ఇది చక్కగా గోచరిస్తే; నేన్= నేను; నా తోయమువారికిన్= నన్నునుసరించే వారికి; అన్యుల= ఇతరులయొక్క; తోయములన్= మార్గాలను; చెందకుండన్= పొందకుండా; ధ్రువము= నిశ్చయం; ఎఱిcగింతున్= తెలిపెదను.

**తా :** కమల సంభవా! ఈ విషయం నాకు తెలియపరచు. నా కిది బాగా అర్థమైతే నన్నునుసరించే నా పరివారానికి ఈ సత్యం తెలియజేస్తాను. వాళ్ళు ఇతర మార్గాలను అనుసరించకుండా ఉండునట్లు చేస్తాను.

**వ. దేవా ! భూత భవిష్యద్వర్తమానంబులగు వ్యవహారంబులకు నీవ వల్లభుండవు. నీ యెఱుంగని యర్థం బొండెద్దియు లేదు! విశ్వప్రకారంబు వినిపింపు మనిన విని వికసితముఖుండై విరించి యిట్లనియె. 79**

**ప్రతి :** దేవా!= స్వామీ!; భూత+భవిష్యత్+వర్తమానంబులు+అగు= జరిగిన, జరుగనున్న, జరుగుతున్నవి అగు; వ్యవహారంబులకున్= లోకవ్యవహారాలకు; నీవు+అ= నీవే; వల్లభుండవు= ప్రభుడవు; నీ+ఎఱుంగని= నీకు తెలియని; అర్థంబు= విషయం; ఒండు+ఎద్దియున్ లేదు= వేరే ఏదీ లేదు; విశ్వప్రకారంబున్= జగద్విధానాన్ని; వినిపింపుము+అనినన్= ఆలకింపజేయి అనగా; విని= ఆకర్ణించి; విరించి= బ్రహ్మ; వికసితముఖుండు+ఐ= వికసించిన వదనం కలవాడై; ఇట్లు+ అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** స్వామీ! జరిగిన, జరుగనున్న, జరుగుతున్న వ్యవహారాలన్నిటికీ నీవే కర్తవు. నీకు తెలియని విషయమేదీ లేదు. ఈ ప్రపంచ విధానం నాకు తెలియజెప్పు – అని నారదుడు అడిగాడు. అది విని విప్పారిన ముఖంతో విధాత ఇలా అన్నాడు.

**క. రారా బుధులు? విరక్తులు, గారా? యీ రీతి నడుగcగా నేరరు వి**
**స్మేరావహము భవన్మత, మౌరా! నా విభుని మర్మ మడిగితి వత్సా! 80**

**ప్రతి :** వత్సా!= కుమారా!; బుధులు= పండితులు; రారా= నా వద్దకు రావడం లేదా?; విరక్తులు గారా?= వారు వైరాగ్యం కలవారు కాదా?; ఈ రీతిన్= ఈ విధంగా; అడుగగాన్ నేరరు= (నీవలె) ప్రశ్నించినవారు కారు; భవత్+మతము= నీ అభిప్రాయం; విస్మేర+ఆవహము= సంతోషం కలిగించేదిగా ఉన్నది; ఔరా!= ఆశ్చర్యం!; నా విభుని= నా ప్రభువుయొక్క; మర్మము= రహస్యం; అడిగితి= అడిగినావు.

**తా :** పుత్రా! ఎందరు పండితులు నా వద్దకు రావడం లేదు! వారంతా వైరాగ్యం కలవారే కదా! అయినా వాళ్ళెవరూ నీవలె నన్ను ప్రశ్నించినవారు కారు. నీ మతం నాకు సంతసం కల్గించింది. ఆశ్చర్యం! నా ప్రభుని రహస్యమే నీవడిగావు.

**శా. నానాస్థావరజంగమప్రకరముల్ నాయంత నిర్మింప వి**
**జ్ఞానం బేమియు లేక తొట్రుపడ నిచ్చున్ నాకు సర్వానుసం**
**ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము**
**న్నే నా యీశ్వరు నాజ్ఞcగాక జగముల్ నిర్మింప శక్తుండనే? 81**

**ప్రతి :** నానా= అనేక విధాలైన; స్థావర= కదలని; జంగమ= కదలునట్టి; ప్రకరముల్= సమూహాలు; నాయంతన్= నాకు నేనుగా; నిర్మింపన్= సృష్టించడానికి; విజ్ఞానంబు= తెలివి; ఏమియున్ లేక= ఏ మాత్రం లేక; తొట్రుపడన్= తబ్బిబ్బు పడగా; నిచ్చన్= నిత్యం, నాకు; సర్వ= సమస్త సృష్టియొక్క; అనుసంధాన= నిర్మాణంయొక్క; ఆరంభ= పనియొక్క; విచక్షణత్వమున్= విజ్ఞానాన్ని; మున్ను= పూర్వం; మహా+ఉదారంబుగాన్= గొప్ప ఔదార్యంతో; ఇచ్చెన్= ప్రసాదించాడు; ఏను= నేను; ఆ+ఈశ్వరునాజ్ఞన్+కాక= అలా ప్రసాదించిన దేవుని ఆనవల్ల కాక; జగముల్= లోకాలు; నిర్మింపన్= సృష్టించడానికి; శక్తుండను+ఏ= సమర్థుడనా! (కానని భావం)

**తా :** నారదా! విను! నానా రూపాలతో ఉన్న ఈ చరాచర ప్రపంచాన్ని నాకు నేనై సృష్టించడానికి అవసరమైన తెలివి ఏ మాత్రం లేక నేను తొట్రుపడ్డాను. ఆ స్థితిలో పూర్వం ఈ సకల సృష్టినీ ఆరంభించడానికి అవసరమైన విజ్ఞానాన్ని నాకా ప్రభువు ఎంతో ఉదారంగా ప్రసాదించాడు. ఆ దేవుని ఆనతి లేకుంటే ఈ జగన్నిర్మాణశక్తి నాకెక్కడిది?

**మ. అనఘా! విశ్వము నెల్ల దీప్తముగఁ జేయన్ నే సమర్థుండనే?**
**యినచంద్రానల తారకాగ్రహగణం బే రీతి నా రీతి నె**
**వ్వని దీప్తిం బ్రతిదీప్త మయ్యె భువనవ్రాతంబు; దద్దీప్తిచే**
**ననుదీప్తం బగునట్టి యీశ్వరున కే నశ్రాంతమున్ మ్రొక్కెదన్. 82**

**ప్రతి :** అనఘా!= పాపరహితుడా!; విశ్వమున్+ఎల్లన్= సమస్త ప్రపంచాన్నీ; దీప్తముగన్= ప్రకాశితమయ్యేటట్లు; చేయన్= కావించడానికి; నేన్= నేను; సమర్థుండను+ఏ?= శక్తిగలవాడనా?; ఇన= సూర్యుడు; చంద్ర= చందమామ; అనల= అగ్ని; తారకా= నక్షత్రాలు; గ్రహగణంబు= గ్రహసమూహం; ఏ రీతిన్= ఏ విధంగా ప్రకాశిస్తున్నాయో; ఆ రీతిన్= ఆ విధంగా; ఎవ్వని దీప్తిన్= ఎవని ప్రకాశంతో; భువనవ్రాతంబు= లోకాల సముదాయం; ప్రతిదీప్తము+అయ్యెన్= ప్రకాశింప జేయబడినవో; తద్+దీప్తిచేన్= అట్టి ప్రకాశంచే; అనుదీప్తంబు+అగునట్టి= తేజరిల్లుతున్న; ఈశ్వరునకున్= దేవునకు; ఏన్= నేను; అశ్రాంతమున్= సతతం; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** కిల్బిషం లేని నారదా! ఈ జగత్తునంతటినీ ప్రకాశింపజేసే సామర్థ్యం నాకు లేదు. ఎవని ప్రకాశంవల్ల సూర్యుడు, చంద్రుడూ, అగ్నీ, నక్షత్రాలూ, గ్రహాలు ఇంకా ఈ లోకాలన్నీ సముజ్జ్వలంగా ప్రకాశింప చేయబడుతున్నవో, అట్టి దివ్యదీప్తితో విరాజిల్లే పరమేశ్వరునికి నేను సదా ప్రణమిల్లుతున్నాను.

**మ. వినుమీ యీశ్వరు దృష్టిమార్గమున నావేశింప శంకించి సి**
**గ్గున సంకోచము నొందు మాయవలనం గుంఠీభవత్ప్రజ్ఞచే**
**నను లోకేశ్వరుఁడంచు మ్రొక్కు మతిహీనవ్రాతముం జూచి నే**
**ననిశంబున్ నగి ధిక్కరింతు హరిమాయాకృత్య మంచున్ సుతా! 83**

**ప్రతి :** సుతా!= కుమారా!; వినుమీ= ఆలకించుమా!; ఈశ్వరు దృష్టిమార్గమునన్= పరమేశ్వరునియొక్క దృష్టిపథంలో; ఆవేశింపన్= ప్రవేశించడానికి; శంకించి= సంశయించి; సిగ్గునన్= లజ్జతో; సంకోచమున్= ముడుచుకొని పోవుటను, కుంచించుకపోవడం; ఒందు= పొందు; మాయవలనన్= మాయాప్రభావంచే; కుంఠీభవత్ ప్రజ్ఞచేన్= వ్యర్థమైపోతున్న తెలివితో; ననున్= నన్ను; లోక+ఈశ్వరుఁడు+అంచున్= లోకానికి ప్రభువంటూ; మ్రొక్కు= నమస్కరించునట్టి;

మతిహీనవ్రాతమున్= బుద్ధిలేని జనుల గుంపును; చూచి= కనుగొని; నేను; అనిశంబున్= ఎల్లవేళలా; నగి= పరిహసించి; హరిమాయాకృత్యము+అంచున్= శ్రీహరియొక్క మాయగావించు చేష్ట; అంచున్= అనుకొంటూ; ధిక్కరింతున్= తిరస్కరిస్తాను.

**తా :** పుత్రా! ఇంకా ఈ విషయం విశదంగా వివరిస్తాను విను. మాయ ఈశ్వరుని దృష్టిపథంలో ప్రవేశించడానికి శంకించి సిగ్గుతో కుంచించుకుపోతుంది. దానివల్ల తమ తెలివి కుంఠితం కాగా బుద్ధిహీనులు నన్నే లోకానికంతా ప్రభువుగా భావించి నాకు నమస్కరిస్తూ ఉంటారు. అట్టి మూఢులను చూచి ఇది శ్రీహరి మాయవల్ల జరిగేపని కదా? అనుకొని నాలో నేను నవ్వుకొని వాళ్ళను, ధిక్కరిస్తుంటాను.

**వ. మఱియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును, జన్మనిమిత్తంబులైన కర్మంబులును, గర్మక్షోభకంబైన కాలంబును, గాలపరిణామ హేతువైన స్వభావంబును, భోక్తయైన జీవుండును, వాసుదేవుండ కా నెఱుంగుము, వాసుదేవ వ్యతిరిక్తంబు లేదు. సిద్ధంబు. నారాయణ నియమ్యంబులు లోకంబులు, దేవతలు నారాయణశరీర సంభూతులు, వేద యాగ తపో యోగ విజ్ఞానంబులు నారాయణ పరంబులు, జ్ఞానసాధ్యం బగు ఫలంబు నారాయణు నధీనంబు, కూటస్థుండును సర్వాత్మకుండును సర్వద్రష్టయు నయిన యీశ్వరుని కటాక్ష విశేషంబున సృజియింపంబడి ప్రేరితుండనై సృజ్యంబైన ప్రపంచంబు సృజించుచుండుదు, నిర్గుణుండైన యీశ్వరుని వలన రజస్సత్త్వతమోగుణంబులు ప్రభూతంబులై యుత్పత్తి స్థితి లయంబులకుం బాలుపడి కార్యకారణ కర్తృత్వభావంబులందు ద్రవ్యంబులైన మహాభూతంబులును జ్ఞానమూర్తులయిన దేవతలును గ్రియారూపంబులయిన యింద్రియంబులును నాశ్రయంబులుగా నిత్యముక్తుం డయ్యును మాయాసమన్వితుండైన జీవుని బంధించు, జీవులకు నావరణంబులయి యుపాధి భూతంబులయిన మూఁడు లింగంబులు సేసి పరులకు లక్షితంబుగాక తనకు లక్షితంబైన తత్త్వంబు గల యీశ్వరుం డివ్విధంబునం గ్రీడించుచుండు. 84**

**ప్రతి :** మఱియున్= ఇంకను; దేహంబునకున్= శరీరానికి; ద్రవ్యంబులు+ఐన= మూలపదార్థాలైన; మహాభూతంబులునున్= భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం – అనే ఐదు గొప్పభూతాలు; జన్మనిమిత్తంబులు+ఐన= పుట్టుకకు హేతువులయిన; కర్మంబులునున్= కర్మలును; కర్మక్షోభకంబు+ఐన= కర్మలకు కలత కలిగించునట్టి; కాలంబునున్= సమయమూ; కాల పరిణామహేతువు+ఐన= కాలంయొక్క మార్పునకు కారణమైన; స్వభావంబును= స్వభావమును; భోక్త+ఐన= కర్మఫలాన్ని అనుభవించేవాడగు; జీవుండునున్= చేతనుడును; వాసుదేవుండు+అ+కాన్+ఎఱుంగుము= వసుదేవుని కుమారుడైన భగవంతుడే అని తెలుసుకొమ్ము; వాసుదేవవ్యతిరిక్తంబు= శ్రీమన్నారాయణుని కంటె భిన్నమైనది; లేదు; సిద్ధంబు= ఇది నిక్కం; లోకంబులు= జగత్తులు; నారాయణ నియమ్యంబులు= నారాయణునిచే నియమింపదగినవి; దేవతలు= సురలు; నారాయణ శరీరసంభూతులు= నారాయణుని శరీరంనుండి పుట్టినవారు; వేద, యాగ, తపస్+యోగ విజ్ఞానంబులు= వేదాలు, యాగాలు, తపస్సులు, యోగాలు, విజ్ఞానాలు; నారాయణ పరంబులు= నారాయణుడే లక్ష్యంగా గల్గినవి; జ్ఞానసాధ్యంబు+అగు= జ్ఞానంచేత సాధింపదగిన; ఫలంబు= ప్రయోజనం; నారాయణు+ అధీనంబు= నారాయణుని వశంలోనున్నది; కూటస్థుండును= మార్పులేనివాడును; సర్వ+ఆత్మకుండును= సమస్తం తన స్వరూపమైనవాడును; సర్వద్రష్టయునున్= అంతటినీ దర్శించువాడును; అయిన+ఈశ్వరుని= అయిన భగవంతునియొక్క; కటాక్ష విశేషంబునన్=

కడగంటి చూపుయొక్క, విశేషంవల్ల; సృజియింపన్+పడి= సృష్టింపబడి; ప్రేరితుండను+ఐ= ప్రేరణ పొందినవాడనై; సృజ్యంబు+ఐన= సృష్టించదగిన; ప్రపంచంబున్= లోకాన్ని; సృజించుచుండుదున్= సృష్టిస్తూవుంటాను; నిర్గుణుండు+ఐన= గుణాలులేనివాడైన; ఈశ్వరునివలనన్= ఈశ్వరుని నుండి; రజస్సత్త్వతమోగుణంబులు= రజోగుణం, సత్త్వగుణం, తమోగుణం అనే మూడు గుణాలు; ప్రభూతంబులు+ఐ= పుట్టినవై; ఉత్పత్తి= పుట్టుకకు; స్థితి= ఉనికికి; లయంబులకున్= సంహారానికి; పాలుపడి= పూనుకొని; కార్యకారణ కర్తృత్వభావంబులందున్= కార్యం, కారణం, కర్త వీటికి చెందిన భావాలలో; ద్రవ్యంబులు+ఐన= మూలభూతాలైన; మహాభూతంబులును=పృథివ్యాది పంచమహాభూతాలూ; జ్ఞానమూర్తులు+ఐన= జ్ఞానస్వరూపులైన; దేవతలును= అమరులును; క్రియారూపంబులు+అయిన= కార్యరూపాలైన; ఇంద్రియంబులును= కన్ను మొదలైన ఇంద్రియాలును; ఆశ్రయంబులుకాన్= ఆధారాలుగా; నిత్యముక్తుండు+అయ్యును= సదా విడుదల పొందినవాడైనప్పటికినీ; మాయాసమన్వితుండు+ఐన= మాయతోగూడిన; జీవుని బంధించున్= చేతనుణ్ణి బద్ధుణ్ణి కావించును; జీవునకున్= చేతనునకు; ఆవరణంబులు+అయి= ఆచ్ఛాదనములై; ఉపాధిభూతంబులు+అయిన= ఉపాధులుగా ఏర్పడిన; మూఁడు లింగంబులు+చేసి= మూడు గుణాలు నిర్మించి; పరులకున్= ఇతరులకు; లక్షితంబుగాక= గోచరించక; తనకున్ లక్షితంబు+ఐన= తనకు మాత్రమే గోచరించునట్టి; తత్త్వంబు గల= స్వరూపం కల; ఈశ్వరుండు= దేవుడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; క్రీడించున్= వినోదిస్తున్నాడు.

**తా :** అంతమాత్రమే కాదు. శరీర నిర్మాణానికి ఉపయోగపడే పృథివి మున్నగు ఐదు భూతాలూ, పుట్టుకకు హేతువులైన కర్మలూ, కర్మ ప్రవృత్తికి కారణమైన కాలమూ, దాని మార్పునకు కారణమైన స్వభావమూ, కర్మఫలం అనుభవించే జీవుడూ అంతా వాసుదేవ స్వరూపులే అని గ్రహించు. ఆ వాసుదేవునికంటె అన్యమైనదేదీ లేదు. ఇది నిజం. ఈ లోకాలన్నింటినీ నియమించేవాడు శ్రీమన్నారాయణుడే. వేల్పులందరూ ఆ దేవుని శరీరంనుండి పుట్టినవారే. వేదాలూ, యాగాలూ, తపస్సులూ, యోగాలూ, విజ్ఞానమూ అంతా నారాయణుని ఆరాధనారూపమైనవే. జ్ఞానసాధ్యమైన ఫలం కూడా నారాయణుని అధీనంలోనే ఉన్నది. నిర్వికారుడూ, సర్వాంతర్యామీ, సర్వదర్శనుడు అయిన భగవానుని క్రీగంటి చూపువల్లనే నేను జన్మించాను. ఆయన కటాక్షంవల్లనే ప్రేరణ పొంది సృజింపదగిన విశ్వాన్ని సృష్టిస్తున్నాను. గుణరహితుడైన ఈశ్వరునుండి రజస్సత్త్వతమస్సులనే మూడుగుణాలు పుడుతున్నాయి. అవి ఉత్పత్తికీ, స్థితికీ, లయానికీ హేతువులవుతున్నాయి. కార్యభావంలోనూ, కారణ భావంలోనూ, కర్తృభావంలోనూ ద్రవ్యాలైన పృథివ్యాది పంచభూతాలనూ, జ్ఞానరూపులైన బ్రహ్మాదిదేవతలనూ, క్రియారూపాలైన ఇంద్రియాలనూ ఆశ్రయిస్తున్నాయి. జీవుడు సదాముక్తుడే అయినా మాయతోకూడి ఉండడంవల్ల ఆ త్రిగుణాలు అతణ్ణి బంధిస్తున్నాయి. జీవుణ్ణి కప్పివేసే ఉపాధులైన ఈ మూడు గుణాలను కల్పించి తద్ద్వారా ఈశ్వరుడు ఇతరులకు ఏ మాత్రం గోచరించక తనకు మాత్రమే గోచరించే తత్త్వంతో ఈ విధంగా వినోదిస్తూ ఉంటాడు.

**క. ఆ యీశుఁ డనంతుఁడు హరి, నాయకుఁ డీ భువనములకు, నాకున్, నీకున్**
**మాయకుఁ బ్రాణివ్రాతము, కీ యెడలన్ లేద యీశ్వరేతరము సుతా! 85**

**ప్రతి :** సుతా!= పుత్రా!; ఆ ఈశుఁడు= ఆ ఈశ్వరుడు; అనంతుఁడు= అంతం లేనివాడు; హరి= ఆ శ్రీహరి; ఈ భువనములకున్= ఈ లోకాలకూ; నాకున్, నీకున్= నాకూ నీకూ; మాయకున్= మాయకూ; ప్రాణివ్రాతముకున్= ప్రాణుల సమూహానికీ కూడా; నాయకుఁడు= ప్రభువు; ఈ+ఎడలన్= ఈ లోకంలో; ఈశ్వర+ఇతరము= పరమేశునికంటే వేరైనది; లేదు+అ= లేనే లేదు.

**తా :** కుమారా! ఆ పరమేశ్వరుడు తుది లేనివాడు. ఆ శ్రీహరి ఈ లోకాలకూ, నాకూ, నీకూ, మాయకూ, ప్రాణివర్గానికీ ప్రభువు. ఆయనకంటె ఇతరమైనది ఈ జగత్తులో ఏదీ లేనే లేదు.

**వ.** **వినుము, మాయావిభుండైన యీశ్వరుండు దన మాయంజేసి దైవయోగంబునం బ్రాప్తంబులయిన కాలజీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి కైకొనియె, నీశ్వరాధిష్ఠితంబైన మహత్తత్త్వంబు వలన నగు కాలంబున గుణవ్యతికరంబును స్వభావంబున బరిణామంబును జీవాదృష్టభూతంబయిన కర్మంబున జన్మంబును నయ్యె, రజస్సత్త్వంబులచే నుపబృంహితంబై వికారంబు నొందిన మహత్తత్త్వంబువలనం దమఃప్రధానంబై ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబగు నహంకారంబు గలిగె, నదియు రూపాంతరంబు లొందుచు ద్రవ్యశక్తియైన తామసంబును గ్రియాశక్తియైన రాజసంబును జ్ఞానశక్తియైన సాత్త్వికంబును నన మూఁడు విధంబులయ్యె, నందు భూతాదియైన తామసాహంకారంబువలన నభంబు కలిగె, నభంబునకు సూక్ష్మరూపంబు ద్రష్టృదృశ్యములకు బోధకంబైన శబ్దంబు గుణంబగు, నభంబువలన వాయువు గలిగె, వాయువునకుం బరాన్వయంబున శబ్దంబు స్పర్శంబు నను రెండు గుణంబులు గలిగియుండు, నది దేహంబులం దుండుటం జేసి ప్రాణరూపంబై యింద్రియ మనశ్శరీర పాటవంబునై యోజస్సహోబలంబులకు హేతువై వర్తించు, వాయువువలన రూప స్పర్శ శబ్దంబు లనియెడు గుణంబులు మూఁటితోడఁ దేజంబు గలిగెఁ, దేజంబువలన రస రూప స్పర్శ శబ్దంబు లనియెడు నాలుగు గుణంబులతో జలంబు గలిగె, జలంబువలన గంధ రస రూప స్పర్శ శబ్దంబు లనియెడు గుణంబు లయిదింటితోడం బృథివి గలిగె, వైకారికంబైన సాత్త్వికాహంకారంబువలనఁ జంద్ర దైవతంబయిన మనంబు గలిగె; మఱియు దిక్కులును వాయువును నర్కుండును బ్రచేతసుండును నాశ్వినులును వహ్నియు నింద్రుండును నుపేంద్రుండును మిత్రుండును బ్రజాపతియు ననియెడి దశదేవతలు గలిగిరి, తైజసంబైన రాజసాహంకారంబువలన దిగ్దైవతంబైన త్వగింద్రియంబును సూర్యదైవతంబైన రసనేంద్రియంబును నశ్విదైవతంబైన ఘ్రాణేంద్రియంబును వహ్నిదైవతంబైన హస్తేంద్రియంబును నుపేంద్ర దైవతంబైన పాదేంద్రియంబును మిత్ర దైవతంబైన గుదేంద్రియంబును బ్రజాపతి దైవతంబైన గుహ్యేంద్రియంబును ననియెడి దశేంద్రియంబులును బోధజనకాంతఃకరణైక భాగంబయిన బుద్ధియుఁ గ్రియాజనకాంతః కరణంబయిన ప్రాణంబునుం గలిగె,నిట్టి శ్రోత్రాదులగు దశేంద్రియంబులతోఁ గూడిన భూతేంద్రియ మనోగుణంబులు వేర్వేఱుగ బ్రహ్మాండ శరీర నిర్మాణంబునంద సమర్థంబు లగునపుడు గృహనిర్మాణంబునకుం బెక్కు పదార్థంబులు సంపాదించినంగాని చాలని చందంబున భూతేంద్రియ మనోగుణంబులవలన గృహంబుకైవడి భగవచ్ఛక్తి ప్రేరితంబు లగుచు నేకీభవించిన సమష్టి వ్యష్ట్యాత్మకత్వంబు నంగీకరించి చేతనాచేతనంబులం గల బ్రహ్మాండంబు కల్పితంబయ్యె, నట్టి యండంబు వర్షాయుత సహస్రాంతంబు దనుక జలంబునందుండె, గాల కర్మ స్వభావంబులం దగులువడక సమస్తంబును జీవయుక్తంబుగఁ జేయ నీశ్వరుం డచేతనంబును సచేతనంబునుగ నొనర్చె, నంతం గాలకర్మస్వభావ ప్రేరకుండయిన పరమేశ్వరుండు జీవరూపంబున**

**మహావరణ జలమధ్య స్థితంబయిన బ్రహ్మాండంబు లోను సొచ్చి సవిస్తారంబు గావించి యట్టి యండంబు భేదించి నిర్గమించె నెట్లంటేని. 86**

**ప్రతి :** వినుము= జాగ్రత్తగా విను; మాయావిభుండు+ఐన= మాయకు ప్రభువైన; ఈశ్వరుండు= భగవంతుడు; తన మాయన్+చేసి= తన మాయా ప్రభావంతో; దైవయోగంబునన్= అదృష్టవశాన; ప్రాప్తంబులు+అయిన= లభించిన; కాలజీవ+అదృష్ట స్వభావంబులు= కాలం, జీవుడు, అదృష్టం అనే వీటి స్వభావాలను; వివిధంబులు= నానా విధాలుగా; చేయ, నిశ్చయించి= చేయడానికి నిర్ణయించి; కైకొనియెన్= (వాటిని) స్వీకరించాడు; ఈశ్వర+అధిష్ఠితంబు+ఐన= భగవంతునిచే అధిష్ఠింపబడిన; మహత్తత్త్వంబువలనన్= 'మహత్తు' అనబడే తత్త్వంవల్ల; అగు= సంభవించే; కాలంబునన్= కాలంచే; గుణవ్యతికరంబును= గుణసమూహమూ; స్వభావంబునన్= స్వభావంచేత; పరిణామంబును= మార్పును; జీవాదృష్టఘాతంబు+ఐన= జీవుల అదృష్టమైన; కర్మంబునన్= కర్మచేత; జన్మంబును= పుట్టుకయు; అయ్యెన్= సంభవించాయి; రజస్సత్త్వంబులచేన్= రజోగుణ సత్త్వగుణాలచేత; ఉపబృంహితంబు+ఐ= వృద్ధిపొందింపబడినదై; వికారంబున్= మార్పును; ఒందిన= పొందినట్టి మహత్తత్త్వంబువలనన్= 'మహత్తు' అనే తత్త్వం నుండి; తమస్+ప్రధానంబు+ఐ= తమోగుణం ప్రధానంగా కలిగి; ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబు+అగు= ద్రవ్యం, జ్ఞానం, క్రియ స్వరూపంగాగల; అహంకారంబు గలిగెన్= అహంకారం జనించింది; అదియున్= ఆ అహంకారం; రూపాంతరంబులు+ఒందుచున్= వేరు వేరు రూపాలు పొందుతూ; ద్రవ్యశక్తి+ఐన= ద్రవ్యానికి చెందిన శక్తియగు; తామసంబున్= తామసంబును; క్రియాశక్తియైన= క్రియకు చెందిన శక్తియగు; రాజసంబున్= రాజసంబును; జ్ఞానశక్తి+ఐన= జ్ఞానానికి సంబంధించిన శక్తి యనబడే; సాత్త్వికంబును= సాత్త్వికమూ; అనన్= అనునట్లు; మూఁడు విధంబులయ్యెన్= మూడు ప్రకారాలుగా రూపొందింది; అందున్= అందులో; భూతాది+ఐన= పంచభూతాలకు మూలమైన; తామసాహంకారంబువలనన్= తామసమైన అహంకారంబునుండి; నభంబు= ఆకాశం; కలిగెన్= జనించింది; నభంబునకున్= ఆకాశానికి; సూక్ష్మరూపంబు= సూక్ష్మమైన ఆకారం; ద్రష్టృదృశ్యములకున్= చూచువానికి, చూడదగినదానికి; బోధకంబు+ఐన= జ్ఞాపకమైన; శబ్దంబు= ధ్వని; గుణంబు+అగున్= గుణమవుతున్నది; నభంబువలనన్= ఆకసంనుండి; వాయువు= గాలి; కలిగెన్= సంభవించింది; వాయువునకున్= గాలికి; పర+అన్వయంబునన్= ఆకాశంతో కారణత్వరూపమైన సంబంధం ఉండడంవల్ల; శబ్దంబు= ధ్వని; స్పర్శంబున్= తాకిడియు; అను= అనునట్టి; రెండు గుణంబులు గలిగి యుండున్= గుణద్వయం సంభవిస్తుంది; అది= ఆ వాయువు; దేహంబుల+అందున్= శరీరాలయందు; ఉండుటన్+చేసి= ఉండడంవల్ల; ప్రాణరూపంబు+ఐ= ప్రాణస్వరూపమై; ఇంద్రియ= ఇంద్రియాలయొక్క; మనస్= చిత్తంయొక్క; శరీర= దేహంయొక్క; పాటవంబై= పటుత్వమై; ఓజస్+సహస్+బలంబులకున్= మనోబలానికీ, వేగానికీ, శరీరబలానికీ; హేతువు+ఐ= కారణమై; వర్తించున్= ఉంటున్నది; వాయువువలనన్= గాలినుండి; రూప స్పర్శ శబ్దంబులు+అనియెడు= రూపం, స్పర్శం, శబ్దం - అనే; గుణంబులు మూఁటితోడన్= మూడు గుణాలతో గూడ; తేజంబు= తేజస్సు; కలిగెన్= జనించింది; తేజంబువలనన్= తేజస్సువల్ల; రసరూప స్పర్శ శబ్దంబులు+అనియెడు= రసం, రూపం, స్పర్శం, శబ్దం - అనే; నాలుగు గుణంబులతోన్= గుణాలు నాల్గింటితో; జలంబు= నీరు; కలిగెన్= పుట్టింది; జలంబువలనన్= నీటివల్ల; గంధ రస రూప స్పర్శ శబ్దంబులు+అనియెడు= గంధం, రసం, రూపం, స్పర్శం, శబ్దం - అనే గుణంబులు; అయిదింటితోడన్= ఐదుగుణాలతో కలిసి; పృథివి= భూమి అనే భూతం; కలిగెన్= సంభవించింది; వైకారికంబు+ఐన= వికారం పొందిన; సాత్త్విక+అహంకారంబువలనన్= సత్త్వగుణానికి చెందిన అహంకారంవల్ల; చంద్రదైవతంబు+అయిన= చంద్రుడు దేవతగా గల; మనంబు గలిగెన్= మనస్సు పుట్టింది; మఱియున్= ఇంకను; దిక్కులునున్= దిశలును; వాయువునున్= గాలియు; అర్కుండునున్= సూర్యుడు; ప్రచేతసుండునున్= వరుణుండు; ఆశ్వినులునున్= అశ్వినీ దేవతలు; వహ్నియున్= అగ్ని;

ఇంద్రుండునున్= దేవేంద్రుడును; ఉపేంద్రుడునున్= విష్ణువును; మిత్రుండునున్= మిత్రుడనే దేవత; ప్రజాపతియున్+అనియెడి= ప్రజాపతి అనే; దశ దేవతలు= పదిమంది దేవతలు; కలిగిరి= పుట్టారు; తైజసంబు+అయిన= తేజస్సు వికారమైన; రాజస+అహంకారంబువలనన్= రజోగుణప్రధానమగు అహంకారంనుండి; దిగ్దైవతంబు+అయిన= దిక్కులు దేవతగా గల; త్వక్+ఇంద్రియంబును= 'త్వక్' (చర్మం) అనే ఇంద్రియం; సూర్యదైవతంబు+అయిన= సూర్యుడు దేవతగాగల; రసనేంద్రియంబునున్= జిహ్వేంద్రియం; అశ్విదైవతంబు+అయిన= అశ్వినులు దేవతలుగా గల; ఘ్రాణేంద్రియంబునున్= నాసిక అనే ఇంద్రియం; ఇంద్ర దైవతంబు+అయిన= ఇంద్రుడు దేవతగాగల; హస్తేంద్రియంబును= 'పాణి' అనే ఇంద్రియం; ఉపేంద్రదైవతంబు+అయిన= ఉపేంద్రుడు దేవతగాగల; పాద+ఇంద్రియంబునున్= 'పాద' మనే ఇంద్రియం; మిత్రదైవతంబు+అయిన= మిత్రుడు దేవతగా గల; గుద+ఇంద్రియంబునున్= 'గుద' మనే ఇంద్రియం; ప్రజాపతి దైవతంబు+అయిన= ప్రజాపతి దేవతగాగల; గుహ్య+ఇంద్రియంబునున్= ఉపస్థేంద్రియం; అనియెడి= అనునట్టి; దశేంద్రియంబులును= పది ఇంద్రియాలూ; బోధ= జ్ఞానాన్ని; జనక= కల్గించు; అంతఃకరణ= అంతరింద్రియాలలో; ఏకభాగంబు+అయిన= ఒక (ముఖ్య) భాగమయిన; బుద్ధియున్= బుద్ధీ; క్రియాజనక+అంతఃకరణంబు+అయిన= క్రియను కల్గించే అంతఃకరణమైన; ప్రాణంబునున్= ప్రాణమూ; కలిగెన్= సంభవించాయి; ఇట్టి= ఇటువంటి; శ్రోత్రాదులు+అగు= చెవి మొదలగు; దశ+ఇంద్రియంబులతోన్= పది యింద్రియాలతో; కూడిన= చేరిన; భూత+ఇంద్రియ మనోగుణంబులు= భూతాలు, ఇంద్రియాలు, మనస్సు, గుణాలు; వేరు+వేఱుగన్= విడివిడిగా; బ్రహ్మాండశరీర నిర్మాణమందున్= బ్రహ్మాండమనే శరీరమును నిర్మించుటయందు; అసమర్థంబులు= శక్తిలేనివి; అగునప్పుడు= అయిన వేళలో; గృహనిర్మాణమునకున్= ఇల్లు కట్టడానికి; పెక్కు పదార్థంబులు= పలు వస్తువులు; సంపాదించిననకాని= కూర్చుకొంటే కాని; చాలని చందంబునన్= సరిపోని విధంగా; భూత+ఇంద్రియ మనోగుణంబుల వలనన్= భూతాలు, ఇంద్రియాలు, మనస్సు, గుణాలవలన; గృహంబు కైవడిన్= ఇంటివలె; భగవత్+శక్తిప్రేరితంబులు+అగుచున్= భగవంతుని శక్తిచే ప్రేరణ పొందినవై ఏకీభవించినన్= ఒక్కటికాగా; సమష్టి వ్యష్ట్యాత్మకత్వంబున్= సమష్టి భావాన్నీ, వ్యష్టి భావాన్నీ; అంగీకరించి= సమ్మతించి; చేతన+అచేతనంబులన్ కల= చేతనులైన జీవులతోనూ, అచేతనమైన ప్రకృతితోనూ గూడిన; బ్రహ్మాండంబు= అజాండం; కల్పితంబు+అయ్యెన్= నిర్మించబడింది; అట్టి అండంబు= అటువంటి బ్రహ్మాండం; వర్షాయుత సహస్రాంతంబు దనుకన్= కోటి సంవత్సరాల వరకూ; జలంబునందున్= నీటిలో; ఉండెన్= ఉండిపోయింది; కాలకర్మస్వభావంబులన్= కాలంయొక్క, కర్మంయొక్క స్వభావాలలో; తగులువడక= చిక్కుకొనక; ఈశ్వరుండు= భగవానుడు; సమస్తంబునున్= అంతటినీ; జీవయుక్తంబుగన్= జీవసహితంగా; చేయన్= చేయడానికై; అచేతనంబునున్= చేతనంగానిదానిని; సచేతనంబుగన్+ఒనర్చెన్= చైతన్యం కలదిగా చేశాడు; అంతన్= ఆ మీదట; కాలకర్మస్వభావప్రేరకుండు+అయిన= కాలంయొక్కయు, కర్మంయొక్కయు స్వభావానికి ప్రేరణ కల్గించునట్టివాడగు; పరమేశ్వరుండు= భగవంతుడు; జీవరూపంబునన్= జీవరూపంతో; మహావరణ జలమధ్యస్థితంబు+అయిన= పెద్ద ఆవరణంగల నీటి మధ్యలోనున్న; బ్రహ్మాండంబులోను సొచ్చి= బ్రహ్మాండంలో ప్రవేశించి; సవిస్తారంబున్+కావించి= దాన్ని విస్తృతంగా చేసి; అట్టి అండంబున్= అలావిశాలమైన బ్రహ్మాండాన్ని; భేదించి= భిన్నం కావించి; నిర్గమించెన్= బయలు వెడలినాడు; ఎట్లంటేనిన్= అది ఎలా జరిగిందంటే (పైకి అన్వయం)

**తా :** ఈశ్వరుడు మాయను నియమించేవాడు. ఆయనకు తనమాయవల్ల కాలమూ, జీవాదృష్టమూ, స్వభావం అప్రయత్నంగా సిద్ధించాయి. వాటిని ఆయన వివిధరూపాలుగా చేయాలని నిశ్చయించుకొని సృష్టికార్యానికి సహకారకాలుగా స్వీకరించాడు. ఈశ్వరుడధిష్ఠించిన మహత్తత్త్వం కారణంగా కాలంనుండి త్రిగుణాల భేదమూ, స్వభావంనుండి పరిణామమూ, జీవుని అదృష్టరూపమైన కర్మనుండి జన్మమూ సిద్ధించాయి.

రజోగుణంచేతా, సత్త్వగుణంచేతా వృద్ధిపొందిన మహత్తత్త్వం వికారానికి లోనయింది. దానినుండే తమోగుణ ప్రధానమై పంచభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు రూపంగా కలదైన అహంకారం సంభవించింది. ఆ అహంకారం మరల వికృతిపొంది ద్రవ్యశక్తియైన తామసమనీ, క్రియాశక్తియైన రాజసమనీ, జ్ఞానశక్తియైన సాత్త్వికమనీ మూడురూపాలుగా పరిణమించింది.

పంచభూతాలకు మూలమైన తామసాహంకారంనుండి ఆకాశం పుట్టింది. ద్రష్ట అయిన ఆత్మకూ, దృశ్యమైన జగత్తుకూ బోధకమై సూక్ష్మరూపమై ఉన్న శబ్దం ఆకాశానికి గుణమయింది. వికారానికి లోనైన ఆకాశంనుండి స్పర్శగుణ ప్రధానమైన వాయువు పుట్టింది. తనకు కారణమైన ఆకాశంలోని శబ్దమూ, తనకు సహజమైన స్పర్శమూ అనే రెండు గుణాలు గాలికున్నాయి. ఆ గాలి శరీరాలలో ప్రాణరూపంలో ఉంటుంది. అది ఇంద్రియపటుత్వానికీ, మనోబలానికీ, శారీరకశక్తికీ హేతువవుతున్నది. వికారంపొందిన వాయువునుండే రూపం, స్పర్శం, శబ్దం–అనే మూడు గుణాలుగల్గిన తేజస్సు జనించింది. ఆ తేజస్సునుండి రసం, రూపం, స్పర్శం, శబ్దం అనే నాలుగు గుణాలతో గూడిన జలం కలిగింది. జలంనుండి గంధరసరూపస్పర్శశబ్దాలనే అయిదు గుణాలు గల పృథివి పుట్టింది. పై జెప్పినవన్నీ తామసాహంకారం నుండి కల్గినవే.

వికారానికి లోనైన సాత్త్వికాహంకారంనుండి మనస్సు జనించింది. దానికి చంద్రుడు అధిదేవత. ఆ సాత్త్వికాహంకారం నుండే దిక్కులూ, వాయువూ, సూర్యుడూ, వరుణుడూ, అశ్వినీదేవతలూ, అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడూ, మిత్రుడూ, ప్రజాపతీ అనే పదిమంది దేవతలు ఉద్భవించారు.

తైజసమైన రాజసాహంకారం నుండి శ్రోత్రం మొదలైన ఐదు జ్ఞానేంద్రియాలూ, వాక్కు మున్నగు ఐదు కర్మేంద్రియాలూ, బుద్ధీ, ప్రాణమూ కలిగాయి. ఆ పదియింద్రియాల అధిదేవతల వివరమిది – శ్రోత్రేంద్రియానికి దిక్కులూ, త్వగింద్రియానికి వాయువూ, నేత్రేంద్రియానికి సూర్యుడూ, రసనేంద్రియానికి ప్రచేతసుడూ, ఘ్రాణేంద్రియానికి అశ్వినీ దేవతలూ, వాగింద్రియానికి అగ్నీ, హస్తేంద్రియానికి ఇంద్రుడూ, పాదేంద్రియానికి ఉపేంద్రుడూ, గుదేంద్రియానికి మిత్రుడూ, ఉపస్థేంద్రియానికి ప్రజాపతి దేవతలుగా ఉన్నారు. బుద్ధి జ్ఞానం కల్గించే అంతఃకరణంలో ఒక భాగం. ప్రాణం క్రియాహేతువైన అంతఃకరణం.

శ్రోత్రాదులగు దశేంద్రియాలతో గూడిన భూతాలు, ఇంద్రియాలు, మనస్సు, శబ్దస్పర్శాదులైన గుణాలు విడివిడిగా ఉన్నప్పుడు బ్రహ్మాండమనే శరీరాన్ని నిర్మించలేకపోయాయి. ఇల్లు కట్టాలంటే అనేక వస్తువులను ఒకచోట చేర్చితేగానీ సాధ్యం కాదు గదా! అదే రీతిగా పైన పేర్కొన్న భూతాలు, ఇంద్రియాలు, మనస్సు, గుణాలు, భగవంతుని శక్తివల్ల ఒకటిగా చేరాయి. సమష్టిగానూ, వ్యష్టిగానూ కలిసి చేతనాలనూ, అచేతనాలనూ, కల్పించాయి. అలా ఈ బ్రహ్మాండాన్ని నిర్మించాయి. ఆ విధంగా నిర్మించబడిన అండం కోటి సంవత్సరాల వరకూ నీళ్ళలోనే ఉండిపోయింది.

అందుమీదట కాలకర్మస్వభావాలకు లోబడనివాడూ, అన్నింటినీ ప్రాణవంతంగా చేయగలవాడూ అయిన ఈశ్వరుడు ప్రాణరహితమైనదాన్ని ప్రాణసహితంచేశాడు. కాలకర్మస్వభావాలకు ప్రేరకుడైన ఆ దేవుడు మహావరణ జలమధ్యంలో ఉండిన బ్రహ్మాండంలో జీవరూపంతో ప్రవేశించి దాన్ని మిక్కిలి విస్తృతమయ్యేటట్లు చేశాడు. చివరికి ఆ అండాన్ని భేదించుకొని వెలికి వచ్చాడు. అది ఎలా జరిగిందో వివరిస్తాను విను.

**క. భువనాత్మకుఁ దా యీశుఁడు, భువనాకృతితోడ నుండు బ్రహ్మాండంబున్**
**వివరముతోఁ బదునాలుగు, వివరంబులుగా నొనర్చె విశదంబులుగన్. 87**

**ప్రతి :** భువన+ఆత్మకుఁడు= ప్రపంచమే స్వరూపంగా కలవాడగు; ఆ ఈశుఁడు= ఆ పరమేశ్వరుడు; భువనాకృతితోడన్= భువనాకారంతో; ఉండు బ్రహ్మాండంబున్= ఉన్నట్టి అజాండాన్ని; వివరముతోన్= వివరణంతో; పదునాలుగు వివరంబులుగాన్= పద్నాల్గు లోకాలుగా; విశదంబులుగన్= స్పష్టమయ్యేటట్లు; ఒనర్చెన్= చేశాడు.

**తా :** జగత్స్వరూపుడైన ఆ పరమేశ్వరుడు ఒక భవనాన్ని పోలివున్న ఈ బ్రహ్మాండాన్ని విడివిడిగా చేసి విపులమైన చతుర్దశ భువనాలుగా తీర్చిదిద్దాడు.

**మ. బహుపాదోరుభుజాననేక్షణశిరఃఫాలశ్రవో యుక్తుఁడై**
**విహరించున్ బహుదేహి దేహగతుఁడై, విద్వాంసు లూహించి త**
**ద్బహురూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతు, రా**
**మహనీయాద్భుతమూర్తి యోగిజనహృన్మాన్యుండు మేధానిధీ! 88**

**ప్రతి :** మేధానిధీ= బుద్ధిమంతుడా!; బహు= అనేకాలైన; పాద= చరణాలు; ఊరు= తొడలు; భుజ= భుజాలు; ఆనన= ముఖాలు; ఈక్షణ= నేత్రాలు; శిరస్= తలలు; ఫాల= నొసళ్ళు; శ్రవస్= చెవులు – వీటితో; యుక్తుఁడు+ఐ= కూడినవాడై; బహుదేహి= అనేక శరీరధారులయొక్క; దేహగతుఁడు+ఐ= శరీరాలలో నున్నవాడై; విహరించున్= ఆ దేవుడు విహరిస్తాడు; విద్వాంసులు= పండితులు; ఊహించి= తర్కించి; తద్+బహురూప+అవయవంబులన్= ఆ దేవుని నానారూపాలైన అంగాలలో; భువనసంపత్తిన్= లోక సంపదను; విచారింతురు= ఆలోచిస్తారు; ఆ మహనీయ+అద్భుతమూర్తి= అట్టి పూజనీయమై ఆశ్చర్యావహమైన భగవంతుడు; యోగిజన= యోగులయొక్క; హృద్+మాన్యుండు= హృదయాలచే పూజింపదగినవాడు.

**తా :** మేధావీ! ఆ భగవంతుడు పలుపాదాలూ, తొడలూ, భుజాలూ, ముఖాలూ, నేత్రాలూ, శిరస్సులూ, నొసళ్ళూ, చెవులూ కలిగివుంటాడు. అలా ఉంటూ అనేక ప్రాణుల శరీరాలలో నెలకొని విహరిస్తూ ఉంటాడు. పండితులు చక్కగా విమర్శించి ఆ భగవంతుని నానారూపాలైన అవయవాలలోనే సర్వ ప్రపంచపుటునికినీ ఊహిస్తూ ఉంటారు. మహనీయుడూ, ఆశ్చర్యకరమైన స్వరూపం కలవాడూ అయిన ఆ భగవంతుడు యోగుల హృదయాలచే పూజింపదగి ఉన్నాడు.

**వ. వినుము. చతుర్దశలోకంబులందు మీఁది యేడు లోకంబులు శ్రీమహావిష్ణువునకుం గటిప్రదేశంబున నుండి యూర్ధ్వదేహ మనియును, గ్రింది యేడు లోకంబులు జఘనంబునుండి యధోదేహ మనియునుం బలుకుదురు. ప్రపంచ శరీరుండగు భగవంతుని ముఖంబువలన బ్రహ్మకులంబును, బాహువులవలన క్షత్త్రియకులంబును, నూరువులవలన వైశ్యకులంబును, బాదంబులవలన శూద్రకులంబును జనియించెనని చెప్పుదురు; భూలోకంబు గటి ప్రదేశంబు, భువర్లోకంబు నాభి, సువర్లోకంబు హృదయంబు, మహర్లోకంబు వక్షంబు, జనలోకంబు గ్రీవంబు, తపోలోకంబు స్తనద్వయంబు, సనాతనంబును బ్రహ్మనివాసంబును నైన సత్యలోకంబు శిరంబు, జఘన ప్రదేశం బతలంబు, తొడలు వితలంబు, జానువులు సుతలంబు, జంఘలు**

తలాతలంబు, గుల్ఫంబులు మహీతలంబు, పదాగ్రంబులు రసాతలంబు, పాదతలంబు పాతాళంబు నని (లోకమయుంగా) భావింతురు. కొందఱు మఱియుం బాదతలంబువలన భూలోకంబును, నాభివలన భువర్లోకంబును, శిరంబువలన స్వర్లోకంబును గలిగెనని లోకకల్పనంబు నెన్నుదురు. పురుషోత్తముని ముఖంబువలన సర్వజంతు వాచాజాలంబును, తదధిష్ఠాతయగు వహ్నియు నుదయించె! చర్మరక్తమాంస మేదశ్శల్య మజ్జాశుక్లంబులు సప్తధాతువు లందురు. పక్షాంతరంబున రోమ త్వఙ్మాంసాస్థి స్నాయుమజ్జా ప్రాణంబులును సప్తధాతువులని యందురు, అందు రోమంబు లుష్ణిక్ఛందంబనియుఁ. ద్వక్కు ధాత్రీఛందం బనియు, మాంసంబు త్రిష్టుప్ఛందం బనియు, స్నాయు వనుష్టుప్ఛందం బనియు, నస్థి జగతీఛందం బనియు, మజ్జ పంక్తిచ్ఛందం బనియుఁ, బ్రాణంబు బృహతీఛందం బనియు నాదేశింతురు. హవ్యకవ్యామృతాన్నంబులకు, మధురాది షడ్రసంబులకు రసనేంద్రియంబునకు, రసాధీశ్వరుండైన వరుణునికిని హరిరసనేంద్రియంబు జన్మస్థానంబు. సర్వప్రాణాదులకు వాయువునకు విష్ణునాసికా వివరంబు నివాసంబు. సమీప దూరవ్యాపి గంధంబులకు, నోషధులకు, నశ్విదేవతలకు భగవంతుని ఘ్రాణేంద్రియంబు నివాసంబు; దేవలోక సత్యలోకంబులకుఁ, దేజంబునకు, సూర్యునకు, సకలచక్షువులకు లోకలోచనుని చక్షురింద్రియంబు స్థానంబు; దిశలకు, నాకాశంబునకు, శ్రుతిభూతంబులైన యంశంబులకు, శబ్దంబునకు సర్వేశ్వరుని కర్ణేంద్రియంబు జన్మస్థానంబు. వస్తుసారంబులకు, వర్ణనీయ భాగ్యంబులకుఁ బరమ పురుషుని గాత్రంబు భాజనంబు. స్పర్శంబునకు, వాయువునకు, సకలస్నిగ్ధత్వంబునకు దివ్యదేహుని దేహేంద్రియంబు గేహంబు. యూపప్రముఖ యజ్ఞోపకరణంబులగు తరుగుల్మ లతాదులకుఁ బురుషోత్తముని రోమంబులు మూలంబులు, శిలాలోహంబులు సర్వమయుని నఖంబులు, మేఘజాలంబులు హృషీకేశుని కేశంబులు, మెఱుంగులు విశ్వేశ్వరుని శ్మశ్రువులు. భూర్భువస్సువర్లోక రక్షకులైన లోకపాలకుల పరాక్రమంబులకు భూరాదిలోకంబులకు క్షేమంబునకు, శరణంబునకు నారాయణుని విక్రమంబులు నికేతనంబులు; సర్వకర్మంబులకు, నుత్తమంబులైన వరంబులకుఁ దీర్ఘపాదుని పాదారవిందంబు లాస్పదంబులు. జలంబులకు, శుక్లంబునకుఁ, బర్జన్యునకుఁ, బ్రజాపతిసర్గంబునకు సర్వేశ్వరుని మేఢ్రంబు సంభవ నిలయంబు. సంతానంబునకుఁ, గామాదిపురుషార్థంబులకుఁ జిత్తసౌఖ్యరూపంబులగు నానందంబులకు, శరీర సౌఖ్యంబునకు నచ్యుతుని యుపస్థేంద్రియంబు స్థానంబు. యమునికి, మిత్రునికి, మలవిసర్గంబునకు భగవంతుని పాయ్వింద్రియంబు భవనంబు. హింసకు, నిర్ఋతికి, మృత్యువునకు, నిరయంబునకు నిఖిలరూపకుని గుదంబు నివాసంబు. పరాభవంబునకు, నధర్మంబునకు, నవిద్యకు, నంధకారంబునకు ననంతుని పృష్ఠభాగంబు సదనంబు, నదనదీ నివహంబునకు నీశ్వరునినాడీ సందోహంబు జన్మమందిరంబు. పర్వతంబులకు నధోక్షజుని శల్యంబులు జనకస్థలంబులు. ప్రధానంబునకు, నన్నరసంబునకు, సముద్రంబులకు, భూతలయంబునకు బ్రహ్మాండగర్భుని యుదరంబు నివేశంబు. మనోవ్యాపార రూపంబగు లింగశరీరంబునకు మహామహిముని హృదయంబు సర్గభూమి యగు, మఱియును. 89

**ప్రతి :** వినుము= విను; చతుర్దశలోకంబులందున్= పదునాల్గు భువనాలలో; మీఁది యేడు లోకంబులు= పైనున్న సప్తలోకాలు; శ్రీమహావిష్ణువునకున్= ఆ విష్ణుదేవునికి; కటిప్రదేశంబుననుండి= నడుమునుండి; ఊర్ధ్వదేహమనియును= పైశరీరమనీ; క్రింది యేడు లోకంబులు= క్రింది సప్తలోకాలూ; జఘనంబునుండి= నడుమునుండి; అధోదేహమనియునున్= క్రింది శరీరమనీ పలుకుదురు; ప్రపంచశరీరుండు+అగు= భువనమే శరీరంగా కల్గిన; భగవంతుని ముఖంబువలనన్= పరమేశ్వరుని వదనంనుండి; బ్రహ్మకులంబును= బ్రాహ్మణకులం; బాహువులవలనన్= భుజాలనుండి; క్షత్రియకులంబును= రాజవంశం; ఊరువులవలనన్= తొడలనుండి; వైశ్యకులంబును= వైశ్యవంశం; పాదంబులవలనన్= చరణాలనుండి; శూద్రకులంబును= శూద్రజాతియును; జనియించెను+అని= కలిగాయని చెప్పుదురు; భూలోకంబు= పృథ్వీలోకం; కటిప్రదేశంబు= మొలభాగం; భువర్లోకంబు= భువర్లోకం; నాభి= బొడ్డు; సువర్లోకంబు= సువర్లోకం; హృదయంబు= హృదయస్థానం, మహర్లోకంబు; వక్షంబు= వక్షఃస్థలం; జనలోకంబు= భూమినుండి అయిదవది అయిన జననామంగల లోకం; గ్రీవంబు= కంఠం; తపోలోకంబు= తాపసులుండేలోకం; స్తనద్వయంబు= రెండుచన్నులు; సనాతనంబును= అనాదిసిద్ధమూ; బ్రహ్మనివాసంబునున్+ఐన= బ్రహ్మకు నెలవూఅయిన; సత్యలోకంబు= సత్యలోకం; శిరంబు= మస్తకం; జఘన ప్రదేశంబు= జఘనస్థలం; అతలంబు= అతలం; తొడలు= ఊరువులు; వితలంబు= వితలం; జానువులు= మోకాళ్ళు; సుతలంబు= సుతలం; జంఘలు= పిక్కలు; తలాతలంబు= తలాతలం; గుల్ఫంబులు= చీలమండలు; మహాతలంబు= మహాతలం; పదాగ్రంబులు= కాలిమునివ్రేళ్ళు; రసాతలంబు= రసాతలం; పాదతలంబు= అరికాలు; పాతాళంబున్= పాతాళం అని; లోకమయున్+కాన్= భువనస్వరూపునిగా; భావింతురు= భావిస్తారు; మఱియున్ కొందఱు= ఇంకను కొందరు; పాదతలంబువలనన్= చరణతలంనుండి; భూలోకంబును= పృథ్వీలోకం; నాభివలనన్= బొడ్డునుండి; భువర్లోకంబునున్= భువర్లోకం; శిరంబువలనన్= శిరస్సునుండి; స్వర్లోకంబునున్= స్వర్గలోకం కలిగెనని; లోక కల్పనంబున్= లోకనిర్మాణాన్ని; ఎన్నుదురు= పరిగణిస్తారు; పురుషోత్తముని= పరమపురుషునియొక్క; ముఖంబువలనన్= వదనంనుండి; సర్వజంతు వాచాజాలంబునున్= సమస్త ప్రాణుల వాక్యసమూహమూ; తద్+అధిష్ఠాత+అగు= వాక్కుకు అధిష్ఠానదైవమైన; వహ్నియున్= అగ్నియును; ఉదయించెన్= ఉద్భవించాయి; చర్మ= చర్మం; రక్త= నెత్తురు; మాంస= మాంసం; మేదస్= మేదస్సు; శల్య= ఎముకలు; మజ్జా= మజ్జ; శుక్లంబులు= శుక్లం అనునవి; సప్తధాతువులు+అందురు= ఏడు ధాతువులంటారు; పక్షాంతరంబునన్= మరొక పక్షం అనుసరించి; రోమ= శిరస్సుకాక ఇతరాంగాలమీద ఉండే వెంట్రుకలు; మాంస= మాంసం; అస్థి= ఎముకలు; స్నాయు= సన్నని నరాలు; మజ్జా= మజ్జ; ప్రాణంబులునున్= ప్రాణాలూ; సప్తధాతువులు+అని= ఏడుధాతువులని అందురు; అందున్= వాటిలో; రోమంబులు= వెంట్రుకలు; ఉష్ణిక్ఛందంబు+అనియున్= 'ఉష్ణిక్' అనే ఛందస్సనీ; త్వక్కు= చర్మం; ధాత్రీఛందంబనియున్= 'ధాత్రి' అనే ఛందస్సనీ; మాంసంబు= మాంసం; 'త్రిష్టుప్' ఛందంబు+ అనియున్= 'త్రిష్టుప్' అనే ఛందస్సనీ; స్నాయువు= నరం; 'అనుష్టుప్' ఛందంబు+అనియున్= 'అనుష్టుప్' అనే ఛందస్సనీ; అస్థి= ఎముక; 'జగతీ' ఛందంబు+అనియున్= 'జగతి' అనే ఛందస్సు అనియు; మజ్జ= ఎముకలలోని కొవ్వు; 'పంక్తి' చ్ఛందంబు+అనియున్= 'పంక్తి' అనే ఛందస్సనీ; ప్రాణంబు= ప్రాణం; 'బృహతీ' ఛందంబు+అనియున్= 'బృహతి' అనే ఛందస్సనీ; ఆదేశింతురు= వ్యవహరిస్తారు; హవ్య...అన్నంబులకున్= హవ్య= దేవతల కర్పించే పురోడాశరూపహవ్యానికీ; కవ్య= పితరుల కిచ్చే చరురూపమైన కవ్యానికీ; అమృత+అన్నంబులకున్= అమృతమనే అన్నానికీ; మధుర+ ఆదిషడ్రసంబులకున్= 'తీపి' మొదలైన ఆరు రసాలకూ; రసనా+ఇంద్రియంబునకున్= జిహ్వేంద్రియానికీ; రస+అధీశ్వరుండు+ ఐన= జలానికి అధిదేవత అయిన; వరుణునికిని= వరుణ దేవునికీ; హరిరసనా+ఇంద్రియంబు= విష్ణుదేవుని జిహ్వేంద్రియం; జన్మస్థానంబు= పుట్టుచోటు; సర్వప్రాణాదులకున్= సమస్తమైన ప్రాణం, అపానం మొదలగువానికి; వాయువునకున్=

గాలికి; విష్ణునాసికావివరంబు= విష్ణుదేవుని ముక్కులోని రంధ్రం; నివాసంబు= నివాసప్రదేశం; సమీపదూరవ్యాపిగంధంబులకున్= దగ్గఱగానూ, దూరంగానూ, ప్రసరించే వాసనలకు; ఓషధులకున్= ఔషధవృక్షాలకూ; అశ్విదేవతలకున్= అశ్వినీ దేవతలకూ; భగవంతుని ఘ్రాణ+ఇంద్రియంబు= పరమేశ్వరుని 'ఘ్రాణ' మనే ఇంద్రియం; నివాసంబు= వాసస్థానం; దేవలోక సత్యలోకంబులకున్= దేవతల లోకానికీ, (బ్రహ్మనివసించే) సత్యలోకానికీ; తేజంబునకున్= తేజస్సుకూ; సూర్యునకున్= భానునకూ; సకల చక్షువులకున్= సర్వనేత్రాలకూ; లోకలోచనుని= లోకనేత్రుడైన శ్రీమన్నారాయణునియొక్క; చక్షురింద్రియంబు= నేత్రేంద్రియం; స్థానంబు= నివాసం; దిశలకున్= దిక్కులకూ; ఆకాశంబునకున్= ఆకసానికీ; శ్రుతిభూతంబులు+ఐన= శ్రవణభూతాలైన; అంశంబులకున్= విషయాలకూ; శబ్దంబునకున్= ధ్వనికీ; సర్వ+ఈశ్వరుని= పరమేశ్వరునియొక్క; కర్ణ+ఇంద్రియంబు= శ్రోత్రేంద్రియం; జన్మస్థానంబు= పుట్టిన నెలవు; వస్తుసారంబులకున్= పదార్థాల సారాంశాలకు; వర్ణనీయ= వర్ణింపదగిన; భాగ్యంబులకున్= భాగధేయాలకు (సంపదలకు); పరమపురుషుని= పరమేశ్వరుని యొక్క; గాత్రంబు= శరీరం; భాజనంబు= స్థానం; స్పర్శంబునకున్= తాకిడికి; వాయువునకున్= గాలికి; సకలస్నిగ్ధత్వంబునకున్= నైగనిగ్యానికంతటికీ; దివ్యదేహుని= దివ్యశరీరుడైన పరమేశ్వరునియొక్క; దేహ+ఇంద్రియంబు= శరీరేంద్రియం; గేహంబు= గృహం; యూపప్రముఖయజ్ఞ+ఉపకరణంబులు+అగు= యాగపశుబంధన స్తంభం మున్నగు యజ్ఞసాధనాలైన; తరుగుల్మలతా+ఆదులకున్= చెట్లు, పొదలు, తీగలు మున్నగువాటికి; పురుషోత్తముని= పరమపురుషుని; రోమంబులు= శిరస్సు తప్ప తక్కిన అవయవాలమీది వెంద్రుకలు; మూలంబులు= కారణాలు; శిలాలోహంబులు= రాళ్ళు, లోహాలూ; సర్వమయుని= సర్వేశ్వరుని; నఖంబులు= గోళ్ళు; మేఘజాలంబులు= మబ్బులు; హృషీకేశుని= మాధవునియొక్క; కేశంబులు= వెంద్రుకలు; మెఱుంగులు= మెఱుపులు; విశ్వ+ఈశ్వరుని= విశ్వప్రభునియొక్క; శ్మశ్రువులు= గడ్డాలు, మీసాలు; భూర్భువస్సువర్లోకరక్షకులు+ఐన= భూలోకానికీ, భువర్లోకానికీ, సువర్లోకానికీ రక్షకులుగా ఉన్న; లోకపాలకుల= భువన పాలకులయొక్క; పరాక్రమంబులకున్= విక్రమాలకు; భూరాదిలోకంబుల= భూలోకం మున్నగు లోకాలయొక్క; క్షేమంబునకున్= సుస్థితికి; శరణంబునకున్= రక్షణకూ; నారాయణుని= మాధవునియొక్క; విక్రమంబులు= పరాక్రమాలు; నికేతనంబులు= నిలయాలు; సర్వకర్మంబులకున్= సమస్తకార్యాలకూ; ఉత్తమంబులు+ఐన వరంబులకున్= శ్రేష్ఠమైన వరాలకు; తీర్థపాదుని= పవిత్రపాదుడైన శ్రీహరియొక్క; పాద+అరవిందంబులు= చరణాంబుజాలు; ఆస్పదంబులు= స్థానాలు; జలంబులకున్= నీటికి; శుక్లంబునకున్= వీర్యానికీ; పర్జన్యునకున్= మేఘానికీ; ప్రజాపతి సర్గంబునకున్= బ్రహ్మసృష్టికీ; సర్వేశ్వరుని= సర్వప్రభువైన పరమాత్మునియొక్క; మేఢ్రంబు= పురుషాంగం; సంభవనిలయంబు= పుట్టుచోటు; సంతానంబునకున్= సంతతికీ; కామాదిపురుషార్థంబులకున్= కామం మున్నగు పురుషార్థాలకూ; చిత్తసౌఖ్యరూపంబులగు= మనస్సుకు సౌఖ్యం కలిగించే రూపంగల; ఆనందంబులకున్= సంతోషాలకు; శరీరసౌఖ్యంబునకున్= దేహసుఖానికీ; అచ్యుతుని= మాధవునియొక్క; ఉపస్థేంద్రియంబు= గుహ్యేంద్రియం; స్థానంబు= నిలయం; యమునికిన్= యమధర్మరాజుకూ; నిర్‌ఋతికిన్= నైరృతి పాలకుడైన నిర్‌ఋతికీ; మృత్యువునకున్= మృత్యుదేవతకు; నిరయంబునకున్= నరకానికీ; నిఖిలరూపకుని= సర్వరూపుడైన భగవంతుని; గుదంబు= గుదేంద్రియం; నివాసంబు= నెలవు; పరాభవంబునకున్= అవమానానికీ; అధర్మంబునకున్= ధర్మవిరుద్ధమైనదానికి; అవిద్యకున్= అజ్ఞానానికీ; అంధకారంబునకున్= చీకటికి; అనంతుని= భగవంతునియొక్క; పృష్ఠభాగంబు= వీపు (మూడి); సదనంబు= గృహం; నదనదీనివహంబునకున్= నదీ నదుల సమూహానికి; ఈశ్వరుని నాడీ సందోహంబు= భగవంతుని నాడీబృందం; జన్మమందిరంబు= పుట్టినయిల్లు; పర్వతంబులకున్= కొండలకు; అధోక్షజుని= విష్ణునియొక్క; శల్యంబులు= ఎముకలు; జనకస్థలంబులు= పుట్టుచోటులు; ప్రధానంబునకున్= ప్రకృతికి; అన్నరసంబునకున్= ఆహారరసానికీ; సముద్రంబులకున్= సాగరాలకు; భూతలయంబునకున్= ప్రాణుల లయస్థితికీ;

బ్రహ్మాండగర్భుని= బ్రహ్మాండాన్ని గర్భంలో కలిగివున్నవాని; ఉదరంబు= గర్భం; నివేశంబు= స్థానం; మనోవ్యాపారంబు+అగు= చిత్తచేష్టారూపమైన; లింగశరీరంబునకున్= కారణశరీరానికి; మహామహిముని= గొప్పమహిమలు గల ఆ దేవుని; హృదయంబు= హృదయం; సర్గభూమి+అగున్= సృష్టి స్థానమవుతున్నది; మఱియున్= ఇంకను–

**తా :** ఈ పద్నాలుగు లోకాలలో పై ఏడులోకాలు మహావిష్ణువుయొక్క నడుమునుండి పై శరీరమంటారు. అట్లే క్రింది ఏడులోకాలూ నడుమునుండి క్రింది శరీరమంటారు. ఈ ప్రపంచమే భగవంతునికి శరీరం. ఆయన ముఖంనుండి బ్రహ్మకులమూ, బాహువులనుండి క్షత్రియకులమూ, తొడలనుండి వైశ్యకులమూ, పాదాలనుండి శూద్రకులమూ పుట్టాయని వర్ణిస్తారు.

ఆ మహావిష్ణువుకు కటిస్థలం భూలోకం, నాభి భువర్లోకం, హృదయం సువర్లోకం, వక్షం మహర్లోకం, కంఠం జనలోకం, స్తనాలు తపోలోకం, శిరస్సు సనాతనమైన సత్యలోకం, జఘనం అతలం, తొడలు వితలం, మోకాళ్లు సుతలం, పిక్కలు తలాతలం, చీలమండలు మహాతలం, కాలిమునివ్రేళ్ళు రసాతలం, అరికాలు పాతాళం. ఈ కారణంవల్ల ఆ దేవుణ్ణి లోకమయుడని భావిస్తారు.

మరి కొంతమంది ఆయన పాదతలంనుండి భూలోకమూ, బొడ్డునుండి భువర్లోకమూ, శిరస్సునుండి సువర్లోకమూ పుట్టాయని మూడు లోకాల సృష్టినీ వివరిస్తారు.

శ్రీమన్నారాయణుని ముఖంనుండి సమస్త ప్రాణుల వాక్కులూ, వాక్కుల కధిష్ఠానమైన అగ్నీ పుట్టాయి. చర్మం, రక్తం, మాంసం, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లం – ఇవి యేడు ఆ దేవుని ఏడు ధాతువులంటారు. మరొక పద్ధతిలో రోమాలు, చర్మం, మాంసం, ఎముకలు, స్నాయువులు, మజ్జ, ప్రాణాలు– ఇవి ఏడు ధాతువులని వర్ణిస్తారు.

వాటిలో రోమాలు ఉష్ణిక్ ఛందస్సనీ, చర్మం ధాత్రీ ఛందస్సనీ, మాంసం త్రిష్టుప్ ఛందస్సనీ, స్నాయువులు అనుష్టుప్ ఛందస్సనీ, శల్యం జగతీ ఛందస్సనీ, మజ్జ 'పంక్తి' చ్ఛందస్సనీ, ప్రాణం బృహతీ ఛందస్సనీ వ్యవహరిస్తారు.

దేవతల కర్పించే పురోడాశరూపమైన హవ్యానికీ, పితృదేవతల కిచ్చే చరురూపమైన కవ్యానికీ, అమృతాన్నానికీ, మధురాదులైన ఆరురసాలకీ, రసనేంద్రియానికీ, రసానికీ అధీశ్వరుడైన వరుణుడికీ విష్ణుని రసనేంద్రియమే జన్మస్థానం. అట్లే అన్ని ప్రాణాదులకూ, వాయువుకూ, విష్ణుని నాసారంధ్రం నెలవు. దగ్గరగానూ, దూరంగానూ వ్యాపించే గంధాలకూ, ఓషధులకూ, అశ్వినీ దేవతలకూ ఆ పరమేశ్వరుని ఘ్రాణేంద్రియం స్థానం.

దేవలోకానికీ, సత్యలోకానికీ, తేజస్సుకూ, సూర్యుడికీ, సకలనేత్రాలకూ లోకనేత్రుడైన పరమాత్ముని చక్షురింద్రియమే నివాసం. దిక్కులకూ, ఆకాశానికీ, శ్రవణాంశాలకూ, శబ్దానికీ, సర్వేశ్వరుని శ్రోత్రేంద్రియం జన్మభూమి. ప్రశస్తాలైన వస్తువులకూ, కొనియాడదగిన సౌందర్యాలకూ పరమ పురుషుని శరీరమే స్థానం.

స్పర్శానికీ, గాలికీ, నైగనిగ్యానికీ, ఆ దివ్యశరీరుని త్వగింద్రియమే గృహం. యాగపశువును బంధించే స్తంభాది యజ్ఞపరికరాలైన చెట్లూ, పొదలూ, తీగలూ, మొదలైన వాటికి పురుషోత్తముని రోమాలు స్థానాలు. రాళ్ళూ, లోహాలూ ఆ విశ్వాత్మునికి గోళ్ళు. మబ్బులు ఆయన శిరోజాలు. మెరుపులు సర్వేశుని మీసాలు, భూలోక భువర్లోక సువర్లోకాలను కాపాడే లోకపాలకుల పరాక్రమాలకు, భూలోకం మున్నగు లోకాల క్షేమానికీ, శరణానికీ నారాయణుని పరాక్రమం నట్టిల్లు. ఎల్ల కోరికలకూ, శ్రేష్ఠమైన వరాలకూ ఆ పవిత్రపాదుని పాదపద్మాలే నిలయాలు.

జలాలు, శుక్లం, పర్జన్యుడు, ప్రజాపతి సృష్టి – వీటన్నింటికీ ఆ సర్వేశ్వరుని పురుషాంగం జన్మస్థలం. సంతతికీ, కామం మున్నగు పురుషార్థాలకూ, మనస్సుకు సుఖం కలిగించే ఆనందాలకూ, శరీరసుఖానికీ అచ్యుతుని గుహ్యేంద్రియం స్థానం. యమునికీ, మిత్రునికీ, మల విసర్జనానికీ ఆ దేవుని పాయ్వింద్రియం ఇల్లు. హింసకూ, నిరృతికీ, మృత్యువుకూ, నరకానికీ ఆ సర్వరూపుని గుదం నెలవు. అవమానానికీ, అధర్మానికీ, అవిద్యకూ, చీకటికీ, అంతంలేని ఆ దేవుని పృష్ఠదేశం నివాసం. నదనదీసమూహాలకు ఆ ఈశ్వరుని నాడీసంఘం పుట్టిల్లు, కొండలకు ఆ దేవుని ఎముకలు జన్మస్థానాలు. ప్రకృతికీ, అన్నరసానికీ, సముద్రాలకూ, భూతాల విలయానికీ ఆ బ్రహ్మాండగర్భుని ఉదరమే ఉనికిపట్టు. మానసిక వ్యాపారరూపమైన లింగదేహానికి గొప్ప మహిమగల ఆ దేవుని హృదయం సృష్టి స్థానం. అంతే కాదు,

**ఆ. నీలకంధరునకు నీకు నాకు సనత్కు, మారముఖ్య సుతసమాజమునకు**
**ధర్మసత్త్వబుద్ధి తత్త్వములకు నీశ్వ, రాత్మ వినుము పరమమైన నెలవు. 90**

**ప్రతి :** నీలకంధరునకున్= శివునకూ; నీకున్, నాకున్= నీకూ, నాకూ; సనత్కుమారముఖ్య= సనత్కుమారుడు మున్నుగాగల; సుతసమాజమునకున్= పుత్రసముదాయానికీ; ధర్మ= ధర్మానికీ; సత్త్వ= సత్త్వగుణానికీ; బుద్ధి= బుద్ధియొక్క; తత్త్వములకున్= విజ్ఞానానికీ; పరమము+ఐన= శ్రేష్ఠమైన; నెలవు= స్థానం; ఈశ్వర+ఆత్మ= పరమేశ్వరుని ఆత్మయే; వినుము= విను.

**తా :** నారదా! వినుము. శివునికీ, నీకూ, నాకూ, సనత్కుమారుడు మున్నగు కుమారులకూ, ధర్మానికీ, సత్త్వానికీ, బుద్ధితత్త్వానికీ, (విజ్ఞానానికీ) శ్రేష్ఠమైన ఉనికిపట్టు ఆ పరమేశ్వరుని ఆత్మయే.

**సీ. నరసురాసుర పితృ నాగ కుంజర మృగ, గంధర్వ యక్ష రాక్షస మహీజ**
**సిద్ధ విద్యాధర జీమూత చారణ, గ్రహ తారకాప్సరోగణ విహంగ**
**భూత తటిద్వస్తుపుంజంబులును నీవు, ముక్కంటియును మహామునులు నేను**
**సలిలనభస్థ్సలచరములు మొదలైన, వివిధజీవులతోడి విశ్వమెల్ల**

**ఆ. విష్ణుమయము పుత్త్ర! వే యేల బ్రహ్మాండ, మతని జేనలోన నడఁగి యుండు**
**బుద్ధి నెఱుఁగరాదు భూతభవద్భవ్య, లోకమెల్ల విష్ణులోన నుండు. 91**

**ప్రతి :** పుత్త్ర= కుమారా!; నర= మానవులు; సుర= దేవతలు; అసుర= అసురులు; పితృ= పితరులు; నాగ= సర్పాలు; కుంజర= గజాలు; మృగ= మృగాలు; గంధర్వ= గంధర్వులు; యక్ష= యక్షులు; రాక్షస= రక్కసులు; మహీజ= వృక్షాలు; సిద్ధ= సిద్ధులు; విద్యాధర= విద్యాధరులు; జీమూత= మేఘాలు; చారణ= చారణులు; గ్రహ= గ్రహాలూ; తారకా= నక్షత్రాలు; అప్సరస్+గణ= అప్సరసలసమూహాలు; విహంగ= పక్షులు; భూత= భూతగణాలూ; తటిత్= మెరుపులు; వస్తుపుంజంబులునున్= వస్తుసముదాయాలూ; నీవు; ముక్కంటియును= శివుడును; మహామునులు= గొప్పమునులూ; నేను; సలిల= జలంలోను; నభస్= ఆకాశంలోను; స్థల= నేలయందు; చరములు= చరించే ప్రాణులు; మొదలైన వివిధజీవులతోడి= నానా జీవసంచయంతో గూడియున్న; విశ్వము+ఎల్లన్= ప్రపంచమంతా; విష్ణుమయము= హరిమయం; వేయి+ఏల= వేయి (పెక్కు) మాటలెందుకు?; బ్రహ్మాండము= అజాండం; అతని జేనలోనన్= ఆ పరమేశ్వరుని పంద్రెండంగుళముల కొలతగల ప్రదేశంలో; అడఁగియుండున్= లీనమైయుంటుంది; బుద్ధిన్= తెలివితో; ఎఱుఁగన్‌రాదు= తెలిసికొన వీలుగాదు; భూతభవద్భవ్యలోకమెల్లన్= జరిగిన, జరుగుతున్న, జరుగనున్న ప్రపంచమంతా; విష్ణులోనన్+ ఉండున్= విష్ణుదేవునిలోనే ఉంటుంది.

**తా :** కుమారా? నరులూ, దేవతలూ, దానవులూ, పితరులూ, ఉరగులూ, గజాలూ, మృగాలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ, వృక్షాలూ, సిద్ధులూ, విద్యాధరులూ, మేఘాలూ, చారణులూ, గ్రహాలూ, నక్షత్రాలూ, అచ్చరలూ, పక్షులూ, భూతగణాలూ, మెరుపులూ, వివిధ వస్తువులూ, నీవూ, శివుడూ, మునులూ, నేనూ, నీళ్లలోనూ, ఆకసంలోనూ, నేలమీదా చరించే వివిధప్రాణులతో గూడిన ఈ విశ్వమంతా విష్ణుమయమే. పెక్కు మాటలేల? ఈ బ్రహ్మాండాలన్నీ అతని ఒక్క జేనలో ఇమిడిపోతాయి. బుద్ధిబలంతో ఆ భగవంతుణ్ణి తెలుసుకోలేము. కడచన్నవీ, ఇప్పుడున్నవీ, రానున్నవీ – అగు లోకాలన్నీ శ్రీవిష్ణుదేవునిలోనే ఉన్నాయి.

**క. మండలములోన భాస్కరుఁ, డుండి జగంబులకు దీప్తి నొసఁగెడి క్రియ, బ్ర**
**హ్మాండములోపల నచ్యుతుఁ, డుండుచు. బహిరంతరముల నొగి వెలిఁగించున్. 92**

**ప్రతి :** భాస్కరుఁడు= సూర్యుడు; మండలములోనన్= తన మండల పరిధిలోనే; ఉండి= నిలిచి; జగంబులకున్= లోకాలకు; దీప్తిన్= ప్రకాశాన్ని; ఒసఁగెడి క్రియన్= ఇచ్చేరీతిగా; అచ్యుతుఁడు= శ్రీహరి; బ్రహ్మాండములోపలన్= అజాండంలోననే; ఉండుచున్= ఉంటూ; బహిరంతరములన్= వెలుపలా, లోపలా; ఒగిన్= క్రమంగా; వెలిఁగించున్= ప్రకాశింపజేస్తున్నాడు.

**తా :** సూర్యుడు తన మండలంలోనే తానుంటూ లోకాలకు కాంతిని ప్రసాదిస్తున్నాడు. అట్లే అచ్యుతుడు బ్రహ్మాండంలో ఉంటూనే లోపలా, వెలుపలా ప్రకాశింపజేస్తున్నాడు.

**ఉ. అట్టి యనంతశక్తి జగదాత్ముని నాభిసరోజమందు నేఁ**
**బుట్టి యజింపఁగా మనసు పుట్టిన యజ్ఞపదార్థజాతముల్**
**నెట్టన కానరామికి వినిర్మలమైన తదీయరూపమున్**
**గట్టిగ బుద్ధిలో నిలిపి కంటి నుపాయము నా మనంబునన్. 93**

**ప్రతి :** అట్టి= అటువంటి; అనంతశక్తి జగదాత్మునిన్= అనంతమైన శక్తిగల విశ్వాత్మునియొక్క; నాభిసరోజమందున్= నాభిపద్మంలో; నేన్= నేను; పుట్టి; యజింపఁగాన్= యజ్ఞం చేయడానికి; మనసుపుట్టినన్= సంకల్పం కలుగగా; యజ్ఞపదార్థజాతముల్= యజ్ఞాని కవసరమైన వస్తుసముదాయాలు; నెట్టనన్= స్పష్టంగా; కానరామికిన్ కనిపించకపోవడంతో; వినిర్మలము+ఐన= స్వచ్ఛమైన; తదీయ రూపమున్= ఆ దేవుని రూపాన్ని; గట్టిగన్= దృఢంగా; బుద్ధిలోన్= మతిలో; నిలిపి= నెలకొల్పి; నామనంబునన్= నా చిత్తంలో; ఉపాయమున్ కంటిన్= ఉపాయం కనుగొన్నాను.

**తా :** అట్టి అనంతశక్తి సంపన్నుడైన విశ్వాత్ముని బొడ్డుతామరలో నేను పుట్టాను. నాకు యజ్ఞం చేయాలనే బుద్ధి పుట్టింది. కాని ఆ యజ్ఞాని కవసరమైన పదార్థాలేవీ నాకు కనిపించలేదు. అప్పుడు మిగుల స్వచ్ఛమైన ఆ భగవంతుని స్వరూపాన్ని దృఢంగా బుద్ధిలో నిలిపి ధ్యానం చేశాను. అప్పుడు నా మనస్సులో ఒక ఉపాయం తోచింది.

**సీ. పశుయజ్ఞ వాటయూపస్తంభ పాత్ర మృ, ద్ఘట శరావ వసంతకాలములును**
**స్నేహౌషధీబహులోహచాతుర్హోత్ర, మత నామధేయసన్మంత్రములును**
**సంకల్పఋగ్యజుస్సామ నియుక్త వ, షట్కారమంత్రానుచరణములును**
**దక్షిణల్ దేవతాధ్యాన తదనుగత, తంత్రవ్రతోద్దేశ ధరణిసురులు**

**తే. నర్పణంబులు బోధాయనాదికర్మ, సరణి మొదలగు యజ్ఞోపకరణసమితి**
**యంతయును న మ్మహాత్ముని యవయవములు, గాఁగఁ గల్పించి విధివత్ప్రకారమునను. 94**

**ప్రతి :** పశు= యజ్ఞపశువులూ; యజ్ఞవాట= యాగశాలా; యూపస్తంభ= యజ్ఞపశుబంధన స్తంభమూ; పాత్ర= పాత్రలూ; మృద్+ఘట= మట్టికుండలూ; శరావ= మూకుళ్ళు; వసంతకాలములును= వసంత ఋతువున్నూ; స్నేహ= నేయి; ఓషధి= వడ్లు మున్నగు ఓషధులూ; బహులోహ= వివిధలోహాలూ; చాతుర్హోత్ర= నల్గురుహోతలు నిర్వర్తించవలసిన దర్శపూర్ణమాసాదికర్మలకు సంబంధించిన; మత= అభిప్రాయాలూ; నామధేయ= జ్యోతిష్టోమాదినామాలూ; సన్మంత్రములును= ఉత్తమమంత్రాలూ; సంకల్ప= సంకల్పం; ఋగ్యజుస్సామ= ఋగ్వేద యజుర్వేద సామవేదాలచే; నియుక్త= నియోగించబడిన; వషట్కారమంత్ర= వషట్కారాలతో గూడిన మంత్రాలయొక్క; అనుచరణములును= ఉచ్చారణలూ; దక్షిణల్= యజ్ఞంలో ఇవ్వవలసిన దక్షిణలు; దేవతా= వివిధ దేవతలయొక్క; ధ్యాన= చింతనం; తదనుగత= ఆ ధ్యానంలో అనుసరించిన; తంత్రవ్రత= తంత్రాలూ, వ్రతాలూ; ఉద్దేశ= ఉద్దేశంగాగల; ధరణిసురులున్= భూసురులు; అర్పణంబులు= కర్మసమర్పణలూ; బోధాయన+ఆదికర్మసరణి= యజ్ఞసంబంధమైన జ్ఞానానికి స్థానమైన కర్మముల విధానం, మొదలగు; యజ్ఞోపకరణసమితి= యజ్ఞసాధనసంచయం; అంతయును= అంతా; ఆ+మహాత్ముని= ఆ పరమేశ్వరుని; అవయవములుగాఁగన్= అంగాలయ్యేటట్లు; కల్పించి= భావించి; విధివత్ప్రకారమునను= విధ్యుక్త విధానంతో...

**తా :** యజ్ఞపశువులూ, యజ్ఞవాటికా, యూపస్తంభమూ, పాత్రలూ, మట్టికుండలూ, మూకుళ్ళూ, యాగకాలమైన వసంత ఋతువూ, నేయి, వడ్లు మున్నగు ఓషధులూ, వివిధాలైన లోహాలూ, నల్గురుహోతలతో నిర్వర్తింపదగిన దర్శపూర్ణమాసాది వైదికకర్మలూ, జ్యోతిష్టోమాదినామాలూ, మంత్రాలూ, సంకల్పమూ, ఋగ్యజుస్సామ వేదాలలోని వషట్కారాలతో గూడిన మంత్రాలూ, దక్షిణలూ, దేవతా ధ్యానం, దానికి తగిన తంత్రాలు, వ్రతాలూ, భూసురులూ, దేవతల నుద్దేశించి చేసే కర్మ సమర్పణలూ, బోధాయనాదుల కల్పగ్రంథాలలోని కర్మవిధానం, మొదలైన యజ్ఞోపకరణాలూ – ఇవన్నీ పరమేశ్వరుని అంగాలుగా సంకల్పించాను. ఆ మీదట శాస్త్రోక్త విధి ననుసరించాను.

**విశే :** 'అగ్నౌ హుతం వషట్కృతం' అన్నట్లు అగ్నియందు వ్రేల్చబడినది 'వషట్కృతం'.

**క. యజ్ఞాంగి యజ్ఞఫలదుఁడు, యజ్ఞేశుఁడు యజ్ఞకర్త యగు భగవంతున్**
**యజ్ఞపురుషుఁగా మానస, యజ్ఞముఁ గావించితిం దదర్పణబుద్ధిన్. 95**

**ప్రతి :** యజ్ఞాంగి= యజ్ఞమే శరీరంగాగలవాడూ; యజ్ఞఫలదుఁడు= యజ్ఞానికి ఫలం ప్రసాదించేవాడూ; యజ్ఞేశుఁడు= యజ్ఞప్రభువూ; యజ్ఞకర్త= యజ్ఞానికి నిర్వాహకుడూ; అగు భగవంతున్= అయిన దేవుణ్ణి; యజ్ఞపురుషుఁగాన్= యజ్ఞంలో ప్రధానమైన పురుషుడుగా (భావించి); తదర్పణ బుద్ధిన్= ఆ దేవునికి సమర్పించే తలంపుతో; మానసయజ్ఞమున్= మనసుచే నిర్వర్తింపదగిన యజ్ఞాన్ని; కావించితిన్= చేశాను.

**తా :** యజ్ఞమే శరీరమైనవాడూ, యజ్ఞానికి ఫలమిచ్చేవాడూ, యజ్ఞప్రభువూ, యజ్ఞనిర్వాహకుడూ అయిన పరమాత్మను యజ్ఞపురుషుణ్ణిగా భావించుకొని ఆ దేవునికే యజ్ఞఫలం సమర్పించాలన్న తలంపుతో మానసయజ్ఞం చేశాను.

**క. అప్పుడు బ్రహ్మలు దమలోఁ దప్పక ననుఁ జూచి సముచితక్రియ లగుచు**
**న్నప్పరమేశున కభిమత, మొప్పఁగఁ దగ సప్తతంతు వొగిఁ గావింపన్. 96**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; బ్రహ్మలు= ప్రజాపతులు, తమలోన్; తప్పక= తప్పకుండా; ననున్+చూచి= నన్ను గమనించి; సముచిత క్రియులు+అగుచున్= తగిన క్రియలు గలవారై; ఆ+పరమేశునకున్= ఆ పరమాత్మకు; అభిమతము= ప్రీతి; ఒప్పఁగన్= కలిగేటట్లు; తగన్= తగిన విధంగా; సప్తతంతువు= యజ్ఞం; ఒగిన్= క్రమంగా; కావింపన్= చేయగా.

**తా :** అప్పుడు మరీచి మున్నగు ప్రజాపతులు నేను చేసిన మానసయజ్ఞం చూచి, తాము గూడ ఉత్సుకతతో ఆ దేవునికి ప్రీతి కలిగేటట్లు యజ్ఞం నిర్వర్తించారు.

**విశే :** సప్తతంతువు అంటే ఏడు విధాలైన ఛందస్సులతో విస్తరింపబడినది – యజ్ఞం.

**చ. మనువులు, దేవదానవులు, మానవనాథులు, మర్త్యకోటి, దా**
**రనయము వారివారికిఁ బ్రియంబగు దేవతలన్ భజించుచున్,**
**ఘనతరనిష్ఠ యజ్ఞములఁ గైకొని చేసిరి, తత్ఫలంబు ల**
**య్యనుపమమూర్తి యజ్ఞమయుఁడైన రమావరునందుఁ జెందఁగన్. 97**

**ప్రతి :** మనువులు= స్వాయంభువుడు మున్నగు మనువులూ; దేవదానవులు= దేవతలూ, రాక్షసులూ; మానవనాథులు= రాజులూ; మర్త్యకోటి= మనుజసముదాయమూ; తారు= తాము; అనయము= ఎల్లవేళలా; వారివారికిన్= ఆ యా యజ్ఞకర్తలకు; ప్రియంబు+అగు= ఇష్టమైన; దేవతలన్ భజించుచున్= దేవతలను సేవిస్తూ; ఘనతర నిష్ఠన్= గొప్ప నియమంతో; యజ్ఞములన్= యజ్ఞాలను; కైకొని= గ్రహించి; తత్ఫలంబులు= ఆ యజ్ఞఫలాలు; ఆ+అనుపమమూర్తి= ఆ నిరుపమాన విగ్రహుడూ; యజ్ఞమయుఁడు+ఐన= యజ్ఞస్వరూపుడూ అయిన; రమావరునందున్= లక్ష్మీనాథునియందు; చెందఁగన్= సమర్పితం కాగా; చేసిరి= నిర్వర్తించారు.

**తా :** ఆ ఘటనను చూచి స్వాయంభువాది మనువులూ, దేవతలూ, దానవులూ, రాజులూ, మనుజులూ – వీరంతా వాళ్ళ వాళ్ల కిష్టమైన దేవతలను సేవిస్తూ సాటిలేనివాడూ, యజ్ఞమూర్తీ అయిన లక్ష్మీరమణునికే ఫలం చెందేటట్లు మహానిష్ఠతో యజ్ఞాలు చేశారు.

**క. సువ్యక్తతంత్రరూపకుఁ, డవ్యక్తుఁ డనంతుఁ డభవుఁ డచ్యుతుఁ డీశుం**
**డవ్యయుఁడగు హరి సురగణ, సేవ్యుఁడు క్రతుఫలదుఁ డగుటఁ జేసిరి మఖముల్. 98**

**ప్రతి :** సువ్యక్త తంత్రరూపకుఁడు= సుస్పష్టమైన తంత్రరూపం కలవాడూ; అవ్యక్తుఁడు= వ్యక్తం కానివాడూ; అనంతుఁడు= తుదిలేనివాడూ; అభవుఁడు= జననం లేనివాడూ; అచ్యుతుఁడు= చ్యుతి (జారుపాటు) లేనివాడూ; ఈశుఁడు= ప్రభువు; అవ్యయుఁడు= వ్యయం (తరుగు)లేనివాడూ అగు; సురగణసేవ్యుఁడు= దేవతాబృందంచే సేవింపదగినవాడూ అయిన; హరి= శ్రీహరి; క్రతుఫలదుఁడు+అగుటన్= యజ్ఞ ఫలప్రదాత కావడంవల్ల; మఖముల్= యజ్ఞాలు; చేసిరి= (ఆ దేవుణ్ణి ఉద్దేశించి) చేశారు.

**తా :** స్పష్టమైన తంత్రరూపం కలవాడూ, ఇతరులకు వ్యక్తం కానివాడూ, అంతం లేనివాడూ, జన్మ లేనివాడూ, చ్యుతి లేనివాడూ, జగత్ప్రభువూ, అవ్యయుడూ అయిన శ్రీహరి దేవతలచే సేవింపదగినవాడూ, యజ్ఞఫలాలను ప్రసాదించేవాడూ కావడంవల్ల పై జెప్పినవారంతా ఆ దేవుణ్ణి ఉద్దేశించే యజ్ఞాలు చేశారు.

**క. అగుణుండగు పరమేశుఁడు, జగములఁ గల్పించుకొఱకుఁ జతురత మాయా**
**సగుణుండగుఁ గావున హరి, భగవంతుం డనఁగఁ బరఁగె భవ్యచరిత్రా! 99**

**ప్రతి :** భవ్యచరిత్రా= మంగళకరమైన చరిత్రగల నారదా!; అగుణుండు+అగు= నిర్గుణుడైన; పరమ+ఈశుఁడు= పరమేశ్వరుడు; జగములన్= లోకాలను; కల్పించుకొఱకున్= సృష్టించడానికి; చతురతన్= నేర్పుతో; మాయాసగుణుండగున్= మాయవల్ల గుణసహితు డవుతున్నాడు; కావునన్= అందుచేత; హరి= శ్రీహరి; భగవంతుండు= భగవానుడు; అనఁగన్ పరఁగెన్= అని వ్యవహరించబడినాడు.

**తా :** మంగళకరమైన చరిత్ర గల నారదా! పరమేశ్వరుడు నిర్గుణుడు. ఐనా జగన్నిర్మాణం చేయడానికి ఆయన మాయా ప్రభావం వల్ల నేర్పుతో గుణసహితుడవుతున్నాడు. అందువల్లనే ఆయన 'భగవంతుడు' అని చెప్పబడుతున్నాడు.

**క. విశ్వాత్ముఁడు. విశ్వేశుఁడు, విశ్వమయుం డఖిలనేత విష్ణుఁ డజుం డీ**
**విశ్వములోఁ దా నుండును, విశ్వము దనలోనఁ జాల వెలుఁగుచు ఉండున్. 100**

**ప్రతి :** విశ్వాత్ముఁడు= విశ్వానికి ఆత్మ అయినవాడు; విశ్వేశుఁడు= విశ్వానికి ప్రభువు; విశ్వమయుండు= విశ్వరూపుడు; అఖిలనేత= సర్వానికీ నాయకుడు; విష్ణుఁడు= విష్ణుదేవుడు; అజుండు= జననం లేనివాడు; విశ్వము= ప్రపంచం; తనలోనన్= తనలో; చాలన్= మిక్కిలిగా; వెలుఁగుచునుండన్= ప్రకాశిస్తూ ఉండగా; తాను; విశ్వములోన్= ప్రపంచంలో; ఉండున్= ఉంటాడు.

**తా :** విశ్వానికి ఆత్మ అయినవాడూ, విశ్వప్రభువూ, విశ్వరూపుడూ, సమస్తానికీ నాయకుడూ, జననం లేనివాడూ అయిన విష్ణుదేవుడు ఈ విశ్వం తనలో మిక్కిలిగా వెలుగొందుతుండగా తాను విశ్వంలో ప్రకాశిస్తూ ఉంటాడు.

**చ. అతని నియుక్తిఁజెంది సచరాచరభూత సమేతసృష్టి నే**
**వితతముగా సృజింతుఁ, బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు ప్రోచుఁ, బార్వతీ**
**పతి లయ మొందఁజేయు, హరి పంకరుహోదరుఁ దాదిమూర్తి య**
**చ్యుతుఁడు త్రిశక్తియుక్తుఁడగుచుండును నింతకుఁ దాన మూలమై. 101**

**ప్రతి :** అతని నియుక్తిన్= ఆ నారాయణుని ఆదేశాన్ని; చెంది= పొంది; నేన్= నేను; సచరాచరభూత సమేతసృష్టిన్= స్థావరజంగమ ప్రాణులతో గూడిన సృష్టిని; వితతముగాన్= విస్తృతంగా; సృజింతున్= సృష్టిస్తాను; ప్రభవిష్ణుఁడు= అత్యంత సమర్థుడైన; విష్ణుఁడు= నారాయణుడు; ప్రోచున్= ఆ సృష్టిని కాపాడుతాడు; పార్వతీపతి= శివుడు; లయమున్= వినాశాన్ని; ఒందన్+చేయున్= కలిగిస్తాడు; పంకరుహ+ఉదరుఁడు= పద్మనాభుఁడు; ఆదిమూర్తి= మొదటిమూర్తి; అచ్యుతుఁడు= చ్యుతిలేనివాడగు విష్ణుడు; ఇంతకున్= దీనికంతటికీ; తాను+అ= తానే; మూలము+ఐ= కారణమై; త్రిశక్తియుక్తుఁడు= సృష్టి స్థితిలయాలకు సంబంధించిన శక్తులతో గూడినవాడు; అగుచుండును= అవుతుంటాడు.

**తా :** ఆ దేవుని ఆనతి ననుసరించి నేను చరాచర ప్రాణులతో గూడిన ఈ సృష్టిని విస్తారంగా సృజిస్తున్నాను. ప్రభావ సంపన్నుడైన, విష్ణువు దీనిని పోషిస్తున్నాడు. పార్వతీపతియైన శివుడు దీనిని లయింపజేస్తున్నాడు. పద్మనాభుడూ, మొదటివేల్పూ, అచ్యుతుడూ అగు శ్రీహరి సృష్టి స్థితిలయ శక్తులకు మూలహేతువై ఉన్నాడు.

**క. విను వత్స! నీవు నన్నడి, గిన ప్రశ్నకు నుత్తరంబు కేవలపరమం**
**బును బ్రహ్మం బీ యఖిలం, బున కగు నాధారహేతుభూతము సుమ్మీ! 102**

**ప్రతి :** వత్స= పుత్రా! నీవు నన్ను అడిగిన ప్రశ్నకు; ఉత్తరంబు= సమాధానం విను; కేవలపరమంబునున్= కేవలం పరతత్త్వమైన; బ్రహ్మంబు= పరబ్రహ్మం; ఈ+అఖిలంబునకున్= ఈ సమస్త విశ్వానికీ; ఆధారహేతుభూతము+అగున్ సుమ్మీ= ఆశ్రయ కారణమైనదిగా అవుతున్నది సుమా!

**తా :** కుమారా! నీవు నన్నిప్పుడడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతాను, విను. ఈ సకల విశ్వానికీ ఆధారకారణమైనది ఒకే ఒక పరబ్రహ్మమే సుమా!

**క. హరి భగవంతుఁ డనంతుఁడు, కరణాంబుధి సృష్టికార్యకారణ హేతు**
**స్ఫురణుం డవ్విభుకంటెం, బరుఁ డెవ్వఁడు లేఁడు తండ్రి! పరికింపంగన్. 103**

**ప్రతి :** తండ్రి!= నాయనా!; భగవంతుఁడు= భగవానుడు; అనంతుఁడు= తుదిలేనివాడు; కరుణా+అంబుధి= దయాసముద్రుడు, అయిన; హరి= శ్రీహరి; సృష్టికార్యకారణ= సృష్టికి చెందిన కార్యకారణాలకు; హేతుస్ఫురణుండు= హేతువై స్ఫురించువాడు; పరికింపంగన్= పరిశీలించగా; ఆ+విభుకంటెన్= ఆ ప్రభువుకంటే; పరుఁడు= ఉత్కృష్టుడు; ఎవ్వఁడు లేఁడు= మరొకడెవడూ లేడు.

**తా :** శ్రీహరి జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజమనే షడ్గుణాలు కలవాడు, అంతం లేనివాడు. అతడే ఈ సృష్టికి చెందిన కార్యకారణాలకు మూలమైనవాడు. ఆలోచించి చూడగా ఆ ప్రభునికంటె ఉత్కృష్టుడైనవాడు మరొకడు లేడు.

**సీ. ఇది యంతయును నిక్క మే బొంక నుత్కంఠ మతిఁ దద్గుణధ్యానమహిమఁజేసి**
**పరికింప నే నేమి వలికిన నది యెల్ల సత్యంబ యగు బుధస్తుత్య! వినుము**
**ధీయుక్త! మామకేంద్రియములు మఱచియుఁ, బొరయ వసత్యవిస్ఫురణ మెందు!**
**నదిగాక మత్తను వామ్నాయతుల్యంబు, నమరేంద్రవందనీయంబు నయ్యెఁ,**

**తే. దవిలి యా దేవదేవుని భవమహాబ్ధి, తారణంబును మంగళకారణంబు**
**నఖిలసంపత్కరంబునై యలరు పాద, వనజమున కే నొనర్చెద వందనములు. 104**

**ప్రతి :** బుధస్తుత్య!= పండితులచే స్తుతింపదగిన నారదా!; ఇది యంతయును= ఇదంతా; నిక్కము= నిజం; ఏన్= నేను; బొంకన్= అసత్యం పలుకను; ఉత్కంఠమతిన్= కౌతుకంగల మదిలో; తద్గుణధ్యానమహిమన్+చేసి= ఆ పరమాత్మయొక్క గుణాల ధ్యాన ప్రభావంచేత; పరికింపన్= పరిశీలింపగా; నేను+ఏమి పలికినన్= నేనేమి చెప్పినా; అదియెల్లన్= అదంతా; సత్యంబు+అ= నిజమే; అగున్= అవుతుంది; వినుము= విను; ధీయుక్త= బుద్ధిమంతుడా!; మామక+ఇంద్రియములు= నా ఇంద్రియాలు; మఱచియున్= విస్మరించికూడా; ఎందున్= ఎక్కడా; అసత్య విస్ఫురణము= యథార్థం కానిదానిని స్ఫురింపజేయడాన్ని; పొరయవు= పొందవు; అదిగాక= అంతేకాక; మత్తనువు= నా శరీరం; ఆమ్నాయతుల్యంబున్= వేదంతో సమానమైనది; అమర+ఇంద్రవందనీయంబున్= ఇంద్రునిచే నమస్కరింపదగినదీ; అయ్యెన్= ఐనది; తవిలి= ఆసక్తుడనై; ఆ దేవదేవుని= దేవతలకే దేవుడైన శ్రీహరియొక్క; భవమహాబ్ధితారణంబునున్= సంసారమహాసాగరాన్ని దాటించేదీ;

మంగళకారణంబున్= శుభాలకు హేతువూ; అఖిలసంపత్కరంబున్+ఐ= సకల సంపదలు చేకూర్చేదీ అయి; అలరు= విరాజిల్లుచున్న; పాదవనజమునకున్= చరణకమలానికి; ఏన్= నేను; వందనములు= నమస్కారాలు; ఒనర్చెదన్= చేస్తాను.

**తా :** ఇప్పుడు నేను చెప్పినదంతా నిజం. నేను అసత్యం పలకను. పండిత స్తుతికర్తుడవైన ఓ నారదా! విను. ఔత్సుక్యంతో ఆ భగవంతుని గుణాలను ధ్యానించడంవల్ల కలిగిన ప్రభావంతో నేనేమి పలికినా అదంతా నిజమే అవుతుంది. ఓ బుద్ధిమంతుడా! నా ఇంద్రియాలు ఎప్పుడుగానీ పొరపాటున గూడా అసత్యం వైపు పోవు. అంతే కాదు. నా శరీరం వేదతుల్యమైనది. దేవేంద్రునికి సైతం ఇది నమస్కరింపదగినది. సంసారమనే గొప్ప సముద్రాన్ని దాటించేదీ, శుభాలకు కారణమైనదీ, సకల సంపదలనూ సమకూర్చేదీ అయిన ఆ దేవదేవుని పాదపద్మానికి నేను నమస్కరిస్తున్నాను.

**ఉ. ఆ నళినాక్షు నందనుఁడనయ్యుఁ, బ్రజాపతినయ్యు, యోగ వి**
**ద్యానిపుణుండ నయ్యును, బదంపడి మజ్జననప్రకారమే**
**యేను నెఱుంగ; నవ్విభుని యిద్ధమహత్త్వ మెఱుంగ నేర్తునే?**
**కానఁబడున్ రమేశపరికల్పితవిశ్వము గొంతకొంతయున్. 105**

**ప్రతి :** ఆ నళినాక్షు= ఆ పద్మనేత్రుని; నందనుఁడను+అయ్యున్= కుమారుడనైనా; ప్రజాపతిన్+అయ్యున్= బ్రహ్మనైనను; యోగ విద్యానిపుణుండన్+అయ్యునున్= యోగవిద్యలో ఆరితేరినవాడనైనా; పదంపడి= మరియు; మత్+జనన ప్రకారమే= నేను పుట్టిన రీతినే; ఏనున్= నేనును; ఎఱుంగన్= తెలియజాలను; ఆ+విభుని= ఆ ప్రభువుయొక్క; ఇద్ధమహత్త్వము= ప్రకాశించే గొప్పతనాన్ని; ఎఱుంగన్ నేర్తును+ఏ= తెలియజాలుదునా?; రమేశ పరికల్పితవిశ్వము= లక్ష్మీరమణుడు కల్పించిన జగత్తు; కొంత కొంతయున్= కొంచెం కొంచెమే; కానఁబడున్= (నాకు) కనిపిస్తుంది.

**తా :** నేను ఆ పద్మనేత్రుని కుమారుడనైనా, బ్రహ్మనైనా, యోగవిద్యలో నిపుణుడనైనా, నా పుట్టుక ఎలా జరిగిందో నాకే తెలియదు. ఇక ఆ ప్రభుని ప్రదీప్త ప్రభావం ఎలా గ్రహించగలను? ఆ లక్ష్మీనాథుడు నిర్మించిన ఈ ప్రపంచం కొంచెం కొంచెమే నాకు గోచరిస్తున్నది.

**మ. విను వే యేటికిఁ దాపసప్రవర! యి వ్విశ్వాత్ముఁ డీశుండు దాఁ**
**దన మాయామహిమాంతముం దెలియఁగాఁ దథ్యంబుగాఁ జాలఁ ద**
**న్నను, నే నైనను మీరలైన సురలైనన్ వామదేవుండు నై**
**నను నిక్కం బెఱుఁగంగఁ జాలుదుమె? జ్ఞానప్రక్రియాయుక్తులన్. 106**

**ప్రతి :** తాపసప్రవర!= మునిశ్రేష్ఠా!; వేయి+ఏటికిన్= వెయ్యిమాటలేల; విను; ఈ+విశ్వాత్ముఁడు= ఈ విశ్వస్వరూపుడు; ఈశుండు= ఈశ్వరుడు; తాన్= తాను; తన మాయామహిమాంతమున్= తనయొక్క మాయా ప్రభావంయొక్క తుదను; తథ్యంబుగాన్= నిజంగా; తెలియఁగాన్+చాలఁడు= గ్రహింపనేరడు; అన్నను= అనగా; నేను+ఐనను= నేనైనా; మీరలు+ఐనన్= మీరైనా; సురలు+ఐనన్= దేవతలైనా; వామదేవుండున్+ఐననున్= శివుడైనా; జ్ఞాన ప్రక్రియా యుక్తులన్= జ్ఞాన ప్రకారం సంబంధమైన ఉపపత్తులతో; నిక్కంబున్= నిజం; ఎఱుఁగంగన్+చాలుదుము+ఎ= తెలుసుకోగలమా?

**తా :** మునివర్యా! నారదా! పలుమాటలేల? ఇది విను. విశ్వస్వరూపుడైన ఆ పరమేశ్వరుడు తన మాయా మహిమను నిజంగా తుదముట్ట తానే గ్రహించలేకున్నాడు. అట్టి స్థితిలో నేనుగానీ, మీరుగానీ, ఇంద్రాది దేవతలుగానీ, కడకు

శివుడైనా జ్ఞాన ప్రక్రియకు చెందిన, యుక్తులతోనూ, (జ్ఞానంతో, క్రియలతో, యుక్తులతో) నిజం తెలుసుకోగలమా? తెలియలేమని తాత్పర్యం.

**వ. అ మ్మహాత్ముండైన పుండరీకాక్షుండు సర్వజ్ఞుం డంటేని. 107**

**ప్రతి :** ఆ+మహాత్ముండు+ఐన= ఆ మహనీయుడైన; పుండరీక+అక్షుండు= పద్మలోచనుడు; సర్వజ్ఞుండు+అంటేనిన్= సర్వం తెలిసినవాడు గదా అన్నావంటే...

**తా :** ఆ మహాత్ముడైన పద్మాక్షుడు సర్వజ్ఞుడు గదా! తన మహిమ ఆయన కెందుకు తెలియదు? అని నీవు అనవచ్చు. అది వివరిస్తాను, విను.

**క. గగనము దన కడపలఁ దాఁ, దగ నెఱుఁగని కరణి విభుఁడు దా నెఱుఁగఁ దనన్**
**గగనప్రసవము లే దన, నగునే సర్వజ్ఞతకును హాని దలంపన్. 108**

**ప్రతి :** గగనము= ఆకాశం; తన కడపలన్= తన అంతాన్ని; తాను తగన్+ఎఱుఁగని కరణిన్= తాను తగినట్లు తెలియజాలని విధంగా; విభుఁడు= ప్రభుడు; తాను ఎఱుఁగఁడు+అనన్= తాను (తన తుదిని) ఎరుగడనగా; గగనప్రసవము= ఆకాశపుష్పం; లేదు+అనన్= ఉండదనగా; సర్వజ్ఞతకున్= సర్వజ్ఞత్వానికి; హాని= భంగం; అగును+ఏ= కలుగునా?

**తా :** ఆకాశం తన అంతాన్ని తాను తెలుసుకోలేదు. అట్లే ఆ దేవుడు తన సమగ్రతను తానే ఎరుగజాలకున్నాడు. ఆకాశపుష్పం లేదన్నంతమాత్రాన సర్వజ్ఞత్వానికి భంగం కలుగుతుందా? అట్లే తన అంతు తనకే తెలియదన్నంత మాత్రాన భగవంతుని సర్వజ్ఞత్వానికి లోటు వాటిల్లదు.

**విశే :** నిజానికి ఆకాశ పుష్పం లేదు. అట్లే భగవంతునికి అంతమనేది లేదు. లేనిదాన్ని లేదనడంవల్ల సర్వజ్ఞత్వానికి హాని కల్గదని తాత్పర్యం.

**చ. తలకొని య మ్మహాత్మకుఁడు దాల్చిన య య్యవతారకర్మముల్**
**వెలయఁగ నస్మదాదులము వేయి విధంబుల సన్నుతింతు, మ**
**య్యలఘు ననంతునిం జిదచిదాత్మకు నాద్యు ననీశు నీశ్వరుం**
**దెలియఁగనేర్తుమే తవిలి? దివ్యచరిత్రున కేను మ్రొక్కెదన్. 109**

**ప్రతి :** తలకొని= యత్నించి; ఆ+మహాత్మకుఁడు= ఆ మహాత్ముడు; తాల్చిన= ధరించిన; ఆ+అవతారకర్మముల్= ఆ యా అవతారాలకు సంబంధించిన కార్యాలు; వెలయఁగన్= ప్రకాశింపగా; అస్మత్+ఆదులము= మా బోటివారం; వేయి విధంబులన్= అనేక విధాల; సన్నుతింతుము= స్తుతిస్తాం; ఆ+అలఘున్= ఆ గొప్పవాణ్ణి; అనంతునిన్= తుదిలేనివానిని; చిత్+అచిత్+ఆత్మకున్= చేతనాచేతన స్వరూపుణ్ణి; ఆద్యున్= ప్రథముని; అనీశున్= తనకు ప్రభులెవరూ లేనివానిని; ఈశ్వరున్= (అంతటికీ) ప్రభువైనవానిని; తవిలి= ఆసక్తిగొని; తెలియఁగన్ నేర్తుము+ఏ= తెలుసుకొనగలమా? దివ్య చరిత్రునకున్= అట్టి దివ్యమైన చరిత్రగలవానికి; ఏను మ్రొక్కెదన్= నేను నమస్కరిస్తాను.

**తా :** ఆ మహామహుడు జగద్రక్షణకు పూనుకొని ఆ యా అవతారాలలో చేసిన పనులు మాబోట్లం వేయివిధాల ప్రశంసిస్తూ ఉంటాం. మహామహుడూ, తుదిలేనివాడూ, చిదచిత్స్వరూపుడూ, మొదటివాడూ, తనకు ప్రభువులేనివాడూ,

తానే అంతటికీ ప్రభువైనవాడూ, అయిన ఆ దేవుని ఎంత ప్రయత్నించినా మనం తెలుసుకోగలమా? దివ్యచరిత్రుడైన ఆ దేవునకు నేను ప్రణమిల్లుతున్నాను.

**మ. పరమాత్ముం డజుఁ డీ జగంబుఁ బ్రతికల్పంబందుఁ గల్పించుఁ దాఁ**
**బరిరక్షించును ద్రుంచునట్టి యనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ**
**ద్భరితుం గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ**
**శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్. 110**

**ప్రతి :** పరమాత్ముండు+అజుఁడు= పుట్టుకలేని ఆ పరమపురుషుడు; ప్రతికల్పంబున్= ప్రతియుగంలోనూ; ఈ జగంబున్= ఈ విశ్వాన్ని; కల్పించున్= సృష్టిస్తాడు; తాన్= తాను; పరిరక్షించున్= కాపాడుతాడు; త్రుంచున్= సంహరిస్తాడు; అట్టి అనఘున్= అటువంటి కిల్బిషం లేనివానిని; బ్రహ్మ+ఆత్మున్= పరమాత్మస్వరూపుని; నిత్యున్= శాశ్వతుడైనవానిని; జగద్భరితున్= జగమంతా నిండి ఉన్నవానిని; కేవలున్= ఏకమాత్రుని; అద్వితీయునిన్= సాటిలేనివానిని; విశుద్ధజ్ఞానున్= పరిశుద్ధమైన జ్ఞానం కలవానిని; సర్వ+ఆత్మున్= సర్వానికి ఆత్మయైనవానినీ; ఈశ్వరున్= ప్రభువునూ; ఆద్యంతవిహీనున్= తుది మొదళ్ళు లేనివానిని; నిర్గుణునిన్= గుణరహితుని; శశ్వత్+మూర్తిన్= శాశ్వతమైన ఆకృతిగలవాడైన పరమేశ్వరుణ్ణి; చింతించెదన్= ధ్యానిస్తాను.

**తా :** పుట్టుకలేని ఆ పరమాత్ముడు ప్రతికల్పంలోనూ ఈ విశ్వాన్ని సృష్టిస్తాడు, పోషిస్తాడు, లయింపజేస్తాడు. పాపరహితుడూ, బ్రహ్మస్వరూపుడూ, శాశ్వతుడూ, జగమంతా నిండినవాడూ, కేవలుడూ, సాటిలేనివాడూ, నిర్మలజ్ఞానవంతుడూ, సర్వాంతర్యామీ, తుదిమొదళ్ళు లేనివాడూ, గుణరహితుడూ, శాశ్వతమూర్తీ అయిన పరమేశ్వరుణ్ణి నేను ధ్యానిస్తాను.

**చ. సరసగతిన్ మునీంద్రులు ప్రసన్న శరీరహృషీకమానస**
**స్ఫురణ గలప్పు డవ్విభుని భూరికళాకలిత స్వరూపముం**
**దర మిడి చూతు; రెప్పుడుఁ గుతర్కతమోహతిచేత నజ్ఞతం**
**బొరసిన యప్పు డవ్విభుని మూర్తిఁ గనుంగొనలేరు నారదా! 111**

**ప్రతి :** నారదా= నారదమహర్షీ!; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; సరసగతిన్= సరసమైన నడవడితో; ప్రసన్న= ప్రసాదగుణంతో గూడిన; శరీర= దేహం; హృషీక= ఇంద్రియాలు; మానస= చిత్తంయొక్క; స్ఫురణ= ప్రకాశం; కలప్పుడు= ఉన్నప్పుడు; ఆ+విభుని= ఆ ప్రభువుయొక్క; భూరికళాకలిత స్వరూపమున్= గొప్ప కళామయమైన ఆకృతిని; తరమిడి= వరుసబెట్టి; ఎప్పుడున్= ఎల్లవేళలా; చూతురు= దర్శిస్తారు; కుతర్కతమోహతిచేతన్= కుత్సితమైన తర్కమనే తమస్సువలన గల్గిన క్షతిచేత; అజ్ఞతన్+పొరసిన+అప్పుడు= అజ్ఞానాన్ని పొందిన సమయంలో; ఆ+విభుని; మూర్తిన్= ఆకృతిని; కనుంగొనలేరు= దర్శించలేరు.

**తా :** నారదమునీ! మునీశ్వరులు తమ శరీరం, ఇంద్రియాలు, మనస్సు నిర్మలంగా ఉన్నప్పుడు మాత్రమే ఆ దేవుని మహిత కళామయమైన స్వరూపం చూడగలరు. ఎప్పుడు వాళ్ళు కుత్సితమగు తర్కవితర్కాలనే తమస్సుకు లోబడి అజ్ఞానోపహతులవుతారో అప్పుడు ఆ దేవుని దివ్యస్వరూపాన్ని దర్శించలేరు.

వ. అని వెండియు నిట్లను. ననఘా! య మ్మహనీయతేజోనిధి మొదలి యవతారంబు సహస్రశీర్షాది యుక్తంబయి ప్రకృతి ప్రవర్తకంబగు నాదిపురుష రూపంబగు; నందుఁ గాలస్వభావంబులను శక్తు లుదయించె; నందుఁ గార్యకారణరూపంబయిన ప్రకృతి జనించెఁ; బ్రకృతివలన మహత్తత్త్వంబును, దానివలన నహంకార త్రయంబును బుట్టె; నందు రాజసాహంకారంబువలన నింద్రియంబులును, సాత్త్వికాహంకారంబువలన నింద్రియగుణ ప్రధానంబులైన యధిదేవతలును, తామసాహంకారంబు వలన భూతకారణంబు లయిన శబ్ద స్పర్శరూపరస గంధతన్మాత్రంబులునుం బొడమెఁ; బంచతన్మాత్రంబులవలన గగనానిలవహ్ని సలిలధరాదికంబైన భూతపంచకంబు గలిగె; నందు జ్ఞానేంద్రియంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులును, గర్మేంద్రియంబులైన వాక్పాణి పాద పాయూపస్థంబులును, మనంబును జనియించె; నన్నింటి సంఘాతంబున విశ్వరూపుండైన విరాట్పురుషుండు పుట్టె; నతని వలన స్వయం ప్రకాశుం డయిన స్వరాట్టు సంభవించె; నందుఁ జరాచరరూపంబుల స్థావరజంగమాత్మకంబయిన జగత్తు గలిగె; నందు సత్త్వరజస్తమో గుణాత్మకుల మయిన విష్ణుండును, హిరణ్యగర్భుండ నయిన యేనును, రుద్రుండును గలిగితి; మందు సృష్టి జననకారణుండయిన చతుర్ముఖుండు పుట్టె; వానివలన దక్షాదులగు ప్రజాపతులు దొమ్మండ్రు గలిగిరి. అందు భవత్ప్రముఖులైన సనకసనందనాది యోగీంద్రులును, నాకలోకనివాసులయిన వాసవాదులును, ఖగలోకపాలకులగు గరుడాదులును, నృలోకపాలకులగు మనుమాంధాతృ ప్రముఖులును, దలలోకపాలకులగు ననంత వాసుకి ప్రభృతులును, గంధర్వ విద్యాధర చారణసాధ్యరక్షో యక్షోరగ నాగలోకపాలురును, మఱియు ఋషులును, బితృదేవతలును, దైత్యదానవ భూతప్రేతపిశాచ కూశ్మాండ పశుమృగాదులును నుద్భవించిరి. ఇట్టి జగత్ప్రథమోద్భవంబు మహత్తత్త్వసృష్టి యనంబడు. ద్వితీయం బండసంస్థితం బనం దగుఁ. దృతీయంబు సర్వభూతస్థం బననొప్పు; నం దైశ్వర్య తేజోబలసంపన్నులైన పురుషులు సర్వాత్మండైన నారాయణుని యంశసంభవులుగా నెఱుంగుము. అప్పుండరీకాక్షుని లీలావతారంబు లనంతంబులు; దత్కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికి నలవి గాదు. అయినను నాకుం దోఁచినంత నీ కెఱింగించెద వినుము. **112**

**ప్రతి :** అని, వెండియున్= మఱల; ఇట్లు+అనున్= ఇలా చెప్పాడు; అనఘా!= కిల్బిషరహితుడవైన నారదా!; ఆ+మహనీయ తేజస్+నిధి= ఆ పూజనీయుడైన తేజస్వియొక్క; మొదలి+అవతారంబు= ప్రథమావతారం; సహస్రశీర్షాదియుక్తంబు+ అయి= వెయ్యి తలలు మొదలగు అవయవాలతో కూడినదై; ప్రకృతి ప్రవర్తకంబు+అగు= ప్రకృతిని ప్రవర్తింపజేయునట్టి; ఆదిపురుషరూపంబు+అగున్= మొదటి పురుషుని రూపమవుతున్నది; అందున్= ఆ రూపంలో; కాలస్వభావంబులు+అను= కాలం, స్వభావం అనబడే; శక్తులు+ఉదయించెన్= శక్తులు పుట్టాయి; అందున్= ఆ శక్తులలో; కార్యకారణరూపంబు+అయిన= కార్యం, కారణం అనే రూపం గల్గిన; ప్రకృతి జనించెన్= ప్రకృతి పుట్టింది; ప్రకృతివలనన్= ఆ ప్రకృతినుండి; మహత్తత్త్వంబును= 'మహత్తు' అనబడే తత్త్వమూ; దానివలనన్= ఆ మహత్తునుండి; అహంకార త్రయంబునున్ పుట్టెన్= రాజససాత్త్వికతామసాలు అనే మూడు అహంకారాలు జనించాయి; అందున్= వాటిలో; రాజసాహంకారంబువలనన్= రాజసమైన అహంకారంనుండి; ఇంద్రియంబులునున్= చెవిమొదలైన ఇంద్రియాలు; సాత్త్వికారంబువలనన్= సాత్త్వికాహంకారంనుండి; ఇంద్రియగుణ

ప్రధానంబులైన= ఆ యా ఇంద్రియాలకు చెందిన గుణాలను ముఖ్యంగా కలిగిన; అధిదేవతలునున్= అధిష్ఠానదేవతలూ; తామసాహంకారంబువలనన్= తామసాహంకారంనుండి; భూతకారణంబులు+అయిన= పంచభూతాలకూ హేతువులయిన; శబ్దస్పర్శ రూపరసగంధ తన్మాత్రంబులునున్= శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే తన్మాత్రలూ; పొడమెన్= కలిగాయి; పంచతన్మాత్రంబులవలనన్= ఆ అయిదు తన్మాత్రలనుండి; గగన= ఆకాశం; అనిల= వాయువు; వహ్ని= అగ్ని; సలిల= జలం; ధరా+ఆదికంబు+ఐన= భూమిమున్నగు; భూతపంచకంబు= ఐదు భూతాలు; కలిగెన్= ఉద్భవించాయి; అందున్= వాటిలో; జ్ఞానేంద్రియంబులు+అయిన= జ్ఞానేంద్రియాలుగా ప్రసిద్ధాలయిన; త్వక్= త్వగింద్రియం; చక్షుస్= నేత్రేంద్రియం; శ్రోత్ర= శ్రవణేంద్రియం; జిహ్వా= రసనేంద్రియం; ఘ్రాణంబులునున్= ఘ్రాణేంద్రియం; కర్మ+ ఇంద్రియంబులు+ఐన= కర్మేంద్రియాలుగా ప్రసిద్ధిగాంచిన; వాక్ పాణి పాద పాయు+ఉపస్థంబులును= వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థంబునూ, మనంబును= చిత్తమున్నూ; జనియించెన్= కలిగాయి; అన్నింటి= ఈ చెప్పినవాటన్నింటి యొక్క; సంఘాతంబునన్= సమూహంచేత; విశ్వరూపుండు+ఐన= విశ్వమే రూపంగాగల; విరాట్పురుషుండు= విరాట్ అనే పురుషుడూ; పుట్టెన్= సంభవించాడు; అతనివలనన్= అతనినుండి; స్వయంప్రకాశుండయిన= తనకు తానుగా ప్రకాశించేవాడగు; స్వరాట్టు= స్వరాట్ పురుషుడు; సంభవించెన్= కలిగాడు; అందున్= అందులో; చరాచరరూపంబులన్= కదలునట్టి, కదలనట్టి రూపాలతో; స్థావరజంగమ+ఆత్మకంబు+అయిన= అచరములు, చరములతోగూడిన; జగత్తు= విశ్వం; కలిగెన్= జనించింది; అందున్= ఆ విశ్వంలో; సత్త్వరజస్తమోగుణ+ఆత్మకులము+అయిన= సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణస్వరూపులమయిన; విష్ణుండును= శ్రీమన్నారాయణుడును; హిరణ్యగర్భుండ నయిన యేనును= హిరణ్యగర్భు' డనబడే నేనున్నూ; రుద్రుండునున్= శివుండును; కలిగితిమి= జనించాం; అందున్; సృష్టిజననకారణుండు+అయిన= సృష్టి ఉత్పత్తికి హేతువైన; చతుర్ముఖుండు= నాల్గుముఖాలుగల బ్రహ్మ; పుట్టెన్= కలిగాడు; వానివలనన్= అతనినుండి; దక్షాదులు+ అగు= దక్షుడు మున్నగు; ప్రజాపతులు తొమ్మండ్రు= తొమ్మిదిమంది ప్రజాపతులు; కలిగిరి= సంభవించారు; అందున్= అట్టివారిలో; భవత్ప్రముఖులు+ఐన= నీవు మున్నగు; సనక సనందన+ఆది= సనకుడు సనందనుడు మున్నగు; యోగి+ ఇంద్రులును= యోగిశ్రేష్ఠులును; నాకలోకనివాసులు+అయిన= స్వర్గలోకం నివాసంగా గల; వాసవ+ఆదులున్= ఇంద్రుడు మొదలగువారు; ఖగలోకపాలకులు+అగు= పక్షిప్రపంచాన్ని పాలించేవారైన; గరుడ+ఆదులును= గరుత్మంతుడు మున్నగువారూ; నృలోకపాలకులు+అగు= నరలోకాన్ని పాలించేవారైన; మను మాంధాతృ ప్రముఖులును= మనువు, మాంధాత మున్నగువారునూ; తలలోకపాలకులు+అగు= 'తల' లోకాన్ని పాలించేవారైన, అనంతవాసుకి ప్రభృతులును, శేషుడూ, వాసుకి మొదలైనవారును; గంధర్వవిద్యాధరచారణ సాధ్యరక్షోరగనాగలోకపాలురునున్= గంధర్వలోకం, విద్యాధరలోకం, చారణలోకం, సాధ్యలోకం, రక్షోలోకం, యక్షలోకం, సర్పలోకం, నాగలోకం – ఈ లోకాలను పాలించేవారునూ; మఱియున్= ఇంకా; ఋషులును= మహర్షులు; పితృదేవతలును= పితృలోకం చేరినవారును; దైత్యదానవ భూతప్రేత పిశాచ కూష్మాండ పశుమృగాదులునున్= దైత్యులు, దానవులు, భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, కూశ్మాండులు, పశువులు, మృగాలు మున్నగు ప్రాణులూ; ఉద్భవించిరి= ఉదయించారు; ఇట్టి జగత్+ప్రథమ+ఉద్భవంబు= ఇలాంటి లోకంయొక్క మొదటి పుట్టుక; మహత్+తత్త్వసృష్టి అనన్+పడున్= 'మహత్తత్త్వం' యొక్క సృష్టి అనబడుతుంది; ద్వితీయంబు= రెండవది; అండసంస్థితంబు+అనన్+తగున్= అండంలో ఉండునది అనబడుతుంది; తృతీయంబు= మూడవది; సర్వభూతస్థంబు+ అనన్+ఒప్పున్= అన్ని భూతాలలో నున్నదని పేర్కొనబడుతుంది; అందున్= వానిలో; ఐశ్వర్య తేజస్+బలసంపన్నులు+ఐన= ఐశ్వర్యం, తేజస్సు కలవారైన; పురుషులు= జీవులు; సర్వాత్ముండు+ఐన= విశ్వాత్మకుడైన; నారాయణుని= విష్ణునియొక్క; అంశసంభవులుగాన్= అంశంనుండి జనించినవారని; ఎఱుంగుము= గ్రహించు; ఆ+పుండరీకాక్షుని= ఆ పద్మలోచనునియొక్క; లీలావతారంబులు= లీలలకోసం కలిగిన అవతారాలు; అనంతంబులు= అంతం లేనివి; తత్కర్మంబులు= ఆ అవతారాలకు

చెందిన కార్యాలు; లెక్కపెట్టన్= గణించడానికి; ఎవ్వరికిన్+అలవి గాదు= ఎవరికీ సాధ్యం కాదు; అయినను= అయినా; నాకున్+తోఁచినంత= నా బుద్ధికి గోచరించినంతమట్టుకు; నీకు ఎఱింగించెదన్= నీకు తెలియజేస్తాను, విను.

**తా :** అని చెప్పి మళ్ళీ బ్రహ్మ నారదునితో ఇలా అన్నాడు –

పాపరహితుడా! వేయితలలు, వేయినేత్రాలు, వేయిపాదాలూ కలిగి ప్రకృతిని ప్రవర్తింపజేసే ఆదిపురుషుని రూపమే మహాతేజస్వి అయిన ఆ దేవదేవుని మొదటి అవతారం. అట్టి అవతారస్వరూపంనుండి కాలం, స్వభావం అనే రెండు శక్తులు పుట్టాయి. అందుండి కార్యకారణరూపమైన ప్రకృతి పుట్టింది. ఆ ప్రకృతినుండి మహత్తత్త్వం జనించింది. దానినుండి రాజసాహంకారం, సాత్త్వికాహంకారం, తామసాహంకారం అనే మూడు అహంకారాలు ఉద్భవించాయి. వాటిలో రాజసాహంకారంనుండి ఇంద్రియాలు కలిగాయి. సాత్త్వికాహంకారంనుండి ఇంద్రియగుణాలు ప్రధానంగాకల ఇంద్రాది దేవతలు జనించారు. తామసాహంకారంనుండి పంచభూతాలకు హేతువులైన శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం–అనే పంచతన్మాత్రలు పుట్టాయి. వాటినుండి ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనే పంచభూతాలు ప్రభవించాయి. వాటినుండి త్వక్కు, చక్షువు, శోత్రం, జిహ్వ, ఘ్రాణం అనే జ్ఞానేంద్రియాలు, వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థం అనే కర్మేంద్రియాలూ, మనస్సూ జనించాయి.

వీటన్నింటి చేరికవల్ల విశ్వస్వరూపుడైన విరాట్పురుషుడు ఉదయించాడు. అతనినుండి స్వయంప్రకాశుడైన స్వరాట్పురుషుడు ఆవిర్భవించాడు. అతనినుండి చరాచరరూపాలతో స్థావరజంగమాత్మకమైన జగత్తు జనించింది. అందుండి సత్త్వగుణస్వరూపుడైన విష్ణుడూ, రజోగుణస్వరూపుడనై హిరణ్యగర్భుడనబడే నేనూ, తమోగుణ స్వరూపుడైన రుద్రుడూ జన్మించాము. అందుండే సృష్టియొక్క ఉత్పత్తికి హేతువైన నాల్గుముఖాల బ్రహ్మ పుట్టాడు. ఆయనవల్ల దక్షుడు మున్నగు తొమ్మిదిమంది ప్రజాపతులు జనించారు. వారినుండి నీవూ, సనకాదులను యోగీశ్వరులూ, స్వర్గలోకంలో ఉండే ఇంద్రాదులు, పక్షిలోకరక్షకులైన గరుడాదులు, మానవలోకం పాలించే మనువు, మాంధాత మున్నగువారూ, తలలోకాన్ని పాలించే అనంతుడు, వాసుకి మున్నగువారూ, ఇంకా గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు, చారణులు, సాధ్యులు, రాక్షసులు, యక్షులు, ఉరగులు, నాగులు–నివసించే లోకాలను పాలించేవారూ, ఋషులు, పితరులు, దైత్యులు, దానవులు, భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, కూశ్మాండులు, మరియు పశువులు, మృగాదులు సంభవించాయి.

ఇట్టి జగత్తుయొక్క మొట్టమొదటి పుట్టుకను 'మహత్తత్త్వసృష్టి' అంటారు. రెండవది అండగతసృష్టి, మూడవది సకలభూతగతమైన సృష్టి, అందులో ఐశ్వర్యం, తేజస్సు, బలంగల పురుషులు సర్వాంతర్యామి అయిన శ్రీమన్నారాయణుని అంశయందు పుట్టినవారని గ్రహించు. ఆ పద్మాక్షుని లీలావతారాలకు అంతమే లేదు. ఆ అవతారాలలో ఆయన చేసే సత్కర్మలు లెక్కించడం ఎవరికీ శక్యం కాదు, అయినా నాకు తోచినంతవరకూ నీకు వినిపిస్తాను, విను.

## ✤ శ్రీ మన్నారాయణుని లీలావతారంబుల యభివర్ణనము ✤

**ఉ. అన్యకథానులాపము లహర్నిశమున్ వినునట్టి సత్క్రియా**
**శూన్యములైన కర్ణముల సూరిజనస్తుత! సర్వలోక స**
**మ్మాన్యమునై తనర్చు హరిమంగళ దివ్యకథామృతంబు సౌ**
**జన్యతఁ గ్రోలవయ్య బుధసత్తమ! యే వివరించి చెప్పెదన్.** **113**

**ప్రతి :** సూరిజనస్తుత! = పండితులచే స్తుతింపబడినవాడా!; బుధసత్తమ! = పండిత శ్రేష్ఠుడా!; అన్యకథా+అనులాపములు= ఇతరులకు చెందిన కథలను గూర్చిన భాషణలు; అహర్నిశమున్= రేయింబవళ్ళు; విను+అట్టి= ఆలకించునట్టి; సత్క్రియాశూన్యములు+ఐన= మంచిపని చేయని; కర్ణములన్= చెవులతో; సర్వలోకసమ్మాన్యమును+ఐ= సమస్తలోకాలచే పూజింపదగి; తనర్చు= వెలుగొందుచున్న; హరిమంగళ దివ్యకథా+అమృతంబున్= శ్రీహరియొక్క మంగళకరమైన దివ్యకథలు అనే సుధను; సౌజన్యతన్= సుజనత్వంతో, మంచితనంతో; క్రోలవయ్య (క్రోలుము+అయ్య)= ఆస్వాదింపవయ్యా!; ఏన్= నేను; వివరించి చెప్పెదన్= విస్తరించి చెబుతాను.

**తా :** సూరిజనానికి వినుతింప దగినవాడవగు పండితవర్యుడా! రేయింబవళ్ళూ ఇతరకథా ప్రసంగాలు వింటూ ఏ మాత్రం పుణ్యం పొంత పోని వీనులకు విష్ణుకథలు విందు చేస్తాయి. సకల లోకాలకీ పూజనీయమై వెలుగొందే ఆ దేవుని దివ్యమంగళ కథాసుధారసాన్ని నేను నీకందిస్తాను. ఆసక్తితో ఆస్వాదించయ్యా!

**వ. అని పలికి నారదుంజూచి మఱియు నిట్లనియె. 114**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; నారదున్+చూచి= నారద మహర్షిని చూస్తూ; మఱియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** ఈ విధంగా పలికి నారదుణ్ణి చూస్తూ బ్రహ్మదేవుడు మళ్ళీ అతనితో ఇలా అన్నాడు.

**మ. కనకాక్షుండు భుజావిజృంభణమునన్ క్ష్మాచక్రముం జాపఁ జు**
**ట్టినమాడ్కిం గొనిపోవ, యజ్ఞమయదంష్ట్రి స్వాకృతిందాల్చి య**
**ద్దనుజాధీశ్వరుఁ దాఁకి యబ్ధినడుమన్ దంష్ట్రాహతిం ద్రుంప ధా**
**త్రిని గూలెం గులిశాహతింబడు మహాద్రింబోలి యత్యుగ్రతన్. 115**

**ప్రతి :** కనక+అక్షుండు= హిరణ్యాక్షుడు; భుజావిజృంభణమునన్= చేతులబలం అతిశయించటంతో; క్ష్మాచక్రమున్= భూవలయాన్ని; చాపన్ చుట్టినమాడ్కిన్= చాపను చుట్టినట్లు (చుట్టి); కొనిపోవన్= తీసుకొనిపోగా; (భగవానుడు) యజ్ఞమయ= యజ్ఞస్వరూపమగు; దంష్ట్రిస్వ+ఆకృతిన్= వరాహరూపమైన తన ఆకారాన్ని (మంచి ఆకృతిని); తాల్చి= ధరించి; ఆ+దనుజ+ అధీశ్వరున్= ఆ రాక్షసప్రభువును; తాఁకి= మార్కొని; అబ్ధినడుమన్= సాగరమధ్యంలో; దంష్ట్రాహతిన్= కోరల దెబ్బతో; త్రుంపన్= చంపగా, వాడు; కులిశ+ఆహతిన్= వజ్రాయుధపు దెబ్బకు; పడు= కూలునట్టి; మహా+అద్రిన్ బోలి= పెద్ద కొండవలె; అతి+ఉగ్రతన్= మిక్కిలి భీకరంగా; ధాత్రినిన్= నేలమీద; కూలెన్= పడ్డాడు.

**తా :** పూర్వం హిరణ్యాక్షుడనే రక్కసుడుండేవాడు. వాడు భుజబలాటోపంతో భూచక్రాన్ని చాప చుట్టినట్టు చుట్టి సముద్రగర్భంలో దాచాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు యజ్ఞవరాహరూపం ధరించి ఆ దానవుణ్ణి మార్కొన్నాడు. సముద్ర మధ్యంలో కోరలతో క్రుమ్మి ఆ రాక్షసుణ్ణి హతమార్చాడు. వాడు వజ్రాయుధం వేటుకు నేలకూలే మహాపర్వతంవలె అతిభీకరంగా క్రిందపడ్డాడు. ఇది యజ్ఞవరాహావతార చరిత్ర.

**వ. మఱియు సుయజ్ఞావతారంబు విను మని యిట్లనియె. 116**

**ప్రతి :** మఱియున్= ఇంకా; సుయజ్ఞ+అవతారంబున్= సుయజ్ఞుని అవతారాన్ని గూర్చి; వినుము+అని= వినవలసింది అంటూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇక సుయజ్ఞావతారం ఎలా సంభవించిందో చెబుతాను విను. అంటూ నారదునితో బ్రహ్మ మళ్ళీ ఇలా చెప్పాడు.

**సీ. ప్రకటరుచిప్రజాపతికిని స్వాయంభువుని కూఁతు రాకూతి యను లతాంగి**
**కర్థి జన్మించి సుయజ్ఞుండు నా నొప్పు నతఁడు దక్షిణ యను నతివయందు**
**సుయమనామామరస్తోమంబుఁ బుట్టించి యింద్రుఁడై వెలసి యుపేంద్రలీల**
**నఖిలలోకంబుల యార్తి హరించిన నతని మాతామహుండైన మనువు**

**తే. తనమనంబునఁ దచ్చరిత్రమున కలరి, పరమ పుణ్యుండు హరి యని పలికెఁ గాన**
**నంచిత జ్ఞాననిధియై సుయజ్ఞుఁ డెలమిఁ, దాపసోత్తమ! హరి యవతారమయ్యె. 117**

**ప్రతి :** తాపస+ఉత్తమ!= మునులలో శ్రేష్ఠుడైన నారదా!; ప్రకట రుచిప్రజాపతికిన్= ప్రసిద్ధుడైన 'రుచి' అనే ప్రజాపతికీ; స్వాయంభువుని కూఁతురు= స్వాయంభువమనువు పుత్రిక; ఆకూతి+అను లతా+అంగికిన్= ఆకూతి అనే వనితకూ; అర్థిన్ జనించి= కోరికతో సంభవించి; 'సుయజ్ఞుండు' నాన్= సుయజ్ఞుడు అనగా; ఒప్పు= అలరారుచున్న; అతఁడు= ఆ కుమారుడు; దక్షిణయను అతివయందున్= దక్షిణ అనే అంగనయందు; సుయమనామ+అమరస్తోమంబున్= 'సుయములు' అను పేరుగల దేవతాబృందాన్ని; పుట్టించి= జనింపజేసి; ఇంద్రుఁడు+ఐవెలసి= ఇంద్రుడుగా ప్రకాశించి; ఉప+ఇంద్రలీలన్= మాధవునివలె; అఖిలలోకంబుల= సమస్తలోకాలయొక్క; ఆర్తిన్= పీడను; హరించినన్= పోగొట్టగా; అతని మాతామహుండు+ ఐన మనువు= అతని తల్లికి తండ్రియైన స్వాయంభువమనువు; తన మనంబునన్= తన చిత్తంలో; తద్+చరిత్రమునకున్= అతని చరిత్రకు; అలరి= సంతసించి; పరమపుణ్యుండు= ఆ పరమ పవిత్రుడు; హరి= 'శ్రీహరి'యే; అని పలికెన్+కానన్= అని అన్నాడుగావున, సుయజ్ఞుఁడు; ఎలమిన్= ప్రీతితో; అంచితజ్ఞాననిధి+ఐ= పూజింపదగిన జ్ఞానానికి నెలవై; హరి అవతారము+అయ్యెన్= శ్రీహరి అవతారంగా పేరొందాడు.

**తా :** పూర్వం రుచి అనే ప్రజాపతికీ, స్వాయంభువమనువు పుత్రికయగు ఆకూతి అనే గుణవతికీ సుయజ్ఞుడు పుట్టాడు, అతడు దక్షిణ అనే వనితను ధర్మపత్నిగా స్వీకరించాడు. ఆమె గర్భాన 'సుయములు' అన్న పేరుగల దేవతలను జనింపజేశాడు. ఇంద్రుడై దేవతలకు నాయకుడయ్యాడు. విష్ణువులాగా అఖిలలోకాల దుఃఖాన్ని తొలగింపజేశాడు. తాత అయిన స్వాయంభువమనువు తన మనుమని చరిత్రకు ఎంతో సంతసించి 'ఈ పుణ్యాత్ముడు శ్రీహరియే' అని అన్నాడు. మునీంద్రా! ఆ కారణాన ఉత్తమజ్ఞాననిధియైన సుయజ్ఞుడు శ్రీహరి అవతారంగా ప్రసిద్ధి పొందాడు.

**వ. అని చెప్పి సాంఖ్యయోగ ప్రవర్తకాచార్యవర్యుం డగు కపిలుని యవతారంబు విను మని యిట్లనియె. 118**

**ప్రతి :** అని చెప్పి= అని చెప్పిన తర్వాత; సాంఖ్యయోగ= సాంఖ్యమనే యోగానికి; ప్రవర్తక= ప్రవర్తకుడైన; ఆచార్యవర్యుండు+ అగు= ఆచార్య శ్రేష్ఠుడైన; కపిలుని+అవతారంబు= కపిలమహర్షి అవతారాన్నిగూర్చి; వినుము+అని= వినవలసింది అంటూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** బ్రహ్మ సుయజ్ఞుని గూర్చి చెప్పి ఆపై షడ్దర్శనాలలో ఒకటియగు సాంఖ్యయోగాన్ని ప్రవర్తింపజేసిన ఆచార్యశ్రేష్ఠుడు కపిలుని అవతారగాథను ఆలకించుమంటూ ఇలా అన్నాడు.

**విశే :** సాంఖ్యమంటే తత్త్వాల పరిగణన ద్వారా కలిగే జ్ఞానం. అదికూడా పరమాత్మ జ్ఞానమే.

**చ. ధృతమతి దేవహూతికిని దివ్యవిభుండగు కర్దమప్రజా**
**పతికిఁ బ్రమోద మొప్ప నవభామలతోఁ గపిలాఖ్యఁ బుట్టి యే**
**గతి హరిఁ బొందు నట్టి సుభగంబగు సాంఖ్యము దల్లి కిచ్చి దు**
**ష్కృతములు వాపి చూపె మునిసేవితమై తనరారు మోక్షమున్. 119**

**ప్రతి :** ధృతమతి= నిగ్రహింపబడిన బుద్ధిగల; దేవహూతికిని= దేవహూతికీ; దివ్యవిభుండు+అగు= దేవతాలక్షణాలతో అలరారే నాథుడగు; కర్దమప్రజాపతికిన్= కర్దముడను ప్రజాపతికీ; ప్రమోదము+ఒప్పన్= ఆనందంతో; నవభామలతోన్= తొమ్మిదిమంది వనితలతో; కపిల+ఆఖ్యన్= కపిలుడు అన్న పేరుగలిగి; పుట్టి= సంభవించి; ఏ గతిన్= ఏ విధంగా; హరిన్= విష్ణువును; పొందున్= (సాధకుడు) చేరుకొంటాడో; అట్టి సుభగంబు+అగు= అటువంటి మనోజ్ఞమైన; సాంఖ్యము= సాంఖ్యయోగాన్ని; తల్లికిన్+ఇచ్చి= తల్లికి బోధించి; దుష్కృతములు= పాపాలు; పాపి= తొలగించి; మునిసేవితము+ఐ= తాపసులచే అనుభవింపబడినదై; అలరారు= తనరారు; మోక్షమున్= ముక్తిని; చూపెన్= ప్రసాదించాడు.

**తా :** దేవహూతి అను ఆమె నిశ్చలమతియైన సతి. దివ్యతేజోవంతుడైన కర్దమప్రజాపతి ఆమె పతి. ఆ దంపతులకు సంతోషం అతిశయింపగా తొమ్మిదిమంది కూతుళ్ళతో పాటు శ్రీహరి కపిలుడన్న పేరుతో జన్మించాడు. ఏ యోగంతో శ్రీహరిని చేరడానికి సాధ్యమవుతుందో, ఆ మనోజ్ఞమైన సాంఖ్యయోగాన్ని ఆయన తల్లియగు దేవహూతికి బోధించాడు. అలా ఆమె పాపాలు రూపుమాపి మునులు అనుభవించే మోక్షాన్ని ఆమెకు ప్రసాదించాడు.

**విశే :** షడ్దర్శనాలు-(1) న్యాయదర్శనం, (2) వైశేషికదర్శనం, (3) సాంఖ్యదర్శనం, (4) యోగదర్శనం (5) పూర్వమీమాంసా దర్శనం మరియు (6) ఉత్తరమీమాంసాదర్శనం. ఇందులో మూడవదైన సాంఖ్యయోగానికి ప్రవర్తకుడు కపిలమహర్షి.

**వ. మఱియు దత్తాత్రేయావతారంబు వినుము. 120**

**ప్రతి :** మఱియున్= ఇంకా; దత్తాత్రేయ+అవతారంబున్= దత్తాత్రేయుని అవతారాన్ని గూర్చి, ఆలకించు.

**తా :** ఇక దత్తాత్రేయుని అవతారం ఎలా వచ్చిందో, వివరిస్తాను. ఆలకించు.

**సీ. తాపసోత్తముఁ డత్రి తనయునిఁ గోరి రమేశు వేఁడిన హరి యేను నీకు**
**ననఘ! "దత్తుఁడ నైతి" నని పల్కుకతమున నతఁడు దత్తాత్రేయుఁడై జనించె**
**న మ్మహాత్ముని చరణాబ్జపరాగసందోహంబుచేఁ బూతదేహు లగుచు**
**హైహయయదువంశ్యు లైహికాముష్మిక ఫలరూపమగు యోగబలము వడసి**

**తే. సంచితజ్ఞానఫల సుఖైశ్వర్య శక్తి, శౌర్యములఁ బొంది తమ కీర్తి చదల వెలుఁగ**
**నిందు నందును వాసికి నెక్కి రట్టి, దివ్యతరమూర్తి విష్ణు నుతింపఁదరమె? 121**

**ప్రతి :** తాపస+ఉత్తముఁడు= మునివర్యుడైన; అత్రి= అత్రిమహర్షి; తనయునిన్= పుత్రుణ్ణి; కోరి= అభిలషించి; రమా+ ఈశున్= లక్ష్మీరమణుడైన హరిని; వేఁడినన్= ప్రార్థించగా; హరి= మాధవుడు; అనఘ!= పాపరహితుడా!; ఏను= నేను; నీకు దత్తుడన్ ఐతిన్= నీ కీయబడినవాడనైనాను; అని పల్కుకతమునన్= అని చెప్పడంవల్ల; అతఁడు= ఆ హరి;

దత్తాత్రేయుఁడు+ఐ జనించెన్= దత్తాత్రేయుడుగా సంభవించినాడు; ఆ+మహాత్ముని= ఆ మహనీయునియొక్క; చరణ+అబ్జపరాగసందోహంబుచేన్= పాదపద్మాల ధూళిపటలంచేత; పూతదేహులు+అగుచున్= పవిత్రశరీరులవుతూ; హైహయయదువంశ్యులు= హైహయవంశానికీ, యదువంశానికి చెందినవారు; ఐహిక+ఆముష్మిక ఫలరూపము+అగు= ఇహలోకానికీ; పరలోకానికీ చెందిన ప్రయోజనరూపమైన; యోగబలము= యోగశక్తిని; పడసి= పొంది; సంచిత= ఆర్జించుకొన్న; జ్ఞానఫల= జ్ఞానమనే ఫలమూ; సుఖ+ఐశ్వర్య= సుఖం, సంపద; శక్తి= బలం; శౌర్యములన్= పరాక్రమాలను, పొంది; తమకీర్తి= తమ యశస్సు; చదలన్= ఆకసాన; వెలుఁగన్= ప్రకాశించగా; ఇందున్ అందునున్= ఉభయలోకాలలోనూ; వాసికిన్+ఎక్కిరి= ప్రతిష్ఠ పొందారు; అట్టి దివ్యతరమూర్తిన్= అటువంటి దివ్యమైన ఆకృతిగల; విష్ణున్= విష్ణుదేవుని; నుతింపన్ తరము+ఎ= కీర్తింపసాధ్యమా?

**తా :** మునులలో మేటియైన అత్రిమహర్షి తనకు పుత్రుణ్ణి అనుగ్రహించుమని విష్ణుని ప్రార్థించాడు. అందుకు శ్రీహరి "మునీంద్రా! నేను నీకు దత్తుడ నయ్యాను" అని అన్నాడు. అందుచేత హరియే దత్తాత్రేయుడై అత్రికుమారుడుగా జన్మించాడు. ఆ మహాత్ముని పాదపద్మధూళి సోకి హైహయ వంశానికీ, యదువంశానికీ చెందినవారంతా పవిత్ర దేహులయ్యారు. ఆయన అనుగ్రహంవల్లనే ఇహ పరలోకాలలో యోగబలం ఆర్జించుకొన్నారు. జ్ఞానఫలాన్నీ, సుఖాన్నీ, ఐశ్వర్యాన్నీ, శక్తినీ, శౌర్యాన్నీ, పొందారు. తమ కీర్తి మింట ప్రకాశిస్తుండగా ఉభయలోకాలలో ప్రసిద్ధి వహించారు. అట్టి దివ్యమూర్తి యగు హరిని నుతింపదరమా?

**విశే :** ఇందులో చెప్పిన జ్ఞానాదులన్నీ భగవంతుని లక్షణాలు.

**వ. వెండియు సనకాద్యవతారంబు వినుము. 122**

**ప్రతి :** వెండియున్= మరియు; సనకాది+అవతారంబున్= సనకాదుల అవతారాన్ని గురించి; వినుము= విను.

**తా :** ఇక సనకుడు; మున్నగు బ్రహ్మ మానస పుత్రుల అవతారాన్ని గూర్చి వివరిస్తాను, ఆలకించు.

**సీ. అనఘాత్మ! యేను గల్పాదిని విశ్వంబు సృజియింపఁ దలఁచి యంచితతపంబు**
**నర్థిఁ జేయుచు "సన" యని పల్కుటయు నది కారణంబుగ సనాఖ్యలను గల "స**
**నందన", "సనక", "సనత్కుమార", "సనత్సుజాతులు" నల్వురు సంభవించి**
**మానసపుత్రులై మహి నుతికెక్కిరి పోయిన కల్పాంతమున నశించి**

**తే. నట్టి యాత్మీయతత్త్వంబు వుట్టఁ జేసి, సంప్రదాయకభంగిని జగతి నెల్లఁ**
**గలుగఁ జేసిరి య వ్విష్ణుకళలఁ దనరి, నలువు రయ్యును నొక్కఁడ నయచరిత్ర! 123**

**ప్రతి :** అనఘ+ఆత్మ= పుణ్యాత్మా! ఏను= నేను; కల్పాదినిన్= యుగాదిలో; విశ్వంబున్= ప్రపంచాన్ని; సృజియింపన్+తలఁచి= సృష్టించాలని భావించి; అర్థిన్= కోరికతో; అంచిత తపంబున్= పూజితమైన తపస్సును; చేయుచున్= అనుష్ఠిస్తూ; 'సన' యని పల్కుటయున్= 'సన' అని పలికినాను; అది కారణంబుగన్= అలా పలకడంవల్ల; సనాఖ్యలను గల= 'సన' అన్న పేళ్ళుగల, సనందన, సనక, సనత్కుమార; సనత్సుజాతులు= సనందనుడు, సనకుడు, సనత్కుమారుడు; సనత్సుజాతుడు అనువారు; నల్వురు= నలుగురు; సంభవించి= జనించి; మహిన్= భూమిపై; మానసపుత్రులు+ఐ= మనస్సులో పుట్టిన

కుమారులై; నుతికిన్ ఎక్కిరి= కీర్తి పొందారు; పోయిన కల్పాంతమునన్= కడచిన యుగం చివర; నశించినట్టి= కనుమరుగై పోయినట్టి; ఆత్మీయతత్త్వంబున్= ఆత్మకు సంబంధించిన తత్త్వాన్ని; పుట్టన్+చేసి= కలిగించి; జగతిని+ఎల్లన్= లోకమంతటా; సంప్రదాయకభంగినిన్= సంప్రదాయ పద్ధతిని; కలుగన్+చేసిరి= కల్గించారు; నయచరిత్ర!= నీతిబద్ధచరిత్రగల నారదా!; ఆ+విష్ణుకళలన్= ఆ విష్ణుదేవుని అంశాలతో; తనరి= ప్రకాశించి; నలువురు+అయ్యునున్= వారు నలుగురైనప్పటికీ; ఒక్కఁడు+అ= ఒక్కరూపు గలవారేసుమా!

**తా :** పుణ్యాత్మా! నారదా! నేను కల్పారంభంలో విశ్వాన్ని సృష్టించాలనుకొన్నాను. అందుకై తపస్సు చేస్తూ 'సన' అని పలికాను. ఆ కారణంచేత 'సన' అన్న పేరుతో సనందనుడు, సనకుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అనే నలుగురు కుమారులు పుట్టారు. వారు బ్రహ్మ మానసపుత్రులుగా ప్రసిద్ధి పొందారు. గత కల్పాంతంలో అంతరించిపోయిన ఆత్మజ్ఞానాన్ని వాళ్ళు లోకంలో సంప్రదాయబద్ధంగా ప్రవర్తింపజేశారు. నయ శీలుడవగు నారదా! ఆ విష్ణుని కళలతో జన్మించిన వాళ్ళు నలుగురైనా నిజానికి వారి అవతారం ఒక్కటిగానే పరిగణింపబడవలసియున్నది.

**విశే :** సంప్రదాయక భంగి – తరతరాలుగా గురువులనుండి శిష్యులకు, తండ్రులనుండి కొడుకులకు సంక్రమిస్తున్న విద్యాదులకు సంబంధించిన వ్యవహారం సంప్రదాయం దాని తీరు.

**వ. మఱియు నరనారాయణావతారంబు వినుము. 124**

**ప్రతి :** మఱియున్= ఇంకా; నరనారాయణ+అవతారంబున్= నరుడు; నారాయణుడు అనువారి అవతారాన్నిగూర్చి; వినుము= ఆలింపుము.

**తా :** ఇంకా నరనారాయణులెలా అవతరించారో, విను.

**క. గణుతింపఁగ నరనారా, యణు లన ధర్మునకు నుదయ మందిరి దాక్షా**
**యణి యైన "మూర్తి"వలనం, బ్రణుతగుణోత్తరులు పరమపావనమూర్తుల్. 125**

**ప్రతి :** గణుతింపఁగన్= వినుతికెక్కునట్లుగా; ధర్మునకున్= ధర్మానికి, అధిష్ఠానమైన ధర్మునికి; దాక్షాయణి+ఐన మూర్తివలనన్= దక్షుని పుత్రిక యగు మూర్తి అనే ఆమెద్వారా; నరనారాయణులు+అనన్= నరుడు, నారాయణుడు అనే పేర్లతో; ప్రణుత గుణ+ఉత్తరులు= మిక్కిలి నుతి పాత్రమైన గుణాలుగలవారు; పరమపావనమూర్తుల్= మిక్కిలి పవిత్రమైన ఆకృతులు గలవారూ; ఉదయము+అందిరి= జన్మించారు.

**తా :** వినుతి కెక్కిన గుణాలు గలవారూ, మిక్కిలి పావనమూర్తులూ అయిన నరుడూ, నారాయణుడు అన్నవారు ధర్మానికి అధిష్ఠానమైన ధర్మునికీ, దక్షుని సుతయగు మూర్తికీ జన్మించారు.

**క. అనఘులు బదరీవనమున, వినుతతపోవృత్తి నుండ, విబుధాధిపుఁడున్**
**మనమున నిజపదహానికి, ఘనముగఁ జింతించి దివిజకాంతామణులన్. 126**

**ప్రతి :** అనఘులు= పాపరహితులైన ఆ నరనారాయణులు; బదరీవనమునన్= బదరికావనంలో; వినుతతపస్+వృత్తిన్+ఉండన్= ప్రశస్తమైన తపస్సు అనే పనిలో ఉండగా; విబుధ+అధిపుఁడున్= దేవతల కధిపతియగు ఇంద్రుడు; మనమునన్= చిత్తంలో; నిజపదహానికిన్= తన పదవికి కలిగే హానినిగూర్చి; ఘనముగాన్= మిక్కిలిగా; చింతించి= చింతకు లోనై; దివిజకాంతామణులన్= దేవతా వనితలలో మిన్నలైనవారిని...

**తా :** పరమ పవిత్రులైన ఆ నరనారాయణులు బదరీవనంలో తపోనిష్ఠులయ్యారు. అది చూచి ఇంద్రుడు వారి తపస్సుచే తన పదవికి గండం ఏర్పడవచ్చునన్న చింతకు లోనై దేవతా స్త్రీలలో మేలైనవారిని కొందరిని–

**క. రావించి "తపోవిఘ్నముఁ, గావింపుం" డనుచు బనుపఁ గడు వేడుకతో**
**భావభవానీకిను లనఁ, గా వనితలు సనిరి బదరికా వనమునకున్. 127**

**ప్రతి :** రావించి= రప్పించి; తపస్+విఘ్నమున్+కావింపుఁడు= వారి తపస్సుకు విఘ్నం కలిగించండి; అనుచున్= అంటూ; పనుపన్= పంపగా; కడు వేడుకతోన్= మిక్కిలి సంతోషంతో; భావభవ+అనీకినులు+అనఁగాన్= మన్మథుని సేనలా అన్నట్లు; వనితలు= దేవతాస్త్రీలు; బదరికా వనమునకున్= బదరీవనానికి; చనిరి= వెళ్ళారు.

**తా :** అలా దేవతావనితలను పిలిపించి ఇంద్రుడు 'నరనారాయణుల తపస్సుకు అంతరాయం కలిగించండి' అని చెప్పి పంపాడు. ఆ కాంతలు ఎంతో సంతసంతో మన్మథునిసేనలా అన్నట్లు బయలుదేరి బదరీవనానికి పోయారు.

**వ. అందు. 128**

**ప్రతి :** అందున్= ఆ వనంలో

**తా :** నరనారాయణులు ఉన్న వనంలో

**మ. నరనారాయణు లున్న చోటికి మరున్నారీసమూహంబు భా**
**స్వరలీలం జని రూపవిభ్రమ కళాచాతుర్య మేపారఁగాఁ**
**బరిహాసోక్తుల నాటపాటలఁ జరింపం జూచి నిశ్చింతతన్**
**భరితధ్యానతపఃప్రభావనిరతిం బాటించి నిష్కాములై. 129**

**ప్రతి :** మరుత్+నారీసమూహంబు= దేవకాంతలబృందం; నరనారాయణులు+ఉన్న చోటికిన్= నరుడూ, నారాయణుడూ తపస్సు చేస్తున్న ప్రదేశానికి; భాస్వరలీలన్= ప్రకటమైన లీలావిలాసంతో; చని= పోయి; రూప విభ్రమకళాచాతుర్యము= సౌందర్యం, విలాసకళల నైపుణ్యం; ఏపారఁగాన్= ఉట్టి పడేవిధంగా; పరిహాస+ఉక్తులన్= పరిహాస ప్రధానమైన పలుకులతోనూ; ఆటపాటలన్= ఆటలతో పాటలతో; చరింపన్+చూచి= సంచరిస్తూవుండగా చూచి; నిశ్చింతతన్= చింతారహితంగా; భరిత ధ్యాన తపస్+ప్రభావనిరతిన్= పూర్ణమైన ధ్యానం, తపస్సుల ప్రభావంమీది ఆసక్తిని; పాటించి= అనుసరించి; నిష్కాములు+ఐ= కోరిక లేనివారై...

**తా :** అక్కడ నరుడూ, నారాయణుడూ తపస్సు చేస్తున్న చోటికి దేవకాంతలు సవిలాసంగా వెళ్ళారు. అందచందాలతీరూ, కళానైపుణ్యాల సొరూ ఉట్టిపడునట్లుగా పరిహాసవచనాలు పలుకుతూ, ఆటలాడుతూ, పాటలుపాడుతూ, విహరించారు. అలా తపోవనంలో విహరిస్తున్న అమరకాంతలను ఆ నరనారాయణులు చూచారు. వారు ఏ మాత్రం చలించలేదు. కామునికి లొంగలేదు. నిశ్చింతులై, నిర్మోహులై వాళ్ళు అలాగే నిరతిశయ నిశ్చల ధ్యానంలో, తపస్సులో నిమగ్నులైవుండి పోయారు.

**క. క్రోధము దమ తపములకును, బాధక మగు టెఱిఁగి దివిజభామలపై న**
**మ్మేధాత్మకు లొక యింతయుఁ, గ్రోధముఁ దేరైరి సత్త్వగుణయుతు లగుటన్. 130**

**ప్రతి :** ఆ+మేధాత్మకులు= మేధాసంపన్నులైన ఆ నరనారాయణులు; క్రోధము= కోపం; తమ తపములకున్= తమ తపోనిష్ఠకు; బాధకము+అగుట+ఎఱిఁగి= బాధ కలిగిస్తుందని గ్రహించి; సత్త్వగుణయుతులు+అగుటన్= సత్త్వగుణసంపన్నులు కావున; దివిజభామలపైన్= ఆ దేవవనితలమీద; ఒక+ఇంతయున్= ఒకించుక గూడా, రవ్వంతైనా; క్రోధమున్= కోపాన్ని; తేరు+ఐరి= ప్రదర్శించనివారైనారు.

**తా :** ఆ మేధావులైన నరనారాయణులు కోపం తమ తపస్సులను బాధిస్తుందని గ్రహించారు. సత్త్వగుణసంపన్నులు కావడంవల్ల వారు ఆ దేవవనితల మీద కించిన్మాత్రంకూడా కోపం చూపలేదు.

**క. నారాయణుఁ డప్పుడు దన, యూరువు వెసఁ జీర, నందు నుదయించెను బెం**
**పారంగ నూర్వశీ ముఖ, నారీజనకోటి దివిజనారులు మెచ్చన్. 131**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో, నారాయణుఁడు; తన ఊరువున్= తనతొడను; వెసన్= శీఘ్రంగా; చీరన్= చీల్చగా; పెంపు+ఆరంగన్= పెంపొప్పగా; అందున్= ఆ తొడయందు; ఊర్వశీముఖనారీజనకోటి= ఊర్వశిమున్నగు స్త్రీ జనబృందం; దివిజనారులు= దేవవనితలు; మెచ్చన్= ప్రశంసించగా; ఉదయించెన్= ఉద్భవించింది.

**తా :** అప్పుడు నారాయణుడు వెంటనే తన ఊరుభాగాన్ని గోటితో చీల్చాడు. అందుండి అమరకాంతలు మెచ్చగా ఊర్వశి మున్నగు అచ్చరలు పుట్టారు.

**క. ఊరువులందు జనించిన, కారణమున "నూర్వశి"యన ఘనతకు నెక్కెన్**
**వారల రూపవిలాస వి, హారములకు నోడి రంత నమరీజనముల్. 132**

**ప్రతి :** ఊరువులందున్= తొడలయందు; జనించిన కారణమునన్= పుట్టినందువల్ల (ఆమె); ఊర్వశి+అనన్= ఊర్వశి అని; ఘనతకున్ ఎక్కెన్= ప్రశస్తి గాంచింది; అంతన్= ఆపై; అమరీజనముల్= ఇంద్రుడు పంపిన దేవకాంతలు; వారల= ఆ ఊర్వశిమున్నగు వనితలయొక్క; రూప విలాసవిహారములకున్= సౌందర్యవిలాస విహారాలకు; ఓడిరి= పరాజితలయ్యారు.

**తా :** నారాయణుని ఊరువులందు పుట్టినందువల్ల ఆమె ఊర్వశి అని ప్రసిద్ధి వహించింది. ఇంద్రుడు పంపిన దివిజకాంతలు ఊర్వశి మున్నగువారి సౌందర్యం, విలాసం, విహారం చూచి వారిముందు తమ ఆటలు సాగవని సిగ్గుజెంది ఓడిపోయారు.

**వ. అంతం దాము నరనారాయణుల తపోవిఘ్నంబు గావింపంబూని చేయు విలాసంబులు, మానసిక సంకల్పమాత్రంబున సృష్టిస్థితి సంహారంబు లొనర్పంజాలు న మ్మహాత్ముల దెసం బనికిరాక కృతఘ్నునకుం జేయు నుపకృతులుంబోలె నిష్ఫలంబులైన సిగ్గునం గుందుచు, నూర్వశిం దమకు ముఖ్యురాలిగాఁ గైకొని తమ వచ్చిన జాడన మరలి చని రంత. 133**

**ప్రతి :** అంతన్= ఆ మీదట, తాము; నరనారాయణుల తపోవిఘ్నంబు= నరనారాయణుల తపస్సుకు ఆటంకం; కావింపన్+పూని= చేయబూని; చేయు విలాసంబులు= ప్రదర్శించే విలాసాలు; మానసిక సంకల్పమాత్రంబునన్= చిత్తంయొక్క సంకల్పమాత్రంచేత; సృష్టి స్థితి సంహారంబులు= జగన్నిర్మాణ పోషణ సంహారకార్యాలు; ఒనర్పన్+చాలు= చేయగల; ఆ+మహాత్ములదెసన్= ఆ మహనీయులపట్ల; పనికిరాక= ఉపయోగపడక; కృతఘ్నునకున్= చేసిన మేలు మరచినవానికి; చేయు ఉపకృతులున్+పోలెన్= చేసే ఉపకారాలవలె; నిష్ఫలంబులు+ఐనన్= నిష్ప్రయోజనాలు కాగా, విఫలములు

కాగా; సిగ్గునన్= లజ్జతో; కుందుచున్= వగచుచూ; ఊర్వశిన్+తమకున్+ముఖ్యరాలిగాన్= ఆ ఊర్వశిని తమ బృందానికి నాయకురాలుగా; కైకొని= గ్రహించి; తమ వచ్చిన జాడను+అ= తాము వచ్చిన దారిలోనే; మరలి చనిరి= తిరిగిపోయారు; అంతన్= ఆ మీదట...

**తా :** మనసులో సంకల్పించినంత మాత్రాన ఆ నరనారాయణులు సృష్టిస్థితిలయాలు చేయ శక్తిగలవారు. అట్టి మహాత్ముల తపోనిష్ఠకు భంగం కల్గించాలని సురవనితలు చేసిన శృంగారచేష్టలు కృతఘ్నుడికి చేసిన ఉపకారక్రియలవలె వ్యర్థాలయ్యాయి. అందుచేత వాళ్ళు సిగ్గుతో కుంచించుకుపోయారు. ఆ ఊర్వశినే తమకు నాయకురాలినిగా చేసికొని వచ్చిన దారినే తిరిగి వెళ్ళారు.

**క. కాముని దహించెఁ గ్రోధ మ, హామహిమను రుద్రుఁ, డట్టి యతికోపము నా**
**ధీమంతులు గెలిచి రనం, గామము గెలుచుటలు సెప్పఁగా నేమిటికిన్? 134**

**ప్రతి :** రుద్రుఁడు= శివుడు; క్రోధమహామహిమనున్= కోపంయొక్క గొప్ప ప్రభావముతో; కామునిన్= మదనుణ్ణి; దహించెన్= కాల్చివేశాడు; అట్టి అతికోపమున్= అటువంటి తీవ్రకోపాన్ని; ఆ ధీమంతులు= బుద్ధిమంతులగు ఆ నరనారాయణులు; గెలిచిరి+అనన్= జయించారనగా; కామమున్ గెలుచుటలు= వారు కామాన్ని జయించారనడాన్ని; చెప్పఁగాన్+ఏమిటికిన్= చెప్పవలసిన పని ఏమున్నది?

**తా :** పూర్వం రుద్రుడు మహాకోపంతో కాముణ్ణి కాల్చివేశాడు. కోపం అంత దారుణమయింది. అట్టి కోపాన్ని సైతం ఆ బుద్ధిమంతులైన నరనారాయణులు అనాయాసంగా జయించారు. ఇక వారు కామాన్ని జయించడం గురించి చెప్పనేల?

**విశే :** గీత 'కామ ఏష క్రోధ ఏష' ఇత్యాది శ్లోకంలో కామక్రోధాలు మహాశనములు, మహాపాపాలు అని చెప్పింది. అది ప్రాణికి వైరి. ఆ రెంటి సముదాయాన్ని 'జహి' – చంపు అనికూడా గీతాచార్యుడు ఆదేశించాడు. నరనారాయణులు కామక్రోధ జయం చేసినవారు కనుక అవతారపురుషులయ్యారు.

**వ. అట్టి నరనారాయణావతారంబు జగత్పావనంబై విలసిల్లె, వెండియు ధ్రువావతారంబు వివరించెద వినుము. 135**

**ప్రతి :** అట్టి నరనారాయణ+అవతారంబు= అటువంటి నరనారాయణుల అవతారం; జగత్+పావనంబు+ఐ= లోకపావనమై; విలసిల్లెన్= వెలుగొందింది; వెండియున్= ఇంకా; ధ్రువ+అవతారంబున్= ధ్రువుని అవతారాన్ని; వివరించెదన్ వినుము= వివరిస్తాను; విను.

**తా :** అలాంటి నరనారాయణుల అవతారం లోకాన్ని పవిత్రం చేస్తూ వెలుగొందింది. ఇక ధ్రువుని అవతారాన్ని వివరిస్తాను, వినుము.

**సీ. మానితచరితుఁ "డుత్తానపాదుం"డను భూవరేణ్యునకు సత్పుత్రుఁడనఁగ**
**నుదయించి మహిమఁ బెంపొంది బాల్యంబున జనకునికడ నుండి సవతితల్లి**
**దను నాడు వాక్యాస్త్రతతిఁ గుంది మహిత తపంబు గావించి కాయంబుతోడఁ**
**జని మింట ధ్రువపదస్థాయి యై యటమీఁద నర్థి వర్తించు భృగ్వాదిమునులుఁ**

**తే. జతురగతి గ్రింద వర్తించు సప్తఋషులఁ, బెంపు దీపింపఁ దన్ను నుతింప వెలసి**
**"ధ్రువుఁడు" నా నొప్పి య విష్ణుతుల్యుఁ డగుచు, నున్న పుణ్యాత్ముఁ డిప్పుడు నున్నవాఁడు. 136**

**ప్రతి :** మానితచరితుఁడు= పూజిత చరిత్రుడు; ఉత్తానపాదుండు+అను= ఉత్తానపాదుడనే; భూవరేణ్యునకున్= రాజుకు; సత్పుత్రుఁడు+అనఁగన్= మంచి కుమారుడనగా; ఉదయించి= జనించి; మహిమన్= ప్రభావంతో; పెంపు+ఒంది= వృద్ధి పొంది; బాల్యంబుననన్= బాల్యదశలో; జనకునికడన్+ఉండి= తండ్రివద్దవుండి; సవతితల్లి= మారుతల్లి అయిన సురుచి; తనున్+ఆడు= తన్నుగూర్చి చెప్పునట్టి; వాక్య+అస్త్రతతిన్= మాటలనే బాణాల సమూహంచేత; కుంది= వగచి; మహిత తపంబున్= శ్రేష్ఠమైన తపస్సు; కావించి= చేసి; కాయంబుతోడన్= శరీరంతోగూడ; చని= వెళ్ళి; మింటన్= ఆకసంలో; ధ్రువపదస్థాయి+ఐ= చెదిరిపోవటంలేని సుస్థిరమైన స్థానంలో ఉన్నవాడై; అటమీదన్= ఆ స్థానానికిపైన; వర్తించు= ఉన్న; భృగు+ఆదిమునులున్= భృగువుమున్నగు మునులునూ; చతురగతిన్= నిపుణమైనగతితో; క్రిందన్ వర్తించు= ఆ స్థానానికి క్రిందిభాగంలో ఉన్న; సప్తఋషులు= ఏడుగురు ఋషులు; పెంపుదీపింపన్= గొప్పతనం వెలుగొందగా; తన్ను నుతింపన్= తన్ను ప్రశంసింపగా; వెలసి= ప్రకాశించి; ధ్రువుఁడు నాన్= ధ్రువుడనగా; ఒప్పి= భాసిల్లి; ఆ+విష్ణుతుల్యుఁడు+అగుచున్= ఆ విష్ణువుతో సమానుడై; ఉన్నపుణ్యాత్ముఁడు= ఉన్నట్టి పవిత్రాత్ముడు; ఇప్పుడున్+ఉన్నవాఁడు= నేడుగూడా అక్కడే ఉన్నాడు.

**తా :** ఉత్తమచరిత్రుడైన ఉత్తానపాదుడనే నృపునకు ధ్రువుడు సత్పుత్రుడై సంభవించాడు, ప్రభావసంపన్నుడై పేరుగాంచాడు. చిన్న తనంలో ఒకనాడు తండ్రిచెంత ఉండగా సవతితల్లి 'సురుచి' ఆ బాలుణ్ణి నిందావచనాలనే అస్త్రాలతో నొప్పించింది. అందుకు దుఃఖించిన ధ్రువుడు గొప్ప తపస్సు చేశాడు. ఆ తపస్సు ఫలించింది. భగవానుడు సాక్షాత్కరించి ధ్రువుణ్ణి అనుగ్రహించాడు. అతడు సశరీరంగా వెళ్ళి ఆకసంలో మహోన్నతస్థానమైన ధ్రువస్థానంలో స్థిరపడినాడు. ఆచోటికి పైన ఉండే భృగువు మున్నగు మహర్షులూ, క్రింద ఉండే సప్తర్షులూ ఆ మహనీయుణ్ణి గొప్పగా ప్రశంసించారు. అతడు 'ధ్రువుడు' అనే పేరుతో విలసిల్లి విష్ణుతుల్యుడైనాడు. ఇప్పుడు కూడా ఆ పుణ్యాత్ముడు ఆ ధ్రువస్థానంలోనే వెలుగొందుతున్నాడు.

**విశే :** చాక్షుషమనువు కాలంలో భృగువు సప్తర్షులలో ఒకడు. ఇక్కడ పేర్కొన్న సప్తర్షులలో భృగువు లేడు. కాబట్టి కాలాంతరానికి చెందిన సప్తర్షులను ఇక్కడ గ్రహించాలి.

**వ. మఱియుఁ బృథుని యవతారంబు వినుము. 137**

**ప్రతి :** మఱియున్= ఇంకా; పృథుని= పృథుచక్రవర్తియొక్క; అవతారంబు= జనన వృత్తాంతాన్ని; వినుము= శ్రద్ధగా విను.

**తా :** ఇంక పృథుచక్రవర్తి అవతరించిన తీరు వివరిస్తాను, శ్రద్ధగా విను.

**ఉ. వేనుఁడు విప్రభాషణ పవిప్రహతిచ్యుతభాగ్యపౌరుషుం**
**డై నిరయంబునం బడిన నాత్మతనూభవుఁడై పృథుండు నాఁ**
**బూని జనించి తజ్జనకుఁ బున్నరకంబును బాపె, మేదినిన్**
**ధేనువుఁజేసి వస్తువితతిం బిదికెన్ హరిసత్కళాంశుఁడై. 138**

**ప్రతి :** వేనుఁడు= వేనుడనే నృపుడు; విప్ర= ద్విజులయొక్క; భాషణ= మాటలనెడు; పవి= వజ్రాయుధంయొక్క; ప్రహతి= దెబ్బలచేత; చ్యుత= జారిపోయిన; భాగ్యపౌరుషుండు+ఐ= అదృష్టం, పౌరుషం కలవాడై; నిరయంబునన్= నరకంలో;

పడినన్= పడిపోగా; ఆత్మతనూభవుఁడు+ఐ= అతని కుమారుడై; పృథుండు= పృథుచక్రవర్తి; నాన్= అనే పేరుతో; పూని జనించి= పూనికతోపుట్టి; తత్+జనకున్= ఆ తండ్రియొక్క; పున్నరకంబునున్+పాపెన్= పున్నామనరకాన్ని తొలగించాడు; హరిసత్+కళా+అంశుఁడు+ఐ= శ్రీహరియొక్క ఉత్తమ కళాంశం కలవాడై; మేదినిన్= భూమిని; ధేనువున్+చేసి= గోవుగా చేసి; వస్తువితతిన్+పిదికెన్= అనేక పదార్థాలను పితికినాడు.

**తా :** వేనుడను రాజు భూసురుల శాపవచనాలనే వజ్రాయుధపు దెబ్బలకు గురియై సిరినీ, మగటిమినీ కోల్పోయాడు. తుదకు నరకం పాలయ్యాడు. అతనికి పృథుడనే కుమారుడు శ్రీహరి కళాంశంతో జనించాడు. అతడు తండ్రిని పున్నామనరకం నుండి కాపాడాడు. భూమిని ధేనువుగా జేసి అమూల్యమైన అనేక వస్తువులను పిదికాడు.

**వ. అని మఱియు వృషభావతారంబు నెఱింగింతు, వినుము, అగ్నీధ్రుం డనువానికి "నాభి" యనువాఁ డుదయించె, నతనికి మేరుదేవి యను నామాంతరంబు గల "సుదేవి"యందు హరి వృషభావతారంబు నొంది జడస్వభావంబైన యోగంబు దాల్చి ప్రశాంతాంతః కరణుండును, బరిముక్తసంగుండునునై పరమ హంసాభిగమ్యం బయిన పదం బిది యని మహర్షులు వలుకుచుండం జరించె, మఱియు హయగ్రీవావతారంబు సెప్పెద వినుము. 139**

**ప్రతి :** అని= అని చెప్పి; మఱియున్= ఇంకనూ; వృషభావతారంబున్= వృషభుని అవతారాన్ని; ఎఱింగింతున్= తెలియజేస్తాను; వినుము= విను; అగ్నీధ్రుండు+అనువానికిన్= 'అగ్నీధ్రుడు' అనేపేరు గలవానికి; నాభి+అనువాఁడు+ఉదయించెన్= నాభియనేవాడూ సంభవించాడు; అతనికిన్= నాభికి; మేరుదేవి+అను= మేరుదేవి అనే; నామ+అంతరంబుగల= మరొక పేరుగల; 'సుదేవి' యందున్= సుదేవి అనే పత్నియందు; హరి= నారాయణుడు; వృషభ+అవతారంబునొంది= వృషభుడుగా అవతరించి; జడస్వభావంబు+ఐన= జడశీలమైన; యోగంబు+తాల్చి= యోగం శీలించి; ప్రశాంత+అంతః కరణుండునున్= మిక్కిలి శాంతమైన అంతఃకరణం కలవాడూ; పరిముక్తసంగుండును+ఐ= సంగం వదలినవాడును అయి; పరమహంస+ అభిగమ్యంబు+అయిన= పరమహంసచే పొందదగిన; పదంబు+ఇది+అని= స్థానమిదియని, మహర్షులు; పలుకుచుండన్= చెప్పుచుండగా; చరించెన్= ప్రవర్తించాడు; మఱియున్= ఇంకనూ; హయగ్రీవ+అవతారంబు= హయగ్రీవుని అవతారాన్ని గురించి; చెప్పెదన్= నుడివెదను; వినుము= ఆలకించుము.

**తా :** ఇలా చెప్పి బ్రహ్మ మరల ఇలా అన్నాడు. నారదా! ఇప్పుడు వృషభుని అవతారం తెలియజేస్తాను, విను, 'అగ్నీధ్రు' డనే వానికి 'నాభి' అనే కుమారుడు కలిగాడు. నాభి భార్య సుదేవి. ఆమెకు మరొకపేరు 'మేరుదేవి'. ఆమెయందు శ్రీహరి వృషభావతారంగా జన్మించాడు. అతడు జడశీలమైన యోగం పూనాడు. ప్రశాంత చిత్తంతో ఇతరమైనవాటితో సంగం వదలి చరించాడు. 'ఇది పరమహంసల స్థితి' అని తన్ను గురించి మునులు ప్రశంసిస్తూ ఉండగా ఆ యోగంలో ప్రవర్తించాడు.

ఇక హయగ్రీవావతారం వర్ణిస్తాను, విను.

**చ. అనఘచరిత్ర! మన్మఖమునందు జనించె హయాననాఖ్యతన్**
**వినుతసువర్ణవర్ణుఁడును వేదమయుం డఖిలాంతరాత్మకుం**
**డనుపమయజ్ఞపూరుషుఁడు నై భగవంతుఁడు; దత్సమస్త పా**
**వనమగు నాసికాశ్వసనవర్గములందుదయించె వేదముల్. 140**

**ప్రతి :** అనఘచరిత్ర!= దోషరహితమైన నడవడి గలవాడా!; భగవంతుఁడు= పరమాత్ముడు; హయానన+ఆఖ్యతన్= 'హయవదనుడు' అన్న పేరుతో; మత్+మఖమునందున్= నేను చేసిన యజ్ఞంలో; వినుత సువర్ణవర్ణుఁడునున్= ప్రశస్తమైన బంగారుమేని చాయగలవాడునూ; వేదమయుండు= వేదస్వరూపుడు; అఖిల+అంతరాత్మకుండు= సకల విశ్వానికి అంతరాత్మయైనవాడూ; అనుపమయజ్ఞ పూరుషుఁడున్+ఐ= సాటిలేని యజ్ఞపురుషుడై; జనించెన్= పుట్టాడు; వేదముల్= వేదాలు; తద్+సమస్తపావనము+అగు= ఆ హయవదనుని సకల పవిత్రమైన; నాసికాశ్వసనవర్గములందున్= ముక్కు పుటాలలోని శ్వాసవాయువులనుండి; ఉదయించెన్= జనించాయి.

**తా :** సచ్చరిత్రా! మేలిమి బంగరుకాంతిగలవాడూ, వేదస్వరూపుడూ, సర్వాంతర్యామీ, సాటిలేని యజ్ఞపురుషుడూ అయిన భగవానుడు 'హయగ్రీవుడు' అన్న పేరుతో నేను నిర్వహించిన యజ్ఞం నుండి ఆవిర్భవించాడు. సర్వాన్ని పావనంచేసే ఆ హయగ్రీవుని ముకుపుటాలలోని శ్వాసవాయువులనుండి వేదాలు ప్రాదుర్భవించాయి.

**వ. మఱియు మత్స్యావతారంబు వినుము. 141**

**ప్రతి :** మఱియున్= ఇంకా; మత్స్యావతారంబున్= మత్స్యంయొక్క అవతారాన్ని గూర్చి; వినుము= విను.

**తా :** ఇంక మత్స్యావతారం వివరిస్తాను, విను.

**సీ. ఘనుఁడు వైవస్వతమనువుకు దృష్టమై యరుదెంచునట్టి యుగాంతసమయ**
**మందు విచిత్రమత్స్యావతారము దాల్చి యఖిలావనీమయం బగుచుఁ జాల**
**సర్వజీవులకు నాశ్రయభూతుఁ డగుచు నే కార్ణవంబైన తోయముల నడుమ**
**మన్ముఖశ్లథవేదమార్గంబులను జిక్కు వడకుండ శాఖ లేర్పడఁగఁ జేసి**

**తే. దివ్యు లర్థింప నా కర్థిఁ దెచ్చి యిచ్చి, మనువు నెక్కించి పెన్నావ వనధినడుమ**
**మునుఁగకుండంగ నరసిన యనిమిషావ, తార మేరికి నుతియింపఁ దరమె వత్స! 142**

**ప్రతి :** వత్స= కుమారా!; ఘనుఁడు= గొప్పవాడైన; వైవస్వతమనువుకున్= వైవస్వతుడు అనే మనువుకు; దృష్టము+ఐ= కనిపించినదై; అరుదెంచునట్టి= వచ్చునట్టి; యుగాంతసమయమందున్= ప్రళయకాలంలో; విచిత్ర మత్స్య+అవతారము= ఆశ్చర్యకరమైన మత్స్యావతారాన్ని; తాల్చి= ధరించి; చాలన్= మిక్కిలిగా; అఖిలావనీమయంబు+అగుచున్= సకలభూమయం అవుతూ; సర్వజీవులకున్= సమస్తజీవకోటికి; ఆశ్రయభూతుఁడు+అగుచున్= ఆధారమైనవాడవుతూ; ఏక+అర్ణవంబు+ఐన= ఏకసాగరమయమైన; తోయముల నడుమన్= నీటిమధ్య; మన్ముఖశ్లథవేదమార్గంబులనున్= నా వదనంనుండి జారిన వేద మార్గాలను; చిక్కువడకుండన్= సంకీర్ణమైపోకుండా; శాఖలు+ఏర్పడఁగన్+చేసి= ఆ వేదశాఖలను స్పష్టంగా వేరుపరచి; దివ్యులు= దేవలోకవాసులు; అర్థింపన్= కోరగా; అర్థిన్= అక్కరతో; నాకు, తెచ్చి, యిచ్చి= నా చేతికందజేసి; మనువున్= వైవస్వతమనువును; ఎక్కించి= అధిష్ఠింపజేసి; పెన్నావ= ఆ పెద్దనావ; వనధినడుమన్= సాగరమధ్యంలో; మునుగక+ ఉండంగన్= మునిగిపోకుండా; అరసిన= కాపాడిన; అనిమిష+అవతారము= మత్స్యావతారం; ఏరికిన్= ఎవరికైనా; నుతియింపన్ తరము+ఎ= స్తుతించుటకు సాధ్యమా? కాదని తాత్పర్యము.

**తా :** కుమారా! ప్రళయసమయంలో సమస్తం జలమయమై పోయింది. ఆ పరిస్థితిని వైవస్వతమనువు ముందే గ్రహించి ఒక పడవపై కూర్చున్నాడు. అప్పుడు భగవంతుడు విచిత్రమైన మత్స్యావతారం దాల్చాడు. భూతలంలోని సకల జీవులకూ

ఆధారమైన ఆ దేవుడప్పుడు నా ముఖంనుండి జారిపోయిన వేదశాఖలు సంకీర్ణమైపోకుండా విభజించాడు. దేవతల కోరికననుసరించి నాకు మళ్ళీ ఆ వేదశాఖల నందించాడు. వైవస్వతుణ్ణి నావపై ఎక్కించి ఆ నావ సముద్రంలో మునిగిపోకుండా కాపాడినాడు. మహామహనీయమైన ఆ మత్స్యావతారాన్ని వినుతించడానికి ఎవరికి శక్యమవుతుంది?

**వ. మఱియుఁ గూర్మావతారంబు వినుము. 143**

**ప్రతి :** మఱియున్= ఇంకను; కూర్మ+అవతారంబున్= కూర్మరూపమైన అవతారాన్నిగూర్చి; వినుము= విను.

**తా :** ఇంక కూర్మావతారాన్ని గూర్చి విను.

**మ. అమృతోత్పాదనయత్నులై విబుధదైత్యానీకముల్, మందరా**
**గముఁ గవ్వంబుగఁజేసి యబ్ధి దరువంగాఁ, గవ్వపుంగొండ వా**
**ర్ధి మునుంగన్ హరి కూర్మరూపమున నద్రిందాల్చెఁ దత్పర్వత**
**భ్రమణవ్యాజత వీఁపుఁదీట శమియింపంజేయఁగా నారదా! 144**

**ప్రతి :** విబుధదైత్య+అనీకముల్= దేవతల, రాక్షసుల సమూహాలు; అమృత+ఉత్పాదనయత్నులు+ఐ= అమృతాన్ని పుట్టించాలన్న ప్రయత్నం గలవారై; మందర+అగమున్= మందరమనే పర్వతాన్ని; కవ్వంబుగన్+చేసి= కవ్వంగా చేసుకొని; అబ్ధిన్= క్షీరసాగరాన్ని; తరువంగాన్= చిలుకగా; కవ్వము+కొండ= కవ్వంగా ఉండిన మందర పర్వతం; వార్ధిన్ మునుంగన్= సముద్రంలో మునిగిపోగా; హరి= శ్రీహరి; కూర్మరూపమునన్= తాబేటి రూపంతో; తద్+పర్వత భ్రమణవ్యాజతన్= ఆ కొండ గిరగిర తిరుగుట అనే వ్యాజంతో; వీపు+తీట= తన వీపుపైని దురద; శమియింపన్=+చేయఁగాన్= తీరిపోవునట్లు చేయగా; అద్రిన్= మందరనగాన్ని; తాల్చెన్= ధరించాడు.

**తా :** నారదా! పూర్వం దేవతలూ, రాక్షసులూ అమృతం సాధించాలనే యత్నంతో మందరాద్రిని కవ్వంగా జేసుకుని క్షీరసముద్రాన్ని మథించారు. అప్పుడా కవ్వపు గొండ కడలి నడుమ మునిగిపోయింది. అప్పుడు శ్రీహరి తన వీపు దురద శమింపజేయటానికా అన్నట్లు గిరగిర తిరిగే గిరిని కూర్మరూపం దాల్చి ధరించాడు.

**వ. వెండియు నృసింహావతారంబు వినుము. 145**

**ప్రతి :** వెండియున్= మరల; నృసింహ+అవతారంబున్= నరసింహుని అవతారం గురించి; వినుము.

**తా :** ఇక నరసింహావతారాన్ని వివరిస్తాను, వినుము.

**మ. సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ స్రుక్కించి యుద్యద్గదా**
**ధరుఁడై వచ్చు నిశాచరుం గని, కనద్దంష్ట్రాకరాళాస్య వి**
**స్ఫురితభ్రూకుటితో నృసింహగతి రక్షోరాజవక్షంబు భీ**
**కరభాస్వన్నఖరాజిఁ ద్రుంచెఁ ద్రిజగత్కల్యాణసంధాయియై. 146**

**ప్రతి :** సురలోకంబున్= దేవలోకాన్ని; కలంచి= కలతబెట్టి; దేవసమితిన్= దేవతలబృందాన్ని; స్రుక్కించి= బాధించి; ఉద్యద్గదాధరుఁడు+ఐ= పై కెత్తిన గదను ధరించినవాడై; వచ్చు నిశాచరున్+కని= వచ్చునట్టి హిరణ్యకశిపుణ్ణి చూచి;

కనత్= ప్రకాశించు; దంష్ట్రా= కోరలచే; కరాళ= భీకరమైన; ఆస్య= ముఖమునందు; విస్ఫురిత= విశేషంగా స్ఫురించిన; భ్రూకుటితోన్= బొమముడితో; నృసింహగతిన్= నరసింహగమనంతో; రక్షస్+రాజవక్షంబున్= రాక్షసరాజుయొక్క వక్షః స్థలాన్ని; త్రిజగత్= ముల్లోకాలకూ; కల్యాణ= శుభమును; సంధాయి+ఐ= కల్గించువాడై; భీకర భాస్వత్+నఖరాజిన్= భయంకరమై ప్రకాశించే గోళ్లపంక్తితో; త్రుంచెన్= సంహరించాడు.

**తా :** హిరణ్యకశిపుడనే రాక్షసుడు దేవలోకంపై దాడి వెడలి దేవతలను బాధించాడు. ప్రచండ గదా దండం పైకెత్తుకొని వచ్చే ఆ దానవుణ్ణి శ్రీహరి చూచాడు. వాణ్ణి హతమార్చి ముల్లోకాలకూ క్షేమం చేకూర్చాలనుకున్నాడు. వెంటనే నిడుదకోరలతో భీతి గొలిపే నోరూ, కోపంతో ముడివడ్డ కనుబొమ్మలుగల నరసింహావతారం ధరించాడు. కరకు గోళ్ళతో ఆ రాక్షసేశ్వరుని వక్షం చీల్చి పరిమార్చాడు.

**వ. ఇంక నాదిమూలావతారంబు సెప్పెద వినుము. 147**

**ప్రతి :** ఇంకన్= ఇట మీదట; ఆదిమూల+అవతారంబున్= ఆదిమూలమనే అవతారాన్ని గురించి; చెప్పెదన్= చెబుతాను; వినుము= ఆలకించు.

**తా :** ఇక ఆదిమూలావతారాన్ని గురించి వివరిస్తాను వినుము.

**మ. కరినాథుండు జలగ్రహ గ్రహణదుఃఖాక్రాంతుఁడై వేయి వ**
**త్సరముల్ గుయ్యిడుచుండ వేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్**
**"హరి నీవే శరణంబు నా" క నినఁ గుయ్యాలించి వేవేగ వా**
**శ్చరముంద్రుంచి కరీంద్రుఁ గాచె మహితోత్సాహంబునం దాపసా! 148**

**ప్రతి :** తాపసా!= నారదా!; కరినాథుండు= గజేంద్రుడు; జలగ్రహ= మొసలియొక్క; గ్రహణ= పట్టుచేత గల్గిన; దుఃఖ= దుఃఖంచే; ఆక్రాంతుఁడు+ఐ= ఆక్రమించబడినవాడై; వేయివత్సరముల్= వెయ్యి సంవత్సరాలు; కుయ్యి ఇడుచుండన్= మొరపెట్టుచుండగా; వేల్పులకున్= (శ్రీహరి తప్ప) ఇతర దేవతలకు; విశ్వవ్యాప్తి= విశ్వమంతా నిండి ఉండటం; లేకుండుటన్= లేక పోవడంవల్ల; 'హరి నీవే శరణంబు'= 'శ్రీహరీ! నీవే నాకు రక్షకుడవు'; అనినన్= అని కరి ఆక్రందింపగా; కుయ్యి= మొర; ఆలించి= విని; వేవేగన్= వెనువెంటనే; వాశ్చరమున్= జలంలో సంచరించే మకరాన్ని; త్రుంచి= సంహరించి; మహిత+ఉత్సాహంబునన్= మహోత్సాహంతో; కరి+ఇంద్రున్= గజేంద్రుణ్ణి; కాచెన్= రక్షించినాడు.

**తా :** నారదమునీ! పూర్వం గజేంద్రుడు మొసలిచే పట్టువడి దుఃఖించాడు. వేయి సంవత్సరాలు దానితో పోరాడి రక్షణకై మొరపెట్టుకొన్నాడు. హరి తప్ప తక్కిన దేవతలు విశ్వమయులు కారు. కాన అతని ఆపద మాన్పలేకపోయారు. అప్పుడా గజరాజు "శ్రీహరీ! నీవే నాకు శరణం" అంటూ శ్రీహరికి శరణాగతుడయ్యాడు. అతని ఆక్రందనం విని శ్రీహరి వెనువెంటనే ఆదిమూల (వైకుంఠ) రూపంలో వచ్చి పరమోత్సాహంతో మకరిని హతమార్చి కరిని కాపాడాడు.

**వ. మఱియును వామనావతారంబు వినుము. 149**

**ప్రతి :** మఱియును= ఇంకను; వామన+అవతారంబునున్= వామనుని అవతారాన్ని గూర్చి; వినుము= విను.

**తా :** ఇక వామనావతారం వివరిస్తాను, విను.

సీ. యజ్ఞేశ్వరుండగు హరి విష్ణుఁ డదితిసంతానంబునకు నెల్లఁ దమ్ముఁడయ్యుఁ
బెంపారు గుణములఁ బెద్ద యై, వామన మూర్తితో బలిచక్రవర్తిఁ జేరి
తద్భూమి మూఁడుపాదమ్ముల నడిగి పదత్రయంబునను జగత్త్రయంబు
వంచించి కొనియెను వాసవునకు రాజ్య మందింప నీశ్వరుం డయ్యు మొఱఁగి

తే. యర్థిరూపంబు గైకొని యడుగ వలసె, ధార్మికుల సొమ్ము వినయోచితముగఁ గాని
వెడఁగుఁదనమున నూరక విగ్రహించి, చలన మందింపరాదు నిశ్చయము పుత్ర! **150**

ప్రతి : యజ్ఞ+ఈశ్వరుండు+అగు= యజ్ఞానికి ప్రభువైన; హరి= శ్రీహరి; విష్ణుఁడు= విష్ణుదేవుడు; అదితిసంతానంబునకున్+ ఎల్లన్= అదితియొక్క సంతతి కంతటికీ; తమ్ముఁడు+అయ్యున్= అనుజుఁడై కూడా; పెంపారు= అతిశయించు; గుణములన్= గుణాలచేత; పెద్ద+ఐ= పెద్దవాడై (శ్రేష్ఠుడై); వామనమూర్తితోన్= వామనాకారంతో; బలిచక్రవర్తిన్+చేరి= బలిచక్రవర్తిని సమీపించి; తద్+భూమిన్= ఆ చక్రవర్తి పొలంలో; మూడు పాదమ్ములన్ అడిగి= మూడు అడుగులనేల యాచించి; పదత్రయంబుననున్= మూడు అడుగులను; జగత్రయంబున్= ముల్లోకాలను; వంచించి= మోసగించి; కొనియెను= గ్రహించాడు; వాసవునకున్= ఇంద్రునికి; రాజ్యము+అందింపన్= సురరాజ్యం ఇప్పించుటకై; ఈశ్వరుండు+అయ్యున్= తాను సర్వప్రభువై కూడా; మొఱఁగి= మోసగించి; అర్థిరూపంబున్= యాచక స్వరూపాన్ని; కైకొని= గ్రహించి; అడుగవలసెన్= యాచించవలసి వచ్చింది; ధార్మికుల సొమ్మున్= ధర్మాత్ముల ధనాన్ని; వినయ+ఉచితముగన్ కాని= అడకువతోనే గాని; వెడఁగుదనమునన్= అవివేకంతో; ఊరక= నిష్కారణంగా; విగ్రహించి= కలహించి; చలనము+అందింపరాదు= కదిలించగూడదు; నిశ్చయము= ఇది నిర్ణయం.

**తా :** యజ్ఞాల కధిపతియైన విష్ణుదేవుడు అదితి సంతానంలో చిన్నవాడు. ఐనా ఉత్తమ గుణాలలో అందరికంటే జ్యేష్ఠుడై వెలుగొందాడు. ఆయన వామనాకారంతో బలిచక్రవర్తి చెంతకు వచ్చి అతని నేలలో మూడడుగులనేల యాచించి పుచ్చుకొన్నాడు. ఆ మూడడుగులతో ముల్లోకాలనూ ఆక్రమించాడు. వంచనతో అతని రాజ్యమపహరించాడు. తాను సర్వేశ్వరుడైయుండి కూడా ఇంద్రుడికి రాజ్యం అప్పగించడానికై వంచనతో బలిని యాచించవలసివచ్చింది. వత్సా! బలిచక్రవర్తివంటి ధర్మాత్ముల సొమ్మును వినయంగా వెళ్ళి ఉచితపద్ధతిలో గ్రహించాలి. అంతేకాని అవివేకంతో పోట్లాడి ఆక్రమించరాదు– ఇది నిశ్చయం.

చ. బలి నిజమౌళి న వ్వటుని పాదసరోరుహభవ్యతీర్థ ము
త్కలిక ధరించి, తన్నును జగత్త్రయమున్ హరికిచ్చి, కీర్తులన్
నిలిపె వసుంధరాస్థలిని నిర్జరలోక విభుత్వ హానికిం
దలఁకక శుక్రు మాటలకుఁ దారక భూరివదాన్యశీలుఁడై. **151**

ప్రతి : బలి= బలిచక్రవర్తి; నిర్జరలోక విభుత్వహానికిన్= దేవలోకంమీది ప్రభుత్వానికి కలుగనున్న భంగపాటుకు; తలఁకక= జంకక; శుక్రు మాటలకున్= శుక్రాచార్యుడు చెప్పిన వచనాలకు; తారక= చలించక; భూరివదాన్యశీలుఁడై= గొప్ప దాతృత్వం గలవాడై; నిజమౌళిన్= తన శిరస్సుపై; ఆ+వటుని= ఆ వామనునియొక్క; పాదసరోరుహ భవ్యతీర్థమున్= చరణకమలంయొక్క మంగళకరమైన తీర్థాన్ని; ఉత్కలికన్= ఔత్సుక్యంతో; ధరించి= తాల్చి, తన్నును; జగత్త్రయమున్=

ముల్లోకాలనూ; హరికిన్+ఇచ్చి= వామనునికి సమర్పించి; వసుంధరాస్థలినిన్= భూతలంమీద; కీర్తులన్ నిలిపెన్= యశస్సులను ప్రతిష్ఠింపజేశాడు.

**తా :** గొప్ప దాత అయిన బలిచక్రవర్తి ఆ బ్రహ్మచారి వామనుని పాదపద్మాలు కడిగిన పవిత్ర తీర్థాన్ని ఔత్సుక్యంతో తలపై చల్లుకొన్నాడు. తనతో కూడ మూడు లోకాలనూ నారాయణునికి, ధారాదత్తం కావించాడు. విశ్వమంతటా శాశ్వతమైన కీర్తిని నిలుపుకొన్నాడు. ఆ దానం వల్ల దేవలోకాధిపత్యం పోతుందని జంకలేదు. తనకు హాని జరుగుతుందని శుక్రాచార్యుడు చెప్పినా వినలేదు.

**వ. మఱియు న ప్పరమేశ్వరుండు నారదా! హంసావతారంబు నొంది యతిశయ భక్తియోగంబున సంతుష్టాంతరంగుం డగుచు నీకు నాత్మతత్త్వ ప్రదీపకంబగు భాగవత మహాపురాణం బుపదేశించె, మన్వవతారంబు నొంది స్వకీయ తేజఃప్రభావంబున నప్రతిహతంబైన చక్రంబు ధరియించి దుష్టవర్తనులైన రాజుల దండించుచు శిష్టపరిపాలనంబు సేయుచు నాత్మీయ కీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె, మఱియు ధన్వంతరి యన నవతరించి తన నామస్మరణంబున భూజనంబునకు సకలరోగనివారణంబు సేయుచు నాయుర్వేదంబుఁ గల్పించె, నింకం బరశురామావతారంబు వినుము. 152**

**ప్రతి :** మఱియున్= ఇంకను; నారదా!; ఆ+పరమేశ్వరుండు= ఆ పరమాత్మ; హంసావతారంబున్+ఒంది= హంసరూపమైన అవతారం దాల్చి; అతిశయ భక్తియోగంబునన్= అధికమైన భక్తియోగముచే; సంతుష్ట+అంతరంగుండు+అగుచున్= సంతసించిన స్వాంతం గలవాడవుతూ; నీకున్; ఆత్మతత్త్వ ప్రదీపకంబు+అగు= ఆత్మస్వరూపాన్ని ప్రకాశింపజేయు; భాగవతమహాపురాణంబు= భాగవతమనే గొప్ప పురాణాన్ని; ఉపదేశించెన్= బోధించాడు; మను+అవతారంబున్+ఒంది= మనువుగా అవతరించి; స్వకీయతేజస్+ప్రభావంబునన్= తన తేజోమహిమచేత; అప్రతిహతంబు+ఐన= మొక్కవోని (ఎదురులేని); చక్రంబు ధరియించి= చక్రం దాల్చి; దుష్టవర్తనులు+ఐన= దుష్టప్రవృత్తిగల; రాజులన్= నరపతులను; దండించుచున్= శిక్షిస్తూ; శిష్టపరిపాలనంబు= సజ్జనరక్షణమును; చేయుచున్= ఆచరిస్తూ; ఆత్మీయకీర్తిచంద్రికలు= తన యశస్సుఅనే వెన్నెలలను; సత్యలోకంబునన్= బ్రహ్మలోకంలో; వెలింగించెన్= ప్రకాశింపజేశాడు; మఱియున్= ఇంకను; ధన్వంతరి అనన్= ధన్వంతరి అన్నపేరుతో; అవతరించి= పొడమి; తన నామస్మరణంబునన్= తనపేరును స్మరించుటతో; భూజనంబునకున్= భూలోకజనాలకు; సకలరోగ నివారణంబున్= సమస్తవ్యాధుల నివారణం; చేయుచున్= కావిస్తూ; ఆయుర్వేదంబున్= ఆయుర్వేదాన్ని; కల్పించెన్= నిర్మించాడు; ఇంకన్= ఇకపై; పరశురామ+అవతారంబు= పరశురాముని అవతారాన్నిగూర్చి; వినుము= ఆలకించుము.

**తా :** నారదా! అంతేకాదు. ఆ పరమాత్ముడు హంసావతారం దాల్చాడు. అతిశయమైన నీభక్తియోగానికి మెచ్చాడు. నీకు ఆత్మతత్త్వం తెలిపే భాగవతమనే మహాపురాణం ఉపదేశించాడు. మనువుగా అవతరించి తన తేజోమహిమతో అమోఘమైన చక్రం చే బూని దుష్టులగు రాజులను దండించాడు. శిష్టులను రక్షించాడు. తనకీర్తి చంద్రికలు సత్యలోకంలో వెలిగేటట్లు చేశాడు.

ఆపై ధన్వంతరి రూపం ధరించాడు. తన నామస్మరణతోనే భూలోకంలోని ప్రజలకు రోగాలన్నీ, తొలగిస్తూ ఆయుర్వేదం కల్పించాడు. ఇక పరశురామావతారం ఎలా వచ్చిందో చెబుతాను, విను.

**మ. ధరణీ కంటకులైన హైహయ నరేంద్ర వ్రాతమున్ భూరి వి**
**స్ఫురితోదార కుఠారధారఁ గలనన్ ముయ్యేడు మాఱుల్ పోరిం**
**బొరి మర్దించి, సమస్త భూతలము విప్రుల్ వేఁడఁగా నిచ్చి తాఁ**
**జిరకీర్తిన్ జమదగ్ని రాముఁడన మించెం దాపసేంద్రోత్తమా! 153**

**ప్రతి :** తాపస+ఇంద్ర+ఉత్తమా!= మునిశ్రేష్ఠులలో ఉత్తముడవైన నారదా!; ధరణీకంటకులు+ఐన= భూమికి విరోధులైనట్టి; హైహయనర+ఇంద్రవ్రాతమున్= హైహయరాజుల సమూహాన్ని; భూరి విస్ఫురిత+ఉదార కుఠారధారన్= గొప్పగా మెరుపులుచిమ్మే ఉదారమైన గండ్రగొడ్డలి వాదరతో; కలనన్= యుద్ధంలో; మూడు+ఏడుమాఱుల్= ఇరువదొక్క సార్లు; పొరిన్+పొరిన్= క్రమక్రమంగా; మర్దించి= శిక్షించి; విప్రుల్= ద్విజులు; వేడఁగాన్= ప్రార్థించగా; సమస్త భూతలమున్= సకల భూవలయాన్నీ; ఇచ్చి= సమర్పించి; తాన్= తాను; జమదగ్ని రాముఁడు+అనన్= జమదగ్నికుమారుడైన పరశురాముడనగా; చిరకీర్తిన్= శాశ్వత యశస్సుతో; మించెన్= అతిశయించాడు.

**తా :** మునీంద్రులలో అగ్రగణ్యుడవైన నారదా! పూర్వం హైహయవంశజులైన నృపులు లోకవిరోధులై దురుసుగా ప్రవర్తించారు. వారిని శిక్షించడానికి శ్రీమన్నారాయణుడు పరశురాముడుగా అవతరించాడు. రణరంగంలో ఇరవైయొక్క పర్యాయాలు ఆ రాజబృందాన్ని దారుణమైన తన గండ్ర గొడ్డలితో చెండాడినాడు. బ్రాహ్మణులు ప్రార్థించేసరికి భూమండలమంతా వారికి దానం చేశాడు. జమదగ్ని సుతుడైన ఆ పరశురాముడు అలా శాశ్వతకీర్తి పొందాడు.

**వ. మఱియు శ్రీ రామావతారంబు సెప్పెద వినుము. 154**

**ప్రతి :** మఱియున్= ఇంకా; శ్రీరామ+అవతారంబున్= శ్రీరాముని అవతారాన్నిగూర్చి; చెప్పెదన్= చెబుతాను; వినుము= విను.

**తా :** ఇక శ్రీరాముని అవతారాన్ని చెబుతాను, విను.

**సీ. తోయజ హిత వంశ దుగ్ధ పారావార రాకా విహార కైరవహితుండు**
**కమనీయ కోసలక్ష్మాభృత్సుతా గర్భ శుక్తి సంపుట లసన్మౌ క్తికంబు**
**నిజపాదసేవక వ్రజ దుఃఖ నిబిడాంధకార విస్ఫురిత పంకరుహసఖుఁడు**
**దశరథేశ్వర కృతాధ్వర వాటికా ప్రాంగణాకర దేవతానోకహంబు**

**తే. చటులదానవగహనవైశ్వానరుండు, రావణాటోపశైల పురందరుండు**
**నగుచు లోకోపకారార్థ మవతరించె, రాముఁడై చక్రి లోకాభిరాముఁడగుచు. 155**

**ప్రతి :** తోయజహితవంశ= పద్మాలకు హితుడైన సూర్యునియొక్క వంశమనే; దుగ్ధ పారావార= క్షీరసముద్రానికి; రాకావిహార= పూర్ణిమనాడు విహరించువాడైన; కైరవహితుండు= కలువలకు మిత్రుడైన చంద్రుడు; కమనీయ= మనోజ్ఞమైన; కోసలక్ష్మాభృత్= కోసలరాజుయొక్క; సుతా= కొమార్తెయైన కౌసల్యయొక్క; గర్భశుక్తి సంపుట= గర్భమనే ముత్తెపుచిప్పలో; లసత్= ప్రకాశించు; మౌక్తికంబు= ముత్యం; నిజపాదసేవక= తన పాదాన్ని సేవించు భక్తులయొక్క; వ్రజ= సమూహంయొక్క; దుఃఖ= దుఃఖమనే; నిబిడ+అంధకార= దట్టమైన చీకటికి; విస్ఫురిత= ప్రకాశించే; పంకరుహసఖుఁడు= పద్మమిత్రుడైన సూర్యుడు;

దశరథ+ఈశ్వర= దశరథమహారాజుచే; కృత= చేయబడిన; అధ్వర= పుత్రకామేష్టియొక్క; వాటికా= శాలయొక్క; ప్రాంగణ= ముంగిలియను; ఆకర= ఉత్పత్తిప్రదేశంలోని; దేవతా+అనోకహంబు= కల్పవృక్షం; చటుల= క్రూరులగు; దానవ= రాక్షసులనెడు; గహన= అరణ్యానికి; వైశ్వానరుండు= అగ్ని; రావణ= రావణునియొక్క; ఆటోప= గర్వమనెడు; శైల= కొండకు; పురందరుండున్= ఇంద్రుడు; అగుచున్= అవుతూ; చక్రి= చక్రధారియైన విష్ణువు; లోక+ఉపకారార్థము= లోకానికి మేలుచేయుటకై; లోక+అభిరాముఁడు+అగుచున్= లోకమనోహరుడవుతూ; అవతరించెన్= అవతరించాడు.

**తా :** చక్రధారియైన శ్రీమహావిష్ణువు లోకోపకారం చేయడానికి జగదభిరాముడైన శ్రీరాముడుగా అవతరించాడు. ఆయన సూర్యవంశమనే క్షీరసాగరానికి పున్నమనాటి చంద్రుడు. కౌసల్యాదేవి గర్భమనే ముత్తెపు చిప్పలో జన్మించిన మంచిముత్యం. తన భక్తుల శోకమనే చిమ్మచీకట్లను పోకార్చే సూర్యుడు. దశరథుని పుత్రకామేష్టి యాగశాల ముంగిట మొలకెత్తిన కల్పతరువు. కర్కశులైన దానవులనే కారడవులను దహించే కార్చిర్చు. రావణుని గర్వమనే పర్వతాన్ని బద్దలు చేసే ఇంద్రుడు.

**క. చిత్రముగ భరత లక్ష్మణ, శత్రుఘ్నుల కర్థి నగ్రజన్ముం డగుచున్**
**ధాత్రిన్ రాముఁడు వెలసెఁ బ, విత్రుఁడు దుష్కృతలతాలవిత్రుం డగుచున్. 156**

**ప్రతి :** ధాత్రిన్= భూతలం మీద; చిత్రముగన్= ఆశ్చర్యంగా; భరత లక్ష్మణ+శత్రుఘ్నులకున్= భరతునికి; లక్ష్మణునికి, శత్రుఘ్నునికీ; అర్థిన్= కోరికతో; అగ్రజన్ముండు+అగుచున్= ముందు పుట్టినవాడు అవుతూ; రాముఁడు= శ్రీరాముడు; పవిత్రుఁడు= పావనుడు; దుష్కృత లతాలవిత్రుండు+అగుచున్= పాపాలనే తీగలను ఛేదించు కొడవలిగా అవుతూ; వెలసెన్= ప్రకాశించాడు.

**తా :** ఆ శ్రీరాముడు భరత లక్ష్మణ శత్రుఘ్నులనే సోదరులకు అగ్రజుడై జన్మించాడు, ఆ పవిత్రచరిత్రుడు పాపాలనే తీగలను తెగనరికే కొడవలిగా లోకంలో విలసిల్లాడు.

**విశే :** తక్కిన అన్ని అవతారాలలోనూ శ్రీమహావిష్ణువు ఒంటి చేతిమీద అవతార ప్రయోజనాన్ని సాధించాడు. కానీ శ్రీరామావతారంలో లోకాన్ని అనుగ్రహించటం కోసం మానవుడుగా పుట్టి తన బాధ్యతను తమ్ములతో పంచుకొని నిర్వహించాడు. అదీ చిత్రం.

**వ. అంత. 157**

**ప్రతి :** అంతన్= ఆ మీదట

**సీ. కిసలయఖండేందు బిసకుందపద్మాబ్జ పద ఫాల భుజ రద పాణి నేత్రఁ**
**గాహళ కరభ చక్ర వియత్పులిన శంఖ జంఘోరు కుచ మధ్య జఘన కంఠ**
**ముకుర చందన బింబ శుక గజ శ్రీకార గండ గంధోష్ఠవాగ్గమన కర్ణఁ**
**జంప కేందు స్వర్ణ శఫర ధను ర్నీల నాసికాస్యాంగదృగ్భ్రూశిరోజ**

**తే. నళి సుధావర్త కుంతల హాస నాభి, కలిత జనకావనీపాలకన్యకా ల**
**లామఁ బరిణయమయ్యె లలాటనేత్ర, కార్ముక ధ్వంస ముంకువ గాఁగ నతఁడు. 158**

**ప్రతి :** కిసలయ= చివుళ్లు; ఖండ+ఇందు= అర్ధచంద్రుడు; బిస= తామరతూండ్లు; కుంద= మొల్లలు; పద్మ= తామరలు; అబ్జ= కలువలవంటి; పద= చరణాలు; ఫాల= నొసలు; భుజ= బాహువులు; రద= దంతాలు; పాణి= హస్తాలు; నేత్రన్= కన్నులూ గలదానిని; కాహళ= కాహళనామకమైన వాద్యవిశేషం; కరభ= మణికట్టునుండి చిటికెన వ్రేలివరకుగల చేతి వెలుపలిచోటు; చక్ర= చక్రవాకపక్షులు; వియత్= ఆకాశం; పులిన= ఇసుకతిన్నెలు; శంఖ= శంఖాలవంటి; జంఘా= పిక్కలు; ఊరు= తొడలు; కుచ= స్తనాలు; మధ్య= నడుము; జఘన= పిరుదులు; కంఠ= కంఠముగలదానిని; ముకుర= అద్ధం; చందన= శ్రీచందనం; బింబ= దొండపండు; శుక= చిలుక; గజ= ఏనుగు; శ్రీకార= శ్రీకారాలవంటివైన; గండ= చెక్కిళ్ళు; గంధ= శరీరపరిమళం; ఓష్ఠ= పెదవి; వాక్= వాక్కు; గమన= నడక; కర్ణన్= చెవులూ గలదానిని; చంపక= సంపెంగ; ఇందు= చంద్రుడు; స్వర్ణ= బంగారం; శఫర= చేపలు; ధనుస్= ధనుస్సు; నీల= నీలాలవంటివైన; నాసికా= ముక్కు; ఆస్య= ముఖం; అంగ= దేహం; దృక్= నేత్రాలు; భ్రూ= కనుబొమలు; శిరోజన్= వెంద్రుకలూ గలదానిని; అళి= తుమ్మెదలు; సుధా= అమృతం; ఆవర్త= సుడివంటివైన; కుంతల= శిరోజాలు; హాస= నవ్వు; నాభి= బొడ్డులచే; కలితన్= కూడినదానిని; జనక+అవనీపాలకన్యకాలలామన్= జనకమహారాజుయొక్క కన్యారత్నాన్ని; లలాటనేత్ర కార్ముక ధ్వంసము= ఫాలలోచనుడైన శివుని ధనుర్భంగం; ఉంకువ+కాఁగన్= ఓలికాగా; అతఁడు= ఆ శ్రీరాముడు; పరిణయము+అయ్యెన్= పెండ్లాడినాడు.

**తా :** ఆపై శ్రీరాముడు శివునిధనుర్భంగం ఓలి కాగా జనకుని కూతురు సీతాదేవిని చేపట్టాడు. ఆ దేవిపాదాలు చివుళ్లవంటివి, ఫాలం అర్ధచంద్రుని వంటిది, భుజాలు తామరతూండ్ల వంటివి, దంతాలు మొల్లల వంటివి, చేతులు పద్మాల వంటివి, కనులు కలువల వంటివి, పిక్కలు కాహళాల వంటివి, తొడలు కరభాల వంటివి, కుచాలు చక్రవాకాల వంటివి, నడుము ఆకసం వంటిది, పిరుదులు ఇసుకతిన్నెల వంటివి, కంఠం శంఖంవంటిది, చెక్కిళ్లు అద్దాలవంటివి, శరీరగంధం చందనంవంటిది, పెదవి దొండపండు వంటిది, పలుకు చిలుకపలుకువంటిది, గమనం గజగమనం వంటిది, చెవులు శ్రీకారాల వంటివి, ముక్కు సంపెంగ వంటిది, ముఖం చంద్రునివంటిది, శరీరం బంగారు వంటిది, నేత్రాలు చేపలవంటివి, కనుబొమలు ధనుస్సు వంటివి. తలవెంద్రుకలు నీలాల వంటివి, ముంగురులు తుమ్మెదల వంటివి, నవ్వు అమృతం వంటిది, బొడ్డు సుడి వంటిది.

**వ. అంత. 159**

**ప్రతి :** అంతన్= ఆ మీదట.

**తా :** ఆ తర్వాత.

**క. రామున్ మేచకజలద, శ్యామున్ సుగుణాభిరాము సద్వైభవ సు**
**త్రామున్ దుష్టనిశాట వి, రాముం బొమ్మనియెఁ బంక్తిరథుఁ డడవులకున్. 160**

**ప్రతి :** మేచక జలదశ్యామున్= నీలిమబ్బువలె నల్లనివాడూ; సుగుణ+అభిరామున్= మంచి గుణాలచే మనోహరుడైనవాడూ; సత్+వైభవసుత్రామున్= శ్రేష్ఠమైన ఐశ్వర్యంలో ఇంద్రునితో సమానుడు; దుష్టనిశాట విరామున్= దుష్టులగు రాక్షసులను సంహరించేవాడూ, అయిన; రామున్= శ్రీరాముణ్ణి; పంక్తిరథుఁడు= దశరథుడు; అడవులకున్= అరణ్యాలకు; పొమ్ము+ అనియెన్= పొమ్మన్నాడు.

**తా :** నీలిమబ్బువలె నల్లనైనవాడూ, సద్గుణాకరుడూ, ఐశ్వర్యంలో ఇంద్రతుల్యుడూ, దుష్టరాక్షసులను దునుమాడేవాడూ అయిన రామచంద్రుణ్ణి తండ్రి దశరథుడు అడవులకు పొమ్మన్నాడు.

**వ. ఇట్లు పంచిన. 161**

**ప్రతి :** ఇట్లు పంచినన్= ఈ రీతిగా పంపగా.

**తా :** ఈ విధంగా దశరథుడు శ్రీరాముణ్ణి అడవులకు పంపగా

**చ. అరుదుగ లక్ష్మణుండు జనకాత్మజయుం దనతోడ నేఁగుదే**
**నరిగి రఘూత్తముండు ముదమారఁగఁ జొచ్చెఁ దరక్షు సింహ సూ**
**కర కరి పుండరీక కపి ఖడ్గ కురంగ వృకాహి భల్ల కా**
**సర ముఖ వన్య సత్త్వ చయ చండతరాటవి దండకాటవిన్. 162**

**ప్రతి :** రఘు+ఉత్తముండు= రఘువంశశ్రేష్ఠుడైన రాముడు; లక్ష్మణుండు= సౌమిత్రి; జనక+ఆత్మజయున్= సీతయూ; అరుదుగన్= ఆశ్చర్యావహంగా; తనతోడన్= తనతోగూడ; ఏఁగుదేన్= రాగా; అరిగి= పోయి; తరక్షు= సివంగులూ; సింహ= సింహాలూ; సూకర= పందులూ; కరి= ఏనుగులూ; పుండరీక= పులులూ; కపి= కోతులూ; ఖడ్గ= ఖడ్గమృగాలూ; కురంగ= జింకలు; వృక= తోడేళ్లూ; అహి= సర్పాలూ; భల్ల= ఎల్గుబంట్లూ; కాసర= అడవిదున్నలూ; ముఖ= మొదలైన; వన్య= అడవిలో బుట్టిన; సత్త్వచయ= ప్రాణిసంతతిచేత; చండతర+అటవిన్= భయంకరమైన అడవిగల; దండక+అటవిన్= దండకారణ్యంలో; ముదము+ఆరఁగన్= సంతోషంతో; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తా :** అలా దశరథుడు పంపేసరికి అడవులకు వెళ్తున్న రాముణ్ణి లక్ష్మణుడు, సీత అనుగమించారు. రఘువంశశ్రేష్ఠుడైన రాముడు సివంగులూ, సింహాలూ, అడవిపందులూ, ఏనుగులూ, పులులూ, కోతులూ, ఖడ్గమృగాలూ, జింకలూ, తోడేళ్ళూ, పాములూ, ఎలుగుబంట్లూ, అడవిదున్నలూ మున్నగు అడవి మృగాలతో మిక్కిలి భయంకరమైన దండకారణ్యంలో సంతోషంతో ప్రవేశించాడు.

**క. ఆ వనమున వసియించి నృ, పావననయశాలి యిచ్చె నభయములు జగ**
**త్పావన మునిసంతతికిఁ గృ, పావననిధియైన రామభద్రుం డెలమిన్, 163**

**ప్రతి :** నృ, పావన, నయ, శాలి= నరులను పవిత్రులను కావించే నీతిశాలియైనవాడూ; కృపావననిధి= దయాసాగరుడూ; అయిన, రామభద్రుండు= శ్రీరాముడు; ఆ వనమునన్= ఆ అడవిలో; వసియించి= నివసించి; జగత్+పావనమునిసంతతికిన్= లోకాన్ని పావనం కావించే మునుల సముదాయానికి; ఎలమిన్= ప్రీతితో; అభయములు ఇచ్చెన్= అభయప్రదానం చేశాడు.

**తా :** నరులను పావనులను గావించే నీతిలో నిపుణుడూ (నృప+అవననయశాలి= రాజరక్షణ నీతిశాలీ), దయాసాగరుడూ అయిన శ్రీరాముడు ఆ మహారణ్యంలో నివసించాడు. అక్కడ ఉన్న లోకపావనులైన మునిగణాలకు అభయప్రదానం చేశాడు.

**క. ఖరకరకుల జలనిధి హిమ, కరుఁడగు రఘురామవిభుఁడు గఱకతితోడన్**
**ఖరుని వధించెను ఘనభీ, కర శరముల నఖిలజనులుఁ గర మరుదందన్. 164**

**ప్రతి :** ఖరకరకుల= సూర్యవంశమనే; జలనిధి= సముద్రానికి; హిమకరుఁడు+అగు= చంద్రుడైన; రఘురామవిభుఁడు= శ్రీరాముడు; కఱకతితోడన్= ఆగ్రహంతో; అఖిలజనులున్= ప్రజలందరూ; కరము= మిక్కిలి; అరుదు+అందన్= ఆశ్చర్యపడగా; ఘనభీకరశరములన్= గొప్పభయంకరమగు బాణాలతో; ఖరునిన్= ఖరుడనే రక్కసుని; వధించెను= చంపెను.

**తా :** సూర్యవంశమనే సముద్రానికి చంద్రునివంటివాడగు శ్రీరాముడు జనులందరూ ఆశ్చర్యపడగా కోపంతో మిక్కిలి భీకరమగు బాణాలు ప్రయోగించి ఖరుడనే రాక్షసుణ్ణి వధించాడు.

**క. హరిసుతుఁ బరిచరుఁగాఁ గొని, హరిసుతుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్,**
**హరివిభునకు హరిమధ్యను, హరిరాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై. 165**

**ప్రతి :** హరి విక్రముఁడు+ఐ= సింహంవంటి పరాక్రమం కలవాడైన శ్రీరాముడు; హరిసుతున్= సూర్యుని కుమారుడగు సుగ్రీవుణ్ణి; పరిచరుగాన్= అనుచరుడుగా; కొని= గ్రహించి; హరిసుతున్= ఇంద్రునిసుతుడగు వాలిని; తునుమాడి= చంపి; హరిపురమునకున్= యమపురికి; పనిచెన్= పంపాడు; హరివిభునకున్= వానరరాజగు సుగ్రీవునికి; హరి మధ్యనున్= సింహంవంటి నడుముగల రుమనూ; హరిరాజ్యపదంబున్= కపిరాజ్యాన్ని; ఇచ్చెన్= అప్పగించాడు.

**తా :** సింహంవంటి విక్రమంగల శ్రీరాముడు సూర్యునిపుత్రుడైన సుగ్రీవుణ్ణి అనుచరుడుగా గ్రహించాడు. ఇంద్రుని పుత్రుడగు వాలిని నేలగూల్చి యమపురికంపాడు. వానరరాజగు సుగ్రీవునికి సింహమధ్యఅగు రుమనూ, కిష్కింధారాజ్యాన్ని అప్పగించాడు.

**వ. అంత సీతానిమిత్తంబునం ద్రిలోకకంటకుండగు దశకంఠుం దునుమాడుటకునై కపిసేనా సమేతుండయి చనిచని ముందట నతిదుర్గమం బయిన సముద్రంబు పేర్చి తెరువు సూపకున్న నలిగి. 166**

**ప్రతి :** అంతన్= ఆ మీదట; సీతా నిమిత్తంబునన్= సీతకొరకై; త్రిలోకకంటకుండు+అగు= ముల్లోకాలకూ విరోధియైన; దశకంఠున్= రావణాసురుని; తునుమాడుటకున్+ఐ= చంపడానికై; కపిసేనా సమేతుండు+అయి= వానరసేనతో గూడినవాడై; చనిచని= వెళుతుండగా; ముందటన్= ఎదుట; అతిదుర్గమంబు+అయిన= మిక్కిలి దుస్తరమైన; సముద్రంబు= సాగరం; పేర్చి= అతిశయించి; తెరువు సూపకున్నన్= దారి చూపకుండడంవల్ల; అలిగి= కోపించి...

**తా :** పిమ్మట శ్రీరాముడు సీతకొరకై మూడులోకాలకూ విరోధియైన రావణుణ్ణి సంహరింపదలంచాడు. వానరసేనను వెంటబెట్టుకొని లంకవైపు పయనించి దక్షిణ సాగరతీరం చేరాడు. దాటవీలుగాని ఆ సాగరం బాట చూపనందున ఆగ్రహించాడు.

**మ. వికటభ్రూకుటి ఫాలభాగుఁ డగుచున్ వీరుండు క్రోధారుణాం**
**బకుఁడై చూచినయంతమాత్రమున న ప్పాథోధి సంతప్త తో**
**య కణ గ్రాహ తిమింగిల ప్లవ ధులీ వ్యాళ ప్రవాళోర్మికా**
**బక కారండవ చక్ర ముఖ్య జలసత్త్వశ్రేణితో నింకినన్. 167**

**ప్రతి :** వీరుండు= పరాక్రమవంతుడైన శ్రీరాముడు; వికటభ్రూకుటి ఫాలభాగుఁడు+అగుచున్= ముడివడిన కనుబొమ్మలుగల నొసలుగలవాడై; క్రోధ+అరుణ+అంబకుఁడు+ఐ= కోపంతో ఎర్రబడిన నేత్రాలుగలవాడై; చూచిన+అంత మాత్రమునన్= చూచిన వెంటనే; ఆ+పాథోధి= ఆ సాగరం; సంతప్త= తీవ్రంగా తపింపజేయబడిన; తోయ కణ= జలబిందువులూ; గ్రాహ= మొసళ్ళూ; తిమింగిల= తిమింగిలాలూ; ప్లవ= నీలికాకులు; ఢులీ= ఆడుతాబేళ్ళూ; వ్యాళ= పాములూ; ప్రవాళ= పగడపుతీగలు; ఊర్మికా= అలలు; బక= కొంగలూ; కారండవ= నీటికోళ్లు; చక్ర= చక్రవాకాలూ; ముఖ్య= మొదలగు; జలసత్త్వ= జల జంతువులయొక్క; శ్రేణితోన్= వరుసతోగూడా; ఇంకినన్= ఇంకిపోగా...

**తా :** అంత ఆ మహావీరుడైన రాముడు నొసట కనుబొమలు ముడివడగా కోపంతో ఎర్రబడిన కనులతో ఆ సముద్రం వైపు చూచాడు. అలా చూడగానే సముద్రం–కాగిననీరూ, మొసళ్ళూ, తిమింగిలాలూ, నీటి కాకులూ, (ఆడు) తాబేళ్లూ, పాములూ, పవడపుతీగలూ, అలలూ, కొంగలూ, నీటికోళ్ళూ, చక్రవాక పక్షులూ, మున్నగు జలజంతువులతో సైతం తుకతుక ఉడికేసరికి ఇంకిపోయింది.

**వ. అయ్యవసరంబున సముద్రుండు కరుణాసముద్రుం డగు శ్రీరామభద్రుని శరణంబు సొచ్చినం గరుణించి యెప్పటి యట్ల నిలిపి నలునిచే సేతువు బంధింపించి తన్మార్గంబునం జని. 168**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; సముద్రుండు= సాగరుడు; కరుణాసముద్రుండు+అగు= దయాసాగరుడైన; శ్రీరామభద్రునిన్= శ్రీరామచంద్రుని; శరణంబు చొచ్చినన్= శరణువేడుకొనగా; కరుణించి= అనుగ్రహించి; ఎప్పటి అట్ల= పూర్వం మాదిరిగా; నిలిపి= స్థాపించి; నలునిచేన్= నలుడను పేరుగల వానరునిచేత; సేతువున్= వారధిని; బంధింపించి= కట్టంజేసి; తద్+మార్గంబునన్= ఆ సేతువు దారిలో; చని= వెళ్లి...

**తా :** అప్పుడు సముద్రుడు దయాసాగరుడైన శ్రీరామచంద్రునికి శరణాగతుడయ్యాడు. రాము డతనిపై కరుణించాడు. యథాప్రకారం ఉండవలసినదిగా సముద్రుణ్ణి అనుగ్రహించాడు. నలుడనే వానరప్రముఖునిచే వంతెన కట్టించాడు. ఆ మార్గంలో పయనించాడు.

**మ. పురముల్ మూఁడును నొక్క బాణమున నిర్మూలంబు గావించు శం**
**కరు చందంబున నేర్చె రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధ గో**
**పుర శాలాంగణ హర్మ్య రాజభవన ప్రోద్యత్ప్రతోళీ కవా**
**ట రథాశ్వ ద్విప శస్త్రమందిర నిశాట శ్రేణితో వ్రేల్మిడిన్. 169**

**ప్రతి :** పురముల్ మూఁడునున్= మూడు పట్టణాలున్నూ (త్రిపురములను); ఒక్కబాణమునన్= ఒకే శరంతో; నిర్మూలంబు+ కావించు= నశింపజేయునట్టి; శంకరు చందంబునన్= శివునిలాగా; రాఘవుఁడు= శ్రీరాముడు; ఇద్ధ= సమృద్ధమైన; గోపుర= గోపురాలూ; శాలాంగణ= మందిర ప్రాంగణాలూ; హర్మ్య= ప్రాసాదాలూ; రాజభవన= నృపగృహాలూ; ప్రోద్యత్= విస్తరించిన; ప్రతోళీ= పెద్దవీథులూ; కవాట= తలుపులూ; రథ= అరదాలూ; అశ్వ= గుర్రాలూ; ద్విప= ఏనుగులూ; శస్త్రమందిర= ఆయుధ గృహాలూ; నిశాట= రాక్షసులయొక్క; శ్రేణితోన్= పంక్తితో కూడ; లంకా పట్టణంబున్= లంకా నగరాన్ని; వ్రేల్మిడిన్= త్రుటిలో, చిటికలో; ఏర్చెన్= కాల్చివేశాడు.

**తా :** పూర్వం శంకరుడు ఒకే బాణంతో త్రిపురాలను దగ్ధం చేశాడు, అదే రీతిలో రాముడు పెద్దపెద్ద గోపురాలూ, మందిర ప్రాంగణాలూ, ప్రాసాదాలూ, రాజగృహాలూ, వీథులూ, తలుపులూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, ఆయుధాగారాలూ, రాక్షసులతో సహా లంకానగరాన్ని చిటికలో భస్మం కావించాడు.

**క. రావణు నఖిలజగద్వి, ద్రావణుఁ బరిమార్చి నిలిపె రక్షోవిభుఁగా**
**రావణుననుజన్మునిఁ నై, రావణసితకీర్తి మెఱసి రాఘవుఁడెలమిన్. 170**

**ప్రతి :** ఐరావణసితకీర్తిన్= ఐరావతదిగ్గజంవలె తెల్లనికీర్తితో; మెఱసి= ప్రకాశించి; రాఘవుఁడు= శ్రీరాముడు; ఎలమిన్= ప్రీతితో; అఖిలజగద్విద్రావణున్= సమస్తజగత్తునూ బాధించునట్టి; రావణున్= దశకంఠుని; పరిమార్చి= హతమార్చి; రావణు+అనుజన్మునిన్= రావణుని తమ్ముడగు విభీషణుని; రక్షోవిభుఁగాన్= రాక్షసరాజుగా; నిలిపెన్= ప్రతిష్ఠించాడు.

**తా :** ఐరావతంవలె తెల్లనైన యశస్సుతో ప్రకాశించిన శ్రీరాముడు సమస్తలోకాలనూ బాధిస్తున్న రావణుని హతమార్చినాడు. అతని తమ్ముడైన విభీషణుణ్ణి ప్రీతితో లంకానగరానికి రాజుగా ప్రతిష్ఠించాడు.

**సీ. ధర్మసంరక్షకత్వప్రభావుం డయ్యు ధర్మవిధ్వంసకత్వమునఁ బొదలి**
**ఖరదండనాభిముఖ్యముఁ బొంద కుండియు ఖరదండనాభిముఖ్యమున మెఱసి**
**పుణ్యజనావనస్ఫూర్తిఁ బెంపొందియుఁ బుణ్యజనాంతకస్ఫురణఁ దనరి**
**సంతతాశ్రితవిభీషణుఁడు గాకుండియు సంతతాశ్రితవిభీషణత నొప్పి**

**తే. మించెఁ, దన కీర్తిచేత వాసించె దిశలు, దరమె నుతియింప జగతి నెవ్వరికినైనఁ**
**జారుతరమూర్తి నవనీశ చక్రవర్తిఁ, బ్రకటగుణసాంద్రు దశరథరామచంద్రు. 171**

**ప్రతి :** ధర్మ సంరక్షకత్వ ప్రభావుండు= ధర్మాన్ని రక్షించువాడు అన్న ప్రభావం కలిగినవాడు; అయ్యున్= అయికూడా; ధర్మవిధ్వంసకత్వమునన్= ధర్మాన్ని ధ్వంసం చేసినవాడు అనే గుణంచేత, (శివధనుర్భంగకారుడు అన్న భావంచేత) (ధర్మం అంటే విల్లు); పొదలి= విరాజిల్లి; ఖరదండన+ఆభిముఖ్యమున్= అతి తీక్ష్ణమైన దండనంలో సిద్ధపడటాన్ని; పొందక+ ఉండియున్= చెందకుండా ఉండినప్పటికీ; ఖరదండన+ఆభిముఖ్యమునన్= ఖరదండనమునకు అభిముఖత్వంచేత (ఖరుడనే రక్కసుని దండించుటయందు అభిముఖత్వంచేత); మెఱసి= ప్రకాశించి; పుణ్యజన+అవన స్ఫూర్తిన్= పుణ్యజనులను (పుణ్యాత్ములను) రక్షించుటలో చొరవచేత; పెంపు+ఒందియున్= గొప్పతనం పొందికూడా; పుణ్యజనాంతక స్ఫురణన్= పుణ్యజనులను అంత మొందించువాడు అన్న స్ఫూర్తిచేత (పుణ్యజనులు అంటే రాక్షసులు); తనరి= వెలుగొందిఁ (రాక్షసాంతకుడు అన్న పేరుతో విరాజిల్లి); సంతత= ఎల్లవేళలా; ఆశ్రిత విభీషణుఁడు= ఆశ్రయించిన వారికి భయం కలిగించేవాడు; కాక+ ఉండియున్= కాకున్నా; సంతతాశ్రిత విభీషణతన్+ఒప్పి= సదా ఆశ్రయించిన విభీషణుడు గలిగియుండినవాడు అన్న భావంతో ప్రకాశించి; మించెన్= అతిశయించాడు; తన కీర్తిచేతన్= తన యశస్సుచేత; దిశలు= దిక్కులు; వాసించెన్= వాసింపజేశాడు; జగతిన్= లోకంలో; ఎవ్వరికిన్+ఐనన్= ఎవరికైనా; చారుతరమూర్తిన్= సుందరతరమైన ఆకృతిగలవానిని; అవనీశ చక్రవర్తిన్= రాజులకు చక్రవర్తిని; ప్రకటగుణసాంద్రున్= గొప్పగుణాలచే నిండినవానిని; దశరథరామచంద్రున్= దశరథుని కుమారుడైన రామచంద్రుణ్ణి; నుతియింపన్ తరము+ఎ= స్తుతింప సాధ్యమా?

**తా :** ఆ రాముడు ధర్మరక్షకుడన్న మహిమగలిగి యుండికూడా ధర్మవిధ్వంసకుడై ప్రకాశించాడు, అనగా శివధనుర్భంగం చేశాడని భావం, ఖరదండనలో ఆభిముఖ్యంలేనివాడైనా ఖరదండనలో అభిముఖుడయ్యాడు. అంటే కఠిన శిక్షలు విధించడానికి విముఖుడైన రాముడు ఖరుడనే రాక్షసుణ్ణి దండించడానికి సుముఖుడయ్యాడు. పుణ్యజనరక్షకుడై కూడా పుణ్యజనులను వధించాడు, అనగా పుణ్యాత్ములను రక్షించి రక్కసులను శిక్షించినాడని భావం. (పుణ్యజన శబ్దానికి రాక్షసుడనే అర్థం కలదు) ఆశ్రిత విభీషణుడు కాకున్నా ఆశ్రిత విభీషణుడయ్యాడు, అనగా ఆశ్రయించినవారిపట్ల భయంకరుడు కాడు, విభీషణునికి ఆశ్రయమిచ్చినవాడని తాత్పర్యం. మరియు రాముడు తన విస్తృత యశస్సును దశదిశలా వ్యాప్తం కావించి ప్రసిద్ధి వహించాడు. మహాసుందరుడూ, మహారాజులలో మేటీ, సుగుణాభిరాముడూ అయిన ఆ దశరథరాముణ్ణి కీర్తించడానికి లోకంలో ఎవరికీ సాధ్యం కాదు.

**విశే :** ధర్మ, ఖర, పుణ్యజన, విభీషణ పదములు శ్లిష్టపదాలు. వాటితో విరోధ పరిహారంగా సాగిన రమణీయ రచన ఇది.

**వ. అట్టి శ్రీరామావతారంబు జగత్పావనంబును నస్మత్ప్రసాద కారణంబునునై నుతికెక్కె, నింకఁ గృష్ణావతారంబు వివరించెద, వినుము. 172**

**ప్రతి :** అట్టి శ్రీరామ+అవతారంబు= అలాంటి శ్రీరాముని అవతారం; జగత్+పావనంబునున్= లోకపావనమైనదీ; అస్మత్+ప్రసాద కారణంబునున్+ఐ= మనబోంట్లకు అనుగ్రహకారణం అయినదీ అయి; నుతికి+ఎక్కెన్= స్తుతిపాత్రమయింది; ఇంకన్= ఇంకా; కృష్ణ+అవతారంబున్= శ్రీకృష్ణుని అవతారాన్ని; వివరించెదన్= విశదీకరిస్తాను; వినుము= ఆలకించు.

**తా :** అటువంటి శ్రీరామచంద్రుని అవతారం లోకపావనమై మనబోటివారి ననుగ్రహించింది. ఇక కృష్ణావతారాన్ని వర్ణిస్తాను, విను.

**సీ. తాపసోత్తమ! విను దైత్యాంశములఁ బుట్టి నరనాథు లతులసేనాసమేతు**
**లగుచు ధర్మేతరులై ధాత్రిఁ బెక్కుబాధల నలంచుటఁజేసి ధరణి వగలఁ**
**బొందుచు వాపోవ భూభార ముడుపుట కై హరి పరుఁడు నారాయణుండు**
**చెచ్చెరఁ దన సితాసిత కేశయుగమున బలరామ కృష్ణ రూపములఁ దనరి**

**తే. యదుకులంబున లీలమై నుదయ మయ్యె, భవ్యయశుఁడగు వసుదేవు భార్యలైన**
**రోహిణియు దేవకియు నను రూపవతుల, యందు నున్మత్తదైత్యసంహారి యగుచు. 173**

**ప్రతి :** తాపస+ఉత్తమ!= మునిశ్రేష్ఠుడవగు నారదా!; విను= ఆలకించు; నరనాథులు= రాజులు; దైత్య+అంశములన్= రాక్షసాంశలతో; పుట్టి= ఆవిర్భవించి; అతులసేనాసమేతులు+అగుచున్= సాటిలేని సేనలతో గూడినవారై; ధర్మ+ఇతరులు+ఐ= అధర్మపరులై; ధాత్రిన్= భూమిని; పెక్కుబాధలన్= అనేక పీడలచేత; అలంచుటన్+చేసి= నొప్పించడంవల్ల; ధరణి= భూదేవి; వగలన్+పొందుచున్= పరితాపాలను పొందుతూ; వాపోవన్= మొఱలిడగా; పరుఁడు= సర్వోత్కృష్టుడు; నారాయణుండు= నారాయణనామం కలవాడగు; హరి= శ్రీహరి; చెచ్చెరన్ (చెర+చెర)= వెనువెంటనే; తనసిత+అసితకేశయుగమునన్= తెల్లని నల్లనివైన రెండురకాల వెంద్రుకలతో; బలరామకృష్ణ రూపములన్= బలరాముడు; కృష్ణుడు అన్న ఆకారాలతో; తనరి= విలసిల్లి; యదుకులంబునన్= యదువంశంలో; లీలమైన్= లీలగా; వసుదేవు భార్యలు+ఐన= వసుదేవునికి ధర్మపత్నులగు, రోహిణియున్; దేవకియున్= రోహిణి, దేవకి; అను= అనే; రూపవతులయందున్=

సౌందర్యవతులందు; ఉన్మత్త= పెద్దగా మదించిన; దైత్యసంహారి+అగుచున్= రాక్షసులను సంహరించువాడవుతూ; ఉదయమయ్యెన్= ఆవిర్భవించాడు.

**తా :** మునివర్యుడవగు నారదా! రాక్షసాంశలతో పుట్టిన పెక్కుమంది రాజులు తమ అపార సేనాబలంతో అధర్మమార్గంలో ప్రవర్తించారు. భూదేవికి నానాబాధలు కల్గించారు. ఆమె దుఃఖిస్తూ హరితో మొరపెట్టుకొన్నది. పరాత్పరుడైన శ్రీమన్నారాయణుడు అపుడు మదోన్మత్తులైన దానవులను సంహరించి భూభారం తొలగించాలనుకొన్నాడు. యదువంశంలో వాసికెక్కిన వసుదేవునకు రోహిణి, దేవకి అనే భార్యలయందు తన తెల్లని కేశంతో బలరాముడుగానూ, నల్లని కేశంతో శ్రీకృష్ణుడుగానూ ఆ దేవుడు అవతరించాడు.

**వ. ఇట్లు పుండరీకాక్షుండగు నారాయణుండు సమస్తభూభారనివారణంబు సేయం దన మేని కేశద్వయంబ చాలునని యాత్మ ప్రభావంబు దెలుపుకొఱకు నిజకళాసంభవులైన రామకృష్ణుల దేహవర్ణంబులు శ్వేతకృష్ణంబులని నిర్దేశించు కొఱకు సితాసిత కేశ ద్వయ వ్యాజంబున రామకృష్ణాఖ్యల నలరి యవతరించె; నందు భగవంతుండును సాక్షాద్విష్ణుండును నైన కృష్ణుండు జనమార్గవర్తి యయ్యును నతిమానుషకర్మంబుల నాచరించుటం జేసి కేవల పరమేశ్వరుం డయ్యె; నమ్మహాత్ముం డాచరించు కార్యంబులు లెక్క వెట్ట నెవ్వరికి నలవి గాదు; అయినను నాకు గోచరించినయంత యెఱింగించెద వినుము. 174**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; పుండరీక+అక్షుండు+అగు= పద్మాలవంటి నేత్రాలు గలవాడైన; నారాయణుండు= శ్రీహరి; సమస్త భూభార నివారణంబు+చేయన్= సకలధరాభారాన్ని నివారించడానికి; తన మేని కేశద్వయంబు+అ= తన శరీరంలోని రెండు వెంద్రుకలు మాత్రమే; చాలున్+అని= సమర్థమైనవి అని; ఆత్మప్రభావంబున్= తనశక్తిని; తెలుపుకొఱకున్= ప్రకటించుట కొరకు; నిజకళాసంభవులు+ఐన= తన కళలతో అవతరించిన, రామకృష్ణుల; దేహవర్ణంబులు= శరీరచ్ఛాయలు; శ్వేతకృష్ణంబులు+అని= తెలుపు, నలుపు అని; నిర్దేశించు కొఱకున్= సూచించుటకై; సిత+అసితకేశద్వయవ్యాజంబునన్= తెలుపు నలుపునైన రెండు వెంద్రుకలు అన్న నెపంతో; రామకృష్ణ+ఆఖ్యలన్= బలరాముడు, కృష్ణుడు, అను పేళ్ళతో; అలరి= విలసిల్లి; అవతరించెన్= దిగివచ్చినాడు; అందున్= వారిలో; భగవంతుండునున్= షడ్గుణైశ్వర్య సంపన్నుడునూ; సాక్షాత్+విష్ణుండును= సాక్షాత్తూ విష్ణుదేవుడూ ఐన, కృష్ణుండు; జనమార్గవర్తి+అయ్యునున్= ప్రజల త్రోవలో వర్తించువాడైనా; అతిమానుష కర్మంబులన్= లోకోత్తరమైన పనులను; ఆచరించుటన్+చేసి= చేయడంవల్ల; కేవల పరమేశ్వరుండు+అయ్యెన్= లోకైక పరమాత్ముడైనాడు; ఆ+మహాత్ముండు; ఆచరించు= చేయునట్టి; కార్యంబులు= కర్మంబుల; లెక్కపెట్టన్= గణించుటకు; ఎవ్వరికిన్ అలవి కాదు= ఎవరికీ సాధ్యం కాదు; అయిననున్= ఐనప్పటికీ; నాకు గోచరించినయంత= నాకు తోచినంతమట్టుకు; ఎఱింగించెదన్= తెలియజేస్తాను; వినుము= ఆలకించు.

**తా :** ఈ విధంగా పద్మాక్షుడైన శ్రీమన్నారాయణుడు భూభారమంతా నివారించడానికి తన రెండు వెంద్రుకలే చాలనుకున్నాడు. తన ప్రభావం తెలపడానికి తన అంశంలో పుట్టిన రామకృష్ణుల శరీరకాంతులు తెలుపునలుపులుగా చేశాడు. ధవళమూ, నీలమూ అయిన రెండు వెంద్రుకల నెపంతో రాముడు, కృష్ణుడు అను పేర్లతో అవతరించాడు. వారిలో షడ్గుణైశ్వర్య సంపన్నుడూ, సాక్షాద్విష్ణుస్వరూపుడూ అయిన కృష్ణుడు ఇతర జనులు నడిచిన మార్గంలో నడిచినా మానవాతీతమైన కార్యాలెన్నో చేశాడు. అందువల్ల పరమేశ్వరుడుగానే ప్రసిద్ధి చెందాడు. ఆ మహనీయుడొనర్చిన కార్యాలు గణించడం ఎవరికీ సాధ్యం కాదు. అయినా నాకు తెలిసినంతవరకూ తెలుపుతాను, విను.

**క. నూతనగరళస్తని యగు, పూతనఁ బురుటింటిలోనఁ బొత్తుల శిశువై**
**చేతనముల హరియించి ప, రేతనగరమునకు ననిచెఁ గృష్ణుఁడు పెలుచన్. 175**

**ప్రతి :** పురుటింటిలోనన్= ప్రసవ గృహంలోనే; పొత్తుల శిశువు+ఐ= పొత్తులబిడ్డయై; నూతన గరళస్తని+అగు= క్రొత్త విషం నిండిన స్తనాలు గలదైన; పూతనన్= పూతన అనే రక్కసిని; చేతనములన్= ప్రాణాలను; హరియించి= హరించి; కృష్ణుఁడు= వసుదేవుని పుత్రుడు; పరేతనగరమునకున్= యమనగరానికి; పెలుచన్= ఆగ్రహంతో; అనిచెన్= పంపినాడు.

**తా :** శ్రీకృష్ణుడు పురిటింట్లో పొత్తుల బిడ్డగావున్న సమయంలో పూతన అను రాకాసి చన్నులలో విషం నింపుకొని పాలివ్వడానికి వచ్చింది. దానిని గ్రహించి కృష్ణుడు పాలతోపాటు దాని ప్రాణాలు కూడా తాగి దాన్ని యమలోకాని కంపాడు.

**క. వికటముగ నిజపదాహతిఁ, బ్రకటముగా మూఁడు నెలల బాలకుఁడై యా**
**శకటనిశాటుని నంతక, నికటస్థునిఁజేసె భక్తనికరావనుఁడై. 176**

**ప్రతి :** భక్తనికర+అవనుఁడు+ఐ= భక్తుల సమూహాన్ని రక్షించువాడై; మూఁడు నెలల బాలకుఁడు+ఐ= మూడు మాసాల ప్రాయంగల బాలుడైన కృష్ణుడు; వికటముగన్= వికృతంగా; నిజపద+ఆహతిన్= తన కాలి తన్నుతో; ప్రకటముగాన్= అందరు చూస్తూవుండగానే; ఆ శకటనిశాటునిన్= ఆ శకటాసురుని; అంతక నికటస్థునిన్= యముని సమీపంలో ఉండేట్లుగా; చేసెన్= చేశాడు.

**తా :** భక్తలోకపాలకుడైన కృష్ణుడు మూడు నెలల ప్రాయంలో ఉన్నపుడే శకట రూపంలో ఒక దనుజుడు తన్ను పరిమార్చటానికి రాగా, అతణ్ణి తన కాలితన్నుతో యముని సమీపానికి పంపాడు.

**క. ముద్దుల కొమరుని వ్రేతల, రద్దులకై తల్లి ఱోల రజ్జులఁ గట్టం**
**బద్దులకు మిన్ను ముట్టిన, మద్దుల వడిఁ గూల్చె జనసమాజము వొగడన్. 177**

**ప్రతి :** ముద్దుల కొమరుని= ప్రియమైన పుత్రుని; తల్లి= తల్లియైన యశోద; వ్రేతల రద్దులకు+ఐ= గొల్లెతలపట్ల అల్లరిపనులకై; ఱోలన్= ఱోటియందు; రజ్జులన్= దారాలతో; కట్టన్= కట్టివేయగా; పద్దులకున్= పంతాలకు; జనసమాజము= ప్రజాసమూహము; పొగడన్= ప్రశంసించగా; మిన్నుముట్టిన= ఆకాశమంటిన; మద్దులన్= మద్ది చెట్లను; వడిన్ కూల్చెన్= శీఘ్రంగా కూల్చివేసినాడు.

**తా :** కృష్ణుడు అల్లరి పనులు చేస్తున్నాడని గోపికలు యశోద వద్ద గోలపెట్టారు. యశోద అతని అల్లరిపనులు మాన్పించాలని తాడుతో రోటికి బంధించింది. వెంటనే ఆ బాలుడు పంతానికి రోలీడ్చుకుంటూ పోయి ఆకసమంటే జంట మద్దులను నేలగూల్చాడు. అప్పుడక్కడి జనులందరూ కృష్ణుణ్ణి కీర్తించారు.

**విశే :** నలకూబర మణిగ్రీవులు అనే ఇద్దరు గంధర్వులు శాపంవల్ల మద్దిచెట్లుగా రూపొందారు. బాలకృష్ణుడు ఆ చెట్లను నేలగూల్చి వారిని శాపవిముక్తులను గావించాడన్న కథ ఇక్కడ అనుసంధింపదగినది.

**మ. మదిఁ గృష్ణుండు యశోదబిడ్డఁడని నమ్మంజాల యోగీంద్ర! త**
**ద్వదనాంభోజములోఁ జరాచరసమస్త ప్రాణిజాతాటవీ**

**నదనద్యద్రిపయోధియుక్త మగు నానాలోకజాలంబు భా**
**స్వదనూనక్రియఁ జూపెఁ దల్లికి మహాశ్చర్యంబు వాటిల్లఁగన్. 178**

**ప్రతి :** యోగీంద్ర!= యోగిశ్రేష్ఠా!; మదిన్= నా చిత్తంలో; కృష్ణుండు= బాలకృష్ణుడు; యశోద బిడ్డడు+అని= యశోదాపుత్రుడని; నమ్మన్+చాలన్= విశ్వసించలేను; తద్+వదన+అంభోజములోన్= అతని ముఖపద్మంలో; చర+అచర= స్థావరజంగమాత్మకమైన; సమస్త= సకలమైన; ప్రాణిజాత= ప్రాణుల సమూహం; అటవీ= అడవులు; నద నదీ= నదీనదాలు; అద్రి= కొండలు; పయోధి= సముద్రాలతో; యుక్తమగు= కూడినట్టి; నానాలోకజాలంబున్= వివిధలోక సమూహాన్ని; మహా+ఆశ్చర్యంబు= గొప్ప అద్భుతం; వాటిల్లగన్= సంభవించగా; తల్లికిన్= యశోదకూ; భాస్వత్+అనూనక్రియన్= ప్రకాశించే మహావిధానంతో; చూపెన్= చూపించాడు.

**తా :** యోగివర్యా! ఎన్నో అద్భుతకార్యాలు బాల్యంలోనే చేసిన కృష్ణుడు యశోద కొడుకని నేను నమ్మలేను. ఒకనాడతడు ఆ తల్లికి సమస్త చరాచర ప్రాణులూ, అడవులూ, నదీనదాలూ, కొండలూ, సాగరాలూ వీటితో కూడిన వివిధ జగజ్జాలాన్ని అపూర్వప్రక్రియతో తన నోట చూపినాడు. అది చూచి తల్లి ఆశ్చర్యపడింది.

**విశే :** నదులు – పశ్చిమానపుట్టి తూర్పు సముద్రంలో కలిసేవి. నదములు – తూర్పునపుట్టి పశ్చిమ సముద్రంలో కలిసేవి.

**చ. వరయమునానదీహ్రదనివాసకుఁడై నిజవక్త్రనిర్గత**
**స్ఫురిత విషాంబుపానమున భూజనులన్ మృతిఁబొందఁజేయు భీ**
**కరగరళద్విజిహ్వుఁడగు కాళియపన్నగు నా హ్రదంబుఁ జె**
**చ్చెర వెడలించి కాచె యదుసింహుఁడు గోపకగోగణంబులన్. 179**

**ప్రతి :** వరయమునా నదీహ్రదనివాసకుఁడు+ఐ= శ్రేష్ఠమగు యమునానదిలోని మడుగు నివాసంగా కలవాడై; నిజ= తనయొక్క; వక్త్ర= ముఖంనుండి; నిర్గత= బయలువెడలిన; స్ఫురిత= మంటలు చిమ్ముతున్న; విష+అంబు= విషయుక్త జలంయొక్క; పానమునన్= త్రాగుటచేత; భూజనులన్= లోకంలోని ప్రజలను; మృతిన్+పొందన్+చేయు= మరణం పొందేటట్లు చేస్తున్న; భీకరగరళ ద్విజిహ్వుఁడు+అగు= భయంకర విషంగల రెండు నాల్కలు గలవాడైన; కాళియపన్నగున్= కాళియుడనే సర్పాన్ని; చెచ్చెరన్= శీఘ్రంగా; ఆహ్రదంబున్ వెడలించి= ఆ మడుగునుండి వెడలగొట్టి; యదు సింహుఁడు= యదుశ్రేష్ఠుడైన కృష్ణుడు; గోపక గోగణంబులన్= గోపకులనూ, గోబృందాలనూ; కాచెన్= కాపాడాడు.

**తా :** యమునానదిలోని మడుగులో కాళియుడనే సర్పరాజు నివసించేవాడు. అతని నాల్కలు రెండూ భయంకరమైన విషంతో నిండియుండేవి. అతడు క్రక్కిన విషం కలిసిన నీరు త్రాగిన ప్రజలు ప్రాణాలు కోల్పోయేవారు. ఇలా ఉండగా యదుకులతిలకుడగు కృష్ణుడు కాళియుణ్ణి ఆ హ్రదంనుండి వెడలగొట్టి గోపాలురనూ, గోవులనూ రక్షించాడు.

**మ. తనయా! గోపకు లొక్కరేయి తతి, నిద్రంజెందఁ గార్చిచ్చు వ**
**చ్చినఁ "గృష్ణా! మము నగ్నిపీడితుల రక్షింపం దగుం గావవే"**
**యనినం "గన్నులు మీరు మోడ్పుఁ డిదె దావాగ్నిన్ వెసన్నార్తు నే"**
**నన వా రట్ల యొనర్ప మ్రింగె శిఖిఁ బద్మాక్షుండు లీలాగతిన్. 180**

**ప్రతి :** తనయా! = కుమారా!; గోపకులు = గోపాలకులు; ఒక్కరేయితఱిన్ = ఒకనాటి రాత్రిసమయంలో; నిద్రన్+చెందన్ = నిద్రించగా; కార్చిచ్చు = దావానలం; వచ్చినన్ = వ్యాపించగా; "కృష్ణా!; అగ్ని పీడితులన్ = అగ్నిచే బాధితులమగు; మమున్ = మమ్ములను; రక్షింపన్‌తగుదున్ = కాపాడ దగును; కావవే (కావుము+ఏ) = రక్షింపవే! అనినన్ = అని వేడుకొనగా; "మీరు కన్నులు మోడ్వుఁడు = నేత్రాలు మూసుకొనండి; ఇది+ఎ = ఇప్పుడే; దావ+అగ్నిన్ = ఈ కార్చిచ్చును; వెసన్ = శీఘ్రంగా; ఆర్తున్+ఏన్ = నేను ఆర్పివేస్తాను; అనన్ = అని కృష్ణుడనగా; వారు, అట్లు+అ, ఒనర్పన్ = వారంతా అట్లే కన్నులు మూసుకొనగా; పద్మ+అక్షుండు = పద్మనేత్రుడు; లీలాగతిన్ = అవలీలగా; శిఖిన్ = అగ్నిని; మ్రింగెన్ = కబళించాడు.

**తా :** కుమారా! అది ఒకనాటిరాత్రి సమయం. గోపాలురందరూ నిద్రిస్తున్నారు. ఇంతలో అమాంతంగా కార్చిచ్చు వారిని చుట్టుముట్టింది "కృష్ణా! మంటల్లో చిక్కుకొన్నాం. మమ్మల్ని కాపాడు" అంటూ వాళ్లు తనను వేడుకొన్నారు. అప్పుడు పద్మాక్షుడు "మీరంతా కళ్ళు మూసుకోండి. ఇదిగో క్షణంలో నే నా కార్చిచ్చు నార్పుతాను" అని చెప్పాడు. వారట్లే చేశారు. కృష్ణుడు అలవోకగా ఆ దావాగ్నిని కబళించివేశాడు.

**క. మందుని గతి యమునాంబువు, లందు నిసిం గ్రుంకి బద్ధుఁడై చిక్కిన యా**
**నందుని, వరుణుని బంధన, మందు నివృత్తునిగఁ జేసె హరి సదయుండై. 181**

**ప్రతి :** మందుని వలెన్ = మందమతిలాగా; నిసిన్ = రాత్రివేళ; యమునా+అంబువులందున్ = యమునానదీ జలాలలో; క్రుంకి = మునిగి; బద్ధుఁడు+ఐ = బంధింపబడినవాడై; చిక్కిన = తగులుకొన్న (కృశించిన); ఆ నందునిన్ = ఆ నందుడనే గోపాలక ప్రభువును; హరి = కృష్ణుడు; సదయుండు+ఐ = దయగలవాడై; వరుణుని బంధనమందున్ = వరుణుని పాశంనుండి; నివృత్తునిగన్+చేసెన్ = తొలగిన వానినిగా చేశాడు.

**తా :** ఒకనాటి అర్ధరాత్రివేళ నందుడు ముందు వెనుకల చూడకుండా యమునానదిలో స్నానం చేస్తూ మునిగిపోయాడు. అక్కడ వరుణుని పాశాలలో చిక్కుకొన్నాడు. అప్పుడు దయామయుడైన కృష్ణుడు అతణ్ణి ఆ పాశబంధంనుండి విడిపించాడు.

**మ. మయసూనుండు నిజానువర్తుల మహామాయన్ మహీభృద్గుహా**
**శ్రయులంగా నొనరించి తత్పథము నీరంధ్రంబు గావించినన్**
**రయ మొప్పం గుటిలాసురాధమునిఁ బోరం ద్రుంచి గోపావళిన్**
**దయతోఁ గాచిన కృష్ణు సన్మహిమ మేతన్మాత్రమే తాపసా! 182**

**ప్రతి :** తాపసా! = నారదా!; మయసూనుండు = మయుని కుమారుడైన వ్యోమాసురుడు; నిజ+అనువర్తులన్ = తన్ను (కృష్ణుని) అనుసరించువారిని; మహామాయన్ = గొప్ప మాయతో; మహీభృత్+గుహా+ఆశ్రయులంగాన్ = కొండగుహ నాశ్రయించిన వారినిగా; ఒనరించి = చేసి; తద్+పథమున్ = ఆ గుహలోనికి వెళ్లే త్రోవను; నీరంధ్రంబున్ = సందు లేనిదిగా; కావించినన్ = చేయగా; రయము+ఒప్పన్ = వేగంగా; కుటిల+అసుర+అధమునిన్ = దుష్టుడైన ఆ రాక్షసాధముణ్ణి; పోరన్ = యుద్ధంలో; త్రుంచి = చంపి; గోప+ఆవళిన్ = గోపాలక బృందాన్ని; దయతోన్ = కృపతో; కాచిన కృష్ణు = రక్షించిన శ్రీకృష్ణుని యొక్క; సత్+మహిమము = శ్రేష్ఠమైన ప్రభావం; ఏ తన్మాత్రము+ఏ = ఇంతింత మాత్రమా? కాదని తాత్పర్యం.

**తా :** మునీంద్రా! మయాసురుని పుత్రుడైన వ్యోమాసురుడనేవాడు ఒకసారి తన మాయా ప్రభావంతో కృష్ణుని అనుచరులైన గోపకులనందరినీ ఒక గుహలో ప్రవేశించునట్లు చేశాడు. గుహలోనికి రాకపోకలు సాగించే దారిని మూసివేశాడు.

వెంటనే మహావేగంతో శ్రీకృష్ణుడు ఆ కుటిల రాక్షసుణ్ణి పోరాటంలో హతమార్చి గోపాలకుల నందరినీ దయతో కాపాడాడు. అట్టి కృష్ణుని మహామహిమ ఇంతింతని చెప్ప వీలగునా? కాదని భావం.

**క. దివిజేంద్రప్రీతిగ వ, ల్లవజను లేఁటేఁటఁ జేయు లాలితసవనో**
**త్సవము హరి మానిపిన గో, పవరులు గావింపకున్న బలరిపుఁ డలుకన్. 183**

**ప్రతి :** వల్లవజనులు= గోపకులు; దివిజ+ఇంద్రప్రీతిగన్= దేవేంద్రునికి ప్రీతి కలిగేటట్లు; ఏటన్+ఏటన్= ప్రతి సంవత్సరం; చేయు= అనుష్ఠించు; లాలితసవన+ఉత్సవమున్= లలితమైన యాగమనే ఉత్సవాన్ని; హరి= కృష్ణుడు; మానిపినన్= నిలిపివేయగా; గోపవరులు= గోపాలక వర్యులు; కావింపకున్నన్= ఆ యాగాన్ని అనుష్ఠించకుండా ఉండగా; బలరిపుఁడు= ఇంద్రుడు; అలుకన్= కోపంతో...

**తా :** గోపాలకులు గోకులంలో ప్రతిసంవత్సరం ఇంద్రుడికి ప్రీతిగా యాగం చేసేవారు. ఆ యాగం, చేయవద్దని కృష్ణుడు వారికి బోధించాడు. గోపకులు కృష్ణుని మాట విని యాగం నిలిపివేశారు. ఇంద్రుడు కోపోద్దీపితుడయ్యాడు.

**తే. మంద గొందలమంద నమందవృష్టిఁ, గ్రందుకొనుఁ డంచు నింద్రుండు మందలింపఁ**
**జండపవన సముద్ధూత చటుల విలయ, సమయ సంవర్తకాభీలజలధరములు. 184**

**ప్రతి :** మంద= గొల్లపల్లె; కొందలమందన్= కలత చెందేటట్లుగా; అమందవృష్టిన్= అతివృష్టిచే; క్రందుకొనుఁడు+అంచున్= ముట్టడించండి అంటూ, ఇంద్రుండు; మందలింపన్= హెచ్చరించగా; చండపవన= ప్రచండమైన గాలిచే; సముద్ధూత= ఎగురగొట్టబడిన; చటుల= భీకరంగా చలించే; విలయ సమయ= ప్రళయకాలమునందలి; సంవర్తక= సంవర్తకంవంటి; ఆభీల= భీకరమైన; జలధరములు= మేఘాలు.

**తా :** అప్పుడు వ్రేపల్లె కలతపడునట్లుగా 'అతివృష్టి కురియించండి' అని ఇంద్రుడు మేఘాలను పురికొల్పాడు. అంతట ప్రచండమైన వేగానికి పైకెగిరి ప్రళయకాలంలోని సంవర్తకాలవంటి మేఘాలు భీకరంగా వ్యాపించాయి.

**శా. సప్తస్కంధ శిఖా కలాప రుచిమత్సౌదామనీవల్లికా**
**దీప్తోదగ్రముహు స్తమః పిహితధాత్రీ భాగనీరంధ్రమై**
**సప్తాశ్వస్ఫురదిందు మండలనభస్సంఛాదితాశాంతర**
**వ్యాప్తాంభోద నిరర్గళస్ఫుటశిరోవాఃపూరధారాళమై. 185**

**ప్రతి :** సప్తస్కంధ= పెద్దకొమ్మలవంటి ఏడురూపాలుగల; శిఖా కలాప= అగ్నిజ్వాలల సమూహంవలె; రుచిమత్= ప్రకాశంకల; సౌదామనీ= మెరుపులనెడు; వల్లికా= తీవలచే; దీప్త= ప్రకాశింపజేయబడిన; ఉదగ్ర= భీకరమై; ముహుస్= మరల; తమస్= చీకటిచే; పిహిత= కప్పబడిన; ధాత్రీభాగ= భూభాగంచేత; నీరంధ్రము+ఐ= దట్టమైనదై; సప్త+అశ్వ= సూర్యునిచే; స్ఫురత్= ప్రకాశించు; ఇందుమండల= చంద్రమండలంగల; నభస్+ఆకాశమునందు, సంఛాదిత= కప్పబడిన; ఆశా+అంతర= దిగంతరాలయందు; వ్యాప్త= వ్యాపించిన; అంభోద= మబ్బులచే; నిరర్గళ= ఆటంకం లేకుండ; స్ఫుట= స్పష్టమగు; శిరస్= అగ్రభాగంకల; వాఃపూర= జలప్రవాహంచేత; ధారాళమై= అడ్డులేనిదై...

**తా :** ఇంద్రుని ఆదేశంతో వాన ప్రారంభమయింది. అగ్ని జ్వాలల్లాగా మిరుమిట్లు గొలిపే మెరుపులతో, ఆ వర్షం అంతకంతకూ భయంకరమయింది. చీకట్లు దట్టంగా వ్యాపించాయి. సూర్యచంద్రమండలాలతో సహా ఆకాశాన్ని కప్పివేసిన కారుమబ్బులు దిగంతరాలకు వ్యాపించాయి. ధారాళంగానూ, కుండపోతగానూ వర్షం కురియసాగింది.

**విశే :** సప్తస్కంధ – కాళి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ – అనే పేర్లుగల అగ్నిదేవుని నాలుకలు.

**వ. కురియు వానజల్లు పెల్లున రిమ్మగొని సొమ్మలు వోయి గోకులం బాకులంబయి "కృష్ణ! కృష్ణ! రక్షింపు" మని యార్తిం బొంది కుయ్యిడ నయ్యఖండ కరుణారస సముద్రుండును, భక్తజన సురద్రుముండును నైన పుండరీకాక్షుండు. 186**

**ప్రతి :** కురియు= కురిసేటువంటి; వానజల్లు పెల్లునన్= పెద్ద గాలి వాన వలన; రిమ్మగొని= మతిభ్రమ చెంది; సొమ్మలు+పోయి= సొమ్మసిల్లి; గోకులంబు= గోగోపకులందరూ; ఆకులంబు+అయి= వ్యాకులత చెంది; "కృష్ణ, కృష్ణ, రక్షింపుము"+అని= కృష్ణ కృష్ణా! రక్షించుమంటూ; ఆర్తిన్+పొంది= బాధచెంది; కుయ్యి+ఇడన్= మొర యిడగా; ఆ+అఖండ కరుణారస సముద్రుండునున్= ఆ అనంత దయాసాగరుడూ; భక్తజన సురద్రుముండునున్= భక్తజనులపాలిటికి కల్పవృక్షమూ ఐన; పుండరీక+అక్షుండు= పద్మలోచనుడు.

**తా :** విడుపు లేకుండా పెద్దవాన కురిసింది. ఆ తాకిడికి గోకులమంతా వ్యాకులమై పోయింది. జనులందరూ మతిభ్రమకు లోనై మూర్ఛిల్లారు. అలా కలతజెంది బాధతో "కృష్ణా! కృష్ణా! కాపాడు. రక్షించవయ్యా" అంటూ మొరపెట్టుకొన్నారు. ఆ మొర విని అనంత దయాసముద్రుడూ, భక్తజనుల పాలిటి కల్పవృక్షమూ అయిన ఆ పద్మాక్షుడు –

**శా. సప్తాబ్దంబుల బాలుఁడై నిజభుజా స్తంభంబునన్ లీలమై**
**సప్తాహంబులు శైలరాజము లసచ్ఛత్త్రంబుగాఁ దాల్చి, సం**
**గుప్తప్రాణులఁ జేసె మాధవుఁడు గోగోపాలక వ్రాతమున్**
**సప్తాంభోధి పరీతభూధరున కాశ్చర్యంబె చింతింపఁగన్? 187**

**ప్రతి :** సప్త+అబ్దంబుల= ఏడు సంవత్సరాల ప్రాయంకల; బాలుఁడు+ఐ= చిన్న పిల్లవాడైన; మాధవుఁడు= రమాకాంతుడు; నిజభుజా స్తంభంబునన్= తన బాహువనే స్తంభముతో; లీలమైన్= అవలీలగా; సప్త+అహంబులు= ఏడుదినాలు; శైలరాజమున్= గోవర్ధనగిరిని; లసత్+ఛత్రంబుగాన్+తాల్చి= వెలుగొందు గొడుగుగా ధరించి; గోగోపాలక వ్రాతమున్= గోవులనూ, గోపాలకసమూహాన్నీ; సంగుప్తప్రాణులన్+చేసెన్= చక్కగా రక్షించబడిన ప్రాణాలుగలవారినిగా చేశాడు; సప్త+అంభోధి పరీతభూధరునకున్= ఏడు సముద్రాలచే చుట్టబడిన, భూవలయాన్ని ధరించేవానికి; చింతింపఁగన్= ఆలోచించగా; ఆశ్చర్యంబు+ఎ= (ఆ పని)అద్భుతమైనదా? కాదని భావం.

**తా :** ఏడేండ్ల బాలుడైన కృష్ణుడు తన భుజస్తంభంపై అవలీలగా ఏడుదినాలపాటు గోవర్ధనగిరిని గొడుగులాగా అద్భుతంగా ఎత్తి పట్టుకొని, గోవులకు, గోపాలకులకు అందరికీ ప్రాణరక్షణ చేశాడు. ఏడు సముద్రాలచే ఆవరింపబడిన భూమినే ధరించిన భగవంతుడు ఈ కొండను ఎత్తడం ఏమాశ్చర్యం?

**సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా ధవళిత విమల బృందావన వీథియందు**
**రాసకేళీ మహోల్లాసుఁడై యుత్ఫుల్ల జలజాక్షుఁ డొక నిశాసమయమునను**
**దనరారు మంద్ర మధ్యమ తారముల నింపు దళుకొత్త రాగభేదములఁ జెలఁగి**
**ధైవత ఋషభ గాంధార నిషాద పంచమ షడ్జ మధ్యమ స్వరము లోలిఁ**

**తే. గళలు జాతులు మూర్ఛనల్ గలుగ వేణు, నాళ వివరాంగుళన్యాసలాలనమున**
**మహితగతిఁ బాడె నవ్యక్తమధురముగను, పంకజాక్షుండు దారువు లంకురింప. 188**

**ప్రతి :** ఉత్ఫుల్లజలజాక్షుఁడు= వికసించినట్టి పద్మాలను పోలిన కన్నులుగల కృష్ణుడు; ఒక నిశాసమయమునను= ఒకనాటి రాత్రి వేళయందు; సాంద్ర= దట్టమైన; శరత్+చంద్ర+చంద్రికా= శరదృతువులోని చంద్రుని వెన్నెలలచే; ధవళిత= తెల్లగాజేయబడిన; విమల= నిర్మలమైన; బృందావన వీథియందున్= బృందావనానికి చెందిన వీధిలో; రాసకేళీ మహా+ఉల్లాసుఁడు+ఐ= రాసకేళిచే గల్గిన గొప్ప ఉత్సాహం కలవాడై; తనరారు= విలసిల్లు; మంద్ర, మధ్యమ, తారములన్= మంద్రస్థాయి, మధ్యస్థాయి, తారస్థాయి, అను త్రివిధస్థాయులతో; ఇంపు= సొంపు; తళుకొత్తన్= విలసిల్లగా; రాగభేదములన్= వివిధరాగాలతో; చెలఁగి= విజృంభించి; ధైవత....స్వరములు= ధైవతం, ఋషభం, గాంధారం, నిషాదం, పంచమం, షడ్జం, మధ్యమం అనే స్వరాలు; ఓలిన్= వరుసగా, కళలు, జాతులు; మూర్ఛనల్= సంగీతానికి చెందిన కళలూ, జాతులూ; ఆరోహణావరోహణ క్రమాలు; కలుగన్= సంభవించగా; వేణునాళ= పిల్లనగ్రోవియొక్క; వివర= రంధ్రాలపై; అంగుళన్యాస= వ్రేళ్లుంచుట అనే; లాలనమునన్= లాలన క్రియచే; మహితగతిన్= గొప్ప విధానంతో; అవ్యక్త మధురముగన్= అక్షరాలు తెలియరానట్లూ, మధురంగానూ; దారువులు= కొయ్యలు; అంకురింపన్= చిగిరించగా; పంకజ+అక్షుండు= పద్మనేత్రుడు; పాడెన్= గానం చేశాడు.

**తా :** అది ఒక శరత్కాలపు రాత్రి. పండువెన్నెలలో బృందావన వీథులన్నీ తెల్లగా కనిపిస్తున్నాయి. విరబూచిన తామరలవంటి నేత్రాలు గల కృష్ణుడు ఆ వనంలో రాసకేళికి ఉపక్రమించాడు. ఆ క్రీడోల్లాసంతో పిల్లనగ్రోవి చేతపట్టాడు. దాని రంధ్రాలపై వ్రేళ్ళని ఇంపుగా వివిధరాగాలను ఆలపించాడు. వాటిలో మంద్రస్థాయినీ, మధ్యమస్థాయినీ, తారస్థాయినీ వినిపించాడు. ధైవతం, ఋషభం, గాంధారం, నిషాదం, పంచమం, షడ్జం, మధ్యమం అనే ఏడు స్వరాలు, కళలూ, జాతులూ, ఆరోహణావరోహణక్రమమూ తేటపడే విధంగా అవ్యక్త మధురంగా గానం చేశాడు. ఆ గానానికి మ్రోళ్ళు చివురించాయి.

**విశే :** సంగీత శాస్త్రానికి సంబంధించిన పారిభాషిక పదాలన్నింటినీ పోతన మహాకవి ఇందులో సమన్వయాత్మకంగా చెప్పాడు. భగవంతుడు రసస్వరూపుడు కనుక ఈ సమన్వయం సముచితం.

భక్తి శృంగార రసములకు సంబంధించిన క్రీడను రాసక్రీడ అంటారు. అవ్యక్తమధురం – పక్షుల, జంతువుల నాదాలలో అక్షరాల స్వరూపం అవ్యక్తంగా ఉంటుంది. నాదమే మధురంగా ఉంటుంది.

**మ. హరివేణూద్గత మంజులస్వరనినాదాహూతలై గోప సుం**
**దరు లేతేర ధనాధిపానుచరగంధర్వుండు గొంపోవఁ ద**
**త్తరుణుల్ గుయ్యిడ శంఖచూడుని భుజాదర్పంబు మాయించి తాఁ**
**బరిరక్షించినయట్టి కృష్ణుని నుతింపన్ శక్యమే యేరికిన్? 189**

**ప్రతి :** హరి= కృష్ణునియొక్క; వేణు= పిల్లనగ్రోవినుండి; ఉద్గత= బయలు వెడలిన; మంజుల= మనోజ్ఞమైన; స్వరనినాద= స్వరశబ్దంచేత; ఆహూతలు+ఐ= పిలువబడినవారై; గోపసుందరులు= గోపికలు; ఏతేరన్= రాగా; ధనాధిపానుచరగంధర్వుండు= కుబేరుని సేవకుడగు గంధర్వుడు (శంఖ చూడుడనేవాడు) కొంపోవన్= ఆ గోపికల నపహరించి తీసుకుపోగా, తత్+తరుణుల్= ఆ యువతులు; కుయ్యిడన్= మొరలిడగా; శంఖచూడుని= శంఖచూడుడనే ఆ గంధర్వునియొక్క; భుజాదర్పంబున్= భుజగర్వాన్ని; మాయించి= నశింపజేసి; తాన్= తాను; పరిరక్షించిన యట్టి= కాపాడినట్టి; కృష్ణునిన్= శ్రీకృష్ణభగవానుని; నుతింపన్= స్తుతించుటకు; ఏరికిన్= ఎవరికైనా; శక్యము+ఏ= సాధ్యమవుతుందా?

**తా :** శ్రీకృష్ణుని వేణువునుండి వెలువడిన మధురధ్వని విని గోపికలు పరుగెత్తుకొని వచ్చారు. అప్పుడు కుబేరుని అను యాయి యగు శంఖచూడుడనే గంధర్వుడు వాళ్ళను ఎత్తుకు పోయాడు. వాళ్ళు కృష్ణా, కృష్ణా, అంటూ మొరపెట్టుకొన్నారు. అది విని మాధవుడు వెంటనే ఆ శంఖచూడుని భుజదర్పం పోకార్చి ఆ సుందరీమణులను రక్షించాడు. అట్టి శ్రీకృష్ణుని నుతించడం ఎవరికీ సాధ్యంకాని పని.

**చ. నరక ముర ప్రలంబ యవనద్విప ముష్టిక మల్ల కంస శం**
**బర శిశుపాల పంచజన పౌండ్రక పల్వల దంతవక్త్ర వా**
**నర ఖర సాల్వ వత్స బక నాగ విదూరథ రుక్మి కేశి ద**
**ర్దుర వృష ధేనుక ప్రముఖదుష్టనిశాటులఁ ద్రుంచె ద్రేల్మిడిన్. 190**

**ప్రతి :** నరక...నిశాటులన్= నరకుడు, మురుడు, ప్రలంబుడు, కాలయవనుడు, ఏనుగు, ముష్టికుడు, (చాణూరుడు) మున్నగు మల్లురు, కంసుడు, శంబరుడు, శిశుపాలుడు, పంచజనుడూ, పౌండ్రకుడు, పల్వలుడు, దంతవక్త్రుడు, వానరుడు, గర్దభుడు, సాల్వుడు, వత్సుడు, బకుడు, కాళియుడు, విదూరథుడు, రుక్మి, కేశి, దర్దురుడు, వృషభుడు, ధేనుకుడు, ప్రముఖ= మున్నగు, దుష్ట= దుష్టులగు; నిశాటులన్= రాక్షసులను; ద్రేల్మిడిన్= త్రుటిలో; త్రుంచెన్= సంహరించాడు.

**తా :** ఆ శ్రీకృష్ణుడు నరకాసుడు, మురాసుడు, ప్రలంబుడు, కాలయవనుడు, కువలయాపీడమను ఏనుగు, ముష్టికుడు (చాణూరుడు) మొదలైన మల్లురు, కంసుడు, శంబరుడు, శిశుపాలుడు, పంచజనుడు, పౌండ్రక వాసుదేవుడు, పల్వలుడు, దంతవక్త్రుడు, ద్వివిదుడనే వానరుడు, గర్దభాసురుడు, సాల్వుడు, వత్సాసురుడు, బకాసురుడు, విదూరథుడు, రుక్మి, కేశి, దర్దురుడు, వృషభాకారాలు గల ఏడుగురు దనుజులు, ధేనుకుడు మొదలైన దుష్టులైన పెక్కుమంది రక్కసులను చిటికలో రూపుమాపినాడు.

**వ. మఱియును. 191**

**ప్రతి :** మఱియును= ఇంకను.

**తా :** ఇంకా

**మ. బలభీమార్జునముఖ్య చాపధరరూపవ్యాజతం గ్రూరులన్**
**ఖలులన్ దుష్టధరాతలేశ్వరుల సంగ్రామైకపారీణ దో**
**ర్బలకేళిం దునుమాడి సర్వధరణీభారంబు మాయించి సా**
**ధుల రక్షించినయట్టి కృష్ణుని ననంతుం గొల్తు నెల్లప్పుడున్. 192**

**ప్రతి :** బల= బలరాముడు; భీమ= భీముడు; అర్జున= అర్జునుడు; ముఖ్య= మున్నగు; చాపధర రూప= విలుకాండ్ర రూపమనే; వ్యాజతన్= మిషతో; క్రూరులన్= క్రూరస్వభావులను; ఖలులన్= నీచులను; దుష్టధరాతల+ఈశ్వరులన్= దుర్మార్గులైన రాజులను; సంగ్రామ+ఏక+పారీణదోస్+బలకేళిన్= సంగరంలో ఆరితేరిన భుజబలం అనే క్రీడతో; తునుమాడి= సంహరించి; సర్వధరణీభారంబున్= సకలభూభారాన్ని; మాయించి= తొలగించి; సాధులన్= శిష్టజనులను; రక్షించిన+అట్టి= కాపాడినట్టి; అనంతున్ కృష్ణునిన్= అంతంలేని శ్రీకృష్ణపరమాత్మను; ఎల్లప్పుడున్= ఎల్లవేళలా; కొల్తున్= ఆరాధిస్తాను.

**తా :** అంతేకాక బలరాముడు, భీముడు, అర్జునుడు, మున్నగు ధనుర్ధారుల రూపాల వ్యాజంతో అవతరించి క్రూరస్వభావులూ, నీచులూ, దుష్టులూ, అయిన రాజులను యుద్ధమనే భుజబలక్రీడలో రూపుమాపి ఆ భగవంతుడు సమస్త ధరణీభారాన్ని తొలగించాడు. సజ్జనులను కాపాడినాడు. అట్టి అనంతుడైన కృష్ణ పరమాత్మను నేను సదా ఆరాధిస్తాను.

**విశే :** బలరాముడు భగవదవతారమే. అర్జునుడు గూడా గీతలో "పాండవానాం ధనుంజయః" అని చెప్పినట్లు శ్రీకృష్ణాంశభవుడే. ఆ వరుసలో భీముడు కూడా ఇక్కడ పేర్కొనబడినాడు. భీముడు భగవదవతారుడా? అని కొందరు సంశయించవచ్చు కాని ధర్మోద్ధరణకై అవతరించిన భగవంతుడు అసాధారణ బలపరాక్రమం కల భీముడు మున్నగువారిలో గూడా ఆ రూపంతో ఉన్నట్లు మనం గ్రహించాలి. ఇక్కడ –

**యద్యద్విభూతిమత్సత్త్వం, శ్రీమదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥**

అన్న గీతావచనాన్ని సమన్వయించుకుంటే సరిపోతుంది. మధ్వులు వాయుదేవుణ్ణి ముఖ్యప్రాణదేవర అంటారు. కనుక వాయునందనుడు అవతారవ్యక్తిగా సంభావ్యుడు.

**వ. అట్టి లోకోత్కృష్టుండైన కృష్ణుని యవతారమాహాత్మ్యంబెఱింగించితి నింక వ్యాసావతారంబు వినుము. 193**

**ప్రతి :** అట్టి= అటువంటి; లోక+ఉత్కృష్టుండైన= లోకశ్రేష్ఠుడగు; కృష్ణుని= వాసుదేవుని; అవతారమాహాత్మ్యంబున్= అవతారంయొక్క ప్రభావాతిశయాన్ని గురించి; ఎఱింగించితిని= తెలిపినాను; ఇంక, వ్యాస+అవతారంబున్= వ్యాసుని అవతారాన్ని గూర్చి విను.

**తా :** లోకోత్తరుడైన శ్రీకృష్ణభగవానుని అవతార ప్రభావం వివరించాను. ఇంక వ్యాసుని అవతారాన్ని వివరిస్తాను. శ్రద్ధగా విను.

**చ. ప్రతియుగమందు సంకుచితభావులు నల్పతరాయువుల్ సుదు**
**ర్గతికులు నైన మర్త్యుల కగమ్యములున్ స్వకృతంబులున్ సుశా**
**శ్వతములు నైన వేదతరుశాఖలు దా విభజించినట్టి స**
**న్నుతుఁడు పరాశరప్రియతనూజుఁడు నా హరి పుట్టె నర్మిలిన్. 194**

**ప్రతి :** ప్రతియుగమందున్= ప్రతికల్పంలోనూ; సంకుచిత భావులున్= అల్పస్వభావులూ (ముడుచుకొనిపోయిన ఆలోచనలు కలవారు); అల్పతర+ఆయువుల్= అల్పాయుష్కులూ; సుదుర్గతికులున్= మిక్కిలి దుర్గతిపాలయ్యేవారు, ఐన; మర్త్యులకున్= మానవులకు; అగమ్యములున్= అగోచరాలూ; స్వకృతంబులున్= తాను (భగవానుడు) నిర్మించినవీ; సుశాశ్వతములున్=

నిత్యములూ; ఐన; వేదతరుశాఖలు= వేదమనే వృక్షంయొక్క కొమ్మలు; తాన్= తాను; విభజించినట్టి= వేరు చేసినట్టి; సన్నుతుఁడు= సజ్జనస్తుతుడూ; పరాశరప్రియతనూజుఁడు= పరాశరునికి ప్రీతిపాత్రుడైన పుత్రుడూ; నాన్= అనగా; హరి= శ్రీహరి; అర్మిలిన్= ప్రీతితో; పుట్టెన్= సంభవించాడు.

**తా :** ప్రతియుగంలోనూ అల్పబుద్ధులూ, అల్పాయుష్కులూ, దుర్గతి పొందేవారూ అయిన మానవులుంటారు. వారికి భగవంతుడు కల్పించినవీ, శాశ్వతమైనవీ అయిన వేదాలు గోచరించవు. అట్టివారిని అనుగ్రహించాలన్న బుద్ధితో శ్రీహరి సజ్జనస్తుతి పాత్రుడై పరాశర మహర్షికి ప్రియపుత్రుడైన వేదవ్యాసుడుగా అవతరించి వేదవృక్షాన్ని శాఖలుగా విభజించాడు.

**విశే :** సంకుచిత స్వభావులు అంటే గురు ఉపదేశాదులవలన పొందవలసిన వికాసం పొందని ఆలోచనలు కలవారు.

(సుదుర్గతి) సు= అంటే మిక్కిలి అనికూడా అర్థం. ఆంధ్రదీపిక – మామిడి వెంకయ్య.

**వ. మఱియు బుద్ధావతారంబు వినుము. 195**

**ప్రతి :** మఱియున్= ఇంకా; బుద్ధ+అవతారంబు= బుద్ధునియొక్క అవతారాన్ని గూర్చి; వినుము= ఆలకించు.

**తా :** ఇంకా బుద్ధుని అవతారం వివరిస్తాను, వినుము.

**మ. అతిలోలాత్ములు సూనృతేతరులు భేదాచార సంశీలు రు**
**ద్ధత పాషండమతౌపధర్ములు జగత్సంహారు లైనట్టి యా**
**దితి సంజాతు లధర్మవాసనల వర్తింపం, దదాచార సం**
**హతి మాయించి హరించె దానవులఁ బద్మాక్షుండు బుద్ధాకృతిన్. 196**

**ప్రతి :** అతిలోలాత్ములు= మిక్కిలి చంచలస్వభావులు; సూనృత+ఇతరులు= అసత్యపరులు; భేద+ఆచార సంశీలురు= సంప్రదాయ విరుద్ధమైన ఆచారాలయందు పట్టుదల గలవారు; ఉద్ధత పాషండమత+ఔపధర్ములు= గర్వించిన పాషండుల మతాన్ని ఉపధర్మంగా పాటించేవారు; జగత్+సంహారులు+ఐనట్టి= లోకనాశకులు అయిన; ఆ దితిసంజాతులు= దితిపుత్రులైన ఆ రాక్షసులు; అధర్మవాసనలన్= ధర్మవిరుద్ధ సంస్కారాలతో; వర్తింపన్= ప్రవర్తించగా; తదాచారసంహతిన్= వారి దురాచారపరంపరను; మాయించి= రూపుమాపి; పద్మ+అక్షుండు= కమలనేత్రుడు; బుద్ధ+ఆకృతిన్= బుద్ధరూపంతో (వచ్చి); దానవులన్= దైత్యులను; హరించెన్= సంహరించాడు.

**తా :** ఇక బుద్ధావతారం గురించి విను. చపలస్వభావులూ, అసత్యప్రవర్తనులూ, భేదాచారపరులూ, అధార్మికులూ, పాషండమతానుయాయులూ అయిన దితిపుత్రులు లోకాన్ని చంపుకు తినేవారు. పద్మలోచనుడు బుద్ధుడుగా అవతరించి ఆ రక్కసులను వారి దురాచారాలతో కూడ నిర్మూలించాడు.

**వ. మఱియుం గల్క్యవతారంబు వినుము. 197**

**ప్రతి :** మఱియున్= ఇంకా; కల్కి+అవతారంబు= కల్కి అవతారాన్ని గూర్చి; వినుము= వినవలసింది.

**తా :** ఇక కల్కి అవతారాన్ని గూర్చి వివరిస్తాను, విను.

మ. వనజాక్ష స్తవశూన్యులై మఱి వషట్స్వాహా స్వధా వాక్య శో
భనరాహిత్యులు, సూనృతేతరులునుం, బాషండులున్నైన వి
ప్రనికాయంబును శూద్రభూపులుఁ గలిం బాటిల్లినం గల్కియై
జననంబంది యధర్మమున్నడఁచు సంస్థాపించు ధర్మంబిలన్. 198

**ప్రతి :** వనజాక్ష స్తవశూన్యులై= శ్రీహరిని స్తుతించనివారై; మఱి= ఇంకా; వషట్....రాహిత్యులు= వషట్, స్వాహా, స్వధా అనే పదాలతో వాక్యాలు పలకడంవల్ల కలిగే శుభాలను పొందనివారై; సూనృతేతరులునున్= అసత్య ప్రవృత్తి గలవారూ; పాషండులున్+ఐన= వేదవిరుద్ధ మతానుసారులూ అయిన; విప్రనికాయంబునున్= ద్విజసమూహం; శూద్రభూపులు= శూద్రరాజులూ; కలిన్= కలియుగంలో; పాటిల్లినన్= చెలరేగగా; కల్కి+ఐ= కల్కిరూపంతో; జననంబు+అంది= జన్మించి; అధర్మమున్+అడఁచున్= అధర్మాన్ని నశింపజేస్తాడు; ఇలన్= భూతలంలో; ధర్మంబున్= ధర్మాన్ని; సంస్థాపించున్= నెలకొల్పుతాడు.

**తా :** ఇక కల్కి అవతారం గురించి విను. కలికాలంలో విప్రులు భగవంతుణ్ణి ప్రార్థించరు, వేదవిహితమైన యజ్ఞ యాగాది కర్మలు చేయరు. వారినోటినుండి 'వషట్, స్వాహా, స్వధా' అనే యజ్ఞయాగాదుల్లో ఉచ్చరించే మాటలు వినిపించవు. వాళ్ళు సత్యం పాటించరు. నాస్తికులై వేదవిరుద్ధంగా ప్రవర్తిస్తారు. శూద్రులు రాజులవుతారు. ఇట్టి స్థితి సంభవించినప్పుడు భగవానుడు కల్కి రూపంతో అవతరిస్తాడు. అధర్మం తొలగిస్తాడు, ఇలలో ధర్మం స్థాపిస్తాడు.

**విశే :** అగ్నికి స్వధాకారమూ, పితృదేవతలకు స్వధాకారమూ, దేవతలకు వషట్కారమూ నియతములు పూర్వం చెప్పిన అవతారాలలో చివరిది "కల్కి" తప్ప తక్కినవి గతించిన అవతారాలు. "కల్కి" రానున్న అవతారం.

**వ. అని మఱియుఁ బితామహుండు నారదున కిట్లనియె. మునీంద్రా, పుండరీకాక్షుం డంగీకరించిన లీలావతారకథావృత్తాంతంబు నేను నీకు నెఱింగించు నంతకు మున్న హరి వరాహాద్యవతారంబు లంగీకరించి తత్ప్రయోజనంబులఁ దీర్చె. మన్వంతరావతారంబు లంగీకరించి నవియు నంగీకరింపఁగలవియునై యున్నయవి; వర్తమానంబున ధన్వంతరి పరశురామావతారంబులు దాల్చి యున్నవాడు. భావికాలంబున శ్రీరామాద్యవతారంబుల నంగీకరింపంగలవాఁ; డమ్మహాత్ముండు సృష్ట్యాది కార్య భేదంబులకొఱకు మాయాగుణావతారంబులందు, బహుశక్తి ధారణుండైన భగవంతుండు సర్గాదిని దపంబు నేనును ఋషి గణంబులును నవప్రజాపతులునునై యవతరించి విశ్వోత్పాదనంబు గావించుచుండు, ధర్మంబును విష్ణుండును యజ్ఞంబులును మనువులును నింద్రాది దేవగణంబులును ధాత్రీపతులును నయి యవతరించి జగంబుల రక్షించుచుండు, నధర్మంబును రుద్రుండును మహోరగంబులును రాక్షసానీకంబులును నై యవతరించి విలయంబు నొందించుచుండు, నిత్తెఱంగునం బరమేశ్వరుండును సర్వాత్మకుండును నైన హరి విశ్వోత్పత్తిస్థితి లయ హేతు భూతుండై విలసిల్లు; ధరణీరేణువుల నయిన గణుతింప నలవియగుం గాని యమ్మహాత్ముని లీలావతారాద్భుత కర్మంబులు లెక్క వెట్ట నెవ్వరికి నశక్యంబై యుండు, నీకు సంక్షేపరూపంబున నుపన్యసించితి సవిస్తారంబుగా నెఱింగింప నాకుం దరంబుగా దనిన నన్యులం జెప్పనేల? వినుము. 199**

**ప్రతి :** అని మఱియున్= అని ఇంకా; పితామహుండు= బ్రహ్మ; నారదునకున్+ఇట్లు+అనియెన్= నారదునితో ఇలా అన్నాడు; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా!; పుండరీక+అక్షుండు= పద్మలోచనుడైన విష్ణుదేవుడు; అంగీకరించిన= స్వీకరించిన; లీలా+అవతారకథావృత్తాంతంబున్= లీలావతారాలకు సంబంధించిన కథలయందలి వృత్తాంతాన్ని; నేను నీకున్ ఎఱింగించు+ అంతకుమున్ను+అ= నేను నీకు తెలియజేయుటకు ముందే; హరి= శ్రీహరి; వరాహ+ఆది+అవతారంబులు+అంగీకరించి= 'వరాహం' మున్నగు అవతారాలను స్వీకరించి; తద్+ప్రయోజనంబులన్+తీర్చెన్= ఆ అవతారాలవల్ల కలుగవలసిన ప్రయోజనాలను సాధించాడు; మన్వంతర+అవతారంబులు= మన్వంతరాలకు చెందిన అవతారాలు; అంగీకరించినవియున్= పూర్వం చేపట్టినవీ; అంగీకరింపఁగలవియున్+ఐ= ఇకమీదట చేపట్టవలసినవీ; ఉన్న+అవి= ఉన్నాయి; వర్తమానంబునన్= ఈ యుగంలో ఇప్పుడూ; ధన్వంతరి పరశురామ+అవతారంబులు= ధన్వంతర్యవతారం, పరశురామావతారం; తాల్చి= ధరించి; ఉన్నవాఁడు= వున్నాడు; భావికాలంబునన్= రానున్న కాలంలో; శ్రీరామ+ఆది+అవతారంబులన్= శ్రీరాముడు మొదలైన అవతారాలను; అంగీకరింపన్+కలవాఁడు= స్వీకరింపనున్నాడు; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడు; సృష్టి+ ఆదికార్యభేదంబుల కొఱకున్= సృష్టిమున్నగు భిన్నభిన్న కార్యాలను సాధించడానికై; మాయా గుణావతారంబులు+అందున్= మాయాగుణప్రధానమైన అవతారాలు ధరిస్తాడు; బహుశక్తిధారణుండు+ఐన= అనేక శక్తులు ధరించినవాడగు; భగవంతుండు= పరమాత్ముండు; సర్గ+ఆదిని= సృష్ట్యాదిలో; తపంబు= తపస్సును; నేనునున్; ఋషిగణంబులునున్= ఋషుల బృందములున్నూ; నవప్రజాపతులునునై= తొమ్మిదిమంది ప్రజాపతులుగా; అవతరించి= అవతారాలు దాల్చి; విశ్వ+ఉత్పాదనంబున్= ప్రపంచోత్పత్తిని; కావించుచుండున్= చేస్తూవుంటాడు; ధర్మంబునున్= ధర్మాన్ని; విష్ణుండునున్= విష్ణుడూ; యజ్ఞంబులునున్= యజ్ఞాలు; మనువులునున్= మనువులూ; ఇంద్ర+ఆదిదేవగణంబులునున్= ఇంద్రుడు మున్నగు దేవతలున్ను; ధాత్రీపతులునున్+అయి= రాజులున్నూ అయి; అవతరించి= అవతారాలు దాల్చి; జగంబులన్= లోకాలను; రక్షించుచుండున్= కాపాడుతూవుంటాడు; అధర్మంబును= అధర్మమూ; రుద్రుండును= శివుడూ; మహా+ఉరగంబులును= గొప్ప సర్పాలూ; రాక్షస+అనీకంబులునునై= దానవబృందాలుగానూ అయి; అవతరించి= అవతారాలుదాల్చి; విలయంబున్+ ఒందించుచుండున్= నశింపజేస్తూవుంటాడు; ఈ+తెఱంగునన్= ఈ రీతిగా; పరమ+ఈశ్వరుండును= పరమేశుడూ; సర్వ+ఆత్మకుండునున్ ఐన= విశ్వాత్మకుడూ, అయిన; హరి= పరమాత్మ; విశ్వ+ఉత్పత్తిస్థితిలయ హేతుభూతుండు+ఐ= ప్రపంచోత్పత్తికీ, స్థితికీ, నాశానికీ కారణభూతుడై; విలసిల్లున్= ప్రకాశిస్తాడు; ధరణీరేణువులన్+అయినన్= భూమి ధూళికణాలనైనా; గణుతింపన్= లెక్కపెట్టడానికి; అలవి+అగున్+కాని= సాధ్యమవుతుంది కాని; ఆ+మహాత్ముని= ఆ మహనీయునియొక్క; లీలా+అవతార+అద్భుతకర్మంబులు= లీలావతారాలలోని ఆశ్చర్యకరమైన కార్యాలు; లెక్కపెట్టన్= గణన చేయడానికి; ఎవ్వరికిన్= ఎట్టివారికైనా; అశక్యంబు+ఐ+ఉండున్= అసాధ్యమై వుంటుంది, నీకు; సంక్షేపరూపంబునన్= సంగ్రహంగా; ఉపన్యసించితిన్= చెప్పాను; సవిస్తారంబుగాన్= ఇక విశదంగా; ఎఱింగింపన్= తెలియపరచడానికి; నాకున్+తరంబుకాదు+అనినన్= నాకు వీలుగాదు అంటే; అన్యులన్= ఇతరులను గూర్చి; చెప్పన్+ఏల= చెప్పవలసిన అవసరమేమి?

**తా :** ఇలా చెప్పి బ్రహ్మ మళ్ళీ నారదునితో ఈ విధంగా అన్నాడు. మునిశ్రేష్ఠా! శ్రీమన్నారాయణుడు స్వీకరించిన లీలావతార కథావిశేషాలు నే నిప్పుడు నీకు చెప్పాను. ఇంతకుముందే శ్రీహరి ఆదివరాహం మొదలైన అవతారాలు స్వీకరించి చేయవలసిన పనులన్నీ చేశాడు. మన్వంతర సంబంధమైన అవతారాలు ఇంతవరకూ జరిగినవీ ఉన్నాయి. ఇక జరగబోయేవీ ఉన్నాయి. వర్తమానకాలంలో ఆయన ధన్వంతరి, పరశురామావతారాలను ధరించివున్నాడు. భవిష్యత్తులో

శ్రీరాముడు మొదలైన అవతారాలు ధరిస్తాడు. ఆ మహాత్ముడు సృష్టి మొదలైన వివిధ కార్యాలు నెరవేర్చడానికి మాయాగుణంతో నిండిన అవతారాలు స్వీకరిస్తాడు.

అనేక శక్తులతో కూడిన ఆ భగవంతుడు సృష్ట్యాదిలో తపస్సుగా, నేనుగా, ఋషులుగా, తొమ్మిదిమంది ప్రజాపతులుగా అవతరించి లోకాన్ని సృష్టిస్తూ వుంటాడు. ధర్మం, విష్ణువు, యజ్ఞాలు, మనువులు, ఇంద్రుడు మొదలైన దేవతల రూపాలతో, రాజుల రూపాలతో అవతరించి లోకాలను రక్షిస్తూ వుంటాడు. అధర్మం, రుద్రుడు, భీకరసర్పాలు, రాకాసిమూకలుగా అవతరించి విశ్వాన్ని సంహరిస్తూ వుంటాడు.

పరమేశ్వరుడూ, సర్వస్వరూపుడూ అయిన శ్రీహరి ఈ విధంగా ఈ విశాల విశ్వసృష్టికీ, స్థితికీ, లయానికీ హేతువై ప్రకాశిస్తాడు. భూమిలోని ధూళికణాలనయినా లెక్కపెట్ట వచ్చుగాని భగవంతుని లీలావతారాలలోని అద్భుతకృత్యాలను లెక్కపెట్టడం ఎవ్వరికీ అలవి కాదు. నీకు సంగ్రహంగా చెప్పాను. సవిస్తరంగా చెప్పడం నాకే సాధ్యం కాదు. ఇక ఇతరుల మాట చెప్పడమెందుకు? ఇంకా విను.

**చ. అమరఁ ద్రివిక్రమస్ఫురణ నందిన యమ్మహితాత్మపాద వే**
**గమున హతంబులైన త్రిజగంబుల కావల వెల్గు సత్య లో**
**కము చలియించినం గరుణఁ గైకొని కాచి ధరించు పాద ప**
**ద్మము తుదినున్న యప్రతిహతంబగు శక్తి గణింప శక్యమే? 200**

**ప్రతి :** అమరన్= తగినట్లు; త్రివిక్రమస్ఫురణన్= వామన రూపమైన స్ఫూర్తిని; అందిన= పొందిన; ఆ+మహిత+ఆత్మ= ఆ మహనీయునియొక్క; పాదవేగమునన్= చరణవేగంచేత; హతంబులు+ఐన= క్షతినొందిన; త్రిజగంబులకున్= మూడులోకాలకూ; ఆవలన్= అవతల; వెల్గు= దీపించునట్టి; సత్యలోకము= బ్రహ్మలోకం; చలియించినన్= కదలగా; కరుణన్= దయను; కైకొని= స్వీకరించి; కాచి= రక్షించి; ధరించు= భరించునట్టి; పాదపద్మముతుదిన్= చరణ కమలంయొక్క చివర, ఉన్న; అప్రతిహతంబు+అగు= ఎదురులేనిదైన; శక్తిన్= ప్రభావాన్ని; గణింపన్ శక్యము+ఏ= లెక్కింపసాధ్యమా? సాధ్యం కాదనుట.

**తా :** ఆ పరమాత్ముడు త్రివిక్రమావతారం దాల్చాడు. ఆయన పాదాల విసురుకు మూడు లోకాలూ తల్లడిల్లాయి. అంతే కాదు. ఆ ముల్లోకాలకు ఆవల వెలుగొందే సత్యలోకం గూడా చలించింది. అప్పుడు ఆ దేవుడు దయతో ఆ లోకాన్ని ముప్పునుండి తప్పించి రక్షించాడు. అట్టి పరమేశ్వరుని పాదాగ్రాన ఉండే శక్తి ఇట్టిదని వర్ణించడం ఎవరికీ వీలుగాదు.

**మ. హరి మాయాబల మే నెఱుంగ నఁట శక్యంబే సనందాది స**
**త్పురుషవ్రాతముకైన, బుద్ధి నితరంబున్ మాని సేవాధిక**
**స్ఫురణం దచ్చరితానురాగ గుణవిస్ఫూర్తిన్ సహస్రాస్య సుం**
**దరతం బొల్పగు శేషుఁడుం దెలియఁ డన్నన్ జెప్పనే లొండొరున్. 201**

**ప్రతి :** ఏన్= నేను; హరిమాయాబలమున్= శ్రీహరియొక్క మాయకుగల శక్తిని; ఎఱుంగనఁట= తెలియజాలనట!; సనంద+ఆది సత్పురుషవ్రాతముకైనన్= సనందుడు మున్నగు సజ్జనుల బృందానికైనా; శక్యంబు+ఏ= హరిమాయాబలం తెలుసుకోవడానికి సాధ్యమా?; బుద్ధిన్= మతిలో; ఇతరంబున్ మాని= ఇతర చింతలు వదలి; సేవాధికస్ఫురణన్=

భగవత్సేవయందేగల గొప్ప స్ఫూర్తితో; తచ్చరిత+అనురాగ గుణవిస్ఫూర్తిన్= ఆ దేవుని చరిత్రయందలి ప్రేమ అనే గుణాతిశయంచేత; సహస్ర+ఆస్యసుందరతన్= వెయ్యి ముఖాల అందచందాలతో; పొల్పు+అగు= ఒప్పునట్టి; శేషుఁడున్= అనంతుడు గూడ; తెలియఁడు+అన్నన్= ఆ మాయాశక్తి ఎరుగడనగా; ఒండొరున్+చెప్పనేల?= ఇతరుల సంగతి చెప్పడమెందుకు?

**తా :** శ్రీహరి మాయాశక్తిని నేనే తెలుసుకోలేకున్నాను. ఇక సనందుడు, సనకుడూ, సనత్కుమారుడు, సనత్సుజాతుడు మొదలైన సజ్జనులకు మాత్రం తెలుసుకోవడానికి వీలు కాగలదా? ఇతరమైన ఆలోచనలన్నీ మాని సదా బుద్ధిని భగవత్సేవయందే నిల్పినవాడు ఆదిశేషుడు వేయినోళ్ళతో ఆ పరమేశ్వరుని చరిత్రను అనురక్తుడై కీర్తిస్తూ ఉంటాడు. అట్టి శేషుడు సైతం ఆయన మాయామహిమ ఎట్టిదో తెలియజాలడు. ఇక ఇతరులను గూర్చి చెప్పడమెందుకు?

**చ. ఇతరము మాని తన్ను మది నెంతయు నమ్మి భజించువారి నా**
**శ్రితజనసేవితాంఘ్రిసరసీరుహుఁడైన సరోజనాభుఁ డం**
**చితదయతోడ నిష్కపటచిత్తమునం గరుణించు, నట్టి వా**
**రతులదురంతమై తనరు న వ్విభు మాయఁ దరింతు రెప్పుడున్. 202**

**ప్రతి :** ఆశ్రితజన సేవిత+అంఘ్రి సరసీరుహుఁడు+ఐన= ఆశ్రయించిన భక్తజనులచే సేవింపబడిన పాద పద్మాలుగల; సరోజనాభుఁడు= కమలనాభుడు; ఇతరమున్ మాని= అన్యచింతలు మాని; తన్నున్= తనను; మదిన్= చిత్తంలో; ఎంతయున్ నమ్మి= ఎంతగానో విశ్వసించి; భజించువారిన్= సేవించేవారిని; అంచిత దయతోడన్= ఒప్పారెడు కృపతో; నిష్కపటచిత్తమునన్= కపటంలేని హృదయంతో; కరుణించున్= దయజూచును; అట్టివారు= అలా హరిని భజించి వారి కృపకు పాత్రులైనవారు; అతులదురంతము+ఐ= సాటిలేనిదే కాక దాటరానిదై; తనరు= ఒప్పుచున్న; ఆ+విభుమాయన్= ఆ ప్రభుని మాయను; ఎప్పుడున్= ఎల్లవేళలా; తరింతురు= దాటిపోతారు.

**తా :** ఎవరు ఇతర చింతలుమాని సదా శ్రీహరినే దృఢంగా నమ్మి సేవిస్తారో వారిని, భక్తులు ఆశ్రయించే పాదపద్మాలు కలిగిన కమలనాభుడు మిక్కిలి దయతో కల్లాకపటం లేని చిత్తంతో అనుగ్రహిస్తాడు. అలా భగవంతుని కృపకు పాత్రులైనవారు మాత్రమే సాటిలేని, అంతంలేని, దాటరాని మాయనుండి సులభంగా తరించగలరు.

**వ. మఱియును సంసారమగ్నులయి దివసంబులు ద్రోఁచియు నంతంబున శునక సృగాలభక్షణంబులైన కాయంబు లందు మమత్వంబు సేయక భగవదర్పణంబు సేసిన పుణ్యాత్ములుం గొందఱు గల రెఱింగింతు వినుము. నేను నీ బ్రహ్మత్వంబునం జెందు రాజసంబు విడిచి య మ్మహాత్ముని పాదారవిందంబుల భక్తి నిష్ఠుండ నయి శరణాగతత్వంబున భజియించునప్పుడు దెలియుదు; రాజసగుణుండనై యున్నవేళం దెలియంజాలఁ; గావున శాస్త్రంబులు ప్రపంచింపక కేవలభక్తి జ్ఞాన యోగంబున సేవింతు; మఱియు సనకాదులగు మీరును, భగవంతుండైన రుద్రుండును, దైత్యపతియైన ప్రహ్లాదుండును, స్వాయంభువ మనువును, నతని పత్నియగు శతరూపయుఁ, దత్పుత్రులగు ప్రియవ్రతోత్తానపాదులునుం, బ్రాచీన బర్హియు, ఋభువును, వేనజనకుండగు నంగుండును, ధ్రువుండును గడవం జాలుదురు వెండియు. 203**

**ప్రతి :** మఱియునున్= ఇంకా; సంసారమగ్నులు+అయి= సంసారంలో మునిగినవారై; దివసంబులు= దినాలు; త్రోఁచియున్= గడపికూడా; అంతంబునన్= చివర; శునక సృగాల భక్షణంబులు+ఐన= కుక్కలకు, నక్కలకు ఆహారమైన; కాయంబులందున్= శరీరాలయందు; మమత్వంబున్= మమకారమును; చేయక= కల్పించుకోక; భగవత్+ అర్పణంబున్+ చేసిన= పరమేశ్వరునికి అంకితాలుగా చేసినట్టి; పుణ్య+ఆత్ములున్= పవిత్రాత్ములు గూడ; కొందఱు కలరు= కొందరున్నారు; ఎఱింగింతున్ వినుము= వారిని గురించి తెలియజేస్తాను, విను; నేనున్= నేనుగూడ; బ్రహ్మత్వంబునన్= బ్రహ్మపదవియందు; చెందు= పొందునట్టి; రాజసంబున్= రజోగుణంవల్లకలిగే అహంభావాన్ని; విడిచి= త్యజించి; ఆ+మహాత్ముని= ఆ భగవంతునియొక్క; పాదారవిందంబులన్= చరణకమలాలయందు; భక్తినిష్ఠుండన్+అయి= భక్తి స్థితి గలవాడనై; శరణ+ ఆగతత్వంబునన్= శరణాగతి భావంతో; భజియించు+అప్పుడు= సేవించు సమయంలో; తెలియుదున్= ఆ భగవత్తత్త్వాన్ని గ్రహిస్తాను; రాజసగుణుండను+ఐ= రజోగుణం కలవాడనై; ఉన్నవేళన్= ఉన్నప్పుడు; తెలియన్+చాలన్= ఎరుగలేను, కావున; శాస్త్రంబులు ప్రపంచింపక= శాస్త్రాలను విస్తరించకుండా; కేవల భక్తిజ్ఞానయోగంబునన్= భక్తియోగంతోనూ, జ్ఞానయోగంతోనూ మాత్రమే; సేవింతున్= పరమేశ్వరుణ్ణి భజిస్తాను, మఱియున్= ఇంకనూ; సనకాదులు+అగు= సనకుడు మున్నగు; మీరునున్= మీరూ; భగవంతుండు+ఐన, రుద్రుండునున్= శివుడును; దైత్యపతి+ఐన= రాక్షసాధిపుడైన, ప్రహ్లాదుండును, స్వాయంభువమనువును; అతని పత్నియగు= అతని భార్యయైన, శతరూపయున్; తద్+పుత్రులు+అగు= వారి కుమారులైన; ప్రియవ్రత+ఉత్తానపాదులునున్= ప్రియవ్రతుడూ, ఉత్తానపాదుడు అనువారును, ప్రాచీన బర్హియున్, ఋభువును; వేనజనకుండు+అగు+అంగుండునున్= వేనుని తండ్రియగు, అంగుండును; ధ్రువుండునున్= ధ్రువుడును; కడవన్+చాలుదురు= తరింపనేర్తురు; వెండియున్= మరియును.

**తా :** ఇంతేకాదు. ఇంక కొందరు పుణ్యాత్ములున్నారు. వారిని గురించి చెబుతాను, విను. వాళ్ళు సంసారంలో మునిగి తేలుతూ దినాలు గడపినా చివరలో కుక్కలూ, నక్కలూ పీక్కొనితినే ఈ శరీరాలపై మమకారం పెట్టుకోలేదు. తమ దేహాలను పూర్తిగా భగవంతునికే అర్పించారు. నేను బ్రహ్మను గదా అన్న గర్వంతో ఒక్కొక్కసారి రజోగుణం నన్ను పైకొంటుంది. ఆ సందర్భంలో నే నా మహాత్ముని తత్త్వం ఇట్టిదని గ్రహింపలేను. రజోగుణం వదలి భక్తి యుక్తుడనై ఆ దేవుని పాదపద్మాలను శరణాగతి భావంతో సేవించినప్పుడు మాత్రమే ఆ భగవానుని మహిమను తెలుసుకో గల్గుతున్నాను. అందుచేతనే శాస్త్రాలను పరిశీలిస్తూ వాటిపై ఆధారపడక భక్తిజ్ఞానయోగాలతో మాత్రమే నేనా పరమాత్మను సేవిస్తాను.

నేనే కాదు, సనకుడు, సనందనుడూ, సనత్కుమారుడూ, సనత్సుజాతుడు నీవు మొదలైన వాళ్ళూ భగవంతుడైన శివుడూ, దైత్యులను పాలించే ప్రహ్లాదుడూ, స్వాయంభువుడనే మనువూ, అతని భార్య శతరూప, వారి కుమారులైన ప్రియవ్రతుడూ, ఉత్తానపాదుడూ, ప్రాచీనబర్హి అనే రాజేంద్రుడు, ఋభువు అనే మహర్షి, వేనుని తండ్రియగు అంగుడు, ఉత్తానపాదుని కుమారుడైన ధ్రువుడూ-వీరంతా భగవంతుని మాయను దాటగల్గినవారే. మరియును.

**సీ. గాధిగయాదు లిక్ష్వాకు దిలీప మాంధాతలు భీష్మ యయాతి సగర**
**రఘు ముచుకుం దైళ రంతిదే వోద్ధవ సారస్వతోదంక భూరిషేణ**
**శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల బలి విభీషణ శిబి పార్థ విదుర**
**లంబరీష పరాశ రాలర్క దేవల సౌభరి మిథిలేశ్వరాభిమన్యు**

**తే. లార్ష్టిషేణాదులైన మహాత్ము లెలమిఁ, దవిలి య ద్దేవు భక్తిఁ జిత్తముల నిల్పి**
**తత్పరాయణులౌట దుర్దాంతమైన, విష్ణుమాయఁ దరింతురు విమలమతులు. 204**

**ప్రతి :** గాధిగయ+ఆదులు= గాధి, గయుడు మున్నగువారు; ఇక్ష్వాకు దిలీపమాంధాతలు= ఇక్ష్వాకువు, దిలీపుడూ, మాంధాత అనువారు, భీష్మ....విదురులు= భీష్ముడు, యయాతి, సగరచక్రవర్తి, రఘుమహారాజు, ముచుకుందుడు, ఐలుడు, రంతిదేవుడు, ఉద్ధవుడు, సారస్వతుడు, ఉదంకుడు, భూరిషేణుడు, శ్రుతదేవుడు, హనుమంతుడు, శతధన్వుడు, పిప్పలుడు, బలి, విభీషణుడు, శిబి, అర్జునుడు, విదురుడు–అనువారు అంబరీష.....మన్యులు= అంబరీషుడు, పరాశరముని, అలర్కమహారాజు, దేవలుడు, సౌభరి, మిథిలాధిపతియగు జనకుడు, అభిమన్యుడు–అనువారు; ఆర్ష్టిషేణ+ఆదులు+ఐన= ఆర్ష్టిషేణుడు మొదలగు; మహాత్ములు= మహానుభావులు; ఎలమిన్= ప్రీతితో; తవిలి= ఆసక్తిగలిగి; ఆ+దేవున్= ఆ దేవుణ్ణి; భక్తిన్= భక్తితో; చిత్తములన్= మనస్సులయందు; నిల్పి= ప్రతిష్ఠించి; తద్+పరాయణులు+ఔటన్= ఆ దేవునియందే ఏకాగ్రత గల్గియున్నవారు కావడంవల్ల; విమలమతులు= నిర్మలచిత్తులై; దుర్దాంతము+ఐన= దాటవీలుగాని; విష్ణుమాయన్= విష్ణుదేవుని మాయను; తరింతురు= దాటుదురు.

**తా :** గాధి, గయుడు మున్నగువారు, ఇక్ష్వాకువూ, దిలీపుడు, మాంధాత, భీష్ముడు, యయాతి, సగరుడు, రఘుమహారాజు, ముచుకుందుడు, ఐలుడు, రంతిదేవుడు, ఉద్ధవుడు, సారస్వతుడు, ఉదంకుడు, భూరిషేణుడు, శ్రుతదేవుడు, హనుమంతుడు, శతధన్వుడు, పిప్పలుడు, బలిచక్రవర్తి, విభీషణుడు, శిబిచక్రవర్తి, అర్జునుడు, విదురుడు, అంబరీషుడు, పరాశరమహర్షి, అలర్కమహారాజు, దేవలుడు, సౌభరి, జనకుడు, అభిమన్యుడు, ఆర్ష్టిషేణుడు మున్నగు నిర్మల చిత్తులైన మహనీయులందరూ అనురక్తులై భక్తితో ఆ భగవానుని తమ మనస్సుల్లో నిలిపారు. ఆయనే గతి అని సేవించారు. అందుచేతనే దాట శక్యంగాని విష్ణుమాయను తరించ గలిగారు.

**మ. అనఘా! వీరల నెన్న నేమిటికిఁ, దిర్యగ్జంతుసంతాన ప**
**క్షినిశాటాటవికాఘజీవ నివహ స్త్రీ శూద్రహూణాదు లై**
**నను నారాయణభక్తియోగమహితానందాత్ము లై రేని వా**
**రనయంబుం దరియింతు ర వ్విభుని మాయావైభవాంభోనిధిన్. 205**

**ప్రతి :** అనఘా!= పాపరహితుడా!; వీరలన్= ఈ చెప్పిన వారిని; ఎన్నన్+ఏమిటికిన్= లెక్కించడమెందుకు?; తిర్యక్....హూణాదులు= తిర్యక్+జంతుసంతాన= పశువులు మున్నగు ప్రాణిసమూహం; పక్షి= పక్షులు; నిశాట= రాక్షసులు; ఆటవిక= అడవిలో బ్రదుకువారు; అఘజీవ నివహ= పాపజీవుల సమూహం; స్త్రీ= స్త్రీలు; శూద్ర= శూద్రులు; హూణ+ఆదులు+ఐనను= హూణులు మున్నగువారైనా; నారాయణ= శ్రీహరియొక్క; భక్తియోగ= భక్తియోగంచేత; మహిత+ఆనంద+ఆత్ములు+ఐరి+ఏనిన్= ముఖ్యమైన ఆనందస్వభావం గలవారైతే; వారు= అలాంటివారు; అనయంబున్= ఎల్లవేళలా; ఆ+విభుని= ఆ పరమాత్మునియొక్క; మాయావైభవ+అంభోనిధిన్= మాయావైభవమనే సముద్రాన్ని; తరియింతురు= దాటుతారు.

**తా :** పాపరహితుడైన నారదా! సహజంగా పవిత్రాత్ములైన పై జెప్పినవారిని గూర్చి పేర్కొనబనిలేదు. పశువులైనా, పక్షులైనా, రాక్షసులైనా, అడవిలో బ్రదుకువారైనా, పాపజీవనులైనా, స్త్రీలైనా, శూద్రులైనా, హూణులు మున్నగువారైనా–

ఎవరైనా సరే– ఆ శ్రీమన్నారాయణుని మీది భక్తియోగంతో అఖండమైన ఆత్మానందం పొందినవారైతే చాలు, తప్పక ఆ దేవుని మాయావైభవమనే సాగరాన్ని సులభంగా దాటుతారు.

**వ. కావున. 206**

**ప్రతి :** కావునన్= అందువల్ల

**తా :** కనుక

**క. శశ్వత్ప్రశాంతు నభయుని, విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్**
**శాశ్వతు సము సదసత్పరు, నీశ్వరుఁ జిత్తమున నిలుపు మెపుడు మునీంద్రా! 207**

**ప్రతి :** ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా!; శశ్వత్+ప్రశాంతున్= ఎల్లప్పుడు ప్రశాంతుడైనవానిని; అభయునిన్= భయంలేని వానిని; విశ్వ+ఆత్మున్= ప్రపంచస్వరూపుని; ప్రబోధమాత్రున్= జ్ఞానైకస్వరూపుని; విభున్= ప్రభువైనవానిని, సర్వవ్యాపకుని; సంశుద్ధున్= పరిశుద్ధుడైనవానిని; శాశ్వతున్= నిత్యుడైనవానిని; సమున్= సర్వత్రా సమభావం కలవానిని; సదసత్పరున్= సత్తుకు అసత్తుకు అతీతుడైన వాడైన; ఈశ్వరున్= పరమేశ్వరుని; ఎపుడు= ఎల్లవేళలా; చిత్తమునన్ నిలుపుము= హృదయంలో ప్రతిష్ఠించుకో.

**తా :** అందుచేత మునీంద్రా! ఎల్లవేళలా ప్రశాంతుడైనవాడు, భయరహితుడు, విశ్వమయుడు, కేవలజ్ఞానస్వరూపుడు, సర్వేశ్వరుడు, శుద్ధాత్ముడు, శాశ్వతుడు, సముడు, సత్తు, అసత్తులకు అతీతుడు, అయిన పరమేశ్వరుణ్ణి సదా నీ చిత్తంలో ప్రతిష్ఠించుకో.

**వ. అట్లయిన న పుణ్యాత్ముల ననవద్యశీలుర నవిద్య లజ్జావనత వదనయై పొందం జాలక వైముఖ్యంబున దవ్వు దవ్వులం దలంగి పోవు. మఱియును. 208**

**ప్రతి :** అట్లు+అయినన్= అలా భగవంతుని చిత్తంలో నిల్పుకొంటే; ఆ+పుణ్య+ఆత్ములన్= ఆ పవిత్రాత్ములైనవారిని; అనవద్యశీలురన్= దోషరహితమైన స్వభావంగలవారిని; అవిద్య= అజ్ఞానం అనే వనిత; లజ్జా+అవనతవదనయై= సిగ్గుతో తలవంచుకొన్నదై; పొందన్+చాలక= చేరజాలక; వైముఖ్యంబునన్= పెడమొగం పెట్టుకొని; దవ్వు దవ్వులన్= దూరదూరాననే; తలంగిపోవున్= తొలగిపోతుంది; మఱియునున్= ఇంకా.

**తా :** ఎవరు పరమాత్మను చిత్తంలో ప్రతిష్ఠించుకొంటారో, అట్టి సచ్చరిత్రులూ, పుణ్యాత్ములూ, అయిన మహనీయుల చెంతకు పోలేక అవిద్య సిగ్గుతో తలవంచుకొని పెడమొగమై దూరదూరాలకు తొలగిపోతుంది. ఇంతే కాదు.

**చ. హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములం దలంచి సు**
**స్థిరత విశోక సౌఖ్యములఁ జెందిన ధీనిధు లన్యకృత్యము**
**ల్మఱచియుఁ జేయనొల్లరు, తలంచిన నట్టిదయౌ, సురేంద్రుఁడుం**
**బరువడి నుయ్యి ద్రవ్వునె పిపాసితుఁడై సలిలాభిలాషితన్? 209**

**ప్రతి :** హరిన్= శ్రీహరిని; పరమాత్మున్= పరమేశ్వరుని; అచ్యుతున్= చ్యుతిలేని దేవుని; అనంతునిన్= అంతంలేని భగవంతుడగు శ్రీమన్నారాయణుని; చిత్తములన్= మనస్సులలో; తలంచి= భావించి; సుస్థిరతన్= దృఢంగా; విశోక సౌఖ్యములన్= శోకంలేని సుఖాలను; చెందిన= పొందిన; ధీనిధులు= బుద్ధిమంతులు; అన్యకృత్యముల్= భగవత్పరంకాని ఇతరకార్యాలు; మఱచియున్= విస్మరించి కూడా; చేయన్+ఒల్లరు= చేయడానికి సమ్మతించరు; తలంచినన్= ఆలోచించగా; అట్టిద+ఔన్= అది అంతే; సురేంద్రుఁడున్= దేవేంద్రుడు కూడా; పిపాసితుఁడు+ఐ= దప్పిగొన్నవాడై; సలిల+అభిలాషితన్= నీళ్లు కావాలన్న కోరికతో; పరువడిన్= మరల; నుయ్యి+త్రవ్వును+ఎ?= బావి త్రవ్వుతాడా?

**తా :** పరమాత్ముడూ, చ్యుతిలేనివాడు, తుదిలేనివాడు, అయిన శ్రీహరిని మనస్సులో స్థిరంగా భావించినవాళ్ళు శోకంలేని సుఖస్థితిని పొందుతారు. అట్టి బుద్ధిమంతులు భగవంతుని స్మరణ తప్ప ఇతరకార్యాలు ఏమరుపాటున గూడా చేయరు. ఆలోచించి చూస్తే, అది అంతే. వర్షం కురిపించే ఇంద్రుడు దప్పిగొని నీళ్ళకై బావి త్రవ్వుతాడా?

**ఉ. సర్వఫలప్రదాతయును, సర్వశరణ్యుఁడు, సర్వశక్తుఁడున్**
**సర్వజగత్ప్రసిద్ధుఁడును, సర్వగతుండగు చక్రపాణి యీ**
**సర్వశరీరులున్ విగమసంగతిఁ జెంది విశీర్యమాణులై**
**పర్వినచో నభంబుగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్. 210**

**ప్రతి :** సర్వఫలప్రదాతయునున్= అందరికీ (అన్ని) ఫలాలిచ్చేవాడున్నూ; సర్వశరణ్యుఁడు= అందరికీ రక్షకుడూ; సర్వ శక్తుఁడున్= సకల శక్తులు గల్గినవాడు; సర్వజగత్ప్రసిద్ధుఁడునున్= అన్ని లోకాల్లో ప్రసిద్ధికెక్కినవాడూ; సర్వగతుండు+అగు= సర్వత్రా ఉన్నవాడు అయిన; చక్రపాణి= సుదర్శనచక్రం చేతబట్టినవాడూ; బ్రహ్మము= పరబ్రహ్మస్వరూపుడూ అయిన ఆ దేవుడు; ఈ సర్వశరీరులున్= ఈ సకల దేహధారులూ; విగమసంగతిన్+చెంది= వినాశస్థితినిపొంది; విశీర్యమాణులు+ఐ= శిథిలమగువారై; పర్వినచోన్= పారిపోయిన చోటగూడా; నభంబుగతిన్= ఆకాశంలాగా; తాన్= తాను; ఎప్పుడున్= ఎల్లవేళలా; చెడక+ఉండున్= నశించకుండా ఉంటాడు.

**తా :** ఆ దేవుడు అందరికీ అన్ని ఫలాలూ ప్రసాదించేవాడు. అందరికీ శరణు పొందదగినవాడు. అన్ని శక్తులూ కలవాడు. లోకాలన్నిటా ప్రసిద్ధుడు. అంతటా వ్యాపించినవాడు, సుదర్శనమనే చక్రాయుధం ధరించిన పరబ్రహ్మస్వరూపుడగు ఆ దేవుడు తక్కిన ఈ సమస్త ప్రాణులూ చిక్కి సుక్కి శిథిలమై అంతరించిపోయిన కల్పాంతరంలో కూడా ఆకాశం లాగా తానొక్కడు మాత్రం చెక్కు చెదరకుండా నిర్వికారుడై నిలిచి ఉంటాడు.

**ఉ. కారణకార్యహేతు వగు కంజదళాక్షునికంటె నన్యు లె**
**వ్వారును లేరు; తండ్రి! భగవంతు ననంతుని విశ్వభావనో**
**దారుని సద్గుణావళు లుదాత్తమతిం గొనియాడకుండినం**
**జేరవు చిత్తముల్ ప్రకృతిఁజెందని నిర్గుణమైన బ్రహ్మమున్. 211**

**ప్రతి :** తండ్రి!= నాయనా నారదా!; కారణకార్య హేతువు+అగు= కారణాలకూ, వాటివల్ల జరిగే కార్యాలకూ ముఖ్యకారణమైన; కంజదళ+అక్షుని కంటెన్= పంకజాక్షునికంటె; అన్యులు+ఎవ్వారునున్= ఇతరు లెవ్వరునూ; లేరు, భగవంతునిన్=

షడ్గుణైశ్వర్యసంపన్నుని; అనంతునిన్= తుదిలేనివాడు నగు; విశ్వభావనా+ఉదారుని= ప్రపంచ సృష్టికర్తయగు ఉదారునియొక్క; సద్గుణ+ఆవళులు= ఉత్తమగుణ బృందాన్ని; ఉదాత్తమతిన్= ఉత్తమచిత్తంతో; కొనియాడక+ఉండినన్= స్తుతించకుంటే; చిత్తముల్= మనస్సులు; ప్రకృతిన్+చెందని= ప్రకృతి దోషమంటని; నిర్గుణము+ఐన= గుణరహితమైన; బ్రహ్మమున్= పరబ్రహ్మన్ని; చేరవు= చెందవు.

**తా :** తండ్రీ! అటు కారణాలకూ, ఇటు కార్యాలకూ అన్నింటికీ కారణభూతుడైనవాడు ఆ పద్మనేత్రుడే. ఆయనకంటే ఇతరు లెవరూ ఆశ్రయింప దగినవారు లేరు. షడ్గుణైశ్వర్య సంపన్నుడూ, అంతంలేనివాడూ, ప్రపంచ సృష్టికర్తా అయిన ఆ పరమేశ్వరుని సద్గుణ పుంజాలను ఉదాత్తమైన చిత్తంతో స్తుతించాలి. అలా చేయకుంటే ప్రకృతి కతీతమైన నిర్గుణ బ్రహ్మాన్ని మనస్సులు పొందజాలవు.

**మ. నిగమార్థప్రతిపాదకప్రకటమై, నిర్వాణసంధాయిగా**
**భగవంతుండు రచింప భాగవతకల్పక్ష్మాజమై శాస్త్రరా**
**జి గరిష్ఠంబగు నీ పురాణకథ సంక్షేపంబునం జెప్పితిన్;**
**జగతిన్ నీవు రచింపు దీని నతివిస్తారంబుగాఁ బుత్రకా! 212**

**ప్రతి :** పుత్రకా!= వత్సా!; నిగమ+అర్థ ప్రతిపాదకప్రకటము+ఐ= వేదార్థాలను ప్రతిపాదించే దగుటచేత ప్రశస్తమై; నిర్వాణ సంధాయిగాన్= మోక్షాన్ని కూర్చేదిగా; భగవంతుండు= పరమాత్మ; రచింపన్= నిర్మించగా; భాగవత కల్పక్ష్మాజమై= భాగవతమనే కల్పవృక్షమై; శాస్త్రరాజిన్= శాస్త్రసముదాయంలో; గరిష్ఠంబు+అగు= అతిశ్రేష్ఠమైన; ఈ పురాణకథన్= ఈ పురాణ వృత్తాంతాన్ని; సంక్షేపంబునన్+చెప్పితిన్= నేను సంగ్రహంగా చెప్పాను; నీవు; జగతిన్= లోకంలో; దీనిన్, అతివిస్తారంబుగాన్= మిక్కిలి విస్తృతంగా; రచింపు= నిర్మించు.

**తా :** వత్సా! ఈ పురాణకథ వేదార్థాలను ప్రతిపాదించడం వల్ల ప్రశస్తమైనది. మోక్షప్రదంగా ఉండేటట్లు భగవంతుడు దీన్ని రచించాడు. ఇది భగవద్భక్తుల పాలిటి కల్పవృక్షం. శాస్త్రాలన్నింటిలోనూ శ్రేష్ఠమైనది. ఈ పురాణకథను నేను నీకు సంగ్రహంగా వివరించాను. నీవు దీన్ని లోకంలో విస్తృతంగా ప్రచారం కావించు.

**విశే :** భాగవతం భగవంతుడు రచించాడని ప్రకటించడంవలన వేదమే అని చెప్పినట్లయింది

**చ. పురుషభవంబు నొందుట యపూర్వము జన్మములందు; నందు భూ**
**సురకులమందుఁ బుట్టు టతిచోద్యము; నిట్లగుటన్ మనుష్య ల**
**స్థిరమగు కార్యదుర్దశలచేత నశింపక విష్ణుసేవనా**
**పరతఁ దనర్చి నిత్యమగు భవ్యపథంబును బొందు టొప్పదే? 213**

**ప్రతి :** జన్మములందున్= జన్మలలో; పురుషభవంబున్= మగపుట్టుక; ఒందుట= పొందుట; అపూర్వము= అరుదైనది; అందున్= ఆ పురుషజన్మంలో గూడ; భూసురకులమందున్= విప్రకులమందు; పుట్టుట= సంభవించుట; అతిచోద్యము= మిక్కిలి ఆశ్చర్యం; ఇట్లు+అగుటన్= ఇలా కావడంచేత; మనుష్యులు= మానవులు; అస్థిరము+అగు= చంచలమైన; కార్యదుర్దశలచేతన్= కార్యదుఃస్థితులచేత; నశింపక= చెడిపోక; విష్ణుసేవనా పరతన్= భగవంతుణ్ణి సేవించుటయందాసక్తిచేత;

తనర్చి= విలసిల్లి; నిత్యము+అగు= శాశ్వతమైన; భవ్యపథంబునున్= శ్రేయోమార్గాన్ని; పొందుట= చేరుట; ఒప్పదు+ఏ= తగదా?

**తా :** జన్మలలో పురుషజన్మ చాలా అపురూపం. అందులోనూ విప్రకులంలో జన్మించడం మరీ అరుదు. అందుచేత మనుజులు అనిత్యమైన నిష్ప్రయోజన కార్యాలలో బడి దురవస్థలపాలు కాకుండా శ్రీహరిని సేవించి నిత్యమైన పరమపదం పొందడం ఉచితం కదా!

**మ. ఉపవాసవ్రత శౌచ శీల మఖ సంధ్యోపాస నాగ్నిక్రియా**
**జప దానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర; ద**
**చ్ఛపుభక్తిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా**
**ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వలేకుండినన్. 214**

**ప్రతి :** అచ్ఛపుభక్తిన్= స్వచ్ఛమైన భక్తితో; హరిన్= శ్రీహరిని; పుండరీకనయనున్= పద్మాలవంటి నేత్రాలు కలవానిని; సర్వ+అతిశాయిన్= అన్నింటినీ మించిన వానిని; రమా+అధిపున్= లక్ష్మీరమణుని; పాపఘ్నున్= పాపాలను నశింపజేయువానిని; పర+ఈశున్= పరమేశ్వరుణ్ణి; అచ్యుతునిన్= విష్ణుని; అర్థిన్= కోరికతో; కొల్వలేకుండినన్= అర్చించని పక్షంలో; ఉపవాస....కర్మములన్= ఉపవాస= నిరాహారం; వ్రత= వ్రతాచరణ; శౌచ= నిర్మలత; శీల= సచ్చరిత్రం; మఖ= యజ్ఞాలు; సంధ్యా+ఉపాసన= సంధ్యావందనం; అగ్నిక్రియా= అగ్నికార్యాలైన హోమాదులూ; జప= జపాలు; దాన= దానాలు; అధ్యయన+ఆదికర్మములన్= వేదాధ్యయనం మున్నగు కర్మలచేత; మోక్షప్రాప్తి= ముక్తియొక్క లబ్ధి; చేకూరదు= లభించదు.

**తా :** పద్మాక్షుడూ, అన్నిటినీ మించినవాడూ, లక్ష్మీకాంతుడూ, పాపనాశకుడూ, పరమేశ్వరుడూ, చ్యుతి లేనివాడూ అయిన శ్రీహరిని నిర్మలమైన భక్తితో ఆసక్తితో భజించాలి. అట్లు చేయకుండా ఉపవాసాలు, వ్రతాలు, శౌచాలు,శీలాలు, యాగాలు, సంధ్యోపాసనలూ, అగ్ని కార్యాలు, జపాలు, దానాలు, వేదాధ్యయనాలు– మున్నగు పనులెన్ని చేసినా మోక్షం లభించదు.

**క. వనజాక్షు మహిమ నిత్యము, వినుతించుచు, నొరులు వొగడ వినుచున్, మదిలో**
**ననుమోదించుచు నుండెడు, జనములు దన్మోహవశతఁ జనరు మునీంద్రా! 215**

**ప్రతి :** మునీంద్రా!= మునిశ్రేష్ఠా!; నిత్యమున్= ప్రతిదినం; వనజాక్షుమహిమన్= పద్మలోచనుడైన మాధవుని ప్రభావాన్ని; వినుతించుచున్= స్తుతిస్తూ; ఒరులు= ఇతరులు; పొగడన్= స్తుతించగా; వినుచున్= వింటూ; మదిలోన్= చిత్తంలో; అనుమోదించుచున్+ఉండెడు= సంతసిస్తూ ఉండే; జనములు= ప్రజలు; తద్+మోహవశతన్+చనరు= ఆ దేవుని మాయకు లోను గారు.

**తా :** మునివర్యా! పద్మనేత్రుని మహిమను ఎల్లవేళలా స్తుతించాలి. ఇతరులు స్తుతిస్తూ ఉంటే వినాలి. మనస్సులో ఆ మహిమను మననం చేస్తూ సంతసించాలి. అలా చేసేవాళ్ళు ఆ దేవుని మాయకు లొంగరు.

**క. అని వాణీశుఁడు నారద, మునివరునకుఁ జెప్పినట్టి ముఖ్యకథా సూ**
**చన మతిభక్తిఁ బరీక్షి, జ్జనపాలునితోడ యోగిచంద్రుఁడు నుడివెన్. 216**

**ప్రతి :** అని= ఆ రీతిగా; వాణీ+ఈశుఁడు= సరస్వతీనాథుడైన బ్రహ్మ; నారదముని వరునకున్= నారదమునీంద్రునకు; చెప్పిన+అట్టి= వివరించినట్టి; ముఖ్యకథాసూచనము= ప్రముఖమైన వృత్తాంత నిర్దేశాన్ని; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; పరీక్షిత్+జనపాలునితోడన్= పరీక్షిన్మహారాజుతో; యోగిచంద్రుఁడు= యోగివర్యుడగు శుకుడు; నుడివెన్= చెప్పాడు.

**తా :** ఇలా పూర్వం బ్రహ్మదేవుడు మునివర్యుడైన నారదునికి ముఖ్యకథను వివరించాడు. ఆ వృత్తాంతాన్ని యోగివర్యుడైన శుకుడు మిక్కిలి భక్తితో పరీక్షిన్మహారాజుకు నివేదించాడు.

## ❖ పరీక్షితుఁడు శుకునిఁ బ్రపంచోద్భవాదికంబు నడుగుట ❖

**సీ. విను శుకయోగికి మనుజేశుఁ డిట్లను మునినాథ! దేవదర్శనము గలుగ**
**నారదమునికిఁ బంకేరుహభవుఁ డెఱింగించిన తెఱఁగు సత్కృప దలిర్ప**
**గణుతింప సత్త్వాదిగుణశూన్యుఁడగు హరి కమలాక్షు లోకమంగళములైన**
**కథలు నా కెఱిఁగింపు కైకొని నిస్సంగ మైన నా హృదయాబ్జమందుఁ గృష్ణు**

**తే. భవ్యచరితుని నాద్యంతభావశూన్యుఁ, జిన్మయాకారు ననఘు లక్ష్మీసమేతు**
**నిలిపి, యస్థిరవిభవంబు నిఖిల హేయ, భాజనంబైన యీ కళేబరము విడుతు. 217**

**ప్రతి :** విను, శుకయోగికి, మనుజ+ఈశుఁడు= పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు; మునినాథ!= మునీంద్రా!; దేవ దర్శనము= భగవద్దర్శనం; కలుగన్= కలుగునట్లుగా; నారదమునికిన్= నారదమహర్షికి; పంకేరుహభవుఁడు= బ్రహ్మ; ఎఱింగించిన= తెలియజెప్పిన; తెఱఁగున్= విధానాన్ని; సత్కృప= దివ్యమైన దయ; తలిర్పన్= ప్రకాశించగా; గణుతింపన్= పరిశీలించగా; సత్త్వ+ఆదిగుణశూన్యుఁడు+అగు= సత్త్వం, రజస్సు, తమస్సు, అనే గుణాలు లేనివాడగు; హరి= విష్ణువు; కమల+అక్షు= పద్మలోచనునియొక్క; లోకమంగళములు+ఐన= భువనశుభకరమైన; కథలు= చరిత్రలు; కైకొని= అంగీకరించి; నాకు+ఎఱిఁగింపు= నాకు తెలియజేయి; నిస్సంగము+ఐన= తగులంలేని; నా హృదయ+అబ్జము+అందున్= నా చిత్తపద్మంలో; భవ్యచరితునిన్= మంగళకరమైన చరిత్రం కలవానిని; ఆది+ అంతభావశూన్యున్= మొదలు తుదిలేనివానిని; చిన్మయ+ఆకారున్= జ్ఞానస్వరూపుని; అనఘున్= పాపవిదూరుని; లక్ష్మీసమేతున్= లక్ష్మీరమణుని; నిలిపి= నెలకొల్పి; అస్థిరవిభవంబు= అశాశ్వతమైన వైభవంగలది; నిఖిల హేయ భాజనంబు= సమస్తమైన వదలి వేయవలసిన విషయాలకూ పాత్రమైన; ఈ కళేబరము= ఈ శరీరాన్ని; విడుతున్= విడిచివేస్తాను.

**తా :** అప్పుడు శుకయోగి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు– “మునీంద్రా! బ్రహ్మదేవుడు నారదమునికి భగవద్దర్శనం కలగడానికి చెప్పిన ఉపాయం దయతో నాకూ చెప్పండి. సత్త్వరజస్తమోగుణాలకు అతీతుడూ, పద్మనేత్రుడూ అయిన శ్రీహరి కథలు లోకానికి మంగళం కలిగిస్తాయి. అవి నాకు తెలియజేయండి! మీరు చెప్పినది విని సంగరహితమైన నాహృదయంలో శుభచరిత్రుడూ, తుదిమొదళ్ళు లేనివాడూ, చిన్మయ స్వరూపుడూ, పాపరహితుడూ, లక్ష్మీసమేతుడూ అయిన కృష్ణుణ్ణి నిలుపుకొంటాను. చంచలం, త్యజింపదగిన పదార్థాలకు నెలవూ అయిన ఈ శరీరాన్ని పరిత్యజిస్తాను.

**వ. అదియునుంగాక యెవ్వండేని శ్రద్ధా భక్తి యుక్తుండై కృష్ణగుణకీర్తనంబులు వినుచుం బలుకుచు నుండు నట్టివాని హృదయపద్మంబునందుఁ గర్ణ రంధ్రమార్గంబులం బ్రవేశించి కృష్ణుండు విశ్రమించి**

**సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు చందంబున నాత్మగతంబైన మాలిన్యంబు నపకర్షించుఁ గావున. 218**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక; ఎవ్వండు+ఏనిన్= ఎవడైనా; శ్రద్ధా భక్తి యుక్తుండు+ఐ= శ్రద్ధతోనూ; భక్తితోనూ కూడినవాడై; కృష్ణ గుణకీర్తనంబులు= శ్రీకృష్ణుని గుణప్రశంసలు; వినుచున్= ఆలిస్తూ; పలుకుచున్= కీర్తిస్తూ; ఉండున్= ఉంటాడో; అట్టివాని= అట్టి భక్తునియొక్క; హృదయపద్మంబునందున్= చిత్తకమలంలో; కర్ణరంధ్ర మార్గంబులన్= చెవిసందు త్రోవలో; ప్రవేశించి= దూరి; కృష్ణుండు విశ్రమించి= విశ్రాంతి తీసుకొని; సలిలగతంబు+ఐన= జలంలోవున్న; కలుషంబునున్= మాలిన్యాన్ని; శరత్+కాలంబు= శరదృతువు; నివారించు చందంబునన్= తొలగించే విధంగా; ఆత్మగతంబు+ఐన= చిత్తంలోనున్న; మాలిన్యంబున్= దోషాన్ని; అపకర్షించున్+కావునన్= దూరంగా లాగివేస్తాడు కాబట్టి...

**తా :** అంతేకాక ఎవడు శ్రద్ధా భక్తులు కలిగి కృష్ణుని గుణగణాలను ఇతరులు కీర్తిస్తుంటే వింటాడో, తాను గూడా స్వయంగా కీర్తిస్తాడో, అట్టి భక్తుని హృదయకమలంలోనికి శ్రవణరంధ్రాలద్వారా కృష్ణుడు ప్రవేశిస్తాడు, అక్కడ విశ్రమిస్తాడు. నీటిలోని మురికిని శరదృతువు తొలగించినట్లు మనస్సులోని మాలిన్యాన్ని తొలగిస్తాడు. అందుచేత–

**మ. భరితోదగ్రనిదాఘతప్తుఁడగు నప్పాంథుం డరణ్యాది సం**
**చరణక్లేశసముద్భవం బగు పిపాసంజెంది యాత్మీయ మం**
**దిరముంజేరి గతశ్రముం డగుచు నెందేనిం జనంబోని భం**
**గి రమాధీశుపదారవిందయుగసంగీభూతుఁడై మానునే? 219**

**ప్రతి :** భరిత+ఉదగ్రనిదాఘతప్తుఁడు+అగు= మిక్కిలిభీకరమైన మండుటెండచే పరితపింపజేయబడిన వాడైన; ఆ+పాంథుండు= ఆ బాటసారి; అరణ్య+ఆది సంచరణక్లేశసముద్భవంబు+అగు= అడవులు మున్నగు ప్రదేశాలలో తిరుగుటచే గల్గిన శ్రమచే సంభవించిన; పిపాసన్+చెంది= దప్పికపొంది; ఆత్మీయ మందిరమున్+చేరి= తన గృహం చేరుకొని; గతశ్రముండు+ అగుచున్= తొలగిన శ్రమగలవాడవుతూ; ఎందు+ఏనిన్+చనన్+పోని= ఎక్కడికీ పోవనొల్లని; భంగిన్= రీతిలో; రమా+ అధీశు= లక్ష్మీరమణుని; పద+అరవిందయుగ= పాదపద్మద్వంద్వంతో; సంగీభూతుఁడు+ఐ= కలయిక పొందినవాడై; మానున్+ఏ?= ఆ సంగం వదలుకొంటాడా?

**తా :** అడవుల్లో సంచరిస్తూ వేసవికాలంలోని మండుటెండల తాపానికి పరితప్తుడైన బాటసారి బడలి దప్పిక జెంది చివరికి తన ఇల్లు చేరుకొంటాడు. అక్కడ హాయిగా అలసట తీర్చుకొంటాడు. అక్కడనుండి మళ్ళీ ఎక్కడికీ కదలడు. అట్లే రమాకాంతుని చరణకమలయుగళంతో సంబంధం కలిగి ఆ ఆనందం చవి చూచినవాడు మళ్ళీ దాన్ని వదలడు.

**వ. అదియునుంగాక సకలభూత సంసర్గశూన్యంబైన యాత్మకు భూతసంసర్గం బేప్రకారంబునం గలిగె? నది నిర్నిమిత్తత్వంబునం జేసియో కర్మంబునం జేసియో యా క్రమంబు నా కెఱింగింపుము. 220**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక; సకలభూత సంసర్గశూన్యంబు+ఐన= సమస్తాలైన భూతాలతోనూ కలయికలేని; ఆత్మకున్= జీవునికి; భూతసంసర్గంబు= భూతాలతోడి కలయిక; ఏ ప్రకారంబునన్+కలిగెన్= ఎలా సంభవించింది?; అది, నిర్నిమిత్తత్వంబునన్+చేసియో= నిష్కారణంగానా?; కర్మంబునన్+చేసియో= కర్మవశాననా?; ఆ క్రమంబు= ఆ పద్ధతి; నాకున్+ఎఱింగింపుము= నాకు తెలియజేయి.

**తా :** అంతేకాదు. సమస్త భూతాల తోటి కలయిక లేని ఆత్మకు భూతాలతో సాంగత్యం ఎలా కల్గింది? అది అకారణంగా కలిగిందా? లేక కర్మవల్ల సంభవించిందా? ఈ వైనం నాకు వివరించు-

**సీ.** **ఎవ్వని నాభియం దెల్ల లోకాంగ సంస్థానకారణపంకజంబు వొడమె,**
**నందుదయించి సర్వావయవస్ఫూర్తిఁ దనరారునట్టి పితామహుండు**
**గడఁగి యెవ్వని యనుగ్రహమున నిఖిల భూతముల సృజించె నుత్కంఠతోడ**
**నట్టి విధాత యే యనువున సర్వేశు రూపంబు గనుఁగొనె రుచిరభంగి?**

**తే.** **నా పరంజ్యోతియైన పద్మాక్షునకును, నలినజునకుఁ బ్రతీకవిన్యాసభావ**
**గతులవలనను భేదంబు గలదె? చెపుమ, యతిదయాసాంద్ర! యోగికులాబ్ధిచంద్ర! 221**

**ప్రతి :** అతిదయాసాంద్ర!= మిక్కిలిదయగలవాడా!; యోగికుల+అబ్ధిచంద్ర= యోగివంశమనే సాగరానికి చంద్రుడవైనవాడా!; ఎవ్వని నాభియందున్= ఎవని బొడ్డునందు; ఎల్ల లోక+అంగసంస్థానకారణ పంకజంబు= సమస్తలోకావయవాల సంస్థితికి హేతువైన పద్మం; పొడమెన్= ఉదయించెనో; అందున్+ఉదయించి= ఆ పద్మంలో పుట్టి; సర్వ+అవయవస్ఫూర్తిన్= సకలాంగాల ప్రకాశంతో; తనరారునట్టి= అలరారునటువంటి; పితామహుండు= బ్రహ్మదేవుడు; కడఁగి= పూని; ఎవ్వని అనుగ్రహమునన్= ఎవని కృపతో; ఉత్కంఠతోడన్= ఔత్సుక్యంతో; నిఖిలభూతములన్= సకలప్రాణులనూ; సృజించెన్= సృష్టించెనో; అట్టి, విధాత= బ్రహ్మ; ఏ+అనువునన్= ఏ విధంగా; సర్వ+ఈశురూపంబు= పరమాత్ముని రూపాన్ని; రుచిరభంగిన్= మనోహరమైన పద్ధతిలో; కనుఁగొనెన్= చూచెనో; ఆ పరంజ్యోతి+ఐన= అట్టి పరమోత్కృష్ట జ్యోతిస్స్వరూపుడైన; పద్మ+అక్షునకునున్= పద్మనేత్రుడైన విష్ణుమూర్తికిని; నలినజునకున్= పద్మసంభవుడైన బ్రహ్మకున్ను; ప్రతీకవిన్యాస= అవయవ విన్యాసంలోనూ; భావగతులవలననున్= భావగమనంలోనూ; భేదంబు= తేడా; కలదె= ఉన్నదా?; చెపుము+అ= చెప్పుము.

**తా :** ఓ పరమ దయామయా! యోగవంశాబ్ధిచంద్రా! ఎవని నాభిలో సమస్తలోకాల ఉనికికి హేతువగు పద్మం పుట్టిందో, ఆ పద్మంలో పుట్టి సర్వాంగసుందరంగా ప్రకాశించే బ్రహ్మదేవుడు ఎవని అనుగ్రహం వల్ల ఔత్సుక్యంతో సకలప్రాణులనూ సృష్టించాడో, అట్టి బ్రహ్మ ఏ రీతిగా సర్వేశ్వరుని రూపాన్ని సాక్షాత్కరింపజేసికొన్నాడో, అట్టి పరంజ్యోతి స్వరూపుడైన పద్మాక్షునికీ, బ్రహ్మకూ అవయవ విన్యాసంలోనూ, భావగమనంలోనూ వ్యత్యాసం ఉన్నదా? ఉంటే వివరించు.

**వ.** **మఱియును భూతేశ్వరుం డయిన సర్వేశ్వరుం డుత్పత్తి స్థితిలయకారణంబైన తన మాయను విడిచి మాయానియామకుండై యేయే ప్రదేశంబుల శయనంబు సేసె? నదియునుంగాక పురుషావయవంబులచేఁ బూర్వకాలంబున లోకపాలసమేతంబులైన లోకంబు లెత్తెఱంగునం గల్పితంబు లయ్యె? నదియునుంగాక మహాకల్పంబులును, నవాంతర కల్పంబులును, భూతభవిష్యద్వర్తమాన కాలంబులును, దేహాభిమానులై జనియించిన దేవపితృమనుష్యాదులకుం గలుగు నాయుఃప్రమాణంబులును, బృహత్సూక్ష్మకాలాను వర్తనంబులును, ఏ యే కర్మంబులం జేసి జీవు లే యే లోకంబుల నొందుదురు? మఱియు నేయే కర్మంబులం జేసి దేవాది శరీరంబులం బ్రాపింతు? రట్టి కర్మమార్గప్రకారంబును, సత్త్వాది గుణంబుల పరిణామంబులగు దేవాదిరూపంబులం గోరు జీవులకు నే యే కర్మసముదాయం బెట్టు సేయందగు? నెవ్వనికి నర్పింపందగు?**

నవి యెవ్వనిచేత గ్రహింపంబడు? భూ పాతాళ కకుబ్వ్యోమ గ్రహ నక్షత్ర పర్వతంబులును, సరిత్సముద్రంబులును, ద్వీపంబులును నే ప్రకారంబున సంభవించె? నా యా స్థానంబుల గలవారి సంభవంబు లేలాటివి? బాహ్యాభ్యంతరంబులం గలుగు బ్రహ్మాండ ప్రమాణం బెంత? మహాత్ముల చరిత్రంబు లెట్టివి? వర్ణాశ్రమ వినిశ్చయంబులును, ననుగతంబులై యాశ్చర్యావహంబులగు హరియవతార చరిత్రంబులును, యుగంబులును, యుగప్రమాణంబులును, యుగధర్మంబులును, బ్రతియుగంబునందును మనుష్యుల కేయే ధర్మంబు లాచరణీయంబు లట్టి సాధారణ ధర్మంబులును, విశేషధర్మంబులును, జాతి విశేష ధర్మంబులును, రాజర్షి ధర్మంబులును, నాపత్కాల జీవన సాధన భూతంబులగు ధర్మంబులును, మహదాదితత్త్వంబుల సంఖ్యయును, సంఖ్యాలక్షణంబును, నా తత్త్వంబులకు హేతుభూత లక్షణంబులును, భగవత్సమారాధన విధంబును, అష్టాంగయోగ క్రమంబును, యోగీశ్వరుల యణిమాద్యైశ్వర్య ప్రకారంబును, వారల యర్చిరాదిగతులును, లింగశరీర భంగంబులును, ఋగ్యజుస్సామాథర్వవేదంబులును, నుపవేదంబులైన యాయుర్వేదాదులును, ధర్మశాస్త్రంబులును, నితిహాస పురాణంబుల సంభవంబును, సర్వభూతంబుల యవాంతర ప్రళయంబును, మహాప్రళయంబును, నిష్టాపూర్తంబులును, యాగాది వైదిక కర్మజాలంబును, వాపీకూపతటాక దేవాలయాది నిర్మాణంబులును, నన్నదానం బారామప్రతిష్ఠ మొదలగు స్మార్తకర్మంబులును, కామ్యంబులైన యగ్నిహోత్రంబుల యనుష్ఠాన ప్రకారంబును, జీవసృష్టియు, ధర్మార్థకామంబు లనియెడు త్రివర్గంబుల యాచరణప్రకారంబును, మలినోపాధిక పాషండ సంభవంబును, జీవాత్మబంధ మోక్ష ప్రకారంబును, స్వరూపావస్థాన విధంబును, సర్వస్వతంత్రుండైన యీశ్వరుం డాత్మమాయం జేసి సర్వ కర్మసాక్షి యయ్యు న మ్మాయ నెడఁబాసి యుదాసీనగతిని విభుండై క్రీడించు తెఱంగును గ్రమంబునఁ బ్రపన్నుండనైన నాకు నెఱింగింపుము.

బ్రాహ్మణ శాపంబునంజేసి శోకవ్యాకుల చిత్తుండవై యనశన వ్రతుండవైన నీవు వినుట యెట్లని సందేహింపవలవదు. త్వదీయ ముఖారవింద వినిఃసృత నారాయణ కథామృత పానకుతూహలి నైన నాకు నింద్రియంబులు వశంబులై యుండు; నది గావున నేనడిగిన ప్రశ్నంబులకు నుత్తరంబులు సవిస్తరంబులుగా నానతిచ్చి కృతార్థునిం జేయఁ బరమేష్ఠితుల్యుండవగు నీ వపూర్వసంప్రదాయానురోధంబున నర్హుండ వగుదు వని విష్ణురాతుం డయిన పరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుండైన శుకయోగి నడిగిన నతండు బ్రహ్మ నారదసంవాదంబును, నేక సంప్రదాయాను గతంబును, గతానుగతిక ప్రకారంబునునై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మకుపదేశించిన భాగవతపురాణంబు వేదతుల్యంబు నీ కెఱింగింతు విను మని చెప్పెనని సూతుండు శౌనకాది మహామునులకుం జెప్పి నట్లు శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. **222**

ప్రతి : మఱియును= ఇంకా; భూత+ఈశ్వరుండు+ఐన= భూతాలకు అధిపతియైన; సర్వ+ఈశ్వరుండు= భగవంతుడు; ఉత్పత్తిస్థితిలయకారణంబు+ఐన= పుట్టుకకూ, వృద్ధికీ, సంహారానికీ హేతువగు; తనమాయను విడిచి= తనదైన మాయా

శక్తిని వదలి; మాయా నియామకుండు+ఐ= మాయను నియమించువాడై; ఏ యే ప్రదేశంబులన్= ఏ యేచోట్ల; శయనంబు చేసెన్= నిద్రించాడు?; అదియునున్+కాక= అంతే కాక; పూర్వకాలంబునన్= పురాతనకాలంలో; పురుష+అవయవంబులచేన్= విరాట్పురుషునియొక్క అంగాలచేత; లోకపాల సమేతంబులు+ఐన= లోకపాలురతో కూడిన; లోకంబులు= జగత్తులు; ఏ+తెఱంగునన్= ఏ రీతిగా; కల్పితంబులు+అయ్యెన్= నిర్మించబడ్డాయి; అదియునున్+కాక= అంతేకాక; మహాకల్పంబులును= పెద్దకల్పాలు; అవాంతరకల్పంబులును= మహాకల్పాల మధ్యసంభవించే ఇతరములైన కల్పాలూ; భూతభవిష్యద్వర్తమాన కాలంబులును= జరిగిపోయిన, జరుగనున్న, జరుగుతున్న కాలాలూ; దేహ+అభిమానులు+ఐ= శరీరాలపై అభిమానం కలవారై; జనియించిన= సంభవించిన; దేవపితృమనుష్యాదులకున్= దేవతలకు, పితరులకు, మనుష్యులు మొదలగువారికి; కలుగు= సంభవించే; ఆయుఃప్రమాణంబులును= ఆయుస్సులయొక్క కాలపరిమితులూ; బృహత్+సూక్ష్మకాల+ అనువర్తనంబులును= మహాకాలాన్నీ, సూక్ష్మకాలాన్నీ అనుసరించి ప్రవర్తించుటలూ; ఏ యే కర్మంబులు చేసి= ఏ యే పనులాచరించి; జీవులు= చేతనులు; ఏ యే లోకంబులన్+ఒందుదురు= ఏ యే లోకాలు చేరుకొంటారు; మఱియున్; ఏ యేకర్మంబులన్+చేసి= ఏ యే పనులచేసి; దేవాదిశరీరంబులన్+ప్రాపింతురు= దేవతలు మొదలైనవారి దేహాలను పొందుతారు; అట్టి కర్మమార్గప్రకారంబునున్= అటువంటి కర్మపథానికి చెందిన విధానం; సత్త్వ+ఆదిగుణంబుల పరిణామంబులగు= సత్త్వం మున్నగు గుణాల ఫలాలైన; దేవ+ఆదిరూపంబులన్= దేవతలు మున్నగు వారి ఆకృతులను; కోరుజీవులకున్= అభిలషించే చేతనులకు; ఏ యే కర్మసముదాయంబు= ఏ యే పనులు; ఎట్టు చేయందగున్?= ఎలా నిర్వర్తించాలి?; అవి= ఆ పనులు; ఎవ్వనికిన్+అర్పింపన్+తగున్= ఎవ్వరికి సమర్పించాలి; అవి ఎవ్వనిచేతన్ గ్రహింపన్+ పడున్= అవి ఎవనిచే స్వీకరింపబడుతున్నాయి?; భూ= భూమి; పాతాళ= పాతాళలోకం; కకుప్= దిక్కులు; వ్యోమ= ఆకాశం; గ్రహ= ఆదిత్యాది గ్రహాలూ; నక్షత్ర= తారకలూ; పర్వతంబులున్= కొండలూ; సరిత్సముద్రంబులునున్= నదులూ, సాగరాలూ; ద్వీపంబులునున్= కుశాదిద్వీపాలూ; ఏ ప్రకారంబునన్ సంభవించెన్?= ఎలా పుట్టాయి?; ఆ యాస్థానంబులన్= ఆ యా ప్రదేశాలలో; కలవారి= ఉన్నవారి; సంభవంబులు= పుట్టుకలు; ఏలాటివి= ఎట్టివి?; బాహ్యాభ్యంతరంబులన్= వెలుపలా, లోపలా; కలుగు= సంభవించు; బ్రహ్మాండప్రమాణంబు+ఎంత?= అజాండంయొక్క కొలత ఎంత?; మహాత్ముల= మహనీయులైనవారి; చరిత్రంబులు+ఎట్టివి?= వృత్తాంతాలు ఎలాంటివి?; వర్ణాశ్రమ వినిశ్చయింబులును= వర్ణాలకూ; ఆశ్రమాలకు చెందిన నిర్ణయాలూ; అనుగతంబులు+ఐ= అనుస్యూతంగా వచ్చునట్టి; ఆశ్చర్యావహంబులగు= అచ్చెరువు గలిగించే; హరి అవతార చరిత్రంబులనున్= శ్రీహరియొక్క అవతారాలకు సంబంధించిన కథలూ; యుగంబులునున్= కృతాదియుగాలూ; యుగప్రమాణంబులునున్= ఆ యా యుగాల కాలపరిమితులూ; యుగధర్మంబులునున్= ఆ యా యుగాలకు సంబంధించిన ధర్మాలూ; ప్రతియుగంబునందునున్= ఒక్కొక్క యుగంలోనూ; మనుష్యులకున్= మనుజులకు; ఏ యే ధర్మంబులు= ఎట్టి ఎట్టి ధర్మాలు; ఆచరణీయంబులు= ఆచరింపదగినవో; అట్టి సాధారణ ధర్మంబులునున్= సామాన్యధర్మాలూ; విశేషధర్మంబులునున్= అసామాన్యధర్మాలూ, జాతి విశేషధర్మంబులునున్, జాతులకు సంబంధించిన విశిష్టధర్మాలూ; రాజర్షిధర్మంబులునున్= రాజర్షులకు చెందిన ధర్మాలూ; ఆపత్+కాలజీవన సాధనభూతంబులు+అగు= విపత్సమయంలో జీవించడానికి ఉపకరించే; ధర్మంబులునున్= ధర్మాలూ; మహత్+ ఆదితత్త్వంబుల సంఖ్యయునున్= 'మహత్తు' మున్నగు తత్త్వాల లెక్కా; సంఖ్యా లక్షణంబునున్= ఆ లెక్కకు సంబంధించిన లక్షణం; ఆ తత్త్వంబులకున్= ఆ మహదాదితత్త్వాలకు; హేతు భూత లక్షణంబులునున్= కారణమైన లక్షణాలూ; భగవత్+ సమారాధన విధంబునున్= భగవానుణ్ణి ఆరాధించే విధానం; అష్ట+అంగయోగ క్రమంబునున్= యమం, నియమం మొదలగు అష్టాంగ యోగములయొక్క పద్ధతీ; యోగి+ఈశ్వరుల= యోగిశ్రేష్ఠుల; అణిమాది+ఐశ్వర్య ప్రకారంబునున్=

అణిమ, మహిమ మున్నగు అష్టైశ్వర్యాల విధానం; వారల+అర్చిరాది గతులునున్= ఆ యోగుల అర్చిరాది మార్గాలూ; లింగశరీర భంగంబులునున్= సూక్ష్మదేహాల వినాశం; ఋగ్యజు స్సామాధర్వవేదంబులును= ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం; ఉపవేదంబులు+ఐన= ఉపవేదాలుగా ప్రసిద్ధాలైన, ఆయుర్వేదాదులునున్= ఆయుర్వేదం మున్నగునవీ; ధర్మశాస్త్రంబులునున్= మనుస్మృతి మున్నగు ధర్మశాస్త్రాలూ; ఇతిహాస పురాణంబుల= భారతాదులగు ఇతిహాసాలూ, మత్స్యాదిపురాణాలయొక్క; సంభవంబునున్= పుట్టుకయును; సర్వభూతంబుల= సకల భూతాలయొక్క; అవాంతర ప్రళయంబునున్= మధ్యకాల ప్రళయం; మహాప్రళయంబునున్= పెద్ద ప్రళయం; ఇష్టాపూర్తంబులునున్= యాగాదులైన వేదవిహితకర్మలు; తటాక నిర్మాణాది స్మార్తకర్మలూ; యాగాది వైదికకర్మ జాలంబునున్= యాగములు మున్నగు వేదచోదితమైన కర్మసమూహము; వాపీకూప తటాక దేవాలయాది నిర్మాణంబులునున్= నడబావులు, బావులు, చెరువులు, దేవాలయాలు మున్నగు వాటి నిర్మాణాలూ; అన్నదానంబు= అన్నంపెట్టడమూ; ఆరామప్రతిష్ఠ= ఉద్యాన నిర్మాణం; మొదలగు= మొదలైన; స్మార్తకర్మంబులును= స్మృతి బోధించిన కర్మలూ; కామ్యంబులు+ఐన= కోరికతో చేయునవియగు; అగ్నిహోత్రంబుల+అనుష్ఠాన ప్రకారంబునున్= అగ్ని హోత్రాలు చేసే విధానం; జీవసృష్టియున్= జీవులయొక్క సృష్టీ; ధర్మ+అర్థకామంబులు+అనియెడు= ధర్మం, అర్థం, కామం అని చెప్పబడు; త్రివర్గంబుల= పురుషార్థత్రయంయొక్క; ఆచరణప్రకారంబును= ఆచరించే విధానమూ; మలిన+ఉపాధిక= మలిన శరీరధారులైన; పాషండ సంభవంబును= పాషండుల పుట్టుకా; జీవాత్మ బంధమోక్ష ప్రకారంబునున్= జీవాత్మలయొక్క సంసారబంధం, అందుండి విడుదలకు చెందిన విధానం; స్వరూప+అవస్థాన విధంబునున్= తనలో తానుండే రీతీ; సర్వస్వతంత్రుండు+ఐన= అన్నివిధాలా స్వాతంత్ర్యం ఉన్న; ఈశ్వరుండు= పరమేశ్వరుడు; ఆత్మమాయన్+చేసి= తన మాయచేత; సర్వకర్మసాక్షి యయ్యున్= సకల కర్మలకూ సాక్షిగా ఉండికూడా; ఆ+మాయన్+ఎడబాసి= ఆ మాయను వదలి; ఉదాసీనగతినిన్= ఏమీ పట్టని వానితీరులో; విభుండు+ఐ= ప్రభువై; క్రీడించు తెఱంగునున్= విహరించే విధానం; క్రమంబునన్= క్రమంగా; ప్రపన్నుండన్+ఐన= శరణాగతుడనైన; నాకున్ ఎఱింగింపుము= నాకు తెలియజేయి; బ్రాహ్మణ శాపంబునన్+చేసి= విప్రశాపంవల్ల; శోకవ్యాకులచిత్తుండవు+ఐ= దుఃఖంచే వ్యాకులత చెందిన మనస్సు గలవాడవై; అనశనవ్రతుండవు+ఐన= నిరాహారదీక్షావ్రతం పాటించుచున్న; నీవు, వినుట, ఎట్లు+అని= నీవెలా వినగలవు అని; సందేహింపవలవదు= సంశయించ వద్దు; త్వదీయ= నీ యొక్క; ముఖ+అరవింద= ముఖమనే పద్మంనుండి; వినిఃసృత= బయలువెడలిన; నారాయణ= నారాయణునియొక్క; కథా+అమృతపాన= కథ అనే సుధను పానం చేయుటయందు; కుతూహలిని+ఐన= కుతూహలం కలవాడనైన; నాకున్= నాకు; ఇంద్రియంబులు వశంబులై యుండున్= ఇంద్రియాలు స్వాధీనమై ఉంటాయి; అది గావునన్= ఆ కారణంచేత; నేను+అడిగిన ప్రశ్నంబులకున్= నేను చేసిన ప్రశ్నలకు; ఉత్తరంబులు= సమాధానాలు; సవిస్తరంబులుగాన్= విస్తృత వివరణతో కూడినవిగా; ఆనతిచ్చి= సెలవిచ్చి; కృతార్థునిన్ చేయన్= కృతకృత్యుణ్ణి చేయడానికి; పరమేష్ఠితుల్యుండవు+అగు నీవు= బ్రహ్మతో సమానుడవైన నీవే; పూర్వ సంప్రదాయ+అనురోధంబునన్= ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించి; అర్హుండవు+అగుదువు= తగినవాడవగుదువు; అని విష్ణురాతుండైన పరీక్షిన్నరేంద్రుండు= అంటూ విష్ణువుచే రక్షితుండైన పరీక్షిన్మహారాజు; బ్రహ్మరాతుండైన శుకయోగిన్= బ్రహ్మచే అనుగ్రహింపబడిన శుకుణ్ణి; అడిగినన్= ప్రశ్నించగా; అతండు= ఆ శుకుడు; బ్రహ్మనారద సంవాదంబునున్= బ్రహ్మ నారదులయొక్క సంభాషణ రూపంతో ఉన్నదీ; ఏక సంప్రదాయానుగతంబునున్= ఒకే సంప్రదాయానికి చెందినదీ; గతానుగతికప్రకారంబునున్= పరంపరాక్రమంగా వస్తున్నదీ; తొల్లి= పూర్వం; సర్వ+ఈశ్వరుండు= భగవంతుడు; బ్రహ్మ కల్పంబునన్= బ్రహ్మకల్పంలో; బ్రహ్మకు+ఉపదేశించిన= విధాతకు ప్రబోధించినట్టి; భాగవత పురాణంబు= భాగవతమనే పురాణం; వేదతుల్యంబు= వేదంతో సమానమైనది;

నీకున్+ఎఱింగింతున్ వినుమని చెప్పెన్ అని= నీకు తెలియజేస్తాను, వినుము అని చెప్పాడని; సూతుండు= సూతుడు; శౌనక+ఆది మహామునులకున్= శౌనకుడు మున్నగు గొప్ప మునులకు; చెప్పినట్లు= నుడివినట్లు; శుకయోగి+ఇంద్రుండు= యోగివర్యుడగు శుకుడు; పరీక్షిత్+నరేంద్రునకున్+ఇట్లు+అనియెన్= పరీక్షిన్మహారాజుకు ఇలా చెప్పాడు.

**తా :** భూతాలకు అధినాథుడైన సర్వేశ్వరుడు ఉత్పత్తికీ, స్థితికీ, లయానికీ హేతువైన తన మాయను వదలి మాయా నియామకుడై ఏ ఏ స్థలాలలో శయనించాడు? అంతేకాక పూర్వం విరాట్పురుషుని అవయవాలతో ఇంద్రుడు మొదలైన లోకపాలకులతో కూడిన లోకాలు ఎలా సృష్టింపబడ్డాయి? మహాకల్పాలు, అవాంతరకల్పాలు, భూతభవిష్యద్వర్తమానకాలాలు, శరీరాభిమానంతో జన్మించే దేవతలు, పితరులు, మానవులు మొదలగు వారికి కలిగే ఆయుఃప్రమాణాలు నాకు చెప్పు.

మహాకాలాన్నీ, సూక్ష్మకాలాన్నీ అనువర్తించి జీవులు ఏ ఏ కర్మలు చేసి ఏ ఏ లోకాలకు ప్రయాణం సాగిస్తారు? ఏ ఏ కర్మలవల్ల వాళ్లకు దేవతా శరీరాలు వస్తాయి? అట్టి కర్మమార్గపద్ధతి నాకు వివరించు.

ఇంకా సత్త్వాది గుణాలకు ఫలాలైన దేవాది స్వరూపాలు కోరే జీవులు ఏ యే కర్మలు ఏ విధంగా చేయాలి? ఆ కర్మలను ఎవరికి సమర్పించాలి? వాటిని ఎవరు స్వీకరిస్తారు?

భూమి, పాతాళం, దిక్కులు, ఆకాశం, గ్రహాలు, నక్షత్రాలు, పర్వతాలు, నదులు, సముద్రాలు, దీవులు ఎలా ఉద్భవించాయి? ఆ యా చోట్ల ఉండే జీవుల జన్మలు ఎలాంటివి?

వెలుపలా, లోపలా బ్రహ్మాండం కొలత ఎంత? మహాత్ముల చరిత్రలు ఎటువంటివి? వర్ణాశ్రమ నియమాలు, క్రమంగా ఏర్పడి ఆశ్చర్యం కలిగించే శ్రీమన్నారాయణునిఅవతార కథలు, నాలుగుయుగాలు, ఆ యుగాల ప్రమాణాలు, యుగధర్మాలు, ప్రతియుగంలోనూ మానవులు పాటించవలసిన సాధారణ ధర్మాలు, విశేషధర్మాలు, ఆ యా జాతులకు సంబంధించిన ధర్మాలు, రాజర్షుల ధర్మాలు, జీవన సాధనాలైన ఆపద్ధర్మాలు, మహత్తు మొదలైన తత్త్వాలసంఖ్య, వాటి లక్షణం, ఆ తత్త్వాలకు హేతువులయిన లక్షణాలు, భగవానుణ్ణి ఆరాధించే పద్ధతి, యమనియమాదులైన అష్టాంగాలతో కూడిన యోగక్రమం, యోగిశ్రేష్ఠులైన వారి అణిమ, మహిమ మొదలగు అష్టసిద్ధుల స్వరూపం, అర్చిరాది మార్గాలలో ఆ యోగులు పయనించే తీరు, లింగశరీరాల వినాశం, ఋక్కు, యజుస్సు, సామం, అధర్వం అనే నాలుగు వేదాలు, ఆయుర్వేదం మొదలైన ఉపవేదాలు, ధర్మశాస్త్రాలు, ఇతిహాసాలు, పురాణాలు ఆవిర్భవించిన పద్ధతి, అన్ని భూతాలకూ ఏర్పడే అవాంతర ప్రళయం, వాటిస్థితి, మహాప్రళయం, ఇష్టాపూర్తాలనబడే యజ్ఞాది వైదిక కర్మలు, బావులు, మడుగులు, చెరువులు, దేవాలయాలు మొదలగు వాటి నిర్మాణం, అన్నదానం, ఆరామ ప్రతిష్ఠ మొదలైన స్మృతుల్లో చెప్పిన కర్మలు, కామ్య కర్మలైన అగ్నిహోత్రాదులు నిర్వర్తించే విధానం, జీవుల సృష్టి, ధర్మం, అర్థం, కామం అనే త్రివర్గాలను ఆచరించే తీరు, మలిన శరీరులైన పాషండుల పుట్టుక, జీవాత్ముడు బంధింపబడే రీతి, ఆపై మోక్షం పొందే పద్ధతి, స్వస్వరూపంతో నెలకొనే ప్రకారం, దేనికీ లోబడక అన్నిటా స్వతంత్రుడైన ఈశ్వరుడు తన మాయతో సమస్త కర్తలకూ సాక్షిగా ఉంటూనే ఆ మాయకు అతీతుడై ఉదాసీనునిలాగా ప్రభువై క్రీడించే పద్ధతి– ఈ సంగతులన్నీ విపన్నుడనై ప్రపన్నుడనైన నాకు వివరించు.

"నీవు బ్రాహ్మణ శాపంవల్ల దుఃఖిస్తున్నావు, నీ మనస్సు కలత జెంది ఉంది, పైగా నిరాహారదీక్షతో ఉన్నావు! నేను చెప్పే ఈ విషయాలు ఎలా వినగలవు?" అని సంశయింప వద్దు. నేను మీ ముఖపద్మం నుండి వెలువడే శ్రీమన్నారాయణ కథా సుధను తనివి దీరా తాగాలన్న కుతూహలంతో ఉన్నాను. అట్టి నాకు ఇంద్రియాలు స్వాధీనంలోనే ఉన్నాయి. కాబట్టి

నేను అడిగిన ప్రశ్నలు అన్నిటికీ సమాధానాలు సవిస్తరంగా ఆనతిచ్చి నన్ను కృతార్థుణ్ణి కావించు. నీవు బ్రహ్మతో సమానుడవు. నీవు మాత్రమే ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించి వాటిని వివరించడానికి తగినవాడవు".

ఈ విధంగా విష్ణురాతుడైన (విష్ణువుచే రక్షితుడైన) పరీక్షిన్మహారాజు (బ్రహ్మరాతుడైన బ్రహ్మచే వ్యాసునికి పుత్రుడుగా అనుగ్రహింపబడిన) శుకమహాయోగిని అడిగాడు.

అప్పుడు శుకమహర్షి "రాజా! బ్రహ్మ నారదుల సంవాదరూపమూ, ఒకే సంప్రదాయానికి చెందిందీ, క్రమపద్ధతిలో పరంపరగా వస్తున్నదీ అయిన భాగవతమనే మహాపురాణమున్నది. అది వేదంతో సమానం. దానిని పూర్వం సర్వేశ్వరుడు బ్రహ్మకల్పంలో బ్రహ్మకు ఉపదేశించాడు. అది నీకు తెలియపరుస్తాను, విను," అని చెప్పి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

**విశే :** ఉపవేదములు: ఆయుర్వేదం, గాంధర్వం, ధనుర్వేదం, అర్థశాస్త్రవేదం (శిల్ప, పాక, నీతి, అశ్వశాస్త్రాదులు).

**సీ. భూపాలకోత్తమ! భూతహితుండు సుజ్ఞానస్వరూపకుఁడైనయట్టి**
**ప్రాణికి దేహసంబంధ మెట్లగు నన్న మహి నొప్పు నీశ్వరమాయ లేక**
**కలుగదు, నిద్రలోఁ గలలోనఁ దోఁచిన దేహబంధంబుల తెఱఁగువలెను**
**హరియోగ మాయామహత్త్వంబునం బాంచభౌతికదేహసంబంధుఁడగుచు**

**తే. నట్టి మాయాగుణంబుల నాత్మ యోలి, బాల్య కౌమార యౌవనభావములను**
**నర సుపర్వాది మూర్తులఁ బొరసి "యేను", "నాయ దిది" యను సంసారమాయఁదగిలి. 223**

**ప్రతి :** భూపాలక+ఉత్తమ= రాజవర్యా!; భూతహితుండు= ప్రాణులకు మేలు కూర్చువాడు; సుజ్ఞానస్వరూపకుఁడు+ఐనయట్టి= శ్రేష్ఠమగు జ్ఞానమే స్వరూపంగా కలవాడు అయిన; ప్రాణికిన్= దేహికి; దేహసంబంధము= శరీరంతో కలయిక; ఎట్లు+అగునన్నన్= ఎలా కలుగుతుందనగా; మహిన్= ఇలలో; ఒప్పు= ప్రకాశించు; ఈశ్వరమాయలేక= భగవంతుని మాయాశక్తి లేకుండా; కలుగదు= సంభవించదు; నిద్రలోన్= నిద్రించునప్పుడు; కలలోనన్= స్వప్నమందు; తోఁచిన= భాసించిన; దేహబంధంబుల తెఱఁగువలెనున్= శరీర సంబంధాల మాదిరిగా; హరియోగ మాయామహత్త్వంబునన్= శ్రీహరి యోగమాయాప్రభావంవల్ల; పాంచ భౌతిక దేహసంబంధుఁడు+అగుచున్= ఐదుభూతాలవల్ల ఏర్పడిన దేహంతో కలయికగలవాడై; అట్టి మాయాగుణంబులన్= అటువంటి మాయకు చెందిన గుణాలచేత; ఓలిన్= క్రమంగా; ఆత్మ బాల్యకౌమారయౌవన భావములనున్= బాలత్వ, కుమారత్వ, యువకత్వ భావాలను; నర సుపర్వాది మూర్తులన్= మనుష్య దేవాదుల, ఆకృతులను; పొరసి= పొంది; ఏను= నేను; నాయ దిది= ఇది నాది; అను సంసారమాయన్+తగిలి= సంసారానికి చెందిన మాయలో తగులుకొని...

**తా :** రాజోత్తమా! "జీవుడు భూతాలకు మేలు చేకూర్చేవాడు, జ్ఞానమే స్వరూపంగా కలవాడు, అలాంటివానికి శరీరంతో సంబంధం ఎలా కలిగింది" అంటావా? జగతీతలమంతా వ్యాపించి ఉన్న ఈశ్వరుని మాయ అనేది లేకపోతే జీవునికి దేహంతో సంబంధం కలుగదు. నిద్రించే వేళ స్వప్నంలో దేహాలతో సంబంధం గోచరిస్తుంది కదా! అలాగే నారాయణుని యోగమాయాప్రభావంవల్ల జీవుడు పంచభూతాలతో కూడిన దేహంతో సంబంధం కలవాడవుతాడు. ఆ మాయాగుణాలవల్లనే క్రమంగా బాల్యం, కౌమారం, యౌవనం అనే దశలు పొందుతాడు. మనుష్య, దేవతాది ఆకారాలను కూడా స్వీకరిస్తాడు. 'నేను' అనే అహంకారాన్నీ, 'నాది' అనే మమకారాన్నీ పెంచుకొంటాడు. సంసారమాయలో బద్ధుడవుతాడు.

**వ. వర్తించుచు నిట్లున్న జీవునికి భగవద్భక్తి యోగంబున ముక్తి సంభవించుట యెట్లన్న - నెప్పుడేని జీవుండు ప్రకృతి పురుషాతీతంబయిన బ్రహ్మస్వరూపంబునందు మహితధ్యాన నిష్ఠుండగు నప్పుడు విగతమోహుండై యహంకార మమకారాత్మకంబయిన సంస్కరణంబు దొఱంగి ముక్తుండయి యుండు; మఱియు జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడుచుండు; నట్టి దేహధారియైన భగవంతునందలి భక్తిం జేసి జీవునకు ముక్తి యెత్తెఱంగునం గలుగునని యడిగితివి, జీవుం డవిద్యామహిమం జేసి కర్మానుగతంబయిన మిథ్యా రూపదేహసంబంధుండు; భగవంతుండు నిజయోగమాయా మహిమంబునం జేసి స్వేచ్ఛా పరికల్పిత చిద్ఘన లీలావిగ్రహుండు కావున భగవంతుండైన యీశ్వరుండు స్వభజనంబు ముక్తి సాధనజ్ఞానార్థంబు కల్పితంబని చతుర్ముఖునకుఁ దదీయనిష్కపటతపశ్చర్యాది సేవితుండయి నిజజ్ఞానానందఘనంబయిన స్వరూపంబు సూపుచు నానతిచ్చె; నది గావున జీవునికి భగవద్భక్తి మోక్షప్రదాయకంబగు; నిందులకు నొక్క యితిహాసంబు గల దెఱింగింతు నాకర్ణింపుము; దాన భవదీయ సంశయనివృత్తి యయ్యెడు నని శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. 224**

**ప్రతి :** వర్తించుచున్= ఉంటూ; ఇట్లు+ఉన్న జీవునికిన్= ఇలా ఉండే చేతనునికి; భగవత్+భక్తియోగంబునన్= భగవంతుని మీద భక్తి కలుగుటచేత; ముక్తి= మోక్షం; సంభవించుట ఎట్లు+అన్నన్= లభించుట ఎలా అంటే; ఎప్పుడు+ఏనిన్= ఏ సమయమందైతే; జీవుండు= చేతనుడు; ప్రకృతి పురుషాతీతంబు+అయిన= ప్రకృతికీ, పురుషునికీ అతీతమైవున్న; బ్రహ్మస్వరూపంబునందున్= పరబ్రహ్మయొక్క స్వరూపంలో; మహిత ధ్యాన, నిష్ఠుండు+అగున్= శ్రేష్ఠమైన ధ్యానమునందు నిష్ఠ కలవాడవుతాడో; అప్పుడు= ఆ సమయంలో; విగతమోహుండు+ఐ= మోహం తొలగినవాడై; అహంకార మమకార+ఆత్మకంబు+అయిన= నేను, నాది అనే భావనతో గూడిన; సంస్కరణంబున్= సంస్కారాన్ని; తొఱంగి= వదలి; ముక్తుండు+అయి= మోక్షం పొందినవాడై; ఉండున్= ఉంటాడు; మఱియున్= ఇంకను; జీవ+ఈశ్వరులకున్= జీవునికీ ఈశ్వరునికీ; దేహసంబంధంబులు= శరీరంతో కలయికలు; కానంబడుచుండున్= కనిపిస్తూ వుంటాయి; అట్టి దేహధారి+ఐన= అటువంటి శరీరధారియగు; భగవంతునందలి= పరమేశ్వరునియందు; భక్తిన్+చేసి= భక్తివల్ల; జీవునకున్= చేతనునకు; ముక్తి= మోక్షం; ఏ+తెఱంగునన్= ఏ రీతిగా; కలుగునని= సంభవించునని; అడిగితివి= ప్రశ్నించితివి, జీవుండు; అవిద్యామహిమన్+చేసి= అవిద్యయొక్క ప్రభావంవలన; కర్మ+అనుగతంబు+అయిన= కర్మ ననుసరించిన; మిథ్యారూప దేహసంబంధుండు= మిథ్యయగు దేహంతో సంబంధం కలవాడు; భగవంతుండు= దేవుడు; నిజయోగమాయా మహిమంబునన్+చేసి= తనయొక్క యోగమాయా ప్రభావంవల్ల; స్వేచ్ఛాపరికల్పిత చిద్ఘనలీలా విగ్రహుండు= తన ఇచ్ఛతో కల్పించుకొన్న జ్ఞానఘనమైన లీలాశరీరం కలవాడు; కావునన్= అందుచేత; భగవంతుండు+ఐన= షడ్గుణైశ్వర్య సంపన్నుడైన; ఈశ్వరుండు= పరమాత్ముడు; స్వభజనంబు= తనసేవ; ముక్తిసాధన జ్ఞాన+అర్థంబు= మోక్షసాధనమైన జ్ఞానంకొఱకై; కల్పితంబు+అని= కల్పింపబడినదని; చతుర్ముఖునకున్= నాలుగుమోములు గల బ్రహ్మకు; తదీయ నిష్కపట తపశ్చర్యాది సేవితుండు+అయి= అతని కపటంలేని తపోనిష్ఠాదులచేత సేవింపబడినవాడై; నిజజ్ఞాన+ఆనందఘనంబు+అయిన= తనయొక్క జ్ఞానంచేత, ఆనందంచేతఘనమైన; స్వరూపంబున్= నిజరూపాన్ని; చూపుచున్+ఆనతిచ్చెన్= చూపిస్తూ తెలియజేశాడు; అది గావునన్= అందువల్ల; జీవునికిన్= చేతనునికి; భగవత్+భక్తి= దేవునియందలి భక్తి; మోక్షప్రదాయకంబు+ అగున్= ముక్తి నిచ్చే దవుతున్నది; ఇందుకున్= ఈ సంగతి నిరూపించడానికి; ఒక్క ఇతిహాసంబు= ఒక ప్రాచీన వృత్తాంతం;

కలదు= ఉన్నది; ఎఱింగింతున్= తెలియజేస్తాను; ఆకర్ణింపుము= వినుము; దానన్=దానితో; భవదీయ సంశయనివృత్తి= నీ సందేహ నివారణ; అయ్యెడున్+అని= అవుతుందని; శుకయోగి+ఇంద్రుండు= శుకమహర్షి; రాజ+ఇంద్రునకున్+ ఇట్లు+అనియెన్= రాజశ్రేష్ఠునకు ఇలా చెప్పాడు.

**తా :** ఇలా బద్ధుడై వర్తించే జీవుడికి భగవంతుని మీది భక్తితో ముక్తి ఎలా కల్గుతుంది అంటావా? వివరిస్తాను, విను. ప్రకృతికీ, పురుషుడికీ అతీతమైన బ్రహ్మస్వరూపాన్ని జీవుడు ఎప్పుడు తీవ్రంగా ధ్యానిస్తాడో అప్పుడు మోహంనుండి విడివడుతాడు. అహంకార మమకార మయమైన సంసారంనుండి విడుదల పొందుతాడు.

అంతేకాదు, జీవుడికీ, ఈశ్వరుడికీ శరీరాలతో, సంబంధాలు కనిపిస్తున్నాయి. భగవంతుడు కూడ శరీరం ధరించే ఉన్నాడు. అట్టి భగవంతుడి మీద భక్తి కలిగివుంటే జీవుడికెలా ముక్తి సిద్ధిస్తుంది? అని ప్రశ్నించావు.

అవిద్యకు లోనైనవాడు జీవుడు. అవిద్యా ప్రభావంవల్ల అతడు కర్మననుసరించి సంప్రాప్తించిన శరీరాన్ని ధరిస్తాడు. ఆ దేహం మిథ్యారూపమైనది. భగవంతుడు యోగమాయతో గూడినవాడు. ఆయన తన యోగమాయా ప్రభావంవల్ల తన ఇష్టానుసారం జ్ఞానమయమైన లీలాశరీరం కల్పించుకొంటాడు. అందువల్ల మోక్షానికి సాధనమైన జ్ఞానానికై తనసేవ కల్పించబడిందని భగవంతుడైన ఈశ్వరుడు బ్రహ్మతో చెప్పాడు. బ్రహ్మ నిష్కపటంగా తపస్సు చేసి పరమేశ్వరుని ఆరాధించాడు. అప్పుడు తన జ్ఞానానందఘనమైన స్వరూపం బ్రహ్మకు చూపిస్తూ ఈశ్వరుడు పై రీతిగా తెలిపాడు.

అందువల్ల జీవుడికి భగవద్భక్తి తప్పక మోక్షం ప్రసాదిస్తుంది. ఈ విషయం నిరూపించే ఇతిహాసం ఒకటి ఉన్నది. అది వివరిస్తాను, విను. దానివల్ల నీ సందేహం తీరుతుంది అని చెప్పి యోగివర్యుడైన శుకుడు రాజవర్యుడైన పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

### ✤ నారాయణుండు బ్రహ్మ తపంబునకు మెచ్చి వరంబు లిచ్చుట ✤

**సీ. హరిపాదభక్తి రహస్యోపదేష్టయు నఖిలదేవతలకు నధివిభుండు**
**నైన విధాత గల్పాదియందును నిజాశ్రయపద్మమున కధిష్ఠాన మరయ**
**నర్థించి జలముల నన్వేషణము సేసి నలినంబు మొదలు గానంగలేక**
**విసివి క్రమ్మఱను దద్బిసరుహాసీనుఁడై సృష్టినిర్మాణేచ్ఛఁజిత్తమందుఁ**

**తే. జాల నూహించి తత్పరిజ్ఞానమహిమ, సరణి మనమునఁదోఁపక జడనుపడుచు**
**లోకజాలంబుఁ బుట్టింపలేక మోహి, తాత్ముఁడై చింత నొందు న య్యవసరమున. 225**

**ప్రతి :** హరిపాదభక్తి రహస్య+ఉపదేష్టయున్= శ్రీహరి చరణాలయందలి భక్తియొక్క రహస్యాన్ని ఉపదేశించువాడు; అఖిల దేవతలకున్= దేవతల కందరికీ; అధివిభుండున్= అధినాయకుడును; ఐన విధాత= ఐనట్టి చతుర్ముఖుడు; కల్పాది యందునున్= యుగాదియందు; నిజ+ఆశ్రయపద్మమునకున్= తనకు ఆధారమైన కమలానికి; అధిష్ఠానము+అరయన్= ఆధారం తెలిసికోవాలని; అర్థించి= కోరి; జలములన్= నీటిలో; అన్వేషణము+చేసి= వెదకి; నలినంబుమొదలున్= తామర తూటియొక్క మూలాన్ని; కానంగన్+లేక= చూడజాలక; విసివి= విసుగుజెంది; క్రమ్మఱను= మరల; తద్బిసరుహాసీనుఁడు+ ఐ= ఆ పద్మంలో కూర్చున్నవాడై; సృష్టినిర్మాణ+ఇచ్ఛన్= సృష్టిని కల్పించాలన్న కోరికతో; చిత్తమందున్= మనస్సులో;

చాలన్= మిక్కిలిగా; ఊహించి= తర్కించి; తద్+పరిజ్ఞానమహిమసరణి= దానికి సంబంధించిన విజ్ఞాన ప్రభావముయొక్క పద్ధతి; మనమునన్= చిత్తమునందు; తోఁపక= స్ఫురింపక; జడనుపడుచున్= ముందుకు సాగలేనివాడవుతూ; లోకజాలంబున్= ప్రపంచాన్ని; పుట్టింపలేక= సృష్టించజాలక; మోహిత+ఆత్ముఁడు+ఐ= మోహానికి గురిఅయిన చిత్తం కలవాడై; చింతన్+ఒందు+ఆ+అవసరమునన్= చింతించు సందర్భంలో.

**తా :** శ్రీహరి పాదాలమీది భక్తిగల్గి ఉండడంలోని పరమరహస్యాన్ని ఉపదేశించినవాడూ, దేవతలకెల్ల అధినేతా అయిన బ్రహ్మదేవుడు యుగారంభంలో తనకు నెలవైన పద్మానికి మూలమేమిటో పరిశీలించాలనుకొన్నాడు. నీళ్ళలో వెదకడం ప్రారంభించాడు. ఎంత వెదకినా ఆ పద్మానికి మొదలు ఎక్కడ ఉందో తెలుసుకోలేకపోయాడు. చివరికి విసిగివేసారి మరలివచ్చి ఆ పద్మంలోనే ఆసీనుడయ్యాడు. జగత్తును సృష్టించాలనే సంకల్పం ఆయన హృదయంలో ఉదయించింది. ఎంతో ఆలోచించాడు. కాని సృష్టికి సంబంధించిన పరిజ్ఞానం ఆయన మనస్సుకు తోచక క్రిందుమీదయినాడు. అలసత్వం ఆవహించింది. లోకసృష్టి చేయలేకపోయాడు. అతని చిత్తం మోహగ్రస్తమయింది. చింతాక్రాంతుడయ్యాడు.

**వ. జలమధ్యంబుననుండి యక్షర సమామ్నాయంబున స్పర్శంబులందు షోడశాక్షరంబును మఱియు నేకవింశాక్షరంబును నైన యియ్యక్షరద్వయంబువలన నగుచు మహాముని జనధనం బయిన “తప” యను శబ్దం బినుమా ఉచ్చరింపంబడి వినంబడిన, నట్టి శబ్దంబు వలికిన యప్పురుషుని వీక్షింపంగోరి నలుదిక్కులకుం జని వెదకి, యెందునుం గానక. మరలి వచ్చి నిజస్థానంబైన పద్మంబునం దాసీనుండై యొక్కింత చింతించి యట్టి శబ్దంబు దన్నుఁ దపంబు సేయుమని నియమించుటగాఁ దలంచి ప్రాణాయామ పరాయణుండై, జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబుల జయించి, యేకాగ్ర చిత్తుండై, సకలలోక సంతాపహేతువగు తపంబు వేయి దివ్యవత్సరంబులు గావింప, నీశ్వరుండు ప్రసన్నుండై పొడసూపిన నక్కమలసంభవుండు తత్క్షణంబ రాజసతామసమిశ్రసత్త్వగుణాతీతంబును, శుద్ధ సత్త్వగుణావాసంబును, నకాల విక్రమంబును, సర్వలోకోన్నతంబును, సకల సురగణస్తుత్యంబును, ననంత తేజోవిరాజితంబు నైన వైకుంఠ పురంబుం బొడగని యందు. 226**

**ప్రతి :** జలమధ్యంబుననుండి= నీటి నడుమనుండి; అక్షర సమామ్నాయంబునన్= అక్షరాల క్రమంలో; స్పర్శంబులందున్= ‘క’ మొదలు ‘మ’ వరకు గల స్పర్శాక్షరాలలో; షోడశ+అక్షరంబునున్= పదునారవ అక్షరమైన ‘త’ అను అక్షరమూ; మఱియున్= ఇంకను; ఏకవింశాక్షరంబునున్+ఐన= ఇరువదియొకటవ అక్షరమగు ‘ప’ అను అక్షరమూ– ఈ అక్షరద్వయంబువలనన్= ఈ రెండక్షరాలవలన; అగుచున్= ఏర్పడుతూ; మహాముని జనధనంబు+ఐన= గొప్పతపోధనుల ధనమైన, ‘తప’ అను శబ్దంబు; ఇనుమాఱు= రెండు పర్యాయాలు; ఉచ్చరింపన్+పడి= పలుకబడి; వినన్+పడినన్= వినిపించేసరికి; అట్టిశబ్దంబు+పలికిన= అలాంటి ‘తప’ శబ్దాన్ని ఉచ్చరించినట్టి; ఆ+పురుషుని= ఆ వ్యక్తిని; వీక్షింపన్+కోరి= చూడనభిలషించి; నలుదిక్కులకున్+చని= నాల్గు దిక్కులకు వెళ్ళి; వెదకి= అన్వేషించి; ఎందునున్+కానక= ఎక్కడను చూడక; మరలివచ్చి= తిరిగివచ్చి; నిజస్థానంబు+ఐన= తన నెలవైన; పద్మంబునందున్= కమలంలో; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; ఒక్క+ఇంత చింతించి= కొంతసేపు ఆలోచించి; అట్టి శబ్ధంబు= ఆ ‘తప’ అను శబ్దం; తన్నున్+తపంబు చేయుమని= తనను తపస్సు ఆచరించుమని; నియమించుటగాన్+తలంచి= కట్టడిసేయుటగా భావించి; ప్రాణాయామపరాయణుండు+ఐ= ప్రాణాయామంలో చిత్తం నిల్పినవాడై; జ్ఞాన+ఇంద్రియ కర్మ+ఇంద్రియంబులన్ జయించి=

శ్రోత్రాదులగు జ్ఞానేంద్రియాలనూ, వాక్కు మొదలగు కర్మేంద్రియాలనూ నిగ్రహించి; ఏక+అగ్రచిత్తుండు+ఐ= ఒకేచోట నిల్పిన మనస్సుగలవాడై; సకలలోక సంతాపహేతువు+అగు= సమస్తలోకాల సంతాపానికి కారణమైన; తపంబు= తపస్సు; వేయిదివ్య సంవత్సరంబులు= వెయ్యి దివ్యవర్షాలు; కావింపన్= చేయగా; ఈశ్వరుండు= భగవంతుడు; ప్రసన్నుఁడు+ఐ= అనుగ్రహం కలవాడై; పొడచూపినన్= సాక్షాత్కరింపగా; ఆ+కమలసంభవుండు= ఆ బ్రహ్మదేవుడు; తద్+క్షణంబు+అ= ఆ క్షణంలోనే; రాజసతామసమిశ్రసత్త్వగుణ+అతీతంబునున్= రజోగుణానికీ, తమోగుణానికీ, ఆ గుణాల సమ్మిశ్రణమైన సత్త్వగుణానికీ అతీతమైనదియు; శుద్ధసత్త్వగుణ+ఆవాసంబునున్= శుద్ధసత్త్వగుణానికి నిలయమైనదియు; అకాలవిక్రమంబునున్= కాలపరాక్రమం లేనిదియును; సర్వలోక+ఉన్నతంబునున్= అన్ని లోకాలకంటె ఉత్కృష్టమైనదియు; సకల సురగణస్తుత్యంబునున్= సమస్తదేవతాబృందాలచే స్తుతింపదగినదియును; లోభమోహభయవిరహితంబునున్= లోభం, మోహం, భయం అనేవి లేనిదియు; అపునరావృత్తి మార్గంబునున్= తిరిగివచ్చే త్రోవలేనిదియును; అనంతతేజస్+విరాజితంబునున్+ఐన= అపరిమితమైన తేజస్సుచే ప్రకాశించునదియునగు; వైకుంఠపురంబున్+పొడగని= వైకుంఠనగరాన్ని చూచి; అందున్= ఆ నగరంలో

**తా :** అప్పుడు నీటినడుమనుండి ఒక 'శబ్దం' వినిపించింది. 'క' మొదలు 'మ' వరకు ఉండే స్పర్శాక్షరాలలో (కాదయో మావసానాః స్పర్శాః) పదునారవదీ, ఇరువది యొకటవదీ అయిన 'తప' అనే రెండక్షరాల వల్ల ఆ శబ్దం ఏర్పడింది. 'తప' అనే ఆ శబ్దం మహర్షులకు అమూల్యమైన ధనం. ఆ మాట రెండుసార్లు 'తప' 'తప' అని ఉచ్చరింపబడింది. బ్రహ్మ దాన్ని విన్నాడు. ఆ శబ్దాన్ని ఉచ్చరించిన పురుషుణ్ణి చూడాలనుకొన్నాడు. నాలుగు దిక్కులకూ వెళ్ళి వెదికాడు. కాని ఎక్కడా ఆ పురుషుడు గోచరించలేదు. తిరిగివచ్చి తన నివాసమైన పద్మంలోనే కూర్చున్నాడు. కొంతసేపు ఆలోచించాడు. తన్ను తపస్సు చేయుమని హెచ్చరించడానికే ఆ శబ్దం వినిపించిందని భావించాడు. ప్రాణాయామం చేశాడు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను నిగ్రహించినాడు. చిత్తాన్ని ఏకాగ్రం చేసుకొని వెయ్యి దివ్యవర్షాలు తపస్సు చేశాడు. ఆ ఘోర తపస్సునకు లోకాలన్నీ తపించిపోయాయి. అప్పుడు శ్రీహరి ప్రసన్నుడై బ్రహ్మకు ప్రత్యక్షమయ్యాడు.

వెంటనే బ్రహ్మ వైకుంఠపురాన్ని దర్శించాడు. ఆ పురం రాజస తామసగుణాలకూ, ఆ గుణాలతో మిశ్రితమైన సత్త్వగుణానికీ అతీతంగా ఉన్నది. అది శుద్ధసత్త్వగుణానికి ఆవాసమయింది. కాలానికి అక్కడ ప్రాబల్యం లేదు. అది లోకాలకన్నింటికంటె ఉన్నతమైనది. సకలదేవతలకూ స్తుతింపదగినది. అక్కడ లోభ–మోహ–భయాలు లేవు. అక్కడికి పోయినవారు మళ్ళీ తిరిగి రావడమంటూ జరుగదు. తుదిలేని తేజస్సుతో అది ప్రకాశిస్తున్నది. అట్టి వైకుంఠాన్ని బ్రహ్మదేవుడు వీక్షించాడు.

**సీ.** **సూర్యచంద్రానలస్ఫురణలం జొరనీక నిజదీధితిస్ఫూర్తి నివ్వటిల్ల**
**దివ్యమణిప్రభాదీపిత సౌధవిమానగోపురహర్మ్యమండపములుఁ**
**బ్రసవగుచ్ఛ స్వచ్ఛ భరిత కామితఫల సంతానపాదపసముదయములుఁ**
**గాంచనదండసంగతమారుతోద్ధూత తరళవిచిత్రకేతనచయములు**

**తే.** **వికచ కైరవ దళదరవింద గత మ, రంద రసపాన మోదితేందిందిర ప్ర**
**భూత మంజుల నినదప్రబుద్ధ రాజ, హంసశోభిత వరకమలాకరములు.** **227**

**ప్రతి :** సూర్యచంద్ర+అనల= సూర్యుడు, చంద్రుడు, అగ్ని – వీరియొక్క; స్ఫురణలన్= వెలుగులను; చొరనీక= ప్రవేశించనీయక; నిజదీధితిస్ఫూర్తి= తమ కాంతుల విస్ఫురణం; నివ్వటిల్లన్= వ్యాపించగా; దివ్య= దేవలోకభవమైన; మణిప్రభా= మణుల కాంతులచేత; దీపిత= ప్రకాశింపజేయబడిన; సౌధ= మేడలు; విమానగోపుర= విమానాలు, గోపురాలు; హర్మ్య= మిద్దెలు; మండపములు= చవికలు; ప్రసవగుచ్ఛ= పూగుత్తులచేతను; స్వచ్ఛ= నిర్మలమైన; భరిత= నిండిన; కామిత= కోరిన; ఫల= ఫలాలుగల; సంతానపాదప= కల్పవృక్షాలయొక్క; సముదయములు= సమూహాలు; కాంచన దండ= స్వర్ణదండాలతో; సంగత= కూడియున్న; మారుత= గాలిచే; ఉద్ధూత= ఎగురగొట్టబడి; తరళ= చంచలమైన; విచిత్ర= వింతలైన; కేతనచయములు= టెక్కెముల సమూహాలు; వికచ= వికసించిన; కైరవ= కలువలలో; దళత్= విప్పారుచున్న; అరవింద= పద్మాలలోని; మకరందరస= తేనెయొక్క; పాన= త్రాగడంచేత; మోదిత= సంతసించిన; ఇందిందిర= తుమ్మెదలయొక్క; ప్రభూత= పెద్దదైన; మంజుల= మనోజ్ఞమగు; నినద= శబ్దంచేత; ప్రబుద్ధ= మేల్కాంచిన; రాజహంస= రాయంచలచేత; శోభిత= విరాజిల్లిన; వర= శ్రేష్ఠమైన; కమల+ఆకరములు= సరస్సులు...

**తా :** ఆ వైకుంఠనగరంలో మేడలు, విమానాలు, గోపురాలు, మిద్దెలు, మండపాలు, దివ్యమణికాంతులతో దేదీప్యమానంగా తేజరిల్లుతున్నాయి. ఆ దీప్తి ముందు సూర్యచంద్రాగ్నుల తేజస్సులు వెలవెలబోతున్నాయి. ఇంకను ఆ నగరంలో పూలగుత్తులతో నిండినవై కోరిన ఫలాలు ప్రసాదించే కల్పతరువుల గుంపులున్నాయి. బంగారు కర్రలకు తగిలించిన రంగురంగుల పతాకలు గాలి తాకిడికి రెపరెపలాడుతున్నాయి. వికసించిన కలువల్లోనూ, కమలాల్లోనూ, మకరందరసం ఆస్వాదిస్తూ మధుకరబృందాలు ఆనందంతో ఝుంకారం చేస్తున్నాయి. ఆ శబ్దానికి మేల్కొన్న కలహంసలతో అక్కడి సరస్సులు కనులపండువు గావిస్తున్నాయి.

**సీ. వల నొప్పఁగా 'న దైవం కేశవాత్పర' మ్మని పల్కు రాజకీరావళియును**
**మహిమ 'జగద్విష్ణుమయ మఖిల'మ్మని చదివెడు శారికాసముదయంబు**
**నేపారఁగా 'జితం తే పుండరీకాక్ష' యని లీలఁ బాడు పికావళియును**
**లలి మీఱఁగా 'మంగళం మధుసూదన' యనుచుఁ బల్కెడు మయూరావళియును**

**తే. దవిలి 'శ్రౌషడ్వషట్స్వధే' త్యాది శబ్ద, కలితముగ మ్రోయు మధుప నికాయములును**
**గలిగి యఖిలైక దివ్య మంగళ విలాస, మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు. 228**

**ప్రతి :** వలను+ఒప్పఁగాన్= నేర్పుతో; 'న దైవం కేశవాత్పరం'= 'కేశవునికి మించిన దైవం లేదు' అని విష్ణుపారమ్యాన్ని పల్కు= పలికే; రాజకీర+ఆవళియునున్= రాచిలుకలగుంపూ; మహిమన్= ప్రభావంలో; 'జగద్విష్ణుమయమఖిలం'= సమస్త జగత్తు విష్ణుమయం, అని చదివెడు; శారికా సముదయంబు= గోరువంకల గుంపు; ఏ పారగాన్= అతిశయించగా; పుండరీకాక్ష!= తెల్లదామరలవంటి కన్నులుగల ఓ విష్ణూ!; తే= నీకు; జయం= జయమగు గాక; అని, లీలన్= క్రీడగా; పాడు= గానం చేస్తున్న; పిక+ఆవళియును= కోయిలల సమూహమును; లలిమీఱఁగాన్= ఉత్సాహంతో; 'మంగళం మధుసూదన!'= 'మాధవా నీకు మంగళం'; అనుచున్+పల్కెడు= అని పలికే; మయూర+ఆవళియునున్= నెమళ్ళ సమూహమూ; తవిలి= ఆసక్తిగొని; 'శ్రౌషట్‌వషట్ స్వధా'+ఇత్యాదిశబ్ద కలితముగన్= "శ్రౌషట్‌వషట్‌స్వధా"– ఇవి మున్నుగాగల శబ్దాలతో కూడినట్లుగా; మ్రోయు= ధ్వనించు; మధుపనికాయములునున్= తుమ్మెదల గుంపూ; కలిగి= కల్గినదై; వైకుంఠ మందిరంబు=

వైకుంఠంలోని భవనం; దివ్యమంగళ విలాసమహిమన్= దివ్యమైన శుభాల విలాసప్రభావంచేత; చెన్ను+ఒందున్= విలసిల్లుచుండును.

**తా :** అక్కడి రాచిల్కలు 'కేశవునికంటె పరదైవం మరి లేదు' అని పల్కుతున్నాయి. గోరువంకలు 'విశ్వమంతా విష్ణుమయం' అని పల్కుతున్నాయి. కోయిలలు 'పద్మాక్షా నీదే జయం' అని పాడుతున్నాయి. నెమళ్ళు 'మధుసూదనా నీకు మంగళం' అని అంటున్నాయి. తుమ్మెదల గుంపులు 'శ్రౌషట్, వషట్, స్వధా, ఇత్యాది శబ్దాలతో ఝంకారం చేస్తున్నాయి. ఈ విధంగా వైభవోపేతమైన వైకుంఠ మందిరం సకల దివ్యమంగళ విలాసాలతో పరమ సుందరంగా భాసిస్తున్నది.

**విశే :** "స్వాహా దేవహవిర్దానే శ్రౌషడ్వౌషడ్వషట్ స్వధా" అని అమరం. యజ్ఞయాగాదులలో దేవతలకు హవిస్సు ఇచ్చేటప్పుడు శ్రౌషట్, వౌషట్, వషట్ అనియు, పితృదేవతలకిచ్చునప్పుడు 'స్వధా' అనియు ఉచ్చరిస్తారు.

"జితం తే దేవదేవేశ, జితం తే పుండరీకాక్ష' ఇత్యాదివచనాలు భగవంతుని విజయాన్ని ప్రశంసిస్తున్నాయి."

**వ. మఱియుంబయోధరావళీవిభాసితనభంబునుంబోలె వెలుంగుచున్న య ద్దివ్యధామంబునందు. 229**

**ప్రతి :** మఱియున్= ఇంకా; పయోధర= మేఘాలయొక్క; ఆవళీ= శ్రేణిచే; విభాసిత= ప్రకాశింపజేయబడిన; నభంబునున్+ పోలెన్= ఆకాశం వలె; వెలుంగుచున్న= ప్రకాశిస్తున్న; ఆ+దివ్యధామంబునందున్= ఆ దివ్యమైన మందిరంలో...

**తా :** ఇంకను మేఘపంక్తిచే విరాజిల్లే ఆకాశంలాగా తేజరిల్లుతున్న ఆ దివ్యమందిరంలో-

**సీ. సలలితేందీవరశ్యామాయమానోజ్జ్వలాంగులు నవ్యపీతాంబరులును**
**ధవళారవిందసుందరపత్రనేత్రులు సుకుమారతనులు భాసురవినూత్న**
**రత్న విభూషణ గ్రైవేయ కంకణ హార కేయూర మంజీర ధరులు**
**నిత్యయౌవనులు వినిర్మలచరితులు, రోచిష్ణులును హరిరూపధరులు**

**తే. నగు సునందుండు నందుండు నర్హణుండుఁ, బ్రబలుఁడును నాదియగు నిజపార్శ్వచరులు**
**మఱియు వైదూర్యవిద్రుమామలమృణాళ, తుల్యగాత్రులు దను భక్తితో భజింప. 230**

**ప్రతి :** సలలిత= మనోజ్ఞమైన; ఇందీవర= కలువలవలె; శ్యామాయమాన= నల్లనిరంగు కలిగిన; ఉజ్జ్వలాంగులు= ప్రకాశించే శరీరం గలవారు; నవ్యపీతాంబరులునున్= కొత్త పసుపు పచ్చని వస్త్రాలు ధరించినవారును; ధవళ= తెల్లనైన; అరవింద= పద్మాలయొక్క; సుందర= అందమైన; పత్రనేత్రులు= దళాలవంటి కన్నులు గలవారు; సుకుమారతనులు= సున్నితమైన శరీరాలు గలవారు; భాసుర= ప్రకాశించుచున్న; వినూత్న= కొంగొత్తవగు; రత్నవిభూషణ= రత్నాభరణాలు; గ్రైవేయ= కంఠహారాలూ; కంకణ= మురుగులూ; హార= ముత్యాలసరాలూ; కేయూర= భుజకీర్తులూ; మంజీరధరులు= నూపురాలు ధరించినవారు; నిత్యయౌవనులున్= శాశ్వతమైన యౌవనం కలవారు; వినిర్మల చరితులున్= స్వచ్ఛమైన నడవడి గలవారు; రోచిష్ణులునున్= కాంతిమంతులూ; హరిరూపధరులు= శ్రీహరియొక్క రూపం దాల్చినవారూ; అగు= అయిన, సునందుండు, నందుండు, అర్హణుండు, ప్రబలుఁడును; ఆదియగు= మొదలగు; నిజపార్శ్వచరులు= తనపక్కనే ఉండి సేవించువారు; మఱియున్= ఇంకనూ; వైదూర్య= వైదూర్యాలతోనూ; విద్రుమ= పగడాలతోనూ; అమల= నిర్మలమగు;

మృణాల= తామరతూడులతోనూ; తుల్యగాత్రులు= సమానమైన శరీరాలు గలవారు; తనున్= తనను; భక్తితోన్ భజింపన్= భక్తితో సేవిస్తుండగా...

**తా :** ఆ వైకుంఠంలో సునందుడూ, నందుడు, అర్హణుడు, ప్రబలుడు మున్నగు సేవకులు భగవంతుణ్ణి భక్తితో సేవిస్తున్నారు. వారు నల్లకలువలవలె నీలమైన నిగనిగలాడే శరీరాలతో విరాజిల్లుతున్నారు. పచ్చని కొంగొత్త పట్టుపుట్టాలు కట్టుకొని ఉన్నారు. తెల్ల దామర రేకులవంటి కనులతో శోభిల్లుతున్నారు. వారివి సుకుమారమైన దేహాలు. వారు ధగధగలాడే రత్నాభరణాలూ, కంఠహారాలూ, కంకణాలూ, ముత్యాలసరాలూ, భుజకీర్తులూ, నూపురాలూ ధరించి ఉన్నారు. నిత్యయౌవనంతో భాసిస్తున్నారు. పవిత్రమైన నడవడి గల్గియున్నారు. అందరూ శ్రీహరి రూపాలు దాల్చి జాజ్వల్యమానంగా వెలుగొందుతున్నారు. వారు వైడూర్యాలతోనూ, పగడాలతోనూ, నిర్మలమైన తామర తూండ్లతోనూ సమానమైన తనువులు కల్గివున్నారు. అందరూ భక్తితో శ్రీమన్నారాయణుని భజిస్తున్నారు.

**సీ. క్షాళితాఖిలకల్మషవ్రజామరనదీ జనక కోమలపదాబ్జములవాని**
**నఖిలసంపత్కారణాపాంగ లక్ష్మీ విలాసితవక్షఃస్థలంబువానిఁ**
**బద్మమిత్రామిత్రభాసిత కరుణాతరంగిత చారునేత్రములవాని**
**భువననిర్మాణనైపుణ భవ్య నిజ జన్మకారణ నాభిపంకజమువాని**

**తే. నహి హితాహితశయన వాహనములవాని, సేవితామరతాపసశ్రేణివాని**
**నఖిలలోకంబులకు గురుఁడైనవానిఁ గాంచెఁ బరమేష్ఠి గన్నుల కఱవు దీఱ. 231**

**ప్రతి :** క్షాళిత= కడిగివేయబడిన; అఖిల= సమస్తమైన; కల్మషవ్రజ= పాపసమూహంగల; అమరనదీ= గంగానదియొక్క; జనక= సంభవస్థానమగు; కోమల= మృదువైన; పద+అబ్జములవానిన్= పాదపద్మాలు గలవానిని; అఖిల= సమస్తమగు; సంపత్= సంపదలకు; కారణ= హేతువైన; అపాంగ= కడగంటిచూపుగల; లక్ష్మీ= లక్ష్మిచేత; విలాసిత= విలసిల్లజేయబడిన; వక్షఃస్థలంబువానిన్= ఉరఃప్రదేశంగలవానిని; పద్మ= కమలాలకు; మిత్ర= మిత్రుడైన సూర్యుడు; అమిత్ర= శత్రువైన చంద్రుడు వీరిచే; భాసిత= ప్రకాశింపజేయబడి; కరుణా= దయచే; తరంగిత= వ్యాప్తమైన; చారునేత్రములవానిన్= సుందరమగు కన్నులు గలవానిని; భువన= ప్రపంచముయొక్క; నిర్మాణ= కల్పనయందలి; నైపుణ= నిపుణత్వంచేత; భవ్య= శుభావహమగు; నిజ= తనయొక్క; జన్మ= పుట్టుకకు; కారణ= హేతువగు; నాభిపంకజమువానిన్= నాభిపద్మంగలవానిని; అహి= సర్పాలకు; హిత= హితుడైన ఆదిశేషుడు; అహిత= శత్రువైన గరుడుడు; శయన= శయనంగానూ; వాహనములవానిన్= వాహనంగానూ కల్గినవానిని; సేవిత= సేవింపబడిన, (సేవించునట్టి); అమర తాపసశ్రేణివానిన్= దేవతల, మునుల బృందం గలవానిని; అఖిలలోకంబులకున్= సకలలోకాలకూ; గురుఁడు+ఐనవానిన్= తండ్రియైనవానిని; పరమేష్ఠి= బ్రహ్మ; కన్నుల కఱవు+తీఱన్= నేత్రపర్వంగా; కాంచెన్= చూచాడు.

**తా :** ఆ భగవానుని కోమలమైన పాదపద్మంనుండే సకలపాపాలనూ కడిగివేసే గంగానది ఉద్భవించింది. తన కడగంటి చూపుతో కలుములనన్నిటినీ ప్రసాదించే లక్ష్మీదేవి ఆయన వక్షఃస్థలంలో నివసిస్తున్నది. ఆ దేవుడు సూర్యచంద్రులు అనే సుందరమైన కన్నులు కలవాడు. ఆ కన్నులలో కరుణా తరంగాలు పొంగిపొరలుతూ ఉంటాయి. జగన్నిర్మాణ నిపుణుడగు విధాత, ఆయన నాభికమలంనుంచే పుట్టాడు. శేషుడే ఆయనకు పడక. గరుడుడే వాహనం. ముక్కోటి దేవతలూ, మునులూ ఆయనను సేవిస్తూ ఉంటారు. ఆయన సకలలోకాలకూ తండ్రి. అట్టి పరమేశ్వరుణ్ణి బ్రహ్మ కన్నుల కరవుదీరా చూచాడు.

**క. కమనీయ రూపరేఖా, రమణీయతఁ జాల నొప్పు రమణీమణి య**
**క్కమలాలయ దన మృదు కర, కమలంబుల విభుని పాదకమలము లొత్తెన్. 232**

**ప్రతి :** కమనీయ రూపరేఖా రమణీయతన్= అందమైన సౌందర్యరేఖతో సుందరంగా; చాలన్= మిక్కిలిగా; ఒప్పు= ప్రకాశించునట్టి; రమణీమణి= నారీమణి; ఆ+కమల+ఆలయ= పద్మం నివాసంగాగల ఆ లక్ష్మి; తన మృదు కరకమలంబులన్= తన మెత్తని హస్తపద్మాలతో; విభుని= నాథుడైన శ్రీహరియొక్క; పాదకమలములు= చరణకమలాలు; ఒత్తెన్= పిసికింది.

**తా :** రూపరేఖా విలాసాలతో చక్కని చుక్కలాగా ఉన్న లక్ష్మీదేవి తన కోమలమైన పాణిపద్మాలతో తన ప్రాణనాథుడైన మహావిష్ణువుయొక్క పాదపద్మాలను ఒత్తుతున్నది.

**వ. వెండియు. 233**

**ప్రతి :** వెండియున్= మరియును...

**తా :** ఇంకా,

**శా. శ్రీకాంతాతిలకంబు రత్నరుచిరాజిప్రేంఖితస్వర్ణ డో**
**లాకేళిన్ విలసిల్లి తత్కచభరాలంకారస్రగ్గంధ లో**
**భాకీర్ణ ప్రచరన్మధువ్రత మనోజ్ఞాలోలనాదంబు ల**
**స్తోకానుస్వరలీల నొప్పఁగ నిజేశున్ వేడ్కతోఁ బాడఁగన్. 234**

**ప్రతి :** శ్రీకాంతాతిలకంబు= స్త్రీరత్నమైన లక్ష్మీదేవి; రత్నరుచి= రత్నకాంతులయొక్క; రాజి= శ్రేణిచేత; ప్రేంఖిత= కదిలించబడిన; స్వర్ణడోలాకేళిన్= బంగరుటూయెల యందు ఊగుటతో; విలసిల్లి= అలరారి; తద్= ఆమెయొక్క; కచభర= కేశపాశాలకు; అలంకారస్రక్= అలంకారమైన పూమాలలయొక్క; గంధ= సౌరభమునందలి; లోభ= ఆశచే; ఆకీర్ణ= కలగాపులగంగా; ప్రచరత్= సంచరిస్తున్న; మధువ్రత= తుమ్మెదలయొక్క; మనోజ్ఞ= మనోహరమైన; నాదంబులు= ఝుంకారాలు; అస్తోక+అనుస్వరలీలన్= ఇంపైన శ్రుతిగా; ఒప్పఁగన్= భాసించగా; నిజేశున్= తననాథుని గూర్చి; పాడఁగన్= కీర్తిస్తూ ఉండగా.

**తా :** అంతేకాదు. శ్రీమహాలక్ష్మి రత్నపుకాంతులతో విరాజిల్లు బంగరుటూయెలలో ఊగుతూవున్నది. ఆమె కొప్పులో తురిమిన పుష్పమాలికల సుగంధంమీది ఆశతో గుమిగూడిన తుమ్మెదలు మనోజ్ఞంగా ఝుంకారాలు చేస్తూ మూగుతున్నాయి. ఆ ఝుంకారమే ఇంపైన శ్రుతిగా శ్రీదేవి శ్రీహరి మీద కీర్తనలు ఆలపిస్తున్నది.

**వ. అట్టి నిత్యవిభూతియందు. 235**

**ప్రతి :** అట్టి= అటువంటి; నిత్యవిభూతియందున్= పరమపదంలో...

**తా :** ఆ విధమైన వైకుంఠంలో.

**మ. సతతజ్ఞానరమా యశో బల మహైశ్వర్యాది యుక్తున్ జగ**
**త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళత్పంకేరుహాక్షున్ శ్రియః**

**పతి నాద్యంతవికారదూరుఁ గరుణాపాథోనిధిన్ సాత్వతాం**
**పతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవిభ్రాజిష్ణు రోచిష్ణునిన్. 236**

**ప్రతి :** సతత= ఎల్లప్పుడు; జ్ఞాన= జ్ఞానమూ; రమా= లక్ష్మి; యశస్= కీర్తి; బల= బలం; మహైశ్వర్య+ఆది= గొప్ప ఐశ్వర్యం మున్నగువాటితో; యుక్తున్= కూడినవాడును; జగత్పతిన్= లోకనాథుడూ; యజ్ఞ+ఈశున్= యజ్ఞప్రభువూ; అనంతున్= అంతంలేనివాడూ; అచ్యుతున్= జారుపాటులేనివాడూ; దళత్+పంకేరుహ+అక్షున్= వికసించిన పద్మాలవంటి నేత్రాలు గలవాడూ; శ్రియఃపతిన్= దయాసాగరుడూ; సాత్వతాంపతి= యదువంశజుల ప్రభువూ; వర్ధిష్ణున్= వృద్ధి శీలుడూ; సహిష్ణున్= సహన శీలుడూ; గుణవిభ్రాజిష్ణున్= గుణాలచే భాసించువాడూ; రోచిష్ణునిన్= కాంతిమంతుడూ అగు; విష్ణున్= విష్ణుదేవుని...

**తా :** అట్టి పరమపదంలో ఎల్లవేళలా జ్ఞానం, సంపద, కీర్తి, బలం, ఐశ్వర్యం కలవాడూ, భువనాలకు ప్రభువూ, యజ్ఞానికి అధీశ్వరుడూ, తుదిలేనివాడు, చ్యుతిలేనివాడూ, వికసించునట్టి పద్మాలవంటి నేత్రాలు కలవాడూ, లక్ష్మీవల్లభుడూ, మొదలు, తుది అనే కొలమానాలు లేనివాడూ, దయాసముద్రుడూ, యాదవులకు అధినాథుడు, వృద్ధిశీలుడు, సహనశీలుడు, అంతటా వ్యాపించినవాడు, కల్యాణ గుణాలతో విరాజిల్లేవాడు, కాంతిమంతుడు

**విశే :** 'సాత్వతాం పతి' – దీనిని అలుక్సమాసం అంటారు. విభక్తి ప్రత్యయానికి లోపం రాకపోవటం ఇందులో గమనింపదగిన విషయం. 'సాత్వతామ్' – సంస్కృత షష్ఠీ బహువచనాంతపదం. బలరాముడు ఆదిగురువుగా ఒక ప్రత్యేకమైన భక్తిమార్గాన్ని అవలంబించే యాదవులను సాత్వతులంటారు. 'శ్రియఃపతి' కూడా అలుక్సమాసమే.

**మ. దరహాసామృతపూరితాస్యు నిజభక్తత్రాణపారాయణు**
**న్నరుణాంభోరుహపత్రలోచనునిఁ బీతావాసుఁ ద్రైలోక్య సుం**
**దరు మంజీరకిరీటకుండలముఖోద్యద్భూషు యోగీశ్వరే**
**శ్వరు లక్ష్మీయుతవక్షుఁ జిన్మయు దయాసాంద్రుం జతుర్బాహునిన్. 237**

**ప్రతి :** దరహాస+అమృత పూరిత+ఆస్యున్= చిరునవ్వు అనే అమృతంతో నిండిన వదనం కలవాడు; నిజభక్తత్రాణ పారాయణున్= తనభక్తులను రక్షించుటయందాసక్తి గలవాడూ; అరుణ+అంభోరుహ పత్రలోచనునిన్= ఎర్ర తామరల రేకులవంటి నేత్రాలు కలవాడూ; పీతావాసున్= పచ్చని వస్త్రాలు గలవాడూ; త్రైలోక్యసుందరున్= ముల్లోకాలలో అందగాడు; మంజీర కిరీట కుండలముఖ+ఉద్యద్+భూషున్= అందెలు, కిరీటం, మకర కుండలాలూ మొదలగు మేలి సొమ్ములు గలవాడు; యోగి+ఈశ్వర+ఈశ్వరున్= యోగీశ్వరులకు ఈశ్వరుడు; లక్ష్మీయుతవక్షున్= వక్షంలో లక్ష్మిగలవాడూ; చిత్+ మయున్= జ్ఞానస్వరూపుడూ; దయాసాంద్రున్= కృపానిధీ; చతుర్బాహునిన్= నాల్గు భుజాలు కలవాడూ అగు విష్ణుని...

**తా :** చిరునవ్వు అనే అమృతం నిండిన నెమ్మోము గలవాడూ, తన భక్తులను కాపాడడంలో ఆసక్తి గలవాడూ, ఎర్రతామర రేకులవంటి నేత్రాలు కలవాడూ, పీతాంబరుడూ, త్రిలోక సుందరుడూ, అందెలు, కిరీటం, మకర కుండలాలు మున్నగు మంచి సొమ్ములు దాల్చినవాడూ, యోగీశ్వరులకు ప్రభువూ, వక్షఃస్థలంలో లక్ష్మిని ధరించినవాడు, జ్ఞానస్వరూపుడూ, కృపామయుడూ, నాల్గుభుజాలు గలవాడూ అయిన విష్ణుదేవుని

**విశే :** పీత+ఆవాసుడు= నిలువెల్లా బంగారువన్నెగల వస్త్రం ధరించినవాడు పీతావాసుడు.

**వ. మఱియు ననర్ఘ రత్నమయ సింహాసనాసీనుండును, సునంద నందకుముదాది సేవితుండును, బ్రకృతిపురుష మహదహంకారంబులను చతుశ్శక్తులును గర్మేంద్రియ జ్ఞానేంద్రియమనో మహాభూతంబులను షోడశ శక్తులును బంచతన్మాత్రంబులునుం బరివేష్టింపఁ గోట్యర్క ప్రభావిభాసితుండును, స్వేతరాలభ్య స్వాభావిక సమస్తైశ్వర్యాతిశయుండునునై స్వస్వరూపంబునం గ్రీడించు సర్వేశ్వరుండైన పరమపురుషుం బురుషోత్తముం బుండరీకాక్షు నారాయణుం జూచి సాంద్రానందకందళిత హృదయారవిందుండును, రోమాంచకంచుకితశరీరుండును, ఆనందబాష్పధారాసిక్తకపోలుండును నగుచు. 238**

**ప్రతి :** మఱియున్= ఇంకా; అనర్ఘ రత్నమయ సింహాసన+ఆసీనుండునున్= అమూల్యమైన రత్నాలతో నిర్మింపబడిన సింహాసనం అధిష్ఠించినవాడూ; సునంద నంద కుముద+ఆది సేవితుండును= సునందుడు, నందుడు, కుముదుడు మున్నగువారిచే సేవింపబడినవాడూ; ప్రకృతి పురుష మహత్+అహంకారంబులు+అను= ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వం, అహంకారం అను; చతుర్+శక్తులును= నాల్గు శక్తులూ; కర్మ+ఇంద్రియ జ్ఞాన+ఇంద్రియ మనస్+మహాభూతంబులు+అను షోడశశక్తులునున్= ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, ఐదు మహాభూతాలూ అనే పదునారు శక్తులూ; పంచతన్మాత్రంబులునున్= శబ్దాదులగు ఐదు తన్మాత్రలూ; పరివేష్టింపన్= చుట్టూచేరగా; కోటి+అర్క ప్రభావిభాసితుండును= కోటిమంది సూర్యుల కాంతివంటి కాంతిచే భాసించువాడూ; స్వ+ఇతర+అలభ్య= తనకంటె ఇతరులయందు లభించని; స్వాభావిక= తనకు సహజ సిద్ధమైన; సమస్త+ఐశ్వర్య+అతిశయుండును= సమస్తఐశ్వర్యాలయొక్క ఆధిక్యం కలవాడూ; ఐ= అయి; స్వస్వరూపంబునన్= నిజరూపంతో; క్రీడించు= ఆటలాడుచున్న; సర్వ+ఈశ్వరుండు+ఐన= సర్వానికీ ప్రభువైన; పరమపురుషున్= పరమోన్నతుడైన పురుషుని; పురుష+ఉత్తమున్= పురుషులలో ఉత్తముని; పుండరీకాక్షున్= పద్మనేత్రుని; నారాయణున్+చూచి= శ్రీమన్నారాయణుని దర్శించి; సాంద్ర+ఆనంద= అధికమైన ఆనందంచే; కందళిత= వికసించిన; హృదయ+అరవిందుండునున్= హృదయమనే పద్మంకలవాడూ; రోమాంచ= గగుర్పాటుచే; కంచుకిత= వ్యాప్తమైన; శరీరుండును= శరీరం కలవాడునూ; ఆనందబాష్పధారా= ఆనంద బాష్పాల ధారలచే; సిక్త కపోలుండునున్= తడిసిన గండస్థలం కలవాడునూ; అగుచున్= అవుతూ.

**తా :** అమూల్యమైన రత్నమయ సింహాసనంలో కూర్చున్నవాడు, సునందుడు, నందుడు, కుముదుడు మొదలగు అనుచరుల సేవలు గైకొనువాడు, ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వం, అహంకారం అనే నాల్గుశక్తులు, వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనే ఐదు కర్మేంద్రియాలు, శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణం అనే ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం–అనే ఐదు మహాభూతాలు ఈ పదునారు శక్తులు, శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే ఐదు తన్మాత్రలు తనచుట్టూ చేరి కొలుస్తుండగా కోటి సూర్యుల కాంతితో వెలుగొందుతూ, ఇతరులకు అలభ్యమై, తనకు మాత్రమే సహజమైన సకలైశ్వర్యాలతో భాసించేవాడు, నిజస్వరూపంతో క్రీడించేవాడూ, అంతటికీ అధినాయకుడూ, పరమపురుషుడూ, పరమశ్రేష్ఠుడూ, పద్మలోచనుడూ అయిన శ్రీమన్నారాయణుణ్ణి బ్రహ్మ దర్శించాడు. ఆయన హృదయకమలం అమితానందంతో వికసించింది. శరీరం గగుర్పాటు చెందింది. ఆయన చెక్కిళ్ళు ఆనందబాష్పాలతో తడిసిపోయాయి.

**క. వర పరమహంస గమ్య, స్ఫురణం దనరారు పరమపురుషుని పద పం**
**కరుహములకు నజుఁడు చతు, శ్శిరములు సోఁకంగ నతులు సేసిన హరియున్. 239**

**ప్రతి :** వర= శ్రేష్ఠులైన; పరమహంస= పరమహంసలచే; గమ్యస్ఫురణన్= పొందదగిన స్ఫూర్తితో; తనరారు= విలసిల్లునట్టి; పరమపురుషుని= పురుషోత్తమునియొక్క; పదపంకరుహములకున్= పాదపద్మాలకు; అజుఁడు= బ్రహ్మ; చతుర్+శిరములు= నాల్గు తలలు; సోఁకంగన్= తగులునట్లుగా; నతులు+చేసినన్= ప్రణామాలు చేయగా; హరియున్= ఆ శ్రీహరియును...

**తా :** మహానుభావులగు పరమహంసలకు మాత్రమే చేరదగిన ఆ పరమ పురుషుని పాదపద్మాలకు బ్రహ్మదేవుడు తన నాలుగు శిరస్సులు తగులునట్లు ప్రణామాలు చేశాడు. అప్పుడు శ్రీహరి కూడా

**చ. ప్రియుఁడగు బొడ్డుఁదమ్మి తొలిబిడ్డఁడు వేలుపుఁబెద్ద భూత సం**
**చయములఁ జేయు కర్త నిజశాసనపాత్రుఁడు ధాత మ్రొక్కినన్**
**దయ దళుకొత్తఁ బల్కెఁ బ్రమదస్మితచారుముఖారవిందుఁడై**
**నయమునఁ బాణిపంకజమునన్ హరి యాతని దేహ మంటుచున్. 240**

**ప్రతి :** ప్రియుఁడు+అగు= ప్రియమైన; బొడ్డు+తమ్మి తొలిబిడ్డఁడు= నాభిపద్మంనుండి కల్గిన మొదటి పుత్రుడు; వేలుపు+పెద్ద= దేవతలలో పెద్దవాడు; భూతసంచయములన్= ప్రాణిసమూహాలను; చేయు కర్త= సృష్టించే ధాత; నిజశాసన పాత్రుఁడు= తన ఆజ్ఞకు పాత్రమైనవాడు; అగు, ధాత= బ్రహ్మ; మ్రొక్కినన్= నమస్కరించగా; హరి= శ్రీహరి; దయ తళుకొత్తన్= కృప ప్రసరించగా; ప్రమదస్మిత చారుముఖ+అరవిందుఁడు+ఐ= సంతోషంతోకూడిన చిరునవ్వు చిందిస్తున్న అందమైన ముఖపద్మం కలవాడై; నయమునన్= మెల్లగా; పాణిపంకజమునన్= పద్మంవంటిహస్తంతో; ఆతని దేహము+అంటుచున్= అతని శరీరం స్పృశిస్తూ; పల్కెన్= చెప్పినాడు.

**తా :** తన నాభిపద్మంలో పుట్టిన ముద్దుల పెద్దకొడుకు, దేవతలలో జ్యేష్ఠుడు, ప్రాణి సమూహముల సృష్టికర్త, తన ఆజ్ఞననుసరించి మెలగేవాడు, అయిన బ్రహ్మ తనకు నమస్కరించేసరికి శ్రీహరికి దయ పొంగిపొరలింది. ఆనందంతో కూడిన మందహాసంతో ఆయన ముఖపద్మం వికసించింది. తన కరారవిందంతో బ్రహ్మ శరీరాన్ని మెల్లగా నిమురుతూ శ్రీమన్నారాయణుడిలా అన్నాడు.

**ఆ. కపటమునుల కెంత కాలమునకు నైన, సంతసింప నేను జలజగర్భ!**
**చిరతపస్సమాధిఁజెంది విసర్గేచ్ఛ, మెలఁగు నిన్నుఁ బరిణమింతుఁగాని. 241**

**ప్రతి :** జలజగర్భ!= పద్మగర్భుడవైన బ్రహ్మా!; నేను, కపటమునులకున్= చిత్తశుద్ధిలేని తాపసులకు; ఎంతకాలమునకునైనన్= ఎంత సమయానికైనను; సంతసింపన్= సంతోషించను; చిరతపస్సమాధిన్= బహుకాలం తపోనిష్ఠను; చెంది= పొంది; విసర్గ+ఇచ్ఛన్= జగత్తును సృష్టించాలన్న కోరికతో; మెలఁగు నిన్నున్= ప్రవర్తించే నిన్ను; పరిణమింతున్+కాని= అనుమోదిస్తాను.

**తా :** పద్మజా! చిరకాలం నన్ను సేవించినప్పటికీ చిత్తశుద్ధి లేని మునులపట్ల నేను సంతోషం పొందను. బహుకాలం తపోనిష్ఠలో ఉండి జగత్సృష్టి చేయాలన్న కోరికతో ఉన్న నిన్ను మాత్రం నేను మెచ్చుకొంటున్నాను.

**తే. భద్రమగుఁగాక నీకు నో పద్మగర్భ! వరము నిపుడిత్తు నెఱిఁగింపు వాంఛితంబు;**
**దేవదేవుఁడనగు నస్మదీయపాద, దర్శనంబవధి విపత్తిదశల కనఘ! 242**

**ప్రతి :** ఓ పద్మగర్భ!= ఓ కమలగర్భా!; నీకున్ భద్రమగున్ గాక!= నీకు మంగళమగుగాక!; వాంఛితంబున్= నీ కోరికను; ఎఱిఁగింపు= తెలుపుము; ఇపుడు, వరమున్, ఇత్తున్= ఇప్పుడే వరమిస్తాను; అనఘ!= పాపరహితా!; దేవదేవుఁడన్+అగు= దేవతలకును దేవుడనైన; అస్మదీయపాదదర్శనంబు= నా చరణసందర్శనం; విపత్తి దశలకున్= ఆపదవస్థలకు; అవధి= చివరిహద్దు.

**తా :** కమలగర్భా! నీకు మంగళమగుగాక! నీ కోరిక ఏమిటో చెప్పు. ఇప్పుడే నీకు వరం ప్రసాదిస్తాను. పాపరహితుడా! దేవ దేవుణ్ణి అయిన నా పాదసందర్శనంతో ఆపదలన్నీ అంతమైపోతాయి.

**చ. సరసిజగర్భ! నీయెడఁ బ్రసన్నత నొంది మదీయలోక మే**
**నిరవుగఁ జూపుటెల్లను నహేతుక భూరి దయా కటాక్ష వి**
**స్ఫురణన కాని, నీదగు తపోవిభవంబునఁ గాదు, నీ తప**
**శ్చరణము నాదు వాక్యముల సంగతిఁగాదె సరోజసంభవా! 243**

**ప్రతి :** సరసిజగర్భ!= పద్మసంభవా!; నీ యెడన్= నీ పట్ల; ప్రసన్నతన్+ఒంది= ప్రసన్నత్వాన్ని పొంది; ఏను= నేను; మదీయలోకము= నా లోకాన్ని; ఇరవుగన్= స్థిరంగా; చూపుట+ఎల్లనున్= చూపించడమంతా; అహేతుక భూరి దయాకటాక్ష విస్ఫురణన్+అ+కాని= ప్రత్యేకమైన కారణంలేని గొప్ప కృపాకటాక్ష ప్రసారంవల్లనే కాని; నీ దగు తపస్+ఎభవంబునన్ కాదు= నీ తపః ప్రభావం వల్ల కాదు; సరోజసంభవా!= కమలసంభవా!; నీ తపస్+చరణము= నీవు తపస్సు చేయడం; నాదు వాక్యముల సంగతిన్+కాదె= నేను చెప్పిన మాటలను బట్టియే కదా!

**తా :** అరవిందోద్భవా! నీపై అనుగ్రహం కలిగి నీకు నా వైకుంఠలోకమంతా చూపాను. ఇలా చూపడానికి కారణం ఉన్నది. ఇది నా అపార కృపాకటాక్ష ప్రసారం వల్లనే జరిగింది గాని నీతపోవైభవం వల్ల జరుగలేదు. పద్మసంభవా! నీవు తపస్సు చేయడం కూడా నా మాటలను పాటించడంవల్లనే కదా!

**క. తప మనఁగ మత్స్వరూపము, తపమను తరువునకు ఫలవితానము నే నా**
**తపముననే జనన స్థి, త్యుపసంహరణము లొనర్చుచుండుదుఁదనయా! 244**

**ప్రతి :** తనయా!= కుమారా!; తపము+అనఁగన్= తపస్సు అంటే; మత్స్వరూపము= నా స్వరూపం; తపము+అను= తపస్సనే; తరువునకున్= వృక్షానికి; ఫలవితానము నేను= ఫలాల సముదాయం నేనే; ఆ తపముననే= ఆ తపస్సు వల్లనే; జనన+స్థితి+ఉపసంహరణములు= సృష్టి స్థితి సంహారాలు; ఒనర్చుచుండుదున్= చేస్తూ ఉంటాను.

**తా :** తపస్సు అంటే నా స్వరూపమే, కాని మరేమీ కాదు. తపస్సు అనే చెట్టుకు ఫలం నేనే. కుమారా! ఆ తపస్సు వలననే నేను సృష్టి స్థితిలయాలు నిర్వహిస్తూ ఉంటాను.

**క. కావున మద్భక్తికిఁ దప, మే విధమున మూలధనమొ యిది నీ మది రా**
**జీవభవ! యెఱిఁగి తప మిటు, గావించుట విగతమోహకర్ముఁడ వింకన్. 245**

**ప్రతి :** రాజీవభవ= పద్మసంభవా!; కావునన్= అందువల్ల; మద్భక్తికిన్= నా మీది భక్తికి; ఏ విధమునన్= ఏవిధంగా; తపము= తపస్సు; మూలధనమొ= ఆధారభూతమగు ధనమో; ఇది= ఈ సంగతి; నీ మదిన్= నీ చిత్తంలో; ఎఱిఁగి= తెలుసుకొని; తపము+ఇటుగావించుటన్= ఇలా తపస్సు చేశావు కాబట్టి; ఇంకన్= ఇకపై; విగతమోహకర్ముఁడవు= (నీవు) కర్మమోహాలు తొలగినవాడవైతివి.

**తా :** కమలభవా! అందువల్ల నా మీద భక్తిని ఏ రీతిగా చూపినా దానికి తపస్సే మూలధనం. ఇది నీ మనస్సులో బాగా గుర్తించి తపస్సు చేశావు. అందుచేత నీ కర్మలూ, మోహం ఇంక తొలగిపోయాయి.

**క. అని యానతిచ్చి కమలజ!, యెనయఁగ భవదీయమానసేప్సిత మే మై**
**నను నిత్తు వేఁడు మనినను, వనరుహసంభవుఁడు వికచవదనుం డగుచున్. 246**

**ప్రతి :** అని ఆనతి+ఇచ్చి= అని చెప్పి; కమలజ!= పద్మసంభవా!; ఎనయఁగన్= పొందునట్లుగా; భవదీయమానస+ ఈప్సితము+ఏమి+ఐనన్+ఇత్తున్= నీ మనసులోని కోరిక ఏదైనా ఇస్తాను; వేఁడుము+అనినను= కోరుకొమ్మని చెప్పగా; వనరుహ సంభవుఁడు= పద్మసంభవుడగు బ్రహ్మ; వికచవదనుండు+అగుచున్= వికసిత ముఖుడవుతూ...

**తా :** ఈ రీతిగా చెప్పి విష్ణుదేవుడు మరల "చతుర్ముఖా! నీ మనోభీష్టం ఏదైనా సరే ఇస్తాను. కోరుకో" అని అన్నాడు. ఆ మాటలు వినగానే విధాత మోము సంతోషాతిశయంతో విప్పారింది.

**చ. హరివచనంబు లాత్మకుఁ బ్రియం బొనరింపఁ బయోజగర్భుఁ డో**
**పరమపదేశ! యోగిజనభావన! యీ నిఖిలోర్వియందు నీ**
**యరయని యట్టి యర్థ మొకఁడైనను గల్గునె? యైన నా మదిన్**
**బెరసిన కోర్కి దేవ! వినిపింతు దయామతిఁ జిత్తగింపవే! 247**

**ప్రతి :** హరివచనంబులు= శ్రీహరి మాటలు; ఆత్మకున్= చిత్తానికి; ప్రియంబు+ఒనరింపన్= ప్రీతి గూర్చగా; పయోజగర్భుఁడు= పద్మగర్భుడైన బ్రహ్మ; ఓ పరమపద+ఈశ= ఓ వైకుంఠనాథా!; యోగిజనభావన= యోగమార్గం అనుసరించే జనుల హృదయాలలో సంచరించేవాడా! దేవ!; ఈ నిఖిలోర్వియందున్= ఈ సకల ధరాతలంలో; నీ+అరయని+ అట్టి= నీకు గోచరించనట్టి; అర్థము+ఒకఁడు+ఐనను= విషయం ఒక్కటైనా; కల్గును+ఎ= ఉందునా?; ఐనన్= ఐనప్పటికీ; నా మదిన్= నా చిత్తంలో; బెరసిన= కలిగిన; కోర్కి= అభిలాష; వినిపింతున్= నీకు వినిపిస్తాను; దయామతిన్= కృపగలచిత్తంతో; చిత్తగింపవే (చిత్తగింపుము+ఏ)= మనస్కరింపుమా!

**తా :** శ్రీహరి మాటలు హృదయానికి ఆనందం కల్గించగా బ్రహ్మ ఆయనతో ఇలా అన్నాడు. "పరమపద ప్రభుడవగు ఓ స్వామీ! యోగిజన హృదయాంతర్యామీ! ఈ సమస్తమైన ధరాతలంలో నీకు తెలియని విషయం ఏమైనా ఉంటుందా? ఐనా నా చిత్తంలో నెలకొన్న కోరిక నీకు మనవి చేస్తాను. దేవా! దయతో చిత్తగించు

**విశే :** చిత్తగింపుము+ఏ – ఇక్కడ 'ఏ' అనేది సంప్రార్థనంలో క్రియాపదానికి చేరుతుంది. అప్పుడు, వెనుక ఉన్న ము అనే ప్రత్యయానికి 'వుజి' ఆదేశంగా వస్తుంది. చిత్తగింపవే అవుతుంది.

**వ. దేవా! సర్వభూతాంతర్యామివై భగవంతుండవైన నీకు నమస్కరించి మదీయ వాంఛితంబు విన్నవించెద నవధరింపు; మవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయ స్థూలసూక్ష్మరూపంబులును,**

**నానాశక్త్యుపబృంహితంబులైన బ్రహ్మాది రూపంబులును, నీయంత నీవే ధరించి జగదుత్పత్తి స్థితిలయంబులం దంతు కీటంబునుం బోలెఁ గావించుచు నమోఘసంకల్పుండవై లీలావిభూతిం గ్రీడించు మహిమంబు దెలియునట్టి పరిజ్ఞానంబుఁ గృపసేయుము. భవదీయ శాసనంబున జగన్నిర్మాణంబు గావించునపుడు బ్రహ్మాభిమానంబునంజేసి యవశ్యంబును మహదహంకారంబులు నామదిం బొడముం గావునఁ దత్పరిహారార్థంబు వేఁడెద. నన్నుం గరుణార్ద్ర దృష్టి విలోకించి దయసేయు మని విన్నవించిన నాలించి పుండరీకాక్షుం డతని కిట్లనియె. 248**

**ప్రతి :** దేవా!= భగవంతుడా!; సర్వభూత+ అంతర్యామివి+ఐ= సమస్తప్రాణులలో అంతర్యామిగానుండి; భగవంతుండవు+ఐన నీకున్= షడ్గుణైశ్వర్యసంపదతో అలరారు నీకు; నమస్కరించి= మొక్కి; మదీయవాంఛితంబున్= నా కోరికను; విన్నవించెదన్= మనవిచేస్తాను; అవధరింపు= చిత్తగించు; అవ్యక్తరూపంబులు+ఐ= అస్పష్టమైన రూపాలు గలవియై; వెలుంగు= ప్రకాశించు; భవదీయస్థూల సూక్ష్మరూపంబులును= నీ యొక్క స్థూలరూపాలూ, సూక్ష్మరూపాలూ; నానాశక్తి+ఉపబృంహితంబులు+ఐన= వివిధశక్తులచే వృద్ధిజెందినవైన; బ్రహ్మాదిరూపంబులునున్= బ్రహ్మ మున్నగురూపాలూ; నీ యంత నీవే ధరించి= నీకు నీవే తాల్చి; జగత్+ఉత్పత్తి స్థితిలయంబులన్= ప్రపంచంయొక్క సృష్టి, స్థితి, వినాశాలను; తంతుకీటంబునున్+పోలెన్= సాలీడులాగా; కావించుచున్= చేస్తూ; అమోఘసంకల్పుండవు+ఐ= వ్యర్థం కాని సంకల్పం గలవాడవై; లీలావిభూతిన్= లీలల వైభవంతో వెలిగే జగత్తులు; క్రీడించు= వినోదించు; మహిమంబున్= ప్రభావాన్ని; తెలియునట్టి= గ్రహించునట్టి; పరిజ్ఞానంబున్= తెలివిని; కృప+చేయుము= దయసేయుము; భవదీయశాసనంబునన్= నీ యాజ్ఞచే; జగత్+నిర్మాణంబున్= లోకంయొక్క ఉత్పత్తిని; కావించునపుడు= చేసే సమయంలో; బ్రహ్మ+అభిమానంబునన్+చేసి= 'బ్రహ్మను' అన్న అభిమానంవల్ల; అవశ్యంబును= తప్పకుండా; మహత్+అహంకారంబులు= మహత్తు, అహంకారం; నా మదిన్= నా చిత్తంలో; పొడమున్= కలుగుతాయి; కావునన్= కాబట్టి; తత్పరిహార+అర్థంబు= వాటి తొలగింపుకొరకు; వేఁడెదన్= నిన్ను ప్రార్థిస్తున్నాను; నన్నున్= నన్ను; కరుణా+ఆర్ద్ర దృష్టిన్= దయార్ద్రమైన చూపుతో; దయసేయుము+అని= కృపసేయుమని; విన్నవించినన్= విజ్ఞప్తి చేసుకొనగా; ఆలించి= విని; పుండరీక+అక్షుండు= పద్మనేత్రుడు; అతనికిన్= ఆ బ్రహ్మకు; ఇట్లు+ అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** 'స్వామీ! నీవు భగవంతుడవై సకలప్రాణులలో అంతర్యామివై ఉన్నావు. ఇట్టి నీకు నమస్కరించి నా కోరిక నీకు విన్నవిస్తాను, అవధరించు. వ్యక్తం కాని రూపాలతో ప్రకాశించే నీ స్థూలసూక్ష్మ స్వరూపాలూ, వివిధ శక్తులలో వృద్ధినొంది విలసిల్లే బ్రహ్మమొదలైన వారి రూపాలు నీయంతట నీవే ధరిస్తున్నావు. సాలెపురుగులాగా జగత్తుయొక్క సృష్టినీ, స్థితినీ, లయాన్నీ నిర్వహిస్తున్నావు. నీ సంకల్పం వ్యర్థం కానిది. ఇలా ఈ జగత్తులో వినోదిస్తున్న నీ మహిమ గ్రహించే తెలివి నాకు ప్రసాదించు. నేను నీ ఆజ్ఞానుసారంగా జగత్తును నిర్మిస్తూ ఉంటాను. ఆ పని చేసేటప్పుడు నేను బ్రహ్మను కదా, అన్న అభిమానంతో నా మనస్సులో మహదహంకారాలు పొడసూపుతాయి. వాటిని నశింపజేయవలసిందిగా వేడుకొంటున్నాను. నన్ను దయార్ద్రమైన దృష్టితో చూచి అనుగ్రహించు' అని బ్రహ్మదేవుడు చేసిన విన్నపం విని పద్మాక్షు డతనితో ఇలా అన్నాడు.

**విశే :** పరమాత్మకు నిత్యవిభూతి, లీలావిభూతి అని రెండు ఉన్నాయి. నిత్యవిభూతి శ్రీవైకుంఠం. లీలావిభూతి జగత్తు.

**క. వారిజభవ! శాస్త్రార్థ వి, చారజ్ఞానమును భక్తి సమధికసాక్షా**
**త్కారము లను నీ మూఁడు ను, దారత నీ మనమునందు ధరియింపనగున్. 249**

**ప్రతి :** వారిజభవ!= పద్మసంభవా!; శాస్త్ర+అర్థ విచారజ్ఞానమును= శాస్త్రాల అర్థాన్ని విచారించే జ్ఞానం; భక్తి; సమధికసాక్షాత్కారములు+అను= అధికమైన సాక్షాత్కారం–అనే; ఈ మూఁడున్= ఈ మూడింటినీ; నీ మనమునందున్= నీ చిత్తంలో; ఉదారతన్= గొప్పగా; ధరియింపనగున్= వహింపనగును.

**తా :** ఓ సరోజసంభవా! శాస్త్రాల అర్థాన్ని పరిశీలించే జ్ఞానం, భక్తి, ఉత్తమమగు సాక్షాత్కారం–అనే ఈ మూడు లక్షణాలనూ నీ చిత్తంలో గట్టిగా నిల్పుకో!

**సీ. పరికింప మత్స్వరూపస్వభావములును మహిమావతారకర్మములుఁ దెలియఁ**
**తత్త్వవిజ్ఞానంబు దలకొని మత్ప్రసాదమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ!**
**సృష్టిపూర్వమునఁ జర్చింప నే నొకరుండఁ గలిగి యుండుదు వీతకర్మి నగుచు**
**సమధికస్థూలసూక్ష్మ స్వరూపములుఁ దత్కారణప్రకృతియుఁ దగు మదంశ**

**ఆ. మందు లీనమైన నద్వితీయుండనై, యుండు నాకు నన్య మొకటి లేదు;**
**సృష్టికాలమందు సృజ్యమానం బగు, జగము మత్స్వరూప మగును వత్స! 250**

**ప్రతి :** కమలగర్భ= పద్మసంభవా!; పరికింపన్= పరిశీలింపగా; మత్స్వరూప స్వభావములును= నా స్వరూపం, నా స్వభావం; మహిమ+అవతారకర్మములున్= ప్రభావ సంపన్నమైన అవతారకృత్యాలూ; తెలియన్= గ్రహించడానికి; తత్త్వవిజ్ఞానంబు= పరతత్త్వానికి సంబంధించిన జ్ఞానం; తలకొని= ఏర్పడి; మత్+ప్రసాదమునన్= నా అనుగ్రహంచే; నీకు; కల్గెడిన్= కల్గుతుంది; సృష్టిపూర్వమునన్= సృష్టికి ముందు; చర్చింపన్= విచారించగా; నేను+ఒకరుండన్= నే నొక్కడనే; వీతకర్మిన్ అగుచున్= కర్మలేనివాడనై; కలిగి యుండుదున్= ఏర్పడి ఉంటాను; సమధిక స్థూలసూక్ష్మ స్వరూపములున్= అధికమైన స్థూలం, సూక్ష్మం అగురూపాలూ; తత్కారణ ప్రకృతియున్= వాటికి హేతువగు ప్రకృతీ; తగు మదంశమందున్= అనువైన నా అంశంలో; లీనమైనన్= లయం కాగా; అద్వితీయుండను+ఐ= రెండవది లేనివాడనై, సాటిలేనివాడనై; ఉండు= ఉన్నట్టి; నాకున్ అన్యము+ఒకటి లేదు= నా కంటె భిన్నమైనది మరొకటి లేదు; వత్స!= కుమారా!; సృష్టికాలమందున్= సృష్టి జరిగే సమయంలో; సృజ్యమానంబు+అగు= సృజింపబడునట్టి; జగము= లోకం; మత్స్వరూపము+అగును= నా స్వరూపమే అవుతున్నది.

**తా :** పద్మసంభవా! నా స్వరూపం, స్వభావం, ప్రభావం, అవతారం, అందు నేను చేసే కర్మలూ– వాటి నన్నింటినీ గ్రహించే తత్త్వజ్ఞానం నా అనుగ్రహంవల్లనే నీకు కలుగుతుంది. సృష్టికిముందు నేను ఒక్కడుగానే ఉంటాను. అప్పుడు నాకు ఎట్టి కర్మసంబంధం ఉండదు. స్థూలరూపం, సూక్ష్మరూపం, వాటికీ హేతువగు ప్రకృతీ, నా అంశంలోనే లీనమై ఉంటాయి. అందువల్ల నేనొక్కడనే తప్ప నాకంటే వేరైన మరొక పదార్థం లేదు, ఉండదు. కుమారా! సృష్టికాలంలో ఉద్భవించే జగత్తంతా నా స్వరూపమే అని గ్రహించుకో!

**క. అరయఁగఁ గల్పప్రళయాం, తరమున నాద్యంతవిరహితక్రియతోడం**
**బరిపూర్ణనిత్యమహిమం, బరమాత్ముఁడనై సరోజభవ! యే నుందున్. 251**

**ప్రతి :** సరోజభవ!= కమలభవా!; ఏను= నేను; అరయఁగన్= పరిశీలింపగా; కల్పప్రళయాంతరమునన్= కల్పానికీ ప్రళయానికీ మధ్య కాలంలో; ఆది+అంతవిరహిత క్రియతోడన్= తుది మొదలు లేని క్రియాకలాపంతో; పరిపూర్ణ నిత్య మహిమన్= అంతటా నిండిన శాశ్వతమైన ప్రభావంతో; పరమాత్ముఁడను+ఐ= పరమపురుషుడనై; ఉందున్= ఉంటాను.

**తా :** కమలోద్భవా! కల్పానికీ ప్రళయానికీ మధ్యకాలంలో నేను తుద, మొదలు లేనివాడనై, పరిపూర్ణంగా శాశ్వతమైన మహిమతో పరమాత్ముడనై ఉంటాను.

**వ. అదియుంగాక నీవు నన్నడిగిన యీ జగన్నిర్మాణమాయా ప్రకారం బెఱింగింతు, లేని యర్థంబు శుక్తి రజతభ్రాంతియుంబోలె నేమిటి మహిమం దోఁచి క్రమ్మఱం దోఁపకమాను నదియె మదీయ మాయావిశేషం బని యెఱుంగు; మదియునుం గాక లేని యర్థంబు దృశ్యమానం బగుటకును, గల యర్థంబు దర్శనగోచరంబు గాకుండుటకును, ద్విచంద్రాదికంబును దమః ప్రభాసంబును దృష్టాంతంబులుగాఁ దెలియు; మే ప్రకారంబున మహాభూతంబులు భౌతికంబులయిన ఘట పటాదులందుఁ బ్రవేశించియుండు, నా ప్రకారంబున నేను నీ భూత భౌతికంబు లయిన సర్వకార్యంబులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించి యుండుదు; భౌతికంబులు భూతంబులందుఁ గారణావస్థంబొందు చందంబున భూతభౌతికంబులు గారణావస్థం బొంది నాయందు నభివ్యక్తంబులై యుండవు; సర్వదేశంబులయందును, సర్వకాలంబులయందును, నేది బోధితంబై యుండు నట్టిదియ పరబ్రహ్మస్వరూపంబు; తత్త్వం బెఱుంగ నిచ్ఛించిన మిముబోఁటి వారలకు నీ చెప్పిన మదీయ తత్త్వాత్మకంబైన యర్థంబ యర్థం బని యెఱుంగు; ఈ యర్థం బుత్కృష్టం బయినయది; యేకాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయచిత్తంబున ధరియించిన నీకు సర్గాది కర్మంబులందు మోహంబు సెందకుండెడి నని భగవంతుండయిన పరమేశ్వరుండు చతుర్ముఖున కానతిచ్చి నిజలోకంబుతో నంతర్ధానంబు నొందె నని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె. 252**

**ప్రతి :** అదియున్+కాక= అంతేకాక; నీవు నన్నడిగిన= నీవు నన్ను ప్రశ్నించిన; ఈ జగత్+నిర్మాణమాయా ప్రకారంబు+ ఎఱింగింతున్= ఈ విశ్వసృష్టికి సంబంధించిన మాయకు గల తీరు తెన్నులను తెలియజేస్తాను; లేని+అర్థంబు= లేని వస్తువు; శుక్తిరజత భ్రాంతియున్+పోలెన్= ముత్తెపు చిప్పలో వెండిని స్ఫురింపజేసే భ్రమలాగా; ఏమిటి మహిమన్+ తోఁచి= దేని ప్రభావంవల్ల స్ఫురించి; క్రమ్మఱన్= మరల; తోఁపకమానున్= స్ఫురించకుండా పోవునో; అదియే= అదే; మదీయ మాయా విశేషంబు+అని= నా మాయకు చెందిన విశేషమని; ఎఱుంగుము= గ్రహించు; అదియునున్+కాక= అంతేకాక; లేని యర్థంబు= లేని వస్తువు; దృశ్యమానంబు+అగుటకునున్= కనుపించునది కావడానికీ; కలయర్థంబు= ఉన్న వస్తువు; దర్శనగోచరంబు= దృష్టికి గోచరించునది; కాకుండుటకునున్= కాకపోవడానికీ; ద్విచంద్రాదికంబునున్= ఇద్దరు చంద్రులును; తమః ప్రభాసంబునున్= రాహుగ్రహం భాసించుట; దృష్టాంతంబులుగాన్= ఉదాహరణాలుగా; తెలియుము= ఎరుగుము; ఏ ప్రకారంబునన్= ఏ విధంగా; మహాభూతంబులు= పృథివి మొదలగు పంచమహాభూతాలు; భౌతికంబులయిన= ఆ భూతాలచే నిర్మింపబడిన; ఘటపట+ఆదులందున్= కుండ, గుడ్డ మున్నగు వానియందు; ప్రవేశించియుండున్= ప్రవేశించివుండునో; ఆ ప్రకారంబునన్= ఆ విధంగా; నేనున్= నేను కూడ; ఈ భూత భౌతికంబులయిన= భూతాలూ, భూతనిర్మితాలూ అయిన; సర్వకార్యంబులందున్= సకల కార్యాలలోనూ;

సత్త్వాదిరూపంబులన్= సత్త్వం మొదలగు రూపాలతో; ప్రవేశించియుండుదున్= చొచ్చి ఉంటాను; భౌతికంబులు= భూతాలతో తయారైన పదార్థాలు; భూతంబులందున్= పంచభూతాలలో; కారణ+అవస్థన్+పొందు చందంబునన్= హేతుదశను పొందే రీతిగా; భూత భౌతికంబులు= భూతాలూ; భౌతిక పదార్థాలూ; కారణ+అవస్థన్+పొంది= హేతుదశను పొంది; నాయందున్= నాలో; అభివ్యక్తంబులై యుండవు= స్పష్టంగా తోచునట్లుండవు; సర్వదేశంబులయందునున్= సకల స్థలాలలోనూ; సర్వకాలంబులయందునున్= సకల సమయాలలోనూ; ఏది బోధితంబు+ఐ+ఉండున్= ఏది జాగరూకమై ఉంటుందో; అట్టిది+అ= అట్టిదే; పరబ్రహ్మస్వరూపంబు= పరబ్రహ్మయొక్క నిజరూపం; తత్త్వంబు+ఎఱుంగన్= తత్త్వం తెలుసుకోవడానికి; ఇచ్చించిన= కోరిన; మిముఁబోటివారలకున్= మీలాంటివాళ్ళకు; ఈ చెప్పిన మదీయ తత్త్వ+ఆత్మకంబు+ఐన= ఇట్లు చెప్పిన నా తత్త్వంతో కూడిన; అర్థంబు+అ= అర్థమే; అర్థంబు+అని యెఱుంగు= అసలైన అర్థమని గ్రహించు; ఈ యర్థంబు= ఈ అర్థమే; ఉత్కృష్టంబు+అయినయది= ఉన్నతమయినది; ఏకాగ్రచిత్తుండవు+ఐ= నిశ్చలమైన చిత్తం కలిగినవాడవై; ఆకర్ణించి= విని; భవదీయచిత్తంబునన్= నీ మనస్సులో; ధరియించినన్= స్థిరంగా ఉంచుకొన్న; నీకు; సర్గ+ఆది కర్మంబులందున్= సృష్టి మొదలగు విధులలో; మోహంబు= అజ్ఞానం; చెందక+ఉండెడిన్= కలుగకుండా ఉంటుంది; అని భగవంతుండు+ఐన= అని షడ్గుణైశ్వర్యవంతుడగు; పరమేశ్వరుండు= పరమాత్ముడు; చతుర్ముఖునకున్= బ్రహ్మకు; ఆనతి+ఇచ్చి= చెప్పి; నిజలోకంబుతోన్= తన లోకంతో గూడా; అంతర్ధానంబున్+ఒందెన్+అని చెప్పి= అంతర్హితుడైనాడని చెప్పి; శుకుండు= శుకమహర్షి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అంతే కాదు. నీ విందాక నన్ను జగన్నిర్మాణానికి హేతువైన మాయావిధానాన్ని గురించి అడిగావు. ఆ విషయం తెలియజేస్తాను. ముత్తెపుచిప్పను చూస్తే దానిలో వెండి లేకున్నా ఉన్నట్లు తోస్తుంది. అట్లే లేని వస్తువు ఉన్నట్లు తోచి విచారించి చూస్తే లేదని స్పష్టమవుతుంది. ఇది దేనివల్ల జరుగుతున్నదో అదే నా మాయావిశేషమని గ్రహించు.

అంతేకాక మాయాప్రభావం వల్ల లేనివస్తువు కనిపించడం, ఉన్నవస్తువు కనిపించకపోవడం జరుగుతూ ఉంటుంది. చంద్రుడొక్కడే అయినా ఇద్దరు చంద్రులున్నట్లు కనిపిస్తుంది కదా! ఇది లేని వస్తువు కనిపించడానికి దృష్టాంతం. రాహుగ్రహం ఉన్న వస్తువు కనిపించకపోవడానికి దృష్టాంతం. గ్రహమండలంలో రాహువనే గ్రహం ఉన్నా అది మనకు కనిపించదు గదా!

పృథివ్యాదులైన మహాభూతాలు, భౌతిక పదార్థాలైన ఘటం, పటం మొదలగు వస్తువులలో ప్రవేశించి ఉంటాయి. అట్లే నేను భూతాలలోనూ, భూత నిర్మితాలైన సమస్త భౌతిక పదార్థాలలోనూ సత్త్వాది రూపాలతో ప్రవేశించి ఉంటాను.

పృథివ్యాది భూతాలలో ఘటపటాదులైన పదార్థాలు కారణావస్థను పొందుతాయి, అదేరీతిగా భూతాలూ, భౌతికాలూ ఇవన్నీ నాలో కారణావస్థను పొంది ఉంటాయి. అంతేకాని స్పష్టంగా అభివ్యక్తాలై ఉండవు. ఇంతవరకూ నిరూపితమైన ఈ పరబ్రహ్మస్వరూపం అన్ని దేశాలలో, అన్ని కాలాలలోనూ ఇట్లే ఉంటుంది. కాని మార్పు చెందదు. తత్త్వం తెలుసుకో గోరే మీబోంట్లకు నేనిప్పుడు చెప్పినదే తత్త్వస్వరూపమైన అర్థమని గ్రహించు. ఈ అర్థమే అన్నింటికంటె శ్రేష్ఠమైనది. దీన్ని ఏకాగ్రమైన మనస్సుతో విని నీ హృదయంలో నిలుపుకో. అలా చేస్తే జగన్నిర్మాణాది కార్యాలు నిర్వహించేటప్పుడు మోహం నిన్నంటదు. ఈ విధంగా భగవంతుడైన పరమేశ్వరుడు బ్రహ్మకు ఆనతిచ్చాడు. అనంతరం తన వైకుంఠలోకంతో కూడా అంతర్ధానమై పోయాడు అని శుకయోగి పరీక్షిత్తుతో చెబుతూ, మళ్ళీ ఈ రీతిగా అన్నాడు.

**సీ. అవనీశ! బ్రహ్మ యిట్లంతర్హితుండైనఁ బుండరీకాక్షుని బుద్ధి నిలిపి**
**యానందమునఁ బొంది యంజలి గావించి తత్పరిగ్రహమునఁ దనదు బుద్ధి**
**గైకొని పూర్వప్రకారంబునను సమస్త ప్రపంచంబును దగ సృజించి**
**మఱియొకనాఁడు ధర్మప్రవర్తకుఁ డౌచు నఖిలప్రజాపతియైన కమల**

**తే. గర్భుఁ డాత్మహితార్థమై కాక సకల, భువనహితబుద్ధి నున్నతస్ఫురణ మెఱసి**
**మానితంబైన యమనియమముల రెంటి, నాచరించెను సమ్ముదితాత్ముఁ డగుచు. 253**

**ప్రతి :** అవనీ+ఈశ! = రాజా!; బ్రహ్మ= విధాత; ఇట్లు+అంతర్హితుండు+ఐనన్= ఇలా అంతర్ధానమైపోగా; పుండరీకాక్షునిన్= పద్మాక్షుని; బుద్ధిన్= మతిలో; నిలిపి= ప్రతిష్ఠించి; ఆనందమునన్+పొంది= సంతోషంపొంది; అంజలి+కావించి= నమస్కరించి; తత్పరిగ్రహమునన్= ఆ భగవంతుడు పరిగ్రహించుటచేత; తన బుద్ధిన్= తన మతిని; కైకొని= అందుకొని; పూర్వప్రకారంబునన్= పూర్వం మాదిరిగానే; సమస్త ప్రపంచంబును= సకల విశ్వాన్ని; తగన్ సృజించి= తగురీతిలో సృష్టించి; మఱియొకనాఁడు= ఇంకొక దినమున; ధర్మప్రవర్తకుఁడు+ఔచున్= ధర్మాన్ని ప్రవర్తింపజేయువాడవుతూ; అఖిల ప్రజాపతి= అందరికీ ప్రజాపతి; ఐన= అయినట్టి; కమలగర్భుఁడు= బ్రహ్మ; ఆత్మహిత+అర్థమై కాక= తన మేలుకొరకై కాక; సకలభువనహితబుద్ధిన్= సమస్తలోకానికీ హితం కలగాలన్న బుద్ధితో; ఉన్నత స్ఫురణన్= ఉదాత్తమైన భావనతో; మెఱసి= భాసించి; సమ్ముదితాత్ముఁడు+అగుచున్= సంతసించిన చిత్తంకలవాడవుతూ; మానితంబు+ఐన= పూజితమైన; యమనియమముల రెంటిన్= అష్టాంగయోగంలో మొదటివైన యమ, నియమాలు రెండింటినీ; ఆచరించెను= అనుష్ఠించాడు.

**తా :** రాజా! ఈ విధంగా అంతర్ధానం చెందిన పద్మలోచనుణ్ణి బ్రహ్మ తన హృదయంలో నిలుపుకొన్నాడు. ఎంతో ఆనందంతో ఆయనకు ప్రణమిల్లినాడు. ఆయన కృపకు పాత్రుడై పూర్వంలాగానే సమస్త విశ్వాన్నీ సృష్టించాడు. ధర్మప్రవర్తకుడూ, ప్రజాపతీ అయిన బ్రహ్మ మరొకమారు తన మేలుకోసం కాక సకల లోకాల క్షేమం కోరి సంతుష్టాంతరంగుడై యమనియమాలతో మహోన్నతమైన తపస్సు చేశాడు.

**విశే :** యమం – ప్రధానముగా ఇంద్రియాలను అదుపున ఉంచుకొనుట. యమం పది విధాలు సత్యం, దయ, క్షమ, ధృతి, మితాహారం, ఆర్జవం, బ్రహ్మచర్యం, అస్తేయం, అహింస, శౌచం.

నియమం – తపం, సంతోషం, ఆస్తిక్యం, దానం, భగవదర్చన, వేదాంత శ్రవణం, లజ్జ, మతి, జపం, వ్రతం – అను పదివిధాలుగల యోగాంగం.

**వ. అయ్యవసరంబున 254**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా:** ఆలాంటి వేళలో

**క. ఆ నలినాసననందను, లైన సనందాదిమునుల కగ్రేసరుఁడున్**
**మానుగఁ బ్రియతముఁడును నగు, నా నారదుఁ డేఁగుదెంచె నబ్జజుకడకున్. 255**

**ప్రతి :** ఆ నలిన+ఆసన నందనులు+ఐన= ఆ బ్రహ్మ పుత్రులగు; సనంద+ఆదిమునులకున్= సనందుడు మున్నగు మునులకు; అగ్రేసరుఁడున్= మొదటివాడునూ; మానుగన్+ప్రియతముఁడునున్+అగు= మిక్కిలిగా ఇష్టమైనవాడు అయిన; ఆ నారదుఁడు= ఆ నారదముని; అబ్జజుకడకున్= బ్రహ్మవద్దకు; ఏఁగుదెంచెన్= వచ్చాడు.

**తా :** ఆ సమయంలో బ్రహ్మ మానసపుత్రులైన సనందుడు మున్నగు మునులలో మొదటివాడూ, ఆయనకు మిక్కిలి ఇష్టుడూ అయిన నారదమహర్షి బ్రహ్మదేవుని చెంతకు వచ్చాడు.

**క. చనుదెంచి తండ్రికిం బ్రియ, మొనరఁగ శుశ్రూషణంబు లొనరిచి యతఁడుం**
**దనదెసఁ బ్రసన్నుఁ డగుటయుఁ, గని భగవన్మాయ దెలియఁగా నుత్సుకుఁడై. 256**

**ప్రతి :** చనుదెంచి= వచ్చి; తండ్రికిన్= జనకుడైన బ్రహ్మకు; ప్రియమొనరఁగన్= ప్రీతికలుగునట్లుగా; శుశ్రూషణంబులు= సేవలు; ఒనరిచి= చేసి; అతఁడున్= ఆ బ్రహ్మయున్ను; తనదెసన్= తనపట్ల; ప్రసన్నుఁడు+అగుటయున్= అనుగ్రహం కలవాడు కాగా; కని= చూచి; భగవత్+మాయన్= భగవానుని మాయను; తెలియఁగాన్= గ్రహించుటకై; ఉత్సుకుఁడు+ ఐ= ఉబలాటం కలవాడై...

**తా :** అలా వచ్చి తండ్రికి ప్రీతితో సపర్యలు చేశాడు. బ్రహ్మకూడా అతని పట్ల ప్రసన్నుడయ్యాడు. అప్పుడు నారదముని భగవంతునిమాయ ఎట్టిదో తెలుసుకోవడానికి ఉబలాటపడ్డాడు.

**సీ. అవనీశ! నీవు నన్నడిగిన పగిది నాతఁడుఁ దండ్రి నడుగఁ బితామహుండు**
**భగవంతుఁ డాశ్రితపారిజాతము హరి గృపతోడఁ దన కెఱింగించినట్టి**
**లోకమంగళచతుశ్శ్లోక రూపంబును దశలక్షణంబులఁ దనరు భాగ**
**వతము నారదున కున్నతిఁ జెప్పె నాతఁడు చారు సరస్వతీ తీరమునను**

**తే. హరిపదధ్యానపారీణుఁ డాత్మవేది, ప్రకటతేజస్వి యగు బాదరాయణునకుఁ**
**గోరి యెఱిఁగించె; న మ్మహోదారుఁ డెలమి, నాకు నెఱిఁగించె; నెఱిఁగింతు నీకు నేను. 257**

**ప్రతి :** అవనీశ!= రాజా!; నీవు నన్నడిగిన పగిదిన్= నీవు నన్నడిగినట్లే; ఆతఁడు= ఆ నారదుడు; తండ్రిన్= జనకుడైన బ్రహ్మను; అడుగన్= ప్రశ్నింపగా; పితామహుండు= బ్రహ్మ; భగవంతుఁడు= షడ్గుణైశ్వర్య సంపన్నుడు; ఆశ్రితపారిజాతము= ఆశ్రితులపాలిటి కల్పతరువైన; హరి= మాధవుడు; కృపతోడన్= దయతో; తనకున్+ఎఱింగించినట్టి= తనకు తెలిపినటువంటి; లోకమంగళ చతుర్+శ్లోకరూపంబునున్= విశ్వానికి శుభకరమైన నాల్గుశ్లోకాలరూపంతో ఉన్నదీ; దశలక్షణంబులన్= పదిలక్షణాలతో; తనరు= అలరారుచున్న; భాగవతమున్= భాగవతగ్రంథాన్ని; నారదునకున్= నారదమునికి; ఉన్నతిన్= గొప్పగా; చెప్పెన్= ఉపదేశించాడు; ఆతఁడు= ఆ నారదుడు; చారు సరస్వతీ తీరమునను= మనోహరమైన సరస్వతీ నదీతటమందు; హరిపదధ్యాన పారీణుఁడు= శ్రీహరి చరణాలను ధ్యానించుటలో నిపుణుడు; ఆత్మవేది= ఆత్మజ్ఞుడు; ప్రకటతేజస్వి+అగు= గొప్పతేజశ్శాలీ అయిన; బాదరాయణునకున్= వ్యాసునకు; కోరి+ఎఱిఁగించెన్= అభిలాషతో తెలియపరచినాడు; ఆ+మహా+ఉదారుఁడు= ఆ గొప్ప ఔదార్యం కలవాడు; ఎలమిన్= ప్రీతితో; నాకున్+ఎఱిఁగించెన్= నాకు బోధించాడు; నేను, నీకు+ఎఱిఁగింతున్= నేను నీకు ఉపదేశిస్తాను.

**తా :** రాజా! నీవు నన్నడిగినట్లే పూర్వం నారదుడు తన తండ్రి నడిగాడు. అప్పుడు బ్రహ్మ ఉదారబుద్ధితో నారదునికి భగవానుడు, ఆశ్రితులపాటి కల్పవృక్షమూ అయిన శ్రీహరి తనకు తెలియజేసినదీ, లోకాలకు శుభం కలిగించేదీ, నాలుగు శ్లోకాలరూపంలో ఉన్నదీ, పదిలక్షణాలతో కూడినదీ అయిన భాగవతాన్ని ఉపదేశించాడు. నారదుడు ఆ భాగవత స్వరూపాన్ని మనోజ్ఞమైన సరస్వతీ నదీతీరంలో శ్రీహరి పాదాలను ధ్యానించడంలో నిపుణుడూ, ఆత్మతత్త్వజ్ఞుడూ, మహాతేజస్వి అయిన వ్యాసమహర్షికి బోధించాడు. ఉదాత్త చరిత్రుడగు వ్యాసమునీంద్రుడు ప్రీతితో నాకు విస్తరించి బోధించాడు. నేను నీకు దాని నిప్పుడు ఉపదేశిస్తాను.

**విశే :** తరువాత వచనంలో భాగవత దశ లక్షణములను పేర్కొన్నారు.

**వ. అదియునుం గాక యిపుడు విరాట్పురుషునివలన నీ జగంబు లే వడుపునఁ బొడమె నను నివి మొదలయిన ప్రశ్నంబులు గొన్ని నన్నడిగితివి. ఏను నన్నింటికి నుత్తరం బగునట్లుగా ని మ్మహాభాగతం బుపన్యసించెద నాకర్ణింపుము. అ మ్మహాపురాణంబు చతుశ్శ్లోకరూపంబును, దశలక్షణంబునునై సంకుచితమార్గంబున నొప్పు; నందు దశలక్షణంబు లెవ్వి యనిన సర్గంబును, విసర్గంబును, స్థానంబును, బోషణంబును, నూతులును, మన్వంతరంబులును, నీశానుచరితంబులును, నిరోధంబును, ముక్తియు, నాశ్రయంబును ననం బది తెఱంగు లయ్యె; దశమాశ్రయవిశుద్ధ్యర్థంబు తక్కిన తొమ్మిది లక్షణంబులుఁ జెప్పంబడె నవి యెట్టివనిన. 258**

**ప్రతి :** అదియునుంగాక= అంతియే కాక; ఇపుడు; విరాట్పురుషునివలనన్= విరాట్పురుషునినుండి; ఈ జగంబులు= ఈ లోకాలు; ఏ వడువునన్= ఏ విధంగా; పొడమెన్+అను+ఇవి+మొదలు+ఐన= పుట్టెను అను ఇత్యాదిగా గల; ప్రశ్నంబులు= ప్రశ్నలు; కొన్ని నన్నడిగితివి= నన్ను నీవు కొన్ని అడిగావు; ఏనున్= నేను; అన్నింటికిన్= నీ ప్రశ్నలన్నింటికీ; ఉత్తరంబు+అగునట్లుగాన్= సమాధానమయ్యేటట్లుగా; ఈ+మహాభాగవతంబున్= ఈ గొప్పభాగవతాన్ని; ఉపన్యసించెదన్= వివరిస్తాను; ఆకర్ణింపుము= విను; ఆ+మహాపురాణంబు= ఆ భాగవతపురాణం; చతుస్+శ్లోకరూపంబునున్= నాలుగు శ్లోకాల రూపంతోనున్నదియు; దశలక్షణంబునునై= పదిలక్షణాలు గలదియునై; సంకుచితమార్గంబునన్= సంగ్రహపద్ధతిలో; ఒప్పున్= విలసిల్లుతున్నది; అందున్= అందులో; దశలక్షణంబులు= పదిలక్షణాలు; ఎవ్వి+అనినన్= ఏవి అనగా; సర్గంబును= సర్గమూ; విసర్గంబును= విసర్గమూ; స్థానంబును= స్థానమూ; పోషణంబును= పోషణమూ; ఊతులును= ఊతులూ; మన్వంతరంబులును= మన్వంతరాలూ; ఈశానుచరితంబులును= ఈశ్వరుని చరిత్రలూ; నిరోధంబును= నిరోధమూ; ముక్తియున్= ముక్తీ; ఆశ్రయంబునున్= ఆశ్రయమూ; అనన్= అనగా; పది తెఱంగులు+అయ్యెన్= పదివిధాలయ్యాయి; దశమాశ్రయవిశుద్ధ్యర్థంబు= పదవదైన ఆశ్రయంయొక్క విశుద్ధికొరకు; తక్కిన తొమ్మిది లక్షణంబులున్= మిగిలిన తొమ్మిది లక్షణాలు; చెప్పంబడెన్= చెప్పబడ్డాయి; అవి= ఆ లక్షణాలు; ఎట్టివి+అనినన్= ఎలాంటివి అనగా–

**తా :** అంతే కాదు. ఇప్పుడు నీవు నన్ను "విరాట్పురుషుని నుండి ఈ లోకాలు ఎలా పుట్టాయి"? అని ఈలాంటి ప్రశ్నలు కొన్ని అడిగావు. వాటి కన్నీటికీ సమాధానంగా నేను నీకు ఈ మహాభాగవతం ఉపదేశిస్తాను, విను. ఈ మహాపురాణం నాలుగుశ్లోకాల రూపమై, పదిలక్షణాలు కలిగి సంగ్రహరూపంతో ఉన్నది. అందులో పదిలక్షణాలూ ఏవి? అనగా సర్గం, విసర్గం, స్థానం, పోషణం, ఊతులు, మన్వంతరాలు, ఈశానుచరిత్రాలు, నిరోధం, ముక్తి, ఆశ్రయం అనేవి. వీనిలో పదవ

లక్షణమైన ఆశ్రయమే బ్రహ్మం. ఆ బ్రహ్మతత్త్వ జ్ఞానంకొరకై చెప్పినవే మిగిలిన తొమ్మిది లక్షణాలూ. వాటి స్వరూపం ఎట్టిదో వివరిస్తాను.

**విశే :** 'చతుశ్లో కి' గా ప్రసిద్ధమైన గ్రంథభాగం ఇది. ఈ పదిలక్షణాలు ఇకపై క్రమంగా వివరించడమైనది.

**1. యావానహం యథా భావో యద్రూపగుణకర్మకః,**
**తథైవ తత్త్వవిజ్ఞాన మస్తుతే మదనుగ్రహాత్. (2)**

**2. అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్సదసత్పరమ్,**
**పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్. (3)**

**3. ఋతేఽర్థం యత్ప్రతీయేత న ప్రతీయేత చాత్మని,**
**తద్విద్యాదాత్మనో మాయాం యథాఽఽభాసో యథా తమః. (4)**

**4. యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వపి,**
**ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్. (5)**

**తే. మహదహంకార పంచతన్మాత్ర గగన, పవన శిఖి తోయ భూ భూతపంచ కేంద్రి**
**య ప్రపంచంబు భగవంతునందు నగుట, "సర్గ" మందురు దీనిని జనవరేణ్య! 259**

**ప్రతి :** జనవరేణ్య!= రాజా!; మహత్= మహత్తత్త్వం; అహంకార= అహంకారం; పంచతన్మాత్ర= శబ్దస్పర్శరూప రసగంధాలనే ఐదు తన్మాత్రలు; గగన= ఆకాశం; పవన= వాయువు; శిఖి= అగ్ని; తోయ= జలం; భూ= భూమి; అనే భూతపంచక= ఐదుమహాభూతాలు; ఇంద్రియ ప్రపంచంబు= ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు; భగవంతునందు+ అగుట= భగవంతునియందు సంభవించడమే; దీనిని= ఈ సంభవాన్ని; సర్గము+అందురు= 'సర్గ' మని అంటారు.

**తా :** రాజా! మహత్తత్త్వం, అహంకారం, శబ్దస్పర్శరూప రసగంధాలనే ఐదు తన్మాత్రలు, ఆకాశం, గాలి, అగ్ని, నీరు, భూమి – అనే పంచభూతాలు, ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు–ఇవి అన్నీ భగవంతునిలో కనిపించడమే సర్గం.

**విశే :** ఐదు కర్మేంద్రియాలు: త్వక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ.
ఐదు జ్ఞానేంద్రియాలు: చెవి, చర్మం, కన్ను, నాలుక, నాసిక.

**క. సరసిజగర్భుండు విరా, ట్పురుషునివలనన్ జనించి, భూరితర చరా**
**చరభూతసృష్టిఁ జేయుట, పరువడిని "విసర్గ"మండ్రు భరతకులేశా! 260**

**ప్రతి :** భరతకుల+ఈశా!= భరతవంశానికి ప్రభువైనవాడా!; సరసిజగర్భుండు= బ్రహ్మదేవుడు; విరాట్ పురుషుని వలనన్= విరాట్స్వరూపుడైన పురుషునినుండి; జనించి= పుట్టి; భూరితర చరాచర సృష్టిన్+చేయుట= గొప్పదైన స్థావరజంగమాత్మకమగు సృష్టిని చేయడం; పరువడిని= క్రమపద్ధతిలో; విసర్గము+అండ్రు= విసర్గ మంటారు.

**తా :** భరతవంశంలో జనించిన రాజా! చతుర్ముఖబ్రహ్మ విరాట్పురుషుని నుండి ఆవిర్భవించి అపారమైన చరాచరసృష్టిని నిర్వహించడాన్ని 'విసర్గ' మంటారు.

**క. లోకద్రోహినరేంద్రా, నీకముఁ బరిమార్చి జగము నెతి నిల్పిన యా**
**వైకుంఠనాథు విజయం, బాకల్ప "స్థాన" మయ్యె నవనీనాథా! 261**

**ప్రతి :** అవనీనాథా!= రాజా!; లోకద్రోహినరేంద్ర+అనీకమున్= జగత్తుకు ద్రోహం చేసిన రాజుల సమూహాన్ని; పరిమార్చి= హతమార్చి; జగమున్= లోకాన్ని; నెతిన్+నిల్పిన= చక్కగా ప్రతిష్ఠించిన; ఆ వైకుంఠనాథు విజయంబు= ఆ వైకుంఠ వాసియైన విష్ణుదేవుని విజయం; ఆ కల్ప స్థానము+అయ్యెన్= కల్ప మున్నంత వరకూ 'స్థానం' అని చెప్పబడింది.

**తా :** రాజా! లోకద్రోహులైన రాజసమూహాన్ని చంపి జగత్తును ఉద్ధరించిన ఆ విష్ణుని విజయాన్నే 'స్థానం' అంటారు.

**క. హరి సర్వేశుఁ డనంతుఁడు, నిరుపమశుభమూర్తి సేయు నిజభక్త జనో**
**ద్ధరణము "పోషణ"మవనీ, వర! "యూతు" లనంగఁ గర్మవాసన లరయన్. 262**

**ప్రతి :** అవనీ వర!= రాజా!; సర్వ+ఈశుఁడు= సర్వానికీ ప్రభువూ; అనంతుఁడు= తుదిలేనివాడూ; నిరుపమశుభమూర్తి= సాటిలేని మంగళమూర్తీ అయిన; హరి= పరమాత్మ; చేయు= నిర్వహించునట్టి; నిజభక్తజన+ఉద్ధరణము= తన భక్తులగువారి ఉద్ధరణం; పోషణము= పోషణ మనబడును; అరయన్= పరిశీలించగా; ఊతులు+అనంగన్= 'ఊతు' లంటే; కర్మవాసనలు= కర్మకు సంబంధించిన వాసనలు.

**తా :** సర్వేశ్వరుడూ, అంతం లేనివాడూ, సాటిలేని మంగళస్వరూపుడైన శ్రీహరి తన భక్తులను ఉద్ధరించడమే 'పోషణం'. నరనాథా! జన్మాంతరాలనుండి జీవుల ననుసరించి వచ్చే వారివారి కర్మవాసనలనే ఊతు లంటారు.

**తే. జలజనాభ దయాకటాక్ష ప్రసాద, లబ్ధి నఖిలైక లోకపాలకవిభూతి**
**మహిమఁ బొందినవారి ధర్మములు విస్త, రమునఁ బలుకుట "మన్వంతరములు" భూప! 263**

**ప్రతి :** భూప!= రాజా!; జలజనాభ= పద్మనాభునియొక్క; దయాకటాక్ష= కృపాకటాక్షంయొక్క; ప్రసాదలబ్ధిన్= అనుగ్రహం లభించుటచేత; అఖిల+ఏక లోకపాలక విభూతి మహిమన్= సమస్త ముఖ్యలోకాలనూ పాలించగల ఐశ్వర్యముయొక్క ప్రాభవాన్ని; పొందినవారి= అందుకొన్నవారి; ధర్మములు= ధర్మాలను; విస్తరమునన్= విస్తృతంగా; పలుకుట= వచించుట; మన్వంతరములు= మన్వంతరాలు అనబడతాయి.

**తా :** రాజా! ఆ పద్మనాభుని కృపాకటాక్షం వల్ల సకలలోకాలనూ పరిపాలించే మహాభాగ్యం పొందిన మహనీయుల ధర్మాలను విపులంగా వర్ణించడాన్నే 'మన్వంతరా'లంటారు.

**క. వనజోదరునవతార క, థనముఁ దదీయానువృత్తిఁ దచ్చారిత్రం**
**బును విస్తరించి పలుకం, జను నవి "యీశాను కథలు" సౌజన్యనిధీ! 264**

**ప్రతి :** సౌజన్యనిధీ!= మంచితనానికి ఆకరమైన రాజా!; వనజ+ఉదరు= పద్మనాభునియొక్క; అవతారకథనమున్= అవతారాలను గూర్చి చెప్పడం; తదీయ+అనువృత్తిన్= ఆ భగవంతుని అనుసరించటం; తద్+చారిత్రంబును= ఆ దేవుని చరిత్రనూ; విస్తరించి= విశదీకరించి; పలుకన్+చనునవి= పలుకునట్టివి; ఈశాను కథలు= ఈశాను కథలుగా ప్రసిద్ధాలు.

**తా :** సౌజన్యమూర్తివైన నరేంద్రా! అబ్జనాభుని అవతారాలు వర్ణించడాన్నీ, ఆయనను అనుసరించి ఉండడాన్నీ, ఆ దేవుని చరిత్రలనూ, విస్తృతంగా వివరించే కథలనూ 'ఈశాను కథలు' అని వ్యవహరిస్తారు.

**సీ. వసుమతీనాథ! సర్వస్వామి యైన గోవిందుండు చిదచిదానందమూర్తి**
**సలలితస్వోపాధి శక్తిసమేతుఁడై తనరారు నాత్మీయధామమందు**
**ఫణిరాజమృదులతల్పంబుపై సుఖలీల యోగనిద్రారతి నున్నవేళ**
**నఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై, యున్నతతేజంబు లురలుకొనఁగ**

**తే. జరుగు న య్యవస్థావిశేషంబు లెల్ల, విదిత మగునట్లు వలుకుట యది "నిరోధ"**
**మన నిది యవాంతర ప్రళయం బనంగఁ, బరఁగు నిఁక "ముక్తి" గతి విను పార్థివేంద్ర! 265**

**ప్రతి :** పార్థివ+ఇంద్ర! = రాజేంద్రా!; వసుమతీనాథ= భూనాథా!; సర్వస్వామియైన= సర్వానికీ ప్రభువైన; గోవిందుండు= మాధవుడు; చిదచిదానందమూర్తి= చిత్తు, అచిత్తు, ఆనందం, మేళవించిన మూర్తిగలవాడు; సలలిత స్వోపాధి శక్తిసమేతుఁడు+ఐ= సుందరమైన తన ఉపాధికి చెందిన శక్తులతో కూడినవాడై; తనరారు= ఒప్పారుచున్న; ఆత్మీయ ధామమందున్= తన వైకుంఠమందిరంలో; ఫణిరాజమృదుల తల్పంబుపైన్= ఆదిశేషుడనే మెత్తని పడకపై; సుఖలీలన్= హాయిగా; యోగనిద్రారతిన్= యోగనిద్రయందలి ఆసక్తితో; ఉన్నవేళన్= ఉన్నప్పుడు; అఖిలజీవులు= సమస్త చేతనులు; నిజవ్యాపారశూన్యులు+ఐ= తమ తమ పనులేమీ లేనివారై; ఉన్నత తేజంబులు= శ్రేష్ఠమైన తేజస్సులను; ఉరలు కొనఁగన్= కోల్పోగా; జరుగు= అపుడు సంభవించునట్టి; ఆ+అవస్థావిశేషంబులు+ఎల్లన్= ఆ దశా విశేషాల నన్నింటినీ; విదితమగునట్లు= అందరికీ తెలియునట్లు; పలుకుట= వచించుట; అది నిరోధము+అనన్= అది నిరోధమనగా; ఇది అవాంతర ప్రళయంబు+అనంగన్= ఇది రెండు మహాప్రళయాల మధ్య సంభవించే అవాంతర ప్రళయమనగా; పరఁగున్= ఒప్పును; ఇఁక ముక్తి గతిన్= ఇంక ముక్తికి సంబంధించిన స్థితిని; విను= విను.

**తా :** భూనాథా! సర్వానికీ ప్రభువూ, చిత్తు, అచిత్తు, ఆనందం మేళవించిన స్వరూపం గలవాడూ అయిన గోవిందుడు సుందరమైన తన ఉపాధికి సంబంధించిన శక్తులతో గూడినవాడై, వైకుంఠంలోని తన మందిరంలో మెత్తని శేషశయ్యపై సుఖంగా యోగనిద్రలో ఉంటాడు. అప్పుడు సకలజీవులూ తమ తమ తేజస్సులు కోల్పోయి క్రియా శూన్యులవుతారు. అప్పటి ఆ అవస్థావిశేషాల నన్నింటినీ స్పష్టంగా తెలియునట్లు చెప్పడమే "నిరోధం". దీన్నే "అవాంతర ప్రళయం" అని కూడా అంటారు. రాజా! ఇక 'ముక్తి' అంటే ఏమిటో విను.

**సీ. జీవుండు భగవత్కృపావశంబునఁజేసి దేహధర్మంబులై ధృతి ననేక**
**జన్మానుచరితదృశ్యము లైన యజ్జరామరణంబు లాత్మధర్మంబు లయిన**
**ఘనపుణ్యపాపనికాయ నిర్మోచనస్థితి నొప్పి పూర్వసంచితములైన**
**యపహతపాప్మవత్త్వాద్యష్ట తద్గుణవంతుఁడై తగ భగవచ్ఛరీర**

**తే. భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధి నొప్పి, దివ్య మాల్యానులేపన భవ్య గంధ**
**కలిత మంగళ దివ్య విగ్రహ విశిష్టుఁ, డగుచు హరిరూప మొందుటే యనఘ! "ముక్తి." 266**

**ప్రతి :** అనఘ!= పాపరహితుడా! రాజా!; జీవుండు= చేతనుడు; భగవత్+కృపావశంబునన్+చేసి= భగవానుని దయవలన; దేహధర్మంబులు+ఐ= శరీరధర్మాలై; ధృతిన్= ధీరతతో; అనేక జన్మ+అనుచరిత దృశ్యములు+ఐన= పలు జన్మలలో అనుసరించి వచ్చిన దృశ్యాలుగా ఉన్న; ఆ+జరామరణంబులు= ఆ చావు పుట్టుకలు; ఆత్మధర్మంబులయిన= జీవధర్మాలైన;

ఘన= దొడ్డవగు; పుణ్య= సుకృతాల; పాప= కిల్బిషాల; నికాయ= సమూహముయొక్క; నిర్మోచనస్థితిన్= పరిత్యాగస్థితిచేత; ఒప్పి= విలసిల్లి; పూర్వసంచితములు+ఐన= గతకాలంలో సంపాదింపబడిన; అపహత పాప్మవత్త్వ+ఆది= నశింపజేయబడిన పాపం కల్గియుండుట మొదలగు; అష్ట= ఎనిమిదైన; తద్గుణ వంతుఁడు+ఐ= ఆ భగవానుని గుణాలు గలవాడై; తగన్= ఒప్పునట్లు; భగవత్+శరీరభూతుఁడు+ఐ= పరమాత్మునికి శరీరమైనవాడై; పారతంత్ర్య+ఆత్మబుద్ధిన్+ఒప్పి= నేను పరతంత్రుడను, అన్న భావనగల బుద్ధితో; ఒప్పి= విలసిల్లి; దివ్యమాల్య= దివ్యమైన పుష్పాలు; అనులేపన= మైపూతతో; కలిత= కూడిన; మంగళ= మంగళకరమైన; దివ్యవిగ్రహ విశిష్టుఁడు= దివ్యశరీరం కలవాడు; అగుచున్= అవుతూ; హరిరూపము+ఒందుటే= శ్రీహరి రూపాన్ని దాల్చుటే; 'ముక్తి'.

**తా :** పాపరహితుడా! జీవుడు భగవానుని దయవల్ల శరీరధర్మాలై పలు జన్మలనుండి పరంపరగా వచ్చిన జరామరణాలను తప్పించుకొంటాడు. అట్లే ఆత్మధర్మాలైన పుణ్యపాపాలనుండి కూడా విడివడుతాడు. ముందటివైన 'అపహతపాప్మవత్త్వం' మొదలగు ఎనిమిది గుణాలు కలవాడై భగవంతునికి శరీరభూతుడవుతాడు, భగవత్పరతంత్రమైన బుద్ధితో ప్రకాశిస్తాడు. దివ్యగంధాలతో ఒప్పే దివ్యశరీరం కలవాడవుతాడు. ఇలా జీవుడు హరిస్వరూపం పొందడమే 'ముక్తి'.

**విశే :** "య ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సో పిపాసుః సత్యకామః సత్యసంకల్పః"– అని ఛాందోగ్యం – (8–7–1) ఇది ప్రజాపతి చెప్పిన మాట. ఆత్మ పాపం లేనివాడు, వార్ధకం లేనివాడు, చావు లేనివాడు, దుఃఖం లేనివాడు, ఆకలి లేనివాడు, దప్పిక లేనివాడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు అని అర్థం. ఆత్మ ఈ ఎనిమిది గుణాలు కలది అని ఆత్మయొక్క స్వరూపం ఇక్కడ పేర్కొనబడింది.

ఆత్మకు పై ఎనిమిది గుణాలు కలిగి ఉండడం నిత్యప్రాప్తమే ఐనప్పటికీ కర్మరూపమగు అవిద్యచేత అది కప్పబడి ఉంటుంది– 'స్వేన రూపేణాభినిష్పద్యతే' అను శ్రుతి ప్రకారం పరంజ్యోతి స్వరూపప్రాప్తి కలిగినప్పుడు ముక్తపురుషునికి స్వీయరూపం సిద్ధిస్తుంది.

**వ. మఱియు నుత్పత్తిస్థితిలయంబు లెందగుచుఁ బ్రకాశింపఁబడు నదే "యాశ్రయం" బనంబడు. నదియ పరమాత్మ. బ్రహ్మ శబ్దవాచ్యంబు నదియ. ప్రత్యక్షానుభవంబున విదితంబు సేయుకొఱకు నాత్మ యాధ్యాత్మికాది విభాగంబు సెప్పంబడియె; నది యెట్టనిన నాత్మ "యాధ్యాత్మి" "కాధిదైవి" "కాధిభౌతికంబు"లం ద్రివిధం బయ్యె; నందు నాధ్యాత్మికంబు చక్షురాది గోళకాంతర్వర్తియై యెఱుంగం బడుఁ; జక్షురాదికరణాభిమానియై ద్రష్టయైన జీవుండె యాధిదైవికుం డనందగుఁ; జక్షురాద్యధిష్ఠానాభిమానదేవతయై సూర్యాది తేజోవిగ్రహుండు నగుచు నెవ్వనియందు నీ యుభయవిభాగంబునుం గలుగు నతండె యాధిభౌతికుండును, విరాడ్విగ్రహుండును నగుం గావున ద్రష్టయు దృక్కును దృశ్యంబు ననందగు నీ మూఁటియందు నొకటి లేకున్న నొకటి గానరా, దీ త్రితయంబు నెవ్వం డెఱుంగు నతండు సర్వలోకాశ్రయుండై యుండు; నతండె పరమాత్మయును; ఆ మ్మహాత్ముండు లీలార్థంబైన జగత్సర్జనంబు సేయు తలంపున బ్రహ్మాండంబు నిర్భేదించి తనకు సుఖస్థానంబు నపేక్షించి మొదల శుద్ధంబు లగు జలంబుల సృజియించె; స్వతఃపరిశుద్ధుండు గావున స్వసృష్టంబై యేకార్ణవాకారం బైన జలరాశియందు శయనంబు సేయుటం జేసి**

**"శ్లో. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః,**

**తా య దస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః".అను ప్రమాణము చొప్పున నారాయణ శబ్దవాచ్యుండు గావున నతనిప్రభావంబు వర్ణింప దుర్లభం; బుపాదానభూతంబయిన ద్రవ్యంబును, ద్రివిధం బయిన కర్మంబును, గళాకాష్ఠాద్యుపాధిభిన్నంబయిన కాలంబును, జ్ఞానాదికంబగు జీవస్వభావంబును, భోక్త యగు జీవుండును, నెవ్వని యనుగ్రహంబునం జేసి వర్తించుచుండు, నెవ్వని యుపేక్షంజేసి వర్తింపకుండు, నట్టి ప్రభావంబు గల సర్వేశ్వరుండు దా నేకమయ్యు ననేకంబుగాఁ దలంచి యోగకల్పంబునం బ్రబుద్ధుండై యుండు. అంఁట మీఁద స్వసంకల్పంబునం జేసి హిరణ్మయంబైన తన విగ్రహంబు నధిదైవతంబును, నధ్యాత్మికంబును, నధిభూతంబును నను సంజ్ఞాయుతంబై త్రివిధంబుగా సృజియించె. 267**

**ప్రతి :** మఱియున్= ఇంకను; ఉత్పత్తిస్థితిలయంబులు= సృష్టి స్థితి సంహారాలు; ఎందు+అగుచున్= ఎందులో సంభవిస్తూ; ప్రకాశింపన్+పడున్+అది= వ్యక్తంచేయబడునో అది; 'ఆశ్రయంబు'+అనన్‌పడున్= 'ఆశ్రయం' అనబడుతుంది; అది+అ= అదియే పరమాత్మ; బ్రహ్మశబ్దవాచ్యంబున్= 'బ్రహ్మ' అనే శబ్దంచేత చెప్పబడునదీ; అదియ= అదే; ప్రత్యక్ష+అనుభవంబునన్= ప్రత్యక్ష ప్రమాణంతోడి అనుభవంతో; విదితంబు+చేయుకొఱకున్= తెలియజేయుటకై; ఆత్మ= ఆత్మయొక్క; ఆధ్యాత్మిక+ఆదివిభాగంబు= ఆధ్యాత్మికం మొదలైన విభజనం; చెప్పన్+పడియెన్= చెప్పబడింది; అది యెట్టు+అనినన్= అది ఎలా అంటే; ఆత్మ ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికంబులన్= ఆత్మ ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం అనే విభాగాలచే; త్రివిధంబు+అయ్యెన్= మూడు విధాలుగా అయింది; అందున్= ఆ మూడింటిలో; ఆధ్యాత్మికంబు= ఆధ్యాత్మికం; చక్షురాది గోళకాంతర్వర్తి+ఐ= నేత్రం మొదలైన గోళకాలలోపలనున్నదియై; ఎఱుంగన్+పడున్= తెలియబడుతుంది; చక్షుస్+ఆది కరణ+అభిమాని+ఐ= నేత్రం మొదలగు ఇంద్రియాలపట్ల అభిమానం కలవాడై; ద్రష్ట+ఐన= చూచువాడైన; జీవుండు+ఏ= చేతనుడే; ఆధిదైవికుండు+అనన్+తగున్= ఆధిదైవికుడని చెప్పదగియున్నాడు; చక్షుస్+ఆది+అధిష్ఠాన+ అభిమానదేవత+ఐ= నేత్రాదులగు అధిష్ఠానాలయందు అభిమానం కలదేవత అయి; సూర్య+ఆది తేజస్+ విగ్రహుండును+ అగుచున్= సూర్యుడు మున్నగు తేజస్సులే శరీరంగా కలవాడుగా అవుతూ; ఎవ్వనియందున్= ఎవనిలో; ఈ ఉభయ విభాగంబునున్= ఈ రెండు విభాగాలూ; కలుగున్= సంభవించునో; అతండు+ఎ= అతడే; ఆధిభౌతికుండును= 'ఆధిభౌతికు' డన్న పేరుగలవాడూ; విరాట్+విగ్రహుండునున్= విరాట్ఛరీరం కలవాడునూ; అగున్= అవుతున్నాడు; కావునన్= కాబట్టి; ద్రష్టయున్= చూచువాడు; దృక్కును= చూపు; దృశ్యంబు= చూడదగినది; అనన్+తగు= అనదగిన; ఈ మూఁటియందున్= ఈ త్రిపుటియందు; ఒకటి లేకున్నన్= ఒక్కటి లేకుంటే; ఒకటి+కానరాదు= మరొకటి కనిపించదు; ఈ త్రితయంబున్= ఈ మూడింటిని; ఎవ్వఁడు+ఎఱుంగున్= ఎవడు తెలుసుకొంటాడో; అతండు= వాడు; సర్వలోక+ఆశ్రయుండు+ఐ యుండున్= సకలలోకాలకూ ఆధారమై ఉంటాడు; అతండు+ఎ= అతడే; పరమాత్మయును= పరమాత్మగా ఉన్నాడు; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; లీలా+అర్థంబు+ఐన= విలాసంకొరకైన; జగత్సర్జనంబు= లోకసృష్టి; చేయుతలంపునన్= చేయాలన్న భావంతో; బ్రహ్మాండంబున్= అజాండాన్ని; నిర్భేదించి= చీల్చుకొని; తనకున్ సుఖస్థానంబున్+అపేక్షించి= తనకు సుఖప్రదమైన చోటును కోరి; మొదలన్= మొదట; శుద్ధంబులు+అగు= నిర్మలాలైన; జలంబులన్= నీటిని; సృజియించెన్= సృష్టించెను; స్వతఃపరిశుద్ధుండు+కావునన్= తనకు తానే నిర్మలుడు కాబట్టి; స్వసృష్టంబు+ఐ= తనచే నిర్మింపబడినదై; ఏక+అర్ణవ+ ఆకారంబు+ఐన= ఒకే సాగరాకారంగల; జలరాశియందున్= కడలియందు; శయనంబుచేయుటన్+చేసి= శయనించడంవలన; ఆపః= నీరు; నారా ఇతి= నారములని; ప్రోక్తాః= చెప్పబడినవి; ఆపః= నీరే; నరసూనవః= నరుడనబడు నారాయణుని

సంతానాలు; తాః= ఆ నీరు; యత్= ఎందువల్ల; అస్య= ఈ దేవునికి; పూర్వం అయనం= పూర్వం స్థానమో; తేన= ఆ కారణంచేత, అతడు; నారాయణః= 'నారాయణుడు' అని చెప్పబడినాడు; అను ప్రమాణము చొప్పునన్= అనే ప్రమాణాన్నిబట్టి; నారాయణశబ్దవాచ్యుండు= నారాయణ శబ్దంచేత చెప్పదగినవాడు; కావునన్= కాబట్టి; అతని ప్రభావంబు= అతని మహిమ; వర్ణింపన్ దుర్లభంబు= కీర్తించుట అసాధ్యం; ఉపాదానభూతంబు+అయిన= ఉపాదాన కారణమైన; ద్రవ్యంబును= ద్రవ్యం; త్రివిధంబు+అయిన= మూడు విధాలైన; కర్మంబును= కర్మమూ; కళాకాష్ఠా+ఆది+ఉపాధి భిన్నంబు+ ఐన= 'కళ', 'కాష్ఠ' మొదలైన ఉపాధులచే విభక్తమైన; కాలంబును= కాలం; జ్ఞానాదికంబగు= జ్ఞానం మొదలగు; జీవస్వభావంబును= చేతనుని స్వభావం; భోక్తయగు= అనుభవించువాడైన; జీవుండునున్= చేతనుడు; ఎవ్వని అనుగ్రహంబునన్+చేసి= ఎవని ప్రసాదంవల్ల; వర్తించుచుండున్= ప్రవర్తిస్తున్నారో; ఎవని ఉపేక్షన్+చేసి= ఎవని పట్టించుకోకపోవటంవల్ల; వర్తింపకుండున్= ప్రవర్తింపకుండా ఉంటాయో; అట్టి, ప్రభావంబు= మహిమ; కల= కల్గిన; సర్వ+ఈశ్వరుండు= పరమాత్ముడు; తాను ఏకమయ్యున్= తాను ఒకడే యైనా; అనేకంబుగాన్+తలంచి= బహురూపులుగా కాగోరి; యోగతల్పంబునన్= యోగశయనంలో; ప్రబుద్ధుండై+ఉండున్= మేల్కొంచి వుంటాడు; అటమీఁదన్= ఆపై; స్వసంకల్పంబునన్+చేసి= తన సంకల్పంతో; హిరణ్మయంబు+ఐన= స్వర్ణమయమైన; తన విగ్రహంబున్= తన శరీరాన్ని; అధిదైవతంబును, అధ్యాత్మకంబును, అధిభూతంబును అను= అధిదైవత – అధ్యాత్మక – అధిభూతములను; సంజ్ఞాయుతంబు+ ఐ= పేళ్ళుగలదై; త్రివిధంబుగాన్= మూడు రకాలుగా; సృజియించెన్= సృష్టించాడు.

**తా :** ఇక ఉత్పత్తి స్థితి సంహారాలనేవి ఎక్కడ జరుగుతాయో దానినే 'ఆశ్రయ'మంటారు. అదే పరమాత్మ. 'బ్రహ్మ' శబ్దంచేత చెప్పబడేదీ అదే. దానిని ప్రత్యక్షానుభవంతో తెలియజేయడానికై ఆత్మకు ఆధ్యాత్మికాది విభాగం చెప్పడమయింది. అది ఎలా అంటే–

ఆత్మ ఆధ్యాత్మికమనీ, ఆధిదైవికమనీ, ఆధిభౌతికమనీ, మూడు విధాలు. నేత్రం మొదలైన గోళకాలలో ఉంటూ తెలియబడేది ఆధ్యాత్మికం. నేత్రాదీంద్రియాభిమానం కల్గి ద్రష్ట అవుతున్న జీవుడే ఆధిదైవికుడు. నేత్రాదులైన అధిష్ఠానాలలో అభిమానం కల దేవతయై, సూర్యాదితేజస్సులే శరీరంగా కలవాడైన ఎవనిలో, ఆధ్యాత్మిక ఆధిదైవికాలనే ఈ రెండు విభాగాలూ సంభవిస్తాయో, అతడే ఆధిభౌతికుడూ, విరాట్స్వరూపుడుగూడా అవుతున్నాడు. అందువల్ల చూచువాడు, చూపు, చూడదగినది–అనబడు ఈ మూడింటిలోనూ ఏ ఒక్కటి లేకున్నా మరొక్కటి కనిపించదు. త్రిపుటి అనబడే ఈ మూడింటినీ ఎవడు తెలుసుకొంటాడో, అతడే సర్వలోకాలకూ ఆశ్రయమైనవాడు. పరమాత్మకూడా అతడే.

వినోదార్థం జగత్తును సృష్టించాలనే తలంపు ఆ మహాత్ముడికి కలిగింది. ఆ సంకల్పంతో ఆయన బ్రహ్మాండాన్ని నిర్భేదించాడు. తనకు సుఖస్థానం కోరి మొదట పరిశుద్ధమైన నీళ్ళను సృష్టించాడు. ఆయన సహజంగానే పరిశుద్ధుడు. అందువల్ల తాను సృష్టించిన అపార పారావార రూపంలో ఉన్న జలరాశిలో శయనించాడు. అందువల్లనే

**ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః।**
**తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః॥**

అనగా నరుడనే నామాంతరం కల భగవంతుడు జలాలను సృష్టించాడు. అందుకే నీళ్ళకు 'నారములు' అని పేరు. అట్టి నారములు స్థానంగా కల్గివుండడంవల్ల ఆయనకు 'నారాయణుడు' అన్న పేరు కల్గింది. ఈ ప్రమాణాన్ని బట్టి ఆయన 'నారాయణ' శబ్దవాచ్యుడవుతున్నాడు. అట్టి నారాయణుని ప్రభావాన్ని వర్ణించడం వీలుగాని పని.

ఉపాదాన కారణమైన ద్రవ్యం, సంచితం, ప్రారబ్ధం, ఆగామి అనే మూడు విధాలైన కర్మమూ, కళ, కాష్ఠ మున్నగు ఉపాధులచే భిన్నమైన కాలం, జ్ఞానం మొదలగు జీవుని స్వభావం, అనుభవించే జీవుడూ–ఇవన్నీ ఆయన అనుగ్రహంవల్ల ఏర్పడినవే. ఆయన ఉపేక్షిస్తే వాటికి ఉనికి లేదు. అట్టి మహిమ గలవాడు సర్వేశ్వరుడు.

తాను మొదట ఒక్కడైనా ఆ పరమాత్ముడు దేవమనుజాది రూపాలతో అనేకం కావాలని సంకల్పించాడు. స్వాత్మానుభవ రూపమైన యోగశయనంలో మేల్కొని ఉండి తన సంకల్పంతో హిరణ్మయమైన తన శరీరాన్ని అధిదైవతం, అధ్యాత్మికం, అధిభూతం – అనే పేర్లతో మూడు విధాలుగా సృష్టించాడు.

**సీ. అట్టి విరాడ్విగ్రహాంత రాకాశంబు వలన నోజస్సహోబలము లయ్యెఁ**
**బ్రాణంబు సూక్ష్మరూపక్రియా శక్తిచే జనియించి ముఖ్యాసువనఁగఁ బరఁగె**
**వెలువడి చను జీవి వెనుకొని ప్రాణముల్ సనుచుండు నిజనాథు ననుసరించు**
**భటుల చందంబునఁ, బాటిల్లు క్షుత్తును భూరితృష్ణయు మఱి ముఖమువలనఁ**

**తే. దాలుజిహ్వాదికంబు లుద్భవము నొందె, నందు నుదయించె నానావిధైక రసము,**
**లెనయ నవి యెల్ల జిహ్వచే నెఱుఁగఁబడును, మొనసి పలుక నపేక్షించు ముఖమువలన. 268**

**ప్రతి :** అట్టి విరాజ్(డ్)+విగ్రహ+అంతరాకాశంబువలనన్= అటువంటి విరాట్పురుషుని దేహంలోపలి ఆకాశంనుండి; ఓజస్+సహస్+బలములు+అయ్యెన్= ఓజస్సు, వేగం, బలం అనే ధర్మాలు ఉద్భవించాయి; ప్రాణంబు= ప్రాణవాయువు; సూక్ష్మక్రియాశక్తిచేన్= సూక్ష్మరూపమైన క్రియాశక్తిచేత; జనియించి= పుట్టి; ముఖ్య+అసువు+అనఁగన్+పరగెన్= ముఖ్యప్రాణం అని ప్రశస్తి పొందింది; నిజనాథున్= తమ యజమానిని; అనుసరించు= అనుగమించునట్టి; భటుల చందంబునన్= సేవకులవలె; వెలువడి చను= బయలుదేరిపోవునట్టి; జీవిన్ వెనుకొని= ప్రాణిననుసరించి; ప్రాణముల్+చనుచుండున్= ప్రాణాలు పోతూవుంటాయి; మఱి= ఇంకా; ముఖమువలనన్= ముఖంనుండి; క్షుత్తును= ఆకలియు; భూరితృష్ణయున్= అధికమైన దప్పికయు; పాటిల్లున్= కల్గుతాయి; ముఖమువలనన్= ముఖమునుండే; తాలుజిహ్వా+ఆదికంబులు= దవడలు, నాలుక మున్నగునవి; ఉద్భవమున్+ఒందెన్= జనించాయి; అందున్= దానిలోనే; నానావిధైకరసము= అనేకవిధ రసాలు; ఉదయించెన్= పుట్టాయి; ఎనయన్= సరిపోయినట్లుగా; అవి+ఎల్లన్= ఆ రసాలన్నీ; జిహ్వచేన్= నాలుకచే; ఎఱుంగన్+పడును= తెలియబడుతున్నవి; (జీవుడు) మొనసి= పూనుకొని; పలుకన్+అపేక్షించు= మాటాడడానికి అభిలషించే; ముఖమువలనన్= ముఖమునుండి...

**తా :** అట్టి విరాట్పురుషుని శరీరం లోపలి ఆకాశంనుండి ప్రవృత్తి, సామర్థ్యరూపమైన ఓజస్సు, వేగశక్తి, బలం–అనే ధర్మాలు కలిగాయి. సూక్ష్మరూపమగు క్రియాశక్తినుండి ప్రాణం పుట్టింది. అదే ముఖ్య ప్రాణమనబడింది. యజమాని ననుసరించి పోవు సేవకులవలె ప్రాణాలు శరీరంనుండి వెలువడిపోయే జీవిననుసరించిపోతూ ఉంటాయి. విరాట్పురుషునకు జఠరాగ్ని దీపించగానే ఆకలిదప్పికలు ఏర్పడ్డాయి. ముఖంనుండి దవడలు, నాలుక మున్నగునవి జనించాయి. అందుండే ఆరు రకాల రసాలు పుట్టాయి. అవన్నీ నాలుకచే గ్రహింపబడుతున్నాయి. ముఖంనుండి జీవుడు మాట్లాడాలని అభిలషిస్తాడు. అట్టి ముఖం నుండి–

**వ. మఱియు వాగింద్రియంబు పుట్టె, దానికి దేవత యగ్ని; యా రెంటివలన భాషణంబు వొడమె; నా యగ్నికి మహాజల వ్యాప్తం బగు జగంబున నిరోధంబు గలుగుటంజేసి యా జలంబె ప్రతిబంధకం**

బయ్యె; దోదూయమానం బైన మహావాయువు వలన ఘ్రాణంబు వుట్టెం గావున వాయుదేవతాకం బైన ఘ్రాణేంద్రియంబు గంధ గ్రహణ సమర్థం బయ్యె; నిరాలోకం బగు నాత్మ నాత్మయందుఁ జూడం గోరి తేజంబువలన నాదిత్యదేవతాకంబై రూపగ్రాహకంబైన యక్షియుగళంబు వుట్టె; ఋషి గణంబులచేత బోధితుం డగుచు భగవంతుండు దిగ్దేవతాకంబును శబ్దగ్రాహకంబును నైన శ్రోత్రేంద్రియంబు వుట్టించె; సర్జనంబు సేయు పురుషునివలన మృదుత్వకాఠిన్యంబులును, లఘుత్వ గురుత్వంబులును, నుష్ణత్వ శీతలత్వంబులును జేసెడు త్వగింద్రియాధిష్ఠానంబగు చర్మంబు పుట్టె; దానివలన రోమంబు లుదయించె; వానికి మహీరుహంబు లధిదేవత లయ్యె; నందు నధిగతస్పర్శ గుణుండును, నంతర్బహిఃప్రదేశంబుల నావృతుండును నగు వాయువువలన బలవంతంబులును, నింద్రదేవతాకంబులును, నాదానసమర్థంబులును, నానాకర్మకరణ దక్షంబులును నగు హస్తంబు లుదయించె; స్వేచ్ఛా విషయగతి సమర్థుండగు నీశ్వరుని వలన విష్ణు దేవతాకంబులగు పాదంబు లుదయించెఁ; బ్రజానందామృతార్థియగు భగవంతునివలనఁ బ్రజాపతి దేవతాకంబై, స్త్రీ సంభోగాది కామ్యసుఖంబులు కార్యంబులుగాఁ గల శిశ్నోపస్థంబు లుదయించె; మిత్రుం డధిదైవతంబుగాఁ గలిగి భుక్తాన్నాద్యసారాంశ త్యాగోపయోగంబగు "పాయు"వనెడి గుదం బుద్భవించె; వాని కృత్యం బుభయ మలమోచనంబు; దేహంబున నుండి దేహాంతరంబుఁ జేరం గోరి పూర్వకాయంబు విడుచుటకు సాధనం బగు నాభిద్వారంబు సంభవించె; నట్టి నాభియే ప్రాణాపానబంధ స్థానం బనంబడు; దద్బంధ విశ్లేషంబె మృత్యువగు; నదియ యూర్ధ్వాధోదేహ భేదకం బనియును జెప్పంబడు; నన్నపానాది ధారణార్థంబుగ నాంత్ర కుక్షి నాడీనిచయంబులు గల్పింపంబడియె; వానికి నదులును, సముద్రంబులును నధిదేవత లయ్యె; వానివలనఁ దుష్టి పుష్టులను నుదరభరణ పరిణామంబులు గలిగియుండు; నాత్మీయ మాయాచింతనం బొనర్చునపుడు కామ్యసంకల్పాదిస్థానం బగు హృదయంబు గలిగె; దానివలన మనంబును; జంద్రుండును, గాముండును, సంకల్పంబును నుదయించె; నంతమీఁద జగత్సర్జనంబు సేయు విరాడ్విగ్రహంబున సప్తధాతువులును, బృథివ్యప్తేజోమయంబు లయిన సప్త ప్రాణంబులును, వ్యోమాంబు వాయువులచే నుత్పన్నంబులై గుణాత్మకంబులైన యింద్రియంబులును, నహంకార ప్రభవంబులైన గుణంబులును, సర్వవికార స్వరూపం బగు మనస్సును, విజ్ఞానరూపిణి యగు బుద్ధియును బుట్టు; వివిధంబగు నిది యంతయు సర్వేశ్వరుని స్థూల విగ్రహంబు. మఱియును. **269**

**ప్రతి :** మఱియును= ఇంకను; వా(చ్)గ్+ఇంద్రియంబు పుట్టెన్= ముఖంనుండి 'వాక్కు' అనే ఇంద్రియం ఉద్భవించింది; దానికిన్ దేవత అగ్ని= ఆ ఇంద్రియానికి అగ్ని దేవత; ఆ రెంటివలనన్= వాగింద్రియం, అగ్ని–ఈ రెండింటి నుండీ; భాషణంబు= మాట్లాడుట; పొడమెన్= జనించింది; ఆ అగ్నికి మహాజలవ్యాప్తంబు+అగు= అత్యధిక జలంచే వ్యాప్తమైన; జగంబునన్= జగమునందు; నిరోధంబు= ఆటంకం; కలుగుటన్+చేసి= కల్గడంవల్ల; ఆ జలంబు+ఎ= ఆ నీరే; ప్రతిబంధకంబు+అయ్యెన్= అడ్డు అయింది; దోదూయమానంబు+ఐన= వేగంగా చలించునట్టి; మహావాయువు వలనన్= గొప్పగాలినుండి; ఘ్రాణంబు= ఘ్రాణేంద్రియం; పుట్టెన్= ఉదయించింది; కావునన్= అందువల్ల; వాయుదేవతాకంబు+ఐన= వాయువు దేవతగా గలిగిన; ఘ్రాణ+ఇంద్రియంబు= నాసిక అను ఇంద్రియం; గంధ గ్రహణ సమర్థంబు+అయ్యెన్=

వాసనను గ్రహించుటలో శక్తి గలదయింది; నిరాలోకంబు+అగు= కనిపించని దగు, ఆత్మను; ఆత్మయందున్= తనలో; చూడన్+కోరి= చూడాలని తలచి; తేజంబువలనన్= తేజస్సునుండి; ఆదిత్యదేవతాకంబు+ఐ= సూర్యుడు దేవతగా గలదై; రూపగ్రాహకంబు+ఐన= రూపాన్ని గ్రహించగల; అక్షియుగళంబు= నేత్రద్వయం; పుట్టెన్= పుట్టింది; ఋషిగణంబులచేతన్= మునిబృందాలచేత; బోధితుండు+అగుచున్= ప్రబోధితుడవుతూ; భగవంతుండు= పరమాత్మ; దిశ్(క్)+దేవతాకంబునున్= దిక్కు దేవతగా గల్గినదియు; శబ్దగ్రాహకంబునున్= శబ్దాన్ని గ్రహించునదియునైన; శ్రోత్ర+ఇంద్రియంబున్= శ్రోత్రమనే ఇంద్రియాన్ని; పుట్టించెన్= జనింపజేశాడు; సర్జనంబున్+చేయు= సృష్టికార్యం చేయునట్టి; పురుషునివలనన్= పురుషునినుండి; మృదుత్వకాఠిన్యంబులునున్= మెత్తదనం, కఠినత్వం; లఘుత్వగురుత్వంబులునున్= తేలికతనం, బరువూ; ఉష్ణత్వ శీతలత్వంబులునున్= వేడిమి; చల్లదనం – వీటిని; చేసెడు= కల్గించే; త్వచ్+ఇంద్రియ+అధిష్ఠానంబు+అగు= త్వక్కు అనే ఇంద్రియానికి అధిష్ఠానమైన; చర్మంబు పుట్టెన్= చర్మం పుట్టింది; దానివలనన్= ఆ చర్మంనుండి; రోమంబులు= తలపై కేశములుగాక శరీరంలో పలుచోట్లగల వెంద్రుకలు; ఉదయించెన్= పుట్టాయి; వానికిన్= ఆ వెంద్రుకలకు; మహీరుహంబులు= వృక్షాలు; అధిదేవతలయ్యెన్= అధిదేవతలుగా రూపొందాయి; అందున్= అందులో; అధిగతస్పర్శ గుణుండునున్= పొందబడిన 'స్పర్శ' మనే గుణం కలవాడూ; అంతర్బహిః ప్రదేశంబులన్= లోపలా, వెలుపలా; ఆవృతుండునునగు= ఆవరింపబడిన వాడునగు; వాయువువలనన్= గాలినుండి; బలవంతంబులునున్= బలం గలిగినవీ; ఇంద్రదేవతాకంబులునున్= ఇంద్రుడు దేవతగాగలవీ; ఆదానసమర్థంబులునున్= వస్తుగ్రహణశక్తి, గలవీ; నానాకర్మకరణదక్షంబులునున్+అగు= వివిధ కార్యాలు చేయుశక్తి గలవీ అయిన; హస్తంబులు+ఉదయించెన్= చేతులు కలిగాయి; స్వేచ్ఛావిషయగతిసమర్థుండు+అగు= ఇచ్ఛచొప్పున పోగలశక్తి గల్గువాడైన; ఈశ్వరునివలనన్= భగవంతునినుండి; ప్రజాపతిదేవతాకంబు+ఐ= ప్రజాపతి దేవతగా కలదై; స్త్రీ సంభోగాది కామ్యసుఖంబులు= వనితాసంగమం మొదలగు కామ భావనకు సంబంధించిన సుఖాలు; కార్యంబులుగాన్+ కల= కార్యాలుగా గల; శిశ్న+ఉపస్థంబులు= శిశ్నం, ఉపస్థం; ఉదయించెన్= కల్గాయి; మిత్రుండు+ అధిదైవతంబుగా కలిగి= మిత్రుడనే దేవత అధిదేవతగా గలిగి; భుక్త+అన్న+ఆది+అసారాంశ, త్యాగ+ఉపయోగంబగు= తిన్న అన్నాదులలో సారంలేని భాగాన్ని వదలివేయటానికి కుపకరించునదగు; పాయువనెడి గుదంబు+ఉద్భవించెన్= 'పాయువు' అని వ్యవహరింపబడే గుదేంద్రియం కల్గింది; వాని కృత్యంబు= ఆ ఇంద్రియాల పని; ఉభయ మలమోచనంబు= రెండు రకాలమలాన్ని వదిలించడం; దేహంబునుండి= ఒక శరీరంనుండి; దేహ+అంతరంబున్+చేరన్+కోరి= మరొక శరీరాన్ని చేరనభిలషించి; పూర్వకాయంబున్= తొంటి శరీరమును; విడుచుటకున్= త్యజించడానికి; సాధనంబు+అగు= ఉపకరణమైన; నాభిద్వారంబు= బొడ్డు అనే రంధ్రం; సంభవించెన్= కలిగింది; అట్టి నాభి+ఏ= అటువంటి బొడ్డే; ప్రాణాపానబంధ స్థానంబు+అనన్+పడున్= ప్రాణవాయునకూ, అపానవాయువునకూ ముడి అయిన స్థానమనబడుతున్నది; తద్బంధ విశ్లేషంబు+ఎ= ఆ బంధం విడివడటమే; మృత్యువు+అగున్= మరణమవుతున్నది; అది+అ= అదే; ఊర్ధ్వాధో దేహభేదకంబు+ అనియు+చెప్పంబడున్= పై శరీరాన్ని, క్రింది శరీరాన్నీ భేదించునది అనికూడ చెప్పబడుతున్నది; అన్నపానాదిధారణార్థంబుగన్= అన్నాన్నీ, నీటినీ ధరించుటకొరకుగా; ఆంత్ర కుక్షి నాడీనిచయంబులు= పేగులు, గర్భం, నాడీసమూహాలు; కల్పింపన్+ పడియెన్= సృష్టించబడినాయి, వానికి నదులును, సముద్రంబులును; అధిదేవతలు+అయ్యెన్= ఆ ఆంత్రాదులకు సరిత్తులూ, సాగరాలూ అధిదేవత అయ్యాయి; వానివలనన్= వానివలన; తుష్టిపుష్టులను ఉదరభరణ పరిణామంబులు కలిగి యుండున్= 'తుష్టి, పుష్టి' అనే ఉదరాన్ని భరించే రసపరిణామాలు; సంభవించును= ఏర్పడతాయి; ఆత్మమాయాచింతనంబు+ఒనర్చునపుడు= తనయొక్క మాయను గూర్చి చింతించేటప్పుడు; కామ్యసంకల్ప+ఆదిస్థానంబు+అగు= కామ్యకర్మల సంకల్పాదులకు స్థానమైన; హృదయంబు కలిగెన్= హృదయం పుట్టింది; దానివలనన్= దానినుండి; మనంబునున్= మనస్సూ; చంద్రుండును=

సోముడు; కాముండును= మన్మథుడూ; సంకల్పంబునున్= సంకల్పమూ; ఉదయించెన్= కలిగాయి; అంతమీఁదన్= ఆపైన; జగత్సర్జనంబు= జగత్తుయొక్క సృష్టిని; చేయు= చేయునట్టి; విరాట్+విగ్రహంబునన్= విరాట్ శరీరమునందు; సప్తధాతువులును= ఏడు ధాతువులూ; పృథివ్యప్తేజస్+మయంబులు+అయిన సప్తప్రాణంబులును= భూమి, నీరు, తేజోరూపాలైన ఏడుప్రాణాలూ; వ్యోమ+అంబువాయువులచేన్= ఆకాశం, జలం, వాయువు వీటిచే; ఉత్పన్నంబులు+ఐ= పుట్టినవై; గుణాత్మకంబులు+ఐన= గుణస్వరూపాలయిన; ఇంద్రియంబులును= ఇంద్రియాలూ; అహంకారప్రభవంబులు+ఐన= అహంకారంనుండి పుట్టిన; గుణంబులును= గుణాలూ; సర్వవికారస్వరూపంబు+అగు= అన్ని వికారాలూ స్వరూపంగా కల; మనస్సును= చిత్తం; విజ్ఞానరూపిణి+అగు= విజ్ఞానం స్వరూపంగాకల; బుద్ధియును= బుద్ధీ; పుట్టున్= జనించును; వివిధంబు+అగు= నానావిధమైన; ఇది యంతయున్= ఇందంతా; సర్వేశ్వరుని స్థూల విగ్రహంబు= పరమాత్ముని స్థూల శరీరం; మఱియును= ఇంకను.

**తా :** ముఖం నుండి వాక్కు అనే ఇంద్రియం పుట్టింది. దానికి అగ్ని అధిష్ఠానదేవత. వాగింద్రియం నుండీ, అగ్నినుండీ, సంభాషణం పుట్టింది. జగత్తంతా జలవ్యాప్తం కావడంవల్ల అగ్నికి జలంవల్ల నిరోధం కల్గింది. అందువల్ల అగ్నికి జలమే ప్రతిబంధకమయింది. మిక్కిలిగా చలించే మహావాయువునుండి ఘ్రాణం పుట్టింది. దానికి వాయువు అధిదేవత. ఆ ఘ్రాణేంద్రియం గంధాన్ని గ్రహించడంలో నేర్పుగలదయింది. విరాట్పురుషుడు కంటికి కనిపించని ఆత్మను తనలో చూడగోరాడు. అప్పుడు సూర్యుడు దేవతగా కలవీ, రూపం గ్రహించేవీ అయిన నేత్రాలు రెండూ తేజస్సునుండి పుట్టాయి.

మునులందరూ భగవంతుని ప్రార్థించగా ఆయన దిక్కులు దేవతగా కలిగి, శబ్దాన్ని గ్రహించే శ్రోత్రేందియాన్ని ఉద్భవింపజేశాడు.

సృష్టికర్తయైన పురుషుని నుండి త్వగింద్రియానికి అధిష్ఠానమైన చర్మం పుట్టింది. ఆ చర్మం ఆయా వస్తువులలోని మృదుత్వాన్నీ, కాఠిన్యాన్నీ, తేలికతనాన్నీ, బరువునూ, వేడిమినీ, చల్లదనాన్నీ, గ్రహిస్తుంది. చర్మమునుండి వెంద్రుకలు పుట్టాయి. వాటికి చెట్లు అధిదేవతలయ్యాయి.

త్వగింద్రియాన్ని అధిష్ఠించినవాడూ, స్పర్శమనే గుణం కలవాడూ, లోపలా వెలుపలా వ్యాపించినవాడూ అయిన వాయువునుండి హస్తాలు పుట్టాయి. అవి బలం కలవీ, వస్తుగ్రహణంలో నేర్పుకలవీ, అనేకమైన పనులు చేయగలవీ అయ్యాయి. వాటికి ఇంద్రుడు అధిదేవత.

తనకు ఇచ్ఛ వచ్చిన చోటికి పోయే సామర్థ్యం కల ఈశ్వరుని నుండి పాదాలు పుట్టాయి. వాటికి విష్ణువు అధిదేవత.

ప్రజానంద మనే అమృతం కాంక్షించే భగవంతుని నుండి పురుషాంగం, ఉపస్థ (స్త్రీ అంగం) జనించాయి. వాటికి అధిదేవత ప్రజాపతి. స్త్రీ సంభోగం మొదలైనవి వాటి పనులు. మిత్రుడు అధిదేవతగా గల "పాయువు" అనే ఇంద్రియాన్ని "గుదం" అని కూడ అంటారు. అది భుక్తపదార్థాలలోని నిస్సారమైన అంశాన్ని త్యజించటానికి సాధనమవుతుంది. అది ఉభయ మలాలనూ వర్జిస్తుంది.

ఒక శరీరం వదలి మరొక శరీరం ధరింప గోరినప్పుడు మొదటి శరీరం వదలడానికి సాధనంగా 'బొడ్డు' అనే ద్వారం పుట్టింది. ప్రాణం, అపానం బంధింపబడే స్థానం అదే. ఆ బంధం విడిపోవడమే మృత్యువు. పై శరీరాన్ని, క్రింది శరీరాన్నీ వేరు చేసేది గూడా ఆ నాభిస్థానమే. ఆహారపానీయాదులను ధరించడానికి పేగులు, పొట్ట, నాడీ సమూహం కల్పితములైనాయి. వాటికి నదులూ, సముద్రాలూ అధిదేవతలు. వాటివల్ల తుష్టి, పుష్టి అనే ఉదరాన్ని భరించే రసపరిణామాలు కలిగాయి.

ఆ విరాట్పురుషుడు తన మాయను ధ్యానించేటప్పుడు కామానికీ, సంకల్పాదులకూ స్థానమైన హృదయం పుట్టింది. ఆ హృదయం నుండి మనస్సూ, చంద్రుడూ, కాముడూ, సంకల్పమూ పుట్టాయి.

ఆపైన జగత్తును సృష్టించే విరాట్పురుషుని శరీరంలో త్వక్కు, చర్మం, మాంసం, రక్తం, మేదస్సు, మజ్జ, ఎముకలు అనే ఏడు ధాతువులూ, పృథివీ జల తేజోరూపాలైన ఏడుప్రాణాలూ, ఆకాశజలవాయువులనుండి జనించిన గుణస్వరూపాలైన ఇంద్రియాలు, అహంకారాన్ని కలిగించే గుణాలూ, అన్ని వికారాలూ స్వరూపంగా కల మనస్సూ, విజ్ఞాన రూపమైన బుద్ధీ జనించాయి. ఇదంతా ఆ సర్వేశ్వరుని స్థూల శరీరమే. ఇంతే కాదు.

**క. వరుసఁ బృథివ్యాద్యష్టా, వరణావృతమై సమగ్రవైభవములఁ బం**
**కరుహభవాండాతీత, స్ఫురణం జెలువొందు నతివిభూతి దలిర్పన్. 270**

**ప్రతి :** వరుసన్= క్రమంగా; పృథివీ+ఆది+అష్ట+ఆవరణ+ఆవృతము+ఐ= భూమి మొదలైన ఎనిమిది ఆవరణాలచే ఆవరింపబడినదై; సమగ్రవైభవములన్= సంపూర్ణమైన వైభవాలతో; పంకరుహభవ+అండ+అతీతస్ఫురణన్= బ్రహ్మాండాన్ని అతిక్రమించిన స్ఫూర్తితో; అతివిభూతి= గొప్పవైభవం; తలిర్పన్= అలరారగా; చెలువొందున్= విలసిల్లుతున్నది.

**తా :** ఆ స్థూలవిగ్రహం క్రమంగా పృథివి, జలం, తేజస్సు, వాయువు, గగనం, అహంకారం, మహత్తత్త్వం, అవ్యక్తం అనే ఎనిమిది ఆవరణాలలో వ్యాప్తమై ఉన్నది. సంపూర్ణమైన వైభవంతో బ్రహ్మాండాన్ని మించిన స్ఫూర్తితో మిక్కిలిగా ప్రకాశిస్తున్నది.

**క. పొలుపగు సకల విలక్షణ, ములు గల యాద్యంతశూన్యమును నిత్యమునై**
**లలి సూక్ష్మమై మనో వా, క్కులకుం దలపోయఁగా నగోచర మగుచున్. 271**

**ప్రతి :** పొలుపు+అగు= స్థిరమగు; సకల విలక్షణములు గల= సమస్తమైన విశిష్టలక్షణాలుగలదై; ఆద్యంత శూన్యమును= ఆది, అంతం లేనిదై; నిత్యమును+ఐ= శాశ్వతమై; లలిన్= క్రమంగా; సూక్ష్మము+ఐ= అణుస్వరూపమై; మనస్+వాక్కులకున్= చిత్తానికీ, వాక్కులకూ; తలపోయఁగాన్= ఆలోచించగా; అగోచరము+అగుచున్= గోచరం కాని దవుతూ...

**తా :** ఆ విరాట్పురుషుని సూక్ష్మరూపం స్థిరమై, అత్యంత విలక్షణమై యొప్పునది. దానికి మొదలు, తుది లేవు. అది నిత్యమైనది. మనస్సుకూ, వాక్కుకూ గోచరం కానిది.

**సీ. అలఘుతేజోమయంబైన రూపంబిది క్షితినాథ! నాచేతఁ జెప్పఁబడియె;**
**మానిత స్థూలసూక్ష్మ స్వరూపంబులవలన నొప్పెడు భగవత్స్వరూప**
**మమ్మహాత్మకుని మాయాబలంబునఁ జేసి దివ్యమునీంద్రులు దెలియలేరు;**
**వసుధేశ! వాచ్యమై వాచకంబై నామ రూపముల్ క్రియలును రూఢిఁదాల్చి**

**ఆ. యుండు నట్టి యీశ్వరుండు నారాయణుం, దఖిలధృతజగన్నియంతయైన**
**చిన్మయాత్మకుండు సృజియించు నీ ప్రజా, పతుల ఋషులఁ బితృవితతుల నెలమి. 272**

**ప్రతి :** క్షితినాథ!= భూపతీ!; ఇది, అలఘు తేజస్+మయంబు+ఐన= గొప్ప తేజస్సుతో నిండిన; రూపంబు= ఆకారం; నాచేతన్+చెప్పఁబడియెన్= నాచే వర్ణింపబడింది; మానిత స్థూల సూక్ష్మ స్వరూపంబుల వలనన్= మహనీయమైన స్థూల

స్వరూపంతోనూ, సూక్ష్మస్వరూపంతోనూ; ఒప్పెడు= ప్రకాశించుచున్న; భగవత్+స్వరూపము= పరమాత్ముని స్వరూపం; ఆ+మహాత్మకుని= ఆ మహితాత్మునియొక్క; మాయాబలంబునన్+చేసి= మాయాప్రభావంచేత; దివ్యముని+ఇంద్రులున్= దేవలోకానికి చెందిన మునివర్యులు గూడ; తెలియలేరు= ఎరుగజాలరు; వసుధా+ఈశ!= రాజా; వాచ్యము+ఐ= చెప్పదగినదై; వాచకంబు+ఐ= చెప్పునదై; నామ రూపక్రియలను= నామాన్నీ, రూపాన్నీ, క్రియలనూ; రూఢిన్+తాల్చి= ప్రసిద్ధిగా ధరించి, ఉండునట్టి; ఈశ్వరుండు= భగవంతుడు; నారాయణుండు= శ్రీమహావిష్ణువు; అఖిలధృత జగత్+ నియంత+ఐన= ధరించిన సమస్త జగత్తుకూ నియామకుడైన; చిత్+మయ+ఆత్మకుండు= చిన్మయస్వరూపుడు; ఈ ప్రజాపతులన్= ఈ దక్షాది ప్రజాపతులనూ; ఋషులన్= మునులనూ; పితృవితతులన్= పితృసమూహాలనూ; ఎలమిన్= ప్రీతితో; సృజియించున్= సృష్టిస్తున్నాడు.

**తా :** రాజా! మహాతేజస్సుతో నిండిన భగవంతుని స్వరూపాన్ని గురించి నేనిప్పుడు నీకు చెప్పాను. స్థూలమనీ, సూక్ష్మమనీ రెండు రూపాలతో విరాజిల్లే ఆ భగవదాకారాన్ని ఆ పరమాత్ముని ప్రభావంచేత దేవర్షులు గూడా తెలియజాలకున్నారు. వాచ్యమై, వాచకమై నామ రూపక్రియలు దాల్చిన ఈశ్వరుడు సమస్తలోకాలకూ నియామకుడై భాసిస్తున్నాడు. జ్ఞానస్వరూపుడైన ఆ దేవుడే ప్రజాపతులనూ, ఋషులనూ, పితృదేవతలనూ ప్రీతితో సృష్టిస్తున్నాడు.

**వ. మఱియును. 273**

**ప్రతి :** మఱియును= ఇంకా.

**సీ. సుర సిద్ధ సాధ్య కిన్నర నర చారణ గరుడ గంధర్వ రాక్షస పిశాచ**
**భూత వేతాళ కింపురుష కూశ్మాండ గుహ్యక డాకినీ యక్ష యాతుధాన**
**విద్యాధరాప్సరో విషధర గ్రహ మాతృ గణ వృక హరి ఘృష్టి ఖగ మృగాళి**
**భల్లూక రోహిత పశు వృక్షయోనుల వివిధకర్మంబులు వెలయఁ బుట్టి**

**తే. జల నభో భూతలంబుల సంచరించు, జంతుచయముల సత్త్వరజస్తమోగు**
**ణములఁ దిర్యక్సురాసురనరధరాది, భావముల భిన్ను లగుదురు పౌరవేంద్ర! 274**

**ప్రతి :** పౌరవ+ఇంద్ర= పూరు వంశంవాడవైన రాజా!; సుర....యోనులన్= సుర= దేవతలు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; కిన్నర= కిన్నరులు; నర= నరులు; చారణ= చారణులు; గరుడ= గరుడులు; గంధర్వ= గంధర్వులు; రాక్షస= రాక్షసులు; పిశాచ= పిశాచాలు; భూత= భూతాలు; వేతాళ= బేతాళాలు; కింపురుష= కింపురుషులు; కూశ్మాండ= కూశ్మాండులు; గుహ్యక= గుహ్యకులు; డాకినీ= డాకినులు; యక్ష= యక్షులు; యాతుధాన= యాతుధానులు; విద్యాధర= విద్యాధరులు; అప్సరస్= అచ్చరలు; విషధర= సర్పాలు; గ్రహ= గ్రహాలు; మాతృగణ= మాతృగణాలు; వృక= తోడేళ్ళు; హరి= సింహాలు; ఘృష్టి= వరాహాలు; ఖగ= పక్షులు; మృగ+ఆళి= మృగసమూహం; భల్లూక= ఎలుగుబంట్లు; రోహిత= చేపలు; పశు= పశువులు; వృక్షయోనులన్= చెట్ల యోనులయందు; వివిధకర్మంబులు= నానావిధకర్మలు; వెలయన్= ప్రసిద్ధికెక్కగా; పుట్టి= జనించి; జల నభస్+భూతలంబులన్= నీటిలో, ఆకాశంలో, భూతలంలో; సంచరించు= తిరుగునట్టి; జంతు చయములన్= ప్రాణిసంతతియందు; సత్త్వరజస్తమస్+గుణములన్= సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలచేత; తిర్యక్= పశుపక్ష్యాదులు; సుర= దేవతలు; అసుర= రక్కసులు; నర= మనుజులు; ధర= గిరులు; ఆదిభావములన్= మొదలగు స్థితులచే; భిన్నులు+అగుదురు= భిన్న భిన్న స్థితిగతులు గలవారవుతారు.

**తా :** ఇంకా విను, రాజా! జీవులు తాము చేసిన నానావిధ కర్మలననుసరించి సురలు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, నరులు, చారణులు, గరుడులు, గంధర్వులు, రాక్షసులు, పిశాచాలు, భూతాలు, బేతాళాలు, కింపురుషులు, కూశ్మాండులు, గుహ్యకులు, డాకినులు, యక్షులు, యాతుధానులు, విద్యాధరులు, అప్సరసలు, నాగులు, గ్రహాలు, మాతృగణాలు, తోడేళ్ళు, సింహాలు, పందులు, పక్షులు, మృగాలు, ఎలుగుబంట్లు, చేపలు, పశువులు, చెట్లు– వీటి జాతులలో సంభవిస్తారు. నీటిలోనూ, ఆకాశంలోనూ, నేలమీదా సంచరిస్తారు. సత్త్వరజస్తమో గుణాలు గల్గి ఉంటారు. ఈ ప్రాణిజాతమంతా తిర్యక్కులు, సురలు, అసురులు, నరులు, గిరులు – ఇత్యాది భిన్నభిన్న రూపాలతో ఉంటుంది.

**మ. ఇరవొందన్ ద్రుహిణాత్మకుండయి రమాధీశుండు విశ్వంబు సు**
**స్థిరతంజేసి, హరిస్వరూపుఁడయి రక్షించున్ సమస్తప్రజో**
**త్కరసంహారము సేయునప్పుడు హరాంతర్యామియై యింతయున్**
**హరియించుం బవనుండు మేఘముల మాయంజేయు చందంబునన్. 275**

**ప్రతి :** రమా+అధీశుండు= లక్ష్మీనాథుడు; ఇరవు+ఒందన్= స్థిరంగా; ద్రుహిణ+ఆత్మకుండయి= బ్రహ్మదేవుడై; విశ్వంబున్= ప్రపంచాన్ని; సుస్థిరతన్+చేసి= స్థిరపడునట్లు సృష్టించి; హరిస్వరూపుఁడు+అయి= విష్ణురూపుడై; రక్షించున్= కాపాడుతాడు; సమస్తప్రజా= అఖిల ప్రజలయొక్క; ఉత్కర= సమూహమును; సంహారమున్+చేయునపుడు= లయంచేసే సమయంలో; హర+అంతర్యామియై= శివుని అంతర్యామిగానుండి; పవనుండు= వాయువు; మేఘములన్= మబ్బులను; మాయన్+ చేయుచందంబునన్= హరించునట్లు; ఇంతయున్= ఈ సృష్టినంతటినీ; హరియించున్= సంహరిస్తాడు.

**తా :** లక్ష్మీరమణుడు చతుర్ముఖుడై జగత్తును సృష్టిస్తాడు. విష్ణుస్వరూపుడై దాన్ని రక్షిస్తాడు. సంహారకాలంలో హరునికి అంతర్యామిగా నుండి గాలి మబ్బులను హరించినట్లే సమస్త విశ్వాన్ని సంహరిస్తాడు.

**క. ఈ పగిదిని విశ్వము సం, స్థాపించును మనుచు నడఁచు ధర్మాత్మకుఁడై**
**దీపిత తిర్యఙ్నర సుర, రూపంబులు దాన తాల్చి రూఢి దలిర్పన్. 276**

**ప్రతి :** ఈ పగిదిని= ఇట్లు; ధర్మ+ఆత్మకుఁడు+ఐ= ధర్మస్వరూపుడై; రూఢి దలిర్పన్= ప్రసిద్ధి వెలయగా; దీపిత తిర్యక్+నర సురరూపంబులు= ప్రకాశింపజేయబడిన పశుపక్ష్యాదులు, నరులు, దేవతలు– వీరి రూపాలు; తాను+అ= తానే; తాల్చి= ధరించి; విశ్వమున్= లోకాన్ని; సంస్థాపించును= ఏర్పాటు చేయును; మనుచున్= రక్షించును; అడఁచున్= సంహరించును.

**తా :** ఈ విధంగా ఆ పరమాత్ముడు ధర్మస్వరూపుడై తానే పశుపక్ష్యాదులు, నరులు, సురలు మున్నగు రూపాలు ధరిస్తాడు. తానే ఈ విశ్వాన్ని సృష్టిస్తాడు. రక్షిస్తాడు, తుదకు సంహరిస్తాడు.

**సీ. హరియందు నాకాశ, మాకాశమున వాయు, వనిలంబువలన హుతాశనుండు,**
**హవ్యవాహనునందు నంబువు, లుదకంబువలన వసుంధర గలిగె; ధాత్రి**
**వలన బహుప్రజావళి యుద్భవంబయ్యె; నింతకు మూలమై యెసఁగునట్టి**
**నారాయణుఁడు, చిదానంద స్వరూపకుం, దవ్యయుం, డజుఁడు, ననంతుఁ, డాఢ్యుఁ**

**తే. డాదిమధ్యాంతశూన్యుం, డనాదినిధనుఁ; డతనివలనను సంభూతమైన యట్టి**
**సృష్టి హేతుప్రకార మీక్షించి తెలియఁ, జాల రెంతటి మునులైన జనవరేణ్య! 277**

**ప్రతి :** జనవరేణ్యా= రాజా!; హరియందున్= శ్రీహరియందు; ఆకాశము= ఆకసం; ఆకాశమునన్= ఆకసంలో; వాయువు= గాలి; అనిలంబువలనన్= గాలినుండి; హుత+అశనుండు= అగ్ని; హవ్యవాహనునందున్= అగ్నియందు; అంబువులు= జలం; ఉదకంబువలనన్= నీటినుండి; వసుంధర= భూమి; కలిగెన్= ఉద్భవించాయి; ధాత్రివలనన్= భూమినుండి; బహుప్రజా+ఆవళి= పెక్కు విధాలైన ప్రజల సముదాయం; ఉద్భవంబు+అయ్యెన్= జనించింది; ఇంతకున్= ఈ సృష్టికంతటికీ; మూలము+ఐ= ఆధారమై; ఎసఁగునట్టి= అతిశయించునటువంటి; నారాయణుఁడు= శ్రీహరి; చిత్+ఆనంద స్వరూపకుండు= జ్ఞానానందమే స్వరూపంగా కలవాడు; అవ్యయుండు= తరుగు లేనివాడు; అజుఁడు= పుట్టుక లేనివాడు; అనంతుఁడు= తుదిలేనివాడు; ఆఢ్యుఁడు= సంపన్నుడు; ఆదిమధ్య+అంతశూన్యుండు= మొదలు, నడుము, తుదిలేనివాడు; అనాది నిధనుఁడు= జనన మరణాలు లేనివాడు; అతనివలనను= ఆ నారాయణునుండి; సంభూతమైన+అట్టి= జనించినట్టి; సృష్టి హేతుప్రకారము= సృష్టికి కారణమేమి అనుతత్త్వాన్ని; ఎంతటి మునులు+ఐనన్= ఎంతగొప్ప తపోధనులైనా; ఈక్షించి= చూచి; తెలియన్+చాలరు= గ్రహింపలేరు.

**తా :** శ్రీహరినుండి ఆకాశం పుట్టింది. ఆకాశంనుండి వాయువు పుట్టింది. వాయువునుండి అగ్ని పుట్టింది. అగ్నినుండి నీరు పుట్టింది. నీటినుండి భూమి పుట్టింది. భూమినుండి నానావిధ జీవసంతతి పుట్టింది. ఇంతటికీ మూలమై ప్రకాశించేవాడు, ఆ శ్రీమన్నారాయణుడే. ఆయన జ్ఞానానందస్వరూపుడు, అవ్యయుడు, పుట్టుకలేనివాడు, అంతంలేనివాడు, ఐశ్వర్యవంతుడు, ఆదిమధ్యాంతాలు లేనివాడు, చావుపుట్టుకలు లేనివాడు, రాజా! ఆయననుండి జనించిన ఈ సృష్టికి హేతువేమిటో, దాని స్వరూపమెట్టిదో ఎంతగా పరీక్షించినా ఎంతటి మునీశ్వరులైనా తెలుసుకోలేకున్నారు.

**విశే :** ఇక్కడ "ఆత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నమ్, అన్నాత్పురుషః" అనే వేదవచనం (తైత్తిరీయం-బ్రహ్మవల్ల్యధ్యాయం) అనుసంధింపదగి ఉన్నది.

**వ. అదియునుంగాక,** **278**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక

**తా :** అంతమాత్రమే కాక ఇంకా

**మ. ధరణీశోత్తమ! భూతసృష్టి నిటు సంస్థాపించి రక్షించు నా**
**హరికర్తృత్వము నొల్ల కాత్మగత మాయారోపితంజేసి, తా**
**నిరవద్యుండు నిరంజనుండుఁ బరుఁడున్ నిష్కించనుం డాఢ్యుఁడున్**
**నిరపేక్షుండును నిష్కళంకుఁ డగుచున్ నిత్యత్వముం బొందెడిన్.** **279**

**ప్రతి :** ధరణీశ+ఉత్తమ= రాజోత్తమా!; భూతసృష్టిన్= ప్రాణుల సృష్టిని; ఇటు= ఈ రీతిగా; సంస్థాపించి= నిలబెట్టి; రక్షించు= కాపాడుతున్న; ఆ హరి= ఆ మాధవుడు; కర్తృత్వమున్+ఒల్లక= సృష్టిని చేసినవాడను నేను అనే భావాన్ని అంగీకరించక; ఆత్మగతమాయా+ఆరోపితన్+చేసి= తనలోనున్న మాయయందు ఆరోపించి; తాన్= తాను; నిరవద్యుండు= దోషరహితుడూ; నిరంజనుండున్= మాలిన్యం లేనివాడూ; పరుఁడున్= సర్వోత్కృష్టుడు; నిష్కించనుఁడు= అకించనుడు; ఆఢ్యుఁడున్= సంపన్నుడూ; నిరపేక్షుండును= ఏ కోరికాలేనివాడు; నిష్కళంకుఁడు+అగుచున్= మచ్చలేనివాడు అవుతూ; నిత్యత్వమున్= శాశ్వతత్త్వాన్ని; పొందెడిన్= పొందుతున్నాడు.

**తా :** అంతే కాదు. నృపశ్రేష్ఠా! ఈ విధంగా ప్రాణులను సృష్టించి రక్షిస్తున్న ఆ శ్రీహరి సృష్టికర్తృత్వం తనపై ఆపాదించుకోడు. ఇదంతా తనలోని మాయాశక్తికే ఆరోపిస్తాడు. తాను నిరవద్యుడు, నిరంజనుడు, పరుడు, నిష్కించనుడు, ఆద్యుడు, నిరపేక్షుడు, నిష్కళంకుడు అయినవాడై శాశ్వతత్వాన్ని పొందుతాడు.

**వ. బ్రహ్మసంబంధియగు నీ కల్పప్రకారం బవాంతరకల్పంబుతోడ సంకుచిత ప్రకారంబున నెఱింగించితి; నిట్టి బ్రహ్మకల్పంబున నొప్పు ప్రాకృతవైకృత కల్ప ప్రకారంబులును, దత్పరిమాణంబులును, కాలకల్ప లక్షణంబులును, నవాంతర కల్ప మన్వంతరాది భేద విభాగ స్వరూపంబును నతివిస్తారంబుగ నెఱింగింతు వినుము; మదియునుం బద్మకల్పం బనం దగునని భగవంతుండైన శుకుండు పరీక్షిత్తునకుం జెప్పెనని సూతుండు మహర్షులకు నెఱింగించిన. 280**

**ప్రతి :** బ్రహ్మసంబంధి యగు= బ్రహ్మకు సంబంధించిన; ఈ కల్పప్రకారంబున్= ఈ కల్పస్వరూపాన్ని; అవాంతర కల్పంబుతోడన్= మధ్యలో వచ్చే అవాంతర కల్పంతో కలుపుకొని; సంకుచిత ప్రకారంబునన్= సంగ్రహ రూపంగా; ఎఱింగించితిన్= తెలిపాను; ఇట్టి బ్రహ్మకల్పంబునన్+ఒప్పు= ఈ విధమైన బ్రహ్మ కల్పంలో విరాజిల్లుచున్న; ప్రాకృతవైకృత కల్ప ప్రకారంబులును= ప్రకృతి వికృతి సిద్ధములైన కల్పాలూ; తత్పరిమాణంబులును= వాటికాలపరిమితులూ; కాలకల్ప లక్షణంబులును= కాలంయొక్క, కల్పంయొక్క లక్షణాలూ; అవాంతరకల్ప మన్వంతరాదిభేద విభాగస్వరూంబునున్= అవాంతరకల్పాలు, మన్వంతరాలు మొదలైన భేదాల విభాగవిధానం; అతివిస్తారంబుగన్= మిక్కిలి విస్తృతంగా; ఎఱింగింతున్= తెలియజేస్తాను; వినుము= ఆలకించు; అదియునున్= అదికూడా; పద్మకల్పంబు+అనన్+తగునని= పద్మకల్పమని చెప్పదగునని; భగవంతుండు+ఐన= భగవత్స్వరూపుడైన; శుకుండు= శుకమహర్షి; పరీక్షిత్తునకున్ చెప్పెన్+అని= పరీక్షిన్మహారాజుకు తెలిపాడు అని; సూతుండు; మహర్షులకున్= శౌనకాదులైన మునులకు; ఎఱింగించినన్= తెలియజేయగా–

**తా :** బ్రహ్మకు సంబంధించిన ఈ కల్పస్వరూపాన్ని అవాంతర కల్పంతో గూడ సంగ్రహంగా చెప్పాను. ఇట్టి బ్రహ్మకల్పంలో ఉన్న ప్రాకృతాలు, వైకృతాలూ అయిన కల్పాల విధానాలూ, వాటి పరిమాణాలూ, కాలలక్షణాలూ, కల్పలక్షణాలూ, అవాంతరకల్పాలు, మన్వంతరాలూ మొదలగువాని భేదాలూ, విభాగాలూ విపులంగా వివరిస్తాను, విను. దాన్ని కూడా 'పద్మకల్పం' అని వ్యవహరిస్తారు అని భగవానుడైన శుకయోగి పరీక్షిత్తునకు చెప్పినట్లు సూతుడు శౌనకాది మునులకు తెలియజెప్పాడు.

**క. విని శౌనకుండు సూతుం, గనుఁగొని యిట్లనియె సూత! కరుణోపేతా!**
**జననుతగుణసంఘాతా!, ఘనపుణ్యసమేత! విగతకలుషవ్రాతా! 281**

**ప్రతి :** శౌనకుండు= శౌనకమహర్షి; విని= ఆలకించి; సూతున్+కనుఁగొని= సూత మహర్షిని చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; కరుణా+ఉపేతా= దయగలవాడా!; జననుత గుణ సంఘాతా!= జనులచే స్తుతింపబడిన గుణసమూహం కలవాడా!; ఘనపుణ్యసమేత= గొప్పపుణ్యంతో కూడినవాడా!; విగత కలుష వ్రాతా= నశించిన పాపసంచయం గలవాడా!; సూతా!

**తా :** సూతుడు చెప్పినది విని శౌనకుడు ఆయనను చూచి ఇలా అన్నాడు. "సూతమునీ! కరుణాసాంద్రా! జనులు శ్లాఘించే సద్గుణసమూహం కలవాడా! అఖండ పుణ్యరాశీ! పాపరహితా!

**వ. పరమ భాగవతోత్తముండైన విదురుండు బంధుమిత్ర జాతంబుల విడిచి సకల భువన పావనంబులును, గీర్తనీయంబులును నైన తీర్థంబులను, నగణ్యంబులైన పుణ్యక్షేత్రంబులను దర్శించి, క్రమ్మఱ వచ్చి కౌషారవియగు మైత్రేయుం గని యతనివలన నధ్యాత్మ బోధంబు వడసె నని వినంబడు; నదియంతయు నెఱింగింపు మనిన నతం డిట్లనియె. 282**

**ప్రతి :** పరమ భాగవత+ఉత్తముండు+ఐన విదురుండు= మహాభాగవతులలో శ్రేష్ఠుడైన విదురుడు; బంధుమిత్ర జాతంబులన్= చుట్టాలనూ, మిత్రుల సమూహాలనూ; విడిచి= త్యజించి; సకల భువన పావనంబులును= సమస్త లోకాలనూ పవిత్రంచేసేవీ; కీర్తనీయంబులునున్+ఐన= స్తుతింపదగినవీ అయిన; తీర్థంబులనున్= పుణ్యోదకాలనూ; అగణ్యంబులు+ఐన= లెక్కకు అందని; పుణ్యక్షేత్రంబులను= పవిత్రక్షేత్రాలనూ; దర్శించి= చూచి; క్రమ్మఱన్ వచ్చి= మరల తిరిగివచ్చి; కౌషారవియగు మైత్రేయున్+కని= కుషారవి కొడుకగు మైత్రేయ మహర్షిని చూచి; అతనివలనన్= అతనినుండి; అధ్యాత్మ బోధంబున్= ఆధ్యాత్మిక జ్ఞానాన్ని; పడసెన్+అని వినంబడున్= పొందినాడని విననైనది; అది+అంతయున్; ఎఱింగింపుము+అనినన్= అదంతా తెలియజేయుమని అడుగగా; అతండు= సూతుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** మహాభాగవతులలో శ్రేష్ఠుడైన విదురుడు బంధువులనూ, మిత్రబృందాన్నీ వదలిపెట్టి సకలలోకపావనాలూ, స్తుతిపాత్రాలూ ఐన తీర్థాలూ, లెక్కకు మిక్కిలిగానున్న పుణ్యక్షేత్రాలూ సందర్శించాడనీ, మళ్ళీ తిరిగివచ్చి కౌషారవి/ (కుషారవి పుత్రుడు) అయిన మైత్రేయ మహామునిని సందర్శించి ఆయననుండి ఆత్మతత్త్వజ్ఞానం పొందాడని వింటున్నాము. అదంతా మాకు వివరించిచెప్పు మని అడుగగా సూతుడు శౌనకాది మునులతో ఇలా చెప్పాడు.

**విశే :** మైత్రేయుడు – 'మిత్రా' అనే మహిళ కుమారుడు, 'కౌషారవి' అనటంచేత 'కుషారవ' – అనేవాని కుమారుడు అని భావన.

**క. వినుఁ డిపుడు మీరు నన్నడి, గిన తెఱఁగున శుకు మునీంద్రగేయుఁ బరీక్షి**
**జ్జనపతి యడిగిన నతఁ డా, తని కెఱిఁగించిన విధంబుఁ దగ నెఱిఁగింతున్. 283**

**ప్రతి :** వినుఁడు= ఆకర్ణించండి!; మీరు; నను= నన్ను; ఇప్పుడు= ఇపుడు; అడిగిన తెఱఁగునన్= అడిగినట్లు; మునీంద్రగేయున్= మునిశ్రేష్ఠులచే కీర్తింపదగిన; శుకున్= శుకయోగిని; పరీక్షిత్+జనపతి= పరీక్షిన్మహారాజు; అడిగినన్= ప్రశ్నించగా; అతఁడు= ఆ శుకుడు; ఆతనికిన్= పరీక్షిత్తుకు; ఎఱిఁగించిన విధంబున్= తెలిపిన తీరును; తగన్+ఎఱిఁగింతున్= తగురీతిలో తెలియజేస్తాను.

**తా :** మునులారా! వినండి! మీరు నన్నిపు డడిగినట్లే మునీంద్రస్తుతి పాత్రుడైన శుకయోగిని పరీక్షిన్మహారాజు ప్రశ్నించాడు అప్పుడు శుకుడు ఆ రాజునకు చెప్పిన విషయాలను మీకు నేను తెలియపరుస్తాను.

**వ. సావధానులరై వినుండని, 284**

**ప్రతి :** సావధానులరు+ఐ= ఏకాగ్రత గలవారై, వినుండు+అని= ఆలకించండి అని

**తా :** అవధానంతో ఆ విషయాలను ఆలకించండి!

**ఉ. రామ! గుణాభిరామ! దినరాజకులాంబుధిసోమ! తోయద**
**శ్యామ! దశాననప్రబలసైన్యవిరామ! సురారిగోత్ర సు**
**త్రామ! సుబాహుబాహుబలదర్ప తమఃపటుతీవ్రధామ! ని**
**ష్కామ! కుభృల్లలామ! గరకంఠసతీనుతనామ! రాఘవా! 285**

**ప్రతి :** గుణ+అభిరామ!= గుణాలచే అందమైనవాడా!; దినరాజకుల+అంబుధిసోమ!= సూర్యవంశం అనే సముద్రానికి చంద్రునివంటివాడా!; తోయదశ్యామ!= మేఘంవలె నల్లనైనవాడా; దశ+ఆనన ప్రబలసైన్యవిరామ!= రావణాసురునియొక్క బలిష్ఠమైన సైన్యాన్ని అంతమొందించినవాడా!; సుర+అరిగోత్ర సుత్రామ= రాక్షసులనే పర్వతాల పాలిటికి ఇంద్రుడవైనవాడా!; సుబాహుబాహుబలదర్ప తమః= సుబాహుని భుజబల గర్వమనే చీకటికి; పటుతీవ్రధామ!= తీక్ష్ణమైన సూర్యుడవైనవాడా!; నిష్కామ= కోరికలు లేనివాడా!; కుభృత్+లలామ= రాజులకు అలంకారమైనవాడా; గరకంఠ సతీనుతనామ!= విషకంఠుడైన శివుని భార్య పార్వతిచే సుతింపబడిన నామం గలవాడా!; రాఘవా!= రఘువంశమున జనించినవాడా!

**తా :** శ్రీరామా! నీవు కల్యాణగుణ సాంద్రుడవు, సూర్యవంశమనే సముద్రానికి చంద్రుడవు, నీలమేఘశ్యాముడవు, రావణాసురుని భీకరసైన్యాన్ని అంతమొందించినవాడవు, రాక్షసులనే పర్వతాలకు వజ్రాయుధధారివి, సుబాహుని బాహుబల గర్వం అనే చీకటికి సూర్యుడవు, కోరికలు లేనివాడవు, నరపతులకు అలంకారమైనవాడవు, పార్వతిచే స్తుతింపబడిన నామం కలవాడవు, రఘువంశజుడవు–

**క. అమరేంద్రసుత విదారణ!, కమలాప్తతనూజ రాజ్యకారణ! భవ సం**
**తమస దినేశ్వర! రాజో, త్తమ! దైవత సార్వభౌమ! దశరథరామా! 286**

**ప్రతి :** అమర+ఇంద్రసుత విదారణ= దేవేంద్రుని కుమారుడైన వాలిని వధించినవాడా!; కమల+ఆప్తతనూజరాజ్యకారణ= సూర్యుని కుమారుడగు సుగ్రీవుని రాజ్యప్రాప్తికి హేతువైనవాడా!; భవసంతమసదిన+ఈశ్వర!= సంసారమనే చీకటికి సూర్యుడవైనవాడా!; రాజ+ఉత్తమ= రాజశ్రేష్ఠా; దైవత సార్వభౌమ= దేవతలలెల్లరికీ చక్రవర్తీ; దశరథరామా!= దశరథుని కుమారుడవగు శ్రీరామా!

**తా :** వాలిని నేలకూల్చినవాడా! సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని గావించినవాడా! సంసారమనే అంధకారం పాలిటి సూర్యుడా! నృపశ్రేష్ఠా! సకలదేవతా సార్వభౌమా! దశరథ పుత్రుడవైన శ్రీరామచంద్రా!

**మా. నిరుపమగుణజాలా! నిర్మలానందలోలా!, దురితఘనసమీరా! దుష్టదైత్యప్రహారా!**
**శరధిమదవిశోషా! చారుసద్భక్తపోషా!, సరసిజదళనేత్రా! సజ్జనస్తోత్రపాత్రా! 287**

**ప్రతి :** నిరుపమగుణజాలా!= సాటిలేని గుణసంచయం కలవాడా!; నిర్మలానందలోలా= స్వచ్ఛమైన ఆనందంలో మునిగినవాడా!; దురిత ఘన సమీరా= పాపాలనే మబ్బులకు వాయువువంటివాడా!; దుష్టదైత్య ప్రహారా= దుర్మార్గులైన రాక్షసులను హతమార్చువాడా!; శరధిమదవిశోషా= సముద్రునియొక్క మదాన్ని శుష్కింపజేసినవాడా!; చారుసద్భక్తపోషా= సుందరులూ, సజ్జనులూ అయిన భక్తులను పోషించువాడా!; సరసిజదళనేత్రా!= పద్మదళాలవంటి కన్నులు గలవాడా!; సజ్జనస్తోత్రపాత్రా= సుజనుల స్తోత్రాలకు పాత్రమైనవాడా!

**తా :** సాటిలేని గుణాలు గలవాడా! స్వచ్ఛమైన ఆనందంలో ఓలలాడువాడా! పాపాలనే మబ్బులకు మేఘంవంటివాడా! దుష్టులైన రక్కసులను దునుమాడినవాడా! సముద్రుని మదాన్ని రూపుమాపినవాడా! మంచిగుణాలతో అలరారే సద్భక్తులను పరిపాలించువాడా! పద్మదళాలవంటి కన్నులు గలవాడా! శిష్టజనుల స్తుతులకు పాత్రమైన శ్రీరామచంద్రా!

**గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర, కేసన మంత్రిపుత్ర, సహజపాండిత్య, పోతనామాత్య ప్రణీతం బైన శ్రీమహాభాగవత పురాణంబునందు పరీక్షిత్తుతోడ శుకయోగి భాషించుటయు, భాగవతపురాణ వైభవంబును, "ఖట్వాంగు" మోక్షప్రకారంబును, ధారణాయోగవిషయం బయిన మహావిష్ణుని శ్రీపాదాద్య వయవంబుల సర్వలోకంబులు నున్న తెఱంగును, సత్పురుషవృత్తియు, మోక్షవ్యతిరిక్త సర్వకర్మఫల ప్రదదేవతా భజన ప్రకారంబును, మోక్షప్రదుండు శ్రీహరి యనుటయు, హరి భజనవిరహితులైన జనులకు హేయతాపాదనంబును, రాజప్రశ్నంబును, శుకయోగి శ్రీహరి స్తోత్రంబు సేయుటయు, వాసుదేవ ప్రసాదంబునం జతుర్ముఖుండు బ్రహ్మాధిపత్యంబు వడయుటయు, శ్రీహరివలన బ్రహ్మరుద్రాదిలోక ప్రపంచంబు పుట్టుటయు, శ్రీమన్నారాయణ దివ్య లీలావతార పరంపరావైభవ వృత్తాంతసూచనంబును, భాగవతవైభవంబును, బరీక్షిత్తు శుకయోగి నడిగిన ప్రపంచాది ప్రశ్నంబులును, నందు శ్రీహరి ప్రధానకర్త యని తద్వృత్తాంతంబు సెప్పుటయు, భగవద్భక్తి వైభవంబును, బ్రహ్మతపశ్చరణంబునకుం బ్రసన్నుండై హరి వైకుంఠ నగరంబుతోడ బ్రసన్నుండయిన స్తోత్రంబు సేసి తత్ప్రసాదంబునం దన్మహిమంబు వినుటయు, వాసుదేవుం దానతిచ్చిన ప్రకారంబున బ్రహ్మ నారదునికి భాగవతపురాణ ప్రధాన దశ లక్షణంబు లుపన్యసించుటయు, నారాయణవైభవంబును, జీవాది తత్త్వ సృష్టియు, శ్రీహరి నిత్యవిభూత్యాది వర్ణనంబును, గల్ప ప్రకారాది సూచనంబును, శౌనకుండు విదురమైత్రేయ సంవాదంబు సెప్పుమని సూతు నడుగుటయు నను కథలు గల ద్వితీయ స్కంధము. 288**

**ప్రతి :** ఇది= ఈ రచన; శ్రీపరమేశ్వర= శ్రీ పరమాత్మునియొక్క; కరుణాకలిత= దయచే కలిగిన; కవితా విచిత్ర= కవితచే విచిత్రుడైన; కేసన మంత్రిపుత్ర= కేసనామాత్యుని కుమారుడగు; సహజపాండిత్య= సహజసిద్ధమైన వైదుష్యంగల; పోతన+అమాత్య= పోతనామాత్యునిచేత; ప్రణీతంబు+ఐన= రచింపబడిన; శ్రీమహాభాగవత పురాణంబునందున్= శ్రీ మహాభాగవత పురాణంలో; పరీక్షిత్తుతోడ, శుకయోగి= పరీక్షిన్మహారాజుతో శుకయోగి; భాషించుటయున్= మాటలాడుటయూ; భాగవత పురాణ వైభవంబును= భాగవతమనే పురాణంయొక్క మహత్త్వమున్ను; 'ఖట్వాంగ' మోక్షప్రకారంబును= 'ఖట్వాంగు'డను నృపుడు మోక్షం పొందిన విధానమూ; ధారణాయోగ విషయంబు+అయిన= 'ధారణ' అనే యోగానికి విషయమైన; మహావిష్ణుని= శ్రీమన్నారాయణునియొక్క; శ్రీపాదాద్యవయవంబులన్= 'శ్రీపాదం' మున్నగు అంగాలలో; సర్వలోకంబులున్= సమస్తలోకాలూ; ఉన్న తెఱంగును= ఉన్నపద్ధతియూ; సత్పురుషవృత్తియున్= సజ్జనుల వర్తనమూ; మోక్షవ్యతిరిక్త= మోక్షానికంటె వేరైన; సర్వకర్మఫల= సమస్త కర్మల ఫలాలను; ప్రద= ఇచ్చునట్టి; దేవతా= దేవతలయొక్క; భజన ప్రకారంబును= సేవావిధానమూ; శ్రీహరి= మహావిష్ణువు; మోక్షప్రదుండు అనుటయున్= మోక్షము నిచ్చువాడు అనడమూ; హరిభజన విరహితులు+ఐన= శ్రీహరి సేవ చేయని; జనులకున్= ప్రజలకు; హేయతా+ ఆపాదనంబును= హీనత్వం ఆపాదించుటయూ; రాజప్రశ్నంబును= పరీక్షిత్తు చేయు ప్రశ్న; శుకయోగి శ్రీహరి స్తోత్రంబు సేయుటయున్= శుకుడు శ్రీహరిని స్తుతించడమూ; వాసుదేవ ప్రసాదంబునన్= శ్రీకృష్ణుని అనుగ్రహంచేత; చతుర్ముఖుండు=

బ్రహ్మ; బ్రహ్మ+ఆధిపత్యంబున్= బ్రహ్మస్థానాధికారాన్ని; పడయుటయున్= పొందడమూ; శ్రీహరివలనన్= శ్రీహరినుండి; బ్రహ్మరుద్ర+ఆది లోకప్రపంచంబు= బ్రహ్మ; శివుడు మున్నగువారి లోకాలతో గూడిన విశ్వం; పుట్టుటయున్= జనించడమూ; శ్రీమత్+నారాయణ దివ్యలీలావతార పరంపరావైభవ వృత్తాంత సూచనంబును= శ్రీమన్నారాయణుని దివ్యమైన లీలావతారాల పరంపరయొక్క ప్రభావానికి చెందిన వృత్తాంతాలను సూచించడం; భాగవత వైభవంబును= భాగవతంయొక్క మహిమయూ; పరీక్షిత్తు శుకయోగినడిగిన ప్రపంచాది ప్రశ్నంబులునున్= పరీక్షిన్మహారాజు శుకుణ్ణి ప్రశ్నించిన ప్రపంచాన్ని గూర్చిన ప్రశ్నలూ; అందున్= అందులో; శ్రీహరి, ప్రధానకర్త+అని= ముఖ్యకర్తయని; తద్+వృత్తాంతంబు= ఆయన చరిత్రను; చెప్పుటయున్= వివరించడం; భగవద్భక్తి వైభవంబును= భగవానుని భక్తిప్రభావం; బ్రహ్మ తపశ్చరణంబునకున్= బ్రహ్మ కావించిన తపస్సుకు; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహించినవాడై; హరి= అచ్యుతుడు; వైకుంఠ నగరితోడన్= వైకుంఠపురంతో సహా; ప్రసన్నుండయినన్= ప్రత్యక్షం కాగా; స్తోత్రంబు+చేసి= ఆ దేవుణ్ణి వినుతించి; తద్+ప్రసాదంబునన్= ఆ దేవుని అనుగ్రహంతో; తద్+మహిమంబున్= ఆయన ప్రభావాన్ని; వినుటయున్= ఆలకించడం; వాసుదేవుండు= హరి; ఆనతిచ్చిన ప్రకారంబునన్= సెలవిచ్చినట్లు, బ్రహ్మ, నారదునికి; భాగవతపురాణ ప్రధాన దశలక్షణంబులు= భాగవత పురాణంయొక్క ముఖ్యమైన పదిలక్షణాలు; ఉపన్యసించుటయున్= చెప్పడం; నారాయణ వైభవంబును= శ్రీమన్నారాయణుని ప్రభావం; జీవాది తత్త్వసృష్టియున్= 'జీవుడు' మున్నగు తత్త్వాలను సృష్టించడం; శ్రీహరి నిత్య విభూతి+ఆది వర్ణనంబును= శ్రీహరియొక్క నిత్య విభూతి (వైకుంఠం) మున్నగువాటిని వర్ణించడం; కల్ప ప్రకార+ఆది= 'కల్ప' విధానాదులను; సూచనంబును= నిర్దేశించడం; శౌనకుండు; విదురమైత్రేయ సంవాదంబు= విదురమైత్రేయుల సంభాషణం; చెప్పుమని= వివరించుమని; సూతున్+అడుగుటయున్= సూతుని ప్రశ్నించడం అను; కథలు గల ద్వితీయ స్కంధము= రెండవ స్కంధం (సమాప్తం).

**తా :** ఇది శ్రీ పరమేశ్వరుని అనుగ్రహం వల్ల ప్రాప్తించిన అత్యద్భుతమైన కవిత్వం కలవాడూ, కేసనమంత్రి కుమారుడూ, సహజమైన పాండిత్యం కలవాడూ అయిన పోతనామాత్యుడు రచించిన శ్రీమహాభాగవతపురాణం.

అందులో పరీక్షిన్మహారాజుతో శుకయోగి కావించిన సంభాషణం, భాగవత పురాణప్రశస్తీ, ఖట్వాంగుడు మోక్షం పొందిన విధానం, ధారణా యోగానికి విషయమైన మహావిష్ణుదేవుని శ్రీ పాదాలు మొదలైన అవయవాలలో సమస్తలోకాలు ఉన్న పద్ధతీ, సత్పురుషవర్తనం, మోక్షంకంటె భిన్నమైన సమస్త కర్మఫలాలనూ ఇచ్చే దేవతలను భజించే రీతీ, మోక్షప్రదాత శ్రీహరి ఒక్కడే అనడం, హరిసేవ చేయని ప్రజలకు హీనత్వాపాదనం, రాజు ప్రశ్నించడం, శుకయోగి శ్రీహరిని స్తుతించడం, వాసుదేవుని అనుగ్రహంవల్ల బ్రహ్మ బ్రహ్మలోకాధిపత్యం వహించడం, శ్రీహరినుండి బ్రహ్మ, రుద్రుడు మొదలైనవారి లోకాలు జనించడం, శ్రీమన్నారాయణుని దివ్యలీలావతారాల వైభవవార్తలను సూచించడం, భాగవత ప్రాముఖ్యం, పరీక్షిత్తు శుకయోగిని ప్రపంచం మొదలైన వాటిని గూర్చి ప్రశ్నించడం, అందులో శ్రీహరి అన్నిటికీ ముఖ్యకర్త అని ఆయన వృత్తాంతాన్ని ప్రతిపాదించడం, భగవద్భక్తి ప్రాశస్త్యం, బ్రహ్మ చేసిన తపస్సుకు మెచ్చి శ్రీహరి వైకుంఠంతో సహా ఆయనకు ప్రత్యక్షం కావడం, బ్రహ్మవిష్ణువును స్తుతించి ఆయన అనుగ్రహంవల్ల ఆయన మహిమను ఆలకించడం, వాసుదేవుడు చెప్పినట్లే బ్రహ్మనారదుడికి భాగవతపురాణానికి సంబంధించిన ప్రధానమైన పది లక్షణాలను వివరించడం, శ్రీమన్నారాయణుని వైభవం, జీవుడు మొదలైన తత్త్వాల సృష్టీ, వాసుదేవుని నిత్యవిభూతి మొదలైన వాటి వర్ణనం, కల్పప్రకారం మొదలైన వాటి సూచనా, శౌనకుడు విదురునికీ మైత్రేయునికీ జరిగిన సంవాదం చెప్పుమని సూతుని అడగడం అనే కథలు గల ద్వితీయస్కంధం (సమాప్తమయింది).

*:: శ్రీకృష్ణార్పణమస్తు ::*

# పద్యగద్యసూచి

## ప్రథమస్కంధము

## ద్వితీయస్కంధము

